శ్రీమద్వాల్మీకి మహర్షి ప్రణీతంబయిన

శ్రీపార్వతీపరమేశ్వర సంవాదంబును శ్రీరామదాస విష్ణుదాస సంవాదంబునగు

# శ్రీమదానందరామాయణమున

సారయాత్రాయాగ విలాస జన్మ వివాహాత్మక షట్కాండాలంకృతంబగు

## ప్రథమ సంపుటము.

బ్రహ్మశ్రీ సిద్ధాంతి - శివశంకర శాస్త్రులవారిచే విరచితంబయిన

ఆంధ్రభాషాత్మకంబగు తాత్పర్యార్థ వివరణంబుతోడ



సద్గ్రంథ ప్రకటన కార్యాధికారులయిన

బ్ర॥ రా॥ యం. జి. సుబ్బరాయ శాస్త్రులవారిచే



చెన్నపురి:

"ఆల్బినియన్" ముద్రాక్షరశాలయందు ముద్రాయితంబై

ప్రకటింపంబడినది.

శక. ౧౮౨౪. శుభకృత్సంవత్సర జ్యేష్ఠమాసము.

౧౯౦౨ వ సం.

# విజ్ఞప్తి.

శ్రీమదానంద రామ భక్తులగు సత్పురుషులారా!

ఈ "శ్రీమదానంద రామాయణంబు" ఉత్తరదేశంబున సుప్రసిద్ధంబై నాగరాక్షరంబులతో ముద్రాయితంబునై పారాయణ పురాణ శ్రవణాదులచే భక్తకోటి సమాదృతంబునై బరగుచున్నది. మఱియునిది కర్ణాటాది కొన్ని దేశభాషలలో పద్యకావ్యంబులై యొప్పుచున్నది. అయిననిది యాంధ్రలిపితో నీవరకు నెవరును ముద్రించక ఆంధ్రభాషయం దెవరును రచియించక యుండడము నొక లోపమేగదా? దీనినెఱింగి ఆంధ్రదేశీయులగు భక్తజనులకు పవిత్రరామ చారిత్రవర్ణ నానందము నొసంగవలయునని బ్రహ్మశ్రీ॥ సిద్ధాంతి శివశంకరశాస్త్రిలవారు ఇప్పని కొప్పికొని, బృహత్ స్తోత్ర రత్నాకర ప్రథమ ద్వితీయ భాగములను ముద్రించియుండు నాయెడ విశ్వాసము గల్గినవారై "నేను వ్రాసిన ఈశ్రీమదానంద రామాయణ గ్రంథప్రకటన కార్యమును నీవు వహింపుము ఇందుచే సద్గ్రంథప్రకటన కార్యాలయంబను ప్రఖ్యాతితో ననేక సత్పుస్తక ప్రకటనశక్తి నొదవించి శ్రీరామమూర్తి యనుగ్రహించి బ్రోచుగాత" యనిప్రేరించిరి. వారిసత్ప్రేరణచే నికార్యంబునంబూని పనిఁజేయుచు వచ్చితిని. గొప్పగ్రంథము, అధిక ద్రవ్యసాధ్యముగానఁ దీనికై చందాదారుల సాహ్యము కావలసివచ్చె. మహాత్ములు కొందఱు చందాదారులుతప్ప తక్కిన చందాదారులతో జిక్కువడుట యింతంత కాదు. మఱిదానికిం దగినట్లే "శ్రేయాంసి బహువిఘ్నాని" యన్నట్లు నికార్యమునకు విఘ్నములు మెండుగా గల్గుచువచ్చె. అయిననెట్లో శ్రీరామానుగ్రహముచే సమగ్ర పుస్తకము ముద్రాయితంబై వెలువడినది. రసికభక్తాగ్రగణ్యు లానందింతురుగాక.

ఈగ్రంథము గొప్పదిగా నుండుటంబట్టి మూడుసంపుటములుగా నేర్పరుపంబడినది. ఇగ్గ్రంథము నవకాండాత్మకంబు. అందు ప్రథమ సంపుటమున షట్కాండలును, ద్వితీయసంపుటమున రాజ్యకాండ ప్రథమాధ్యాయంబగు శ్రీమదానందరామ సహస్రనామంబును, తృతీయసంపుటమున రాజ్యాదికాండ త్రయంబును గలదు. తత్త్వవిచార పరులకు సుకరంబై యుండవలయునని శ్రీమదానందరామ సహస్రనామ మాత్రముతో నేర్పడిన సంపుటము చిన్నదైనను వేదశాస్త్ర తత్త్వవిచారముచే మహత్త్వమునంది గొప్పదియనంబడును.

శ్రీరామభక్తులగు రసికాగ్ర గణ్యులందఱును గుణైక గవేషణులై ఇమ్మహాగ్రంథమున ప్రకటన స్ఖాలిత్యాది దోషంబులను మన్నించుచు విషయ ప్రాధాన్యముచే నానందించవలయునని ప్రార్థించుచున్నాను.

## ఈ శ్రీమదానందరామాయణముయొక్క వెల వివరము.

| | | | |
|---|---|---|---|
| ప్రథమ సంపుటమునకు | రు. ౬-౦-౦ | మూడు సంపుటములుగల సమగ్ర పుస్తకమునకు | రు. ౧౫-౦-౦ |
| ద్వితీయ సంపుటమునకు | ,, ౩-౦-౦ | వి. పి. లో | ,, ౧౭-౮-౦ |
| తృతీయ సంపుటమునకు | ,, ౬-౦-౦ | | |

మఱియు నీసద్గ్రంథప్రకటన కార్యాలయమునందు అప్రకటితంబును ప్రాచీనంబులును సత్పురుషోల్లాసకంబులును ధర్మార్థకామ మోక్షచతుర్విధ పురుషార్థ సాధకంబులు నయిన సద్గ్రంథములనే ప్రకటింపవలయు ననునది ముఖ్యోద్దేశముగా నుండుటంబట్టి; ప్రకృతమున తత్త్వసంగ్రహ రామాయణంబును ప్రకటించుట సముచితంబనియెంచి దానికై యుద్యమించియున్నారము. తన్నామంబే తన్మహిమను నువ్యక్తపరచుచున్నదిగదా? ఇదియును ఆంధ్రతాత్పర్య వివరణములతోఁజేరి శ్రీమదానంద రామాయణమునంత కావచ్చుగానున్నది. ఇది సప్త కాండాత్మకంబు. "నిత్యంకింధావసి" ఇత్యాది సప్తర్షికృతరామస్తోత్రాదులును తత్త్వవిచారంబులును సర్వజనానంద కరంబులై యొప్పుచున్నవి. ఇట్టిది సంగ్రాహ్యంబను సంగతిని అతిశయించి చెప్పుటయేల? స్వయంవ్యక్తంబు. దీనికై:— విడిచందాలతో మేము శ్రీమదానంద రామాయణ ప్రకటనయందు పడినపాట్లు చాలుగానున్నది. కావున, మొత్తచందాలనే సంగ్రహించెదముగాని విడిచందాలువలదు. అయిన సమగ్రపుస్తకము ౨౦౦ ఫారములకు తగ్గదు. ఎక్కువైననుసరియె. చందాదారులకుమాత్రము బైండుతోఁడ వెల ౧౦ రూపాయలు. చందా చేయ నిష్టముగలవారు మొదట ౫ రూపాయిలను అడ్వాన్సుగా ననుపవలయును. సగముపుస్తకమును ముద్రించి పంపెదము. పిదప ౫ రూపాయిలనంది తక్కిన సగము పుస్తకమును పంపుదము. శ్రీమదానంద రామాయణమును, ఎన్నిచిక్కులుగల్గినను విడువక సమగ్రముగా ముద్రించి యిచ్చినదే ఇకార్యాలయమువారు సదుద్యమ నిరతులను సంగతిలో చందాదారులకు సాక్ష్యమై యున్నదిగదా? కావున నీతత్త్వ సంగ్రహ రామాయణ ప్రకటన కార్యమునకు చందాదారులుగాచేరి సత్పురుషులు సహాయము చేయవలయునని సంప్రార్థించుచున్నాడను.

ఇట్లు

సజ్జన విధేయుఁడు,

ఎమ్-జి- సుబ్బరాయశాస్త్రి.

సద్గ్రంథ ప్రకటన కార్యాలయం-ఏజంటు.

సాహుకార్ పేట, మదరాస్.

శుభకృత్సం॥
జ్యేష్ఠశు ౧౫,
శుక్రవారము.

శ్రీరామాయనమః.

ఆంధ్ర తాత్పర్య వివరణ సహితంబగు

# శ్రీమదానందరామాయణము యొక్క

## ప్రథమసంపుటవిషయానుక్రమణిక.

### ౧. సారకాండము.

#### ప్రథమ సర్గయందు,



#### ద్వితీయ సర్గయందు,



#### తృతీయ సర్గయందు,

## చతుర్థ సర్గయందు,



## పంచమ సర్గయందు,

విషయము. — పుట సంఖ్య.



## దశమ సర్గయందు.



## ఏకాదశ సర్గయందు,



## ద్వాదశ సర్గయందు,

---:o:---

## ౩. యాగకాండము.

ప్రథమ సర్గయందు,

## ప్రథమ సంపుట విషయానుక్రమణికా.



—:o:—

### ౪. విలాస కాండము.

ప్రథమ సర్గయందు,

—:o:—

ఇట్లు ప్రథమ సంపుట విషయానుక్రమణికా.
సంపూర్ణము.

—:o:—

శ్రీరామాయనమః.

ఆంధ్రభాషాత్మక భాష్యార్థ వివరణ సహితంబగు

# శ్రీమదానందరామాయణము యొక్క

## * ద్వితీయసంపుట విషయానుక్రమణికా.



* రామనామ నిర్వచనము ౧౮ పుటలు గలవు. ఇట్టి తత్తన్నామములకు యథోచితముగా శ్రుతిస్మృతి పురాణోపష్టంభకంబగు నర్థవివరణంబు గలదు. చివరలోని అకారాది నామావళితో సంఖ్యనెఱింగి తత్సంఖ్యకనామ నిర్వచనంబును సుఖముగా తెలియంగనగు.

ఇంక భాష్యార్థ వివరణమునందలి శేషాంశ సూచనలు.

—:౦:—

ఇట్లు శ్రీమదానందరామాయణమున
ద్వితీయ సంపుట విషయానుక్రమణికా
ముగిసెను.

—:౦:—

శ్రీరామాయనమః.

ఆంధ్ర తాత్పర్య వివరణ సహితంబగు

# శ్రీమదానందరామాయణము యొక్క

## తృతీయ సంపుట విషయానుక్రమణిక.

### ౭. రాజ్యకాండము.

—:o:—

## రాజ్యకాండోత్తరార్ధము.

### త్రయోదశ సర్గయందు,

విషయము. — పుట సంఖ్య.

అష్టమ సర్గయందు,



నవమ సర్గయందు,



దశమ సర్గయందు,



ఏకాదశ సర్గయందు,



ద్వాదశ సర్గయందు.



త్రయోదశ సర్గయందు,



చతుర్దశ సర్గయందు,



పంచదశ సర్గయందు,



షోడశ సర్గయందు,

విషయము. సప్తదశ సర్గయందు, పుట సంఖ్య.



అష్టదశ సర్గయందు,



—:o:—

౯. పూర్ణ కాండము.

ప్రథమ సర్గయందు,



ద్వితీయ సర్గయందు,



తృతీయ సర్గయందు,



చతుర్థ సర్గయందు.



పంచమ సర్గయందు,



షష్ఠ సర్గయందు,



సప్తమ సర్గయందు,



అష్టమ సర్గయందు,



నవమ సర్గయందు,



పూర్ణకాండసమాప్తిః

—:o:—

శ్రీరామాయనమః.

చిత్రవిచిత్రాద్భుతకథా సందర్భగర్భితంబును

శ్రీ సీతారామవాక్యామృత వేదాంత తత్త్వసార గుంభితంబునగు

# శ్రీమదానందరామాయణము.

ఆస్తికులగు సుజనవర్యులకు విజ్ఞాపనము:—

“శ్లో॥ రమంతేయోగినోనంతే సత్యానందేచిదాత్మని । ఇతిరామపదేనాసౌ పరంబ్రహ్మాభిధీయతే= శాశ్వతుండైన సచ్చిదానందస్వరూపుఁడగు పరమాత్మయందు యోగులు రమించెదరు. కనుక నట్టిపరబ్రహ్మము రామపదవాచ్యంబగునని యుపనిషత్తు చెప్పుచున్నది. శ్లో॥ శ్రీరామరామరామేతి రమేరామేమనోరమే। సహస్రనామతత్తుల్యం రామనామవరాననే= పార్వతితో పరమేశ్వరుఁడు ౧౦౦౦ విష్ణునామములకు సమానము రామనామమని పఠించుచున్నట్లు చెప్పినసంగతి భారతమునుండి తెలియవచ్చుచున్నది. శ్లో॥ నాయనాయముఖతోవినాష్టకం మాళితోపినశివాయపంచకం। నామరామ ఇతితాదృశంతథా తత్తదన్వయవశాచ్చతద్ద్వయం= అష్టాక్షరంబున ముఖవర్ణంబగు రేఫ లేనియెడల (నాయనాయ) పరమపదముకొఱకుగాచాలదని యర్థభేదమగుచున్నది. పంచాక్షరంబున శిరోవర్ణంబగు మకారము లేకుండిన (నశివాయ) శుభముకొఱకుగాదని యర్థభేదమగును. కావున నుభయమంత్రములకును అర్థక్రియాసమన్వయమగునది రామనామమని యభియుక్తవచనముగలదు, ఇట్టితారకమూర్తిచారిత్రముకన్నను మానవకోటికి రక్షకంబు వేఱెగలదే? గనుక, ఆస్తికులందరును రామచారిత్ర వర్ణనంబున నిహపరసౌఖ్యములనందవలసియున్నది. అందువలన పరమపవిత్రంబగు శ్రీరామచారిత్రంబును నిరూపించుచుండు గ్రంథములలో:—

శ్రీమద్రామాయణము గాయత్రీరామాయణంబని ప్రసిద్ధిజెందినదిగాక, దూర్వాసరామాయణము. వసిష్ఠరామాయణము. విశ్వామిత్రరామాయణము. మొదలుగాగలవి (౧౦౦) నూరు రామాయణములుగలవు. వాటిలో రామోపాసనాది సమస్త తత్త్వరహస్యంబులకు మూలంబై చిత్రకథాసంవిధానములతో నొప్పుచుండు పార్వతీపరమేశ్వరసంవాదాత్మకంబగు “ఆనందరామాయణము” మిక్కిలి రమణీయంబును సమస్తాస్తిక జనాదరణీయంబునై బరగుచున్నది. అది తెనుగునముద్రాయితంబై సర్వజన సులభము కాకయుండు కొఱతను పోగొట్టి, సర్వజనులు శ్రీరామచంద్ర దివ్యావదానములనుచదివి యానందించునట్లు చేయదలచి,” బ్రహ్మశ్రీ సిద్ధాంతి. శివశంకరశాస్త్రులవారిచే రచింపఁబడిన ఆంధ్రభాషాతాత్పర్యముతోడ, ఈ గ్రంథము నచ్చువేయించవలయుననిన వారిసదుపదేశంబును పుణ్య[illegible]కరంబనినమ్మి, యీ ప్రకటనకార్యమున ప్రవర్తించియున్నారము.

ఈ “ఆనందరామాయణ”ములోని విషయమాతృకనే ఈప్రకటనలో సూచనగా చేయుంచి యున్నారము. దానిని చదివికొనుటచేత ఈ మహాగ్రంథముయొక్క ప్రయోజనము సర్వజనులకును

నువ్యక్తంబగుచున్నది. అందుమీఁద నందరును ఆనందముతో మా ప్రయత్నమునకు సహాయభూతుల గుదురనియును నమ్ముచున్నాము.

ఈ గ్రంథమున నాయా కాండలవద్ద సముచితముగా చిత్రపటములు పెట్టబడుచుండును.

ఇట్టి యమూల్యమగు "ఆనందరామాయణ"మను గ్రంథమును పైని ప్రక్కమూలమును, దిగువ దాని తాత్పర్యమును పెట్టి డిమ్మి ౮ పేజీల సైజులో ముద్రించుచునున్నారము. ఈ గ్రంథము ర మారమి యిరువది సంచికలుగల పుస్తకము కావచ్చునని తోచుచున్నది. గనుక:—

దీనికి "ఆనందరామాయణ"మునకు సర్వజన సులభముగానుండునట్లు (౮౦) పుటలుగల ౧౦ఫారముల సంచికయొకటికి రూ. ౦-౮-౦ చందానిర్ణయింపబడియున్నది. దీనికై అడ్వాన్సుగా నొక్కరూపాయిమాత్రమునే ఇచ్చిననరి. పిమ్మట సంచికలనిచ్చి పయికమును తీసికొందుము. ఇప్పటికి ఆరు సంచికలు వెలువడినవి. చందాదారుగా చేరదువారు ఇప్పుడు ర రూపాయలనిచ్చి(౬) సంచిక లనందవలయును. సంవత్సరము నాలుగు నెలలకు పుస్తకము పూర్తి కావచ్చును. చెన్నరాజధానితప్ప బైటిచందాదారులు, మాకు అడ్వాన్సురూపాయనుమాత్రమే మొదట పంపవలెను. పిదపమూడు నెలల కొకమారు మూడుసంచికలను వి.పి. గా పంపించుచున్నారము. చందాదారులకు అడ్వాన్సును గ్రంథపూర్తితో ముజరా ఇచ్చెదము.

ఈ మహాగ్రంథమునకు ౫ చందాలను మొత్తముగా చేయువారు పోషకులుగా నెంచబడుదురు. ౧౨ చందాలను చేయించినవారికి ౧ ప్రతి యుచితముగానిచ్చెదము. చందాదారుల పేళ్లను గ్రంథములో ప్రకటించెదము. ౧౮౯౯ వ-సం॥ జనవరినుండి సంచిక వెలువనవి.

సూచన—ఆరవ (౬) సంచిక వెలువడినవెనుక ఈ ఆనందరామాయణ చందాదారులుగా నేర్పడువారలు కడచిన సంచికలకు సంచికె ఒకటింటికి ఒక అణావంతున యెక్కువగా నివ్వవలసియుండును. ౧౦ సంచికలనగా నర్ధగ్రంథమైనవెనుక చందా చేయువారికి, కడచిన సంచికలకు ౨ డేసి అణాలవంతున ఎక్కువ అగును. గ్రంథపూర్తియైనవెనుక కొనువారికి సంచిక ౧ టికి ౧౨ అణాలవంతననగా సమగ్ర పుస్తకము ౧౫ రూపాయలగును.

ఈ యానందరామాయణమునందలి యారవపంచికయొక్క ౫-౭ ఫారములనగా విలాసకాండలోని ౧౨ ఫారటలు, చందాదారులుగా చేరదువారు చూచుటకై ఈ ప్రకటనపత్రికతోడ చేర్చియున్నారము. వాటినైనను చూచి యానందరామాయణమునందలి యానందామృతము నందుటకు చందాదారులై వెలయుఁడు.

ఇట్టి శ్రీరామ చరితామృతపాన ప్రయత్నమునకు మహాత్ములందరును సహాయులుగా నేర్పడి యానందింపవలెనని ప్రార్థించుచున్నాము. ఆనందరామాయణము వలయువారు, మదరాసు, పంకసాల వీధి, ౩౯౭ నం॥ గృహములో ఆనందరామాయణ ప్రకటన కార్యాలయం పేరను

౧౮౯౯-వ సంవత్సరము. [illegible] యం. వి. సుబ్బరాయ శాస్త్రియను నాపేరికి వ్రాయవలెను.

# ఆనందరామాయణ విషయానుక్రమణిక.

ఇట్లు, ఆనందరామాయణ విషయానుక్రమణిక సంపూర్ణము. శ్రీరస్తు.

శ్రీ

# శ్రీబృహత్స్తోత్ర రత్నాకరము.

:0:

## మొదటి భాగము.

ఇందువలన సమస్త సత్పురుషులకు తెలియచేయునదేమనగా:—

శ్రద్ధాయుక్తులగు ఆర్యులు, అనేకములైన సద్గ్రంథములను ఇదివరకే అచ్చువేయించియుండినను త్రికాలములయందు పారాయణము చేయుటకు అనుకూలములై ధర్మార్థ కామమోక్షప్రదంబులై ఋషిప్రోక్తంబులగు భగవన్నామస్తోత్రములబృందము ఇదివరకు లేదని కొదవపడుటఁజూచి, అస్మద్గురువులగు బ్రహ్మశ్రీ ధూళిపాటి—అరుణాచల శాస్త్రులవారు తాము మహాయాత్రఁబోవుచుండునపుడు అచ్చటచ్చట దివ్యక్షేత్రములలో పుణ్యపురుషులవలన సంపాదింపఁబడిన స్తోత్రములతోడ వారి నిత్యగ్రంథ సత్కాలక్షేపములలోని పారాయణ యోగ్యంబులై పురాణాంతర్గతములైన దివ్యస్తోత్రములను [illegible] యొక పుస్తకములో క్రమముగా పరిశీలనచేసి వ్రాయించి ఆ

పుస్తకమునకు శ్రీబృహత్ స్తోత్రరత్నాకరమని నామంబిడి లోకోపకారార్థమై ఈసద్గ్రంథమును వేయింప నాజ్ఞాపించినందున నే దీనిని ప్రచురింపఁబూనితి.

ఈగ్రంథములోని స్తోత్రంబులు అనేక వృత్తజాతుల వలన యుక్తంబులైనవిగాన కులకు సహా సంతోషప్రదంబులై వ్యాప్యమానందకరంబులుగనుండును. ఇందులో మంగళా యకస్తోత్రములు (౫) శివస్తోత్రములు (౨౮) విష్ణుస్తోత్రములు (౭౦) శ్రీరామస్తోత్రములు (౨౮) గ తీర్థస్తోత్రములు (౨౦) మహాలక్ష్మ్యాది దేవీస్తోత్రములు (౨౭) నవగ్రహస్తోత్రములు (౩౯) వే స్తోత్రములు (౧౧) మొత్తము (౨౨౮) స్తోత్రములుగలవు. ఇది ౫౬౦ పుటలుగలిగి ౫౦ పౌ రళనరి గ్లేజ్ కాగితములపై (అనగా ఈనోటీసు వేసియుండు కాగితములవంటి కాగితమ అతిసుందరమైన తెనుగక్షరములతో నచ్చువేయింపబడి మిక్కిలి రమ్యంబగు బైండుతోకూడి సద్భక్తులకు లభ్యంబగునటుల సులభ క్రయమునకు విక్రయించబడును. ప్రతి ౧-కి రూ. ౧ కు ఇయ్యబడును. వ్యాల్యూపేయబిల్ చార్జి ౫ అణాలు అగును ౫-౬ ప్రతులు ఒక్కసా రప్పించుకొనువారికి ప్రతి ఒకటికి రెండున్నర అణా పోస్టేజి లాభమగును.

ప్రపంచములో అన్నిజన్మములకంటె మిక్కిలి శ్రేష్ఠమైన మనుష్యజన్మంబును మనకు జేసిన భగవంతునిని ఈజన్మములో స్తోత్రంబులచే ప్రార్థించి అత్యుత్తమమైన సద్గతిని బొంద సత్పురుషులందరును ఈగ్రంథమును తెప్పించికొని కృతార్థులు కావలెనని ప్రార్థించుచున్నాఁడ

:o:

శ్రీ బృ హ త్ స్తో త్ర ర త్నా క ర ము.

# రెం డ వ భా గ ము.

మొదటిభాగమునకంటె సుమారు ౧౦౦ పేజీలు అధికముగా నుండును. మంచి ములు. బైండు దీనికంటె అందముగా నుండును (మొదటిభాగములోనుండు స్తోత్రములలో ని కొండ ఇందులోనుండదు) అందులోలేని అపూర్వమైన శ్రీమహావిష్ణుస్తోత్రములు (౨౯) శ్రీవ తార స్తోత్రములు (౨౫) శ్రీరామస్తోత్రములు (౮) శ్రీమదాంజనేయస్తోత్రములు (౧౦) శ్రీగణే త్రములు (౯) శ్రీశివస్తోత్రములు (౫౬) శ్రీమహాలక్ష్మీస్తోత్రములు (౧౩) అంబా స్తోత్ర మొత్తము (౧౮౬) స్తోత్రములుండును దీనివెల ౧-కి ౧-౧౨-౦. వి. పి పోస్టేజి ప్రతి ౧-కి అగును. ఐదుప్రతులకు పైబడి మూడు ప్రతులు తెప్పించుకొనువార్లకు సగము టపాలు సే మేమే వహించెదము.

౧౨-ప్రతులు ఒకటేసారిగా తెప్పించుకొనువారికి ౧ ప్రతి లాభముగా నివ్వఁబ

ఇట్లు సకలసజ్జన విధేయుఁడగు,

రత్నపటి. ఎమ్. శ్రీ సుబ్రాయశాస్త్రి,

౧౦౦ అంకస్వాలవీథి, మద్రాసు

శ్రీః.

శ్రీరామః ప్రసన్నోస్తు॥ శ్రీగణేశాయనమః.

సీతాలక్ష్మణ భరతశత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్ర స్వామినేనమః.

# శ్రీమదానందరామాయణే

## సారకాండః.

---

వాల్మీకిరువాచ॥ శ్లో॥ వామే భూమిసుతా పురస్తు హనుమాన్ పృష్ఠే సుమిత్రాసుతః।
శత్రుఘ్నో భరతశ్చ పార్శ్వదళయో ర్వాయవ్యకోణాదిషు॥
సుగ్రీవశ్చ విభీషణశ్చ యువరాట్తారాసుతో జాంబవాన్।
మధ్యే నీలసరోజ కోమలరుచిం రామం భజే శ్యామలం॥ ౧॥
ఆదౌ రావణమర్దనం ద్విజగిరా తీర్థాటనం సీతయా।
సాకేతే దశవాజిమేధకరణం పత్న్యా విలాసాటనం॥
స్త్రీపుత్రగ్రహణం స్వమార్గమటనం పృథ్వ్యాశ్చ సంరక్షణం।
రామార్చాదినిరూపణం దయితయా స్వీయస్థలారోహణం॥ ౨॥

ఏకదా పార్వతీ దేవీ శంకరం ప్రాహ హర్షితా। కైలాసవాసినం నత్వా రామభక్త్యైక తత్పరా॥౩॥*॥
పార్వత్యువాచ—శంభో త్వయా పురాణాని కథితాని మమాంతికే। రఘునాథస్యచరిత్రం జన్మకర్మసమన్వితం॥౪॥

---

శ్రీరామాయనమః.

ఆనందరామాయణ తాత్పర్య సంగ్రహంబున సారకాండము.

శ్రీమద్వేంకటేశాయనమః॥ శ్రీమద్విఘ్నేశ్వరాయనమః॥ శ్రీమదాంజనేయాయ నమః॥
శ్రీమద్వాల్మీకిమహర్షిభ్యోనమః॥ శ్రీమత్పార్వతీ పరమేశ్వరాభ్యాంనమః॥*॥శ్రీరస్తు॥*॥

శ్లో॥ జనకంస్వశరీరస్య పాలకంబుద్ధిదాయకం। వర్ణాశ్రమవిధాతారం పితరంగురుమాశ్రయే॥
శ్లో॥ ఆనందరామాయణస్యేహాంధ్రతాత్పర్యముచ్యతే। కల్యాణపురసిద్ధాంతిశివశంకరశర్మణా॥

పరమకారుణిక మూర్తియైన శ్రీవాల్మీకిమహర్షి లోకులననుగ్రహించువాఁడై శ్రీమదానంద రామాయణ మహాపురాణమును చెప్పంబూని గ్రంథాదిని శ్రీపట్టాభిరామమూర్తిని యిట్లు భజించుచున్నాడు. తన యెడమప్రక్కలో సీతయును ఎదుట నాంజనేయుఁడును వెనుక

కథయస్వాధునా దేవ మమ ప్రీతివివర్ధనం । ఆనందదాయకం కర్మ రఘువీరేణ యత్కృతం ॥౫॥ శ్రీశివ ఉవాచ— సమ్యక్పృష్టం త్వయా కాంతే రామచంద్రకథానకం । కథయామి సవిస్తారం మహామంగళకారకం ॥౬॥ ఆదినారాయణాద్బ్రహ్మా భూన్మరీచిర్విధేస్సుతః । మరీచేః కశ్యపః పుత్ర స్తత్సుత స్సూర్య ఉచ్యతే ॥౭॥ సూర్యపుత్త్రశ్శ్రాద్ధదేవో మనుర్వైవస్వతస్త్వితి। సఏవప్రోచ్యతేతస్యేక్ష్వాకుః పుత్రః ప్రతాపవాన్ ॥౮॥ ఇక్ష్వాకోస్తు వికుక్షిశ్శశాదశ్చ సఏవహి । వికుక్షేస్తు కకుత్స్థశ్చ సఏవాత్రపురంజయః ॥౯॥ సఏవోక్తశ్చేంద్రవాహః కకుత్స్థస్యపతే స్సుతః। అనేనాస్తస్య పుత్రోభూద్విశ్వరంధిశ్చ తత్సుతః ॥౧౦॥ చంద్రశ్చంద్రస్య పుత్రోభూ ద్యువనాశ్వః ప్రతాపవాన్। శాబస్తోయువనాశ్వస్య శాబస్తస్యసుతో మహాన్ ॥౧౧॥ బృహదశ్వ ఇతిఖ్యాత స్తస్మాజ్జజ్ఞే నృపోత్తమః ॥ కువల

లక్ష్మణుడును ఇరుగెలంకులలో భరతశత్రుఘ్నులును వాయవ్యమే మొదలగు మూలలలో సుగ్రీవుడు విభీషణుడు యువరాజగు నంగదుడు జాంబవంతుండును గలిగి, నడుమ నల్లకలువలవంటి కోమలకాంతిగల శ్యాములుండగు రాముని భజించుచున్నాడను. అని యిట్లు మంగళాచరణానంతరము అమ్మహాముని చే సంగ్రహముగ నీయానంద రామాయణమునందలి విషయములు వర్ణింపబడుచున్నవి. ఎట్లనిన—మొదటిదియగు సారకాండమున రావణసంహారాదికంబును, రెండవదియగు యాత్రాకాండమున బ్రాహ్మణ వాక్యముచే సీతతోడ తీర్థయాత్రాదికమును, మూడవదియగు యాగ కాండమున నయోధ్యలో దశాశ్వమేధాదికమును, నాలగవదియగు విలాసకాండమున పత్నితోడ వినోదసంచారాదికమును, అయిదవదియగు జన్మకాండమున స్త్రీ పుత్రగ్రహణాదికమును, ఆరవదియగు వివాహకాండమున కోదండదీక్షోటకు సంచరించుట మొదలుగాగలదియును, ఏడవదియగు రాజ్యకాండమున రాజ్యసంరక్షణాదికమును, ఎనిమిదవదియగు మనోహరకాండమున రామార్చనాది నిరూపణంబును, తొమ్మిదవదియగు పూర్ణకాండమున ప్రియురాలితోడ స్వస్థల ప్రయాణాదికమును చెప్పబడుచున్నది. అని యిట్లు పార్వతీ పరమేశ్వర సంవాదాత్మకంబగు నీకథ యారంభింపబడుచున్నది:—

ఒక సమయమునందు సంతసింపబడిన పార్వతీదేవి రామభక్తిపరాయణురాలై కైలాసనిలయుండగు శ్రీ శంకరస్వామితో నిట్లనియె. శంభుమూర్తీ, నీచే నావద్ద పురాణములు చెప్పబడినవి. ఇప్పుడు నాకు ప్రీతిని వృద్ధిజేయు నట్టిదియును సంతోషము నిచ్చునట్టిదియును అగు శ్రీరామమూర్తి గొనెడి జననము చర్యలు మొదలుగాగల దివ్యచరిత్రను నిరూపింపవేడెద. అనిన పార్వతీ దేవికి శ్రీపరమేశ్వరుడు ఇట్లు చెప్పందొడంగెను;—ఓమనోహారిణీ! చక్కగ నడిగితివి. దివ్యమంగళ ప్రదంబగు శ్రీరామచంద్రునికథను సవిస్తరముగ చెప్పుచున్నాడను. ఆదినారాయణమూర్తినుండి బ్రహ్మపుట్టె. వానికొమరుడు మరీచిమహర్షి, అతని పుత్రుడు కశ్యపుడు. తత్సుతుడు సూర్యుడు. సూర్యసూనుడే యముడు. అతనే వైవస్వత మనువనబడును. మనుపుత్రుడే

యాశ్వనృపతిః దృఢాశ్వస్తత్సుతః స్మృతః॥౧౨॥ హర్యశ్వ ఇతి తత్పుత్రో నికుంభస్తత్సుతః స్మృతః। బర్హణాశ్వో నికుంభస్య బర్హణాశ్వన్నృపోత్తమాత్ ॥౧౩॥ కృతాశ్వనృపతిః ప్రోక్తః శ్యేనజిత్తత్సుతః స్మృతః। యువనాశ్వ శ్శ్యేనజితో యువనాశ్వాన్నృపోత్తమాత్ ॥౧౪॥ మాంధాతా తత్ర్రసద్దస్యుః సఏవ కథితో భువి। పురుకుత్సశ్చ మాంధాతుః పురుకుత్సస్యవై పునః॥౧౫॥ త్రసద్దస్యు రితిఖ్యాత స్త్వనరణ్యశ్చ తత్సుతః। అనరణ్యస్య హర్యశ్వో హర్యశ్వస్యారుణ స్సుతః॥౧౬॥ త్రిబంధనోఽరుణాజ్జాత స్త్రిబంధన సుతో మహాన్। సత్యవ్రతస్సఏవాత్ర త్రిశంకురితి నైస్మృతః॥౧౭॥ సత్యవ్రతస్యపుత్రోభూ ద్ధరిశ్చంద్రః ప్రతాపవాన్ । రోహితస్తత్సుతః ప్రోక్త స్తస్మాచ్చహారితః స్మృతః॥ ౧౮॥ హారితస్యసుతశ్చంప స్సుదేవశ్చంపదేహజః। సుదేవాద్విజయః ప్రోక్త స్తత్పుత్రో భరుకః స్మృతః॥ ౧౯ ॥ భరుకస్యవృకః పుత్రో వృకపుత్రస్తు బాహుకః। బాహుకాత్సగరోజజ్ఞేఽసమంజాస్సగరాత్మజః॥౨౦॥ అసమంజసః పుత్రోఽభూ దంశుమానితి నామతః। తస్యపుత్రోదిలీపస్తు దిలీపాచ్చ భగీరథః॥ ౨౧ ॥ భగీరథాచ్ఛ్రుతోజాతః శ్రుతాన్నాభః ప్రకీర్త్యతే। నాభస్య సింధుద్వీపశ్చ హ్యయుతాయుశ్చ తత్సుతః॥౨౨॥ ఋతుపర్ణ స్త్వయుతాయో స్సుదాస స్తస్యకీర్త్యతే। మిత్రసహ స్సఏవాత్ర కల్మాషాంఘ్రిస్సఏవహి॥౨౩॥ సుదాస స్యాశ్మకః పుత్రో మూలకో శ్మకదేహజః। సఏవ నారీకవచో మూలకస్య సుతోమహాన్॥౨౪॥ నామ్నా దశరథః ప్రోక్త స్తస్యపుత్రః ప్రతాపవాన్। నామ్నా త్వైడవిడః ప్రోక్త స్తస్య విశ్వసహ స్స్మృతః॥ ౨౫॥ తస్య పుత్రస్తు ఖట్వాంగః ఖట్వాంగాద్దీర్ఘ

ఇక్ష్వాకురాజు. ఇక్ష్వాకుపుత్రుఁడే వికుక్షి, ఇతఁడే శశాదుఁడనియు చెప్పబడును. వీనితనయుఁడే పురంజయుండను కకుత్స్థ మహారాజు. ఇతనికి ఇంద్రవాహుఁడనియు పేరుగలదు. వాని కుమారుండు విశ్వరంధి అనేనుడు అనిపిలువబడును. అనేనఃపుత్రుండు చంద్రుఁడు. చంద్రునితనయుఁడు యువనాశ్వుఁడు. వానికొడుకు శాబస్తుఁడు. తదాత్మజుఁడు బృహదశ్వుండు. వానిసుతుఁడు కువలయాశ్వుఁడు. వానిపుత్రుఁడు దృఢాశ్వుఁడు. వానినుండి హర్యశ్వుఁడు పుట్టెను. వానివలన నికుంభుఁడు జనించె. నికుంభతనయుఁడే బర్హణాశ్వుఁడు. వానికి కృతాశ్వుఁడు పుత్రుఁడయ్యె. వీనికొడుకు శ్యేనజిత్తు. వీనికొడుకు యువనాశ్వుఁడు. యువనాశ్వపుత్రుఁడే త్రసద్దస్యుండనబడు మాంధాతృమహారాజు. వీనికొడుకు పురుకుత్సుఁడు. పురుకుత్సునికొడుకు మరలత్రసద్దస్యుఁడు. వీనికొడు కనరణ్యుఁడు. వీనికొడుకు హర్యశ్వుడు. వీనికొడుకు అరుణుఁడు. అరుణపుత్రుఁడు త్రిబంధనుఁడు. త్రిబంధనపుత్రుఁడే సత్యవ్రతుండనబడు త్రిశంకుమహారాజు. వీనికొడుకు హరిశ్చంద్రుఁడు. వానిపుత్రుడురోహితుఁడు. రోహితసుతుఁడు హారితుఁడు. హారితాత్మజుఁడుచంపుఁడు చంపునిసుతుఁడు సుదేవుఁడు. సుదేవభవుఁడు విజయుఁడు. విజయసుతుఁడు భరుకుండు. వానికొడుకు వృకుండు. వృకపుత్రుఁడు బాహుకుండు. బాహుకసుతుఁడు సగరుండు. సగరాత్మజుండు అసమంజసుండు. వీనిపుత్రుఁడు అంశుమంతుండు. వీనికొడుకు దిలీపుఁడు. వీనికుమారుఁడు భగీరథమహారాజు. భగీరథభవుఁడే శ్రుతుండు. శ్రుతపుత్రుఁడు నాభుఁడు. నాభసుతుఁడు సింధుద్వీపుఁడు. వీనికొడుకు అయుతాయు. తత్సుతుఁడు ఋతుపర్ణుఁడు. వానికొడు సుదాసుఁడే మిత్రసహుండ

బాహుకః। దిలీపశ్చ సవివాత్రి తస్య పుత్రోరఘుస్స్మృతః॥౨౬॥ రఘోః పుత్రో హ్యజః ప్రోక్త స్తస్మా ద్దశరథః స్మృతః। రాజ్ఞో దశరథాజ్జాతః శ్రీరామః పరమేశ్వరః॥౨౭॥ యస్య నామాన్యనంతాని గృణంతి మునయస్సదా। విష్ణోరారభ్యకథితా ఏకషష్టిర్నృపామయా॥౨౮॥ ఏకషష్టిర్నృపాశ్చాగ్రే మధ్యేరామోవిరాజతే। తస్యతేచరితం కృత్స్నం సంక్షేపాచ్చబ్రవీమ్యహం॥౨౯॥ ఇక్ష్వాకువంశప్రవరః క్షత్రియోలోకవిశ్రుతః। బలవాన్సరయూతీరేఽయోధ్యాయాం పార్థివోత్తమః॥౩౦॥ నామ్నా దశరథ శ్శ్రీమాన్ జంబుద్వీపపతిర్మహాన్। శశాస రాజ్యం ధర్మేణ స్సైన్యేనమహతావృతః॥౩౧॥ అయోధ్యాయాస్తుసాన్నిధ్యే దేశే శ్రీకోసలాహ్వయే। కోసలాయాం మహాపుణ్యః కోసలాఖ్యోన్నృపోమహాన్॥౩౨॥ తస్యాసీద్దుహితారమ్యా కౌసల్యా పతికాముకా। తస్యా దశరథేనైవ వివాహో నిశ్చితోముదా॥౩౩॥ లగ్నార్థం తం సమానేతుం దూతా దశరథం నృపం॥ యయు ర్వినిశ్చయంకృత్వా వివాహదివసస్యచ॥౩౪॥ తదా దశరథశ్చాపి సాకేతే సరయూజలే। నౌకాస్థోజలజాం క్రీడాం చక్రేవై మంత్రిబంధుభిః॥౩౫॥ నిశాయాం సేనయా యుక్త స్తతోమాగధవందిభిః। రత్నదీపప్రకాశైశ్చ ననృతుర్వారయోషితః॥౩౬॥ తస్మి

నియును కల్మాషపాదుఁడనియుని చెప్పబడును. వానికొడుకు అశ్మకసుతుఁడే నారీకవచుండనబడు మూలకుఁడు. మూలకునితనయుఁడు దశరథుఁడు. దశరథసుతుఁడు ఐడవిడుఁడు. వీనితనయుఁడు విశ్వసహుఁడు. విశ్వసహసుతుఁడు ఖట్వాంగుఁడు. తత్సుతుఁడు దీర్ఘబాహు. దీర్ఘబాహుపుత్రుఁడు దిలీపమహారాజు, దిలీపపుత్రుఁడే రఘుమహారాజు. రఘుజుఁడే అజమహారాజు. అజాంగజుఁడే దశరథమహారాజు. ఈదశరథాత్మజుఁడే శ్రీరామచంద్రుండు. ఎవనినామములను మునులు అనంతముగా గ్రహించుచున్నారో, అట్టిపరమేశ్వరుండే ఈరామచంద్రుండు. ఇట్లువిష్ణుభట్టారకుని మొదలుజేసికొని ౬౧ మహారాజులు నాచేత నిరూపింపబడిరి. ఆవెనుకగూడ ౬౧ మహారాజులుగలరు. ఇట్లు మధ్యభాగమున శ్రీరామమూర్తిరాజిల్లు చుండును. అమ్మహాను భావునిచరిత్రమును నీకు సంక్షేపముగా నంతయును చెప్పుచున్నాడను. ఇక్ష్వాకువంశమున ముఖ్యుఁడును లోకప్రసిద్ధుఁడును బలవంతుఁడును రాజశ్రేష్ఠుఁడును అగు పేరుచేదశరథుండనబడు క్షత్రియుండు జంబూద్వీపమునేలుచు సరయూనదీతీరమగు నయోధ్యాపట్టనమున గొప్పసేనలతో రాజ్యపరిపాలనముఁ జేయుచుండెను. అయోధ్యకు సమీపమున కోసలయను దేశమున కోసలానగరమున పుణ్యాత్ముండగు కోసలుండనురాజు గలఁడు. ఆతనికి కౌసల్యయను రమ్యయైన వివాహమునకు సిద్ధమగు కూతురుగలదు. ఆమెను దశరథమహారాజునకిచ్చి పెండ్లిచేయునట్లు నిశ్చయింపబడెను. వివాహదినమును నిశ్చయించుకొని లగ్నమునకై యాదశరథరాజును పిలుచుకొనివచ్చుటకు వెడలిరి. అప్పుడు దశరథుండును సరయూనదిలో నావనెక్కి మంత్రులతోను బంధువులతోను జలక్రీడామహోత్సవమును జరిపెను. రాత్రిసేనలతోడ వెడలగా నటుమీద వందిమాగధబృందముపొగడ వారనారులు నాట్యమొనరించిరి. అకాలమున లంకలో రావ

న్యాఽలేతు లంకాయాం విధింపప్రచ్ఛరావణః॥కస్మాన్మే మరణంబ్రహ్మన్ తత్త్వంమాంవక్తు మర్హసి॥౩౭॥తద్రావణవచశ్శ్రుత్వా కథయామాసతంవిధిః । కౌసల్యాయాందశరథా ద్రామస్సాక్షాజ్జనార్దనః॥ ౩౮॥ చతుర్ధాపుత్రరూపేణ భూత్వాత్వాంసహనిష్యతి। పంచమేహనిలగ్నస్య రాజ్ఞోదశరథస్యహి॥౩౯॥ దివసోనిశ్చితోవిప్రైః కోసలాఖ్యేనరావణ। తద్విధేర్వచనంశ్రుత్వా పుష్పకస్థో దశాననః॥ ౪౦॥ అయోధ్యాం సత్వరంగత్వా రాక్షసైః పరివేష్టితః। నాకాస్థం తం దశరథం జిత్వాయుద్ధైస్సుదారుణైః॥ ౪౧॥ బభంజ నిజపాదేన తాంనాకాం సరయూజలే । తదాసర్వేమృతాస్తత్ర సరయ్వా నిర్మలేజలే॥ ౪౨॥ దశరథసుమంత్రౌద్వౌ నాకాఖండోపరిస్థితౌ: శనైశ్శనైఃప్రవాహేణ గత్వాభాగీరథీంనదీం॥౪౩॥ తతస్సముద్రమధ్యేహి జీవంతౌ వీశ్వరేచ్ఛయా, రావణః కోసలాంగత్వా కృత్వా పరమసంగరం॥౪౪॥ కోసలాఖ్యంనృపంజిత్వా కౌసల్యాంతాం జహారసః । తతఃప్రముదితోలంకాం యయావాకాశవర్త్మనా॥౪౫॥ దృష్ట్వాతిమింగిలంమత్స్యం వసంతంలవణార్ణవే। చిత్తేవిచారయామాస దేవాస్తేమమశత్రవః॥ ౪౬॥ లంకాయాశ్చహరిష్యంతి కౌసల్యాంగుప్తవిగ్రహాః। అతస్తిమింగిలాయేమాం న్యాసభూతాంకరోమ్యహం॥౪౭॥ ఇతిసంశ్చిత్యమనసి పేటికాయాంనిధాయతాం । మత్స్యంసమర్ప్యహృష్టాత్మా యయౌలంకాందశాననః॥ ౪౮॥ తిమింగిలోపితామాస్యే ధృత్వాబ్ధావ్యచరత్సుఖం। అగ్రే దృష్ట్వా రిపుంస్వీయం తేనయుద్ధాగ్రముద్యతః॥౪౯॥ ద్వీపేతాం పేటి

---

• రాసురుఁడు బ్రహ్మదేవునితో "ఓయిబ్రహ్మ, నాకుమరణమెట్లుగలుగును? యథార్థమును నాకుచెప్పుటకు తగినవాఁడుగానుందువు"అని చెప్పెను. అందుకు-దశరథరాజువలనకౌసల్యాగర్భమున శ్రీమన్నారాయణమూర్తి నాలుగు ప్రకారములుగా పుత్రరూపము చేనవతరించి, రామనాముఁడగు నతడు నిన్ను చంపును. ఆదశరథునికిని కౌసల్యకును ఇఁక నయిదవదినమున, వివాహలగ్నమని కోసలరాజువలన విప్రులచేత నిశ్చయింపబడినది." అని బ్రహ్మపలికెను. ఇట్టి బ్రహ్మవచనమునువిని రావణుఁడు వెంటనే పుష్పకమునెక్కి త్వరగా నయోధ్యకు వెడలి క్రూరులైనరాక్షసులచే పరివేష్టితుఁడై, యుద్ధముజేసి దశరథరాజును జయించి, తనకాలిచే నానావను సరయూనదిలో విరుగద్రొక్కెను. ఆనిర్మలోదకమున నందరును నష్టులయిరి. దశరథరాజును సుమంత్రుఁడను మంత్రియును తామిరువురే ఆనాకాశకలము నవలంబించినవారలై తిన్నతిన్నగా ప్రవాహములోపడి గంగానదినిచేరి, చివరకు సముద్రమధ్యమున నీశ్వరనియతివలన నెట్లో జీవించిరి. ఆరావణుఁడు కోసలకువెడలి యుద్ధముచేసి ఆరాజునుచంపి యాకౌసల్యయను కన్యకను అపహరించికొని లంకనుగురించి యాకాశమార్గమున పోవుచు లవణసముద్రమున వసించు తిమింగిలమునొక్కటిని చూచెను. మఱియు తనమనస్సున-దేవతలు నాశత్రువులు, వారు దాగిన యొది రూపములుగలవారలై ఈకౌసల్యను అపహరింతురు, కనుక నీమెను ఈతిమింగిలమునకు గము యుండుటకై యిచ్చెదను-అని విచారముచేసికొని ఆమెనొక పెట్టెలోపెట్టి మత్స్యమునకు తొనపు సంతోషచిత్తుఁడై లంకకువెడలెను. ఆతిమింగిలమును దానిని నోటఁబెట్టికొని సుఖావన సంపన్న

కాంస్థాప్య సంగ్రామం రిపుణాకరోత్। ఏతస్మిన్నంతరే నౌకాఖండస్తం ద్వీపమాగతః॥ ౫౦॥ తదా తౌ మంత్రినృపతీ ద్వీపం తమారురుహతుః। తత్రతం పేటికాం దృష్ట్వా సముద్ఘాట్యాతివిస్మితౌ॥ ౫౧॥ తస్యాం దృష్ట్వాథ కౌసల్యాం జ్ఞాత్వా వృత్తం పరస్పరం। తయా ముహూర్తసమయే ద్వీపే దశరథో నృపః॥ ౫౨॥ గాంధర్వాఖ్యవివాహంచ చకార ముదితాననః। తతో రాజాథ కౌసల్యా సుమంత్రో మంత్రిసత్తమః॥ ౫౩॥ త్రయస్థిత్వా పేటికాయాం తద్ద్వారం పిదధుః పునః। తిమింగిలో రిపుంజిత్వా చకారాస్యే తు పేటికాం॥ ౫౪॥ లంకాయాం రావణశ్చాపి సమాహూయ విధిం పునః। ఉవాచ ప్రహసన్ వాక్యం సభాయాం సంస్థితస్సుఖం॥ ౫౫॥ విధే తవ వృథా వాక్యం రావణేన మయా కృతం। హతో దశరథస్తోయే కౌసల్యా గోపితా మయా॥ ౫౬॥ తద్రావణవచశ్శ్రుత్వా సభాయాం పద్మసంభవః। దీర్ఘస్వరేణ ప్రోవాచ ఓం పుణ్యాహమితి స్ఫుటం॥ ౫౭॥ రావణస్సంభ్రమాత్ప్రాహ కిమిదం వ్యాహృతం త్వయా। విధిః ప్రోవాచ లగ్నం హి జాతం దశరథస్య హి॥ ౫౮॥ తదా విధిం మృషాకర్తుం దూతాన్సంప్రేష్య సాదరం। తిమింగిలాత్సమానీయ పేటికాం బ్రహ్మణోంతికే॥ ౫౯॥ సముద్ఘాట్యాదదర్శాసౌ తత్ర తస్యాం దశాననః। తదాతిచకితః క్రుద్ధస్తాన్ హంతుం ఖడ్గమాదదే॥ ౬౦॥ తదాతిసంభ్రమాద్వేధా రావణం వాక్యమబ్రవీత్। కిం కరోషి దశాస్య త్వం మాధునా సాహసం కురు॥ ౬౧॥ కౌసల్యైకా స్థాపితాస్యాం పేటికాయాం త్వయా పురా। త్రయస్త్రత్ర సంజాతా భవిష్యంత్యత్ర కోటిశః॥ ౬౨॥ భవిష్యతి వధస్తేఽస్య రామో హ్యేవ జనిష్యతి। సాహసం కురు మా హ్యేవ సత్యాయుషి దశానన॥ ౬౩॥ య

గుచు, ఎదుట తన శత్రువునుచూచి కలహింపఁదొడఁగి, ఒకద్వీపమున నాపెట్టెనుంచి పగతో పోరాడుచుండెను. అంతలోనా నౌకాఖండము ఆద్వీపమును జేరెను. అప్పుడామంత్రియును రాజును ద్వీపమునెక్కిరి. అచ్చటనాపెట్టెనుచూచి తెరచియచ్చెరువొందిరి. దానిలో కౌసల్యనుచూచి అన్యోన్యముగా తమతమ వృత్తాంతముల నెరిగిరి. పిమ్మట నాదశరథరాజు ముహూర్త సమయములో గాంధర్వవివాహవిధిని కౌసల్యనచ్చటనే పెండ్లాడెను. పిదప నాముగ్గురును మరలపెట్టెలోదూరి లోపలద్వారమును బిగించికొనిరి. తిమింగిలమును శత్రువును జయించి ఆపెట్టెను తననోట పెట్టికొనెను. లంకయందు రావణుండును మరల బ్రహ్మదేవుని పిలపించి "ఓయి విధీ, నీమాట నాచే నసత్యముగానయ్యె. నీటిలో దశరథుఁడు చంపబడెను. నాచేత కౌసల్యదాచబడెను." అనిసభలోనవ్వుచుపలికెను. అందుకుబ్రహ్మఉచ్చస్స్వరముతో "ఓంపుణ్యాహం" అని శుభకర్మారంభ సూచక మంగళానుశాసనమును చెప్పెను. దానినివిని రావణుఁడు సంభ్రమముతో ఏమనిచెప్పెదవని యధిక్షేపించెను. అందుకు బ్రహ్మ "దశరథమహారాజుకు వివాహము నెరవేరినదిగదా" యనెను. వెంటనే రావణుఁడు విధిని దబ్బరజేయఁదలచి దూతల[illegible] తిమింగిలాననమునుండి యాపెట్టెను తెప్పించి బ్రహ్మసన్నిధానమున తెరచి యందు వారిని [illegible] మఱియు వారిని చంపుటకు ఖడ్గమును క్రుద్ధుఁడై చేతబూనెను. అప్పుడతిసత్వమున [illegible] రావణునితోనిటనియె. ఓయి రావణా, ఇప్పుడు సాహసింపవలదు. ముందు

ద్భవిష్యం తద్భవతు తదగ్రే మాస్తు సాంప్రతం । ఏతాన్ దూతైః ప్రేషయాద్య సాకేతం త్వం సుఖీభవ॥ ౧౪॥ నభవిష్యతి మద్వాణీ మృషా జానీహి నిశ్చయం। యద్భావ్యం తద్భవత్యేవ గహనా కర్మణో గతిః॥ ౧౫॥ తద్విధేర్వచనం సత్యం మత్వాభీతో దశాననః। పేటికాం ప్రేషయామాస సాకేతం స్వభటైర్ద్రుతాత్॥ ౧౬॥ సాకేతే పేటికాం త్యక్త్వా గాస్తే రావణం గతాః॥ అయోధ్యాయాం మహానాసీ త్సంభ్రమో నృపదర్శనాత్॥ ౧౭॥ అయోధ్యావాసినాం స్వాం కోసలాధిపతేరపి। తతః పునర్వివాహస్య సంభ్రమం కోసలాధిపః॥ ౧౮॥ కృత్వా స్వరాజ్యం జామాత్రే దదౌ ప్రీత్యాహి పుత్రికాం। తదారభ్య కోసలేంద్రాః ప్రోచ్యంతే రవివంశజాః॥ ౧౯॥ తతో రాజా దశరథ స్సుమిత్రాం మగధేశజాం। వివాహేనాపరాం పత్నీం చకార దయితాం ప్రియాం॥ ౨౦॥ కైకేయనృపతేః కన్యాం కైకేయీం పద్మలోచనాం। వివాహేనాకరోద్భార్యాం తృతీయాం పరమాదరాత్॥ ౨౧॥ తథాన్యాని సప్తశతకలత్రాణ్యకరోన్నృపః। ఏవం రాజా దశరథ శ్శాస్తా స జగతీతలే॥ ౨౨॥ దానైర్భోగైర్దశరథో బభూవ జరఠో మహాన్। నాభవత్సంతతి స్తస్య ధార్మికస్యావనీపతేః ॥ ౨౩ ॥ కౌసల్యా చ సుమిత్రా చ కైకేయీ చ గిరీంద్రజే । ఏతాః కులీనా స్సుభగా రూపయౌవనసంయుతాః॥ ౨౪॥ తస్మిన్నవసతి రాజ్యం తు స్థితోఽయోధ్యాపురి ప్రియే॥ దేవానాం దానవానాంచ రాజ్యార్థం విగ్రహోఽభవత్॥ ౨౫॥ తత్ర వాగధవచ్ఛ్రుత్వా యత్రాయోధ్యాపతిర్మహాన్। జయస్తత్ర స సంచేహ

నీవు ఈపెట్టలో కౌసల్యనొకతిని పెట్టితివి. అచ్చటముప్పయు వెలువడిరి. ఇట్లే కొట్లకొలది కాగలరు. నీవు వీరినిచంపితివా ఇప్పుడే రాముఁడు పుట్టును. వీరలకాయుర్బలముండగా నిప్పుడే సాహసింపకుము. వెనుక నెట్లగునో అట్లు అగుగాక. వలదు నాయనా, ఇప్పుడు వీరలను సాకేతరాజధానికి పంపించి నీవు సుఖముగానుండుము. ఎప్పుడును నామాట దబ్బరకాచాలదని చక్కఁగా నెఱిగి కొనుము. ఇది నిశ్చయము. కాతగినది తప్పకయగును. కర్మమార్గము దురవగాహము. అనియిట్లు చెప్పిన విధివచనములను సత్యమని తెలిసి భయభ్రాంతుఁడైన రావణుఁడు వెంటనే ఆపెట్టెను భటులచేతనిచ్చి సాకేతరాజధానికి పంపించెను. ఆభటులునట్లే అయోధ్యలో నాపెట్టె పెట్టి రావణునింజేరిరి. అయోధ్యలో రాజదర్శనమువలన గొప్పసంభ్రమములు జరిగినవి. కోసలపతికిని నాగరికులకును మిక్కిలి యుత్సాహము కలిగినది. సంతసించిన కోసలపతి మరల వివాహమహోత్సవమును జరిపి తన రాజ్యముతోడ కౌసల్యను దశరథునికిచ్చెను. అదిమొదలు రవివంశపురాజులు కోసలేంద్రులనబడెదరు. పిమ్మట నాదశరథుఁడు మగధరాజసుతయగు సుమిత్రను పెండ్లాడి ప్రియపత్నిగా జేసికొనెను. కేకయ నృపపుత్రియైన కమలలోచనయగు కైకేయియను కన్యను మిక్కిలి యాదరముతో మూడవభార్యగా పెండ్లాడెను. ఇట్లే ౭౦౦ మంది భార్యలను వివాహవిధిని స్వీకరించెను. ఇత్తెఱంగున దశరథరాజు దానములతోను భోగములతోను లోకమును పాలించుచు ముసలివాఁడాయెను. అట్టి ధార్మికుఁడైన రాజుకు సంతానము గలుగలేదు. అతనికి కౌసల్య సుమిత్ర కైకేయి అను వీరుముప్వురును రూపయౌవన సంపన్న

స్తాం శ్రుత్వా పవనోజవాత్ ॥ ౧౬॥ ప్రార్థయామాస నృపతిం యుద్ధాయోద్యుక్తం స ప్రతి । తత్ర గత్వా దశరథశ్చకార కదనం మహత్ ॥ ౧౭॥ ఏతస్మిన్నంతరే తత్ర సంగ్రామేఽతిభయావహే । భిన్నాక్షం స్యందనం రాజా నాజానాద్రణసంభ్రమాత్ ॥ ౧౮॥ రాజ్ఞోఽంతికే స్థితా సుభ్రూః కైకేయీ రణకౌతుకం । పశ్యంతీ స్యందనం భిన్నం అపశ్యత్సమరాంగణే ॥ ౧౯॥ అక్షవత్స్వనిజం హస్తం చకార జయహేతవే । తయా తు పూర్వం బాల్యత్వాన్మహర్షేః కస్యచిన్మునేః ॥ ౨౦॥ కృష్ణవర్ణం కృతం తేన శప్తా తే స్యపవాదతః । ముఖమగ్రే నిరీక్ష్యంతి నైవ లోకాః కదాచన ॥ ౨౧॥ తతస్తు గంతుముద్యుక్తం కైకేయీ వామహస్తతః । దండాదికం దదౌ తస్మై మునయే భక్తితః ॥ ౨౨॥ తుష్టో దదౌ వరం విప్రస్తవ వామకరోఽమలః । భవితా వజ్రకఠినః క్వాపి నాశం న యాస్యతి ॥ ౨౩॥ కైకేయీ తం వరం స్మృత్వా స్వం చకారాక్షవత్కరం । అథ జిత్వా రణే దైత్యాన్దృష్ట్వా తత్కర్మ పార్థివః ॥ ౨౪॥ దదౌ వరౌ ద్వౌ తస్యై స న్యాసభూతౌ కృతౌ తయా । యదాహం యాచయిష్యామి తదా త్వం దేహి తౌ మమ ॥ ౨౫॥ తథేత్యుక్త్వా నృపః పత్న్యా యయౌ స్వనగరం ప్రతి । ఏకదా స నిశాయాం తు మృగయాయాం మహావనే ॥ ౨౬॥ చకార వారిబంధం చావధీద్వనచరాన్బహూన్ । ఏతస్మిన్నంతరే తత్ర వనే వారాణసీపథాత్ ॥ ౨౭॥ కరండస్థౌ స్వపితరౌ స్వస్కంధే శ్రవణో వహన్ । కాశీం నేతుం యయౌ వైశ్యో వ్యఘుర్బాధాధయాన్వితః ॥ ౨౮॥ నీరం పాతుం శీఘ్రం దేహి చావయోః శ్వేతి ప్రార్థితః । తాభ్యాం కరండకం న్యస్య గతో కూలే జలసన్నిధౌ ॥ ౨౯॥ గత్వా కృత్వా

తజెంది సత్కుల ప్రసూతలనఁబడి భార్యలై బరగుచుండిరి. అతఁడు ప్రియమగు నయోధ్యలో రాజ్యమునేలుచుండగా రాజ్యమునకై దేవదానవులకు కలహామాయెను. అపుడచ్చట దశరథ రాజున్నచోటులో జయము తప్పదను దివ్యవచనమును విని వాయుదేవుఁడు వచ్చి దశరథునిఁ బ్రార్థించెను. రాజును యుద్ధమునకై వెడలెను. అచ్చటపోయి గొప్పయుద్ధము జరుగుచుండగా దశరథుఁడా యుద్ధసంభ్రమములో తన తేరుయొక్క యిరుసు విరిగినదానిని చూడలేదు. సమీపమందున్న కైకేయి రణవినోదమును చూచుచు ఈరథము భిన్నమయిన సంగతినెఱిగి జయముకొఱకు తనహస్తమును ఇరుసువలె నిలిపెను. మునుపు చిన్నతనమున నామె ఒకానొక మునియొక్క మసిమూతిని నల్లని వన్నెగలదానినిగా చేసెను. అందుచేత నాముని శపించగా నచ్చటిలోకులు తద్భాజ్ఞవలన నొకప్పుడును ముఖమునెదుట చూడకైరి. పిదప వెడలుచుండు మునికి కైకేయి తన యెడమచేతితో దండాదికమును మిక్కిలి భక్తితోడ నిచ్చెను. ఆఋషి సంతసించి నీచేయి వజ్రకఠినమై నాశమునొందదని వరమునిచ్చెను. దానిని స్మరించియే, కైకేయి తనచేతి నిరుసుకుబదులుగాపెట్టెను. అంతటయుద్ధమున దైత్యులను జయించిన దశరథుఁడు తనసతి చేసినపనిని చూచి రెండువరములనిచ్చెను. అందుకా కైకేయి ఇపుడిచ్చిన వరములను ఎపుడునేనడుగుదు నపుడివ్వవలసియుండునని నిలిపెను. అట్లే కానిమ్మని రాజు తనయూరికి వచ్చెను. మఱియు నొకప్పుడు ఆదశరథుండు రాత్రి వేటలో వారిబంధముజేసి అనేకవనచరములను చంపెను. ఆసమయమున నచ్చట కాశికిపోవుబాటసారిగా శ్రవణుఁడను వైశ్యుఁడు

జలేకుంభం న్యమజ్జయతిస్మాజలేక్షణం । కుంభస్యశబ్దతశ్శబ్దో బహూపకరిణోయథా ॥౯౦॥ వన్యద్విపోనహంతవ్య శ్చేతి జానన్నపినృపః । వైశ్యంరాజాద్విపంమత్వా విన్యాసపత్త్రిణా ॥౯౧॥ పపాతశ్రవణస్తోయే హాకేనాహంప్రతాడితః । బ్రువతశ్చేతితద్వాక్యం శ్రుత్వాభూద్విహ్వలోనృపః ॥౯౨॥ గత్వాజలాద్బహిర్వేగా త్తంకృత్వాకర్ణ్యాతద్గిరం । సవణాంవృత్తంపితల్యంతం చకారభయవిహ్వలః ॥౯౩॥ తావంధావపితత్పుత్ర వధంశ్రుత్వారుదతుః కారయిత్వానృపతినా చితింపుత్రసమన్వితౌ ॥౯౪॥ దశరథాయతౌశాపం దదతుఃపుత్రదుఃఖితౌ । పుత్రశోకాదావయోర్హి యథామృత్యుస్తవాస్త్వితి ॥౯౫॥ యయౌనృపోపినగరీం గురుంవృత్తంన్యవేదయత్ । వసిష్ఠోనృపతేర్దోష శాంత్యర్థంతురగాధ్వరం ॥౯౬॥ నృపేణకారయామాస సాకేతేసరయూతటే । రోమపాదఇతిఖ్యాత స్తస్మైదశరథస్సఖా ॥౯౭॥ శాంతాంస్వకన్యాంప్రాయచ్ఛ త్తద్రాష్ట్రేభూదవర్షణం । విభాండకాశ్రమంవారనారీ స్సంప్రేష్యతత్సుతం ॥౯౮॥ రోమపాదో మోహయిత్వా ఋష్యశృంగంసమానయత్ । వారస్త్రియోవనేగత్వా సమానిన్యుర్మృగీసుతం ॥౯౯॥ నాట్యసంగీతవాద్యైశ్చ విభ్రమాలింగనాదిభిః । తత్ప్రభావాదభూద్వృష్టిః పుత్రోపినృపతేరభూత్ ॥౧౦౦॥ తతస్తుష్టోరోమపాద స్తస్మైశాంతాందదౌసుతాం । దశరథోపిస్వపురీం మానయామాసతంమునిం ॥

---

తన గ్రుడ్డితల్లిదండ్రులను కావడిలో మూపున మోసికొనిపోవుచు నారాత్రి చమటచేడస్సిరా(?) గూటకు నీళ్లనిమ్ము నాయనా యని తలిదండ్రులడుగగా నా కావడినచ్చట పెట్టి చెరువువద్ద నీటదిగి తల క్రిందుగా ముంతనుముంచెను. ఆముంత మునుగుశబ్దము ఏనుగు నీళ్లుపీల్చునట్లుకాగా అడవియేనుగను చంపరాదనుట నెఱింగినవాడైనను దశరథుడు శ్రవణుని గజమని బాణముతో కొట్టెను. వాడు హా ఎవడు నన్ను చంపువాడని పడెను. వెంటనే రాజు ఆమాటవిని కల ండి వచ్చిచూచి త్వరగా నీటినుండిదీసి వానివలన సంగతినంతటిని తెలిసికొని బాణము వేసెను. భయభ్రాంతుండునయ్యె. ఆగ్రుడ్డివాండ్రు ఆపుత్రవధచేనేడ్చి రాజువలన పుత్రు డ తమకుచితిని వేయించికొని "పుత్రశోకమువలన మాకెట్లో నీకునట్లే మరణమగుగాక" అని దశరథుని శపించిరి. పిదపరాజు నిజరాజధానికివచ్చి వసిష్ఠులవారికీసంగతిని తెలిపెను. సాకేతమున సరయూతీరమున వసిష్ఠుండు ఆపాపము పరిహరించుటకై రాజుచేత అశ్వమేధ యాగమును చేయించెను. దశరథుడు తన మిత్రుడును ప్రసిద్ధుడునగు రోమపాదునికి తన కన్యయైన శాంతయనుదానినిచ్చెను. రోమపాదుడు తన రాష్ట్రమున ననావృష్టిబాధగలుగగా ఋష్యశృంగుని పిలిచికొనివచ్చుటకై విభాండకాశ్రమమునకు వారకాంతలనంపెను. వారుపోయి నాట్యసంగీత వాద్యములచే విభ్రమాలింగనాది సత్కారములచే నా [illegible]భాండకసుతుని మోహింపజేసి వెంటదెచ్చిరి. ఆ మునిమహిమవలన అచ్చట వానలుకురిసెను. రాజుకు పుత్రుం డునుకలిగెను. అందుచేత సంతసించిన రోమపాదుడు నాఋష్యశృంగునికి సుతయగు శాంత చ్చెను. దశరథుడును తన పట్టణమునకు ఆమునిని పిలిపించెను. అతడును బిడ్డలులేని రా

౧॥ సతు రాజ్ఞేఽంగపుత్రస్య నిరూప్యేష్టిం మహర్షికః। ప్రత్యక్షం హి చకారాగ్నిం యజ్ఞకుండాత్సపాయసం॥౨॥ అగ్ని ర్దత్వా స్వయం వహ్ని స్తదాంతర్ధానమేయివాన్। రాజ్ఞా విభక్తం స్త్రీభ్యస్తత్ కైకేయ్యా గుప్తభాగతః॥౩॥ అహరత్పాయసం హస్తా ద్గృధ్రీ శాపవిమోచకం। సువర్చలాప్సరో యా భూత్ స్వర్గార్థం గాత్సువ ంధువః॥౪॥ శప్తా బ్రాతా తు సా గృధ్రీ తయా వేధాస్సతోషితః। తస్యై తుష్టో విధిః ప్రాహ కైకేయీ పాయసం యదా॥౫॥ ప్రక్షేప్స్యత్యంజనీగిరౌ తదా తే భవితా గతిః। అప్సరాత్వం పూర్వవచ్చ భవిష్యతి న సంశయః॥౬॥ తస్మాత్త్వత్పాయసం నీత్వా క్షిప్తం జనపర్వతే। నిజం స్వరూపం సాలబ్ధ్వా జగామ సురమందిరం॥౭॥ తత స్తాభ్యాం తు కైకేయ్యై దత్తం కించిత్తు పాయసం। భక్షితా భక్షయామాసు రంతర్గర్భా స్తదాభవన్॥౮॥ అసంస్థాసాం దోహదాస్తే పుత్రాణాం భావికర్మభిః। పుత్రాణాం భావికర్మాణి విదుస్తే దోహదైర్జనాః॥౯॥ ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గత శ్రీమదానందరామాయణే వాల్మీకీయే సారకాండే ప్రథమస్సర్గః॥... ... ... ... ॥*॥౧॥*॥

శ్రీశివ ఉవాచ — ఏతస్మిన్నంతరే భూమి ర్దశాస్యాది ప్రపీడితా। బ్రహ్మాణం ప్రార్థయామాస విష్ణుం సోపి తదాబ్రవీత్॥౧॥ భూమ్యామవతరిష్యామి భవంతు కపయస్సురాః। గంధర్వీ దుందుభీనామ్నీ భూమ్యాం కార్యార్థసిద్ధయే॥౨॥ మంథరాఖ్యా భవత్వేషా రాజ్యవిఘ్నార్థసిద్ధయే। పశ్చాత్పునర్ద్వాపరాంతే కుబ్జాత్వం కంసమందిరే॥౩॥ అథ విష్ణుశ్చైత్రమాసి నవమ్యాం మధ్యగే రవౌ। సూతికాగృహమధ్యే తు కౌసల్యాయాః పురోభవత్। చతుర్భుజః పీత

జుకు ఇంద్రునినుండి యొకయాగమును నిరూపించి పాయసముతోడ నగ్ని యజ్ఞకుండమునుండి ప్రత్యక్షమగునట్లుచేసెను. అగ్ని తానుగా నావిర్భవించి రాజుకు పరమాన్నమునిచ్చెను. రాజును తన ప్రియభార్యలకు దానిని పంచెను. కైకేయి నిజదౌష్ట్యమువలన గృధ్రీశాపమోచకం బగు నాపాయసమును పారవేచెను. అదియేమనిన, సువర్చలయను యప్సరస నాట్యదోషమున బ్రహ్మచే శపింపఁబడి వేడుకొనెను. సంతసించిన విధి ఎపుడు కైకేయిపాయసమును అంజనగిరిలో పారవేయునో అప్పుడు నీకు గతికలుగునని వరమిచ్చెను. అందువలన నాసువర్చల గ్రద్దయైయుండె. ఈమె పాయసము పారవేయగా ముందువలె దేవాంగనయై వెడలెను. అంతట తక్కిన ఇరువురును, కొంచము పాయసమును కైకేయికిచ్చిరి. పిమ్మట వారు పరమాన్నమును భక్షించి యప్పుడంతర్గర్భములుగలవారలయిరి. పుత్రులయొక్క భవిష్యత్క్రియల తోడ వారలకు వేవిళ్లు గలిగెను. లోకులు వేవిళ్లవలన పుత్రచర్యల నెఱుంగుదురు. ॥౧॥

౨—ఈనడుమ భూమి రావణాది రాక్షసులచేత పీడింపఁబడినదాయెను. అందువలన భూదేవి బ్రహ్మను ప్రార్థించెను. అతఁడును శ్రీమహావిష్ణువును ప్రార్థించెను. అపుడు విష్ణు "అవనిలో నవతరించెదను, దేవతలు కపులగుగాక, దుందుభియను గంధర్వస్త్రీ కార్యార్థసిద్ధికై మునుము మంథరగా రాజ్యవిఘ్నార్థసిద్ధికై పుట్టని, పిమ్మట మరల ద్వాపరాంతమున కంససన్నిధిని కుబ్జయగును" అని అభయమిచ్చెను. అటుమీద శ్రీమహావిష్ణు చైత్రశుక్ల నవమినాఁడు

వా సా మేఘశ్యామోమహాద్యుతిః॥ ౪॥ సాపిదృష్ట్వాబాలభావం ప్రార్థయామాసతంహరిం । తతోజాత స్తదాబాలః క్షణాద్రత్నవిభూషితః॥ ౫॥ హేమవర్ణఃకంజనేత్ర శ్చంద్రాస్య స్తపనప్రభః । తతస్సుమిత్రాపురత శ్శేషోభూద్బాలరూపధృక్॥ ౬॥ ఆవిర్భూతౌ ద్వావమలౌ కైకేయ్యాశ్శంఖచక్రకే । ఏవంతేజనితాబాలా శ్చత్వారస్సుశుభే॥ ౭॥ దేవదుందుభయో నేదుః పుష్పవృష్టిశ్శుభాపతత్ । జాతకర్మాదిసంస్కారా న్గురుణాన్వకారి తదా॥ ౮॥ ... యామాసవిధివ న్నృపతుర్వారయోషితః॥ శ్యామంరామంతు కౌసల్యాతనయంప్రాహవై గురుః॥ ౯॥ సుమిత్రాతనయంనామ్నా లక్ష్మణంగురురబ్రవీత్ । తతోభరతశత్రుఘ్నౌ నామ్నాసౌప్రాహవై గురుః॥ ౧౦॥ రమణాద్రామఏవాసౌ లక్షణైర్లక్ష్మణ స్స్మృతః । భరణాద్భరతశ్చేతి శత్రుఘ్నశ్శత్రుతర్జనాత్॥ ౧౧॥ ఏవంవవృధిరేసర్వే లక్ష్మణోరాఘవేణహి । శత్రుఘ్నో భరతేనాపి చకారక్రీడనాదికం॥ ౧౨॥ రుక్మ కంకణకుండలై ర్నూపురై స్తైర్విభూషితాః । కేయూరరశనాహార కుండలైరపిశోభితాః॥ ౧౩॥ అనేకరుక్మరత్నాది నిర్మితేషువరేషుచ । మంచకేషుకుమారా స్తే విరేజుర్మాలినః॥ ౧౪॥ ఫాలేస్వర్ణమయాశ్వత్థ పర్ణాన్యతిమహాంతిచ । ముక్తాఫలాగ్రలంబీని శోభయంతిస్మబాలకాన్॥ ౧౫॥ కంఠేరత్నమణివ్రాత మధ్యద్వీపినఖాంచితాః । కర్ణయోస్స్వర్ణసంపన్న రత్నార్జునకలాటుకాః॥ ౧౬॥ సింహనమణిమంజీర కటి... ద్యుతాః । స్మితవక్త్రాల్పదశనా ఇంద్రనీలమణిప్రభాః॥ ౧౭ ॥ అంగణేరింగమాణశ్చ సంస్కారైస్సంస్కృతాశ్శుభాః । తేతాతంరంజయామాసుమాతౄంశ్చాపివిశేషతః॥ ౧౮ ॥ కౌసల్యానృప

---

పత్న్యాహ్న మధ్యమున నూతికాగృహమధ్యభాగమున కౌసల్యాదేవియెదుట నావిర్భవించె ... చతుర్భుజుండును పీతాంబరధారియును మేఘశ్యాముండును తేజోధికుండును అగు శ్రీహరి ఆమె చూచి బాలభావము నొందుమనట్లు ప్రార్థించెను. అంతట క్షణకాలములో చంద్రునివంటి మోమును కమలములవంటి కన్నులును అగ్నివంటి తేజస్సును బంగారువంటి వర్ణభూషణంబులును గల దివ్యబాలకుం డుదయించెను. అంతట సుమిత్రాదేవి యెదుట శేషుండు బాలరూపమును ధరించి యవతరించెను. శంఖచక్రదేవత లిరువురును కైకేయియందు అమడబిడ్డలైరి. ఇట్లు నలుగురు బాలకులు శుభసమయమందు పుట్టిరి. దేవదుందుభులు మ్రోగినవి. శుభమైనపుష్పవృష్టి కురిసినది. జాతకర్మమే మొదలుగాగల సంస్కారములను వారికి దశరథుఁడు గురువులైన వసిష్ఠులవారిచే విధ్యుక్తమార్గమున చేయించెను. గురుఁడు కౌసల్యాపుత్రునికి రామయని నామమిడెను. సుమిత్రాపుత్రునికి లక్ష్మణుఁడనియును కైకేయీ సుతులకు భరతశత్రుఘ్నులనియును నామకరణముఁ జేసెను. రమించుటవలన రాముఁడని లక్షణములచే లక్ష్మణుఁడని భరించుటచే భరతుఁడని శత్రునిగ్రహమువలన శత్రుఘ్నుండని పేర్లొప్పుచుండును. ఇట్లు వీరు వర్ధిల్లుచుండఁగా రామునితోడ లక్ష్మణుఁడును భరతునితోడ శత్రుఘ్నుండును ఆటపాటలలో నెడబాయకయుండిరి. వారు నలుగురు దివ్యరత్న సువర్ణాంకితములగు కేయూర కుండలకంకణ నూపురాది భూషణములచే నలంకరింపఁబడి రావిరేకులు

తిశ్చాపి నానాశస్త్రైస్సుశోభితైః। [illegible] ॥ ౧౯ ॥ రామస్స్వేతరం దృష్ట్వా భోజనస్థం త్వరాన్వితః। [illegible] ॥ ౨౦ ॥ [illegible] త్రం దుద్రావన్నృపచోదితా। [illegible] ॥ ౨౧ ॥ [illegible] సుందరాముః కరే [illegible] నచ। కౌసల్యాస్యే న్నృపాస్యే చ కబలం తం [illegible] ॥ ౨౨ ॥ ఏవం నానా [illegible] సరాఘవః। నానాశిశుక్రీడనకైశ్చేష్టితైర్ముగ్ధభాషితైః॥ ౨౩ ॥ బాలక్రీ[illegible] । పితరౌ నిజచారిత్రైర్వాహనారోహణాదిభిః॥ ౨౪ ॥ తతస్తే బాలకాస్సర్వే వస్త్రాలంకారభూషితాః। సభాయాం పితరం నత్వా తస్థుస్సింహాసనోపరి॥ ౨౫॥ అథపిత్రోపసీతాస్తే గురుణా మునినా తదా। గర్భాష్టే [illegible] జన్మతః పంచమే సమే॥ ౨౬॥ బ్రహ్మవర్చసకామస్య కార్యం విప్రస్య పంచమే। రాజ్ఞో బలార్థినష్షష్ఠే వైశ్యస్యార్థార్థినోష్టమే॥ ౨౭॥ పద్వాభ్యోపనయన మేవం శాస్త్రేషు నిర్ణయః। గురోర్గేహస్య [illegible] ॥ ౨౮॥ చతురః ఖ్యాతా నేవ కలాశ్శాస్త్రాదికాన్యపి। బ్రహ్మచర్యసమాప్తౌ తే తీర్థాని [illegible] ॥ ౨౯ ॥ సేనయా మంత్రిసహితా వసిష్ఠేన సమన్వితాః। పశ్చాత్ సైకపునరాగత్య సాకేతం వివిశుస్తదా॥ ౩౦॥ ఏవం తే మతిమంతశ్చ పిత్రా

మోమున వ్రేలగ మణిమయ వ్యాఘ్రనఖములు కంఠమున దొల్లుచుండ లేతపండ్లమీఁది చిరునవ్వు ముద్దుగారుచుండ అంగణమున దోగాడుచు బాలక్రీడలచే తల్లిదండ్రులను రంజింపఁజేసిరి. కౌసల్యా దశరథులు సదలంకారములచే రామాదులను అలంకరించి వినోదముల నొందుచుండిరి. రాముఁడు భోజనసమయమున కడిని చేత తీసికొని పరుగెత్తెను. పట్టుటకై కౌసల్య [illegible] లెను. యోగులకుగూడ గోచరించని శ్రీరాముఁడు చిక్కకయుండెను. ఇట్లు రాముఁడు చుట్టి [illegible] కౌసల్యనోటిలోను దశరథవక్త్రమునను ముదముతో నాముద్దనిడెను. ఇట్లే రాఘవుఁడు ప[illegible] దెరంగులగు కౌతుకంబులతోను వివిధవిధములైన బాలక్రీడలతోను చేష్టలతోను ముద్దుమాటలతోను పిల్లల పోట్లాటలతోను ముద్దునడకలతోను వాహనారోహణాదికములతోను జననీజనకుల నానందింపజేసెను. అంతట నాబాలకులందరును వర్ధిల్లి వస్త్రభూషణాలంకృతులై [illegible] తండ్రికి నమస్కారమొనర్చి సింహాపీఠంబుల నలంకరించిరి. పిదప దశరథుఁడు వసిష్ఠాదిమునులతో నాబాలురకు గర్భాదిగా నారవదియును జన్మాదిగా నయిదవదియునగు వత్సరమున సంతోషముగా ఉపనయన సంస్కార మహోత్సవమును జరిపెను. ఏలయనిన, బ్రహ్మవర్చస కాముఁడగు బ్రాహ్మణునికి అయిదవయేటను, బలాపేక్షగల క్షత్రియునికి ఆరవయేటను, అర్థకాంక్షగల వైశ్యునికి ఎనిమిదవయేటను, ఉపనయనము కాఁగలదని జ్ఞానులచే శాస్త్రమున నిర్ణయింపఁబడినది. పిదప వారు సుముహూర్తమున గురుకులవాసముచేసి సాంగములగు నాలుగు వేదములను విద్యలను ఇతర శాస్త్రాదులను ముఖోద్గతములుగా నేర్చి, బ్రహ్మచర్య సమాప్తియందు ఆదరముతో తీర్థంబులకు వెడలి, సేనతో మంత్రులతో వసిష్ఠులవారిని వెంబడించికొని మరల

రాజ్ఞోవశేస్థితాః। పితరం రంజయామాసుః పౌరాన్ జానపదానపి॥ ౩౧॥ * ॥ ఇతి శ్రీశతకోటి రామాయణాంతర్గతే శ్రీమదానందరామాయణే వాల్మీకీయే సారకాండే రామజన్మనామ ద్వితీయస్సర్గః ... ... ॥*॥ ౨॥ *॥

శ్రీశివఉవాచ—ఏతస్మిన్నంతరేయోధ్యాం విశ్వామిత్రోయయౌమునిః । యజ్ఞసంరక్షణార్థాయ రాజానంమునిరబ్రవీత్॥ ౧॥ రామంచలక్ష్మణంచాపి మహ్యందేహికియద్దినం । గురుణామంత్ర్యరాజాపి ప్రేషయామాస తౌతదా॥ ౨॥ జగ్మతుర్యజ్ఞరక్షార్థం గాధిజేనరథస్థితౌ । తతఃప్రహృష్టోగాధేయః స్థిత్వాకామాశ్రమేపథి॥ ౩॥ ప్రభాతేస్నాతయోస్స్నాతః ప్రాదాద్విద్యాస్తయోర్ముదా । మాహేశ్వరీంచసద్విద్యాం ధనుర్విద్యాపురస్సరాం॥ ౪॥ శాస్త్రమాస్త్రంలౌకికీంచ రథవిద్యాంగజోద్భవాం । అశ్వవిద్యాంగదావిద్యాం మంత్రాహ్వానవిసర్జనే ॥ ౫॥ క్షుత్తృట్ శ్రమవిలోపిన్యౌ బలామతిబలామపి । సర్వవిద్యాస్త్వవాప్యాథ హ్యభూతాం రామలక్ష్మణౌ ॥ ౬ ॥ వనౌకసాంహితార్థాయ జఘ్నతుస్తత్రరాక్షసాన్ । పథిపాంథజనధ్వంసకారిణీంనామతాటకాం॥ ౭ ॥ రాక్షసీమేకబాణేన జఘానరఘునందనః । అప్సరసామునింపూర్వం క్షోభయామాసకాననే॥ ౮॥ రాక్షసీతస్యశాపేన బభూవసుందకామినీ। మారీచశ్చసుబాహుశ్చ సుందాత్తస్యాస్సుతావుభౌ॥ ౯॥ రామబాణాద్గతిస్తస్యై కీర్తితామునినాపురా । సాప్రాప్యదివ్యదేహత్వం నత్వారామందివంగతా॥ ౧౦॥ విశ్వామిత్రాశ్రమంరామో గత్వాతద్యజ్ఞఘాతకాన్।

నారుమాసములలో నయోధ్యాపురిని సంతోషమున ప్రవేశించిరి. ఇట్లా రాజపుత్రులు అనుకూలపాత్రులై దశరథుని వశమున తండ్రిని నాగరికులను దేశపువారిని గూడ రంజింపజేసిరి.

౩—ఈమధ్యలో విశ్వామిత్రమహాముని అయోధ్యకువచ్చి యజ్ఞసంరక్షణకొఱకు దశరథరాజును "రామలక్ష్మణులను కొన్నిదినములు నావశమున నిమ్ము" అని యడిగెను. అపుడు రాజును ఆచార్యునితో నాలోచించి వారిని పంపెను. ఆరామలక్ష్మణులు రథారూఢులై మిత్రునితోడ వెడలిరి. అంతట సంతుష్టుండైన కౌశికుండు దారిలో కామాశ్రమమున ప్రభాతసమయమున స్నానముచేసి సుస్నాతలగు రామలక్ష్మణులకు మాహేశ్వరియను విద్యను ధనుర్విద్యాపురస్సరముగా శస్త్రవిద్యను అస్త్రవిద్యను లౌకికంబులగు రథగజతురగవిద్యలను ఆయుధవిద్యను మంత్రములప్రయోగోపసంహారములను ఆకలిదప్పులను పోగొట్టునటువంటి బలాతిబలావిద్యలనుగూడ సంతోషముతో నుపదేశించెను. పిదప నారామలక్ష్మణు లిరువురును సర్వవిద్యలను గ్రహించి వనవాసుల క్షేమమునకై అచ్చట రక్కసుల నణచిరి. శ్రీరాముండు మార్గమున దారివారికి మారిగానుండిన తాటకయను రక్కసిని ఒకబాణముచేజంపెను. అది మునుపొక యప్సరస్త్రీ. వనమున నొకతాపసుని తొందరపెట్టగా నామెను రాక్షసి యగునట్లతండు శపించెను. అందువలన తాటక సుందుండను రాక్షసుని కామిని యయ్యె. దానికి సుందునివలన సుబాహుండని మారీచుండని యిరువురు పుత్రులుపుట్టిరి. ఆ శపించినమునిచే నామెకు రామబాణమునుండి సద్గతి చెప్పంబడియుండె. అట్లే ఆమె యిచ్చట దివ్య

రాక్షసాన్నిశితైర్బాణై ర్జఘానరఘునందనః ॥౧౧॥ ప్రారంభం రణయజ్ఞస్య చకారరఘునందనః॥ హత్వాసహస్ర శ్రీమాన్ రాక్షసాన్ నిశితైశ్శరైః॥ ౧౨॥ క్షిప్త్వాబాణేనమారీచం శతయోజనసాగరే । హత్వాసుబాహుంతైః స బాణేనరఘుసత్తమః॥ ౧౩॥ కృత్వాగాధిజయజ్ఞస్య సమాప్తింరఘునందనః । నాకరోద్రణయజ్ఞస్య సమాప్తింస్వ కృతస్యచ॥ ౧౪॥ కాలానలమతృప్తం తందృష్ట్వాతత్తృప్తిహేతవే। శ్రుత్వాజనక గేహేతు తత్కన్యాయాస్స్వయం వరం॥ ౧౫ ॥ రామలక్ష్మణసంయుక్తో మునిస్తంనగరంయయౌ । గమనావసరేమార్గే భర్త్రా శప్తాంశిలాంమునిః॥ ౧౬॥ మునిరూపమహేంద్రేణ భుక్తాంరహసిశోభనాం। గౌతమస్యాంగనాంనామ్నా హ్యహల్యాంకథయత్తదా॥ ౧౭॥ బ్రహ్మణానిర్మితాహల్యా ద్విముఖీగోఃపరిక్రమాత్ । దత్తాపురాగౌతమాయ విసృజ్యేంద్రాదికాన్సురాన్ ॥౧౮॥ తత్సురమ్యభువా వైరం తాంభుక్త్వామునిశాపతః। సహస్రభగవాన్జాత స్సహస్రలోచనస్తతః॥ ౧౯॥ శ్రీరామచంద్రోనిజపాదపద్మ స్పర్శేనతాంగౌతమధర్మపత్నీం । నిష్కల్మషామద్భుతరూపయుక్తాం చకారదేవఃకరుణాసముద్రః॥ ౨౦॥ నదీరూపాజనస్థానేఽహల్యాగౌతమశాపతః। రామేణభ్రమతారణ్యే ప్యంఘ్రిస్పర్శాత్సముద్ధృతా॥ ౨౧॥ కల్పభేదాద్వదంతీత్థం మునయశ్చాపికేచన । నైకరూపాస్తిసర్వేషు కల్పేషురామసత్కథా॥ ౨౨ ॥ తతస్తౌ సురగంధర్వై ర్వర్షితౌపుష్పవృష్టిభిః। దత్వాహల్యాంగౌతమాయ జగ్మతుర్జానకీంప్రతి॥ ౨౩॥ రామేణాశాం

---

దేహమునంది రామునివందించి దివమునకేగెను. అంత రాముఁడు విశ్వామిత్రాశ్రమమునకు వెడలి అచ్చటి యజ్ఞఘాతకులగు రాక్షసులను చంపుచు రణయజ్ఞమున కారంభించి వేలకొలది శ్రీమంతులగు రక్కసులను నిశితాస్త్రంబులచే నణగద్రొక్కి, మారీచుని నూరామడదూరమున సముద్రములో పడవేసి, సుబాహువును చంపివేసి, విశ్వామిత్రయాగమును పూర్తిచేసి, తృప్తిఁ జెందకయుండు కాలాగ్నిని చూచి దానికి తృప్తినిచ్చుటకై తనరణయజ్ఞమును పూర్తిజేయక యుండెను. పిదప జనకరాజమందిరమున సీతాస్వయంవర వృత్తాంతమును విని రామలక్ష్మణుల తోడ విశ్వామిత్రుండు జనక రాజధానికి వెడలెను. దారిలో పోవునపుడు గాధిజుఁడు గౌతమ పత్నియై మునివేషమునందిన యింద్రునిచే ననుభవింపఁబడి పతివలన శాపమునొంది శిలయై యుండు అహల్యా వృత్తాంతమును చెప్పెను. పూర్వము బ్రహ్మచే నిర్మింపబడిన యహల్య ఇం ద్రాది సురులకివ్వబడక ద్విముఖిగో ప్రదక్షిణముచే గౌతమముని కివ్వబడెను. అపుడచే నిం ద్రుఁడు ఆమెనురమించి గౌతమశాపమున సహస్రభగుఁడుగా నేర్పడి పిమ్మట సహస్రాక్షుం డన బడెను. ఆగౌతమధర్మపత్నిని కరుణాసముద్రుఁడగు శ్రీరామచంద్రుఁడు నిజపాదసంస్పర్శనము వలన పాపరహితగాను ఆశ్చర్యరూప సంపన్నురాలుగాను చేసెను. గౌతమశాపముచే జనస్థాన మున నదీరూపముగా నహల్యయుండగా, అరణ్య సంచారసమయమున రాముఁడు నిజపాద స్పర్శచేత నుద్ధరించెను. అని యిట్లుగూడ కొందరుమునులు కల్పభేదమువలన చెప్పెదరు. శ్రీ రామ దివ్యచారిత్రము అన్నికల్పములలోను ఏకరూపముగాలేదు. అంతట వారిమీద దేవ

కాంతమూచే నావికో వాక్యమబ్రవీత్ ॥ నావిక ఉవాచ॥ ఆదావహం క్షాళయిత్వా పాదరేణూంస్తవ ప్రభో॥ ౨౪॥ పశ్చాన్నౌకాం స్పర్శయామి తవపాదౌ రఘూద్వహ।నో చేత్త్వత్పాదరజసా స్పృష్టా నారీ భవిష్యతి॥ ౨౫ ॥ అస్తి మే గృహిణీ గేహే కిం కరోమ్యపరాం స్త్రియం। ఇతి తద్వాక్యమాకర్ణ్య విహస్య రఘునందనః॥ ౨౬ ॥ తేన సంక్షాళితపదో నౌకాం తామారురోహ సః ।తతస్తీర్త్వా జాహ్నవీం తే మిథిలాం మునిభిర్యయుః॥ ౨౭॥ మిథిలాయాం సమాహూతాః కోటిశః పార్థివా యయుః । రావణోప్యద్య శాస్త్ర్యపి యయౌ శ్రుత్వా స్వమంత్రిభిః ॥ ౨౮ ॥ అనాహూతో పుష్పకేణ సేనయా పరివారితః। నయయౌ పుత్రవిరహాద్రాజా దశరథస్తదా ॥ ౨౯ ॥ అత్యాదరైర్విదేహేన సమాహూతోపి కీర్తితః । శ్రీరామలక్ష్మణాభ్యాం చ విశ్వామిత్రో మునీశ్వరైః॥ ౩౦ ॥ శనైర్యదా స మిథిలాం బహిశ్చోపవనం యయౌ । విశ్వామిత్రం సమానేతుం జనకో మంత్రిభిస్సహ॥౩౧॥ యావద్గంతుం మనశ్చక్రే తావచ్ఛిష్యస్సమాయయౌ । విశ్వామిత్రస్య తం దృష్ట్వా ననామ జనకస్తదా॥ ౩౨॥ తతశ్శిష్యః కరం ధృత్వా జనకస్య కరేణ హి । నీత్వా రహసి ప్రోవాచ వచనం స్వగురోః స్ఫుటం॥ ౩౩ ॥ శ్వామహాగాధిజో రాజన్ రాజ్ఞో దశరథస్య హి । మయా పుత్రౌ సమానీతౌ వీరౌ శ్రీరామలక్ష్మణౌ ॥౩౪॥ తా సీతోర్మిళయోః పాణిగ్రహణం హి కరిష్యతః । పణీకృతం త్వయా చాపం రామోయం ఖండయిష్యతి॥ ౩౫॥ అతో వరవిధానేన తౌ పురీం నేతుమర్హతి । ఏతద్వృత్తం చాపభంగ పర్యంతం మాన్యా

గంధర్వులచే పూలవాన వర్షింపబడెను. అహల్యను గౌతమునికిచ్చి గంగాతీరమునకు వెడలిరి. పిమ్మట శ్రీరాముఁడు పడవనెక్కనపుడు నావికాపతి రామునిజూచి "ప్రభూ నీపాదధూళిని నేను మొదట నీళ్లతో కడిగి పిదప పడవనెక్కించెదను. అట్లు చేయకపోతినా నీపాదరజస్సునంటి యీపడవ పణతియగును. నాకింటిలో నిల్లాలున్నది. మరియొక మగువ నేమిచేయుదును" అని చెప్పెను. దానిని విని రాఘవుఁడు నవ్వి వానిచే కాళ్లుకడిగించుకొని పడవనెక్కెను. అంత నంద రును గంగానదినిదాటి మునులతోడ మిథిలాపురికి వెళ్లిరి. మిథిలయందు పిలువఁబడిన రాజులు మితిలేక వెళ్లిరి. సారణముఖమున రావణుఁడు స్వయంవర వార్తవిని తనమంత్రులతోడ సేనా పరివృతుఁడై పుష్పకమునెక్కి పిలువబడక యుండియును వెళ్లెను. మిక్కిలియాదరముతో మిథి లాపతి పిలిపించినను దశరథుఁడు పుత్రవిరహమున వెడలలేదు. విశ్వామిత్రుఁడు రామలక్ష్మణు లను వెంటబెట్టికొని మునులతోడ తిన్నగా మిథిలాపురోపవనమును చేరెను. జనకరాజు విశ్వా మిత్రుని పిలిచికొనివచ్చుటకు తనమంత్రులతో నాలోచించి వెడలునప్పటికి ఒకశిష్యుఁడచ్చటికి పోయెను. అపుడు జనకుఁడు కౌశికశిష్యునిఁజూచి నమస్కరించెను. అంతనాశిష్యుఁడు జనకునిచే బట్టికొని రహస్యప్రదేశమునకుపోయి "ఓయిరాజా, విశ్వామిత్రమునులవారు నీతో చెప్పుమ నిరి. రామలక్ష్మణులను వీరులగు దశరథరాజనందనులు నాతోడవచ్చియున్నారు. వారు సీతో ర్మిళలను పెండ్లియాడగలరు. ఈరాముఁడు నీచే పందెముగా నున్నబడిన చాపమును ఖండిం చును. అందువలన వరవిధానమున వారిని రాజధానిలోనికి రాబట్టికొనుము. ఈసంగతిని విల్లు

టంకురు ॥ ౩౬ ॥ ఇత్యుక్త్వా జనకం శిష్యః స్వగురుం శీఘ్రమాయయౌ । జనకోఽపి ముదాయుక్తః తూర్ణమేవ నిజాం పురీం ॥ ౩౭ ॥ తోరణాద్యైశ్శోభయిత్వా సైన్యేన పరివేష్టితః । వారణేంద్రం పురస్కృత్య సభార్యస్సైన్యపైర్యుతః ॥ ౩౮ ॥ సుమేధాదిప్రమదాభిర్నానావాద్యైర్మహోత్సవైః । విశ్వామిత్రాంతికం గత్వా నత్వా సంపూజ్య తం మునిం ॥ ౩౯ ॥ అజ్ఞాతఇవ తం దృష్ట్వా శ్రుత్వా తద్వృత్తమాదరాత్ । వస్త్రాలంకారభూషాద్యైస్సంపూజ్య విధివన్నృపః ॥ ౪౦ ॥ గజయోస్తౌ సమారోప్య చామరాద్యైస్సువీజితౌ । విశ్వామిత్రేణ మునినా నినాయ మిథిలాం పురీం ॥ ౪౧ ॥ ననృతుర్వారనార్యశ్చ తుష్టువుర్వందిమాగధాః । నేదుర్నానాను వాద్యాని జగుస్తేతు నటాదయః ॥ ౪౨ ॥ తదా తౌ హట్టమార్గేణ జగ్మతుశ్చాతిశోభినౌ । శ్రుత్వా చ పురనార్యశ్చ వీరౌ శ్రీరామలక్ష్మణౌ ॥ ౪౩ ॥ సమాగతావితి ముదా గోపురాట్టాలసంస్థితాః ॥ కంజనేత్రైర్దదృశుస్తే వవర్షుః పుష్పవృష్టిభిః ॥ ౪౪ ॥ తతః పరస్పరం ప్రోచుస్సీతాయోగ్యో వరస్త్వయం! రామోఽస్మాకం కోచ తేహి కరోత్వేవం విధిస్తు సః ॥ ౪౫ ॥ ఊర్మిలాయాస్తు యోగ్యోఽయం లక్ష్మణో వీతిసులక్షణః । అస్మాకం సుకృతైరద్య తయోరేతౌ పతీ శుభౌ ॥ ౪౬ ॥ శ్రీరామలక్ష్మణౌ రమ్యౌ భవతశ్చోత్తమోత్తమౌ । ఏవం తాసాం కామినీనాం వచనాని నృపాత్మజౌ ॥ ౪౭ ॥ శుశ్రువతుశ్శుభాన్యేవ హ్యూర్ధ్వాస్యౌ తౌ దదర్శతుః । తత్ర తే మిలితాస్సర్వే నృపాః ప్రోచుః పరస్పరం ॥ ౪౮ ॥ ఏతాదృశో విదేహేన యదాస్మాభిస్సమాగతం । తదోత్సవః కృతో నైవ హ్యనయోః క్రియతే కథం ॥

విరుగువరకు వెల్లడిచేయవలదు." అని యిట్లుపలికి తనగురువుసన్నిధికి వేగిరమెవచ్చెను. జనకరాజును ఊరకయె సంతోషయుక్తుఁడై తన పత్తనమున అలంకారము చేయించి సేనావృతుండై సతులను నృపులను వెంటబెట్టికొని ఉత్తమగజములను పురస్కరించి సుమేధాది కాంతలును నానావాద్యములును మహోత్సవకరంబుగా నుండునపుడు విశ్వామిత్రుని సన్నిధికి వెడలి, మునిపుంగవుని పూజించి తెలియనివానివలె వారివృత్తాంతమునడిగి తెలిసికొని విధివిధానమున వసన భూషణాలంకారములతో సత్కరించి ఆ రామలక్ష్మణులను ఏనుగలమీాద నెక్కించి చామరా ద్యుపచారములతోడ విశ్వామిత్రునింగూడి మిథిలాపురిలోన పిలిచికొనివచ్చెను. వారాంగనలు నాట్యమాడుచుండ వందిమాగధులు కొనియాడుచుండ వాద్యములు మ్రోగుచుండ పణ్యవీధిలోవచ్చుచు రామలక్ష్మణులు రాజిల్లుచుండిరి. ఈమహోత్సవమునువిని నగర నారీమణులు గోపురాట్టాలములనెక్కి తమ పంకజనేత్రములతోచూచి పూలవానల గురిపించుచు, వారిలో “ఇతఁడు రాముఁడు మనసీతకు తగినమగడుకాగలడు, బ్రహ్మ యిట్లే సంఘటనముచేయుగాక, సులక్షణుఁడగు నీలక్ష్మణుఁడు మనయూర్మిళకు తగినవాఁడు, మన పుణ్యవశమున వారలకు వీరు మంచిమగండ్లు లభించెదరు, ఎంత సుందరులుగానున్నారు. నీకును వీరుత్తమోత్తములు కారే!" అని యిట్లు పరస్పరముగా చెప్పికొనుచుండగా నాశుభవచనములను రామలక్ష్మణులును వినిరి. అంత నచట చేరియున్న రాజులందరును తమలోతాము “ఏమిది? మనము వచ్చినపుడు ఇట్లుత్సవము చేయబడలేదు. వీరికి మహోత్సవము జరుగుచున్నది. మనలనేల

౪౯॥ కిమంతస్తేన రాజ్ఞాద్య సీతా రామాయ సార్పితా । కిమస్మాకం సమాహూయ మానభంగోద్య నః కృతః॥ ౫౦॥ ఏవం తేషాం నృపాణాం చ వచనాని నృపాత్మజౌ । జనకో గాధిజశ్చాపి శుశ్రువుస్తే సమంతతః॥ ౫౧ ॥ తతశ్చ తైశ్చ వైర్వీరా గవాక్షైః స్త్రీభిరీక్షితౌ । జగ్మతుర్వాద్యఘోషాఢ్యౌ జనకస్య సభాం ప్రతి॥ ౫౨ ॥ తతోవతరతుర్వీరౌ గజాభ్యాం మునినా సహ । తత్స్వయంవరశాలాయాం సూపవిష్టేషు రాజసు ॥ ౫౩॥ విశ్వామిత్రానుగౌ తౌ హి మునిశాలాం ప్రజగ్మతుః । ఋద్ధాయాం మునిశాలాయాం మునేరగ్రే నిషీదతుః॥ ౫౪ ॥ ఏవం సభాయామృద్ధాయాం రాజ్ఞా కన్యా ప్రతిగ్రహే । ప్రతిజ్ఞాతం మమ ధనుస్తత్సజ్జత్వముపస్థితం॥ ౫౫॥ యదాధీతో ధనుర్విద్యామత్తః పరశుధారిణా । తదా దత్తం మయా తస్మై ధనుస్త్రిపురదాహకం॥ ౫౬॥ తేనైకవింశద్వారం హి నిక్షత్రీపృథివీకృతా । సహస్రబాహుర్నిహతః స్వపితుర్ఘాతకారణాత్॥ ౫౭॥ తస్మైథిలాంగణే స్థాప్య జామదగ్న్యః స్వపంయయా । అశ్వవత్తద్ధనుః కృత్వా జానకీ క్రీడనం వ్యధాత్॥ ౫౮॥ జామదగ్న్యస్తేన సీతాం జ్ఞాత్వా లక్ష్మీం తదిచ్ఛయా । దదౌ నృపం పణార్థం తద్ధనురస్త్రైర్దురాసదం॥ ౫౯॥ పణీకృతం ధనుస్తచ్చ విదేహేన స్వయంవరే । తతస్సభాయామృద్ధాయాం జనకః ప్రాహ శంకితః॥ ౬౦॥ సంస్థాప్య రాజ్ఞాం పురతస్తస్మై చాపమనుత్తమం । శస్త్రాగారాత్సమానీతం వృషైః పంచశతైస్తు యత్ ॥ ౬౧॥ సీతాస్వయంవరార్థం యత్తన్న్యస్తం పరశుధారిణా । నృపః ప్రాహ సభామధ్యే యో వీరస్త్వద్య సంసది॥ ౬౨ ॥ కరిష్యతి ధను

పిలిపించెను? ఈ రామునికే సీతనిచ్చినాఁడా? మనలను రప్పించి మానభంగము చేయబడినదా?" అనియిట్లు చెప్పికొనుటనుగూడ దశరథుడు రామలక్ష్మణులు విశ్వామిత్రాదులును వినిరి. అంత తిన్నదిన్నగా నావీరులు ఊరివారికి నేత్రానందము నొదవించుచు వాద్యఘోషములతోఁడ జనకరాజ సభకువచ్చిరి. ఏనుగలనుండి దిగి విశ్వామిత్రుని వెంబడించి స్వయంవర మందిరమున ప్రవేశించి మునిశాలయందు కౌశికునిముందర కూర్చుండిరి. ఇట్లు నిండినసభలో జనకరాజు "ఏనూరు మహావృషభములచే నాశస్త్రాగారమునుండి తీసికొనిరాబడిన పరశురాములవారిచే సీతాస్వయంవరమునకై పెట్టబడిన యీధనుస్సుకు ఏమహావీరుఁడు నల్లెత్రాడు నెక్కిబెట్టునో వానిని మాసీతాదేవి వరించగలదు" అని ప్రతిజ్ఞపలికి యందరిమెదుట నాదివ్యచాపమును సంస్థాపించెను. ఓసిపార్వతి, పరశురాముఁడు నావద్ద చదివినపుడు నాదియగు త్రిపుర దాహకమయిన ఆధనుస్సును అతనికిచ్చితిని. ఆభార్గవుడు ఈధనస్సుచేతనే తన తండ్రిని హింసించిన కారణమున వేయిచేతులుగల కార్తవీర్యార్జుననిచంపి ఇరువదియొకమార్లు భూమిని నిక్షత్రముగా చేసినాఁడుగదా? దానిని కడపట మిథిలాంగణమున జనకునిగురించి పడవేసి జామదగ్న్యుఁడు వెడలెను. ఆధనుస్సును గుఱ్ఱమువలె చేసికొని సీతాదేవి యాటలాడుచుండును. అందుచేత పరశురాముఁడు సీతను సాక్షాల్లక్ష్మిగా నెఱిగి ఇతరులకలవిగాని యీవింటినే సీతాస్వయంవరమున పందెముగాపెట్టెను. అందువలన జనకుండునట్లు ప్రతిజ్ఞచేసెను. ఆ ప్రతిజ్ఞావచనమును విని పర్వతమువంటి ధనుస్సునుచూచి రాజోత్తములందరును మోములవ్రేలవిడిచిరి. కొందరు

సృజ్యం తం మే సీతా వరిష్యతి । తత్తస్య వచనం శ్రుత్వా ధనుర్దృష్ట్వాచలోపమం ॥ ౧౩॥ అధోముఖాస్తదా సర్వే బభూవుః పార్థివోత్తమాః । కేచిద్భూమేస్సముద్ధర్తుం ధనుశ్శక్తా న చాభవన్ ॥ ౧౪॥ భూమేరుచ్చాలితే కేచిదూర్ధ్వం నేతుం న చాశకన్ । సర్వేప్యుచ్చాలనే తస్య నృపాశ్శక్తా న చాభవన్ ॥ ౧౫॥ సజ్జీకారః కుతస్తస్య మనసాప్యవిచింతితః । ధనుస్సజ్జీకృతౌ సర్వాన్ నృపాన్ జ్ఞాత్వా పరాఙ్ముఖాన్ ॥ ౧౬ ॥ తదాతిగర్వసంయుక్తస్సభాయాం రావణోబ్రవీత్ । ధనుషస్సన్నిధిం గత్వా విహసన్ జనకం ప్రతి ॥ ౧౭ ॥ యేన వై నిర్జితా దేవాస్త్రైలోక్యం స్వవశీకృతం । ఆందోలితో భుజాభిః శ్రీకైలాసో యేన వై మయా ॥ ౧౮ ॥ తస్య మే జనకాద్యత్వం బలం పార్థివసంసది । ద్రష్టుమిచ్ఛసి కిం త్వస్మిన్ లఘుచాపే తృణోపమే ॥ ౧౯ ॥ ఏవం వదన్ దశాస్యస్స నమ్రీభూత్వా మహాధనుః । గృహీతుం వామహస్తేన చాలయామాస వై తదా ॥ ౨౦ ॥ న తచ్చచాల కించిచ్చ తదా దక్షిణసత్కరం । పురః కృత్వా గృహీతుం తచ్చాలయామాస వై పునః ॥ ౨౧ ॥ న తచ్చచాల తదపి తదాశ్చర్యేణ రావణః । భుజాభ్యాం చాలయామాస తదా చాపం చచాల న ॥ ౨౨ ॥ ఏవం క్రమేణ సర్వాభిర్భుజాభిశ్చాలయన్ ధనుః । వింశద్దోర్భిరేకదేశం చాపస్యోర్ధ్వం చకార సః ॥ ౨౩ ॥ ఏకోనవింశతిర్దోర్భిర్ధృత్వా చైవ చ తద్ధనుః । గుణం భూమ్యాం నిపతితం గృహీతుం హి దశాననః ॥ ౨౪ ॥ కించిద్భూత్వా విన

---

నేలనుండియెత్తుటకును అసమర్థులైరి. కొందరు భూమినుండి కదలించినను నిలిపికొనుటకును చేతకాకపోయిరి. చక్కగా నెత్తినిలుపుటకెవరును శక్తులు కనుబడలేదు. విల్లునెక్కుబెట్టుట యననేమి తమ మనస్సులోను చింతింపచాలరయిరి. ఇట్లు చాపము నధిజ్యము చేయుటలో నెల్లరును విముఖులైయుండుట నెరిగి, అపుడు అఖర్వగర్వదుర్వహుండైన రావణుండు కోదండముపద్దికివచ్చి నవ్వుచు సభలోజనకునితో నిట్లనియె. ఎవనిచేత దేవతలు జయింపబడిరి? ఎవండు మూలోకములను స్వవశము చేసికొనెను? ఎవండు కైలాసము తనచేతులమీద నల్లాడించివిడిచెనో అట్టి నాయొక్క బలమును రాజసభలో కనపుకడ్డివంటి ఈ యల్పచాపమునందు చూడందలచెదవా జనకుండా! అనిచెప్పుచు రావణుండు వంగికొని అమ్మహాధనువును ఎడమచేతితో తీసికొనుటకు కదలింపసాగెను. అది యిసుమంతైనను చలింపలేదు. కుడిచేతిని వేసిచూచెను. అపుడును కదలలేదు. ఆశ్చర్యము నొంది భుజములతో పెగలింపబూనెను. అప్పటికిని కదలదాయెను. ఈ క్రమమున నన్ని భుజములతోను ఎత్తబూనెను. చివర కిరువదిచేతులతో నొక ధనుర్భాగమును పైకెత్తెను. పంతొమ్మిదిచేతులతో దానినట్లే నిలిపికొని నేలంబడియుండు అల్లెత్రాటిని తీసికొనుటకు కొంచమువంగి దానినెత్తుకొనెను. అంతలో ఆధనుస్సు ఎదమీదంబడెను. క్రింద కిచకిచలాడుచు తన యిరువదిచేతులతోను ఎదనుండి ధనువునెత్తనేరడయ్యె. పైచూపులు చూపుచు నేలంబడెను. కచ్చవీడిపోయె, కిరీటముతొలగిపోయెను. సభలో రాజులందరును పకపకలాడిరి. అపుడు రావణునికి ప్రాణాంతకమనబడెను. కండ్లు గిరగిరలాడెను. నోట చొంగ వెడలెను. అంత నతని మంత్రులును పరివారరాక్షసులును చుట్టికొనిరి. అందరును ధనుస్సును

ద్రస్య దోష్ణా జగ్రాహ తం గుణం । ఏతస్మిన్నంతరే తచ్చ పపాత హృదయే ధనుః ॥ ౨౫ ॥ స తద్వింశద్భుజాభిశ్చ చచాల హృదయాద్ధనుః । తదా సభాయామూర్ధ్వాస్యః పపాత స దశాననః ॥ ౨౬ ॥ ముకుటః పతితో భూమౌ ముక్తకచ్ఛోప్యభూత్తదా । తదా విజహసుస్సర్వే సభాయాం పార్థివోత్తమాః ॥ ౨౭ ॥ తదా ప్రాణాంతికశ్వాసీ ద్రావణస్య సభాంగణే । అక్షిణీ భ్రామయామాస లాలాస్నేభ్యో వినిర్యయౌ ॥ ౨౮ ॥ తదా తం వేష్టయామాసు ర్మంత్రిణో రాక్షసాస్తదా । ధనురుచ్చాలనేశక్తా స్తే భవన్నైవ సంపది ॥ ౨౯ ॥ స హ స్రేషు దశాస్యస్య విష్ఠామూత్రం తదాకరోత్ । తతస్సభాయాం జనకః పునః ప్రాహాతిశంకితః ॥ ౩౦ ॥ కోపి వీరోస్తి భూమ్యాం వా కిం విర్వీరం హి భూతలం । చేదస్తి కశ్చిత్సదసి తర్హి సోద్య సభాంగణే ॥ ౩౧ ॥ జీవదానం కరోత్వస్మై దశాస్యాయ నృపాగ్రతః । ఇతి వాక్యశరాఘాత భిన్నౌ తౌ రామలక్ష్మణౌ ॥ ౩౨ ॥ దదృశతుర్గాధిజస్య ముఖం తౌ స్ఫురితభ్రువౌ । విశ్వామిత్రస్తదా ప్రాహ రామం చోత్తిష్ఠ రాఘవ ॥ ౩౩ ॥ కిమంతం రావణస్యాద్య త్వం పశ్యసి సభాంగణే । జీవయైనం రాక్షసేంద్రం సజ్జం కురు ధనుస్త్విదం ॥ ౩౪ ॥ తస్మునేర్వచనం శ్రుత్వా తథేత్యుక్త్వా స రాఘవః । తదోత్థాయాసనాద్వేగా త్ప్రణనామ మునీశ్వరం ॥ ౩౫ ॥ నిష్కాస్య కంఠాద్ధారాదీన్ కటిం బద్ధ్వా తదా ప్రభుః । ముకుటాది దృఢం కృత్వా శనైః ప్రాప సభాంగణం ॥ ౩౬ ॥ తం రామమాగతం దృష్ట్వా జనాస్సర్వేతివిస్మితాః । చకితాః పార్థివాస్సర్వే దదృశుర్నేత్రపంకజైః ॥ ౩౭ ॥ పరస్పరం తదా ప్రోచుః కిం మూఢోస్తి శిశుస్త్వయం । యత్రాస్మాభిః స్థితం తూష్ణీం తత్రాయం కిం కరిష్యతి ॥ ౩౮ ॥ కేచిదాహుర్దశాస్యం హి ద్రష్టుం

---

ఎత్తుటకు చేతకాక నిర్విణ్ణులయిరి. వేయారుమందినడుమ రావణుఁడు మలమూత్రములను చేసికొనెను. పిమ్మట జనకుండు మిక్కిలి శంకించుచు మరల నిట్లనెను. భూమిలో నొకవీరుఁడైనను లేఁడా? భూతలంబే నిర్వీరమాయెనా? వీరుండుండినచో ఈ సభామధ్యమున ఈ దశకంఠునికి రాజులయెదుట జీవదానము చేయుఁగాక. అనిన జనకవాక్యమను బాణమునాటి రామలక్ష్మణులిరువురును కనుబొమ్మలదురుచుండ విశ్వామిత్రునిముఖమును చూచిరి. అందుకప్పుడు విశ్వామిత్రుఁడు “రఘువీర, లెమ్ము, నీవేమి యిప్పుడిచ్చట రావణుని అంతమును చూచెదవా? ఈ సభామధ్యమున రాక్షసేంద్రుని బ్రతికింపుము, ఈధనుస్సును ఎక్కుబెట్టుము” అనెను. శ్రీరాముఁడ ఆమునివచనమునువిని అట్లేయని సత్వరమునలేచి మునీశ్వరునివందించి మెడలో హారాదులను సవరించుకొని నడుముకట్టికొని కిరీటాదులను సరిపరచుకొని సభాంగణమున తిన్నగావెడలెను. ఆరామమూర్తినిచూచి జనులందరును ఆశ్చర్యమునొందిరి. రాజులందరును చకితులై కనుదామరలతో జూచి యొండొరులలో నిట్లుపలికిరి. ఈబాలుండేమి మూఢుఁడా? ఏవిషయమున మనమందరమును ఊరకయున్నామో ఆవిషయమున ఇతఁడేమి చేయగలఁడు? కొందరు రావణుచూచుటకు బాలకుఁడు వచ్చుచున్నాఁడనిరి. కొందరు ఇచ్చట బాలుఁడాటలాడుచున్నాఁడనిరి. కొందరు ఏలయితఁడు కంఠహారాదులను తీసిపెట్టెననిరి. కొందరు ఈముని పగతోనితని నీపనిలో ప్రవేశపెట్టెననిరి. కొందరు ఇతనిబలమును పరీక్షించుటకై విశ్వామిత్రుఁడు పంపెనుగాని

...లస్యనిగ్రహః । కేచిదూచుర్బాలచేష్టా క్రియతే శిశునాత్రహి ॥ ౮౯ ॥ కేచిదూచుః కిమర్థం హి హరాముక్తా స్త్వనేన
వా । కేచిదూచుర్గాధిజేన చాపం ప్రతినియోజితః ॥ ౯౦ ॥ కేచిదూచుర్వైరబుద్ధ్యా చోదితః కిం శిశు స్త్వయం । వధా
ర్థం చాపఘాతేన విశ్వామిత్రేణ రాఘవః ॥ ౯౧ ॥ కేచిదూచుర్బలం త్వస్య మునినా త్ర పరీక్షితుం । చోదితో స్త్వత్ర శ్రీ
రామ శ్చాపేఽయం కిం కరిష్యతి ॥ ౯౨ ॥ ఏవం నానావిధాం స్తర్కా న్యావత్కుర్వంతి పార్థివాః । తావద్దృష్ట్వాగ్ర
తో రామం జనకః ప్రాహ గాధిజం ॥ ౯౩ ॥ కిమర్థం ప్రేషిత స్త్వత్ర మునే బాలస్సభాంగణే । యత్రైతే రావణాద్యాశ్చ
నృపాస్సర్వే తిరస్కృతాః ॥ ౯౪ ॥ తస్మిం శ్చాపే త్వయం బాలః కిమాగత్య కరిష్యతి । యత్త్వయా శిష్యవాక్యేన పూర్వం
చాహం ప్రబోధితః ॥ ౯౫ ॥ తత్సర్వం తు మృషైవాద్య చాపాగ్రే తు నిపత్తమ । క్వాయం బాలః కోమలాంగః క్వేదం
చాపం సుదుర్ధరం ॥ ౯౬ ॥ కించాతక స్తృషాక్రాంత స్సాగరం శోషయిష్యతి । ఏతస్మిన్నంతరే సర్వాస్సుమేధాద్యాః స్త్రి
యశ్చతాః ॥ ౯౭ ॥ గవాక్షజాలరంధ్రైశ్చ ప్రాసాదోపరిసంస్థితాః । దదృశుస్సుకుమారాంగం రామం పంకజలోచ
చనం ॥ ౯౮ ॥ ద్విజరాజాననం చారు దోర్దండద్వయశోభితం ॥ హేమవర్ణోపమరుచిం శృంఖలానూపురాంఘ్రికం ॥
౯౯ ॥ శృంఖలాకంకణవర ద్వయశోభితసత్కరం । దివ్యకుండలమకుట రత్నాలంకారశోభితం ॥ ౧౦౦ ॥ సుజంఘం
సుపదం శూరం సుజానుం సుందరోదరం । సుస్కంధం సుహనుం కంబు కంఠం త్రివలిశోభితం ॥ ౧ ॥ స్మితాస్యం కోమ
లోష్ఠం చ సుదంతావలిరంజితం । సునాసం సుకపోలం చ కంజపత్రాయతేక్షణం ॥ ౨ ॥ సుభ్రూఫాలం చ సుస్నిగ్ధం

ధనుస్సు నితఁడేమి చేయఁగలఁడనిరి. ఇట్లు నానావిధములుగా రాజులు వితర్కించుచుండఁగా జన
కుఁడు ముందు రాముని జూచి విశ్వామిత్రునితో నిట్లనియె. మునిపుంగవా, ఈ బాలకుండు ఏల
పంపఁబడెను? రావణాదులును రాజులును ఏ ధనుర్విషయమై దుర్బలులై యున్నారో అట్టి
ధనుస్సును బాలుఁడువచ్చి యేమి చేయఁగలఁడు? మునుపు శిష్యవాక్యమున నాకు తెలిపిన దం
తయును ఈ ధనుర్ముఖమున నిజమగునా? కోమలాంగుండగు బాలుఁడెచ్చట, ఈ దుర్ధరంబగు
కోదండం బెచ్చట? చాతకపక్షి దప్పిగొనినను సముద్రమును శోషింపగలదా? అని జనకుఁడు చెప్పు
చుండగా ప్రాసాదముల మీఁదనున్న సుమేధాదిసుదతులందరును గవాక్షరంధ్రములనుండి, సర్వాంగ
సుందరుఁడును సర్వాలంకార భూషితుఁడును సుస్నిగ్ధ సర్వావయవుండును సుకుమార శరీరుం
డును మహాపురుష లక్షణములచే మనోహరాకారుండును మహానుభావుండును అగు శ్రీరామ
చంద్రుండు నిజతేజస్సామ్రాజ్యముచేత సభాంగణము రారాజించుచుండఁగా శివచాపంబునకు
అభిముఖుఁడై వచ్చుచుండుటను చూచిరి. ఇట్లు చూచిన స్త్రీలందరును ఊర్ధ్వముఖులై చేతు
లనెత్తికొని మోహావేశముచేత గగనమున త్రిమూర్తులను నిరీక్షించుచు, ఓ పరమేశ్వరా పర
మేష్ఠీ పంకజాక్షా మాకొక్క జన్మాంతరాచరిత వ్రతదాన ధర్మాది పుణ్యఫలంబు లేవైన ఉ
న్న వాటిబలమున శ్రీరామచంద్రునికి పుష్పమువలె యీ ధనుస్సు తేలికయగునట్లు అనుగ్రహిం
పుఁడు. ఈ సుందరాంగుని కంధరంబున పుష్పమాలికను సీత సమర్పించుగాత. మాకిప్పు
డిట్టి సీతారామ వివాహ మహోత్సవమును చూచుటచేత మా నేత్రములు సఫలములు

కుంచితాలకశోభితం। ముక్తామాణిక్యరత్నాది నానాలంకారశోభితం॥ ౩॥ ముక్తారత్నపుష్పమాలా న్యస్తవక్షస్థలశోభితం। న్యస్తహారంన్యస్తసూత్రం బద్ధపీతాంబరాన్వితం॥ ౪॥ దివ్యముద్రాంగుళిలసత్కంకణద్వయసత్కరం। ఏవం దృష్ట్వా స్త్రియో రామం సభాంగణవిరాజితం॥ ౫॥ న్యస్తకోదండతూణీరం శివచాపాభిసంముఖం। ప్రార్థయామాసుస్తాస్సర్వా ఊర్ధ్వాస్యా ఊర్ధ్వసత్కరాః॥ ౬॥ పశ్యంత్యోగగనే శంభుం మోహాన్నారాయణం విధిం। సాక్షాన్నారాయణం రామం నజ్ఞాత్వాతాశ్చవై స్త్రియః॥ ౭॥ హేశంభో హేరమాకాంత హేవిధే మత్పూర్వకృతైః। వ్రతదానాదిపుణ్యైశ్చ చాపసజ్జీకరోత్వయం॥ ౮॥ యుష్మాభిర్నస్సుకృతైశ్చ కర్తవ్యం పుష్పవద్ధనుః। అద్యాస్య కంఠదేశే త్రిమాలాం సీతా దధాత్వియం॥ ౯॥ నోభవత్వద్య నేత్రాణాం సాఫల్యం దర్శనాదిహ। సీతయా రామచంద్రస్య వేదికాయాం స్థితస్య హి॥ ౧౦॥ ఏతస్మిన్నంతరే సీతా రామం దృష్ట్వా సభాంగణే। దివ్యప్రాసాదసంరూఢా సఖీభిః పరివేష్టితా॥ ౧౧॥ ప్రోచ్చచాలాసనాద్వేగా దానందస్వేదసంప్లుతా। సఖ్యాస్తులస్యాః కంఠేస్వాం దోర్లతాం క్షిప్య సాదరం॥ ౧౨॥ అబ్రవీన్మధురం వాక్యం రత్నాలంకారమండితా। కింపణో క్రియతే పిత్రా మమ శత్రుస్వరూపిణా॥ ౧౩॥ క్వరామస్సుకుమారాంగః క్వేదం చాపం నగోపమం। హావిధే కింకరో మ్యద్య కిమస్త్యంతర్గతం తవ॥ ౧౪॥ రామాద్వినాన్యం పురుషం మనసాహం నరోచయే। యది తాతో బలాదన్యం మాం దాస్యతి తదాప్యహం॥ ౧౫॥ త్యజామి జీవితం త్వద్య ప్రాసాదపతనాదినా। హే శంభో హే విధే దుర్గే హే సావిత్రి సరస్వతి॥ ౧౬॥ హే గాయత్రి స్వరేభానో మఘు

గాక. అని వేడుచుండగా నంతలో చెలికత్తెలతోడ సాలంకృతయై సౌధము నెక్కియున్న సీత సభాంగణమున రాముని చూచి యమందానందము నొంది తులసియను సఖి మెడను తన భుజలతను వేసికొని సాదరముగా, ఏమి ఈపందెమును నాకు శత్రుస్వరూపుండై జనకుండు ఏర్పరచెను. సుకుమారుండగు రాముడెక్కడ, ఈ పర్వతమువంటి చాపమెక్కడ? అయ్యో, దైవమా ఇచ్చుట నెట్లు చేయుదువు? నీయంతరంగమున నేమిగలదు? రాముని వదలి వేరొకని మోహించచాలను. ఒకవేళ నాతండ్రి బలాత్కారమున నింకొకనికిచ్చెనా, నేను తప్పక యుప్పరిగెనుండి పడియైనను ప్రాణమును వదలుదును. ఓ శంకరా, విధీ, దుర్గాదేవీ, సావిత్రీ, సరస్వతీ, గాయత్రీ, సహస్రకిరణా, మహేంద్రా, సమవర్తీ, వరుణా, కుబేరా, అగ్నిభట్టారకా, వెన్నా, విష్ణుమూర్తీ, పక్షిరాజా! ఆదిశేషుఁడా, ఓయి సుధాకరుండా, ఓ సమస్తదేవతలారా, లక్ష్ముల నిట్లు ప్రార్థించుచున్నాను. మీరు అందరును అనుగ్రహించి ఇమ్మహాధనుస్సును పుష్పము గఁ చేసిపెట్టుడు. మీరందురు ఈ శ్రీరాముని భుజదండములలో ప్రవేశింపుఁడు, నేను పదునులుగు సంవత్సరములు మునివృత్తి ననుసరించినదై వనమున చరించెదను, ఈ సుకుమారుండు వేష్టి నెక్కుబెట్టుగాక. అని యిట్లు నానావాక్యములతో దేవతలను సంతోషింపఁజేసెను. ఇట్టి చేతఁసాదమున నుండెడు సీతయొక్క మధురాలాపములను రాజవదనలయొక్కయు రాజుల వేసిక్కయు సంభ్రమ వచనంబులను జనకుని యాలాపంబులను వినుచు శ్రీరాముండు చిరునవ్వు క్రొన్నచు చాపము వద్దికి వెడలి నమస్కరించి దానికి ప్రదక్షిణము వచ్చి మరల వందించి శివుని

వస్యమలో౽యప । హేకుబేరానలరమే హేవిష్ణోఖగనాయక ॥ ౧౭ ॥ హేఫణీంద్రనిశానాథ హేసర్వేంగ్లరా
యః । యుష్మాకంప్రార్థయామ్యద్య ప్రసార్యనిజపల్లవం॥ ౧౮॥ సర్వైర్వరేతన్మహచ్చాపం కరణీయంతుపుష్పవత్ । (
వేశనీయంయుష్మాభిః శ్రీరామభుజదండయోః॥ ౧౯ ॥ చతుర్దశవత్సరాణి మునివృత్త్యశవర్తినీ । విచరామివనేచ
హం ధనుస్సజ్జంకరోత్వయం ॥ ౨౦ ॥ ఏవంనానావిధైర్వాక్యైస్సీతాదేవీ ప్రతోషయత్ । ఏవంప్రాసాదస
స్థాయా స్సీతాయావివిధానిచ॥ ౨౧॥ తథాతాసాంహినారీణాం నృపాణాంజనకస్యచ। వాక్యానిశ్రుత్వా శ్రీర
మః కించిత్కృత్వాస్మితాననం ॥ ౨౨ ॥ యయౌచాపంనమస్కృత్య కృత్వాతంచప్రదక్షిణం । పునర్నత్వాశివంధా
త్వాధ్యాత్వాదశరథంనృపం ॥ ౨౩ ॥ కౌసల్యాంచగురుంధ్యాత్వా వామహస్తేనతద్ధధా । సవ్యహస్తేనచాపస్య
ణంధృత్వారఘూత్తమః॥ ౨౪॥ వామహస్తేనన్రమంత చ్చకారసఏనీక్షణాత్ । తదానినేదుర్వాద్యాని తుష్టువుర్వం
మాగధాః॥ ౨౫॥ ఏతస్మిన్నంతరేరాము వామహస్తబలాద్ధనుః । మధ్యేభవత్త్రిఖండంత చ్ఛైవంప్రాచీనముత్తమం
౨౬॥ చాపభంగాన్మహానాద స్తదాభూద్గగనాంగణే । చకంపేధరణీత్వంచా లింగయన్మాంభయాద్దృఢం॥ ౨౭॥
క్షుభుస్సాగరాస్సర్వే నినేదుస్తాదిశోదశ । తారానిపేతుర్ధరణీం శిరశ్శేషోప్యచాలయత్॥ ౨౮॥ వవుర్వాతాస్సుగ
ధాశ్చ దేవాస్తేగగనాస్థితాః । వాదయామాసుర్వాద్యాని పుష్పైస్సమవాకిరన్ ॥ ౨౯ ॥ స్వర్వేశ్యానృతుః
హి దేవాస్తోషంప్రపేదిరే । తదానినేదుస్సదసి భేర్యోదుందుభయోవరాః ॥ ౩౦॥ నవవాద్యస్వనాస్సర్వే బభూ

ధ్యానించి తలిదండ్రులను భావించి గురువును వందించి తన యెడమచేత దాని నెత్తుకొని కు
చేతితో నల్లెద్రాడు తీసికొని క్షణమాత్రమున వామహస్తముచే నాకార్ముకమును వంచి
సెను. అప్పుడు సకలవాద్యములు మ్రోగుచుండెను. వంది మాగధులు పొగడిరి. ఈనడుమ ర
ముని యెడమచేతి బలమువలన ఆశైవమగు మహాచాపంబు మూడు తునకలై విరిగిపడెను
ధనుర్భంగమువలన గగనమున మహాధ్వని గలిగెను. భూమి నడిగెను. భీతిచే నీవు నన్నాలి
గించితివి. సముద్రము లల్లకల్లోలంబులయ్యె. పది దిక్కులును మ్రోగినవి. నక్షత్రములు రా
నవి. ఆదిశేషుండు తలయూడించెను. పరిమళయుక్తంబగు చల్లని గాలివీచెను. గగనంబు
నున్న దేవతలు వాద్యములను వాయించిరి, పుష్పవృష్టిం గురిపించిరి. దేవాంగనలు నర్తనమ
జేసిరి. దేవత లానందించిరి. ఇచ్చట సభాంగణమున వారకాంతలాడిరి మఱి పాడిరి. వా
ములు మ్రోగెను. వంది మాగధులు పొగడిరి. జయధ్వనులు నిండినవి. స్త్రీలు గవాక్షవ
నుండి రామునిమీద పూలజల్లిరి. అప్పుడు రావణుండు లజ్జానమ్రముఖుండై బోడితలల
కచ్చువీడియుండ కలతనొంది క్షణకాలమైన నచ్చట నిలువనేరక వేగముగా లంకకు వె
పోయెను. రామునిచేత భగ్నంబగు నా భర్గధనుస్సునుచూచి మగువలందరు మోదమున
జయనాదంబులతోడ కరతాళంబులు వేసిరి. సీతాదేవియును అమందానందముచేత పులకి
గియై రెప్పవేయక కనుదామరలతో రాముని నిరీక్షించుచు నుత్కంఠితమైయుండె. అం

ర్జయనిస్వనాః । ననృతుర్వారనార్యశ్చ తుష్టువుర్మాగధాదయః॥ ౩౧॥ స్త్రీయో గవాక్షరంధ్రైశ్చ రామం పుష్పైరవా
కిరన్ । తదాసరావణస్తూష్ణీం లజ్జయానతమస్తకః ॥ ౩౨ ॥ ముకుటైరపిహీనశ్చ ముక్తకచ్ఛోతివిహ్వలః । సభా
యాం నతుగంతస్థా తూర్ణం లంకాపురీం యయౌ॥ ౩౩॥ రామేణ భగ్నం తచ్చాపం దృష్ట్వా నార్యో ముదాన్వితాః । చ
క్రుర్జయస్వనైర్ఘోషా నర్తనైశ్చ క్రుశ్చ తాళికాః॥ ౩౪॥ సీతాపి ముదితా జాతా హర్షరోమాంచనిర్భరా । అనిమేషా
కంజనేత్రా రామముత్కంఠితా హ్యభూత్॥ ౩౫॥ ఏతస్మిన్నంతరే రాజా జనకః ప్రాహ మంత్రిణః। కరిణీస్థామత్ర సీతా
మానయధ్వం సముత్సవైః॥ ౩౬ ॥ రక్షణీయా నిజైస్సైన్యై ర్వేష్టయిత్వా సమంతతః । తథేతి తే మంత్రిణశ్చ యయు
ర్వేగేన జానకీం॥ ౩౭॥ ప్రోచుస్తే మధురం వాక్యం ప్రబద్ధకరసంపుటాః । హే సీతే కంజనయనే ధన్యాసి గజగామిని॥
౩౮॥ రవివంశోద్భవేనాద్య దశరథసుతేన చ । రామేణ భగ్నం సదసి చాపముత్తిష్ఠ వేగతః ॥ ౩౯ ॥ కరిణీపృష్ఠమారు
హ్య రామం త్వం గంతుమర్హసి । రామకంఠేర్పయస్వాద్య రత్నమాలాం ముదాన్వితా॥ ౪౦॥ తన్మంత్రిణాం వచశ్శ్రు
త్వా సీతా నత్వా స్వమాతరం । సఖీభిః కరిణీపృష్ఠే సంస్థితాసీన్ముదాన్వితా॥ ౪౧॥ తదోగ్రే నవవాద్యాని నినేదుర్మం
గళానిచ । నినేదుః పృష్ఠభాగేపి నానావాద్యాని వై ముహుః॥ ౪౨॥ చిత్రోష్ణీషాః కంచుకినశ్శతశో వేత్రపాణయః। సీ
తాకరిణ్యాశ్చాగ్రేతే దుద్రువుర్దీర్ఘనిస్వనాః॥ ౪౩ ॥ వారయన్తో జనసంమర్దం సీతాం ద్రష్టుం జనైః కృతం । ననృతు
ర్వారనార్యశ్చ బభూవుర్యత్ర నిస్వనాః॥ ౪౪॥ తుష్టువుర్మాగధాద్యాశ్చ నటా గానం ప్రచక్రిరే । కరిణీం వేష్టయామా

---

జనకమహారాజు మంత్రులతో, మన సీతాదేవిని మాతంగముపై నెక్కించికొని సైన్యముల
తోడ సురక్షితముగా పిలచికొనిరండు. అనెను. అట్లేయని వెడలిన మంత్రులు సీత సన్నిధిం
జేరి. సరసిజాక్షియగు సీతమ్మా నీవు ధన్యవయితివి రవికులాలంకారుండగు దశరథపుత్రుండు
రాముండు సభలో చాపమును ఖండించెను, లెమ్ము, భద్రగజమునెక్కి భద్రముగవచ్చి శ్రీరామ
భద్రుని జేరగలవు. సంతసముతో రాముని మెడలో రత్నహారమును సమర్పింపుము. అని మధు
రముగా విన్నవించిరి. మంత్రుల మంగళ వాక్యములను విని జానకి జననిని వందించి సఖుల
తోడ నేనుఁగుమీఁద నెక్కెను. ముందర మంగళవాద్యములు కర్ణానందంబు నిచ్చుచుండెను.
వెనుకను వాద్యములు విధవిధములుగా వాయింపబడుచుండె. చిత్రశిరస్త్రాణులును వేత్రపాణు
లును అగు నూరారుమంది కంచుకులు ముందుముందు పరుగెత్తుచు తమ దండాలచే జన సంమ
ర్దమును నివారించుచుండిరి. వారకాంతలాడిరి. మాగధులు పొగడిరి. నటులు గానముచేసిరి.
గుఱ్ఱములనెక్కి వేలకొలదిగల పరివారజనులు సాలంకృతులై సీతను చామరాదులతో పరి
వేష్టించికొని వెడలిరి. పిదప ముసలివాండ్రైన ఉపమాతలు (దాదులు) శస్త్రములను ధరించి
చేత బంగారి బెత్తములనుబూని గుఱ్ఱములమీఁద నెక్కి వెడలిరి. ఆవెనుక పురుష వేషము
వేసికొని సాలంకృతలైయుండు తరుణీమణులు వేలకొలది తరలిరి. మోములను మరుగుచేసి
కొనిన కంచుకీజనులు తురగములమీఁద వెళ్లిరి. అటుమీఁద మంత్రులందరును నానావాహన

ను స్సీతా వాస్యస్సహప్రభః ॥ ౪౫ ॥ అశ్వారూఢాశ్చామరాది బిభ్రంతో యుక్తశోభితాః । తతోశ్వసంస్థాశ్చ
స్తాం యయుశ్శోపమాతరః ॥ ౪౬ ॥ జరతాశ్చ స్త్రీధారిణ్యః స్వర్ణదండలసత్కరాః । తతః పురుషవద్వేషాన్బిభ్రంతి
ప్రమదోత్తమాః ॥ ౪౭ ॥ యయుస్తరుణ్యశ్చ తశ్చ స్త్రీ హస్తాస్సుభూషితాః । గోపితాస్యాః కంచుకిస్యస్తురగాధి
సంస్థితాః ॥ ౪౮ ॥ తతస్తే మంత్రిణస్సర్వే నానావాహనసంస్థితాః । స్వైస్వైస్సైన్యైర్వేష్టయామాసుః సీతాయాః కరిణీం
ద్రా ॥ ౪౯ ॥ చామరైః వ్యజనైస్సఖ్యో ముహుస్సీతామవీజయన్ । స్త్రియో గవాక్షరంధ్రైశ్చ సీతాం పుష్పైరవ
రన్ ॥ ౫౦ ॥ ఏవం నానాసముత్సాహై శ్చనైస్సీతా తటిత్ప్రభా । నవరత్నమయీం మాలాం బిభ్రతీ దక్షిణే కరే ॥ ౫
గామం నేత్రకటాక్షైశ్చ పశ్యంతీ ముదితాననా । సభాయాం రాఘవం గత్వా కరిణ్యాశ్చావరుహ్య చ ॥ ౫౨ ॥ శనై
ర్భ్యాంయయా రామం తద్గ్రీవాయాం సులజ్జితా । ముమోచ నిజబాహుభ్యాం రత్నమాలాం ముదాన్వితా ॥ ౫౩ ॥ చ
రనమనంరామ పాదయోః స్థాప్య వై శిరః । తస్థావవాఙ్ముఖీ సీతా సభాయామతిలజ్జితా ॥ ౫౪ ॥ దదర్శ సీతాం
మోపి హారశోభితహృత్స్థలః । అవాప తోషం నితరాం ననామ గాధిజం ప్రభుః ॥ ౫౫ ॥ తదా రామం సమాలింగ్య
శ్వామిత్రో మునీశ్వరః । సునివేశ్య నిజాంకే తం ప్రేమ్ణావఘ్రాయ మస్తకే ॥ ౫౬ ॥ తదా స జనకస్సీతాం గాధిజాంకే
వేశయత్ । సీతయా రఘునాథేన శుశుభే స మునిస్తదా ॥ ౫౭ ॥ మానయామాస స మునిర్జన్మసాఫల్యతాం హృది । తత
భాయాం జనకో విశ్వామిత్రం వచోబ్రవీత్ ॥ ౫౮ ॥ ప్రసాదాత్తవ రామస్య లాభో జాతోద్య మే మునే । ధన్యోస్మ్యహ

---

ములనెక్కి తమతమ సైన్యములతో నంతట రక్షించుకొనియుండిరి. వింజామరములతోను వ్య
నములతోను సఖులు సీతను సేవించుచుండిరి. గవాక్షములనుండి స్త్రీలు సీతమీఁదపూలజల్లి
ఇట్లుమహోత్సవములతోడ మెరుగుబోడియగు సీత కుడిచేతిలో దివ్యనవరత్నమాలికను ధరిం
నిజకటాక్షములచే రాముని నలంకరించుచు సుముఖియై తిన్నతిన్నగా శ్రీరామసన్నిధానమునక
ఏనుఁగునుండి దిగి కొంతనడిచివచ్చి తనరెండుచేతులతో శ్రీరామకంఠమునకు రత్నమాలికన
సమర్పించెను. మఱియు, శ్రీరామచరణారవిందములకు నమస్కరించి మిగులసిగ్గుతో మోము
వంచినిలచెను. శ్రీరాముఁడును మణిమాలాలంకృత వక్షఃస్థలుండై సీతనుచూచి యమందాన
దమునొంది విశ్వామిత్రునికి నమస్కరించెను. ఆకౌశికముని ప్రేమతో రాముని నాలింగించి
తనతొడమీఁద కూర్చుండబెట్టికొని శిరస్సు నాఘ్రాణించెను. అపుడాజనకుఁడు సీతను విశ్వామి
త్రుని మఱియొకతొడమీఁద కూర్చుండబెట్టెను. అమ్మహాముని సీతారాములచే నక్కాలమున
ప్రకాశించుచుండెను. కౌశికుండు తనమదిని జన్మసాఫల్యమయినదని తలంచుచుండెను. అంత జన
కుఁడు విశ్వామిత్రునితో-మునిసత్తమా, మీప్రసాదమువలన నాకు శ్రీరాముండు లభించెను,
నేనుధన్యుండనైతిని కులము సఫలమయ్యె, నాదలితండ్రులు ధన్యులైరి, లోకమున శ్రీరాముని
మామయని ప్రఖ్యాతి నొందితినిగదా. అనిచెప్పి మునిచరణంబులకు నమస్కారముచేసి రాముని
వందించెను. అపుడచ్చటగల రాజులందరును దివ్యసుందర మోహనాంగియగు జానకినిచూచి

కులం ధన్యం ధన్యౌ తౌ పితరౌ మమ॥ ౫౯ ॥ యోహం శ్రీరామశ్వశుర శ్చైతిలోకే ప్రథాం గతః । ఇత్యుక్త్వా గాధిజం నత్వా ప్రణనామ రఘూత్తమం॥ ౬౦ ॥ తదా తే పార్థివాస్సర్వే సీతాం దృష్ట్వా తటిత్ప్రభాం । బింబోష్ఠీం చంద్రవదనాం నేత్రశరతాడితాః॥ ౬౧॥ బభూవుర్వికలా స్తత్ర దుర్దైవం మేనిరే నిజం । కేచిన్మూర్ఛాం యయు స్తత్ర తాన్సమాగత్య మైథిలః॥ ౬౨॥ ప్రార్థయామాస నృపతీన్ విషణ్ణాన్ సదసి స్థితాన్ । నష్టశ్రీన్ మ్లానవదనాన్ లజ్జయానతకంధరాన్॥ ౬౩॥ యుష్మాభిర్మేత్రకన్యాయా వివాహం వినివర్త్యచ । గంతవ్యం స్వపురాణ్యేవ కరణీయా కృపా మయి॥ ౬౪ ॥ తదా తే పార్థివాస్సర్వే మంత్రాంశ్చక్రుః పరస్పరం । యది యుద్ధే విజేతవ్యః శ్రీరామో ద్యరణాంగణే॥ ౬౫॥ తర్హ్యస్మిన్ సమయే దుష్టే జయో నూనం భవిష్యతి । కుముహూర్తే వయం యాతా స్తూష్ణీం గత్వా పురాణి హి॥ ౬౬॥ సుముహూర్తే పునర్యోద్ధుం యాస్యామ స్సకలా బలైః । భవిష్యతి తదాస్మాకం జయో యుద్ధవినిశ్చయాత్॥ ౬౭॥ యదా రామం బాణభిన్నం పశ్యామః పతితం రణే । భవిష్యామః కృతకృత్యా స్తదా సర్వే వయం నృపాః॥ ౬౮॥ తదైవాస్యాపమానస్య దుఃఖం మర్మస్థలంగతం । త్యజామః పార్థివాస్సర్వే జేష్యామో రాఘవం యదా॥ ౬౯॥ కిమర్థమధునా వైరం దర్శనీయం నృపాయవై । ఇతి సంమంత్ర్య తే సర్వే తథేత్యుక్త్వా నృపోత్తమాః ॥ ౭౦ ॥ కృత్వా సీతావివాహం చ గచ్ఛామః స్వస్థలాని హి । తదా తాన్ సకలం వస్తు గృహాణి జనకో ముదా ॥ ౭౧ ॥ కల్పయామాస విధివ న్మునీంశ్చాపి రఘూత్తమం । తతో గాధిజవాక్యేన విదేహః ప్రేషయ మంత్రిణః॥ ౭౨ ॥ సమానేతుం దశరథం తత్ప్రతీక్షాం చకార సః । తేపి గత్వా మంత్రిణశ్చ దృష్ట్వా దశరథం నృపం॥ ౭౩॥ వృత్తం నివేద్య సకలం తన్నత్వా తత్పురః స్థితాః । వృత్తం దశరథః శ్రుత్వా తుతోష

తత్కటాక్షశరతాడితులై తమదురదృష్టమును తలంచుచు వికలురైరి. కొందరు మూర్ఛాక్రాంతులు నయిరి. ఇట్టి సిగ్గుచే తలవంచుకొని నిర్విణ్ణులై యుండు రాజులను చూచి జనకరాజు మీరలందరును నాకూతురి వివాహమహోత్సవమును నెరవేర్చి మీపట్టణములకు వెడలవలయును, నాయెడ దయచేయవలెను అని సంప్రార్థించెను. అపుడు రాజులందరును, శ్రీరాముని యుద్ధమున జయించుపక్షమునందు ఇదిమనకు దుష్కాలము, జయముకాచాలదు, చెడ్డ ముహూర్తమున మనము వెడలివచ్చితిమి, ఊరకమనయూరుచేరి మరల యుద్ధమునకై మంచి ముహూర్తమున బయలుదేరివచ్చెదము. అప్పుడు తప్పక మనకు జయమగును, ఎప్పుడు రాముండు రణమున పడిపోవునో మనమప్పుడు కృతకృత్యులగుదుము, అప్పటికి యీ యవమానము మనకు పోవును, ఇపుడు వృథా విరోధమును ఈ జనకునితో మనమేల పెట్టుకొనవలె? అని యిట్లు పరస్పరముగా నాలోచించుకొని జనక సంప్రార్థన నంగీకరించిరి. అంత విదేహుండు వారికందరికి విడిది మొదలుగాగల వాటిని యేర్పరచియిచ్చెను. మునులకును పూజ్యమగు సముచిత స్థానములను సిద్ధపరచెను. ఇట్లు జనకుఁడు విధివిధానముగా నందరిని సత్కరించుచు గాధిజునిచే సంప్రేరితుఁడై దశరథరాజును పిలచికొనివచ్చుటకు మంత్రులనంపి తాను వారిరాకను పరీక్షించుచుండెను. ఆమంత్రులు నయోధ్యఁజేరి దశరథరాజ సన్నిధిలో సప్రణామముగా నంగని విజ్ఞాపించిరి. దశరథుండును విదిత వృత్తాంతుండై అత్యంతానందము నొంది, సపరివారము

నితేరాత్రదా ॥ ౨౪ ॥ సైన్యేన నాగరైస్సర్వైః స్త్రీభిర్జానపదైస్సహ । మిథిలామగమచ్ఛీఘ్రం తదా దశరథో నృపః ॥ ౨౫ ॥ తదా మహోత్సవేనైవ నృపం దశరథం పురీం । నేతుం గజం పురస్కృత్య జనకః పార్థివైర్యయౌ ॥ ౨౬ ॥ తదా దశరథాగ్రే తౌ దృష్ట్వా కైకేయజౌ సుతౌ । శ్రీరామలక్ష్మణావత్ర కుతః ప్రాప్తావ్యచింతయత్ ॥ ౨౭ ॥ తావద్రామలక్ష్మణాభ్యాం యుక్తం తం గాధిజం మునిం । స్వసేనాయాం నృపో దృష్ట్వా విస్మయం ప్రాప మైథిలః ॥ ౨౮ ॥ తతో దశరథం నత్వా వసిష్ఠం ప్రణిపత్య చ । గాధిజం జనకః ప్రాహ కావేతౌ రామరూపిణౌ ॥ ౨౯ ॥ తతస్తం గాధిజః ప్రాహ రామాంశాద్భరతస్త్వయం । లక్ష్మణాంశాచ్ఛత్రుఘ్నః కైకేయ్యా నందనావిమౌ ॥ ౩౦ ॥ తచ్ఛ్రుత్వా జనకః ప్రాహ రాజానం గాధిజం గురుం । సీతాం రామాయ దాస్యామి లబ్ధాం భూమ్యామయోనిజాం ॥ ౩౧ ॥ దేహజామూర్మిళానామ్నీం లక్ష్మణాయార్పయామ్యహం । కుశధ్వజస్య మే బంధోః శ్రుతకీర్తిశ్చ మాండవీ ॥ ౩౨ ॥ ఏవం తే బాలికే రమ్యే రూపయౌవనమండితే । సీతోర్మిళాభ్యామపి యే మయా నిత్యం ప్రలాలితే ॥ ౩౩ ॥ దాస్యామ్యహం భరతాయ మాండవీం మండనాన్వితాం । శత్రుఘ్నాయ శ్రుతకీర్తిమర్పయామ్యహమాదరాత్ ॥ ౩౪ ॥ ఏవం స్నుషాశ్చతస్రశ్చ త్వమంగీకురు పార్థివ । ఇతీరితో జనకం ప్రాహ రాజా దశరథో ముదా ॥ ౩౫ ॥ తతో దశరథః ప్రాహ శతానందం పురోహితం । అహల్యాజఠరోద్భూతం మైథిలాగ్రే స్థితం మునిం ॥ ౩౬ ॥ కథం లబ్ధా భువస్సీతా తత్సర్వం వక్తుమర్హసి । శతానందస్తథేత్యుక్త్వాబ్రవీద్దశరథం నృప ॥ ౩౭ ॥ * ॥ శతానంద ఉవాచ — సమ్యక్పృష్టం త్వయా రాజన్ శృణుష్వైకాగ్రమానసః । ఆసీత్పురా నృపః కశ్చిత్పద్మాక్ష ఇతి విశ్రుతః ॥ ౩౮ ॥ స దృష్ట్వా సకలాన్ లోకాన్ లక్ష్మీకామైకతత్పరాన్ । చింతయామా

---

తో ముఖ్యులగు నాగరికులు జనపదమువారును వెంబడించిరాగా వేగిరమె మిథిలానగరమునకేతెంచెను. జనకుఁడు సముచితముగా మహోత్సవములం జేసికొని దశరథరాజు నెదుర్కొనెను. అపుడందరును దశరథునివద్దనున్న కైకేయీసుతులను చూచి శ్రీరామలక్ష్మణు లిచ్చటికేలవచ్చిరి? అని విస్మితులైరి. అంతలో జనకుండు తన సైన్యమున రామలక్ష్మణులతోడ రాజిలుచుండు విశ్వామిత్రునిఁజూచి సంభ్రమించుచు దశరథుని వందించి వసిష్ఠులవారికి ప్రణమించి, కౌశికునితో రామరూపులగు వీరిరువురెవరు? అని యడిగెను. అందుకు గాధిజుండు-శ్రీరామాంశమునుండి యీభరతుండును లక్ష్మణాంశమునుండి యీశత్రుఘ్నుండును కైకేయీగర్భమున పుట్టిరి అనెను. అంత జనకుఁడు దశరథ మహారాజుతోను వసిష్ఠ విశ్వామిత్రులతోను పార్థివోత్తమా, భూమి నుద్భవించి యయోనిజయైన సీతను శ్రీరామునికిని, నాయౌరసపుత్రియగు ఊర్మిళయను కన్యకను లక్ష్మణునికిని, నాబంధువగు కుశధ్వజునియొక్క రూపయౌవన సంపన్నురాండ్రగు నిరువురు కూతుండ్రలలో మాండవియను కన్యను భరతునికిని, శ్రుతకీర్తియను కన్యకను శత్రుఘ్ననికిని సమర్పించెదను. ఇట్లు నలుగురు కోడండ్రను మీరు అంగీకరించి యనుగ్రహింపుఁడు. అని యత్యాదరముగా సంప్రార్థించెను. అట్లే యని దశరథుండు నంగీకరించెను. పిదప, దశరథరాజు జనకపురోహితుఁడును అహల్యా తనయుండునగు శతానందమునితో మునీంద్రా సీత భూమినుండి యెట్లు లభించినది? దాని నంతయును వివరింప

పమనసి లక్ష్మీంకన్యాంకరోమ్యహం॥ ౮౯॥ తపసైవనిజాంకేతాం రంజయామినిరంతరం। ఇతినిశ్చిత్యసనృపస్తప్త్వా
తీవ్రంమహత్తపః॥ ౯౦॥ దృష్ట్వాప్రసన్నామగ్రేతు లక్ష్మీంవచనమబ్రవీత్। దుహితామేభవత్వంహి సాప్రాహానృప
తింప్రతి॥ ౯౧॥ పరతంత్రాస్మ్యహంరాజన్ విష్ణుంత్వంప్రార్థయాధునా। సచేద్దాస్యామిమాంతేహి తదాహ్యహం
దుహితాతవ॥ ౯౨॥ భవిష్యామినసందేహ స్తథేత్యుక్త్వానృపఃపునః। తప్త్వాతీవ్రంతపోవిష్ణుం చకారవరదోన్ముఖం॥
౯౩॥ నత్వాతంనృపతిఃప్రాహ దేహికన్యాంరమాంమమ। తద్రాజవచనంశ్రుత్వా మాతులింగఫలంహరిః॥ ౯౪॥ పద్మా
క్షాయదదౌశ్రేష్ఠం స్వయమంతర్దధేవిభుః। తద్భిత్వానృపతిఃకన్యాం దదర్శకనకప్రభాం॥ ౯౫॥ తాందృష్ట్వాసాభి
లాషస్స కన్యాంమేనేనిజాంశుభాం। పద్మాక్షనృపతేఃకన్యాం పద్మాంలోకావదంతితే॥ ౯౬॥ అహ్వయామాసుస్తాం
రమ్యాం సర్వచిత్తైకరంజనీం। శకలేమాతులింగస్య భూత్వైకత్రఫలంపునః॥ ౯౭॥ జాతందృష్ట్వాదధారాథ స్వహస్తే
నృపతేస్సుతా। సావవర్ధతనృపతే రంకేచంద్రకలాయథా॥ ౯౮॥ శుక్లపక్షేచతాందృష్ట్వా పద్మాక్షోచింతయ
ద్ధృది। కస్మైదేయామయాకన్యా హ్యస్యైయోగ్యోవరోత్రకః॥ ౯౯॥ తతస్సంమంత్ర్యనృపతి స్స్వయంవరమథార
భత్। స్వయంవరేథపద్మాయా యజ్ఞారంభాంచకారసః॥ ౧౦౦॥ స్వయంవరాయయజ్ఞాయ పత్త్రైరాకారయన్నృ
పాన్। తేపిశృంగారయుక్తాశ్చ యయుఃపద్మాస్వయంవరం॥ ౧॥ పద్మాస్వయంవరంశ్రుత్వా యయుస్తత్రమునీశ్వ
రాః। యయుర్దేవాస్సగంధర్వా దానవామానవాఃఖగాః॥ ౨॥ నగానద్యస్సముద్రాశ్చ భూరుహాఃకామరూపిణః।
యయుర్యక్షాఃకిన్నరాశ్చ రాక్షసారావణాదయః॥ ౩॥ సర్వాన్ సమాగతాన్ దృష్ట్వా పద్మాక్షఃప్రాహతాన్ప్రతి। అ

నేర్తవనెను. శతానందుడిట్లు చెప్పుచున్నాఁడు—విను మోయిరాజా, పూర్వము పద్మాక్షుండను
రాజు విఖ్యాతుఁడుగానుండె. అతఁడు లక్ష్మీ కామతత్పరులగు సమస్తలోకులనుచూచి, తన
మనమున, నేను లక్ష్మిని కన్యకగా జేసికొందును తపశ్శక్తివలన నాతొడమీఁద నామె నాటలా
డించెదను. అని చింతించి, తీవ్రతపంబు నాచరించెను. మహాలక్ష్మి ప్రసన్నురాలై వరము వేఁడు
మని నీవు నాకూతురగుమనిన నందుకు, రాజా నేను పరతంత్రగాన నీవు శ్రీవిష్ణుమూర్తిని ప్రా
ర్థింపుము, అతఁడు నీకు నన్నీఁగలఁడు, అప్పుడు నేను నీకు తప్పక కూతురగుదును. అని యంత
ర్ధానమయ్యె. అందుకు సరియని పద్మాక్షుఁడు మరల తీవ్రతపమాచరించి నారాయణుని వర
దునిగా జేసికొనెను. అపుడు ప్రసన్నుఁడైన విష్ణుభట్టారకుండు 'నాకు లక్ష్మిని కన్యకగానిమ్ము'
అని సప్రణామముగా వేఁడుకొనుచుండు పద్మాక్షునికి మాతులింగఫల మొకటిని వరముగానిచ్చి
యంతర్ధానమునొందెను. అంత నారాజు దానిని వలిచి అందులో స్వర్ణవర్ణయగు కన్యకను
చూచి కుతూహలముతో తనకు ఇది మంగళకన్యకయనితలంచెను. ఆరమ్యాంగిని లోకులు పద్మా
క్షుపుత్రియగు పద్మయని పిలువనారంభించిరి. అందరియంతఃకరణముల నాకర్షించుచుండు ఆక
న్యక ఆమాతులింగఫలశకలమున మరలియొక పండు పుట్టినదానిం జేకొనెను. ఆరాజుతొడమీఁద
నాబాల చంద్రికలవలె వర్ధిల్లుచుండెను. అంతపద్మాక్షుఁడు ఈ కన్యనెవనికిచ్చెదను? దీనికి తగిన

కాశనీలవర్ణేన య స్స్వాంగం పరిలేపయేత్ ॥ ౪॥ దదామి తస్మై పద్మేయం సత్యం జ్ఞేయం వచో మమ । తద్రాజవచనం శ్రు
త్వా దుర్ఘటం నృపసత్తమాః ॥ ౫॥ పద్మాసౌందర్యసంభ్రాంతా స్తాం హర్తుం తే సముద్యతాః । తాన్ కన్యాహరణోద్యు
క్తాన్ నృపాన్ దృష్ట్వా స నిర్జరాన్ ॥ ౬॥ చకార సంగరం తైస్స పద్మాక్షో లోమహర్షణం । తద్బాణపీడితా దేవా మా
నవా విముఖా రణే ॥ ౭ ॥ బభూవుస్తత్ర దైత్యైశ్చ పద్మాక్షో నిహతో రణే । తతస్తే మిళితా స్సర్వే తాం ధర్తుం దుద్రువుర్ద్ర
వాత్ ॥ ౮॥ సా దృష్ట్వా ధర్తుముద్యుక్తాన్ జుహావాగ్నౌ కళేబరం । తాం మద్దృష్ట్వా నృపాద్యాస్తే వివిస్వన్నగరం తదా ॥౯॥
బభంజుర్నృపగేహాని భూమిం చక్రురితస్తతః । శ్మశానతుల్యం నగరం జాతం వై క్షణమాత్రతః ॥ ౧౦॥ పద్మాక్షనృపతేర్ల
క్ష్మీసంగాజ్జాతేదృశీ దశా । తస్మాన్న మునయో లక్ష్మీం కామయంతి కదాచన ॥ ౧౧ ॥ లక్ష్మ్యా చిత్తస్య చాంచల్యం భయం
శోకో వధోపి చ । భవత్యేవ మహద్దుఃఖం తస్మాత్తాం పరివర్జయేత్ ॥ ౧౨ ॥ పద్మాక్షే నిహతే యుద్ధే నృపపత్న్య స్సహ
స్రశః । భర్త్రా సహైవ గమనం చక్రుస్తా భయనిర్భరాః ॥ ౧౩॥ తతస్తే దైత్యవర్యాద్యా యయుః స్వం స్వం స్థలం ప్రతి ।
ఏకదా వహ్నికుండాత్సా పద్మా శక్తిః స్థిరా హరేః ॥ ౧౪ ॥ బహిర్నిర్గత్య కుండస్య సమీపే సముపావిశత్ । ఏతస్మి
న్నంతరే తత్ర పుష్పకస్థో దశాననః ॥ ౧౫॥ విచరన్ జగతీం జేతుమాకాశవర్త్మనా యయౌ । సారణస్తాం దదర్శాథ వ
హ్నికుండే బహిః స్థితాం ॥ ౧౬ ॥ సారణో దర్శయామాస రావణాయ వచోబ్రవీత్ । పురా సురాసురాద్యాశ్చ యాం
ధర్తుం సముపస్థితాః ॥ ౧౭ ॥ సేయం పద్మాక్షనృపతేః కన్యా పద్మాగ్నిసన్నిధౌ । తత్సారణవచశ్శ్రుత్వా తాం దృష్ట్వా
కామమోహితః ॥ ౧౮ ॥ యానాజ్జవాదుత్పపాత తాం ధర్తుం సానలే విశత్ । తామగ్నౌ సంప్రవిష్టాం స దృష్ట్వా

వరుఁడెచ్చటఁగలఁడు? ఇట్లు చింతించి స్వయంవరమహోత్సవమును యజ్ఞమునకారంభించి. దా
నితోఁడ ప్రకటించెను. రాజులనందరిని పిలిపించెను. ఇట్టిపద్మాస్వయంవరమునకు మునులును దేవత
లును గంధర్వులును దానవులును మానవులును గరుడులు నాగులు కామరూపులగు నదీవృక్షపర్వ
త సముద్రాధిదేవతలును యక్షకిన్నరులును రావణాదిరాక్షసులును వచ్చిరి. ఇట్లువచ్చిన అందరి
తో స్వయంవరమంటపమున పద్మాక్షుఁడు "ఎవఁడు ఆకాశనీలవర్ణముచే తనయంగమును లేపిం
చుకొనునో అతనికి యీపద్మయను కన్యక యివ్వబడును. ఇదిసత్యము" అనిచెప్పెను. రాజశ్రే
ష్ఠులందరును ఈమాటవిని దుర్ఘటమని యెంచి పద్మాసౌందర్య సంభ్రాంతులై ఆమెనపహ
రించుట కుద్యమించిరి. అపుడు అపహరణోద్యుక్తులగు ససురులయిన నృపోత్తములతో దారుణ
రణయజ్ఞమున కారంభించి శౌర్యమును ప్రకటించెను. వాని బాణాఘాతముల నోర్వజాలక దే
వతలు మానవులు విముఖులై వెడలిరి. దానవులు ఎట్లో పద్మాక్షుని జంపిరి. అంత నందరు జేరి
ఆమెను పట్టుటకు పరుగిడిరి. ఆమెదానినెఱిఁగి తనదేహమునగ్నిలోదాచెను. ఆమె కనుపడనం
దున ఆరాజాదులు నగరమునవెదికి రాజమందిరములను పగలగొట్టి భూమిని పెల్లగించిరి. ఆహా!
క్షణమాత్రమున పత్తనంబు శ్మశానతుల్యంబయ్యె. లక్ష్మీసంగమువలన పద్మాక్షరాజుకు ఇట్టిదశ
గల్గె. అందువలన మునులు ఎప్పుడును లక్ష్మిని అపేక్షించరు. లక్ష్మివలన చిత్తచాంచల్యంబు

జ్ఞాత్వాథతత్స్థలం ॥ ౧౯ ॥ తతః ప్రాహదశాస్యస్స త్వయా దేవా నృపాదయః । కృత్వాగ్నౌ వసతింపద్మే శ్రమేగ్రస్తాః కృతాః పురా॥ ౨౦ ॥ తదద్యవాసస్థానం తే మయాజ్ఞాతం మనోరమే । పద్మే ధునాహం త్వాం ధర్తుం శోధయామ్యనలస్థలం ॥ ౨౧ ॥ ఇత్యుక్త్వా జలకుంభైశ్చ సిషేచాగ్నిం దశాననః । యావత్పశ్యతి రత్నాయాం తావత్తత్ర దదర్శ హ॥ ౨౨॥ పంచరత్నాని దివ్యాని గృహీత్వా తాని రావణః । కరండికాయాం సంస్థాప్య విమానేన యయౌ పురీం॥ ౨౩॥ కరండికాం దేవగేహే సంస్థాప్య రావణస్తదా । రాత్రౌ మందోదరీం ప్రాహ మంచకస్థాం రహఃస్థితః॥ ౨౪ ॥ హేమందోదరి రత్నాని మయాత్వత్తోషదానిహి । సమానీతాని యత్నేన త్వదర్థం సురసద్మని॥ ౨౫॥ కరండికాయాం వర్తంతే గచ్ఛ గృహ్ణీష్వ తానిహి । తద్దశాస్యవచశ్శ్రుత్వా సాయయౌ నిజరగృహాత్ ॥ ౨౬ ॥ కరండికాం తత్ర దృష్ట్వా తాం నేతుం పతిసన్నిధౌ । యావదుచ్చాలయామాస నచచాల తదా భువః॥ ౨౭॥ తదా సా లజ్జితాగత్వా రావణాయ న్యవేదయత్ । తచ్ఛ్రుత్వా సప్రహస్యాథ స్వయం నేతుం యయౌ తదా॥ ౨౮॥ తాం సోప్యుచ్చాలయామాస నచచాల కరండికా । యదా వింశద్భుజైర్భూమ్యా నచచాల కరండికా॥ ౨౯॥ తదా స విస్మయావిష్టో భయం మే నే దశాననః। తత్రోద్ఘాటయామాస రావణస్తం కరండికాం॥ ౩౦॥ తావద్దదర్శ తస్యాం సః కన్యాం సూర్యప్రభోపమాం । తత్తేజోహత తేజస్కా న్యాసంచక్షూంషి రక్షసాం॥ ౩౧॥ తాం దృష్ట్వా బాలికాం రమ్యాం యయుస్సర్వేత్రస్తా దయః। తదా మందోదరీం ప్రాహ తస్యా వృత్తం దశాననః॥ ౩౨ ॥ పద్మాక్షకులజాత్యాది సర్వవృత్తం రణోద్భవం । క్రోధాన్మందోదరీ ప్రాహ భయభీతా దశాననం॥ ౩౩ ॥ ఇయం కృత్యా ప్రచండాస్య కులవిధ్వంసకారిణీ । లంకాంకిమర్థమానీతా

భయము శోకము హింసయును మహాదుఃఖమును కలుగును, కనుక ఆసంపదను విడువవలయును. ఇట్లు పద్మాక్షుఁడు నేలపడగా నానృపపత్నులు వేలకొలది భయాతిశయముచే సహగమనముం జేసిరి. రాక్షసేంద్రములే మొదలుగాగల వారందరును తమతమ స్థలములకరిగిరి. ఒకానొకప్పుడు శ్రీమన్నారాయణుని యొక్క స్థిరశక్తియైన యాపద్మ అగ్నికుండమునుండి వెలువడి సమీపమున సంచరించుచుండె. అంతలో రావణుండు పుష్పకమునెక్కి, విజయయాత్ర జేయుచునట్లు వచ్చెను. అపుడు రావణదూతయగు సారణుండు పద్మనుచూచి రావణునితో "ప్రభూ, చూడుము, మునుపు సురాసురాదులు ఎవతకై శ్రమించిరో ఆ యీపద్మ యజ్ఞకుండ సమీపముననున్నది." అని చెప్పెను. అందుమీఁద కామమోహితుండగు దశకంఠుండు తటాలున పుష్పకమునుండి దుమికి పట్టబోయెను. ఆమెయును అగ్నిలో దాగెను. అందుకు రావణుండు. అగ్నిలోదాగి నీవు మునుపు దేవతలకు నృపులకు శ్రమనిచ్చితివి, ఓమనోహారిణి నీస్థలమును నేనెఱింగితిని, ఇయ్యగ్ని కుండమునిపుడు శోధించెదను. అనిచెప్పి జలకుంభములచే నగ్నిని చల్లార్చిచూచి యచ్చట దొరకిన దివ్యపంచరత్నములనుతీసి పెట్టెలోపెట్టుకొని లంకకు వెడలి, దేవాలయమున దానిని భద్రపరచి యారాత్రి మంచముపై మందోదరితో రహస్యముగా ప్రేయసీ, నీకొఱకు దివ్యపంచరత్నములను తెచ్చి దేవునింటిలోపెట్టియున్నాను. ఆపెట్టెనెత్తికొనిరమ్ము. అనిచెప్పెను. అందుకామె యచ్చటికిపోయి ఆపెట్టెను కదలింపనేరక సిగ్గుపడి

హ్యస్యాజ్ఞాత్వాపి చేష్టితం॥ ౩౪॥ దుష్టాం స్వవంశఘాతాయ త్యజైనాం సత్వరం వనే। బాలత్వేఽపీదృశీ గుర్వీ తారుణ్యే కింకరిష్యతి॥ ౩౫॥ వధోఽస్యాస్తవ జానేఽహం మృత్యురేవ భవిష్యతి। స్థాపనీయా న లంకాయాం మియమద్య వచో రావణ॥ ౩౬॥ ఇతి తస్యా వచశ్శ్రుత్వా సత్యం మేనే దశాననః। మంత్రిభిశ్చాథ సంమంత్ర్య దూతానాజ్ఞాపయత్తదా॥ ౩౭॥ కరండికేయం నీత్వాద్య విమానే స్థాప్య యత్నతః। త్యక్త్వా వ్యాఘ్రమహావాక్యాత్తు వనే గచ్ఛత వేగతః॥ ౩౮॥ తతస్తే రాక్షసాస్సర్వే సంమీల్య పుష్పకే ధతాం। కరండికాం తు సంస్థాప్య నిన్యుశ్చాకాశవర్త్మనా॥ ౩౯॥ దశాస్యపత్నీ తానాహ కార్యా భూమిగతా త్వియం। స్థాపనీయా బహిర్నైయం దర్శనాద్వధకారిణీ॥ ౪౦॥ గృహస్థాశ్రమయుక్తో య స్తథా చ విజితేంద్రియః। వృద్ధిమేష్యతి తద్గేహే కుమారీయం శుభాననా॥ ౪౧॥ చరాచరేషు సర్వత్ర ఆత్మరూపేణ యః స్థితః। తస్య గేహే చిరం కాలం స్థాస్యతీయం న సంశయః॥ ౪౨॥ ఇతి మందోదరీవాక్యం శ్రుత్వా దూతాస్సవిస్తరం। యావత్తే గంతుముద్యుక్తాస్తావత్కన్యా వచోఽబ్రవీత్॥ ౪౩॥ యాస్యామ్యహం పునర్లంకాం రాక్షసానాం వధాయ చ। నిధనాయ దశాస్యస్య సపుత్రస్య సమంత్రిణః॥ ౪౪॥ అథ తృతీయవేలాయా మాగత్యాహం పునస్త్విహ। నికుంభజంపాం ద్రకంఠం శతశీర్షణం చ రావణం॥ ౪౫॥ హనిష్యామి పునర్గత్వా పునర్యాస్యామి త్వత్పురీం। అహం చతుర్థవేలాయా ముద్భూతం మూలకాసురం॥ ౪౬॥ కుంభకర్ణసుతం శూరం మర్దయిష్యామ్యహం పునః। తత్తస్యా వచనం శ్రుత్వా వ్యాదివిద్ధో దశాననః॥ ౪౭॥ జాతాస్తే రాక్షసాస్సర్వే భయభీతాశ్శవోపమాః। రావణశ్చింతయామాస హంతవ్యాద్యైవ బాలికా। తీక్ష్ణం ఖడ్గం కరే కృత్వా పద్మాం దుద్రావ రావణః హంతుకామం పతిం దృష్ట్వా మయకన్యా న్యవారయత్॥ ౪౯॥

---

వచ్చి రావణునికి విన్నవించెను. అంత రావణుఁడే నవ్వుచు వెడలి కదలించిచూచి రానందున తనయిరువదిచేతులు వ్యర్థములుకాగా విస్మయావిష్టుఁడై భయభ్రాంతుండై యచ్చటనే ఆపెట్టెను తెరచిచూచెను. అప్పుడందులో సూర్యునివలె వెలుంగుచున్న కన్యారత్నముంగనెను. దాని తేజస్సువలన రాక్షసులనేత్రంబులు నిస్తేజస్కంబులయ్యె. దానినిచూచుటకు బంధుమిత్రవర్గము వారందరునువచ్చి చుట్టుకొనిరి. అప్పుడు దాని వృత్తాంతమునంతయును రావణుండు మందోదరితోఁ జెప్పెను. అందుకు మందోదరి భయభ్రాంతయై క్రోధమునొంది రావణునితో నిట్లనియె. ఈ మారి నీకులనాశముఁ జేయునట్టిది, దీనివృత్తాంతము తెలిసియును లంకకేల తేబడెను? నిజవంశనాశమునకై తెచ్చితివా? వేగమే వనమున వదలుము, బాల్యముననే ఇట్లున్న నింక యౌవనమున నేమిచేయుగలదో? నీకుదీనివల్లనే మృత్యువు సంభవించును. నేనెఱుఁగుదును, ఇప్పుడే దీనిని లంకలో స్థాపింపవలదు; అని యిట్లు చెప్పిన మందోదరీ వాక్యములనువిని సత్యమనినమ్మి మంత్రులతో నాలోచించి దూతలతో ఈపెట్టెనెత్తి విమానమున పెట్టికొని వనమునపోయి వేగమే విడువదగును. అనియాజ్ఞాపించెను. అంతనట్లే రాక్షసులు ఆమెను పెట్టెతోడ విమానమున పెట్టుకొని వెడలునపుడు మందోదరి యిట్లనియె. దీనిని భూమిలో పాతిపెట్టతగును. వెలుపల నున్నదగినదికాదు. చూచినమాత్రమున చంపునట్టిది. ఎవఁడు గృహస్థుండైనను జితేంద్రియుండై చరాచరంబులలో నంతట యాత్మరూపముచే నిండియుండునో వానియింటిలో

సాహసం కురు మా దైన్యేవ సత్యాయుషి దశానన । భవిష్యతి వధస్త్వద్య తవనాస్యా వచో మృషా॥ ౫౦॥ యద్భవిష్యతి భవతు తదగ్రే త్యజ కాననే। కాలాంతరేణ యో మృత్యుస్తమద్య త్వం కిమిచ్ఛసి॥ ౫౧ ॥ ఇతి భార్యావచః శ్రుత్వా తూష్ణీమాస దశాననః । తతస్సా పేటికా దూతైః క్షిప్తా యానేన వై జవాత్॥ ౫౨॥ పశ్యన్ వనాని సర్వాణి సీతాయాం మైథిలస్య చ । కృతా భూమిగతా దూతైస్తదా సర్వైః కరండికా॥ ౫౩॥ తతో యయుః పునర్లంకాం దూతాస్తే రావణస్య చ । న్యవేదయన్ రావణాయ సర్వం వృత్తం యథాకృతం॥ ౫౪॥ సా భూమిస్సూర్యగ్రహణే విదేహేన సమర్పితా। బ్రాహ్మణాయ ద్విజశ్చాపి తాం కర్షయితుముద్యతః॥ ౫౫॥ పశ్యన్ విప్రో ముహూర్తం స ప్రత్యబ్దం వై పునః పునః । చిరకాలేన దృష్ట్వాథ ముహూర్తః పరమోదయః॥ ౫౬॥ శూద్రేణ కర్షయామాస భూమిం కృష్యర్థమాదరాత్ । తదా హలశిరాగ్రేణ నిర్గతా సా కరండికా॥ ౫౭ । తాం గృహీత్వా స శూద్రోపి యయౌ భూమిపతిం ద్విజం । సమర్ప్యాతం నిధానం తు హర్షాత్ప్రాహ ద్విజోత్తమం॥ ౫౮॥ శ్రేష్ఠస్తవ ముహూర్తోయం మహాభాగ్యం తవ ద్విజ । ఇమాం హలాగ్రసంభూతాం గృహాణ త్వం కరండికాం॥ ౫౯॥ నిధానపూరితాం గుర్వీం మయా యత్నేన చాహితాం । తతస్స ద్విజవర్యస్తు తాం జగ్రాహ కరండికాం॥ ౬౦ ॥ తామానీయ విదేహాయ సభామధ్యే దదౌ ముదా । నృపతిం ప్రాహ వృత్తాంతం ద్విజం పృష్టవాన్నృపోపి సః॥ ౬౧॥ ఉవాచ బ్రాహ్మణం భక్త్యా మయా భూమిస్సమర్పితా । తస్యాం లబ్ధా త్వయా చేయం తవైవాస్తు కరండికా॥ ౬౨॥ విదేహనృపతేర్వాక్యం శ్రుత్వోవాచ ద్విజః పునః । మహ్యం సమర్పితా పూర్వం భూమిరేవ త్వయా నృప॥

చిరకాలమీమె యుండగలదు. ఇందుకు సంశయములేదు. అనిన మందోదరీవాక్యమును విని దూతలు నన్నేల్లయని వెడలునపుడు అక్కన్యకయిట్లనియె. నేను రాక్షసుల నందరిని చంపి సపుత్రసపరివారంబుగా రావణుని ధ్వంసముచేయుటకు లంకకు మరలవచ్చెదను. పిమ్మట మూడవతూరివచ్చి నికుంభజాతునాపౌండ్రకుని శతకంఠరావణునిఁ జంపెదను. మరల నాలగవతూరి వచ్చి కుంభకర్ణతనయుండగు శూరుఁడైన మూలకాసురిని సంహరించెదను. అనిన నాకన్యావాక్యములను విని రావణునికి హృదయ భేదనముకాగా భయభ్రాంతులగు రాక్షసులందరును పీనుగలవలె వెలవెలబోయిరి. రావణుఁడు తీక్ష్ణఖడ్గమును చేతబూని దీని నిప్పుడే చంపవలయునని పద్మవద్దికి పరుగిడెను. చంపఁదలఁచు పతినిజూచి మందోదరియిట్లు నివారించెను. ఆయుర్బలంబుండగా ఇప్పుడే సాహసము చేయవలదు. అట్లు సాహసించితివా తప్పకయిప్పుడే నీవు చత్తువు, ఈమెయొక్క మాటబొంకుకాదు. వెనుకనుండి యగునదియగుగాక. మొదట వనమున విడిచిపెట్టుము. కాలాంతరమున రాతగిన మృత్యువును ఇప్పుడేల రాగోరుదువు? ఇట్టి యిల్లాలిమాటనువిని దశకంఠుఁడు ఊరికయుండెను. అంత నాదూతలు ఆపెట్టెను తీసికొనివెడలి అనేకకాననములను చూచుచు మిథిలాదేశమునందు నాగంటిచాలున గంగానదివద్ద భూమిలో పాతిపెట్టి యథాగతముగా లంకానగరమునుచేరి రావణునితో నడచినసంగతిని విన్నవించిరి. ఆభూమి విదేహరాజుచే నొక బ్రాహ్మణునికి సూర్యగ్రహణసమయమున సమర్పింపబడినది. ఆద్విజుండు దానిని దున్నించుటకై ప్రతిసంవత్సరమును సుముహూర్తమును ప్రతీక్షిం





౬౩॥ నేయంకరండికారమ్యా వసుపూర్ణాసమర్పితా । యద్భూమ్యాంవర్తతేవిత్తం తన్నృపస్యనసంశయః ॥ ౬౪॥ మామాధర్మఃస్పృశతు గృహాణేమాంకరండికాం । ఏవంనృపస్యవిప్రేణ కలహోఽభూత్సుదారుణః ॥ ౬౫॥ తదా సభాసదస్సర్వే నృపతింవాక్యమబ్రువన్ । మాకార్యఃకలహోరాజన్ పశ్యాస్యాంకింతువర్తతే॥ ౬౬॥ తాంతదో ద్ఘాటయామాస దూతైర్నృపతిసత్తమః । తస్యాందృష్ట్వాబాలికాంతు విస్మయంప్రాపపార్థివః ॥ ౬౭ ॥ ద్విజస్త్య క్త్వాయయౌగేహం పాలయామాసతాంనృపః । తదాఖేచరవాద్యాని నేదుఃకుసుమవృష్టిభిః ॥ ౬౮ ॥ వవర్షుస్సుర సంఘాశ్చతాంకన్యాంజనకంనృపం । గంధర్వాగాయనంచక్రుర్ననృతుశ్చాప్సరోగణాః॥ ౬౯ ॥ తదామేనేసజాంక న్యాం జనకస్తోషమాపసః । జాతకంకారయామాస విప్రైస్తస్యాస్సవిస్తరం ॥ ౭౦ ॥ దదౌదానానివిప్రేభ్యో ననృతు ర్వారయోషితః । మాతులింగాన్నిర్గతాయా మాతులింగీతిసాస్మృతా॥ ౭౧ ॥ అగ్నివాసాదగ్నిగర్భా తథారత్నావ తీతిచ । రత్నాంతరనివాసాచ్చ ప్రోచ్యతేజగతీతలే ॥ ౭౨॥ ధరణ్యానిర్గతాయస్మాత్తస్మాద్ధరణిజేతిచ । జనకేనావి తాయస్మా జ్జానకీతిప్రకీర్త్యతే॥ ౭౩॥ సీరాగ్రాన్నిర్గతాయస్మాత్సీతేత్యత్రప్రగీయతే । పద్మాక్షనృపతేఃకన్యా తస్మా త్పద్మేతిసాస్మృతా ॥ ౭౪ ॥ ఏవంనామాన్యనంతాని సీతాయాస్సంతిభోనృప । ఆకాశనీలవర్ణాభ వపుషానేనజానకీ॥ ౭౫॥ లబ్ధారామేణపద్మాక్ష ప్రతిజ్ఞాసఫలీకృతా । ఏవంత్వయాయథాపృష్టం యథాత్వాంవినివేదితం ॥ ౭౬ ॥ చత ప్రస్త్వంస్నుషాస్త్వత్రకర్తు మర్హానిభోనృప ॥*॥ శ్రీశివఉవాచ—ఏతస్మిన్నంతరేతత్ర పూర్వందశరథేనచ ॥ ౭౭॥

చుచుండి చిలకాలమునకు లభించిన నొకదివ్యముహూర్తమున తనభూమిని రైతుచేదున్నించెను. అప్పుడు నాగంటిమొననుండి యీపెట్టెవెలువడెను. ఆశూద్రుండు దానినితీసికొని భూస్వామివద్దకివచ్చి సంతోషముగా నాబ్రాహ్మణునితో-స్వాములారా, మీరుమహాపుణ్యాత్ములు, పెట్టినముహూర్తము బలుబాగుగానున్నది, ఇదినాగంమొననుండి వెలువడినపెట్టె, తీసికొనుండు, ప్రయత్నముతోతెచ్చితిని. అనిచెప్పెను. పిదప నాబ్రాహ్మణుండు ఆకరండికను తీసికొని రాజసభకు సమర్పించి దానివృత్తాంతమును రాజుతోచెప్పెను. అందుకు రాజు "నేను నీకు భూమిని దానము చేసితిని, దానిలోనిది దొరకెను, నీవేతీసికొమ్ము, ఇది నాకేల?" అని నిరాకరించెను. బ్రాహ్మణుండును "రాజా, నాకు ముందు భూమినిమాత్రమునే నీవు సమర్పించితివి, ఈ సువర్ణపూర్ణంబగు దివ్యకరండికను నాకొప్పగించలేదు, భూమిలో దాగియుండి లభించిన విత్తము రాజుకు చేరతగినది ధర్మ్యము, ఇందుకు సంశయములేదు, నాకధర్మమువలదు, పెట్టెను తీసికొమ్ము" అని నిరూపించెను. ఇట్లు వారిరువురును వివాదముచేయునపుడు సభాసదులందరును "మహారాజా, ఏలయీవ్యర్థప్రసంగంబు? వలదువలదు, దానిలో నేమియున్నది చూడము" అని పలికిరి. దూతలచే దానిని తెరపించి యందలో బాలనుచూచి విస్మయము నొందెను. బ్రాహ్మణుండు విడిచి తనయింటికి నెడలెను. రాజును దానిని పాలించెను. అప్పుడు దేవవాద్యములు మ్రోగెను. అప్సరసలాడిరి. గంధర్వులు పాడిరి. జనకునిపై కన్యారత్నముపై సురులు విరుల వానగురిపించిరి. అంత జనకమహారాజు తనపుత్రియని యాబ్రాహ్మణులచే జాతకములను వ్రా




సమాహూతో౽యయుస్సైన్యైః స్త్రీపుత్రైశ్శ్వశురాశ్చతే, కోసలో మాగధేశశ్చ కైకేయశ్చయుధాజితౌ॥ ౭౮॥ మానయామాస తాన్రాజా జనకో౽పిముదాన్వితః। తతోదశరథంపూజ్య శ్రీరామంలక్ష్మణంతథా॥ ౭౯॥ భరతంచాపి శత్రుఘ్నం సంపూజ్యాభరణాదిభిః। నినాయజనకస్తుష్టః స్వపురీంపరమోత్సవైః ॥౮౦॥ తదారామోనృపంనత్వా రాజ్ఞాచాలింగితో౽ముహుః। వసిష్ఠంగాధిజంనత్వా కౌసల్యాదీన్ప్రణమ్యచ ॥ ౮౧ ॥ రాజ్ఞోదశరథస్యాగ్రేతైస్త్రీభిర్బంధుభిస్సహ। గజారూఢో౽యయావగ్రే తేప్యభూవన్గజస్థితాః ॥ ౮౨ ॥ నదత్సువాద్యసంఘేషు స్తువత్సుమాగధాదిషు। నర్తత్సువారనారీషు వివేశనగరీంప్రభుః॥ ౮౩॥ తదాసీత్సంభ్రమఃపౌరస్త్రీణాంశ్రీరామదర్శనే। విసృజ్యస్వీయకృత్యాని దుద్రువుర్గోపురాదిషు॥ ౮౪॥ కట్యాంనిధాయబాలాని దదృశూరఘునందనం। రాజమార్గంగతంరామం వవర్షుఃపుష్పవృష్టిభిః॥ ౮౫॥ ఏవంమహోత్సవైర్వాస స్థలందశరథస్సుతైః। యయావస్త్రాన్నతోయాద్యైః పరిపూర్ణంమనోరమం॥ ౮౬॥ కృత్వాజ్యోతిర్విదాలగ్న దివసస్యవినిశ్చయం। వంటపాంశ్చతోరణాని పతాకాశ్చధ్వజాంస్తథా॥ ౮౭॥ రోపయామాసుస్సర్వత్ర మంత్రిణోమిథిలాంపురీం। మార్గాశ్చందనలిప్తాశ్చ పుష్పైరాచ్ఛాదితా౽అపి॥ ౮౮॥ మాలాభిస్తోరణైఃపుష్పఘోషాద్యైస్తేప్రకాశిరే। తతోముహూర్తసమయే విధూచ్ఛిష్టాంనిశాంశుభాం॥ ౮౯॥ సుతైలాఢ్యాంస్త్రియస్సర్వాః కౌసల్యాద్యాస్తుమాతరః। రామాదీన్పరిలిప్యాదౌ నీరాజనపురస్సరం॥ ౯౦॥ కరకుంభాంస్తోయపూర్ణాం చతుర్దిక్షుసదీపకాన్। సంస్థాప్యస్నాపయామాసు మహావాద్యపురస్సరం॥ ౯౧॥ తదాభ్యర్ఘ్యం

యించి దానధర్మంబుల నొనరించెను. కనుక, ఆమె మాతులింగమునుండి వెలువడినందున మాతులింగి యనబడును. అగ్నిలో వాసముచేసినందున నగ్నిగర్భ యనబడును. రత్నాంతర్నివాసంబుచే రత్నావతియని పిలువబడును. భూమినుండి వచ్చినందున భూపుత్రియను పేరొందెను. జనకునిచే పాలింపఁబడి జానకీనామము నందినది. సీరాగ్రమునుండి తేబడినందున సీతయని ఖ్యాతిఁజెందినది. పద్మాక్షురాజపుత్రిగాన పద్మయని స్మరింపఁబడును. ఇట్లు అనేకనామంబులు సీతాదేవికి కలవు. ఓదశరథుఁడా! ఆకాశనీలవర్ణుఁడగు సీరామునికి సీత యిప్పుడు లభించినది. ఇప్పుడు పద్మాక్షుని ప్రతిజ్ఞ సఫలంబయ్యె. నీవడిగిన సంగతిని తెలిపితిని. ఇఁక నలుగురుకోడండ్రనంది యానందింపుము.అని శతానందుఁడు చెప్పుచుండునప్పటికి దశరథరాజుచే పిలువనంపబడియుండిన దశరథుని మామలు కోసలరాజు మగధరాజు కేకయరాజును సపుత్రమిత్రపరివారులై వచ్చిచేరిరి. జనకుండు సంతోషముతో వారినందరిని స్వాగతసల్లాపాదికముచే సంమానించెను. అంత జనకుండు దశరథుని పూజించి రామలక్ష్మణ భరత శత్రుఘ్నులను దివ్యాభరణాదులచేత నలంకృతులంజేసి మహోత్సవంబులతోడ నిజనగరమునకు పిలిచికొనిపోవునపుడు శ్రీరాముండు దశరథుని నమస్కరించి పలుమారు సమాలింగితుండై, వసిష్ఠ విశ్వామిత్రులకు నమస్కారముచేసి కౌసల్యాదులగు తల్లులకు ప్రణమించి, దశరథునిముందర ఆస్త్రీలతోడను బంధువులతోడను మొదటవెడలెను. మంగళవాద్యములు మ్రోగుచుండగా వందిమాగధులు వందించుచుండగా ఆప్రభు నగరమును ప్రవేశించెను. అంత నత్యంత సంభ్ర

స్నాయ చాపి కృత్వాసన్నశ్చ మాతరః । రామాదీన్పురతః కృత్వా వస్త్రాలంకారభూషితాః ॥ ౯౨ ॥ అభ్యంగపూర్వకం సస్నౌ రాజా దశరథోఽపి సః । సమాహూయ నృపస్త్రీశ్చ సభాయాం స్వస్తికే గురుః ॥ ౯౩ ॥ ముక్తావినిర్మితే రాజ్ఞః పార్శ్వే వామే న్యవేశయత్ । అగ్రే రామాదికాన్కృత్వా తాః స్త్రియో ఽవనతాననాః ॥ ౯౪ ॥ హరిద్రాకుంకుమాలిప్త చరణా రేజిరేంగణే । వసిష్ఠో బ్రాహ్మణైర్యుక్తో రాజ్ఞా రామాదిభిర్ముదా ॥ ౯౫ ॥ కృత్వా గణపతేః పూజాం పుణ్యాహాదిత్రయం క్రమాత్ । కారయామాస విధివత్ప్రతిష్ఠాం దేవకస్య చ ॥ ౯౬ ॥ గ్రామాచారం కులాచారం వృద్ధాచారం తథా పునః । దేశాచారం చ ప్రమదాచారాదీనకరోన్నృపః ॥ ౯౭ ॥ తోయకుంభం మంటపాదికానాం పూజనమాకరోత్ । కౌసల్యాద్యాః స్త్రియస్సర్వా హరిత్పీతారుణైర్వరైః ॥ ౯౮ ॥ హేమతంత్వర్చితైర్వస్త్రైర్విరేజుర్మంటపాంగణే । జనకశ్చ నృపైర్యుక్తో మహావాద్యపురస్సరం ॥ ౯౯ ॥ రామాదీన్స్వనిజం గేహం నేతుకామస్సమాయయౌ । మంటపే పూజయామాస రామాదీన్ జనకస్తదా ॥ ౧౦౦ ॥ హేమతంతూద్భవైర్దివ్య వస్త్రైరాభరణాదిభిః । తదా విరేజుస్తే బాలాస్సర్వే ప్రముదితాననాః ॥ ౧ ॥ తతస్తే వారణేంద్రస్థా దివ్యచామరవీజితాః । శృణ్వంతో వాద్యఘోషాంశ్చ వర్షితాః పుష్పవృష్టిభిః ॥ ౨ ॥ హరిద్రాంకితధాన్యైశ్చ మాంగల్యైర్మౌక్తికాదిభిః । మాతృభిర్వారణస్త్రీషు సంస్థితాభిర్ముహుర్ముహుః ॥ ౩ ॥ ఏవం తే రాఘవాద్యాశ్చ పురస్త్రీభిర్నిరీక్షితాః । ప్రాసాదోపరిసంస్థాభిః లాజాభిర్వర్షితా ముహుః ॥ ౪ ॥ దదృశుర్నర్తనాన్యగ్రే వారస్త్రీణాం స్మితాననాః । వాటికాః పుష్పవృక్షాణాం వరమృత్పాత్రనిర్మి

నముతో నప్పటి పౌరనారులందరును గోపురసౌధాదులమీద పరుగులిడుచు నడుములమీద బిడ్డలనిడుకొని తమతమ పనులనువిడిచి మిక్కిలి కుతూహలముతో శ్రీరామదర్శనము నొందుచుండిరి. రాజమార్గమున రాజిలుచుండు రామునిమీఁద రాజవదనలందరును కుసుమ వర్షమ్ముం గురిపించిరి. ఇట్లు మహోత్సవంబులతోడ దశరథమహారాజువచ్చి సరుచిరంబును సర్వసత్కార సంపూర్ణంబునగు వాసస్థలమును ప్రవేశించెను. మంత్రులు దైవజ్ఞుల వలన వివాహలగ్ననిశ్చయముచేయించి, మంటపములతోను తోరణములతోను పతాకముల తోను ధ్వజములతోను మిథిలాపట్టణమును దివ్యాలంకారయుక్తముగాజేసిరి. రాజమార్గంబులు చందనలిప్తంబులై పూలచే పరుపఁబడి బరగుచుండెను. పిమ్మట, చంద్రాస్తసమయమగు శుభమైన రాత్రియందు, కౌసల్యాది జనులును తక్కిన వృద్ధసువాసినులును రామలక్ష్మణ భరతశత్రుఘ్నులను మొదట దివ్యపీఠములమీఁద గూర్చుండబెట్టి పాటలుపాడి మంగళారతులనెత్తి మంగళవాద్యముల మంగళఘోషములతోడ అభ్యంగవిధానమునొనరించిరి. నాలుగుదిక్కుల లోను దీపములతోడ సజలకుంభములను సంస్థాపించి, మంగళవిధానముతో రామాదులకు నభ్యంగస్నానమును చేయించిరి. ఆస్త్రీలందరును తాముగూడ వస్త్రాలంకారభూషితులై యభ్యంగమంగళస్నానములను చేసికొనిరి. దశరథరాజును అభ్యంగస్నానమును చేసికొనెను. అంత వసిష్ఠమునులవారు నృపస్త్రీలనుపిలిపించి ముక్తావినిర్మితంబగు స్వస్తిమంటపమున దశరథరాజుకు వామభాగమున ప్రక్కలో కూర్చుండబెట్టి వారిముందర రామాదులను సాలంకార

తాః ॥ ౫ ॥ తథాకృత్రిమవృక్షాంశ్చ పతాకాంశ్చధ్వజాంస్తథా । వహ్నిసంగాదౌషధీనాం పుష్పవృక్షవినిర్మితాన్ ॥ ౬ ॥ తటిత్ప్రభోపమాంశ్చాపి గగనాంతర్విరాజితాన్ । వహ్నిసంగాదౌషధీభ్యః ప్రకారాన్ వివిధాన్ వరాన్ ॥ ౭ ॥ చంద్రజ్యోత్స్నాంకృత్రిమాంశ్చ దీపవృక్షాన్ సహస్రశః । దీపమాలాశ్చవ్యాఘ్రాదీన్ కృత్రిమాన్ రథసంస్థితాన్ ॥ ౮ ॥ ఔషధీభిఃపూరితాంశ్చ కేకీచక్రోపమాదికాన్ । దదృశుర్వారణేంద్రస్థా ఏవంతేరాఘవాదయః ॥ ౯ ॥ తదాదేవావిమానస్థా దదృశుఃకౌతుకంముదా । ఏవంనానోత్సవైర్బాలా యయుర్జనకమందిరం ॥ ౧౦ ॥ అవరుహ్యగజేంద్రేభ్య స్తస్థుస్తేమంటపాంగణే । మధుపర్కవిధానాని విష్టరాదీనిచ క్రమాత్ ॥ ౧౧ ॥ తయోర్గురూచక్రతుస్తౌ వసిష్ఠగౌతమాత్మజౌ । వాల్మీక్యాదిమునివృంద వేష్టితౌతుష్టమానసౌ ॥ ౧౨ ॥ తతఃపూజాంవధూనాంచ ముదాదశరథోనృపః । చకారగురుణాయుక్త స్తదాసమంటపాంగణే ॥ ౧౩ ॥ తతోలగ్నముహూర్తేతాన్ వధూభిశ్చపృథగ్వరాన్ । వేదికాసుస్థితాన్కృత్వా దంపత్యోరంతరేపటాన్ ॥ ౧౪ ॥ ధృత్వామంగళఘోషాంశ్చ మునిభిశ్చక్రతుర్గురూ । తదాతూష్ణీంసభాయాంతే శుశ్రువుస్సకలాజనాః ॥ ౧౫ ॥ పుష్పైఃపీతధాన్యైశ్చ వవర్షుర్దంపతీన్ స్త్రియః ॥ * ॥ శ్రీదేవీతనయాః శివస్సుఖకరో మిత్రశ్శశీకంపనః । సర్వేతేమునయశ్చలాదశదిశ స్సర్పామృగేంద్రాఃఖగాః ॥ నద్యఃపుణ్యసరోవరాణి దితిజా స్తీర్థానికంజాసన శ్చేంద్రోవహ్న్యమరానదాజలధయః కుర్వంతువోమంగళం ॥ ౧౬ ॥ తదేవలగ్నంసుదినంతదేవ । తారాబలంచంద్రబలంతదేవ । విద్యాబలందైవబలంతదేవ । కాశీపతేర్య

ముగాపెట్టికొని బ్రాహ్మణులతోడ స్వస్తివాచనమున కారంభించిరి. ఆస్త్రీలు అవనతాననలుగా పసపుకుంకుమములచే నలంకృతులై రాజిలుచుండిరి. వసిష్ఠముని మొదట శ్రీమన్మహాగణపతిపూజజేసి పుణ్యాహాదిత్రియమును క్రమముగా నాచరించి విధిప్రకారముగా కులదేవతాప్రతిష్ఠను కావించెను. దశరథుండు గ్రామాచారములను కులాచారములను దేశాచారములను వృద్ధాచారములను సువాసిన్యాచారములను నెరవేర్చి, తోయకుంభమంటపాదుల పూజనను నొనరించెను. అట్టి మంగళ మంటపాంగణమునందు కౌసల్యాది సువాసిను లందరును మిక్కిలి శ్రేష్ఠములయిన పచ్చపసపువన్నెలుగల బంగారు సరిగెవస్త్రములను ధరించినవారలై వెల్గుచుండిరి. జనకనృపోత్తముండును రాజుతోడ మహావాద్యపురస్సరంబుగా రామాదివరులను పూజించి పిలచికొనిపోదలచి వచ్చెను. అపుడు జనకుండు రామలక్ష్మణ భరతశత్రుఘ్నులను బంగారుసరిగె వస్త్రములచేతను దివ్యాభరణములచేతను పూజింపగా వారు రాజిలుచుండిరి. అందరు నానందముఖులుగానుండిరి. దివ్యచామరములు వీచుచుండ ఉత్తమగజంబులనెక్కి రామాదులు సువాద్యములను వినుచు, ఆడ యేనుఁగులమీఁదనుండి తల్లులు అడుగడుగునకును మంత్రాక్షత మంగళవాద్యములతోడ కుసుమవర్షమును కురిపించుచుండగా వెడలిరి. ఇట్లు వచ్చుచుండు శ్రీరామాదివరులను ప్రాసాదాదులమీఁదనెక్కిన పౌరనారులు నిరీక్షించుచు నడుగడుగునకును లాజవర్షముంగురిపించిరి. అపుడు వారనారుల నాట్యంబులను మృత్పాత్రలలోని పూలచెట్లయొక్క వరుసలను అట్లే కృత్రిమవృక్షంబులను విచిత్రతరంబులగు పతాక

త్స్మరణంప్రకీర్తయం॥ ౧౭॥ ఏవంమంగళశబ్దైశ్చ మహావాద్యపురస్సరం । తేషామంతఃపటాన్ముక్త్వా ఓంపుణ్యాహస్త్వితి చతుర్గురూ॥ ౧౮॥ తాసాంతేపాణిగ్రహణ విధానంవిధిపూర్వకం । లాజాహోమాదికంసర్వం చక్రుర్మంగళపూర్వకం॥ ౧౯॥ తదామహావాద్యఘోషా నినేదుర్మంటపాంగణే । ననృతుర్వారనార్యశ్చ జగుర్మాగధవందినః॥ ౨౦॥ నటామంగళగీతైశ్చ తుష్టువుస్తేమహాస్వనైః । తదాదానాన్యనేకాని చక్రతుస్తౌనృపోత్తమౌ॥ ౨౧॥ అథ తేబాలకాస్సర్వే వధూఃస్థాప్యకటీషువై । కౌసల్యాదివనితాభి జగ్ముస్తేభోజనగృహం॥ ౨౨॥ తత్రాక్రమసించనంచక్రు స్సంపూజ్యత్వం చమామపి । తతోరామాదికాస్సర్వే స్వస్వపత్న్యాశ్చపృథఙ్ముదా॥ ౨౩॥ చక్రుస్తేభోజనంహృష్టాః స్త్రీభిస్సర్వత్రవేష్టితాః । రాజాదశరథశ్చాపి సుహృద్భిశ్చనృపోత్తమైః ॥ ౨౪ ॥ పౌరైర్జానపదైరిష్టైర్మునిభిఃపరివారితః । జనకస్య

ధ్వజంబులను బాణవేడుకలలోని పుష్పవృక్షంబులను అంతరిక్షాంతర్విరాజమానంబులగు ఔషధప్రయోగంబులచే అగ్నిసంగంబున నాశ్చర్యకరంబులుగా ప్రకాశించుచున్న మెరుపుబిరుసులను చిత్రధ్వజపతాకాదులను, మఱియు నిట్టి పలువింతలను పరికించుచు చిరునవ్వునవ్వుచు శ్రీరామాది వరులు ఊరేగింపుతో జనకరాజదివ్యమందిరంబునకువచ్చి గజేంద్రంబులనుండి గ్రి వివాహమంగళమంటపాంగణములలో భద్రపీఠంబుల నలంకరించిరి. అపుడు దేవతలు తమ విమానంబులలోనుండి యిట్టి పెండ్లివేడుకలను తిలకించుచుండిరి. వాల్మీకియే మొదలుగాగల మునిబృందముచే పరివేష్టితులై తుష్టమానసలుగానుండు దశరథజనకాచార్యులగు వసిష్ఠ శతానంద మహర్షులు మధుపర్కవిధానములను ఆసనప్రదానాదిసత్కారంబులను చేయించిరి. అంత దశరథుండు వసిష్ఠానుజ్ఞచే వధూపూజనొనరించెను. పిదప వివాహశుభలగ్నముహూర్తమున నావరులను వధువులతోడ వెవ్వేరుగ మంగళవేదికలపై కూర్చుండబెట్టి, దంపతులనడుమ తెర వేసిపట్టుకొని, శతానందవసిష్ఠులు “బ్రహ్మాదిదేవతలు మునులు మొదలుగాగల సమస్తంబును మీారలకు మంగళమునిచ్చుగాత, చేయతగిన శ్రీకాశీవిశ్వేశ్వరస్మరణంబను నదియే సుదినంబు సులగ్నంబు చంద్రతారాబలయుక్తంబు విద్యాబలంబు దైవబలంబుగానున్నది.” అను నిట్టియర్థంబులుగల మంగళశ్లోకములను చెప్పుచు దివ్యమంగళ సంగీతాదులతోడ మంగళవాద్యధ్వనులు నాదబ్రహ్మమయంబన నొప్పుచుండు సమయమునందు ఆ తెరలనుతీసి, “ఓంపుణ్యాహస్తు” అని చక్కగ వక్కాణించిరి. అంతనా సీతాదివధువులకును శ్రీరామాది వరులకును పాణిగ్రహణమహోత్సవంబు విధివిధానముగా నడచినది. పిదప లాజహోమాది వివాహవిధానకర్మలన్నియును శుభప్రదంబులుగా నెరవేరినవి. అట్టి మహోత్సవకల్యాణమంటపమున గణికానర్తనంబులును వందివందనంబులును మంగళసంగీతంబులును నయనానందంబులు కర్ణానందంబులు మనోహరంబులునై వర్తిల్లుచుండగా నాజనకరాజును దశరథుండును నానావిధంబులగు మహాదానములనొసంగి దేవభూదేవ సంతృప్తింగావించిరి. అంతనా బాలకులు తమ వధువులను నడుములపై నెక్కించుకొని సర్వజనానందంబుగా కౌసల్యాది స్త్రీసమూహముతోడ

గృహం గత్వా చకార భోజనం ముదా॥ ౨౫॥ కౌసల్యాద్యాః స్త్రియః స్త్రీభిః చక్రుర్భోజనముత్తమం । సుమేధయా ప్రార్థితాస్తా వందితాశ్చ ముహుర్ముహుః॥ ౨౬ ॥ ఏవం నానాసముత్సాహం శ్చకార జనకో ముదా । అథ తే బాలకా స్సర్వే స్త్రీవాక్యాన్మాతృసన్నిధౌ॥ ౨౭ ॥ స్వస్వపత్న్యాశ్చ పాదయో స్స్వ శిరోభిర్నమనం ముహుః । చక్రుస్తుష్టమ నాస్సర్వే తాస్తాన్నేముః పృథక్పృథక్॥ ౨౮॥ కుంకుమాంకితపాదాశ్చ తేషామంకేషు తాదదుః ॥ ౨౯॥ * ॥ శ్రీరామ స్సహవాప్య భూమితనయా మాద్యాం జగత్స్వామినీం । సర్వాత్మా వరహేతు సుందరతనుః కారుణ్యపూర్ణేక్షణః ॥ విద్యుద్వర్ణవిరాజమానవసనస్త్రైలోక్య చూడామణిః। శోభామాప జగత్త్రయేప్యుపమాం ముక్తావిరాజద్గళః ॥ *॥ ౩౦॥ చతుర్థదివసే రాత్రౌ వంశపాత్రవిరాజితైః । దీపైర్నీరాజితాస్సర్వే విరేజూ రాఘవాదయః ॥ ౩౧ ॥ రామాదీనాం పారిబర్హాన్ దదౌ స జనకస్తదా । నియుతాన్ వారణేంద్రాంశ్చ శిబికాశ్చాపి తన్మితాః॥ ౩౨ ॥ తురగాన్ దశలక్షాంశ్చ నియుతాన్ స్యందనాన్ దదౌ । నానాలంకారవాసాంసి గోదాసీ సేవకాదికాన్॥ ౩౩ ॥ దదౌ స రాఘవాదిభ్యో యేషాం సంఖ్యా న విద్యతే। ఏవం సంమానితాస్తే తే బాలా జనకేన హి॥ ౩౪ ॥ పూర్వవదుత్సవాద్యైశ్చ స్వస్వపత్న్యా సమన్వితాః । గజారూఢా నృత్తగీతై స్తాభిస్స్వమంటపం యయుః॥ ౩౫ ॥ తతో రాజా మాసమేకం నివాయ్య నృపవా

---

భోజనగృహంబునకు వెడలిరి. ఓ సర్వమంగళ, అచ్చట నిన్ను ననుగూడ పూజించి ఆ(మ)సించనమను శుభకర్మనొనరించిరి. అంత శ్రీరామాదులందరును తమతమ పత్నులతోడ నంతట నంగనాపరివేష్టితులై వెవ్వేరుగా గూర్చుండి సుభోజనంబుల నారగించిరి. మహారాజగు దశరథుండును రాజేంద్రులగు మిత్రులతోడను మునులతోడను పరివృతుండై జనకమందిరంబున భోజనవిధానంబుచే నానందించెను. కౌసల్యాది రాజస్త్రీలు స్త్రీపరివారముతోడ జనకపత్ని సుమేధచే నడుగడుగునకును ప్రార్థింపఁబడుచు ఉత్తమభోజనంబుల నొనరించిరి. ఇట్లే జనకుండు ఉత్సాహమహోత్సవంబులను సలుపుచుండెను. పిమ్మట నాబాలకులందరును మాతృసన్నిధానంబున స్త్రీవాక్యలాలితులై తమపత్నీపదారవిందంబులకు తమయుత్తమాంగముల నొత్తుచుండిరి. వెవ్వేరుగా నావధువులును సంతుష్టచిత్తలై పతులపాదంబులకు ప్రణమిల్లుచుండిరి. మఱియును తమ కుంకుమాంకితచరణాంకములను పతులయంకంబుల కలంకరించుచుండిరి. త్రైలోక్యచూడామణియును సర్వాత్మకుఁడును వరదివ్యసుందరాంగుండును ముక్తాహారవిరాజమానకంధరుఁడును కరుణాకల్లోలిత కటాక్షుండును పీతాంబరధారియు నగు శ్రీరామచంద్రుండు మూలప్రకృతియై జగన్మాతయై బరగు భూపుత్రిని చేబట్టి ముల్లోకములలోననుపమంబయిన కాంతినొంది సీతాకాంతుండనుటచే లోకకాంతుఁడన రాజిలుచుండె. నాలగవనాడు రాత్రి రాఘవాదులు వేణుపాత్రవిరాజితదీపముల నీరాజనంబులచే విరాజించుచుండిరి. అపుడు శ్రీరామాదులకు జనకుండు మహారాజార్హసామానవస్తువుల ననగా లక్షలకొలది మత్తమాతంగంబులను అట్లే పాలకిలను పదిలక్షగుఱ్ఱములను లక్షరథంబులను పలుదెరంగుల యలంకారవస్త్రములను శ్రీరామాదివరులకు సమర్పించెను. ఇట్లు లెక్కలేకయుండునంతటి దివ్యవస్తు

కృతః । తతస్సైన్యేన స్వపురీం గంతుం పుర్యా బహిర్యయౌ ॥ ౩౬ ॥ సీతాద్యా నిర్యయుర్దృష్ట్వా సాస్రునేత్రాస్సువిహ్వలాః । సుమేధా తాస్సమాలింగ్య సాంత్వయిత్వా విసర్జయత్ ॥ ౩౭ ॥ అథ రాజా దశరథో జనకం వినివర్తయత్ । తదా దశరథం ప్రాహ జనకస్సాస్రులోచనః ॥ ౩౮ ॥ శ్వసన్ కోష్ణమ్లానాస్యో విరహాగ్గద్గదాక్షరః । ఏతావత్కాలపర్యంతం సీతాద్యా లాలితా మయా ॥ ౩౯ ॥ అధునా త్వమిమాస్త్వగ్రే లాలయస్వ కృపేక్షణైః । ఇత్యుక్త్వా నృపతిం నత్వా మిథిలాం జనకోఽయయౌ ॥ ౪౦ ॥ తతో దశరథశ్చాపి స్నుషాస్త్రీశిబికాయానాదిభిః । నృపైస్సైన్యైశ్చ స్వపురీం యయావాగ్రేశసైన్యైః ॥ ౪౧ ॥ అథ గచ్ఛతి శ్రీరామే మైథిలాదోర్ద్యోజనత్రయం । నిమిత్తాన్యతిఘోరాణి దదర్శ నృపసత్తమః ॥ ౪౨ ॥ నత్వా వసిష్ఠం పప్రచ్ఛ కిమిదం మునిపుంగవ । నిమిత్తానీహ దృశ్యంతే విషమాని సమంతతః ॥ ౪౩ ॥ వసిష్ఠస్తమథో ప్రాహ భయమాగామి సూచ్యతే । పునరప్యభయం తేఽద్య శీఘ్రమేవ భవిష్యతి ॥ ౪౪ ॥ మృగాః ప్రదక్షిణం యాంతి త్వాం పశ్య శుభసూచకాః । ఏవం వై వదతస్తస్య వవౌ ఘోరతరోఽనిలః ॥ ౪౫ ॥ ముష్ణంచక్షూంషి సర్వేషాం పాంసువృష్టిభిరర్దయత్ । తతో దదర్శ పరమం జామదగ్న్యం మహాప్రభం ॥ ౪౬ ॥ నీలమేఘనిభం ప్రాంశుం జటామండలమండితం । ధనుః పరశుహస్తం చ సాక్షాత్కాలమివస్థితం ॥ ౪౭ ॥ క్షాత్రవీర్యాంతకం రామం దృష్ట్వా క్షత్రియమర్ద

---

వులనిచ్చిన జనకునివలన నాబాలకులు సంమానింపఁబడుచుండిరి. యథాపూర్వముగా మహోత్సవములను చేసికొని తమతమపత్నులతోడ గజస్కంధములనెక్కి నృత్తగీతాది వినోదంబులనొందుచు విడిదియింటికి వచ్చిచేరిరి. అంతట నిట్లే ఒకనెల యమందానందముగా మిథిలానగరంబున దశరథమహారాజు జనకరాజ ప్రార్థన నంగీకరించి వసించుచుండెను. ॥౩౩౫॥ పిదప నిజ

**సీత యత్తవారింటికి బోవుట.**

సైన్యములతోడ నయోధ్యకు ప్రయాణముచేసెను. మిథిలారాజధానిని విడిచివచ్చునపుడు దుఃఖగలయిన సీతోర్మిళా మాండవీశ్రుతకీర్తులు మనంబున కలతనొంది బాష్పాకులిత నేత్రులై యుండ సుమేధాదేవి వారిని సమాలింగనాది యూరార్పులచే సమాధానము చేయుచుండెను. అపుడు జనకరాజు సాశ్రులోచనుండై మోమువాడుచుండ నిట్టూర్పులు వెడలుచుండ గద్గదస్వరమున దశరథునితో నిట్లనియె. ఈవరకు సీతయు మొదలయిన వీరు నాచే లాలనతో పాలింపఁబడుచుండిరి, ఇఁక మీఁద మీరు దయాదృష్టులతో పాలింపనగును. అని యందరును సీతారామాది వధూవరులను సపరివారంబుగా సాగనంపి వెనుకకరిగిరి. అంత దశరథుండు కోడండ్రు మొదలైన యిల్లాండ్రతోడను రాజులతోడను పుత్రులతోడను సైన్య పరివారముతోడను నిజనగరంబునకు తిన్నగా వచ్చుచుండెను॥ ౩౪౦ ॥ అటుపిమ్మట మిథిలాపురికి

**పరశురామాగమనంబు.**

మూఁడామడదూరమున శ్రీరాముఁడు వచ్చుచుండగా దశరథుఁడు దారుణంబులైన దుశ్శకునంబులను చూచి, వసిష్ఠులతో “స్వామీ, ఏమిది? ఎచ్చటచూచినను దుర్నిమిత్తంబులు కనుబడుచున్నవి” అని నమస్కరించి యడిగెను. అందుకు మునివర్యుఁడు “రాబోవు భయమును సూ

నం। ప్రాప్తం దశరథస్యాగ్రే రక్తాస్యం రక్తలోచనం॥ ౪౮॥ తం దృష్ట్వా భయసంత్రస్తో రాజా దశరథస్తదా। అర్ఘ్యా దిపూజాం విస్మృత్య త్రాహి త్రాహీతి చాబ్రవీత్॥ ౪౯॥ దండవత్ప్రణిపత్యాహ పుత్రప్రాణాన్ప్రయచ్ఛ మే। ఇతి బ్రువంతం రాజాన మనాదృత్య రఘూత్తమం॥ ౫౦॥ ఉవాచ నిష్ఠురం వాక్యం క్రోధాత్ప్రచలితేంద్రియః। త్వం రామ ఇతి మన్నామ్నా చరసి క్షత్రియాధమ॥ ౫౧॥ ద్వంద్వయుద్ధం ప్రయచ్ఛాశు యది త్వం క్షత్రియోఽసి మే। పురాణం జర్జరం చాపం భఙ్క్త్వా త్వం కత్థసే ముధా॥ ౫౨॥ ఇదం తు వైష్ణవం చాప మారోపయసి చేద్గుణం। తర్హి యుద్ధం త్వయా సార్థం కరోమి రఘువంశజ॥ ౫౩॥ న చేత్సర్వాన్హనిష్యామి క్షత్రియాంతకరోఽస్మ్యహం। ఇతి తద్వచనం శ్రుత్వా రాఘవో వాక్యమబ్రవీత్॥ ౫౪॥ వయమేకగుణాః స్వామిన్ యూయం చైవ గుణాధికాః। గోవిప్రదేవనారీషు రాఘవా నాస్త్రధారిణః॥ ౫౫॥ మద్యైతైశ్చ జీవితాని తవ పాదార్పితాని హి। యథేచ్ఛం ఘాతయాస్మాకం విప్రైర్యుద్ధం కరోమి న॥ ౫౬॥ ఇతి బ్రువతి రామే వై చచాల వసుధా భృశం। క్రుద్ధం దృష్ట్వా జామదగ్న్యం క్షత్రియాంతముపస్థితం॥ ౫౭॥ అంధకారో బభూవాథ చుక్షుభుస్సప్తసాగరాః। రామో దాశరథిర్వీరో వీక్ష్య తం భార్గవం రుషా॥ ౫౮॥ ధనురాచ్ఛిద్య తద్ధస్తా దారోప్య గుణముంజసా। తూణీరాద్బాణమాదాయ సంధాయాకృష్య వీర్యవాన్॥ ౫౯॥ ఉవాచ భార్గవం రా

---

చించుచున్నది, మరల నేడు నీకు త్వరగానే అభయము కాగలదు, మృగములు శుభసూచకంబులై నిన్ను చూచుచు ప్రదక్షిణంబుగా పోవుచున్నవి." అని చెప్పుచున్నప్పటికి, చండమారుతము వీచెను. అందరు యీవానచే కండ్లుకప్పి కష్టమునొందిరి. వెంటనే గర్వాంధులగు సర్వావనీశ్వరులనణచి గాత్రవీర్యాంతకుండను కీర్తినొంది ప్రత్యక్షాంతకునింబోలె బరగుచున్నవాఁడును నీలమేఘనిభుఁడును ఆజానుబాహుఁడును జటాకలాపకాంతుండును రక్తముఖుండును కార్ముకకుద్దాలకరుండును అయిన మహాతేజుండగు జామదగ్న్యరాముండు దశరథుని యెదుట వచ్చెను. అప్పుడా రాజు అతనిజూచి భయభ్రాంతుండై అర్ఘ్యాదిపూజలను మరచి దండప్రణామముజేసి, పుత్రప్రాణంబులనిమ్ము రక్షింపుము అని వేడుచుండెను. పరశురాముండు వానిని లక్ష్యపెట్టక క్రోధావేశమునొందినవాఁడై మిగుల నిష్ఠురంబుగా రామునితో "క్షత్రియాధముఁడా, నీవు రామయని నాపేరుగలవాఁడై చరించెదవు, నీవు క్షత్రియుండగునెడ నాతోడ ద్వంద్వయుద్ధమును జేయుము. శిథిలమయిన ప్రాతవిల్లును విరచి వ్యర్థముగా నిక్కుచున్నావు, ఇదిగో వైష్ణవంబగు నీధనుస్సు నెక్కుబెట్టిన నప్పుడు నీతోడ యుద్ధమును చేసెదను, అట్లు చేయకపోయిన క్షత్రియాంతకుఁడైన నేను అందరిని చంపివేయుదును." అని యదలించెను. అందుకు శ్రీరాముఁడు "స్వామీ, మేమొక్కగుణమే గలవారలు, తామే గుణాధికులు, రఘువంశజులు గోవులమీఁద బ్రాహ్మణులమీఁద స్త్రీలమీఁద అస్త్రము వేయువారుకారు. నేను వీరును మాప్రాణములనే మీకప్పగించియున్నారము, ఇచ్చవచ్చినట్లు చంపుము, బ్రాహ్మణులతో యుద్ధముఁ జేయము." అని వినయముతో చెప్పుచుండగా పుడమి గడగడవడకెను. క్రుద్ధుండైన పరశురామునిజూచి క్షత్రియప్రళయము సమీపించెను, చీగట్లు క్రమ్మెను, సముద్రములు

మ శృణు బ్రహ్మన్ వచో మమ । లక్ష్యం దర్శయ బాణస్య హ్యమోఘో రామసాయకః॥ ౬౦॥ లోకాన్ పాదయుగం వాపి వద శీఘ్రం మమాజ్ఞయా । ఏవం వదతి శ్రీరామే భార్గవో విక్రుతాననః॥ ౬౧॥ సంస్మరన్పూర్వవృత్తాంత మిదం వచనమబ్రవీత్ । రామ రామ మహాబాహో జానే త్వాం పరమేశ్వరం॥ ౬౨ ॥ పురాణపురుషం విష్ణుం జగత్సర్గలయోద్భవం । బాల్యేహం తపసా విష్ణు మారాధయితుమంజసా॥ ౬౩॥ గత్వాహి తీర్థగోమత్యాం తపసా తోష్య శార్ఙ్గిణం। అహర్నిశం మహాత్మానం నారాయణమనన్యధీః॥ ౬౪ ॥ యస్యాం శేన మయా భూమ్యా మవతారో ధృతోస్తిహి । భూభారహరణార్థాయ కార్తవీర్యవధేప్సయా॥ ౬౫ ॥ తతః ప్రసన్నో దేవేశః శంఖచక్రగదాధరః । ఉవాచ మాం రఘుశ్రేష్ఠ ప్రసన్నముఖపంకజః॥ ౬౬॥ * ॥ శ్రీభగవానువాచ—ఉత్తిష్ఠ తపసో బ్రహ్మన్ ఫలితం తే తపో మహత్ । మచ్చిదంశేన యుక్తస్త్వం జహి హైహయపుంగవం॥ ౬౭॥ కార్తవీర్యం పితృహణం యదర్థం తపసః శ్రమః । తతస్త్రిస్సప్త కృత్వస్త్వం హత్వా క్షత్రియమండలం॥ ౬౮॥ కృత్స్నాం భూమిం కశ్యపాయ దత్వా శాంతిముపావహ । త్రేతాయుగే దాశరథి ర్భూత్వా రామోహమవ్యయః ॥ ౬౯॥ ఉత్పత్స్యే పరయా భక్త్యా తదా ద్రక్ష్యసి మాం పునః । మత్తేజః పునరాదాస్యే త్వయి దత్తం మయా పురా ॥ ౭౦ ॥ తదా తపశ్చరన్ లోకే తిష్ఠ త్వం బ్రహ్మణో దినం । ఇత్యుక్త్వాంతర్దధే దేవ స్తథా సర్వం మయా కృతం॥ ౭౧॥ సఏవ విష్ణుస్త్వం రామ జాతోసి బ్రహ్మణార్థితః । మయి స్థితం తు త్వత్తేజ స్త్వయై

అల్లకల్లోలంబులయ్యె. అంత వీరుండైన దశరథరాముఁడు కోపముతో నాపరశురామునిజూచి, అతనిచేతనున్న ధనుస్సునుతీసికొని నారినెక్కబెట్టి బాణము ననుసంధానముజేసి యీడ్చి, పరశురామునితో “బ్రాహ్మణుఁడా, వినుము, ఈ బాణమునకు లక్ష్యమునుచూపుము, శ్రీరామబాణంబు వ్యర్థముకానిది, కాబట్టి లోకములనుగాని నీరెండుకాళ్లనుగాని చూపుము.” అని చెప్పెను. ఈట్టి రామవాక్యములనువిని భార్గవుండు వికలుండై పూర్వవృత్తాంతమును స్మరించుచు నిట్లుపల్కెను;—రామ, రామ, మహానుభావుఁడా, నీవు పరమేశ్వరుండని నేనెఱింగితిని. నీవే లోకసృష్టిస్థిత్యంతకారణుండగు పురాణపురుషుండు శ్రీమన్నారాయణుండు. నేను బాల్యమున శ్రీవిష్ణుమూర్తిగురించి తపంబొనరింపందలఁచి గౌతమీతీర్థంబునకు వెడలి, ఎవనియంశముతోడ నేను భూభారహరణమునకై కార్తవీర్యవధేచ్ఛచేత నిట్లు భూమిలో నవతరించితినో అట్టి మహాత్ముండగు నారాయణుని నిరంతరముగా ధ్యానించుచుంటిని. పిదప, శంఖచక్రగదాధరుండు ప్రసన్నుఁడై నాతోడ “తపంబునుచాలింపుము బ్రాహ్మణుఁడా, నీమహాతపంబు ఫలించినది. నాయొక్క చిదంశచే యుక్తుండగు నీవు ఈతపంబును ఎవనిజంపుటకై చేయుచున్నావో అట్టి హైహయేంద్రుండైన కార్తవీర్యుని జయింపుము. పిమ్మట ౨౧మార్లు క్షత్రియసమూహమును సంహరించి సమస్తభూమండలమును కశ్యపమహర్షికి దానమిచ్చి సమాహితుండగుము త్రేతాయుగంబున నేను దశరథరాముండుగా నవతరించెదను. మరల నీవు పరమభక్తితో చూడగలవు. మునుపు నేను నీకిచ్చిన తేజస్సును మరల తీసికొనుచున్నాను. అప్పుడు తపంబు నాచరించుచు బ్రహ్మకల్పముపర్యంతము సుఖముగానుండుము. అనిచెప్పి యంతర్ధానమునొం

వపుర్నరాకృతం ॥ ౭౨ ॥ అద్య మే సఫలం జన్మ ప్రతీతోఽసి మమ ప్రభో । నమోఽస్తు జగతాం నాథ నమస్తే భక్తిభావన॥ ౭౩॥ నమః కారుణికానంత రామచంద్ర నమోఽస్తు తే । దేవ యద్యత్కృతం పుణ్యం మయా లోకజిగీషయా॥ ౭౪ ॥ తత్సర్వం తవ బాణాయ భూయాద్రామ నమోఽస్తు తే। తతో ముక్త్వా శరం రామ స్తత్కర్మ భస్మసాత్కరోత్॥ ౭౫॥ తతః ప్రసన్నో భగవాన్ శ్రీరామః కరుణామయః । జామదగ్న్యం తదా ప్రాహ వరం వరయ చేతసః॥ ౭౬॥ తతః ప్రీతేన మనసా భార్గవో రామమబ్రవీత్ । యది మేఽనుగ్రహో రామ తవాస్తి మధుసూదన॥ ౭౭॥ త్వద్భక్తసంగస్త్వత్పాదే మమ భక్తిస్సదాస్తు వై । తథేతి రాఘవేణోక్తః పరిక్రమ్య ప్రణమ్య తం॥ ౭౮ ॥ పూజితస్తదనుజ్ఞాతో మహేంద్రాచలమన్వగాత్ । రావణేన జితా దేవా స్సగర్వో రావణో మహాన్॥ ౭౯॥ సహస్రబాహునా బద్ధ స్సోఽర్జునో భార్గవేణ హి। హతః క్షణేన సమరే సోద్య శ్రీభార్గవోఽపి చ॥ ౮౦॥ జితస్తద్ధనుషా బాణ మోచనాద్రాఘవేణ హి । ఏవం శ్రీరామచంద్రస్య పౌరుషం కిం వదామ్యహం॥ ౮౧॥ అథ రాజా దశరథో రామం స్మృతమివాగతం । దృఢమాలింగ్య హర్షేణ నేత్రాభ్యాం జలముత్సృజత్॥ ౮౨॥ తతః ప్రీతేన మనసా స్వస్థచిత్తః పురీం యయౌ । అయోధ్యాయాం సుమంత్రోఽపి నృపం శ్రుత్వా సమాగతం॥ ౮౩ ॥ నగరీం శోభయామాస పతాకాధ్వజతోరణైః । వారణేంద్రం పురస్కృత్య రామం ప్రత్యుద్యయౌ జవాత్॥ ౮౪॥ అథో నదత్సు వాద్యేషు రాజా పుత్రైస్సుహృజ్జనైః । వివేశ నగరం పౌరైః పశ్యన్నృత్యాదికం పథి॥ ౮౫॥

దినందున, అట్లే సర్వము నాచే నాచరింపఁబడినది. ఆవిష్ణువే నీవు బ్రహ్మదేవునిచే ప్రార్థింపఁబడి యవతరించితివి. నాయందుండిన నీతేజస్సును ఇపుడు తీసికొంటివి. ఇపుడు నాజన్మము సఫలమయినది. నాకు ప్రసన్నుండవైతివి. లోకైకప్రభుఁవై భక్తపరాధీనుండవై కారుణికోత్తముఁడవై అనంతుండగు శ్రీరామచంద్రమూర్తీ, నీకు నమస్కారము నమస్కారము. ఈవరకు ఏమేమి పుణ్యము లోకజయార్థముగా నాచేత చేయబడియున్నవో అవంతయును నీబాణమునకు లక్ష్యమగుగాక, శ్రీరామా, నీకు నమస్కారము. మరల నమస్కారము. అని యిట్లు పరశురాముండు వేడుకొనుచుండగా శ్రీరాముండు భాణమును ప్రయోగించి ఆసత్కర్మరాశిని భస్మముచేసెను. పిదప కరుణాకరుఁడైన శ్రీరాముఁడు ప్రసన్నుఁడై పరశురామునితో వరము వేడుమనెను. అందుకు జామదగ్న్యుండు "శ్రీరామమూర్తీ, నీకునాయందనుగ్రహబుద్ధిగల్గినట్లయితే నీభక్తులసహవాసంబును నీయందు నిరంతరభక్తియును నాకు కలుగని"యని ప్రార్థించి, అట్లే కానిమ్మని రామునిచే వరమునంది ప్రదక్షిణనమస్కారములనుచేసి, సంపూజితుండై యనుజ్ఞనొంది మహేంద్రాచలమునకు వెడలెను. పార్వతీదేవీ, దేవతలను జయించి గర్వించిన రావణాసురుని తనవేయిచేతులతో బిగించిన కార్తవీర్యార్జుననిని క్షణమాత్రమున యుద్ధమందు పడద్రుంచిన భార్గవరాముండు ఈ శ్రీరామునిచే జితుండయినపుడు, శ్రీరామచంద్రుని పౌరుషము నేమనివర్ణింతును. ॥౩౮౦॥ అంత దశరథరాజు రాముని మడిసిమరల బ్రతికివచ్చినట్లు

శ్రీరామాదు లయోధ్యకువచ్చుట.

దలచి గాఢాలింగనముతో నానందబాష్పములతో నత్యంతప్రీతమానసుండును స్వస్థచిత్తుండు

రామాద్యాశ్చ స్వస్వపత్న్యా రతే గజసంస్థా యయుః పురీం । నన్నృతుర్వారనార్యశ్చ తుష్టువుర్మాగధాదయః ॥ ౫౬ ॥ ఏవ రాజా గృహం గత్వా బాలకైః స్వీయసద్మని । రమాపూజాం కారయిత్వా దదౌ దానాన్యనేకశః ॥ ౫౭ ॥ తదాలంకార వస్త్రాద్యైః సుహృదః పార్థివాదయః । రామాదీన్పూజయామాసు స్తదా దశరథం నృపం ॥ ౫౮ ॥ దశరథోఽపి తాన్సర్వాన్ పూజయామాస వైభవైః ॥ తతస్తే సుహృదస్సర్వే నృపాశ్చ స్వస్థలం యయుః ॥ ౫౯ ॥ ప్రీత్యా యుధాజితం రాజా స్థాపయామాస స్వాంతికం । రామాద్యా రమయామాసు స్స్వస్వదారాః స్వసద్మసు ॥ ౬౦ ॥ * ॥ పార్వత్యువాచ— శ్రీవిష్ణోస్తు చిదంశేన జామదగ్న్యస్త్వయా స్మృతః । తద్వచ్చాయం రాఘవః కిం నుద మే సంశయం ప్రభో ॥ ౬౧ ॥ * ॥ శ్రీశివ ఉవాచ—అష్టావింశస్తువిధృతా అవతారాశ్చ విష్ణునా ॥ ౬౨ ॥ రామకృష్ణావతారౌ చ పూర్ణరూపేణ తౌ ధృతౌ । వరిష్ఠౌ సకలేష్వేవావతారేషు హి తావుభౌ ॥ ౬౩ ॥ తయోరపి వరః పూర్వ స్సత్యసంధో జితేంద్రియః । జ్ఞేయో రామావతారో హి నాన్యేన సదృశః పరః ॥ ౬౪ ॥ కృష్ణః కృష్ణరుచిర్జ్ఞేయ శ్రీరామో రుక్మసంరుచిః । ఏవం గిరీంద్రజే ప్రోక్తం సీతాయాశ్చ స్వయంవర ॥ ౬౫ ॥ శ్రీసీతారామకల్యాణ మహోత్సవమహోజసః । అస్యాధ్యాయస్య శ్రవణా న్మంగళం లభ్యతే నరైః ॥ ౬౬ ॥ * ॥ ॥ ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గత శ్రీమదానందరామాయణే వాల్మీకీయే సారకాండే సీతాస్వయంవరో నామ తృతీయస్సర్గః ॥ ॥ 3 ॥ ॥ * ॥

నై రాజధానికివచ్చెను. రాజువచ్చు సంగతి తెలిసి అయోధ్యయందు సుమంత్రమంత్రితంబుగా నలంకారములచే రాజమార్గంబులు రాజిలుచుండెను. మంత్రులు భద్రగజంబులతోడవచ్చి స్వాగతంబొనరింపగా, మంగళవాద్యంబులు సంగతంబులై యుండ, మిగుల వేడుకలతో నందరును నగరమును ప్రవేశించిరి. ఇట్లనేకరాజవిభవంబులతోడ దశరథుండు తననగరుజేరి స్వస్వపత్నులతోడ శ్రీరామాదులచే లక్ష్మీపూజచేయించి, అనేకదానంబులనిచ్చెను. అపుడు మిత్రవర్గపురాజులు దివ్యాలంకారవస్త్రాదులచే శ్రీరామాదులను దశరథరాజును పూజించిరి. దశరథుండును వారినందరిని విభవముతో సత్కరించెను. అంత నందరును వారివారి స్థలములంజేరిరి. దశరథుండు ప్రీతిచే యుధాజితుని తనవద్దనే నిలిపెను. శ్రీరామాదులు తమతమ పత్నులతోడ నిజనిజ రాజమందిరంబులలో రమించుచుండిరి. అనిన, శివవాక్యామృతమునందుచున్న పార్వ

శ్రీరామావతార శ్రేష్ఠత్వము.

తి "పరమేశ్వరా, భార్గవరాముండు శ్రీవిష్ణుమూర్తియొక్క చిదంశమున గల్గినట్లు చెప్పితివే శ్రీరాముండును అట్లేగదా? నాసంశయమును పరిహరింపుము" అనియడిగెను. అందుకు శివుండిట్లనెను. విష్ణువుచే ౨౮ అవతారములు ధరింపఁబడినవి. అందులో రామకృష్ణావతారములు రెండును పూర్ణరూపములయి శ్రేష్ఠంబులనబడుచున్నవి. ఆ రెంటిలో మొదటిదైన శ్రీరామావతారంబు మిక్కిలి శ్రేష్ఠంబు. దీనికి సమానమైనది లేదు. కృష్ణుండు కృష్ణవర్ణుండనబడును. శ్రీరాముఁడు రుక్మవర్ణుండుగా నుండును. ఓగిరిజా, ఇట్లు సీతాస్వయంవరము చెప్పఁబడినది. ఈయధ్యాయ కథాశ్రవణముచేత మానవులు మంగళమునొందుదురు. ... ॥3॥

శ్రీశివ ఉవాచ— అథసీతాయుతశ్శ్రీమాన్ రామస్సాకేతసంస్థితః । బుభుజేవివిధాన్భోగాన్ రాజసేవాపరో౽భవత్ ॥ ౧ ॥ శరత్కాలాశ్వినేమాసి జనకేనస్వమంత్రిణః । ఆహ్వానాయచరాజానం ప్రేషితాస్త్వరితంయయుః ॥ ౨ ॥ తానాగతాన్దశరథః శీఘ్రంసత్కృత్యసాదరం । పప్రచ్ఛాగమనేహేతుం తేపినత్వాతమూచిరే ॥ ౩ ॥ దీపావల్యుత్సవార్థంత్వాం సకుటుంబంసమంత్రిణం । పౌరజానపదైస్సాక మాహ్వయామాసతేసుహృత్ ॥ ౪ ॥ తత్తేషాంవచనంశ్రుత్వా దూతానాజ్ఞాపయన్నృపః । కథ్యతాంనగరేరాష్ట్రే గమనంమిథిలాంప్రతి ॥ ౫ ॥ సుముహూర్తేతతోరాజా హస్త్యశ్వరథపత్తిభిః । పౌరైర్జానపదైస్సాకం యయౌకరివిరాజితః ॥ ౬ ॥ రాజ్ఞఃపృష్ఠేసమాజగ్ముర్గజోపరివిరాజితాః । రామలక్ష్మణభరత శత్రుఘ్నాస్తేస్వలంకృతాః ॥ ౭ ॥ కౌసల్యాద్యారాజదారాః స్నుషాభిస్తాఃపృథక్పృథక్ । రత్నమాణిక్యముక్తాది శోభితాస్సువరాసుచ ॥ ౮ ॥ కరిణీషుసమాసీనావేష్టితావేత్రపాణిభిః । ధాత్రికాభిస్సదాసీభి ర్యయుర్వస్త్రాదిభూషితాః ॥ ౯ ॥ ఆగతంనృపతింశ్రుత్వా జనకఃపౌరవాసిభిః । ప్రత్యుజ్జగామహర్షేణ నినాయనగరీంప్రతి ॥ ౧౦ ॥ వాద్యఘోషనినాదైశ్చ దుందుభీనాంమహాస్వనైః । వారాంగనానాంనృత్యాద్యైః గాయకానాంచగాయనైః ॥ ౧౧ ॥ మార్గేమార్గేమహాసౌధా రూఢస్త్రీణాంకదంబకైః । పుష్పవృష్టివివర్షాభి ర్యయౌనృపగృహాంనృపః ॥ ౧౨ ॥ తతోగృహాణిరమ్యాణి పూరితాన్యన్నవారిభిః । ప్రవివేశనృపశ్రేష్ఠో జనకేనాతిమానితః ॥ ౧౩ ॥

## శ్రీరామాదులు దీపావళిపండుగకు పోవుట.

అటుమీఁద సీతాసమేతుండైన శ్రీరామచంద్రుండు అయోధ్యలో వివిధభోగంబుల ననుభవించుచు రాజసేవాపరుండాయెను. శరదాశ్వయుజమాసంబున జనకుండు దశరథరాజును పిలచికొనివచ్చుటకు మంత్రులనంపెను. వారు వచ్చుటనెఱింగి దశరథుండు వేగమె సత్కరించి యాదరముతోడ ఆగమనకారణంబు నడిగెను. అందుకు వారు నమస్కరించుచు మిక్కిలి వినీతులై “మహారాజా, నీమిత్రుంబు జనకరాజు మిమ్ములను సకుటుంబ సపరివారంబుగా నీదీపావళీమహోత్సవమునకు దయచేయవలయునని ప్రార్థించుచున్నాఁడు” అని విన్నవించిరి. దశరథుండును సంమతించి ఆసంగతిని దేశమందంతట ప్రకటించి, సుముహూర్తమున పౌరజానపదాది పరివారముతోడ మిథిలకు ప్రయాణమొనరించెను. చతురంగసైన్యములనడుమ శ్రీరామలక్ష్మణ భరతశత్రుఘ్నులును కౌసల్యాది మాతలును సీతాది రాజపత్నులును ఏనుఁగుల నెక్కి దాసదాసీముఖ రాజవైభవములతోడ మహోత్సవముగా వెడలిరి. పిదప దశరథాగమునంబునెఱింగిన జనకరాజు మిక్కిలి సంతసముతోడ ప్రత్యుద్గమించి వాద్యఘోషంబులును దుందుభీనాదంబులును గణికా నర్తనంబులును సౌధాంతస్త్రీల పుష్పవృష్టులును సర్వేంద్రియాహ్లాదకంబులై యుండ, రాజమార్గమున వియ్యాలవారిని యల్లుండ్రను సముచిత సత్కారంబులచే పిలచికొనివచ్చెను. అందరును సమస్తభోగ సామగ్రిసమేతంబులైన రమ్యమందిరంబులను ప్రవేశించిరి. పిదప జనకుండు దీపావళీదినంబునందు వివిధవిధ సముత్సాహంబులతో

తతో నానాసముత్సాహై ర్మృష్టాన్నై ర్నృత్తగాయనైః। వస్త్రైరాభరణైస్సర్వాన్ జామాతౄంశ్చ విశేషతః॥౧౪॥
మణిరత్నాదిదీపైశ్చ ముహుర్నీరాజనైరపి। జనకః పూజయామాస దీపావళ్యాంమహాదినే॥ ౧౫॥ దీపోత్సవైర్మహా
పుణ్యే బలిరాజ్యం ప్రవర్తతే। ఆనందస్సర్వలోకానాం మంగళాసుగృహేగృహే॥ ౧౬॥ అభ్యంగోద్వర్తనాద్యైశ్చ
పరిపక్వాన్నభోజనైః। గోదాసదాసీదానైశ్చ హస్త్యశ్వరథపత్తిభిః॥ ౧౭॥ చకారతుష్టాన్ జామాతౄన్ జనకో
నృపతింతథా। నృపపత్నీస్సదుహితా స్త్వయోధ్యాస్థాదికాన్ క్రమాత్॥ ౧౮॥ తతః ప్రస్థానమకరో త్పురీందశర
థో నృపః। తతో రాజా దశరథ స్సైన్యేనపరివేష్టితః॥ ౧౯॥ యయౌ శనైశ్శనైర్మార్గే సుహృన్మంత్రిపురస్సరః। ఏ
తస్మిన్నంతరేమార్గే సీతార్థం ధనుషా పురా॥ ౨౦॥ భగ్నమానా నృపతయః పూర్వవైరమనుస్మరన్। అసంఖ్యాతాస్స
సైన్యాస్తే రురుధుర్నృపతింపథి॥ ౨౧॥ తాందృష్ట్వా నృపతింశ్చాపి కిమేతదితి విహ్వలః। మంత్రిభిర్మంత్రయామాస
జనకః స్వజనైరపి॥ ౨౨॥ ఏతస్మిన్నంతరే రామ శ్శ్రుత్వా చింతార్ణవే నిజం। నిమగ్నం పితరం శీఘ్రం యయౌ లక్ష్మణసం
యుతః॥ ౨౩॥ నత్వా దశరథం రామః కించిన్నమ్రో బ్రవీదిదం। తాత రాజన్న కర్తవ్యా చింతా సతి మయి త్వయా॥ ౨౪॥
క్షణాదేవ వధిష్యామి పశ్య త్వం కౌతుకం మమ। తతో రామవచశ్శ్రుత్వా రాజాలింగ్య రఘూత్తమం॥ ౨౫॥ ప్రాహవ
ద్వార్షికో బాల స్త్వం కథం యోద్ధుమిచ్ఛసి। అరణ్యే సకుటుంబో హం వేష్టితో స్మి నృపాధమైః॥ ౨౬॥ అహమేవగ

---

మృష్టాన్నాదులతో దివ్యవస్త్రాభరణంబులతో నందరిని, విశేషముగా నల్లుండ్రను రత్నదీపం
బులతో నడుగడుగున కారతులతో నారాధించెను. మహాపుణ్యాంబగు దీపావళీదినంబున ప్రతిగృ
హంబునను సర్వలోకానందంబగునట్లు మంగళదీప మహోత్సవంబులచే బలిరాజ్యంబు రాజి
లుచుండును. నాఁడు జనకుండు జామాతలను దివ్యాభ్యంగన పక్వాన్నభోజన గోదాసదాసీప్ర
దాన చతురంగసైన్యసమర్పణంబులచే సంతుష్టులుగాజేసెను. అట్లే జానక్యాదిసుతలను, చివ
రకయోధ్యావాసులనందరిని సత్కరించి నానందులంజేసెను॥ ౧౮ ॥ అంత దశరథుండు సాకే

### మత్సరంబున మదించివచ్చిన మహారాజులతో మహాయుద్ధము.

తమునకు ప్రయాణమై, సమస్తపరివారంబుతోడ తిన్నగ వచ్చుచుండెను. అంతలో పూర్వము
శీతకొఱకు ధనుస్సుచే భగ్నమనోరథులగు రాజులందరును పూర్వవైరమును స్మరించుచు లె
క్కలేని సైన్యములతోడ వచ్చి, దారిలో దశరథునికి ముట్టడివేసిరి. జనకుండును వారినిజూచి
ఏమిది? యని సంభ్రాంతుండై మంత్రులతో నాలోచించెను. అంతలో శ్రీరాముండు లక్ష్మణుని
తోడ చింతావారిధిని మునిగిన తండ్రివద్దికివచ్చి నమస్కరించి వినయముతో "తండ్రీ, నేనుం
డగా నీవు చింతింపవలదు. క్షణమాత్రమున వీరిని సంహరించెదను. నాకౌతుకమును చూడు
ము." అని విన్నవించెను. అందుకు దశరథుండు రాముని నాలింగించుకొని "నాయనా, పదు
నాఱేండ్లబాలుఁడగు నీవు ఎట్లు యుద్ధముచేయగలవు? నీచులగురాజులు అరణ్యమున సకుటుం
బుఁడగు నన్ను ముట్టడించిరి. నేనే యుద్ధమునకుపోదును. నీవు సైన్యమును రక్షింపుము"

మిష్యామి యోద్ధుంత్వంరక్షవాహినీం। తత్తాతవచనంశ్రుత్వా రామస్తంపునరబ్రవీత్ ॥ ౨౭ ॥ యదామేక్షయితాం శక్తిం పశ్యసిత్వంరణాంగణే। తదామేకురుసాహాయ్యం తావదత్రస్థిరోభవ॥ ౨౮ ॥ స్వాంవాహినీంసకుటుంబాం తాతత్వంరక్షమద్గిరా। ఇత్యుక్త్వాపితరంనత్వా సజ్జీకృత్యశరాసనం ॥ ౨౯ ॥ జగామరథమారూఢో లక్ష్మణోపితమన్వగాత్। తౌదృష్ట్వాభరతశ్చాథ శత్రుఘ్నోపిజగామసః ॥ ౩౦ ॥ తాందృష్ట్వాదశసాహస్రీం రాజసేనామచోదయత్। తతస్తేపార్థివాస్సర్వే రథస్థంతంరఘూత్తమం ॥ ౩౧ ॥ నిరీక్ష్యదర్శయామాసు స్స్వసేనాయాంపరస్పరం। సమాగతోయంశ్రీరామ స్స్వపితృస్యందనస్థితః॥ ౩౨॥ ఏషవైసుమహచ్ఛ్రీమాన్ విటపీసంప్రకాశతే। విరాజత్యుజ్జ్వలస్కంధః కోవిదారధ్వజోరథే॥ ౩౩ ॥ దశరథాజ్ఞయాతస్య రథేశస్త్రౌఘపూరితే। ధ్వజబద్ధపతాకోచ్చ కోవిదారేస్థితస్స్వయం॥ ౩౪ ॥ ఏవంవదంతస్తేసర్వే రథైర్యోద్ధుంసమాయయుః। తతోభవన్మహద్యుద్ధం ఘోరంతచ్చ పరస్పరం ॥ ౩౫ ॥ అస్త్రైశ్శస్త్రైర్భిందిపాలై శ్శతఘ్నీభిఃపరశ్వధైః। రామస్యసైనికాన్హత్వా రాజానోరామమభ్యయుః ॥ ౩౬ ॥ తేవవర్షుర్మహాశస్త్రై ర్బాణైర్వ్యాప్యదిగంబరం। తాన్దృష్ట్వానృపతీన్సర్వాన్ రామమేవాభిసంముఖాన్ ॥ ౩౭ ॥ లక్ష్మణఃప్రాద్రవచ్ఛీఘ్రం భరతోపిసశత్రుహా। స్వామితారకవద్ఘోర మాసీద్యుద్ధంసుదారుణం॥ ౩౮॥ తతోనృపతయస్సర్వే శస్త్రౌఘైర్భరతంతదా। తేవిధ్యామూర్ఛితంచక్రు స్స్యందనాత్పతితోభువి॥ ౩౯ ॥ భర

అనిచెప్పెను. అందుకు మరల రాముఁడు "నేను రణమున శక్తిహీనుఁడయినపుడు నీవు సహాయముచేయుగాక, అవరకు ఇచ్చటనే స్థిరుఁడైయుండుము. నామాటవిని సకుటుంబ సైన్యములను బోషించుచుండుము" అనిచెప్పి తండ్రికి నమస్కరించి, ధనుస్సును చక్కజేసికొని రథారూఢుండై వెడలెను. లక్ష్మణుండు వెంబడించెను. వారినిచూచి భరతశత్రుఘ్నులును వెడలిరి. వారినిచూచి పదివేలసైన్యంబును పంపించెను. పిదప రాజులందరును రథమునెక్కిన రాముని జూచి తమలోతాము "వచ్చుచున్న శ్రీరాముండు తనతండ్రిరథము నెక్కియున్నాఁడు. ఇతఁడు గదా గొప్ప సంపద్వృక్షమువలె ప్రకాశించుచున్నాడు. ఉజ్జ్వలస్కంధంబును కోవిదారధ్వజంబును రథమున గల్గియున్నది. దశరథాజ్ఞచే నిట్లు వచ్చుచుండును." అని యిట్లు పలుకుచు వారందరును రథములతోడ రణమునకువచ్చిరి. అంత నన్యోన్యముగా భయంకరమైన మహాయుద్ధము జరిగినది. శస్త్రాస్త్రములతో రామసైనికులను పడమొత్తి రాజులందరును రాముని మీఁద దిగబడిరి. ఇట్లు బాణవర్షంబుల గగనంబును దిక్కులను వ్యాపించుచు రామునిమీఁద వచ్చుచున్న వీరినిచూచి లక్ష్మణుండు భరతశత్రుఘ్నులును వెంబడించగా, వారితో తారసిల్లెను. ఆయుద్ధము కుమారతారకయుద్ధమువలె మిక్కిలి భయంకరముగానుండెను. అపుడు రాజులందరును శస్త్రౌఘములచే భరతశత్రుఘ్నులను మూర్ఛితులంజేసిరి. వారు నేలఁబడిరి. అందుచే లక్ష్మణుండు క్రుద్ధుఁడై విజృంభించి బాణవర్షమును కురిపించుచువచ్చియును వారికి చాలక పోయెను. అపుడు శ్రీరామచంద్రుఁడు రణాంగణమున జాలరంధ్రములనుండి కౌసల్యాది మాత

తం పతితం దృష్ట్వా శత్రుఘ్నం దివ్యసుశ్శరైః । తంచాపి విరథం కృత్వా దుద్రువుర్లక్ష్మణం నృపాః ॥ ౪౦ ॥ వవర్షుర్నిశి తైర్బాణైశ్చక్రుస్తం వ్యాకులం రణే । తథైవ రాఘవం చాపి శరై రాచ్ఛాదయన్నృపాః ॥ ౪౧ ॥ తతః శ్రీరామచంద్రోపి లీలయా సమరాంగణే । పశ్యత్సు జాలరంధ్రైశ్చ కౌసల్యాద్యాసు మాతృషు ॥ ౪౨ ॥ సీతయా భ్రాతృపత్నీషు పిత్రా మంత్రిషు తేష్వపి । టణత్కృత్య మహచ్చాపం వాయవ్యాస్త్రేణ తాన్నృపాన్ ॥ ౪౩ ॥ శుష్కపర్ణవదుద్ధూయ ప్రాక్షిపదబ్ధిరోధసి । మోహనాస్త్రేణ శేషాన్హి మోహయామాస రాఘవః ॥ ౪౪ ॥ లులుంఠ సకలం సైన్యం హస్త్యశ్వరథసంకులం । తతో మూర్ఛితమాలోక్య భరతం కైకయీ రణే ॥ ౪౫ ॥ కరిణ్యాశ్శీఘ్రముత్ప్లుత్య శుశోచాంకే నిధాయ తం । తతో దశరథశ్చాపి కౌసల్యాప్రపతేః స్త్రియః ॥ ౪౬ ॥ సాంత్వయిత్వా స తాన్రామః సౌమిత్రిం ప్రాహ వేగతః ఇతో విదూరే సౌమిత్రే ముద్గలస్య తపోనిధేః ॥ ౪౭ ॥ ఆశ్రమోస్తి హి తత్ర త్వం గత్వా వల్లీశ్శుభావహాః । సంజీవన్యాదికాస్సర్వాశ్శీఘ్రమానయ లక్ష్మణ ॥ ౪౮ ॥ మునేస్తపః ప్రభావేన బహవస్సంతి తత్ర వై । తథేతి లక్ష్మణో గత్వా స్యందనస్థస్త్వరాన్వితః ॥ ౪౯ ॥ అవరుహ్య రథాద్వీరస్సంవివేశాశ్రమం మునేః । నివారితస్స వటుభి స్సమాధివిరమే మునేః ॥ ౫౦ ॥ యాచ్ఞాం కృత్వా శుభావల్లీః ప్రాప్స్యసే త్వం న చాన్యథా । కాలాతిక్రమభీత్యా స లక్ష్మణో రఘూత్తమం ॥ ౫౧ ॥ వృత్తం నివేదయామాస పునస్తం రాఘవోబ్రవీత్ । నివారయిత్వా వటుకాన్ వినాశస్త్రైస్త్వరాన్వితః ॥ ౫౨ ॥

లు సీతాది రాజపత్నులు మంత్రులు నందరును చూచుచుండగా, వినోదముతో వాయవ్యాస్త్రప్రయోగముచేసి రాజులనందరిని శుష్కపర్ణంబులవలె సముద్రతీరమునకు నెగరగొట్టెను. తక్కిన వారినందరిని మోహనాస్త్రప్రయోగముచే మూర్ఛితులంజేసెను॥౪౪॥ఇట్లు సమస్త సై

శ్రీరాముండు భరతశత్రుఘ్నులను సంజీవనిచే బ్రతికించుట.

న్యంబును రామరణక్రీడచే నిశ్శేషంబయినపుడు, కైకేయి గజమునుండిదిగి భరతు నెత్తుకొని తొడనునచి దుఃఖింపసాగెను. దశరథుఁడును కౌసల్యాదులును చింతాక్రాంతులై రోదనమున కారంభించిరి. వారిని రాముఁడు సమాధానపరచుచు లక్ష్మణునితో “ఓలక్ష్మణా, ఇచ్చట సమీపమున ముద్గలాశ్రమంబున సంజీవిన్యాది మహౌషధులు ఆమునిప్రభావముచే రాజిలుచున్నవి. వేగమెపోయి వాటిని తీసికొనిరమ్ము” అని యాజ్ఞాపించెను. వెంటనే లక్ష్మణుఁడును రథమునుండిదిగి ఆశ్రమమునకుపోయి అచ్చటివటువులు “మునులవారు సమాధినిష్ఠనుండి బహిర్ముఖులైనపిదప వారినియాచించి తీసుకొనిపోవచ్చు”నని నివారింపగావచ్చి ఆసంగతిని రామసన్నిధి కెరుకజేసెను. అందుకు రాముండు “వారి భయమువలదు, త్వరగావెడలి శస్త్రములేక యావటువలను నిగ్రహించి మహౌషధులను తీసికొనిరమ్ము” అని పంపెను. సౌమిత్రి యత్యంత త్వరితముగా వెడలి బలాత్కారమున నానామూలికల నట్లే తెచ్చెను. శ్రీరాముండు వాటిచే భరతశత్రుఘ్నులను సప్రాణులంజేసి కైకేయికిని దశరథరాజునకును అమందానందము నొందించెను. అప్పుడు కైకేయీదశరథులు శ్రీరామాదుల నాలింగించి యానందించుచు వసిష్ఠుల

ఆనయత్వంశుభావల్లీ ర్నాశంకాంచమునేఃకురు । సోపిరామాజ్ఞయాగత్వా నివార్యవటుకాన్ క్షణాత్॥ ౪౩॥ బలా త్కారేణతాంవల్లీంగృహిత్వారామమాగతః । భరతంజీవయామాస విశల్యంకృత్యసానుజం॥ ౪౪ ॥ తతస్సముత్థితం దృష్ట్వా కైకేయీభరతంముదా । సంతోషంపరమంచక్రే కైకేయీంపితరంతదా ॥ ౪౫ ॥ రాఘవంసాసమాలింగ్య భరతంపరిషస్వజే । తతోరాజాతిసంతుష్ట స్సమాలింగ్యరఘూత్తమం॥ ౪౬॥ హర్షాన్మహోత్సవాం స్తత్ర చకారగు రుణాద్విజైః । తతస్తేవటవస్సర్వే హాహాకృత్యమునీశ్వరం॥ ౪౭॥ వృత్తంనివేదయామాసు స్సమాధివిరమేమునేః। స ముద్గలోపితచ్ఛ్రుత్వా విస్మయేనాబ్రవీద్వటూన్ ॥ ౪౮ ॥ కోలక్ష్మణఃకిమర్థంక స్యాజ్ఞయాసోఽపహరద్రుతం । విది త్వాసకలంవృత్త మాగచ్ఛధ్వంత్వరాన్వితాః॥ ౪౯ ॥ తథేతితేదశరథం గత్వాప్రోచుస్త్వరాన్వితాః । కస్త్వంకిమర్థ మానీతా వల్ల్యోలక్ష్మణహస్తతః ॥ ౫౦ ॥ తాన్ దృష్ట్వాక్రోధసంయుక్తాన్ రాజాచింతాతురోబ్రవీత్ । అహందశర థోవల్ల్యో భరతార్థంసమాజ్ఞయా॥ ౫౧ ॥ ఆనీతామునయేసర్వం బ్రువధ్వంనతిపూర్వకాః । అహమప్యాగమిష్యా మి మునింసాంత్వయితుంజవాత్ ॥ ౫౨ ॥ తతస్తేమునయస్సర్వే నృపవాక్యాద్యవర్ణయన్ । శ్రుత్వారామస్యపితరం క్రోధంసంవృత్యవేగతః॥ ౫౩ ॥ దర్శనార్థంమతించక్రే తావద్దృష్టోనృపఃపురః॥ బద్ధకరసంపుటంతం ప్రణమంతంనృ పోత్తమం॥ ౫౪ ॥ ప్రార్థయంతంసముత్థాప్య పూజయామాససాదరం । రామాద్యాన్నృపపుత్రాశ్చ కౌసల్యాద్యాశ్చనృ

చే బ్రాహ్మణులతోడ ననేక రక్షాశుభకర్మోత్సవములను చేయించెను. అచ్చట నాముద్గలముని బహిర్ముఖుఁడై వటువులనుండి ఈ వృత్తాంతమునువిని “ఎవఁడాలక్ష్మణుఁడు? ఎందుకు వీటిని హరించెను? శీఘ్రముగాపోయి తెలిసికొనిరండు.” అని వటువులనంపెను. వారువచ్చి దశరథు నితో నాసంగతిచెప్పగా, దశరథుండు ఆహతపోధనుల క్రోధమునకు చిక్కితిమిగదాయని చిం తించుచు “మహానుభావులారా, నేను దశరథుండను, భరతార్థము నాయాజ్ఞచే తీగలుతేబడి నవి, ఈసంగతిని నానతులతోడ మహర్షిసన్నిధి కెరిగింపుఁడు, ఇదిగో వారిని సమాధానము జేయుటకు నేనును వచ్చుచున్నాఁడను.” అని చెప్పిపంపెను. ఆ బాలమునులు ఇచ్చటి సర్వవృ త్తాంతమును సవిస్తరముగా ముద్గలమునికి విజ్ఞాపించిరి. పిదప ముద్గలుఁడు శ్రీరామ జనకవృ త్తాంతమునెఱిఁగి కోపమునువదలి రామదర్శనమునకు రాదలఁచెను. అంతలో దశరథుండు నెదుటవచ్చి బద్ధాంజలియై ప్రణమించి ప్రార్థించుచుండగా, ముద్గలుండు సముచితముగా దశ రథరాజును సత్కరించి, అట్లే నమస్కరించుచుండు శ్రీరామాదులనందరిని యుచితమర్యాద లచే ననుగ్రహించెను. ముద్గలపత్నియగు సుమతిచే కౌసల్యాదిస్త్రీలు విశేషముగా పూజింపఁ బడుచుండిరి. అంత దశరథుఁడు “స్వామీ, నేనపరాధమును చేసితిని క్షమింప వేడుచున్నాను. అని మాటమాటకు భయభక్తిప్రణామంబులచే ముద్గలముని నారాధించెను. అప్పుడు ముద్గ లుండు “మహారాజా, నాకునీవు మహోపకారముచేసితివి, అట్లుకాకున్న సీశ్రీసీతారామ దర్శ నంబు నాకు లభించునా? ఇతఁడు మాయతోడ మానుషవేషమందిన మాధవుఁడుకాఁడే?” అను చుండగానంతుష్టస్వాంతుండగుచు దశరథుండుసప్రణాముఁడైకొంతసంగతినడుగబూనెను.॥౫౫॥

పత్రిస్త్రియః ॥ ౧౫ ॥ ప్రణమ్యాథమునింస్తుత్వా తన్ముద్గలభార్యయా । సుమత్యాపూజితాస్సర్వా రాజదారావిశేషతః॥ ౧౬॥ తతోదశరథఃప్రాహ మునింస్తుత్వాపునఃపునః। మయాపరాధితంరాజ్ఞా క్షమ్యతాంత్త్వయామునే॥౧౭॥ మునిర్దశరథంప్రాహ హ్యుపకారోమహాన్కృతః । నోచేత్కథందర్శనం మే ధ్యానస్థస్యసుతస్యతే॥ ౧౮ ॥ శ్రీరామస్యససీతస్య నృవేషస్యహిమాయయా । ఇతితస్యవచశ్శ్రుత్వా దృష్ట్వాతుష్టంమునీశ్వరం॥ ౧౯ ॥ ఉవాచనృపతిర్నత్వాకించిత్ప్రష్టుమనామునిం । జ్ఞాత్వానృపస్యసమునిర్హృద్గతంప్రష్టుకాముకం॥ ౨౦ ॥ ఏకాంతేతులసీఖండే నీత్వాతంనృపమేవసః । పప్రచ్ఛకింతేవాంఛాస్తి వదస్వకథ్యతేమయా ॥ ౨౧ ॥ తమబ్రవీద్దశరథ శ్రీరామస్యహిభావియత్ । హితాహితంసవిస్తారం జ్ఞాతుమిచ్ఛేమునీశ్వర ॥౨౨॥ నృపస్యవచనంశ్రుత్వా రాజానంమునిరబ్రవీత్॥ ౨౩॥ ॥ * ॥ ముద్గలఉవాచ—సాక్షాన్నారాయణోవిష్ణు స్సర్వవ్యాపీజనార్దనః । భూభారహరణార్థాయ తవాపివరదానతః॥ ౨౪॥ అవతీర్ణోస్తిత్వత్తోహి తవపుణ్యమహోదయాత్ । అధర్మస్యవినాశంచ వృద్ధింధర్మస్యసాదరం ॥ ౨౫॥ నిర్దాళనంహిదుష్టానాం సజ్జనానాంచపాలనం। కరిష్యతిమహానేషతవపుత్రోరఘూత్తమః॥ ౨౬॥ దశవర్షసహస్రాణి దశవర్షశతానిచ । కరిష్యతిమహద్రాజ్యం గతేత్వయిదివంనృప ॥ ౨౭ ॥ సప్తద్వీపపతిశ్చాయం భవిష్యతినృపోమహాన్ । ద్వౌతౌభవిష్యతఃపుత్రౌ చతస్రశ్చస్నుషాస్తథా॥ ౨౮॥ చతుర్వింశతిపౌత్రాశ్చ పౌత్ర్యస్తుద్వాదశైవహి।

## ముద్గలముని శ్రీరామవృత్తంబును దశరథునికి చెప్పుట.

వెంటనే ముద్గలుండు ఇంగితమెరిగి తులసీఖండమున నేకాంతమునకు పిలచికొనిపోయి "ఏమబ్బా నీవడిగెడువిషయము? నీకోర్కెలనడుగుము చెప్పెదను" అని సాదరముగా నడిగెను. అందుకు దశరథుఁడు "స్వామీ, శ్రీరామునియొక్క హితాహితంబగు భవిష్యద్వృత్తాంతమును సవిస్తరముగా మీవలన తెలియగోరుచున్నాను" అని ప్రశ్నజేసెను. ముద్గలముని యిట్లనెను;— సర్వవ్యాపియైయుండు సాక్షాచ్ఛ్రీమన్నారాయణుఁడు నీకు వరమిచ్చినందుచేత, భూభారమును హరించుటకు నీయొక్క మహాపుణ్యోదయమున నీకు జ్యేష్ఠపుత్రుఁడుగా నవతరించియున్నాఁడు. ఇతఁడు లోకమున అధర్మమును హరించి ధర్మమును రక్షించి దుష్టనిగ్రహణంబును శిష్టపరిపాలనంబును కావించి, రఘువంశశిరోమణియై, నీవు దివంబున కేగినపుడు పదునొకండువేల సంవత్సరములు మహారాజ్యపరిపాలనముజేయుచు రారాజించుచుండును. ఇతఁడు సప్తద్వీపాధిపతియై చక్రవర్తియై వర్తిలుచుండును. ఇతనికి ఇద్దరు కొడుకులును నలుగురు కోడండ్రును ఇరువది నలుగురుమంది మనములును పండ్రెండుమంది మనమరాండ్రును లెక్కలేనిమంది మున్మనములును పుట్టగలరు. కొన్నిదినములలో నితఁడు వృందాశాపము ననుభవించుటకై దండకావనమున బోవును. అటుమీద మహద్రాజ్యము ననుభవించుచుండును. అని చెప్పిన ముద్గల వాక్యములను దశరథరాజు విని మరల యిట్లు విన్నవించెను— తాపసోత్తములారా, ఆవృంద యెవతె? ఆమె యెవనియిల్లాలు? దానిచే శ్రీహరి యేల శపింపఁబడెను? ఆసంగతిని సవిస్తరముగా వివరించి చెప్పవలయును. అని సంప్రార్థించిన దశరథునికి ముద్గలముని

అసంఖ్యాతాః ప్రపౌత్రాద్యా భవిష్యంతి సుతస్య తే । కియద్దినైరయం వృందా శాపం భోక్తుం హి దండకే ॥ ౨౯ ॥ గమిష్యతి తతః పశ్చాద్భూమౌ రాజ్యం కరిష్యతి । తత్తస్య వచనం శ్రుత్వా నృపః ప్రాహ మునిం పునః ॥ ౩౦ ॥ * ॥ దశరథ ఉవాచ—కా వృందా కస్య భార్యా సా కథం శప్తో హరిస్తయా । తత్సర్వం విస్తరేణైవ కథయస్వ మునీశ్వర ॥ ౩౧ ॥ ముద్గల ఉవాచ—పురా జలంధరేణాసీద్యుద్ధం శ్రీశంకరస్య చ । వృందాపాతివ్రత్యబలాద్రక్షితం విష్ణునా తదా ॥ ౩౨ ॥ జ్ఞాత్వా తద్దర్శితపథా పార్వత్యా ధర్షణాదినా । జాలంధరం పురం గత్వా తద్దైత్యపుటభేదనం ॥ ౩౩ ॥ పాతివ్రత్యస్య భంగాయ వృందాయాశ్చాకరోన్మతిం । అథ వృందారకాదేవి స్వప్నమధ్యే దదర్శ హ ॥ ౩౪ ॥ భర్తారం మహిషారూఢం తైలాభ్యక్తం దిగంబరం । దక్షిణాశాగతం ముండం తమసా ప్యావృతం తదా ॥ ౩౫ ॥ తతః ప్రబుద్ధా సా బాలా తం స్వప్నం స్వం విచిన్వతీ । కుత్రాపి నాలభచ్ఛర్మ గోపురాట్టాలభూమిషు ॥ ౩౬ ॥ తతస్సఖీద్వయయుతా నగరోద్యానమాగతా । వనాద్వనాంతరం యాతా దదర్శాతీవ భీషణౌ ॥ ౩౭ ॥ రాక్షసౌ సింహవక్త్రౌ ద్వౌ దంష్ట్రాననసుభీషణౌ । తౌ దృష్ట్వా విహ్వలాతీవ పలాయనపరా తదా ॥ ౩౮ ॥ దదర్శ తాపసం శాంతం సశిష్యం మౌనమాస్థితం । తతస్తత్కంఠమాసజ్య నిజబాహులతాం భయాత్ ॥ ౩౯ ॥ మునే మాం రక్ష శరణమాగతామిత్యభాషత । తత్తస్యా వచనం శ్రుత్వా ధ్యానం ముక్త్వా స వై మునిః ॥ ౪౦ ॥ ఉన్మీల్య నయనే వృందాం హ్యదిదృష్ట్వాబ్రవీద్వచః । తిష్ఠ త్వం బాలికే హ్యత్ర మా భయం కురు సర్వథా ॥ ౪౧ ॥ ఇత్యుక్త్వా పురతో దృష్ట్వా రాక్షసౌ మునిసత్తమః । నిర్భర్త్స్య సంతౌ హుంకారైః క్రోధేన మహతావృతః ॥ ౪౨ ॥ తౌ తద్ధుంకారతస్త్రస్తౌ పలాయనపరౌ తదా । తత్సామర్థ్యం మునేర్దృష్ట్వా వృందా సా విస్మ

యిట్లు చెప్పనారంభించెను. పూర్వము జలంధరాసురునికి శ్రీమత్పరమేశ్వరునితోడ మహాయు

### వృందా శాపముచేత శ్రీహరికి రామావతారము వచ్చుట.

ద్ధము జరిగెను. అపుడు జలంధరాసురుని నతనిభార్య వృందయనునది తన పాతివ్రత్య ప్రభావముచే రక్షించుచుండెను. అపుడు శ్రీవిష్ణుభట్టారకుండు పార్వతివలన తెలియబడిన మార్గముగలవాఁడై జలంధర పురమునకు వెడలి వృందా పాతివ్రత్య భంగము నొనరింప దలంచెను. పిదప నొకరాత్రి యా వృందారకాదేవి తనపతి అభ్యంగము చేసికొని దిగంబరుఁడయి పోతు, నెక్కి-పోవుచున్నట్లును చీగట్లు కమ్మి యతఁడు బోడితలతో దక్షిణదిగ్గామియైనట్లును కలగని తెల్లవారి లేచి తన యాస్వప్నమునే చింతించుచు తన విహారభూములలో నెచ్చటను సుఖము నందక, ఇరువురు చెలికత్తెలతోడ నగరోద్యానవనమును ప్రవేశించెను. పిదప వనమునుండి మరియొకవనము అందుండి యింకొకవనము ఇట్లు పోవుచు, కోరలచే మిక్కి-లి భయంకరముఖులై సింహనాదంబులచే భీషణులయిన ఘోరరాక్షసుల నిరువురిని చూచి, భయభ్రాంతయై పరుగెత్తెను. ఇట్లు కొంతదూరముపోగా నొకచోట మౌనముని శాంతుఁడై శిష్యులతోడ కూర్చుండియుండు ముని నొకనిని జూచి, అతిభీతిచే నతని సన్నిధికి జని నిజబాహులతలచే నతని కంఠమును కట్టుకొనెను. “మునీంద్రా, శరణాగతయైన నన్ను రక్షింపుము” అని మొరబెట్టుచున్న యా వృందా వాక్యములచే నాముని ధ్యానమునువదలి బహిర్ముఖుండై కండ్లు తెరచి

యావృతా॥ ౯౩॥ ప్రణమ్య దండవద్భూమౌ మునిం వచనమబ్రవీత్ ॥ * ॥ వృందోవాచ—రక్షితాద్య త్వయా ఘోరాద్భయాదస్మాత్కృపానిధే ॥ ౯౪ ॥ కించిద్విజ్ఞప్తుమిచ్ఛామి కృపయా తద్వదస్వ మాం। జలంధరో హి మే భర్తా రుద్రం యోద్ధుం గతః ప్రభో॥ ౯౫॥ స తత్రాస్తే కథం యుద్ధే తన్మే కథయ సువ్రత। మునిస్తద్వాక్యమాకర్ణ్య కృపయోర్ధ్వమవైక్షత॥ ౯౬॥ తావత్కపీ సమాయాతౌ తం ప్రణమ్యాగ్రతః స్థితౌ। తతస్తద్భ్రూలతాసంజ్ఞా ప్రయుక్తౌ గగనాంతరాత్॥ ౯౭॥ గత్వా క్షణార్ధాదాగత్య వానరావగ్రతః స్థితౌ। శిరఃకబంధహస్తౌ చ దృష్ట్వాబ్ధితనయస్య సా ॥ ౯౮ ॥ పపాత మూర్ఛితా భూమౌ భర్తృవ్యసనదుఃఖితా। కమండలుజలైస్సిక్తా మునినాశ్వాసితా తదా ॥ ౯౯ ॥ రుదిత్వా సుచిరం వృందా తం మునిం వాక్యమబ్రవీత్ ॥ * ॥ వృందోవాచ—కృపానిధే మునిశ్రేష్ఠ జీవయైనం మునిప్రియం ॥ ౧౦౦॥ త్వమేవాస్య పునశ్శక్తో జీవనాయ మతో మమ ॥ * ॥ మునిరువాచ—నాయం జీవయితుం శక్యో రుద్రేణ నిహతో యుధి॥ తథాపి త్వత్కృపావిష్టః పునస్సంజీవయామ్యహం। ఇత్యుక్త్వాంతర్దధే యావత్తావత్సాగరనందనః॥ ౨ ॥ వృందామాలింగ్య తద్వక్త్రం చుచుంబ ప్రీతమానసః। అథ వృందాపి భర్తారం దృష్ట్వా హర్షితమానసా ॥ ౩ ॥ రేమే తద్వనమధ్యస్థా తద్యుక్తా బహువాసరం। కదాచిత్సురతస్యాంతే దృష్ట్వా విష్ణుం తమేవ హి॥ ౪॥ నిర్భర్త్స్య క్రోధసంయుక్తా వృందా వచనమబ్రవీత్॥ * ॥ వృందోవాచ—ధిక్త్వేదం హరే శీలం పరదారాభిమానినః॥ ౫॥ త్వం జ్ఞాతోసి మయా సమ్యక్ మాయీ ప్రత్యక్షతాపసః। యౌ త్వయా మాయయా ద్వౌ తౌ స్వకీయౌ దర్శితౌ మమ ॥ ౬ ॥ తౌ దేవరాక్షసౌ భూత్వా తవ భార్యాం వినేష్యతః। జయవిజయనామానౌ జ్ఞాతౌ కృత్రిమరూపిణౌ॥ ౭॥ త్వం చాపి భార్యాదుఃఖార్తో వనే క

---

తన మెదమీఁదనున్న వృందను చూచి "పిల్లదాన, ఇచ్చట యుండుము, భయపడవలదు" అని చెప్పి, యెదుటనున్న రాక్షసులను చూచి క్రుద్ధుండై హుమ్మని ధిక్కరించెను. అపుడు వారు ఆహుంకార మాత్రమునకు వెరచి వెనుకకు పరుగెత్తిరి. మునిపుంగవుని యిట్టి సామర్థ్యమునుచూచి యాశ్చర్య పరవశయయిన వృంద దండప్రణామం బొనరించి "తాపసోత్తమా, దయానిధియగు నీవు నన్నిపుడు మహాభీతినుండి కాపాడితివి. నేనొకసంగతిని విన్నవించెదను, కరుణించి ఆ సంగతిని నాకు చెప్పవలయు. అదియేమనిన, జలంధరుఁడను నామగఁడు రుద్రునితో యుద్ధమునకు పోయెను, అతఁ డిప్పుడెట్లున్నాఁడు?" అని సవినయముగా ప్రార్థించెను. అందుకు ముని దయతో నంతరిక్షమునుచూచుచు నావేళకు గగనమున వచ్చినిలచి నమస్కరించుచున్న కపుల నిరువురినిచూచి కనుబొమ్మలచే సంజ్ఞ జేసిపంపెను. వారిరువురు వానరులు క్షణార్థమున పోయి వచ్చిరి. అపుడు వృంద సముద్ర సుతుఁడగు తన మగని రుండ కబంధములను చేతబట్టియున్న కపులనుచూచి పతి వియోగ దుఃఖితయై నేలఁబడి మూర్ఛనొందెను. అపుడు మునిపుఁడు నిజకమండలోదకములను చల్లి యామెను ఆశ్వాసించుచుండెను. ఆమె మిగుల దుఃఖించుచు మునితో "కృపాళువైన మహానుభావుఁడా, మునిప్రియుఁడగు నితనిని బ్రతికింపుము, నీవే యితని బ్రతికించుటకు శక్తుఁడవని నమ్మియున్నాను" అని వేడుకొనెను. అందుకు ముని "రుద్రునిచేత జచ్చిన యితని బ్రతికించుటకు కాచాలదు. అయిన నీయందు గల్గిన దయచే నేను మరల బ్రతి

పిసహాయవాన్ । భవసర్వేశ్వరోపిత్వం యత్తేశిష్యత్వమాగతౌ ॥ ౮ ॥ పుణ్యశీలసుశీలౌతౌ కపిరూపధరావుభౌ । అతస్తేవానరైరస్తు సంగతిర్దండకేవనే ॥ ౯ ॥ వటురూపధరశ్శిష్యో యస్తార్క్ష్యశ్చేతివేద్మ్యహం । ఇత్యుక్త్వాసాతదా వృందా ప్రావిశద్ధవ్యవాహనం ॥ ౧౦ ॥ తతోజలంధరోదైత్యో నిహతోయుధిశంభునా । తస్మాద్రాజన్నిదానీంతౌ కుంభకర్ణదశాననౌ ॥ ౧౧ ॥ జాతౌసాగరమధ్యేతౌ లంకాయామధునాస్థితౌ । నీత్వాజనకజాంబాలాం పంచవట్యాస్తు మాతృవత్ ॥ ౧౨ ॥ పాలయిత్వాథషణ్మాసాన్ రామబాణాన్మరిష్యతః । రామోపివాలినంహత్వా సుగ్రీవేణసమన్వితః ॥ ౧౩ ॥ శిలాభిస్సాగరంబద్ధ్వా సీతామాదాయయాస్యతి । యాత్రాయజ్ఞవిలాసాంశ్చ సప్తద్వీపప్రరక్షణం ॥ ౧౪ ॥ కరిష్యతిదయితయా బంధుభిశ్చయథాసుఖం । ఇదంగోప్యంత్వయారాజన్ కథనీయంనకుత్రచిత్ ॥ ౧౫ ॥ ॥ శ్రీశివ ఉవాచ — ఇత్యుక్త్వాముద్గలస్సర్వం భావిరామస్యకౌతుకాత్ । చరిత్రంవర్ణయామాస యదాయద్యత్కరిష్యతి ॥ ౧౬ ॥ తత్సర్వంనృపతిశ్శ్రుత్వా తుష్టఃపప్రచ్ఛతంపునః । పూర్వజన్మనికశ్చాహం కింమయాసుకృతంకృతం ॥ ౧౭ ॥ తత్సర్వంవదమాంబ్రహ్మన్ యస్మాజ్జాతోహరిస్సుతః । మమసాక్షాద్రామచంద్రో లక్ష్మీస్సీతాత్వభూత్స్నుషా ॥ ౧౮ ॥ ఇతితస్యవచశ్శ్రుత్వా నృపమాహపునర్మునిః ॥ * ॥ ముద్గల ఉవాచ — ఆసీత్సహ్యాద్రివిషయే కరవీరపురేపురా ॥ ౧౯ ॥ బ్రాహ్మణోధర్మనిత్యాఖ్యో ధర్మదత్తఇతిశ్రుతః । విష్ణువ్రతకరస్సమ్యగ్విష్ణుపూజారతస్సదా ॥ ౨౦ ॥ ద్వాదశాక్షరవిద్యాయాం జపనిష్ఠోతిథిప్రియః । కదాచిత్కార్తికేమాసి హరిజాగరణాయసః ॥ ౨౧ ॥ రాత్ర్యాంతుర్యావశేషాయాం జగామహరిమందిరం । హరిపూజోపకరణాన్ ప్రగృహ్య నిజతాతదా ॥ ౨౨ ॥ తేనదృష్టాసమాయాతా రాక్ష

కించెదను.” అనుచు నంతర్ధానము నొందెను. అంతలో జలంధరుఁడును వృందను ఆలింగించికొని మోమును ముద్దిడి సుప్రీతుఁడాయెను. పిదప వృందాదేవి మగనిజూచి మహానందము నొంది ఆవసమున నతనితోడ బహుసంవత్సరములు క్రీడించుచుండెను. ఇట్లుండగా, నొకప్పుడు సురతాంతమున నతనినే శ్రీవిష్ణు మూర్తినిగా నెఱిఁగి, కోపావిష్టయై ధిక్కారపూర్వకముగా “ఛీ, ఛీ, హరీ పరదారరతంబగు నీశీలంబు కాల్పనా? నీవు మాయివైన ప్రత్యక్ష తాపసుఁడను దానిని నేను చక్కగా దెలిసితిని. ఎవరిద్దరు రాక్షసులు నీమాయచే నీవారుగావచ్చిరో, వారే నీభార్యను అపహరించెదరు, జయవిజయులనువారే యీ కృత్రిమరూపమునుదాల్చిరి. నీవు సర్వేశ్వరుండైనను వనమున కపిసహాయముగలవాఁడై పత్నీదుఃఖము ననుభవించుచుండుము. పుణ్యశీల సుశీలురను వారిరువురు నీకు శిష్యులై కపిరూపములనొంది యున్నందున దండకావనమున వానరులతోడ వసించుచుండుము. వటువేషమున నీవద్దనున్న శిష్యుఁడు గరుడుండని నాకు దెలియును” అని చెప్పి అగ్నిని ప్రవేశించెను. అందువలన యుద్ధమందు రుద్రునిచే జలంధరుండు చంపఁబడెను. ఓయి దశరథుఁడా, కాబట్టి వారిద్దరు ఇప్పుడు రావణ కుంభకర్ణులుగా పుట్టి సముద్రమధ్యమున లంకలో నున్నారు. వారు పంచవటిలోనుండి సీతాదేవిని అపహరించికొనిపోయి తల్లివలె కాపాడుచుండి, ఆరుమాసములయినపిదప రామబాణముచే జచ్చెదరు. శ్రీరాముఁడు వాలినిజంపి సుగ్రీవ సమన్వితుఁడై శిలలచే సముద్రమును బంధించి సీతను తెచ్చికొనును,

సీభీమనిస్స్వనా। వక్రదంష్ట్రాలలజ్జివ్హా నిమగ్నారక్తలోచనా॥ ౨౩ ॥ దిగంబరాశుష్కమాంసా బింబోష్ఠీఘుర్ఘురస్వనా। తాందృష్ట్వాభయసంత్రస్తః కంపితావయవస్తదా ॥ ౨౪ ॥ పూజోపకరణైస్సర్వైః పయోభిశ్చాహనద్బలాత్। సంస్మృత్యయద్ధరేర్నామ తులసీయుక్తవారిణా॥ ౨౫॥ సోహనద్వారిణాతస్మా త్తత్పాపంలయమాగతం। అథసంస్మృత్యసాపూర్వ జన్మకర్మవిపాకజాం॥ ౨౬॥ స్వాందశామబ్రవీద్విప్రం దండవచ్చప్రణమ్యసా॥ *॥ కలహోవాచ—పూర్వకర్మవిపాకేన దశామేతాంగతాస్మ్యహం ॥ ౨౭ ॥ తత్కథంతుపునర్విప్ర యాస్యామ్యహంగతిముత్తమాం॥ *॥ ముద్గలఉవాచ—తాందృష్ట్వాప్రణతామార్తాం వదమానాంస్వకర్మచ॥ ౨౮॥ అతీవవిస్మితోవిప్ర స్తదావచనమబ్రవీత్॥ *॥ ధర్మదత్తఉవాచ—కేనకర్మవిపాకేన త్వందశామీదృశీంగతా॥ ౨౯ ॥ కుతఃప్రాప్తాచకింశీలా తత్సర్వంవిస్తరాద్వద॥ *॥ కలహోవాచ—సౌరాష్ట్రనగరేబ్రహ్మన్ భిక్షునామాభవద్ద్విజః॥ ౩౦॥ తస్యాహంగృహిణీబ్రహ్మన్ కలహాఖ్యాతినిష్ఠురా। నకదాచిన్మయాభర్తు ర్వచసాపిశుభంకృతం॥ ౩౧॥ నార్పితంతస్యమృష్టాన్నం భర్తుర్వచనభంగయా। పాకకాలేమయానిత్యం యద్యచ్చాన్నంమనోరమం ॥ ౩౨ ॥ తత్తత్పూర్వంస్వయంభుక్త్వా పశ్చాద్భర్త్రేనివేదితం। ఏకదాసపతిర్మిత్రం మమవృత్తంన్యవేదయత్ ॥ ౩౩ ॥ నైవశృణోతిమేపత్నీ మద్వాక్యంకింకరోమ్యహం। తేనశ్రుత్వాతుసకలం క్షణంసంచింత్యవైహృది॥ ౩౪॥ ఉవాచమత్పతింకించి ద్యుక్తంతాంతేవదామ్యహం। విపరీతోక్త్యావదస్వత్వం గృహిణీసాకరిష్యతి॥ ౩౫॥ తవవాక్యేనకార్యాది యత్కించిత్తవవాంఛితం। తథేతిమిత్రవాక్యేన గృహమేత్యపతిర్మమ॥ ౩౬॥ మామాహదయితేమాత్వం భోజనార్థంసమాహ్వాయ। మమమిత్రంమహా

తీర్థయాత్రలను యజ్ఞక్రియలను ద్వీప ప్రదక్షిణంబును ప్రియురాలితోడ బంధువులతోడ యథాసుఖముగా చేయగలఁడు. ఇది రహస్యమైనసంగతి, ఎచ్చటను చెప్పవలదు. ఓసి పార్వతీ, ఇట్లు ముద్గలముని శ్రీరామునియొక్క భవిష్యద్వృత్తాంతమును ఎప్పుడెప్పుడు ఎట్లెట్లు చేయునో ఆ సంగతులనన్నిటిని వర్ణించిచెప్పెను. వాటిని విని దశరథుండు సంతసమునొంది "మహానుభావా, పూర్వజన్మంబున నేనెవఁడను? నేనేమి పుణ్యముచేసితిని? ఎందువలన శ్రీహరి నాకొడుకు శ్రీరాముఁడుగా నవతరించెను? లక్ష్మియగు సీత కోడ లెట్లయినది?" అని ప్రశ్న జేసెను. అందుకు ముద్గలుఁడు ఇట్లు పలుకుచున్నాఁడు. మనుపు సహ్యాద్రిదేశమున కరవీరపురమునందు ధర్మజ్ఞాని

కేకయియొక్క జన్మాంతర కలహాఖ్యానము.

యైన ధర్మదత్తుఁడను బ్రాహ్మణుఁడొకఁడు గలిగెను. అతఁడు చక్కగా శ్రీమన్నారాయణ పూజా పరాయణుఁడై విష్ణువ్రతము నాచరించుచుండెను. వాసుదేవ ద్వాదశాక్షర విద్యాసంపన్నుఁడును అతిథి ప్రియుఁడును జపశీలుఁడు నగు ఆవిప్రుఁడు ఒకానొకప్పుడు కార్తికమాసమున హరిజాగరణముకొరకు రాత్రి వేకువజామున శ్రీవిష్ణు దేవాలయమునకు పూజోప కరణములను తీసికొనిపోవుచుండెను. దారిలో వ్రేలాడు నాలుకయును వక్ర దంష్ట్రంబులును శుష్కాంగములును రక్తాక్షులును భయంకర ధ్వనియును గల్గి దిగంబరయైన రాక్షసియొకతె కనుపడెను. ధర్మదత్తుఁడు దానినిజూచి భయమునొంది వడకుచు పూజోపకరణములను నీళ్లను బలా

దుష్టం తచ్ఛ్రుత్వాస్వపతేర్వచః॥ ౩౭॥ తదాభర్తా మయోక్తస్స స్నానుస్తవసఖాస్తితం । సమాహ్వాయామ్యశసార్థ మద్యైవబ్రాహ్మణోత్తమం॥ ౩౮ ॥ తతోమయాసమాహూతః స్వయంగత్వాపతేస్సఖా । తదారభ్యనిషేధోక్త్యాశకా ర్యమాజ్ఞాపయత్పతిః॥ ౩౯ ॥ ఏకదాసపితుర్ద్రష్ట్వా క్షయాహస్సపతిర్మమ । మామాహదయితేశ్రాద్ధం నకరిష్యామ్యహశ హంపితుః॥ ౪౦॥ తద్వాక్యంస్వపతేశ్శ్రుత్వా మయావిప్రానిమంత్రితాః । మయాధిక్ధిక్కృతోభర్తా కథంశ్రాద్ధం కరోషిన॥ ౪౧॥ పుత్రధర్మంనజానాసి కాగతిస్తేభవిష్యతి । తతఃపునస్సమామాహ పక్వాన్నాన్యద్యమాకురు॥ ౪౨॥ ద్విజంనిమంత్రయస్వైరం మావిస్తారంకురుప్రియే । తత్తస్యవచనంశ్రుత్వా మయాష్టాదశభూసురాః॥ ౪౩॥ నిమంత్రితాస్సుశ్రాద్ధార్థం పక్వాన్నానికృతానిహి । తతఃపునస్సమామాహ ప్రియేశృణువచోమమ॥ ౪౪॥ మయాసహాద్యాత్త్వంమిష్టం పాకంభుక్త్వాతతఃపరం । స్వీయోచ్ఛిష్టంత్వద్యవిప్రాణాం పరివేషణమాచర॥ ౪౫ ॥ తన్మయావచనంశ్రుత్వా పతిర్ధిక్ధిక్కృతఃపునః । కథమాదౌస్వయంభుక్త్వా పశ్చాద్విప్రాణాంసమర్పయేత్ ॥౪౬॥ ఏవంసర్వనిషేధోక్త్యా శ్రాద్ధంసాంగంచకారసః । పిండదానాదికంకృత్వా మామాహపతితఃపునః॥ ౪౭ ॥ అహముపోషణంత్వద్య కరిష్యామినశంశయః । తత్తస్యవచనంశ్రుత్వా మిష్టాన్నేనసభోజితః ॥ ౪౮ ॥ తతోదైవవశాద్భర్తా విస్మృత్యాప్రాహమాంపునః । నీత్వాపిండాన్ క్షిపస్వాద్య సత్తీర్థేపరమాదరాత్॥ ౪౯ ॥ తతోమయాశౌచకూపే నీత్వాపిండావిసర్జితా । తతఃఖిన్నమనావిప్రో హాహేత్యుక్త్వాస్థితోభవత్॥ ౫౦॥ క్షణంవిచింత్యమామాహ పిండాన్మాత్వంబహిఃకురు । తదోత్తీర్యశౌచకూపే మయాపిండాబహిఃకృతాః॥ ౫౧॥ తతఃపునస్సమామాహ పిండాన్ తీర్థేక్షిపస్వమా । త

త్కారముగాపారవేసెను. హరినామంబుల నుచ్చరింపుచు తులసీ యుక్తసలిలంబులచే కొట్టబడి నందున ఆరాక్షసియొక్క పాపంబులయించెను. పిదప నారక్కసి తనజన్మాంతర సంస్కారవశమున గల్గిన దుర్దశను స్మరించుచు, ఆమునికి దండప్రణామం బొనరించి “బ్రాహ్మణోత్తముఁడా, జన్మాంతర కర్మదోషమువలన నేనీ దుర్దశనొందితిని. నేనెట్లు మరల సద్గతినొందుదును?” అని వేఁడెను. పరితాపార్తయై పలికిన తద్వాక్యములచే నత్యంత విస్మయమునొందిన ధర్మదత్తుఁడు “ఏట్టి కర్మవిపాకమున నీకీ దశవచ్చినది? ఆసంగతిని విస్తరించిచెప్పుము.” అనిననందుకారక్కసి యిట్లనెను. విప్రోత్తమా సౌరాష్ట్రదేశమునందు భిక్షుఁడను బ్రాహ్మణుఁడుండెను. నేను అతని యిల్లాలను. కలహాయని నాపేరు. నేను మిక్కిలి నిష్ఠుర స్వభావముగలదానను. మగనికి మాటలతోను మంచి నెంచి చెప్పలేదు, ఒకనాడును మృష్టాన్నము పెట్టలేదు, పతిమాటలను పడద్రొక్కుచుంటిని, వంటజేయునపుడు ఏదియేది మంచి వస్తువులుండునో వాటినన్నిటిని మొదట నేనుతిని పిదప పతికివేయుచుంటిని. ఇట్లుండ నొకప్పుడు నాపతి తన మిత్రునితో “నాయిల్లాలు నామాట వినుటలేదే, నేనేమిచేయుదును?” అని నాసంగతిని చెప్పికొనెను. అతఁడు అంతయునువిని కొంతసేపు చింతించుచుండి నామగనితో “మిత్రమా, నేనొకయుక్తిని చెప్పెదను, అట్లుచేయుము, ఏమనిన, నీ కనిష్టమయినదానిని ఇష్టముగాను ఇష్టమయినదాని ననిష్టముగాను చేయవలసినదానిని చేయవలదనియును చేయకూడనిదానిని చేయుమనియును ఇట్లు నిషేధోక్తులతో మాటలాడిన

దాతీర్థేమయాక్షిప్తా స్తత్పిండాః పరమాదరాత్॥ ౫౨॥ ఏవం మయా కదా భర్తు ర్వచనం న కృతం తదా। కలహప్రియా చ వై నిత్యం మయ్యుద్విగ్నమనా యదా॥ ౫౩॥ పరిణేతుం తతోఽన్యాం వై మనశ్చక్రే పతిర్మమ। తతో గరం సమాదాయ ప్రాణా స్త్యక్త్వా మయా ద్విజ ॥ ౫౪ ॥ అథ బద్ధ్వా వధ్యమానాం మాం నిన్యుర్యమకింకరాః। యమశ్చ మాం తదా దృష్ట్వా చిత్రగుప్తమపృచ్ఛత॥ ౫౫ ॥ * ॥ యమ ఉవాచ — అనయా కిం కృతం కర్మ ఫలం శుభమథాశుభం। ప్రాప్తవ్యైషా చ తత్కర్మ చిత్రగుప్తావలోకయ॥ ౫౬॥ *॥ కలహోవాచ — చిత్రగుప్త స్తదా వాక్యం భర్త్సయన్మా మువాచ హ॥*॥ చిత్రగుప్త ఉవాచ — అనయా తు శుభం కర్మ కృతం కించిన్న విద్యతే॥ ౫౭॥ మిష్టాన్నం భుజ్యమానేయం న భర్త్రే తదర్పితం। అతశ్చ వల్గులీయోన్యాం స్వవిష్ఠాదా వతిష్ఠతు ॥ ౫౮ ॥ భర్తృద్వేష్టి సదా త్వేషా నిత్యం కలహకారిణీ। విష్ఠాదా సూకరీయోన్యాం తస్మాత్తిష్ఠత్వియం హరే॥ ౫౯॥ పాకభాండే సదా భుఙ్క్తే గుప్తం చైకాకినీ తతః। తస్మాదేషా బిడాలాస్తు స్వజాతాపత్యభక్షిణీ॥ ౬౦॥ భర్తారమపి చోద్దిశ్య హ్యాత్మఘాతః కృతోఽనయా। తస్మాత్ప్రేతశరీరేపి తిష్ఠత్వేకాతినిందితా॥ ౬౧ ॥ అతశ్చైషా మరుదేశే ప్రాపితవ్యా హరైర్భటైః। తత్ర ప్రేతశరీరస్థా చిరంతిష్ఠత్వియం తతః॥ ౬౨॥ ఊర్ధ్వం యోనిత్రయం చైషా భునక్త్వశుభకారిణీ ॥ * ॥ కలహోవాచ — తతో దూతైః ప్రాపితాహం మరుదేశం క్షణాద్ద్విజ ॥ ౬౩ ॥ దత్వా ప్రేతశరీరం మే గతాస్తే స్వస్థలం ప్రతి। సాహం పంచదశాబ్దాని ప్రేతదేహే స్థితా కిల॥ ౬౪॥ క్షుత్తృడ్భ్యాం పీడితాత్యర్థం దుఃఖితా స్వేన కర్మణా। తతః క్షుత్పీడితా నిత్యం శరీరం వణిజస్త్వహం॥ ౬౫ ॥ ప్రవిశ్య దక్షిణే ప్రాప్తా కృష్ణావేణ్యాస్తు సంగమే। తత్తీరం సంశ్రితా యావ త్తావత్తస్య శరీరతః॥ ౬౬॥ శివవిష్ణుగణైస్తూర్ణ

---

నీకార్యము చక్కబడును." అని యుక్తి నుపదేశించెను. నామగడు నట్లేయని యింటికివచ్చి, ప్రియురాలా నేడు మహాదుష్టుఁడైన నామిత్రుని భోజనమునకు పిలువవలదని నాతోచెప్పెను. అందుకు నేను అతఁడు మిగుల సాధువేల పిలువగూడదు? నేడే పిలచెదనని తీసికొనివచ్చి మృష్టాన్నము పెట్టితిని. అదిమొదలు నాపతి నిషేధోక్తులతోనే కాలము గడుపుచుండెను. ఇట్లుండ మా మామగారి తద్దినమురాగా నాపతి నాతో నేడు నాతండ్రి శ్రాద్ధమును చేయననెను. వెంటనే నేను విప్రులను నిమంత్రించి ఛీ, ఛీ, ఎట్లు శ్రాద్ధముచేయవు? పుత్రధర్మము తెలియదా చేయకపోయిన నీకేమిగతి కాగలదు? అని తిరస్కరించితిని. అందుకు "అయితే పక్వాన్నములను వండవలదు, ఒక బ్రాహ్మణునే చెప్పుము, విస్తారము చేయకుము." అనిన పతిమాటకు ప్రతికూలముగా ౧౮ మంది విప్రులను చెప్పితిని. పక్వాన్నములను వండితిని. అందుకు మరల యతఁడు నాతో "ఓసీ, నామాటవినుము, మన మిరువురును వండినదానినిమొదటతిని మిగిలిన దానిని బ్రాహ్మణులకు పెట్టుదము" అనెను. అదివిని పతిని ధిక్కరించుచు శ్రద్ధతో శ్రాద్ధపాక మొనరించి బ్రాహ్మణులకు పెట్టితిని. ఇట్లు సర్వనిషేధోక్తులతో శ్రాద్ధమును సాంగముగా నెరవేర్చి పిండదానాదికము నాచరించి కడపట నేనుపవాసము చేసెద ననెను. నేను ఎంతమాత్రము సరిపడదని మృష్టాన్నముపెట్టి భోజనము చేయించితిని. అటుమీఁద దైవవశమున నా భర్త మరచి "మిగుల యాదరముతో నీపిండములను మహాతీర్థమున విడిచిరమ్ము" అనెను.

మహాకృష్టాబలాదహం । తతఃక్షుత్ క్షామయాదృష్టా భ్రమంత్యాత్వంమయాద్విజ॥ ౬౭॥ త్వద్ధస్తతులసీవారి సంస్పర్శ గతపాతకా । తత్కృపాంకురువిప్రేంద్ర కథంముక్తాభవామ్యహం ॥ ౬౮॥ యోనిత్రయాదగ్రభావ్యా దస్మాచ్చప్రేత భావతః । మాముద్ధరమునిశ్రేష్ఠ త్వామహంశరణంగతా॥౬౯॥ఇత్థంనిశమ్యకలహావచనంద్విజశ్చ। తత్పాపకర్మభయవిస్మయదుఃఖయుక్తః ॥ తద్గ్లానిదర్శనకృపాచలచిత్తవృత్తిః । ధ్యాత్వాచిరంసువచనంసజగాదదుఃఖాత్ ॥ ౭౦॥*॥*॥

ఇతి శ్రీశతకోటి రామచరితాంతర్గత శ్రీమదానందరామాయణే వాల్మీకీయే సారకాండే వృందావన కలహాఖ్యానో నామ చతుర్థస్సర్గః॥ ... ... ... ... ... ... ॥౪॥

అంత నేను వాటిని మలకూపమునందు పారవేచితిని. అప్పుడతఁడు హాహాకారముల చేయుచు ఖిన్నుండై కొంతసేపూరకయుండి నాతో ఆపిండములను నీవు బయటతీయవలదనెను. నేను ఆ పీతినూతిలో దిగి యెత్తికడిగితిని. మరల యతఁడు వీటిని తీర్థమున వేయవలదననిన నేనాదర ముతో తీర్థమునందు సమర్పించితిని. ఇట్లు నేనెల్లప్పుడును కలహప్రియనై యున్నందున బిక్షుండు విసికి వేరు పెండ్లిచేసికొనుటకు పూనెను. అంత నేను గరళముతిని ప్రాణములను విడిచితిని. యమకింకరులు కాలపురి కీట్చికొనిపోయిరి. అచ్చట యముఁడు “ఇది ఏమి శుభా శుభ కర్మలను చేసినది? చూడు”మని చిత్రగుప్తున కాజ్ఞాపించెను. అందుకు చిత్రగుప్తుఁడు నన్ను దూలనాడుచు “ఇదిచేసిన శుభకర్మయొక్కటియును లేదు. తాను మృష్టాన్నముతిని పతికి పెట్టి నందున (వల్గుసీ) యోనియందు తన మలమును భక్షించుచుండుగాక. నిత్యమును కలహించుచు పతితో ద్వేషించినందున (సూకరీ) యోనియందు మలము భక్షించుచుండని. షాక భాండమున గుట్టుగా తిండితిన్నందున పిల్లియై తన బిడ్డలను తాను తినవలయును పతి నుద్దేశించి యాత్మ హత్య చేసికొనినందున అత్యంత నింద్యమగు ప్రేతశరీరము నొందియుండదగును. అందువలన మరుదేశమున పంపతగినది. అచ్చట ప్రేతశరీరమున చిరకాలముండని. అటుమీఁద తక్కిన మూఁడు జన్మముల ననుభవించుగాక” అని చెప్పినందుచేత, ఈ మరుభూమికి దూతలు నన్ను తీసికొనివచ్చి ప్రేతదేహమునిచ్చి తమ తావునకు వెడలిరి. ఆ నేను ౧౫ సంవత్సరములు ప్రేత దేహవాసినిగానున్నాను. దప్పిచేతను ఆకలిచేతను పీడింపఁబడినదై నాదుష్కర్మచే దుఃఖిం చుచు, ఆకలి నోర్వలేక వణిజుని శరీరమున ప్రవేశించి దక్షిణమున కృష్ణావేణీ సంగమ ప్రదేశ మందుండి, యచ్చట శివవిష్ణు గణములనుండి వెళ్లగొట్టబడి క్షుత్తుచే కృశించుచు పరిభ్రమించు చువచ్చి నిన్నుచూచితిని. నీచేతి తులసీజలమువలన పాపములు పరిహారించిపోయినవి. కాబట్టి, యోవిప్రోత్తమా, నేనెట్లు ముక్తురాలగుదును? ముందనుభవింపదగిన యోనిత్రయ దుఃఖమును ప్రేతదుఃఖమును ఎట్లుపోవును? నిన్నే శరణాగతనై నమ్మిన దియగు నన్ను అనుగ్రహింపుము. అని యిట్లు ప్రార్థించుచుండు కలహావచనములను ఆ ధర్మదత్తుఁడు విని వాని పాపకర్మలచే భయా

ధర్మదత్తఉవాచ—విలయంయాంతిపాపాని తీర్థదానవ్రతాదిభిః । ప్రేతదేహస్థితాయాస్తే తేషునైవాధికారితా ॥ ౧ ॥ త్వద్గ్లానిదర్శనాదస్మాత్ ఖిన్నంచమమమానసం । నైవనివృత్తిమాయాతి త్వామనుద్ధృత్యదుఃఖితాం ॥ ౨ ॥ పాతకంచతివాత్యుగ్రం యోనిత్రయవిపాకదం । నైవాల్పైఃక్షీయతేపుణ్యైః ప్రేతత్వంచాతిగర్హితం ॥ ౩ ॥ తస్మాదాజన్మజనితం యన్మయాకార్తికవ్రతం । తత్పుణ్యస్యార్ధభాగేన సద్గతిస్త్వమవాప్నుయాత్ ॥ ౪ ॥ కార్తికవ్రతపుణ్యేన నసామ్యంయాంతిసర్వథా । యజ్ఞదానానితీర్థాని వ్రతాన్యపితతోధ్రువం ॥ ౫ ॥ * ॥ ముద్గలఉవాచ—ఇత్యుక్త్వాధర్మదత్తోసౌ యావత్తామభ్యషేచయత్ । తులసీమిశ్రతోయేన శ్రావయన్ద్వాదశాక్షరం ॥ ౬ ॥ తావత్ప్రేతత్వనిర్ముక్తా జ్వలదగ్నిశిఖోపమా । దివ్యరూపధరాజాతా లావణ్యేనయథోర్వశీ ॥ ౭ ॥ తతస్సాదండవద్భూమౌ ప్రణనామయథాద్విజం । ఉవాచసాతదావాక్యం హర్షగద్గదభాషిణీ ॥ ౮ ॥ * ॥ కలహోవాచ—త్వత్ప్రసాదాద్ద్విజశ్రేష్ఠ విముక్తానిరయాదహం । పాపాబ్ధౌమజ్జమానాయా స్త్వంనౌభూతోసిమేధ్రువం ॥ ౯ ॥ * ॥ ముద్గలఉవాచ—ఇత్థంసావదతీవిప్రం దదర్శాయాంతమంబరాత్ । విమానంసుందరంయుక్తం విష్ణురూపధరైర్గణైః ॥ ౧౦ ॥ అథసాతద్విమానస్థై ర్విమానేచాధిరోపితా । పుణ్యశీలసుశీలాద్యై రప్సరోగణసేవితా ॥ ౧౧ ॥ తద్విమా

శ్వర్య దుఃఖంబులనంది యందువలన కరుణించి బడలి చిత్తచాంచల్యమునొంది, కొంతసేపు చక్కగా ధ్యానించి దుఃఖముతో మంచిమాటల నిట్లననెను॥*॥ ... ... ॥*॥౪॥*

### కార్తికమాస శ్రీవిష్ణువ్రత మహిమ.

“తీర్థాటనముచేతను దానధర్మములచేతను వ్రతాచరణలచేతను తపస్సుచేతను పాపములు పరిహరించుచున్నవి. ప్రేతదేహము నవలంబించిన నీకు వాటిని చేయుట కధికారము లేదు. నీకష్టమునుచూచి నామనంబు నొచ్చుచున్నది. దుఃఖించుచుండు నిన్ను విడనాడితే సంతోషము కలుగజాలదు. నీయొక్క జన్మత్రయానుభవము నిచ్చు పాపమైననూ మిక్కిలి భయంకరమయినది. నింద్యమైన నీప్రేతత్వంబు అల్పపుణ్యములచేత పోచాలదు. కాబట్టి నేను పుట్టినది మొదలుకొని యాచరించుచు వచ్చిన కార్తిక వ్రతముయొక్క మహాపుణ్యమున అర్ధభాగముచేత సద్గతి నొందుదువుగాక. యజ్ఞ దానవ్రతాదు లేవియును కార్తిక వ్రతపుణ్యమునకు సాటికాచాలదు.” అని చెప్పి, ధర్మదత్తుండు ఆకలహకు తులసీ మిశ్రజలములచే ద్వాదశాక్షర మంత్రమును వినుపించుచు నభిషేకము చేసెను. అంత నది ప్రేతత్వమునువదలి అగ్ని జ్వాలాతుల్యంబయిన దివ్యదేహమునొంది సౌందర్యమున నూర్వశికి సమానయయ్యె. పిదప నది ధర్మధత్తునకు దండ ప్రణామ మొనరించి, ఆనంద తుందిలయై గద్గదస్వరమున “బ్రాహ్మణోత్తముండా, నీప్రసాదమువలన నేను నరకమునుండి యుద్ధరింపఁబడితిని. దురితవారిధిలో మునిగిన నాకు నీవు నౌకవలె నొప్పుచుందువు.” అని సంస్తుతించుచుండగా, విష్ణురూపధరులగు గణములచే విరాజించుచుండు విమానం బొకటివచ్చెను. సుందరంబగు నా విమానమునందున్నవారు పుణ్యశీల సుశీ

నంతదా పశ్య ద్ధర్మదత్తస్సవిస్మయః । పపాతదండవద్భూమౌ దృష్ట్వాతౌ పుణ్యరూపిణౌ ॥ ౧౨ ॥ పుణ్యశీలసుశీలాభ్యాం సముత్థాప్యగతంద్విజం । సమభ్యనందయన్వాణీం ప్రోచతుర్ధర్మసంయుతాం॥ ౧౩॥ *॥ గణావూచతుః— సాధుసాధుద్విజశ్రేష్ఠ యస్త్వంవిష్ణురతస్సదా । దీనానుకంపీధర్మజ్ఞోవిష్ణువ్రతపరాయణః ॥ ౧౪ ॥ ఆబాల్యాత్త్వయాహ్యేతద్యత్కృతంకార్తికవ్రతం । తవతస్యార్ధదానేన పుణ్యంద్విగుణ్యమాగతం॥ ౧౫ ॥ త్వత్పుణ్యస్యార్ధభాగేన యదస్యాఃపూర్వకర్మజం । హరిజాగరణాద్యైశ్చ విమానమిదమాగతం॥ ౧౬॥ వైకుంఠం నీయతేసద్యో నానాభోగయుతాత్వియం । దీపదానభవైఃపుణ్యై స్తేజసంరూపమాశ్రితా॥ ౧౭ ॥ తులసీపూజనాద్యైశ్చ కార్తికవ్రతజైశ్శుభైః । విష్ణుసాన్నిధ్యగాజాతా త్వయాదత్తైఃకృపానిధే ॥ ౧౯ ॥ త్వమప్యస్యభవస్యాంతే భార్యయాసహయాస్యసి । వైకుంఠభువనంవిష్ణో స్సాన్నిధ్యంచసరూపతాం॥ ౨౦॥ తేధన్యాఃకృతపుణ్యాస్తే తేషాంచసఫలోభవః। యైర్భక్త్యారాధితోవిష్ణుర్ధర్మదత్తత్వయాయథా॥ ౨౧ ॥ సమ్యగారాధితోవిష్ణుః కింనయచ్ఛతిదేహినాం । ఔత్తానపాదిర్యేనైవ ధ్రువత్వేస్థాపితఃపురా॥ ౨౨॥ యన్నామస్మరణాదేవ దేహినోయాంతిసద్గతిం । గ్రాహగ్రహీతోనాగేంద్రో యన్నామస్మరణాత్పురా॥ ౨౩॥ విముక్తస్సన్నిధింప్రాప్తో జాతోయంజయసంజ్ఞకః । గ్రాహోయంవిజయోనామ్నా శ్రీవిష్ణోశ్చింతనాదభూత్ ॥ ౨౪ ॥ యతస్త్వయార్చితోవిష్ణు స్తత్సాన్నిధ్యంప్రయాస్యసి । బహూ

---

లాదులు ఈకలహాను దానిమీఁద నెక్కించుకొనిరి. అప్సరసలచే సేవింపఁబడుదానిని చూచి దర్మదత్తుఁడు విస్మయమునొంది, ఆపుణ్యాత్ములకు సాష్టాంగముగా ప్రణమించెను. ఆవెనుక నాపుణ్యశీల సుశీలలు ధర్మధత్తుని లేవనెత్తి యిట్లు చెప్పుచున్నారు;—మంచిది; మంచిది; మహాబ్రాహ్మణుఁడా, నారాయణ పరాయణుఁడును దీనులయెడ దయగలవాఁడును ధర్మజ్ఞుఁడును విష్ణువ్రతరతుఁడును అయిన నీవు బాల్యప్రభృతిగా నాచరించిన కార్తిక వ్రతపుణ్యమున నర్ధము నిచ్చినందున నది ద్విగుణముగా నీమెకు పుణ్యబలమునిచ్చి యీమెయొక్క వెనుకటి నూరు జన్మముల పాపములనుగూడ పోగొట్టి రక్షించినది. ఈమె యనుభవింపదగిన జన్మత్రయ పరిపాకము పరిహారమయ్యె. మంత్రోదక స్నానముచేతనే పాపముపోయె. విష్ణు జాగరణాదులచే విమానంబు వచ్చినది. నానావైభవములతో నీమెను వైకుంఠమునకు తీసికొనిపోవుచున్నాము. దీపదాన మహిమవలన తేజోరూపంబుగల్గినది. కార్తిక వ్రతమునందలి తులసీ పూజనాదుల చేత వైకుంఠమున విష్ణు సాన్నిధ్యము లభించినది. కరుణాకరుఁడై కార్తికమాస పూజాఫలదానముచేసిన నీవును ఈజన్మాంతమున సతితోడ శ్రీవిష్ణు సాన్నిధ్య సారూప్యముక్తి నొందగలవు. ధర్మధత్తుఁడా, నీవలె భక్తితో విష్ణువ్రతము నాచరించిన మహానుభావుల జన్మమే సఫలము, వారే ధన్యులు. చక్కఁగా నారాయణుని సేవించినవారికి దుర్లభం బేమిగలదు? ఉత్తానపాదుని కొడుకు విష్ణుధ్యానముచే ధ్రువపదము నొందలేదా? ఆ శ్రీమన్నారాయణ నామ పారయణంబు ననే గజేంద్రుండైయుండి ముక్తినొందినట్టి యీ జయుఁడనువాఁడుగను, నక్రంబుగానుండి

న్యష్టసహస్రాణి భార్యాద్వయయుతస్యతే ॥ ౨౫ ॥ తతఃపుణ్యక్షయేజాతే యదాయాస్యసిభూతలం । సూర్యవంశోద్భవోరాజా విఖ్యాతస్త్వంభవిష్యసి ॥ ౨౬ ॥ నామ్నాదశరథస్తత్రభార్యాద్వయయుతఃపునః । తృతీయేయంతదాభార్యా పుణ్యస్యైవార్ధభాగినీ ॥ ౨౭ ॥ కలహాకైకయీనామ్నా భవిష్యతినసంశయః । తత్రాపితవసాన్నిధ్యం విష్ణుర్దాస్యతిభూతలే॥ ౨౮॥ ఆత్మానంతవపుత్రస్తే ప్రకల్ప్యామరకార్యకృత్ । రామనామ్నారావణాదీన్ హత్వారాజ్యంకరిష్యతి ॥ ౨౯ ॥ తవాజన్మవ్రతాదస్మాద్విష్ణుసంతుష్టికారణాత్ । నయజ్ఞానచదానాని నతీర్థాన్యధికానివై॥3౦॥ అతస్త్వమగ్రేపిధర్మజ్ఞ నిత్యంవిష్ణువ్రతేస్థితః । త్యక్తమాత్సర్యదంభోపి భవస్వసమదర్శనః ॥ 3౧ ॥ కార్తికేమాధవే మాఘే చైత్రేమాసచతుష్టయే । ప్రత్యబ్దంత్వంధర్మదత్త ప్రాతఃస్నాయీసదాభవ ॥ 3౨ ॥ ఏకాదశీవ్రతేతిష్ఠ తులసీవనపాలకః । బ్రాహ్మణానపిగాశ్చాపి వైష్ణవాంశ్చసదాభజ ॥ 33 ॥ మసూరికాశ్చారనాలం వృంతాకాదీనిఖాదమా । ఏవంత్వమపిదేహాంతే తద్విష్ణోఃపరమంపదం॥ 3౪ ॥ ప్రాప్స్యతిధర్మదత్తత్వం తద్భక్త్యేవయథావయం । పుణ్యశీలసుశీలాఖ్యౌ జయశ్చవిజయస్తథా॥ 3౫ ॥ ధన్యోసివిప్రాగ్ర్యయతస్త్వ యైతద్వ్రతంకృతంతుష్టికరంజగద్గురోః । యదర్ధభాగాత్సఫలాస్మరారేః ప్రణీయతేస్మాభిరియంసలోకతాం ॥ 3౬ ॥ ముద్గలఉవాచ—ఇత్థంతౌధర్మద

ముక్తినందినట్టి యీవిజయుఁడను వాఁడుగను, ఇప్పుడు పుణ్యశీల సుశీల నామధేయంబులు గలవారమై యున్నారము. దేహధారులకు విష్ణు నామస్మరణంబే శరణంబై సద్గతి నిచ్చుచున్నది. నీవు పిదప పుణ్యక్షయానంతరంబున దశరథుఁడను పేరుగల సూర్యవంశపురాజుగా నవతరించుచున్నావు. నీకిరువురు భార్యలుందురు. నీయొక్క పుణ్యార్ధ భాగినియగు నీమె కలహాయనునది కైకయియను మూఁడవభార్యగానుండును. ఇందుకు సంశయము లేదు. అప్పుడును భూమిలో నీకు శ్రీహరి సాన్నిధ్యము నిచ్చుచుండును. దేవకార్య నిర్వాహమునకై శ్రీవిష్ణువు రామనామంబైన పుత్రుఁడుగాపుట్టి రావణాదులను జంపి రాజ్యమేలును. ధర్మదత్తుఁడా, నీ కార్తిక విష్ణువ్రత ప్రభావమింతగా నున్నది. మహానుభావా, ఏతీర్థములును దీనికి సాటిగావు, ఏయజ్ఞములును ఇందుకు సరిగాదు, ఏదానములును దీని కీడుగాదు. కాబట్టి యింకమీఁదను విష్ణు వ్రతమునందే సుస్థిరుఁడై యుండుము. మదమాత్సర్య దంభాదులను వదలి సమదర్శినుండగుము. కార్తికము వైశాఖము మాఖము చైత్రము అనునీ నాల్గునెలలలో ప్రతి వత్సరంబునను నీవు ప్రాతః స్నానము నాచరింపుము. తులసీకాననమును కాపాడుచు నేకాదశీవ్రతము ననుష్ఠింపుము. బ్రాహ్మణులను గోవులను విష్ణుభక్తులను పూజింపుము. చిరుసెనగలను ఆరనాలంబును వంకాయలను తినవలదు. ఇట్లుండి మావలె నీవు దేహాంతమున శ్రీవిష్ణు పరమపదము నొందుదువుగాక. విప్రవర్యా ఏనీయొక్క వ్రతార్ధఫలముచే నీమెను విష్ణులోకమునకు పిలచికొనిపోదుమో అట్టి నీవే ధన్యుఁడవు. నీవే నారాయణవ్రతము నాచరించిన ధీరుఁడవు. అని యిట్లుపదేశించి యా పుణ్యశీల సుశీలులు కలహతోడ వైకుంఠమునకు జనిరి. ధర్మదత్తుండును అట్లే యావ్రతము

త్రంత ఋషదిశ్యవిమానగా । తయాశలహయాసార్ధం వైకుంఠభువనంగతా ॥ ౩౭ ॥ ధర్మదత్తోఽప్యసౌరాజా తత్ప్ర స్తద్ద్వితేస్థితః । దేహాంతేపరమంస్థానం భార్యాభ్యామన్వితోఽభ్యగాత్ ॥ ౩౮ ॥ బహూన్యబ్దసహస్రాణి స్థిత్వావై కుంఠసద్మని । తతఃపుణ్యక్షయేజాతే జాతోఽసిత్వంనృపోమహాన్ ॥ ౩౯ ॥ దారైస్త్రిభిర్దశరథ స్తేవిష్ణుఃపుత్రతాంగతః । రామోయంలక్ష్మణశ్శేషో భరతోబ్జారిశత్రుహా ॥౪౦॥ ఏవంసర్వంమయాఖ్యాతం యథాపృష్టంత్వయామమ । ధన్యస్త్వం యస్యతనయ స్సాక్షాన్నారాయణోఽభవత్ ॥ ౪౧ ॥ * ॥ శ్రీశివఉవాచ—ఇత్యుక్త్వానృపతింపూజ్య విససర్జమునిస్త దా । ఆలింగ్యరామంసౌమిత్రిం మేనేసాకృతకృత్యతాం ॥ ౪౨ ॥ తదారాజాస్వసైన్యేన మహాహర్షసమన్వితః । అ యోధ్యామగమద్రమ్యాం గోపురాట్టాలమండితాం ॥ ౪౩ ॥ నృపమాగతమాజ్ఞాయ మంత్రిణఃపురవాసినః । పతాక తోరణాద్యైశ్చ దివ్యచందనసేచనైః ॥ ౪౪ ॥ నగరీంభూషయిత్వాతే నృత్యవాద్యాదిమంగళైః । విన్యుఃకుటుంబస హితం రాజానంనగరీంప్రతి ॥ ౪౫ ॥ రామమాగతమాజ్ఞాయ గోపురాట్టాలపఙ్క్తిషు । కట్యాంనిధాయబాలాన్ స్వాన్ స్త్రియఃస్థిత్వానిజైఃకరైః ॥ ౪౬ ॥ సువర్ణకుసుమాద్యైశ్చ వవర్షుఃపుష్పవృష్టిభిః । కాశ్చిన్మార్గోపరిస్థిత్వా కుంభదీపాదిమంగళైః ॥ ౪౭ ॥ ఆర్తిక్యాదిభీరాజానం నరామంశాంతికారకైః । పూజయంతిస్మతాస్సర్వా రాజమార్గే పృథక్పృథక్ ॥ ౪౮ ॥ ఏవంనానాసముత్సాహై ర్నర్తనైర్వారయోషితాం । దుందుభీనాంనినాదైశ్చ గాయకా

---

నాచరించుచుండి దేహాంతమున తన సతులతోఁడ విష్ణులోకమునకుచేరెను. అనేక సహస్ర సంవత్సరంబులు వైకుంఠంబున నానందంబు నందుచుండి, పుణ్యక్షయముకాఁగా దశరథుఁడను వాఁడవై యిట్లు పుట్టితివి. నీయొక్క ముగ్వురు భార్యలలో శ్రీవిష్ణు పుత్రభావమునొందెను. ఈరా ముఁడే శ్రీవిష్ణువు, ఆదిశేషుండే లక్ష్మణుఁడు. శంఖచక్రములే భరతశత్రుఘ్నులు. మహారాజా, మహా విష్ణువు నీకొడుకగుటచే నీవే ధన్యుఁడవు. నీవడిగిన సంగతినంతయును చెప్పితిని. అని ముద్గలముని యిట్లు భూత భవిష్యద్వృత్తాంతములను నిరూపించి, దశరథుని సత్కరించి, శ్రీరామాదుల నాలింగించి పంపెను. పిదప దశరథమహారాజు మహాసైన్యములతోఁడ నందరిని పిలచికొని దివ్యా

**శ్రీరామాదులు మరల నయోధ్యకు వచ్చి చేరుట.**

లంకార యుక్తంబగు నయోధ్యకు చేరెను. మంత్రులువచ్చి సముచిత మర్యాదలతో నగర ప్రవేశమును కావించిరి. రాజమార్గమున రాముఁడువచ్చుట నెఱింగి గ్రామామణులు గోపు రాట్టాలకములనెక్కి లేతబిడ్డలను చంకలలో నెత్తుకొని కొందరును పుష్పవృష్టుల గురిపించుచు కొందరును వేడుకల జూచుచుండిరి. కొందరచ్చటచ్చట యంగనలు మంగళకుంభ దీపావళులచే మంగళారతులచే నారాధించుచుండిరి. ఇట్లు మహోత్సవంబులతోను మంగళవాద్య ఘోషంబులతోను వారాంగనా నర్తనంబులతోను గాయక గాయనంబులతోను గవాక్షముల నుండి సౌధాంతః పురస్త్రీలు సమర్పించుచుండు పుష్పవృష్టులతోను చామరా ద్యుపచారంబుల తోను వచ్చి నిజరాజ మందిరంబుల నలంకరించిరి. అంత దశరథమహారాజు జనకరాజుయొక్క మంత్రులను వస్త్రాలంకారాదులతో సత్కరించి భోజనాదులతో సంతోషం బొనరించి మిథి

నాంచ గాయనైః ॥ ౪౯॥ సౌధోద్ధృతగవాక్షైశ్చ స్త్రీముక్తపుష్పవృష్టిభిః । యయౌస్వశిబిరంరామో వీజ్యమానస్సుచామరైః ॥ ౫౦॥ తతస్తాన్ జనకామాత్యాన్ వస్త్రాలంకారవాహనైః । సత్కృత్య భోజనాద్యైశ్చ ప్రేషయామాస మైథిలం ॥ ౫౧ ॥ ఏవం సర్వేషూత్సవేషు జనకో వార్షికేషు సః । నినాయ మిథిలాం రామం మాతృభిః పార్థివేన చ ॥ ౫౨॥ ఉత్తరోత్తరతః పూజ్య తోషయామాస రాఘవం । రామోపి రమయామాస లీలాభిః నృపతిం తదా ॥ ౫౩॥ మాసైః షడ్భిర్జనకజా లక్ష్మీః శ్రీరాఘువాచ్ఛుభా । లగ్నే హ్యేకాదశే వర్షే రజోయుక్తా బభూవ హ ॥ ౫౪ ॥ తద్వార్తాం జనకశ్శ్రుత్వా పత్నీభిర్మంత్రిభిస్సహ । అయోధ్యామగమచ్ఛీఘ్రం రాజా ప్రహృష్టజ్జగామతం ॥ ౫౫॥ పరస్పరం సమాలింగ్య సాకేతమిథిలాధిపౌ । నృత్యవాద్యసముత్సాహైరయోధ్యాం వివిశతుస్సుఖం ॥ ౫౬ ॥ తతో మహాసముత్సాహైర్నానామంటపతోరణైః । కదలీస్తంభమాలాభిరిక్షుదండైస్సుచామరైః ॥ ౫౭ ॥ చతుర్ద్వారిమంటపైశ్చ ఘంటాఘోషైస్సదర్పణైః । కింకిణీజాలఘోషైశ్చ వితానైర్దీపరాజిభిః ॥ ౫౮ ॥ వసిష్ఠో మునిభిస్సార్ధం గర్భాధానవిధింశుభం । కారయామాస రామేణ సీతాయాశ్చాతిహర్షితః ॥ ౫౯ ॥ తదా వస్త్రైరలంకారైర్జనకో నృపతిం ముదా । పూజయామాస సస్త్రీకం స్నుషాపుత్రసమన్వితం ॥ ౬౦ ॥ మాసమేకమతిక్రమ్య యయౌ స్వనగరీం శుభం । రామోపి సీతయా సార్ధం నానాభోగాన్ సుపుష్కలాన్ ॥ ౬౧ ॥ బుభుజే హేమరత్నాది నిర్మితేషు గృహేషు సః । రుక్మమండన

లకుపంపెను. ఇట్లే సర్వోత్సవంబులకును శ్రీరామాదులను మిథిలాపురికి పిలపించికొని జనకరాజు రాజమాతలను దశరథరాజును ఆనందితాంతరంగులంజేసి యిట్లుత్తరోత్తరాభివృద్ధిగా నల్లుని సంతోషపరచుచుండెను. రాముండును లీలావినోదంబులతో రారాజించుచుండెను॥౫౩॥

శ్రీ సీతారామాదుల శోభనమహోత్సవము.

పిమ్మట నారుమాసములకు శ్రీరామునికన్నను చిన్నదియైన సీతమ్మ పదునొకండవయేట శుభలగ్నమున ప్రథమార్తవయయ్యె. ఆ శుభవార్తనువిని జనకుండు పత్నులతోడను మంత్రులతోడను పరివారముతోడను మరల నయోధ్యకువచ్చెను. దశరథుండు స్వాగతంబొనరింపగా నిరువురును పరస్పరాలింగనాదులచే సంతోషించి నిజవిభవంబులతోడ రాజమందిరంబుల నలంకరించిరి. పిదప నత్యంతమహోత్సవ విధవిధంబులగు మంటపంబులచేతను తోరణంబులచేతను అరటిచెట్లవరుసలచేతను చెరుకుజల్లవలచేతను చామరంబులచేతను నాలుగుదారుల పందిళ్లచేతను ఘంటానాదంబులచేతను అద్దములచేతను గజ్జెల సవ్వళ్లచేతను మంగళదీపావళులచేతను సాలంకృతంబగు రాజమందిరంబున వసిష్ఠుండు గర్భాధానశుభమహోత్సవమును శ్రీసీతారాములకు చేయించెను. అపుడు వస్త్రాలంకారంబులచే జనకుండు కొడుకు కోడల్లాండ్రతోడనున్న దశరథరాజును మిగుల సత్కరించెను. ఇట్లు సంతోషముగా నొకనెల యచ్చటనుండి మిథిలకు జనకుండు వెడలెను. శ్రీరాముండు సీతతోడ సంపూర్ణంబులైన విధవిధ భోగంబులను సువర్ణరత్నాలంకృతంబులగు మందిరంబులలో ననుభవించుచుండెను. స్వర్ణాలంకృతలగు దాసీజనులు సేవించుచుండిరి. ఇట్లే లక్ష్మణ భరత శత్రుఘ్నులకు వారివారి పుత్రులతోడ

యుక్తాభి ర్దాసీభిర్విజితస్సుఖం ॥ ౯౨ ॥ ఏవంతాసాంస్నుషసుత పత్నీనాంచపృథక్పృథక్ । యథాకాలేవిధానేషు గర్భాధానాదికేషుచ ॥ ౯౩ ॥ ఆగత్యజనకశ్చక్రే నానోత్సాహాన్ముదాన్వితః । అయోధ్యానగరీమధ్యే వాద్యఘోషో గృహేగృహే॥ ౯౪॥ మంగళానిచసర్వత్ర నకుత్రాప్యస్త్యమంగళం । నదరిద్రోఋణీనాసీన్నాధివ్యాధిప్రపీడితః॥ ౯౫॥ రామాదిభిశ్చతుర్భిస్తై ర్బంధుభి స్తదనంతరం । పృథగ్గేహేషుభార్యాభి ర్గార్హస్థ్యమధర్మనుష్ఠితం ॥౯౬॥ రామఃప్రాతస్సముత్థాయ కృతశౌచాదిసత్క్రియః । ఆరుహ్యశిబికాందివ్యాం స్నానార్థంసరయూంనదీం ॥ ౯౭ ॥ గత్వాకూలేవాహనాది విసృజ్యరఘునందనః । గచ్ఛంస్తస్యాఃపావనార్థం సరయ్వాఃపులినేముదా ॥ ౯౮ ॥ మంత్రిభి ర్వేష్టితోగత్వా నత్వాతాంసరయూంనదీం । స్నాత్వానిత్యవిధింకృత్వా బ్రాహ్మణైఃపరివారితః॥ ౯౯ ॥ దత్వాదానాన్యనేకాని గోభూధాన్యరసాదిభిః । సంపూజ్యసరయూంపుణ్యాం బ్రాహ్మణాన్ పూజ్యసాదరం ॥ ౧౦౦ ॥ యయౌరథంసమారుహ్య రుక్మబంధనబంధితం । రుక్మతంతురజ్జుభిశ్చ సర్వతఃపరివేష్టితం॥ ౧౦౧॥ పట్టకూలాదివస్త్రై ర్వరై రాచ్ఛాదితంశుభం । వాజినాహంసారథినా సుస్నాతేన ప్రచోదితం॥ ౧౦౨ ॥ కింకిణీవరమాలాభి ర్ఘంటాభిరతిగర్జితం। రుక్మదండధరైర్దూతై రగ్రేదర్శితసత్పథః॥ ౧౦౩ ॥ పథినీరాజితస్త్రీభి ర్వర్షితఃపుష్పవృష్టిభిః । ప్రాపస్వీయంగృహం

---

సముచితకాలంబులలో విధివిధానంబున నిషేకశాంతి శుభకర్మమహోత్సవంబులు జరిగెను. అప్పుడప్పుడును జనకుండువచ్చి పలుమహోత్సవంబులను కావించి సంతోషము నందుచుండెను. అయోధ్యానగరంబున నెచ్చటను మంగళవాద్యములు మ్రోగుచుండినవి. అన్నిచోట్లలోను శుభమహోత్సవంబులుతప్ప యమంగళప్రసక్తియే లేదు. ఆయూరిలో నొక్కడును దరిద్రుండు అప్పులుగలవాఁడు చింతాయుక్తుఁడు వ్యాధిబాధితుఁడును లేఁడు. ఇటుండ శ్రీరామలక్ష్మణ భరత శత్రుఘ్నులు నిజనిజబంధుపరివారంబులతోడ వెవ్వేరుగా దివ్యరాజమందిరంబులలో నానాభోగంబుల ననుభవించుచు తమతమ పత్నులతోడ గృహస్థాశ్రమధర్మంబుల ననుష్ఠించుచుండిరి॥౯౬॥ శ్రీరాముఁడు ప్రొద్దునలేచి శౌచాచారాదిక్రియలను తీర్చికొని దివ్యాందోళనము

శ్రీరాములవారి దినచర్యావర్ణనము.

నెక్కి స్నానమునకై సరయూనదికి వెడలి, తీరమున వాహనాదులనువదలి మంత్రులతోడ మాటలాడుచు నా నదికి పరిశుద్ధినిచ్చుటకై యిసుకదిబ్బలమీఁద కాలినడకతో ప్రవాహమువద్దికి పోయి, విప్రోత్తములచే పరివేష్టితుఁడై స్నానముచేసి నిత్యకర్మానుష్ఠానమునొనరించి, గో భూ తిల హిరణ్యాజ్య వాసో ధాన్య గుడ రౌప్య లవణాది నానాదానములనొసంగి,సరయూనదిని బ్రాహ్మణులను సాదరముగా సంపూజించి బంగారుగొలుసులచే శృంగారింపబడిన రథమునెక్కి, పట్టుబట్టలచేత స్వర్ణరజ్జువులచే నలంకరింపబడి దివ్యాశ్వములు కట్టబడి స్నానముచేసి మడిగట్టుకొనిన సారథిచేత నడుపఁబడుచుండు తద్రథమున వచ్చుచు, వెండికఱ్ఱలవారు బంగారుకఱ్ఱలవారు గెజ్జెలకంచుకులు మొదలైనవారిచే చూపఁబడెడు రాజమార్గమున నాగరికస్త్రీలచే

రాముః సూర్యకోటిసమప్రభం॥ ౨౪॥ అవరుహ్యరథాద్రామః పాదయోర్ధృత్యపాదుకే । వివేశసీతాసందత్త పాద్యార్ఘ్యాచమనోగ్గృహం॥ ౨౫ ॥ గత్వాగ్నిహోత్రశాలాయాం సీతయాఽఽసనసంస్థితః । అగ్నిహోత్రాదివిధినా వహ్నింహుత్వాతతఃపరం ॥౨౬॥ స్ఫటికస్యచలింగస్య కర్మమార్గైర్యథావిధి। లోకానాంశిక్షణార్థాయ కృత్వాపూజనముత్తమం ॥ ౨౭ ॥ జానక్యాదత్తపక్వాన్న నైవేద్యాదిసమర్ప్యచ । బ్రాహ్మణాన్పూజ్యదానాద్యైస్తోష్యలబ్ధ్వాతదాశిషః॥ ౨౮॥ తులసీంచమహాధేను మశ్వత్థంమునిపాదపం । పూజయిత్వారవిందేవం బ్రహ్మయజ్ఞంవిధాయచ॥ ౨౯॥ గురోర్ముఖాచ్చపౌరాణీం కథాంశ్రుత్వాతుసీతయా । గురుంపునఃప్రపూజ్యాథ బంధుభిఃపరివేష్టితః॥౩౦॥ ప్రార్థితశ్చముహుఃపత్న్యా బ్రాహ్మణైఃపరివారితః । నారికేళకపిత్థామ్ర కదళీజంబుదాడిమైః॥ ౩౧॥ ఖర్జూరికాపనసాద్యైః పక్వాన్నైర్ఘృతపాచితైః । ఉపహారంసుఖంకృత్వా తాంబూలంపరిగృహ్యచ ॥ ౩౨ ॥ దివ్యవస్త్రాణిసంగృహ్య దృష్ట్వాదర్శేనిజంముఖం । నిరీక్షితశ్చవైదేహ్యా రుహ్యస్యందనముత్తమం॥ ౩౩॥ వేష్టితోమంత్రిదూతాద్యైః స్తూర్యధ్వనిపురస్సరః । మాతృగేహంతతోగత్వా తాఃప్రణమ్యావనింగతః॥ ౩౪॥ సవ్యాంప్రదక్షిణాంకృత్వా గత్వారాజగృహంప్రతి । సింహాసనస్థంరాజానం నత్వాస్థిత్వాతదాజ్ఞయా॥ ౩౫ ॥ పౌరకార్యాణ్యనేకాని కృత్వా

పుష్పవృష్టుల గురిపించుచు రత్నారార్తికంబులనెత్తుచు సేవింపగా నిజమందిరంబున కేతెంచి, రథమునుండిదిగి పాదుకలఁదొడిగి జనకనందనచేత నివ్వబడినపాదార్ఘ్యాచమనంబులనందుచు నిజగృహంబున నగ్నిహోత్రశాలను ప్రవేశించి, పత్నితోడ శ్రీమదగ్నినాహుతులచే నారాధించి, లోకశిక్షకొఱకు విధివిధానంబుగా స్ఫటికలింగంబున శ్రీసాంబశంకరమూర్తి నారాధించి, సీతాదత్తనైవేద్యాదికములను సమర్పించి, దానంబులచే విప్రసంతుష్టినొనర్చి తదాశీర్వాదంబుల నంది, గోపూజనంబును అశ్వత్థవృక్షార్చనమును అతసీతుల స్యారాధనంబును కావించి, శ్రీసూర్యారాధనంజేసి, బ్రహ్మయజ్ఞ విధానానంతరంబు శ్రీవశిష్ఠమునులవారినుండి సీతతోడ పురాణ పుణ్యకథలనువిని వారిని సత్కరించి, తన బంధువులతోడ పరివృతుండై వినోద సల్లాపశీలుఁడగుచుండును. పిదప పత్నిచే పలుమారు ప్రార్థింపబడి దివ్యఫలములు దివ్యఘృత పక్వాన్నములుగల యుపహారమును భుజించి యథాసుఖంబుగా తాంబూలమును స్వీకరించి దివ్యవస్త్రంబుల నలంకరించుకొని దర్పణంబును దర్శించి, జానకీకటాక్షకవచితుండై రథము నెక్కి మంత్రిమాతాదులు పరివేష్టించియుండ మంగళవాద్యములతోడ మాతృశ్రీలవారి మందిరంబునకుజని తనతల్లులకు ప్రదక్షిణనమస్కారంబులంజేసి, యచ్లో తీర్థరూపులవారి రాజమందిరంబునకువచ్చి సింహాసనాసీనుండగు దశరథమహారాజును ప్రణమించి గొలుచుచు ఊరి వారిపనులను చక్కబరచి, రాజాజ్ఞనొంది అడుగడుగుకును తండ్రిని గౌరవించుచు నానావిభవంబులతోడ సముత్సాహ మహోత్సవంబున నిజమందిరంబునకు వచ్చును. పిదప జానకీదత్తంబులయిన అర్ఘ్యపాద్యాచమనాసనాదుల నాదరించి యామెతో నన్నిసంగతులను సరసహా

రాజ్ఞావిసర్జితః । యయౌస్యందనమాస్థాయ నృపంనత్వాపునఃపునః॥ ౮౬॥ తూర్యగీతవినాదైశ్చ నర్తనైర్వారయోషితాం । యయౌస్వీయంగృహంరామ స్స్యందనాదవరుహ్యచ ॥ ౮౭ ॥ భూమిజాదత్తపాద్యార్ఘ్యాచమనీయాసనాదికం । గృహీత్వాయద్బహిర్గత్వా కృతంతత్తాంన్యవేదయత్ ॥ ౮౮ ॥ సర్వంవృత్తంకౌతుకేన హాస్యగీతాదిమంగళైః । రమయిత్వాభూమికన్యాం దివ్యవస్త్రాదిభూషితాం॥ ౮౯॥ తతోమధ్యాహ్నసమయే సరయ్వాంవాథసద్మని। స్నాత్వామాధ్యాహ్నికంకర్మ చకారరఘునందనః॥ ౯౦ ॥ నిత్యంయత్రాకరోత్స్నానం సరయ్వాంనిర్మలేజలే । తదాఖ్యయాభవత్తీర్థం రామతీర్థమితిస్ఫుటం॥ ౯౧ ॥ తద్విఖ్యాతంత్రిభువనే చైత్రమాసివిశేషతః। మాధ్యాహ్నికంచ సంపాద్య బ్రాహ్మణైర్మంత్రిభిర్వృతైః॥ ౯౨॥ ఇష్టైస్సువర్ణపాత్రేషు త్రిపదాసుస్థితేషుచ । పరిష్కృతేషుజానక్యా సీతాయాగతిలాఘవాత్॥ ౯౩ ॥ క్వణత్కంకణమంజీర కింకిణీనూపురాదిషు । నదత్సుభోజనంచక్రే రాఘవోహర్షపూరితః॥ ౯౪॥ కరశుద్ధింవిధాయాథ భుక్త్వాతాంబూలముత్తమం । తతశ్శతపదంగత్వా నిద్రాంకృత్వాతుసీతయా॥ ౯౫॥ పునర్వస్త్రాణిసంగృహ్య లబ్ధ్వాశస్త్రాణిసాదరం । ధనుర్బాణౌకరేధృత్వా రథేస్థిత్వాథబంధుభిః । ౯౬ ॥ పుష్పారామోద్యానకాదీన్ దృష్ట్వాతుకౌతుకేనచ । వాద్యఘోషైర్నర్తకాద్యైర్గత్వాస్వీయంగృహంపునః ॥ ౯౭॥

స్వోక్తులచే నిరూపించుచు, సరయూనదిలోగాని నిజమందిరంబునగాని సుస్నాతుండయి మాధ్యాహ్నిక సత్కర్మల నాచరించును. ఇట్లు ప్రతినిత్యమును శ్రీరాముఁడు సరయూనదిలో నెచ్చటస్నానముచేసెనో అచ్చట యిప్పటికిని రామతీర్థంబని ప్రసిద్ధిగలదు. అది ముల్లోకములలోను విదితంబై చైత్రమాసమున విశేష ఫలదంబయినది. పిదప, మాధ్యాహ్నికానంతరము ఇష్టులు బ్రాహ్మణులు మంత్రులు కలిసి కూర్చుండి, ముక్కాలుపీటలమీఁద సువర్ణపాత్రంబులలో దివ్యపక్వాన్నములను కంకణ మంజీర కింకిణీ నూపురాద్యాభరణంబులయొక్క కలమధురధ్వనులచే నానందమొనరించుచు శ్రీసీతాదేవి వడ్డించుచుండ నారాఘవోత్తముండు సుఖభోజనం బొనరించి కరశుద్ధినొంది తాంబూలాలంకృతుండై శతపథచారియై సంతసించును. కొంతసేపు నిద్రించి పిదప నవనవాలంకార వస్త్రంబులచే నలంకృతుండై ధనుర్బాణపాణియై శస్త్రము లందీసికొని రథమునెక్కి సవిభవముగా వెడలి పుష్పారామంబులలోను ఉద్యానంబులలోను వనంబులలోను విహరించుచుండి, మరలమంగళవాద్య నర్తనాదులతోడ మందిరంబునకువచ్చును. పిదప సాయంకాల సంధ్యావందనాది సత్కర్మల నాచరించి సవిస్తరముగా నగ్నిదేవును పాసించి పరమేశ్వరు నారాధించి ఆహారాదుల నారగించి, దివ్యసౌధమునందు సువర్ణరత్నాలంకృతంబగు దివ్యపర్యంకంబున శ్రీరఘురాముండు సీతతోడ హాస్యగీతాది వినోదంబుల నందుచు సుఖనిద్రనొందును. ఇట్లే అత్యంతవిభవ మహోత్సవములచే పండ్రెండేండ్లు గతించి

దశరథునకు కౌసల్యయెదుట శ్రీరాముఁడు తత్త్వోపదేశము జేయుట.

నవి॥౧౦౦॥ ఒకానొకప్పుడు దశరథుఁడు ముద్గలముని వచనముల చేతను వసిష్ఠమునివాక్యములచే

సాయంసంధ్యాదిసంపా ద్యపునహూర్ణాత్వాసవిస్తరం । శంభుంభక్త్యాశ్రపునఃపూజ్య కృత్వాచైవోపహారకం ॥ ౯౮॥ రత్న కాంచనమాణిక్య నిర్మితేమంచకేవరే । దివ్యప్రాసాదమధ్యేస సీతయారఘునాయకః॥ ౯౯ ॥ హాస్యగీతవినోదాద్యైశ్శి ర్నిద్రాంచక్రేతతఃపరం। ఏవంనానాసముత్సాహై నిజనాయార్క సమాస్సుఖం॥౧౦౦॥ఏకదారాఘవంరాజాజ్ఞాత్వాముద్గలవాక్యతః । వసిష్ఠవాక్యతశ్చాపి చరిత్రైశ్చాప్యమానుషైః ॥ ౧ ॥ సాక్షాన్నారాయణంవిష్ణుం మత్వామహాయరహఃస్థితః । పప్రచ్ఛవినయేనైవ హృదిభావంవిధాయచ ॥౨॥ రామనారాయణస్త్వంహి భూభారహరణాయచ । మత్తోజాతోసీతిలోకా వదంత్యజ్ఞానబుద్ధయః ॥ 3 ॥ అతఃపృచ్ఛామితేరామమాయయామోహితస్తవ। కించిత్ జ్ఞానోపదేశేన నాశయాజ్ఞానజాంమతిం॥ ౪॥ దారాపత్యగృహాద్యేషు స్థితానైవోపశామ్యతి।తత్పితుర్వచనం శ్రుత్వా రాజానంరాఘవోబ్రవీత్॥ ౫॥ శ్రీరామఉవాచ—శ్రుణురాజన్ప్రవక్ష్యామి తవజ్ఞానార్థముత్తమం। శ్రుణోతుమమమాతేయం కౌసల్యాపితవప్రియా ॥ ౬ ॥ నశ్వరంభాసతేచైత ద్విశ్వంమాయోద్భవంనృప । యథాశుక్తౌరౌప్యభాసః కాచభూమ్యాంజలస్యచ॥ ౭॥ యథారజ్జౌసర్పభాసో మృగతోయేజలస్పృహా । తద్వదాత్మనిభాసోయం కల్ప్యతేనశ్వరోబుధైః॥౮ ॥ అజ్ఞానదృష్టిభిర్నిత్యం మన్యతేనతుపండితైః । ఆత్మాశుద్ధోనిర్వ్యలీక స్సచ్చిదానందల

తను అమానుష కృత్యములచేతను శ్రీరాముఁడు సాక్షాన్నారాయణావతారంబేయని నెమ్మనంబున నమ్మి, శ్రీరాముని రహస్యప్రదేశమునకుపిలిచి సవినయముగా నిట్లనెను. “రామభద్రా నీవే నారాయణుఁడుగదా? భూభారహరణమునకైయవతరించిన మహానుభావుండు నీవేగావా? అజ్ఞానులగు లోకులు నీవు నావల్ల పుట్టితివని చెప్పెదరు. కాబట్టి మాయామోహితుండనైన నేను వేఁడుచున్నాను. కొంత జ్ఞానోపదేశమునొనరించి నాయజ్ఞానబుద్ధిని పరిహరింపుము. ఈ షణత్రయ బద్ధంబగు నీ సంసృతిలో విశ్రాంతి కలుగనేరదు. ఉద్ధరింపుము, శ్రీరామా” అని యడిగిన దశరథునితో. శ్రీరాముఁ డిట్లనెను. రాజా వినుము, నీకొరకు జ్ఞానమును నిరూపించుచున్నాను. నాతల్లియగు ఈ కౌసల్యగూడ వినని నశ్వరంబగు నీప్రపంచమంతయును ముత్తెపు చిప్పయందు వెండియును భ్రాంతితోఁచునట్లును, క్షారభూమిలో జలముతోఁచినట్లును, రజ్జువునందు సర్పభ్రాంతితోఁచునట్లును, ఎండమావులవో జలేచ్ఛగల్గినట్లును, ఈ యాత్మయందు మాయావిలసితంబై యున్నదను సంగతిని పండితులు తెలియగలరు. అజ్ఞానులు తెలియజాలరు. పండితులైననో ఇట్లు తెలిసికొందురు- నిస్పృహుఁడును పరిశుద్ధుఁడును ఆత్మ నిషేధాప్రతియోగి యైనందున సదాత్మకుండును స్వయంప్రకాశుండుగాన చిదాత్మకుండును ఆనందస్వరూపుండగుటచే నానందాత్మకుండునై సచ్చిదానందలక్షణుఁడని చెప్పబడుచుండును. అట్టి పరమాత్మయొక్క అంశాంశమువలన పరమేశ్వర బ్రహ్మాదులును మేమేమొదులుగాగల యందురును ప్రపంచ సృష్టిస్థితి సంహారకార్యంబులకై మాయవలన నానారూపంబుల నందియున్నారము. నాటకములోని నటాదిపాత్రవేషములను నటుఁడు ధరించినట్లు ఈ సగుణ బింబాకృతుల

క్షుణః॥ ౯॥ యస్యాంశాంశేనవిశ్వేశ బ్రహ్మాద్యాస్సకలావయం । స్థిత్యుత్పత్తివినాశార్థం నానారూపాణిమాయయా॥ ౧౦॥ ధార్యతేఽటవద్రాజన్ నతేష్వాసక్తఏవసః । యథాపద్మంనస్పృశతి జలంమాయాంతథామలః॥ ౧౧ ॥ ఆత్మానిత్యోనస్పృశతి పరమానందవిగ్రహః । దేహాగారసుతస్త్రీషు మామకేతిచయామతిః ॥ ౧౨ ॥ ఉపసంహృత్యబుద్ధ్యాసం న్యస్యబ్రహ్మణిచిద్ఘనే । యద్యత్కించిద్భాసతేఽత్ర తత్తన్నారాయణాత్మకం॥౧౩॥ పశ్యత్వంసర్వభావేన ముచ్యతేభవసంకటాత్ । సత్యంశౌచందయాశాంతిః క్షమాచేంద్రియనిగ్రహః॥ ౧౪ ॥ అహింసాభగవద్భక్తి ర్వేదమార్గానువర్తనం । ఇత్యాద్యాయేగుణారాజన్ తాన్భజస్వనిరంతరం॥ ౧౫ ॥ చౌర్యంద్యూతంవివాదంచ మాత్సర్యం దంభమేవచ । క్రౌర్యంలోభంభయంక్రోధం నింద్యకర్మప్రవర్తనం ॥ ౧౬ ॥ వేదవిప్రయతీనాంచ సాధూనాంమానభంగనం । నిందాపైశున్యమనిశం త్యజదూరంస్వతోనృప॥ ౧౭॥ పూర్వంత్వయాతపస్తప్తం పుత్రత్వంయాచితంమమ। తస్మాజ్జాతోఽస్మిత్వత్తోఽహం కౌసల్యాయాంనృపోత్తమ॥ ౧౮॥ యన్మయాకథితంచైత దజ్ఞానమలనాశనం। గోపనీయంప్రయత్నేన కథనీయంనకుత్రచిత్॥ ౧౯॥ తద్రామవచనంశ్రుత్వా గతమాయామలోనృపః। సద్భావపరిపూర్ణస్తు రోమాంచితవపుర్ధరః॥ ౨౦ ॥ ప్రణనామరాఘవస్య చరణౌ గాఢభావతః। తతోరామంపునఃప్రాహ పితరంనిర్మలా

నందుచుండును. వాటిలో నాసక్తుఁడుకాఁడు. నీళ్లు తామరనెట్లు అంటకయుండునో అట్లే ఆత్మమాయావలంబనములేక నిర్మలుఁడు నిత్యానందమూర్తియునై యున్నాఁడు. నీవు ఈ దేహగేహసుత సతులలో నాదియను బుద్ధినివదలి దేనియందును మమకారములేక, చిదాత్మకుఁడైన పరబ్రహ్మయందు సర్వభారమునునచి, సర్వభావముతో గోచరించువాటి నన్నిటిని నారాయణస్వరూపంబని పరిభావించుచుండుము. ఈసంసారక్లేశమునుండి తొలగుదువు. సత్యము సదాచారము కారుణ్యము శాంతి ఓర్పు జితేంద్రియత్వము అహింస దైవభక్తి వేదమార్గము నవలంబించియుండుట ఇత్యాదిగుణములను నిరంతరముగా నాశ్రయించియుండుము. రాజా, దొంగతనము జూదము వాక్కలహము మాత్సర్యము దంభము క్రూరత్వము క్రోధము భీరుత్వము లోభము దుష్కార్యముల నవలంబించుట వేదనింద బ్రాహ్మణనింద యతినింద సజ్జననింద పరదూషణము పిశునత్వము మొదలగువాటిని సర్వవిధములలోను సర్వకాలములలోను వదలుము. పూర్వము నీవు తపంబొనర్చి పుత్రత్వమును ప్రార్థించితివి. కాబట్టి నేను నీవలన కౌసల్యయం దవతరించితిని. యజ్ఞానపరిహారకంబగు నేను చెప్పిన ఈ విషయమును బలాత్కారముగా దాచిపెట్టుము. ఎచ్చటను చెప్పవలదు. ఇట్టి శ్రీరామవాక్యములునువిని దశరథుండు అజ్ఞాననివృత్తిని సుజ్ఞానప్రాప్తినొంది సద్భావముతో పులకితాంగుండై శ్రీరామ చరణంబులకు నమస్కరించెను. అందుకు రాముఁడు “రాజా, నీవిట్లు బిడ్డకు మ్రొక్కులను మాయచే చేయరాదు. నరవేషుండైన నాకిది హాస్యాస్పదముగానుండును. మనస్సులోనే సద్భావముచే నన్ను నిత్యము ఆరాధించుచుండుము. ఆదరముతో నాయందే మనస్సు

శయం॥ ౨౧॥ నేదంయోగ్యంత్వయారాజన్ వందనాదిశిశుంప్రతి। మాయయానరవేషస్య మమోపహాసకారణం॥ ౨౨॥ మనసైవచమాంనిత్యం భజభావేనసాదరం। మచ్చిత్తోమద్గతప్రాణో మయిభక్తిందృఢాంకురు॥ ౨౩॥ ఇత్యుక్త్వాపితరౌనత్వా గృహీత్వాజ్ఞాతయఃప్రభుః॥ యయౌరథసమారూఢ శ్రీరామస్స్వనికేతనం ॥ ౨౪ ॥ కదామాతుః గృహంగత్వా సీతయాభోజనంవ్యధాత్। కదాభ్రాతృగృహేష్వేవ కదాపక్త్యాపితుస్స్వయం॥ ౨౫॥ కదాదశరథంతాతం భోజనార్థంనిజంగృహం। భార్యాపుత్రాదిభిర్యుక్తం పౌరైర్విప్రైస్సమన్వితం ॥ ౨౬ ॥ ముదారామస్సమాహూయ భోజయామాససాదరం। శ్రీరామదర్శనార్థంతే తపోవననివాసినః ॥ ౨౭ ॥ అయోధ్యాంనగరీమేత్య ద్వారపౌరనిషేధితాః। శతశఃప్రత్యహంరామం దృష్ట్వాస్తుత్వాపునఃపునః॥ ౨౮॥ ఆతిథ్యంరఘునాథస్య గృహీత్వాతుష్టమానసాః। సప్తపంచదినాన్యేవ స్థిత్వాపుణ్యకథాదిభిః॥ ౨౯॥ రమయిత్వారమానాథం జగ్ముస్స్వంస్వంవరాశ్రమం। యత్రయత్రహిరామస్య ప్రీతింజ్ఞాత్వావిదేహజా॥ ౩౦ ॥ తత్తచ్చకారసాసాధ్వీ హాస్యక్రీడాసనాదికం। వివాహానంతరంరామ స్సమాద్వాదశసీతయా ॥౩౧॥ రమయామాససాకేతే మహాక్రీడాపురస్సరం। సహస్రవర్షైర్విజ్ఞేయం శ్రేష్ఠంవర్షంకృతేయుగే ॥ ౩౨ ॥ శతవర్షైశ్చత్రేతాయాం ద్వాపారేదశవర్షజం। కలేర్మానేనబోద్ధవ్యం శూన్య

గలవాఁడును నాయందే ప్రాణములుగలవాఁడును నాయందే దృఢభక్తిగలవాఁడును అగుము.” అని యిట్లు చెప్పి తలిదండ్రులను వందించి జ్ఞాతులను పిలిచికొని రథమునెక్కి నిజమందిరంబునకు వచ్చెను॥ ౧౨౪॥ ఎప్పుడు సీతతోడ శ్రీరాముఁడు తల్లిగారింటికి వెడలి

శ్రీరాములవారు లోకులతో నానందించుచుండుట.

భుజించును? ఎప్పుడు సోదరుల యిండ్లలో భుజించును? ఎప్పుడు తండ్రిగారి బంతిలో భుజించును? ఎప్పుడు తనయింటికి భోజనమునకై భార్యాపుత్రులతోడ పౌరులతోడ దశరథుని పిలిచికొని వచ్చును? అని వారువారు ప్రార్థింపవలసినట్లు సర్వజనాదరంబునకు నాశ్రితుండై రాముఁడు రారాజించుచుండెను. మఱియు, శ్రీరాఘవుఁడు సంతోషముతో నందరిని రప్పించి భోజనాది సత్కారములచే నాదరించుచుండెను. వనవాసులు రామదర్శనమునకై వచ్చి ద్వారములలో పౌరులచే నిషేధింపఁబడినను నూరారుమంది చూచి పలుమారుస్తుతించి రాఘవుఁడు చేయునాతిథ్యాదులచేనానందించి ఐదారుదినములచ్చటయుండి పుణ్యకథలచే పురుషోత్తమునికి సంతృప్తినిచ్చి తమతమయాశ్రమంబులకు బోవుచుండిరి. జానకీదేవి శ్రీరామునికి దేనియందు ప్రీతిగలదో దానినేనెరవేర్చుచు సరసహాస్య క్రీడనాదులతోడ నానందించుచుండెను. ఇట్లు శ్రీరాముండు వివాహానంతరము సీతాదేవితోడ ౧౨ సంవత్సరములు మహోత్సవంబుగా జరిపెను. శ్రేష్ఠవర్షంబు కృతయుగంబున వేయింతలుగాను త్రేతాయుగంబున నూరింతలుగాను ద్వాపరమునందు పదింతలుగాను కలియుగంబున సమంబుగాను మూఁడుపాదముల శూన్యహ్రాసమువలన తెలియునది. ఇట్లు దేవభోగంబులనందుచు శ్రీరాముఁడయోధ్యలో నుండున

హాని సా త్రివిక్రమాత్॥ ౩౩ ॥ ఏవం శ్రీరామచంద్రేణ భోగా... నృపా యస్మిన్ ఋతౌ చ యద్ద్రవ్యం ఫలపుష్పాదికం శుభం॥ ౩౪ ॥ తత్సర్వం సర్వదైవాసీ ద్రామే సాకేతసంస్థితే॥ ౧౯॥ సర్వైస్తు తత్ర తస్కరాణాం భయం నహి॥ ౩౫ ॥ భయం హింస్రాదికం నాసీ దయోధ్యావిషయే ప్రియే । యుధాజిద్ధూర్తి మత్కైకేయీ భ్రాతా భరతమాతులః ॥ ౩౬ ॥ వినాయ భరతం స్వీయ రాజ్యం శత్రుఘ్నసంయుతం । కౌతుకేన నృపేద్దృష్ట్వా కైకేయీం ప్రణిపత్య చ॥ ౩౭॥ ఏవం రామస్య మాంగల్యం బాలత్వేపి సుఖావహం । యే శృణ్వంతి నరా భక్త్యా న తేషామస్త్యమంగళం ॥ ౩౮॥ ఏవం యథా త్వయా పృష్టం తథా సర్వం మయోదితం । రామేణాచరితం యచ్చ నృణాం మాంగల్యదాయకం॥ ౩౯॥ ఏవం గిరీంద్రజే ప్రోక్తం బాలలీలాదికౌతుకం । రామచంద్రస్య సంక్షేపాత్తవ ప్రీత్యై సుఖావహం ॥౪౦॥*॥ ఇతి శ్రీశతకోటి రామచరితాంతర్గత శ్రీమదానంద రామాయణే వాల్మీకీయే బాలచరిత్రే సారకాండే శ్రీరామదినచర్యా వర్ణనం నామ పంచమస్సర్గః॥ ... ... ... ... ... ... ౫॥*॥

శ్రీశివ ఉవాచ—ఏవం త్రేతాయుగే రామం నగర్యాం సీతయా సుఖం । క్రీడంతం నారదోऽభ్యేత్య యయావాకాశవర్త్మనా॥ ౧॥ అథ రామో మునిం పూజ్య సీతయా లక్ష్మణేన చ । శుశ్రావ వచనం తస్య సురైర్విజ్ఞాపితం చ యత్॥ ౨॥ నిహత్య రావణం యుద్ధే తతో రాజ్యం కురుష్వహి । అంగీకృత్య రఘుశ్రేష్ఠస్తం మునిం విససర్జ యత్॥ ౩॥ అథ రా

పుడు ఆయా ఋతువులలో పూచిపండతగిన పుష్పఫలంబులు సార్వర్తుకంబులై యుండెను. అనావృష్టియును చోరభయమును హింస్రాదికభీతియును లేదు. కైకేయీసోదరుండును భరతుని మేనమామయును అయిన యుధాజిత్తు తనరాజ్యమునకు భరతశత్రుఘ్నులను కైకేయీదశరథులయాజ్ఞ నొంది ప్రణమించి పిలచికొనిపోయెను. ఇట్లు రామునియొక్క మంగళప్రదంబయిన దివ్యబాల్యచరిత్రంబు వినువారికెన్నటికిని అమంగళము కలుగనేరదు. ఓసి, పార్వతీ, నీవడిగిన శ్రీరాముని బాలలీలావినోదంబులను లోకులమేలుకొరకును నీప్రీతికొరకును చెప్పితిని. ... ౫॥

## శ్రీరాములకు నారదుఁడు దేవప్రార్థనను విన్నవించుట.

ఇట్లు శ్రీరాముఁడు సీతతో నగరంబున క్రీడించుచుండగా పండ్రెండవయేట నారదుండు గగనమునుండి యవతరించెను. సీతతోడను లక్ష్మణునితోడను రాముఁడా మునిని సత్కరించెను. పిదప, నతఁడు "రఘూత్తమా, దేవతలిట్లు విన్నవించుచున్నారు. రావణునిజంపిన పిదప రాజ్యము నేలవలయును" అని చెప్పెను. అందుకు రాముఁడు అంగీకరించి మునినంపించెను. అంత శ్రీరాముఁడు "దేవీ, మీమామ నాకు రాజ్యాభిషేకముజేయ దలచియున్నాఁడు. అందుకు నేను విఘ్నమును పుట్టించి లక్ష్మణునితోడ రావణాదులను చంపుటకై దండకవనమునకు వెడలుదును. నీవిచ్చటనే అత్తమామల సేవించుచుండుము." అనిన నందుకు సీత రాముని వందించి యింపుమాటల నిట్లు పలికెను. నాథా, నన్నుగూడ వనమునకు తీసికొనిపొమ్ము, ఇచ్చట మూడుకారణములు గలవు. నాచిన్ననాడు సత్యవచనుండైన బ్రాహ్మణుడొకఁడు నాచేతి

మో(బవీత్సీతాం మమరాజ్యాభిషే [illegible] స్తితత్రాహం విఘ్నముత్పాద్య దండకం ॥ ౪॥ గచ్ఛామిరావ ణాదీనాం వధార్థంలక్ష్మణేనచ । [illegible] ంవసాత్రత్వం కౌసల్యాం పార్థినంభజ ॥౫॥ తద్రామవచనంశ్రుత్వా ప్రణిపత్యరఘూత్తమం । ఉవాచ [illegible] ంవాక్యం వనంమాంత్వంనయప్రభో ॥ ౬॥ కారణాన్యత్రవైత్రీణి సంతితాని దామ్యహం । బాలత్వేకరరేఖాంమే దృష్ట్వాకశ్చిద్ద్విజాగ్రణీః ॥ ౭॥ వనప్రయాణంమామాహ భర్త్రాసహసత్యవాగ్ద్విజః పత్వద్యప్రయాణాన్తే దండకంహిత్వయాసహ ॥ ౮॥ అన్యత్స్వయంవరేపూర్వం సురానపిమయోదితం । యదాచా హాంతికంప్రాప్తః సజ్జితుంత్వంసభాంగతః ॥౯॥ చతుర్దశవత్సరాణి మునివృత్త్యనువర్తినీ । విచరిష్యామ్యరణ్యేహం ధనుస్సజ్జంకరోత్వయం ॥ ౧౦॥ తత్సత్యంకురుమద్వాక్యం ప్రయాణాద్దండకంత్వయా । అన్యచ్ఛ్రుతంమయాపూర్వం రామాయణమనుత్తమం ॥ ౧౧ ॥ తత్రసీతాంవినారామో నగతోస్తిహిదండకం । తస్మాత్త్వంమాంరఘు శ్రేష్ఠదండకంనేతుమర్హసి ॥ ౧౨॥ తత్సీతావచనంశ్రుత్వా తథాస్త్వితివచోబ్రవీత్ । విహస్యరాఘవ శ్శ్రీమాన్ సమాలింగ్యవిదేహజాం ॥ ౧౩॥ అథరాజాదశరథ శ్శ్రీరామాయాభిషేచనం । యౌవరాజ్యపదేకర్తు ముద్యుక్తః ప్రా హవైగురుం ॥ ౧౪॥ యౌవరాజ్యపదేరామ మభిషేక్తుంత్వమర్హసి । తద్రాజవచనంశ్రుత్వా గురుర్దశరథంనృపం ॥ ౧౫॥ కౌసల్యాగృహమానీయ బోధయామాసవైరహః । రాజన్ శృణుత్వంకౌసల్యా సుమిత్రేశ్రుణుతాంత్వమే ॥౧౬॥ రావణస్యవధార్థంహి రామస్త్వాద్దండకంవనం । గమిష్యతిలక్ష్మణేన సీతయాకైకయీవరాత్ ॥ ౧౭ ॥ తస్మాదజ్ఞాతవ

రేఖనుజూచి పతితోడ నీమెకు వనప్రయాణమగునని చెప్పియున్నాడు. శాస్త్రముతప్పునా? నాస్వయంవర సమయమున నీవు ధనుస్సునెక్కుబెట్టినప్పుడు "ఓదేవతలారా, రాముఁడే ఈ ధనుస్సును ఎక్కుబెట్టుని, అందుకై నేను మునివృత్తినవలంబించి ౧౪ వత్సరములు వనమున వసించెదను" అని ప్రతిజ్ఞజేసితిని. అది నెరవేరవలసినదిగదా? శ్రేష్ఠమైన రామాయణకథను నేను వినియున్నాను. అందులో సీతనువదలి రాముఁడు దండకకు వెడలినట్లులేదుగదా? ఈమూ డు కారణములంబట్టి నన్ను నీవు వెంటబెట్టికొని పోదగును. అనిన సీతమాటవిని నవ్వి యా లింగించి అట్లే కానిమ్మనెను॥ ౧౩॥ పిమ్మట దశరథుఁడును శ్రీరామునికి యౌవరాజ్యపట్టాభిషే

శ్రీరామపట్టాభిషేక ప్రయత్నము.

కముజేయదలచి, వసిష్ఠులను "మీరు రామునికి పట్టాభిషేకము జేయదగుదురు" అని ప్రార్థిం చెను. అందుకాముని రాజును కౌసల్యామందిరంబునకు పిలిచికొని రహస్యమున "రాజా విను ము; కౌసల్యా సుమిత్రలారా, వినుడు; కైకేయీవరమువలన రావణాదులను సంహరించుటకై శ్రీరాముఁడు రేపు సీతను లక్ష్మణునివెంట తీసికొని దండకవనమునకు పోవుచున్నాడు. కాబట్టి తెలియనివానివలె అభిషేకసంభారములను ఊరక చేయింపుము. సుమంత్రునిచే రాజులను పి లుపింపుము, రాజా, రామవిరహమువలన బ్రాహ్మణశాపమువలనను త్వరగానే నీవు స్వర్గలోక మునకు పోదువు. ఈ కౌసల్య మరల రామరాజ్యోత్సవమును చూచుగాక. నీవును విమానం

త్తూష్ణీం సంభారానభిషేచితుం । తారా ... మంత్రిణ సహ ... నృపాదికాన్॥ ౧౭॥ శ్రీరామవివాహోద్రా జన్ బ్రాహ్మణస్యాపిశాపతః । అచిరాదేవస్వర్లోకం త్వంగమిష్యసిపార్థివ॥ ౧౯॥ కౌశల్యేయంరామరాజ్యో త్సవం పశ్యతువై పునః । అంతరిక్షాద్విమానస్థ స్త్వంపశ్యసిమహోత్సవం॥ ౨౦॥ దుర్లంఘ్యాభావినీరేఖా బ్రహ్మాదీనాంనృ పోత్తమ । ఇతిశ్రుత్వాగురోర్వాక్యం తేనరాజాసభాంయయౌ॥ ౨౧॥ రామరాజ్యాభిషేకాయ సంభారానకరోన్ము దా । దూతైరాకారయామాస నృపాన్ దశరథ స్తదా॥ ౨౨॥ ఋషీశ్వరాస్సమాజగ్ముః నానాశ్రమనివాసినః । నగ రీంశోభయామాసుః దూతాశ్చిత్రధ్వజోత్తమైః॥ ౨౩॥ పతాకాభిస్తోరణైశ్చ హేమకుంభైర్మనోరమైః । గురురా జ్ఞాపయామాస సుమంత్రంనృపమంత్రిణాం ॥౨౪॥ శ్వఃప్రభాతేమధ్యకక్షే కన్యకాస్స్వర్ణభూషితాః । తిష్ఠంతుషో డశగజాః స్వర్ణరత్నాదిభూషితాః॥ ౨౫॥ చతుర్దంతస్సమాయాతు ఐరావతకులోద్భవః । నానాతీర్థోదకైఃపూర్ణాః స్వర్ణకుంభాస్సహస్రశః ॥ ౨౬ ॥ స్థాప్యతాంతత్రవైయాఘ్రి చర్మాణిత్రీణిచానయ । శ్వేతచ్ఛత్రంరత్నదండ ముక్తా మణివిరాజితం ॥ ౨౭ ॥ దివ్యమాల్యానివస్త్రాణి దివ్యాన్యాభరణానిచ । మునయస్సంస్కృతా స్తత్ర తిష్ఠంతుకుశ పాణయః॥ ౨౮ ॥ నర్తక్యోవారముఖ్యాశ్చ గాయకావైదికా స్తథా । నానావాద్యత్రకుశలా వాదయంతునృపాంగ ణే॥ ౨౯॥ హస్త్యశ్వరథపాదాతా బహిస్తిష్ఠంతుసాయుధాః । నగరేయానితిష్ఠంతి దేవతాయతనానిచ॥ ౩౦॥ తే షుప్రవర్తతాంపూజా నానాబలిభిరాదృతాః । రాజానశ్శీఘ్రమాయాంతు నానోపాయనపాణయః॥ ౩౧॥ ఇత్యాది

బుననుండి చూతువు. భవిష్యద్రేఖ బ్రహ్మాదులకు తప్పక యనుభవింపవలసినది." అని యుప దేశించినపిదప దశరథుఁడు సభకువెడలి రామ రాజ్యాభిషేకమునకు సంభారములనన్నిటిని చే యించెను. దూతలనంపి రాజులను పిలిపించెను. ఋషులు దయచేసిరి. పట్టణంబు దివ్యాలం కారములతో కండ్లపండుగగానుండెను. అపుడు వసిష్ఠుఁడు సుమంత్రునితో "రేపు ప్రొద్దున మధ్యకక్షలో సువర్ణాలంకృతలగు కన్యకలుండుగాక. స్వర్ణరత్నాలంకృత గజంబులు ౧౬ వచ్చు గాక. ఐరావత కులజనుయిన చతుర్దంతంబును తీసికొనిరండి. సమస్తతీర్థంబులపుణ్యజలంబులు తెప్పింపబడని, పులిచర్మములు మూడుకావలయును. రత్నదండమును ముత్యముల జాలర్లను గల శ్వేతచ్ఛత్రంబును దివ్య కుసుమమాలికలను దివ్య వస్త్రంబులను దివ్యాభరణం బులను సిద్ధపరచవలయును. సమిత్కుశపాణులై మునులు సిద్ధముగా నుండదగును. మంగళవాద్యములు మ్రోగుచుండని చతురంగసైన్యము సాయుధముగా వచ్చినిలవని. ఊరిలోని దేవాలయంబులలో పూజోత్సవంబులు జరుగని. కప్పముల నప్పగించుటకు రాజులు సర్వసిద్ధులుగా నుండవలయును" అని యాజ్ఞాపించి రథమునెక్కి శ్రీరాముని వద్దికివచ్చి సర్వవృత్తంబును నివేదించి "రామ్ముఁడా, రేపు నీవు దండకమునకు వెడలుదువు. ౧౪ సంవత్సరము లచ్చటయుండి రావణుని సంహరించి సీతతోడ లక్ష్మణునితోడ మరలవచ్చి రాజ్యమునేలెదవు. లోకరీతి ననుసరించి తండ్రిమాటను వినుము. నేడు సీతతోడ యథావి ధిగా నుపవాసవ్రతము నాచరింపుము. జితేంద్రియుఁడై భూశాయిగానుండుము." ఇట్లు చెప్పి

శ్యవసిష్ఠస్తు రథేనరఘునందనం । గత్వాసంమానితస్తేన సర్వంవృత్తంన్యవేదయత్॥ ౩౨॥ నిమిత్తమాత్రస్త్వంరామ శ్వోగమిష్యసిదండకాః । చతుర్దశసమాస్తత్ర స్థిత్వాసంవ్యాప్త్యరావణం॥ ౩౩॥ బంధునాసీతయాసార్థం తతోరాజ్యంకరిష్యసి । లౌకికీంవృత్తిమాలంబ్య స్వీకురుష్వాపిభువః ॥ ౩౪ ॥ అద్యత్వంసీతయాసార్థ ముపవాసంయథావిధి । కృత్వాకుచిర్యామికాయాం భవరామజితేంద్రియః॥ ౩౫॥ ఇత్యుక్త్వారథమారుహ్య దృష్ట్వారామంసలక్ష్మణం। జానకీంచాపిసగురు ర్యయౌరాజగృహంపునః॥ ౩౬ ॥ కౌసల్యాచసుమిత్రాతే రామరాజ్యాభిషేచనం । నృపాపిశ్రుత్వా శ్రీగురో రాస్యాత్ స్నేహసమన్వితే॥ ౩౭ ॥ చక్రతుఃపూజనందేవ్యా స్తద్విఘ్నోపశమస్పృహే । బలిదానైశ్శాంతిపాఠై ర్మునివృందసమన్వితే ॥ ౩౮ ॥ అథాపరాహ్ణేసౌధస్థా దాస్యాఃపుత్రీతుమంథరా । శోభితాంనాగరీందృష్ట్వా పృష్ట్వావృద్ధాంపథిస్థితాం॥ ౩౯॥ శ్రుత్వాశ్రీరామరాజ్యార్థం యయౌవేగేనకైకయీం । సర్వంవృత్తంనివేద్యాథ తూష్ణీమాసీత్తదాక్షణం॥ ౪౦ ॥ తచ్ఛ్రుత్వాకైకయీచాపి తస్మైభూషణమర్పయత్। ఏతస్మిన్నంతరేవాణ్యా దేవవాక్యాత్సుమోహితా॥ ౪౧॥ తుష్టాందృష్ట్వాతుకైకేయీం భర్త్సయంత్యాహతాంపునః । మూఢేకథంత్వంతుష్టాసి హతభాగ్యాసివేద్మ్యహం॥ ౪౨॥ రామేరాజ్యపదంప్రాప్తే కౌసల్యాయాశ్చకైకయి । దాసీభవిష్యసిత్వంహి అతోమద్వచనంకురు ॥ ౪౩ ॥ వరేణన్యాసభూతేన రాజ్యంశ్రీభరతాయహి । నృపంప్రార్థయరామస్య ద్వితీయేనవరేణచ॥ ౪౪॥ దండకారణ్యగమనం చతుర్దశసమాఃపదా । క్రోధాగారంప్రవిశ్యాద్య కురుష్వయన్మయేరితం॥ ౪౫ ॥ తన్మంథ

శ్రీసీతారామ లక్ష్మణులనుచూచి తనయింటికి వెడలెను. కౌసల్యాసుమిత్రలు వసిష్ఠులవారి నుండి రామరాజ్యాభిషేకము దబ్బరయని విని అనుతాపముగల్గి విఘ్నశాంతికై మునులచేత శాంతికర్మలను చేయించి దేవినారాధించిరి॥౩౮॥ పిదప, అపరాహ్ణసమయమున సౌధాంతః

కైకేయీ వరదానముచే శ్రీరామాదుల దండకారణ్యయాత్ర.

పురమునుండి దాసీపుత్రియగు మంథర రాజమార్గములోని మహోత్సవంబులచే దారిలోని ముసలిదానివలన రామపట్టాభిషేకమునువిని త్వరగా కైకేయివద్దికివచ్చి సంగతులనన్నిటిని చెప్పి కొంతసేపూరకయుండెను. అదివిని కేకేయియును ఆభరణంబును పారితోషకంబునిచ్చెను. అంతలో దేవవాక్యమువలన వాణివలన మోహింపఁబడినదియగు కైకేయినిచూచి మంథర ధిక్కరించుచు నిట్లనియె. మూఢురాలా, ఏలనీవు సంతోషించుచున్నావు? దురదృష్టురాలవయితివి. నేనెఱుఁగుదును. రాముఁడు రాజ్యమేలుచుండునపుడు కౌసల్యకు నీవుదాసివైయుందువుగదా? కైకేయి, కాబట్టి నామాటవినుము. నీకు చెప్పియుండు వరముల ననుసరించి, భరతునికి రాజ్యంబును రాముడు కాలినడకతో ౧౪ సంవత్సరములు దండకారణ్యవాసిచుగుటను రెండువరములుగా పతిని ప్రార్థింపుము. ఇప్పుడే క్రోధసౌధము నెక్కుము. నేనుచెప్పినట్లు చేయుము. అనినమంథరా వాక్యములను కైకేయి విని యొప్పుకొనెను. శ్రీరామదేవేచ్ఛచే కైకేయిసి అవివేక మావరించెను. అంతనారాత్రి యామె కోపాగరమున నున్నదని తెలిసి దశరథుఁడు త్వరగా నచ్చటికి జని, వెంట్రుకలు కెదురుకొని అలంకారమునువదలి నేలమీఁద

రోక్తంస్వహితం మత్వాసాపితథాకరోత్ । మోహితాసాఽవివేకేన శ్రీరాఘవసురేచ్ఛయా॥౪౬॥ తతోనిశాయాం రాజ్ఞాసా జ్ఞాతా క్రోధగృహస్థితా । గత్వాతత్రనృపశ్శుభ్రాం దదర్శకైకయీంతదా॥ ౪౭॥ వికీర్యమాణకేశాంతాం త్యక్తాలంకారమండనాం । భూమౌశయానాంతాందృష్ట్వా జ్ఞాత్వాతస్యామనోగతం ॥ ౪౮ ॥ రామాయదండకారణ్యం యౌవరాజ్యంసుతాయచ । వరాభ్యాంయాచితంజ్ఞాత్వా హేత్యుక్త్వామూర్ఛితోభవత్ ॥ ౪౯ ॥ ప్రభాతేతత్సుమిత్రేణ వృత్తంశ్రుత్వానృపంయయౌ । కైకేయీమంత్రిణాపృష్టా సుమంత్రంప్రాహసాతదా ॥ ౫౦ ॥ అత్రానయస్వ శ్రీరామం ద్రష్టుంతంవాంఛతేనృపః । సోప్యాహరామంనృపతి మపృష్ట్వానానయామ్యహం॥ ౫౧ ॥ తదాశశాసనృపః ప్రాహ శీఘ్రమానయరాఘవం । సుమంత్రోప్యానయామాస రాఘవంపార్థివాజ్ఞయా॥ ౫౨ ॥ తతోరామోనృపం గత్వా శ్రుత్వాకైకేయుజాగిరా । ఆత్మానందండకేవాసం వరదానంపితుఃపురా॥ ౫౩ ॥ తథేత్యంగీచకారాథ నృపం। వచనమబ్రవీత్ । మాతేశోకోస్తుహేతాత వ్యాహంగచ్ఛామి దండకాన్ ॥ ౫౪ ॥ తద్రామవచనంశ్రుత్వా హేత్యుక్త్వాతంనృపోబ్రవీత్ । మాంవిసృజ్యకథంఘోరం విపినంగంతుమిచ్ఛసి॥ ౫౫ ॥ తస్యతద్వచనంశ్రుత్వా సాంత్వయామాసరాఘవః । అహం ప్రతిజ్ఞాం సంతీర్య శీఘ్రంయాస్యామితంపురం॥ ౫౬ ॥ ఇదానీంగంతుమిచ్ఛామి త్వత్సుమాతుశ్చవాంఛయా । మాతరంచసమాశ్వాస్య హ్యానుసీయచజానకీం॥ ౫౭ ॥ ఆగత్యపాదౌవందిత్వా తవయాస్యేసుఖంవనం ఇత్యుక్త్వాతౌపరిక్రమ్య మాతరంద్రష్టుమాయయౌ ॥౫౮॥ నత్వాస్వమాతరంరామ స్సమాశ్వాస్యపునఃపునః । నత్వా

---

బడియుండు సతినిచూచి, రామునికి దండకారణ్యమును భరతునికి యౌవరాజ్యమును రెండు వరములుగా నిచ్చుటయను తన్మనోభావము నెఱింగి, హా యని మూర్ఛితుండాయెను. తెల్లవారగానే సుమంత్ర మంత్రి యచ్చటికివెడలి ఏమిసంగతియని కైకేయి నడుగగా, ఆమె శ్రీరాము నిచ్చటికి పిలిచికొనిరమ్ము. దశరథుఁడు చూడదలచుచున్నాడనెను. అందుకతఁడు రాజు నడుగక నేను పిలచికొనిరానసెను. అపుడు తిన్నగా నృపుఁడు శ్రీరాము నిచ్చటికి గొనిరమ్మని యందలించెను. సుమంత్రుఁడు రాజాజ్ఞ నెరవేర్చెను. పిదప శ్రీరాముఁ డచ్చటికివచ్చి కైకేయీ వచనములవలన తనకు దండకారణ్యవాసము పూర్వము తండ్రియిచ్చిన వరముగా నేర్పడిన సంగతినెఱిఁగి, అట్లేగానిమ్మని యంగీకరించి "తండ్రీ నీవు చింతింపవలదు, నేను దండకారణ్యమునకు పోవుచున్నాను" అనిచెప్పెను. అందుకు దశరథుఁడు హాహాకారముజేయుచు "రామభద్రా, ఎట్లు నన్నువదలి ఘోరారణ్యమునకు పోదలఁచుచున్నావు?" అనినంత శ్రీరాముఁడు "నేను ప్రతిజ్ఞను నెరవేర్చి త్వరలో పట్టణమునకు వచ్చుచున్నాను, ఇపుడు వెడలదలఁచెదను. తల్లియిచ్ఛ సఫలమగుగాక. నాతల్లిని సమాధానపరచి సీతను తీసికొనివచ్చి నీచరణములకు మ్రొక్కి, సుఖముగా వనమునకు పోవుచున్నాను" అని తండ్రితో సాంత్వవచనంబులనాడి; వెంటనే కౌసల్యామందిరంబునకేతెంచి తల్లిపాదములకు మ్రొక్కి మరలమరల సమాధానంబులనుచెప్పి యెట్లో ఒప్పించి యనుజ్ఞవడసి ప్రదక్షిణ నమస్కారములనొనర్చి నిజమందిరంబునకు

ప్రదక్షిణాఃకృత్వా తామామంత్ర్యయయౌగృహం॥ ౫౯॥ సవనవృత్తాంతుసీతాంస కథయామాసరాఘవః। సీతయా లక్ష్మణేనాపి వనంగంతుంపునఃపునః॥౬౦॥ ప్రార్థితశ్చతథేత్యుక్త్వా త్వరయామాసతౌపునః। సర్వస్వంబ్రాహ్మణాన్ దత్వా సీతయాగ్నిసమన్వితః ॥ ౬౧ ॥ పద్భ్యామేవవినిర్యాతో యయౌరామోనృపాంతికం। గచ్ఛంతంపథిశ్రీ రామం పద్భ్యాంద్దృష్ట్వాపురౌకసః॥ ౬౨ ॥ పరస్పరేణతేవృత్తం శ్రుత్వావ్యాకులమానసాః। బభూవుస్తాన్ వామదేవః కథయామాసపాదరాత్॥౬౩॥నారదాగమనంరామప్రతిజ్ఞాం రావణస్యచ। వధాదికంసవిస్తారం విష్ణుంమనుజరూపిణం ॥౬౪॥ పౌరాశ్శ్రుత్వాగతక్లేశా వ్యాభూవన్పథిసంస్థితాః। తతోఽసత్వాన్నృపంరామః కైకేయీంవాక్యమబ్రవీత్॥ ౬౫॥ అంబాగతోఽహంవిపినం గంతుమాజ్ఞాందదస్వమాం। తతస్సావల్కలాదీని దదౌరామాదికాంస్తదా ॥౬౬॥ రామస్తాన్పరిధాయాథ స్వయంసీతాంసమీక్షయత్। తందృష్ట్వాకైకయీం ప్రాహగురుఃక్రోధేనభర్త్సయన్॥ ౬౭॥ జడే పాపినిదుర్వృత్తే రామఏవత్వయావృతః। వనవాసాయదుష్టేత్వం సీతాయై కింప్రదాస్యసి॥౬౮॥ ఇత్యుక్త్వాదివ్యవస్త్రాణిసీతాయైసగురుర్దదౌ। రాజాదశరథోఽప్యాహ సుమంత్రంరథమానయ॥ ౬౯॥ రథమారుహ్యగచ్ఛంతు వనం వనచరప్రియాః। రామఃప్రదక్షిణంకృత్వా పితరౌరథమారుహత్॥ ౭౦॥ సీతయాలక్ష్మణేనాథ మోదయామాససారథిం। కౌసల్యాంచ సుమిత్రాంచ తాతమాశ్వాస్య వైపునః॥ ౭౧॥ సమాశ్వాస్య జనాన్ రామస్తమసా తీరమాయయౌ। మాఘమాసేసితే పక్షే పంచమ్యాంపరమేహని॥ ౭౨॥ ప్రాప్తేహ్యష్టాదశేవర్షే రాఘవాయమహాత్మనే। ఆసీద్వనప్రయాణంహి స్వపుర్యాస్తమసాతటం॥ ౭౩॥ ఇంద్రాద్యానిర్జరాశ్చక్రుస్తదాతస్మాగ్గసత్క్రియాం।ఆసన్

వచ్చి సీతకు నడచినసమాచారములను తెలిపెను. సీతయును లక్ష్మణుఁడును మేమును వనమునకు వెంబడించి వచ్చెదమని పలుమారు ప్రార్థింపబడిన రఘురాముఁడు అయిన త్వరపడుడని యాజ్ఞాపించి, తనసొమ్మంతయును బ్రాహ్మణులకు పంచిపెట్టి సీతతోడ నగ్నిహోత్ర సమన్వితుండై లక్ష్మణుడు వెంబడించుచుండగా దశరథరాజుసన్నిధి కేతెంచెను. కాలినడకతో వచ్చుచుంచు రామునిజూచి పౌరజనులు తమలో నొండొరులు సంగతిని మాటలాడుకొని దుఃఖంపసాగిరి. అపుడు వామదేవుఁడు వారికి నారదాగమనమును రామప్రతిజ్ఞను భవిష్యద్రావణవధాదికార్యములను నారాయణుఁడే శ్రీరామనాముఁడగు నరుఁడుగా నవతరించుటను గూడ తెలిపెను. అదివిని వారు సమాధానమునొంది దారిలోనిలచి చూచుచుండిరి. అంత నా కైకతో "తల్లీ, అరణ్యయాత్రకు అనుజ్ఞనిమ్ము" అని శ్రీరాముఁడు వేడగా; ఆమె నారుబట్టలు మొదలైనవాటిని రామాదులకిచ్చెను. రాఘవుండు వాటిని తాను కట్టుకొని సీతనుచూచెను. ఆస్థితినెఱింగి వసిష్ఠుండు క్రుద్ధుండై "పాపినియగు కైకేయి, నీవు మిక్కిలి దుష్టస్వభావముగలది, నీవు రామవనవాసమును వరముగానడిగితివి, సీతకేల వల్కలాదుల నిచ్చెదవు?" అని తిరస్కరించి, జానకీదేవిని దివ్యవస్త్రంబులచే పురస్కరించెను. దశరథుండును సుమంత్రునితో "రథమును తీసికొనిరమ్ము వనచరప్రియులగు వీరు రథారూఢులై యరణ్యమునకు వెడలని" అని

శుభాశ్చశకునా రామస్య ప్రవ్రజతో వనం ॥ ౨౪ ॥ ఉషిత్వైకాం నిశాం తత్ర శృంగబేరంపురం యయౌ । గుహేన సమానితశ్చాపి తత్ర రాత్రిం నినాయ సః ॥ ౨౫ ॥ కషాయీతైర్వటక్షీరైర్బబంధ రాఘవో జటాం । ప్రభాతే సీతయారుహ్య నౌకాయాం లక్ష్మణేన సః ॥ ౨౬ ॥ ప్రేషయామాస సరథం సుమంత్రం నగరీం ప్రతి । గుహస్తాం వాహయామాస నౌకాం స్వజ్ఞాతిభిస్తదా ॥ ౨౭ ॥ గంగామధ్యగతా గంగాం ప్రార్థయామాస జానకీ । దేవి గంగే నమస్తేస్తు నివృత్తా వనవాసతః ॥ ౨౮ ॥ రామేణ సహితాహం త్వాం లక్ష్మణేన చ పూజయే । సురామాంసోపహారైశ్చ నానాబలిభిరాదృతా ॥ ౨౯ ॥ ఇత్యుక్త్వా పరకూలం తు గత్వా రామో గుహం తదా । విసర్జయిత్వా తత్రైకాం నిశాం నీత్వా శనైశ్శనైః ॥ ౩౦ ॥ భరద్వాజాశ్రమం గత్వా తత్స్థా తేనాతి పూజితః । తతః ప్రయాగే యమునాం తీర్త్వా న త్వా మహావనం ॥ ౩౧ ॥ వాల్మీకేరాశ్రమం గత్వా తత్స్థా తేనాతిమానితః । చిత్రకూటే లక్ష్మణేన పర్ణశాలాం మనోరమాం ॥ ౩౨ ॥ కృత్వా మాంసైర్మృగోద్భూతైః బలిం దత్వా రఘూత్తమః । తత్స్థా తత్ర సుఖం భ్రాత్రా సీతయా స్వగృహే యథా ॥ ౩౩ ॥ శయనాసనపాకాగ్నిదేవాదీనాం పృథక్పృథక్ । తత్రాసన్ వివిధాశ్శాలాస్తరువల్లీవిరాజితాః ॥ ౩౪ ॥ కందైర్మూలైర్వనోద్భూతైస్త్వగమాంసఫలాదిభిః । మునీశ్వరాణామాతిథ్యం చక్రుస్తే స్వగృహే యథా ॥ ౩౫ ॥ ఏకదా నిద్రితం రామం సీతాంకే సన్నిరీక్ష్య చ । ఐంద్రకాకస్తదాగత్య నఖాగ్రైస్తుండేన చాసకృత్ ॥ ౩౬ ॥ సీతాం కు

## శ్రీరామాదులయొక్క అరణ్యప్రయాణము.

యాజ్ఞాపించెను శ్రీరాముఁడు పితృవులకు ప్రదక్షిణనమస్కారములుజేసి సీతతోడను లక్ష్మణునితోడను రథమునెక్కి సారథిని వెడలమని కౌసల్యకును సుమిత్రకును తండ్రికిని పలుమారు సమాధానములను చెప్పి జనులకు సమాధానము చెప్పుచు తమసానదీతీరమునకు వచ్చెను. మహాత్ముండగు శ్రీరామునికి వివాహానంతరము ౧౨వ సంవత్సరము వచ్చుచుండఁగా మాఘశుక్ల పంచమినాఁడు అయోధ్యనుండి తమసాతీరమునకు వచ్చుట సిద్ధించినది. ఇంద్రాది దేవతలు ఆమార్గ సత్కారమునొనర్చిరి. రాముఁడు వనమునకు వెడలుచుండఁగా శుభశకునంబు లయి

## శ్రీరామాదులు గుహునిచేపూజింపబడి గంగదాఁటి మునిపూజితులగుట.

నవి॥౨౪॥ ఇట్లు వెడలిన శ్రీరామాదులు తమసాతీరమున నొకరాత్రియుండి, శృంగబేరపురమునకు వెడలి, యచ్చట గుహునివలన సత్కరింపఁబడి యచ్చటగూడ నొకరాత్రిగడచి, గుహునిచేత తేబడిన మఱ్ఱిపాలుచే జడగట్టుకొనెను. ప్రొద్దునలేచి శ్రీరాఘవుఁడుఁ సీతయును లక్ష్మణుఁడును అనుయాయులుగానుండ నావనెక్కి, సుమంత్రుని సరథునిగా నయోధ్యకంపెను. గుహుఁడు తనవారితోడ నా నావనునడిపెను. గంగనడుమ జానకీదేవి "గంగాభగవతి,నీకునమస్కారము, నేను వనవాసమునుండి నివృత్తయైవచ్చునపుడు నిన్ను సురామాంసఫలాహారాద్యుపహారములచే శ్రీరామలక్ష్మణులతోడ నారాధించెదను."అని జాహ్నవిని ప్రార్థించెను. శ్రీరాముఁడు ఆవలి గట్టునెక్కి గుహునివదలి, అచ్చట నొకరాత్రి వాసముచేసి తిన్నతిన్నగా భరద్వాజాశ్రమమును చేరి యామునిచే సత్కరింపఁబడెను. పిదప ప్రయాగలో యమునానదినిదాటి ప్రణమించి, వా

స్తంభ్యదుంర క్తంవిదదారామిషాశయా।నిద్రాభంగభయాద్భర్తుస్సీతియానని వారితః॥౫౭॥సీతాంగుష్ఠంతుకాకేనభిన్నం దృష్ట్వారఘూత్తమః।అభిద్రవంతంర క్తాస్యమిషీకాస్త్రేముమోచసః॥౫౮॥కేనాప్యరక్షితస్యాస్త్రాద్భియాబ్రహ్మాండగోలకేస్వంశరణమాగతప్త స్యపుపర్నాదరవాక్యతః॥౫౯॥ఇషీకాస్త్రేణకాకస్యబిభేదనయనంక్షణాత్। ఏవంనానాకౌతుకానికుర్వంస్తస్థౌసుఖంప్రభుః ॥౬౦॥ సుమంత్రోపిపురీంగత్వానృపంవృత్తంన్యవేదయత్। సోపిరామారామేతిజల్పన్స్వంజీవితంజహౌ ॥౬౧॥ నృపంమృతంగురుర్జ్ఞాత్వాతైలద్రోణ్యాంనిధాయతం। యుధాజిన్నగరాద్దూతైః కైకేయ్యాస్తనయావుభౌ ॥౬౨॥ఆనాయయామాసభరతశత్రుఘ్నౌవేగతస్తదా। తావుభావపివేగేనస్వాంపురీంసంవివేశతుః ॥౬౩॥మాత్రాసంపాదితంకృత్యంజ్ఞాత్వాధిక్కృత్యమాతరం। భరతః పితరంవహ్నౌదదౌసరయూసైకతే ॥౬౪॥ వీరాణాంమాతరస్తాశ్చజగ్ముర్నస్వామినాదివం। పితురుత్తరకార్యాదికర్తకృత్వాసవిస్తరం ॥౬౫॥ మంథరాంతాడయామాసమాతురగ్రేపునఃపునః। ప్రార్థితోప్యభిషేకార్థంరాజ్యమంగీచకారన ॥౬౬॥ తతోమంత్రిజనైస్సార్ధంమాతృభిఃపురవాసిభిః। పరివర్తయితుంరామంయయౌసభరతస్తదా ॥౬౭॥ గుహేనమానితశ్చాపిభరద్వాజాశ్రమంయయౌ। తపోబలేనభూస్వర్గంనిర్మాయభరతంమునిః ॥౬౮॥ ససైన్యంపూజయామాసతంనత్వాభర

---

ర్శ్యాశ్రమంబగు మహావనంబునకువచ్చి యామునీంద్రునిచే గౌరవింపఁ బడుచుండెను ॥౫౬॥

చిత్రకూటములో నైంద్రకాకాక్షిభేదనము.

లక్ష్మణుఁడు మనోహరంబగు పర్ణశాలను కల్పింపగా నందులో సీతారాములు మృగమాంసాద్యుపహారములనంది పంచబ్రహ్మ యజ్ఞంబులచే బలిప్రదానంబొనర్చి లక్ష్మణునితోడ నిజగృహంబుననున్నట్లే సుఖమందుచుండిరి. అచ్చట పడగటిల్లు ఓలగపుచావడి వంటయిల్లు అగ్న్యాయతనంబు దేవాయతనంబు స్నానగృహము మొదలయినవి వెవ్వేరుగా శాలలు తరులతలతో బరగుచుండినవి. తనయింటిలో నిచ్చినట్లే మునీంద్రులకు కందమూలఫలాది దివ్యవన్య వస్తువులచే శ్రీరామాదులు ఆతిథ్యసత్కారము నిచ్చుచుండిరి. ఒకానొకప్పుడు సీతతొడమీఁద రాముఁడు నిద్రబోవుచుండగా ఐంద్రకాక మొకటివచ్చి గోళ్లచేతను ముక్కుచేతను సీతయొక్క మృదుళారుణాంగుష్ఠమును మాంసేచ్ఛచేత పలుమారుచీల్చెను. పతికి నిద్రాభంగమగునని ఆ సతిదాని నివారింపలేదు. అంత రాముఁడు మేల్కొని చూచి, వెరచి పరుగెత్తుచున్న యా మొత్తమూతి కాకిమీఁద నిషీకాస్త్రమును ప్రయోగించెను. అది బ్రహ్మాండమున నెచ్చటను శరణమునెఱుఁగక మరణభీతితో శ్రీరామచరణమునే శరణమనెను. ప్రసన్నరాఘవుఁడు నయ్యిషీకాస్త్రముచే నైంద్రకాకాక్షిని ఛేదించెను. ఇట్లే అనేకాశ్చర్యకార్యములను నెరవేర్చుచు మహాప్రభువగు శ్రీరామచంద్రుఁడు సుఖంబుండెను ॥౬౦॥ అచ్చట సుమంత్రుఁడు పోయి నడ

శ్రీరాముఁడు భరతునికి పాదుకలనిచ్చి యనుగ్రహించుట.

చినసంగతిని దశరథునికి విన్నవించెను. ఆరేడును రామరామయని జీవితమునువిడిచెను. వసి

తోపి సః । మునిసందర్శితపథా చిత్రకూటే గజంయయా ॥౯౯॥ దృష్ట్వా రామం తుశాలాయాం సీతయా బంధునాన్వితం। నత్వా తేనాలింగితశ్చ సర్వం వృత్తం న్యవేదయత్ ॥౧౦౦॥ రామశ్శ్రుత్వా మృతం తాతం గత్వా మందాకినీం నదీం । స్నాత్వా తిలాంజలిం దత్వా యయౌ శాలాం సబాంధవః ॥౧॥ తతస్తం ప్రార్థయామాస భరతో గురుణా సహ । రాజ్యార్థం రాఘవశ్చాపి నేత్యువాచ పునః పునః ॥౨॥ ప్రాయోపవేశనం తత్ర దర్భేషు భరతస్తదా। చకార నిగ్రహం తస్య జ్ఞాత్వా గురుమచోదయత్ ॥ ౩ ॥ రామాజ్ఞయా గురుశ్చాపి భరతం బోధయత్తదా । భూభారహరణార్థాయ విష్ణుస్సాక్షాజ్జనార్దనః॥ ౪ ॥ అత్రజాతోస్తి దేవానాం వచనాద్రావణాదికాన్ । హంతుం గచ్ఛతి రామోద్య మా త్వం విగ్రహమాచర ॥ ౫ ॥ తజ్జ్ఞాత్వా హరిం రామం భరతో రామమబ్రవీత్ ।రాజ్యార్థం పాదుకే దేహి తయోస్సేవాం కరోమ్యహం ॥౬॥ జటావల్కలధారీ చ వసామి నగరాద్బహిః । ప్రతీక్షాంతవరాజేంద్ర వర్షాణి చ చతుర్దశ ॥ ౭ ॥ కృత్వా చతుర్దశే వర్షే పూర్ణే నగస్త్వేరవాత్వహం । ప్రవేక్ష్యామ్యనలం రామ సత్యమేతద్వచో మమ ॥౮॥ తత్తస్య వచనం శ్రుత్వా తథేత్యుక్త్వా రఘూత్తమః । రాజ్యార్థం స్వీయపదయోః పాదుకే రత్నభూషితే॥ ౯ ॥ దదౌ రామస్తదా తస్మై తతస్తం సవిసర్జయత్ । గృహీత్వా పాదుకే దివ్యే భరతో రత్నభూషితే ॥౧౦॥ మస్తకోపరి తే బధ్వా కృతకృత్యమమన్యత । తతో నత్వా రఘుశ్రేష్ఠం పరి

ష్ఠుఁడు రాజమృతి నెఱింగి తైలఘటమున శవమునుదాచి, యుధాజిత్పట్టణమునకు దూతలనంపి త్వరగా భరతశత్రుఘ్నులను పిలిపించెను. వారును వేగమే తమపురమునకువచ్చిరి. అంత భరతుఁడు తల్లిచే తేబడిన దుష్కృత్యము నెఱిఁగి తల్లిని తిరస్కరించుచు సరయూతీరమున తండ్రి కగ్నినిచ్చెను. ఆవీరమాతలు పతితోడ పరలోకయాత్ర జేయకయుండిరి. భరతుండు సవిస్తరముగా తండ్రి యుత్తరక్రియలను నెరవేర్చి, తల్లియెదుట మంథరను మరలమరల పడగొట్టుచుండెను. అందరును రాజ్యాభిషేకమునకై మిక్కిలి ప్రార్థించినను భరతుఁ డంగీకరింపక మంత్రులను తల్లులను నాగరికులను వెంటతీసికొని శ్రీరాముని నరణ్యావాసమునుండి మరలింప వలయునని వెడలి గుహునిచే గౌరవింపఁబడి భరద్వాజాశ్రమమునకు వచ్చెను. ఆమునీంద్రుఁడు తన తపోబలమువలన భూస్వర్గమును నిర్మించి సైన్యములతోడ భరతుని సత్కరించెను. అంత నాకైకేయీతనయుఁడు వారినివందించి వారిచేచూపబడిన మార్గము ననుసరించి చిత్రకూటమునకేతెంచి పర్ణశాలలో లక్ష్మణునిచే సీతచే గొల్వఁబడుచుండు శ్రీరామునిజూచి నమస్కరించి రామాలింగనమునొంది సర్వవృత్తాంతమును విన్నవించెను. రఘురాముండు మహాగురుమరణ వార్తవిని మందాకినికివెడలి స్నానముజేసి తిలాంజలినిచ్చి, తనయొక్క కొండమీఁది యాశ్రమమునకువచ్చెను. పిదప భరతుఁడు వసిష్ఠులతోడ పూజ్యుఁడా రాజ్యము నేలుమని రాఘవుని నత్యంతప్రీతితో ప్రార్థించెను. రాముండును వలదువలదని నిరాకరించుచుండెను. అందుకు భరతుఁడు అచ్చటనే దర్భలుపరచుకొని ప్రాయోపవేశనము నొనర్చెను. ఆబలాత్కారము నెఱింగి శ్రీరాముఁడు వసిష్ఠులను ప్రేరించెను. వారు రామాజ్ఞచేత భరతునికి

క్రమ్యపునః పునః ॥౧౧॥ సైన్యైః సమాతృభిశ్శీఘ్రం రామమామంత్ర్య సోయయౌ । సంప్రార్థయత్కైకయీ సా రామచంద్రం పునః పునః ॥ ౧౨ ॥ మయాపరాధితం రామ తత్క్షంతవ్యం రఘూత్తమ । తామాహ రామచంద్రోపి నత్వయా మేపరాధితం ॥ ॥౧౩ ॥ మచ్ఛందాన్మంథరావాక్యాత్త్వం వాణ్యా మోహితా తదా । సుఖం గచ్ఛాంబ స్వపురీం న క్రోధోస్తి మమ త్వయి ౧౪ ॥ ఇత్యుక్తా రామచంద్రేణ భరతేనన్యవర్తత । భరతః పూర్వమార్గేణ యయౌ స్వనగరీం ముదా ॥ ౧౫ ॥ సర్వాన్సం స్థాప్య నగర్యాం సు నందిగ్రామమకల్పయత్ । తత్రాప భరత స్తత్ర స్థాప్య సింహాసనోపరి ॥ ౧౬ ॥ రామస్య పాదుకే దివ్యే ఫలమూలాశనః స్వయం । రాజకార్యాణి యావంతి సర్వాణి పృథివీపతేః ॥౧౭॥ తాని పాదుకయోస్సమ్యఙ్నివేదయతి రాఘవః ॥ గణయన్దివసాన్యేవ రామాగమనకాంక్షయా ॥౧౮॥ స్థితో రామార్పితమనాః పాపభ్రష్టాముని ర్యథా । రామోపి చిత్రకూటాద్రౌ వసన్మునిభిరాదృతః ॥ ౧౯॥ చకార సీతయా క్రీడాం విపినే రమ్యపర్వతే । మనశ్శిలాను తిలకం సీతాయా నిటిలే కరోత్ ॥ ౨౦ ॥ గండయోశ్చిత్రవల్లీస్సోశ్చకార నిజహస్తతః । వృక్షాగుణదళైశ్చిత్రైః కోమలైః కుసుమాదిభిః ॥ ౨౧ ॥ ఏవం క్రీడన్సుఖం రామ స్తస్థౌ తత్ర్యానుజేనచ । నాగరాస్తు సదా జగ్ము రామదర్శనలాలసాః ॥ ౨౨ ॥ దృష్ట్వా శజ్జనసంబాధం రామస్తత్యాజతం గిరిం । అన్వగాత్సీతయా భ్రాత్రా హ్యత్రేరాశ్రమముత్తమం ॥

"నాయనా, శ్రీరాముని నీవు బలాత్కరింపవలదు, ఇతఁడు సాక్షాన్నారాయణుండు. దేవప్రార్థన నంగీకరించి రావణాది దుష్టరాక్షసులను సంహరించి భూభారమును పరిహరించుటకై యవతరించియున్నాఁడు." అని సమాధానవచనములను పలికెను. ఆవెనుక భరతుఁడు తత్త్వము నెఱిఁగి దాశరథితో "అన్నా, రాజ్యముకొఱకు నీపాదుకలనిమ్ము, నేను వాటిని సేవించెదను. జడలు దాల్చి నారుబట్టకట్టుకొని యూరిబయట వసించుచుందును. నీకొరకు ౧౪వ సంవత్సరపూర్తిలో రవియస్తమించగానే నేనగ్నిని ప్రవేశించెదను. ఇది నామాటసత్యము." అని ప్రతిజ్ఞ జేసెను. ఆమాటవిని రాముఁడు అట్లేకానిమ్మని రాజ్యమేలువకు రత్నాలంకృతంబులగు తనపాదుకలను భరతునికి అనుగ్రహించి యిచ్చిపంపెను. పిదప భరతుఁడు ఆరత్నపాదుకలను తలమీఁద పెట్టుకొని నేనే ధన్యుండని సంతసించుచు పలుమారు రఘురామునికి ప్రదక్షిణ నమస్కారములనాచరించి రామానుజ్ఞనంది యథాగతంబుగా వెడలెను. అపుడు ఆకైకేయి "రామచంద్రా, రఘునాథా, నేనుచేసినది గొప్పయపరాధము. దీనినిక్షమించుము." అని సంప్రార్థించెను. అందుకు శ్రీరాముఁడు "తల్లీ నాకు నీవు అపరాధమును చేయలేదు. అపుడు నీవు నాయిచ్ఛవలన మంథరావాక్యముచే వాణిచే మోహింపఁబడితివి. సుఖముగా నూరికిపొమ్ము నీయందు నాకు కోపములేదు." అని సమాధానమునుచెప్పగా, నామెను భరతుండు పిలచికొని పోయెను. ఇట్లు పోయిన భరతుఁడు అందరిని అయోధ్యలోనునచి తాను నందిగ్రామమును గల్పించికొని అందులో సింహాసనముమీఁద శ్రీరామపాదుకలనునచి సమస్త రాజకార్యంబులను తత్సన్నిధికి నివేదించి నెరవేర్చుచు, ఆపాదుకలనే శ్రీరాముండని నెమ్మనంబున నమ్మి తా

౨౩ ॥ నత్వాత్రిం మానితస్తేన తస్థౌ తత్ర దినత్రయం । గుహాస్థామనసూయాం తాం సీతాత్రేర్వచనాత్తదా ॥ ౨౪ ॥ నత్వా తయాలింగితా సా తదంకే సుఖు పావిశత్। అనసూయా తదా సీతాం పూజయామాస సాదరం ॥ ౨౫ ॥ దివ్యే దదౌ కుండలే ద్వే నిర్మితే విశ్వకర్మణా । దుకూలే ద్వే దదౌ తస్యై నిర్మలే భక్తిసంయుతా ॥ ౨౬ ॥ అంగరాగం చ సీతాయై దదావత్రేస్తు సా ప్రియా । నత్యక్ష్యతేంగశోభా త్వాం కదాపి జనకాత్మజే ॥ ౨౭ ॥ పాతివ్రత్యం పురస్కృత్య రామమన్వేహి జానకి। కుశలీ రాఘవో యాతు త్వయా భ్రాత్రా పునః గృహం ॥ ౨౮ ॥ భోజయిత్వా యథాన్యాయం రామం సీతాసమన్వితం । అత్రిర్విసర్జయామాస రామో నత్వా యయౌ వనం ॥ ౨౯ ॥ ఏవం వర్షమతిక్రాంతం రామస్య గిరివాసినః। యథాసుఖం లక్ష్మణేన జానక్యా సహితస్య చ ॥ ౩౦ ॥ ఏవం గిరీంద్రజే యోధ్యాపుర్యాం రామేణ యత్కృతం। చరిత్రం తన్మయా కించిత్త్వదగ్రే వినివేదితం ॥ ౩౧ ॥ * ॥ ఇతి శ్రీ శతకోటి రామచరితాంతర్గత శ్రీమదానంద రామాయణే వాల్మీకీయే సారకాండే అయోధ్యాచరిత్రే దండకకానన ప్రవేశనం నామ నవమస్సర్గః ॥ * ॥ ..................౯॥

ను మునివృత్తి నవలంబించి కందమూలఫలాశనుఁడై బ్రహ్మర్షివలె శ్రీరామధ్యాన పరాయణుఁడై దినములను లెక్కించుచుండెను ॥౧౧౮॥ ఇచ్చట శ్రీరాముఁడు చిత్రకూటాద్రిలో ము

## శ్రీసీతారాములు అత్రిమున్యాశ్రమమున సత్కారమునందుట.

నులతోడ వాసము చేయుచున్నవాఁడై ఆ రమ్యగిరివనంబున సీతయొక్క లలాటమున మన శిలాతిలకము నిడును, చెక్కిళ్లపై చిత్రలతలను వ్రాయును, కోమలంబులగు పల్లవపుష్పంబుల నలంకరించును, ఇట్లు పత్నీసమేతుఁడైన రఘురాముండు లీలావినోదంబుల నందుచుండెను. అంత నచ్చట పలుమారు నాగరికులు రామదర్శనాకాంక్షులై వచ్చిపోవుటచే నట్టి జనసంబాధముగల యాగిరినివదలి సతితోడను తమ్మునితోడను అత్యుత్తమంబయిన అత్రిమున్యాశ్రమమునకు పోయెను. అచ్చట శ్రీరాముఁడు మునికి నమస్కరించి వారిచే సంమానింపబడి మూఁడుదినములుండెను. అపుడు సీతాదేవి అత్రిమాటమీఁద గుహావాసినియగు అనసూయనుచూచి ప్రణమించి యామెచే నాలింగింపబడి తత్సన్నిధిని కూర్చుండెను. అప్పుడనసూయ సాదరముగా సీతమ్మను సంమానించి, యామెకు విశ్వకర్మ నిర్మితంబులయిన దివ్యకుండలములను దివ్యదుకూలంబులను భక్తితోనిచ్చి, అంగరాగము నర్పించి "జనకనందిని, ఎప్పుడును నీ దేహమున కాంతి క్షీణించచాలదు. పాతివ్రత్యమును పురస్కరించి రాముని ననుసరించి యుండుము. శ్రీరాఘవుఁడు క్షేమముగా తమ్మునితోడను నీతోడను మరల నిజమందిరమును ప్రవేశించుగాక." అని సంప్రార్థనలను చెప్పెను. అత్రిముని యిట్లు సీతారాములను యథాయోగ్యంబుగా భోజనాదులచే సత్కరించిపంపెను. శ్రీరాముం డచ్చటినుండి వనమునకు వెడలెను. ఇట్లరణ్యవాసులగు శ్రీరామాదులకు ఒకసంవత్సరము గతించెను. ఓసిపార్వతీ, ఇట్లు సాకేత రాజధానిలోని శ్రీరామవృత్తంబు కొంతవరకు చెప్పబడినది. ... ... ౧౩౦॥౯॥

శ్రీశివ ఉవాచ — అథ రామస్సీతయా తు లక్ష్మణేన సమన్వితః । యయౌ స దండకారణ్యం సజ్జం కృత్వా మహాధనుః ॥ ౧ ॥ అగ్రే యయౌ స్వయం రామస్తత్పృష్ఠే జానకీ యయౌ ॥ తస్యాః పృష్ఠే స సౌమిత్రిర్యయౌ ధృతశరాసనః ॥ ౨ ॥ వనే దృష్ట్వాథ కాసారం స్నాత్వా పీత్వా జలం సుఖమ్ ॥ భుక్త్వా ఫలాని పక్వాని తస్థుస్తత్ర క్షణం త్రయః ॥ ౩ ॥ ఏతస్మిన్నంతరే తత్ర విరాధం నామ రాక్షసమ్ ॥ తే తం దదృశు రాయాంతం మహాసత్త్వం భయానకమ్ ॥ ౪ ॥ కరాళదంష్ట్రివదనం భీషయంతం స్వగర్జితైః । వామాంసన్యస్తశూలాగ్రగ్రథితానేకమానుషం ॥ ౫ ॥ భక్షయంతం గజం వ్యాఘ్రం మహిషం వనగోచరం ॥ జ్యారోపితధనుః కృత్వా రామో లక్ష్మణమబ్రవీత్ ॥ ౬ ॥ రక్ష త్వం జానకీమత్ర సంహనిష్యామి రాక్షసం । స తు దృష్ట్వా రామనాథం లక్ష్మణం జానకీం తదా ॥ ౭ ॥ కౌ యువామితి తౌ ప్రాహ తతో రామస్తమబ్రవీత్ । నామకర్మాణి జం సర్వం కైకేయ్యాదిపిచ ఇత్యకృతం ॥ ౮ ॥ తద్రామవచనం శ్రుత్వా విహస్య రాక్షసోఽబ్రవీత్ । మాం న జానాసి రామ త్వం విరాధం లోకవిశ్రుతం ॥ ౯ ॥ మద్భయాన్మునయస్సర్వే త్యక్త్వా వనమితో గతాః । యది జీవితుమిచ్ఛాస్తి త్యక్త్వా సీతాం విరాయుధౌ ॥ ౧౦ ॥ పలాయేతాం న చేద్భీషం భక్షయామి యువామహం ॥ ఇత్యుక్త్వా రాక్షసస్సీతామాదాతుమభిదుద్రువే ॥ ౧౧ ॥ రామశ్చిచ్ఛేద తద్బాహూ శరేణ ప్రహసన్నివ । తతః క్రోధపరీతాత్మా వ్యాదాయ వికటం ముఖం ॥ ౧౨ ॥ రామమభ్యద్రవద్రామశ్చిచ్ఛేద పాదావతః । పదద్వయం తదా సర్ప ఇవాస్యేన యయౌ పునః ॥ ౧౩ ॥ తతోఽర్ధచంద్రాకారేణ నిహతో రాఘవేణ సః । తతస్సీతా సమాలింగ్య ప్రశశంస రఘూత్తమం ॥ ౧౪ ॥ దేవదుందుభయో నేదుర్దివి దేవగణేరితాః । తతో విరాధకాయాత్తు రుపశ్చవిఃగ్గతః ॥ ౧౫ ॥ స తం రామం నిజం వృత్తం కథయామాస

## శ్రీరాముఁడు విరాధుని సంహరించుట.

అనంతరమున శ్రీరాముఁడు సీతను లక్ష్మణుని బిలచికొని ధనుష్పాణియై దండకారణ్యమునకు వెడలెను. ముందు రాముఁడును వెనుక సీతయును ఆవెనుక ధనుర్ధారియగు లక్ష్మణుండును పోవుచుండిరి. ఆవనమున నొక కాసారమునుచూచి స్నానపానంబుల నొనర్చి సుఖముగా పక్వఫలంబులను భుజించి యచ్చట మువ్వురును క్షణకాలముండిరి. అంతలో నచ్చోట మహాబలుండును భయంకరుండును తీక్ష్ణ దంష్ట్రాననుండునగు విరాధుండను రాక్షసుండు తన యెడమభుజమున పెక్కుమనుజులను గ్రుచ్చికొనియుండు శూలాయుధమును మోసికొని నిజతర్జనచే వెరపించుచు వన్య గజమహిష వ్యాఘ్రాదులను భక్షించుచు వచ్చుచుండగా నీ ముమ్వురునుచూచిరి. అపుడు శ్రీరాఘవుఁడు విల్లునెక్కుబెట్టి చేతబూని లక్ష్మణునితో "నీవు జానకిని రక్షించికొనుము. నేను రక్కసుని జంపెదను" అను వాఁడును సీతా రామలక్ష్మణులను చూచి మీరెవరని యడిగి శ్రీరామునివలన సర్వవృత్తాంతము నెఱింగి, పకపక నవ్వుచు రాముని జూచి రాముఁడా, నన్నెఱుగవా? నాభయమువలన మునులు నీవనమును విడిచి పరుగెత్తిరి. బ్రతుకగోరిక గల్గిన సీతను వదలి నిరాయుధులై పరుగెత్తుఁడి. అట్లు కాక పోయిన మీయిరువురిని నేను భక్షించెదను అని చెప్పుచు సీతను అంటఁబోయెను శ్రీరాముఁడపుడు నవ్వుచున్నట్లువాని చేతులను తెగఁగొట్టెను. ఆరక్కసుఁడు క్రుద్ధుఁడై తనవికటముఖమును విస్తరించు

సాదరం । దుర్వాససాహంశప్తస్తు పురావిద్యాధరస్తు భుజః ॥౧౬॥ ఇదానీంమోచితశ్శాపా త్త్వయాకాలాంతరేవ నే । ఇత్యుక్త్వారాఘవంస్తుత్వా విమానేనయయౌదివం ॥ ౧౭॥ విరాధేస్వర్గతేరామో లక్ష్మణేనచసీతయా । జగామ శరభంగస్య వనంసర్వసుఖావహం ॥ ౧౮ ॥ శరభంగంతతోనత్వాతేనసంమానితోబహు । తస్థౌతత్రనిశామేకాం శరభంగోమునీశ్వరః ॥ ౧౯ ॥ తస్మైసమర్ప్యస్వంపుణ్య మారురోహచితింతదా । స్తుత్వాతంసవిమానేనవైకుంఠంపర మంయయౌ ॥ ౨౦ ॥తతశ్శనైస్సుతీక్ష్ణస్య య్యయావాశ్రమముత్తమం । నత్వాతంపూజితస్తేన సుఖంతస్థౌరఘూద్వ హః ॥౨౧॥ ఏతస్మిన్నంతరేతత్ర నానాశ్రమనివాసినః । మునయోరాఘవంద్రష్టుం సమాజగ్ముస్సహస్రశః ॥౨౨॥ సర్వేతేరాఘవంనత్వా స్తుత్వానిన్యుర్నిజం నిజం । ఆశ్రమంసీతయాభ్రాత్రా చక్రుఃపూజాం సవిస్తరాం ॥౨౩॥ ఏ కరాత్రంత్రిరాత్రంవా పంచసప్త దినానివా। పక్షమాత్రంతుమాసంవా సార్ధమాసమథాపివా ॥ ౨౪ ॥ త్రిమాసా న్పంచమాసంవా షణ్మాసైకాదశాఽథవా । సాగ్రంసంవత్సరంవాపి స్వాశ్రమేషురఘూత్తమం ॥ ౨౫ ॥ సంస్థా ప్యచక్రురాతిథ్య మధికంచోత్తరోత్తరం । పశ్చాద్గనుజేన శ్రీరామమేవంపూజ్య విసర్జయన్ ॥ ౨౬ ॥ భ్రమతై వంహి రామేణనవవర్షాణిదండకే । ఆశ్రమేషుమునీనాంచ వ్యతిక్రాంతానివైసుఖం ॥౨౭॥ బహవోనిహతాస్తత్ర రాక్షసాభ్రమతాతదా ॥ రాఘవేణసహభ్రాత్రా క్రీడతావనికన్యయా ॥ ౨౮ ॥ నానాశ్రమారామపుష్ప వనోపవ

క్రొని తరుముచురాగా రాముఁడు పరుగెత్తుచుండు వానికాళ్లను తెగగొట్టెను. అంతనతఁడు సర్పమువలె దొరలుచురాగా రాఘవుఁడు అర్ధచంద్ర నారాచముచే సంహరించెను. సీత మెచ్చి మగని నాలింగించెను. దేవగణప్రేరితంబులై దేవదుందుభులు మోగినవి. అపుడు విరాధదేహమునుండి దివ్యపురుషుండొకఁడు వెడలివచ్చి నమస్కరించుచు రామునితో "పూర్వము నేనొక విద్యాధరుఁడను. దూర్వాసముని శాపముచే నిట్లు రక్కసుఁడనైయుంటిని. కాలాంతరమున నీవనములో నీచే శాపముక్తుండయితిని" అనిచెప్పి రామునిస్తుతించి విమానమునెక్కి

శ్రీరాముఁడు శరభంగమునికి ముక్తినిచ్చుట.

స్వర్గమునకు వెడలెను॥౧౭॥ అటుమీఁద రాఘవుండు సీతతోడను లక్ష్మణునితోడను సర్వసౌఖ్యప్రదంబైన శరభంగవనమునకు వెడలి, ఆమునికి నమస్కరించి మునిచే చక్కగ సంమానితుఁడై అచ్చటనొకరాత్రి వసించెను. ఆ శరభంగమునీశ్వరుండు తన పుణ్యమును శ్రీరామునికి సమర్పించి తన దేహమును చితాగ్నికర్పించి శ్రీరామునిస్తోత్రముజేయుచు విమానమునెక్కి దివ్య వైకుంఠమునుచేరెను ॥౨౦॥ పిమ్మట రఘునాథుఁడు తిన్నగా నుత్తమంబగు సుతీక్ష్ణునియొ

శ్రీరామాదులకు మునులుచేయు సత్కారములు.

క్క యాశ్రమంబునకు వెడలి, అతనిని వందించి అతనిచే పూజితుఁడై సుఖముగానచ్చట నిలచెను. అంతలో నచ్చటికి నానాశ్రమనివాసులగు వేయారుమంది మహర్షులు శ్రీరామదర్శనాకాంక్షులై వచ్చుచుండిరి. ఆమహామునులందు శ్రీసీతారామలక్ష్మణులను సాదరముగా నారా

నభూమిషు । నదీజలతటాకాద్రి శిఖరాదిస్థలేష్వపి ॥ ౨౯ ॥ జంబ్వామ్రరంభా ద్రాక్షాది నానావృక్షతలేషుహి ॥ చచారసీతయాక్రీడాం రామో దేవ్యాయథాశివః ॥ ౩౦ ॥ అథరామోయయౌకుంభ సంభవస్యానుజాశ్రమం । సుమతిఃపూజయామాస రాఘవంసీతయాన్వితం ॥౩౧ ॥ తతస్సీతాయుతోరామశ్శనైర్భ్రాత్రా ముదాన్వితః । అగస్తేరాశ్రమంప్రాప నానావృక్షవిరాజితం ॥ ౩౨ ॥ ప్రత్యుద్గమ్యమునిశ్చాపి మునిభిర్బహుభిర్వృతః ॥ రాఘవంతం సమాలింగ్య స్వాశ్రమంతేనసంయయౌ ॥ ౩౩ ॥ అథతంపూజయామాస రాఘవంకుంభసంభవః । రామోపిమానిత స్తేన తస్థౌతత్రకియద్దినం॥ ౩౪ ॥ తతఃస్తుత్వారమానాథ మగస్త్యోమునిసత్తమః । దదౌచాపంమహేంద్రేణ రామార్థంస్థాపితంపురా ॥ ౩౫ ॥ అక్షయ్యౌబాణతూణీరౌ ఖడ్గంరత్నవిభూషితం । తతోరామోమునేర్వాక్యా ద్గత్వాతు త్తరేతటే॥ ౩౬ ॥ యయౌపంచవటీంరమ్యాం మార్గేదృష్ట్వాథపక్షిణం । జటాయుషంనగాకార మరుణాత్మజముత్తమం ॥ ౩౭ ॥ సఖాయంస్వపితుశ్చాపి సంభాష్యాథవివేశతాం । తత్రకృత్వామహాశాలాం యథాపూర్వంకృతాంగిరా ॥ ౩౮ ॥ మృగమాంసైర్బలిందత్వా తస్థౌరామోయథాసుఖం । సీతాంసంరక్షయామాస జటాయుఃపక్షిరాట్స్వయం ॥ ౩౯ ॥ రాఘవస్యపంచవట్యాం క్రీడతస్సీతయాసుఖం । సార్ధత్రీణివత్సరాణి వ్యతిక్రాంతానిపార్వతి ॥ ౪౦ ॥ వనేశూర్పణఖాపుత్రంత పంతంసాంబనామకం । బ్రహ్మాదదౌదివ్యఖడ్గం తంసాంబోనదదర్శసః ॥

---

ధించుచుండిరి. ఒకరాత్రి మూడురాత్రులు ఐదారుదినములు పదెనిమిదిదినములు ఒకపక్షము మాసము ఒకటిన్నరనెల మూడునెలలు ఐదునెలలు ౬-౮-౧౧ నెలలు తుద కొకసంవత్సరము ఇట్లు కొందరుకొందరు వారువారు భక్తితో తమతమయాశ్రమంబులలో నిలుపుకొని శ్రీసీతా రామ లక్ష్మణులను సుఖవసతినిచ్చి సత్కరించి పంపుచుండిరి. ఇట్లు మునులయాశ్రమంబులలో సంచరించుచుండు శ్రీరామాదులకు దండకారణ్యమున ౯ సంవత్సరములు సుఖముగా కడచినవి. దండకారణ్యమున రామలక్ష్మణులచే ననేకరాక్షసులు చంపఁబడిరి. శ్రీరాముఁడు సీతాదేవి తోడ పార్వతీ పరమేశ్వరులవలె దివ్యారామంబులలోను పుష్పవనంబులలోను నదీతీరంబుల లోను చెరువుగట్టులమీఁదను శైలశృంగంబులమీఁదను నేరడి మామిడి యరటి మొదలైన వృక్షతలంబులలోను ద్రాక్షాదితీగెల పందిళ్లలోను విహరించుచుండిరి ॥౩౦॥ పిదప రాముండు

అగస్త్యముని శ్రీరాముని సత్కరించి ధనుర్బాణాదుల నప్పగించుట.

జానకితోడ అగస్త్యమున్యనుజుఁడైన సుమతియాశ్రమమునకు పోయి అతనిచే సత్కరింపఁబడి యచ్చటనుండి తిన్నగా సంతసించుచు వెడలి, నానా వృక్షాశ్రితంబైన అగస్త్యాశ్రమంబునకు వచ్చెను. ఆముని శ్రీరామాదులను ప్రత్యుద్గమించి రాఘవుని నాలింగించుకొని తన యాశ్రమంబున నందరిని సత్కరించెను. శ్రీరాముఁడచ్చట సంమానింపఁబడుచు కొన్నిదినములు వసించుచుండెను. అపుడు అగస్త్యుఁడు శ్రీలక్ష్మీపతినిస్తుతించి ఇంద్రునిచే మునుపు శ్రీరామునికొఱకని స్థాపింపఁబడిన దివ్యచాపమును అక్షయ్యంబులగు బాణతూణీరములను రత్నాలంకృతం

౪౧॥ తద్ధృత్వాలక్ష్మణః ఖడ్గంవృక్షాన్వల్లీర్బభంజసః । వృక్షగుల్మైహతస్సాంబస్తతో రాఘవమబ్రవీత్ ॥౪౨॥ ప్రాయశ్చిత్తంబ్రహ్మహాణం మాంవదత్వంరఘూత్తమ । రామోప్యాహహతస్సాంబో రాక్షసోనమనిర్హతః ॥౪౩॥ తచ్ఛ్రుత్వాలక్ష్మణస్తుష్ట స్సాంబమాత్రాపితచ్ఛ్రుతం। తత్రాగంతీపుత్రదుఃఖం రాక్షసీకామరూపిణీ ॥ ౪౪ ॥ విచచారశూర్పణఖా నామ్నాసాసర్వతఃక్రుధా । ఏకదాసాపంచవట్యాం రామంధృష్ట్వాథరాక్షసీ ॥ ౪౫ ॥ పుత్రదుఃఖసమాక్రాంతా ధృత్వారూపంమనోరమం । కాపట్యబుద్ధ్యాశ్రీరామం సానుజంహంతుముద్యతా ॥౪౬॥ ఉవాచమధురం వాక్యం వస్త్రాలంకారమండితా । కాయువాంకాత్వియంరమ్యా కిమర్థమాగతావనం॥ ౪౭ ॥ కుతస్సమాగతావత్ర క్వాధునాగచ్ఛతఃపురః । తత్తస్యావచనంశ్రుత్వా రామస్సర్వంన్యవేదయత్॥ ౪౮ ॥ తతస్సారాఘవంప్రాహ భవ భర్తామమప్రభో। సోప్యాహదయితామేస్తి బహిస్తిష్ఠతిలక్ష్మణః॥ ౪౯॥ ప్రార్థయామాససౌమిత్రిం సాతంసోప్యుత్తరందదౌ । అహందాసోస్మిరామస్య త్వంతుదాసీభవిష్యసి॥ ౫౦ ॥ తతఃక్రోధేనసాసీతాం ధర్తుంవేగేనదుద్రువే। తదాతాంరాఘవఃప్రాహ మమాయంశరఉత్తమః ॥ ౫౧ ॥ చిహ్నార్థంలక్ష్మణాయత్వం నీత్వాదర్శయవేగతః। మద్బాణదర్శనాత్కార్యం సిద్ధింనేష్యతిలక్ష్మణః॥ ౫౨ ॥ ఇత్యుక్త్వారాఘవోబాణం దదౌతస్మైతురోపమం। సత్యం మత్వారామవాక్యం సాయయౌలక్ష్మణంపునః॥ ౫౩ ॥ లక్ష్మణాయరామబాణం దర్శయామాసరాక్షసీ। సబుద్ధ్వా

### శ్రీరామాదులు తిరిగి పంచవటికేగెంచుట.

బగు ఖడ్గంబును శ్రీరామునికి సమర్పించెను ॥ ౩౫ ॥ పిదప శ్రీరాముఁడు అగస్త్యానుజ్ఞనొంది గౌతమీనదియొక్క యుత్తరతీరంబున రమ్యమగు పంచవటీక్షేత్రమునకు పోవుచు దారిలోనున్న పర్వతాకారుఁడు అరుణపుత్రుండును తనదండ్రికి మిత్రుండును సుపవిత్రుఁడునగు జటాయువునుజూచి సంభాషించి, పంచవటిని ప్రవేశించి, యచ్చట పర్ణశాలవేయించికొని యథాపూర్వముగా మృగమాంసంబులచే భూతబలినిచ్చుచు నందరితో నానందించుచుండెను. పర్ణశాలలో సీతను పక్షీంద్రుండగు జటాయువు తానే రక్షించుచుండెను. సీతారాములు పంచవటిలో క్రీడించుచుండగా మూడున్నరసంవత్సరము కడచెను ॥ ౪౦ ॥ వనమున శూర్పణఖాపుత్రుఁడు

### లక్ష్మణుఁడు సాంబుని సంహరించుట.

సాంబుఁడనువాఁడు తపంబొనరించుచుండగా వానికి బ్రహ్మ దివ్యఖడ్గంబునొకటిని యనుగ్రహించియిచ్చెను. సాంబుండు దానిని చూడలేదు. అఖడ్గమును లక్ష్మణుఁడు తీసికొని చెట్లనుతీగెలను కత్తరించుచుండ నందులోజిక్కి సాంబుఁడు మృతినొందెను. దానినెఱింగి సుమిత్రానుతుఁడు రామునితో "అన్నా, బ్రహ్మహత్యా ప్రాయశ్చిత్తమును విధింపుము" అని వేడగా, శ్రీరాముఁడు "నాయనా, వధింపఁబడినవాఁడు సాంబుఁడను రాక్షసుండు. బ్రాహ్మణుఁడుకాడు. చింతయేల?" అని సమాహితునింజేసెను ॥ ౪౩ ॥ కామరూపిణియై కాననంబున సంచరించుచుండు శూర్పణఖయను రాక్షసి తన తనయుఁడు సాంబుఁడు చచ్చినసంగతిదెలిసి దుఃఖించుచు మహా

హృద్గతంబంధో స్తంసంధాయశరాసనే॥ ౫౪ ॥ ముమోచబాణంవేగేన రామనామాంకితంశుభం । సశరోరాక్ష
సీంగత్వా ఘ్రాణకర్ణోష్ఠహృద్భవాన్ ॥ ౫౫ ॥ సంఛిత్వారామతూణీరం వివేశక్షణమాత్రతః । ఘ్రాణకర్ణోష్ఠహృ
జ్జాత రపి:తాసాపిరాక్షసీ॥ ౫౬ ॥ హాహేతాస్మీతిజల్పంతీ యయౌబంధూన్ఖరాదికాన్ । దృష్ట్వాస్వసాంతాదృశీం
తే త్రిశిరఃఖరదూషణాః॥ ౫౭ ॥ తన్ముఖాత్సకలంవృత్తం శ్రుత్వాతేక్రోధసంయుతాః । చతుర్దశమహాఘోరాన్
రాక్షసాన్ప్రేషయంస్తదా॥ ౫౮ ॥ తాన్రామఃక్షణమాత్రేణ చతుర్దశశరైర్యమం । ప్రదర్శయన్స్వీయలోకం
ప్రేషయామాసలీలయా॥ ౫౯ ॥ తాన్రాక్షసాన్మృతాన్ శ్రుత్వా ఖరాద్యాస్తేత్రయఃక్రుధా । యుద్ధాయనిర్యయు

క్రోధమునొంది యొకప్పుడు పంచవటిలో రామునిజూచి, పుత్రశోకసమాకులితయై కపటబుద్ధి తో శ్రీరామలక్ష్మణులనుచంపనెంచి, దివ్యవస్త్రాభరణములుగల మనోహరాలంకారములను దాల్చి మృదుమధురంబుగా "ఎవరు మీరిరువురు మిక్కిలి సుకుమారులు, ఈమనోహరాంగియెవతె? కానవమున కేలవచ్చితిరి? ఇచ్చట యేల యున్నారు? ఎచ్చటికిపోదురు?" అని వేడుకతో వేడెను. అందుకు శ్రీరాముఁడు దానికి సంగతినంతటిని సవిస్తరముగాచెప్పెను. పిదప నారక్కసి రామునితో "ప్రభూ, నాకు నీవు మగడగుము" అనివేడెను. అందుకతఁడు "నాకు ప్రేయసియున్నది. లక్ష్మణుఁడు వెలుపలనున్నాడు." అనిన, నారక్కసి లక్ష్మణుని సంప్రార్థించి "నేను రామదాసుఁడైయున్నాను, నీవుకూడ దాసియగుదువు" అనిచెప్పిన సౌమిత్రివాక్యములచే క్రుద్ధురాలై సీతనుపట్టుటకు పరుగెత్తెను. అపుడు శ్రీరాముఁడు "సుందరీ నాబాణంబిది యత్యుత్తమంబు, నీవు దీనిని తీసికొని త్వరగాపోయి లక్ష్మణునికి గురుతుగాచూపుము. లక్ష్మణుఁడు నాబాణమునుచూచి కార్యసిద్ధి నొనరించును." అని తీక్ష్ణబాణమునిచ్చెను. అది నిజమనినమ్మి మరల లక్ష్మణునివద్దికివెడలి రామబాణమును చూపెను. అతఁడు అన్నయొక్క హృదయాభిప్రాయమునెఱింగి దానిని తనధనుస్సులో సంధానముజేసి వేగముగ బ్రయోగించెను. ఆరామనామాంకితశరంబు ముక్కు చెవ్వి పెదవె పాలిండ్లను ఛేదించి క్షణమాత్రమున శ్రీరాముని యమ్ములపొదలో దూరెను॥౫౬॥ ముక్కుపోయి చెవులూడి పెదవలుపగలి చండ్లు తెగిన నారక్కసి

## శ్రీరాముఁడు ఖరదూషణ త్రిశిరాదులను జంపి ముక్తినిచ్చుట.

అయ్యో చచ్చితినని మొరలిడుచు ఖరాది బంధువులవద్దికి వచ్చెను. ఇట్టి దురవస్థనొందిన చెల్లెలను చూచి ఖరదూషణత్రిశిరులు దానినోటిమీఁదుగా నన్నిసంగతుల నెఱిఁగి కోపమునొంది మిక్కిలి భయంకరులగు ఘోరరాక్షసులను ౧౪ వేలమందిని పంపిరి. వారికి క్షణమాత్రమున ౧౪ బాణములచే యమునిఁజూపుచు వైకుంఠమునిచ్చెను. వారు రక్కసులు చచ్చినసంగతిదెలిసి ఖరాదులు ముప్పురును క్రుద్ధులై ౧౪ వేలసైన్యముతోడ యుద్ధమునకువచ్చిరి. శ్రీరాముండును సీతను సౌమిత్రినిగుహలోదాచి బదిలమని రాక్షసులతో శస్త్రాస్త్రంబులఁబూని ఘోరయుద్ధ

సైన్యైస్సహ సైశ్చచతుర్దశ॥ ౬౦ ॥ రామోపిబంధుంసీతాంచ గుహాయాంస్థాప్యయోగతః। చకారరాక్షసైర్యుద్ధం శస్త్రైరస్త్రైర్భయావహం॥ ౬౧ ॥ చతుర్దశసహస్రాణి స్వీయరూపాణిరాఘవః। కృత్వాతేషాంచపురత శ్శరైస్తాన్మర్దయత్‌క్షణాత్ ॥౬౨॥ హత్వాఖరందూషణంచ తథాత్రిశిరసంశరైః। చతుర్దశసహస్రాంస్తా న్ప్రేషయామాసస్వంపదం॥ ౬౩ ॥ముహూర్తేనతురామేణ సహస్రాణిచతుర్దశ । మితాసేనాఖరాద్యైశ్చనిహతాగౌతమీతటే॥ ౬౪ ॥ఖరాద్యాఃకంటకాయత్ర స్థితాస్తచ్చత్రికంటకం। క్షేత్రంఖ్యాతంత్ర్యంబకాఖ్యం తదేవప్రోచ్యతేభువి॥ ౬౫ ॥ జనస్థానంభూసురాణాం దదావస్తుంరఘూద్వహః। అథసీతాసమాలింగ్య రాఘవంప్రశశంససా॥ ౬౬ ॥ అథతాంజానకీంప్రాహ రామోరహసిసాదరం। సీతేత్వంత్రివిధాభూత్వా రజోరూపావసానలే॥ ౬౭ ॥ వామాంగే మేసత్వరూపా వసచ్ఛాయాంతమోమయీ। పంచవట్యాందశాస్యస్య మోహనార్థంవసాత్రవై॥ ౬౮ ॥ తద్రామవచనంశ్రుత్వా తథాసీతాచకారసా । తతశ్శూర్పణఖాలంకాం గత్వారావణమబ్రవీత్ ॥ ౬౯ ॥ ధిక్త్వాం రాక్షసరాజానం వృత్తంచారైర్నవేత్సియః। చతుర్దశసహస్రాసా సేనాత్వద్బంధుభిస్సహ ॥ ౭౦ ॥ మనుష్యేణైవరామేణ జనస్థానేనిపాతితా । తత్తస్యావచనంశ్రుత్వా తాంధృష్ట్వాతాదృశీంతదా ॥ ౭౧ ॥ సింహాసనాచ్చచాలాథ పునఃపప్రచ్ఛతాంస్వసాం । వదకింకారణంయుద్ధే ప్రాహసారాక్షసేశ్వరం ॥ ౭౨ ॥ స్త్రీరత్నం

---

మొనర్చెను. క్షణమాత్రమున ౧౪ వేలరామరూపములతో వారినెదిరించి పరమపదమున కంపెను. ఖరదూషణ త్రిశిరులను సంహారించి ముక్తినిచ్చెను. ఒక ముహూర్తములో గౌతమీతీరమున నందరును రామబాణాగ్నిచే కాల్చబడిరి. లోకకంటకులై ఆఖరదూషణ త్రిశిరులున్న క్షేత్రము త్రికంటకమనియును త్ర్యంబకమనియును చెప్పఁబడుచున్నది. అపుడు శ్రీరాముఁడు బ్రాహ్మణులు వాసముచేయుటకై జనస్థానమునిచ్చెను. అంత నవనిజ రామమూర్తి నాలింగించి

శ్రీసీతారాములయొక్క రహస్య సల్లాపము.

పొగడెను. ॥౬౬॥ పిదప శ్రీరాముఁడు నాజానకితో "దేవి, మూఁడువిధములుగా నేర్పడి రజోరూపిణివై అగ్నిలో వాసముజేయుము. నాయెడమప్రక్కలో సత్వరూపము నొందియుండుము. తమోరూపముదాల్చి ఛాయనవలంబింపుము. పంచవటిలో రావణుని మోహింపజేయుటకై ఛాయాశ్రయణివై యిచ్చటనే వసింపుము." అని రహస్యముగా సాదరముగా చెప్పెను. ఆరామవచనము నా రామ యట్లేయని యంగీకరించి నెరవేర్చెను. పిదప శూర్పణఖ లంకకు వెడలి

శూర్పణఖవచ్చి రావణునితో మొరలిడుట.

రావణాసురినితో ॥౬౯॥ ఛీ,నీరాక్షసరాజత్వము వ్యర్థము. నీవు చారులవలన వృత్తాంతము నెఱుఁగకపోతివి. నీతమ్ములతో౧౪ వేలసైన్యము ధ్వంసమయ్యె. జనస్థానమును మనుష్యమాత్రుఁడిట్లు జేసెను." అనిచెప్పగా,రావణుఁడు కురూపిణియైన చెల్లెలినిచూచి సింహాసనమునుండిదిగ్గున లేచి నిలచి"యుద్ధమెందుకై నదిచెప్పు"మనెను. అందునకారక్కసి"అన్నా,స్త్రీరత్నంబగుజానకీదేవిని

జానకీంద్రృష్ట్వా మయాచిత్తేవిచింతితం। రావణార్థంవినేష్యామి ధర్తుంతాంతత్పురోగతా ॥ ౨౩ ॥ తావద్బాణేనసీతాహం దశామేతాంతురావణ । సౌమిత్రిణా పంచవట్యా మాజ్ఞయారాఘవస్యచ ॥ ౨౪ ॥ సాంబోపిమేమాతఃపుత్ర స్తప్యమానోనిరర్థకం । వత్త్వోపార్థంకృతంయుద్ధం బంధుభిస్తేనిపాతితాః ॥ ౨౫ ॥ యద్యస్తిపౌరుషంకించిత్త్వర్హి సీతాంసమానయ । నోచేదధోముఖస్తిష్ఠ యథాస్త్రీగతభర్తృకా ॥ ౨౬ ॥ తత్తస్యవచనంశ్రుత్వా సాంత్వయామాసతాంస్వసాం । తౌరామలక్ష్మణౌహత్వా తవశోకాశ్రుమార్జనం ॥ ౨౭ ॥ కరోమ్యహం లోహితేన తయోఃఖేదం భజస్వమా । ఏవంనానా విధైర్వాక్యై స్సాంతయిత్వా స్వసాంముహుః ॥ ౨౮ ॥ స్వహితస్యోపదేష్టారం మాతులంతమసిస్థితం । యయౌరథేనమారీచం తస్మైవృత్తంన్యవేదయత్ ॥ ౨౯ ॥ సోథతంభీషయామాస భాగినేయంముహుర్ముహుః । విశ్వామిత్రాధ్వరేత్యక్త మాత్మానంతంన్యవేదయత్ ॥ ౩౦ ॥ రామాఖ్యయారథంరత్నం రజతంరుక్మభూషితం । శ్రుత్వాహంరాదియుక్తంచి ద్రామంమత్వాబిభేమ్యహం ॥ ౩౧ ॥ కేనతేశిక్షితాబుద్ధిరియంలంకావిఘాతినీ । ఆస్తరూపోస్తికశ్శత్రుర్యే నేయంశిక్షితామతిః ॥ ౩౨ ॥ కథాంనకురురామస్య తంద్రృష్ట్వా త్వంమరిష్యసి । తతఃక్రోధేనతంప్రాహ యదినాయాసిరాఘవం ॥ ౩౩ ॥ మయాత్వర్హి వధిష్యామి త్వామతఃకురుమద్వచః । భూత్వాత్వంమృగరూపశ్చ రామస్త్వామనుయాస్యతి ॥ ౩౪ ॥ త్వంశబ్దంకురురామస్య లక్ష్మణస్తేనయాస్యతి।

జూచి మనరావణునికి దీనినితీసికొనిపోయియిచ్చెదనని యాలోచించి పట్టుటకు ప్రయత్నించితిని. అంతలోలక్ష్మణుఁడు పంచవటిలోరామాజ్ఞనొంది బాణప్రయోగముజేసిననన్నీదురవస్థకుతెచ్చెను. తపమాచరించుచున్నసాంబుండును వ్యర్థుఁడుగాచచ్చెను. నీతమ్ములును చనిపోయిరి. నీకు శౌర్యం బున్నయెడ సీతను గొనిరమ్ము, లేవా, మగఁడు చచ్చిన ముండవలె తలవంచి పడియుండుము." అని నిందించెను. అందుకు రావణుఁడు "చెల్లెలా, చింతింపకుము, రామ లక్ష్మణులను చంపి వారిరక్తముచే నీకండ్ల నీళ్లను కడిగెదను ఆదుఃఖమును విడువుము." అని పెక్కుమాటలచే నామెను సమాధానపరచెను॥ ౨౮॥ పిదప రావణుఁడు తన మేలు జెప్పువాఁడును మేనమామ

రావణ మారీచ మంత్రాలోచనము.

యును తపము నాచరించుచుండువాఁడునగు మారీచునివద్దికి రథమునెక్కిపోయి ఈవృత్తాంతమును నిరూపించెను. వాఁడు మేనల్లుని మాటమాటకు వెరపించుచు "నాయనా, విశ్వామిత్రుని యజ్ఞమున నేను చచ్చివచ్చినవాఁడనబ్బా! రామనామముచే రథమనినను రత్నమనినను రజతమనినను రుక్మభూషణమనినను నేను విని రేఫాదిపదశ్రవణమాత్రమున భయపడువాఁడనైయున్నాను. లంకా వినాశకారణంబగు నీదుర్బుద్ధి యెవనిచే నీకు నేర్పఁబడెఁ? ఏపగవాఁడు నీకాప్తుఁడుగానున్నాఁడు? ఈమతి నీకెట్లు శిక్షితంబయ్యెఁ? రామునిజోలికి పోవలదు. వానిజూచిన నీవుచత్తువు." అని చెప్పెను. అందుచే క్రుద్ధుండైన రావణుండు వానితో "నీవు రాముని వద్దికి పోనియెడల నేనే నిన్ను చంపుదును. కనుక నామాటచొప్పున చేయుము. నీవు మాయా

తతస్తాం జానకీం వేగాల్లంకాం స్వామానయామ్యహం ॥ ౧౫ ॥ లంకాయాస్తవదాస్యామి స్వీయరాజ్యార్థమాద రాత్ । ఇతితస్యాగ్రహం దృష్ట్వా మారీచో హృద్యచింతయత్ ॥ ౧౬ ॥ రామహస్తాన్మృతిశ్శ్రేష్ఠా మృత్యూ రావణహస్తతః । ఇతినిశ్చిత్య మారీచస్తథేత్యుక్త్వాయయౌతదా ॥ ౧౭ ॥ రావణేనరథేస్థిత్వా గత్వాపంచవటీంప్రతి । భూత్వా హేమమయశ్చిత్రో మోహయామాసజానకీం॥ ౧౮ ॥ సాచ్ఛాయామానుషీదృష్ట్వా మృగంరాఘవమబ్రవీత్ । క్రీడార్థంమాంమృగంచేమం ధృత్వాదేహిరఘూత్తమ॥ ౧౯॥ మృగశ్చేత్ప్రాణహీనాంగః కరోమికంచుకీంత్వచః॥ తత్తస్యావచనంశ్రుత్వా జ్ఞాత్వాసర్వంరఘూత్తమః॥౨౦॥ సీతాయారక్షణేబంధుం సంస్థాప్యాన్వమృగంయయౌ. తతోపలాయనం చక్రే మృగోరామంవికర్షయన్ ॥౨౧॥ రామబాణేనభిన్నాంగశ్శబ్దం దీర్ఘంచకారసః। హాసౌమిత్రేసమాగచ్ఛహాహతోస్మ్యద్యకాననే॥౨౨॥ ఇత్యుక్త్వారామవద్వాచా మమారరుధిరంవమన్ ।తంశబ్దంజానకీంశ్రుత్వా చోదయామాసలక్ష్మణం॥౨౩॥ సోప్యాహరామవచనంనేదంసీతేభయంత్యజ। తతస్సాతంపునఃప్రాహ జానామితవచేష్టితం॥౨౪॥ భరతస్యోపదేశేనమృతింరామస్యవాంఛసి। అథవామే భిలాషోస్తిత్వత్ప్రాణాంస్త్యజామ్యహం॥౨౫॥ తత్క్రూరవచనం శ్రుత్వాతస్యాజ్ఞాత్వా మహద్భయం । జానకీంప్రాహసౌమిత్రిర్మాతశ్శృణుమద్వచః॥ ౨౬ ॥ రాఘవాజ్ఞాంపురస్కృత్య రక్షితస్త్వాంమయాత్వయా । తాడితంవాక్యశరేణాద్యభోక్ష్య స్యస్యాచిరాత్ఫలం ॥ ౨౭ ॥ తథాపి శృణు మద్వాక్యం యన్మయాత్రోచ్యతేహితం । మయైతాంధనుషారేఖాం కృతాంత్వత్పరితోఽధునా ॥ ౨౮ ॥ త్వద్రక్ష

మృగంబైన శ్రీరాముఁడు నీవెంటవచ్చును. నీవపుఁడు రామునివలె మొరబెట్టిన విని లక్ష్మణుఁడువచ్చును. అంతనేను సీతను వేగమె లంక కపహరించి తెచ్చెదను. ఇందుకై లంకయొక్క అర్ధరాజ్యమును నీకిచ్చెదను" అని యాజ్ఞాపించెను. అపుడు మారీచుండు తనమదిలో రావణునిచే మృతినొందుట కన్నను రామబాణముచే ముక్తినొందుట మేలనియెంచి యుల్లోకానిమ్మని యొప్పికొనెను ॥౧౭॥ పిదప నామారీచుఁడు రావణునితోఁడ రథమునెక్కి పంచవటికి వెడలి సు

## మారీచతంత్రమున రావణుఁడు సీతనెత్తుకొని జటాయువును జయించి వెడలుట.

వర్ణమయంబయిన చిత్రంబగు మృగాకారమునుదాల్చి సీతను మోహింపజేసెను. తామసియై ఛాయా రూపిణియగు సీత మృగమునుచూచి రామునితో "నాథా, నాకీమృగమును పట్టియిచ్చిన దీనిచర్మముతో కంచుకమును చేసికొందును" అనిన నతఁడు సర్వజ్ఞుఁడయి సీతారక్షణకు లక్ష్మణుని నియమించి మృగము వెంటంబెను. ఆమృగము రాముని నాకర్షించుకొని పరుగిడుచు రామబాణవిద్ధంబై "హా! లక్ష్మణా, రమ్ము, చంపబడితినయ్యో"అని రామునివలె మొరబెట్టి రక్తమునుకక్కి మృతినొందెను. సీత దానివిని లక్ష్మణుని పొమ్మనెను. అందుకు సౌమిత్రి 'వదినా, ఇది రామవచనముకాదు, భయమువల" దనెను. అపుడుసీత " నీచేష్టనే నెఱుఁగుదును. భరతప్రేరితుఁడై రామునిచావు గోరెదవు. లేదా, నాయందు వాంఛగలదేమో? అట్లయిన నా ప్రాణములను వదలుదును."అని నిందించెను.ఆక[illegible]ర వాక్యమునువిని భవిష్యద్భయము నెఱిఁగి

ణార్థం దుష్టానాం దుర్విలంఘ్యాం మహోత్తమాం। మాత్వముల్లంఘయస్వేమాం ప్రాణైః కంఠగతైరపి॥ ౯౯ ॥ ఇత్యుక్త్వా ధనుషః కోట్యా కృత్వా రేఖాం సమంతతః। బాహ్యదేశే పంచవట్యాః స్వామిత్రిః పరిఘోపమాం॥ ౧౦౦ ॥ నత్వా సీతాం తతస్తూష్ణీం యయౌ రామం త్వరాన్వితః । ఏతస్మిన్నంతరే తత్ర రావణో భిక్షురూపధృక్ ॥ ౧ ॥ గత్వా పంచవటీ ద్వారం రేఖాయాశ్చ బహిః స్థితః । నారాయణేతి వై చోక్త్వా తూష్ణీం తస్థౌ స రావణః ॥ ౨ ॥ తావచ్ఛాయామయీ సీతా భిక్షాం తస్మై సమర్పితుం । యయౌ ద్వారం దీర్ఘహస్తా గృహ్ణీష్వేత్యబ్రవీచ్చ తం ॥ ౩ ॥ తదా భిక్షుః పునః ప్రాహ సీతాం పంకజలోచనాం । నాంగీకరోమ్యంతరేణ భిక్షామేతాం త్వయార్పితాం॥ ౪ ॥ గార్హస్థ్యం చేద్రాఘవస్య రక్షితుం త్వం సమిచ్ఛసి । తర్హి రేఖాం సముల్లంఘ్య మాం భిక్షాం దాతుమర్హసి ॥ ౫ ॥ తద్భిక్షువచనం శ్రుత్వా ధర్మోఘ్నాన్మేతి శంకితా। రేఖాబహిస్సవ్య పాదం దత్వా దీర్ఘలసత్కరా ॥ ౬ ॥ గృహ్ణీష్వేమాం వరాం భిక్షామితి తాం ప్రాహ జానకీ । తతో దశాస్యస్తాం ధృత్వా భిక్షురూపం విసృజ్య చ ॥ ౭ ॥ ఖరవాహే రథే సీతాం సంస్థాప్యాథ న్యవర్తత । యావద్గచ్ఛతి వేగేన తావద్దృష్టో జటాయుషా ॥ ౮ ॥ చకార తుములం యుద్ధం రావణేన స పక్షిరాట్ । నిజపద్భ్యాం ముఖేనాథ చూర్ణీకృత్య రథోత్తమం ॥ ౯ ॥ ఖరానష్టౌ వినిష్పిష్య బభంజ తద్ధనుర్మహత్ । ముకుటాన్ దశ సంఛిద్య కృత్వా దేహం తు జర్జరం ॥ ౧౦ ॥ మూర్ఛితం రావణం కృత్వా ససీతస్సంన్యవర్తత । స్వస్థీభూతో దశాస్యోపి తాడయామాస తం పదా ॥ ౧౧ ॥ క్రోధేన మహతా విద్ధః పక్షిణా జర్జరీకృతః । తతో జటాయుః పతితో వమన్ రక్తం ముఖేన

---

సీతతో “తల్లీ, నామాటవినుము. శ్రీరామాజ్ఞ ననుసరించి నిన్నురక్షించు నన్నుముల్లుమాటలచే నొప్పించితివి. దీనిఫలము ననుభవించెదవు. అయినను నామాటవినుము, నీచుట్టు నాధనుస్సుచే నీరక్షణకై వేయబడిన ఈరేఖను ఎట్టికష్టమువచ్చినను దాటిపోవలదు. ఇది నీకు హితము.” అని చెప్పి వింటిమొననుండి పంచవటికి వెలుపల చుట్టు నొకగీతగీచి మంత్రించి సీతనువందించి మౌనముూని రామునిసన్నిధికి తరలెను. అంతలో నచ్చట బిచ్చగాని వేషమునందిన రావణుఁడు వచ్చి పంచవటీద్వారమున రేఖకు వెలుపల నారాయణస్మరణతో నూరకయుండెను.ఆలోపల ఛాయామయి సీత భిక్షదీసికొనివచ్చి ద్వారముననిలచి చేయిజాపి బిచ్చముగొనుమనెను.అపుడు బిచ్చగాఁడు సీతతో “నడుమ తెడగల్గియుండగా నేను నీచే నివ్వఁబడు భిక్ష నంగీకరించను. రామునిగృహస్థ ధర్మమును రక్షించునదివైన రేఖనుదాటివచ్చి భిక్షనిమ్ము” అని చెప్పగా,జానకి తనకధర్మము సంభవించునని శంకించుచు రేఖదాటి యొక యడుగుబెట్టి మంచిబిచ్చము దీనిని దీసికొమ్మనెను. అంత నారావణుఁడు ఆమెను పట్టుకొని భిక్షురూపమునువదలి కంచరగాడిదెల రథము పైనెక్కించుకొని తరలెను. అంత నతఁడు వేగముగా పోవునంతలో జటాయువుజూచి ఘోరయుద్ధమునొనర్చెను. మఱియు నాజటాయువు రథమును బద్దలుజేసి ఆయెన్మిది గాడిదెలను పిండివేసి విల్లునువిరచి పదికిరీటముల నెగరగొట్టి దేహమును జల్లిజేసి యారావణుని మూర్ఛితునింజేసి సీతతోడ వెనుకకరిగెను. పిదప దశకంఠుఁడు స్వస్థచిత్తుఁడై లేచి మహా క్రోధము

షః ॥ ౧౨ ॥ తతోవిహాయసాసీతాం వినాయరావణఃపునః । రామరామేతిజల్పంతీ సీతాభూన్యస్తలోచనా ॥౧౩॥ ఉత్తరీయేబబంధాథ పథిస్వాభరణానిసా । దృష్ట్వాధఃపర్వతేప్రోచ్చైస్సం స్థితాన్పంచవానరాన్ ॥ ౧౪ ॥ ప్రాక్షిపత్కాపిమధ్యేథ సూచనార్థంరఘూత్తమం । తతోదశాస్యస్తాం నీత్వావ్యాశోకేసంన్యవేశయత్ ॥ ౧౫ ॥ ప్రార్థయామాసతాంసీతాం సోత్తరంపాదదాతదా । తస్యాస్సంరక్షణార్థాయ రాక్షసీశ్చసహస్రశః ॥ ౧౬ ॥ అజ్ఞాపయద్దశాస్యస్స స్వయంగేహంవివేశహ । తదేంద్రోబహ్మావాక్యేన పాయసంవర్షతుష్టిదం ॥౧౭॥ దదౌరహసిసీతాయై తేన తుష్టాబభూవసా । సమర్ప్యపాయసంకించిద్రామాయలక్ష్మణాయచ ॥ ౧౮ ॥ సురానతిథయేదత్వా దత్వాథేమంచఖేచరాన్ । దత్వాథత్రిజటాంకించి ద్భక్షయామాసజానకీ ॥౧౯॥ సంమంత్ర్యరావణేనాపి రాక్షసాశ్చైవషోడశ। ప్రేషితారామఘాతార్థం తేఃబంధనభక్షితాః॥౨౦॥యత్రయత్రపంచవట్యాంరామబాణభయాన్మృగః। చచార గౌతమీతీరే సంస్థానంతత్రతత్రహి ॥ ౨౧ ॥ స్థానసంజ్ఞాన్యనేకాని జాతానిచపురాణిహి । మృగస్యపతితంయత్ర నూపురంపరిధావతః ॥ ౨౨ ॥ నూపురాఖ్యోమహాగ్రామః ప్రోచ్యతేగౌతమీతటే। రామబాణప్రహారేణ చపలాక్షోపతద్భువి ॥ ౨౩ ॥ మృగోయత్రమహాంస్తత్ర చాపల్యగ్రామఈర్యతే । గోదాతటేగ్రావభూమ్యాం రామబాణహతోమృగః ॥ ౨౪ ॥ పతితోయత్రతచ్చిహ్నం దృశ్యతేద్యాపిమానవైః । సౌమిత్రిచాపజారేఖా పంచవట్యాస్సమంతతః ॥ ౨౫ ॥ అద్యాపిదృశ్యతేస్పష్టా నదీరూపాభయావహా । పాషాణభూమ్యాంతత్రైవ రావణస్యపదం

నొంది జటాయువును కాళ్లతోవిరుగదన్ని వాఁడుముఖమున రక్తముగక్కుచు నేలఁబడగా మరల సీతను గైగోని గగనమున వెడలెను. అపుడు దారిలోఁబోవుచు సీత రామరామయని యరచుచు నేలఁజూచుచు తనయుత్తరీయమున ఆభరణంబులను ముడివేసి క్రింద నిలచియున్న నయిదుమంది వానరులనుజూచి శ్రీరామునికి యానవాలుకొఱకు పైనుండి యాసొమ్ముల మూటను పారవేచెను. పిదప రావణుఁడు సీతనుగొనిపోయి అశోకవృక్షమూలమున స్థాపించి, ప్రార్థించియును ప్రత్యుత్తరమునివ్వని యామెయొక్క రక్షణకొఱకు వేలకొలది రాక్షసస్త్రీలను నియమించి తనయింటికేగెను ॥ ౧౧౬ ॥ ఆసమయంబున దేవేంద్రుఁడు బ్రహ్మాజ్ఞచే వత్సరతృప్తి

ఇంద్రుఁడు బ్రహ్మాజ్ఞచే సీతాదేవికి పాయసమునర్పించుట.

కరంబయిన దివ్యపాయసముఁదెచ్చి సీతకర్పించెను.ఆమె దాని నందియానందించుచు, రామలక్ష్మణులకు నివేదించి గోదేవతలకు సమర్పించి త్రిజటకు కొంచమిచ్చి తాను కొంచముదినెను॥ ౧౧౯ ॥ పిమ్మట రావణుండు శ్రీరామహత్యకై ౧౬ మంది రాక్షసులనంపగా వారిని కబంధుఁడు

శ్రీరామచారిత్రంబు ప్రత్యక్షసిద్ధంబని పరమేశ్వరుఁ డానతిచ్చుట.

భక్షించెను. పంచవటిలో నెచ్చటెచ్చట గౌతమీతీరమున రామశర భయముచే మృగములు సంచరించెనో అచ్చటచ్చటంతయును అనేకంబులగు పుణ్యస్థలసంజ్ఞలు పట్టణంబులు పుట్టినవి. మృగనూపురము పడిదొరలినచోటు నూపురంబను పురంబయినది. రామబాణముచే చపలా

మహత్ ॥ ౨౬ ॥ అద్యాపిదృశ్యతేభీమం గర్తరూపంనరోత్తమైః । ఖరాద్యైర్యుద్ధసమయే పంచవట్యాం విదేహజా ॥ ౨౭ ॥ గుహాయాంగోపితాభర్త్రా సాద్యాపితత్రదృశ్యతే । తథారామోలక్ష్మణోపి పంచవట్యాంసదైవహి ॥ ౨౮ ॥ దృశ్యతేద్యాపిభోదేవి సజ్జనైర్జ్ఞానదృష్టిభిః । అజ్ఞానదృష్టిభిస్తైతు దృశ్యంతేగ్రావరూపిణః ॥ ౨౯ ॥ రామతీర్థం రామకృతం సీతాలక్ష్మణసంస్కృతే । తీర్థేతత్రతుగౌతమ్యాం దృశ్యతేద్యాపిమానవైః ॥ ౩౦ ॥ రామేణసీతయాయత్ర శయ్యాయాంపర్వతోపరి । కృతంపూర్వంతుశయనం రామశయ్యాగిరిఃస్మృతః ॥ ౩౧ ॥ శయ్యారూపాణిదృశ్యంతే ద్యాపితత్రతృణానిహి । రామోపిలక్ష్మణందృష్ట్వా శ్రుత్వాసీతావచోశుభం ॥ ౩౨ ॥ నివేదితంలక్ష్మణేన క్రోధాత్ప్రస్మయచేతసా । నిమిత్తాన్యతిఘోరాణి దృష్ట్వాచైవసమంతతః ॥ ౩౩ ॥ యయౌపంచవటీంవ్యగ్ర స్తత్రసీతాంనదదర్శన । తతోమానుషభావంతు దర్శయన్సకలాన్జనాన్ ॥ ౩౪ ॥ విచిన్వన్సర్వతస్సీతాం గృధ్రరాజందదర్శసః । తతస్సపక్షివచసా రావణేనహృతాం ప్రియాం ॥ ౩౫ ॥ జ్ఞాత్వాతంయోజయామాస వహ్నినాజీవితక్షయే । తత్తుష్ట్వైర్థంవనస్థమాంసం క్షిప్త్వాస్నాత్వారఘూత్తమః ॥ ౩౬ ॥ యయౌదక్షిణమార్గేణ విచిన్వన్మాధవప్రభుః । పూర్వవదగ్నిహోత్రంచ చకారకుశభార్యయా ॥ ౩౭ ॥ ఏతస్మిన్నంతరేదేవి త్వయాప్రోక్తస్త్వహంపురా । త్వయాయస్యజపోనిత్యం రామస్యక్రియతేసదా ॥ ౩౮ ॥ సోయంస్త్రీవిరహాత్కస్య మాధవభ్రమతేవనే । తవేతివచనంశ్రుత్వా తదాత్వామబ్రువంత్వహం ॥ ౩౯ ॥ దేవిసాక్షాన్మహావిష్ణుస్త్వయం రామోమహీతలే । శిక్షార్థంసకలాన్లోకాన్ మాధ

---

క్షుంబైన మృగముచచ్చినచోటు చాపల్య గ్రామంబనబడును. గోదాతీరమున రాతినేలలో రామబాణ హతంబగు మృగముపడగా దాని గురుతిప్పటికిని నరుల కగుబడును పంచవటికి చుట్టును లక్ష్మణుని ధనూరేఖ భయంకరమైన నదీరూపముగా నిప్పటికిని కనుపించుచున్నది. అచ్చటనే ఇప్పుడును రాతినేలలో గుంతయైన రావణుని గొప్పయడుగగుబడును. ఖరాదియుద్ధ సమయమున పంచవటివద్ది యేగుహాలో సీత రక్షింపబడెనో అచ్చట పతితోడ నాదేవి సాన్నిధ్యమునొంది కాన్పించుచున్నది. రామలక్ష్మణులు సంచరించిన పంచవటీ ప్రాంతమున నిప్పుడును సజ్జనుల జ్ఞానదృష్టికి వారగుబడుచున్నారు. అవి అజ్ఞానులకు శిలా రూపంబులుగానున్నవి. గౌతమీనదిలో రామతీర్థంబని లక్ష్మణతీర్థంబని వారిచే చేయబడినవి గలవు. మునుపు సీతారాములు పబండపై పండుకొని యుండిరో అదిగలది రామ శయ్యాగిరియని చెప్పఁబడుచున్నది. ఇప్పటికి నచ్చట కసవు పాన్పువలె కాన్పించును ॥ ౧౩౧ ॥ పిదప, శ్రీరాముఁడు తమ్ముని జూచి

సీతావిరహదుఃఖ వర్ణనలో పార్వతికి పరమేశ్వరుఁడు రామతత్త్వమును జ్ఞప్తిజేయుట.

సీతారోదనమును విని వెరవందుచు నెల్లెడలలో నశుభంబులగు దుశ్శకునంబుల నెఱిఁగి పంచవటికివచ్చి సీతనుగానక,లోకులకు తన మానుషలీలను జూపించువాఁడై జానకి నంతట వెదకుచు వచ్చి జటాయువునుజూచి వానివలండి రావణ దుష్కృత్యమునువిని, మృతినొందిన జటాయువునకు అగ్నిసంస్కారము నొనర్చి వన్యమాంస బలినిచ్చి స్నానముచేసెను. అట్లే దక్షిణమార్గ

వద్భ్రమతే వనే ॥ ౪౦ ॥ నారీసంగో నరైస్త్యాజ్యః సర్వదా త్రేతి శిక్షయన్ । నారీవిషయజం దుఃఖ మీదృశం భ్రమకారకం ॥ ౪౧ ॥ దర్శయన్ సకలాన్ లోకాన్ విచరత్యత్ర తే వనే । ఇతి మద్వచనం శ్రుత్వా తత్పరీక్షార్థముద్యతా ॥ ౪౨ ॥ త్వం గతాసి సమీపం శ్రీరాఘవస్య తదా వనే । సీతారూపేణ తం రామం త్వయా ప్రోక్తం శుభం వచః ॥ ౪౩ ॥ రామ రాజీవపత్రాక్ష మామగ్రే పశ్య జానకీం । క్రీడస్వాద్య మయా సార్ధమేహి శీఘ్రం సుఖీ భవ ॥ ౪౪ ॥ త్వదుక్తం రాఘవః శ్రుత్వా విహస్య త్వాం వచోఽబ్రవీత్ । జానామ్యహం కాసీతి సీతా త్వం నాసి వేద్మ్యహం ॥ ౪౫ ॥ త్వం కిం సీతాస్వరూపేణ మోహయస్యత్ర మాం వనే । ఏవం పునః పునః ప్రోక్తా యదా త్వం రాఘవేణ హి ॥ ౪౬ ॥ తదా త్వయా తత్స్వరూపం జ్ఞాతం సత్యం మయేరితం । తతో నత్వా రామచంద్రం ప్రార్థయిత్వా పునః పునః ॥ ౪౭ ॥ ఆగతాసి పునర్మాం త్వం కైలాసశిఖరే మమ (?) । త్వం కా త్వం కిమితి ప్రోక్తా రాఘవేణ పునః పునః ॥ ౪౮ ॥ యా త్వం సా దండకే జాతా త్వం కానామ్నాంబికా వనే । త్వం లజ్జితాసి రామేణ తత్ర తత్ర వనస్థలే ॥ ౪౯ ॥ త్వం లజ్జాపురనామ్నాసి నగరే దండకే వనే । తతస్తౌ రామసౌమిత్రీ జగ్మతుర్దక్షిణాం దిశం ॥ ౫౦ ॥ బహవో నిహతా మార్గే రాక్షసాః కామరూపిణః । ఏతస్మిన్నంతరేఽరణ్యే కబంధేన ధృతౌ తదా ॥ ౫౧ ॥ శ్రీరామలక్ష్మణౌ మార్గే యోజనాయతబాహునా । దృష్ట్వా తం శిరసా హీనం బాహూ చిచ్ఛేదతుస్తదా ॥ ౫౨ ॥ తతస్స దివ్యరూపోఽభూన్నత్వా రామం వచోఽబ్రవీత్ ॥ కబంధ ఉవాచ—పురా గంధర్వరాజోఽహం బ్రహ్మణో వరదానతః ॥ ౫౩ ॥ కేనాప్యవధ్యస్త్వహం స ముష్ట్యావక్త్రం ముసీశ్వరం । రక్షోభావేతి శప్తోఽహం ము

ముగాబోవుచు తాను మహాప్రభువైనను పరమమూఢునివలె కుశములతో గట్టిన భార్యాప్రతికృతిని పెట్టుకొని అగ్నిహోత్రాదులను నెరవేర్చుచుండెను. పార్వతీ, మునుపు నే నక్కాలమునగదా నీచే «శంకరా, ఏ రాముని నామమును నీవు సంతతము జపించుచుందువో ఆ శ్రీరాముఁడు స్త్రీవిరహముచే మూఢునివలె భ్రమించుచున్నాఁడు. చూడుము" అని యడుగబడితిని. అందుకు నేను నీతో «దేవీ, సాక్షాన్నారాయణుఁడే శ్రీరాముఁడుగా నవతరించియున్నాఁడు. సకల లోకమునకును-స్త్రీసంగము మిక్కిలిచెడ్డది నరులు సర్వవిధములలోను దీనిని వదలవలయును, స్త్రీవిషయ దుఃఖంబిట్టిదని తలఁపనగును, ఇది మిక్కిలి భ్రాంతికారణంబు-అని శిక్షించువాఁడై తాను మూఢునివలె వనమున విభ్రాంతి నొందుచుండును." అని చెప్పితినిగదా? ఆమాటవిని నీవు పరీక్షించుటకు ప్రయత్నించి వనమున శ్రీరామసన్నిధికి జని సీతారూపమునుదాల్చి రామునితో «రాజీవాక్షుండగు రామచంద్రా, జానకియగు నన్నుజూచి నాతోడ నిచ్చట క్రీడించుచు సుఖమునందుము రమ్ము" అనిపిలచితివిగదా? ఆమాటవిని శ్రీరాముఁడు నవ్వుచు—«నీవు ఎవతివయితివను దానినినే నెఱుఁగుదును. సీత నీవుకాదని నాకు తెలియును. ఏల నీవు నన్ను సీతారూపముతో మోహ పరచుచున్నావు." ఇట్లు పలుమారు నిరాకరింపఁగా, నేనుచెప్పినట్లు తత్స్వరూపము నెఱిఁగి సత్యమనుకొని, అంత నా రామచంద్రుని నమస్కరించి పలుమారు ప్రార్థించి ఈకైలాస శిఖరమున నాసన్నిధి కేతెంచితివిగదా? నీవప్పుడచ్చట రామునిచే ఎవతె వేల వచ్చితివని యడిగించికొని లజ్జపడిన తావున దండకారణ్యమున లజ్జాపురమని నగరమొక్కటిగల్గి

వినాప్రాహమాంపునః ॥ ౫౪ ॥ త్రేతాయుగేయదారామ లక్ష్మణౌయోజనాయతౌ । ఛేత్స్యతస్తేమహాబాహూ తదాశాపాత్ప్రమోక్ష్యసే ॥ ౫౫ ॥ తతోరాక్షసదేహోహ మింద్రమభ్యద్రవంరుషా । సోపివజ్రేణమాంరామ శిరోదేశేప్రతాడయత్ ॥ ౫౬ ॥ తదాకుక్షౌశిరఃపాదయుగళంచగతంక్షణాత్ । బ్రహ్మదత్తవరాన్మృత్యు ర్నాభూన్మేవజ్రతాడనాత్ ॥ ౫౭ ॥ ముఖాభావేకథంజీవే దయమిత్యసురాధిపః । తదామాంప్రాహశక్రోయం జఠరేతేముఖంభవేత్ ॥ ౫౮ ॥ బాహూతేయోజనాయామావద్యశీఘ్రంభవిష్యతః । తదారభ్యాత్రబాహుభ్యాం లబ్ధంతద్భక్షయామ్యహం ॥ ౫౯ ॥ తిష్ఠత్యగ్రేమతంగాది మునీనాంపరిచారికా । శబరీదర్శనార్థంత్వం తత్రయాహిరఘూత్తమ ॥ ౬౦ ॥ కథయిష్యతిసాసీతా శుద్ధింతేరఘునందన । ఇత్యుక్త్వారాఘవంనత్వా స్తుత్వాస్వర్గంయయౌముదా ॥ ౬౧ ॥ తతోరామోలక్ష్మణేన శబరీసన్నిధింయయౌ । సాపిసంపూజ్యశ్రీరామం విశేషైర్వనసంభవైః ॥ ౬౨ ॥ చితామారోఢుముద్యుక్తా రాఘవంప్రాహహర్షితా । ఋష్యమూకగిరావగ్రే సుగ్రీవోమంత్రిభిస్సహ ॥ ౬౩ ॥ వర్తతేతస్యసఖ్యేన సీతాశుద్ధింలభిష్యసి । గచ్ఛరామఇతస్త్వగ్రే పంపానామసరోవరం ॥ ౬౪ ॥ తత్తటాకేషువృక్షాణాం ఫలానివివిధానిచ । భక్షస్వత్వంజలంపీత్వా యాహిసుగ్రీవసన్నిధిం ॥ ౬౫ ॥ ఇత్యుక్త్వాశబరీ రామం నత్వావహ్నింవివేశసా । రామసందర్శనాన్ముక్తిం ప్రాప్తావైకుంఠమాయయౌ ॥ ౬౬ ॥ తతోరామశ్చసౌమిత్రి ర్యయౌపంపాసరోవరం । ఫలానిభక్షయామాస పీత్వాతజ్జలముత్తమం ॥ ౬౭ ॥ తతశ్చసైర్యయౌమార్గే ఋష్యమూకాచలంప్రతి । పశ్యన్వనాని

---

నది ॥ ౧౪౯ ॥ పిదప నా రామలక్ష్మణులు దక్షిణదిక్కునకు వెడలిరి. స్వేచ్ఛారూపులగు రక్కసు

### శ్రీరామునిచే కబంధుఁడు ముక్తినొందుట.

లనేకులచ్చట వీరిచే సంహరింపఁబడిరి ఆ నడుమ, దారిలో యోజనప్రమాణంబులగు బాహువులుగల్గిన కబంధునిచే రామలక్ష్మణులు ధరింపబడిరి. తలలేని వానిఁజూచి చేతులను తెగఁగొట్టిరి. అంత నా కబంధుఁడు దివ్యరూపమునంది రాముని వందించి "మునుపు గంధర్వరాజగు నేను ఎవనిచేతను చావని బ్రహ్మవరముగలవాఁడై ఒంటెవంటి మోముగల మునినిజూచి పరిహాసించితిని. అందుకా ముని నన్ను నీవు రాక్షసుండగుమని శపించి "త్రేతాయుగంబున నెప్పుడు రామలక్ష్మణులు యోజనప్రమాణంబులగు నీయొక్క మహాబాహువులను తెగఁగొట్టెదరో అప్పుడు నీవు ముక్తుఁడగుము." అని కరుణించెను. అటుపిమ్మట నేను రాక్షసదేహముదాల్చి యింద్రునిఁదరుమితిని. శ్రీరామా, ఆవజ్రి వజ్రంబుచే నాతలఁగొట్టెను. ఆక్షణమున నాకడుపులో తల కాళ్లును లీనంబయ్యె. బ్రహ్మవరబలమున వజ్రాఘాతముచేతను చావుకలుగదయ్యె ఇంద్రుఁడు ముఖములేక వీడెట్లు బ్రతుకునని కరుణించి నాతో "ఇప్పుడే నీకు కడుపులో ముఖముగల్గును, నీరెట్టలు ఆమడపొడవుగల వగును," అని చెప్పిపోయె. అదిమొదలిచ్చట చేతచిక్కినదానిం దినుచున్నాను. ఇఁకముందు మతంగాదిమునులయొక్క పరిచారికులుగలరు. శబరీదర్శనమునకై నీవచ్చటికి దయచేయుము. రఘునాథా, ఆమె సీతయొక్క సుద్దిని చెప్పుచున్నది."

సర్వత్ర చింతయామాస జానకీం ॥ ౬౭ ॥ ఏవం గిరీంద్రజే ప్రోక్త మారణ్యం చరితం తవ । శ్రీరామస్య ససీతస్య లక్ష్మణేన యుతస్య చ ॥ ౯ ॥ ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గత శ్రీమదానందరామాయణే సారకాండే అరణ్యచరిత్రే ఖరాదివధో నామ సప్తమస్సర్గః॥ ... ... ... ... ... ... ॥౭॥

శ్రీ శివ ఉవాచ—అథ రామో లక్ష్మణేన ఋష్యమూకాచలం ప్రతి । యయౌ ధృతధనుర్బాణో నేత్రే సర్వత్ర చాలయన్ ॥ ౧ ॥ ఋష్యమూకగిరేః పార్శ్వే గచ్ఛంతౌ రామలక్ష్మణౌ । సుగ్రీవేణాథ తౌ దృష్ట్వా ఋష్యమూకస్థితేన హి ॥ ౨ ॥ సుగ్రీవస్తౌ తదా దృష్ట్వా చతుర్భిర్మంత్రిభిర్యుతః । సంమంత్ర్య మారుతిం ప్రాహ వాలినా ప్రేషితావుభౌ ॥ ౩ ॥ మాం హంతుం ధృతకోదండౌ సతూణీరౌ నరాకృతీ । ఇతోఽస్మాభిః ప్రగంతవ్యం మంత్రం శృణు మయోచ్యతే ॥ ౪ ॥ గచ్ఛ జానీహి భద్రం తే వటుర్భూత్వా ద్విజాకృతిః । తాభ్యాం సంభాషణం కృత్వా జానీహి హృదయం తయోః ॥౫॥

అని చెప్పి రాముని వందించి వందించి యానందించుచు దివమునకరిగెను ॥౧౬౧॥ పిదప రాముఁడు లక్ష్మణునితోడ శబరీసన్నిధికి వెడలెను.

శ్రీరామలక్ష్మణులు శబరికి ముక్తినిచ్చి ఋష్యమూకగిరికరుగుట.

ఆమెయును శ్రీరాముని సంపూజించి విశేషంబులగు వన్యవస్తువులచే సత్కరించి సంతసించి చితారూఢయగుచు రామునితో "ఋష్యమూకగిరిమీఁద మంత్రులతోడ సుగ్రీవుండుగలడు. వాని సఖ్యమువలన సీతయొక్క సుద్దిని వినగలవు. ఇచ్చటనుండి ముందు పంపాసరోవరమునకు వెడలి యచ్చటి నానా దివ్యఫలంబులను భక్షించి నీరుద్రావి సుగ్రీవసన్నిధికిపొమ్ము." అని చెప్పి శ్రీరామునికి నమస్కరించి అగ్నిప్రవేశము నరించెను. రామదర్శనముచే వైకుంఠముక్తినొందెను. పిదప రామలక్ష్మణులు తిన్నగా పంపాసరోవరమునకువచ్చి ఫలాహారములనంది దివ్యోదకమును పానముజేసిరి. శ్రీరాముఁడు తిన్నగా ఋష్యమూకమునకు వచ్చుచు అంతట వనంబులంజూచుచు సీతాదేవిని దలంచుచుండెను. పార్వతీ, నీకు నాచే నిట్లు లక్ష్మణునితోడనున్న శ్రీ సీతారాముల యారణ్యచరిత్రంబు చెప్పఁబడినది ॥౭॥

శ్రీరామలక్ష్మణులను ఆంజనేయుఁడు వహించి ఋష్యమూకముపైకి గొనిపోవుట.

అనంతరంబున శ్రీరాముఁడు ధనుర్బాణంబులనుదాల్చి యంతటజూచుచు లక్ష్మణునితోడ ఋష్యమూకగిరికి వెడలెను. ఇట్లు పోవుచున్న రామలక్ష్మణులను గిరిమీఁదనుండు సుగ్రీవుఁడుచూచి తన నాల్గురుమంత్రులతోడ నాలోచించి ఆంజనేయునితో "వీరిరువురును వాలిచేపంపఁబడి నన్నుచంపుటకై ధనుర్ధారులై నరరూపులు నడచుచున్నారు. ఇచ్చటినుండి మనము కదలవలెను. నేనుచెప్పెదు యోచనను వినుము. నీవు విప్రవటువేషమునంది వారివద్దికిపోయి వారి యింగితమునెఱిఁగి, మంచిదిగానుండిన చేయిచాపిచూపి నగుమొగముగలవాడగుము. ఇట్లు నిశ్చయముఁదెలియుము. అనిచెప్పి ప్రేరించెను. అట్లేయని వాయుసుతుఁడు బ్రాహ్మణబ్రహ్మచారియైవచ్చి రాముని నమస్కరించి నరశ్రేష్ఠులారా, మీరెవరనియడిగెను. అం

యదితౌదుష్టహృదయా సంజ్ఞాంకురుకరాగ్రతః । సాధుత్వే స్మితవక్త్రో భూరేవంజానీహినిశ్చయం ॥ ౬ ॥ తథేతివ టురూపేణ గత్వానత్వారఘూత్తమం । కౌయువాంపురుషవ్యాఘ్రౌ ఇతిపప్రచ్ఛమారుతిః ॥ ౭ ॥ తతస్తంలక్ష్మణః ప్రాహ పూర్వవృత్తంసవిస్తరం । శబరీవచనాద్రామస్సఖ్యం కర్తుంసమాగతః ॥ ౮ ॥ సుగ్రీవేణాథతచ్ఛ్రుత్వా స్వ రూపంమారుతిస్తదా । చకారనైజంప్రకటం స్వీయంవృత్తంన్యవేదయత్ ॥ ౯ ॥ మత్స్కంధమధిరుహ్యాద్య పర్వ తంగంతుమర్హథః । తథేతిమారుతేఃస్కంధే సంస్థితౌతౌబభూవతుః ॥ ౧౦ ॥ ఉత్పపాతగిరేర్మూర్ధ్ని క్షణాదేవ మహాకపిః । వృక్షచ్ఛాయాంసమాశ్రిత్య తౌస్థితౌరామలక్ష్మణౌ ॥ ౧౧ ॥ సుగ్రీవంమారుతిర్గత్వా రామవృత్తంన్యవేద యత్ । తతఃప్రజ్వాల్యవహ్నిం ససుగ్రీవోరాఘవేణసహి ॥ ౧౨ ॥ చకారసఖ్యంవేగేన సమాలింగ్యపరస్పరం । వృక్ష శాఖాంస్వయంఛిత్వా విష్టరార్థంస్వయంకపిః ॥ ౧౩ ॥ హర్షేణమహతావిష్టా స్సర్వేపివావతస్థిరే । లక్ష్మణస్త్వబ్రవీ త్సర్వం సుగ్రీవంవృత్తమాత్మనః ॥ ౧౪ ॥ తచ్ఛ్రుత్వాసకలంవృత్తం సుగ్రీవస్స్వంన్యవేదయత్ । సఖేశ్రుణుష్వమేవృ త్తంవాలినాయత్కృతంపురా ॥ ౧౫ ॥ మయపుత్రోదుర్మదశ్చ కిష్కింధామేకదాగతః । కృత్వాసదీర్ఘశబ్దంతు వాలినంసముపాహ్వయత్ ॥ ౧౬ ॥ తంశ్రుత్వానిర్యయౌవాలీ జఘానదృఢముష్టినా । దుద్రావతేనసంయుక్తో జగామస్వగుహాంప్రతి ॥ ౧౭ ॥ అనుదుద్రావతంవాలీ వాలిపృష్ఠేత్వహంగతః । వాలీమామాహతిష్ఠత్వం బహిర్గచ్ఛా మ్యహంగుహాం ॥ ౧౮ ॥ ఇత్యుక్త్వాఽవిశ్యసగుహాం మాసమేకంననిర్యయౌ । గుహాద్వారాత్సయారక్తం నిర్గతంత

త లక్ష్మణుం డతనికి పూర్వవృత్తాంతమును చక్కగాఁ దెలిపి, శ్రీరాముఁడు శబరీవాక్యముచే మీ సుగ్రీవునితోడ సఖ్యమందుటకై వచ్చియున్నాఁడనెను. అదివిని మారుతి మాయావటురూప మును మాని నిజరూపమును ప్రకటించి తనసంగతిని విన్నవించి నామూపులమీఁద నెక్కికొ ని పర్వతమునకు పోఁగల్గినవారుగా నున్నారని శ్రీరామలక్ష్మణులను ప్రార్థించెను. వారు నట్లే యని వాతాత్మజుని స్కంధములలో కూర్చుండిరి. ఆమహాకపి క్షణమాత్రమున కొండ మీఁదికొక గంతువేసిపోయి చెట్లనీడలో డింపెను॥౧౧॥ హనుమంతుఁడు సుగ్రీవునికి రామవృ

## శ్రీరామ సుగ్రీవసఖ్య సంభాషణము.

త్తంబు నెఱింగించఁగా, నతఁడు అగ్నిని ప్రజ్వలింపజేసి శ్రీరామునితోడ సఖ్యమునొనర్చి పరస్ప రాలింగనమునొంది తానే ఒక చెట్టు రెమ్మవిరచి ఆసనంబుగా నర్పించెను. అమందానందము నంది యందరును కూర్చుండిరి. సుగ్రీవునితో లక్ష్మణుండు తనవృత్తాంతమును చెప్పెను. ఆసం గతినంతయునువిని సుగ్రీవుఁడు తనసంగతిని చెప్పఁబూని. “మిత్రమా, మునుపు వాలిచేననుభ వించిన నాకథవినుము. ఒకప్పుడు మయపుత్రుండగు దుర్మదుండు కిష్కింధకువచ్చి పెద్దయా ర్భాటముచే వాలినిపిలిచెను. అదివిని వాలి వెలువడి వానిని తనపిడికిటితో నొకపోటుపొ డిచెను. అంత నతఁడంతతో తనగుహకు పఱుగెత్తెను. వాలి వానినివెంబడించి తరిమెను. వాలి వెనుక నేనుగూడ దరలితిని. గుహలోదూరునపుడు వాలి నాతో “నేను గుహనుండి బయటవ

న్నిరీక్ష్యచ ॥౧౯॥ నిశ్చితంమయాపావాలీ దుర్మదేనహతస్త్వితి। ఏతస్మిన్నంతరేశ్రుత్వా కిష్కింధాంరిపువేష్టితాం ॥౨౦॥ గుహాద్వారిశిలామేకాం నిధాయదుర్మదస్యచ। యత్నతోమార్గరోధార్థం కిష్కింధామాగతస్స్వయం ॥౨౧॥ మాందృష్ట్వారిపవస్సర్వే వేగాచ్చక్రుఃపలాయనం। అనిచ్ఛంతంమంత్రిణోమాం తత్పదేసంన్యవేశయత్ ॥౨౨॥ తతోహత్వారిపుంవాలీ దృష్ట్వామాంస్వపదస్థితం। సంతాడ్యనగరాన్మాంస బహిర్నిష్కాసయత్తదా ॥౨౩॥ తతస్స సర్వలోకేషు వాదయామాసదుందుభిం। భార్యాంసుగ్రీవపాతాయస్స మేవధ్యోథవేదిని ॥౨౪॥ తతోలోకాన్పరిక్రమ్య ఋష్యమూకోమయాశ్రితః। ఏకదాదుందుభిర్నామ దైత్యోమహిషరూపధృక్ ॥౨౫॥ యుద్ధాయవాలినంరాత్రౌ సమాహ్వయతభీషణః। తతోవాలీసమాగత్య ధృత్వాశృంగేకరేణసః ॥౨౬॥ హస్తాభ్యాంతచ్ఛిరశ్ఛిత్త్వా తోలయిత్వాక్షిపద్భువి। పపాతతచ్ఛిరోరామ మతంగాశ్రమసన్నిధౌ ॥౨౭॥ రక్తవృష్టిఃపపాతోచ్చైర్మతంగశ్చాశపత్క్రుధా। యద్యాగతోసిమేవాలిన్ గిరింశీఘ్రంమరిష్యసి ॥౨౮॥ ఏవంశప్తస్తదారభ్య ఋష్యమూకంనయాత్యసౌ। ప్రతిజ్ఞాంతేకరోమ్యద్య సీతాంశీఘ్రంసమానయే ॥౨౯॥ యదానీతారావణేన తదాదృష్టామయాఖగే। బధ్వోత్తరీయేక్షిప్తాని పశ్యత్వంభూషణానిహి ॥౩౦॥ ఇత్యుక్త్వాదర్శయామాస సుగ్రీవోభూషణానిహి। తానిదృష్ట్వాబ్రవీద్బంధుం రామస్త్వంనిశ్చయంవద ॥౩౧॥ త్వయాదృష్టానిసీతాయాం తచ్ఛ్రుత్వాలక్ష్మణోబ్రవీత్। నవేద్మ్యహంసమస్తాని వేద్మ్యంగులిభవానిహి ॥౩౨॥ వందనేయానిదృష్టాని మయానిత్యంరఘూద్వహ। తతోరామోతిసంతుష్టో లబ్ధాంసీతామమన్యత ॥౩౩॥ సుగ్రీవవచనాద్రామః ప్రత్యయార్థంతదాత్మనాత్

చ్చువరకు నీవిచ్చటయుండు"మని చెప్పిపోయెను. నెలరోజులయినను మరలి రాలేదు. నేనపుడు గుహాద్వారమున రక్తమువచ్చుటను చూచి దుర్మదుండు వాలినిచంపెనని నిశ్చయించుకొని, అంతలో కిష్కింధను పగవారు ముట్టడించిరని విని, దుర్మదునికి దారిగట్టవలెనని యొకశిలఁదెచ్చి గుహాద్వారమును మూసివేసి, కిష్కింధకువచ్చితిని. నన్నుచూచి శత్రువులు త్వరగా పరుగెత్తిపోయిరి. మంత్రులు నేనుకోరకయున్నను నన్ను రాజ్యమునప్రతిష్ఠించిరి. పిదప వాలి శత్రుసంహారమునొనరించివచ్చి తనరాజ్యమేలుచుండు నన్నుజూచి పడమొత్తి యూరిబైటికి వెళ్లగొట్టెను. సర్వలోకములలోను సుగ్రీవునికాపాడువాఁడు నాచే చంపఁబడునని చాటించెను. పిదప నేను లోకములనుచుట్టి ఈ ఋష్యమూకము నాశ్రయించితిని. ఒకప్పుడు దుందుభియను దైత్యుఁడు భయంకర మహిషాకారముతోవచ్చి వాలిని రాత్రియుద్ధమునకుపిలిచెను. అంతట వాలివచ్చి వాని కొమ్మును చేతఁబట్టుకొని చేతులతో వానితలఁజీల్చి యూచి నేలఁగొట్టెను రాముఁడా, ఆతల మతంగమునిసన్నిధిలోఁబడెను. మీఁదనెత్తురువానగురియుగా నామునిః "వాలీ, నీవిచ్చటికివచ్చితివా త్వరలోఁజచ్చితివి." అని శపించెను. అదిమొదలు వాలి ఋష్యమూకమునకు వచ్చుటలేదు. నీకునేనుప్రతిజ్ఞ జేసిచెప్పెదను. సీతను త[illegible]లోదెచ్చియిచ్చెదను. రావణుఁడు గొనిపోవునపుడు గగనమున సీత నాచేత చూడఁబడెను. ఆ[illegible] యుత్తరీయమునకట్టి పడవేచిన భూషణములివిగదా చూడుము రామచంద్రా!" అనిన సుగ్రవవాక్యములను విని అ

పాదాంగుష్ఠేనాక్షిపత్త ద్దుందుభేశ్శిరఉత్తమం ॥ ౩౪ ॥ దశయోజనపర్యంతం తదా బాణేన వైభుసః । చక్రా కారాన్సప్తతాలాన్ దృష్ట్వా దేహవ్యాపీ స ప్రభుః ॥ ౩౫ ॥ స్వీయాంగుష్ఠేన సౌమిత్రేః పదం కించిద్విమర్ద్య చ । ఋజుం కృత్వా పన్నగం తం శేషాంశేన స్థితం భువి ॥ ౩౬ ॥ సుగ్రీవప్రత్యయార్థం హి సప్తతాలాన్ బిభేద సః । గుహాయామేకదా తాళఫలాని స్థాపితాని హి ॥ ౩౭ ॥ వాలినా సప్తసీతాని కేన సర్పం దదర్శ సః । తం శశాప త్వయి వృక్షాశ్చ భవిష్యంతీతి వానరః ॥ ౩౮ ॥ సర్పోప్యాహాథ తాన్ ఛేత్తా యస్తే హంతా న సంశయః । తద్దృష్ట్వా రామసామర్థ్యం తస్మిన్ప్రత్యయమాపసః ॥ ౩౯ ॥ సుగ్రీవస్తం పునః ప్రాహ రాఘవం హృష్టమానసః । వాలినే సురనాథేన పురా దత్తాస్తి మాలికా ॥ ౪౦ ॥ యాం దృష్ట్వా రిపవో యుద్ధే గతవీర్యా భవంతి హి । యా పురా కశ్యపేనైవ తపసా దుష్కరేణ చ ॥ ౪౧ ॥ శివాల్లబ్ధార్పితా పుత్ర మిద్రం తేనాపి వాలినే । ప్రీత్యార్పితా మాలికా సా వాలీ కంఠే దధాత్యసౌ ॥ ౪౨ ॥ తస్యాస్త్వం దర్శనాద్రామ గతసత్వో భవిష్యతి । తత్రోపాయం చింతయస్వ యేన తేద్య జయో భవేత్ ॥ ౪౩ ॥ తత్తస్య వచనం శ్రుత్వా రామస్సర్పం తమబ్రవీత్ । యశ్శాపాన్మోచితః పూర్వం సప్తతాలాన్విభిద్య చ ॥ ౪౪ ॥ గచ్ఛ త్వం మమ వాక్యేన కిష్కింధాయాం చ వాలినం । నిశి వినిద్రితం దృష్ట్వా హర తన్మాలికాం శుభాం ॥ ౪౫ ॥ తథేతి రామవాక్యేన కిష్కింధామేత్య పన్నగః । మంచకస్థాం జహారాథ తాం మాలాం వాసవందదౌ ॥ ౪౬ ॥ తతో రామాజ్ఞయా గత్వా సమాహూయాథ వాలినం । యుద్ధం చకార సుగ్రీవ శ్శ్రీరామోపి దదర్శ తం ॥ ౪౭ ॥ సమానరూపౌ తౌ దృష్ట్వా మిత్ర

తుఁడుచూపిన సొమ్ములనుచూచి శ్రీరాముఁడు లక్ష్మణునితో "తమ్ముఁడా, నీవు సీతయందుచూచిన భూషణంబు లివియగునా?" అనెను. అందుకు "రఘునాథా, అన్నిటిని నేనెఱుఁగను. నిత్య వందనసమయమున అంగుళ్యాభరణములనుమాత్రము నేనెఱుఁగుదునుగదా?" అనిచెప్పిన లక్ష్మణుని పలుకుచే ముదమునంది యిఁక సీత దొరకినదనియెంచెను ॥౩౩॥ పిదప సుగ్రీవుఁడుచెప్పగా

శ్రీరాముఁడు సుగ్రీవునికి నిజచర్యలచే నమ్మకమిచ్చి, వాలిమాలికను తెప్పించుట.

నతనినమ్మకమునకై తన పాదాంగుష్ఠముచే నాదుందుభిశిరంబును ౧౦ యోజనములదూరము చిమ్మెను. మఱియు సర్పదేహమున పెరిగియున్న చక్రాకారంబులయిన సప్తతాళవృక్షంబుల నుచూచి, తన పాదాంగుష్ఠముచే లక్ష్మణుని పాదమును రుద్దినమాత్రమున శేషాంశంబగు నా సర్పమును చక్కఁబరచి సుగ్రీవప్రత్యయంబునకై యాతాళంబులను బాణముచే భేదించెను. ఒకప్పుడు గుహలో తాళఫలంబులు స్థాపింపఁబడినవిగదా? వాటిలోనేదు తేబడగా వాలి సర్పమునుచూచి, "నీయందు వృక్షంబులుగూడ పుట్టుగాక" అని శపించెను. సర్పంబుకూడ "ఎవఁడు వాటిని కత్తరించునో వాఁడు నిన్ను తప్పకచంపును." అని ప్రతిశాపమునిచ్చెను. కనుక సుగ్రీవుండు శ్రీరామునియుండు నమ్మకముగలవాఁడై సంతోషించెను ॥౩౯॥ పిమ్మట సుగ్రీవుఁడు రామునితో "మిత్రమా, మునుపు శివునినుండి తపముచేసి కశ్యపబ్రహ్మసంపాదించిన రిపుబల విధ్వంసినియగు మాలికను తనపుత్రుఁడగు దేవేంద్రునికిచ్చెను. అతఁడుదానిని వాలికినిచ్చియున్నాఁడు. వాలి దానిఁదాల్చివచ్చిన నెట్టివానికైనను చూచినంతలో బలము క్రుంగిపోవును

ఘాతవిశంకయా । నముమోచతదాబాణం రామస్సోపివ్యవర్తత ॥ ౪౭ ॥ సుగ్రీవోరాఘవంప్రాహ మాంఘాత
యసివాలినా । యదిమద్ధననేవాంఛా త్వమేవజహిమాంవిభో ॥ ౪౯ ॥ తత్తస్యవచనంశ్రుత్వా సుగ్రీవస్యరఘూత్త
మః । బంధయామాససుగ్రీవం పుష్పైః క్లింతుబంధునా ॥ ౫౦ ॥ పునస్తంప్రేషయామాస సోపివాలినమాహ్వయత్ ।
తతశ్శ్రుత్వాయయౌవాలీ తంతారాప్రార్థయత్తదా ॥ ౫౧ ॥ శ్రుతమంగదవాక్యేన మయారామస్సమాగతః । చరా
రమైత్రంకింతేన మాకురుష్వాద్యసంగరం ॥ ౫౨ ॥ గచ్ఛత్వారమానాథం బంధుంమానయసాదరం । యావరాజ్య
పదందేహి తస్మైమ్మేవచనంశ్రుణు ॥ ౫౩ ॥ తత్తారావచనంశ్రుత్వా వాలీతాంవాక్యమబ్రవీత్ । జానామ్యహంరా
ఘవంతం నరరూపధరంహరిం ॥ ౫౪ ॥ తస్యహస్తాన్మృతిశ్చాస్తి గచ్ఛామిపరమంపదం । సుఖంత్వంతిష్ఠతారేత్ర
సుగ్రీవంభజసర్వదా ॥ ౫౫ ॥ యదాత్వయాససుగ్రీవః కరిష్యతిరతింప్రియే । తదాతతృప్తిభోగస్యా ఽన్యత్యంగచ్ఛా
మిభామిని ॥ ౫౬ ॥ అతఏవమాలికామేను ప్రాధాత్పశ్యమత్ప్రియే । అద్యాహంరామబాణేన పతిష్యామిరణాంగణే
॥ ౫౭ ॥ అద్యధన్యోస్మ్యహంతారే ధన్యాతేపితరౌమమ । యోహంశ్రీరామహస్తేన మరిష్యామిరణాంగణే ॥ ౫౮ ॥
ఏవమాశ్వాస్యతాంతారాం యయౌవాలీత్వరాన్వితః । దృష్ట్వావాలీమహోత్సాహ సంతోషంపరమంయయౌ

---

అందుచే నీవు దుర్బలుండగుదువేమో. తగినయుక్తిని యోచింపుము. పిమ్మట మనకు జయమ
గును." అనిచెప్పగాఁ విని రాముండుసర్వముతో "సప్తతాళంబులను భేదించి నిన్ను శాపము
నుండి రక్షించిన నామాటవినుము. నామాటమీఁద కిష్కింధకుపోయి రాత్రి నిద్రించుచుండు
వాలినిచూచి ఆ శుభమాలికను తీసికొనిరమ్ము." అని యాజ్ఞాపించెను. అట్లేయని యాపాము
రామవాక్యముచే కిష్కింధకుపోయి మంచమీఁదనున్న ఆమాలిక నపహరించి యింద్రునికిచ్చె

## శ్రీరాముండు వాలినిసంహరించుట.

ను ॥౭౬॥ పిమ్మట సుగ్రీవుఁడు శ్రీరామాజ్ఞచే వాలినిపిలచి యుద్ధముజేసెను. రాఘవుండు అక్కా
లమున సమానరూపులగు వాలిసుగ్రీవులనుచూచి మిత్రునికి పెట్టుపడునని శంకించి బాణముఁ
బ్రయోగించలేదు. సుగ్రీవుండును పోరజాలక పరుగెత్తివచ్చి, రామునితో "రామా, వాలిచే
నన్ను చంపించుటకన్నను నీవేచంపుము." అని మొరలిడిన, నందుకు రాముండు లక్ష్మణునిచేత
సుగ్రీవునికి పూలదండవేయించి మరలపంపెను. అతఁడుపోయి వాలినిపిలిచెను. అపుడు వచ్చు
చుండు వాలిని తారాదేవి "పతీ, శ్రీరాముఁడే వెంచి సుగ్రీవునితో సఖ్యమొనరించినట్లు అంగ
దునివలన నేనెఱింగితిని. ఇప్పుడు కలహింపకుము. పోయి రామచరణమును శరణమని నమ్మి, త
మ్మునిగౌరవింపుము. సుగ్రీవునికే యౌవరాజ్యాభిషేక మొనరింపుము. నామాటనాలకింపుము."
అని సంప్రార్థించెను. అందుకు వాలి "సతీ, శ్రీరాముఁడే నరాకృతినొందిన నారాయణుండని
నేనెఱుఁగుదును. వానిచేతనాకు మరణముగలదు. పరమపదమునకు పోదును. తారా, నీవిచ్చట
సుగ్రీవుని సేవించుచు సుఖమందుము. నీతోడ సుగ్రీవుఁడు సుఖమందుచుండుటచే ప్రియురాలా,

॥ ౫౯ ॥ చకారబంధునాయుద్ధం తదాబాణేనరాఘవః । వృక్షఖండేస్థితోభూత్వా పాతయామాసతంభువి॥ ౬౦ ॥ తతస్తారాసమాగత్య శుశోచవాలినంప్రతి । వాలీదృష్ట్వాగమానాథం తదాప్రాహసగద్గదః ॥ ౬౧ ॥ వృక్షఖండేస్థితోభూత్వా త్వయామాంతాడితోహృది । తవాద్యదుర్యశోజాతం మమజాతోమహోదయః ॥ ౬౨ ॥ కింమయాపకృతంతేహి త్వయాయుస్త్వాన్నిపాతితః । రామఃప్రాహవాలినంత్వం రుమాయాంలంపటస్సదా ॥ ౬౩ ॥ బంధుభార్యాంగృహేస్థాప్య బంధుంహంతుంత్వమిచ్ఛసి । దుర్వృత్తంత్వాంసమాలోక్య మయాత్వస్త్వాన్నిపాతితః ॥ ౬౪ ॥ యథాత్వయారుమాభుక్తా తథాతారాంతవప్రియాం । భోక్ష్యత్వయంహిసుగ్రీవో వచనాన్మేకపీశ్వర ॥ ౬౫ ॥ యద్యపిత్వంసురాచారో నిహతోసిరణేమయా । తథాపిభిల్లరూపేణ ద్వాపరాంతేంఘ్రిణంమమ ॥ ౬౬ ॥ ప్రభాసే త్వంశరంభిత్వా పూర్వవైరేణవానర । తతోమద్ధస్తమరణస్యా స్వకారణగౌరవాత్ ॥ ౬౭ ॥ ముక్తింగచ్ఛసివాలిన్ త్వం శుభాంజన్మాంతరేణహి । తతఃప్రాహపునర్వాలీ మేథవిష్యత్యుదీరితం ॥ ౬౮ ॥ సీతావృత్తంత్వయాపూర్వం రావణేన్నతుశేనహి । దత్తాభవిష్యదానీయ సీతాతవమయాతదా ॥ ౬౯ ॥ అధునాప్రార్థయామిత్వా మంగదంపరిపాలయ । ఇత్యుక్త్వాసతదావాలీ జహౌప్రాణాన్రణాంగణే ॥ ౭౦ ॥ అంగదేనతదారామః కారయామాసతత్క్రి-)

నేను వానిసతిని భోగించినదానియొక్క యానృణ్యమునందుదును. ప్రేయసీ, అందుచేతనే నా మాలిక మాయమయ్యె. నేడేయుద్ధరంగమున రామబాణముచే మృతినొంది ముక్తినందెదను. ఇపుడునేను ధన్యుఁడను. నాజనకులు కృతార్థులు." అని సమాధానము బలికి, త్వరగా వెడలివచ్చుచు మహోత్పాతంబులను చూచి మహోత్సాహమునంది సుగ్రీవునితో సంగ్రామమొనరించుచుండెను. అపుడు మ్రాకు చాటులోనుండి రాముఁడు బాణమువేసి వాలిని నేల

### శ్రీరాముఁడు వాలికి భవిష్యజ్జన్మము నెఱిఁగించుట.

ద్రోసెను ॥ ౬౦ ॥ పిదప తారవచ్చి వాలికొఱకు దుఃఖించెను. అపుడు వాలి గద్గదవాక్యములచే రామునితో "మ్రాకుచాటులోనుండి నాయెదను భేదించితివి. నీకిపుడు దుష్కీర్తియును నాకు సత్కీర్తియును గలిగినది. ఏలనన్ను జంపితివో, నీకేమి నేనపకారముచేసితిని?" అనిచెప్పగా; నందుకు రాముఁడు "నీవు రుమాలోలుఁడవై తమ్ముని సతిని యింటనునచి తమ్ముని జంపనెంచితివి. నీదుర్వృత్తి నెఱిఁగి నినుజంపితిని. కపిరాజా, నీవెట్లు రుమారతినొందితివో సుగ్రీవుండు నట్లే నాయాజ్ఞచే తారారతినొంది యానందించుగాక. అయినను, దురాచారుఁడు నీవు నాచేచంపఁబడితివిగాని, ఈ వైరము ననుసరించి (ద్వాపరాంతమున ప్రభాసమున నీవు బోయవాడవై బాణముచే నాకాలునుభేదింపుము) ఆకారణమున నాచే మరణమయ్యె. జన్మాంతరమున నీకు ముక్తిగాగలదు." అని వరమిచ్చెను. మరలవాలి "శ్రీరామా, నీవుమొదట నీయభిప్రాయమును తెలిపి సీతావృత్తాంతమును చెప్పియుండిన, క్షణకాలములో రావణునినుండి నేను సీతను తెచ్చియిచ్చియుందును. పోని, ఇపుడు, అంగదుని పాలింపుమని ప్రార్థించుచున్నాను." ఇట్లుసంప్రా

యాం । అథరామంసుగ్రీవో రాజ్యార్థంప్రార్థయత్తదా ॥ ౨౧ ॥ రామస్తమేవరాజానం చకారలక్ష్మణేనసః । అథ వార్షికమాసాన్వస్తుంరామోవిచారయత్ ॥ ౨౨ ॥ ప్రవర్షణగిరేఃప్రోచ్చశిఖరేస్ఫటికోద్భవాం । రమ్యాందృష్ట్వాగుహాంరామః పత్రపుష్పసమన్వితాం ॥ ౨౩ ॥ నినాయవార్షికాన్మాసాన్ చతురశ్శ్రీరఘూద్వహః । ఏకదా లక్ష్మణస్స్నాత్వా యావద్రామంసమాగతః ॥ ౨౪ ॥ సాత్త్వికాస్యాత్సీతయాయుక్త స్తావద్రామోనిరీక్షితః । సౌమిత్రిణా వందితా సాపత్యుర్వామే లయంయయౌ ॥ ౨౫ ॥ ఏవమాసీత్తదా సీతావియోగో రాఘవాయహి । సుగ్రీవోథపురీ మధ్యే చకారరాజ్యముత్తమం ॥ ౨౬ ॥ ఏకదాహనుమద్వాక్యాద్వానరాన్స సమాహ్వయత్ । ప్రవర్షణగిరా వాసీ త్తీర్థే ద్వేరామలక్ష్మణే ॥ ౨౭ ॥ ఏతస్మిన్నంతరేరామో దృష్ట్వాప్రాప్తంశరదృతుం । క్రోధేనప్రేషయామాస సుగ్రీవంలక్ష్మణాయసః ॥ ౨౮ ॥ సోపిగత్వాథకిష్కింధాం భీషయామాసవానరాన్ । ఆగతంలక్ష్మణంశ్రుత్వా సుగ్రీవో భయవిహ్వలః ॥ ౨౯ ॥ మారుతింప్రేషయామాస సాంత్వనార్థంహిలక్ష్మణం । సగత్వాతంసాంత్వయిత్వా కిష్కింధా మానయత్తదా ॥ ౩౦ ॥ ఏతస్మిన్నంతరేతారాం ప్రేషయామాసవానరః । సాపిగత్వామధ్యకక్షాం సంస్థితాతందద ర్శసా ॥ ౩౧ ॥ లక్ష్మణంసాంత్వయామాస వచోభిర్మధురైర్నిజైః । సమాహూతానిసైన్యాని రామార్థంప్లవగేనహి ॥ ౩౨ ॥ సుగ్రీవేణత్వయాకోపో మాకార్యోద్యహిదేవర । తతోలక్ష్మణహస్తంసా ధృత్వారాజగృహంయయౌ ॥ ౩౩ ॥

---

ర్థించి ప్రాణములువిడిచెను ॥ ౭౦ ॥ అపుడు శ్రీరాముఁడు అంగదునిచే వాలియుత్తర క్రియలను

### శ్రీరాముఁడు సుగ్రీవునికి కపిరాజ్యము నిప్పించుట.

చేయించెను. పిదప సుగ్రీవుఁడు రాజ్యమేలుమని రాముని బ్రార్థించెను. శ్రీరాముఁడు వానినే లక్ష్మణునిచే కపిరాజుగాఁజేయించెను. పిమ్మట వార్షికమాసంబులచ్చట వసించుటకు రాముఁడు చింతించెను. ప్రవర్షణగిరియొక్క తుంగశృంగంబున పత్రపుష్పాదులతో నొప్పుచుండు స్ఫటిక శిలారమ్యంబగు గుహానుచూచి శ్రీరాముఁడచ్చట నాలుగుమాసములను కడపెను. ఒకప్పుడు

### శ్రీరాముని సీతావిరహములోని విశేషము.

లక్ష్మణుఁడు స్నానముచేసి శ్రీరాముని జూచునప్పటికి సాత్త్వికియగు సీతతోడనుండు రాముండగు బడెను. ఆసీత లక్ష్మణునిచే వందింపఁబడి పతియెడమప్రక్క లీనయయ్యె. అప్పుడు రామునికి సీతావియోగం బీతెరంగున పరిణమించినదిగదా? తరువాత సుగ్రీవుండు తనయూరిలో రాజ్య మేలుచుండెను. ఒకప్పుడు హనుమంతుని వాక్యముచే వానరులను రప్పించెను. ప్రవర్షణ పర్వతమున రామతీర్థంబనియును లక్ష్మణతీర్థంబనియును రెండు తీర్థములేర్పడినవి ॥౭౭॥ ఇట్లుం

### శ్రీరామునివద్దికి సుగ్రీవుఁడు సేనలతో వచ్చి చేరుట.

డగా,శరదృతువువచ్చుచునే చూచి రాముఁడు కోపమునంది సుగ్రీవునివద్దికి లక్ష్మణునిఁబంపెను. అతఁడు కిష్కింధకుపోయి వానరులను వెరపించెను. సుగ్రీవుఁడు లక్ష్మణునిరాకనెఱింగి భయ భ్రాంతుఁడై సమాధానమునకై యాంజనేయుని నంపెను. అతఁడు వచ్చి సమాహితునిఁజేసి

దృష్ట్వా సుగ్రీవరాజస్తు మాసనాత్సంచచాల సః । సుగ్రీవం లక్ష్మణః ప్రాహ విస్మృతో ఽసి రఘూత్తమం ॥ ౮౪ ॥ వాలీ యేన హతో వీర స్స బాణస్త్వాం ప్రతీక్షతే । త్వమద్య వాలినో మార్గం గమిష్యసి మయా హతః ॥ ౮౫ ॥ ఏవమత్యంతపరుషం వదంతం లక్ష్మణం తదా । ఉవాచ హనుమాన్వీరః కథమేవం ప్రభాషసే ॥ ౮౬ ॥ రామకార్యార్థమనిశం జాగర్తి న తు విస్మృతః । ఇత్యుక్త్వా తం పూజయిత్వా సుగ్రీవేణ స మారుతిః ॥ ౮౭ ॥ చకార లక్ష్మణం శాంతం సుగ్రీవో ఽప్యథ వానరైః । గత్వా తం రాఘవం నత్వా దర్శయామాస వానరాన్ ॥ ౮౮ ॥ రాఘవం స తదా ప్రాహ సుగ్రీవః ప్లవగాధిపః । దేవ పశ్య సమాయాంతీం వానరాణాం మహాచమూః ॥ ౮౯ ॥ అత్ర యూథాధిపతయః పద్మాన్యష్టాదశ స్మృతాః । తతో రామాజ్ఞయా సీతా శుద్ధ్యర్థం తాం దిదేశ సః ॥ ౯౦ ॥ దిక్షు సర్వాసు విధాన్ వానరాన్ప్రేష్య సత్వరం । యామ్యాం దిశం జాంబవంతమంగదం వాయునందనం ॥ ౯౧ ॥ నలం సుషేణం శరభం మైందం సంప్రేషయత్తదా । మాసాదర్వాక్చ వర్తధ్వం నో చేద్వధ్యా భవిష్యథ ॥ ౯౨ ॥ తతో రామో ముద్రికాం స్వాం దదౌ మారుతిసత్కరే । మన్నామాక్షరయుక్తేయం సీతాయై దీయతాం రహః ॥ ౯౩ ॥ తతో రామస్స్వయం మంత్రం దదౌ తస్మై హనూమతే । తన్మంత్రస్య బలమితే కృత్వా తజ్జపలేఖనే ॥ ౯౪ ॥ లబ్ధ్వా సామర్థ్యమతులం లంకాం గంతుం స మారుతిః । నత్వా రామం పరిక్రమ్య జగామ కపిభిస్సహ ॥ ౯౫ ॥ ఉదంతం రాఘవం ప్రాహ చిత్రకూటే పురా కృతం । మనశ్శిలాయాస్తిలకం సీతాఫాలే వినిర్మితం ॥ ౯౬ ॥ గండయోః పత్ర

---

కిష్కింధకు గొనిపోయెను. అంతలో సుగ్రీవుఁడు తారనుగూడ పంపెను. ఆమె వెడలివచ్చి మధ్య కక్ష్యలో లక్ష్మణునిఁజూచి "శ్రీరామునికొఱకు కపిరాజు సైన్యములను చేర్చుచున్నాఁడు గదా? దేవరా, కోపము వలదు;" అని మృదుమధుర వాక్యములఁబలుకుచు చేబట్టి రాజగృహమునకు పిలచికొనిపోయెను. పీఠమునుండి లేచి సుగ్రీవుఁడు మర్యాద జేయునప్పటికి లక్ష్మణుండు "ఏమోయి, శ్రీరాముని మరచితివా? ఏది వాలిని చంపెనో ఆ బాణము నిన్నెదురుచూచును. నీవిపుడు నాచే వాలిదారికిపోదువు." ఇట్లు మిక్కిలి క్రూరముగా నొక్కిజెప్పెడు లక్ష్మణునికి ఆంజనేయుఁడు "ఇంత యాగ్రహమేల? ఎల్లప్పుడు రామకార్యమున జాగరూకులైయుండగా మరుపెక్కడిది?" అని సమాధానముఁజెప్పి గౌరవించి సుగ్రీవునిచే సత్కారము చేయించెను. లక్ష్మణుఁడును శాంతుడయ్యె. పిదప సుగ్రీవుఁడు వానరులతోడ వచ్చి రాఘవుని వందించి సైన్యములను చూపి "రఘునాథా, ఈ వానర మహాసైన్యము నవలోకింపుము, దీనిలో సేనాపతులు ౧౮ పద్మసంఖ్యాకులున్నారు." అని విన్నవించి, శ్రీరామాజ్ఞచే సీతావృత్తాంతము నెఱిఁగివచ్చుటకై వారికాజ్ఞనిచ్చెను ॥ ౯౦ ॥

### కపిరాజు సుగ్రీవుఁడు సీతాన్వేషణకై కపులనంపించుట.

సుగ్రీవుఁడు అన్ని దిక్కులకును కపులనంపుటలో దక్షిణదిక్కుకు అంగద జాంబవ దాంజనేయ నళ సుషేణ శరభ మైందాములనంపుచు కపులకందఱికిని "ఒక నెలలోపల నెఱిఁగిరాకపోయిన మరణదండనకు లోబడుదురు" అని చండశాసన మొనరించెను. అంత రాముఁడు తనచేతి ముద్రికను ఆంజనేయునిచేతనిచ్చి, "రహమున దీనిని సీతకప్పగించుము" అని చెప్పి, నిజమంత్ర

వల్ల్యాది సీతామైక్షన్త వానరాః । తతస్తే ప్రస్థితాస్సర్వే పశ్చిమాదిషుదిక్షుచ ॥ ౯౭ ॥ ప్రేషితాస్తే సమాయాతా న
దృష్ట్వేతి తమబ్రువన్ । తదాంగదాద్యాః ప్లవగా సీతార్థం బభ్రముర్వనే ॥ ౯౮ ॥ మత్వాయం రావణశ్చేతి రాక్షసాం కృత
కోద్దయన్ । సాధ్రాస్యాన్ ఖేచరాన్ దృష్ట్వా గుహాద్వారాద్వినిర్గతాన్ ॥ ౯౯ ॥ జలార్థం సంప్రవిష్టాస్తే గుహాయాం
వానరోత్తమాః । తస్యాం తాన్ గచ్ఛతస్తూష్ణీం దినాన్యష్టాదశైవహి ॥ ౧౦౦ ॥ అతిక్రాంతాని తిమిరే బభ్రముస్తతఇతస్త
తః । తత్రరత్నమయేదివ్యే గేహేదృష్ట్వా స్త్రియం శుభాం ॥ ౧ ॥ సంశ్రావ్య తాం నిజం వృత్తం తద్వృత్తం శ్రోతుముద్య
తాః । తాన్ సంపూజ్య కథయామాస నైజం వృత్తం తు యోగినీ ॥ ౨ ॥ హేమానామ్నీ సుతా విశ్వకర్మణస్సా మహేశ్వరం ।
నృత్యేన తోషయామాస దదౌ తస్మై పురం మహత్ ॥ ౩ ॥ అత్రస్థిత్వా చిరంకాలం యదాగంతుం సముద్యతా । సామాం
ప్రాహాత్రరామస్య ప్రతీక్షాం కురు సద్మని ॥ ౪ ॥ సమాగచ్ఛ స్వరామస్య కృత్వా పూజనముత్తమం । ఇత్యుక్త్వా సా దివం
యాతా రాఘవం గమ్యతే మయా ॥ ౫ ॥ స్వయంప్రభేతి నామ్నాహం హేమాయాః పరిచారికా । అధునా బ్రూత యు
ష్మాకం సాహాయ్యం కింకరోమ్యహం ॥ ౬ ॥ తత్తస్యా వచనం శ్రుత్వా జ్ఞాత్వా స్వీయం దినవ్యయం । తామాచుర్వానరా
స్సర్వే నస్త్వం కురు గృహాద్బహిః ॥ ౭ ॥ ఇత్యుక్త్వా సాక్షణేనైవ తైస్సహైవ యయౌ బహిః । తద్గిరాచ్ఛాదితస్వీయ
నయనైర్వానరైస్తదా ॥ ౮ ॥ నజ్ఞాతంచ తయా కేన మార్గేణ చ బహిష్కృతం । సాపిగత్వా పూజ్యరామం దేహం త్యక్త్వా

---

ము నతనికుపదేశించెను. వాయు పుత్రుఁడు ఆమంత్రమును లక్షజపముచేసి లక్షమార్లు వ్రాసి
లంకకుపోవు సామర్థ్యమునందెను. పిదప నంజనాసుతుఁడు శ్రీరామునివలన చిత్రకూటమున
సీతచెక్కిళ్లలోను నుదురులోను పత్త్రావళులు తిలకము వ్రాయబడినవిమొదలుగాగల రహస్యో
దంతములను తెలిసికొని, శ్రీరామచంద్రునికి ప్రదక్షిణ నమస్కారంబులనొనర్చి కపులతోడ
వెడలెను. తక్కినవారు పశ్చిమాదిదిక్కులకు పోయివెదకి సీత దొరకలేదని మరలి వచ్చిరి.
అంత నంగదాది కపివీరులు గహనచారులై పోవుచు వీఁడే రావణుఁడని నూర్లకొలది దొరకిన
రాక్షసులను పడమెత్తుచు॥౯౮॥ఒకానొకగుహాద్వారమునుండి వెలువడుచుండు తేమమోముల

హేమాపురమున కపులు దారిగానక చిక్కువడుట.

ఖేచరులను చూచి, ఈగుహలో నీళ్లుగలవనియెంచి లోఁజొచ్చి యూరకపోగాఁపోగా ౧౮ దిన
ములుకడచినవి. ఆగుహలోని కటికి చీకటిలోనిటటు భ్రమించి చివరకొక రత్నమయంబగు దివ్య
గృహమున శుభాంగినొకతెనుచూచి తమసంగతినిచెప్పి నీసంగతియేమనియడిగిరి. ఆయోగిని
వీరినిసత్కరించి “హేమయనుపేరుగల విశ్వకర్మయొక్కకూతురు తననృత్యసేవచే నీశ్వరిని సం
తోషపరచి ఈపురమును వరముగాగొని, యిచ్చట చిరకాలము వాసముజేసి పోవునపుడునాతో
నీవీయింటిలో రామాగమనమును ప్రతీక్షింపుచుండుము. శ్రీరాముని సత్కరించివెడలిరమ్ము.అని
చెప్పి దివమునకరిగెను. శ్రీరాముని నేనందగలను. నాపేరు స్వయంప్రభ. నేను హేమయొక్క
పనికత్తెను. నేనేమిమీకు సాహ్యముచేయవలయును?” అనిచెప్పగా, నంగదాదులు తమకాల

దివం యయౌ ॥ ౯ ॥ తతస్తే వానరా జ్ఞాత్వా గుహాయాం స్వదినవ్యయం । విషణ్ణాస్సాగరం గత్వా తస్థుః ప్రాయోపవేశనే ॥ ౧౦ ॥ జటాయోః కీర్తనం చక్రూ రామకార్యమృతం తదా । తచ్ఛ్రుత్వాథ స సంపాతిస్తాన్ హంతుం స సముద్యతః ॥ ౧౧ ॥ తేభ్యశ్శ్రుత్వా మృతిం బంధోర్దత్వా తస్మై జలాంజలిం । తేషాం శ్రుత్వా సర్వవృత్తం సీతావృత్తం న్యవేదయత్ ॥ ౧౨ ॥ శతయోజనమధ్యే ద్వీపే లంకాయాం వర్తతే ధునా । అశోకవనికాయాం తు తీర్త్వాబ్ధిం తాం ప్రపశ్యథ ॥ ౧౩ ॥ అహం పక్షవిహీనోస్మి మయా గంతుం న శక్యతే । గృధ్రత్వాద్దూరదృక్చాహం సీతా మాం దృశ్యతే గిరేః ॥ ౧౪ ॥ భ్రాత్రా జటాయుషా పూర్వ ముడ్డీయాహం బలాద్రవిం । స్ప్రష్టుకామస్తదా తప్తస్తాతో బంధుర్మయా సఖే ॥ ౧౫ ॥ పక్షాభ్యాం భస్మసాజ్జాతౌ మే పక్షౌ పతితావుభౌ । జటాయుస్సపక్షశ్చ గతో దేశాంతరం పునః ॥ ౧౬ ॥ అహం తదా పక్షహీనశ్చంద్రశర్మాణముత్తమం । మునిం నత్వా మయా తస్మై నిజవృత్తం నివేదితం ॥ ౧౭ ॥ తదా మాం స మునిః ప్రాహ యదా త్వం వానరోత్తమాన్ । సీతాశుద్ధిం కథయసి తదా పక్షౌ భవిష్యతః ॥ ౧౮ ॥ పశ్యతాం నిర్గతౌ పక్షౌ కోమలౌ మాం క్షణాదిహ । యదా నీతా రావణేన పురా సీతా విహాయసా ॥ ౧౯ ॥ మత్పుత్రేణ తదా దృష్టా కథితాపి హి మాం తదా । ధిక్కృతస్స మయా క్రోధాత్త్వయా న విమోచితా ॥ ౨౦ ॥ తదారభ్య గతః క్రోధాదద్యాపి న సమాగతః । ఇత్యుక్త్వా తాన్ కపీన్ దృష్ట్వా స సంపాతిర్గతస్తదా ॥ ౨౧ ॥ అథ తే వానరాస్సర్వే ప్రోచుః స్వం స్వం బలం తదా । న కోపి గమనే శక్తశ్శతయోజ

---

యాపనమునేఱిగి "తల్లీ, నీవు మమ్మును గుహకు వెలుపల విడిచినచాలు" నని వేడిరి. క్షణములో నామె వారితోడ గుహనుండి వెలుపలవచ్చెను. కండ్లుచిగట్లుకమ్మిన కపులువచ్చిన దారిని కానరైరి. ఆమెయును వెడలి శ్రీరాముని బూజించి దేహమును వదలి దివమున కరిగెను. పిదప కపులు గుహలో బహుకాలము వ్యర్థమాయెనని చింతతో సముద్రతీరమున ప్రాయోపవేశమున నిష్ఠులయి జటాయుసంకీర్తనమును ఆహా! రామకార్యమునకై ప్రాణమునిచ్చెగదాయని చెప్పుచుండగా, విని వీరినిచంపదలచి సంపాతివచ్చెను॥౧౧॥అపుడా సంపాతి వీరినుండి తమ్ముని మృతినె

సంపాతి సీతావృత్తాంతమును కపులకు చెప్పి, రెక్కలు మొలచి జనుట.

ఱిగి, తమ్మునికి జలాంజలినిచ్చి కపులవృత్తాంతమును తెలిసికొని వారితో "సముద్రమున నూరామడనడుమ లంకలో నశోకవనమున నిప్పుడుసీతగలదు. సముద్రమునుదాటి యామెను చూడండి. నాకు రెక్కలుపోయినవి. నేను పోజాలను. గ్రద్దనయిననేను దూరదృక్కగుదును. సీత నన్నుకొండనుండిచూచినది. నాతమ్ముఁడు జటాయువును నేనును సూర్యునిముట్టదలఁచి చాల దూరము పైకెగిరిపోతిమి. రెక్కలచేతమ్ముని బ్రోచుచువచ్చిననేను ఆతపతప్తుండనై నేలబడగా బూడిదెరెక్కలూడిపడెను. సపక్షుండగుజటాయువు దేశాంతరగతుఁడయ్యె. అప్రుడు నేనుపక్షహీనుఁడనై చంద్రశర్మయను మునీంద్రునివందించి వారికి నాసంగతి నెఱిగించితిని. వారప్రుడు కరుణించి సీతయొక్కసుద్దిని నీవు కపులకు చెప్పినపుడు నీకు రెక్కలు పుట్టును అని వరమిచ్చిరి. ఇదిగో చూడుడు మెత్తని రెక్కలిప్పుడే మొలచుచువచ్చినవి. మునుపుగగనమున

ధసాగరే ॥ ౨౨ ॥ తదాస జాంబవాన్ వృద్ధ స్తుత్వా తం మారుతిం ముహుః । జన్మకర్మాదిసంశ్రావ్య లంకాం గంతుం దిదేశ తం ॥ ౨౩ ॥ సోఽపి శ్రుత్వా సముద్యోగం చకారారుహ్య పర్వతం । నిజభారాద్భూమిగతం కృత్వా సస్మార రాఘవం ॥ ౨౪ ॥ ఏవం గిరీంద్రజే ప్రోక్తం కిష్కింధావిషయే కృతం । చరితం రాఘవేణేదం పురాపాపప్రణాశనం ॥ ౨౫ ॥ ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతానందరామాయణే సారకాండే కిష్కింధాచరిత్రం నామాష్టమస్సర్గః ॥ ... ౮ ॥

శ్రీశివ ఉవాచ—అథోడ్డీయ హనుమాన్ యయావాకాశవర్త్మనా । తద్దృష్ట్వా తద్బలం జ్ఞాతుం సురసాం నాగమాతరం ॥ ౧ ॥ ప్రేషయామాసురమరాః స్వాశీఘ్రం తత్పురో యయౌ । తదాసా మారుతిం ప్రాహ విశ త్వం వదనం మమ ॥ ౨ ॥ స ప్రాహ రఘువీరస్య కార్యం కృత్వా విశామ్యహం । దృష్ట్వా తస్యాస్తు నిర్బంధం వవర్ధ తత్ తదా కపిః ॥ ౩ ॥ వివర్ధితం తయాప్యాస్యం తదాణుర్మూర్తిర్బభూవ సః । అంగుష్ఠమాత్రస్తస్యాస్స వక్త్రం గత్వా వినిర్గతః ॥ ౪ ॥ జ్ఞాత్వా సాపి బలం తస్య స్తుత్వా తం ప్రయయౌ దివం । అథాబ్ధివచనాన్మార్గే మైనాకః పర్వతోత్తమః ॥ ౫ ॥ జలమధ్యాత్సముదభూద్విశ్రాంత్యర్థం హనూమతః । నానామణిమయైశ్శృంగైస్తస్యోపరి నరాకృతిః ॥ ౬ ॥ భూత్వా యాంతం హనూమంతం ప్రాహ మైనాకపర్వతః । ఆగచ్ఛామృతకల్పాని జగ్ధ్వా పక్వఫలాని మే ॥ ౭ ॥ విశ్రామ్యాత్ర క్షణం పశ్చాద్గమిష్యసి యథాసుఖం । పురా గిరీణామింద్రేణ యుద్ధమాసీత్సుదారుణం ॥ ౮ ॥ తదా దశరథేనాహం మోచితోఽస్మ్యత్ర సంస్థితః । అతస్తదుపకారం హి నిస్తర్తుం నిర్గతోఽస్మ్యహం ॥ ౯ ॥ గచ్ఛతో రామకార్యార్థం తవ విశ్రాంతిహేతవే । తదా

---

రావణుఁడు సీతనెత్తుకొనిపోయినపుడు నాకొడుకుచూచివచ్చి చెప్పెను. నీవామెనేలవిడిపింపలే దని నేనతనిధిక్కరించితిని. అదిమొదలు కోపమంది పోయినవాఁడీవరకురాలేదు. అనిచెప్పి, కపులనుండి సెలవంది సంపాతి తరలెను. తరువాత కపులందరునప్పుడు తమతమబలములను పలికిరి. ఒకఁడును సముద్రమున నూరామడపోవ శక్తుఁడుకాఁడయ్యె. అంతనావృద్ధకపి జాంబవంతుఁడు పలుమారాంజనేయునిస్తుతించి అతని జన్మకర్మవృత్తాంతము నెఱింగించి లంకాప్రయాణమునకు నియోగించెను. అతఁడును తదుద్యోగమునువిని కొండనెక్కి నేలగ్రుంగునట్లుచేసి శ్రీరాముని స్మరించెను. పార్వతీ, పాపపరిహారకంబైన మనుపటి శ్రీరామునియొక్క కిష్కింధావిషయములోని సచ్చరిత్రంబిట్లు నాచేచెప్పఁబడినదని మఱియు నామహేశ్వరుఁడిట్లనియె॥ ౮॥

హనుమంతుఁడు సాగరమును లంఘించి వెడలుట.

పిదప నాంజనేయుఁడు సముద్రమున లంఘించిపోవునపుడు దారిలో వాని బలమును తెలియగోరి దేవతలు నాగమాతయగు సురస నంపిరి. ఆమె వచ్చి వాయుపుత్రుని కడ్డముగ నిలచి నానోట దూరుమనెను. అపుడా కపిప్రవరుండు“ రామకార్యమును నెరవేర్చియట్లే చేయుదు” నని వేడియును, ఆమెయొక్క నిర్బంధము నెఱింగి, తనదేహమును పెంచసాగి, అట్లే ఆమెయును పెంచగా తటాలున నంగుష్ఠమాత్రుఁడై నోటదూరి బయటవెడలెను. ఆ సురసయును అతని బలమునెఱిఁగి నమస్కరించి దివమునకు తరలెను. పిమ్మట సముద్రునిమాటమీఁద మైనాకమను పర్వతేంద్రుఁడు ఆంజనేయునికి విశ్రాంతినిచ్చుటకై నీటినడుమ వెలువ

తంహనుమానాహ రామకార్యేన మేశ్రమః ॥ ౧౦॥ విశ్రామస్స్వామికార్యే తన కరోమ్యద్యభక్షణం । మైనాకస్తం పునఃప్రాహ స్వస్పర్శాత్పావయస్వమాం ॥ ౧౧॥ తథేతిస్పృష్టశిఖరః కరాగ్రేణయయౌకపిః । కించిద్దూరంగతస్యాస్య ఛాయాంఛాయాగ్రహోగ్రహీత్ ॥ ౧౨ ॥ సింహికానామసాఘోరా జలమధ్యేస్థితాసదా ॥ ఆకాశగామినాంఛాయామాక్రమ్యాకృష్యభక్షయేత్ ॥ ౧౩ ॥ తయాగృహీతో హనుమాం శ్చింతయామాసవీర్యవాన్ । కేనేదంమేకృతం వేగరోధనంవిఘ్నకారిణా ॥ ౧౪ ॥ ఏవంవిచింత్యహనుమా నధోదృష్టిఃప్రసారయన్ । తత్రదృష్ట్వాసింహికాంతాం తదాస్యేన్యపతత్కపిః ॥ ౧౫॥ తస్యాంత్రజాలంనిష్కాస్యతాంహత్వాగ్రేయయౌపునః । తతోద్ధేర్దక్షిణేకూలే లంకాం కృత్వాతుపార్శ్వతః ॥ ౧౬ ॥ పపాతపరలంకాయాం తత్రతాంరావణస్వసాం । క్రౌంచాంహత్వాసింహికా వల్లంకాంరాత్రౌవివేశసః ॥ ౧౭ ॥ తదాలంకాపురీనామ్నా రాక్షసీతంవ్యతర్జయత్ । హనూమానపితాంవామ ముష్టినావజ్ఞయాహనత్ ॥ ౧౮ ॥ తదాస్మృత్వాబ్రహ్మవాక్యం సాప్రాహశ్రుముఖీపురీ । బ్రహ్మణోక్తాపురాచాహం యదాత్వాంధర్షయేత్కపిః ॥ ౧౯ ॥ తదారామోరావణస్య వధార్థమత్రయాస్యతి । జ్ఞాతంమయారావణస్య వధంరామః కరిష్యతి ॥ ౨౦॥ జితంత్వయాగచ్ఛలంకా మశోకేపశ్యజానకీం । తతోవివేశహనుమా ల్లంకాంపశ్యన్స్వయాతదా ॥ ౨౧॥ దదర్శలంకాంతాంరమ్యాం గోపురాట్టాలమండితాం । హట్టవీధీచతుష్కాఢ్యాం త్రికూటశిఖరస్థితాం ॥ ౨౨॥ పశ్యన్సమంతతస్సీతాం ప్రతిగేహంసమారుతిః । గుహాయాంనిద్రితందృష్ట్వా కుంభకర్ణంభయానకం ॥ ౨౩॥ దృష్ట్వావిభీషణం

---

డెను. వివిధరత్నమయంబులగు దివ్యశృంగములుగల దానిమీఁదుగా వానరుండు నరరూపము నంది పోవుచుండెను. అపుడు మైనాకుఁడు “వాయుపుత్రా, నీవిచ్చటదయచేసి అమృతకల్పంబులగు పక్వఫలంబులను భక్షించి కొంచము సేపు విశ్రమించికొని పిదప నీయిచ్చవచ్చినట్లు పోవుదువుగాక. మునుపు ఇంద్రునికిని శైలరాజులకును యుద్ధమగునపుడు దశరథునివలన నేను రక్షింపబడి యిచ్చట దాగితిని. ఆ యుపకారము నెంచుచు కృతజ్ఞతజూపనిట్లు, శ్రీరామకార్యమునకుఁ బోవునీయొక్క విశ్రాంతికొఱకు వచ్చితిని.” అని పలికెను. అందుకు కపివరుఁడు “శ్రీరామకార్యమున నాకుశ్రమలేదు. స్వామికార్యమున విశ్రమించను. ఇపుడు దీనిని భక్షించను” అని నిరాకరించెను. అంత మైనాకుఁడు “అయిన నీస్పర్శచేతనైనను నన్ను పునీతునింజేయు” మనిసంప్రార్థించఁగా అట్లేయని ఆంజనేయుఁడు తనచేత వానిందాకి ముందువెడలెను. కొంతదూరముపోగా సింహికయను భయంకరమైన రక్కసియొకతె గగనచారులను ఛాయనవలంబించి భక్షించుచు ఛాయాగ్రాహిణియనబడినది యాంజనేయుని నాకర్షించెను. అప్పుడు మహాబలుండగు హనుమంతుఁడు “నావేగమునకు తడయొల్లు గల్గినది!” అని చింతించుచు క్రిందచూచి నోరుతెరచి కొనియుండు సింహికనీక్షించి దానినోటదుమికి దానిపేగులన్నిటిని పెరికిదీసి వెలువడి చంపి ముందువెడలెను. తరువాత సముద్రదక్షిణతీరమున లంకకుప్రక్కలో పరలంకలో దిగి యచ్చట రావణునిచెల్లెలగు క్రౌంచయనుదానిని సింహికను చంపినట్లే చంపిరాత్రి లంకనుప్రవేశించెను ॥౧౭॥ అప్పుడు లంకాపురియను రాక్షసి వానిని వెరిపించెను. హనుమం

రామకీర్తనే హృష్టమానసం । దృష్ట్వా సులోచనాయుక్తం నిద్రితం మేఘనిస్వనం ॥ ౨౪ ॥ యయౌ రాజగృహం రాత్రౌ రావణం సదసిస్థితం । దృష్ట్వా స్వయం వాయురూపీ దీపరాజీర్వ్యలోపయత్ ॥ ౨౫ ॥ అకరోద్వస్త్రహీనాం స్తాన్ రావణాదీం స్సమారుతిః । ఉల్కాకేనాకరోద్భస్మ కూర్చం సరావణస్యచ॥ ౨౬॥ రాక్షసీః కోటిశోన గ్నాః కృత్వా తోయఘటాన్ కపిః । బభంజలీలయా తూష్ణీం దూతాన్సృచ్ఛేనతర్జయత్॥ ౨౭॥ తదాతివిహ్వలాస్సర్వే ప్రోచుస్తే తు పరస్పరం । క్రుద్ధాద్య జానకీ సత్యం నః ప్రాణాంతముపాగతం ॥ ౨౮ ॥ తమ్ఛృత్వా తుష్టచిత్తస్స యయౌ రావణసద్గృహం । అదృష్ట్వా జానకీం తత్ర యయౌ పుష్పకముత్తమం॥ ౨౯ ॥ రావణం నిద్రితం దృష్ట్వా వేష్టితం స్త్రీకదంబకైః । దృష్ట్వా మందోదరీం తత్ర సీతేయమితి శంకితః॥ ౩౦ ॥ లక్ష్మణోక్తాని చిహ్నాని పశ్యం స్తస్యాం దదర్శన । తథాపి సీతాసదృశీం దృష్ట్వా వ్యగ్రమనాస్త్వభూత్ ॥ ౩౧ ॥ పార్వత్యువాచ—కథం మందోదరీ సీతా సదృశీ రాక్షసీ రితా । సీతాం శాంశాంశజాస్సర్వాః స్త్రియశ్చేతి శ్రుతం మయా॥ ౩౨ ॥ శ్రీశివ ఉవాచ—శృణు ష్వ కారణం దేవి సీతేయం విష్ణునార్చితా । తేనైవ విష్ణునా పూర్వ మియం మందోదరీ చితా ॥ ౩౩ ॥ ఏకదా కైకసీ మాతా రావణం ప్రాహ దుఃఖితా। శేషోచ్ఛ్వాసేన మే లింగం గతం చాద్య రసాతలం॥ ౩౪ ॥ శివాదానీయమాం దేహి ఆత్మలింగమనుత్తమం । తస్మాత్త్వ

## ఆంజనేయుఁడు లంకలో ప్రవేశించి సీతను వెదకుట.

తుఁడును దాని నెడమముష్టితో నొకమొట్టుమొట్టి యణచెను. అపుడాలంకాపురి బ్రహ్మవాక్యమును స్మరించి కన్నీరు గార్చుచు "బ్రహ్మ యిట్లు నాతో చెప్పియుండెను. ఎప్పుడు నిన్ను కపి నిగ్రహించునో అప్పుడు శ్రీరాముఁడు రావణునిఁ జంపుటకు వచ్చుటకు వచ్చును. కనుక, రాముఁడు రావణునిఁజంపును. నేనేఁటిగెలిచిని. నీవునన్ను గెలిచితివి. లంకకుఁబొమ్ము..అశోకవనమున జానకినిచూడుము." అని పలుకగా నాంజనేయుఁడు వచ్చుచు త్రికూట శిఖరస్థితంబును హర్మ్యశ్రేణీరమణీయంబును శృంగారశృంగాటకసంగతంబును గోపురాట్టాల శోభితంబునగు లంకాపురిని అంతట పరిశీలించుచు ప్రతిగృహమందును సీతనువెదకబూని, భయంకరుఁడై గుహలో నిద్రించుచుండు కుంభకర్ణునిఁజూచి, శ్రీరామకీర్తనంబున కుతూహలచిత్తుఁడగు విభీషణుని నీక్షించి, సులోచనాయుతుఁడై నిద్రించుచుండు మేఘనాదుని నవలోకించి, రాత్రిరాజగృహములోఁ జొచ్చెను. సభలోనున్న దశకంఠునుంజూచి వాయురూపియగుతానే దీపావళి నార్చెను. రావణాదులనందరిని నగ్నులఁగావించెను. రావణుని గడ్డము మీసములను కొఱవిచే బూడిదెఁజేసెను. వినోదముగా గుడ్డలులేని కోట్లకొలది రాక్షసస్త్రీలకు నీటికుండల నంటగట్టెను. దూతలను తోకతో వెఱపించెను. అప్పుడందరును భయభ్రాంతులై "నేడు సీతాదేవి కుపితయైయుండును, సత్యము. ప్రాణాంతకము. వచ్చినది." అని యొండొరులు చెప్పికొనసాగిరి. అదివిని కొండ మానందింప నయ్యాంజనేయుఁడు రావణుని యంతఃపురములోఁజొచ్చి అచ్చటను సీతనెఱుఁగక పుష్పకమునకు వెడలి స్త్రీపరివార పరివేష్టితుఁడై నిద్రించుచుండు రావ

చనంశ్రుత్వాగాయనాద్వరదోస్మ్యహం॥ ౩౫ ॥ మామాహరావణోవాక్యం ద్వౌవరౌదేహిమాంప్రభో । ఆత్మలింగంచమ న్మాత్రే పత్న్యర్థ పార్వతీంమమ॥ ౩౬ ॥ తత్తస్యవచనంశ్రుత్వా త్వందత్తాసిగిరీంద్రజే । దత్వాత్మలింగంసంప్రోక్తో మయాత్వాయుధిరావణః॥ ౩౭ ॥ మార్గేలింగంభూమిసంస్థం కరోషితర్హ్యహంపునః । నాగ్రేగచ్ఛామితత్ స్థానాత్త త్రైవచవసామ్యహం॥ ౩౮ ॥ తథేతిరావణఃప్రోక్త్వా దేవ్యాలింగేనసోయయౌ । తదాత్వయా స్మృతో విష్ణుస్తేనాం గంచందనాదినా॥ ౩౯ ॥ కృత్వామందోదరీనామ్నీ మయహస్తేర్పితాశుభా । తాంనినాయమయశ్శీఘ్రం పాతాళేస్వీ యసద్గృహం॥ ౪౦ ॥ తతోద్విజస్వరూపేణ విష్ణుఃప్రాహదశాననం । ప్రతారితశ్శివేనత్వం దత్వాదుర్గాంతుకృత్రి మాం॥ ౪౧ ॥ పాతాళేమయగేహేసా గోపితాస్తిశివేనహి । వివిచ్యసిత్వంస్వర్లోకం భూర్లోకంచేతిశంకయా॥ ౪౨॥ స్వీయంమత్వాతుపాతాలం తత్రత్వంనవివిచ్యసి । త్యజేమాంకృత్రిమాందుర్గాం పశ్యత్వంమయసద్మని ॥౪౩॥ గిరీంద్ర జాంమహారమ్యాం పత్నీంకృత్వాసుఖంభజ । తద్విప్రవచనంసత్యం మత్వామామేత్యవైపునః॥ ౪౪॥ విహస్యరావణః ప్రాహ జ్ఞాతంతేంతర్గతంమయా । అర్పితాకృత్రిమాదేవీ మా తాంగోప్యరసాతలం॥ ౪౫॥ తత్రైవాస్త్వధునాచేయం త్వహంనేష్యామిగోపితాం । ఇత్యుక్త్వాతాంవిసృజ్యాథ పాతాలంగంతుముద్యతః ॥ ౪౬ ॥ తావన్మార్గేహ్యల్పశంకా

ణుని సద్ద మందోదరినిఁజూచి సీతయనిశంకించి లక్ష్మణుఁడుచెప్పియున్న గురుతులామెయందు కానరాకపోయినను జానకీసదృశయని పరికించి వ్యాకులచిత్తుఁడాయెను॥ ౩౭॥ అని చెప్పినపతితో

మందోదరీ జన్మవృత్తాంతము. గోకర్ణమహాక్షేత్రోత్పత్తి.

పార్వతి "సీతయొక్క కళలోని యంశాంశమువలన స్త్రీలందరునుపుట్టిరని వినియున్నానే, రక్క సియగు మందోదరి యెట్లు సీతకు సమానురాలగును?" అనిన నాసాంబమూర్తి యిట్లనెను— ఒకప్పుడు రావణునితల్లియగు కైకసి యేడ్చుచు కొడుకుతో "శేషుని యుచ్ఛ్వాసముచేత నా లింగము రసాతలమునకేగెను. మేలైన ఆత్మలింగమును శివునివలన సంపాదించియిమ్ము."అని కోర్కెఁజెప్పికొనెను. తల్లికోఱకు రావణుఁడు సామగానములచే నన్ను మెప్పించి నేను వరము లు వేడుమనగా "నేను రెండువరములనడిగెదను. నాతల్లికై యాత్మలింగమునిమ్ము. నాకుపత్ని గా పార్వతి నిమ్ము." అని కోరెను. అపుడు నిన్ను నేనిచ్చితిని. ఆత్మలింగము నిచ్చుచు "ఓరి రావణా, దారిలో నీవు ఈలింగమును నేలఁబెట్టితివా, నేనుపిమ్మట నచ్చటినుండి వెలువడిరాను' అని యొప్పించి పంపితిని. సరియనివాఁడు పోవుచుండెను. వానిచేఁ జిక్కిననీవు శ్రీవిష్ణుమూర్తి ని స్మరింపగా నతఁడు చందనాదులతో నొక విగ్రహముఁజేసి దానికి మందోదరియని పేరిడి మయునికప్పగించెను. ఆ మయుఁడు పాతాళమున తన యింటిలో భద్రపరచిపెట్టెను. అంత శ్రీహరి బ్రాహ్మణరూపముతో వచ్చి రావణునిఁజూచి "నిన్ను శివుఁడు వంచించినాడు, ఎట్లనిన కృత్రిమయగు దుర్గాదేవిని నీకిచ్చి, నీవు భూస్వర్లోకములలో వెదకనేర్తువు స్వీయబుద్ధిచే పాతా ళమును వదలుదువు, అని మయునియింటిలో తన దేవిని దాచిపెట్టెను. కావున నీమోసగాతి

గ్రస్తః ప్రాహద్విజంతథా । అత్రలింగం క్షణం హస్తే గృహీత్వా వచనాన్మమ॥ ౪౭॥ యావన్నిర్వర్త్యశౌచంతాంత్వా మహమేష్యామి వేగతః । ద్విజవేషధరో విష్ణుస్తదా ప్రాహ దశాననం॥ ౪౮॥ అతిక్రాంతే ముహూర్తేథ లింగం స్థాప్య వ్రజామ్యహం । తథేతి రావణః ప్రోక్త్వా తత్కరే లింగమర్పయత్ ॥ ౪౯॥ తతో మూత్రస్య సాధారా ఖండితాభూచ్చిరం ప్రియే । అతిక్రాంతే ముహూర్తేథ లింగం సాగరరోధసి॥ ౫౦॥ పశ్చిమే స్థాప్య భూమ్యాం స యయౌ స్వీయస్థలం హరిః । తతస్స రావణశ్చాపి మూత్రం కృత్వా యథావిధి॥ ౫౧ ॥ లింగం దృష్ట్వా భూమిసంస్థం తచ్ఛిరశ్చాలయత్తదా । తదా భూమ్యాంగతం లింగం శిరః కించిచ్చచాల స॥ ౫౨॥ అభూద్గర్తా కర్ణరంధ్ర సదృశీ తచ్ఛిరః స్థలే । గర్తాయాం తచ్ఛిరశ్చాపి కర్ణశంఖూపమం కృశం॥ ౫౩॥ భువః కర్ణోపమం లింగం గోకర్ణం తద్వదంతిహి । తతః ఖిన్నమనాస్తూష్ణీం పాతాలం రావణో యయౌ॥ ౫౪॥ మయగేహే నిరీక్ష్యాథ దేవీం మందోదరీం వరాం । మయం సంప్రార్థయామాస దదౌ తాం రావణాయ సః॥ ౫౫॥ తతో వివాహం నిర్వర్త్య పారిబర్హం దదౌ మయః । రావణాయ దృఢాం శక్తిమమోఘాం శత్రుఘాతినీం॥ ౫౬॥ దృష్ట్వా మందోదరం తస్యాః ప్రాహ మందోదరీమితి । తాం నామ్నా రావణస్తూర్ణస్త యా స్వీయస్థలం యయౌ॥ ౫౭॥ తతో మాత్రాధికృతస్స పునస్తప్తుం త్వరాన్వితః । గోకర్ణం రావణో గత్వా తప్త్వా లబ్ధ్వా విశ్వేశ్వరాత్॥

---

ని విడిచి మయునియింటిలో పోయిచూడుము. మిక్కిలి మనోహరయగు చక్కనిపార్వతిని పత్నిగాఁజేసికొని సుఖింపుము.” అని యుపదేశించెను. రావణుఁడామాటలు సత్యంబులనినమ్మి నావద్దికి మరలవచ్చి నవ్వుచు “నీమనోగతమును నేనెఱిఁగితిని. నిజగిరిజను దాచి ఈ మాయ బొమ్మనా నాకిచ్చితివి. నీదినీవేతీసికొమ్ము, నే నామెనుగొని తెచ్చెదను.” అని నిన్ను నాకర్పించి పాతాళమునకు పోదలచెను. అంతలో మార్గమున రావణుని కల్పశంకకురాగా నావిప్రునితో “నేనల్పశంకానివృత్తి జేసికొనివచ్చునంతవరకు నీవీయాత్మలింగమును చేతఁబట్టియుండు” మనెను. విప్రవేషుఁడగు విష్ణువు “ముహూర్తకాలముమించెనా నేను దీనిని నేలఁబెట్టిపోదు”నని లింగమును తీసికొనెను. రావణుఁడుపోయి దీర్ఘమూత్రవిసర్జనలో యుండెను. ముహూర్తమతిక్రమించగా ముకుందుఁడు పశ్చిమ సముద్రతీరమున నవనిలో నాత్మలింగమును సంస్థాపించి తన తావునకు తరలెను అంతనా రావణుఁడు శౌచవిధిఁదీర్చికొనివచ్చి నేలనున్న లింగమునుచూచి దానిఁబెగలించెను. అది యిసుమంతైనను కదలక యుండగా దాని తలపై కర్ణరంధ్రసదృశంబైన గర్తమొకటిగల్గెను. భూమిలోని కర్ణోపమలింగముగాన దానిని గోకర్ణమని చెప్పుదురు గదా? అంత రావణుఁడు ఖిన్నుఁడై యూరక పాతాళమునకుపోయి మయుని మందిరంబున మనోహారియగు మందోదరినిచూచి ప్రార్థింపగా, నతఁడు దానిని రావణునికిచ్చి పెండ్లిజేసెను. అపుడు మయుఁడు అల్లునికి శత్రుఘాతినియై యమోఘంబగు శక్త్యాయుధంబును పారిబర్హంబుగానిచ్చెను. ఇది మందమైన యుదరముగలదిగాన మందోదరియనబడున నెను. రావణుండా రామామణితోడ రాజిలుచు నిజరాజధానికేతెంచెను ॥౫౭॥ పిదప తల్లిచే ధిక్కరిం

౫౮॥ త్రైలోక్యం స్వవశంకృత్వా లంకాయాంరాజ్యమాపసః । తస్మాత్త్రీతా సమానేయం దృష్టా మందోదరీప్రియే॥ ౫౯॥ లంకాయాం వాయుపుత్రేణ రావణాగ్రేవినిద్రితా । మయోప్యాగాత్సలంకాయాం గృహంకృత్వా యథాసుఖం॥ ౬౦॥ మయబంధుర్గయోనామ మహాస్వీరః ప్రతాపవాన్ । రాత్రౌవినిద్రితో గేహే బ్రహ్మదత్తవరస్సుధీః॥ ౬౧॥ దశాస్య హస్తాత్తన్మృత్యు ర్విధినోక్తం విచింత్యచ । తస్యవస్త్రం మారుతినా హృతం సదసి వై పురా॥ ౬౨॥ తత్క్షిప్తం హేమపర్యంకే రావణస్యకపిస్తదా । విభీషణస్యపర్యంకే వసనం రావణస్యచ॥ ౬౩॥ క్షిప్త్వాపశ్యన్జానకీం స లంకాయాంచ ముహుః కపిః। యయావశోకవనికాం వృక్షప్రాసాదమండితాం॥ ౬౪॥ దదర్శతత్రప్రాసాదం శింశపానామపాదపం । తన్మూలే రాక్షసీమధ్యే దదర్శావనికన్యకాం ॥౬౫॥ ఏకవేణీం కృశాం దీనాం మలినాంబరధారిణీం । భూమౌశయానాం శోచంతీం రామరామేతిభాషిణీం॥ ౬౬॥ కృతార్థోహమితి ప్రాహ దృష్ట్వా సీతాం సమారుతిః । శింశపానగశాఖాగ్ర ముపలభ్యాంతరస్థితః॥ ౬౭॥ పురాదృష్టానలంకారాన్ తస్యాదేహే దదర్శ స । తతః కిలకిలాశబ్దైర్యయౌతత్రదశాననః ॥౬౮॥ దదర్శ రావణస్స్వప్నే కపిః కశ్చిత్సమాగతః । అశోకవనికాయాం సా దృష్ట్వా తేన విదేహజా॥౬౯॥ రామహస్తాన్మృతిశ్శీఘ్రం లబ్ధుం తాం ధర్షయామ్యహం । కపిర్దృష్ట్వా రాఘవాయ నివేదయతు మత్కృతం॥ ౭౦॥ ఆగమిష్యతి తచ్ఛ్రుత్వా రా

### హనుమంతుఁడు వెదకుచుపోయిసీతను దర్శించుట.

పఁబడి యాదశకంఠుఁడు మరలతపించుటకై త్వరగా గోకర్ణమునకువచ్చి తపమొనరించి బ్రహ్మ వరములనంది త్రిలోకములను తన వశముఁజేసికొని లంకలోరాజ్యమేలుచుండెను. అందువలన మందోదరి సీతవలె చక్కనిదైయుండినది. ఆ మందోదరి నిద్రించుచుండగా నంజనాసుతుఁడు చూచెను. లంకలోనే మయుండును ఇల్లుగట్టుకొని వసించుచుండెను. మయుని తమ్ముఁడుగయుఁడను వాఁడు బ్రహ్మవరముల నంది మహాబలుండై యచ్చట నిద్రించుచుండెను. అపుడు హనుమంతుఁడు "వీనికి మృత్యువు రావణునిచేనగును. అట్లు బ్రహ్మవాక్యముగలదని" పరిభావించి, మొదట తానెత్తిన వాని వస్త్రమును రావణుని బంగారు మంచముపై వేసెను. రావణవస్త్రమును విభీషణుని పర్యంకమందునచెను. అంత నెచ్చటను సీతనుగానక యశోకవనమునకువచ్చి యచ్చట యొకప్రాసాదమును శింశుపావృక్షమును చూచెను. ఆ వృక్షమూలమున రాక్షసపరివేష్టితయై రామకాంత కనుబడెను. ఒకటేజడఁదాల్చి కృశయై దైన్యమునంది మలినవస్త్రముఁగప్పికొని నేలఁబండుకొని రామరామయని యంగలార్చుచుండు జానకీదేవినిచూచి యాంజనేయుఁడు ధన్యుఁడైతి ననుకొని యయ్యశోక వృక్షశాఖాగ్రమున దాగి కూర్చుండి, మునుపుండిన అలంకారములను చూడడయ్యె ॥ ౬౮ ॥ తరువాత రావణుఁడు కపియొకఁడువచ్చి యశోకవనమున

### రావణుఁడు సీతచే తిరస్కృతుఁడై జనుట.

సీతనుచూచినట్లు కలగని, "శ్రీరామునిచేత త్వరగా చావునందుటకై యామెను బలాత్కరించి

మామాంనిహనిష్యతి । ఇతినిశ్చిత్యసయయౌ స్త్రీభిస్సంవేష్టితోముదా॥౨౧॥ నూపురాణాంధ్వనింశ్రుత్వావిహ్వలాసీద్వైదేహజా । రావణోజానకీమాహ మాందృష్ట్వాకింవిలజ్జసే॥౨౨॥రామంవనచరంరాజ్య భ్రష్టంత్యక్తసుహృజ్జనం।పిత్రాహీనంభోగహీనం పదాత్వయ్యతినిష్ఠురం॥౨౩॥ఏకాంతవాసినపింగ జటావల్కలధారిణం । తంత్యక్త్వామాంభజస్వాద్యత్రైలోక్యేశంమహాబలం॥౨౪॥అప్సరోభిస్సేవితంమాం భాగ్యయుక్తంవదస్థితం। స్త్రీయోమందోదరీముఖ్యా స్త్వాంభజిష్యంత్యహర్నిశం॥౨౫॥ మయారాజ్యంత్వదధీనం కృతమస్తిభజస్వమాం । మయాస్వజీవితంచాపి త్వదధీనంకృతంమహత్॥౨౬॥ఇతినానావిధైర్వాక్యైః ప్రార్థయామాసరావణః । ఉవాచాధోముఖీసీతా నిధాయతృణమంతరే॥౨౭॥రాఘువాద్భీభ్యతానూనం భిక్షురూపంధృతంత్వయా । రహితేరాఘువాభ్యాంత్వం శునీవహవిరధ్వరే॥౨౮॥హృతవానసిమాంనీచతత్ఫలంప్రాప్స్యసేచిరాత్।యదారామశరాఘాత విదారితవపుర్భవాన్॥౨౯॥భవిష్యసిరణేరామం జానీషేమానుషంతదా। శ్రుత్వారక్షోధిపః క్రుద్ధోజానక్యాఃపరుషాక్షరం॥వాక్యంక్రోధసమావిష్టః పునర్వచనమబ్రవీత్॥౩౦॥

యవమానించెదను. నాచేష్టను కపి చూచి రామునితో చెప్పునుగాక. అందువలన రాముఁడు వచ్చి నన్ను చంపునుగాక." అని యిట్లునిశ్చయించి స్త్రీపరివృతుఁడై సీతయున్న చోటికి కోలాహలము జేయుచు వచ్చెను. నూపురనాదమునువిని వైదేహి విహ్వలయయ్యె. రావణుఁడు ఎదుట వచ్చి సీత «నన్నుచూచి యేల సిగ్గుపడుచున్నావు? సుఖములేక యడవులపాలై యొంటరిగ దిక్కుమాలినవానివలె మిత్రులు విడనాడ రాజ్యభ్రష్టుఁడై తండ్రిలేనిరాముని నేల వరించి యున్నావు?నీతో నెల్లప్పుడు నిష్ఠురములాడుచుండెడు జడదాల్చిన జోగిగాడే?త్రిలోకపాలకుఁడై మహాబలుఁడగు నన్ను భజింపుము. భాగ్యయుక్తుఁడై యప్సరసలచే సంసేవింపఁబడు నన్నేమందువు? నన్ను నీవు వరించితివా మండోదరి మొదలగు సుందరులందరును నీ పనికత్తెలుగారే? నారాజ్యము నీయధీనముగాదటే? నాప్రాణములు నీయధీనములుగావేమే?" ఇట్లు నానావిధ వాక్యములచే సంప్రార్థించెను. అందుకు సీత నేలఁజూచుచు కసవు కడ్డి నడ్డుజేసికొని «శ్రీరామునికి వెరచి నీవు బిచ్చగాడవయితివే. నీచుఁడా, రఘువరులు వారిరువురు లేనప్పుడు యజ్ఞమున హవిస్సును కుక్కవలె నీవు నన్ను తెచ్చితివే. త్వరలో దాని ఫలము ననుభవించెదవు. ఎప్పుడు రణాంగణమున రామబాణములచే నీదేహము చీలి బద్దలగుచుండునో అపుడు రాముని మానుషత్వము నెఱుంగుదువుగాక."అని తుచ్ఛీకరించగా రావణుఁడు మిక్కిలి కోపమునొంది «దేవత లీయూరిలో నింకయును దుఃఖింతురు. రాముఁడు నాయెదుట నిలిచిపోరజాలడు.అట్లు నిలచెనా వాఁడు చెడును. రాముఁడుజయించచాలడు.నాకానందము."అని యిట్లునొక్కి చెప్పెను.

శిఖరిణీ వృత్తం. ౧—భవిత్రీ లంకాయాం (త్రి)దశవదనగ్లాని రచిరా ।
౨—త్స రామోపి స్థాతా (న)యుధి పురతో లక్ష్మణసఖః॥
౩—తథా యాస్యత్యుచ్చై (ర్వి)పద మనుజే నాత్ర జటిలో।
౪—జయశ్రీ రామే స్యా (న్న)మమ బహుతోషో త్రతు భవేత్ ॥౨౧॥

తద్రావణవచశ్శ్రుత్వా జానకీ ప్రాహ తం పునః । షష్ఠాక్షరపరాణ్యేవ చతుర్ష్వపి చరణేష్వపి ॥ ౨౨ ॥ త్యక్త్వాక్షరాణి చత్వారి లోప్యశ్లోకమముం పఠ । ఏవం తయా జితో వాక్యైర్మార్గణైస్స దశాననః ॥ ౨౩ ॥ దుద్రావ భీషయన్ సీతాం ఖడ్గముద్యమ్య సత్వరః । ధృత్వా కరేణ తత్పాణిం మందోదర్యా నిషేధితః ॥ ౨౪ ॥ మాదృశ్యో బహవస్సంతి త్యజైనాం కృపణాం కృశాం । తతోఽబ్రవీద్దశగ్రీవో రాక్షసీర్వికృతాననాః ॥ ౨౫ ॥ యథా మే వశగా సీతా భవిష్యతి సకామనా ।

టీక॥ లంకాయాం=లంకాపురిలో, అచిరాత్=త్వరగా, త్రిదశవదనగ్లానిః=దేవతల మోములకుపీడ, భవిత్రీ=కాగలిగినది. లక్ష్మణసఖః=లక్ష్మణునికి మిత్రమైన, సః రామః అపి=ఆరాముఁడుగూడ, యుధి=రణమున, పురతః=నాయెదుట, నస్థాతా=నిలువగల్గిన వాఁడు కాఁడు. తథా=అట్లే, జటిలః=జడదాల్చిన రాముఁడు, అత్ర=ఇచ్చట, అనుజేన=తమ్మునితోఁడ, ఉచ్చైః=గొప్పదైన, విపదం=ఆపదను, యాస్యతి=పొందగలఁడు, రామే=రాముని యందు, జయశ్రీః=జయసంపద, స్యాన్న=గలుగనేరదు.. అత్ర=ఈవిషయమందు, మమతు=నాకైననో, బహుతోషః=మిక్కిలిసంతసము, భవేత్=అగును,—అని రావణుఁడు చెప్పగా అందుకు సీత "ఈ శ్లోకములోనే ప్రతి పాదమునను ౭వ అక్షరములను నాల్గింటిని లోపించి పఠించికొనుము. నీ బ్రతుకందులోనే తెల్లవారును" అని చెప్పెను. (అనగా- మొదటిపాదమున- త్రి- రెండవపాదమున- న- మూడవపాదమున- వి- నాల్గవపాదమున- న- అని లోపింపవలసిన అక్షరములగును. అట్లు లోపించిన నిట్లగును. శ్లో॥ భవిత్రీలంకాయాందశవదనగ్లానిరచిరా । త్స రామోపిస్థాతాయుధిపురతో లక్ష్మణసఖః॥ తథాయాస్యత్యుచ్చైః పదమనుజేనాత్రజటిలో । జయశ్రీరామేస్యాన్మమ బహుతోషోత్రతుభవేత్ ॥*॥ తా—లంకాపురిలోఁ ద్వరగా దశముఖుని ముఖములకు పీడ కాఁగల్గినది. లక్ష్మణుని మిత్రమైన ఆరాముఁడె రణమున నీయెదుట నిలువఁగల్గినవాఁడు. అట్లే జడధారి రాముఁడిచ్చట తమ్మునితోఁడ గొప్ప పదవి నందఁగలఁడు. శ్రీరామునియందే జయసంపద నిలుచును. ఈవిషయమున నాకు నమందానందమగును. ఇచ్చట శిఖరమనగా కలశము అదిగల్గినది రాజ్యసంపదను శిఖరిణియనవచ్చును. ఆ వృత్తముతో రావణుఁడు చెప్పగా నందలో సీత యొకయక్షరమును లోపించి షోడశచ్ఛందో వృత్తముతో నుత్తరముగా దానినే చెప్పగా, నీరాజ్యసంపద తొలఁగి నీకు షోడశసంస్కారప్రాప్తిగల్గునని రావణునికి సూచించినట్లయినది. ఇది దైవమాయగా వాని నోట సరస్వతిపలికించె ననవచ్చుగానున్నది. ఎట్లయిన నదియు నొక వక్రోక్త్యలంకారభేదమన బరగుచున్నది.)

అని ఇట్లు సీతావాక్శరవిద్ధుఁడైన రావణుఁడు పిదప క్రుద్ధుఁడై వేగమె చేతకత్తి నెత్తికొని వెరపించుచు పరుగెత్తెను. మందోదరి వాని పాణిఁ దనచేబట్టి వలదని "నావంటివారందరో గలరు, ఈ కృపణయగు కృశాంగిని విడువుము." అని నివారించెను. అంతనా రావణుఁడు "వికారంబులగు రాక్షసాంగనలారా, మీరందరును సీత సకుతూహలయై ఎట్లు నాకు వశవర్తిని

తథాయతంతత్వరితం తర్జనాదరణాదిభిః॥౮౬॥ యదిమాసద్వయాదూర్ధ్వం మచ్ఛయ్యాంనాభినందతి। తదామేప్రాతరాశాయ హత్వాకురుతమానుషీం॥౮౭॥ తదాసీతాపునఃప్రాహ వచనంతందశాననం। బాల్యేత్వేహంసమానీతా పేటికాస్థాత్వయాపురా॥౮౮॥ తదామయావచఃప్రోక్తం తత్త్వంకింవిస్మృతోసిహి। అధునాహంగమిష్యామి యాస్యామిత్వరితంపునః॥౮౯॥ త్వాంబంధుపుత్రసైన్యాద్యైర్హంతుంచేతిమయేరితం। తత్స్వీయంవచనంసత్యం కర్తుమత్రాగతాస్మ్యహం॥౯౦॥ త్వాంబంధుపుత్రసైన్యాద్యైర్హనిహత్యరామహస్తతః। తతోయోధ్యాపురీంగత్వా పునర్యాస్యామిత్వత్పురీం॥౯౧॥ నికుంభజంపౌండ్రకంతం మాతామహగృహేస్థితం। శతశీర్షంరావణంచ ద్వీపాంతరనివాసినం॥౯౨॥ సాహాయ్యార్థంపౌండ్రకేణ లంకాయాంచారితంపునః। అహంతృతీయవేళాయాం సంవధిష్యామితావుభౌ॥౯౩॥ తతస్స్వీయంస్థలంగత్వా పునర్యాస్యామ్యహంజవాత్। కుంభకర్ణోద్భవంవీరం మూలకాసురనామకం॥౯౪॥ అత్రైవతుర్యవేళాయా మాగత్యపుష్పకేణహి। అహమేవహనిష్యామి శితబాణైరణాంగణే॥౯౫॥ అన్యచ్చాపిస్మరాద్యత్వం పురాయద్విధినోదితం। యద్వాక్యాచ్ఛత్వయాగత్వా కౌసల్యానృపతీహృతౌ॥౯౬॥ పేటికాస్థౌపునస్త్యక్తౌ సాకేతేదైవయోగతః। అతస్త్వంమర్తుకామోసి యతోహమాహృతాత్వయా॥౯౭॥ గచ్ఛగేహే సుఖంభుంక్ష్వ రామశ్శీఘ్రంహనిష్యతి। ఇతిసీతావాక్యబాణైర్భిన్నమర్మస్థలోపిసః॥౯౮॥ యయౌతూష్ణీంనిజంగేహం లజ్జితశ్చదశాననః। ఏవందశాననేయాతే రాక్షస్యోరావణాజ్ఞయా॥౯౯॥ జానకింతాంస్వకైర్ద్వైశ్చ తథాప్రా

---

గునో అట్లు నయ భయ ప్రియవాక్కులచే ప్రయత్నించుడు. ఇంక రెండునెలలకులోగా నా పడకనొప్పుకొనక పోయెనా మరునాడే చంపి నాకు చికిత్సావిశేష మొనర్పుఁడు." అని యాజ్ఞాపించెను. అదివిని జానకీదేవి రావణునితో "మునుపు నేను బాలనై పెట్టెలో నున్నపుడు నీవు నన్ను తీసికొనివచ్చితివి. అపుడు నేను చెప్పినదానిని మరచితివిగదా? ఇపుడు నేను పోదును"మరల నిన్ను సపరివారంబుగా సంహారించుటకై వచ్చెదనని చెప్పలేదా? ఆ నామాటను సత్యమనిపించుటకై వచ్చియున్నాను. శ్రీరామునిచే నిన్ను నీవారినిఁగూడ చంపించి యయోధ్యకుపోయి మరల మాతామహ గృహమందుండు నికుంభ సుతుఁడగు పౌండ్రకుని పౌండ్రకునితోడ సాహ్యాముగా చరించువాఁడైన ద్వీపాంతరవాసియగు శతకంఠరావణుని, నేను మూడవతూరివచ్చివారిని చంపెదను. అంత స్వస్థలమునకుపోయి పుష్పకమున నాల్గవబారి మరల వేగమెవచ్చి కుంభకర్ణసుతుఁడగు మూలకాసురుఁడను వీరునింజంపెదను. ఇంక నిప్పుడు, మునుపు బ్రహ్మచెప్పినవాక్యములన్నిటిని స్మరింపుము. ఏ బ్రహ్మవాక్యమునకై కౌసల్యా దశరథులను పెట్టెలోతెచ్చి మరల పంపితివో తలంపుము. దైవయోగముదొడ్డది. కావున నీవు నన్ను తెచ్చుటచేత చావనెంచియున్నావు. ఇంటికిపోయి నెమ్మదిగా భుజింపుము. రాఘవుఁడు త్వరగా జంపును"—అని చెప్పిన, సీతావాక్యబాణములచే మేనిసందులన్నియును బ్రద్దలగుచుండినను సిగ్గుజెంది రావణుఁడూరక యింటికేగెను ॥౯౯॥ ఇట్లు రావణుఁడు వెడలగా నార

రోక్తిభిర్ముహుః । అసైర్వివిధైర్ఘోరైః ఖడ్గాద్యై భీషయన్ స్వకరాదిభిః ॥ ౧౦౦ ॥ నివార్య త్రిజటానామ్నా విభీషణ ప్రియానుగా । తాస్సర్వాః రాక్షసీః వేగా ద్వాక్యమాహ సాదరం ॥౧౦౧॥ నభీషయధ్వం రుదతీం నమస్కురుత జానకీం । శుచి హ్యెన్నా రాఘవస్స్వప్నే మయాదృష్టోద్యజానకీం॥ ౨॥ మోచయామాసదగ్ధ్వామాం లంకాం హత్వారురావణం । రావణోగోమయ హ్రదే తైలాభ్యక్తోదిగంబరః ॥ ౩ ॥ మయాద్యదృష్టస్స్వప్నే హి తస్మాదేనాం న సాహసం। కార్యం సేవ్యా సదా చేయం రామాదభయదాయినీ ॥౪॥ యుష్మాభిర్దుఃఖితా చేద్వో భర్త్రీ యం ఘాతయిష్యతి। ఇతి త్రిజటావాక్యం శ్రుత్వాతస్థుర్భయాకులాః ॥౫॥ తూష్ణీమేవ తదా సీతా దుఃఖాత్కించిదువాచ సా । ఇదానీమేవ మరణం కేనోపాయేన మేభవేత్ ॥౬॥ దీర్ఘా వేణీ మమాత్యర్థ ముద్బంధాయభవిష్యతి।యన్మయాస్వీయవాగ్బాణైః లక్ష్మణస్తాడితః పురా ॥౭॥ తస్మాదిమాః పీడయంతి భోక్తవ్యం తే స్వకృతం మయా। మయా నిరాగస్సౌమిత్రి స్త్రాసితో గౌతమీతటే ॥౮॥ ప్రాయశ్చిత్తం కరోమ్యద్య తస్యత్యక్త్వా స్వజీవితం । ఏవం నిశ్చితబుద్ధిం తాం మరణాయాథ జానకీం ॥ ౯ ॥ దృష్ట్వా శశ్వైవాయుపుత్రో రామవృత్తం న్యవేదయత్ । ఆసాకేతనిర్గమాచ్చ స్వసీతాదర్శనావధి ॥౧౦॥ సవిస్తారం క్రమేణైవ సీతాతోషార్థమాదరాత్। సీతా క్రమేణతత్సర్వం శ్రుత్వాహాశ్చర్యమానసా॥౧౧॥ కిం మయేదం శ్రుతం వాద్యే మ్ని స్వప్నో దృష్టోథవానిశి। యేన మే కర్ణపీయూష వచనం సముదీరితం ॥౧౨॥ సదృశ్యతాం మహాభాగః ప్రియవాదీ

## సీతా విలాపము. త్రిజటా సాంత్వనము.

రాక్షసభటులు రావణాజ్ఞనంది ఘోరఘోషంబులచేతను క్రూరభాషణంబులచేతను భీకరచేష్టలచేతను ఖడ్గహస్తములచేతను సీతను వెరుపింపసాగిరి. అపుడు విభీషణుని ప్రియానుగయైన త్రిజటయనునది వారిని నివారించి "దుఃఖించుచుండు జానకిని వెరుపింపవలదు. నమస్కరించండి. మంచిగుర్తులతో శ్రీరాముఁడు స్వప్నమున కనుబడి ఈ లంకను కాల్చి రావణునిఁజంపి సీతను విడిపించెను. రావణుఁడు ఒట్టి వళ్లుతో నూనెయంటుకొని పేఁడగుంటలో నున్నట్టు కనుబడెను. కనుక ఈమెకై సాహసింపవలదు. శ్రీరామునివలన నభయమునిచ్చునుగాన నీమెను సంతతము సేవింపవలసినది. మీరలీమెను సంకటపెట్టితిరా మీకుపతిచే మృతినిప్పించును." అనిన నా త్రిజటావాక్యములచే వారందరునువెరచి యూరకకూర్చుండిరి. అపుడు సీత దుఃఖించుచు "ఇప్పుడే నాకు మరణ మెట్లుగలుగును? మునుపు నేను వాగ్బాణములచే లక్ష్మణునిఁ గొట్టితినిగాన నిట్లు తత్ఫలముగా వీరిచే బాధింపఁబడుచుందును. ఏపాపము నెఱుఁగని సుమిత్రానందనుఁడు నాచేత గౌతమీతీరమున వెరుపింపఁబడెను. నాప్రాణమువిడిచి దానికి ప్రాయచిత్తముచేసికొనియెద." ఇట్లు మరణమును నిశ్చయించుచుండు జానకిని ॥౯॥ హను

## సీతాదేవి నాంజనేయుఁడు సందర్శించి రామముద్రిక నిచ్చుట.

మంతుఁడు చూచి తిన్నగా శ్రీరామవృత్తాంతమును విన్నవించెను. అయోధ్యను విడిచినది మొదలు ఆంజనేయునిఁజూచువరకు నడచిన యావద్వృత్తాంతమును సవిస్తరముగా సాదర

మమాగ్రతః। తచ్ఛ్రుత్వా త్వరితో గత్వా నత్వా తామబ్రవీత్పునః ॥౧౩॥ రామవృత్తం దదౌ తస్యై రాఘవస్యాంగులీయకం। తాం రామముద్రికాం దృష్ట్వా నత్వా తమబ్రవీత్కపిం ॥౧౪॥ సర్వం కథయ మద్వృత్తం యథాదృష్టం త్వయాత్ర హి। తదా తాం సాంత్వయామాస రామో మత్స్కంధసంస్థితః ॥౧౫॥ వానరేంద్రైస్సమాగత్య హత్వా రావణమాహవే। త్వాం నేష్యతి భయం సీతే త్యజ త్వం మమ వాక్యతః ॥౧౬॥ తతస్సీతా ప్రత్యయార్థం స్వయం రూపం ప్రదర్శయత్। తతః పునః ప్రత్యయార్థం సీతాయై రాఘవోదితం ॥౧౭॥ మనశ్శిలాయాస్తిలకం చిత్రకూటగిరౌ కృతం। కపిస్తత్కథయామాస పూర్వవృత్తం సవిస్తరం ॥౧౮॥ తతస్తుష్టాం జానకీం తాం మారుతిర్వాక్యమబ్రవీత్। అనుజ్ఞాం దేహి మే మాతస్త్వభిజ్ఞానం దదస్వ మాం ॥౧౯॥ సా తం చూడామణిం పిత్రా దత్తం కేశాంతరస్థితం। నిష్కాస్య తత్కరే దత్వా పూర్వం కాకేన యత్కృతం ॥౨౦॥ చిత్రకూటగిరౌ వృత్తం కథయామాస తత్కపిం। తతో నత్వా రామపత్నీం చింతయామాస చేతసి ॥౨౧॥ స్వామికార్యం కృతం చైతదన్యత్కించిత్కరోమ్యహం। ఇతి నిశ్చిత్య మనసా జానకీం పునరబ్రవీత్ ॥౨౨॥ మాతర్మే స్త్యతిక్షుద్బాధ స్త్వద్యనిక్షమదో మహాన్। అస్మిన్వనే తి మధురం ఫలం సద్యో తిదుర్లభం ॥౨౩॥ తవాజ్ఞయాద్య సీతే హం కరిష్యే భక్షణం ధ్రువం। ఇతి తద్వచనం శ్రుత్వా జానకీ స్వీయకంకణం ॥౨౪॥ నిష్కాస్య హస్తాత్తం ప్రాహ గృహాణేదం ప్లవంగమ। అనేన ఫలసంభారాన్ లంకాహట్టాత్ప్రగృహ్య చ ॥౨౫॥ భుక్త్వా పీత్వా సుఖం గచ్ఛ వనేస్మిన్త్రోటయస్వమా। తదా కపిః పునః ప్రాహ పరమస్తఫలాని హి ॥౨౬॥ నాహం భుంజామి సీతే మే వ్రతమస్తి

ముగా చెప్పినదానిని విని సీతాదేవి యాశ్చర్యమునంది "నేనేమి గగనమున వినుచున్నాను? ఒండె రాత్రి కలగంటినా యేమి? ఎవఁడు నాకిట్లు కర్ణామృతంబులగు పలుకలను పలుకుచుండునో ప్రియవాక్కుశలుఁడగు ఆ పుణ్యాత్ముఁడు నాయెదుటకనుబడని." అని చెప్పగా, నాంజనేయుఁడు ఎదుటవచ్చి నమస్కరించి మరల శ్రీరామవృత్తమును విన్నవించి శ్రీరామనామాంగుళీయకమును సీతకు సమర్పించెను. ఆమె రామముద్రికను చూచి నమస్కరించి "ఇచ్చటనాసంగతిని నీ వెట్లుచూచితివో అట్లు సర్వంబును చెప్పుదువుగదా" యనెను. అప్పుడాంజనేయుఁడామెను సమాధానము జేయుచు "శ్రీరాముఁడు నామూపులపైగూర్చుండి కపివరులతోడ నిచ్చటికివచ్చి రణమున రావణునిజంపి నిన్ను గొనిపోవును, సీతమ్మా, నామాటచే భయమును వదలుము." అని సీతకు నమ్మకము నిచ్చుటకై రామునిచే చెప్పఁబడిన చిత్రకూటమున తిలకమిడినది మొదలుగాగల సంగతిని విస్తారముగా విన్నవించి, అంత నానందించుచుండు జానకీదేవిని "తల్లీ, నాకభిజ్ఞానమునిచ్చి యనుజ్ఞనిమ్మని" వేడెను. అందుకు సీత తనతండ్రి యిచ్చియుండిన చూడామణిని జడనుండియెత్తి ఆంజనేయునిచేతనిచ్చి మునుపు కాకముచే చేయఁబడిన కృత్యమును చెప్పెను. పిదప నాకపీంద్రుఁడు సీతనునమస్కరించి తనమనమున "స్వామికార్యమును నెరవేర్చితిమి. ఇఁక నేమైన కొంచము చేష్టచేసి పోవలయు" నని నిశ్చయించికొని, సీతతో "తల్లీ, మిక్కిలి బడలికయిచ్చు నాకలి గనుక నీవనమున నత్యంతదుర్లభంబై మిక్కిలి మధురంబగు ఫలములను నీయాజ్ఞచే నిక్కముగా భక్షించెదను." అని ప్రార్థించెను॥౨౩॥ అదివిని సీత

వ్రజామ్యహం । వ్రజంతంమారుతిందృష్ట్వా సీతావచనమబ్రవీత్ ॥౨౭॥ భోబాలకకపిశ్రేష్ఠ రావణోస్తివనాధిపః। నశక్తిర్నచశక్యం తే కథంత్వంభక్షయిష్యసి ॥౨౮॥ తత్తస్యావచనంశ్రుత్వా మారుతిఃప్రాహజానకీం। శ్రీరామేతిపరం మంత్రశాస్త్రం యేహృదయాంతరే ॥౨౯॥ తేనసర్వాణిరక్షాంసి తృణరూపాణిసాంప్రతం । తదాతంజానకీప్రాహ పతితాన్యత్రవైభుజ ॥ ౩౦ ॥ భుంక్ష్వతానిఫలానిత్వం తూష్ణీమాత్రోటయాత్రవై। తథేతిమారుతిర్నోక్త్వా వృక్షాన్పుచ్ఛేనచాలయత్ ॥౩౧॥ వృక్షాందోలనమాత్రేణ నిపేతుశ్చఫలానిహి । భక్షయామాసతాన్యేవ సఫలానిక్షణేన సః ॥౩౨॥ తతోవృక్షాన్సముత్పాట్య లాంగూలేనసమారుతిః। క్షిప్త్వాతాన్స్వవృక్షేషు సమస్తానిఫలానివై ॥౩౩॥ పాతయామాసభూమ్యాంతు భక్షయామాసతానిసః। భక్షితానిసమస్తాని ఫలానివనజానిహి ॥౩౪॥ దృష్ట్వాతందుద్రువుర్ఘోరం మారుతింవనరక్షకాః। రాక్షసానాగతాన్దృష్ట్వా వృక్షైస్తాన్తాడయత్కపిః ॥౩౫॥ ఉత్పాట్యాశోకవనికాం నిర్వృక్షామకరోత్క్షణాత్ । సీతాశ్రయనగంత్యక్త్వా వనంశూన్యంచకారసః ॥౩౬॥ బభంజచైత్యప్రాసాదం హత్వాతద్రక్షకాన్క్షణాత్ । తతస్తారాక్షసీస్సర్వా వనభంగంనిరీక్ష్యచ ॥ ౩౭ ॥ పప్రచ్ఛుర్జానకీంసర్వాః కోయంకస్యేతితస్త్వహ। తాస్సర్వాజానకీప్రాహ రాక్షసాఃకామరూపిణః ॥ ౩౮ ॥ విచరంతిముదాభూమ్యాం వేద్మ్యహంభిక్షురూపిణా। యదాహృతాపంచవట్యాం రావణేనహితద్వనాత్ ॥౩౯॥ తస్మాత్ జ్ఞేయస్తుయుష్మాభిః కోయం

### హనుమంతుఁడు సీతానుజ్ఞనొంది ఫలములు దిని వనభంగ మొనరించుట.

దయతో తనచేతి కంకణముఁదీసి «కపివీర, దీనిఁ దీసికొనుము. లంకలోని అంగళ్ల బజారున దీనిచే కావలసినఫలములను తీసికొనుము. తిని త్రాగి సుఖముగాపొమ్ము. ఈవనమున ఛేదింపవలదు.» అనగా నందుకు కపీంద్రుఁడు «తల్లీ, పరులచేతి పండ్లను నేను తిననివ్రతము కలదు. పోదును» అనిఁ వెడలెను. దానిం జూచి జానకి «ఓరినాయనా, వానరనాయకా, రావణుఁడు వనాధిపతిగదా? నాకుశక్తిలేదు. నీవల్లకాచాలదు. మఱెట్లు తిందివురా?» అని మదలించగా, నందుకు హనుమంతుఁడు «అమ్మా, శ్రీరామయను పరమమంత్రశాస్త్రము నాడెందమునందు గలదు. అందుచేత నిప్పుడు రాక్షసులందరును నాకు తృణప్రాయులు.» అని చెప్పెను. అంత నాజానకి నేలఁబడిన పండ్లను వీటిని తిని తృప్తినొందుము. వ్యర్థముగా ఛేదించవలదనెను అట్లేయని యంజనాత్మజుఁడు తోకతో చెట్లునదిలించెను. అంతనా చెట్లనుండి పండ్లురాలినవి వాటిని వానరేంద్రుఁడు భక్షించగా నవినఫలములయ్యె. మరువ్నందనుఁడు మహావృక్షంబులను తోకతో పెల్లగించి తక్కిన చెట్లమీఁదవేచి పండ్లనన్నిటినిరాలగొట్టి, చక్కగామెక్కియిచ్చట నొక్కటిని నిలపడయ్యె. వనరక్షకులు వచ్చి వాయునందనుని వెరపించి తరుముటకు పరుగిడిరి. వచ్చినవారిని చూచి వృక్షములచే పవనాత్మజుఁడు పడమొత్తెను. మఱియు నావనమును సీతయాశ్రయించిన ఇఱుగుడుచెట్టుతప్ప మఱియేచెట్టునులేని బయలు నేలగాఁజేసెను. అచ్చట నుండిన చైత్యాలయమును పగలగొట్టి కావలివాండ్రను చంపెను. దానిని చూచి

మాంపృచ్ఛతేద్య కిం। ఇతి తస్యా వచశ్శ్రుత్వా రాక్షస్యోథ సువిహ్వలాః ॥౪౦॥ దశాననం హి తద్వృత్తం యయుశ్శీఘ్రం నివేదితుం। ఏతస్మిన్నంతరే ప్రాత ర్మంచకే కటిబంధనం ॥౪౧॥ వీక్ష్య రావణశ్చాథ గయస్య చకిత స్తదా। ధూర్తాం మందోదరీం జ్ఞాత్వా తాం హంతుం ఖడ్గమాదదే ॥౪౨॥ తదా నివారిత స్త్రీభిః స్త్రీహత్యాం మా కరోష్వితి। తదా క్రుద్ధో దశగ్రీవ స్తూష్ణీం గత్వా గయగృహం ॥౪౩॥ అవధీన్నిద్రితం వీరం ఖడ్గేన స్వగృహం యయౌ। తదా విభీషణః ప్రాత ర్బంధో ర్వస్త్రం స్వమంచకే ॥౪౪॥ దృష్ట్వా తాం సరమాం హంతుం దుద్రువే వర్జిత స్తదా। స్త్రీభిః ధృత్వా తస్య హస్తం స్త్రీహత్యా గర్హితా త్వితి ॥౪౫॥ విభీషణ స్తదారభ్య బంధో స్త్రాసమమన్యత। ఏవమాసీచ్ఛలం తాయాం కౌతుకం కపినాకృతం ॥౪౬॥ అథ వేగేన రాక్షస్యస్సభా సంస్థం దశాననం। వృత్తం నివేదయామాసుః స్థలద్భాష్పా వనోద్భవం ॥౪౭॥ తచ్ఛ్రుత్వా రావణః క్రోధాత్కపినోత్పాటితం వనం। వనపాలం సమాహూయ జంబుమాలినమబ్రవీత్ ॥౪౮॥ రాక్షసైర్నియుతైర్గచ్ఛ కీశం ధృత్వా సమానయ। తథేతి స యయౌ వేగా దశోకవనికాం ప్రతి ॥౪౯॥ దృష్ట్వా సైన్యం దీర్ఘనాదం చకార కపికుంజరః। తత స్తే రాక్షసాశ్శస్త్రైర్నిజఘ్ను ర్వానరోత్తమం ॥౫౦॥ తతః ఉత్ప్లుత్య హనుమాన్ తోరణేన సమంతతః। నిష్పిపేష క్షణాదేవ మశకానివ యూథపః ॥౫౧॥ హత్వా తాన్ రాక్షసాన్సర్వాన్ స్తతో వేగేన మారుతిః। తాలవృక్షం సముత్పాట్య జఘాన జంబుమాలినం ॥౫౨॥ తాన్ సర్వాన్ నిహతాన్ శ్రుత్వా పంచసేనాపతీన్నృపః।

---

యచ్చటి రాక్షస స్త్రీలు వీఁడెవ్వఁ డెచ్చటివాఁడని సీత నడిగిరి. అందుకు సీత వారందరితో రక్కసులు కామరూపులై యథేచ్ఛగా నేలఁదిఱుగుచుందురు. నేనెఱుఁగను. రావణుఁడు బిచ్చగాని వేషముతో నన్ను పంచవటిలో పట్టితెచ్చెను గనుక మీరే వీని నెవ్వఁడని తెలియుదురుగాక. ఏమని నన్నడుగుచున్నారు!” అని చెప్పగా, వారందరును భయభ్రాంతులై అసంగతిని రావణునికి చెప్పుటకై వెడలిరి ॥ ౧౪౦ ॥ అంతలో రావణుఁడు తెల్లవారి లేచి తనమంచ

రావణుఁడు భ్రాంతుఁడై గయునిఁ జంపుట.

మమీఁద గయుని కటివస్త్రమునుచూచి వీఁడు మందోదరి ననుభవించెననుకొని మందోదరిని జంపుటకై ఖడ్గమెత్తుకొనెను. స్త్రీ హత్యవలదువలదని అచ్చటి యంగనలందరును నివారించిరి. అంత రావణుఁడు క్రుద్ధుఁడై యేమియుఁబలుకక గయుని యింటికిపోయి నిద్రించుచున్నా వీరునిఁజంపి తననగరుకు వచ్చెను. అపుడు విభీషణుఁడు ప్రొద్దున తన మంచముమీఁద రావణుని వస్త్రమునుచూచి, తనసతిని సరమను చంపుటకై తరలి, అచ్చటియంగనలు చేబట్టుకొని నింద్యమగు స్త్రీ హత్యనేలఁ జేసెదవని నివారింపగా విడిచి యూరకుండెను. మఱియు నదిమొదలు అన్ననుండి వెరపునాలోచించెను. ఇట్లు కపివీరునిచే నచ్చట వినోదము జేయఁబడెను ॥ ౪౬॥ తరువాత నతిత్వరగా రాక్షస స్త్రీలు కన్నీరుగార్చుచు సభనున్న రావణునితో వనభం

రావణుఁడు వనభంగమునువిని వానరుని బట్టించుట.

గవృత్తాంతమును విన్నవించిరి. అదివిని దశవదనుఁడు జంబుమాలియను వనపాలకునిం బిలచి

రావణః ప్రేషయామాస హతస్తేతోరణేనచ ॥ ౫౩ ॥ వాయుపుత్రేణ వేగేన లక్షరాక్షససంయుతాః । సతానపిమృతాన్ శ్రుత్వాఽక్షంపుత్రం ప్రేషయత్తదా ॥౫౪॥ కపినామారితస్సోపి ససైన్యోముద్గరేణచ। తతస్సం ప్రేషయామాస పుత్రమింద్రజితంపునః॥౫౫॥ తతస్సరథమారూఢః కోటిరాక్షసవేష్టితః। యుద్ధంచ కారకపినా శస్త్రైరస్త్రైస్సుదుర్ధరైః ॥౫౬॥ తదాపుచ్ఛేనసైన్యాయ కృత్వాప్రాకారముత్తమం। నిష్పిపేషతోరణేన రాక్షసాన్ మారుతిః క్షణాత్ ॥౫౭॥ తతోవృక్షంసముత్పాట్య మేఘనాదమతాడయత్। వృక్షేణభిన్నసర్వాంగో మేఘనాదోవిశద్గుహాం ॥౫౮॥ ఏతస్మిన్నంతరే బ్రహ్మా ప్రార్థయామాసమారుతిం। బ్రహ్మాస్త్రంమానయన్ మేద్య త్వంలంకాంయాహి రావణాం ॥౫౯॥ తథేత్యంగీచకారాసౌ మేఘనాదంయయౌవిధిః। విధిః ప్రాహ మేఘనాదం కృగతోద్యపరాక్రమః॥౬౦॥ గచ్ఛమేఽస్త్రేణతంబధ్వా పితురగ్రేసమానయ । తద్బ్రహ్మవచనంశ్రుత్వా మేఘనాదః పునర్యయౌ ॥౬౧॥ బ్రహ్మాస్త్రేణాథవాబధ్వాతమానయామాసరావణం । తతో రావణవాక్యేన ప్రహస్తః ప్రాహమారుతిం॥ ౬౨ ॥ కస్త్వంకుతః సమాయాతః ప్రేషితః కేనవావద । తతఃసరామవృత్తాంతం కథయామాసవిస్తరాత్ ॥ ౬౩ ॥ పునస్తంబోధయామాస రావణంవాయునందనః । విసృజ్యమౌర్ఖ్యాద్ధృదిశత్రుభావనాం భజస్వరామంశరణాగతప్రియం । సీతాంపురస్కృత్యసపుత్రబాంధవో రామంనమస్కృత్యవిముచ్యసేభయాత్॥ ౬౪॥ యావన్నగాధాఃకపయోమహాబలా మహేంద్రతుల్యానఖదంష్ట్రయోధినః । లంకాంసమాక్రమ్యవినాశయంతితే తావద్ద్రుతందేహిరఘూత్తమాయతాం॥ ౬౫॥

నీవు పదివేల రక్కసులతోడపోయి ఆకోతిని పట్టితెమ్మని యాజ్ఞాపించెను. అట్లేయని వాఁడు సపరివారుఁడుగా నశోకవనమునకురాగా నాంజనేయుఁడు పెద్దకూతవేసెను. అదివిని వారందరును శస్త్రములను ప్రయోగింపగా మారుతిచెట్లను పెల్లగించుకొని వారిపై విసిరి, మశకములను మత్తేభంబువలె మర్దించి మన్నుజేసి, తాలవృక్ష మొకటినెత్తి జంబుమాలినెత్తి మీఁదపడమొత్తి చంపెను. అదివిని రావణుఁడు లక్షసైన్యముతోడ నయిదుమంది సేనాపతులనంపించి వారందరును వానరునిచేతి తోరణప్రహారముచే చావగా, అక్షుఁడను తనకుమారుని బంపెను. వాని నానాయుసుతుఁడు ముద్గరప్రహారముచే మృత్యుముఖమునకంపెను. పిమ్మట దశకంఠుఁడు ఇంద్రజిత్తయిన మేఘనాదునినంపెను వాఁడు కోటిసైన్యముతోడవచ్చి శస్త్రాస్త్రంబులం బ్రయోగించి ఘోరయుద్ధముజేసెను. ఆంజనేయుఁ డాసైన్యమునకు తనతోకతో ప్రాకారమును రచించి తోరణస్తంభముచే వారినందరిని సంహరించెను. మఱియు నొకవృక్షమును పెగలించికొని మేఘనాదుని యంగములన్నియును తునకలగునట్లు మొత్తెను. వాఁడు వానరునికివెరచి వరుగెత్తి గుహలోదాగెను. అంతలో బ్రహ్మగారువచ్చి "నాబ్రహ్మాస్త్రమును గౌరవింపుము. లంకలోకి రావణునివద్దికిపొమ్ము" అని యాంజనేయునిఁ బ్రార్థించి, అట్లేకానిమ్మని మాటదీసికొని, గుహలోదాగియున్న మేఘనాదునివద్దికిపోయి "నీపరాక్రమ మెచ్చుటపోయెఁ కపిని నాయస్త్రముచే బంధించి తండ్రివద్దికి గొనిపొమ్ము." అని వెడలిరి. అంత నట్లే యింద్రజిత్తు

జీవన్న రామేణవిమోక్ష్యసేత్వం గుప్తస్సురేంద్రైరపిశంకరేణ। నదేవరాజాంకగతోనమృత్యోః పాతాళలోకానపి సంప్రవిష్టః ॥ ౧౬॥ శుభంహితంపవిత్రంచ వాయుపుత్రవచశ్శుభః। ప్రతిజగ్రాహనైవాసౌ మ్రియమాణఇవౌషధం॥ ౧౭॥ ఇతితద్వచనంశ్రుత్వా మారుతింప్రాహరావణః। యేనవినిర్జితాదేవా స్తస్యమేపౌరుషంత్వయా॥ ౧౮॥ నదృష్టంవల్గసేవ్యర్థం శ్రుణుకించిద్వదామితే। పంచాంగపాఠకశ్చాయం పశ్యబ్రహ్మాకృతోమయా॥ ౧౯॥ ప్రతీహార స్త్వయంసూర్య శ్శశీఛత్రధరఃకృతః। వరుణోఽయంజలగ్రాహీ మార్జకఃపవనస్త్వహ ॥ ౨౦ ॥ అగ్నిఃకృతోఽయం రజకో మాలాకారశ్శచీపతిః। దండపాణిర్యమశ్చాత్ర దాస్యశ్చాత్రసురస్త్రియః ॥౨౧॥ మార్తండోనాపితశ్చాయం గణపఃఖరరక్షకః। మంగలాద్యగ్రహాస్సప్త మేసోపానఇవాసనే ॥౨౨॥ శిశుసేవాతత్పరేయం షష్ఠీదే

---

మరలవచ్చి బ్రహ్మాస్త్రముచే నాంజనేయునిగట్టిపట్టుకొనిపోయెను॥౧౬౦॥ పిదపరావణాజ్ఞచేప్రహ

ఆంజనేయుని సద్బోధనను వినక విఱ్ఱవీగుట.

స్తుఁడు “నీవెవఁడవు? పలవచ్చితివి? ఎవరంపిరి? చెప్పు”మని యడుగగా, నాంజనేయుఁడు శ్రీరామవృత్తాంతమును చక్కగా నొక్కి వక్కాణించి “రావణా, మూర్ఖతనమువలన మనమున శత్రుభావమును వదలి, శరణాగతప్రియుఁడగు శ్రీరాముని సేవింపుము. సీతాదేవిని పురస్కరించుకొని సానుజుండు సాత్మజుండునై రాముని నమస్కరించి భయములేక బ్రతుకుదువు.మహాబలులును మహాసింహతుల్యులును నఖదంష్ట్రాయోధులునగు కొండలవంటి కపులు నీలంకను ముట్టడివేసి ధ్వంసముచేయుటకుమును పే త్వరబడి యాజానకీదేవిని శ్రీరామసన్నిధి కర్పించి ధన్యుఁడగుము.నీవు సురేంద్రులచేతనో శంకరునిచేతనో రక్షింపఁబడినను ఇంద్రసన్నిధిలో దాగినను మృత్యువు కరుణించిబోచినను పాతాళలోకంబులలోఁ జొచ్చియున్నను శ్రీరామునిచే బ్రతికియుండనేరవు. తప్పక చత్తువు.” అని చెప్పిన ప్రియంబును మంగళంబును పరిశుద్ధంబునగు పవనాత్మజునిమాటను మన్నింపక యా దుష్టరావణుఁడు చచ్చుచుండువాఁ డౌషధమును నిరాకరించునట్లు నిరాకరించి, కపివీరునితో “ఓరి దూత, దేవతలనుజయించిన నా పరాక్రమమును నీ వెఱుఁగనివాఁడుగాన నిట్లు వ్యర్థముగా మొరుగుచున్నావు. కొంచెము చెప్పెదను వినుము. చూడుమీ బ్రహ్మదేవుఁడు నాకు పంచాంగముచెప్పెడువాఁడై పడియున్నాడు. ఈ సూర్యుఁడు ప్రతీహారియైయున్నాడు. చంద్రునిఁ గొడపట్టువానిఁ జేసితిని. ఈ వరుణుఁడు నీళ్లుతెచ్చువాఁడు. ఇచ్చట వాయువు చెత్తూడ్చువాఁడు. అగ్ని గుడ్డలుతుకువాఁడై రజకుండనబడుచుండును. ఇంద్రుఁడు పూలదండలుకట్టువాఁడు. ఇచ్చట యముఁడే దండపాణియైయుండును. దేవస్త్రీలందరును దాసీజనులు. మార్తండుడే మంగలివాఁడు. గణపుఁడు గాడిదెలగాచువాఁడు. అంగారకాది సప్తగ్రహములు నాయాసనమునకు సోపానములు. ఈ షష్ఠీదేవి బిడ్డలదాదిగా చేయఁబడినది. కైలాసమును చేత నాడించితిని. కుబేరుని జయించితిని. ఎట్లు నాయెదు

పీడయాత్కృతా । ఆందోళితశ్చ కైలాసః కుబేరోఽపి వినిర్జితః॥ ౨౩॥ కథం మమాఽగ్రే విలపస్యభీతవత్ ప్లవంగమానామధమోఽసి దుష్టధీః । క ఏష రామః కతమో వనేచరో నిహన్మి సుగ్రీవయుతం నరాధమం॥ ౨౪॥ ఇత్యుక్త్వా హంతుముద్యుక్తస్తం దశాస్యస్సభాస్థితః । తదా నివారయామాస రావణం స విభీషణః ॥ ౨౫ ॥ పరదూతో న హంతవ్య ఇత్యాదివచనైస్తదా । తతః క్రోధసమావిష్టో రావణో లోకరావణః ॥ ౨౬ ॥ దూతానాజ్ఞాపయామాస ఛేదనీయం తు లాంగులం । తద్రావణవచః శ్రుత్వా తీక్ష్ణకాస్తే సహస్రశః॥ ౨౭॥ స్వాయుధైశ్ఛేదయామాసుః కుఠారక్రకచాదిభిః। ఆయుధాన్యేవ శతశస్తత్పుచ్ఛాఘాతమాత్రతః॥ ౨౮॥ బభూవుశ్శతమాణాని తస్య రోమాపి న వ్యథా ।తన్నిరీక్ష్య దశాస్యస్స మారుతిం వాక్యమబ్రవీత్॥ ౨౯॥ న వీరా గోపయంత్యత్ర స్వీయం మృత్యుమపి క్వచిత్ । అతస్త్వం వద పుచ్ఛస్య యేన ఘాతోఽస్య తే భవేత్॥ ౩౦॥ తదా మరత్వం స్వం ప్రాహ కపిస్తచ్చ మృషేతి సః । మత్వా దశాస్యస్తం ప్రాహ పునస్సత్యం వదేతి చ॥ ౩౧॥ తదా స మారుతిస్తూష్ణీం క్షణం చిత్తే వ్యచింతయత్। మత్పితుశ్చ సఖా వహ్నిస్తస్మాన్నాస్తి భయం మమ ॥ ౩౨॥ తస్మాత్పుచ్ఛం దీపయిత్వా లంకాం దగ్ధాం కరోమ్యహం । తతస్తం రావణం ప్రాహ మారుతిస్సదసి స్థితః॥ ౩౩॥ పుచ్ఛం మే వహ్నినా దగ్ధం భవిష్యతి న సంశయః। తత్తస్య వచనం శ్రుత్వా రావణో నిజకింకరాన్ ॥౩౪ ॥ ఆజ్ఞాపయామాస పుచ్ఛం దీపయిత్వా ప్రయత్నతః । లంకాయాం దర్శనీయోఽయం దృష్ట్వైనం మద్భయం భవేత్ ॥౩౫॥ సర్వేషాం మద్రిపూణాం చ తథా చ శ్రుత్వా వరాన్వితాః । తైలాక్తైశ్శణపట్టైశ్చ రాక్షసా వసనైరపి ॥౩౬ ॥ పుచ్ఛం సంవేష్ట్య

ట నీవు నిర్భయముగా కేకలు వేయుదువు? దుష్టబుద్ధిగల నీవు కపులలో పరమనీచుడవు. ఈరాముడెవ్వడు? ఈకపి యెంతవాడు? సుగ్రీవునితోడ నీ నరాధమునిం జంపెదను." అని చెప్పి, రావణుడు సభలో నావాయుసుతునిం జంప నెంచెను. అపుడు విభీషణుడు "పరుల దూతను చంపరాదు" అని మంచిమాటలాడి నివారించెను. పిదప క్రోధాక్రాంతుడైన లోక భయంకరుడగు రావణుడు వీనితోక కత్తిరించుడని దూతల కాజ్ఞాపించెను. వేలకొలది తీక్ష్ణకులువచ్చి కొడవలి రంపము మొదలైన ఆయుధములచే కోయనారంభించగా వారి యాయుధములన్నియును వేయూరుతునకలై నశించెను. ఆంజనేయుని రోమముకూడ తెగలేదు. దాని నెఱిగి రావణుడు మారుతిని "వీరులు తమ మృత్యువునుకూడ దాచుటలేదుగాన నీతోక యెట్లుపోవునో నీవే చెప్పు"మనెను. అందు కాంజనేయుడు నేను చావులేనివాడనని యథార్థము పలికియును మరల సత్యముచెప్పుమని రావణుడడుగగా, క్షణమాత్రము తనమనస్సులో నాతండ్రికి మిత్రుడగు అగ్నిభట్టారకునిచే నాకు భయముగలుగజాలదు ॥౨౧౩॥గనుక నా

## రాక్షసులు వానరుని వాలమునకు వహ్నినంటించి యూరేగించుట.

తోకకు నిప్పుపెట్టించుకొని లంకనే కాల్చివేయుదునని యాలోచించి రావణునితో "నాతోక నిప్పుచే కాల్పబడు నందుకు సంశయములేదు" అని పలికెను. ఆమాటవిని రావణుడు తనసేవకులకు "మీరందరు ప్రయత్నించి వీనితోకకు నిప్పుముట్టించి లంకలో కనుబరచండి. నాశత్రు

యామాస స్తదాపుచ్ఛం వ్యవర్ధత । తతో వసనహట్టాత్తు వస్త్రకోశాన్విలుంఠ్యచ ॥ ౮౭ ॥ తత్పుచ్ఛం వేష్టయామాసు ర్గృహవస్త్రైరనేకశః । తతః పురుషనారీణాం లంకాస్థానం నృపాజ్ఞయా ॥ ౮౮ ॥ బలాదాచ్ఛిద్య వస్త్రాణి చక్రుస్స ర్వాన్ దిగంబరాన్ । తథైవ యుయ్యామంటపాంశ్చ కంచుకీః కంచుకానపి ॥ ౮౯ ॥ పౌరాణాం రాజగేహాచ్చ తేవస్త్రాణి సమానయన్ । దృష్ట్వా పూర్తిం తు పుచ్ఛస్య సభాస్థానాం నృపస్య చ ॥ ౯౦ ॥ వస్త్రమాత్రైస్సమస్తైశ్చ లాంగూలం వేష్ట యంస్తదా । ధ్వజోష్ణీషపతాకాభి ర్విప్రాణాం వసనైరపి ॥ ౯౧ ॥ మందోదర్యాదివస్త్రైశ్చ శిశూనాం వసనాదిభిః । వే ష్టయన్కపిలాంగూలం తతస్సీతాం యయుశ్చరాః ॥ ౯౨ ॥ తత్ జ్ఞాత్వా మారుతిశ్చాపి పుచ్ఛపూర్తిం ప్రదర్శయత్ । తదా కోలాహలశ్చాసీ ద్వస్త్రార్థం ప్రతిసద్మని ॥ ౯౩ ॥ తైలార్థం చ ఘృతార్థం చ స్నేహమాత్రం సమానయన్ । నాసీన్నిశా యాం దీపార్థం శిశూనామపి నో ఘృతం ॥ ౯౪ ॥ ఆసన్ స్త్రీపురుషా నగ్నా లజ్జా నాసీత్పరస్పరం । తత స్తద్దీపయామా సువహ్నినా భస్త్రకంపనైః ॥ ౯౫ ॥ ప్రదీప్తం నాభవత్పుచ్ఛం తతో మారుతిరబ్రవీత్ । యదాస్వీయముఖేనాయం య జమానో ద్య రావణః ॥ ౯౬ ॥ వహ్నిం ప్రజ్వాలయేదత్ర తదా జ్వాలా భవిష్యతి । తన్మారుతివచశ్శ్రుత్వా యయావగ్రే దశాననః ॥ ౯౭ ॥ యావత్ఫూత్కారయామాస తత్పుచ్ఛానలమాననైః । తావత్తచ్ఛిరజైః శ్మశ్రుకూర్చాద్దగ్ధాదశాభ వన్ ॥ ౯౮ ॥ తదా వింశద్భుజైః స్వీయముఖోపరి దశాననః । తాడయద్వహ్నిశాంత్యర్థం జహాసూ రాక్షసా స్తదా ॥ ౯౯ ॥ హాస్యం చకార హనుమాం స్తదా క్రుద్ధస్స రావణః । నీయతాం మర్కటశ్చాయ మితి దూతాన్వచోబ్రవీత్ ॥ ౧౦౦ ॥

వ్వులకందరికిని నాభయము గలుగును.” అని యాజ్ఞాపించెను. అట్లే అందరును త్వరబడి నూ నెలోముంచిన తెల్లుగసవుతిరులను గుడ్డలను తోకకు చుట్టుచురాగా నది పెరుగసాగెను. అంత బట్టలబజారులోనుండు వస్త్రములన్నిటినెత్తి జుట్టిరి. రాజాజ్ఞచే నిండ్లలోని స్త్రీపురుషు ల వస్త్రములన్నియును చుట్టబడెను. అందరును దిగంబరమూర్తులయిరి. చివరకు పరుపుగుడ్డ లు బంత్రౌతులవి సభవారివి రాచరికమువారివి రావణాదులవి మందోదర్యాది రాజాంగనలవి బిడ్డలవి తలగుడ్డలు మొలగుడ్డలు ధ్వజపటములు అన్నియునయినవి. సీతాదేవియొక్క వస్త్ర మునకు యత్నించగా దానినెఱిగి యాంజనేయుండు తోకపెంపును చాలించి పుచ్ఛపూర్తిం జూపెను. ఇంటింటను గుడ్డలకై గుమిగూడి గొట్టుకొనుచుండిరి. నూనెకై నేతికై జిడ్డుజిక్కి న చాలునని యల్లాడి తెచ్చిపోయుచుండిరి. రాత్రియైన దీపమునకు నూనెలేదు. బిడ్డలకు నె య్యి సున్న. అందఱును నిర్వాణమూర్తులగుటచే నొండొరులకు స్త్రీపురుషులలో సిగ్గు భగ్గు మనుచుండె. అంతనా తోకకు నిప్పుముట్టించి కొలిమితిత్తుల నూదించిరి. పుచ్ఛమంటికొని మండ లేదు. అపుడు ఆంజనేయుఁడు “ఇపుడు యజమానుఁడగు రావణుఁడే తననోటితో నూదుచు నిప్పుముట్టించిన నంటుకొను”ననెను. అట్లే రావణుఁడు ముందుకువచ్చి తోకనిప్పునూదెను. వానితలవెంట్రుకలతోడ గడ్డము మీసములు కాలి వెలుగువత్తులయినవి. రావణుఁడు తన యిరువదిచేతులచే మోములను రుద్దుకొనుచుండగా రాక్షసులందురును పకపకలగా నవ్వుచుం

తతోదూతాఃకపింనిన్యు ర్లంకాయాంతేసమంతతః । శృంఖలాభిఃదృఢంబధ్వా భ్రామయామాసు రాదరాత్ ॥ ౧॥ వాద్యఘోషైర్దీర్ఘుఃశబ్దైః వేష్టితంశస్త్రధారిభిః। ఏవందివాసర్వలంకాం దృష్ట్వోడ్డీయసమారుతిః॥ ౨॥ ధృత్వాతిసూక్ష్మరూపంతు దృఢబంధవినిర్గతః । యథాస్థానంబ్రహ్మణోస్త్రం తద్యయాపూర్వమేవహి॥ 3 ॥ తతఃపశ్చిమదేశస్థం లంకాద్వారంసమాశ్రయత్ । నిష్కాస్యతోరణంద్వారా జ్జఘానద్వారరక్షకాన్ ॥ ౪॥ హత్వాస్వరక్షకాంశ్చాపి ప్రాసాదేషుసమంతతః । దదావగ్నింస్వపుచ్ఛేన లంకాందగ్ధాంచకారసః॥ ౫॥ తదాకోలాహలశ్చాసీ ల్లంకాయాంప్రతిసద్మని । నిద్రితాన్యపిబాలాని త్యక్త్వానార్యోగృహాద్బహిః॥ ౬॥ దుద్రువుఃప్రాణరక్షార్థం దగ్ధవస్త్రాలకాస్తదా। క్రమేణరావణాదీనాం ప్రాసాదాన్ జ్వలయన్కపిః॥ ౭॥ తాంరావణసభాందగ్ధ్వా జనాపుచ్ఛేనతాడయత్। అథవప్రాక్షసాదగ్ధా ముఖవాద్యానిచక్రిరే। ౮॥ తదాసరావణఃక్రుద్ధో రాక్షసైర్దశకోటిభిః। యయాయోద్ధుంమారుతినా తాన్సర్వాన్తోరణేనసః ॥ ౯ ॥ ఘాతయామాసపుచ్ఛేన బధ్వాచైకత్రకోటిశః । తత్రైవలీలయాపుచ్ఛం రావణస్యచమస్తకే॥౧౦॥ సంతాడ్యతత్త్వచం దగ్ధామకరోన్మారుతిఃక్షణాత్ । తత్పుచ్ఛవహ్నినాదగ్ధో మూర్ఛితోభూద్దశాననః॥౧౧॥ కపిశ్శ్రీరామకీర్త్యర్థం రావణంనజఘానసః । పతితంపితరందృష్ట్వా దృష్ట్వాదగ్ధాన్ స్వరాక్షసాన్ ॥౧౨॥ ఆత్మనఃప్రాణరక్షార్థ మింద్రజిద్వివరంయయౌ । కపిర్లక్ష్మణప్రీత్యర్థం మేఘనాదంజఘానస॥ ౧౩॥ ఏవంసర్వాన్వినిర్జిత్య గోపురాట్టాలమండితాం। దగ్ధ్వాలంకాంసవిస్తారం యయౌసాగరముత్తమం॥ ౧౪॥ ప్రసార్యతత్రశేపుచ్ఛం జలజ్వా

---

డిరి. అప్పు డాంజనేయుఁడు అపహాస్యముచేయగా దశగ్రీవుఁడు క్రుద్ధుఁడై ఈ మర్కటము నావలగొనిపొండని దూతల కాజ్ఞాపించెను. అంత వారు మారుతికి సంకిళ్లువేసి చక్కగకట్టి శ్రద్ధతో లంకలోనంతట యూరేగించుచు వాద్యములు మ్రోగుచుండగా శస్త్రధారులై కేకలు వేయుచు వెంటఁబోయిరి. ఇట్లు కపివీరుఁడు గంతులు వేయుచు పగలు సర్వలంకనుచుట్టి, యత్యంత సూక్ష్మరూపమునొంది సంకిళ్లువదలించుకొనెను. ఆవేళకు బ్రహ్మాస్త్రంబును యథాస్థానగతంబయ్యె ॥౧-౩॥ తరువాత నాంజనేయుఁడు పశ్చిమలంకాద్వారము నాశ్రయించి ద్వార

ఆంజనేయుఁడు లంకాపట్టణమును కాల్చుట.

మునుండి తోరణస్తంభమునెత్తుకొని ద్వారపాలకులను తన కావలివారినిగూడ సంహరించి ప్రాసాదంబులలోనంతట తన తోకచే నిప్పుపెట్టి లంకను కాలినదానినిగాఁ జేసెను. అపుడు ప్రతిగృహమునందును కోలాహలమారంభమయ్యె. ఆడవాండ్రు నిద్రించుచుండు బిడ్డలనువిడిచి ప్రాణరక్షణకై తమకురులును గుడ్డలును కాలిపోగా నింటికివెలుపల పరుగెత్తిరి. క్రమముగా రావణాదుల ప్రాసాదములకు మంటనంటించి ఆ రావణసభనుకాల్చి జనులను తోకచేనదలించెను. కాలుచుండు రాక్షసులు నోటికిచేతికి తాళమారంభించిరి. అప్పుడు రావణుఁడు సంక్రుద్ధుఁడై పదికోట్లరాక్షసులతోడ వెడలి యాంజనేయునితో యుద్ధమారంభించెను. కపివీరుఁ డపుడు తోరణస్తంభముచే ప్రహరించుచు నొక్కొకచోట కోట్లకొలది రక్కసులను తో

రక్షయిత్వాకపిః । తత్తరంగైస్సీతలంస్వం కృత్వాలాంగూలముత్తమం॥ ౧౫॥ నిజకంఠాచ్చధూమ్రేణ శ్లేష్మాణంసాగరే క్షిపత్ । తతఃకపిఃక్షణంతూష్ణీం స్థిత్వాసీతాంవిచింత్యచ॥౧౬॥ తాడయామాసహృదయే మత్వాదగ్ధాంవిదేహజాం। ఆత్మానంగర్హయామాస స్థిత్వాసాగరరోధసి॥ ౧౭ ॥ ధిక్ ధిక్ మాంవానరంమూఢం స్వామిపత్న్యాశ్చదాహకం। నిశ్చయేనమయాదగ్ధా జానకీరామతోషదా॥ ౧౮॥ నవిచారఃకృతఃపూర్వం లంకాదాహేఽవివేకినా । ఆత్మఘాతం కరోమ్యద్య పుచ్ఛబంధేనచాత్రవై॥ ౧౯॥ కింరామాయేదృశంస్వాస్యం దర్శయేద్యవిగర్హితం, రామశ్శ్రుత్వాస సీతాయా వృత్తంశీఘ్రంమరిష్యతి ॥ ౨౦ ॥ తద్దుఃఖేనససౌమిత్రి ర్మరిష్యతినసంశయః । తయోర్దుఃఖేనసుగ్రీవ స్తదర్థంసచివైరుమా॥ ౨౧॥ తంశ్రుత్వాసోంగదశ్చాపి మరిష్యత్యతిలాలితః । తారాపిపుత్రశోకేన నృపేషేష్టైథవానరాః॥ ౨౨॥ ప్రాప్తేపంచదశేవర్షే భరతోపిమరిష్యతి । రామదుఃఖేనకౌసల్యా సుమిత్రాపుత్రదుఃఖితః ॥౨౩॥ తథాసాకైకయీదుష్టా సర్వానర్థకరీతుయా । శత్రుఘ్నోబంధుదుఃఖేన రామార్థంమునయశ్చతే॥ ౨౪ ॥ రాఘవోరామభక్తాశ్చ మంత్రిణస్సుహృదస్తథా । సీతాపితుఃకులంసర్వం కౌసల్యాయాఃపితుఃకులం ॥ ౨౫ ॥ సుమిత్రాయాశ్చకైకేయ్యాస్తేషాంసంబంధినస్తథా । నష్టేరాజకులేజాతే ప్రజాస్స్వేచ్ఛానువర్తినీ॥ ౨౬॥ మరిష్యతినసందేహః స్తతస్థావర జంగమం । భూమిష్ఠాఃప్రాణినస్సర్వే యదానష్టాస్తదాదివి॥ ౨౭॥ హవ్యకవ్యవిహీనాస్తే దేవానాశంగతాఇవ । అకాలేప్రలయంద్రుష్ట్వా నష్టాంసృష్టింస్వనిర్మితాం ॥౨౮॥ పశ్చాత్తాపేనధాతాపి మరిష్యతినసంశయః । ఏవంక్రమేణ

కతో చుట్టికట్టి కెడపి, అట్లే వినోదముగా రావణుని తలమీఁద పుచ్ఛమునుంచి దెబ్బవేసి వానిచర్మమును కాల్చెను. తోకనిప్పుచే రావణుఁడు మూర్ఛితుఁడయ్యె. ఆంజనేయుఁడైనను శ్రీరామునికి కీర్తికలుగవలెనని రావణునిఁ జంపలేదు. తండ్రి నేలఁబడగాఁజూచి తన రాక్షసులదరును కాలినదాని నెఱిఁగి స్వప్రాణరక్షణకై యింద్రజిత్తు బిలములోదూరెను. వానిని లక్ష్మణుని ప్రీతికై వానరుఁడు చంపలేదు. కపీంద్రుఁడిట్లు గోపురాట్టాల్యాలంకృతమైన సర్వలంకను దహించి సముద్రతీరమునకు వెడలి జలజంతువులను బ్రోవనెంచి నీటిమీఁదతోకను చాపి, అలలచేతనే తోకను చల్లార్చుకొనెను ॥౧౫॥ తనగొంతునుండి పొగవన్నెచే శ్లేష్మను సముద్రము

వానరుఁడు సీత నిప్పులో జిక్కికొనెనని భ్రాంతుఁడై విలపించుట.

లో నుమ్మివేసి కొంతసేపూరక చింతించుచుండి సీతను తలంచుకొని, అయ్యో సీతకాలెనని రొమ్మునకొట్టుకొనుచు కడలియిసుకమీఁద కూర్చుండి తనలోతానిట్లు చింతించెను. స్వామిభార్యనుకాల్చిన పరమమూఢుఁడగు నీకపి పరమనీచుఁడు. ఛీ, ఛీ, అయ్యో! రామకాంతయగు సీత నిజముగా కాలిపోయెనే అవివేకియగు నేను లంకను కాల్చునపుడు మొదట విచారించక పోతినే. ఇచ్చటనే తోకచే నురివేసికొని చచ్చుచున్నాను.ఎట్లు నింద్యమగు నామోమును శ్రీరామునికి చూపుదును? రాముండీవార్త విని బ్రతుకడు. ఆదుఃఖముచే లక్ష్మణుఁడు నిలువడు. వారు పోగా సుగ్రీవుఁడు మృతినొందును. అంనుచే మంత్రులతోడ రుమ కాటికేగును, అంతనంగదు

బ్రహ్మాండం నశ్యత్యేవన సంశయః ॥ ౨౯ ॥ ఏతద్ఘాతనిమిత్తో౽హం విధినానిర్మితః పురా । ఇత్యుక్త్వవంతంఖేదేన దేహ త్యాగార్థముద్యతం॥ ౩౦ ॥ దృష్ట్వాసా కాళజావాణీ బభూవబహుహర్షదా । మాకురుష్వకపేఖేదం సదస్తాజానకీశుభా॥ ౩౧॥ ఆత్మానందర్శయిత్వాతాం శీఘ్రంగచ్ఛరఘూద్వహం । తాంవాణీంహనుమాన్ శ్రుత్వా బభూవహర్షపూరితః॥ ౩౨॥ ద్రుతంతాంజానకీంద్రష్టు మశోకవనికాంయయౌ । తావద్దదర్శలంకాయాం సువర్ణవేష్టితాంభువం ॥ ౩౩॥ తత్కారణంవదామ్యద్య తచ్ఛృణుష్వగిరీంద్రజే । ఆసీద్గిరివరో దేవి త్రికూటఇతివిశ్రుతః॥ ౩౪ ॥ క్షీరోదేనావృతః శ్రీమాన్ యోజనాయతముచ్ఛ్రితః । తావతావిస్తృతః పర్యక్ త్రిభిశ్శృంగైః పయోనిధిం॥ ౩౫॥ దశఃకుంభో చయన్నాస్తే రౌప్యాయసహిరణ్మయైః । తస్యద్రోణ్యాంభగవతో వరుణస్యమహాత్మనః॥ ౩౬॥ ఉద్యానమృతుమన్నామ ఆక్రీడం సురయోషితాం । తస్మిన్సరస్సువిపులం లసత్కాంచనపంకజం॥ ౩౭॥ కుముదోత్పలకల్హార శతపత్రశ్రియోర్జితం। నైతత్కృతఘ్నాః పశ్యంతి నస్పృశంపాననాస్తికాః॥ ౩౮॥ తస్మిన్సరసిదుష్టాత్మా విరూపోంతర్జలాశయః। ఆసీద్గ్రాహో గజేంద్రాణాం దురాధర్షో మహాబలః॥ ౩౯ ॥ అథదంతోజ్జ్వలముఖః కదాచిద్గజయూథపః । ఆజగామతృషాక్రాంతః కరేణుపరివారితః॥ ౪౦॥ తృషితః పానకామో౽యమవతీర్ణశ్చతత్సరః । పిబతస్తస్యతత్తోయం గ్రాహస్తముపసద్యత॥ ౪౧॥ సులీనః పంకజవనే యూథమధ్యగతః కరీ । గృహీతస్తేనరౌద్రేణ గ్రాహేణాతిబలీయసా॥ ౪౨॥ గజ ఆకర్షతేతీరం గ్రాహ ఆకర్షతేజలం । పశ్యంతీనాం కరేణూనాం క్రోశంతీనాంసుదారుణం । నీయతేపంకజవనే గ్రా

డుండదు. పుత్రశోకముచే తారపోవును. రాజులేమిచే కపులు చత్తురు. ౧౪ గేండ్లు నిండగానే భరతుండు మృతిరతుండగును. రామదుఃఖముచే కౌసల్యయును లక్ష్మణదుఃఖముచే సుమిత్రయును సర్వానర్థములకు మూలమైన కైకేయియును తత్సంబంధులును జనకరాజాదులును తద్బంధువర్గమువారును ఇట్లే క్రమముగా రాజకుల మంతయును విలయము నొందును. ప్రజలు స్వేచ్ఛగాపోయి చత్తురు. పిదప స్థావరజంగమములే చెడును. భూప్రాణులందరు నశించగా హవ్యకవ్యములులేని దేవతలబ్రతుకు తెల్లవారును. ఇట్టియకాల ప్రళయమునుచూచి త నసృష్టిచెడెనని పశ్చాత్తాపముచే బ్రహ్మచచ్చును. క్రమముగా బ్రహ్మాండమే పోవునిందుకు సంశయములేదు. ఈదుడుకుతనమునకు నిమిత్తముగా నేను నిర్మింపఁబడితిని. అనిప్రలాపించిప్రాణము విడనాడ ప్రారంభించునంతలో నాంజనేయునికి-“దుఃఖింపకుము, మంగళదేవతయగు జానకీదేవి కాలిపోలేదు. కపీ, నీవామెను కనుగొని శ్రీరామసన్నిధికి శీఘ్రముగాపొమ్ము” అని యశరీరవాక్కొకటి వినుబడెను. ఆమంచిమాటవిని హనుమంతుఁడు హర్షపూరితుండై వేగమె జానకిని దర్శించుటకై యశోకవనమునకు వచ్చెను ॥౩౩॥ అంతలో నాలంకయందు బంగారు గప్పిన

గజేంద్రమోక్షణ గరుడాహరణాదాన మూలకముచే లంకాస్వర్ణమహిమ.

నేలనవలోకించెను. పార్వతీ! దాని కారణముఁ జెప్పెద వినుము.——త్రికూటమను ప్రసిద్ధంబగు పర్వతశ్రేష్ఠము పయోధివేష్టితమై సంపదగల్గియుండును. యోజనప్రమాణామెత్తరము అంతయె వెడల్పునుగల మూడుశృంగము లందులోగలవు. అవి మూడును బంగారు వెండి

హేణావ్యక్తమూర్తినా ॥ ౪౩ ॥ తథాతురంయూథపతిం కరేణవః [illegible] రసాబలీయసా । విచుక్రుశుర్దీన
ధియోఽపరేగజాః పార్ష్ణిగ్రహాస్తారయితుంనచాశకన్ [illegible] యుద్ధ్యతయోర్యుద్ధమభూద్ఘోరం దివ్యవర్షసహస్ర
కం । వారుణైస్సంయతః పాశైః [illegible] తయోర్యుద్ధమభూద్ఘోరం [illegible] ఘోరైస్తు పాశైర్నాగ
ద్రథైస్తథా । విస్ఫూర్జితమః [illegible] వేష్ట్యమానస్సుఘోరైస్తు పాశైర్నాగైః గృహీతో
ఘోరకర్మణా । పరమాపదమాపన్నో [illegible] చపారవాన్ ॥ [illegible] వ్యథితస్సనిరుత్సాహో [illegible] విశుద్ధేనాంతరా
త్మనా । ప్రగృహ్య పుష్కరాగ్రేణ కాంచనం కమలోదరం ॥ ౪౭ ॥ [illegible] పూజయిత్వా జనార్ద
నం । ఆపద్విమోక్షమన్విచ్ఛన్ గజస్తోత్రముదీరయత్ ॥ ౪౮ ॥ [illegible] సుప్రీతః పరమేశ్వరః । ఆరుహ్య
గరుడం విష్ణు రాజగామ మహోత్తమః ॥ ౫౦ ॥ గ్రాహగ్రస్తం [illegible] గజేంద్రం జలాశయాత్ । ఉజ్జహారాప్ర
మేయాత్మా తరసామధుసూదనః ॥ ౫౧ ॥ జలస్థం దారయామాస [illegible] చక్రేణమధుసూదనః । మోచయామాస నాగేం
ద్రం పాశేభ్యశ్శరణాగతం ॥ ౫౨ ॥ ఆసీద్గజః పురా పాండ్య ఇంద్రద్యుమ్న ఇతి నృపః । ఏకదా సతపోనిష్ఠో బభూవ
ధ్యానతత్పరః ॥ ౫౩ ॥ యదృచ్ఛయా యయౌ తత్ర కుంభజన్మా స పాంతికం । ధ్యానస్థస్సనృపోనైవ మునింవేదసమాగతం ॥
౫౪ ॥ దదౌ నార్ఘ్యం మునిర్భూపం దృష్ట్వాత్మానంతునోత్థితం । తపోమదేనసంభ్రాంతస్త్వాంయస్మాన్నోత్థితోనిమాం ॥

ఇనుము వన్నెలచే దిక్కుల నావరించుచుండును. దాని సానువులో పూజ్యుండైన వరుణదేవుని యొక్క ఋతుమంతంబను దేవస్త్రీలకు విహారస్థానంబయిన దివ్యోద్యానంబొకటిగలదు. అందులో విస్తారంబును కనకకమల కమనీయంబును కువలయకుముద కల్హారకాంతికాంతంబునయి నదివ్యసరస్సున్నది. అది కృతఘ్నులకును నాస్తికాధములకును హింసకులకును కనుబడదు. దానిలో దుష్టాత్మయును ఘోరాకారంబును మహా బలాన్వితంబును మత్తేంద్రమారణంబునగు మహానక్రంబు అంతర్జలంబున నంతరించియుండును. అంతనప్పటికి దంతభీకరాననంబైన నలగోనుంగొకటి దప్పిగొని ఆడయేనుగులతోడ వచ్చెను. అట్లే ఆకొలనిలోదిగి నీళ్లుద్రావునపుడు ఆమొసలిచే పట్టబడెను. మిక్కిలి బలశాలియైన మొసలిచేత నీడ్వబడిన ఏనుగుల ఱేడు మధ్యగతుండైనను తామరతోటలో చిక్కువడెను ఇట్లు మొసలిచేత బలముగాపట్టి లాగబడి యల్లాడుచుండు గజరాజును చూచి తక్కినగజములు అనుతాపముచే వెనుకనిలిచి లాగుచు ఎంత పీకులాడినను మొసలిపట్టును విడిపింపనేరకపోయెను. పిదప వేయేండ్లు గొప్పజగడమైనది. అప్పుడా గజరాజు వారణంబులు మఱి దారుణంబులనగు నాగపాశంబులచేత చుట్టబడి కదలజాలకపోయెను. అట్లు మహానక్రముచే నీడవబడిన గజరాజు వ్యథగల్గి యుత్సాహముచెడి యాపదనొంది శ్రీహరిం దలంచెను. నిర్మలంబునగు నంతరంగముచే బహిరంగములను నిగహించి యేకాగ్రుండై కరాగ్రముచే కనకకమలము నందుకొని మనసులో నివేదనముగా భావించి పురుషోత్తమునిం బూజించి ఆపత్పరిహారమునెంచుచు స్తోత్రముచెప్పెను. ఆగజేంద్రుఁ

౫౫ ॥ అతోఽగజోఽభవద్భ్రాంత మదేనవిపినే చిరం [illegible] సోఽహం [illegible] శ్రుత్వా నృపతిశ్శాపం తం ప్రణమ్య స్థితః పునః ॥ ౫౬ ॥ విశా
పం ప్రార్థయామాస మునిః ప్రాహాహారేః కరాత్ [illegible] బహుమ [illegible] దా గ్రాహోద్ధరిష్యతి ॥ ౫౭ ॥ పురాత్రైవగ
[illegible] స్త్వప్సరోగణసేవితః । సుస్నిగ్ధజ [illegible] వాహం । తాము క్త్వా స్తేగు [illegible] సరస్యఘమర్షణార్థం దృష్ట్వా
దేవలం చిరం [illegible] సంస్థితం తం బహిః కర్తుం [illegible] హాహాహూస్సమాగతః ॥ [illegible] భూత్వా జలలీన స్తత్పాదౌ స్వక
రేణహి । దృఢం ధృత్వా [illegible] స్స వ్యచింతయత్ ॥ ౬౦ ॥ వన్నే గృహీతౌ పాదౌ తస్మాద్గ్రాహో భవాత్ర
వై । తేన సంప్రార్థితః ప్రాహ [illegible] విష్ణు [illegible] పూర్వశాపేన పతితావతి సంకటే । హరిరుద్ధృ
త్య తాభ్యాం యయౌ [illegible] నాథ తార్క్ష్యేణ ప్రార్థితః ప్రాహ తం హరిః । గచ్ఛ భక్ష
య పతితే గజనక్రకళేబరే [illegible] ఉద్ధరిష్య [illegible] సరః పుణ్యం తావద్భూరిభుంగకృచ్ఛిరాట్ । కళేబరాంతకం
ప్రాప్తం సిపాత్యఖగేశ్వరః ॥ ౬౩ ॥ [illegible] భూరిభుంగ మపరేణ కళేవరే । ధృత్వా తార్క్ష్యః కృద్ధదేశం భక్షణా
ర్థమపశ్యత ॥ ౬౪ ॥ తావత్ క్షీరార్ణవే జంబూ నదవృక్షం సమీక్ష్య సః । ఆయామవి స్తరోచ్చైస్తు సహస్రయోజనం
శుభం ॥ ౬౫ ॥ తచ్ఛాఖాయాం విశాలాయాం యావత్తస్థౌ స ఖగరాట్ । తావద్బభంజ తచ్ఛాఖా వాలఖిల్యైర్వృతాధో
ముఖైః ॥ ౬౬ ॥ తపద్భిః షష్టిసాహస్రైః చిరకాలం సమాశ్రితా । తాంస్తాదృశాన్విలోక్యాథ తచ్ఛాపభయశంకితః ॥

డుచేసిన స్తుతిచే పరమేశ్వరుఁడగు విష్ణుభట్టారకుండు సుప్రసన్నుఁడై గరుడునెక్కి వేగమెవచ్చి గజనక్రంబులను బయలుకీడ్చుకొని నిజచక్రాయుధంబుచే మకరంబును మర్దించెను. శరణాగతుఁడగు కరిరాజును హరి యిట్లు పరిరక్షించి పాశంబులనుండి తొలగించెను. మునుపు ఇంద్రద్యుమ్నుఁడను పాండ్యరాజుండెను. అతఁ డొకానొకప్పుడు తపమునాచరించుచు ధ్యాననిష్ఠుఁడైయుండెను. ఆకస్మికముగా నచ్చటికి అగస్త్యుఁడు వచ్చెను ధ్యానమందున్న యారాజు మునీంద్రునిరాక నెఱుఁగలేదు. అపుడగస్త్యుఁడు రాజును “నీవు తపోమదముచే నాకు ప్రత్యుత్థానాదికము నాచరించకపోతివి గనుక, భ్రాంతుఁడా! అరణ్యమున నేనుఁగై పుట్టి మదముపట్టి చిరకాలము తిరుగుచుండుము.” అని శపించెను. ఇంద్రద్యుమ్నుఁ డందుకు వెరచి విశాపమివ్వఁడని సంప్రార్థించెను. అగస్త్యుఁడు కరుణించి “నక్రము నిన్నుఁ ధరించినపుడు చక్రపాణి యుద్ధరించును” అని చెప్పి వెడలెను. మునుపపుడే ఈదివ్యసరోవరములో హూహూయను గంధర్వుఁడు అప్సరస్త్రీలతోడ జలక్రీడకై వచ్చి, అచ్చట నఘమర్షణస్నానముం జేయుచు నెమ్మదిగానున్న దేవలుండను మునినిచూచి, ఆమునిని బైటవెడలించుటకై ప్రయత్నించి తానే నీటిలో దాగికొని చేతులతో దేవలుని కాళ్లఁబట్టి లాగెను. ఆశాపాయుధుండు “మొసలివలెపట్టి లాగితివిగాన నిచ్చటనీవు మొసలివైపడియుండు”మని శపించెను. హూహూ మిక్కిలివేడుకొనగా, హరి యుద్ధరించునని విశాపముంజెప్పెను. ఇట్లు వారిరువురును పూర్వశాపమువలన అత్యంతసంకటమునొందియుండిరి. వారికి వారిజాక్షుండుద్ధరించి స్వీయస్థలములనిచ్చిపోయెను.అంత నాకలిగొన్న గరుడునిచే ప్రార్థింపఁబడి శ్రీహరి “పడియుండు మొసలి యేనుఁగుల కళేవర

౧౮॥ గృహీత్వాస్వదంతునాశాఖాం బభ్రామగగనే పునః । తతో దృష్ట్వా కశ్యపం స్వ తాతం నత్వా వ్యజిజ్ఞపత్ ॥౧౯॥ వద శుద్ధాం భువం మేద్య కుర్వేహం యత్ర భోజనం । తదా తం కశ్యపః ప్రాహ శతయోజనసాగరే ॥ ౨౦ ॥ లంకా నామ్నా శుద్ధభూమి స్తత్ర త్వం కురు భోజనం । ఇతి పితుర్వచనాల్లంకాం యయౌ తార్క్ష్యః క్షణేన సః ॥ ౨౧॥ ప్రోచ్చయోఃపతు యోశాఖాం స్థాప్యతాన్భక్షయన్ముదా । తత్ర త్రైశిఖి స్తత్ర శృంగాణి త్రీణి చాభవన్ ॥ ౨౨॥ త్రికూట ఇతి నామ్నా స లంకాయాం గిరిరాడభూత్ । తేషు శృంగేషు తాం శాఖాం తార్క్ష్యః సంస్థాప్య సంయయౌ ॥ ౨౩॥ వాలఖిల్యాస్తపోంతే తే యయుర్విష్ణోః పరంపదం । ఆసీచ్ఛాఖాంతరాళే సా లంకాయాం శృంగమూర్ధసు ॥ ౨౪ ॥ గ్రావభూతాం శ్చైవ లేన నవిదుస్తాంతు రాక్షసాః । లంకాగ్నినా దవీభూతా మర్దయన్ రాక్షసాన్ భువి ॥ ౨౫॥ పపాతయుద్రసేనాఽసీ ల్లంకా భూమిర్హిరణ్మయీ । తాం దృష్ట్వా చకితో వేగా ద్వనే సీతాం యయౌ కపిః ॥ ౨౬ ॥ దృష్ట్వా శోకే పునః సీతాం తామాహ కపికుంజరః । మత్స్కంధస్థితో రామ మద్య పశ్యసి జానకి ॥ ౨౭॥ సా ప్రాహ మోచితా మస్యై రక్షాం రామో న సహిష్యతి । నీత్వా పునర్ముద్రికాం త్వం రాఘవాయ సమర్పయ ॥ ౨౮॥ ఇత్యుక్త్వా తత్కరే సీతా దదౌ శ్రీరామముద్రికాం । తతస్తాం మారుతిః స్పృష్ట్వా నత్వా శీఘ్రం యయౌ పునః ॥ ౨౯॥ ఆరురోహ సువేలాద్రిం చూర్ణం సమకరోద్గిరిం । ఏతస్మిన్నంతరే బ్రహ్మా దదౌ పత్రం సవిస్తరం ॥ ౩౦॥ యద్యత్కృతం మారుతినా లంకాయాం తస్య సూచకం । తద్గృహీత్వా మా

---

ములను భక్షింపుము పొమ్ము” అని యాజ్ఞాపించెను. అంత నాసరస్సునకు గరుడుఁడువచ్చి భూభంగుండను గృధ్రరాజు కళేవరసమీపముంజేరగా వానింజంపి యొకకాలితోఁ బట్టి మఱియొక్క కాలిచే నారెండు కళేవరములను ధరించి భక్షించుటకు తగిన శుద్ధప్రదేశమును వెదకెను. అప్పటికి క్షీరసముద్రమున జాంబూనదవృక్షమును వీక్షించి నిడుపు పొడుగు వెడల్పులచే వేయామడగల యిదిసరియని దాని విస్తారమగు రెమ్మమీఁద గరుడుఁడు నిలిచెను. అరువదివేల మందియనబడి తలక్రిందుగా తపమాచరించుచున్న వాలఖిల్యులను ఋషులకు నాదరువైన తచ్ఛాఖ బళువునోర్వనేరక విరిగెను. గరుడుఁడు దానిని వారిని చూచి శాప మెచ్చటగల్గునోయని శంకించుచు తనతుండముచే నారెమ్మనుపట్టుకొని మరల గగనమున పరుగెత్తెను. అంత నతఁడు తనతండ్రియగు కశ్యపునింజూచి “నేను భుజించుటకుతగిన శుద్ధప్రదేశమును తెలుపు” మని ప్రార్థించెను. అందుకు కశ్యపుఁడు “సముద్రమున నూరామడలలో లంకయను శుద్ధభూమిగలదు. అచ్చట నీవు భుజింపుము” అని చెప్పెను. గరుడుండట్లే తండ్రిచెప్పినట్లు లంకకుపోయి ఎత్తైనరెక్కలపై ఆశాఖనునచికొని వాటినిభక్షించెను. ఆసమయమున రాలినముక్కలు మూడుశృంగములయినవి. పిదప నది లంకలో త్రికూటమనుకొండగా నేర్పడెను. ఆ శృంగములమీఁద నాశాఖనునచి గరుడుఁడు వెడలెను. వాలఖిల్యులును తపమునాచరించినవెనుక నారాయణుని పరమపదమునొందిరి. ఆశాఖ యంతరాళమున శృంగములకొనలలో పాచివలన రాయిగా పరిణమించియుండెను. దానిని రక్కసులెఱుంగరు. అది లంకాగ్నిచే కరగి

రుతిర్వేగా న్నత్వావృష్టావః గీత ... ౨౧ ॥ తతఉడ్డీయవేగేన యయావాకాశవర్త్మనా । పర్వన్నష్టంమహా ఘోరం కపినామూర్ధ్వతస్తట ॥ ౨౨ ॥ ఉదగ్దిశ్యంతరాకించి త్పపాతభువిమారుతిః । తతోదృష్ట్వాఽపిం స్తత్ర దృష్ట్వైకంమునిసత్తమం॥ ౨౩ ॥ కించిద్గర్వసమావిష్ట స్తంమునింప్రాహమారుతిః । మయాశ్రీరామకార్యంతు కృతమస్తి మునీశ్వర ॥ ౨౪ ॥ పానీయంపాతుమిచ్ఛామి దర్శయాస్వజలాశయం । తర్జన్యాదర్శయామాస మునిస్తస్మైజలాశయం॥ ౨౫ ॥ తతస్సమారుతిర్ముద్రాం మణింపత్రంమునేఃపురః । సంస్థాప్యనీరంపాతుంవై యయాకాసారముత్తమం॥ ౨౬ ॥ తతస్తత్రః పికశ్చి స్తద్రికాంమునిసన్నిధౌ । కమండులౌ ప్రాక్షిపత్స యయౌతౌపచ్ఛమారుతిః ॥ ౨౭ ॥ గృహీత్వా స్వంమణింపత్రం మునింప్రచ్ఛముద్రికాం । మునిర్భ్రూసంజ్ఞయాతస్మై మండలుమదర్శయత్ ॥ ౨౮ ॥ తతః కమండలౌ తూష్ణీం ముద్రికామవలోకయత్ । తావద్దదర్శాంజనేయ స్తస్మిన్ శ్రీరామముద్రికాః ॥ ౨౯ ॥ దృష్ట్వాసహస్రశ స్తత్ర చకితః ప్రాహతంమునిం । కుతస్త్వియామముద్రికాశ్చ వదకామమముద్రికా॥ ౩౦ ॥ ఏతాసుత్వంమునిశ్రేష్ఠతదాతం మునిరబ్రవీత్ । యదాయదావాయుపుత్రై స్సీతానాంరాఘవాజ్ఞయా ॥ ౩౧ ॥ లంకాంగత్వాసమానీత్వా శుద్ధిముద్రాస్తనామదా । మదగ్రేస్థాపితాస్తాశ్చ కపిభిశ్చకమండులౌ ॥ ౩౨ ॥ నిక్షిప్తాస్తాస్త్వియామాస్సర్వాః పశ్యైతాసు స్వముద్రికాం । తస్యనేర్వచనంశ్రుత్వా గతగర్వ స్తమబ్రవీత్ ॥ ౩౩ ॥ కియంతోరాఘవాశ్చాత్ర సమాయాతామునీ

---

నేలఁబడగా నారసమువలన లంకంతయును సువర్ణమయంబగు రుద్రసేనయైనది॥౨౬॥దానిఁ

శ్రీరాముఁడు మునిరూపముతో నాంజనేయుని గర్వమణచుట.

జూచి చకితుఁడై యాంజనేయుఁడు వేగమె సీతాసన్నిధానమునకువచ్చి నెమ్మదిగానున్న యాయ మ్మనుచూచి యామెతో "నామూఁపుపై గూర్చుంముడు శ్రీరాముని నిప్పుడేచూచెదవు" అని ప్రార్థించెను. అందుకామె "శ్రీరాముఁడు ఇతరులచే విడుపింపఁబడిన నన్ను సహించడు నీవీముద్రి గొనిపోయి రామునికి సమర్పింపుము." అనిచెప్పి యతనిచేత నాశ్రీరామాంగుళీయకము ని చ్చెను. అట్లేయని సీతనభివందించి కపీంద్రుఁడు శీఘ్రముగా వెడలి సువేలాద్రినెక్కి- పుడిగొ నెను. అంతలో బ్రహ్మ యాంజనేయుఁడచ్చట జరిపినపనుల వివరణము నెఱిఁగించునట్లు జా కటిని వ్రాసియిచ్చెను. హనుమంతుఁడు దానిఁగొని బ్రహ్మాభివాదనమొనర్చి యుత్తరవుతీసి ని గంతువేసి గగనమున ఘోరఘోషముంజేయుచువచ్చి కపులమీఁదుగా నపుడు ఉత్తరది ంతరాళముననే దుమికెను. అచ్చట కపులను మఱియొక మునీశ్వరునింజూచి కొంచము గ ంచియున్న హనుమంతుఁడు ఆమునిని "మునీంద్రా, నేను శ్రీరామకార్యమును నెరవేర్చి వ యున్నాడను. దప్పిగల్గియున్నది. జలాశయముంజూపు"మని కోరెను. ఆమునీంద్రుడు జు నవ్రేలిచే వానరునికి నీటిఱెంకిం జూపించెను. అంత నాంజనేయుఁడు శ్రీరామముద్రికను సీ చూడామణిని బ్రహ్మపత్రమును మునియెదుటఁబెట్టి నీళ్లుద్రాగుటకై యామంచిగుంటకు డలెను. అంత నచ్చట యొకకపివచ్చి యారామముద్రికను మునికమండలములో వేసిపోయె

ర్వ । మునిస్తంప్రాహనిహ్యా సద్య గణయస్వాద్యముద్రికాః ॥ ౯౪ ॥ కమండులోరంజలిభి స్తదాథముద్రికాము చః । బహిఃక్షిప్తస్మారుతిస్స నాంతంతాపాందదర్శవై ॥ ౯౫ ॥ పునఃకమండలౌకృత్వా మునింనత్వాకపిఃక్షణం । చింయామాసమనని మాదృశైశ్శతశైఃపురా ॥ ౯౬ ॥ సమానీతా స్తిసీతాయా శ్శుద్ధిఃకాగణనాద్య మే । ఇతినిశ్చిత్యమన గతగర్వ స్తదాకపిః ॥ ౯౭ ॥ పునర్దక్షిణమార్గేణ యయౌయత్రాంగదాదయః । ప్రాయోపవేశనస్థాస్తే తంద్రుష్ట్వాతు మానసాః ॥ ౯౮ ॥ బభూవుర్వానరాస్సర్వే సమాలింగ్యాథతంముహుః । జ్ఞాత్వాతస్మాత్తతస్సీతా దృష్టాశోకవనేతివ ॥ ౯౯ ॥ యయుస్తేరాఘువంశీఘ్రం మార్గే సుగ్రీవపాలితం । దృష్ట్వామధువనంసర్వే పృష్ట్వాతంవాయునందనం ॥ ౩౦౦ ॥ లానిభక్షయామాసు ర్దధివక్త్రోన్యషేధయత్ । తతస్తేతాడయామాసు ర్దధివక్త్రంకపీశ్వరం ॥ ౧ ॥ జ్ఞాత్వాతంమా తులమపి సుగ్రీవస్యాంగదాదయః । సగత్వాసకలంవృత్తం సుగ్రీవాయన్యవేదయత్ ॥ ౨ ॥ సోపిశ్రుత్వాజనకజా దృష్ట్వాతైరిత్యమన్యత । నోచేన్మధువనంరమ్యం కథమశ్నంతివానరాః ॥ ౩ ॥ తతోవిసర్జయామాస దధివక్త్రంకపీశ్వరః । మాసమేనస్త్వయాకార్య స్త్వంశీఘ్రంప్రేషయస్వతాన్ ॥ ౪ ॥ మమాంతికంతతోగత్వా దధివక్త్ర స్తథాకరోత్ । తతస్సుగ్రీవవచనం శ్రుత్వాతేనసమీరితం ॥ ౫ ॥ యయుస్తేవానరాస్సర్వే రామంనత్వాపురఃస్థితాః ॥ తతోహర్షాన్మారుతిస్స బ్రహ్మపత్రంన్యవేదయత్ ॥ ౬ ॥ దత్వాచూడామణింరామం కాకవృత్తంన్యవేదయత్ । తచ్ఛ్రుత్వా

ను. ఆంజనేయుఁడువచ్చి మణిని పత్రమును తీసికొని ముద్రికయేది? అని మునినడిగెను. మునిపుఁడు బొమసన్నచే వానికి కమండలువును చూపించెను. ఆకమండలువులో నూరక ముద్రికలనుచూడగా వేలకొలది రామముద్రిక లగుబడినవి. అందువలన మారుతి సంభ్రాంతుఁడై "మునీంద్రా, ఎచ్చటివీముద్రికలు? వీటిలో నాముద్రికయేది చెప్పుము." అనివేడగా, నాముని "ఎప్పుడెప్పుడు ఆంజనేయులు శ్రీరామాజ్ఞచే లంకకుపోయి సీతలయొక్క శుద్ధముద్రికలను తెచ్చుచుందురో, అప్పుడంతయును నావద్దపెట్టబడిన వవన్నియును కపులచే కమండలువులో నున్నబడినవి. వీటిలో నీముద్రికయేదో చూడుము." అనిపలికెను. దానికి వాయుసుతుఁడు "స్వామీ, ఇచ్చట యెందరురాములువచ్చిరి?" అనియడిగి, ముద్రికలనెత్తి లెక్కించి తెలిసికొనుమని మునిచే నుత్తరవునంది, ఎన్నిమార్లు కమండలువునుండి ముద్రికలనెత్తి ఎంచుచువచ్చినను దాని కంతమునెఱుఁగక మరల నట్లే యందులో నన్నిటిని పడవేసి మునిపునివందించి కొంతసేపు చింతించుచుండి "నావంటివారు నూరారుమంది ఈవరకే సీతావృత్తాంతముద్రికలంగొని తెచ్చియున్నారు. ఇఁక నేనెంతటివాఁడను?" అని మదినెంచి గర్వములేనివాఁడై, మరల దక్షిణమార్గముగా ప్రాయోపవేశ వ్రతాచారణంబున నున్నవారు అంగదాదులు ఉ

శ్రీరాముఁడు సీతావృత్తాంతమువిని హనుమంతుని సంమానించుట.

న్నచోటికి వచ్చెను. వారందరును వాయుపుత్రునింజూచి యానందించిరి ॥ ౯౯ ॥ పరస్పరాలింగనముల నాచరించిరి. ఆంజనేయుని నోటిమీఁదుగా సీతావృత్తాంతమునువిని సంతసించిరి. త్వరగా రామునిసన్నిధికి వెడలిరి. దారిలో సుగ్రీవునియొక్క మధువనంబునుచూచి

సకలంవృత్తం జ్ఞాత్వామారుతినాకృతః॥ ౭ ॥ లంకాయాంబ్రహ్మపత్రేణ రామస్తుష్టోబభూవసః । సమాలింగ్యహనూమంతం రాఘవోవాక్యమబ్రవీత్॥ ౮॥ తవోపకారిణశ్చాహం నపశ్యామ్యద్యమారుతే, కర్తుంప్రత్యుపకారంతే ధన్యోసిజగతీతలే॥౯॥ పరీరంభోహిమేలోకే దుర్లభఃపరమాత్మనః । అతస్త్వంమమభక్తోసి ప్రియోసివానరపుంగవ॥౧౦॥ యత్పాదపద్మయుగళం తులసీదళాద్యైః । సంపూజ్యవిష్ణుపదవీ మతులాంప్రయాంతి ॥ తేనైవకింపునరసౌ పరిరబ్ధమూర్తిః రామేణవాయుతనయఃకృతిపుణ్యపుంజః॥ ౧౧ ॥ రామంసమారుతిఃప్రాహ భీతభీతోతికంపితః । మయాపరాధితమితి ముద్రావృత్తంమునేర్వచః । ౧౨ ॥ తచ్ఛ్రుత్వారామచంద్రోపి విహస్యోవాచమారుతిం । మయైవదర్శితమార్గే కౌతుకంమునిరూపిణా ॥ ౧౩ ॥ త్వద్గర్వపరిహారాయ ముద్రికాంమత్కరేత్విమాం । కనిష్ఠికాయాంత్వం పశ్య సమానీతాత్వయాద్యవై ॥ ౧౪॥ తాంరామముద్రికాందృష్ట్వా శ్రీరామస్యకరాంగులౌ । ననామగతగర్వస్స రామంవిష్ణుమమన్యత ॥ ౧౫ ॥ మయ్యాప్యస్యైవకృపయా పౌరుషంచేత్యమన్యత । ఏవంగిరీంద్రజేప్రోక్తం చరిత్రంసుందరాభిధం ॥ ౧౬॥ రామార్థంవాయుపుత్రేణ కృతంసర్వార్థదాయకం ॥౩౧౭ ॥ ఇతిశ్రీశతకోటిరామచరితాంతర్గత శ్రీమదానందరామాయణే వాల్మీకీయే హనుమత్సుందరచరిత్రే సారకాండే సీతాశుద్ధిర్నామ నవమస్సర్గః ॥౯॥*॥

యంగదుని యాజ్ఞనంది యావనములోని ఫలంబులను భక్షించిరి. దధిముఖుఁడను వనపాలకుఁడు నిషేధించగా వానిని సుగ్రీవుని మేనమామయని యెఱిఁగియును కొట్టిరి. వాఁడుపోయి సుగ్రీవునితో మొరబెట్టెను. వాఁడును "ఆకపులు సీతను కనుగొనివచ్చియుండవచ్చును, లేనియెడల రమ్యమగు మధువనమునెట్లు కొల్లగొట్టుదురు?" అనియెంచి, దధిముఖునితో "నీవు వారిని నిషేధించవలదు, వారిని త్వరగా నావద్దికిపంపుము." అని చెప్పిపంపెను. దధిముఖుఁడును అట్లేచేసెను. అంత సుగ్రీవునిమాటవిని వానరులందరును వాయుపుత్రునితోడవచ్చి శ్రీరామునివందించి యెదుటనిలిచిరి. ఆంజనేయుఁడానందించుచు శ్రీరామసన్నిధికి బ్రహ్మపత్రమును చూడామణిని సమర్పించెను. కాక వార్తనెఱిఁగించెను. అంతయునువిని బ్రహ్మపత్రముచే లంకలోని వానరచేష్టనంతయును తెలిసికొని శ్రీరాముఁడు అమందానందమునంది ఆంజనేయుని నాలింగించి "వాయునందనా, ఉపకరించిన నీకు పుడమిని ప్రత్యుపకారము నెఱుఁగను. పరమాత్మయగు నాయొక్క ఆలింగనము అత్యంతదుర్లభము. అది నీకబ్బినది. నీ వందుచే నాకు భక్తుఁడవు ప్రియుఁడవు." అని సమ్మానించెను. పార్వతీ, ఎవని పాదారవిందయుగ్మమును తులస్యాదులచే పూజించినవారు పరమపదంబగు బ్రహ్మలోకము నందుచుందురో, వానిచేతనే సమాలింగింపబడిన ఆంజనేయుఁడు చెప్పనదియేమి? పండిన పుణ్యపుంజమువలె బరగుచుండె. అంత ననిలసుతుఁడు మిక్కిలి వెరచుచు గడగడవడఁకుచు నేనపరాధము నాచరింతినని ముద్రికావృత్తాంతమును మునివచనమును విన్నవించెను. అందుకు రామచంద్రుఁడు నవ్వుచు "మునిరూపమందిన నాచేతనే దారిలోనట్లు నీ గర్వపరిహారమునకై వినోదము చూపఁబడినది.

శ్రీశివ ఉవాచ—అథాహమారుతింరామో మాంవద స్వసవిస్తరం । లంకాస్వరూపంతత్ జ్ఞాత్వా ప్రతీకారంకరోమ్యహం॥ ౧॥ తద్రామవచనంశ్రుత్వా కథయామాస మారుతిః । లంకాదివ్యపురీదేవ త్రికూటశిఖరేస్థితా॥౨॥ స్వర్ణప్రాకారసహితా స్వర్ణహట్టాలసంయుతా । పరిఖాభిఃపరివృతా పూర్ణాభిర్నిర్మలోదకైః ॥ ౩ ॥ నానోపవనశోభాఢ్యా దివ్యవాపీభిరావృతా । గృహైర్విచిత్రశోభాఢ్యైర్మణిస్తంభమయైశ్శుభైః ॥ ౪ ॥ పశ్చిమద్వారమాసాద్య రాజవాహాస్సహస్రశః । ఉత్తరద్వారితిష్ఠంతి వాజివాహాస్సపత్తయః ॥౫॥ తిష్ఠంత్యర్బుదసంఖ్యాకాః ప్రాచ్యామపితథైవచ । రథినోరాక్షసావీరా ద్వారందక్షిణమాశ్రితాః ॥ ౬ ॥ మధ్యకక్ష్యేప్యసంఖ్యాతా గజాశ్వరథపత్తయః । రక్షయంతిసదాలంకాం నానాస్త్రకుశలాఃప్రభో ॥౭॥ సంక్రమైర్వివిధైర్లంకా శతఘ్నీభిశ్చసంయుతా । ఏ

---

ఇదిగో నీచేత తేబడిన ముద్రికను నాచిటికనవ్రేలిలో చూడుము.'' అని యనుగ్రహించెను. అంత నాంజనేయుఁడు శ్రీరాముని చేతివ్రేలిలో నాముద్రి యుంగరముంజూచి గర్వముగతించినవాఁడై శ్రీరామునే విష్ణుస్వరూపంబనియెఱిఁగి నాయందును ఈతని కృపచేతనే బలసంపదగలిగినదని తెలిసికొని నమస్కరించెను. పార్వతీ, ఇట్లు సుందరంబైన సమాస్త్రేషముల నిచ్చునట్టి శ్రీరామునికై యాంజనేయకృతంబగు చరిత్రంబు నీకు చెప్పఁబడినది ... ... ॥౯॥

### శ్రీరాములవారితో నాంజనేయుఁడు లంక నభివర్ణించి చెప్పుట.

తరువాత శ్రీరాముఁడు మరున్నందనునితో ''సవిస్తరంబుగా నాలంక్కానగర స్వరూపమును నిరూపింపుము. తెలిసి తగినట్లాలోచించి చేయుదును.' అనిచెప్పగా, నందుకు పవనసుతుఁ డిట్లు పలుకుచున్నాఁడు. ప్రభూ, లంకయనునది దేవనగరం బనదగు. అది త్రికూటశిఖరంబుననున్నది. సువర్ణ గోపురాట్టాలకంబులుగలది. తేటనీళ్లనిండిన కందకములు దానింజుట్టు బారియున్నవి. వివిధంబులగు నుపవనంబులు నిండి బరుగుచున్నవి. మంచి బావులుగలవు. మంగళమణి స్తంభంబులచే సంగతంబులగు చిత్రగృహంబులు రాజిలుచున్నవి. పడమట యూరి వాకిలి నాశ్రయించి గజవాహులు వేలకొలదిగా గలరు. ఉత్తరద్వారము నవలంబించి గుఱ్ఱపుఱౌతులు అర్బుదంబులుగా పదాతులతోడ నున్నారు. తూర్పున నట్లేయుందురు. దక్షిణంబున రథికులగు రాక్షసవీరులున్నారు. మధ్యకక్షలో లెక్కలేని చతురంగసైనికులు నిండియుందురు. అందరును శస్త్రాస్త్రంబులచే నేర్పరులై యెల్లప్పుడును లంకను రక్షించుకొనియుందురు నానా దుర్గమార్గంబులును శతఘ్నులు (పిరంగులు)నుగలవు. ఇట్టి లంకలో నీదాసుని చేష్టవినుము. రావణుని బలములో నాలగవవంతును నాశముచేసితిని. లంకను కాల్చితిని.సువర్ణప్రాకారమును పాడుచేసితిని. శతఘ్నులను దుర్గమార్గంబులను పడగొట్టితిని. స్వామీ, నీదర్శనముచే మరల లంక భస్మమైపోవును. త్రికూటశిఖరమున రమ్యమైనను నాచేకాల్పబడిన లంకకు

వంస్థితాయాం దేవేశ శృణుత్వద్దాసచేష్టితం ॥ ౮ ॥ దశాననబలౌఘస్య చతుర్థాంశో మయాహతః । దగ్ధాలంకాపురీస్వర్ణప్రాకారోద్ధర్షితో మయా ॥ ౯ ॥ శతఘ్న్యశ్చసంక్రమాశ్చైవ నాశితా మే రఘూద్వహ । దేవత్వద్దర్శనాదేవ లంకాభస్మీభవేత్ప్రభో ॥ ౧౦ ॥ సువేలాద్రిశ్చోత్తరేస్తి పరలంకాస్తిపశ్చిమే । నికుంభిలాదక్షిణేస్తి తత్రైవయోగినీవటః ॥ ౧౧ ॥ పూర్వేచలఘులంకాస్తి సౌమద్యైః కాంతిమండితా । త్రికూటశిఖరేరమ్యా మత్ప్రచ్ఛానలధర్షితా ॥ ౧౨ ॥ ప్రస్థానంకురుదేవేశ గచ్ఛామో లవణార్ణవం । తన్మారుతేర్వచశ్శ్రుత్వా సుగ్రీవంప్రాహరాఘవః ॥ ౧౩ ॥ సుగ్రీవసైనికాన్సర్వాన్ ప్రస్థానాయాభిచోదయ । ఇదానీమేవవిజయో ముహూర్తస్త్వద్యవర్తతే ॥ ౧౪ ॥ ఆశ్వినీశుక్లదశమీ శ్రవణర్క్షసమన్వితా । శుభాద్యవానరశ్రేష్ఠగచ్ఛామో లవణార్ణవం ॥ ౧౫ ॥ రక్షంతుయూథపాస్సేనా మగ్రే పృష్ఠేచపార్శ్వయోః । నలోభవత్వగ్రసరః పృష్ఠేనీలోద్యరక్షతు ॥ ౧౬ ॥ సుషేణస్సవ్యపార్శ్వే వామే జాంబవానితరేమమ । గజోగవాక్షోగవయో మైందశ్చైతేద్యవానరాః ॥ ౧౭ ॥ వహ్నినైరుతవాయవ్యేశ చతుర్దిక్షుసమంతతః । రక్షంతువానరీంసేనాం ద్వివిదాద్యాస్తథాపరే ॥ ౧౮ ॥ సర్వేగచ్ఛంతుసర్వత్ర సేనాయాశ్శత్రుఘాతినః । ఆరుహ్య మారుతించాహం గచ్ఛామ్యగ్రేంగదంతతః ॥ ౧౯ ॥ ఆరుహ్యలక్ష్మణోయాతు సుగ్రీవత్వంమయాసహ । ఆగచ్ఛస్వేతి చాజ్ఞాప్య హరీన్ రామస్సలక్ష్మణః ॥ ౨౦ ॥ ప్రతస్థేదక్షిణాశాయాం సేనామధ్యగతోవిభుః । తదాతేకపయశ్చక్రుర్భుభుఃకారాన్భయానకాన్ ॥ ౨౧ ॥ వాదయామాసుర్వాద్యాని పణవానకగోముఖైః । వారణేంద్రనిభాస్సర్వే

ఉత్తరమున సువేలాద్రియును పశ్చిమంబున పరలంకయును దక్షిణంబున నికుంభిలయును అచ్చటనే యోగినీ వటవృక్షంబును పూర్వమున లఘులంకయును గలదు. మహాప్రభూ, వెడలండి, పోదము లవణసాగరంబునకు. అనిన మారుతిమాటల ననుమోదించి శ్రీరాముఁడు సుగ్రీవుని

శ్రీరాముఁడు వానరసైన్యములతోడ లంకకు ప్రయాణము చేయుట.

తో ॥౧౩॥ కపిరాజా, నేడే యిప్పుడే విజయముహూర్తముగానున్నది. సైనికులనందరిని ప్రయాణమునకు సిద్ధులగునట్లాజ్ఞాపించుము. ఆశ్వినశుక్ల శ్రవణ దశమిగాన నేడు బాగుగనున్నది. లవణసాగరమునకు పోదము. కపీశ్వరులు ముందు వెనుక ప్రక్కలలో సేనలను రక్షించుగాత. నలుఁడు మొనగాడుగానుండని. నీలుఁడు వెనుకరక్షకుఁడుగా నుండని. సుషేణుఁడును జాంబవంతుఁడును నాకిరుగెలంకుల్లలోనుండని. గజుఁడు గవాక్షుఁడు గవయుఁడు మైందుఁడు వీరునలుగురును ఆగ్నేయాదివిదిక్కులలో రక్షకులైయుండని. ఇట్లు వానరసేనలను రక్షించికొని ద్వివిదాదులు ఇతరులందరును బయలుదేరని. నేను మొదట నాంజనేయునినెక్కి వచ్చుచున్నాను. వెనుక నంగదునిమీఁద లక్ష్మణుఁడు వచ్చునుగాక. సుగ్రీవుఁడా, నీవు నాతోడరమ్ము. అని యిట్లు కపులనాజ్ఞాపించి శ్రీరాముఁడు లక్ష్మణునితోడ సేనామధ్య విరాజితుఁడై దక్షిణమునకు వెడలెను. అపుడు కపులు భయంకరములయిన భుఃభుఃకారమునుచేసిరి. భేరీ మృదంగ పటహాదివాద్యములు మ్రోగినవి. కరీంద్రులవంటి కామరూపులైన కపులు క్షణకాల

వానరాః కామరూపిణః ॥ ౨౨ ॥ గతా స్తదాదవాఙాత్రం క్వచిత్తస్థుర్నతేక్షణం । అథవచ్ఛకునాలంకాం గచ్ఛంతో రాఘువస్యహి ॥ ౨౩ ॥ తేసహ్యంసమతిక్రమ్య మలయంచతథాగిరిం। ఆయయుశ్చానుపూర్వ్యేణ తేసర్వేదక్షిణార్ణవం ॥ ౨౪॥ కృతస్సేనా నివాసశ్చ రాఘువేణాభిషైకతే । చక్రుర్మంత్రంసాగరస్య తరణార్థంప్లవంగమాః ॥ ౨౫॥ లంకాయాంవాయుపుత్రేణ కృతందృష్ట్వాసరావణః । ప్రహస్తాదీం స్తదాప్రాహ కథమగ్రేభవిష్యతి॥ ౨౬॥ ఏకేనకపినాశ్మాకం పురతోజ్వాలితాపురీ , దృష్ట్వాసీతావనంభగ్నం రాక్షసానిహతారణే ॥ ౨౭ ॥ మమాతిలాలితఃపుత్రః కనీయాన్ నిహతోరణే । తదాతేమంత్రిణస్సర్వే దదుర్ధైర్యందశాననం॥ ౨౮ ॥ రాజన్నుపేక్షితోస్మాభి ర్మర్కటోయమితిస్ఫుటం । వయంతవాజ్ఞయాకుర్మో జగత్ప్రృథ్విమవానరం ॥ ౨౯ ॥ కుంభకర్ణ స్తదాప్రాహ రావణంరాక్షసేశ్వరం । త్వయాయోగ్యంకృతంనైత ద్యద్గత్వాజానకీహృతా॥ 3౦ ॥ యద్యప్యనుచితంకర్మ త్వయాకృతమజానతా। సర్వంసమంకరిష్యామి స్వస్థచిత్తోభవప్రభో॥ 3౧ ॥ దేహిదేవమమానుజ్ఞాం హత్వారామంసలక్ష్మణం ॥ సుగ్రీవంవానరాంశ్చైవా గమిష్యామిపునఃక్షణాత్ ॥ 3౨॥ కుంభకర్ణవచశ్ఛ్రుత్వా తదాప్రాహవిభీషణః । మహాభాగవతశ్శ్రీమాన్ రామభక్త్యేకతత్పరః॥ 33॥ విలోక్యకుంభశ్రవణాదిదైత్యా న్మత్తప్రమత్తానతివిస్మయేన । విలోక్యకామాతురమప్రమత్తో దశాననంప్రాహవిశుద్ధబుద్ధిః ॥3౪ ॥ నకుంభకర్ణేంద్రజితౌచరాజం స్తథామహాపార్శ్వమహోదరౌతౌ ।. నికుంభకుంభౌచతథాతికాయః స్థాతుంనశక్తాయుధిరాఘవాగ్రే ॥ 3౫ ॥ సీతాంచసత్కృత్యమహాధనేన ద

మైనను నిలువక ప్రయాణముఁ జేయుచుండిరి. శుభశకునంబులయినని. ఇట్లు సహ్యామలయాది గిరుల నతిక్రమించి క్రమముగా లవణసాగరమునుచేరి రాఘవాజ్ఞచే నిసుకదిబ్బలమీఁద సేనాసన్నివేశంబుల నొనర్చిరి. మఱియు సముద్రమును దాటుటకు నాలోచించుచుండిరి ॥ ౨౫

రావణుఁడు సుగ్రీవునితోఁ జేసిన సంధానము చెడగా విలపించుట.

అచ్చట లంకలో నాంజనేయుఁడు చేసినపనింజూచి యారావణుఁడు ప్రహస్తాదులతో “ఇఁకమీఁద నెట్లగునో! మనయెదుట కపి యొకఁడువచ్చి లంకనుకాల్చెనే! సీతను కనుగొనెను, వనభంగమొనరించెను, రణమున రక్కసులనణఁచెను, నాకడగొట్టు ముద్దుపట్టిని చంపెను” అని మందలించెను. అప్పుడు వాని మంత్రులందరును రావణునికి “ప్రభూ, వీఁడొకఁడు కోతియని మేమందర ముపేక్షించియుంటిమి. నీవాజ్ఞాపించినట్లయిన నీలోకమును మర్కటహీనంబుగా నొనర్చెదము.” అని ధైర్యమునిచ్చిరి. అపుడు కుంభకర్ణుఁడు “అన్నా, నీవు తగినపని జేయకపోతివి. సీతాపహరణముతగదు. అయిననేమో తెలియకచేసితివి. పోనిమ్ము. అంతటిని చక్కబరచెదను. నీవు నెమ్మదిగనుండుము. నాకనుజ్ఞ నిమ్ము. శ్రీరామలక్ష్మణులను సుగ్రీవుని వాని వానరసైన్యమునుగూడ క్షణములో చంపివచ్చెదను.” అని చెప్పగా దానివిని, నిర్మలాంతరంగుండును పరమభాగవతోత్తముండును శ్రీరామ భక్తాగ్రగణ్యుండునగు విభీషణుండు ఆశ్చర్యమునొంది మదోన్మత్తులైన కుంభకర్ణాదులనుచూచి కామాతురుండైన రావణునింజూచి “రాక్షస

త్వాభిరామాయ సుఖీభవత్వం । నో చేన్న రామేణ విమోక్ష్యసే త్వం గుప్తస్సురేంద్రైరపి శంకరేణ ॥ ౩౬ ॥ ఏవం శుభం రావణస్స విభీషణవచో హితం । ఆత్మనః ప్రతిజగ్రాహ నైవాసౌ సౌఖ్యకారకం ॥ ౩౭ ॥ కాలేన నోదితో క్రుద్ధో విభీషణమథాబ్రవీత్ । బంధురూపేణ శత్రుస్త్వం జాతో నాస్త్యత్ర సంశయః ॥ ౩౮ ॥ యోఽన్యస్త్వేవం విధం బ్రూయాద్వాక్యం హన్మి తదైవ తం । ఉత్తిష్ఠ గచ్ఛ దుర్బుద్ధే ధిక్త్వాం రక్షఃకులాధమ ॥ ౩౯ ॥ రావణేనైవముక్తస్స పరుషేణ విభీషణః । చతుర్భిర్మంత్రిభిర్యుక్తో యయౌ శ్రీరాఘవాంతికం ॥ ౪౦ ॥ రాఘవశ్చాపి తం జ్ఞాత్వా తేన సఖ్యం చకార సః । హనూమతోదధేస్తీరే లంకాం చ నికతోద్భవాం ॥ ౪౧ ॥ కారయిత్వా రఘుశ్రేష్ఠస్తత్ర మిత్రం విభీషణం । లంకాయాశ్చ వరాజ్యార్థం వానరైరభ్యషేచయత్ ॥ ౪౨ ॥ తదా విభీషణం ప్రాహ రామచంద్రో విహస్య చ । న్యాసభూతా త్వియం లంకా తావత్కాలం తదాస్తి మే ॥ ౪౩ ॥ యావత్తం రావణం హత్వా తవ దాస్యామ్యహం శుభాం । హనూమతి స్త్వియం నామ్నా లంకాఖ్యాతిం గమిష్యతి ॥ ౪౪ ॥ హనుమల్లంకాబ్ధేస్తీరే వర్తతేద్యాపి పార్వతి । విభీషణాద్రావణాంతే రామస్తాం మోచయిష్యతి ॥ ౪౫ ॥ ఏతస్మిన్నంతరే తత్ర గగనస్థశ్శుకోఽబ్రవీత్ । ప్రేషితో రావణేనైవ సుగ్రీవం ప్రాహ వేగతః ॥ ౪౬ ॥ త్వామాహ రావణో రాజా తవ నాస్త్యర్థవిప్లవః । అహం యద్యహరం భార్యాం రాజపుత్రస్య కింతవ ॥ ౪౭ ॥ కిష్కింధాం యాహి హరిభిస్త్వం వైరం కురు మా మయా । తం ధృత్వా వానరాశ్శీఘ్రం బబంధుర్లోహబంధనైః ॥ ౪౮ ॥ శార్దూలశ్చాపి సేనాం తాం దృష్ట్వాధిపమభాషత । తచ్ఛ్రుత్వా రావణశ్చాపి దీర్ఘచింతాపరోఽభవత్ ॥ ౪౯ ॥ రామ

చక్రవర్తీ, రణమున రాముని యెదుట కుంభకర్ణుఁడు మేఘనాదుఁడు నికుంభుఁడు అతికాయుఁడు మహోదరుఁడు వీరెవ్వరును నిలువజాలరు. సీతాదేవిని సత్కరించి రామునికర్పించి నీవు సుఖమునందుము. లేనియెడల కాలరుద్రుఁడు నిన్ను కాపాడినను రాముఁడు నిన్నువిడునడు.” అని చెప్పెను. హిత మితోచిత మంగళమహితంబగు నామాటను రావణుఁ డాదరించక దుర్దైవముచే నీడవబడి “శత్రువగు నీవు తమ్ముడుగాపుట్టితివి. మఱియొకఁ డీమాట నాతో చెప్పియున్న నప్పుడే వానినిచంపియుందును. లెమ్ము; దుర్బుద్ధిగల రాక్షసకులాధముఁడా, ఛీ, పొమ్ము.” అని ధిక్కరించెను. క్రూర రావణునిచే నిట్లు తిరస్కృతుఁడైన విభీషణుఁడు నలుగురు మం

శ్రీరాముఁడు విభీషణునికి మైత్రితో లంకారాజ్యము నిచ్చుట.

త్రులతోఁడ రామసన్నిధానమునకు వచ్చెను ॥ ౪౦ ॥ రఘునందనుం డును కరుణించి వానింజూచి వానితో సఖ్యమొనరించెను. మఱియు నాంజనేయునిచే సముద్రతీరమున నొకలంకను ఇసుకచే చేయించి యచ్చట మిత్రుఁడగు విభీషణునిం గూర్చుండబెట్టి లంకారాజ్యపట్టాభిషేకమును వానరులతోఁడ చేసెను. అప్పుడు నవ్వుచు రామచంద్రుఁడు విభీషణునితో “నేను రావణుని సంహరించువరకు నీకు దీనిని లంకగా నిచ్చియున్నాను. ఆంజనేయునిచే చేయబడినది ఈలంక ప్రసిద్ధమగుగాక” అని యనుగ్రహించెను. పార్వతీ, సముద్రతీరమున నిప్పటికిని హనుమల్లంక కలదు. రావణాంతమున విభీషణునినుండి దానిని విడిపించును. ఆనదుము నచ్చట రా

స్సంమంత్రయామాస తద్రైకాంతే స్థితః క్షణాత్ । విభీషణేన సుగ్రీవ మారుతిభ్యాం సమన్వితః ॥ ౫౦ ॥ తీర్త్వా ఘంజల ధేరల్పం సంస్థితో బంధునాయుతః । సర్వేషాం వచనం శ్రోతుం రాఘవేణాథ సాగరః ॥ ౫౧ ॥ మేఘవద్గర్జనాం కుర్వన్ వామహస్తేన ధిక్కృతః । అద్యాపి సాగరస్తత్ర తూష్ణీమేవ స విద్యతే ॥ ౫౨ ॥ తతస్సంమంత్ర్య రామస్తు తదా సాగరరోధసి । ప్రాయోపవేశనం చక్రే దర్భాభాస్తీర్య వేగతః ॥ ౫౩ ॥ దినద్వయమతిక్రమ్య తృతీయదివసే తదా । ఉత్థాయ దర్భశయనా త్స్వ సక్తలక్ష్మణమబ్రవీత్ ॥ ౫౪ ॥ పశ్యలక్ష్మణ దుష్టోసౌ వారిధిర్మామపాగతం । నాభినందతి దుష్టాత్మా దర్శనార్థం మమానఘ ॥ ౫౫ ॥ జానాతి మానుషోయం నూం కింకరిష్యతి వానరైః । అద్యపశ్య మహాబాహో శోషయిష్యామి వారిధిం ॥ ౫౬ ॥ పద్భ్యామేవాద్య గచ్ఛంతు వానరా విగతజ్వరాః । ఇత్యుక్త్వా చాపమాకృష్య సందధే బాణముత్తమం ॥ ౫౭ ॥ తదా చచాల వసుధా దిశో ఘూస్తమసావృతాః । చుక్షుభే సాగరో వేలాం భయాద్యోజనమత్యగాత్ ॥ ౫౮ ॥ తిమి నక్రఝషామీనాః ప్రతప్తాః పరితత్రసుః । ఏతస్మిన్నంతరే సాక్షా త్సాగరో దివ్యరూపధృక్ ॥ ౫౯ ॥ రత్నైరుపాయనం రామం సమర్ప్యప్రణనామ సః । అథ తుష్టావ దీనాత్మా ప్రార్థయామాస రాఘవం ॥ ౬౦ ॥ అభయం దేహి మే రామ లంకామార్గం దదామి తే । ఇతి తద్వచనం శ్రుత్వా రాఘవః ప్రాహ సాగరం ॥ ౬౧ ॥ అమోఘోయం మహాబాణః కస్మిన్దేశే నిపాత్యతాం । లక్ష్యం దర్శయ మే శీఘ్రం బాణస్యాస్య పయోనిధే ॥ ౬౨ ॥ సాగరశ్చ వా చ—రాః మోత్తర ప్రదేశేస్తి ద్రుమకల్ప ఇతి శ్రుతః । ప్రదేశస్తత్రబహవః పాపాత్మానో దివానిశం ॥ ౬౩ ॥ బాధంతే

వణుని చేపంపబడిన శుకుఁడు గగనమున సుగ్రీవునితో "రాజపుత్రుని భార్యను నే నపహరించి నందున నీకేమి? ఏయనర్థముగలుగలేదే, కపులతోఁడ నీకిష్కింధకు నీవుపొమ్ము, నాతోఁడ నీకు పగవలదు. అని రావణరాజు నీకు చెప్పుచున్నాఁడు" అని పలుకగా; వానరు లాశుకునిఁబట్టి సంకెళ్లుగొట్టిరి. శార్దూలుం డాసంగతిని రావణునికి తెలిపెను. అందుచే రావణుఁడు దురంత చింతగల్గి దుఃఖించుచుండెను. శ్రీరాముఁడు విభీషణ సుగ్రీవాంజనేయులతోఁడ కొంతసేపు ప కాంతమున కూర్చుండి యాలోచించెను ॥ ౫౦ ॥ సలక్ష్మణుఁడు రాముఁడు అందరిమాటలను వి

శ్రీరామునిచే సముద్రరాజు శరణాగతుఁడై యనుగ్రహింపఁబడుట.

నగోరి సముద్రుని యల్పప్రవాహమును దాటి గూర్చుండి మేఘమువలె గర్జించి యెడమచేతి తో ధిక్కరించెను. పార్వతీ, అచ్చటఁ నిప్పటికిని సముద్రము ఘోషించుటలేదు. అంత నారా ముఁ డాలోచించి దర్భలుపరచుకొని ప్రాయోపవేశన మొనరించెను. రెండుదినములు కడవగా మూడవనాడు దర్భశయనమునుండి లేచి లక్ష్మణునితో "చూడుము లక్ష్మణా, దుష్టుఁడైన వీఁడు సముద్రుఁడు నేనువచ్చినను నాదర్శనమునకు రాలేదు. వీఁడేమి నరుఁడు, కోతులనుకట్టుకొని న న్నేమిచేయగలఁడు? చూడు మిప్పుడే ఈ సముద్రోదకమును శోషించివేయుదును. కపులు శంకలేక కాళ్లతోనే నడచిపోనిమ్ము" అని యాగ్రహించి ధనుస్సునీడ్చి బాణానుసంధానముం జేసెను. అప్పుడు పుడమి చలించెను. దిక్కులు చీఁకట్లుకమ్మెను. సాగరము అల్లకల్లోలమై మే

మాంరఘుశ్రేష్ఠ తత్రతేపాత్యతాంశరః । రామేణముక్తోబాణోఽసౌ క్షణాదాభీరమండలం ॥ ౮౪ ॥ హత్వాపునస్స మాగత్య తూణీరేపూర్వవత్ స్థితః । తదోఽబ్రవీద్రఘుశ్రేష్ఠం సాగరోవినయాన్వితః ॥ ౮౫ ॥ మయిసేతుంకారయస్వ నలేనోపలనిర్మితం । విశ్వకర్మసుతశ్చాయం వరోలబ్ధోఽస్త్యనేనహి ॥ ౮౬ ॥ ద్విజస్యబాహ్నవీతోయే శాలిగ్రామస్త్వ నేనహి । త్యక్తస్తదాతేనశప్తః పాషాణాదితరిష్యతి ॥ ౮౭ ॥ త్వద్ధస్తాదితిశాపోఽయం వరఏవాత్రసంస్మృతః । ఇత్యు క్త్వారాఘవంనత్వా యయౌసింధురదృశ్యతాం ॥ ౮౮ ॥ నలమాజ్ఞాపయామాస సేత్వర్థంరఘునందనః । సేతుమారభ మాణస్తు విఘ్నేశంస్థాప్యరాఘవః ॥ ౮౯ ॥ నవగ్రహాణాంపూజార్థం పాషాణాన్నవసాదరం । నలహస్తేసంస్థాప్య పూర్వాంతేమహోదధౌ ॥ ౯౦ ॥ తతస్సాగరసంయోగే స్వనామ్నాలింగముత్తమం । స్థాపయామీతినిశ్చిత్య మారు తింవాక్యమబ్రవీత్ ॥ ౯౧ ॥ కాశీంగత్వాశివాల్లింగ ద్వయమానయమారుతే । ముహూర్తమధ్యేనోచేత్తు ముహూర్తా తిక్రమోభవేత్ ॥ ౯౨ ॥ తద్రామవచనంశ్రుత్వా తథేత్యుక్త్వాసమారుతిః । యయౌవాకాశమార్గేణ క్షణాద్వారాణ సీంమమ ॥ ౯౩ ॥ తత్రాగత్యాథమాంనత్వా రామకార్యంన్యవేదయత్ । తచ్ఛ్రుత్వాథమయాదేవి రాఘవాయహనూ మతే ॥ ౯౪ ॥ ద్వేలింగేహ్యర్పితేశ్రేష్ఠే తతోహంకపిమబ్రువం । మయాపిదక్షిణేగంతుం పూర్వమేవవినిశ్చితం ॥ ౯౫ ॥ అగస్తినావిశేషేణ యాస్యామిరాఘవాజ్ఞయా । ఏవంమద్వచనంశ్రుత్వా మారుతిఃప్రాహమాంపునః ॥ ౯౬ ॥ కదావిని శ్చితంపూర్వం త్వయాత్రకుంభజన్మనా । తత్సర్వంమాంవదస్వాద్య కృపాంకృత్వామహోపతే ॥ ౯౭ ॥ తన్మారుతివచశ్శ్రు త్వా తతోహమబ్రువంకపిం । మారుతేద్యశ్రుణుష్వత్వం పూర్వవృత్తంవదామితే ॥ ౯౮ ॥ కదాచిన్నారదశ్శ్రీమాన్

రమీఁరి యామడపారెను. మహా మత్స్యాది జలజంతువులు తపించి కంపింపసాగెను. ఆవేళకు సాగరరాజు దివ్యరూపముందాల్చివచ్చి శ్రీరామునికి రత్నముల కానుకనిచ్చి సమస్కరించెను. మఱియు దీనుఁడై స్తుతించెను. "రామచంద్రా, కరుణింపుము. అభయమిమ్ము. లంకకు దారినిచ్చెద"నని సంప్రార్థించెను. అందుకు రాముఁడు "సాగరుఁడా, నాబాణము వ్యర్థముకానిది. ఎచ్చటవదలుదును? గుఱిజూపుము" అని యనుగ్రహించగా; సాగరుఁడు "రామా, ఉత్తరప్రదేశమున ద్రుమకల్పమను చోటుగలదు. అచ్చట ననేకులు పాపాత్ములుగలరు. వారు నన్ను అహోరాత్రము బాధించుచున్నారు. అచ్చట నీబాణముం బ్రయోగింపుము." అని వేడెను. అంత నారామబాణముపోయి ఆప్రదేశమును నిర్మూలముచేసి, మరల శ్రీరాముని యమ్ములపొదనాశ్రయించెను. పిదప సాగరుఁడు వినీతుఁడై "రఘునాథా, ఈ నలుఁడను కపీంద్రుఁడు విశ్వకర్మ యొక్క కుమారుఁడు. వీఁడు ఒకప్పుడు గంగలో బ్రాహ్మణుని శాలిగ్రామమును పడవేసెను. అతఁడు "నీవు నీటవేసినరాళ్లు తేలుచుండని" యనిశపించెను. అది యిప్పుడు వరముగా నేర్పడినదిగనుక నాయందు నలునిచే సేతువును రాళ్లతో కట్టింపుము." అని విన్నవించి సరిత్పతి యంతర్ధానమునొందెను ॥ ౮౮ ॥ పిదప శ్రీరాముఁడు సేతురచనకై నలుని కాజ్ఞనిచ్చి తత్ప్రా

హనుమంతుఁడు శివలింగములం దెచ్చుటకై కాశికి వెడలుట.

రంభమున విఘ్నేశ్వరుని ప్రతిష్ఠించి, నవగ్రహముల పూజకొఱకు నవపాషాణంబులను నలుని

స్నాత్వా శ్రీనర్మదాంభసి । శ్రీమదోంకారమభ్యర్చ్య సర్వదం సర్వదేహినాం ॥ ౭౯ ॥ వ్రజన్విలోకయాంచక్రే పు
రో వింధ్యం ధరాధరం । సంసారతాపసంహారి రేవావారిపరిష్కృతం ॥ ౮౦ ॥ ద్వైరూప్యేణాపి సర్వాంతం స్థావరేణచ
రేణ చ । సాభిఖ్యేన యథార్థాఖ్యా ముచ్చైర్వసుమతీమిమాం ॥ ౮౧ ॥ ఆగతం నారదం దృష్ట్వా వింధ్యః ప్రత్యుజ్జగామ
సః । గృహమానీయ విధివత్ పూజయామాస సాదరం ॥ ౮౨ ॥ గతశ్రమమథాలోక్య బభాషే వనతో గిరిః । అఘుసం
ఘుః పరిహృత స్త్వదంఘ్రిరజసా మమ ॥ ౮౩ ॥ త్వదంగసంగినా హ్యసా సహసా [illegible]
సుదినం చాద్య మేమునే ॥ ౮౪ ॥ ప్రాక్కృతైస్సుకృతైరద్య ఫలితం మే చిరార్జితైః । ధరాధరత్వం కులిషు మాన్యం మే
ద్యభవిష్యతి ॥ ౮౫ ॥ ఇతి శ్రుత్వా తదాకించి దుచ్ఛ్వాసస్యస్థితవాన్మునిః । పునరూచే కులివర స్సంభ్రమా
పన్నమానసః ॥ ౮౬ ॥ ఉచ్ఛ్వాసకారణం బ్రహ్మన్ బ్రూహి సర్వార్థకోవిద । తవాహం మార్గయామ్యద్య వ్యాప్తేదం
క్షణమాత్రతః ॥ ౮౭ ॥ ధరాధరణసామర్థ్యం మేర్వాదౌ పూర్వపూరుషైః । వర్ణ్యతే సముదాయాత్తు దహకేనోదధే
ధరాం ॥ ౮౮ ॥ గౌరీగురుత్వాద్ధిమవా నాధిపత్యాచ్చ భూభృతాం । సంబంధిత్వాత్పశుపతే స్సపక్షో మాన్యభృత్స్వతాం ॥
౮౯ ॥ న మేరుః స్వర్ణపూర్ణత్వా ద్రత్నసానుతయాథవా । సురసద్మతయా వాపి క్వాపి మాన్యో మతో మమ ॥ ౯౦ ॥ ప
రం శతం న కిం శైలా ఇలాకలన కేలయః । ఇహ సంతి సతాం మాన్యా మాన్యాస్తే తు స్వభూమిషు ॥ ౯౧ ॥ మం దేహ దేహ

చేత మహోదధిలో సంస్థాపించి, యంత సాగరసంగమప్రదేశమున తనపేరుతో నుత్తమలింగ
మును ప్రతిష్ఠించునట్లు నిశ్చయించి, యాంజనేయుని "నొకముహూర్తములోపల నీవు కాశికిపో
యి శివునివలన రెండులింగములను తీసికొనిరమ్ము. కాల మతిక్రమించును పొమ్ము.", అని చెప్పి
పంపెను. అట్లేయని వాయుపుత్రుండు క్షణమాత్రమున నావారాణసికి వచ్చెను. పార్వతీ, అ
చ్చటవచ్చి నాకు నమస్కరించి రామకార్యమును విన్నవించెను. అదివిని నేను శ్రీరామునికి
ఆంజనేయునికి రెండులింగములనిచ్చి "కపీ, నేనుకూడ దక్షిణదిక్కుకు వచ్చుటను మునుపే ని
శ్చయించియున్నాను. అగస్త్యమునితోడ విశేషముగా నెంచితిని. శ్రీరామునియనుమతిచే వచ్చు
చున్నాను." అని చెప్పితిని. ఈమాటవిని పావమాని "నీవెపు డగస్త్యునితోడ నిశ్చయించితివి?
నామీఁద కరుణించి యాసంగతిని సవిస్తరముగా నిరూపింపు"మని వేడెను. అందుకు నేనిట్లం

వింధ్యపర్వతుని గర్వభంగమునకై అగస్త్యమునియొక్క దక్షిణదిగ్గమనము.

టిని ॥౭౭॥ మరున్నందనా! వెనుకటిసంగతిని చెప్పెదను, వినుము. ఒకానొకప్పుడు శ్రీనారదమ
హర్షి నర్మదానదిలో స్నానముచేసి అందరికి నన్ని యిష్టములనిచ్చునట్టి యోంకారేశ్వరు
నింబూజించి పోవుచు నెదుట, సంసార సంతాప సంహారకంబైన రేవానదిచే నలంకృతమై స్థా
వరజంగమ రూపములను రెంటి నవలంబించి ఈవసుమతిని యౌన్నత్యముచే యథార్థవతినిగా
జేసిన కీర్తితోడనుండు వింధ్యరాజునుచూచెను. వాఁడు నారదునింజూచి భక్తితో నెదుటవచ్చి
తనయింటికి బిలచికొనిపోయి చక్కగాసత్కరించి విశ్రమించుట నెఱిఁగి వినీతుఁడై "మునీం

మందోహ ఉదయైకదయాశ్రితః । నిషధో నౌషధిగిరిర్ వ్యస్తోఽస్య స్తమితప్రభః ॥ ౯౨ ॥ నీలశ్చనీలనిచయో మంద
రో మందలోచనః । సర్పాలయస్సమలయో రాయంవావాపరైవతః ॥ ౯౩ ॥ హేమకూటత్రికూటాద్యాః కూటోత్త
రపదాస్తుతే । కిష్కింధక్రౌంచసహ్యాద్యా భారసహ్యా న తే భువః ॥ ౯౪ ॥ ఇతి వింధ్యవచశ్శ్రుత్వా నారదో హృద్య
చింతయత్ । అఖర్వగర్వసంసర్గో మహత్వాయ న కల్పతే ॥ ౯౫ ॥ శ్రీశైలముఖ్యాః కింశైలా నేహ సంత్యమలశ్రియః ।
యేషాం శిఖరమాత్రాది దర్శనం ముక్తయే సతాం ॥ ౯౬ ॥ అద్యాస్య బలమాలోక్య మితి ధ్యాత్వాబ్రవీన్మునిః । సత్య
[illegible] గిరిసారం వృణ్వతాం ॥ ౯౭ ॥ పరం శైలేషు శైలేంద్ర మేరుస్త్వామవమన్యతే । మయా నిశ్శ్వసితం
చైతత్త్వయి చాపి నివేదితం ॥ ౯౮ ॥ అథవా మద్విధానాం హి కేయం చింతా మహాత్మనాం । స్వస్త్యస్తు తుభ్యమిత్యు
క్త్వా యయౌ స వ్యోమవర్త్మనా ॥ ౯౯ ॥ గతే మునౌ నినిందస్వ మతి వోద్విగ్నమానసః । చిత్తే విచారయామాస మే
రోః శైత్ర్యం కథం త్వితి ॥ ౧౦౦ ॥ మేరోః ప్రదక్షిణం కుర్యాన్నిత్యమేష దివాకరః । సగ్రహర్క్షగణో నూనం మన్యమా
నో బలాధికం ॥ ౧ ॥ ఇతి నిశ్చిత్య వింధ్యాద్రి వర్ధాపృథేషవృద్ధేక్షణః । విరుధ్య బ్రాధ్నమధ్వానం స్వస్థోభూద్గగనాం
గణే ॥ ౨ ॥ తతః ప్రభాతే సూర్యోసౌ దిశం యామ్యాం సముద్యతః । గంతుం రుద్ధం స్వపంథానం దృష్ట్వా స్వస్థోభవచ్చి
రం ॥ ౩ ॥ యోజనానాం సహస్రే ద్వే ద్వేశతే ద్వేచయోజనే । యోజనస్య నిమేషార్ధా ద్యాతి సోపి చిరం స్థితః ॥ ౪ ॥ గతే

ద్రా, నీపాదధూళిచే పాపమంతయు పరిహరింపఁబడె. నీస్పర్శవలన నాయజ్ఞానము నివృత్తిం
చె. మహానుభావా, నేఁడేసుదినము. నావెనుకటి పుణ్యములు పండివచ్చినవి. నాకులము వారి
లో మాన్యంబగు భూధరత్వంబిపుడు నాకు కలుగుచున్నది." అనిచెప్పగా, నారదుండు విని
కొంచము నిట్టూర్పువిడిచి యూరకయుండెను. అందుకు గిరివరుఁడగు వింధ్యుఁడు సంభ్రాంత
స్వాంతుఁడగుచు "సర్వజ్ఞుఁడైన బ్రాహ్మణోత్తముఁడా, నిట్టూర్పు విడుచుటకు కతనేమి? నీవు
నస్సంకటమును నిమిషమాత్రమున పోగొట్టగలను. ఏమో వెనుకటివారు మొత్తము మీఁద
భూధరంబులని మేరువు మొదలగునాటిని వర్ణించుచున్నారుగాని, నేనొకడనే భూమిని ధరిం
చువాఁడను. గౌరిని గనుటచేతను కొండల ఱేడగుటచేతను శివునిమామ యగుటచేతను ఆ
హిమవంతుఁడొకఁడు సుజనులచే కొనియాడబడుచున్నాడు. మేరువు బంగారు నిండియున్న
నేమి? రత్నసానువైన నెంత? సురసద్మంబైనగాని? అది మాన్యమని యెవ్వరుననరు. ఇది నామ
తము. భూమిలో బాదుకొనియుండు మూర్ఖకొలది కొండలెన్ని లేవు? అవిన్నియును సుజన సం
మాన్యములే, అయిన నవవి యుండెడుచోట్లలో. మందేహశైలమూకారపుష్టిగలది. ఉదయశైల
ము కేవల దయాపాత్రము. నిషధగిరిలో నోషధులులేవు. అస్తశిఖరికి కాంతిసున్న. నీలాద్రి
నల్లనిది. మందరపర్వతము మందాక్షము. మలయధరము పాములపుట్ట. రైవతము నిర్ధనము.
హేమకూటత్రికూటాదులు పేళ్లుమాత్రముగలవి. కిష్కింధక్రౌంచ సహ్యాదిగిరులు భూమిబళ్లు
వు నోర్వజాలవు. నేనొకఁడు గొప్పవాఁడను" అని విఱ్ఱవీగుచుండు వింధ్యుని మాటలనువిని

బహుతిథే గతే కాలే ప్రాచ్యోదీచ్యా ధృతాదితాః । చండర ... ॥౫॥ పాశ్చాత్యాదా క్షిణాత్యాశ్చ నిద్రాముద్రితలోచనాః । శమితా ఏవ దృశ్యంతే ... స్వాహాస్వధావషట్కార వర్జితే జగతీతలే । పంచయజ్ఞక్రియాలోపాచ్చకంపే భువనత్రయం ॥౭॥ తతస్సర్వే విధేర్వాక్యా దగస్త్యం తద్గిరేర్గురుం । ప్రార్థయామాసుశ్చైత్యైత్య సమునిర్వ్యాకులోఽభవత్ ॥౮॥ తదాగస్త్యముఖాయాక్తశ్చ గచ్ఛత్వం దక్షిణాం దిశం । వాక్పాశేన గిరిం బధ్వా మాంభిదత్వం భజస్వమాం ॥౯॥ అహమప్యచిరేణైవ తవ ఖేదాపనుత్తయే । సీతా శ్రీరామపూజార్థం యాస్యామి దక్షిణాం దిశం ॥౧౦॥ ఇతి మద్వచనం శ్రుత్వాఽగస్తిస్సుప్రమనాస్తదా । ముక్త్వా కాశీం యయా వింధ్యం లోపాముద్రాసమన్వితః ॥౧౧॥ తమగస్త్యం సపత్నీకం దృష్ట్వా వింధ్యోఽతికంపితః । అతిఖర్వతరో భూత్వా వివత్తురవనీమివ ॥౧౨॥ ఆజ్ఞా ప్రసాదః క్రియతాం కింకరోస్తీతి చాబ్రవీత్ । తద్వింధ్యవచనం శ్రుత్వాఽగస్తిః ప్రాహ చ సాదరం ॥౧౩॥ వింధ్య సాధురసి ప్రాజ్ఞః మాంచ జానాసి తత్త్వతః । పునరాగమనం చేన్మే తావత్ఖర్వతరో భవ ॥౧౪॥ ఇత్యుక్త్వా దక్షిణామాశా మగస్తిస్సుయయాతదా । వేపమానో గిరిః ప్రాహ పునర్జన్మాద్య మేఽభవత్ ॥౧౫॥ ఉచ్చిరాద్వాదశాబ్దైస్సు సంపశ్యతి దక్షిణే । నాగతం తం సందృష్ట్వా పునశ్శిఖరోర్ధ్వవర్తితే ॥౧౬॥ అద్యశ్వో వా పరశ్వో వా ఆగమిష్యామి వైమునిః । ఇతి చింతామహాభారై గిరిరాక్రాంతవత్ స్థితః ॥౧౭॥ నాద్యాపి మునిరాయాతి

నారదుఁడు తనమనమున "వీఁడు మిక్కిలి క్రొవ్వుపట్టినవాఁడు, లోకమున శిఖర దర్శనమాత్రమున ముక్తినిచ్చునట్టి శ్రీశైలాది మహాశైలంబు లెన్ని లేవు? గర్వము సహింపనగును. వీని బలము చూతము." అని నిశ్చయించి, వింధ్యునితో "గిరులయొక్క సారమును వివరించుచు బాగుగాపలికితివి. అయితే కొండలలో మేరుగిరి నిన్ను తక్కువగాచూచును, నేనందుకే నిట్టూర్పు విడిచితిని. నీకును చెప్పితిని, ఏల? మావంటిమహాత్ములకు ఏచింతయును లేదు. నీకు మేలగుగాక" అనిపలికి గగనమునపోయెను. అంతనావింధ్యుఁడు ఖిన్నుఁడై "కానిమ్ము ఈమేరువునకు ఇంత గొప్పతనమేల? గ్రహనక్షత్రాదులతో సూర్యుఁడు నిత్యప్రదక్షిణము సచ్చునసిగదా? తగినపనిచేయుదు" నని నిశ్చయించి, గగనమున పొడుగుగా పెరిగి పెరిగి సూర్యమార్గనిరోధియై స్వస్థముగనుండెను. చిరకాలమిట్లు ౨౨౦౨ యోజనములు పొడిగియుండగా, నారవి కిరణవ్యాప్తిలేక పశ్చిమ దక్షిణములవారు నిద్రాముద్రితులై పడిరి. పూర్వోత్తరములవారు సంతాపతప్తులైరి, కాలనిర్ణయము కానరాక హవ్యకవ్య యజ్ఞక్రియలు చెడి ముల్లోకములు నల్లోలకల్లోలంబై కంపింపనాగెను. అటుమీఁద దేవతలు బ్రహ్మవచనమునువిని ఆగిరికిగురుఁడైన అగస్త్యమునిని ప్రార్థించిరి. అగస్తియును చింతాకులితుఁడైయుండె. అపుడు ... రుతీ! నేను అగస్త్యమునితో "నీవు దక్షిణదిక్కుకుపొమ్ము. వాక్పాశముచేతనే వింధ్యాద్రినిసంబంధించి చింతనొందక నన్నుభజింపుము. నేనును త్వరలో నీకు వ్యసనము కలుగకయుండునట్లును రామపూజ గల్గునట్లును దక్షిణదిక్కుకు వచ్చుచున్నాను." అనిచెప్పితిని. అదివిని అగస్తిముని సంతసించు

నాద్యాపిగిరిరేధతే । అరుణోపిచతత్కాలే కాలే ... కాలయత్ ॥ ౧౮॥ జగత్ స్వాస్థ్యమవాపోచ్చైః పూర్వ వద్భానుసంచరైః । సమునిర్దండకంగత్వా మద్వాక్య స్మరణ్వ్యాది ॥ ౧౯ ॥ తతోతిమత్పత్నీతీర్థాంచ తస్మాద్వా స్యాస్యహంకపే । ఇత్యుక్తోమ రుతిఃకాశ్యా మయాదేవివిసర్జితః ॥ ౨౦ ॥ జగామాకాశమార్గేణ శీఘ్రంరా మంసమారుతిః । కించిద్గర్వసమావిష్టోలింగద్వయసమన్వితః ॥ ౨౧ ॥ తద్గర్వంరాఘవోజ్ఞాత్వా సుగ్రీవాదీన్ సచాబ్ర వీత్ । ముహూర్తాతిక్రమోమేద్య భవిష్యతితత స్త్వహం ॥ ౨౨ ॥ కృత్వాలింగం సైకతంచ సేతావుత్థాపయామి వై । ఇత్యుక్త్వావానరాన్ సర్వాన్ మునిభిఃపరివేష్టితః ॥ ౨౩ ॥ సైకతంస్థాపయామాస లింగంరామోవిధానతః । త దాసస్మారమనసి కౌస్తుభంరఘునందనః ॥ ౨౪॥ తావద్యయౌమణిశ్శీఘ్రం ఖాత్తో టకీపనోపమః । తంబబంధమ ణింకంఠే కౌస్తుభంరఘునందనః ॥ ౨౫ ॥ మణ్యుద్భవైర్ధనైర్వస్త్రై రత్నాభరణధేనుభిః । దివ్యాన్నైస్సపాయసా ద్యైశ్చ పూజయామాసతాన్ మునీన్ ॥ ౨౬ ॥ తతస్తేమునయస్తుష్టా రాఘవేణాతిపూజితాః । యయుఃస్వీయా శ్రమాన్ మార్గే తాన్ దదర్శసమారుతిః ॥ ౨౭॥ పప్రచ్ఛమారుతిర్విప్రాన్ యూయంకేన సుపూజితాః । తేపూర్య చ్ఛర్లింగమారాధ్య రాఘవేణైవపూజితాః ॥ ౨౮॥ తత్తేషాంవచనంశ్రుత్వా క్రోధావిష్టోవ్యచింతయత్ । వృథాహం శ్రమితస్తేన రామేణాప్యప్రతారితః ॥ ౨౯ ॥ ఇత్థంవదన్ యయౌరామం క్రోధాత్ స్వీయంపదద్వయం । ఘువిసం

చు కాశినివిడచి లోపాముద్రతోడ దక్షిణ దిగ్గమనముఁజేసెను. పత్నితోడవచ్చు మునీంద్రు నింజూచి వింధ్యుండు కంపించుచు భూమిలో గ్రుంకువానివలె మిక్కిలి చిన్నరూపము నొందీ "ఏమి చేయుదు నాజ్ఞాపించవలయు" ననివేడెను. అందు కగస్త్యుఁడు "వింధ్యుఁడా! నీవు మం చివాఁడవు. తెలివిగలవాఁడవు నన్ను చక్కఁగా నెఱుంగుదువు. నేను మరలవచ్చువరకు ఈఖ ర్వాకారమునే ధరించియుండుము." అనియాజ్ఞాపించి, దండకారణ్యమును చేరి నాఁటికి నమరు చూచుచున్నాఁడు. అదిమొదలు వింధ్యుఁడునాకిపుడు పునర్జన్మము ఘటిల్లెనని చింతించుచు, పం డ్రెండేండ్లకొకసారి దక్షిణమున మునిని తలయెత్తి తొంగిచూచుచు మునీంద్రుఁడు రానందున నేడువచ్చును రేపువచ్చును చూతమను చింతయను బళువును మోయజాలని వానివలె గ్రుంగి పడియుండును. ఇప్పటికిని మునిరాడు. వీఁడు పెరుగడు. అరుణకిరణప్రచారంబు నిరాతంకంబై బరగుచున్నది. లోకము సుస్థితంబైనది. ఆమునికొఱకు నేనువచ్చెదను—అని చెప్పి యాంజనే యుని పంపితిని. పార్వతీవినుము॥ ౧౨౦ ॥ అంత నామారుతి గగనమున త్వరగా రెండులింగ రామేశ్వర విశ్వేశ్వరాది ప్రతిష్ఠలతోడ సేతుమూలమున శ్రీరామాదులు సాన్నిధ్యముననుండుట. ములను పొందియున్నానను గర్వముగలవాఁడై పోవుచుండెను. వీనిగర్వమెఱిఁగిన శ్రీరాముఁడు సుగ్రీవాదులతో "నాకు ముహూర్తము మీఱుచువచ్చినది. అందువలన నేను ఇసుకలింగము ను సేతుమూలమున స్థాపించెదను." అనిచెప్పి మునీంద్రులచే పరివేష్టితుఁడై సువిధానమున సై కతలింగమును సంస్థాపించెను. అపుడు రాముఁడు తన కౌస్తుభరత్నమును స్మరించగా నది దేదీ ప్యమానంబై గగనము నుండివచ్చెను. దానిని శ్రీరామచంద్రుఁడు కంఠమునధరించి, దాని

తాడ్యపతిత స్తదాభూమ్యాం పదద్వయం ॥ ౩౦ ॥ గతంకపి స్తదారామ మబ్రవీత్కింన మే స్మృతిః । సీతాశుద్ధిమయా లంకాం గత్వానీతేతిసాద్యహి ॥ ౩౧ ॥ తస్యమేద్యోపహాసోత్ర కాశీంప్రేష్యత్వయాకృతః । కిమర్థంశ్రమితశ్చాహం యదీత్థంతేహృదిస్థితం ॥ ౩౨ ॥ అథవిప్యన్మయాజ్ఞాతం చేత్పూర్వంహృద్గతంతవ । కాశీమహంతహింగత్వా కిమర్థం లింగమానయే ॥ ౩౩ ॥ ఏకంత్వదర్థమానీత మపరంలింగముత్తమం । మయాత్మార్థంసమానీతం తవాగ్రేకింకరోమ్యహం ॥ ౩౪ ॥ ఏవంక్రోధయుతంవాక్యం కించిద్గర్వసమన్వితం । రామశ్శ్రుత్వాకపింప్రాహ కపేత్వంసత్యవాగసి ॥ ౩౫ ॥ మయైతత్ స్థాపితంలింగం సముత్పాటయత్వంబలాత్ । స్థాపయామిత్వయానీతం కాశ్యావిశ్వేశ్వరాభిధం ॥ ౩౬ ॥ తథేత్యుక్త్వామారుతిస్స సైకతస్యేశ్వరస్యచ । సంవేష్ట్యమస్తకేపుచ్ఛం బలేనాందోలయన్ముహుః ॥ ౩౭ ॥ త్రుటితంతత్క్షణేపుచ్ఛం పపాతభువిమూర్ఛితః । జహసుర్వానరాస్సర్వే నచచాలేశ్వర స్తదా ॥ ౩౮ ॥ స్వస్థోభూత్వామారుతిస్స గతగర్వ స్తదాభవత్ । ననామరాఘవంభక్త్యా ప్రార్థయామాసతంముహుః ॥ ౩౯ ॥ మయాపరాధితం రామ తత్ క్షమస్వకృపానిధే । తదాహమారుతింరామ స్త్వంమల్లింగోత్తరేత్విదం ॥ ౪౦ ॥ విశ్వనాథాభిధంలింగం స్వీయంసంస్థాపయాధునా । తథేతిమారుతిర్లింగం స్థాపయామాససాదరం ॥ ౪౧ ॥ మారుతేశ్చైవలింగాయ దదౌరామోవరంతదా । అసంపూజ్యవిశ్వనాథం మారుతేత్వత్ప్రతిష్ఠితం ॥ ౪౨ ॥ మమాదౌపూజయంత్యత్ర యేనరాలింగ

---

నుండి ఇచ్ఛామాత్ర నిర్మితంబులై వచ్చిన ధనకనకవస్తు వాహనాన్న పానంబులచే మునీంద్రులను సత్కరించెను. ఆమునులందరును అత్యంతానందమునొంది సత్కారంబులను స్వీకరించి తమతమ నెలవులకు నడచిరి. దారిలో వారినిచూచి యాంజనేయుడు మీరెవ్వరిచే పూజింపబడితిరని యడిగెను. వారు లింగము నారాధించి శ్రీరాముడు మమ్మును సత్కరించి పంపెనని చెప్పిరి. అదివిని వీరకపి క్రోధమునంది "అట్లాగా? రాముడు నన్ను వంచించెను. నేను అతనికై వ్యర్థముగా శ్రమనొందితిని." అని యాగ్రహించుచు వచ్చి రామునియెదుట రెండుకాళ్లతో గగనమునుండి దుమికి నేలదన్నెను. ఆరెండడుగులును నేలగుర్తుగా నిలిచెను. ఇట్లువచ్చిన కపివీరుడు రామునింజూచి "ఇప్పుడే లంకనుండి సీతావార్తం దెచ్చినవాడని నాయొక్క స్మృతిలేదా? అట్టినన్ను కాశికిపంపించి అపహాస్యము చేసితివి. ఎందుకు నన్నిట్లు శ్రమపెట్టవలెను? ఇట్లు నీమనస్సులో దలంచిన సంగతినాకు తెలిసియున్న నీకాశీలింగములను నేనెందుకు తేత్తును? ఒకలింగమును నీకై తెచ్చితిని. ఒకటిని నాకై తెచ్చితిని. ఇప్పుడేమి చేయుదును?" అని కోపమును గర్వమునుగల మాటలను చెప్పగావిని, శ్రీరాముడు "కపీ, నీవు యథార్థము చెప్పెదవు. నేనేమో ఈలింగమును స్థాపించితిని, దీనిని పెరికివేయుము, నీవు కాశినుండి తెచ్చిన విశ్వేశ్వరనామక లింగమునే ప్రతిష్ఠించెదను." అనిచెప్పెను. అట్లేయని యాంజనేయుడు ఆ సైకతలింగమునకు తనతోకనుచుట్టి పలుమారూగులాడించెను. తోకతెగి కోతినేలబడి మూర్ఛిల్లెను. కపులందరును అట్టహాసమొనరించిరి. లింగమిసుమంతయైనను చలించలేదు. పిదప

ముత్తమం । రామేశ్వరాభిధం సేతౌ తేషాం పూజా వృథా భవేత్ ॥ ౪౩ ॥ ఇత్యుక్త్వా తం పునః ప్రాహ రామో రాజీవ లోచనః । మదర్థం యత్సమానీతం త్వయా లింగం మహోత్తమం ॥ ౪౪ ॥ విశ్వనాథస్య తత్త్వాష్టి మస్తు దేవాలయే చిరం। అనర్చితమవన్యాం తద ప్రతిష్ఠితముత్తమం॥ ౪౫ ॥ అగ్రే కాలాంతరేణాహం తచ్చాపి స్థాపయామి వై । తత్తథైవ వర్తతేద్యాపి లింగం విశ్వేశ్వరాంతికే ॥ ౪౬ ॥ అప్రతిష్ఠాపితం భూమ్యాం న కేనాపి ప్రపూజితం । పునః ప్రాహ కపిం రామస్త్వమత్రచ్ఛిన్నలాంగులః ॥౪౭॥ పసభూమ్యాం గుప్తపాదః స్మర త్వం గర్వతంత్విదం। తతః కపిః స్వీయమూర్తిం స్థాపయామాస స్వాంశతః ॥౪౮॥ ఛిన్నపుచ్ఛా గుప్తపాదా సాత్రాద్యాపి వర్తతే । పతితో మూర్ఛితో యత్ర మారుతిస్తత్ర తద్వరం ॥౪౯ ॥ బభూవ మారుతేర్నామ్నా తీర్థం పాపప్రణాశనం । రామస్తత్రాకరోత్పుణ్యం స్వనామ్నా తీర్థముత్తమం ॥౫౦ ॥ స్వాంశేన స్థాపయామాస మూర్తిం తత్ర రఘూద్వహః । సేతుమాధవనామ్నా సా వర్తతేద్యాపి పార్వతి ॥౫౧॥ స్వనామ్నా లక్ష్మణశ్చాపి చకార తీర్థముత్తమం । తతో రామస్స్వహస్తేన స్పృష్ట్వా మారుతిలాంగులం॥ ౫౨ ॥ చకార పూర్వవద్రమ్యం దృఢసంధిం ప్రసాదితః । తత్పుచ్ఛవేష్టనాజ్జాతః కృశో రామేశమస్తకః ॥ ౫౩॥ సతథైవ కృశోద్యాపి తత్రాస్తి శివమస్తకః । తదారభ్య త్యక్తగర్వ శ్చాభూద్రామే స మారుతిః ॥ ౫౪ ॥ తతో హాంస్తై

నాంజనేయుఁడు స్వస్థుఁడై క్రొవ్వు గుంగినవాఁడునై శ్రీరాముని నమస్కరించి "శ్రీరామా, నేనపరాధము చేసితిని. దయానిధీ, క్షమింపుము." అని పలుమారు ప్రార్థించెను. అంత నారాఘవుఁడు దయజేసి "నీవు విశ్వనాథనామకంబగు నీలింగమును నాలింగమునకుత్తరంబున నిప్పుడు సంస్థాపింపుము." అని వరమిచ్చెను. కపీంద్రుఁడు నట్లేయని యాదరముతో శివప్రతిష్ఠఁ జేసెను అపుడు రాముఁడు "మారుతీ, నీవు ప్రతిష్ఠించిన విశ్వనాథలింగమును పూజించక, మొదట నాచే ప్రతిష్ఠింపబడిన ఈయుత్తమ రామేశ్వరనామలింగమును సేతువులో పూజించినట్లయిన వారి పూజ వ్యర్థమగుగాక." అని యాంజనేయుని శివలింగమునకు వరమిచ్చి, యతనితో "నాకొఱకు నీవు తెచ్చిన మహోత్తమలింగము విశ్వనాథుని దేవాలయమున ప్రతిష్ఠింపఁబడక యూరకపడి యుండని, దీనికిబహుకాలము భూమిలో పూజనమక్కరలేదు. ముందు మఱియొక కాలమున దానిని గూడ నేను సంస్థాపించుచున్నాను." అని రాజీవాక్షుండగు రాముండు విధించెను. గనుక పార్వతీ! ఇప్పుడు విశ్వేశ్వరాలయమున లింగమొకటి ప్రతిష్ఠింపబడక యెవరిచేతను పూజింపఁబడకయున్నది. మరల నారాముఁడు "నీవిచ్చట తోక తెగియున్నావు. భూమిలో గుప్తచరణుఁడై ఈ నీగర్వమును స్మరించుచుండుము." అని చెప్పగా, నాంజనేయుఁడు తనయంశము చే తనమూర్తిని స్థాపించెను. మోటుతోకతో కాళ్లు నేలదాగిన వాయుపుత్రుని ప్రతికృతి యిప్పటికిని కనుబడుచున్నది. ఆంజనేయుఁడుపడి మూర్ఛనొందినచోట నీవరము గల్గినది. అచ్చట పాపపరిహారకంబైన మారుతి తీర్థంబుగలదు. రాముండును తనపేరుతో నచ్చట నొకతీర్థంబును ఏర్పరచి, తనయంశ చేత తనప్రతికృతినిగూడ సంస్థాపించెను. సేతుమాధవనామముతో నారా

కతాల్లింగాదావిర్భూయ రఘూద్వహం । అబ్రువం దేవి తత్సర్వం శృణుష్వ తే వదామ్యహం ॥ ౫౫ ॥ రాఘవేంద్ర రఘుశ్రేష్ఠ శృణు వృత్తం పురాతనం । ఏకదాహం పురా భూమ్యాం మలినాంబరసంయుతః ॥ ౫౬ ॥ భిక్షార్థం కౌతుకాద్విప్రరూపేణ విచరన్ సుఖం । ఋషీణామాశ్రమాద్యేషు హ్యటంతం మాం విలోక్య చ ॥ ౫౭ ॥ మద్రూపమోహితాస్సర్వా ఋషిపత్న్యస్స్మరవిహ్వలాః । మత్పృష్ఠే తాస్సమాజగ్ము ర్భర్తృభిర్వారితా అపి ॥ ౫౮ ॥ తదా తే చ ఋషయస్సర్వే మామజ్ఞాత్వా మునీశ్వరాః । దదుశ్శాపం మహాఘోరం క్రోధసంవిగ్నమానసాః ॥ ౫౯ ॥ రత్యర్థం మోహితా నార్య స్త్వయా తస్మాద్ద్విజాధమ । పతత్వద్య రతేరంగం తే లింగం భువి నో గిరా ॥ ౬౦ ॥ ఏవం ద్విజైర్యదా శప్తః పతల్లింగం తదా భువి । ద్విజచ్ఛర్మస్య మే రామ తతోహం గుప్తతాం తదా ॥ ౬౧ ॥ ద్విజనార్యోప్యపి దృష్ట్వా మాం జగ్ముః స్వం స్వం గృహం ప్రతి । తల్లింగం వవృధే భూమ్యాం గగనం వ్యాప్య సంస్థితం ॥ ౬౨ ॥ తద్దృష్ట్వా చకితో వేధా స్తస్యాంతం ద్రష్టుముద్యతః । పశ్యత స్తస్య కోట్యబ్దై ర్నాంతమాసీచ్చ వేధసః ॥ ౬౩ ॥ తదా మామేత్య సవిధి ర్భయాద్వృత్తం న్యవేదయత్ । అకాలే ప్రలయ స్త్వద్య శంభో నేన భవిష్యతి ॥ ౬౪ ॥ తదా మయా పూర్వవృత్తం విధిం సంశ్రావ్య సాదరం । త్రిశూలో వేధ నేవత్తస్తం ఛేత్తుం సో బ్రవీచ్చ మాం ॥ ౬౫ ॥ కథం తే గం దారయేహం త్వమేవ ఛేత్తుమర్హసి । తతో మయార్కఖండాని కృతాని తస్య రాఘవ ॥ ౬౬ ॥ త్రిశూలేనాపి క్షిప్తాని భూమ్యాం నిపతితానిహి । తజ్జాతాన్యత్ర లిం

ముని యర్చామూర్తి యిప్పటికిని కనుబడుచున్నది. అట్లే లక్ష్మణుఁడును తనపేరుతో నొక తీర్థంబును స్థాపించెను. అంత శ్రీరాముఁడు తనచేత మారుతివాలమును స్పృశించి నుందువలెనే తోక చక్కగయుండునట్లు చేసెను. ఆపుచ్ఛబంధముచేత కృశమైన శిరస్సుగల రామేశలింగము ఇప్పటికిని అట్లే కనుబడును. అదిమొదలుకొని యాంజనేయుఁడు రామవిషయమున గర్వములేనివాఁడై వర్తించుచున్నాడు॥ ౫౪ ॥ పార్వతీ నేను పిమ్మట సైకతలింగమునుండి యావిర్భవించి

శివుఁడు శ్రీరాములవారికి లింగోత్పత్తిని వివరించిచెప్పుట.

శ్రీరామునితో నిట్లుచెప్పితిని ఆసంగతినివినుము;—“రఘునాథా! మునుపటిసంగతిని వినుము. మునుపు నేనొకప్పుడు భూమిలో మలినవస్త్రమునుధరించి వినోదముగా భిక్షకొఱకు బ్రాహ్మణరూపముతో సుఖముగా సంచరించుచు ఋషులయాశ్రమంబులలో పోవుచుంటిని. అట్టినన్ను చూచి నారూపమును మోహించి వేయారుమంది ఋషిపత్నులు తమతమ మగండ్రు నివారించుచున్నను లక్ష్యపెట్టక నన్ను వెంబడించివచ్చిరి. అప్పుడు మునులు నన్నెఱుంగక కోపించి చూచి “బ్రాహ్మణాధముఁడా రతికొఱకు నీచేత మానారులు మోహింపబడినందున నీరత్యంగమగు లింగంబు మామాటచేత నిప్పుడే పడిపోవుగాక.”అని మహా ఘోరశాపమునిచ్చిరి. ఇట్లు శపింపఁబడగా నాలింగము నేలనూడిపడెను. నేను నంతర్ధానమునొందితిని. విప్రపత్నులు నన్నుచూచి తమతమ నెలవులకుచనిరి. ఆలింగము భూమిలో వృద్ధినొంది గగనమును వ్యాపించినిలిచెను. దానిం జూచి చకితుఁడైన బ్రహ్మ దాని యంతమును చూడ బూనెను. ఎంత

గాని జ్యోతిస్సంజ్ఞాని ద్వాదశ ॥ ౬౭ ॥ ఓంకారస్సోమనాథశ్చ త్ర్యంబకో మల్లికార్జునః । నాగేశో వైద్యనాథశ్చ కాశీవిశ్వేశ్వరస్తథా ॥ ౬౮ ॥ కేదారేశో మహాకాలో భీమేశో ఘుసృణేశ్వరః । ఏవమేకాదశ జ్ఞేయా జ్యోతిర్లింగము యాశ్శుభాః ॥ ౬౯ ॥ గంధమాదననామ్నాశో మేరోరీశానదిక్స్థితః । ఆసీచ్చిరం నకస్యాపి మానవస్యాక్షిగోచరః ॥ ౭౦ ॥ తదా తే మునయస్సర్వే శివం బుద్ధ్వా తులింగతః । దదుర్వరం పునర్లింగం తవాస్తు గిరిజాప్రియ ॥ ౭౧ ॥ తతః ప్రలయవాతేన గంధమాదననామకం । తస్మేరోరుత్తమం శృంగ మేకదా త్రాపతద్భువి ॥ ౭౨ ॥ తదిదం హ్యబ్ధిసంయోగే దక్షిణే సాగరాంభసి । గంధమాదననామ్నేదం శృంగం పశ్యాత్ర రాఘవ ॥ ౭౩ ॥ గంధమాదనం మే లింగం పశ్య ద్వాదశమం త్విదం । త్వత్ప్రతిష్ఠితలింగస్య హీశాన్యాం మంతికే స్థితం ॥ ౭౪ ॥ ఏతావత్కాలపర్యంతం నేదం కైశ్చిద్విలోకితం । అద్య త్వయా వానరాద్యైర్దృష్టం స్పష్టం విమోక్షదం ॥ ౭౫ ॥ త్వత్ప్రతిష్ఠితలింగస్య ప్రసాదాత్ప్రసీతలే । ఖ్యాతిం గతం త్విదం లింగం యస్మాత్తస్మాద్రఘూత్తమ ॥ ౭౬ ॥ అస్య లింగస్య యజ్జ్యోతి ర్మదీయం త్వత్ప్రతిష్ఠితే । యాస్యత్యద్య సైకతే త్ర లింగే సేతౌ గిరామమ ॥ ౭౭ ॥ జ్యోతిర్లింగం ద్వాదశమం తథా రామేశ్వరాభిధం । వదంత్యత్ర జనాస్సర్వే హ్యద్యారభ్య రఘూత్తమ ॥ ౭౮ ॥ పూజోత్సవాదికం కర్మ యద్యత్కించిద్గిరామమ । తత్తైవ లింగే తత్సర్వమస్తు రామేశ్వరే సదా ॥ ౭౯ ॥ అహం చాపి మునే ర్వాక్యా దగస్త్యేస్తద్గిరాపిచ । త్యక్త్వా కాశీమాగతోస్మి త్వల్లింగేస్మిన్వసామ్యహం ॥ ౮౦ ॥ ప్రణమేత్సేతుబంధేయః పుమాన్రామేశ్వరం శివం । బ్రహ్మహత్యాదిపాపేభ్యో ముచ్యతే మ

కాలము చూచుచుండినను బ్రహ్మకు దానియంతు కానరాదయ్యె. అపుడా విధి నాసన్నిధికివచ్చి భయమున "అకాలప్రళయము సంభవించుచున్నది స్వామీ" అని సంగతినెఱిగించెను. నేనపుడు బ్రహ్మకు వెనుకసంగతినిచెప్పి దానిని కత్తరించుటకు త్రిశూలమునిచ్చితిని. అందుకతఁడు "నేనెట్లు నీయంగమును ఛేదింతును? నీవే దానికి తగుదు" వనెను. అంత నేను దానిని పండ్రెండుభాగములుగా నేర్పరచితిని. త్రిశూలముచే భూమిలో పడద్రోయగా వాటినుండి జ్యోతిర్లింగంబులను సంజ్ఞగలవి—ఓంకారలింగము సోమనాథలింగము త్ర్యంబకలింగము మల్లికార్జునలింగము నాగేశలింగము వైద్యనాథలింగము విశ్వేశ్వరలింగము కేదారేశలింగము మహాకాళలింగము భీమేశలింగము ఘుసృణేశ్వరలింగము గంధమాదనలింగము—అను పండ్రెండు అర్చ్యావతారమూర్తు లుద్భవించినవి. ఆగంధమాదననామకలింగము మేరువుయొక్క ఈశాన్యదిగ్భాగమున, ఒకనరునికిని కానరాక చిరకాలముగా నుండినది. అప్పుడా మునులందరును లింగమునుండి శివస్వరూపము నెఱిఁగి గిరిజాపతీ నీకు మరల లింగమగుగాక యని వరము నిచ్చిరి. పిమ్మట ప్రళయవాతముచే గంధమాదనంబను నామేరుశృంగము ఒకప్పు డిచ్చట నేల బడెను. అదియే ఈ సముద్రసంగమంబగు దక్షిణసాగరోదకమున పండ్రెండవదియగు నాలింగము నీ సైకతలింగమున కీశాన్యదిగ్భాగమున సమీపములోనున్నది. ఇదిగో చూడుము. ఈవరకు దీనినెవ్వరునెఱుఁగరు. ఇపుడు మోక్షప్రదంబగుదానిని కపులతోడ నీవుచూచితివి, స్వ

దనుగ్రహాత్ ॥౨౧॥ త్వంవదాద్యరఘుశ్రేష్ఠ వరంయేనజనాస్సదా। స్నానార్థమానయిష్యంతి మణికర్ణిజలంమమ॥౨౨॥ తన్మద్వాక్యంసమాకర్ణ్య రాఘుసఃప్రాహహర్షితః। సేతుబంధేనరఃస్నాత్వా దృష్ట్వారామేశ్వరంశివం ॥౨౩॥ సంకల్ప్యనియతోభూత్వా గృహీత్వాసేతువాలుకాం। కరండికాభిర్యత్నేన గత్వావారాణసీంశుభాం ॥౨౪॥ క్షిప్త్వా వేణ్యాంవాలుకాంతాం త్యక్త్వావాలుకరండికాం। ఆనీయగంగాసలిలం రామేశమభిషిచ్యచ ॥౨౫॥ సముద్రేత్యక్త తద్భారో బ్రహ్మప్రాప్నోత్యసంశయం। సంకల్పేనవినాగంగా రామేశంనగమిష్యతి ॥౨౬॥ అగతాచేత్తదాజ్ఞేయ స్సంకల్పఃపూర్వజన్మని। కృతోస్తీత్యత్రమద్వాక్యా న్నాత్రకార్యావిచారణా ॥౨౭॥ ఏవంనానావరాన్రామో యావల్లింగాయసోబ్రవీత్। తావత్తత్రసమాయాతః కుంభజన్మామునీశ్వరః ॥౨౮॥ సనామశంకరంరామం రామాపిప్రణనామతం। తదామునిఃప్రాహరామం ప్రసాదాత్తవరాఘవ ॥౨౯॥ దర్శనంవిశ్వనాథస్య జాతంమేద్యాత్రవైచిరాత్। అద్యాత్రతుష్టిర్జాతామే లింగమత్రకరోమ్యహం ॥౩౦॥ ఇత్యుక్త్వాస్థాపయామాస తన్నామ్నాలింగముత్తమం। రామేశ్వరాగ్నిదిగ్భాగే కుంభజన్మాముదాన్వితః ॥౩౧॥ పూజయామాసతల్లింగ మగస్తీశ్వరనామకం। నత్వాస్తుత్వావిశ్వనాథం రామంరామేశ్వరంతథా ॥౩౨॥ దృష్ట్వాపురాతనంలింగం గంధమాదననామకం। యయౌస్వీయాశ్రమంతుష్టః కుంభజన్మామునీశ్వరః ॥౩౩॥ సేతౌరామేశ్వరస్యైవ దేవిదేవాలయేశుభే। దిశ్యాగ్నేయ్యాం

శించితివి. నీవిచ్చట లింగప్రతిష్ఠచేయుటచేత నీలింగముకూడ ఖ్యాతిగలదయ్యె. ఇదిగో నామాటవలన నీ గంధమాదనేశ్వరలింగములో నెంత తేజస్సుగలదో అంత తేజస్సు నీసైకతలింగమునగూడ ప్రవేశించినది. ఇదిమొదలు జనులు "పంద్రెండవది జ్యోతిర్లింగము అట్టి రామేశ్వర సైకతలింగంబును" అని వాడుచుందురు. పూజోత్సవాదికంబులన్నియును రామేశ్వరలింగంబుననే జరుగునుగాక. శ్రీరామా, నీమాటమీఁదను అగస్త్యముని ప్రార్థనమీఁదను కాశినివిడిచి వచ్చితిని. నీలింగమున నిచ్చటవసించెదను. నాయనుగ్రహమువలన నీరామేశలింగమును ఎవఁడు ప్రణమించునో వాఁడు బ్రహ్మహత్యాదిపాపంబులచే విముక్తుఁడగును. నామణికర్ణికాతీర్థమును తీసికొని స్నానమునకై జనులువచ్చునట్లు నీవు వరమిమ్ము రామచంద్రా!" అనిచెప్పగా, పార్వతీ! శ్రీరాముఁడపుడు సంతసముతో "ఈసేతుబంధమున స్నానముచేసి రామేశ్వరుని దర్శనముచేసి నియమముతో సంకల్పించి సేతువుయొక్క యిసుకను భరణిలోనించుకొని వారాణసికిపోయి త్రివేణిలో నాయిసుకభరణిని పడవేసి గంగోదకముంగొని తెచ్చి రామేశ్వరుని కభిషేకించిన నరుఁడు తనబళువును సముద్రమునకప్పగించినవాఁడై బ్రహ్మమునుపొంది సుఖించును. సంశయములేదు. ఇట్లు సంకల్పములేక గంగ రామేశ్వరునియొద్దికి రాచాలదు. వచ్చెనా జన్మాంతరసంకల్పముండి తీరును. ఇందులో కారణ మవిచారణీయము." ఇట్లు శ్రీరాముఁడు పలువరము

శివరామాగస్త్య సమావేశమున రామేశ్వరమహిమ.

లనిచ్చువేళకు॥౧౨౨॥ అగస్త్యుఁడును అచ్చటికివచ్చి శంకరుని వందించి రామునిచే వందింపఁ

మగస్త్యేశో మీశాన్యాం గంధమాదనం ॥ ౯౪॥ వర్తతేద్యాపి ద్వ్యేలింగే కశ్చిజ్జానాతి వానవా । ప్రసిద్ధోభూచ్చ రామేశః స్వర్గమర్త్యరసాతలే ॥ ౯౫॥ తతో రామాజ్ఞయా సేతుం నలః కర్తుంమనోదధే । కించిద్గర్వసమావిష్టస్తత్ జ్ఞాతం రాఘవేణహి ॥ ౯౬ ॥ యావదేకాం శిలాంత్యక్త్వా నలోఽన్యాం ప్రాక్షిపచ్ఛిలాం । తావత్తరంగకల్లోలై స్సాగరస్య ఇతస్తతః ॥ ౯౭॥ గచ్ఛంతిస్మ శిలాస్సర్వా స్తాదృష్ట్వాభిన్నమానసః । గతగర్వస్తదారామం నలోవృత్తంన్యవేదయత్ ॥ ౯౮॥ రామః శ్రుత్వానలం ప్రాహ రామేతిద్వ్యక్షరేణమే । యదోస్సంధిసిద్ధ్యర్థం పృథగ్వై లిఖితాంద్వయోః ॥ ౯౯॥ సర్వత్రైవం లిఖిత్వాహి దృఢసంధిర్భవిష్యతి । తథేతిరామవచనా త్తథాచక్రే నలస్తదా ॥ ౧౦౦ ॥ కృతేః పంచదినై స్సేతు శ్శతయోజనముత్తమః । కృతాని ప్రథమేనాహ్నా యోజనానిచతుర్దశ ॥ ౧ ॥ ద్వితీయేనతథాచాహ్నా యోజనానాంచవింశతిః । తృతీయేనతథాచాహ్నా యోజనాన్యేకవింశతిః ॥ ౨ ॥ చతుర్థేనతథాచాహ్నా ద్వావింశతిరితిశ్రుతం । పంచమేనత్రయోవింశ ద్యోజనానాంశతంత్వితి॥ ౩ ॥ విస్తృతో ద్వాదశప్రోక్తో యోజనాని కృషన్మయః । ఏవంబబంధసేతుంస నలోవానరసత్తమః ॥ ౪ ॥ యేనమజ్జంతినిమజ్జయంతిచపరాన్ తేప్రస్తరాదుస్తరే । వార్ధౌయేన తరంతివానరభటాః సంతారయంతేఽపిచ ॥ నైతేగ్రావగుణానవారిధిగుణా నోవానరాణాంగుణాః । శ్రీమద్దాశరథేః ప్రతాపమహిమా సోఽయంసముజ్జృంభతే॥ ౫ ॥ తేనైవజగ్ముః కపయో జనానాంశతంద్రుతం । ఆరుహ్యామారుతింరామో లక్ష్మణోఽంగదంతథా ॥ ౬ ॥ జగామవాయువల్లంకా సన్నిధిం సేనయావృతః । అసంఖ్యాతాస్సువేలా

బడి రాముపితో "రఘునాథా, నీ ప్రసాదమువలన చిరకాలముగా ప్రార్థించుచుండిన శ్రీ విశ్వనాథసందర్శనంబు ఇప్పటికి సంభవించినది. నాకు మిగుల సంతోసమయినది." నేనొకలింగమును ప్రతిష్ఠించెదను." అనిచెప్పి, తనపేరుతో నొకలింగమును రామేశ్వరలింగమున కాగ్నేయదిగ్భాగమున సంతసమునందుచు సంస్థాపించెను. పిమ్మట, నాలింగమును పూజించి నతించి నుతించి, యట్లె విశ్వనాథుని రాముని రామేశ్వరునింగూడ సంస్తుతించి, పురాతనంబగు గంధమాదన లింగమును సందర్శించి, అగస్త్యమునీంద్రుండు తన యాశ్రమమునకు వెడలెను. సేతువునందు రామేశ్వరుని కొక్కనికే దివ్యదేవాలయంబొకటిగలదు. ఆగ్నేయదిక్కులో అగస్త్యలింగము ఈశాన్యదిక్కులో గంధమాదనము ఇప్పటికిని కలదు వాటిని ఒకానొకడు తెలియునో తెలియడో! ముల్లోకములలోను రామేశుండు సుప్రసిద్ధుడుగానున్నాడు॥ ౯౫ ॥ తరువాత శ్రీ

శ్రీరామనామమహిమచే నలుఁడు సేతువును నిర్మించుట.

రామాజ్ఞనొంది నలుఁడు సేతు నిర్మాణమునకారంభించి కొంచము గర్వముగలవాఁడాయెను. ఆసంగతిని రాముఁడును తెలిసికొనెను. నలుఁడు సముద్రమున నొకరాయినివిడిచి మఱియొకటి నెక్కువిడుచునప్పటికి మొదటిరాయి అలలరాపిడిచే నటిటుపోయి రాయికిరాయిచేరి నిలువకపోసాగెను. అందుచే నలునికి గర్వభంగమైనది. అంత నానలుఁడు శ్రీరామునికి ఆసంగతినివిన్నవించెను. రఘువరుఁడు "కపీ, నాయొక్క "రామ" యను రెండక్షరములను రాళ్లనతికించుటకై

ద్రిం రురుహుః ప్లవగోత్తమాః ॥ ౭ ॥ తతస్సైన్యగణంతో రామ స్సువేలాద్రింయయౌముదా । దిదృక్షూ రాఘవో లంకా మారురోహాచలంశుభం ॥ ౮ ॥ సువేలాద్రింమహారమ్యం తరువల్లీవిరాజితం । దదర్శలంకావిస్తీర్ణాంరామశ్చిత్రధ్వజాకులాం ॥ ౯ ॥ చిత్రప్రాసాదసంబాధాం స్వర్ణప్రాకారతోరణాం । పరిఖాభిశ్శతఘ్నీభి స్సంక్రమైశ్చవిరాజితాం॥ ౧౦॥ ప్రాసాదోపరివిస్తీర్ణ ప్రదేశేదశకంధరం । పశ్యంతంకపిసైన్యౌఘం సందదర్శరఘూద్వహః॥౧౧॥ తతోరామేణముక్తస్స శుకోగత్వాదశాననం। కపిసైన్యందర్శయంస్తం బోధయామాసరావణం॥ ౧౨॥ సీతాంప్రయచ్ఛరామాయ లంకారాజ్యేవిభీషణం । కృత్వాతంశరణంయాహి నోచేద్రామాన్నమోక్ష్యసే ॥ ౧౩ ॥ తచ్ఛ్రుత్వారావణః క్రోధాచ్ఛుకంధిక్కృత్యవైముహుః । దూతైర్గృహాద్బహిఃకృత్వా రామసేనాంవ్యలోకయత్ ॥ ౧౪ ॥ శుకోపిబ్రాహ్మణఃపూర్వం వసిష్ఠోబ్రహ్మవిత్తమః । అయజత్క్రతుభిర్దేవాన్ విరోధోరాక్షసైరభూత్ ॥ ౧౫ ॥ వజ్రదంష్ట్ర ఇతిఖ్యాతస్తద్రక్షోరాక్షసోమహాన్ । మాంసాన్నంయాచితంద్రృష్ట్వా మునినాకుంభజన్మనా ॥ ౧౬ ॥ శుకభార్యావపుర్ధృత్వా నరమాంసంతమర్పయత్ । తదాశప్తశ్శుకస్తేన త్వంరక్షోభవమాచిరం ॥ ౧౭॥ రక్షఃకృతంపునఃధ్యానాత్ జ్ఞాత్వాతత్పార్థితోఽబ్రవీత్ । రామస్యదర్శనంకృత్వా బోధయిత్వాదశాననం ॥ ౧౮ ॥ త్వంప్రాప్స్యసినిజం రూపం తస్మాజ్జాతశ్శుకోద్విజః। సువేలశిఖరేసంస్థ స్సంమంత్ర్యకపిభిస్తతః॥ ౧౯॥ సూచనార్థంసపుంరామోఽంగ

.రెండురాళ్లలోను వెవ్వేరుగా వ్రాయుము. అంతట నిట్లువ్రాసితివా బలముగనంటుకొనును.'' అని యనుగ్రహించెను. అట్లేయని నలుఁడు సేతువును కట్టసాగెను. మొదటిదినమున పదునాలుగామడదూరము, రెండవనాడు ౨౦ ఆమడలు, మూడవనాడు ౨౧ ఆమడలు, నాలగవనాడు ౨౨ ఆమడలు, అయిదవనాడు ౨౩ ఆమడలు, ఇట్లు ౫ దినములలో ౧౦౦ ఆమడలపొడుగుగల ౧౨ ఆమడలవెడల్పుగల సేతువు నిర్మింపబడెను. వానరశ్రేష్ఠుఁడగు నలుండు ఇట్లు సేతువునుకట్టెను. దుస్తరంబగు సాగరంబున ప్రస్తరంబులు తేలుచు పరులను తేలించుచుండుటకును వానరులు దాటుటకు దాటించుటకును పాషాణములమహిమగాని సముద్రమహిమగాని. వానరమహిమగాని కారణముకాదు. శ్రీరాముని దివ్యప్రతాపమహిమ. అయ్యది విజృంభించి యున్నది॥ ౨౦౫ ॥ పిమ్మట శ్రీరాముఁడాంజనేయుని నాలక్ష్మణుం డంగదుని నెక్కగా నాక

శ్రీరాముఁడు కపులతోడ లంకకు వెడలి, శుకుని విడుచుట.

పిసేనయంతయును ఆసేతువుమీఁదుగా వాయువేగంబునపోయి చేరెను. అసంఖ్యాకులగు కపివీరులు సువేలాద్రిమీఁదనెక్కిరి. అంత నారాఘవుండు సేనలతోడ సువేలాద్రిని సంతసముతో లంక నవలోకించుచు నెక్కెను. శ్రీరాముండు మిక్కిలి రమ్యంబైన లతావృక్షసందోహముచే విలాసాస్పదమగు సువేలాద్రిని. చిత్రధ్వజంబులతోను విచిత్రప్రాసాదంబులతోను సువర్ణప్రాకారతోరణపరిఖాదులతోను శతఘ్న్యాయుధంబులతోను విరాజించుచుండు లంకను, విస్తారమైన మేడమీఁదనెక్కి కపిసేనలను వీక్షించుచుండు దశకంధరుని చూచి, శుకనాసుని

దంలంకాంప్రచోదయత్ । సోపిరామాజ్ఞయాగత్వానానానీత్యుత్తరైస్తదా ॥ ౨౦ ॥ రావణంబోధయామాస సభా
యాంలాంగులాసనే । సంస్థితోభీతవద్వాలితనయస్స్వస్థమానసః ॥ ౨౧ ॥ శృణురావణమద్వాక్యం హితంతేప్రవ
దామ్యహం । సీతాంసత్కృత్యసధనాం ప్రయచ్ఛరాఘవంజవాత్ ॥ ౨౨ ॥ రామంనారాయణంవిద్ధి విద్వేషంత్యజరా
ఘవే । యత్పాదపోతమాశ్రిత్య జ్ఞానినోభవసాగరం ॥ ౨౩ ॥ తరంతిభక్తిపూతాస్తే హ్యతోరామోనమానుషః । మ
ద్వాక్యంకురురాజేంద్ర కులకౌశలహేతవే ॥ ౨౪ ॥ ఏవంనానావిధైర్వాక్యై రంగదేనాతిబోధితః । సోఘనీత్యుత్త
రాణ్యస్య నాశృణోద్వానరస్యచ ॥ ౨౫ ॥ ఉవాచక్రోధసంయుక్తో వానరంసదశాననః । భీషయసీద్యకింమాంత్వం
రావణంలోకరావణం ॥ ౨౬ ॥ యేనసర్వేజితాదేవాః కైలాసఃకంపితోమయా । తస్యమేగ్రేమర్కటత్వం కత్థసే
కింముధాద్యహి ॥ ౨౭ ॥ క్షణేనరాఘవౌహత్వా హత్వాసుగ్రీవమారుతీ । హత్వావిభీషణంత్వాంచ వానరాన్భ
క్షయామ్యహం ॥ ౨౮ ॥ రావణస్యవచశ్చేత్థం శ్రుత్వాప్రాహాంగదశ్చతం । జానామ్యహంపౌరుషంతే బలిపాశవి
చూర్ణిత ॥ ౨౯ ॥ శివపాదాంగుష్ఠభార నమ్రకైలాసపీడిత । సహస్రార్జునవీరాత్మసంభవక్రీడనమృగ ॥ ౩౦ ॥ శ్వే
తద్వీపస్థప్రమదా కరతాడితసస్తుఖ । విష్ణుపుత్రశ్చవై బ్రహ్మా మరీచిస్తత్సుతః స్మృతః ॥ ౩౧ ॥ తత్సుతః కశ్యపస్తస్య పు
త్రోభూదద్రినామకః । తేనైవయుద్ధకాలేతు బధ్వాకారాగృహస్థితః ॥ ౩౨ ॥ పర్యంకోపరిసంబద్ధ మస్మాత్రశాలి
తానన । ఇతివాక్యవరాఘాత తర్జితస్సదశాననః ॥ ౩౩ ॥ దూతాన్నాజ్ఞాపయామాస తాడనీయోయమిత్యయం । తథే

పిడిపించెను. ఆశుకుండుపోయి కపిసైన్యములను చూపించుచు రావణునితోడ "సీతను రా
మునికి సమర్పించి విభీషణునికి లంకారాజ్య పట్టముంగట్టి శ్రీరామపాదమును శరణమని నమ్ము
ము. లేదా నీవు రామునిచే విడువబడవు." అని తెలివినుపదేశించెను. అదివిని రావణుఁడు
కోపముతో పలుమారు శుకునిధిక్కరించి దూతలచే వానిని వెలుపలనెట్టించి శ్రీరామునినే ని
రీక్షించుచుండెను. మునుపు శుకుడనువాఁడొక బ్రాహ్మణుండు. బ్రహ్మవిత్తగు వసిష్ఠుండు య
జ్ఞముచే దేవసంతుష్టిం గలిగించెను. రాక్షసులతో విరోధముగలిగినది. అప్పుడు వజ్రదంష్ట్రుఁడను
గొప్ప రాక్షసుడొకఁడు మాంసాన్నమును యాచించిన అగస్త్యమునికి శుకునియొక్క పెండ్లా
మురూపమునొంది నరమాంసమునర్పించెను. అప్పుడు అగస్త్యుడు "నీవు రాక్షసుఁడగుమని"
శపించెను. పిదప వజ్రదంష్ట్రుని మోసమునెఱిఁగి శుకునిప్రార్థన నంగీకరించి "శ్రీరాముని ద
ర్శనముచేసి రావణునికి తెలివినిచెప్పి నీవు నిజరూపమునందుదువని" విశాపమునిచ్చెను. గనుక
శుకుఁడు విప్రుఁడు॥ ౨౧౭ ॥ సువేలాద్రిలోనున్న రాముఁడు కపులతో నాలోచించి శత్రువద్ది

## శ్రీరామప్రేరితుఁడై రావణునికి అంగదుఁడు బుద్ధిచెప్పుట.

కి సూచనకై అంగదుని పంపించెను. వాఁడును రామాజ్ఞనొంది లంకవెడలి రావణునిసభఁజొచ్చి
స్థిరబుద్ధిగలవాఁడై నిర్భయముగా తనపుచ్ఛపీఠముపైకూర్చుండి "రావణుఁడా, నీకుహితముచెప్పె
దను వినుము. త్వరగా సీతను సత్కరించి ధనములతో రామునికి సమర్పింపుము. రామునినారా

త్యక్త్వా రాక్షసాస్తే శస్త్రహస్తాస్సహస్రశః ॥ ౩౪ ॥ అంగదం దుద్రువుశ్శీఘ్రం తాన్ దృష్ట్వా వానరోత్తమః । మర్దయామాస పుచ్ఛేన తాన్సర్వాన్ క్షణమాత్రతః ॥ ౩౫ ॥ రావణాస్యేషు సంతాడ్య స్వకరాభ్యాం ముహుర్ముహుః । తద్ధస్తపాదౌ పుచ్ఛేన పూర్వం బద్ధ్వా సవిస్తరం ॥ ౩౬ ॥ తతశ్చోడ్డీయ వేగేన యయౌ ప్రాసాదమస్తకః । సువేలాద్రౌ రాఘవేంద్రం తారేయస్స విహాయసా ॥ ౩౭ ॥ అంగదం రాఘవో దృష్ట్వా ప్రాసాదాన్వితమస్తకం । ఉవాచ కింకృతం బాల ప్రాసాదోయం త్వయా కథం ॥ ౩౮ ॥ సమానీతో త్రలంకాయా మిత్రాయేయం పురీ మయా । అర్పితా స్థితతో మిత్ర వస్త్విదం నస్పృశామ్యహం ॥ ౩౯ ॥ తద్రాఘవవచః శ్రుత్వా చకితస్స తదాంగదః । ప్రాసాదం మస్తకే గృహ్య త్వా హస్తాభ్యామాహ రాఘవం ॥ ౪౦ ॥ నజ్ఞాతోయం మయా రామ ప్రాసాదో మస్తకేన మే । ఉత్పాటితశ్చ లంకాయా స్స

---

యణుని గా నెఱుఁగుము. రాఘవునితో ద్వేషమును వదలుము. జ్ఞానులు ఎవని పాదమను పడవనాశ్రయించి సంసారసముద్రమును తరించుచుందురో అట్టి యా రాముఁడు మానవుఁడు కాదు. నా మాటవిని వంశము నుద్ధరించుకొనుము ”అని వివిధవిధనీతులను పలుతెరంగులతో నా రావణునికి హితోపదేశముం జేసెను. ఆ దశకంఠుఁడు వీని నీతివాక్యములను వినకయే మిక్కిలి కోపముతో “ఓరి వానరా! ఏమి నన్ను వెరపించెదవా? ఎవనిచే దేవతలందరును జయింపఁబడిరో వాఁడగు లోకదారుణుండగు రావణుండను నేను కైలాసాద్రిని నడుగించి విడిచితిని. ఇప్పుడేమో వ్యర్థముగా నీవు ఆ నా యెదుట నేమో మొఱగుచుందువు. క్షణమున రామలక్ష్మణులను చంపి ఆంజనేయ సుగ్రీవుల నణచి విభీషణుని నిన్ను సంహరించి కపులను భక్షించెదను.” అని యార్భటించెను. ఇట్టి రావణవీరాలాపమును విని అంగదుఁడు “ఓరీ, నీ మహాపౌరుషంబును నే నెఱుంగుదును. బలియొక్క పాశములచే తునకలైనవాఁడవు నీవేగదా? శివుని పాదాంగుష్ఠభారమునోర్వలేక నేలగ్రుంగి కిచికిచలాడినవాఁడవు కదా? నీవు కార్తవీర్యార్జునిని వేయిమంది బిడ్డలచేతిలో క్రీడామృగంబైన సంగతిని మరచితివా? శ్వేతద్వీపమునం దలి మందయానలు మూతిమీఁద కొట్టినదానిని స్మరింపుము. విష్ణుపుత్రుండగు బ్రహ్మయొక్క కొడుకగు మరీచికి పుత్రుడైన కశ్యపునితనయుఁడు అదియనువాఁడు యుద్ధమున నిన్ను పట్టి చెరసాలలో నున్పలేదా? ఇంతయేల, మంచముమీఁద కట్టబడి నాయుచ్చచే నీమోము కడుగఁబడలేదా!” అనియిట్లు అంగదుని వాగ్బాణంబులచే కొట్టబడిన రావణాసురుఁడు దూతలను పిలిచి వీనిని మూతిమీఁద గొట్టి పంపుడని యాజ్ఞాపించెను. వారు నట్లేయని శస్త్రంబులం బూని యంగదునిమీఁద పడవచ్చిరి. అంగదుఁడు వారి నందరిని తోకతో పడమొత్తెను. మఱియు నంగదుండు తన చేతులలో రావణుని చెంపలు వాయించి పలుమారు వాని చేతులు గాళ్లను తన తోకతో బిగదీసి కట్టి, పిమ్మట తలమీద ప్రాసాదము గలవాఁడై సువేలాద్రినున్న రామసన్నిధికి గగనమున వచ్చెను. శ్రీరాముఁ డంగదునిఁ జూచి “ఏమబ్బా! ఈ ప్రాసాదమును లంకనుండి యెట్లు తెచ్చితివి? ఈ పట్టణమును మిత్రు

మానీతస్తవాంతికం ॥ ౪౧॥ పునర్నీత్వాద్యలంకాయాం మేనం సంస్థాపయామ్యహం । ఇత్యుక్త్వా పరిక్రమ్యాథ రాఘవస్యాజ్ఞయాంగదః ॥ ౪౨ ॥ ప్రాసాదం పూర్వవత్ స్థాప్య లంకాయాం సయయౌ పునః । సువేలాద్రౌ రాఘవేంద్రం నత్వా వృత్తం న్యవేదయత్ ॥ ౪౩ ॥ యద్యత్కృతం తు లంకాయాం సంవాదం రావణస్య చ । రామోపి శ్రుత్వా తత్సర్వం స్మిత్వా తం పరిషస్వజే ॥ ౪౪ ॥ అథ శ్రీరామచంద్రోపి సువేలాద్రౌ స్థితస్తదా । లీలయా చాపమాదాయ ముమోచ శరముత్తమం ॥ ౪౫ ॥ తేనచ్ఛత్రసహస్రాణి కిరీటదశకం తథా । లంకాయాం రాక్షసేంద్రస్య ప్రాసాదే సంస్థితస్య చ ॥ ౪౬ ॥ చిచ్ఛేద నిమిషార్ధేన కపీనాం పశ్యతాం ప్రభుః । ఏతస్మిన్నంతరే తత్ర రామాగ్రే సంస్థితో మహాన్ ॥ ౪౭ ॥ న దత్తాం జానకీం శ్రుత్వా రావణేనాంగదాస్యతః । క్రోధేన మహతావిష్టః సుగ్రీవః ప్లవగాగ్రణీః ॥౪౮॥ యయావుడ్డీయ లంకాయాం దశాస్యం రాక్షసైర్యుతం । ప్రాసాదసంస్థితం ఛత్రహీనం ప్రవ్యగ్రమానసం ॥ ౪౯ ॥ సుగ్రీవో రావణం గత్వా జఘాన దృఢముష్టినా । పాతయామాస భూమ్యాం తం వరసింహాసనాత్తదా ॥ ౫౦॥ చక్రతుస్తౌ బాహుయుద్ధం తుములం రోమహర్షణం । ఊర్వంఘ్రికరముష్ట్యాద్యైః కపీశరాక్షసేశ్వరౌ ॥ ౫౧ ॥ తదాసీజ్జర్జరాంగస్స రావణః కపిఘాతతః । దుద్రువే బాహుయుద్ధం త త్యక్త్వా గేహం విలజ్జితః ॥ ౫౨ ॥ తదాచ్ఛిద్య తన్మకుటం యయౌ రామం కపీశ్వరః । స నామ రాఘవం భక్త్యా వృత్తం సర్వం న్యవేదయత్ ॥ ౫౩॥ తం సమాలింగ్య రామోపి సుగ్రీవం ప్రా

న కిచ్చితిని. కావున మిత్రుని వస్తువగు దీనినంటను." అనిచెప్పెను. ఆమాటవిని యంగదుఁడు చకితుఁడై పైచూపులతో తలమీఁదనున్న ప్రాసాదమునుచూచి రామునితో "స్వామీ, నాతలమీఁదనున్న ప్రాసాదము నాకు తెలియదు. లంకనుండి పెగలించుటను నేనెఱుఁగను. నీవద్దికి తెచ్చుటను కానను. ఇదివింత! మఱల దీనినితీసికొనిపోయి లంకలోపెట్టెదను." అనిచెప్పి శ్రీరామాజ్ఞనొంది బయలుదేరి లంకలో నాప్రాసాదమును మునుపున్నట్లు సంస్థాపించి మరల వచ్చి సువేలాద్రిలో శ్రీరామునికి నమస్కరించి లంకలోచేసిన పనులను రావణునితో మాటలాడినదానిని విన్నవించెను. శ్రీరాముఁడును ఆసంగతినంతటిని విని నవ్వి యయ్యంగదుని నాలింగించెను॥ ౨౪౪ ॥ అటుతరువాత శ్రీరామచంద్రుఁడును సువేలాద్రిలోనున్నవాఁడై అపుడు

### సుగ్రీవుడు రావణకిరీటము నపహరించుట.

వినోదముగా ధనుస్సునందుకొని ఉత్తమబాణంబును ప్రయోగించెను. దానిచేత లంకాప్రాసాదంబుననున్న రావణుని నూరుఛత్రంబులును పదికిరీటంబులును కపులుచూచుచుండఁగా అరక్షణములో కత్తరించబడెను. ఆవేళకంతలో నంగదునివలన "సీతాదేవిని తెచ్చి యప్పగించలేదు రావణుఁడు." అది వినుటచే క్రోధావిష్టుండైన సుగ్రీవుండు గగనమున లంఘించిపోయి లంకలో మేడనెక్కి ఛత్రహీనుఁడై చింతించుచు రాక్షసులతోడ నుండు రావణునియెదలో తన దృఢముష్టిచేతకొట్టి వానిని సింహాసనమునుండి నేలద్రోసెను. ఆకపీశ్వర రాక్షసేశ్వరు లిరువురును బాహుయుద్ధమునకారంభించి కరోరసూర్వంఘ్రులయొక్క పెట్లచే భయంకరముగా పో

హసాదరం । మామప్రాప్య సుఖంబంధో గతస్తూష్ణీం దశాననం ॥౫౪॥ త్వజ్జీవితం విపరీతంచేత్ త్వత్కృతే సీతయా మమ। కిం భవిష్యతి సౌఖ్యంహి మేదృశం సాహసంకురు ॥ ౫౫ ॥ తతోభేరీమృదంగాద్యై ర్వాద్యైస్తే వానరోత్తమాః । లంకాం సంవేష్టయామాసు శ్చతుర్ద్వారేషు సంస్థితాః ॥ ౫౬ ॥ తదాతం ముకుటం రామో గదాయ రావణస్యచ । దదౌ తుష్టః శేశాయ లంకాం రోద్ధుం ప్రచోదయత్ ॥ ౫౭ ॥ అంగదం దక్షిణం ద్వారం వాయుపుత్రం తు పశ్చిమం । నలం సైన్యేన ప్రాగ్ద్వారం సుషేణం ద్వారముత్తమం ॥౫౮॥ యయుస్తే రాఘవం నత్వా లంకాం స్వస్వబలైర్యుతాః। తాం లంకాం రురుధుస్సర్వే చతుర్ద్వారేషు వానరాః ॥ ౫౯ ॥ దశాస్యోపి గృహంగత్వా సుగ్రీవజర్జరీకృతః । తస్థౌ తూష్ణీం సరహసి స్మరన్సుగ్రీవపౌరుషం ॥౬౦ ॥ మాలీసుమాలీ చతథా మాల్యవాన్బాంధవాస్త్రయః । మాతామహా రావణస్య తే సంధుం త్ర్యపరస్పరం ॥ ౬౧ ॥ దశాననం బోధయితుం తేభ్యస్త్వేకో యయౌ జవాత్ । మాల్యవానితి నామ్నా యో బుద్ధిమాన్స్నేహసంయుతః ॥ ౬౨ ॥ ప్రాహాతం రాక్షసం వీరం ప్రశాంతేనాంతరాత్మనా । శృణు రాజన్ వచో మేద్య శ్రుత్వా కురు యథేప్సితం ॥ ౬౩ ॥ యదా ప్రవిష్టా నగరీం జానకీ రామవల్లభా। తదాది పుర్యాం దృశ్యంతే నిమిత్తాని దశానన ॥౬౪ ॥ ఘోరాణి నాశహేతూని తాని మే వదతః శృణు। ఖరాః స్తనితనిర్ఘోషా మేఘాః ప్రతిభయంకరాః॥ ౬౫॥ శోణితాన్యభివర్షంతి లంకాముష్ణేన సర్వదా। సీదంతి దేవలింగాని ఖిద్యంతి ప్రచలంతిచ ॥౬౬॥ కాలికాపాం

రాడిరి.అపుడు రావణుఁడు సుగ్రీవుని మొత్తులచే నొళ్లు బద్దలై పోగా బాహుయుద్ధమును వదలి సిగ్గుతో నింటికిపరుగెత్తెను. అప్పుడు రావణకిరీటమును సుగ్రీవుఁడు కొట్టితీసికొని, శ్రీరామునివద్దికివచ్చి నమస్కరించి సర్వవృత్తాంతమును విన్నవించెను. శ్రీరాముఁడు వానినాలింగించికొని సాదరముగా నాసుగ్రీవునిఁజూచి ‟తమ్ముఁడా! నన్ను నీవడుగక యూరక యెట్లు రావణునివద్దికి పోతివి?ఒకవేళ నీప్రాణము తలక్రిందైయుండిన సీతతోడ నాకేమి సుఖముకాగలదు?ఇట్టిసాహసము చేయవలదు.” అని మందలించెను॥ ౫౫ ॥ అంత వానరవీరులు భేరీ మృదంగాదివాద్య

## మాతామహుండగు మాల్యవంతుఁడు రావణునికి బుద్ధిచెప్పుట.

ములతోడ లంకను నాలుగుద్వారములలోనున్నవారలై ముట్టడించనెంచిరి. అపుడు శ్రీరాముఁడు రావణుని యాకిరీటమును సేనాపతియైన అంగదునకిచ్చి, అంగదుని దక్షిణద్వారమునను ఆంజనేయుని పడమటివాకిటను నలుని తూర్పువాకిటను సుషేణుని నుత్తరద్వారంబునను తమతమ సైన్యములతోడనిలిచి యుద్ధముచేయునట్లు అనుజ్ఞనిచ్చెను. వారునట్లేయని శ్రీరాముని వందించి స్వస్వసైన్యములతోడ లంకాద్వారములను ముట్టడించిరి. అచ్చట సుగ్రీవునిచే నలఁకువనందిన రావణుండు ఊరక యంతఃపురములో వాని పౌరుషమును స్మరించుచుండెను. రావణుని మాతామహులైన మాలి సుమాలి మాల్యవంతుఁడు అను ముగ్గురన్నదమ్ములు తా మొండరు లాలోచించి రావణునికి తెలివిచెప్పుటకై వారిలో నొకఁడగు బుద్ధిమంతుఁడైన మాల్యవంతుఁడనువాఁడు సాదరముగావచ్చి మిక్కిలి యనుఁకువగల్గి, వీరుఁడగు రావణునితో

దుర్దర్గంతైః ప్రహసంత్యగ్రతఃస్థితా। ఖరాగోషు ప్రజాయంతే మూషకానకులైస్సహ ॥ ౬౭ ॥ మార్జారేణతుయుంధ్యంతే పన్నగాగరుడేనచ । కరాలోవికటోముండః పురుషఃకృష్ణపింగలః ॥ ౬౮ ॥ కాలోగృహాణిసర్వేషాం కాలేకాలేత్వవేక్షతే । ఏతానన్యానిదృష్టాని నిమిత్తాన్యుద్భవంతిచ ॥ ౬౯ ॥ అతఃకులస్యరక్షార్థం శాంతింకురుదశానన। సీతాంసత్కృత్యసధనాం రామాయాశుప్రయచ్ఛభోః ॥ ౧౭౦ ॥ మాతామహవచశ్చేత్థం శ్రుత్వాతంరావణోబ్రవీత్। రామేణప్రేషితోనూనం భాషసేత్వమనర్గళం ॥ ౭౧ ॥ గచ్ఛవృద్ధోసిబంధుస్త్వం సోఢంసర్వంత్వయోదితం। ఇతోవాకర్ణపదవీం దహత్యేతద్వచస్తవ ॥ ౭౨ ॥ ఇత్యుక్తస్సరావణేన మాల్యవాన్స్వగృహంయయౌ। రావణోపిసభాంగత్వా చోదయామాసరాక్షసాన్ ॥ ౭౩ ॥ పూర్వద్వారంతుధూమ్రాక్షం వజ్రదంష్ట్రంతుపశ్చిమం। నరాంతకందక్షిణంత ముత్తరంచమహోదరం ॥ ౭౪ ॥ ప్రేషయామాససైన్యేన వస్త్రాద్యైస్తోషితాన్జవాత్ । చత్వారస్తేపినత్వాతం రావణంసంగరంయయుః ॥ ౭౫॥ ఏవంరామరావణయోః సైన్యానిచపరస్పరం। యయుస్తానిసంముఖాని సంగరార్థంమహోత్సవైః॥ ౭౬ ॥ ఇతిశ్రీమచ్ఛతకోటిరామ చరితాంతర్గత శ్రీమదానందరామాయణే వాల్మీకీయే సారకాండే యుద్ధచరితే రావణేశ్వరాఖ్యానే దశమస్సర్గః॥ ... ... ... ... ౧౦॥

"ఇప్పుడు నామాటవినుము రాజా! వినినపిదప నీయిష్టముచొప్పున చేయుము. శ్రీరామప్రేయసి యగు సీత యెప్పుడీలంకను ప్రవేశించెనో అదిమొదలు లంకలో నుత్పాతంబులుకనుపడుచున్నవి. నాశహేతువులును భయంకరంబులును అగువాటిని చెప్పెదను వినుము. గాడిదెలు మేఘములవలె గర్జించుచున్నవి. మిక్కిలి భయంకరంబులుగా మేఘములు వేడిరక్తమును కురిపించి లంకను ముంచుచున్నవి. దేవతాప్రతికృతులు భిన్నములగుచున్నవి. ఏడ్చుచున్నవి. మఱి చలించుచున్నవి.కాళికాదేవి యెదుటనిలచి తెల్లని కోరలజూపి యట్టహాసముచేయుచున్నది. ఆవులు గాడిదెలనీనుచున్నది. ఎలుకలు ముంగిసిలతోడ పిల్లులతోడ పోట్లాడుచున్నవి. సర్పములు గరుడునితోడ తారసిల్లుచున్నవి. కృష్ణపింగళవర్ణుండును దారుణుండును భయంకరుండును అగు కాలుండు ఇంటింట నప్పుడప్పుడు తొంగిచూచుచున్నాడు.ఇట్లె ఇంకకొన్ని యితరోత్పాతములు కనుబడుచున్నవి. అందువల్ల కులరక్షణార్థై శాంతిజేయుము.సీతను సత్కరించి ధనములతోడ శ్రీరామునికి త్వరగా సమర్పింపుము." అనిచెప్పెను. అట్టి తాతగారిమాటవిని రావణుండు "నిజముగా రామునిచేత పంపబడి నీవిట్లు తడలేకమాటలాడుచున్నావు. పొమ్ము. నీవు చాలాముసలివాఁడవైతివి. మఱి బంధువు. నీమాటలను సహించెదను. నీమాట యిచ్చట చెవ్వినిదూరి నన్ను కాల్చుచున్నది." అని చెప్పగావిని మాల్యవంతుఁడు తనయింటికి వెడలెను. రావణుండు సభకువచ్చి రాక్షసులను "తూర్పువాకిట ధూమ్రాక్షుండును పడమట వజ్రదంష్ట్రుఁడును దక్షిణంబున నరాంతకుఁడును నుత్తరంబున మహోదరుఁడును యుద్ధముచేయవలసినది." అని యాజ్ఞాపించి వారివారిసైన్యములతోడ నందరిని వస్త్రాదులచే సత్కరించి యుద్ధ

శ్రీశివఉవాచ—అథ తే రాక్షసాస్సర్వే ద్వారేభ్యః క్రోధమూర్ఛితాః । నిర్గత్య భిండిపాలైశ్చ ఖడ్గైశ్శూలైః పరశ్వధైః ॥ ౧ ॥ బాణైః కుంతైశ్శతఘ్నీభిస్సంక్రమైశ్శక్తిభిర్దృఢం । నిర్జఘ్నుర్వానరానీకం మహాకాయా మహాబలాః ॥౨॥ రాక్షసాంశ్చ తథా జఘ్నుర్వానరా జితకాశినః । వృక్షైర్గ్రావైః పర్వతైశ్చ ముష్టిభిః కరతాడనైః ॥ ౩ ॥ తే హయైశ్చ గజైశ్చైవ రథైః కాంచనసన్నిభైః । రక్షోవ్యాఘ్రా యుయుధిరే నాదయంతో దిశో దశ ॥౪॥ ఏవం పరస్పరం చక్రు ర్యుద్ధం వానరరాక్షసాః । నలో జఘాన ధూమ్రాక్షం వజ్రదంష్ట్రం సమారుతిః ॥౫॥ నరాంతకం సతారేయ స్సుషేణస్తం మహోదరం । చతుర్థాంశావశేషేణ నిహతం రాక్షసం బలం ॥౬॥ తదాంగదాద్యాశ్చత్వారో మహావాద్యమహోత్సవైః ॥ ప్రణేమూ రామమాగత్య జయఘోషప్రపూరితాః ॥ ౭ ॥ స్వసైన్యం నిహతం దృష్ట్వా మేఘనాదో యయౌ తదా । సహాస్త్రైర్వ్యాకులం రామం చకార బంధువానరైః ॥౮॥ రామస్సస్మార తార్క్ష్యం స తార్క్ష్యస్సాన్నిధ్యం న్యవారయత్ । తతః పున ర్బ్రహ్మవరా దంతర్ధానం గతోఽసురః ॥౯॥ సర్వాస్త్రకుశలీ వ్యోమ్ని బ్రహ్మాస్త్రేణ సత్వరం తతః । వవర్ష శరజాలాని బ్రహ్మాస్త్రం మానయంస్తదా ॥౧౦॥ క్షణం తూష్ణీముపాసాథ రామస్సబంధువానరైః । తతస్స్వస్థో రఘుశ్రేష్ఠో దదర్శ పతితం బలం ॥౧౧॥ మూర్ఛాగతం బ్రహ్మపాశైస్తదా లక్ష్మణమబ్రవీత్ । చాపమానయ సౌమిత్రే బ్రహ్మాస్త్రేణాసురాం క్షణాత్ ॥ ౧౨ ॥ భస్మీకరోమి తచ్ఛ్రుత్వా లంకామింద్రజితో యయౌ । విలపంతౌ స్వసా

మున కంపించెను. ఆనలువురును ఆరావణుని వందించి రణమునకునడిచిరి. ఇట్లు రామరావణులయొక్క సైనికులు అన్యోన్యముగ మహానాదంబులతోడ సంముఖులై తారసిల్లిరి॥ ౧౦ ॥

ఆంజనేయుఁడు ద్రోణాద్రిం దెచ్చి యుద్ధమునఁజచ్చిన కపులను బ్రతికించుట.

వినుము పార్వతీ! పిమ్మట మహాబలులును మహాకాయులునగు రక్కసులందరును మహా క్రోధాక్రాంతులై యథా నియమంబుగా ద్వారములకు వెడలి నిలచి వాటుఁగుదియ కత్తి ముమ్మొనవాలు గండగొడ్డలి అమ్ము ఈఁటె ఇనుపముండ్లకట్టె చిల్లకోల మొదలైన దుర్గమాయుధంబులచేత వానరసైన్యంబును చంపుచువచ్చిరి. యుద్ధమునందు జయించినవాండ్రగుచు వానరవీరులు చెట్లు రాళ్లు కొండలు పిడికిళ్లు చేతిపెట్లు – వీట్లచే నారాక్షసులను చంపుచుండిరి. ఆదైత్యవీరులు గుఱ్ఱములు ఏనుఁగులు బంగారు తేరులు – వీట్లతోడ కూడి దిక్కులను మ్రోగించుచు పోరుచుండిరి. ఇట్లు పరస్పరము వానరులును రాక్షసులును యుద్ధముచేయుచుండగా నలుఁడు ధూమ్రాక్షుని సంహరించెను. అయ్యాంజనేయుఁడు వజ్రదంష్ట్రునిఁజంపెను. అయ్యంగదుండు నరాంతకుని నంతకుని యింటికంపెను.ఆసుషేణుండు మహోదరుని మచ్చమాపెను. రాక్షసబలము నాలగవవంతు నిలచునట్లు నిర్మించెను. అప్పు డంగదాదులు నలుగురును జయనాదముచే నింపబడిన మహావాద్యముల మహోత్సవంబులతోడ శ్రీరామసన్నిధికివచ్చి నమస్కరించిరి. అప్పుడు మేఘనాదుండు తనసైన్యము నాశమయినదని యెఱింగి సర్వాస్త్రప్రయోగముచేత తమ్మునితోడను వానరులతోడను శ్రీరాముఁడు వ్యాకులమునందునట్లుచేసెను. అ

న్నిర్యో తత్ర వాయుజరాక్షసౌ ॥ ౧౩॥ వరదానాద్బ్రహ్మణస్తౌ దృష్ట్వా రామస్సజీవితౌ । తావూచ రఘుశ్రేష్ఠో యువాభ్యాం జాంబవాన్ రణే ॥ ౧౪ ॥ గత్వాస్తి జీవితశ్చేద్ధి వాచ్యం తర్హి గిరా మమ । ఉపాయం చింతయస్వాద్య వానరాణాం సుజీవనే ॥ ౧౫ ॥ తద్రామవచనం శ్రుత్వా తౌ విభీషణమారుతీ । నిశీథే తౌ విచిన్వంతౌ జాంబవంతం ప్రజగ్మతుః ॥౧౬॥ ఉల్కాకహస్తౌ తం దృష్ట్వా ప్రోచతూ రాఘవేరితం । జాంబవానపి తాం రామ గిరం శ్రుత్వాతిహర్షితః॥ ౧౭ ॥ నిమీలితాక్షః ప్రోవాచ కౌ యువాం వాయుజో రణే । చేదస్తి జీవితస్తర్హి జీవయిష్యతి వానరాన్ ॥ ౧౮॥ తదా విభీషణః ప్రాహ త్వయా త్యక్త్వాంగదాదికాన్ । పృచ్ఛ్యతేద్య కథం వాయుపుత్రస్స పరమాదరాత్ ॥౧౯॥ తదా విభీషణం ప్రాహ జాంబవాన్ ఋక్షసత్తమః । రుద్రావతారస్సంజజ్ఞే వాయుపుత్రః ప్రతాపవాన్ ॥ ౨౦॥ న జ్ఞేయః కపివచ్చాత్ర తస్మాత్తం త్వం విలోకయ । తదా బ్రవీజ్జాంబవంతం నత్వా స వాయునందనః ॥ ౨౧ ॥ యం త్వం పృచ్ఛసి సోద్యాహం జీవితోస్మ్యద్య మారుతిః । విభీషణో ద్వితీయోయం యస్త్వయా పరిభాషతే ॥ ౨౨ ॥ తదా స జాంబవాంస్తుష్టో మారుతిం వాక్యమబ్రవీత్ । గత్వా క్షీరాబ్ధిం వేగాద్ద్రోణాద్రిం త్వం సమానయ ॥ ౨౩ ॥ తథేత్యుక్త్వా త్వరన్ గత్వా గరిధరైర్వర్గోపితం నగం । కామధేన్వా స్వీయఘుర్మ నేత్రలేపాత్ప్రదర్శితం ॥ ౨౪ ॥ ఉత్పాట్యపుప్లువ ద్ధృత్వాఽనయామాస కపిర్జవాత్ । పర్వతోద్భవవల్లీనా మవఘ్రాయామృతోపమం ॥ ౨౫ ॥ సుగంధం జీవయి

ప్పుడు రాఘవుండు గరుడు నిస్మరింపగా నతఁడు సర్పాస్త్రమును నివారించెను. అంత నన్నియస్త్రములలోను నేర్పరియైన ఇంద్రజిత్తు బ్రహ్మవరమువలన నంతర్ధానమునొందినవాఁడై మరల బ్రహ్మాస్త్రముచే నంతట గగనమున బాణజాలమును కురిపించెను. అపుడు రాముఁడు బ్రహ్మాస్త్రమును గౌరవించువాఁడై అందరితోడ కొంతసే పూరకకూర్చుండెను. అంత రాముఁడు స్వస్థుఁడై చూచునప్పటికి బ్రహ్మపాశమువలన వానరబలము మూర్ఛనొందియుండెను. దానింజూచి లక్ష్మణునితో "లక్ష్మణుఁడా! ధనస్సునందుకొమ్ము, క్షణకాలములోపల రాక్షసులనందరిని భస్మము చేయుదును." అని చెప్పెను. అదివిని యింద్రజిత్తు లంకకు వెడలెను. తనవద్ద విలపించుచు బ్రహ్మవరదానమువలన బ్రతికియున్న వారగు ఆంజనేయ విభీషణులనుచూచి శ్రీరాఘవుఁడు వారితో "మీరిరువురునుపోయి రణమున జాంబవంతుఁడు బ్రతికియుండిన న్వానితో–కపులు బదుకుట కుపాయము నాలోచింపుము– అని చెప్పవలయును" అని యాజ్ఞాపించెను. అట్లేయని వారిరువురు నర్ధరాత్రిలో కొఱవి చేతబట్టుకొని జాంబవంతుని వెదకుచుపోయి రామవాక్యమును చెప్పిరి. జాంబవంతుండును రామవాక్యమునువిని యానందించుచు కఁన్దమూసికొనియే "ఎవరు మీరిరువురు? ఆంజనేయుఁడు యుద్ధమున బ్రతికియుండిన కపులను బ్రతికింపగలఁడు." అని చెప్పెను. అందుకు విభీషణుఁడు "జాంబవంతుఁడా! నీవు అంగదాదులనువిడచి యేల వాయుపుత్రుని నొక్కనినే అడిగెదవు?" అని యడిగెను. దానికి జాంబవంతుఁడు "పరాక్రమశాలియగు మారుతి శ్రీరుద్రావతారుఁడు. సామాన్యకపిగా వాని నెంచవలదు. గనుక వానిని చూడుము" అని చెప్పునప్పటికి నాంజనేయుఁడు సమీపించి నమస్కరించి "ఎందుకునన్నడిగె

వ్యంతి రాక్షసాశ్చేతిశంకయా । నిహతాన్ రాక్షసాన్ సర్వాన్ తదాతార్క్ష్యవిభీషణౌ ॥౨౬॥ విక్షిపతుస్సాగరే తాన్ రాఘవస్యాజ్ఞయాక్షణాత్ । తదానంతం గిరింత్వృష్ట్వా సుషేణస్సభిషగ్వరః ॥౨౭॥ పర్వతోద్భవవల్లీభిర్జీవయామాస తాన్ కపీన్ । తతశ్శాఖామృగాస్సర్వే సముత్తస్థుర్విజృంభితాః ॥ ౨౮ ॥ ద్రోణాచలం యథాస్థానే స్థాపయామాస మారుతిః । కుబేరార్పితదివ్యాంభః ప్రమృజ్యనయనేషుచ ॥౨౯॥ అంతర్హితానాం రామాద్యా దర్శనం ప్రాపురాహవే । తతస్సంప్రేషయామాస రావణస్స్వీయమంత్రిణః ॥౩౦॥ అతినాదః ప్రహస్తశ్చ మహానాద దరీముఖౌ । దేవశత్రుర్నికుంభశ్చ దేవాంతకనరాంతకౌ ॥ ౩౧॥ సారణాద్యాబలైరన్యైర్యయుయుధుర్వానరైస్సహ। తాన్సర్వానంగదాద్యాస్తే హత్వాతిష్ఠుర్విగర్జితాః ॥ ౩౨ ॥ తదాకుంభనికుంభాద్వౌ కుంభకర్ణసుతోత్తమౌ । రావణః ప్రేషయామాస యుద్ధార్థం తౌ ప్రజగ్మతుః ॥౩౩॥ తదాకుంభో జాంబవతా నిహతశ్చరణాజిరే । అంగదేననికుంభశ్చ హతశ్శ్రుత్వా దశాననః ॥౩౪॥ అతికాయం స్వీయపుత్రం ప్రేషయామాస సంగరం । అతికాయేన సౌమిత్రిః కృత్వా సంగరముల్బణం॥ ౩౫॥ శరేణపాతయామాస లంకాయాం తచ్ఛిరో మహత్ । తదాయయౌ రావణస్స స్వయం యుద్ధాయ వేగతః ॥౩౬॥ సుహృన్మిత్రజనైర్యుక్తో వేష్టితః పురవాసిభిః । రణేవిభీషణం దృష్ట్వా కోపోచ్ఛ్రిత్తింముమో

దవు? ఆ నేనిదిగో బ్రతికియున్నాను. రెండవవాఁడు వీఁడే విభీషణుఁడు. వానితోడనే నీవు మాటలాడినది." అని మెచ్చరించెను. అప్పుడు జాంబవంతుఁడు సంతసించి "వాయుపుత్రా! నీవు క్షీరనిధికిపోయి వేగముగా ద్రోణాద్రిని తీసికొనిరమ్ము." అని పంపెను. మారుతియు నట్లేయని త్వరగావెడలి గంధర్వులచే దాచబడిన నాకొండను కామధేనువునుండి దానిచెవులను కంట చమరుటచే కనుగొని పెగలించి పుష్పమునెత్తినట్లు తీసికొనివచ్చెను. ఆ కొండలోపుట్టిన తీగలయొక్క అమృతమువంటి దివ్యగంధమును ఆఘ్రాణించి రాక్షసులు బ్రతుకుదురను శంకచేత చంపబడిన రాక్షసులనందరిని అప్పుడు గరుడుఁడును విభీషణుండును రామాజ్ఞనొంది క్షణకాలములోగా వారినందరిని సముద్రములోకి నెట్టివేసిరి. అప్పుడాకొండను భిషక్పతియగు సుషేణుండుచూచి కొండలోపుట్టిన తీగెలచేత నాకపులను బ్రతికించెను. అంత నచ్చటి మర్కటంబులన్నియును లేచి విజృంభించినవి. వాయుపుత్రుఁడు ద్రోణాచలము నట్లే యున్నచోటఁ బెట్టెను. శ్రీరామాదులందరును కుబేరునిచే సర్పింపబడిన దివ్యోదకమును కంట చమరుకొని యుద్ధమున దాగియుండువారినిగూడ చూచునేర్పు నందినవారలయిరి॥ ౩౦ ॥ పిమ్మట

అతికాయుఁడుపోయిన క్రోధముతో రావణుఁడు విభీషణునిమీఁద శక్తిని ప్రయోగించగా దానిచే లక్ష్మణుఁడు మూర్ఛిల్లుట.

రావణుండు తనమంత్రులయిన అతినాదుఁడు ప్రహస్తుఁడు మహానాదుఁడు దరీముఖుఁడు దేవశత్రుఁడు నికుంభుఁడు దేవాంతకుఁడు నరాంతకుఁడు సారణుఁడు మొదలుగాగల వీరులను పంపగా, వారు వెవ్వేరుసైన్యములతోడవచ్చి కపులతో బలముగా జగడమువేసిరి. వారినందరి

చసః ॥ ౩౭ ॥ పృష్ఠేవిభీషణంకృత్వా యయావగ్రేసలక్ష్మణః । హృదిసంతాడితశ్శక్త్యా పపాతభువిలక్ష్మణః॥ ౩౮॥ లక్ష్మణాన్నగరీంనేతుం తంయయౌసదశాననః । నచచాలభుజస్తస్య సౌమిత్రేశ్శేషరూపిణః॥ ౩౯ ॥ తన్నేతుకామోహనుమాన్ హృదిముష్ట్యాన్యతాడయత్ । తేనముష్టిప్రహారేణ పపాతరుధిరంవమన్ ॥౪౦॥ ఆనయామాససౌమిత్రిం మారుతిఃకపివాహినీం । రథారూఢోరావణోపి వివ్యాధమారుతింశరైః ॥ ౪౧ ॥ తతఃకృద్ధేనరామేణ బాణేనహృదితాడితః । సాశ్వధ్వజంరథంసూతం రాఘవోధనురోజసా ॥౪౨॥ ఛత్రంపతాకాంతరసా చిచ్ఛేదశితసాయకైః। అర్ధచంద్రేణచిచ్ఛేద తత్కిరీటంరవిప్రభం ॥ ౪౩ ॥ తతస్తంవ్యాకులందృష్ట్వా రామోరావణమబ్రవీత్ । గచ్ఛాద్యలంకాంమాశ్వస్య శ్వస్త్వంపశ్యసిమేబలం ॥ ౪౪ ॥ తతోలజ్జానతశిరా యయౌలంకాందశాననః । రామోపిలక్ష్మణందృష్ట్వా మూర్ఛితంప్రాహమారుతిం ॥ ౪౫ ॥ ద్రోణాచలంసమానీయ జీవయైనంతథాకపే । తథేతిసయయౌవేగాత్ తజ్జ్ఞాత్వాసదశాననః ॥ ౪౬ ॥ ప్రార్థయిత్వాకాలనేమిం తద్విఘ్నార్థమచోదయత్ । సగత్వాహిమవత్పార్శ్వంతపోవనమకల్పయత్ ॥ ౪౭ ॥ తత్రశిష్యైఃపరివృతో మునివేషధరఃస్థితః । మారుతిశ్చాశ్రమందృష్ట్వా జలంపాతుంవివేశతం ॥ ౪౮ ॥ మునినామానితశ్చాపి జలకుంభఃప్రదర్శితః । మారుతిఃప్రాహతృప్తిర్మే నైవానేనభవిష్యతి॥

---

నంగదాది కపివీరులు చంపి యార్భటించుచు నిలచిరి. అప్పుడు రావణునిచేత పంపబడిన కుంభకర్ణుని పుత్రోత్తములగు కుంభ నికుంభులను వారిరువురు రణమునకేతెంచిరి. అప్పుడు కుంభుఁడు జాంబవంతునిచేతను నికుంభుఁడు అంగదునిచేతను చంపబడిరి. ఆసంగతినివిని రావణుఁడు తనపుత్రుఁడైన అతికాయుఁడనువానిని రణమునకంపెను. వాఁడురాగా లక్ష్మణుండు వానితోడ ఘోరయుద్ధముచేసి లంకలో వాని గొప్పతలను పడవేసెను. అప్పుడారావణుఁడు వేగముగా తానే సుహితాదులతోడ నూరివారితోడకూడి యుద్ధమునకువచ్చి, రణమున విభీషణునిచూచి కోపమునంది శక్త్యాయుధమును ప్రయోగించెను. లక్ష్మణుండపుడు తనవీపున విభీషణునిపెట్టుకొని తాను ముందువెడలెను. ఆశక్తివచ్చి హృదయమునతట్టగా లక్ష్మణుఁడు నేలబడెను. అలక్ష్మణుని తనయూరికెత్తుకొనిపోవుటకు రావణుఁడు వచ్చెను. శేషావతారుండైన సుమిత్రానందనునియొక్క భుజము కదలదయ్యె. అప్పుడు లక్ష్మణుని గొనిబోవదలచిన హనుమంతుఁడువచ్చి రావణుని యెదలో నొకగ్రుద్దుగ్రుద్ది ఆముష్టిప్రహారముచే వాఁడురక్తముకక్కుచు నేలబడగా కపిసైన్యములోనికి లక్ష్మణుని గొనిపోయెను. వెంటనే రావణుండును రథమునెక్కి హనుమంతుని నమ్ములచేకొట్టెను. అంత రాముఁడు క్రుద్ధుఁడై త్వరగా తీక్ష్ణబాణంబులచే నారావణుని ధ్వజాశ్వరథ చ్ఛత్రపతాకంబులను కత్తరించి సారథినిచంపి సూర్యప్రభంబైన వాని కిరీటమును అర్ధచంద్రబాణముచే పగలగొట్టి, హృదయమునుకొట్టెను. అందుచే రావణుఁడు వ్యాకులమునందగా, శ్రీరాముఁడు వానితో“యిప్పుడు లంకకుపోయి యూదార్చుకొని రేపువచ్చి, నాబలమును చూచెదవుగాక” అని ధిక్కరించెను॥౪౪॥ అంత నారావణుఁడు సిగ్గుచే తలవంచి

౪౯ ॥ తంమునిఃప్రాహసమునిస్తటాకంనికటస్థితం । గచ్ఛాక్షిణీపిధాయత్వం జలంపిబయథాసుఖం ॥ ౫౦ ॥ ఆగచ్ఛస్వపునశ్చాత్ర సుఖంతిష్ఠమమాంతికం । జానామిజ్ఞానదృష్ట్యాహం లక్ష్మణశ్చోత్థితస్త్వితి ॥ ౫౧ ॥ గృహాణమంత్రాన్ మత్తస్త్వం యేనపశ్యసి తంగిరిం । గోపితంత్వద్య గంధర్వై ర్యంతంత్వంనేతుమిచ్ఛసి ॥ ౫౨ ॥ ప్లవంగానాంజీవనార్థం లంకాయాంవేగతఃకపే । మత్తస్త్వంలబ్ధవిద్యస్సన్ దదస్వగురుదక్షిణాం ॥ ౫౩ ॥ తథేతిమారుతిర్గత్వా కాసారమపిబజ్జలం । పిధాయనేత్రేతావత్తు మగ్రసన్మకరీతదా ॥ ౫౪ ॥ సోపితాందారయామాస కృత్వాస్యేసామమారహ । తతోంతరిక్షేసాప్రాహ దివ్యరూపాతుమారుతిం ॥ ౫౫ ॥ పురాహంమునినాస్పృశ్య ప్రార్థితానరతిర్మయా । దత్తాశప్తాస్మిత్వత్తోమే నివృత్తిస్తేనకీర్తితా ॥ ౫౬ ॥ ధాన్యమాలీతివిఖ్యాతా౽ప్సరాఃపూర్వభవాంతరే । ఆశ్రమేయస్త్వయాదృష్టః కాలనేమిర్మహాసురః ॥ ౫౭ ॥ రావణప్రేషితోమార్గే స్థితస్త్వంజహివేగతః । తథేతిమారుతిర్గత్వా మునింప్రాహత్వరాన్వితః ॥ ౫౮ ॥ ముష్టింబద్ధ్వాదృఢాంఘోరాం గృహాణ గురుదక్షిణాం । ఇత్యుక్త్వాతాడయామాస హృదితంముష్టినాతదా ॥ ౫౯ ॥ పపాతభువిరక్తాస్య వమన్ ప్రాణాన్ జహౌ క్షణాత్ । తతఃక్షీరనిధింగత్వా జిత్వాగంధర్వసత్తమాన్ ॥ ౬౦ ॥ ద్రోణాచలంగృహీత్వాసౌ యావద్గచ్ఛతి

### ఆంజనేయుఁడు కాలనేమినిచంపి ద్రోణాద్రిందెచ్చి లక్ష్మణునిఁ బ్రతికించుట.

నవాఁడై లంకకు వెడలెను. శ్రీరాముఁడు మూర్ఛనొందియుండు లక్ష్మణునింజూచి యాంజనేయుని "ద్రోణాచలమును తీసికొనివచ్చి వీనిని, అట్లే కపులను బ్రతికింపుము." అని యాజ్ఞాపించెను. అట్లేయని యతఁడు వెడలెను. ఆసంగతినెఱిఁగి రావణుఁడ కార్యమునకు విఘ్నముచేయవలెనని ప్రేరించి కాలనేమియను రాక్షసునిఁ బంపెను. ఆరక్కసుఁడు వెడలి హిమవంతమువద్ద తపోవనమునుకల్పించుకొని యందులో తానొక మునివేషముఁదాల్చి శిష్యులతోడనుండెను. ఆంజనేయుండు పోవుచు నాయాశ్రమమునుచూచి నీళ్లుద్రావుట కందులోదూరెను. ముని హనుమంతుని సంమానించి నీళ్లచెంబునుచూపెను. అందుకు కపివీరుఁడు ఇంతతో నాకు తృప్తికాచాలదనెను. దానికి కపటముని "సమీపమున చెరువున్నది. పోయి కండ్లుమూసికొని కావలసినంత నీళ్లుద్రాగి యథేచ్ఛముగా మరల నిచ్చటికివచ్చి నావద్ద నెమ్మదిగా కూర్చుండుము. జ్ఞానదృష్టివలన లక్ష్మణుండు మేల్కాంచెనని నేనెఱింగితిని. ఆగిరిని చూచునట్టి దివ్యమంత్రము నుపదేశించెదను. గ్రహింపుము. ఏలననగా నాపర్వతమును గంధర్వులు దాచియున్నారు నీవు దానిని గొనిపోయి లంకలో కపులను బ్రతికించనెంచెదవు. నావల్ల విద్యనుగ్రహించి గురుదక్షిణములనిమ్ము" అనిచెప్పగా; హనుమంతుఁడు అట్లేయని పోయి కుంటలో కండ్లుమూసి నీళ్లు ద్రాగుచుండెను. అంతలో నచ్చట మొసలియొకటివచ్చి పట్టెను. మారుతి దానినోరుబట్టి చీల్చివేసెను. అంత నంతరిక్షంబున నది దివ్యరూపమునొంది "మునుపొకముని నన్నంటగా నతనికి నేను సంగమమునివ్వలేదు. అందుచే నన్నతఁడు శపించెను. నేనువేడగా, మారుతీ! నీచేనాకు

మారుతిః । విహాయసాతివేగేన లంకాంతావచ్చవైపథి ॥ ౬౧ ॥ భరతేనశరంముక్త్వా పర్వతో భువిపాతితః । భరతంమారుతిర్దృష్ట్వా రామోయమితివిహ్వలః ॥ ౬౨ ॥ ఉవాచమధురంవాక్యం కథమత్రసమాగతః । జితఃకింరావణేనత్వం రణంత్యక్త్వాపలాయితః ॥ ౬౩ ॥ ఏవముక్తోపిభరతః పునస్తంమారుతింశరం । మత్వాయంరాక్షసశ్చేతి సందధేనిశిసాదరాత్ ॥ ౬౪ ॥ బాణహస్తంతమాలోక్య భుభుక్కారంవిధాయసః । నైవాయంరాఘవశ్చేతి మత్వాధ్యాత్వాక్షణంహృది ॥ ౬౫ ॥ భరతంమారుతిఃప్రాహ రామదూతోద్యమేబలం । పశ్యాద్యహంతద్గిరంతాం శ్రుత్వాతం భరతోబ్రవీత్ ॥ ౬౬ ॥ బంధునామమరామేణ కుతోవదసమాగమః । తవజాతస్సువిస్తారం దండకారణ్యవాసినా॥ ౬౭॥ తతస్తంమారుతిర్వృత్తం సంశ్రావ్యరాఘవస్యతు । భరతేనేషుణాదత్తంగిరింధృత్వాయయౌపునః॥౬౮॥ లంకాం గత్వాసవల్లీభి ర్జీవయామాసలక్ష్మణం । వానరాంశ్చభరతస్య రామంవృత్తంన్యవేదయత్ ॥ ౬౯ ॥ పునర్నీత్వాయథాస్థానం తంసంస్థాప్యమహాచలం । లక్ష్మణోజీవితశ్చేతి సంశ్రావ్యభరతంపునః ॥ ౭౦ ॥ యయావాకాశమార్గేణ లంకాంసమారుతిర్జవాత్ । నృపానాకారయామాస సాకేతంభరతోపిసః ॥ ౭౧ ॥ సాహాయ్యార్థంరాఘవస్య లంకాంగంతుంమనోదధే । తతస్సభాయామాసీనో రావణఃప్రాహరాక్షసాన్ ॥ ౭౨ ॥ గచ్ఛధ్వంత్వరితందూతాః పా

గతిగలుగునని విశాపమునిచ్చెను. నేను జన్మాంతరమున ధాన్యమాలియను యప్సరసను. ఈ యాశ్రమంబున కాలనేమియను రాక్షసుండు నీచేచూడబడినవాఁడు. వాఁడు రావణునినుండి పంపఁబడి దారిలోనున్నాడు. త్వరగా వానిఁజంపుము.” అని చెప్పిపోయెను. అట్లయని యాంజనేయుఁడుపోయి కపటమునినిచూచి తన దృఢముష్టినిచూపి ఇదిగో గురుదక్షిణలఁ గొనుమని మెదలో గ్రుద్దెను. ఆగ్రుద్దుతో వాడు నెత్తురుఁగక్కుచు నేలఁబడి ప్రాణములువిడిచెను. అంత ననిలసుతుఁడు క్షీరనిధికిపోయి గంధర్వవీరులనుజయించి ద్రోణాచలమును తీసికొని గగనమున వేగముగావచ్చుచుండెను. అప్పుడు దారిలో భరతుండు బాణమునుప్రయోగించి ఆంజనేయుని చేతికొండను నేలగూల్చెను. కపివీరుఁడు భరతునిఁజూచి శ్రీరాముండని భ్రమించి తిన్నగా “నెట్లిచ్చటికివచ్చితివి? రావణునిచేత జయింపఁబడి రణమునువిడిచి పరుగెత్తితివా? అని చెప్పుచుండినను, భరతుఁడు వీడెవఁడో రాక్షసుండనియెంచి యారాత్రిలో మఱి బాణానుసంధానము చేసెను. దానింజూచి కపీంద్రుఁడు భుభుక్కారముచేసి వీఁడు రాముఁడు కాఁడనుకొని కొంతసేపు మనమునధ్యానించి భరతునితో “నేను రామదూతను. ఇపుడు నాబలమునుచూపెదను.” అనిచెప్పగా, నందుకు భరతుఁడు “దండకారణ్యవాసియైన మాయన్నయగు రాముఁనితో నీకెట్లు సహవాసముకలిగెను?” అనియడిగెను. అంత నాంజనేయుఁడు శ్రీరామవృత్తాంతమును చెప్పి భరతునిచే బాణముతోనివ్వబడిన కొండనెత్తుకొని లంకకువచ్చి దానితీగెలచే లక్ష్మణుని బ్రతికించెను. వానరులను బ్రతికించెను. శ్రీరామునికి భరతవృత్తాంతమునుగూడ విన్నవించెను. మఱల నాపర్వతమును యథాస్థానముగాపెట్టి లక్ష్మణుఁడు బ్రతికెననుసంగతిని భరతునికిచెప్పి

తాళేతౌమహాబలౌ । ఐరావణోమహాదైత్య స్తథామైరావణోమహాన్ ॥౨౩॥ తయోశ్శ్రేకథనీయంహి యుద్ధవృత్తం
విజయస్యయోః । తథేతితేగతాదూతా స్తాతస్వృత్తం న్యవేదయన్ ॥ ౨౪ ॥ తౌశ్రుత్వావిహ్వలాత్మానౌ లంకాయాంస
ముపస్థితౌ । రామంచలక్ష్మణంహర్తుం నిశాయాంతౌసమాగతౌ ॥౨౫॥ దదర్శతుస్తౌపుచ్ఛస్య పరిఘంహిహనూమ
తః । కపీనాంతత్రసేనాయా స్తదాకాశాన్మహాన్బలౌ ॥ ౨౬ ॥ నిపేతతుఃకపీనాంతు సేనాయాంరామలక్ష్మణౌ । కించి
ద్వినిద్రితౌదృష్ట్వా శిలాయాంసంగరశ్రమాత్ ॥ ౨౭ ॥ నీత్వాతుస్తౌశిలాంశీఘ్రం పాతాలంనిజమందిరం । ఏతస్మిన్నంత
రేదృష్ట్వా సేనాయాంరామలక్ష్మణౌ ॥ ౨౮ ॥ మారుతిఃపాదమార్గేణాం తయోఃపాతాలమాయయౌ । ఏతస్మిన్నంత
రేమార్గే లంకాదక్షిణదిక్తటే ॥ ౨౯ ॥ నికుంభిలాయాంస్వపతిం కపోతీప్రాహగుర్వీణీ । నాథాద్యనరమాంసంమే
భోక్తుంస్పృహయతేమనః ॥ ౩౦ ॥ సప్రాహాద్యసమానీతౌ వర్తతేరామలక్ష్మణౌ । రసాతలంహిదైత్యాభ్యాం దేవ్య
గ్రేతౌవధిష్యతః ॥౩౧ ॥ ఏవంతయోర్వధేజాతే మాంసమానీయతేర్పయే । తద్వాక్యంమారుతిఃశ్రుత్వా కించిత్తోష
యుతోయయౌ ॥ ౩౨ ॥ తావద్దదర్శసద్వారి సంస్థితంమకరధ్వజం । నత్వాతంహనూమంతం పప్రచ్ఛమకరధ్వ
జః ॥౩౩॥ కస్త్వంకుతస్సమాయాతః స్వవృత్తంప్రాహమారుతిః । రామదూతస్తులంకాయా శ్చోరితౌరామలక్ష్మణౌ ॥

లంకకువచ్చెను. భరతుఁడు నచ్చట నయోధ్యకు రాజులను పిలపించెను. శ్రీరామునికి సహాయ
ముచేయవలెనని లంకకుపోవుటకు నాలోచించెను॥౨౧॥ పిమ్మట సభలోనున్న రావణుఁడు రాక్ష

### ఐరావణ మైరావణులు రామలక్ష్మణుల నపహరించుట.

సులకు "ఓదూతలారా! మీరు త్వరగావెడలండి. పాతాళమున నామిత్రులగు ఐరావణ మై
రావణులను మహాదైత్యు లిరువురుగలరు. నాయొక్క యీయుద్ధవృత్తాంతమును వారికి తెలియ
జేయండి" అని యాజ్ఞాపించెను. వారు అట్లేయనిపోయి వారి కాసంగతిని విన్నవించిరి. మ
హాబలులైన ఆ యైరావణమైరావణులు విని విహ్వలాంతరంగులై, లంకలోనున్న రామలక్ష్మ
ణులను రాత్రిలో నపహరించుట కాలోచించివచ్చి యాంజనేయుని తోకయొక్క ప్రాకారము
ను అందులో కపులయొక్క గొప్పసేననుచూచి, కపిసేనలో తిన్నగాదుమికి యుద్ధాయాసము
చేత బండమీఁద పండుకొని కొంచము నిద్రించుచున్న రామలక్ష్మణులను కనుగొని త్వరగా నా
బండను పాతాళములోని తనమందిరమున కెత్తుకొనిపోయిరి. అంతలో నాంజనేయుఁడు సేన
లో రామలక్ష్మణులనుకానక పాదమార్గమున వారి పాతాళమునకువచ్చెను. ఆవేళలో దారి
లో లంకా దక్షిణదిగ్భాగముననుండు నికుంభిలలో గర్భవతియైన పారావతపక్షి తనపతిని "నా
థా నాకు నరమాంసమును తెచ్చిపెట్టుము. ఆశగానున్నది" అనియడిగెను. అందుకామొగ
పక్షి "ఇప్పుడే దైత్యులిరువురువచ్చి రామలక్ష్మణులను పాతాళమునకు కొనిపోయిరి. దేవిమె
దుట వారినిచంపెదరు. అట్లువారుచంపితే ఆమాంసమును నీకు తెచ్చియిచ్చెదను." అని చె
ప్పుచుండగా నామాటవిని మారుతి కొంత చింతించుచుపోయెను. అంత నాద్వారముననున్న

౮౪ । నిద్రితౌనిశిదైత్యాభ్యాం మత్రపాతాలమధ్యహి । తయోర్మోక్షార్థమాయాత శ్చేత్త్వంవేత్సివదస్వతః ॥౮౫॥ తన్మారుతివచశ్శ్రుత్వా తంప్రాహమకరధ్వజః । పితామేవర్తతే తత్ర క్షేమేణాంజనినందనః ॥ ౮౬॥ తచ్ఛ్రుత్వాచ తతఃప్రాహ హనుమాన్మకరధ్వజం । హనూమతఃకుతఃపత్నీ సోబ్రవీన్మారుతింపునః ॥౮౭॥ లంకాదాహంపురాకృత్వా సాగరేశీతలంకృతం । యదాపుచ్ఛంమారుతినా తదాతద్ఘర్మపూరితాత్ ॥౮౮॥ కంఠాత్స్వేదబహిస్త్యక్త స్సాగరే సోపతత్తదా । మకర్యాభక్షితస్సోపి తస్యాంజాతస్సుతోప్యహం ॥ ౮౯ ॥ తచ్ఛ్రుత్వామారుతిః ప్రాహ సోహమే వనసంశయః । తదాననామపితరం తథావృత్తంన్యవేదయత్ ॥ ౯౦ ॥ కామాక్ష్యాస్తౌబలింకర్తుం నిశ్చితౌపూర్వమే వహి । తావానేతుంయదోద్యుక్తాలంకాంగత్వాసుకోత్తమా ॥౯౧॥ శ్వఃకామాక్ష్యాఃపురఃకర్తుం తయోర్దానంవినిశ్చితం । గచ్ఛదేవాలయేగత్వా తత్రస్థిత్వాహరస్వతౌ ॥ ౯౨ ॥ తతస్సమారుతిర్గత్వా త్రసరేణుస్వరూపధృక్ । దేవాలయేప్రవిశ్యాథ కపాటానిబబంధసః ॥ ౯౩ ॥ తావద్దైత్యౌసమాయాతౌ పూజార్థంద్వారిసంస్థితౌ । తస్మైర్దైత్యాఃస్వరేణైవ మారుతిస్తావచోబ్రవీత్ ॥ ౯౪ ॥ పూజాకార్యాగవాక్షేణ సజీవౌరామలక్ష్మణౌ । వనోద్భవైఃఫలైఃపుష్పాదిభిస్సమ్యక్ప్రపూజితౌ ॥౯౫॥ ధృతకోదండతూణీరౌ వన్యపుష్పైశ్శోభితౌ । దేవాలయస్యకించిద్ధి ద్వారముద్ఘాట్యవైశనైః ॥

మకరధ్వజుఁడనువాఁడు ఆంజనేయుని నడ్డగించి "నీవెవఁడవు? ఎందుకువచ్చితివి?" అనియడిగెను వానింజూచి కపీంద్రుఁడు తనసంగతినిచెప్పి "నేను రామదూతను. రాత్రిలో నిద్రించునప్పుడు రామలక్ష్మణులను దైత్యులు పాతాళమునకు గొనిపోయిరి. వారిని కనిపెట్టుటకు నేనిపుడు పోవుచున్నాను. నీకు తెలిసియున్న చెప్పుము." అని యడిగెను. అందుకు మకరధ్వజుండు "అచ్చట నాతండ్రి యాంజనేయుఁడు క్షేమముగ నున్నాఁడా? అనగా, హనుమంతుఁడు ఆమాట విని చకితుఁడై హనుమంతునికి పత్ని యెచ్చటగలదనియడిగెను. అందుకు మఱల మకరధ్వజుఁడు "అంజనేయుఁడు మున్నుపు లంకనుకాల్చి యాంతోకను సముద్రములో చల్లార్చునపుడు ఆపాగకమ్మిననోటియుమ్మి వెలుపల విడువబడెను. ఆయుమిని మొసలియొకటి భక్షించెను. అదివిని యాంజనేయుఁడు నిస్సందేహముగా వాఁడే నేనని నొక్కి వక్కాణించెను. అంతనామకరధ్వజుఁడు తండ్రికి నమస్కరించి "వారు ఐరావణ మైరావణులు మొదటనె లంకకుపోవునపుడు శ్రీరామలక్ష్మణులను కామాక్షీదేవికి బలిగా నర్పింపవలెనని నిశ్చయించిరి. రేపు కామాక్షియెదుట వారిని ఖండించవలెనని నిశ్చయించిరి. పొమ్ము. ఆదేవాలయమునకు వెడలి యచ్చటనిలచి వారిని హరింపుము." అని యచ్చటి సందర్భమును తెలియజేయగా, వెంటనే ఆంజనేయుఁడు సూక్ష్మమగు త్రసరేణురూపమునుదాల్చి దేవాలయమున ప్రవేశించి తలుపులనువేసికొనెను. ఆవేళకు పూజించుటకై యారాకాసులు ద్వారమువద్దనిలచిరి. అపుడు కపివీరుండు దేవియొక్క స్వరముతోనే తిన్నగా వారినిగూర్చి "గవాక్షములోనే పూజచేయవలెను. సజీవులైన శ్రీరామలక్ష్మణులను వన్యంబులగు ఫల పుష్పములచే చక్కగా పూజించవలయును. వారు

౯౬ ॥ మత్తుష్ట్యర్థం ప్రేషణీయా వత్రమామద్యమానవా । యేనకేనప్రకారేణ రామామద్యప్రపశ్యతి ॥౯౭॥ భవిష్యతి నిశ్చయేన సోఽంధో నాస్త్యత్ర సంశయః । తద్దేవ్యా వచనం శ్రుత్వా తుష్టాం జ్ఞాత్వాంబికాం ముదా ॥౯౮॥ తతస్తౌ పూజనం దైత్యౌ గవాక్షేణైవ చక్రతుః । పక్వాన్న పాయసాదీనాం రాశింస్తౌ ప్రముమోచతుః ॥౯౯॥ పంచామృతఘటాంశ్చాపి కోటిశస్తౌ ముమోచతుః । కోటిశః ఫలభారాంశ్చ గవాక్షేణ ముమోచతుః ॥ ౧౦౦ ॥ తత్సర్వం భక్షయిత్వా స మారుతిః ప్రాహ తౌ పునః । కిం దత్తం గ్రాసమాత్రం మే భోజనం క్షుధితాస్త్వహం ॥౧౦౧॥ తద్దేవ్యా వచనం శ్రుత్వా తౌ దైత్యావతివిస్మితౌ । దూతైర్విలుంత్య హట్టాంశ్చ తథా స్వీయపురౌకసః ॥ ౨ ॥ భక్షణీయపదార్థాంస్తౌ గిరినిభము మోచతుః । స్వీయరాజగృహాదిషు యద్యద్వస్త్వపి సంచితం ॥౩॥ తచ్చాపి దూతైరానీయ దైత్యౌ శీఘ్రం ముమోచతుః । తదా కోలాహలశ్చాసీత్పురి తిగేహే పురౌకసాం ॥ ౪ ॥ నాసీచ్ఛేషం బాలకానాం భక్ష్యవస్త్వణ్వపి క్వచిత్ । తతస్తౌ వన్యపుష్పాద్యైర్భూషితౌ రామలక్ష్మణౌ ॥౫॥ ధృతకోదండతూణీరౌ ద్వారేణైవార్పితౌ శ్రియై । తౌ దృష్ట్వా మారుతిర్నత్వాఽలింగ్య శ్రీరామలక్ష్మణౌ ॥ ౬ ॥ కపాటానితతోద్ఘాట్య దైత్యయోః స్వవ్యతజ్జయత్ । తతో రామో లక్ష్మణేన బహిర్దేవాలయాత్తదా ॥౭॥ నిర్గత్య శరజాలైస్తౌ జఘాన క్షణమాత్రతః । సైన్యాని సుహృదాదీంశ్చ తయోస్త్వత్రైజఘాన సః ॥ ౮ ॥ పునస్తౌ జీవితౌ దైత్యౌ పునస్తేన నిపాతితౌ । శతవారం హతావేవం నాసీన్మృత్యు

కోదండ తూణీరములం దాల్చి వనపుష్పంబులచే నలంకరింపఁబడి దేవాలయద్వారమును కొంచముగా తెఱచికొని తిన్నగా నా సంతోషమునకై పంపఁబడుదురు గాక. ఎవ్విధముగా నైనను ఎవ్వఁడిప్పుడు నన్ను చూచునో నిశ్చయముగా వాఁడు గ్రుడ్డివాఁడగును. ఇందుకు సంశయము లేదు." అని చెప్పెను. ఆరక్కసులిరువురును దేవియొక్క మాటవిని జగదంబ సంతోషించెనని సంతసముతో గవాక్షమునుండియే పూజించిరి. పక్వాన్నంబులను పాయసాదులను రాసులు రాసులుగా విడచుచువచ్చిరి. పంచామృతంబుల కడవలను కోట్లకొలంది కుమ్మరించిరి. కోట్ల్యంతరముగా దివ్యఫలంబుల నర్పించిరి. వాటినంతటిని భక్షించి వానరేంద్రుఁడు మరల "ఏమిచ్చితిరి నాకు? ఈ గ్రాసమాత్రముచే నేమగును? మిక్కిలి యాకలి గొనియున్నాను." అని చెప్పెను. ఆకపిరూపదేవీ వచనమునువిని ఆ దైత్యులు మిగుల విస్మితులై దూతలచే పాకశాలలో వెదకి తన యూరివారియొక్కయును తనయొక్కయును తినతగిన వస్తువులనన్నిటిని కొండలవలె కుమ్మరించిరి. తమ రాజమందిరంబులలో సంపాదించి పెట్టిన వస్తువులనన్నిటిని దూతలచే తెప్పించి యొప్పించిరి. అప్పురివారి యిండ్లలో కోలాహలమారంభించెను. ఎచ్చటను బిడ్డలకుగూడ తినతగిన వస్తువు కొంచెమును లేకపోయె. అంతనైరావణ మైరావణులు వన్యపుష్పాభరణంబులచే నలంకరించి ధనుర్బాణధారులుగా నున్నట్లే శ్రీదేవికై శ్రీరామలక్ష్మణులను ద్వారమునుండియే తిన్నగా సమర్పించికొనిరి. వారి నాంజనేయుఁడు చూచి వందించి యాలింగించి యప్పుడా తలుపులను తెరచికొనివచ్చి బెదరించెను. అంతరామలక్ష్మణులు దేవాలయమునుండి బయటవచ్చి యయ్యైరావణ మైరావణుల

స్తయోస్తదా ॥ ౯ ॥ తతో౽తివిస్మితౌ భూత్వా త్వరం గత్వా స మారుతిః । ఇతస్తతో భ్రమన్ పుర్యాం నారీం రహసి సంస్థితాం ॥ ౧౦ ॥ ఐరావణభోగపత్నీం పప్రచ్ఛ మరణం తయోః । సా ప్రాహ నాగకన్యాహం బలేనానేన ధర్షితా ॥ ౧౧ ॥ మైరావణో౽పి మాం నిత్యం దుష్టబుద్ధ్యా ప్రపశ్యతి । ఉభాభ్యామపి చ క్రీడాం దాతుం నాస్తి బలం మయి ॥ ౧౨ ॥ మిత్రం త్వేకో రిపుస్త్వేక స్త్వితి దుఃఖం తయోర్మమ । అతస్తయోర్వధే తుష్టిర్మమ చాపి భవిష్యతి ॥ ౧౩ ॥ మారుతే యది రామో మాం స్వస్త్రీయుం హి కరిష్యతి । తదాహ్యహం కథయామ్యద్య తయోర్మృత్యుర్యతో భవేత్ ॥ ౧౪ ॥ తచ్ఛ్రుత్వా మారుతిః ప్రాహ యది శ్రీరామభార్యతః । నభవిష్యతి భగ్నస్తే మంచకస్తర్హి తే పతిః ॥ ౧౫ ॥ భవిష్యతి రామచంద్రస్తే తేత్యుక్త్వా తమాహ సా । భ్రమరా నైకదా పూర్వం బాలైః కంటకరోపితాః ॥ ౧౬ ॥ మోచయామాసతుస్తౌ హి తేన తుష్టాశ్చ షట్పదాః । తావూచుస్తే యువాభ్యాం హి మరణాద్రక్షితా వయం ॥ ౧౭ ॥ యథా తథా యువాం చాపి రక్షామో మరణాద్వయం । ఇత్యుక్త్వా తే స్థితాశ్చాత్ర తే నీత్వామృతముత్తమం ॥ ౧౮ ॥ తద్రక్తబిందూన్ స్పృష్ట్వా తౌ స్రకుర్వాతే సుజీవితౌ । భ్రమరాస్తే తయోర్నిద్రా స్థానే సంత్యధునా కపే ॥ ౧౯ ॥ కోటిశస్తాన్ మర్దయస్వ సో౽పి తాన్మర్దయత్ క్షణాత్ । తతైకం శరణం ప్రాప్తం భ్రమరం ప్రాహ మారుతిః ॥ ౨౦ ॥ కురు మంనకగర్భం త్వం గజభుక్తకపిత్థవత్ । ఐరావణభోగపత్న్యాః వట్పదో౽పి తథాకరోత్ ॥ ౨౧ ॥ తతో నిహత్య తౌ దైత్యౌ పునర్బాణై

యొక్క సైన్యవర్గంబును మిత్రవర్గంబును వారిరువురిని కూడ బాణజాలముచే ధ్వంసముచేసిరి. ఆరక్కసులిరువురును మరల బ్రతికిరి. వీరు మరల చంపిరి. ఇట్లు నూరుమార్లు సంహరించినను వారికి మృత్యువు కలుగలేదు. అంత నత్యంతాశ్చర్యము నొందిరి. అప్పుడాంజనేయుఁడు త్వరగా వెడలియూరిలో నిటటు సంచరించుచు రహస్యస్థానమున నున్నట్టి యైరావణభోగపత్నియగు కాంతనొకతెనుచూచి వారిమరణము నడిగెను. ఆమె యితనితో "నేనొక నాగకన్యకను. బలాత్కారమున పట్టబడినదానను. ఇచ్చట మైరావణుఁడును నన్ను సంతతము దుష్టబుద్ధితో చూచును. ఇరువురికిని రతిక్రీడనిచ్చుటకు నాకుబలములేదు. నాయందు వారికి ఒకఁడు మిత్రుఁడు ఒకఁడుశత్రుఁ వనుదుఃఖముగలదు. కావున వారిచావు నాకును సంతోషకరము. హనుమంతుఁడా! శ్రీరాముఁడు నన్ను తనయాలినిగా నొప్పికొనునట్లయిన నేనువారికి మృత్యువు దేనివలన కలుగునో చూపెదను." అనిచెప్పెను. అందుకు ఆంజనేయుఁడు "శ్రీరాముని భారమునకు నీమంచము విఱుగకయుండిన నతఁడు నీపతి కాగలఁడు." అనియొప్పెను. దానికామెయు నొప్పి కొనెను. పిదపానాగకన్యక "మునుపొకప్పుడు తుమ్మెదలను బాలకులు ముండ్లలో నున్నపుగా, వాటిని నీయైరావణ మైరావణులు విడిపించిరి. అందుచే మెచ్చిన భ్రమరములు- మీరు మమ్మును మరణమునుండి బ్రోచినట్లు మేము మిమ్మును మరణమునుండి రక్షించెదము- అని చెప్పి వీరి శయనస్థానమున నున్నవి. అవి అమృతబిందువులను గొనివచ్చి వీరిరక్తబిందువులను స్పృశించుచున్నవి. వీరు బ్రతుకుచుందురు. కోట్లకొలదిగానుండు వాటిని

రఘూద్వహః। అభిషిచ్యతిదోఃస్థానే రాజ్యేతంమకరధ్వజం ॥ ౨౨ ॥ యావద్గంతుంమనశ్చక్రే తావన్మారుతినార్థితః। నాగకన్యాగృహంగత్వా నానాచిత్రవిచిత్రితం ॥ ౨౩ ॥ దృష్ట్వాతాంచారువదనాం వస్త్రాలంకారమండితాం। ధృత్వాకరేణతద్ధస్తం కించిత్కృత్వాస్మితాననః ॥ ౨౪ ॥ చకారమంచకంభగ్నం స్వభారేణరఘూద్వహః। తతస్తయా ప్రార్థితస్సరామస్తాంపునరబ్రవీత్ ॥ ౨౫ ॥ త్యక్త్వాదేహంభువంగత్వా భూత్వాబ్రాహ్మణకన్యకా। తతస్తప్త్వాచిరంకాలం తృతీయేత్వంతుజన్మని ॥ ౨౬ ॥ ద్వాపరేద్వారకాయాంహి మమపత్నీభవిష్యతి। ఇతిరామవచనంశ్రుత్వా రామాగ్రేఽగ్నింప్రవిశ్యసా ॥ ౨౭ ॥ కన్యాకుమరీనామ్నాఽసీద్ద్విజకన్యాఽబ్ధిరోధసి। మారుతేస్స్కంధసంస్థోఽభూత్తదారామోముదాన్వితః ॥ ౨౮ ॥ రాజ్యేకృత్వామంత్రిణం స్వంలక్ష్మణంమకరధ్వజః। అకరోత్తంస్కంధసంస్థం శేషంబ్రహ్మాండధారకం ॥ ౨౯ ॥ తతఃక్షణాజ్జగ్మతుస్తౌ లంకాంశ్రీరామలక్ష్మణౌ। శ్రీరామలక్ష్మణౌదృష్ట్వా సుగ్రీవాద్యాశ్చవానరాః ॥ ౧౩౦ ॥ తావాలింగ్యముహుర్నత్వా బభూవుస్తోషపూరితాః। రామోపిసకలంవృత్తం సుగ్రీవాదీన్న్యవేదయత్ ॥ ౩౧ ॥ దైత్యౌరామేణనిహతౌ శ్రుత్వాసదసిరావణః। రాక్షసాంశ్చేతిఃప్రాహ పూర్వవృత్తంభయాన్వితః ॥ ౩౨ ॥ మానుషేణైవమృత్యుర్మే వ్యాహాపూర్వంపితామహః। అతోనారాయణస్సాక్షాన్మానుషోభూన్నసంశయః ॥ ౩౩ రామోదాశరథిర్భూత్వా మాంహంతుంసముపస్థితః। యదాపూర్వమనరణ్యస్సహతోదీ

"సంహరింపుము." అని తెలిపెను. అట్లేయని యాంజనేయుఁడు వాటినిసంహరించెను. అపుడొక తుమ్మెద శరణమనిరాగా "నీవు ఐరావణ భోగపత్నియొక్క మంచమును ఏనుగతిన్న వెలగపండువలె నిస్సారముగా చేయుము; అనియాజ్ఞనిచ్చెను. అదియునట్లే చేసెను. పిమ్మట రామచంద్రుఁడు బాణములచే వారిరువురిని సంహరించి యారాజ్యమున మకరధ్వజునికి పట్టాభిషేక మొనరించి యచ్చటినుండి వెడలుటకు నిశ్చయించినప్పటికి మారుతి "స్వామీ! వివిధచిత్ర విచిత్రితంబైన నాగకన్యామందిరమునకు పోయి సాలంకారయై సుముఖియగు నక్కాంతను చూచి సంతసముతో పాణిగ్రహణం బొనర్పవలె" నని విన్నవించెను. శ్రీరాముఁడు తనభారముచే మంచమును విఱుగగొట్టెను. అంతనామె మిక్కిలి ప్రార్థింపగా మరల శ్రీరాముఁడు "ఈదేహమునువదలి భూమికిజని బ్రాహ్మణకన్యకగా జనించి చిరకాలము తపంబొనరించి మూడవజన్మమున ద్వాపర యుగమునందు ద్వారకానగరములో నాకుధర్మపత్నియగుము; అని వరమునిచ్చెను. వెంటనే యామెయగ్నిని ప్రవేశించెను. సముద్రతీరమున కన్యాకుమారియనుపేరుతో బ్రాహ్మణకన్యకగా నవతరించెను. పిమ్మట శ్రీరాముండు ఆంజనేయుని భుజములపై యెక్కెను. మకరధ్వజుండు మంత్రిపై రాజ్యమును విడచి బ్రహ్మాండ ధారకుఁడైన శేషుండగు లక్ష్మణుని తన భుజములపైయెక్కించికొనెను. అంతనా రామ లక్ష్మణులుక్షణములో లంకకువిజయము చేసిరి ॥౧౩౦॥ వారిని

### రావణుఁడు రామునిచే తన చావును నిశ్చయించి చెప్పుట.

చూచి సుగ్రీవాదులు ఆలింగించి పలుమారువందించి యానందనిర్భరులైరి. శ్రీరాముఁడును

క్షితో మయా ॥ ౩౪ ॥ తదాశప్తశ్చ తేనాహం సూర్యవంశోద్భవే సహి। ఉత్పత్స్యతే చ మద్వంశే పరమాత్మా సనాతనః ॥ ౩౫ ॥ స ఏవ త్వాం పుత్రపౌత్రైర్బాంధవైర్విహనిష్యతి। ఇత్యుక్త్వా స యయౌ నాకం సోఽధునా సమయో మమ ॥ ౩౬ ॥ సమాగతో రాఘవో మాం సమరే సహనిష్యతి। విబోధ్య కుంభకర్ణం మామానయధ్వం త్వరాన్వితాః ॥ ౩౭ ॥ తతస్తే తాం గుహాం గత్వా తచ్ఛ్వాసేన వికర్షితాః। యాతాయాతే ప్రచక్రుస్తే కుంభకర్ణోదరే ముహుః ॥ ౩౮ ॥ తదైకత్ర బాహుపాశైర్బలం కృత్వాథ రాక్షసాః। గత్వా తదంతికం భీతా నిజఘ్నుస్తం ద్రుమైః పదైః ॥ ౩౯ ॥ శిలాభిస్తాడయామాసుశ్చ శ్వైరుష్ట్రైర్వ్యచూర్ణయన్। కాష్ఠభారైర్మహాదాహం దేహే చక్రుర్నృపాజ్ఞయా ॥ ౪౦ ॥ తదా ప్రబుద్ధశ్చోత్థాయ సూకరాన్మహిషాన్ఖరాన్। కోటిశః స్వముఖే క్షిప్త్వా జలవాపీర్విశోష్య సః ॥ ౪౧ ॥ గత్వా నత్వా రాక్షసేంద్రం బోధయామాస రావణం। ఏకదాహం వనే గత్వా దృష్ట్వా తం నారదం మునిం ॥ ౪౨ ॥ పృష్టవాంస్త్వం కుత్ర యాతః కుత ఆగమనం కృతం। స మాం ప్రాహ దేవలోకాదయోధ్యాం ప్రతిగమ్యతే ॥ ౪౩ ॥ రావణాదీన్రణే హంతుం విష్ణుర్జాతోఽత్ర మానుషః। దేవవాక్యాత్త్వరయితుం రామం గచ్ఛామ్యహం జవాత్ ॥ ౪౪ ॥ ఇత్యుక్త్వా మాం గతస్సోఽతః ప్రేషయామాస రాఘవం। ఇతి శ్రుతం మయా పూర్వం తవాగ్రే తన్నివేదితం ॥ ౪౫ ॥ అతోఽర్పయాద్య రామాయ సీతాం సఖ్యం కురు ప్రభో। ఇతి తద్వచనం శ్రుత్వా రావణస్తం వచోఽబ్రవీత్ ॥ ౪౬ ॥ నిద్రావ్యాప్తేఽక్షిణీ తేఽద్య గచ్ఛ నిద్రాం సుఖం కురు।

సమస్తవృత్తాంతమును సుగ్రీవాదులకు తెలిపెను. రావణుండు సభలో తన మిత్రులు పోయిరను దానిని విని భయభ్రాంతుండై "మునుపు బ్రహ్మ నాకు మనుష్యుని వలననే మృత్యువును చెప్పెను. అందువలన నారాయణుండే ప్రత్యక్షముగా నీమానవాకృతి నందియుండును. అందుకు సంశయములేదు. రాముండు దాశరథియై నన్ను సంహరించుటకు వచ్చియున్నాడు. మును పప్పు డనరణ్యుండు దీక్షితుండై యుండి నాచేతచంపబడునప్పుడు సూర్యవంశంబైన నాయీవంశమున పరమాత్మయవతరించుచున్నాడు. అతండే నీపుత్రమిత్ర పరివారముతోడ నిన్ను సంహరించునని శాపమిచ్చి స్వర్గమునకుపోయి యున్నాడు. ఆసమయమిదిగో వచ్చినది. రాముండు వచ్చెను. యుద్ధమున నన్ను చంపును. త్వరగామీరు కుంభకర్ణుని నిద్రలేపి నావద్దికి పిలిచికొనిరండి." అని యాజ్ఞాపించెను ॥౩౭॥ పిమ్మట నారాక్షసులు కుంభకర్ణుని గుహకువెడలి వానియుసు

## కుంభకర్ణుండు నిద్రలేచి యుద్ధముచేయుట.

రుచే నీడవబడి యాతాయాతముచే వానికడుపున చిక్కువడి యొకప్రక్కయెట్లో తప్పించుకొని సమీపించి కాళ్లతోను రాళ్లతోను చెట్లతోను కొట్టి గుబ్బములచేతను ఒంటెలచేతను త్రొక్కించి కట్టెలువేసి మంటపెట్టి రాజాజ్ఞవలననెట్లో లేపిరి. అప్పుడు కుంభకర్ణుండు నిద్రలేచి పందులను ఎనుములను లెక్కలేకభక్షించి నీళ్లనూతులను శోషించి రావణునివద్దికివచ్చి వందించి "నేనొకప్పుడు వనమున పోవుచుదారిలో నారదమునిని చూచితిని. నీవెచ్చిటికి పోదువు? ఎచ్చట నుండివచ్చితివని యడిగితిని. అందుకతండు దేవలోకమునుండి యయోధ్యకు పోవుచున్నాను.

తద్బంధోః క్రూరవచనం శ్రుత్వాన త్వాథరావణం ॥౪౭॥ జవాద్యయాసయుద్ధాయో ల్లంఘ్యప్రాసాదమున్నతం। కుంభకర్ణంతత్రదృష్ట్వా కపయోభయవిహ్వలాః ॥౪౮॥ చక్రుః పలాయనంసర్వే రామపార్శ్వముపాగతాః । కుంభకర్ణంతత్రదృష్ట్వా ప్రణనామవిభీషణః ॥౪౯॥ ఉవాచప్రణతోభూత్వా మయారాజాతిబోధితః, సీతాంరామాయదేహీతి తేనధిక్ ధిక్కృతస్త్వహం॥౫౦॥ తచ్ఛ్రుత్వాహంరాఘవస్య సేవాంకర్తుముపాగతః। తచ్ఛ్రుత్వాబంధువచనం కుంభకర్ణస్తమబ్రవీత్ ॥౫౧॥ సమ్యక్కృతంత్వయావత్స మదగ్రేమాస్థిరోభవ, యుద్ధేస్వీయఃపరోవాత్ర జ్ఞాయతేనమయాఽప్యహో ॥౫౨॥ తతోబంధుంనమస్కృత్య రామపార్శ్వముపాయయౌ, కుంభకర్ణోపిహస్తాభ్యాం పాదాభ్యాంపేషయన్ హరీన్ ॥౫౩॥ చచారవానరీంసేనాం తత్రదృష్ట్వాకపీశ్వరం। శూలేనాఘతంభిత్వాఽఽనయామాసపురీంముదా॥౫౪॥ మార్గేస్వస్థస్సుగ్రీవః కర్ణౌ ఘ్రాణంచపార్శ్వయోః, ఛిత్వాయయౌరాఘవేంద్రం సోపిహారైర్విలజ్జితః ॥౫౫॥ పునర్యయౌరణభువం తందృష్ట్వారఘునందనః। వివ్యాధనిశితైర్బాణై స్సోపిరామంద్రుమైర్నగైః ॥౫౬॥ తాడయామాసతాన్బాణై ర్నివార్యరఘునందనః। వాయవ్యాస్త్రేణచిచ్ఛేద తద్ధస్తౌసాయుధౌక్షణాత్ ॥౫౭॥ ఛిన్నబాహుమథాయాంతం నదంతంవీక్ష్యరాఘవః। ద్వావర్ధచంద్రౌనిశితౌ వాదాయాస్య పదద్వయం ॥౫౮॥ చిచ్ఛేదపతితౌపాదౌ లంకాద్వారిమహాస్వనౌ। నికృత్తపాణిపాదోఽపి కుంభకర్ణోతిభీషణః ॥౫౯॥ బడబాముఖవద్వక్త్రం వ్యాదాయర

ణమున రావణాదులను చంపుటకు మాధవుండు మానుషరూపమునందుచున్నాడు. దేవవాక్యమునుండి రాముని త్వరపెట్టుటకు పోవుచున్నాను అనియిట్లు నాతో చెప్పి అచ్చటినుండి శ్రీరామునం పించెను.ఇట్లు నేను మునుపువింటిని. నీయెదుట విజ్ఞాపించితిని. అందువలన శ్రీరామునికి సీతనర్పించి సఖ్యముచేయుము.'' అని హితము నుపదేశించగా విని రావణుఁడు "నీవిపుడు నిద్రాముద్రాంకితాక్షుఁడై యున్నావు. పోయినెమ్మదిగా నిద్రపొమ్ము," అని నిరాకరించెను. అన్నయొక్క యిట్టి క్రూరవాక్యమును విని కుంభకర్ణుండు రావణుని స్తోత్రముచేసి నమస్కరించి వేగముచే ఎత్తరమైన ప్రాసాదమును దాటి యుద్ధమునకువచ్చెను. అచ్చట కుంభకర్ణునిచూచి కపులు విభ్రాంతచిత్తులయిరి. అందరు పరుగెత్తికొనిపోయి శ్రీరామపాదముల నాశ్రయించిరి. అచ్చట విభీషణుఁడు కుంభకర్ణుని జూచి నమస్కరించి "అన్నా! నేను రావణునికి సీతను రామునికర్పింపుమని విశేషముగా తెలివిచెప్పినను వాఁడు నన్ను ఛీఛీయని ధిక్కరించెను. అదివిని నేను శ్రీరాముని సేవకై యిచ్చటికి వచ్చితిని."అనిచెప్పగా, నాతమ్మునిమాటవిని కుంభకర్ణుఁడు "మంచిపని చేసితివి నాయనా! అయిన నాయెదుట నీవు స్థిరుఁడుగా నిలువవలదు. ఇప్పుడు యుద్ధమున నాకు పరుడు నావాఁడు అనుభేదము తెలియచాలదు." అనిచెప్పెను. అదివిని విభీషణుఁడు శ్రీరామసన్నిధి కరిగెను. కుంభకర్ణుండు చేతులు కాళ్లతో కపులను నలిపివేయుచు వానరసేనలో సంచరించుచు సుగ్రీవునిఁజూచి త్రిశూలముచేగొట్టి సంతసముతో లంకకెత్తికొనిపోయెను. దారిలో సూరడించుకొని యాసుగ్రీవుండు గోళ్లచే శత్రువుయొక్క ముక్కు చెవులను కత్త

ఘునందనం। అభిదుద్రావ వినదన్ రాహుశ్చంద్రమసం యథా ॥౬౦॥ అపూరయచ్ఛితాగ్రైశ్చ సాయకైస్తద్రఘూత్తమః। శరపూరితవక్త్రోఽసౌ చుక్రోశాతిభయంకరః ॥౬౧॥ అథ సూర్యప్రతీకాశ మైంద్రం శరమనుత్తమం । ముమోచ తేన చిచ్ఛేద కుంభకర్ణశిరో మహత్ ॥౬౨॥ తదాఖే దేవవాద్యాని నేదుః కుసుమవృష్టిభిః। వవర్షురమరా రామం తుష్టువుర్వివిధైః స్తవైః ॥౬౩॥ పితృవ్యం నిహతం శ్రుత్వా పితరం చాతివిహ్వలం। రావణి స్సాంత్వయామాస త్వం మే పశ్యాద్య వై బలం ॥౬౪॥ ఇత్యుక్త్వా త్వరితం గత్వా మేఘనాదో నికుంభిలాం । రక్తమాల్యాంబరధరో హవనాయోపచక్రమే ॥౬౫॥ రథార్థం దివ్యశస్త్రార్థం జయార్థమభిచారకైః। యోగినీవటాధోఘూమ్యాం గుహాయాం సంస్థితో రహః ॥౬౬॥ తోయానిలానలవ్యాఘ్ర సర్పరాక్షసకంటకైః। ఆత్మనః పరితః కృత్వా పరిధీన్ సప్తమర్గమాన్ ॥౬౭॥ హోమకుండోర్ధ్వతస్సర్పం బద్ధ్వా కృష్ణమధోముఖం। రక్తపుష్పాంబరధరో రక్తచందనలేపితః ॥౬౮॥ రక్తపుష్పాక్షతాగుండా సర్షపైశ్చందనేక్షుభిః। ఖదిరామ్రపలాశోదుంబరభల్లాతకాష్టిభిః ॥౬౯॥ సమిద్భిర్హావయామాస సావి భల్లాతకఫలైరపి। అర్కనింబబీజపూర కృష్ణధుత్తూరరోచనైః ॥౭౦॥ అపామార్గబదరికా నలదాలకబంధుకైః । నరముండైశ్చ తక్ష్యామాంసై ర్విభీతకఫలాదిభిః ॥౭౧॥ సర్వఖుండైశ్చ మండూకైః త్వగ్దంతస్నాయులోమభిః । నానావనచరాణాం చ మాంసైరపి సమంత్రకం ॥౭౨॥ ఇత్థం చకార హోమం స నిమీల్య నయనే రహః। విభీషణోఽపి తం దృష్ట్వా హోమం ధూ

రించికొని రామసన్నిధికి వచ్చెను. వాఁడును ఊరివారిచే పరిహాసింపఁబడి మరల యుద్ధభూమికి వచ్చెను. రాముఁడును వానిఁజూచి తీక్ష్ణబాణములను ప్రయోగించెను. కుంభకర్ణుండును రాముని మీఁద చెట్లను కొండలను విసరివేయుచు వచ్చెను. అంతనారామచంద్రుఁడు వాయవ్యాస్త్రముచే వానిచేతులను ఆయుధంబులతోడ కత్తిరించెను. చేతులు లేక పోయినను శబ్దించుచు వచ్చుచుండగా చూచి, రాముఁడు రెండర్ధచంద్రబాణంబులచే వాని రెండుకాళ్లను కత్తిరించెను. అవి లంకాద్వారమున ఘోరనాదముంగలుగించి పడెను. చేతులుకాళ్లు తెగగొట్టినను కుంభకర్ణుఁడు బాడబముఖమువలె వక్త్రమును తెరచి కూతబెట్టుచువచ్చి రాహువు చంద్రునిఁదరిమినట్లు పట్టవచ్చెను. నిశితబాణంబులను వానినోటనించినను వాఁడు మిక్కిలి భయంకరుఁడై కేకవేయగా, నారాముఁడు సర్వోత్తమంబైన సూర్యునివలె వెలుగునట్టి యైంద్రాస్త్రమును ప్రయోగించి కుంభకర్ణునితలను పగలగొట్టెను అప్పుడాకాశంబున దేవవాద్యములు మ్రోగినవి. పూలవానగురిసెను. నానాస్తుతులచే దేవతలు కొనియాడిరి. ॥౧౬౩॥ పినతండ్రి పడిపోయిన సంగతిని విని చింతాక్రాంతుడైన తండ్రిని సమాధానముచేసి “నీవు నేడు నాయొక్క బలమును

లక్ష్మణుఁడు ఇంద్రజిత్తును సంహరించుట.

చూడుము” అని చెప్పి త్వరగా మేఘనాదుఁడు నికుంభిలకు వెడలి యోగినీ వృక్షమూలమున రహస్యముగా నొకగుహలో నిలచి రక్తపుష్పములను రక్తవస్త్రములను ధరించి రథముకొఱకును దివ్యాస్త్రములకొఱకును జయముకొరకును ఆభిచారిక మంత్రంబులచే యాగమున కా

ప్రారంభయావహం ॥౭౩॥ ప్రాహరామాయసకలం హోమారంభందురాత్మనః। సమాప్యతేచేద్ధోమోయం మేఘనాదస్యదుర్మతేః ॥౭౪॥ తదాఽజయ్యోభవేద్రామ మేఘనాదస్సురాసురైః। అతశ్శీఘ్రంలక్ష్మణేన ఘాతయిష్యామిరావణిం ॥౭౫॥ యస్తుద్వాదశవర్షాణి నిద్రాహారవివర్జితః। తేనైవమృత్యుర్నిర్దిష్టో బ్రహ్మణాఽస్యదురాత్మనః ॥౭౬॥ లక్ష్మణోయంయదాయోధ్యా పుర్యాస్త్వామనునిర్గతః। తదాదినిద్రాహారాదీన్ నజానాతిరఘూత్తమ ॥౭౭॥ సేవార్థంతవరాజేంద్ర జ్ఞాతంసర్వమిదంమయా। తతోరామాజ్ఞయాగత్వా లక్ష్మణేనవిభీషణః ॥౭౮॥ హనుమత్ప్రముఖైర్వీరై ర్యూథపైస్సర్వతోవృతః। లక్ష్మణందర్శయామాస హోమస్థానంనికుంభిలాం ॥ ౭౯ ॥ అంగదస్యాంధమారుహ్య వహ్ని శ్శస్త్రైణాధకంటకాన్। జ్వాలయామాససౌమిత్రి ర్జఘానరాక్షసాంచరైః ॥౮౦॥ గరుడాస్త్రేణసర్పాంశ్చ పర్వతాస్త్రేణదంష్ట్రిణః। అనలంశాంతమకరో త్పర్జన్యాస్త్రేణలక్ష్మణః ॥ ౮౧ ॥ ప్రాశయామాసహనుమాననిలంశ్చణమాత్రతః। జలంసంశోషయామాస వాయవ్యాస్త్రేణలక్ష్మణః ॥ ౮౨ ॥ పరిఘేష్వపినష్టేషు తత్రాదృష్ట్వారిపోఃస్థలం। యయావుత్పాటితంక్రోధా ద్ధనుమాన్న్యాగ్రోధవటం ॥ ౮౩ ॥తదాతాందర్శయామాస వట స్థాయోగినీగుహాం। గుహాపిధానపాషాణం హనూమాన్పాదఘట్టనైః ॥ ౮౪ ॥ చూర్ణీకృత్యగుహాసంస్థం మేఘనాదంవ్యదర్శయత్। తదాసమేఘనాదోపి త్యక్త్వాహోమంత్వరాన్వితః ॥ ౮౫ ॥ క్రోధావిష్టోరథేస్థిత్వా యయౌలక్ష్మణసంముఖం। శ

రంభించెను. తనకు చుట్టున దుర్గమంబులైన సప్తప్రాకారములను జల వాయు వహ్ని వ్యాఘ్ర సర్ప రాక్షస కంటకంబులచే కల్పించికొనెను. హోమకుండమునకు పైగా తలక్రిందుగా కృష్ణసర్పమునుకట్టి, రక్తపుష్ప రక్తచందనంబుల నలంకరించికొని- ఎఱ్ఱనిపూలు రక్తాక్షలు గురిగింజలు అవాలు రక్తచందనము చెఱకులు చెంద్ర మామిడి మోదుగు రాగి నల్లజీడ యెముకలు ఇట్టెసమిత్తులు మినుములు మాంసము జీడిపండ్లు జిల్లేడు వేప మాదీఫలము నల్లుయుమ్మెత్త నిమ్మ ఉత్తరేణి రేఁగు పద్మోత్పలాదులు అరికెలు బంధూకము నరమాంసము తలబుఱ్ఱలు తాఁడెపండ్లుమొదలైనవి పాముతునకలు కప్పలు చర్మములు దంతములు వెంటుకలు నరములు వివిధవన్యమృగ మాంసములు- వీట్లనన్నిటిని పెట్టికొని మంత్రములతోడ రహస్యమున కండ్లు మూసికొని హోమముచేసెను. విభీషణుఁడు ఆఘోరహోమధూమమును చూచి రామునితో “స్వామీ! దుష్టుఁడైన మేఘనాదునియొక్క ఈహోమంబు నెరవేరినపక్షమున, పిమ్మట వాఁడు దేవరాక్షసులచేతగూడ జయింపఁబడజాలడు. అందువలన త్వరగా లక్ష్మణునిచే నీరావణిని చంపించెదను. ఎవఁడు ౧౨ సంవత్సరములు నిద్రాహారములు లేకయుండునో వానివలననే వీనికి మృత్యువు గల్గునని బ్రహ్మశాసనము. ఈలక్ష్మణుఁడు నీవయోధ్యను వదలినదిమొదలుకొని యీవరకు నీసేవకై నిద్రాహారంబుల నెఱుఁగడు. మహారాజా! ఈసంగతిని నేనెఱుఁగుదును.” అని విన్నవించెను. మఱియు నట్లేయని శ్రీరామాజ్ఞనొంది విభీషణుఁడు హనుమంతుఁడే మొదలయిన సేనావీరులతోడ పరివృతుండై లక్ష్మణునికి హోమస్థానమగు నికుంభి

స్త్రైరస్త్రైః పర్వతాద్యైశ్చ ర్మర్మభిద్భిర్నిజోక్తిభిః ॥౮౬॥ చకారలక్ష్మణోనైవ యుద్ధంతత్తారకామయం । సౌమిత్రిరపి బాణౌఘై రథమశ్వాన్ ధనుర్ధ్వజం ॥౮౭॥ తద్దృఢంకవచంసూతం బిభేదక్షణమాత్రతః । తతస్సోఽన్యేనధనుషా ముక్త్వాబాణాన్ సహస్రశః ॥౮౮॥ పద్భ్యామేవ స్థితోభూమ్యాం చిచ్ఛేదకవచంరిపోః । తదాక్రుద్ధస్సౌమిత్రి ర్బాణేనేంద్రజితస్యహి ॥౮౯॥ సశరందక్షిణభుజం పాతయామాసతద్గృహే । తదాసవామహస్తేన మేఘనాదోఽతివిహ్వలః ॥౯౦॥ సుద్రావలక్ష్మణంహంతుం ధృత్వాశూలమనుత్తమం । తంచాపిమార్గణేనైవ సశూలంవామసత్కరం ॥౯౧॥ మేఘనాదస్యసౌమిత్రి శ్ఛిత్త్వారావణసన్నిధౌ । పాతయామాసలంకాయాం తదద్భుతమివాభవత్ ॥౯౨॥ తదావ్యాదాయస్వముఖం రావణిర్లక్ష్మణంయయౌ । లక్ష్మణోఽపిశరందివ్యం రామనామాంకితంశుభం ॥౯౩॥ ముమోచరఘువీరస్య కృత్వాచింతనమాదరాత్ । సశరస్సశిరస్త్రాణం శ్రీమజ్జ్వలితకుండలం ॥౯౪॥ ప్రమత్తస్యేంద్రజితఃకాయాత్పాతయామాసతచ్ఛిరః । తతఃప్రముదితాదేవా స్సౌమిత్రింపరితుష్టువుః ॥౯౫॥ పుష్పాణివికిరంతోవై చక్రుర్నీరాజనంముహుః । గతశ్రమస్సౌమిత్రి శ్శంఖమాపూరయద్రణే ॥౯౬॥ శ్రుత్వాసీతాశంఖనాదం త్రిజటాంప్రేష్యసాదరం । శుశ్రావసకలంవృత్తం తద్వాక్యాత్ప్రీతమానసా ॥౯౭॥ తతస్తన్మేఘనాదస్య శిరస్సంగృహ్యమారుతిః । రాఘవాయదర్శయితుం త్వరయామాసలక్ష్మణం ॥౯౮॥ తదాసవానరైర్యుక్తోఽంగదస్థస్సవిభీషణః । నానా

లనుచూపెను. అంత నాలక్ష్మణుఁడు అంగదునిమీఁదనెక్కి ఆగ్నేయాస్త్రముచే ముండ్లను కాల్చివేసెను, రాక్షసులను సంహరించెను. గారుడాస్త్రముచే సర్పంబులను పర్వతాస్త్రముచే పులులను పర్జన్యాస్త్రముచే నగ్నిని శాంతిపరచెను. ఆంజనేయుఁడు నిమిషమున వాయువును పీల్చివేసెను. లక్ష్మణుఁడు వాయవ్యాస్త్రముచే నీళ్లను శోషించెను. ఇట్లు కోటలను ధ్వంసము చేసినను శత్రువుయొక్క స్థానము కానరానందున క్రోధమునంది హనుమంతుఁడు యోగినీవటమునే పెగిలింపఁ బూనెను. అప్పు డవ్వటవృక్షంబున నున్న యోగిని యాగుహను చూపెను. హనుమంతుఁడు ఆగుహాద్వారమున పెట్టినపాషాణమును కాళ్లతో త్రొక్కి పుడిచేసి గుహలో నున్న మేఘనాదుని వెరపించెను. అపుడా మేఘనాదుండును హోమమునువదలి వేగముగా నాగ్రహముతోడ రథమునెక్కి లక్ష్మణుని యెదుటవచ్చెను. శస్త్రాస్త్రంబులచేతను పర్వతాదులచేతను ములుమాటలచేతను మేఘనాదుఁడు లక్ష్మణునితోడ దారుణయుద్ధము నొనరింపఁగా; సుమిత్రాత్మజుఁడును బాణసమూహముచే క్షణమాత్రమున వాని రథమును గుఱ్ఱములను ధనుస్సును ధ్వజమును దృఢకవచమును సారథిని కత్తిరించెను. అంత నింద్రజిత్తు వేరే ధనుస్సు నందుకొని నేలమీఁదనేనిలచి వేలకొలది బాణములను ప్రయోగించుచు లక్ష్మణుని కవచమును కత్తిరించెను. అందుచే నాగ్రహించిన లక్ష్మణుఁడు బాణంబును పట్టియున్న దక్షిణబాహువును ఛేదించి వానియింట పడవేచెను. వాఁడు మహాశూలము నెడమచేతితో బూని సౌమిత్రిని సంహరింపవలెనని ముందు నుగ్గివచ్చెను. లక్ష్మణుఁడు శూలసహితమగు వాని యెడమభుజమును

వాద్యనినాదైశ్చ సౌమిత్రీ రాఘవం యయౌ ॥ ౯౯ ॥ నత్వా తం దర్శయామాస మేఘనాదస్య తచ్ఛిరః । తద్దృష్ట్వాలింగ్య సౌమిత్రిం రామస్తుష్టోఽభవత్తదా ॥ ౨౦౦ ॥ రావణోఽపి భుజం దృష్ట్వా శ్రుత్వా పుత్రవధం తథా । పపాత పుత్రదుఃఖేన సభాయాం మూర్ఛితో భువి ॥ ౧ ॥ క్రోధాత్సఖడ్గముద్యమ్య యయౌ హంతుం విదేహజాం । సుపార్శ్వో నామ మేధావీ మంత్రీ తం సన్న్యవారయత్ ॥ ౨ ॥ సఖడ్గం తత్కరం ధృత్వా స్వహస్తేన త్వరాన్వితః । ఊచే నీతిసంయుక్తం వచనం రావణం తదా ॥ ౩ ॥ కథం నామ దశగ్రీవ క్రోధాత్ స్త్రీవధమిచ్ఛసి । అస్మాభిః సహితో యుద్ధే హత్వా రామం సలక్ష్మణం ॥ ౪ ॥ ప్రాప్స్యసే జానకీం శీఘ్రమిత్యుక్తస్స న్యవర్తత । సులోచనాపి సంతస్య భుజం కేయూరభూషితం ॥ ౫ ॥ దృష్ట్వా స్వనాథస్య పురతః పతితం భువి । తదా విలాపం కుర్వంతీ స్పృష్ట్వా తత్పాణినా ॥ ౬ ॥ భుజోఽపి సాంత్వయన్ తాం స లేఖ్యమ్యాం నఖేన హి । స్వనాశం హి తతః కరః ప్రాహ మా ఖేదం భజ భామిని ॥ ౭ ॥ సాక్షాన్నృశిరో రాఘవాత్తే హతోఽహం ముక్తిమాగతః । త్వం చాపి గత్వా శీఘ్రం సత్వా యాస్య నిశ్చయః ॥ ౮ ॥ తత్వాం దాస్యతి రామోఽపి తేనాగ్నిం విశ యాహి మాం । సులోచనాపతిత్వా సా లిఖితం తత్కరోదితం ॥ ౯ ॥ దృష్ట్వా దృష్ట్వా రావణాయ మందోదర్యైర్విభూషితా । యయౌ రామం శిబిరం యా తా దృష్ట్వా వానరోత్తమాః ॥ ౧౦ ॥ సీతేయం రావణేనాద్య భయాద్రామం విసర్జితా । ఇతి మత్వా దుద్రువుస్తే సీతాయా దర్శనేచ్ఛయా ॥ ౧౧ ॥ శిబిరాం ప్రవేష్టయామా

రావణునియెదుటఁ బడునట్లు ఛేదించెను. అది చిక్కి యా [illegible] పినది. అంత నా మేఘనాదుఁడు తననోరు తెరచికొని లక్ష్మణుని మ్రింగవచ్చెను. సౌమిత్రి యంతట శ్రీరామనామాంకితమయిన దివ్యమంగళ బాణంబునొకటిని రాముని ధ్యానించి ప్రయోగించెను. ఆ శరము కవచకుండలాలంకృతంబగు మేఘనాదుని మస్తకంబును త్రుంచివైచెను. అంత నానందించిన దేవతలు లక్ష్మణునిం గొనియాడిరి. మఱియును స్తోత్రంబుచు పూలవాన కురిపించిరి. విశ్రాంతినొందుచు లక్ష్మణుఁడు శంఖనాదమొనరించెను. జానకి యానాదమును విని త్రిజటనంపి యావృత్తాంతము నెఱిఁగి సంతోషించెను. అంత నాంజనేయుఁడు మేఘనాదుని తలనెత్తికొని శ్రీరామునికి చూపుటకై సౌమిత్రిని త్వరపెట్టెను. అపుడు లక్ష్మణుఁడు అంగదుని మీఁద నెక్కి కపులతోడను విభీషణునితోడను అనేక వాద్యంబులతోను శ్రీరామునివద్దికివచ్చి నమస్కరించి యాతలను చూపెను. దానింజూచి రాఘవుండు తమ్ముని నాలింగించి పొంగెను ॥౨౦౦॥ అప్పుట

## సులోచన సహగమనముచేసి తనపతితోడ వైకుంఠమున కరుగుట.

రావణుండు భుజమును చూచి పుత్రవధను విని సభలో మూర్ఛనొందయ్యె [illegible] యునట్లే లేచి క్రోధావిష్టుఁడై కత్తినెత్తికొని జానకిని సంహరించుటకై పోయెను. అప్పుడు సుపార్శ్వుఁడను బుద్ధిమంతుఁడైన మంత్రి వాని ఖడ్గహస్తమును త్వరగా పట్టుకొని "దశకంఠుఁడా కోపముచే నీవేమని స్త్రీవధ నిచ్ఛించెదవు? మాతోడ నీవు యుద్ధమున రామలక్ష్మణులను సంహరించి త్వరగా జానకి నందుదువుగాక" అని నీతిసమ్మతంబైన యథోచితాలాపముచే నివారించెను. సులోచన

సు జ్ఞాత్వాతాంతుసులోచనాం । శిబికావాహకాస్యైనాఽ యయౌ శ్రీరాఘవం పునః ॥ ౧౨ ॥ సులోచనాపి శ్రీరామం ననామ శిరసా ముహుః । భర్తుశ్శిరః కాంక్షమాణాం తాం రామో వాక్యమబ్రవీత్ ॥ ౧౩ ॥ కృపయా తవ భర్తారం కరోమ్యద్య సజీవితం । మా విశస్వాద్య వహ్నింత్వం రోచతే చేద్వదస్వమాం ॥ ౧౪ ॥ తదా సా ప్రాహ శ్రీరామం పునస్స్వామి త్రిహాస్తతః । కుతో భవేత్తన్మరణం మోక్షదం జీవయస్వమా ॥ ౧౫ ॥ ఇత్యుక్త్వా రాఘవం నత్వా పస్మితం కపి వాక్యతః । కృత్వా పత్యుశ్శిరస్తత్ర లబ్ధ్వా భర్తృకళేబరం ॥ ౧౬ ॥ లంకాయాస్తా సమానీయ భుజౌ గత్వా నికుంభిలాం । భర్తృదేహేన సంయోజ్య వివేశాగ్నిం యథావిధి ॥ ౧౭ ॥ సులోచనా దివ్యదేహా వైకుంఠం పతినా యయౌ । రావణోపి సుహృన్మిత్రైః పునర్యోద్ధుం యయౌ రణం ॥ ౧౮ ॥ తతో రామేణ నిహతా స్సర్వే తే రాక్షసా యుధి । లంకాయాం రావణః క్షిప్త శ్శరేణ రాఘవేణ సః ॥ ౧౯ ॥ తతః కృత్వా రామశిరః కృత్రిమం మయహస్తతః । యయౌ సీతాం దర్శయితుం రావణోఽశోకకాననం ॥ ౨౦ ॥ ఏతస్మిన్నంతరే బ్రహ్మా బోధయామాస జానకీం । కృతమస్తి రావణేన కృత్రిమం రామసచ్ఛిరః ॥ ౨౧ ॥ తద్దృష్ట్వా మా భజస్వాద్య ఖేదం త్వమధునాఽబలే । ఇతి సంబోధ్య తాం సీతాం బ్రహ్మాంతర్ధానమాయయౌ ॥ ౨౨ ॥ రావణోపి సమాగత్య దర్శయామాస తచ్ఛిరః । సీతాం ప్రాహ హతో రామస్త్వధునా త్వం

యను మేఘనాదుని పత్ని తనయెదుటపడిన కేయూరమండితంబును బాణాలంకృతంబునయిన తనకాంతుని భుజమునుచూచి వానిపౌరుషంబులను స్మరించుచు ప్రలాపించెను. ఆభుజంబును ఆమెను సమాధానపరచుచు తన రక్తాక్షరములను బాణముచే వ్రాసి "దుఃఖింపవలదు. కాంతా! ప్రత్యక్షమూర్తియైన శేషుని బాణాఘాతముచే నేను ముక్తినందితిని. శ్రీరామసన్నిధికి నీవునుపోయి నమస్కరించి నాతలను వేడుము. రాముఁడు దానిని నీకిచ్చును. దానితోడ నగ్నినిప్రవేశించి నావద్దికిరమ్ము." అని యుపదేశించెను. సులోచన దానింజదివికొని సంతసించి సాలంకృతగా నత్తమామల యనుజ్ఞనొంది పల్లకినెక్కి శ్రీరామ సన్నిధికివచ్చెను. దానిని చూచి వానరవీరులు "రావణుఁడు వెరచి శ్రీరామసన్నిధికి సీతనంపించెను." అనిఎంచి సీతా దర్శన కుతూహలముచే పరుగెత్తిరి, ఇట్లువచ్చి పల్లకినిచుట్టుకొని వాహకులవలన సులోచన యని యెఱిఁగి మరల రామసన్నిధికివచ్చిరి. సులోచనయును శ్రీరామునిఁ దనతలతో మ్రొక్కి మ్రొక్కి పడి శిరస్సునువేడగా; శ్రీరాఘవుఁడు "దయతో నీపెనిమిటిని బ్రతికించి యిచ్చెదను. నిప్పులోపడవలదు. నీకిదియిష్టమా!" అని యనుగ్రహించెను. అందుకామె "మోక్షప్రదంబగు మరణంబు మరల లక్ష్మణునిచేత నేలకలుగవలెను? స్వామీ! మీరు బ్రతికింపవలదు." అని నమస్కరించి, కపిమాటచే, మగని మందహాసయుతమగు మస్తకమును తీసికొని లంకనుండి యారెండు భుజములను తెప్పించి నికుంభిలకువెడలి పతిదేహముతో నన్నిటినిచేర్చి యథావిధిగా నగ్నినిప్రవేశించెను. అంతనాసులోచన దివ్యదేహమునొంది పతితోడ వైకుంఠమునకు పోయెను॥ ౨౧౮॥ రావణుండు మిత్రపరివారంబులతోడ మరల యుద్ధమునకై రణాంగణమునకు

భజస్వమాం॥ ౨౩॥ తదాసాధోముఖీప్రాహ త్వైవాహంశిరాంసిహి। రామబాణైశ్చపశ్యామి పతితానిరణాంగణే॥ ౨౪ ॥ ఇతితద్వాక్యరాఘాత తాడితస్సదశాననః। యయౌతూష్ణీంస్వకంగేహం లజ్జయాఽవనతస్తదా॥ ౨౫ ॥ అథరామాజ్ఞయాసర్వే లంకాంప్రాసాదమండితాం। ఇషీకాచూడహస్తాస్తే వానరాఃకోటిశఃక్షణాత్ ॥ ౨౬॥జ్వాలయామాసుస్సర్వత్ర దత్వావహ్నింముహుర్ముహుః। తదాకోలాహలశ్చాసీ ల్లంకాదాహేపురాయథా ॥ ౨౭॥ దగ్ధాంస్వనగరీందృష్ట్వా స్వగృహాణ్యపిరావణః। దృష్ట్వాదగ్ధానికపిభిర్మేఘాస్త్రంసస్పృజేజవాత్ ॥ ౨౮ ॥ తేనాసీదనలశ్శాంతి స్తద్ద్రుష్ట్వాకపయోయయుః। తతస్సరావణ శ్శుక్రవచనాద్రహసిస్థితః ॥౨౯॥ గుహాంప్రవిశ్యచైకాంతే మౌనీహోమంప్రచక్రమే। లంకాద్వారకపాటాది బధ్వాసర్వత్రయత్నతః ॥ ౨౩౦ ॥ హోమద్రవ్యాణిసంగృహ్య యాన్యుక్తానిమయాపురా। రక్తాంబరధరో ముండమాలీప్రేతాసనస్థితః ॥ ౩౧ ॥ పరిస్తీర్యాథశస్త్రాణి హోమకుండంసమంతతః। ఆదశాహబాలకానాం శిరోభిర్మాంసలోహితైః ॥ ౩౨॥ ఏవంసరిపుఘాతార్థం చకారహవనంరహః॥ ఉత్థితంధూమ్రమాలోక్య రామంప్రాహవిభీషణః ॥ ౩౩ ॥ యదిహోమసమాప్తిస్స్యాత్తదాజేయోభవేదయం। తతోరామాహరీన్సర్వా న్ప్రేషయామాససాదరం ॥ ౩౪ ॥ ప్రాకారంలంఘయిత్వాతే గత్వారావణమందిరం। హ

(రావణుఁడు సీతకుమాయజూపి విముఖుండై యాగవిఘ్నమునొంది మరలరణమునకువచ్చుట.)

వచ్చెను. అంతనా రాక్షసులందరును శ్రీరామునిచే సంహరింపఁబడిరి. రామబాణముచే నెగరగొట్టబడి రావణుఁడు లంకలోపడెను. పిదప నారావణుఁడు మయునిచేత కృత్రిమరామ శిరమును చేయించి సీతకు చూపుటకై అశోకవనమునకు వచ్చెను. అంతలో బ్రహ్మదేవుఁడువచ్చి సీతకు "అమ్మా! రావణుఁడు మోసముచేనొక శ్రీరామ మస్తకంబును చేయించికొని వచ్చుచున్నాడు. ఇప్పుడు దానినిచూచి చింతింపవలదు." అనిబోధించి యంతర్హితుఁడయ్యె. రావణుఁడువచ్చి యాతలనుచూపి, "ఇదిగోరాముఁడు చచ్చెను. ఇప్పుడైనను నన్నుభజింపుము." అనిపలికెను. అందుకామె తలవంచికొని "శ్రీరామబాణంబులచే కత్తరింపఁబడి రణమునపడిన నీతలలనే చూచెదను." అనిచెప్పగా నాపోడుపుడుమాటలచే లజ్జితుఁడై యూరక తనయింటికివచ్చెను. పిమ్మట శ్రీరామాజ్ఞచే నందరును తలమీఁదను చేతులలోను కసవుమోపులనెత్తుకొని కోట్లకొలది కోతులుపోయి ప్రాసాదాలంకృతంబగు లంకను నిప్పుముట్టించి తగలబెట్టిరి. మునుపు లంక కాలిన ప్పుడెట్లో అట్లు కోలాహలమాయెను. అపుడు తనయూరు కాలుచుండుటను చూచి రావణుఁడు మేఘాస్త్రమును ప్రయోగించి నిప్పును చల్లార్చెను. అందువలన నిప్పుచల్లారగా నావానరులు వెడలిరి. ఆపిమ్మట రావణుఁడు శుక్రునిమాటమీఁద రహస్యముగా నొంటరిగా గుహలో ప్రవేశించి మౌనముతో హోమమునకారంభించెను. లంకయొక్క వాకండ్లతలుపులన్నియును మూయబడెను. పార్వతీ! నేనుమునుపు చెప్పినదే హోమద్రవ్యములు. అపుడు నెత్తురులోమునిగి తలబుఱ్ఱల హారమును వేసికొని ప్రేతాసనాసీనుఁడై హోమకుండముచుట్టు శస్త్ర

త్వా రాక్షసవృందం తద్గుహారక్షణతత్పరం ॥ ౩౫ ॥ న దదృశుర్గుహాద్వారం యత్ర హోమం చకార సః । తతశ్చ సరమా నామ ప్రభాతే కరసంజ్ఞయా ॥ ౩౬ ॥ విభీషణస్య భార్యా తాన్ హోమస్థానమసూచయత్ । గుహాపిధానపాషాణమంగదః పాదఘట్టనైః ॥ ౩౭ ॥ చూర్ణయిత్వా రావణాయ తాడయామాస ముష్టినా । వానరాస్తేపి తం వృక్షైస్తాడయామాసురాదరాత్ ॥ ౩౮ ॥ తదా తే వానరా దృష్ట్వా తూష్ణీమేవస్థితం రిపుం । సమానయన్ కేశపాశే ధృత్వా మందోదరీం శుభాం ॥ ౩౯ ॥ విలపంతీం ముక్తనీవీం విహ్వలాం వ్యాకులాం ముకీం । దృష్ట్వా త్యక్త్వా తదా హోమముదతిష్ఠత్త్వరాన్వితః ॥ ౪౦ ॥ తతస్తే వానరాస్సర్వే యయుః శ్రీరాఘవాంతికం । తతో మందోదరీ ప్రాహ కురు త్వం వచనం మమ ॥ ౪౧ ॥ దత్వా సీతాం రాఘవాయ రాజ్యే కృత్వా విభీషణం । తపశ్చర్యాం మయారణ్యే కర్తుమర్హసి వై సుఖం ॥ ౪౨ ॥ తత్తస్యా వచనం శ్రుత్వా తాం స ప్రాహ దశాననః । రామో విష్ణుశ్చ మా సీతా జానామి ప్రాణవల్లభే ॥ ౪౩ ॥ రామహస్తాద్వధం లబ్ధుం హృతా సీతా పురా మయా । రామహస్తాత్త్యక్తదేహో గచ్ఛామి పరమం పదం ॥ ౪౪ ॥ త్వయా కార్యా క్రియా మే హి ప్రవిశ స్వానలం తతః । తతస్సుఖం మయా యుక్తా గమిష్యసి పరం పదం ॥ ౪౫ ॥ ఇత్యుక్త్వా ప్రయయౌ యోద్ధుం రథే స్థిత్వా త్వరాన్వితః । రాజగృహాద్వినిర్గచ్ఛన్నగ్రే ముండీవిలోకితః ॥ ౪౬ ॥ ముకుటః పతితశ్ఛత్ర

ములను పరచి పదిదినములవరకు మాంసముచే నెత్తుటనివిద్ధమైన బాలులతలలచే శత్రునాశమునకొఱకు హోమము చేయుచుండెను. అప్పుడు గగనమున పొగకమ్మిన విభీషణుఁడు దానినెఱిఁగి రామునితో "స్వామీ! ఈహోమము ముగిసెనా వీఁడు జయింపఁబడడు." అని చెప్పగా, శ్రీరఘునందనుఁడు వానరుల నందరిని పంపించెను. వారు ప్రాకారమునుదాటి రావణుని యింటికివెడలి యాగుహారక్షణనిమగ్నులైన రాక్షసులను సంహరించి హోమము చేయుచుండు గుహను కనుగొనకపోయిరి. అంత నచ్చట సరమయను విభీషణపత్ని తెల్లవారి చేతిసన్నచే వారికి హోమస్థానమును కనుపరచెను. గుహయొక్క మూతరాయిని అంగదుండు కాళ్లతోఁ త్రొక్కి-పొడిజేసి లోనుగ్గి రావణునికి ఒకగ్రుద్దులిచ్చెను. ఆవానరులును చెట్లతోపడమొత్తిరి. అప్పుడు కపులు ఊరకయుండు శత్రువునుచూచి మందోదరిని సిగబట్టి యీడ్చికొనివచ్చిరి. చీరెవీడి రవికెవిడిగి విలపించుచు వచ్చుచుండు మందోదరినిచూచి రావణుఁడు హోమమును చాలించి లేచెను. కపులు శ్రీరామసన్నిధికి వచ్చిచేరిరి. అపుడు మందోదరి రావణునితో "నాథా! నా మాటవినుము. రామునికి సీతను సమర్పించి విభీషణునికి రాజ్యపట్టమునిచ్చి, సుఖముగానా తోడ వనమున తపమునకారంభించుము." అని ప్రార్థింపగా; నందుకు రావణుఁడు "శ్రీరాముఁడే శ్రీమన్నారాయణుఁడు, సీతయే రమాదేవి, అని, ప్రాణప్రేయసీ! నేనెఱుఁగుదును. రామునిచే మరణమునందుటకై నేనుమునుపు సీతనపహరించితిని. రామునిచేతజచ్చిన నేను పరమపదమునందుదును. నీవు నాయొక్క క్రియలను పూర్తిఁజేసి పిమ్మట నగ్నిప్రవేశము జేసి నాతోడ పరమపదమునందుదువు. పిమ్మట త్వరగల్గిన సుగ్రీవాది వీరవరులు సుస్నానముచేసి దివ్య

స్సంవిగ్నో రావణోఽవ్యాది । తతోఽయాయా రణభువం వవర్షానిశితైశ్శరైః ॥ ౪౭ ॥ విధాయకృత్రిమాం సీతాం భయే న స దశాననః । పశ్యతాం వానరాణాం చ స్వరథే తాం జఘాన వై ॥ ౪౮ ॥ దివ్యేన శితఖడ్గేన తద్దృష్ట్వా తే ప్లవంగమాః । హాహేత్యుక్త్వా సుఃఖితాస్తే యయూ రామం నివేదితుం ॥౪౯॥ తావద్బ్రహ్మా సమాగత్య రామాదీన్ప్రాహ సాదరం । కృత్రిమేయం హతా సీతా మా ఖేదం భజతాఽద్య హి ॥౫౦॥ తతోఽంతర్ధానమగమద్విధిస్తేపి ప్లవంగమాః । రామాద్యా బ్రహ్మవాక్యేన తుష్టా యుద్ధాయ నిర్యయుః ॥ ౫౧ ॥ తదా స మాతలిశ్శీఘ్రం దేవేంద్రవచనాద్రథం । శస్త్రాస్త్రవాజిసహిత మణిధ్వజశోభితం ॥ ౫౨ ॥ వరచ్ఛత్రసమాయుక్తం రాఘవాగ్రే న్యవేదయత్ । తమారుహ్య తదా రామశ్చకార కదనం మహత్ ॥ ౫౩ ॥ ఆగ్నేయేన తదాగ్నేయం దైవం దైవేన రాఘవః । అస్త్రం రాక్షసరాజస్య జఘాన పరమాస్త్రవిత్ ॥ ౫౪ ॥ తతస్తు ససృజే ఘోరం రాక్షసస్సార్పమస్త్రవిత్ । రామస్సర్పం స్తతో దృష్ట్వా సౌపర్ణాస్త్రం ముమోచ సః ॥ ౫౫ ॥ అస్త్రైః ప్రతిహతే యుద్ధే రామేణ దశకంధరః । పర్జన్యం ససృజం ఘోరం వాయవ్యాస్త్రేణ రాఘవః ॥ ౫౬ ॥ తదస్త్రం వినివార్యాసౌ వహ్న్యస్త్రం ససృజే పునః । పర్జన్యాస్త్రేణ పౌలస్త్యశ్చకార విఫలం తదా ॥ ౫౭ ॥ నాగానామయుతం తురంగనియుతం సార్ధం రథానాం శతం । పత్తీనాం శతకోటినాశసమయే త్వేకా కబంధనృతిః ॥ ఏవం కోటికబంధనర్తనవిధౌ చేకో ధ్వనిః కింకిణీ । త్వంశత్వాః ప్రహరార్ధతో రఘుపతేః కోదండఘం

అని యుపదేశించి రథారూఢుండై త్వరగా యుద్ధమునకు వెడలెను. రాజమందిరంబునుండి వెడలి మొదట ముండినిచూచెను.కిరీటముపడిపోగా మదిని చింతనొందుచునే యుద్ధభూమికి వెడలి తీక్ష్ణశరవర్షముఁ గురిపించెను. మఱియు భయముచే నారావణుఁడు కపులందరు చూచుచుండగా కృత్రిమసీతను కల్పించి తనరథమున ఖడ్గముచే గొట్టిదానిఁజంపెను. దానింజూచి కపులు హాహాకారముజేయుచు నాసంగతిని శ్రీరామునికి విన్నవించుటకై పరుగెత్తిరి. ఆవేళకు బ్రహ్మదేవుఁడువచ్చి సాదరముగా రామాదులతో "ఈకృత్రిమ సీతచంపఁబడెను. ఇప్పుడు మీారుదుఃఖింపవలదు." అనిచెప్పి యంతర్ధానమునొందెను అకపివీరులును శ్రీరామాదులును బ్రహ్మ వాక్యముచే నానందించి యుద్ధమునకు వెడలిరి.అప్పుడు ఇంద్రాజ్ఞనొంది మాతలివజ్రధ్వజంబును దివ్యచ్ఛత్రమును శస్త్రాస్త్రంబులును దివ్యాశ్వంబులునుగల రథమును తీసికొనివచ్చి శ్రీరామున కర్పించెను.దానినెక్కి రఘువీరుఁడు యుద్ధమున కారంభించెను సర్వాస్త్ర సారవిదుండగు రాముఁడు అగ్నేయాస్త్రమున నాగ్నేయాస్త్రమును దైవాస్త్రంబున దైవాస్త్రంబును ఇట్లే రావణునియస్త్రంబులనన్నిటిని ఉపసంహారము చేయుచురాగా నాదశాస్యుఁడు మహానాగాస్త్రమును ప్రయోగించి గారుడా[illegible] నాశముకాగా,మరల నాగ్నేయాస్త్రమును ప్రయోగించి పర్జన్యాస్త్రముచే న[illegible]స్త్రంబులు విఫలంబులని నిరాసఁజేసి కొనెను. ఇట్లు నడచుచుండు ఘోరస[illegible] లేనుఁగులు లక్షగుఱ్ఱములు నూటయేబదిరథములు నూరుకోట్లుపదాతు[illegible]ందగా నొకకబంధనర్తనంబు. ఇట్టి కోటికబం

టారణే ॥ ౫౮ ॥ తదాఖేకౌతుకంద్రష్టుం సమాజగ్ముస్సురాముదా । గంధర్వాఃకిన్నరాయక్షా విమానశతసంస్థితాః॥ ౫౯ ॥ తదాశనిధ్వజంరమ్యం బాణైశ్చిచ్ఛేదరావణః । తంద్రృష్ట్వారామచంద్రోపి ధ్వజహీనంరథంనిజం ॥౬౦॥ మారుతింప్రాహవేగేన క్షణంతిష్ఠధ్వజోపరి । తథేత్యుక్త్వామారుతిస్స తాలముత్పాట్యవేగతః ॥ ౬౧ ॥ కృత్వారామరథేదివ్యే తస్మింస్తస్థౌస్వయంముదా । తంమారుతిధ్వజంద్రృష్ట్వా రావణస్సమరాంగణే ॥ ౬౨ ॥ తాలంచ్ఛత్రంమాతలినం తురగాన్వాయునందనం । ఐంద్రంధనుస్తచ్చిచ్ఛేద నవబాణైస్త్వరాన్వితః॥ ౬౩ ॥ వాతాత్మజమాతలినౌమూర్ఛితౌపతితౌభువి । క్షణమాత్రేణస్వస్థోభూత్తదాసవాయునందనః ॥ ౬౪ ॥ తదారామోవాయుపుత్ర స్కంధస్థిత్వారణాజిరే । చకారతుములంయుద్ధం రావణేనభయావహం ॥౬౫॥ రావణఃపరఘేణైవ సంతాడ్యమారుతింహృది । చకారమూర్ఛితంవేగా త్పపాతసపునర్భువి ॥ ౬౬ ॥ తదాసస్మారరామోఽపి స్వరథంసమరాంగణే । తావద్రథఃక్షణాదేవా యయౌఖాదగ్రతఃస్థితః ॥ ౬౭ ॥ దారుకస్సారథిర్యత్ర యత్రశస్త్రాణ్యనేకశః । యత్రాసౌతేగదాపద్మే యత్రాస్తిగరుడోధ్వజే ॥ ౬౮ ॥ యస్మిన్ శైబ్యశ్చసుగ్రీవ స్తథాచైవబలాహకః । మేఘపుష్పశ్చచత్వారో వాయువేగాస్తురగోత్తమాః ॥ ౬౯ ॥ యత్రచ్ఛత్రంవరందివ్యం హేమదండంవిరాజతే । చామరేద్వేశుభేయత్ర శార్ఙ్గాంపై యత్రసద్ధనుః ॥౭౦॥ తంరథంరాఘవోదృష్ట్వా పరిక్రమ్యప్రణమ్యచ । ఆరురోహముదాయుక్త శ్శార్ఙ్గం

ధనాట్యమున నొక్కకిరుగంటమొక్క శబ్దము. శ్రీరామునియొక్క ధనుర్దండమునందలి గంటయిరువది మార్లు రణరంగమున నరజాములో మ్రోగుచుండినవి. ఇంక శ్రీరామపరాక్రమమహిమ యెంతటిదనవచ్చును? పార్వతీ! వినుము; అప్పుడాకాశమున వింతజూచుటకు సంతసముతో దేవతలు చేరిరి. నూరారు విమానంబులలో గంధర్వ కిన్నరయక్షులు విరాజించుచుండిరి. అప్పుడు రావణుండు వజ్రధ్వజమును కత్తరించెను. అంత రాముఁడు మారుతిని "నీవు క్షణకాలము రథము మీఁద ధ్వజముగా నుండుము" అని యాజ్ఞాపించెను. అట్లేయని యతఁడు రామరథమున తాళవృక్షమును నెట్టి దానిమీఁద తానుధ్వజముగా నిలిచెను. అయ్యాంజనేయధ్వజమును చూచి రణమున రావణుండు తొమ్మిది బాణములను ప్రయోగించి తాలమును ఛత్రమును సారథియగుమాతలిని మారుతిని గుఱ్ఱములను ఇంద్రునిధనుస్సును త్వరగాపడమొత్తెను. మారుతిమాతలులు మూర్ఛితులై పడిరి. వెంటనే క్షణకాలములో నాంజనేయుఁడు మేల్కొనెను. శ్రీరాముఁడపుడు వాయుపుత్రుని భుజములపై యెక్కికొని రణరంగమున దారుణంబగు యుద్ధమొనర్చెను. మరల రావణుండు [illegible]నపరిఘాయుధముచే నాంజనేయుని యెదలో గ్రుద్దెను. అంతనతఁడు నేలబడి మూర్ఛితుఁడయ్యె ॥ ౭౬ ॥ పిమ్మట శ్రీ[illegible]ముద్రుఁడు తనదివ్యరథమును స్మరించెను.

దివ్య వైష్ణవరథమునెక్కి శ్రీర[illegible] [illegible]వణుని సంహరించుట.

వెంటనే అది గగనమున నావిర్భవించివచ్చె[illegible] [illegible]ల్యముచే గరుడధ్వజముచే శైబ్య సుగ్రీవ బలాహక మేఘపుష్పంబులను పవన[illegible] [illegible]గుగుఱ్ఱములచే శస్త్రపరికరం

స్యంధనుతాదదే ॥ ౭౧ ॥ తతోరామశ్శరైస్తీక్ష్ణైర్దశాననశిరాంసిసః ॥ ౭౩ ॥ చిచ్ఛేదతానిగగనే గత్వాతోపయుం
తానిహి । రామహస్తాన్న్యతిజాతాన్యస్మాకంచేతివిచింత్యచ ॥ ౭౪ ॥ వందనంకర్తుకామాని గగనాచ్చరణాజిరే।
సన్నితానిపతంతిస్మ రాఘవస్యపదోపరి ॥ ౭౫ ॥ రామశ్శిరాంసిదృష్ట్వాథ విదీర్ణాస్యానిఖాత్పునః । మాంహంతుంప్ర
ద్రవంతీతి మత్వాభీత్యావ్యతాడయత్ ॥ ౭౬॥ శరాఘైశ్శతశశ్శీఘ్రం తదద్భుతమివాభవత్ । శతమేకోత్తరంఛిన్నం
శిరసాంచైకవర్చసాం ॥ ౭౭ ॥ శతమూర్ధ్నోరావణస్య చైకోత్తరసహస్రకం । ఛిన్నంతత్కల్పభేదేన వదంతీత్యపి
కేచన ॥ ౭౮ ॥ సదృష్ట్వారావణస్యాంతం విభీషణమతేనసః । నాభిదేశేఽమృతంతస్య కుండలాకారసంస్థితం ॥౭౯॥
పావకాస్త్రేణతచ్ఛీఘ్రం శోషయామాసరాఘవః । తతశ్శిరాంసిబాహూంశ్చ చిచ్ఛేదరావణస్యసః ॥ ౮౦ ॥ ఏకేన
ముఖ్యశిరసా బాహుభ్యాం రావణోబభౌ । తయోర్యుద్ధమభూద్ఘోరం తుములంరోమహర్షణం ॥ ౮౧ ॥ తతోదా
రుకవాక్యేన మర్మదేశేవ్యతాడయత్ । బ్రహ్మాస్త్రేణరఘుశ్రేష్ఠ స్సముచ్ఛేదదశకంధరం ॥ ౮౨ ॥ సశరోహృదయంభి
త్త్వా హృత్వాతుదశాననం। రామతూణీరమావిశ్య మేనేస కృతకృత్యతాం ॥౮౩ ॥ రావణస్యచదేహోత్థం జ్యో
తిరాదిత్యవత్స్ఫురత్ । ప్రవివేశరఘుశ్రేష్ఠం దేవానాంపశ్యతాంసతాం ॥ ౮౪ ॥ తదాదేవాస్తుష్టువుస్తం వవర్షుః
పుష్పవృష్టిభిః । నేదుఃఖేదేవవాద్యాని ననృతుశ్చాప్సరోగణాః ॥ ౮౫॥ తదామందోదరీభర్త్రా సహదేహంవిసృజ్య

బుచే గదాపద్మశార్ఙ్గంబులచే ఛత్రచామరాద్యలంకారములచే రంజిలుచుండు రథమును రా
ముఁడవలోకించి ప్రదక్షిణప్రణామంబుల నాచరించి సంతసముగా నారోహించెను. తనశార్ఙ్గధ
నుస్సును చేతబూనెను. తీక్ష్ణశస్త్రంబులచే రావణుని రథరథాశ్వంబులను ధ్వంసముచేసి వా
ని నదలించెను. అంతనసురచక్రేశ్వరుఁడు వేరేతేరునెక్కి రామునితో తారసిల్లెను. అపు
డు శ్రీరాముఁడు నిశితవిశిఖంబులచే దశవదనుని తలలను కత్తరించుచువచ్చెను. ఆతలలు మా
కింతమాత్రము రామునిచేత చావుచిక్కినదని చింతించుచు సంతసమునొంది శ్రీరామపాదం
బులకు వందించుటకై వచ్చుచున్నవన్నట్లు రామచరణారవిందముల మీఁద గగనమున నెగిరి
నవ్వుచువచ్చి పడుచుండెను. నోరుతెరచికొని వచ్చెడు తలలనుచూచి ఇవి మరలనన్నుచంపు
టకై వచ్చుచున్నవనియెంచి బాణజాలముచే రాముఁడు వెరచినట్లు వాటిని పడమొత్తుచుండె
ను. అదిమిక్కిలి యాశ్చర్యముగానుండెను. కొందరు కొందరు కల్పభేదముచేత నూరుతలలు
౧౦౧ తలలు, ౧౦౦౧ తలలు, అని యిట్లు భేదముగా జెప్పెదరు. అంతనా రావణునికి అంత
ముకానరానందున విభీషణుని మాటమీఁద నాభిబొడ్డులో కుండలాకారంబుగానున్న దివ్యా
మృతంబును, శ్రీరాముఁడు వాయువ్యాస్త్రముచే శోషించి తలలను చేతులను కత్తరించెను.
ముఖ్యమగు రెండుచేతులును ఒకతలయునుగల రావణునికిని శ్రీరామునికిని మిక్కిలిఘోరంబ
యిన సంగ్రామముజరిగెను. అంతనారాముఁడు దారకుని మాటమీఁద బ్రహ్మాస్త్రముచే వాని
హృదయమును భేదించెను అదిపోయి హృదయమును భేధించి వానిని సంహరించి కృతకృ

సా । యయౌవై కుంఠభువనం రావణేనముదాన్వితా ॥ ౭౬ ॥ తతోవిభీషణేనైవ రామో రావణసత్క్రియాం। కా రయిత్వాలక్ష్మణేన లంకాయాంతంవిభీషణం ॥ ౭౭ ॥ నీత్వాభిషేచయిత్వాథ న్యాసభూతాంతిదంతికే। వాయుపు త్రకృతాంలంకాం మోచయామాసరాఘవః ॥ ౭౮॥ విభీషణాదిభిశ్శీఘ్రమశోకంప్రేష్యమారుతిం। సీతాయైసక లంవృత్తం శ్రావయామాసరాఘవః ॥ ౭౯ ॥*॥ ఇతిశ్రీశతకోటి రామచరితాంతర్గత శ్రీమదానందరామాయణే వాల్మీ కీయే సారకాండే యుద్ధచరిత్రే రావణవధోనామైకాదశస్సర్గః ॥ * ॥ ... ... ... ॥౧౧॥

శ్రీశివఉవాచ—అథతాందివ్యవస్త్రైశ్చ భూషయిత్వావిదేహజాం । సుస్నాతాంశిబికాసంస్థాం వేష్టి తాంవేత్రపాణిభిః ॥ ౧ ॥ నిష్కాశ్యశ్రీరామసాన్నిధ్యం సుగ్రీవాద్యైస్త్వయాన్వితాః । నానావాద్యసముత్సాహై ర్న ర్తనైర్వారయోషితాం ॥౨॥ తతోవరుహ్యయానాత్సా పద్భ్యాంగత్వాశనైఃపతిం । ననామసీతాశ్రీరామం లజ్జి తాసీత్పతేఃపురః॥ ౩ ॥ రామోపిదృష్ట్వాతాంసీతాం శుద్ధాంజ్ఞాత్వాపితాంపునః । సర్వేషాంప్రత్యయార్థంహి తదా వచనమబ్రవీత్ ॥ ౪ ॥ యథేచ్ఛంగచ్ఛవైదేహి రిపుగేహనివాసిని । నత్వాంగృహ్ణామ్యద్య బ్రహ్మణాప్రార్థితోప్యహం ॥ ౫ ॥ తద్రామవచనంశ్రుత్వా కారయిత్వాచితాంశుభాం । లక్ష్మణేనాథసుస్నాతా సీతావచనమబ్రవీత్ ॥౬॥ రామాదన్యంమనసాపి నాహంజానామిపావక । యదిదంమేస్తిసత్యంహి తర్హిత్వంశీతలోభవ ॥౭॥ ఇతిసాశపథం

త్యంబై రాముని యమ్ములపొదలో దూరెను. చూచుచుండిన దేవతలందరును శ్రీరాముని సం స్తుతించిరి. పూలవానగురిపించిరి దేవవాద్యంబులు మ్రోగినవి. అప్సరసలాడిరి. అప్పుడు మం దోదరి పతితోడ సహగమనముచేసి సంతసముతో వైకుంఠమునకు జనెను. పిదప శ్రీరాముఁడు విభీషణునిచే రావణుని యుత్తరక్రియలను చేయించి లక్ష్మణునంపి లంకలో విభీషణునికి రాజ్య పట్టాభిషేకమును చేయించి,వానివద్ద నాంజనేయునిచే చేయించిపెట్టియున్న లంకను విడిపించె ను. మఱియు నావిభీషణాదులతోడ నాంజనేయుని శీఘ్రముగా నంపించి యశోకవనంబున నున్న సీతాదేవికి సకలవృత్తాంతము నెఱిఁగించెను ... ... ... ॥౧౧॥

సీత యగ్నిప్రవేశముచేసివచ్చి తన త్రిగుణాత్మకరూపముల నేకీభవించికొనుట.

పిమ్మట త్వరగల్గిన సుగ్రీవాది వానర వీరవరులు సుస్నానముచేసి దివ్య వస్త్రాభర ణంబులచే నలంకృతయగు జానకీదేవిని పల్లకిమీఁద నెక్కించికొని భటులు పరివేష్టిం చిరాగా మంగళంబులగు వాద్యంబులతోడను వారాంగనానర్తనంబులతోడను శ్రీరామసన్ని ధికివచ్చిరి. ఆసీత యానమునుండిదిగి కాలినడకతో తిన్నగావచ్చి పతిపాదంబులకు ప్రణమించి యెదుట లజ్జితయై నిలిచెను. శ్రీరాముఁడున్ను ఆమెనుచూచి పరిశుద్ధురాలని యెఱిఁగి యున్న ను మరల యందరినమ్మకముకొఱకు అప్పుడు సీతతో “వైదేహీ! ఇచ్చవచ్చినట్లుపొమ్ము. పగ వానియింటనుంటివి. నిన్నిఁక బ్రహ్మవచ్చిచెప్పినను నేనంగీకరించను.” అని ధిక్కరించెను. ఆ శ్రీరామవచనమునువిని సీత లక్ష్మణునిచే [illegible]నిచేయించి స్నానముచేసివచ్చి యగ్నినిగుఱించి

కృత్వా వివేశానలముత్తమం । తతస్సదేవవాక్యైశ్చ తథాదశరథస్యచ ॥౮॥ వచనాజ్జానకీం శుద్ధాం జ్ఞాత్వా తామగ్రహీత్ప్రభుః । సుభూషితాంపావకేన స్వాంకేసంస్థాపితాంశుభాం॥ ౯ ॥ పంచవట్యాంస్వయమేవ పురాన్యస్తాం చపావకే। ఆలింగ్యజానకీంరామో నిజాంకేసంన్యవేశయత్ ॥౧౦॥ తామసీరాజసీచైవ సాత్త్వికీయాత్రిధాపురా। జాతారావణఘాతార్థం సాజాతైకత్రవైతదా ॥ ౧౧ ॥ తతోదేవైఃస్తుతోరామ శ్చేంద్రేణసమరేమృతాన్ । వానరాన్ సుధావృష్ట్యా జీవయామాససాదరం ॥ ౧౨ ॥ తత్రైకంవానరంరామో ఽదృష్ట్వాపప్రచ్ఛమారుతిం । రాఘవంమారుతిఃప్రాహ కుంభకర్ణేనభక్షితః ॥ ౧౩ ॥ యదికించిత్తస్యకపే ర్నఖకేశాస్థిలోహితం । రణేఽభవిష్యత్పతితం తద్వ్యాద్వ్యామృతవృష్టిభిః ॥ ౧౪ ॥ అథవిష్వగ్జీవితస్స సత్యంవిద్ధిరఘూత్తమ । సుధావృష్ట్యారాక్షసాస్తే జీవయిష్యంతివైపునః॥ ౧౫ ॥ ఇతిభీత్యాపురాస్మాభి స్సర్వేత్యక్తామహోదధౌ। తన్మారుతేర్వచశ్శ్రుత్వా యమరాజం వ్యలోకయత్॥ ౧౬ ॥ యమోపిభీత్యారామాగ్రేఽర్పయత్తంప్లవగోత్తమం। తందృష్ట్వారాఘవస్తుష్ట స్తదాజ్ఞాంనాకముత్తమం ॥౧౭॥ గంతుందదౌమాతలినే సోఽపినత్వారఘూత్తమం । రథేనవాజియుక్తేన యయౌమఘవతఃపురీం॥ ౧౮ ॥ రామస్తుమంగళస్నానం కర్తుంసంప్రార్థితోపిహి । విభీషణేనభరతం స్మృత్వానాంగీచకారసః ॥ ౧౯॥ తతస్సర్వైర్వానరైశ్చ పుష్పకంచారురోహసః । రథేనదారుకశ్చాపి గరుడోమకరధ్వజః ॥ ౨౦ ॥ విభీషణశ్చారు

“పాపకుఁడా! నేను మనస్సునందును రామునికన్న నితరుని నేఱుఁగను. నాయందుసత్యముగలిగి యున్న నీవు చల్లగానగుము.” అనిచెప్పి శపథముచేసి ఆపెద్దనిప్పులోఁబడెను. అంతనగ్నినుండి వచ్చిన జానకిని దేవవాక్యంబులచేతను దశరథుని మాటమీఁదను పరిశుద్ధురాలనితెలిసి శ్రీరాముఁడు స్వీకరించెను. మునుపు పంచవటిలో తానే అగ్నిలో నున్పఁబడిన జానకినియాలింగించి తనతొడమీఁద కూర్చుండబెట్టికొనెను. మునుపు రావణసంహారమునకై యెవతె తామసి రాజసి సాత్త్వికియని మూఁడువిధములుగా నేర్పడియుండెనో అది యిప్పుడొకటిగా నయినది॥

శ్రీరాముఁడు అమృతవర్షముచే వానరులను బ్రతికించుట.

౧౧॥ తరువాత దేవతలచే సంస్తుతుఁడైన శ్రీరాముఁడు ఇంద్రునికాజ్ఞాపించి యమృతవర్షముచే యుద్ధమున మృతినొందిన మర్కటంబులన్నిటిని ప్రీతితో బ్రతికించెను. అప్పుడచ్చట ఒకవానరుఁడు మాత్రము కానరానందున రాముఁడు వాడెక్కడయున్నాడని యాంజనేయునినడిగెను. అందుకతఁడు “స్వామీ! వానిని కుంభకర్ణుండు తినివేసెను. ఆకపియొక్క ఎముకయో గోరో వెంట్రుకయో తుదకు వానిరక్తమో రణమునపడినది కొంచముండినను ఈయమృత వృష్టిచేత తప్పక బ్రతుకును. సత్యముగా తెలియుము. ఇయ్యమృతవృష్టిచే మరల రాక్షసులందరును జీవించెదరని వెరచి మేము మొదలు వారినందరిని మహోదధిలో పడద్రోసితిమి.” అని విన్నవించెను. అందుమీఁద రాముఁడు యమధర్మరాజు నవలోకించెను. యముఁడును భయముచే నా వానరవీరుని శ్రీరామసన్నిధి నర్పించెను. వానినిచూచి రాముఁడానందించి, మాతలికి స్వర్గము

రోహ పుష్పకం రాఘవాజ్ఞయా । తతస్తే నిర్జరాస్సర్వే రామమామంత్ర్య ఖం యయుః ॥ ౨౧ ॥ పృష్ట్వా రామం రథో విమానేన యయౌ దివం । అథ తం రాఘవం ప్రాహ పుష్పకస్థం విభీషణః ॥ ౨౨ ॥ రామ తే ప్రష్టుమిచ్ఛామి తత్త త్త్వం వక్తుమర్హసి । ఐరావణగృహే రామ యదా పాతాలముత్తమం ॥ ౨౩ ॥ పురా గతస్తదా తూష్ణీం కిమర్థం స్థితః ప్రభో । కథం తౌ న హతౌ దుష్టౌ తద్దైవక్షణమాత్రతః ॥ ౨౪ ॥ తత్తస్య వచనం శ్రుత్వా విహస్య రాఘవోఽబ్రవీత్ పురాణాం వధః పూర్వం విధినా మారుతేః కరాత్ ॥ ౨౫ ॥ ప్రోక్తస్తస్మాన్మయా తూష్ణీం ప్రతీక్షా మారుతేః కృతా న్యచ్చ్వా నిజగత్యాం హి మారుతేః పౌరుషం జనాః ॥ ౨౬ ॥ వదంతు యేన శ్రీరామ లక్ష్మణౌ మోచితౌ పురా । అసురాభాహి పాతాలే సోఽయం శ్రీరామసేవకః ॥ ౨౭ ॥ ఇతి పౌరుషవృద్ధ్యర్థం మారుతేర్జగతీతలే । మమ దాసస్య బలినస్త తూష్ణీం స్థితం మయా ॥ ౨౮ ॥ నోచేద్ధుంకారమాత్రేణ పథివాంతుం కిం క్షమః । ఇషీకాస్త్రేణ కాకస్య యేన నేత్రం విదారితః ॥ ౨౯ ॥ శతయోజనపర్యంతం మారీచో ధ్వాపతత్త్రిణా । పురా యేన మయా త్యక్తః సోఽహం కింతుంత దా ॥ ౩౦ ॥ తయోర్వధే తు పాతాలే నశస్త్రార్థం ప్రతీక్షితః । మారుతేః పౌరుషార్థం హి సత్యం వదే విభీషణ ॥ ౩౧ ఇతి రామవచః శ్రుత్వా మారుతిస్స విభీషణం । తదా ప్రాహ విహస్యాథ కిం త్వం తద్విస్మృతోఽసి హి ॥ ౩౨ ॥ సేతుకాలే ఘువేణ గర్వం దృష్ట్వా మయి స్థితం । లాంగూలం ఖండితం పూర్వం లింగోత్పాటనహేతునా ॥ ౩౩ ॥ తస్యాపి రాఘు

---

నకు పోవుటకాజ్ఞనిచ్చెను. అమాతలి శ్రీరామచంద్రుని వందించి రథాశ్వంబులతోడ నింద్రసరమునకు పోయెను ॥౧౫॥ అటుపిమ్మట శ్రీరాముడు మంగళ స్నానము చేయవలెనని విభీష

దేవాదులు వెడలగా పుష్పకము నెక్కివచ్చు రాముడు విభీషణునితో సల్లాపించుట.

నిచే ప్రార్థింపబడినను భరతుని స్మరించి యందుకంగీకరించలేదు. అంతనందరితోడ పుష్పవిమానమునెక్కెను. ఆ పుష్పకమున శ్రీరామాజ్ఞచే రథముతోడ దారుకుండును మకరధ్వజడు విభీషణుడును అందరునెక్కిరి. అంత నమరవరులందరును రామునితో చెప్పి గగనమునడచిరి. దశరథుడును రాముని విచారించి విమానముతోడ స్వర్గమునకు జనెను. అపుడు భీషణుడు పుష్పకమందున్న రాముని గుఱించి “స్వామీ! నేను సీతత్త్వము నడిగెదను. దంజేసి చెప్పవలెను. మునుపు నీవు పాతాళముననైరావణునియింట నేమిచేయక యూరకయుడినదెందుకు? ఎందుకాదుష్టు నీచేలాంక్షణముననే చంపబడరైరి?” అని ప్రార్థించెను. అందు శ్రీరాముడు నవ్వుచు నిట్లుపలికెను—హనుమంతుని చేత మొదట యీమ్మైదలకు చావుకావలెనవిధి విధించియుండె. అందుకై వానిరాకను నిరీక్షించుచుంటిని. మఱియొకటిగలదు. ఇజ్జగంబున నందరును– ఆహా! పాతాళమున రక్కసులచేతజిక్కిన రామలక్ష్మణులను హనుమంతుడు విడిపించికొనివచ్చెను. వీడుగదా శ్రీరామసేవకుడు !– అని యాంజనేయుని పౌరుషంబున వర్ణింతురుగాక. బలిష్ఠుండగు నాసేవకుడైన హనుమంతునికి శౌర్యకీర్తియిల్లెపచ్చుటకై యూరక యుంటిని. అటుగాకపోయిన నేను హుంకార మొకటిచేతనే

గ్రేహి కింబలమన్యస్సేత్రహి । కింవిలంబోరాఘవాయ తయోరసురయోర్వధే ॥ ౩౪ ॥ వధితానిజదాసస్య కీర్తిర్మమవిభీషణ । ఇతితన్మారుతేర్వాక్యం శ్రుత్వారామంవిభీషణః ॥౩౫ ॥ ననామపరయాభక్త్యా తతస్సమ్యక్ప్రపూజయత్ । అథరామఃపున్వకష్ట స్సీతయాప్రార్థితోముహుః ॥౩౬ ॥ తద్వాక్యగౌరవాత్తుష్ట స్త్రిజటాయైవరాన్దదౌ। వస్త్రాలంకారభూషాభిః పూర్వంతుష్టాంవిధాయచ ॥ ౩౭ ॥ త్రిజటేవచనంమేద్య శ్రుణుమంగళదాయకం । కార్తికేమాధవేమాఘే చైత్రేమాసచతుష్టయే ॥౩౮ ॥ స్నాత్వాగ్రే త్రిదినంస్నానం త్వత్ప్రీత్యర్థంనరోత్తమాః । కరిష్యంతిహితేనైవ కృతకృత్యాభవిష్యసి ॥ ౩౯ ॥ యైర్నరైస్త్రిదినంస్నానం నకృతంపౌర్ణిమోర్ధ్వతః । తేషాంమాసకృతంపుణ్యం హరత్వంవచనాన్మమ ॥ ౪౦ ॥ అన్యచ్చాపిశ్రుణుష్వత్వం దీయతేయోవరోమయా । అశుచీనిగృహాణ్యేవ తథాశ్రాద్ధహవీంషిచ ॥ ౪౧ ॥ క్రోధావిష్టేనదత్తాని విధిపుత్రకృతాన్యపి । త్రిజటేతానితుభ్యంహి శృణ్వన్యత్త్వం మయోచ్యతే ॥౪౨॥ పాదశౌచమనభ్యంగం తిలహీనంచతర్పణం । సర్వంత్రిజటేతుభ్యం తథాశ్రాద్ధమదక్షిణం॥ ౪౩ ॥ ఇతిదత్వావరాన్రామ స్త్రిజటాసరమాన్వితః। సవిభీషణసుగ్రీవ మకరధ్వజవానరః ॥౪౪॥యయావిహాయసాసీతాం దర్శయన్కౌతుకాన్వితః। పశ్యసీతేపురాలంకాం తథారణభువంశుభాం ॥౪౫॥ పశ్యసేతుర్మయాబద్ధ శ్శిలాభిర్లవణార్ణవే। ఏతచ్ఛృణుశ్యతేతీర్థం సేతుబంధమితిస్మృతం ॥ ౪౬ ॥ ఇత్యుక్త్వారఘువీరస్తు రాక్షసేంద్రస్యవాక్య

తృణముచేత కాకుని కన్నునెత్తలేదా? బాణముచే మారీచుని నూరామడ సముద్రమునకు నెట్టలేదా? అట్టినేనప్పుడు క్రుంగినవాడనా? కాను. పాతాళమున వారి వధకై శస్త్రంబులను ప్రతీక్షించలేదు. విభీషణుఁడా! సత్యముగాచెప్పెదను. ఆంజనేయపరాక్రమాభివృద్ధికై యూరకయుంటిని-అని చెప్పిన రాము వాక్యమును విని హనుమంతుఁడు నవ్వి విభీషణునితో "ఏమి? నీ వాసంగతిని మరచితివా, మునుపు సేతునిర్మాణ సమయమున నాయొక్క గర్వమునుచూచి లింగమును పెరికివేయు నెపముచే శ్రీరామమహిమలో నాతోక తెగిపోయెను. అట్టినాబలము శ్రీరాములవారియెదుట నేమని యెంచుటకు అరక్కసుల సంహారమున శ్రీరామునికి సావకాశ మననెట్టిది? విభీషణుఁడా! తనదాసుఁడైన నాయొక్క కీర్తిని వృద్ధిపరచెను." అని పలుకఁగాఁ విని విభీషణుఁడు విశేష భక్తితో రాముని నమస్కరించి పూజించెను ॥౩౫॥ తరువాత శ్రీరాముఁడు సీతచే పలుమారు ప్రార్థింపబడి యామెమాట మీఁద త్రిజటకు వరముల

శ్రీరాముఁడు సీతావాక్యముమీఁద త్రిజటకు వరములనిచ్చుట.

నిచ్చెను. మొదట వస్త్ర భూషణాదులచే సంతోషపరచి "త్రిజటా! నా మంచి మాట వినుము. మానవోత్తములు చైత్ర వైశాఖ కార్తిక మాఘంబులను నాలుగు నెలలలో మొదట మూఁడు దినములు నీ ప్రీతికొఱకు చేయుదురుగదా? అందుచేతనే నీవు ధన్యవగుదువు. ఎవరట్లు పున్నమకువెనుక మూఁడు దినములు స్నానముచేయరో వారియొక్క నెల లోని పుణ్యమును నామాటమీఁద నీవుగ్రహింపుము. మఱియొకవరమును వినుము. ఎవఁడైన

తః । పుష్పకాద్భువిచోత్తీర్య ధృత్వాకోదండముత్తమం ॥ ౪౭ ॥ బభంజసేతుంతత్కోట్యా ధనుష్కోటిరితీర్యతే। అతఏవహితత్తీర్థం స్నానాత్కైవల్యదాయకం ॥ ౪౮ ॥ కోదండపాణిర్నామ్నాసీ ద్రామమూర్తిశ్చతత్రహి । ఏతస్మిన్నంతరేతత్ర సంపాతిస్సయయౌతదా ॥ ౪౯ ॥ తమాలింగ్యరామచంద్ర స్తంప్రాహస్మితపూర్వకం । బంధోర్నామ్నాత్రతీర్థంత్వం కురుసేతౌమహత్తమం ॥ ౫౦ ॥ తథేతిరామవచనా ద్భ్రాతుస్సంతోషకామ్యయా । తీర్థంచకార సంపాతి ర్జటాయురితివిశ్రుతం ॥ ౫౧ ॥ తతోరామాజ్ఞయాయానం సంపాతిశ్చారరోహసః। తతోయానేనతాం సీతాం దర్శయన్ కౌతుకానిహి ॥ ౫౨॥ యయౌరామేశ్వరంపూజ్య తయాశ్రీరఘునందనః । సీతేత్రపశ్యమంత్రార్థమేకాంతేసంస్థితంపురా ॥ ౫౩॥ అత్రదర్భేషుశయనం కృతంపశ్యవిదేహజే । నవగ్రహార్థంప్రతిష్ఠాన్పాషాణాన్పశ్య సాగరే ॥ ౫౪ ॥ తూష్ణీమేవస్థితంపశ్య సాగరంమమవాక్యతః । ఏవంతాందర్శయన్ రామః కిష్కింధాంప్రయయౌ క్షణాత్ ॥ ౫౫ ॥ వానరాణాంస్త్రియస్సర్వా విమానేస్థాప్యరాఘవః । యయౌతాందర్శయన్ సీతాం కౌతుకాని సమంతతః ॥ ౫౬ ॥ ప్రవర్షణగిరింపశ్య ఋష్యమూకాచలంతథా । పంపాసరోవరంపశ్య కృష్ణాంభీమరథీంశుభాం ॥ ౫౭॥ పశ్యపంచవటీంరమ్యాం గోదాతీరవిరాజితాం । అగస్త్యేరాశ్రమంపశ్య సుతీక్ష్ణస్యాశ్రమంతథా॥౫౮॥ పశ్యాత్రేరాశ్రమంసీతే చిత్రకూటంసమీక్షయ । కాళిందీంజాహ్నవీంపశ్య భరద్వాజాశ్రమంతథా ॥౫౯ ॥ ఇత్యు

---

నేమి? వాఁడు బ్రహ్మకొడుకై ననుసరియె. ఇండ్లనశుచిగా పెట్టికొని కోపావేశముతో నెవఁడు హవ్యకవ్యంబుల్లనిచ్చునో వాటిని నీవు గ్రహింపుము. అభ్యంగములేని పాదశౌచంబును నూవులులేని తర్పణంబును దక్షిణలేనిశ్రాద్ధంబును నీకర్పితంబగుగాక" అనియిట్లు శ్రీరాముఁడు త్రిజటకు వరములనిచ్చెను ॥ ౪౩ ॥ పిమ్మట శ్రీరాముఁడు త్రిజటను సరమను విభీషణసుగ్రీవ మక

## శ్రీరాముఁడు సేతువును భజించిసంపాతితో వచ్చుట.

రధ్వజులను వెంటదీసికొని వీమానమున వచ్చునపుడు సీతకు కౌతుకములను చూపుచు "కాంతా! చూచితివాలంకను? అల్లే ఇదిగో యుద్ధభూమి! ఇక్కడచూడుము, నేను సేతువుగట్టిన చోటు! ఇది సేతుబంధంబను తీర్థంబు" అనియిట్లు చెప్పుచు నంతలో విభీషణునిమాట మీఁద పుష్పకమునుండి భూమికిదిగి విల్లందుకొని దాని మొనతో సేతువును పడగొట్టెను. ధనుస్సుయొక్క కోటిచేత కొట్టబడినందుననే ధనుష్కోటియనబడుచున్నది. అందువలననే ఆతీర్థంబు ముక్తిప్రదంబైనది. అచ్చట కోదండపాణియను పేరుతో శ్రీరామమూర్తిగలదు. అంతలోనప్పుడచ్చటికి సంపాతివచ్చెను. రాముఁడు వానినాలింగించికొని నవ్వుచు "ఈసేతుభంగస్థానమున నీవు నీతమ్ముని పేరుతో తీర్థంబును కల్పింపుము." అని యాజ్ఞాపింపగా; నతఁడట్లేయని సహోదరుని సంతోషమునకై జటాయుతీర్థంబును నిర్మించెను. రామాజ్ఞచే సంపాతియును పుష్పకమునెక్కెను. అంతనందరచ్చటినుండివచ్చుచుండగా రాముఁడు సీతకు వింతలను కనుబరచుచు రామేశ్వరమునకువచ్చి సతితోడ రామేశ్వరుని నారాధించి యకాంతతో "ప్రియ! చూడు మిచ్చట

క్త్వాజానకీం రామో భరద్వాజాశ్రితస్తదా । తస్యాశ్రమేయానాదవరుహ్యయథాసుఖం ॥ ౬౦ ॥ మాఘశుక్ల చతుర్థ్యాంహి పూర్ణేవర్షేచతుర్దశే । భరద్వాజోపితపసా స్వర్గంనిర్మాయభూతలే ॥ ౬౧ ॥ పూజయామాసశ్రీరామం సీతావానరసంయుతం। రామోపిప్రాదిసంమంత్ర్య మారుతింవాక్యమబ్రవీత్ ॥ ౬౨ ॥ అయోధ్యాంగచ్ఛభరతం మ ద్వృత్తంకథయస్వతం। సఖాయంశృంగబేరేమే వృత్తంకథయగుహాకం ॥౬౩॥ తథేతిగుహాకంగత్వా కపివృత్తంసర్వ వేదయత్। గుహకోపిముదాయుక్తస్తదారామాంతికంయయౌ ॥ ౬౪ ॥ తతోయోధ్యాంయయౌవేగా న్మారుతిస్సువి హాయసా। నందిగ్రామేపిభరతో పూర్ణేవర్షేచతుర్దశే ॥ ౬౫ ॥ నాగతేరాఘవేవహ్నిం సన్నద్ధోభూత్ప్రవేశితం। శత్రుఘ్నంభరతఃప్రాహ రాజ్యేరణాంగణే ॥౬౬॥ శ్రీరామలక్ష్మణౌవీరౌ హాతౌమన్యేద్యనాగతౌ । ఆకారితావ యాసర్వే నృపాఏతేబలైర్యుతాః ॥౬౭॥ లంకాంగత్వారాఘవస్య సాహాయ్యంకర్తుమిచ్ఛతా।సోహమగ్నింవిశామ్య ద్య రవావస్తాచలంగతే ॥౬౮॥ త్వంగచ్ఛపార్థివైర్లంకాం హత్వాయుద్ధేదశాననం । మోచయిత్వాజనకజాం తతో నఃపారలౌకికం ॥౬౯॥ రామాదీనాంత్రిబంధూనాం కర్తుమర్హసిసాదరం । ఇతితద్వాక్యమాకర్ణ్య పౌరాజానపదా నృపాః ॥ ౭౦ ॥ శత్రుఘ్నోమాతరస్సర్వా ఊర్మిలాద్యాస్త్రియశ్చతాః । సుమంత్రాద్యామంత్రిణశ్చ పౌరనా ర్యశ్చసేవకాః ॥ ౭౧ ॥ భరతంవేష్టయామాసుః ఖేదాద్వ్యాకులమానసాః । భరతస్సాంత్వయన్సర్వాన్ యయౌ

---

మునుపు ఆలోచనలకై చేరియుంటిమి. ఇదిగో నిచ్చట దర్భలమీఁద పండుకొనియుంటిని. ఇవి నవగ్రహంబులకై ప్రత్యాకృతిశిలలు నవపాషాణంబులు స్థాపింపంబడినవి. నామాట నతిక్రమింపక సముద్రుఁడూరక నిలిచిన చోటిది, చూడుము." అని చెప్పుచు క్షణమున కిష్కింధకువచ్చెను. అచ్చటనున్న వానరపత్నులను విమానమున నెక్కించికొని సీతకు "ఇదిగో ప్రవర్షణగిరిని చూడుము. ఋష్యమూకశైలము నవలోకింపుము. పంపాసరోవరము దీనినీక్షింపు ము. కృష్ణాభీమరథీనదులను దృష్టింపుము. అహా గోదాతీరంబున రమ్యంబగు పంచవటియిది. అగస్త్యాశ్రమమిచ్చటనున్నది. అల్లె సుతీక్ష్ణముని యాశ్రమము. అత్రితపోవనంబును చూచితి వా? చిత్రకూటమిది చిత్రముగానున్నది. ఇదియమున, ఇదిగంగ, ఇదిగో భరద్వాజాశ్రమము." అని చెప్పుచు మాపుచువచ్చి భరద్వాజముని ప్రార్థింపగా నతని యాశ్రమంబున దిగి యంద రితోడ నచ్చట నిలిచెను. ॥౬౦॥ పదునాలుగు సంవత్సరంబులు నిండగా మాఘశుక్లచతుర్థినా డు భరద్వాజముని తనతపశ్శక్తిచే భూస్వర్గమునునిర్మించి శ్రీసీతారాములను సపరివారముగా సమస్తభోగవస్తువులచే సత్కరించెను. శ్రీరాముఁడు మదినాలోచించి మారుతిని "అయోధ్యకు వెడలి భరతునికి నావృత్తాంతమును చెప్పుము. శృంగబేరపురమున నామిత్రమగు గుహునికి నాయుదంతము నెఱిఁగింపుము."అని యాజ్ఞాపించెను. వానరవీరుఁడట్లేయని వెడలి గుహునికి సంగతినిచెప్పగా వాడువెంటనే శ్రీరామసన్నిధానమునకు వచ్చెను. అంతనాంజనేయుఁడు గగ నమున వేగముగావచ్చుచుండెను. అచ్చట నందిగ్రామమున భరతుఁడు ౧౪ సంవత్సరములు

తాంసరయూనదీం ॥౫౨॥ చితాంకృత్వాతతఃస్నాత్వా దదౌదానాన్యనేకశః। సప్తప్రదక్షిణాఃకృత్వా వహ్నేర్ధ్యా త్వారఘూత్తమం ॥౫౩॥ సీతాంతాంలక్ష్మణంవీరం నత్వామాతౄగురూంస్తథా। ఆరాధ్యదేవతాంధ్యాత్వా హ్యుత్త రాభిముఖఃస్థితః ॥౫౪॥ రవౌన్యస్తేక్షణస్సాయం ప్రతీక్షన్సంస్థితఃక్షణం। మహాన్కోలాహలశ్చాసీత్తదాస్త్రీపురు షైఃకృతః ॥౫౫॥ ఏతస్మిన్నంతరేఖస్థ స్తద్దృష్ట్వావాయునందనః। ప్రవేష్టుముద్యతంవేగా ద్భరతంగద్గదస్వనః ॥౫౬॥ అబ్రవీన్మధురంవాక్యం సుధయాసేచయన్నివ। మావిశస్వానిలంవీరరాఘవోద్యసమాగతః ॥ ౫౭ ॥ సీతయాలక్ష్మణే నాపి భరద్వాజాశ్రమంప్రతి। వానరైస్సహితంరామం శ్వస్త్వంపశ్యసినిశ్చయాత్ ॥ ౫౮॥ రామోపృచ్ఛ్యంతికస్త్వాం హి ద్రష్టుమస్తిజటాధర। ఇతివాక్యసుధావృష్టి సించితోభరతోముదా ॥ ౫౯ ॥ వహ్నింనత్వాపరావృత్య ననా మవాయునందనం। భరతంమారుతిశ్చాపి నత్వాలింగ్యసవిస్తరం ॥ ౬౦ ॥ శ్రావయామాసశ్రీరామ వృత్తంసంతోష కారకం। తచ్ఛ్రుత్వాభరతస్తుష్ట శ్శోభయామాసతాంపురీం ॥ ౬౧ ॥ అయోధ్యాంతోరణాద్యైశ్చ పౌరైఃప్రత్యు జ్జగామతం। మస్తకేపాదుకేబధ్వా పురస్కృత్యాథవారణం ॥ ౬౨ ॥ మాఘస్యసితపంచమ్యాం ప్రాప్తేపంచద శేఽబ్దకే। ప్రభాతేభరతోయాన్త్యే దదర్శపుష్పకంఖగం ॥ ౬౩ ॥ ననామరాఘవందృష్ట్వా సాష్టాంగంభరతస్త

నిండగా రాముఁడు రానందున నగ్నిప్రవేశమునకు సర్వసిద్ధుఁడై శత్రుఘ్నునితో "నేడురానం దున వీరులగు రామలక్ష్మణులు రణమున రావణునిచే జయింపఁబడినట్లు తలఁచెదను. లంకకుపో యి రాఘవునికి సాహ్యముచేయనెంచిన నేను ఈరాజులనందరిని పిలిపించితిని. అట్టినేనునేడు సూర్యుఁడస్తమించగానే అగ్నిప్రవేశముచేసెదను. నీవు రాజులతోఁడ లంకకువెడలి రణమున రావణునిఁజంపి సీతనువిడిపించి పిమ్మట రామభరతలక్ష్మణులగు మాకుముగ్గురికిని పారలౌకికక్రి యను సాదరముగా చేయుదువుగాక." అనిచెప్పగా, సూరివారును దేశమువారును రాజులును శత్రుఘ్నుండును తల్లులందరును ఊర్మిలాదిస్త్రీలును సుమంత్రాదిమంత్రులున్నూ ఊరియాడోవాం డ్రును సేవకులును అందరును దుఃఖార్తులై భరతుని పరివేష్టించిరి. భరతుఁడపుడు వారినంద రిని సమాధానపరచుచు సరయూనదీతీరమునకు వెడలి చితినివేయించి యంత స్నానముచేసి యనేక దానధర్మంబులనొసంగి ఏడుమార్లు అగ్నిప్రదక్షిణంబునాచరించి శ్రీరామునిధ్యానించి జానకీదేవిని వీరుఁడగులక్ష్మణుని వందించి తల్లులకును మునులకును గురువులకును నమస్కార ములంజేసి దేవతారాధన నాచరించి యుత్తరాభిముఖంబుగా సాయంతనాస్తంగత సూర్యబిం బము నవలోకించుచు క్షణకాలమూరక నిలచియుండెను. అప్పుడచ్చట స్త్రీపురుషులలో నత్యం తచింతా కోలాహలముదరుగుచుండెను. ఆవేళకు గగనమందుండిన హనుమంతుఁడు అగ్నిప్రవే శమునకు సర్వసిద్ధుఁడుగానుండెడు భరతునిఁజూచి కలతనొంది యత్యంతవేగముగా నవతరించి యమృతము గురిపించుచందంబున మృదుమధురవాక్యములచే ,,వీరుఁడా! నీవగ్నిప్రవేశము చే యవలదు. రాముఁడిప్పుడే వచ్చుచునున్నాడు. సీతాలక్ష్మణులతోఁడ భరద్వాజాశ్రమమునకు వ

-। రామోప్యాలింగ్య భరతం కృత్వాహూహాన్యనేకశః ॥౨౪॥ ఏకకాలేజనాన్సర్వాన్ పృథక్ సపరిషస్వజే।
పశ్చాస్న రామేణ కృతమాలింగనంతదా ॥౨౫॥ రామాన్ దృష్ట్వాహ్యసంఖ్యాతాన్ జనాశ్చాసన్ సువిస్మితాః
మాశ్వాస్యాథ భరతః రాఘవస్సాశ్రులోచనం ॥౨౬॥ ననామశిరసామాత్యా వశిష్ఠంచాప్యరుంధతీం। తతో వా
ృనర్తనాద్యైశ్చ నందిగ్రామంయయౌశనైః ॥౨౭॥ శ్మశ్రుకర్మోద్వర్తనంచ తైలాభ్యంగంతుబంధుభిః। నందిగ్రా
ుకరోద్రామో నానామాంగళ్యవస్తుభిః ॥౨౮॥ నవవాద్యనుఘోషాశ్చ నేదుస్సర్వత్రసుస్వరాః। నారోస్యనీం
యామాసూ రత్నదీపైరఘూత్తమం ॥౨౯॥ తతస్సీతాపిశ్వశ్రూస్సా ప్రణనామత్వరుంధతీం। వసిష్ఠంబ్రాహ్మ
ాన్ వృద్ధాన్ వందనీయాన్యథాక్రమం ॥౩౦॥ తతస్సీతాంసమాలింగ్య కౌసల్యాద్యాశ్చమాతరః। స్నాపయా
సుర్మాంగల్య ద్రవ్యైర్వాద్యపురస్సరం ॥౩౧॥ వస్త్రాలంకారభూషాభి శ్చుశుభేజానకీతదా। భరతఃపాదుకే
తు రాఘవస్యానుపూజితే ॥౩౨॥ యోజయామాసరామస్య పాదయోర్భక్తిసంయుతః। తతోతివినయాత్ప్రా
- భరతోరఘునందనం॥౩౩॥ రాజ్యమేతన్న్యాససభూతం మయానిర్యాపితంతవ। కోష్ఠాగారంబలంకోశం కృతం
శగుణమయా ॥౩౪॥ త్వత్తేజసాజగన్నాథ పాలయస్వపురంస్వకం। తథేతిరాఘవశ్చోక్త్వా భరతంసంన్యవేశ
యత్॥౩౫॥ తతస్సదివ్యవస్త్రాణి పరిధాయరఘూత్తమః। సీతయారథమారుహ్య వాద్యఘోషైర్జయస్వనైః॥౩౬॥

---

చ్చెను. నీవు నిజముగా రేపే వానరులతోడ నానరేంద్రుని నవలోకింప గలవు. భరతుండా! శ్రీ
ాముండును నిన్ను చూడనలెనని కుతూహలచిత్తుండై యున్నాడు." అనియిట్లు వచనామృతవ
ాము గురిపింపనందులో మునిగిన భరతుండు సంతసించియగ్నికి నమస్కరించి మరలివాయు
్రతునివందించెను. ఆంజనేయుండును భరతుని నభివందించి యాలింగించి విస్తారముగా సర్వవృ
్తాంతమును విన్నవించెను ॥౨౦॥ అదివిని భరతుండానందించి తోరణాదిమంగళ వ

శ్రీరాముండు విశ్వరూపముతో నందరిని యాలింగనాదులచే మన్నించు

యోధ్యాపట్టణమున నలంకారములను చేయించి యూరివారితోడ నూరేగి
ాద శ్రీరామపాదుకలనుధరించి పట్టపేనుంగను పురస్కరించుకొని వెడ
ండు మాఘశుక్లపంచమినాడు శ్రీరాముండరణ్యవాసమునకుపోయి ౧౫
చుండగా ప్రొద్దున దక్షిణదిక్కులో గగనంబున పుష్పకవిమానము
ణంబులకు సాష్టాంగదండప్రణామంబు నాచరించెను. శ్రీరాముండు
ాపములతోనేక కాలంబున నందరిని వేర్వేరుగా నాలింగించి

౧రాంగనాస్తత్రగీతై ర్యయౌనిజపురీంప్రతి । పౌరనార్యశ్చసౌధస్థా వవర్షుఃపుష్పవృష్టిభిః ॥ ౯౭ ॥ చక్రుర్నీరా
జనంమార్గే నానాబలిపురస్సరం । రామోరథాత్తదోత్తీర్య సీతాంసంప్రేష్యవైగృహం ॥ ౯౮ ॥ పుష్పకంప్రాహ
గచ్ఛత్వం కుబేరంవహసర్వదా । తథేతిరామవచనా జ్జగామపుష్పకంతుతత్ ॥ ౯౯ ॥ అథరామస్సభామధ్యే ద్విజే
శకపిభిస్సహ । దదౌకపిభ్యోగేహాని వస్తురమ్యాణిసాదరం ॥ ౧౦౦ ॥ అథరామాయరాజ్యార్థ మభిషేకంగురుస్త
దా । చకారసుముహూర్తేవై మహామంగళపూర్వకం ॥ ౧ ॥ హనుమత్ప్రముఖాద్యైశ్చ చతుస్సింధుజలంశుభం । స
మానీయనృపైస్సర్వై ర్మహావాద్యపురస్సరం ॥ ౨ ॥ ఛత్రంచతస్యజగ్రాహ పృష్ఠసంస్థస్సలక్ష్మణః । దధారసవ్యపా
ర్శ్వస్థ శ్చామరంభరతస్తదా ॥ ౩ ॥ శత్రుఘ్నోవామపార్శ్వస్థో దధారవ్యజనంశుభం । హనూమాన్పాదుకేదివ్యే
దధారపురతఃస్థితః ॥ ౪ ॥ వాయవ్యాదిచతుష్కోణ సంస్థితాస్తేమహౌజసః । సుగ్రీవాద్యాస్తదాచాసం శ్చత్వారో
రామవీక్షణాః ॥ ౫ ॥ సుగ్రీవోజలపాత్రంచ వరాదర్శంవిభీషణః । దధారహస్తెతాంబూల పాత్రంసవాలినందనః ॥
౬ ॥ వస్త్రకోశంజాంబవాంశ్చ దధారవేగవత్తరః । తస్థౌసింహాసనేరామ స్సపృష్ఠాంశోపబర్హణః ॥ ౭ ॥ సౌమి

మంగళాభ్యంగనమును నందిగ్రామములోననే మాంగల్య వస్తువులచే తమ్ములతోడ చేయించి
కొనెను. వివిధ వాద్యంబులు వాయింపఁబడుచుండినవి. ఎచ్చట వినినను మంగళనాదంబులు
నిండియుండెను. రఘుకుల ప్రదీపకుండగు శ్రీరామునికి రామామణులు రత్నదీపంబులతో నార
తుల నెత్తుచుండిరి. అంత సీతాదేవియును అత్తలకును అరుంధతీ వసిష్ఠులకును వృద్ధులును
పూజ్యులును అగు బ్రహ్మణోత్తములకును క్రమముగా నమస్కార క్రమమునాచరించెను. కౌ
సల్యాది మాతులు సీతనాలింగించికొని మంగళవాద్యంబులు మ్రోగుచుండగా మంగళద్ర
కే సీతమ్మను సత్కరించి యభ్యంగనాది క్రమములను సలిపిరి. నూతన వస్త్రాద్యలంకా
తా దేవి సంశోభించుచుండెను. అపుడు భరతుఁడు అత్యంతభక్తిపురస్సరంబుగా
న పాదుకలను తెచ్చి శ్రీరామపాదారవిందంబులకు తొడిగెను. మిక్కిలి విన
నికి "అన్నా! నాయందుంచబడియుండిన పూజ్యరాజ్యంబిది నీకు సమర్పిం
మున సుగ్రాణము భండారము సైన్యమును పదింతలుగా వృద్ధిచేయఁబడి
రిని కాపాడుము." అని ప్రార్థించెను. శ్రీరాముఁడట్లేయని భరతుని
ముందు సీతతోడ దివ్యవస్త్రంబుల నలంకరించికొని రథమునెక్కి
తన రత్నంబులు నేత్రానందకరంబులై యుండగా నా

శ్రీవామపార్శ్వేఽథ సంపాతిస్సంస్థితోఽభవత్। వామపార్శ్వే భరతస్య గుహస్సంస్థితోఽభవత్ ॥౮॥ శత్రుఘ్నవామపార్శ్వేఽథ సంస్థితో మకరధ్వజః। హనుమద్వామపార్శ్వే చ గరుడస్సంస్థితోఽభవత్ ॥౯॥ సుగ్రీవాదిచతుర్ణాం తే వామపార్శ్వేషు సంస్థితాః। శ్రీచిత్రరథవిజయ సుమంత్రదారుకాస్తథా ॥ ౧౦ ॥ నానారాజోపకరణ ధృతహస్తా మహౌజసః। యయుర్మయాసురాస్సర్వే యక్షగంధర్వకిన్నరాః ॥ ౧౧ ॥ ఔషధ్యఃపర్వతావృక్షా స్సాగరాశ్చాథ నిమ్నగాః। మాలాంచ కాంచనీం వాయు ర్దదౌ వాసవచోదితః ॥ ౧౨ ॥ సర్వరత్నసమాయుక్తం మణికాంచనభూషితం। దదౌ హారం నరేంద్రాయ స్వయం శక్రస్తు భక్తితః ॥ ౧౩॥ ప్రజగుర్దేవగంధర్వా ననృతుర్వారయోషితః। దేవ

* శ్రీరామ పట్టాభిషేకము. *

అంత నా శ్రీరాముఁడు సభామధ్యమున కపులతోడఁ బ్రవేశించి, కపులకు వాసస్థానంబులను సుందరవస్తువులను సాదరముగా నొసంగెను. అటువెనుక కులగురువులగు వసిష్ఠులవారు శ్రీరామునికి రాజ్యపట్టాభిషేకంబును సుముహూర్తంబున దివ్యమంగళవిభవంబులతోడఁ జేసెను. హనుమంతుఁడే మొదలుగాఁగల కపివీరులచే నాలుగుసముద్రములనుండి మంగళజలములు తీసికొనిరాబడెను. సమస్తరాజులును మహావాద్యంబులతోడ చేరిరి. వీపుప్రక్క నిలచిన లక్ష్మణుండు శ్వేతచ్ఛత్రముపట్టెను. కుడిప్రక్కనున్న భరతుఁడు చామరముఁ వేయుచుండెను. ఎడమప్రక్కనున్న హనుమంతుఁడు శ్రీరామ దివ్యపాదుకలను వహించెను. మహాబలులగు సుగ్రీవాదులుఁ వాయవ్యాది చతుష్కోణంబులలో నిలిచిరి. అందు, వాయవ్యమున సుగ్రీవుఁడు జలపాత్రంబును, ఈశాన్యంబున విభీషణుఁడు తాంబూలపాత్రంబును, నైరుత్యంబున జాంబవంతుఁడు వస్త్రకోశంబును, వహించుచు శ్రీరామకరుణాకటాక్ష పాత్రులైరి. దివ్యమంగళంబయిన రత్నసింహాసనంబును రత్నకంబళముపై నివిష్టుఁడై శ్రీరాముఁడుసాలంకృతుఁడుగానలంకరించెను. లక్ష్మణుని యెడమప్రక్కలో సంపాతియును, భరతుని యెడమ ప్రక్కలో గుహుండును, శత్రుఘ్నుని యెడమప్రక్కలో గరుడుఁడును, సుగ్రీవవిభీషణ వాలిపుత్రజాంబవంతుల యెడమప్రక్కలలో వరుసగా చిత్రరథ విజయ సుమంత్రదారుకులును, సాలంకృతులై ప్రకాశించు చుండిరి. పలుతెరంగులగు దివ్యమంగళ ప్రదంబులయిన సామగ్రులతోడ నేసును నాతోడసకల దేవతలును యక్షగంధర్వ కిన్నరులును పర్వతవృక్షనదీ దేవతాదులును శ్రీరామపట్టాభిషేక సమయంబున సాన్నిధ్యము నొందిన వారమైతిమి. ఇంద్రప్రేరితుఁడైన వాయుదేవుఁడు సువర్ణహారమును సమర్పించెను. భక్తితోడ నింద్రుఁడు తానే సార్వభౌముండగు శ్రీరామునికి సమస్తరత్నరమణీయంబగు కనకమణి కమనీయంబైన హారంబును సమర్పించెను. దేవగంధర్వులు గానముచేయుచుండిరి. సురవారాంగనలు నర్తన మొనర్చుచుండిరి. దేవదుందుభులు మ్రోగుచుండినవి. గగనమునుండిపూలవానగురియుచుండె. భరతునిచే సమర్పింపఁబడిననేను ఇట్లుస్తుతించితిని.—

దుందుభయో నేదుః పుష్పవృష్టిః పపాత ఖాత్ ॥ ౧౪ ॥ తతోఽకుర్వంస్తుతించాహంభరతేనాతిపూజితః ॥ ౧౫ ॥

౧. సుగ్రీవమిత్రం పరమం పవిత్రం । సీతాకళత్రం నవమేఘగాత్రం ।
కారుణ్యపాత్రం శతపత్రనేత్రం । శ్రీరామచంద్రం సతతంనమామి ॥౧౬॥

౨. సంసారసారం నిగమప్రచారం । ధర్మావతారం హృతభూమిభారం॥
సదాఽవికారం సుఖసింధుసారం । శ్రీరామచంద్రం సతతంనమామి॥౧౭॥

౩. లక్ష్మీవిలాసం జగతాంనివాసం । లంకావినాశం భువనప్రకాశం॥
భూదేవవాసం శరదిందుహాసం । శ్రీరామచంద్రం సతతంనమామి ॥౧౮॥

౪. మందారమాలం వచనేరసాలం। గుణైర్విశాలం హతసప్తతాలం॥
క్రవ్యాదకాలం సురలోకపాలం । శ్రీరామచంద్రం సతతంనమామి ॥౧౯॥

౫. వేదాంతగానం సకలైస్సమానం । హతారిమానం త్రిదశప్రధానం।
గజేంద్రయానం విగతావసానం । శ్రీరామచంద్రం సతతంనమామి ॥౨౦॥

౬. శ్యామాభిరామం నయనాభిరామం । గుణాభిరామం వచనాభిరామం।
విశ్వప్రణామం కృతభక్తకామం । శ్రీరామచంద్రం సతతంనమామి ॥౨౧॥

౭. లీలాశరీరం రణరంగధీరం । విశ్వైకసారం రఘువంశహారం।
గంభీరనాదం జితసర్వవాదం । శ్రీరామచంద్రం సతతంనమామి ॥౨౨॥

౮. ఖలేకృతాంతం సుజనేవినీతం । సాంగోపగీతం మనసాప్రతీతం।
రాగేణగీతం వచనాదతీతం । శ్రీరామచంద్రం సతతంనమామి ॥౨౩॥

౯. శ్రీరామచంద్రస్య వరాష్టకం త్వాం । మయేరితం దేవి మనోహరం యే।
పఠంతి శృణ్వంతి గృణంతి భక్త్యా । తే స్వీయకామాన్ ప్రలభంతి నిత్యం ॥౨౪॥

ఇతిస్తుత్వారామచంద్రం, సభాయాంసంస్థితస్త్వహం । ఏతస్మిన్నంతరేతత్ర రాజాదశరథో మహాన్ ॥ ౨౫ ॥ దృష్ట్వారామంససీతంచ విమానస్థోఽర్కసన్నిభః । స్తుత్వారామంపరాత్మానం రాజ్యస్థంబంధుకేష్టితం ॥ ౨౬ ॥ ఉవాచ రామంసంతుష్టస్సురానీకవిరాజితః ॥ దశరథఉవాచ—ధన్యోఽహంకృతకృత్యోఽహం ధన్యాతేపితరామమ ॥ ౨౭ ॥ ధన్యోదేశఃకులంధన్యం యస్త్వంరాజ్యాభిషేచితం । పశ్యామ్యద్యమహాబాహో ధన్యాసాజననీతవ ॥ ౨౮ ॥ యాకౌసల్యాసముత్సాహా నేత్రాభ్యాంతేఽద్యపశ్యతి । ఇత్యుక్తవంతంరాజానం ననామసరఘూత్తమః ॥ ౨౯ ॥ కౌసల్యాద్యారాజదారా స్సర్వేతేపౌరవాసినః । లక్ష్మణోభరతశ్చైవ శత్రుఘ్నస్తేథమంత్రిణః ॥ ౩౦ ॥ నమస్కారాన్ప్రచక్రుర్విమానస్థంముదాన్వితాః । తాన్రాజాపిపృథక్పృష్ట్వా సర్వైర్దేవగణైర్యుతః ॥ ౩౧ ॥ పూజితోరామచంద్రేణ మయాసహాన్యవర్తత । యయుస్స్వంస్వంపదంసర్వే మయారాజ్ఞానురాస్తదా ॥ ౩౨ ॥ రామేఽభిషిక్తే రాజేంద్రే సర్వలోకసుఖావహే । వసుధాసస్యసంపన్నా ఫలవంతిమహీరుహాః ॥ ౩౩ ॥

శివశంకరకృత శ్రీరామస్తుతి కందపద్యాష్టకము.

౧. పరమ పవిత్రా వానర, వరమిత్రా శ్రీకళత్ర వారిదగాత్రా।
కరుణాఢ్య కంజనేత్రా, నిరతము శ్రీరామచంద్ర నినుభజియింతున్.

౨. పరిహృతభూభారా సం, సరణాలంకార నిగమసంచార సుఖా।
కర నిర్వికార ధార్మిక, నిరతము శ్రీరామచంద్ర నిను భజియింతున్.

౩. శరదిందుహాస లక్ష్మీ, విలాస లంకావినాశ విశ్వమయా భూ।
సురవాస భువనదీపక, నిరతము శ్రీరామచంద్ర నిను భజియింతున్.

౪. సురలోకపాల వాగ్విజి, తరసాల నికృత్తసప్తతాలా న క్తం।
చరకాల సురసుమార్చిత, నిరతము శ్రీరామచంద్ర నిను భజియింతున్.

౫. కరివరయానా సురవర, నిరంత వేదాంతగాన నిఖిలసమానా।
అరిగర్వహారణ గుణనిధి, నిరతము శ్రీరామచంద్ర నినుభజియింతున్.

౬. వర శ్యామసుందరా దృగ, భిరామ వచనాభిరామ విశ్వస్తుత్యా।
సురుచిరగుణ శ్రితసుఖకర, నిరతము శ్రీరామచంద్ర నినుభజియింతున్.

౭. పర రణధీర రఘూత్తమ, నరవరలీలా గభీరనాదా విశ్వే।
కరస జితసర్వవాదా, నిరతము శ్రీరామచంద్ర నిను భజియింతున్.

౮. దురితాత్మశిక్షకా స, త్పరిరక్షక వాగతీత పరమామేయా।
సురుచిర పుణ్యశ్లోకా, నిరతము శ్రీరామచంద్ర నినుభజియింతున్।

౯. నిను గూర్చి నేను చెప్పిన, వినుతశ్రీరామచంద్ర విమలాష్టకమున్.
వినువారు చదువువారును, కనుఁగొందురు వార భీష్టకామ్యములార్యా.

ఇట్లు శ్రీరామచంద్రస్వామిని సంస్తుతించి నేను సభలోనుండగా; విమానంబుననుండి సూర్యునివలె వెలుగుచున్న దశరథమహారాజు సాక్షాత్పరమాత్మయగు శ్రీరాముఁడు బంధుపరివారముతోడ రాజ్యసింహాసనాసీనుండై యుండుటనుచూచి స్తుతించి యిట్లనెను. శూరశిరోమణీ! రాజ్యపట్టము నలంకరించి రాజిలుచున్న నిన్నుచూచి నేను కృతకృత్యుఁడను, మఱియు కృతకృత్యుండను. తాతలిదండ్రులును కృతకృత్యులు. నాదేశము పావనమయినది. నాకులము పరిశుద్ధమయినది. కౌసల్య మిక్కిలి ముక్కువతో నిన్ను కటాక్షించుచుండునో ఆసీతల్లి మిగుల ధన్యురాలు. ఇట్లు చెప్పుచున్న ధశరథరాజును శ్రీరామచంద్రుఁడు వందించెను. పిదప వరుసగా కౌసల్యాది రాజస్త్రీలును ఊరివారందరును లక్ష్మణభరత శత్రుఘ్న... ...తులును ...మానస్యుఁడగు రాజును ... ...

గంధవంతిచకాశిరే । సహస్రశతమశ్వానాం ధేనూనాంరఘునందనః ॥ ౩౩ ॥ దదౌశతంవృషాణాంచ ద్విజేభ్యోవసుకోటిశః । సూర్యకాంతిసమప్రఖ్యం సర్వరత్నమయీంస్రజం ॥ ౩౪ ॥ సుగ్రీవాయదదౌప్రీత్యా రాఘవోభక్తవత్సలః । అవతంసందదౌశ్రేష్ఠం రాక్షసేంద్రాయరాఘవః ॥ ౩౫ ॥ అంగదాయదదౌదివ్యే రాఘవోబాహుభూషణే । చంద్రకోటిప్రతీకాశం మణిరత్నవిభూషితం ॥ ౩౬ ॥ సీతాయైప్రదదౌహారం ప్రీత్యారఘుకులోత్తమః । సాతంహారందదౌవాయు పుత్రంవాయుసమర్పితం ॥ ౩౭ ॥ తేనహారేణశుశుభే మారుతిగౌరవేణచ । తదాదృష్ట్వాహనూమంతం రామోవచనమబ్రవీత్ ॥ ౩౮ ॥ మారుతేత్వాంప్రసన్నోస్మి వరంవరయకాంక్షితం । హనుమానపితంప్రాహ నత్వారామంప్రహృష్టధీః ॥ ౩౯ ॥ త్వన్నామస్మరతోరామ నతృప్యతిమనోమమ । అతస్త్వన్నామసతతంస్మరన్స్థాస్యామిభూతలే ॥ ౪౦ ॥ యావత్స్థాస్యతితేనామ లోకేతావత్కలేవరం । మమతిష్ఠతురాజేంద్ర వరోయంమేభికాంక్షితః ॥ ౪౧ ॥ యత్రయత్రకథాలోకే ప్రచరిష్యతితేశుభా । తత్రతత్రగతిర్మేస్తు శ్రవణార్థంసదైవహి ॥ ౪౨ ॥ దేవాలయాన్నదీతీరా త్తీర్థాద్వాన్యజ్జలాశయాత్ । వినాన్యత్రస్థలేతేఽస్తు కథావద్ఘటికోర్ధ్వతః ॥ ౪౩ ॥ రామస్తథేతితంప్రాహ ముక్తస్తిష్ఠయథాసుఖం । కల్పాంతేమమసాయుజ్యం ప్రాప్స్యసేనాత్రసంశయః ॥ ౪౪ ॥ తమాహజానకీప్రీతా యత్రకుత్రాపిమారుతే । స్థితంత్వామనుయాస్యంతి భోగాస్సర్వేమమాజ్ఞయా ॥ ౪౫ ॥

రించి నాతోడ సమస్తదేవ గణంబులతోడనుకూడి శ్రీరామునిచేత పూజింపఁబడి వెనుకకు వెడలెను. అపుడు సమస్తదేవతలును వారివారి నిలయములకు జనిరి ॥౧౩౨॥ సమస్తలోకంబు

శ్రీరాముఁడు అందరిని పారితోషికాది సత్కారంబులచే మన్నించుట.

లకు సుఖప్రదంబైన శ్రీరామపట్టాభిషేక సమయంబున పుడమి పైరుతోనిండియుండెను. వృక్షంబులు ఫలవంతంబులై యుండె. నిర్గంధ కుసుమంబులును పరిమళయుక్తములై ప్రకాశించినవి. అపుడు శ్రీరాముఁడు బ్రాహ్మణులకు లక్షగుఱ్ఱములను లక్షగోవులనునూరెద్దులను కోట్లకొలది బంగారమును కొల్లబెట్టెను. భక్తవత్సలుఁడగు రాముఁడు ప్రీతిచే సుగ్రీవునికి సూర్యప్రభంబైన రత్నహారంబు ననుగ్రహించెను. విభీషణునికి మేలైనసిగబంతి నిచ్చెను. అంగదునికి భుజాలంకారంబు నొసంగెను. కోటిచంద్ర ప్రకాశంబును దివ్యరత్నాలంకృతంబునగు హారమును శ్రీరాముఁడు సీతాదేవిచేత నిచ్చెను, ఆమె యవ్వాయుసమర్పితంబగు హారంబును వాయుపుత్రునికి అనుగ్రహించెను. దానిచే నాంజనేయుఁడు గౌరవమునంది రారాజించెను. అపుడమ్మారుతినిజూచి శ్రీరాముఁడు "మరున్నందనా! నేను నీకు ప్రసన్నుండనై యున్నాను. నీకిచ్చవచ్చినట్లు వరములను వేడుము." అని యనుగ్రహించెను. అందు కాంజనేయుఁడు సంతోషితస్వాంతుఁడగుచు శ్రీరామునికి నమస్కరించి "శ్రీరామస్వామీ! నీనామమును స్మరించు నామనంబునకు

[illegible] నీనామము [illegible] స్మరించుచు భూమిలో నివసించెదను. నాయొక్క వరమే

[illegible] నిలచునుగాక. నీయొక్క మం

గ్రామారామేపత్తనేషు వజ్రఖేటకసద్మసు । వనదుర్గాపర్వతేషు సర్వదేవాలయేషుచ ॥ ౪౬ ॥ నదీషు
ర్థేషు జలాశయపురేషుచ । వాటికోపవనాశ్వత్థ వటవృందవనాదిషు ॥ ౪౭ ॥ త్వన్మూర్తింపూజయిష్యం
నవావిఘ్నశాంతయే । భూతప్రేతపిశాచాద్యా నశ్యంతిస్మరణాత్తవ ॥ ౪౮ ॥ యేచాన్యేవానరాద్యాశ్చ వ్యా
ధ్యాంసముపాగతాః । అమూల్యాభరణైర్వస్త్రైః పూజితారాఘవేణతే ॥ ౪౯ ॥ సుగ్రీవప్రముఖాస్సర్వే వ
స్సవిభీషణాః । మకరధ్వజసంపాతి గుహకాఃపార్థివాదయః ॥ ౫౦ ॥ యథార్హంపూజితాస్తేన రామేణః
దిభిః । తతస్సర్వైర్వ్రోభ్యుజనార్థం రాఘవస్సంస్థితోభవత్ ॥ ౫౧ ॥ రామేణప్రాణాహుతయో గృహీతాశ్చే
రుతిః । వినిష్క్రిడ్డీయవేగేన రామాగ్రేభోజనస్యచ ॥ ౫౨ ॥ త్రిపదాయాంస్థితంపాత్రం హైమంపక్వాన్న
తం । నినాయవామహస్తేన ధృత్వాగ్రేవిహసన్ముదా ॥ ౫౩ ॥ స్వయంభుక్త్వారామశేషం ప్రాక్షిపద్వానరానపి
దావిభీషణాద్యాశ్చ స్వీయపాత్రాణిచేగతః ॥ ౫౪ ॥ విసృజ్యమారుతింస్తుత్వా త్వయాసమ్యక్కృతంత్వితి ।
తః ప్తంరాఘువోచ్ఛిష్టం బుభుజుస్సంభ్రమాన్వితాః ॥ ౫౫ ॥ మహానోకలాహలశ్చాసీ ద్రామాచ్ఛిష్టార్థమాదః
సీతారామౌతన్నిరీక్ష్య ముదాప్రహసతుస్తదా ॥ ౫౬ ॥ ఏవంనానాకౌతుకాని కుర్వంతోరాఘవాంతికే । సు
ద్యాస్సుఖంతస్థుస్తోషయుక్తాతంకియద్దినం ॥ ౫౭ ॥ ఏతస్మిన్నంతరేతత్ర పుష్పకంచాగమత్పునః । ప్రాహదేవకు

గళచరితం బెచ్చటుచ్చట జరుగుచుండునో అచ్చటచ్చటఁతయును నిరంతరముగా వినుఁ
నాకు గమనము సిద్ధించుగాక. దేవాలయము నదీతీరము తీర్థము తటాకాది జలాశయ
ఇవ్వితప్ప తక్కిన యే స్థలమందును నీకథ యారు గడియలకుపిమ్మట జరుగునుగాక." అ
మును ప్రార్థించెను. శ్రీరాముఁడ శ్లేయనుచు "ముక్తుఁడై నీయిచ్చవచ్చినట్లుండుము. ప్ర
మున నాయొక్క సాయుజ్యముక్తి నందుదువు. ఇందుకు సంశయమువలదు." అని వరవ
దృఢీకరించెను. అపుడు సీతాదేవి ప్రీతించి యాంజనేయునికి "వాయుపుత్రా! వినుము; నా
జ్ఞవలన గ్రామములలోను తోటలలోను పట్టణములలోను పంటకాపులుండెడు పల్లెలు ఇ
అరణ్యములు కోటలు కొండలు సకలదేవాలయంబులు నదులు పుణ్యక్షేత్రములు పుణ్య
ములు అశ్వత్థాది వృక్షమూలంబులు మొదలైన వీట్లలోను నివసించు. నిన్ననుసరించి యె
పూజించుచుందురో వారికి సమస్తభోగంబులు సిద్ధించని. విఘ్నములు పరిహరించని. ని
స్మరించుటచేత భూతప్రేత పిశాచంబులు నశించుగాక." అనివరమునిచ్చెను. పిమ్మట, అ
ధ్యకువచ్చియున్న వానరులు మొదలుగాగల వారందరును రత్నాభరణంబులచేతను వస్త్ర
బులచేతను సత్కరింపఁబడిరి. మకరధ్వజుండును సంపాతియును గుహుఁడును తక్కిన ర

శ్రీరామునితో నందరును వినోదించుచుండి తమతమ నెలవులకు జనుట.

లును మన్నింపఁబడిరి ॥౧౫౧॥ అంత నందరితోడ శ్రీరాముఁడు భోజనమునకు కూర్చుం
అపుడు రాముఁడు ప్రాణాహుతులను స్వీకరించినతోడుతనే హనుమంతుఁడు కుప్పగంతు వేసివ

ృతస్త్వామహంపునః ॥౫౮॥ మామాహాయత్కుబేరస్తచ్ఛ్రిణుష్వరఘునందన । జితంత్వంరావణేనాదౌ పరాక్రమేణనిర్జితం ॥ ౫౯ ॥ అతస్త్వంరాఘవంనిత్యం వహయానవద్వసేద్భువి । యదాగచ్ఛేద్రఘుశ్రేష్ఠో వైకుంఠాహిమాంతదా ॥ ౬౦ ॥ తచ్ఛ్రుత్వారాఘవఃప్రీత స్సుగ్రీవాదీన్యథాస్థలే । స్థాపయిత్వారయోధ్యాయాం ద్వారాద్బహిర్వ్యస ॥ ౬౧ ॥ తథేతిరామవచనా ద్వానరాద్యాన్యథాస్థలే। స్థాపయిత్వానమయోధ్యాయాం రాద్వారాద్బహిఃస్థితః ॥ ౬౨ ॥ చకారరాజ్యంధర్మేణ లంకాయాంసవిభీషణః । ప్రకాసరాజ్యంపాతాళే ధర్మేణమకరధ్వజః ॥ ౬౩ ॥ చకారతార్క్ష్యస్సంపాతిం యావరాజ్యేపదేనిజే । కకాసరాజ్యంకపిభిః కిష్కింధాయాంకపీ ॥ ౬౪ ॥ శృంగవేరపురేరాజ్యం గుహశ్చాకరోన్ముదా । నత్వారామంవాయుపుత్రో యయాత పుంహిమా ం ॥ ౬౫ ॥ సర్వేవిభీషణాద్యాశ్చ పంచమేసప్తమేహని । దశకనాథకంరాఘవస్య సాకేతంప్రయయుస్స ॥ ౬౬ ॥ పంచసప్తదినాన్యత్ర స్థిత్వాశ్రీరాఘవాంతికం । యాతాయాతంసదాచక్రు స్స్వస్వరాజ్యాద్రఘూత్త ॥ ౬౭ ॥ రామోపిరాజ్యమఖిలం కకాసాఖిలవత్సలః । అనిచ్ఛంతంహిసౌమిత్రిం యావరాజ్యేభ్యషేచయత్॥ ॥ లక్ష్మణఃపరయాభక్త్యా రామసేవాపరోభవత్ । విశ్వామిత్రాధ్వరేపూర్వం రణయాగస్యపూర్ణతా ॥ ౬౯ ॥ తాయారాఘవేణ సాకృతాస్వపదేశదా । రణయాగస్సవిస్తారా ద్వర్ణ్యతేశ్రుణుపార్వతి ॥ ౭౦ ॥ రణాంగణం

కాలుపీట మీఁదనున్న పక్వాన్నములుగల శ్రీరాముని భోజనపాత్రమును తీసికొని యె నవ్వుచు శ్రీరామోచ్ఛేషంబును తానుభక్షించి వానరులకొఱకు దానిని పడవేసెను. అపు భీషణాదులు సుగ్రీవాదులును తమతమ పాత్రములను విడిచిపెట్టి నీవు చక్కనిపని చేసి యాంజనేయుని పొగడుచు ఆపడిన రామోచ్ఛిష్టంబును సంభ్రమముతో తినుచుండిరి. ్పడచ్చట శ్రీరామునియెంగిలి మాకుచిక్కెనా మాకుచిక్కెనాయను మహా కోలాహలము గెను. సీతారాములు వీరి వినోదంబులనుచూచి నవ్వుచుండిరి. ఇట్లు సుగ్రీవాదులు నానా దంబుల నొనర్చుచు శ్రీరాముల సన్నిధిలో నతనికి సంతసము నిచ్చుచు కొన్నిదినము ండిరి. అంతలో నా సచేతనపుష్పకంబు మరలివచ్చి శ్రీరామునికి "స్వామీ! నేను కుబేరుని పంపఁబడితిని- నిన్ను రావణుఁడు మొదట జయించి యనుభవించుచుండె. పిమ్మట శ్రీరా ుఁడు జయించెను. కావున, నీవు శ్రీరాముఁడు భూలోకము నలంకరించుచుండు నంతవరకు ్వామినే సేవించుచుండుము. అతఁడు వైకుంఠమున కరిగినవెనుక నావద్దికిరమ్ము- అనిచెప్పి ంపెను. వచ్చియున్నాను!" అని విన్నవించెను. అదివిని శ్రీరాముఁడు సుప్రీతుఁడై "పుష్పక హా! నీవు సుగ్రీవాదులను వారివారిస్థలములలో విడిచివచ్చి యయోధ్యలో రాజద్వారమున ండవలయునని యాజ్ఞాపించెను. అట్లేయని పుష్పకము శ్రీరామాజ్ఞా ప్రకారము అందరిని ారివారి యూళ్లలో విడచివచ్చి రాజద్వారము బయటనుండెను. విభీషణుఁడు లంకలో ధర్మ ా రాజ్యమేలెను. మకరధ్వజుఁడు ధర్మముగా పాతాళములో రాజ్యమునేలెను. గరు ుఁడు తన యావరాజ్యపదమున సంపాతిని సంస్థాపించెను. సుగ్రీవుఁడు కిష్కింధలో రాజ్య

యజ్ఞకుండం తత్రవై హ్యపలాయనం । తచ్చ వేదవిభానంచ బ్రహ్మసద్మప్రకీర్తితం ॥ ౨౧ ॥ శరాణాశ్చఖట జ్ఞేయశ్శస్త్రఖణస్వనః । సంమార్జనం స్రుక్స్రువయో ర్జ్ఞేయం పాషాణఘర్షణం ॥ ౨౨ ॥ శస్త్రాగ్రాణాం తు స ౦ స్థితయద్రణాంగణే । భూమ్యాం శరాణాం విస్తారః పరిస్తరణముత్తమం ॥ ౨౩ ॥ పరిసమూహనం ధై హ్నిః కాలానలో మహాన్ । స్రువేణ బాణరూపేణ మాంసాహుతిసమర్పణం ॥ ౨౪ ॥ రక్తధారావసోర్ధారా కారోథయానకః । సఓంకారవషట్కార ఘోషోజ్ఞేయో రణాధ్వరే ॥ ౨౫ ॥ అగ్నేర్జ్వాలాశ్శస్త్రతేజో ‹ స్స్వేదస్రవో రణే । జ్వాలాతిశయశాంత్యర్థం పృషదాజ్యస్యసేచనం ॥ ౨౬ ॥ యత్తద్రత్రతు వీరాణా మప్ర చనముత్తమం । జ్ఞానేనసహజీవస్య బలిర్దీపబలిస్స్మృతః ॥ ౨౭ ॥ యేదేహాభినోజీవా బలిదీపహరాస్త్వ, శామహస్తాన్స్మృతింత్యక్త్వా యేకుర్వంతిపలాయనం ॥ ౨౮ ॥ దేహబంధాన్నముక్తాస్తే బలిభక్షణదోషతః । పృ హుతిశ్శిరోభిర్హీనా జ్ఞేయాతత్రప్రదక్షిణాః ॥ ౨౯ ॥ ఉచ్చాటనం హిసర్వేన వీరాణాంజయహోతవే । నిజస దానంచ జ్ఞేయాసాదక్షిణాధ్వరే ॥ ౩౦ ॥ సురైర్యాపుష్పవృష్టిస్తత్ జ్ఞేయంవిప్రాభిషేచనం । జయసంపా యుద్ధే శ్రేయస్సంపాదనంహితత్ ॥ ౩౧ ॥ చరాచరాణామానందో జ్ఞేయస్సనిజగోత్రిణాం । భూతానాంతర విప్ర భోజనంసంప్రకీర్తితం ॥ ౩౨ ॥ ఏవంసుబాహునాయుద్ధే రాఘవస్యరణాధ్వరః । తథాగాధిజయజ్ఞోపి

---

మేలుచుండెను. శృంగబేరపురమున గుహుండు రాజ్యమొనర్చుచుండె. హనుమంతుఁడు ముని కి నమస్కరించి హిమాలయంబున తపమొనరించుటకై వెడలెను. విభీషణాదు రును ౫-౭ దినముల కొకతూరి శ్రీరామసన్నిధికివచ్చి యచ్చట ౫-౭ దినములు వసించిం పోవుట వచ్చుట, ఇట్టి రాకపోకలచే నానందించుచుండిరి. అందరియందును ప్రీతిగల రామ రాజ్యమేలుచుండెను. అపుడు వలదనినను బలాత్కారముచే భరతునికి యౌవరాజ్యమునిచ్చె లక్ష్మణుఁడు మిక్కిలి భక్తితో రామసేవాపరాయణుఁడై యుండెను॥ ౧౭౦॥ పూర్వ

## శ్రీరాముని రణయజ్ఞవర్ణనము.

పూర్వము విశ్వామిత్రుని యజ్ఞమున శ్రీరాముఁడు ఏరణయజ్ఞమున కారంభిచె దానినిప్పుడు పూర్తిచేసెను. ఆరణయజ్ఞమును చక్కఁగా వర్ణించెదను. వినుము—ర రంగమే యజ్ఞకుండము. పరుగెత్తకయుండుటే వేదవిధానంబు. రణకర్మయే బ్రహ్మసద్మ శస్త్రంబుల ఖణనాదమే వేదశస్త్రములు. శస్త్రములకు సానపెట్టుట స్రుక్స్రువమార్జనం నేలఁబడిన బాణములే పరిస్తరణంబులు. ధైర్యమే పరిసమూహము. గొప్పకాలాగ్నియే యజ్ఞ శ్వరుఁడు. బాణమను స్రువముచే మాంసాహుతి సమర్పణమగును. రక్త ధారయే వసోర్ధార హాహాయను నాదమే ప్రణవాదినాదము. శస్త్రకాంతులే యగ్నిజ్వాలలు. ఘర్మ స్రావ ధూమ్రము. వీరులచేతి యస్త్రము లూడిపడుట జ్వాలాతిశయమున శేయు పృషదాజ్య సేచ నబడును. జ్ఞానముతోడ జీవబలినిచ్చుట దీపబలిప్రదానము. దేహాభిమానము గల యే

౼సహైవహి॥౭౩॥ కృతాధ్వరసమాప్తిస్తు విశ్వామిత్రేణవై పురా । విసర్జితో౽పరామేణ దృష్ట్వా౽తృప్తం స్వరే ॥౭౪॥ కాలానలంపునస్తస్య తృప్త్యర్థంచా౽రోష్మతిం । కృత్వాభూమేర్వాహాత్పాత్రం విరాధరు ౼ ॥౭౫॥ పాత్రస్యప్రోక్షణంకృత్వా చిత్రాహుత్యర్థమాదరాత్ । రామశ్శూర్పణఖాయాశ్చ ఘ్రాణం విభేదయత్॥౭౬॥ ప్రాణాహుతిభ్యోరామేణ త్రిశిరాఃఖరదూషణౌ । మారీచశ్చకబంధశ్చ పంచైతేనిహ ణాత్॥౭౭॥ శిఖాబంధవిమోక్షార్థం శబరీభవబంధనాత్ । కృతాముక్తాతురామేణ జలస్పర్శనహేతవే॥ నేత్రయోర్నిహతో వాలీ దత్తంతద్రుధిరంతదా । క్వథిల్లంకాపురీదగ్ధా కుంభకర్ణస్తథౌదనః ॥౭౮॥ ప క్వమింద్రజిత్ జ్ఞేయ శ్శాకార్థంరాక్షసాహతాః । వరాన్నంసారణో జ్ఞేయః ప్రహస్తోవటకఃస్మృతః ॥౮౦॥ని కర్పటో జ్ఞేయః కుంభస్తులవణంస్మృతం । పాయసార్థంకాలనేమి స్త్వతికాయస్సశర్కరా ॥౮౧॥ క్షీ రావణో జ్ఞేయో ఘృతంమైరావణఃస్మృతః । దధ్యోదనస్సరూపస్తు అహావేచసరావణః ॥౮౨॥ హుత్వానివేది ౦త్రః తస్యకాలానలస్యచ । ఉచ్ఛిష్టబలిసంత్యాగః కేశత్వక్కీకసాదినాం ॥౮౩॥ సంత్యాగో త్రరణేజ్ఞేయస్త ప్తోబభూవసః । తతోరణాధ్వరస్యా౽త్ర రాఘవేణవిసర్జనం॥౮౪॥ అయోధ్యాయాంప్రవేశో౽పి కృతస్తత్తే మ్యహం । అధ్వరావభృథస్నానం జ్ఞేయంరాజ్యాభిషేచనం ॥౮౫॥ మంగళానిసమస్తాని యజ్ఞాంగవిహితా

రామునిచేతి చావునందక వెరచి పరుగెత్తిరో వారుబలిదీపహారులు. బలిభక్షణ దోషము వారు ముక్తినొందరైరి. తలలచే పూర్ణాహుతులు. జయమునకై వీరులుచేయు సహో నమే ప్రదక్షిణము. నిజపదప్రదానమే దక్షిణయనఁబడును. దేవపుష్పవృష్టి బ్రాహ్మణాభి ము. జయించుటే శ్రేయస్సునందుట. స్థావరజంగమానందంబు నిజగోత్రానందంబు. భూత ద్రయే విప్రసంతుష్టి. ఇట్లు శ్రీరాముఁడు సుబాహువుతోడ రణయజ్ఞము నొనర్చెను. అట్లే శ్వామిత్రుఁడు యజ్ఞముచేసెను. అవిరెండును సమముగా నడిచెను. విశ్వామిత్రుఁడు మును యజ్ఞమును ముగించెను. రాముఁడైననో రణయజ్ఞమును ముగించలేదు. మరల నా కాలాన ంను తృప్తిపరచుటకై ఇప్పుడమినే పాత్రమనుకొని విరాధుని రక్తముచే పాత్రమును ప్రో ) శూర్పణఖయొక్క ముక్కు చెవులచే చిత్రాహుతుల నిడెను. త్రిశిరుఁడు ఖరుఁడు దూష ప మారీచుఁడు కబంధుఁడు వీరియిదుగురిని పంచప్రాణాహుతులుగాఁ జేసెను. శ్రీరాము శిఖాబంధవిమోక్షమునకై సంసృతిబంధమునుండి శబరితొలగింపఁబడెను. రాఘవుఁడు డ్లకు నీళ్లుతుడుచుటకై వాలిని చంపి వానిరక్తమునిచ్చెను.లంక కాల్పబడుట యేహవిఃపాకము. ంభకర్ణుఁడే ఓదనము. ఇంద్రజిత్తు పక్వాన్నము. రాక్షసు లేకూరలు. శాల్యన్నము సారణుఁడు. హస్తుఁడువడియము. నికుంభుఁడేఅప్పళము.కుంభుఁడేఉప్పు.పాయసముకాలనేమి. అతికాయుఁ ంచదార. ఐరావణుఁడుపాలు. నెయ్యిమైరావణుఁడు. రణయజ్ఞసమాప్తిలోని దధ్యోదనమే ావణుఁడు. ఇట్లు శ్రీరాముఁడు అందరినిచంపి భోజనవస్తువులునుగాఁజేసి యప్పాత్రమును కా

థపరమాత్మాపి కార్యాధ్యక్షో౽తినిర్మలః ॥ ౯౭ ॥ కర్తృత్వాదిప... ...సర్వదా । స
సంతుష్టో లోకానాముపదేశకృత్ ॥ ౯౮ ॥ చకారవివిధాన్ధర్మాన్ గార్హస్థ్యమనులంఘ్యచ । నపర్య
వా నచవ్యాలక...భయం ॥ ౯౯ ॥ నవ్యాధితంభయంచాసీ ద్రామేరాజ్యం ప్రశాసతి । ఔరసానివ ర
గోపపితృవత్ప్రజాః ॥ ౧౦౦ ॥ సీతయాబంధుభిస్సార్థం సాకేతేసుఖమాపసః । ఇదంయుద్ధచరిత్రం తే ప్రోక్తండే
తవ ॥ ౧౦౧ ॥ * ॥ ఇతి శ్రీ శతకోటిరామచరితాంతర్గత శ్రీమదానందరామాయణే వాల్మీకీయే సారకాండే
త్రే రామరాజ్యాభిషేక వర్ణనంనామ ద్వాదశస్సర్గః ॥ ... ... ... ... ...

శ్రీశివఉవాచ—ఏకదారాఘవంద్రష్టుం మునిభిఃకుంభసంభవః । యయౌరామేణసంమాన ము
పావిశత్ ॥ ౧ ॥ ఉపవిష్టాఃప్రహృష్టాశ్చ మునయోరామపూజితాః । సంపృష్టకుశలాస్సర్వే రామంకు
వన్ ॥ ౨ ॥ కుశలం తేమహాబాహో సర్వత్రరఘునందన । దిష్ట్యేదానీంప్రపశ్యామో హతశత్రుమరిం
దిష్ట్యాత్వయాహతాస్సర్వే మేఘనాదాదయో౽సురాః । హత్వారక్షోగణాన్సర్వాన్ కృతకృత్యో౽ద్యజీవ
తితేషాంవచశ్శ్రుత్వా రామస్తాన్ప్రాహసుస్మితః । వర్ణ్యమాదౌయుష్మాభి ర్మేఘనాదోద్యకీర్తితః ॥ ౫ ॥

లాగ్నికిచ్చెను. గోళ్లు యెముకలు మొదలైనవాటిని విడచుటయే ఉచ్ఛిష్టబలిత్యాగమ్ము ల
డకార్యాలాగ్ని తృప్తినొందెను. అంత నారఘుపతి రణాధ్వరమును విడిచి అయోధ్యను ప్ర
శించి రాజ్య పట్టాభిషేకము నందుటయే అవభృథ స్నానమనబడును. శ్రీరాముఁడిట్లు యు
గములగు మంగళంబుల నెఱుంగవలెనని రణయజ్ఞమును విడిచెను. పార్వతీ ! ఇట్లు శ్రీరా
రణయాగమును వర్ణించిచెప్పితిని. ఆహా!! సాక్షాత్పరమాత్మయును సదా నిర్వికారుఁ
నిర్మలుఁడునై నిత్యము స్వానందానుభవము నందుండెడు శ్రీరాముఁడు కర్తృత్వాది
తుఁడైనను కార్యాధ్యక్షుఁడై లోకముల కుపదేశము నిచ్చువాఁడై గృహస్థాశ్రమము న
బించి సమస్తధర్మంబుల నాచరించుచుండెను. శ్రీరాముఁడు రాజ్యము నేలుచుండగా ము
పెండ్లియాడలేదు. సర్పభయంబును రోగభయంబునులేదు. తన యౌరసపుత్రులనెట్లో
ప్రజలను పరిపాలించుచుండెను. ఇట్లు సీతతోడ సపరివారంబుగా శ్రీరాముఁడు సాకేతర
నిలో సుఖముగా నుండెను. దేవీ! నీకిట్లు నాచేత శ్రీరాముని యుద్ధచరిత మభివర్ణింపఁ బ
పరమేశ్వరుఁడు మఱియు నిట్లనెను. ... ... ... ...

మునులతోడ నగస్త్యుండు శ్రీరామదర్శనమునకు వచ్చుట.

ఒకప్పుడు శ్రీరాముని దర్శించుటకై ఋషీశ్వరులతోడ నగస్త్యుఁడు వచ్చి,
మునిచే గౌరవసత్కారములనంది కూర్చుండెను. ఇట్లు సుఖాసీనులై సంతుష్టులై స
తులునైన మునులు తమకుశలములను చెప్పి పిదప శ్రీరాముని "శూరాగ్రణీ! నీకుసే



...చేష్టితం । జన్మ ... ... ... మాద్గదతో మమ ॥ ౭ ॥ పురాకృతయుగేరామ పులస్త్యో బ్రహ్మ
తృణబిందుసుతాయాంస పుత్రంత్రైలోక్యవిశ్రుతం ॥ ౮ ॥ నిర్మమే విశ్రవానామధేయం వేదనిధింశుభం।
సుతాయాంచ విశ్రవానిర్మమేసుతం ॥ ౯ ॥ శ్రేష్ఠం వైశ్రవణంతస్మై ప్రసన్నో భూద్విధిశ్చిరాత్ । విధి
నాయాథ తుష్టస్తత్తపసాదదౌ ॥ ౧౦ ॥ మనోభిలషితంతస్మై ధనేశత్వమఖండితం । పుష్పకంచాప్యేకదా
...విశ్రవసం యయౌ ॥ ౧౧ ॥ పుష్పకేణధనాధ్యక్షో బ్రహ్మదత్తేనభాస్వతా । నత్వాతాతంబ్రాప్రాహాన
...మమ ॥ ౧౨ ॥ దత్తంస్థేయం మయాకుత్ర తద్విచార్యవదస్వమాం। విశ్రవాఅపితంప్రాహ విశ్వకర్మ
॥ ౧౩ ॥ లంకానామ్నీపురీశ్రేష్ఠా సాగరే త్రికుటండితా । త్యక్త్వావిష్ణుభయాద్దైత్యా వివిశుస్తాంరసా
౪ ॥ సుఖంత్వంవసతస్యాంహి తథేత్యుక్త్వాధనేశ్వరః । గత్వాతస్యాంచిరంకాల మువాసపితృసంమతః॥
...శ్చిత్త్వథకాలేహి సుమాలిర్నామరాక్షసః । దుహిత్రావ్యచరద్భూమ్యాం పుష్పకేతందదర్శసః ॥ ౧౬॥
చింతయామాస రాక్షసానాంమహామనాః । కైకసీంతనయామాహ గచ్ఛవిశ్రవసంమునిం ॥ ౧౭ ॥ వరయ
స్తేజః ప్రతాపాత్తేసుతాశ్శుభాః । భవిష్యంతిధనాధ్యక్షతుల్యాస్సూ హితకారిణః ॥౧౮ ॥ సాసంధ్యా

పతీ! అంతట నరివర్గంబును జయించి భాగ్యయుక్తుండగు నిను జూచుచుందుము. భాగ్య
మున మేఘనాదుండే మొదలుగాగలరక్కసుల నందరిని సంహరించి కృతకృత్యుండవై రాజి
...న్నావు" అని చెప్పిరి. అదివిని రఘూత్తముడు మందస్మితుండై "మహాత్ములారా! మీా
...దట మేఘనాదునినేల ప్రశంసించితిరి?" అని యడుగగా నగస్త్యముని యిట్లు సాదరము
...ప్పుచున్నాడు;— శ్రీరామా! సంక్షేపముగా మేఘనాదుని జన్మకర్మాది సకలవృత్తాంత
చెప్పెదను వినుము॥ ౭॥ మునుపు కృతయుగమున బ్రహ్మపుత్రుండగు పులస్త్యముని తృ

రావణకుంభకర్ణాదుల జన్మకర్మ వృత్తాంతము.

...పువుయొక్క పుత్రియందు విశ్రవస్సును ముల్లోకములలో సుప్రసిద్ధుండగు మునీంద్రుని
. వేదనిధియగునా విశ్రవస్సు భరద్వాజపుత్రియందు శ్రేష్ఠుండైన వైశ్రవణు నింగనెను.
... తపమొనరించి. చిరకాలమునకు ప్రసన్నుండైన బ్రహ్మవలన నిజేష్టంబగు ధనేశత్వం
పుష్పకంబును వరముగా నందెను. అంతనొకప్పుడు వైశ్రవణుండు పుష్పకము నెక్కి
...నతండ్రినివందించి "మహాగురూ! బ్రహ్మ నాకొకస్థలము నొసంగనందున, నేనెచ్చట
చవలయునో విచారించి సెలవిమ్ము" అని ప్రార్థించెను. అందుకు విశ్రవస్సు "నాయనా!
... నిర్మితంబైన లంకయను దివ్యనగరము సాలంకారముగా సాగరమందున్నది. వెన్ను
...ి అందున్న రక్కసులు రసాతలమున కరిగిరి. దానిలో నీవుసుఖముగా నుండుము."
...నుగ్రహించెను. అట్లేయని వైశ్రవణుండు లంకలో శంక లేక తండ్రియిష్టము చొప్పున



...త్యుం మసంగ్రవ్యవస్థితా । విధుంతిభువిపాద ... [illegible] ... ముఖస్థితా
విశాత్వం సాహత్వంవేత్తుమర్హసి । తతో ధ్యాత్వామునిస్సర్వం జ్ఞాత్వాతాంప్రత్యభాషత ॥ ౨౦ ॥
లక్షితం మత్తఃపుత్రానభీప్పసి । దారుణాయాంతువేలాయా మాగతాసిసుమధ్యమే ॥ ౨౧ ॥ అతస్తేదా
రాక్షసాః సంభవిష్యతః । సాప్రబ్రవీన్మునిశార్దూలం త్వత్తోప్యేవంవిధాసుతా ॥ ౨౨ ॥ తామాహాంతిమజో యః
స్తిమహామతిః । తతస్సాసుషువేపుత్రాన్ యథాకాలేసుమధ్యమా ॥ ౨౩ ॥ రావణంకుంభకర్ణంచ క్రూరం
నఖాంశుభాం । కుంభీనసీంకనీయాంసం తృతీయంతంవిభీషణం ॥ ౨౪ ॥ రావణఃకుంభకర్ణశ్చ త్రయోదుహిత
దుర్వృత్తాఃప్రాణిభక్షాశ్చ బభూవుర్హువిహింసకాః ॥ ౨౫ ॥ ఏకదారావణోమాత్రా లింగార్థంప్రేషితశ్శివం
ప్రసన్నమకరో త్కైలాసేకమతిదుష్కరం ॥ ౨౬ ॥ కించిత్స్వయంశిరశ్ఛిత్వా వీణాంకర్తుంసముద్యతః । కృ
తంహిదేహస్య తన్మూలంశిరస స్తథా ॥ ౨౭ ॥ తదగ్రంపాదయోఃకృత్వా శంకూనంగులిభి స్తథా । తంత్రీకృత
మాలాభి కృతకోథసహస్రశః ॥ ౨౮ ॥ ఏవంకృత్వాస్వదేహస్య వీణాంపద్మస్వరైర్మహాః । చకారస్వముఖేనైవ
ధర్వంగాయనంశుభం ॥ ౨౯ ॥ తదానందీశ్వరంప్రాహ శంకరోలోకశంకరః । శిరస్సంధాయహస్తేన త్వయా
చోద్యద్యరావణః ॥ ౩౦ ॥ ఆత్మలింగంరాక్షసంత్వాం శంకరోనప్రదాస్యతి । హృద్గతంహిమయాజ్ఞాతంశం...

---

చిరకాలముండెను. ఒకానొకప్పుడు సుమాలియను రాక్షసుఁడు తన పుత్రికను వెంటబె
భూమిలో తిరుగుచు పుష్పకమున కుబేరుని నవలోకించి, రాక్షసులకు హితము నాలోచి
కొని పుత్రియగు కైకసితో « అమ్మా! నీవు మునీంద్రుండగు విశ్రవస్సు వద్దికిపొమ్ము. అత
జస్సును వరముగా నాకర్షింపుము. కుబేరునివంటి కుమారులు నీకు గలుగగలరు. అం
లన మనకు మేలుగలదు. అనిచెప్పెను. అది యట్లే యని నిశ్చయించి సంధ్యాసమయ
నామునియెదుట కాలిబ్రేలిచే నేలగ్రోకుచు తలవంచి నిలిచెను. అతఁడు నీవెవతెవని ౘ
గా మీరే తెలిసికొందురుగాక యని యుత్తరమిచ్చెను. అంత నాముని నిజధ్యానమున
ము నెఱిఁగి యామెకు «నీయిష్టము నెఱిఁగితిని. నావలన కొడుకులను కోరెదవు. సుంద
క్రూరకాలమున వచ్చితివి. అందుచేత నీకు క్రూరరాక్షసు లిరువురు పుట్టగలరు," అని
గ్రహించెను. అందుకాకైకసి నీవల్లను ఇట్టి క్రూరులా పుట్టుదురు? అనివేడగా మఱి
డు కడపటివాఁడు బుద్ధిశాలిగానుండును పొమ్మనెను. అంతనాకైకసి కాలక్రమమున ప
గనెను. మొదటివాఁడు రావణుఁడు రెండవవాఁడు కుంభకర్ణుఁడు. పిమ్మట వరుసగా
శూర్పణఖ కుంభీనసియను మువ్వురుస్త్రీలు. చివరలో నారవవాఁడు విభీషణుఁడు. వీరిఁ
షణుఁడుతప్ప తక్కినవారు చెడ్డనడతగలవారును హింసకులును క్రూరులునై యుందుర
ప్పుడు కైకసి లింగమును తీసికొనిరమ్మని శివసన్నిధికి రావణునిఁబంపెను. వాఁడు కైల
శంకరునిఁ బ్రసన్నునిఁ జేయనెంచి తనతలను కత్తరించి తనకాళ్లలో నిఱికించి వేగు

త్యుక్త్వా ప్రేషణయామాస నందినం త్వయా । ఇతి శంభోర్వచశ్శ్రుత్వా యయౌ నందీ ॥ ౩౨ ॥ శిరస్సంయోజ్య హస్తేన శివోక్తం తన్న్యవేదయత్ । తచ్ఛ్రుత్వా రావణశ్చాపి సమతిక్రమ్య తాం ౩ ॥ చకార పూర్వవద్గానం ద్వితీయదివసే పునః । నందినా శంకరశ్చాపి పూర్వవత్తం న్యవేదయత్ ॥ ౩౪ ॥ ఇ గాన్యేవ గతాని రావణస్య చ । అథ తత్కర్మణా తుష్టశ్శంకరో గాయనేన చ ॥ ౩౫ ॥ భూత్వా ప్రసన్నస్తం వరం వరయ చేతి వై । దృష్ట్వా శంభుం రావణోపి శిరసా తేన సంధితః ॥ ౩౬ ॥ వరయామాస తన్మాత్రే హ్యాత్మ నామమ । యత్నశ్రేష్ఠం పార్వతీం దేహి తథేత్యుక్త్వా దదౌ శివః ॥ ౩౭ ॥ గృహీత్వా గంతుకామం తం పునః ప్రా ప్తదా । మత్తోపార్థం త్వయా వీర దశవారం నిజం శిరః ॥ ౩౮ ॥ ఖడ్గేన చ్ఛేదితం యస్మాత్తస్మాత్తే ద్విశిరాంసి దశ వింశద్భుజాశ్చాపి భవిష్యంతి గిరా మమ ॥ ౩౯ ॥ తదా స రావణస్తుష్టో గిరిజాలింగసంయుతః । వింశద్భుజో వ స్వస్థలం గంతుముద్యతః ॥ ౪౦ ॥ కల్పభేదాచ్ఛతశిరా శతవారం ప్రఖండితైః । స ప్రోక్తస్స్వశిరోభిర్హి వ్యయభుజశ్చ క్వచిత్ ॥ తస్మాద్ధి హ్యతవాన్విష్ణుస్త్వం తాం మార్గే ప్రతార్య వై । తథైవాథ స్త్వేలింగం గోకర్ణం రా త్వయా ॥ ౪౨ ॥ గృహీత్వా స్థాపితం పూర్వం రావణోపి గృహం యయౌ । మందోదరీం హరేర్వాక్యాల్లబ్ధ్వా నుతాం శుభాం ॥ ౪౩ ॥ మాతుః కార్యమసంపాద్య తూష్ణీమేవాతి లజ్జితః । మందోదర్యా ఉరోత్స్వయం వివా

---

ముగా జేసికొని వేళ్లను మెట్లుగా నేర్పరచి తన దేహమునే ఇల్లు వీణాకారముగా నొనర్చి స్వరంబులచే ఆముఖముననే గంధర్వగానమును చేయుచు వచ్చెను. అపుడు లోకమునకు మునిచ్చు శివుఁడు నందిని పిలచి “నీవు పోయి, వాని తలను చేతఁబట్టి ఓరి రావణా! పరమేశ్వరుఁ లింగమును నీకు ఇచ్చుట లేదు. శివహృదయాభిప్రాయమును నేనెఱుఁగుదును. నీవు నీ మునకు పొమ్ము. అని చెప్పి వానిని పంపివేయుము.” అని యాజ్ఞాపించెను. ఆనందియు నట్లే వాని తలను సంధిచి, శివాదేశమును చెప్పెను. అదివిని రావణుఁడు ఆరాత్రి కాగానే మరల నట్లే రెండవతూరి నాతలనతికికొని గానమున కారంభించెను. మరల శివాజ్ఞ దివచ్చి చెప్పిపోయెను. ఇట్లు రావణుఁడు తన తలను పదిమార్లు పదిదినంబులలో శివా ములం జేసి గానము చేయగా సాంబశంకరుండు ప్రసన్నుఁడై వచ్చి వరములు వేడుమనెను. దర్శనమందిన రావణుఁడు ఆకడపటి తల నంటబెట్టుకొని తన తల్లికి ఆత్మలింగము నిమ్మని వరము నడిగెను. నాకు భార్యగా నార్యయగు పార్వతి నిమ్మని రెండవ వరము నడిగెను. ని శివుఁడు వరదుఁడై ఆత్మలింగమును ఆర్యాదేవిని తీసికొని పోవ నెంచుచుండు రావ “ఓరి వీరుఁడా! నీవు నా సంతోషముకొఱకు పదిమార్లు నీ తలలను నఱికి సమర్పించితివి గాన నీకు పదితలలును ఇరువది భుజంబులును నా యాజ్ఞచే కాగలదు.” అని మరల వరముని అంతనా దశగ్రీవుఁడును వింశద్బాహుఁడునయిన రావణుఁడు లింగాంగనలతోడ సం వెడలెను. కల్పభేదముచే కొన్నిచోట్లలో నూరు తలలు ఖండింపఁబడి శతగ్రీవుండని

హాంతోపపూరితః॥౪౪॥ దృష్ట్వైకదా ధనాధ్యక్షం పుష్పకస్థం తు కైకసీ । పుత్రాన్ ధిక్కారయామాస యూయం
డామ్మృతోపమాః॥ ౪౫ ॥ సాపత్నబంధుం యే దృష్ట్వా జాయంతే నాత్రలజ్జితాః । తే మాతృవచనం శ్రుత్వా యయుర్గోక
ర్ణముత్తమం ॥ ౪౬ ॥ దశవర్షసహస్రాణి కుంభకర్ణోఽకరోత్తపః । విభీషణోపి ధర్మాత్మా సత్యధర్మపరాయణః ॥౪౭॥
పంచవర్షసహస్రాణి పాదాంగుష్ఠేన తస్థివాన్ । దివ్యవర్షసహస్రం తు ధూమాహారో దశాననః ॥ ౪౮ ॥ పూర్ణే
ర్షసహస్రేస్వం శిరఃమగ్నౌ జుహావసః । ఏవం వర్షసహస్రాణి నవతస్యాతిచక్రముః॥ ౪౯ ॥ అథవర్షసహస్రే
దశమే దశమం శిరః । ఛేత్తుకామస్య ధర్మాత్మా ప్రసన్నోభూత్ప్రజాపతిః ॥ ౫౦ ॥ ఉవాచ వచనం బ్రహ్మా వరం వర
కాంక్షితం । తదోవాచ దశాస్యస్తు మవధ్యత్వం వరోమ్యహం ॥ ౫౧ ॥ సుపర్ణనాగయక్షేభ్యో దేవేభ్యశ్చాసు
త్వత్తశ్శంభోర్మహావిష్ణో ర్మానుషామేతృణోపమాః॥ ౫౨ ॥ తథేత్యుక్త్వా విధిస్తస్మై దశశీర్షాణి సందదౌ । విభీష
ద్బుద్ధి మమరత్వం దదౌ ముదా ॥ ౫౩ ॥ విమోహితం సరస్వత్యా దేవేంద్రపదకాంక్షిణం । కుంభకర్ణం విధిః ప
రం వరయ వాంఛితం ॥ ౫౪ ॥ సోపి తం వరయామాస నిద్రాం షాణ్మాసికాం శుభాం । షాణ్మాసీయే చైకదినే
బ్రహ్మాపి దత్తవాన్॥ ౫౫ ॥ తతోంతర్ధానమగమ ద్విధిస్తేపి గృహం యయుః। సుమాలీ వరలబ్ధాంస్తాన్ జ్ఞాత్వా

ద్విశతభుజుఁడని చెప్పఁబడియున్నది. గనుకనే శ్రీరామా! మహావిష్ణుఁడు నీవే దారిలో నాత్మ
గమును అపహరించి గోకర్ణమున ప్రతిష్ఠించితివిగదా? హరివాక్యముచే పార్వతినివిడిచి, మ
పుత్రియగు మందోదరిని పెండ్లాడి మాతృకార్యమును నిర్వహింపనేరక మందాత్మయుక్తుఁ
నను మందోదరీ వివాహమువలన నానందము నందియుండెను. ఇట్లుండ నొకప్పుడు కై
పుష్పకమందున్న కుబేరునింజూచి తనపుత్రులను "సవతియన్నను చూచి సిగ్గుపడక యుం
చేత మీరు చచ్చినవారి వంటివారు. పౌరుషము లేనివారు." అని ధిక్కరించెను. తల్లి
విని వారు ఉత్తమంబగు గోకర్ణంబునకుపోయిరి. పదివేలసంవత్సరములు కుంభకర్ణుఁ
నాచరించెను. ధర్మాత్ముఁడగు విభీషణుఁడును సత్యధర్మ పరాయణుఁడై అయి
ములు కాలిబొటనవ్రేలిమీఁదనిలచి తపమునాచరించెను. దశముఖుఁడు
ముల కొకతూరి తనతలను అగ్నిలో నాహుతిగా నర్పించుచు నిట్లు పదివేల
నప్పటికి పదియవతలను కత్తరింప నెంచుచుండగా నప్పటికి ధర్మాత్ముఁడగు ప్ర
మాయెను. అపుడు బ్రహ్మదేవుఁడు ఇష్టముచొప్పున వరము వేడుమనగా రావ
క్షస నాగ యక్ష గరుడాదులవల్లను నీవల్ల శివవిష్ణువు వల్లను నాకు అవధ్యత్వ
వుము. నాకు మనుష్యులు కసవువంటివారలు" అనివరమునడిగెను. అట్లే అగు
పదితలలను మరలనిచ్చెను. విభీషణునికి సద్బుద్ధిని చిరజీవిత్వమును విధివరముగా
వేంద్రపదవిని ప్రార్థింపనెంచి సరస్వతీదేవిచే సంభ్రాంతి నొందింపఁబడిన కుం
బ్రహ్మ వరము వేడుమనెను. వాఁడును "ఆరునెలలు మంచినిద్రపోవుటను ఆరునెల

త్తమాన్ ॥ ౫౬ ॥ పాతాళాన్నిర్భయః ప్రాయాత్ ప్రహస్తాద్యైర్భువం సుఖం । మంత్రివాక్యాద్దశాస్యోపి
సహ్యాత్ సధనదం బలాత్ ॥ ౫౭ ॥ లంకాపుర్యా రాక్షసైస్తు లంకారాజ్యం చకార సః । ధనదః పితరం పృష్ట్వా త్యక్త్వా
లంకాం మహాయశాః ॥ ౫౮ ॥ గత్వా కైలాసశిఖరం తపసాతోషయచ్ఛివం । తేన సఖ్యమనుప్రాప్య తేనైవ పరితో
షితః ॥ ౫౯ ॥ అలకాం నగరీం తత్ర నిర్మమే విశ్వకర్మణా । దిక్పాలత్వమనుప్రాప్య శివస్య వరదానతః ॥ ౬౦ ॥ రావ
విద్యుజ్జిహ్వాయ దదౌ శూర్పణఖాం తదా । పారిబర్హం దదౌ తస్మై దండకారణ్యముత్తమం ॥ ౬౧ ॥ మాతృస్వస్రూ
త్ బంధూన్ త్రిశిరః ఖరదూషణాన్ । సాహాయ్యార్థం దదౌ తస్మై తత్కాంతే తు మృతే చిరాత్ ॥ ౬౨ ॥
ందదౌ హర్షాత్ మధుదైత్యాయ రావణః । దదౌ మధువనం తస్మై పారిబర్హమనుత్తమం ॥ ౬౩ ॥ ఖడ్గజి
ాం క్రాంచీం దదౌ ప్రీత్యా దశాననః । పరలంకాం పారిబర్హం దదౌ తస్మై మనోరమం ॥ ౬౪ ॥ వైరోచన
త్రీం వృత్రజ్వాలేతి విశ్రుతాం । స్వయం దత్తాం ముదోవాహ కుంభకర్ణాయ రావణః ॥ ౬౫ ॥ గంధర్వరాజస్య
శైలూషస్య మహాత్మనః । విభీషణస్య భార్యార్థే సరమాం సముదావహత్ ॥ ౬౬ ॥ తతో మందోదరీ పుత్రం
దమజీజనత్ । జాతమాత్రస్తు యో నాదం మేఘవత్ప్రచకార హ ॥ ౬౭ ॥ తతస్సర్వేఽబ్రువన్ మేఘనాదో
వై జనాః । గుహాయాం కుంభకర్ణోపి నిద్రావ్యాప్తో వినిద్రితః ॥ ౬౮ ॥ తతస్సురావణశ్చాపి దేవగంధర్వకిన్నరాన్ ।

జించుటను" వరముగానడిగెను. బ్రహ్మయు నట్లేయని యనుగ్రహించెను. బ్రహ్మ యంత
నముకాగా వీరును తమయిండ్లకువచ్చిరి. పాతాళమందున్న సుమాలి తనమనములు వర
నందినారని యెఱిగి సంతోషించి నిర్భయముగా ప్రహస్తాదులతోడ పుడమి కేతెంచెను.
ణాసురుండును తనమంత్రులమాటమీఁద బలాత్కారముగా కుబేరుని నిగ్రహించి లంక
పారదోలి, లంకారాజ్యము ననుభవింపఁబూనెను. మహాయశుండగు వైశ్రవణుఁడు తన
షిగి తదాజ్ఞచే కైలాసశిఖరమునకుపోయి పరమేశ్వరుని సంతోషపరచెను. సాంబశం
సుఖమునందెను. అచ్చటనే అలకయను పట్టణంబొకటిని విశ్వకర్మచే నిర్మించి
గ్రహమువలన దిక్పాలకత్వమునొంది యానందించుచుండెను. రావణుఁడువిద్యు
ర్పణఖనిచ్చి దానికిదండకారణ్యమును రాజార్హవస్తుసన్మానముగా నిచ్చెను. దాని
లమునకుచావగా పినతల్లికొడుకులును తనతమ్ములునగు ఖరదూషణత్రిశిరులను
చ్చెను. కుంభీనసిని మధురాక్షసునికి మధువనముతోడ సంతోషముగా నిచ్చె
యనుదానిని ఖడ్గజిహ్వునికి ప్రీతితోనిచ్చి మనోహరంబగు పరలంకను దానికి
ుగానిచ్చెను. రావణుఁడు వైరోచనునియొక్క కూఁతురైన వృత్రజ్వాలయను
ని స్వయంవరముగా కుంభకర్ణునికి పెండ్లిచేసిపెట్టెను. శైలూషుండను గంధర్వ
పుత్రియగు సరమను విభీషణునికి పత్నిగా నంగీకరించెను. అంత నామందోదరి
డను పుత్రునింగనెను. పుట్టినపుడే మేఘమువలె గర్జించుటచేత వాని నందరును

హత్వాఋషీశ్వరాన్నాగాన్ స్త్రియస్తేషాముపాహరత్ ॥ ౬౯ ॥ ధనదోపిచతచ్ఛ్రుత్వా రావణస్యాక్రమంతదా। అధర్మంమాకురుష్వేతి దూతవాక్యైర్న్యవారయత్ ॥ ౭౦ ॥ తతఃక్రుద్ధోదశగ్రీవో జగామధనదాలయం। వినిర్జిత్య ధనాధ్యక్షం జహారతస్యపుష్పకం॥ ౭౧॥ అలకాయాంయదాసీత్స సేనయారావణస్తదా। నిశాయామేకదాభ్రాతుః కుబేరస్యసుతేనహి ॥ ౭౨ ॥ ప్రార్థితాసాపురారంభా చచారఃయతందినం। అజ్ఞాతవృత్తావేగేనయయౌఖాన్నూపురస్వనా ॥ ౭౩ ॥ రావణోపిచతాందృష్ట్వాబలాదేవప్రభుక్తవాన్। చిరాన్ముక్తాఽథవృత్తంసా కౌబేరం సంన్యవేదయత్ ॥ ౭౪ ॥ క్రుద్ధస్సోపిదదౌశాపం రావణాయమహాత్మనే। అద్యాప్రభృతిదశాస్యస్తు విరక్తాంస్త్రియముత్తమాం ॥ ౭౫ ॥ హఠాద్భోక్ష్యతిచేత్తర్హిక్షణమాత్రాన్మరిష్యతి। ఇతిశాపంరావణోపి శుశ్రావచరవాక్యతః ॥ ౭౬ ॥ తదారభ్యస్త్రియం కామమనిచ్ఛంతీంనధర్షయత్। తతోమయంచవరుణం నిర్జిత్యసమరేఽసురః ॥ ౭౭ ॥ స్వర్గలోకమగాత్తూర్ణం దేవరాజజిఘాంసయా। తతోరావణమభ్యేత్యబబంధ త్రిదశేశ్వరః ॥ ౭౮ ॥ తచ్ఛ్రుత్వాసహసాగత్య మేఘనాదఃప్రతాపవాన్। కృత్వాయుద్ధంమహాఘోరం జిత్వాత్రిదశపుంగవం ॥ ౭౯ ॥ ఇంద్రంధృత్వా దృఢంబధ్వా మేఘనాదోమహాబలః మోచయిత్వాస్వపితరం గృహీత్వేంద్రంయయౌపురీం ॥ ౮౦ ॥ బ్రహ్మాతంమే

---

మేఘనాదుండనిపిలచిరి. కుంభకర్ణుఁడు గుహాలో నిద్రాముద్రితుఁడైయుండెను ॥ ౬౮ ॥ పిదప

రావణ దిగ్విజయాది వృత్తాంతము.

రావణుఁడు దేవతలను గంధర్వులను కిన్నరులను ఋషులను నాగులను చంపి వారివారి పత్నులను అపహరించుచు వచ్చెను. కుబేరుఁడు వీని యాక్రమమునువిని అధర్మము నాచరించవలదని దూతలచే చెప్పిపంపెను. అంత నందుచే కోపమునందిన రావణుఁడు అలకాపురమునకువచ్చి కుబేరుని నిగ్రహించి వానిపుష్పకమును అపహరించెను. అలకాపురిలో సేనలతోఁడ రావణుండుండునపుడు ఒకనాడుగాత్రి అన్నయగు కుబేరునిపుత్రుఁడు నళకూబరునిచే ప్రార్థింపఁబడియున్న రంభయను యప్సరస్త్రీ యీయుద్ధవార్త నెఱుఁగనదియై వేగముగా గగనమునుండి దిగెను. రావణుఁడు దాని నూపురనాదమును విని చూచి బలాత్కారముగా పట్టి యనుభవించెను. బహుకాలమునకు విడువఁబడిన రంభ యంతటవచ్చి తద్వృత్తాంతమును కుబేరపుత్రునికి విన్నవించెను. వాఁడు దానినివిని క్రుద్ధుఁడై మహాత్ముఁడగు రావణునికి "ఇదిమొదలు రావణుఁడు అనురాగిణికాకయుండెడు స్త్రీని బలాత్కారముగా ననుభవించిన క్షణముననే చచ్చును గాక" అని శాపమునిచ్చెను. చారులవలన రావణుఁడును ఈసంగతిని వినెను. అదిమొదలు రావణుఁడు తానుమోహితురాలుకాని కాంతను చేరుటలేదు. అంతనారావణుఁడు యమధర్మరాజును వరుణదేవునిని యుద్ధమునజయించి త్వరగా స్వర్గమునకు ఇంద్రుని జయింపనెంచి వెడలెను. అంత నింద్రుఁడు వచ్చి రావణుని బంధించి చెరవేసెను. అదివిని మహాపరాక్రమవంతుఁడైన మేఘనాదుఁడు అత్యంతవేగముగావచ్చిఘోరసంగరంబునొనర్చి దేవేంద్రుని జయించి,

చయామాస దేవేంద్రం మేఘనాదకః । దత్త్వావరాన్రాక్షసాయ బ్రహ్మాస్వభవనంయయౌ ॥ ౮౧ ॥ ఇంద్రజిన్నామ తస్యాసీత్తదారభ్య రఘూత్తమ । రావణాదపియశ్చాసీద్బలిష్ఠస్సురప్రియః ॥ ౮౨ ॥ మేఘనాదాదయశ్చేతి తస్మాత్ప్రోక్తంతవాగ్రతః । ఏతైర్మునీశ్వరైః పూర్వం తన్నిమిత్తంమయేరితం ॥ ౮౩ ॥ రావణోవిజయీలోకాన్సర్వాన్ జిత్వాక్రమేణతు । జిత్వావహ్నింనిఋతించ వాయుం మీశంయయౌముదా ॥ ౮౪ ॥ కైలాసంతోలయామాస బాహుభిఃపరిఘోపమైః । తదాభీతాస్వయందేవీ దోర్భ్యాంసా పరిషస్వజే ॥ ౮౫ ॥ శివోపివామపాదాంగుష్ఠేనకైలాసమూర్ధని । భారందత్వాగిరింఖర్వం చకారాథశనైశ్శనైః ॥ ౮౬ ॥ తదాతద్గిరిసంభూత వల్లిసంధిషుదోర్లతాః । విషజ్ఞా రావణస్యాపి తాఆసన్మర్దితాఃక్షణాత్ ॥ ౮౭ ॥ సతేనాక్రందయామాస స్తంభసంబద్ధచోరవత్ । తదానందీశ్వరేణాపిశప్తోయంరావణేశ్వరః ॥ ౮౮ ॥ చంచలంకర్మఏతత్తేకపితుల్యకులోసుర । వానరైర్మానుషైశ్చైవనాశంగచ్ఛేతితోపివా ॥ ౮౯ ॥ తతఃకాలాంతరేణాయం శంభునైవవిమోచితః । శప్తోప్యగణయన్వాక్యంయ యయౌహైహయపత్తనం ॥ ౯౦ ॥ బహిర్గతంన్నృపంశ్రుత్వా సహస్రార్జుననామకం । మధ్యాహ్నేరావణశ్చక్రేరే వాయాంశివపూజనం ॥ ౯౧ ॥ అథస్తస్మాన్నర్మదాయా భుజపాశైశ్చసేతువత్ । స్తంభయామాసనీరౌఘం జలక్రీడాంగతోర్జునః ॥ ౯౨ ॥ వేష్టితోఽయుతనారీభిః స్తతోయంరావణాంతిదా । ప్లావయామాసధ్యానస్థం జ్ఞాతస్తత్కర్మణా

బలముగా బంధించి తనతండ్రినివిడిపించి యింద్రునితోడ నిజనగరమున కేతెంచెను. అప్పుడు బ్రహ్మదేవుఁడువచ్చి ఇంద్రజిత్తుకు వేడిన వరములనిచ్చి యింద్రుని విడపించికొని నిజలోకమున కుజనెను. అది మొదలు మేఘనాదునికి ఇంద్రజిత్తనుపేరు ప్రసిద్ధమాయెను. శ్రీరామా! రావణునికన్నను మేఘనాదుఁడు బలిష్ఠుండగుటచేత మేఘనాదుఁడే మొదలుగాగలవారిని జయించితివని యీమునులును నేనును నిన్నడిగితిమి॥ ౮౩ ॥ విజయియగు రావణుండిట్లు క్రమముగా

రావణుఁడు కైలాసశిఖరిక్రింద కిచకిచలాడుట మొదలుగాగల యపజయములు.

సర్వలోకములను జయించి అగ్నినిరరుతి వాయువులనుజయించి యీశానజయమునకై కైలాసమును తనభుజములచే పెగలించి యూచెను. అపుడు పార్వతీదేవి వెరచుచు వేగమెవచ్చి పరమేశ్వరుని నాలింగించెను. అప్పుడప్పరమేశ్వరుఁడు తనయెడమ కాలివ్రేలుచే కొండనెత్తినొత్తి తిన్న తిన్నగా భారమునువిడిచి యణచుచువచ్చెను. అపుడప్పర్వత జన్యంబులగులతలనడుమ రావణుని బాహులతలు చిక్కికొని నుఱుమఁబడెను. రావణుఁడందువలన స్తంభమందు బిగదీసికట్టఁబడిన దొంగవలె మొరబెట్టసాగెను. అప్పుడు నందీశ్వరుండు రావణునికి “మిక్కిలిచంచలంబగునిట్టి కపిచేష్టను నీవుచేసినందున నరవానరులచే నాశనము నందుదువుగాక” అని శాపమునిచ్చెను. అటుమీఁద చిరకాలమునకు శివుఁడే కరుణించి విడిచిపెట్టెను. పైన చెప్పినట్లు శపింపఁబడినను లక్ష్యపెట్టక హైహయపట్టణమునకు వచ్చి కార్తవీర్యార్జునుండు బయిటవెడలినట్లు విని మధ్యాహ్నసమయంబున రేవానదీతీరంబున శివపూజఁజేయుచుండెను.

జాతః ॥౯౩॥ ముక్త్వాధ్యానాదికంసర్వం యుద్ధంచక్రేర్జునేనసః। తేనబద్ధోదశగ్రీవః కంఠేరంతుంసుతాయ తం॥౯౪॥ దదౌదశాననంప్రీత్యా కాష్ఠపర్శితహస్తివత్ । కియత్కాలాంతరేణైవ పులస్త్యేనసమోచితః ॥౯౫॥ తతోతిబల మాసాద్యజిఘాంసురరిపుంగవం। సాగరేధ్యానమాసీనం పశ్చాద్భాగేశనైర్యయౌ ॥౯౬॥ ధృతస్తేనైవకక్షేణవాలి నాదశకంధరః । భ్రామయిత్వాతుచతురస్సముద్రాన్ రావణంహరిః ॥౯౭॥ కిష్కింధాంప్రాయయౌ వేగాదగ్రే దృష్ట్వాంగదంశిశుం । ప్రీత్యాతంచుంబనందాతుం దోర్భ్యాంకట్యాంన్యవేశయత్ ॥౯౮॥ తదాబాహోశ్చంచల త్వాత్కక్షాత్సపతితోభువి । తంద్రృష్ట్వాస్వజనాన్ శ్రీశ్చదర్శయామాసవైముదా ॥౯౯॥ ప్రేంఖస్యోపరిపుత్రస్య బబంధాధోముఖంచిరం । ఆసీత్సోంగదమూత్రస్య ధారాధ్రాణానసోసురః ॥౧౦౦॥ స్వయమేవతతోవాలీబహుకా లేగతేసతి । దదావాజ్ఞాందశాస్యాయ తేనసఖ్యంచకారసః ॥౧॥ రావణస్సపునస్థిత్వా పుష్పకంవ్యచరత్సుఖం। పశ్యన్నానావిధాన్వీరాన్ యయౌపాతాలముత్తమం ॥౨॥ తత్రదృష్ట్వాపురంరమ్యంబలేః కోటిరవిప్రభం । తత్తేజో హతతేజస్తత్పుష్పకంనచచాలవై ॥౩॥ తతఃస్వయంయయౌతూష్ణీమేకఏవదశాననః । పురంప్రవిశ్య ద్వారి దదర్శత్వాంహివామనం॥౪॥ కోటిసూర్యప్రతీకాశం పీతకౌశేయవాససం। చతుర్భుజంసపత్నీకం ద్వారరక్షణత

క్రిందిప్రక్కలో కార్తవీర్యార్జునుండు నర్మదానదిని నిజభుజ పాశంబులచే సేతువువలె నీళ్లను స్తంభించి పదివేల పణతులతోడ జలక్రీడన మాచరించుచు ధ్యాననిష్ఠుండగు రావణుని నానీళ్లలో తేలించెను. ఆరావణుఁడు ధ్యానాదికమును వదలి యర్జునినితో యుద్ధమొనరించెను. అప్పుడు హైహయుఁడు రావణునిగొంతును బిగదీసికట్టి ప్రాకుతేనుఁగ నాడించినట్లు తనకొడుకున కాటలాడుటకిచ్చెను. కొంతకాలమయినవెనుక పులస్త్యమునీంద్రునివలన రావణుఁడు విడుపింపఁబడెను. అంత నూరకయుండక కపిరాజగువాలిని జయించనెంచి రావణుఁడు వెడలి సముద్రమున ధ్యాననిష్ఠుఁడైయున్న వాలికి వెనుకప్రక్క తిన్నగాపోయి వానిచంకలలో నిఱికికొనెను. ఇట్లు చిక్కికొనిన రావణుని నెత్తికొని నాలుగు సముద్రములలోను పరిభ్రమించి వేగముగా కిష్కింధకువచ్చుచునెదుటబిడ్డయగు నంగదునిఁజూచి సంభ్రమముతో వానినిముద్దుబెట్టికొనుటకై యెత్తి నడుమున నిడికొనెను. అయ్యవసరంబున చంకలలో నిఱికికొనియున్న రావణుఁడూడిపడెను. వానిని వాలి తనవారికిని శ్రీలకును సంతసముగాచూపి యంగదుని తొట్ల మీఁద తలక్రిందుగా రావణునిఁగట్టిపెట్టెను. ఇట్లుచిరకాలముండగా నారావణుఁడు అంగదుని మూత్రధారలచే ముఖప్రక్షాళణంబుల నందుచుండెను. వాలి తానుగా బహుకాలముగ తింఛెనని దయచేసి రావణునికి పోవనాజ్ఞనిచ్చెను. రావణుఁడది మొదలు వాలితో సఖ్యమునాచరించెను. అంత నసురచక్రవర్తి మరల పుష్పకమునెక్కి యథేచ్ఛముగా సంచరించుచు ననేకవీరులను చూచికొని పాతాళ లోకమునకుపోయి అచ్చట సూర్యకోటి ప్రకాశంబగు బలీంద్రుని రాజధాని నవలోకించెను. దాని తేజస్సుచే నిహతంబై పుష్పకంబు చలించకపోయెను.

త్పరం ॥౫॥ త్వాంప్రాహసదశగ్రీవః కోఽత్రరాజాస్తిమాంవద । తూష్ణీంస్థితో వామనస్త్వ మర్పితంనోత్తరంప్రభో॥
౬॥ తదాత్వాంబధిరంమత్వా సవివేశబలేర్గృహం। తత్రదృష్ట్వాబలింపత్న్యా సారిక్రీడనతత్పరం ॥౭॥ తస్థౌతత్రక్ష
ణంతూష్ణీం బలేర్లక్ష్మీంవ్యలోకయత్ । తావద్దూరంబలేర్హస్తాత్క్రీడాపాశోఽపతత్ భువి ॥ ౮ ॥ తమానేతుంరా
వణస్య బలిరాజ్ఞాపయత్తదా । రావణోపితమానేతుం యయౌపాశాంతికంజవాత్ ॥ ౯॥ ప్రోచ్చచాలభువః పాశం
కరేణనచచాలసః। వింశద్భోర్భిఃక్రమేణాసౌ యావత్పాశమచాలయత్ ॥ ౧౦ ॥ తావదంగులయస్సర్వాః పాశభా
రేణపీడితాః । ననిష్క్రామురిపాశతలా చ్చూర్ణితారుధిరప్లుతాః ॥ ౧౧ ॥ తదామక్రోశదీర్ఘంస చిరకాలందశాన
నః । తతోవిహస్యదాస్యాతం పాశమానీయవై బలిః ॥ ౧౨ ॥ ధిక్ధిక్కృత్వారావణంతం గృహాన్నిష్కాసయద్బ
హిః । తతోధృత్వారాజదూతైస్తదుచ్ఛిష్టైస్తుపోషితః॥ ౧౩ ॥ అశ్వానాంశకృతంనీత్వా ప్రాక్షిపత్ప్రత్యహంబహిః।
ఏకదాద్వారసంగత్వా ప్రార్థయామాసత్వాంముహుః॥ ౧౪ ॥ త్వయాస్వపాదలగ్నస్స్వ పాదాంగుష్ఠేనఖేఽర్పితః।
తదాతిముదితోలంకాం చిరకాలేనరావణః ॥ ౧౫ ॥ యయౌమేనేనిజంజన్మ ద్వితీయంజాతమద్యవై । రావణఃపర
మప్రీత ఏవలోకాన్మహాబలః ॥ ౧౬ ॥ కర్తుంతాన్ స్వవశాన్నిత్యం బభ్రామపుష్పకస్థితః । దృష్ట్వైకదాత్రసాకేతే
పూర్వజంతవదీక్షితం ॥ ౧౭ ॥ అనరణ్యంసంగరేణ చకారపతితంరణే । తదాశప్తోనరణ్యేన మద్వంశేరఘునందన॥

పిమ్మట తానొక్కఁడే యూరిలో ప్రవేశించి, శ్రీరామా! వామనుండగు నిన్ను బలిమందిరద్వారమున జూచెను. కోటిసూర్య ప్రకాశుండును పీతాంబరధరుండును చతుర్భుజుఁడును లక్ష్మీ సమేతుండును ద్వారపాలన దక్షుండునగు నిన్ను "ఇచ్చట యేరాజుగలఁడు? నాకుఁజెప్పుము." అని రావణుఁడు అడిగెను. వామనుండగు నీవు శత్రువగు వానికి నేయుత్తరము నివ్వనైతివి. అప్పుడతఁడు నిన్ను చెవిటివానిగానెంచి బలిమందిరంబును ప్రవేశించెను. అచ్చట తనపత్నితోడ సొగటాలాటలో నాసక్తుండగు బలీంద్రుని నీక్షించెను. అచ్చటనే కొంతసేపూరకయుండి బలీంద్రుని సంపదను వీక్షించుచుండెను. అంతలో బలిచక్రవర్తియొక్క పాచిక దూరమునకు దొరలిపోయెను. సమీపమున నిలచియున్న రావణునింజూచి నీవాపాచికను కొనిరమ్మని యాజ్ఞాపించెను. రావణుఁడు ఆపాచికను తెచ్చుటకు త్వరగా దానివద్దకిపోయెను. మఱి చేతితో దానిని చక్కఁగా కదలించెను. అది నేలనుండి కదలదయ్యె. వీఁడు ఇరువదిచేతులతోను క్రమముగా పాచికను పెగలించునప్పటికి వ్రేళ్లన్నియును పాచికయడుగున నిఱికికొని దానిభారమువలన నలంగి పుడియై నెత్తురుగక్కుచుండగా పెద్దయేడ్పు నేడ్చెను. అంతనాబలిచక్రవర్తి నవ్వి పనికత్తెచే నాపాచికను తెప్పించి ఛీఛీయనిధిక్కరించుచు రావణుని నింటిలోనుండి బయటవెళ్లగొట్టెను. అంత నారాజదూతలచేతఁజిక్కికొని నారియుచ్ఛిష్టముచే పొట్టపోసికొనుచుండెను. అప్పుడు గుఱ్ఱపులద్ది నూడ్చి బయటవేయుట వీనిపనిగానుండెను. ఇట్లుండ నొకప్పుడు ద్వారపాలకుండగు నీవద్దికివచ్చి పలుమారు ప్రార్థించెను. నీవునప్పుడు కృపచేవానిని పాదాంగు

౧౮ ॥ భూత్వాత్వాం సంగరేచైవ సకుటుంబం వధిష్యతి । ఇత్యుక్త్వా స గతో నాకం రావణోపి పురీం యయౌ ॥ ౧౯ ॥ సనత్కుమారమేకాంతే సన్నిరీక్ష్య కదాసురః । నత్వా ప్రపచ్ఛ దేవేషు కో వరశ్చేతి సాదరం ॥ ౨౦ ॥ మునిః ప్రాహ మహావిష్ణుం తచ్ఛ్రుత్వా ప్రాహ తం పునః । విష్ణునా యే హతా యుద్ధే రాక్షసా ద్యాలభంతి కాం ॥ ౨౧ ॥ గతిం చేతి మునిః ప్రాహ తే ముక్తిం యాంతి దుర్లభాం । పునః పప్రచ్ఛ తం నత్వా కేనోపాయేన వై హరేః ॥ ౨౨ ॥ భవిష్యత్యత్ర తే మృత్యుస్తదా తం మునిరబ్రవీత్ । త్రేతాయాం నరరూపేణ రామో విష్ణుర్భవిష్యతి ॥ ౨౩ ॥ అయోధ్యాయాం తదా తేన కృత్వా వైరం సుదారుణం । తస్మాద్వధం కురుష్వత్వ మాత్మనః పరమాత్మనః ॥ ౨౪ ॥ తేన గచ్ఛసి ముక్తిం త్వం తచ్ఛ్రుత్వా స దశాననః । విరోధార్థం జనకజా మాహరద్గౌతమీతటాత్ ॥ ౨౫ ॥ అశోకే రక్షితా తేన మాతృవత్స్వవధేచ్ఛయా । ఏకదా నారదం దృష్ట్వా నత్వా పప్రచ్ఛ రావణః ॥ ౨౬ ॥ భగవన్బ్రూహి మే యోద్ధుం కుత్ర సంతి మహాబలాః । యోద్ధుమిచ్ఛామి బలిభిస్త్వం జానాసి జగత్త్రయం ॥ ౨౭ ॥ మునిర్ధ్యాత్వా చిరాత్ప్రాహ శ్వేతద్వీపనివాసినః । మహాబలా మహాకాయాస్తత్ర యాహి మహామతే ॥ ౨౮ ॥ విష్ణుపూజారతా యే వై విష్ణునా నిహతాశ్చ యే । త ఏవ తత్ర సంజాతా అజేయాశ్చ సురాసురైః ॥ ౨౯ ॥ తచ్ఛ్రుత్వా రావణో వేగాన్మంత్రిభిః పుష్పకేన తైః । యోద్ధుకామో యయౌ గర్వాచ్ఛ్వేతద్వీపాంతికం ముదా ॥ ౩౦ ॥ తత్ప్రభాహత తేజస్కం పుష్పకం నాచలత్పురః । త్యక్త్వా

ష్ఠముచే పైకెగరదన్నిలివి. అంతనతఁడు పరితోషముగా బహుకాలమునకు లంకకువచ్చి చేరెను. అప్పుడు తనకిది రెండవజన్మమనుకొనెనుగదా? శ్రీరామచంద్రా! ఇట్టిమహాబలుఁడు రావణుఁడు పుష్పకాసీనుఁడై మిక్కిలిముక్కువతో లోకంబులను స్వవశంబులనుగాఁ జేయనెంచి నిత్యము సంచరించుచుండును. ఇట్లుండగా నొకప్పుడు సాకేతంబున నీవంశమ్మున పూర్వజుండైన అనరణ్యుఁడు యజ్ఞదీక్షనందియుండునపుడు రావణుఁడువచ్చి యుద్ధముచేసి వానిని రణరంగమున పడద్రోసెను. అప్పుడనరణ్యుఁడు "నావంశమున రఘునందనుఁడవతరించి నిన్ను సకుటుంబముగా సంగరంబున సంహరించునుగాక" అని రావణుని శపించి దివమున కరిగెను. రావణుఁడు ఏకాంతమున నుండెడు సనత్కుమారమునీంద్రునింజూచి నమస్కరించి "స్వామీ! దేవతలలో నెవఁడు శ్రేష్ఠుఁడు?" అని సాదరముగానడిగెను. అందుకు మునీంద్రుఁడు "శ్రీమహావిష్ణుఁడు" అనిపలికెను. మరలరావణుఁడు "స్వామీ! రణమున విష్ణువుచే చంపఁబడిన రాక్షసులు ఏగతినొందుదురు?" అని యడిగెను. అందుకు సనత్కుమారుఁడు "దుర్లభంబగు మోక్షము నందగల"రనగా, రావణుఁడు "నాకు మహావిష్ణువుచే మరణమెట్లుగల్గునో సెలవిమ్ము" అని సప్రణామముగా వేడెను. దానికి మునీంద్రుఁడు "త్రేతాయుగమున శ్రీవిష్ణు నరరూపముతో నయోధ్యలో శ్రీరాముఁడుగా నవతరించును. అప్పుడు వానితో బద్ధద్వేషమును సంపాదించికొని నీయాత్మకప్పరమాత్మవలన మృతినందింపుము. అందువలన నీవు ముక్తినందగలవు." అని యనుగ్రహించిరి. అదివినిన రావణుఁడు సీతోడ వైరవృత్తి నవలంబించుటకై గౌతమీ

విమానంత్రయయా స్వయమేవదశాననః ॥ ౩౧ ॥ ప్రవిశన్నేవతంద్వీపం ధృతో హస్తేన యోషితా । గచ్ఛంత్యా కస్యచిద్దాస్యా పుష్పాణ్యానయితుం వనం ॥ ౩౨ ॥ తయాపృష్టః పరః కోఽసి ప్రేషితః కేనవావద । ఇత్యుక్త్వా లీలయా స్త్రీభిర్హసంతీభిర్ముహుర్ముహుః ॥ ౩౩ ॥ ముఖేషు తాడితో హస్తైర్భ్రామితోఽధోముఖం చిరం । ధృత్వైకం తత్ర దంతాభిః క్షిప్తః కందుకవన్ముహుః ॥ ౩౪ ॥ పరస్పరం హి క్రీడద్భిః కయాత్యక్తస్తు లీలయా । పపాత పరలంకాయాం క్రౌంచాయాశ్చ చమూపకే ॥ ౩౫ ॥ కృపాద్ధస్తాద్వినిర్ముక్తస్తాసాం స్త్రీణాం దశాననః । ఆశ్చర్యమతులం లబ్ధ్వా చింతయామాస దుర్మతిః ॥ ౩౬ ॥ విష్ణునా యే హతా యుద్ధే తేషామేతాదృశం బలం । తస్మాదత్ర నివాసస్తేన శ్వేతద్వీపం ప్రజామ్యహం ॥ ౩౭ ॥ మయి విష్ణుర్యథా కుప్యేత్తథా కార్యం కరోమ్యహం । ఇతి నిశ్చిత్య వైదేహీం జహార రావణో వనాత్ ॥ ౩౮ ॥ జానన్నేవం మహాలక్ష్మీం సజహారావనీసుతాం । మాతృవత్పాలయామాస త్వత్తః కాంక్షన్వధం నిజం ॥ ౩౯ ॥ శ్రీరామచంద్ర ఉవాచ — వాలిసుగ్రీవయోర్జన్మ శ్రోతుమిచ్ఛామి త్వన్ముఖాత్ । కపీంద్రౌ వానరాకారౌ జజ్ఞాత ఇతి తచ్ఛ్రుతం ॥ ౪౦ ॥ అగస్త్య ఉవాచ — మేరౌ స్వర్ణమయే పూర్వం సభాయాం బ్రహ్మణః కదా । నేత్రాభ్యాం పతితం దివ్యమానందాశ్రుజలం తదా ॥ ౪౧ ॥ తద్గృహీత్వా కరే బ్రహ్మా ధ్యాత్వా కించిత్తదత్యజత్ । భూమౌ పతితమాత్రేణ తస్మాజ్జాతో మహాకపిః ॥ ౪౨ ॥ తమాహ ద్రుహిణో వత్స త్వమత్ర వస సర్వదా । ఏవం బహుతిథే కాలే గతే ఋక్షరజాస్సుధీః ॥ ౪౩ ॥

---

తీరమున జానకీదేవి నపహరించి యాతల్లిని తల్లివలెనే అశోకవనమున రక్షించుచుండెను. మఱి యొకప్పుడు రావణుఁడు నారదునిఁజూచి నమస్కరించి, "పూజ్యుఁడా! సెలవిమ్ము. నాతోడ యుద్ధమొనరించుటకు తగిన మహాబలు లెచ్చటగలరు? బలిష్ఠులతోడ యుద్ధముచేయ నెంచెదను. నీవు ముల్లోకములనెఱిఁగిన మునీంద్రుఁడవు." అని ప్రార్థించెను. అందుకు నారదుఁడు కొంత సేపు ధ్యానించి మహాబుద్ధీ! "నీవు శ్వేతద్వీపమునకుపొమ్ము. ఎవరు విష్ణుపూజాపరాయణులో ఎవరు విష్ణువుచే సంహరింపఁబడినవారలో అట్టివారే అచ్చటమూర్తీభవించియుందురు. వారందరును మహాబలులు మహాకాయులు. వారిని దేవరాక్షసులు జయింపచాలరు." అని చెప్పిపొయె. దానిని విని రావణుఁడు మంత్రులతోడ పుష్పకమునెక్కి గర్వించి వారితో యుద్ధముచేయ నెంచి శ్వేతద్వీపసమీపమునకు వచ్చెను. అచ్చటదాని కాంతులచే తిరస్కృతంబైన పుష్పకంబు చలించకపొగా నావిమానమును వదలి రావణుఁడు తానే శ్వేతద్వీపమును ప్రవేశించెను. ఇట్లు వీఁడు పోవుచుండగా నచ్చట పూలగోయుటకు పోవుచున్న కాంతయొకతె వీనిం జూచి చేతఁబట్టికొని "నిన్నెవఁడుపంపెను? చెప్పుము, నీవెచ్చటనుండివచ్చితివి? ఎవఁడవు?" అని పలకరించుచు వినోదముగా వెంటనున్న స్త్రీలును చేరిరాగా వీని చెంపలవాయించుచు కాళ్లబట్టి తలక్రిందుగా నూచుచుండెను. ఇట్లు ఆస్త్రీలు బంతులాడునట్లు వంతులువేసికొని రావణునియొక్కపాదమునుపట్టి విలాసముతో విసరివేయుచు నాటలాడిరి. అప్పుడొకతె తలచే వీనిని నేలబడునట్లు చిమ్మెను. ఈరావణుఁడిట్లో కష్టతరముగా నాస్త్రీపటలమునుండి యూడి

కదాచిత్పర్యటన్మేరౌ ఫలమూలార్థముద్యతః । అపశ్యద్దివ్యసలిలాం వాపీంమణిశిలాచితాం॥ ౪౪॥ పానీయంపాతుమగమ త్తత్రచ్ఛాయామయంకపిం । దృష్ట్వాప్రతికపింమత్వా నిపపాతజలాంతరే ॥౪౫॥ తత్రాదృష్ట్వావారింశీఘ్రంబ హిరుత్ప్లుత్యసంయయా । అపశ్యత్సుందరీంనారీ మాత్మానంవిస్మయంగతః ॥౪౬॥ తతోదదర్శమఘవా సోత్యజద్వీర్యముత్తమం। తామప్రాప్యైవతద్వీర్యం వాలదేశేఽపతద్భువి ॥౪౭॥ వాలీసమభవత్తత్ర శక్రతుల్యపరాక్రమః। భానురప్యాగమత్తత్ర తదానీమేవభామినీం ॥౪౮॥ దృష్ట్వాకామవశోభూత్వా గ్రీవాదేశేఽసృజన్మహత్। బీజంతస్యాస్తతస్సద్యో సుగ్రీవోబలవానభూత్॥ ౪౯ ॥ పుత్రద్వయంసమాదాయ గత్వాసానిద్రితాऽభవత్ । ప్రభాతేపశ్యదాత్మానం పూర్వవద్వానరాకృతిం ॥౫౦॥ తద్వృత్తాంతంవిధిశ్శ్రుత్వా కిష్కింధారాజ్యముత్తమం । దదౌసవానరేంద్రాయపుత్రాభ్యాంతత్రసంస్థితః ॥ ౫౧ ॥ మృతేతస్మిన్విరజస్యభూద్వాలీపుర్యాంకపీశ్వరః । ఏవంతేకథితంరామయథాపృష్టంత్వయామమ ॥౫౨॥ శ్రీరామఉవాచ—యదాసావాలినాబంధుః కిష్కింధాయాబహిష్కృతః॥౫౩॥ తదాతస్యైవసచివః శ్రీమాన్పవననందనః ॥౫౩॥ నవేదకింబలంస్వైజం వాలితుల్యపరాక్రమః ॥ ఇతిరామవచశ్శ్రుత్వా పునస్తంమునిరబ్రవీత్ ॥ ౫౪ ॥ కేసరీనామవిఖ్యాతః కపిరంజనపర్వతే । తస్యపత్నీశుభేపత్న్యా వానర్యావేకదాగిరౌ॥ ౫౫॥ ప్లవంగస్యాంజనీనామ్నీస్థితాతావచ్ఛభాత్తదా । పపాతపాయసమయః పిండోగృధ్రీముఖాద్భువి॥౫౬॥

పరలంకలోనుండు క్రౌంచయొక్క శౌచకూపమునఁగూలెను. అంత రావణుఁడు అహో! విష్ణువునకు కోపమువచ్చునట్లు చేసెదను. నేను శ్వేతద్వీపమున కరిగెదను. విష్ణువుచే యుద్ధమున చంపబడినవారికిట్టిబలము గల్గుచున్నదని యత్యంతాశ్చర్యముతో చింతించి నిశ్చయించి వనమున సీతనపహరించెను. వాఁడు ఈమె మహాలక్ష్మియని యెఱిఁగినవాఁడైనను సీతనపహరించి శ్రీచే మృతినెంచుచు తల్లివలె కాపాడుచుండెను ॥౧౩౯॥ అనిచెప్పుచున్నఁనగస్త్యమునీంద్రుని వారా

వాలి సుగ్రీవులయొక్క యుత్పత్తి వర్ణనము.

మచంద్రుఁడు "మహానుభావా! నీముఖమువలన వాలిసుగ్రీవులయొక్క జన్మవృత్తాంతమును వినఁగోరుచున్నాను. కపివీరులగు వారు సూర్యేంద్రులవలన పుట్టినట్లు వినియున్నాను." అని ప్రశ్నఁజేయఁగా నాముని చెప్పుచున్నాఁడు:—సువర్ణమయంబగు మేరుపర్వతంబునందలి బ్రహ్మసభలో నొకప్పుడు సుఖాసీనుఁడగు బ్రహ్మదేవుని కండ్లలో నానందాశ్రువు లుద్భవించెను. వాటి నావిధిచేతఁబట్టి ధ్యానించి భూమిమీఁద కొంతజల్లెను. అంతనచ్చోట మహాకపియొకఁడుద్భవించెను. బ్రహ్మవానింజూచి నీవిచ్చటనే నిరంతరము వసించుచుండుమనెను. ఇట్లుచిరకాలముగతించిపోఁగా నావిరజుండను ఋక్షుఁడు ఒకప్పుడు ఫలమూలాదులకై మేరువులో పరిభ్రమించుచు, మణిశిలలచే నిర్మింపఁబడి యమృతోదకముగల్గిన బావినిచూచెను. అక్కడఁ నచ్చటనీరుఁద్రావఁగోరి తనప్రతిచ్ఛాయనుచూచి ఇంకొకవానరుఁడనిభ్రమించి నీళ్లలోఁబడెను. అచ్చటకపినిఁగానక బయటవచ్చి తానొకసుందరాంగియగు సుదతిగానుండుటనెఱిఁగివిస్మయమునొందెను. ఇంద్రుఁడుచూ

యదానీతస్తు కైకేయ్యాః కరాద్గృధ్రోతిశుభః పురా । తంపిండంభక్షయామాస వానరీవ్యభ్ర్యతోపమం ॥౫౭॥ ఏతస్మిన్నంతరేతత్ర మార్జారాఖ్యాసమాగతా । పతినారహితేద్వేతే క్రీడంత్యావసనంతయోః ॥౫౮॥ అహారత్పవనోవేగా ద్దృష్ట్వావాయుస్తుదూరతః । అంజనీంప్రార్థయామాస తదాభోగంచకారసః ॥౫౯॥ తత్రైవప్రార్థయామాస మార్జారాఖ్యాంసనిఋతిః । తయాఽకరోద్రతింతత్ర సోపిపర్వతమూర్ధని ॥౬౦॥ తయోస్తాభ్యాంసముత్పన్నా వానర్యామారుతాత్మజః । మార్జార్యాస్సమభూద్ఘోరః పిశాచోఘుర్ఘురస్వనః ॥౬౧॥ చైత్రేమాసిసితేపక్షేహరిదినే మఘాభిధే । నక్షత్రేసనముత్పన్నో హనుమాన్రిపుసూదనః ॥౬౨॥ మహాచైత్రీపూర్ణిమాయాం సముత్పన్నోఽంజనీసుతః । వదంతికల్పభేదేన బుధాఇత్యపికేచన ॥౬౩॥ బాలభావేపియఃపూర్వం దృష్ట్వోద్యంతంవిభావసుం । మత్వాపక్వఫలంచేతి జిఘృక్షుర్లీలయోత్ప్లుతః ॥౬౪॥ యోజనానాంపంచశతం వాయువేగేనమారుతిః । రాహుస్తస్మిన్దినేదర్శే యయౌసూర్యంరఘూత్తమ ॥౬౫॥ తావద్దృష్ట్వాథర్తుకామం రవేరగ్రేకపింస్థితం । తదారాహుర్భయాదేవ రవిముక్త్వేంద్రమాయయౌ ॥౬౬॥ రాహుఃప్రాహశచీనాథం తవపీడాంకరోమ్యహం । ఇతఃపూర్వంత్వయాసూర్యః పీడాంకర్తుంసురేశ్వర ॥౬౭॥ తత్రవిఘ్నంసముత్పన్నం తత్త్వంశీఘ్రంనివారయ। తద్రాహువచనాదింద్రస్సమారుహ్యగజోపరి ॥౬౮॥ దేవైర్యుతోయయౌవేగా ద్దదర్శప్లవగంపురః । తదామమోచతంవజ్రం వృషభవామా

చిమోహావశమున రేతస్ఖలనమునందెను, అది తద్వనితనందక దాని వాలదేశమున నేలఁబడెను. అచ్చట యుద్భవించినవాడు వాలియను పేరుతో నింద్రసమపరాక్రముఁడై బరగెను. అప్పుడే ఆ భామనుచూచి భానుఁడు మోహించివచ్చి ఆమెయొక్క గ్రీవాదేశంబున వీర్యమును వదలెను. అంతనచ్చటనప్పుడే యుద్భవించినవాఁడు సుగ్రీవుండనబడి బలిష్ఠుఁడునై బరగెను. ఆసుందరి ఆ యిరువురి నెత్తికొనిపోయి ఒకప్పుడు నిద్రించుచుండి తెల్లవారిలేచి మునుపెట్లో అట్లే తాను పురుషవానరాకృతి నొందియుండునట్లు తెలిసెను. ఆవృత్తాంతమును బ్రహ్మ తెలసి వచ్చి కిష్కింధారాజ్యము నాకపీంద్రునికిచ్చి యచ్చట నాపుత్రద్వయముతోడ విరజుని స్థాపించి పోయెను. ఆఋక్షుఁడు మృతినందగా విరజుని పురమున వాలి కపిరాజై యుండెను. అనియగస్త్యుండు శ్రీరామునితో నీవడిగిన వాలిసుగ్రీవవృత్తాంతము నెఱిఁగించితి ననెను॥౧౫౭॥ అంత నాశ్రీరాముఁడు

శాపగ్రస్తుఁడగు హనుమంతుఁడు తనబలమును తానెఱుఁగక పోవుట.

"స్వామీ! వాలి తమ్ముఁడగు సుగ్రీవుని వెళ్లగొట్టినపుడు వాలివంటి బలవంతుఁడు హనుమంతుఁడు సుగ్రీవుని మంత్రిగానుండియును తనసహజబలము నెఱుఁగలేదా?" అని యడుగగా నగస్త్యుఁడిట్లనెను. అంజనపర్వతంబున కేసరియను కపివీరుఁడు మిక్కిలి ప్రసిద్ధుఁడు. ఆగిరిలో నిరువురు వానరస్త్రీలు వానికి పత్నులుగలరు. అంజనయను పేరుగల పెండ్లాము ఒకప్పుడు విశ్రాంతిగా నుండువేళలో గగనమునుండి గ్రద్దనోట పీడిన పాయసపిండంబొకటి నేలఁబడెను. కైకేయి చేతిపాయసపిండమును గ్రద్దతన్నుకొనివచ్చినదే, ఆ దీనిని అమృతతుల్యంబగుదానిని అం

రుతింప్రతి ॥౧౯॥ వజ్రఘాతాన్మారుతిః ఖాత్పపాతగిరికందరే । తదాభగ్నా హనూస్తస్య హనుమానితి విశ్రుతః ॥ ౨౦॥ ఖ్యాతింగతోయంసర్వత్ర తదావాయుశ్చుకోపహ । సాంత్వయిత్వాహనూమంతం స్వయం స్తబ్ధోఽభవత్తదా ॥ ౨౧॥ వాయుస్తంభాజ్జనాస్సర్వే నిపేతుర్ధరణీతలే । త్రైలోక్యంశవవజ్జాతం హాహాకారోఽభవద్దివి ॥౨౨॥ తదాభిక్రుత్యదేవేంద్రం వేధావాయుంయయాజవాత్ । ప్రార్థయామాసతంనత్వా పునర్వాయుంవచోఽబ్రవీత్ ॥ ౨౩ ॥ దేవేంద్రస్యాపరాధంత్వం క్షంతుమర్హసికంపన । తవపుత్రాయదాస్యామి వరానద్యహనూమతే ॥౨౪॥ తదాతుష్టోభవద్వాయుశ్చచాలపూర్వవత్పునః । అభూత్సంజీవితంసర్వం త్రైలోక్యంక్షణమాత్రతః ॥౨౫॥ తదాదదౌవరాన్బ్రహ్మా మారుతింపురతఃస్థితం । భవిష్యసిత్వమమరో వజ్రదేహోవరాన్మమ ॥ ౨౬ ॥ త్వంవిష్ణోరపిసాహాయ్యం కరిష్యసివరాన్మమ । తేకుంఠితాగతిర్మాస్తు పుత్రాఞ్జనిసంభవ ॥౨౭॥ భవిష్యతిహరౌభక్తిస్తవనిత్యమనుత్తమా । ఇత్యుక్త్వాంతర్దధేవేధా రాహుస్సూర్యంయయౌపునః ॥౨౮॥ శ్రీరామఉవాచ — దేవేంద్రేణకథందత్తో రవిస్తస్మైసరాహవే । తత్సర్వంవిస్తరేణైవ కథయస్వమమాగ్రతః ॥౨౯॥ అగస్త్యఉవాచ — సుధాపానాదయంరాహుర్దైత్యోభూదమరస్స్వయం । గ్రహోష్టమోఽభవత్సోఽపి యదావాంఛత్యయంసురాన్ ॥౩౦॥ పీడాంకర్తుంతదాదేవాన్ సూర్యంసోమందదంతిహి । జ్ఞాత్వాదమైర్జనాస్సర్వే విజకర్మాదిహేతవే ॥౩౧॥ మోచయిష్యంతిరాహోశ్చ శశినంభా

జనాదేవి భక్షించెను. అప్పటికి మార్జారాస్యయను మఱియొకతెయును వచ్చెను. పతివిరహితలగు వారిరువురు విహరించుచుండగా గాలివీచుటలో వారివస్త్రము లెగిరినవి. వాయుభట్టారకుఁడు దూరమునుండి యంజనను చూచి ప్రార్థించి భోగించెను. అట్లే యమ్మార్జారాస్యను నిరబుతి మోహించి క్రీడించెను. అంజనాగర్భంబున మారుతాత్మజుం డవతరించెను. మార్జారాస్యకు మహాపిశాచంబు పుట్టెను. రిపుసంహారకుండగు నాంజనేయుఁడు చైత్ర శుక్లైకాదశీ మఖానక్షత్రమున పుట్టినట్లును, చైత్రమాసపూర్ణిమయందు పుట్టినట్లును కల్పభేదమున పండితులు వచించెదరు. హనుమంతుఁడు బాల్యచేష్టవలన నుదయించుచుండు సూర్యబింబమునుచూచి పండినపండనియెంచి పట్టదలచి గంతును ౫౦౦ యోజనములవంతున వినోదముగా పైకెగిసెను. నాడమావాస్యయగుటచే రాహువు సూర్యునిఁగ్రసించుట కేగెను. వాఁడుపోయి సూర్యునివద్దనున్నకపివీరునిఁజూచి వెరచి రవిని వదలి యింద్రునివద్దికివచ్చి "దేవేంద్రుఁడా! నిన్ను పీడించెదను. ఇంతకుమునుపు రవిని పీడించునట్లు నీవేయేర్పరచితివి. అందుకు విఘ్నముగల్గినది. దానిని మొదట నివారింపుము." అని యదలించెను. ఆమాటవిని వెంటనే యింద్రుఁడు ఐరావతమునెక్కి దేవతలతోడవచ్చి ఈప్లవంగమునుచూచి తన వజ్రాయుధముచే నాంజనేయునిఁ బడమొత్తెను. అంతనాకపి నేలఁబడి చెంపతెగిపోవుటచేతనే హనుమంతుఁడనుపేరునొందెను. అప్పుడు వాయుదేవుఁడు మిక్కిలి క్రోధమునంది యాంజనేయునికి సమాధానమునుచెప్పి తాను స్తంభించి కూర్చుండెను. జనులందరును వాయుస్తంభనమున నిశ్చేష్టితులై నేలగూలిరి. ముల్లోకంబు

స్ఫురం ప్రతి । యదాయదాభవత్యత్రో పరాగో జగతీతలే ॥౮౨॥ తదాతదాజనాధమైర్కేర్నిజగత్యత్ర మాదరాత్ । తోష యిత్వా సదారాహుం తే తత్ప్రాన్నోచయంతిహి ॥౮౩॥ ఏతత్సర్వం మయాప్రోక్త ముపరాగస్యకారణం । జన్మకర్మ వరాదానం మారుతేశ్చాపి విస్తరాత్ ॥౮౪॥ అతస్తద్బలమాహాత్మ్యం కోవాశక్నోతివర్ణితుం । సఏకదామునీనాం హి చాశ్రమేషుకుశాదికాన్ ॥౮౫॥ చకారేతస్తతస్సర్వాన్వ్యధయన్ యన్మునిబాలకాన్ । తస్యతత్కర్మ మునిభిర్ద్రష్ట్వాశప్తోంజనీసుతః ॥౮౬॥ అద్యారభ్యకపిశ్రేష్ఠ నజ్ఞాస్యతిస్వపౌరుషం । యదాన్యస్యముఖాత్స్వీయం బలంశ్రోష్యసివిస్తరాత్ ॥౮౭॥ భవిష్యతితదాపూర్వ స్మృతిస్తే పౌరుషం పునః । అతస్సుగ్రీవసాన్నిధ్యే విస్మృతఃస్వపరాక్రమః ॥౮౮॥ యదాస్తుతో జాంబవతా పురాప్రాయోపవేశనే । తదాస్మృతిస్తస్యజాతా స్వబలస్యహనూమతః॥౮౯॥ ఏతత్తే సర్వమాఖ్యాతం త్వయాపృష్టం మయానఘ । యథాకథాసవిస్తారం కపిరావణచేష్టితం ॥౯౦॥ రామత్వం

లును పీనుగులవలె నిస్తేజస్కంబులైనవి. స్వర్గమున హాహాకారముపుట్టెను. అప్పుడు బ్రహ్మాదేవుఁడు ఇంద్రుని ధిక్కరించి, వాయునన్నిధికివచ్చి యతనినివందించి “ప్రకంపనుఁడా! దేవేంద్రుని యపరాధమును క్షమింపగలవాఁడవు. నేను నీకోరుదుకునకు వరములనిచ్చెదను.” అని ప్రార్థించగా; నంతననిలుఁడు యథాపూర్వముగా చలించెను. సర్వప్రపంచములును బ్రతికెను. అప్పుడు బ్రహ్మముందున్న హనుమంతునికి “నీవమరుండుగానుండుము. నీదేహము వజ్రదేహమగును. నీవు మహావిష్ణువునకు సాహాయ్యముగానుండుము. నీకు పరమోత్తమంబగు హరిభక్తి యెడతెగకయుండని.” అనియిట్లు అమోఘవరంబులనొసంగి సత్యలోకమునకుఁ జనెను. రాహువు మరలసూర్యునిఁ బీడింపఁబోయెను॥ ౧౭౦ ॥అనిచెప్పిన నగస్త్యమునిని శ్రీరాముఁడు “స్వామీ! రా

సూర్యచంద్ర గ్రహణనైమిత్తిక విచారము.

హువునకు దేవేంద్రుఁడు రవి నెట్లిచ్చెను?ఆసంగతిని విస్తరించిచెప్పవలయునని ప్రార్థింపగా నగస్త్యముని చెప్పుచున్నాడు. తానుగా నీరాహువు అమృతపానముచేత నమరత్వమునందెను. వాఁడే ఎన్మిదవగ్రహముగా నేర్పడెను. వీఁడెప్పుడు దేవతలను బాధింపనెంచునో అప్పుడు దేవతలకుప్రతిగా చంద్రసూర్యులనిచ్చునట్లు దేవేంద్రుఁడు నియమించికొనెను. (తేజోగోళాధిపతులుగాన తమోబాధ నోర్వగలవారని సూర్యచంద్రులను రాహువున కొప్పగించినట్లు భావించదగును.) ధార్మికులగులోకులందరును తమకర్మకు మూలభూతులైన సూర్యచంద్రులకు పీడాపరిహారకంబుగా ధర్మంబులనాచరించుచు రాహుప్రీతినొనర్చి ధన్యులగుచుందురు. శ్రీరామచంద్రా! ఇట్లు గ్రహణతత్వమును ఆంజనేయుని జన్మకర్మవృత్తాంతమును చెప్పితిని. అట్టి హనుమంతుని బలమహిమను చెప్పుటనాదరమా? ఎవరునుచెప్పఁజాలరు. ఆహనుమంతుఁడొకప్పుడు ఋష్యాశ్రమంబులలో కుశాదులను ఇటటుమార్చుచు మునిబాలకులను వెరపించెను. ఆచేష్టనుచూచి య్యామునులు “కపిశ్రేష్ఠుఁడా! ఇదిమొదలు నీపరాక్రమమును నీవెరుగక పోదువుగాక. ఇతరుఁడె

పరమేశ్వరోసి సకలంజానాసివిజ్ఞానదృక్ । భూతంభవ్యమిదంత్రికాలకలనాసాక్షీ వికల్పోజ్ఝితః ॥ భక్తానామ
నువర్తనాయసకలాం కుర్వన్ క్రియాసంహతిం । చాల్ప్యాన్మనుజాకృతిర్మమవచో భాసీశలోకార్చితః ॥ ౯౧॥ శ్రీ
శివఉవాచ — స్తుత్త్వైవంరాఘవంతేన పూజితఃకుంభసంభవః । స్వాశ్రమంమునిభిస్సార్థం ప్రయయాగుప్తవిగ్రహః
॥౯౨॥ వింధ్యాచలంనిజంరూపం సమునిస్సైవదర్శయత్ । పునరుత్థాస్యతిగిరి స్సర్వదాచేతితద్భయాత్ ॥౯౩॥ రా
మస్తుసీతయాసార్థం భ్రాతృభిస్సహమంత్రిభిః । సంసారీవరమానాథోరమమాణోవసద్గృహే॥ ౯౪ ॥ అనాసక్తోపి
విషయాన్ బుభుజేప్రియయాసహ । హనుమత్ప్రముఖైస్సద్భి ర్వానరైఃపరిసేవితః ॥ ౯౫ ॥ రాఘవేశాసతిభువం
లోకనాథేరమాపతౌ । వసుధాసస్యసంపన్నా ఫలవంతశ్చభూరుహాః ॥ ౯౬ ॥ జనాఃస్వధర్మనిరతాః పతిభక్తిప
రాఃస్త్రియః । నాపశ్యత్పుత్రమరణం కశ్చిద్రాజనిరాఘవే ॥ ౯౭ ॥ సమారుహ్యావిమానాగ్ర్యం రాఘవస్సీతయాస
హ । వానరైర్భ్రాతృభిస్సార్థం సంచచారావనింప్రభుః ॥ ౯౮ ॥ అమానుషాణికర్మాణి చకారబహుశోభువి, లో
కానాముపదేశార్థం పరమాత్మారఘూత్తమః ॥ ౯౯ ॥ కోటిశశ్శివలింగాని స్థాపయామాససర్వశః। అశ్వమేధాదివివి
ధాన్ యజ్ఞాన్ విపులదక్షిణాన్ ॥ ౨౦౦ ॥ చకారపరమానందో మానుషంవపురాస్థితః । సీతాంతాంరమయామా
స సర్వభోగైరమానుషైః ॥ ౧ ॥ శశాసరామోధర్మేణరాజ్యంపరమధర్మవిత్ । కథాస్సంస్థాపయామాస సర్వలో

ప్పుడు నీబలమహిమను విస్తరించి చెప్పగా వినుచుందువో అప్పుడు మునుపటిపౌరుషమును స్మ
రించికొందువుగాక." అనిశాపమునిచ్చిరి. అందువలన సుగ్రీవసన్నిధిలో స్వపరాక్రమమును
మరచియుండెను. కపులు ప్రాయోపవేశమునందినపుడు జాంబవంతునిచే పొగడబడిన హను

### అగస్త్యముని శ్రీరామునిస్తుతించి సత్కృతుండై చనుట.

మంతునికి నిజమహిమజ్ఞప్తికివచ్చెను. ॥౨౮౯॥ రఘుపతీ! కపిరావణచరితాది సర్వవృత్తాంతంబు
ను విన్నవించితిని. స్వామీ! నీవేసాక్షాత్పరమేశ్వరుండవు. సర్వజ్ఞుండవు. భూతభవిష్యద్వర్తమా
నకాలంబులకు సాక్షిగానుందువు. నీయందెట్టివికల్పంబులును లేవు. భక్తులననుగ్రహించుటకై
ఈ లోకవ్యాపారంబులను నటించుచు మనుష్యాకృతితో నామాటలనిట్లు మన్నించుచుందువు.
నీవేలోకైక పూజ్యుండుగానుండెదవు. అని యిట్లుఅగస్త్యుఁడుస్తుతించి,శ్రీరామునిచే సత్కరింపఁ
బడిమునులతోడ సంతర్పితుండై నిజాశ్రమంబునకుఁ జనెను.॥౧౯౨॥ తన నిజరూపమును వింధ్య

### శ్రీరాముని మానుషలీలా వినోదము.

నికి కనుపరచిననతఁడు మరల లేచునని యగస్త్యుఁడంతర్ధానమునొందెను. పార్వతీ!వినుము. శు
ద్ధబ్రహ్మంబగు నారామమూర్తి బద్ధసంసారివలె సోదరులతోడను సీతతోడను మంత్రులతోడ
ను లీలావినోదంబుల నందుచుండెను. తాననాసక్తుఁడైనను పరమాసక్తుఁడై జానకీదేవితోడ
జాయాసుఖమందుచుండెను. హనుమంతుఁడె మొదలైనవారివలన సేవింపబడుచుండెను. లోక
నాథుఁడును లక్ష్మీనాథుఁడును అగు రఘునాథుఁడు రాజ్యమేలుచుండగా సర్వియుర్వరగానుండె.

కమలాపహః ॥ ౨ ॥ ఏకాదశసహస్రాణి సైకాదశసమానిచ । త్రేతాయుగభవాన్యేవ వర్షాణిరఘునందనః॥౩॥ చకారరాజ్యంధర్మేణ లోకవంద్యపదాంబుజః । కలేర్మానేన జ్ఞేయాని లక్షాణ్యేకాదశైవహి ॥ ౪ ॥ సైకాదశశతాన్యత్ర రామోరాజ్యంచకారసః । ఏకపత్నీవ్రతోరామో రాజర్షిస్సర్వదాశుచిః ॥ ౫ ॥ యస్యైకమేవతచ్చాసీత్పత్నీవాక్యంశరస్తథా । గృహమేధీయమఖిల మాచరచ్ఛిక్షయాతురం ॥ ౬ ॥ సీతాప్రేమ్ణానువృత్యాచ ప్రశ్రయేణదమేనచ । భర్తుర్మనోహరాసాధ్వీ భావజ్ఞాసాహ్రియాభియా ॥౭॥ యుక్తాతంరంజయామాస రాజానంరాఘవంముదా । ఏవంగిరీంద్రజేప్రోక్తం రామరాజ్యోత్తరోద్భవం ॥ ౮॥ చరితంరఘునాథస్య యథాపృష్టంత్వయామమ। శ్రవణాత్సర్వపాపఘ్నం మహామంగళకారకం ॥ ౯ ॥ సారకాండమిదందేవి యేశృణ్వంతినరోత్తమాః । తేషాంమనోరథాస్సర్వే పరిపూర్ణాభవంతిహి ॥ ౧౦ ॥ ... ... ... ... ... ... ॥౧౩॥*

వృక్షంబులు సఫలంబులనబడినవి. జనులందరును వారివారి ధర్మంబులను చక్కగ నాచరించుచుండిరి. వణితులందరు పతిభక్తిపరాయణలయిరి. ఒక్కడును పుత్రశోకము నెఱుఁగఁడు. శ్రీసీతారాములు సపరివారముగా పుష్పకమునెక్కి పుడమినిసంచరించిరి. శ్రీరాముఁడు మానుషకృత్యంబులనెన్నిటినో చూపుచుండెను. మఱియు లోకులనుపదేశించువాఁడై కోట్లకొలఁది శివప్రతిష్ఠలనాచరించెను. బహుదక్షిణాకంబులైన అశ్వమేధాధిక్రతువుల నాచరించెను. పరమానందవిగ్రహుఁడగు తాను దివ్యభోగంబులచే జానకీదేవిని సంతోషపరచెను. ధర్మాత్ముఁడును ధర్మజ్ఞుఁడునగు రాముఁడు ధర్మరాజ్యమును పరిపాలించెను. సర్వలోకంబులను పరిశుద్ధిఁజేయనెంచి తనచరితంబులను సంస్థాపించెను. లోకపూజ్య చరణారవిందుఁడగు రామచంద్రునిచే త్రేతాయుగంబున ౧౧౦౧౧ సంవత్సరములు పూజ్యంబగురాజ్యంబు భోజ్యంబనడెను. కలియుగంబున నావత్సరంబులు లక్షలక్ష్యంబులన దగును. ఏకపత్నీవ్రతుండగు రాముండు నిత్యపరిశుద్ధుండగు రాజర్షియైయుండగా పత్నీవాక్యంబొకటియే అట్లు శరంబుగానయ్యె. సనాతనంబగు గృహస్థాశ్రమధర్మంబును సమగ్రముగా నాచరించిచూపెను. సీతయును వినయముచేతను ప్రేమచేతను అనువర్తనముచేతను ఇంద్రియనిగ్రహముచేతను లజ్జచేతను భావమునెఱిఁగి భర్త్రుమనోహారిణియై రాముని రంజింపఁజేసి సంసారమునే సంసారమనిపించుచుండెను. పార్వతీ! నీవడిగినట్లు శ్రీరామునియొక్క రామరాజ్యోత్తర చరిత్రంబును చెప్పితిని. ఈదివ్యచరిత్రంబు వినిన సమస్త దురితంబులు పరిహరించి మంగళంబులు సంగతంబులగుచుండు. ఇట్టి సారకాండమును ఎవరు విందురో అట్టి మహాత్ములు సమస్త మనోరథంబులనంది యానందిచుచుందురు. ౨౧౦॥

## మంగళం.

శ్లో॥ రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే।
రఘునాథాయ నాథాయ సీతాయాఃపతయే నమః॥*॥

ఇతిశ్రీమ చ్ఛతకోటిరామచరితాంతర్గత శ్రీమదానంద రామాయణే
వాల్మీకీయే సారకాండే అగస్తిరామ శివపార్వతీసంవాదే త్రయోదశస్సర్గః॥ ౧౩॥
సారకాండః ప్రథమఃపూర్ణః ॥ శ్రీరామచంద్రార్పణమస్తు.



### శుభ ప్రార్థన.

తా॥ సముచితమానుషలీలానుసారముగా తండ్రియగు దశరథమహారాజుచే రామ యనియును, పుత్రవాత్సల్యముగల కౌసల్యచే రామభద్రయనియును, ప్రజలచే రామచంద్ర యనియును, మునీంద్రులచే వేధస్సనియును, మంత్రులచే రఘునాథయనియును, సీతచే నాథయ నియును, జనకాదులచే సీతాపతియనియును పిలువబడిన లీలామానుషవిగ్రహుండగు శ్రీరామ పరబ్రహ్మమూర్తికి నమస్కారము.

• [అని నమస్క్రియాత్మక మంగళము కాండాంతమున చేయబడియున్నది. ఇచ్చట వారువారు పిలుచుటలో నర్థస్వారస్యముగలదు. ఎట్లనిన, రామ=రామయను నామముగలవాఁడా! ఇది తండ్రి పిలుచుటకు తగినట్లు సామాన్యముగానున్నది. రామభద్ర= భద్రమనగా మంగళము నాకంటికి దివ్యమంగళమూర్తియగు రాముఁడాయనిన నిది తల్లిపిలచుటకు తగినట్లున్నది, రామచంద్ర=చంద్రునివలె అహ్లాదకుండగు రాముఁడాయన నిది రంజకత్వముచే ప్రజలు పిలచుటకు తగినది. వేధస్సు=పరమాత్మయననిది సర్వజ్ఞులగు మునులు తత్వము నెఱింగినవారుగాన వారు చెప్పటకుతగినది.రఘునాథ=రఘువంశమునకు పతియనిన నిది మంత్రులు ఈ రవికులమున నింతటివారు లేరుం గమని గౌరవించునట్లయినది. నాథ=పతియనగా సీతలజ్జచే నాయేలికయని పిలచునట్లున్నది. సీతాపతీ=జానకమ్మ మొగుడాయనగా నత్తవారింటిలో నాడబిడ్డకు ప్రాశస్త్యముగాన నచ్చట తన్మూలక నామకీర్తనము లోకవిదితము. ఇట్లు మానుషలీలలో సర్వజనానందప్రదుఁడై రాముఁడు మెలగెనని, శ్లోకభావము తోఁచుచున్నది.]

ఇట్లు లోకానందకరంబగు పార్వతీపరమేశ్వర సంవాదాత్మకానందరామాయణంబున
మొదటిది సారకాండము సంపూర్ణము.
శ్రీరామచంద్ర చరణార విందార్పణము. శివం.



శ్రీః.

శ్రీరామః ప్రసన్నోస్తు॥ శ్రీగణేశాయనమః.

సీతాలక్ష్మణభరతశత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రస్వామినేనమః.

# శ్రీమదానందరామాయణే

## సారకాండో ద్వితీయః ప్రారభ్యతే.

శ్రీగణేశాయనమః ॥ శ్రీపార్వత్యువాచ—సారకాండంత్వయాశంభో కీర్తితంబహుపుణ్యదం । మయా శ్రుతంతుపృచ్ఛామి యత్తద్వక్తుంత్వమర్హసి ॥ ౧ ॥ కథంకృతావాజిమేధా రాఘవేణమహాత్మనా । రామాదీనాం చతుర్ణాంహి బంధూనాంసంతతింవద ॥ ౨ ॥ స్వపుత్రంబంధుపుత్రాంశ్చ కథంస్త్రీభిస్సుయోజితాః । దశవర్ష సహస్రాణి దశవర్షశతానిచ ॥ ౩ ॥ తథైకాదశవర్షాణి త్రేతాయుగభవానిహి । రాజ్యంకృతంత్వయాప్రోక్తం విస్తరాద్వావదస్వమాం ॥ ౪ ॥ యానియానిచరిత్రాణి రాఘవేణకృతానిహి । తానితానిహికృత్స్నాని విస్తరాద్వ

---

శ్రీరామాయనమః.

### శ్రీవాల్మీకిమహర్షి రామాయణమునుచెప్పుటకు కారణనిరూపణము.

శ్రీమద్రామకథా వర్ణనముచే శ్రవణానందము నొంద వించుచుండు శంకరునిఁజూచి పార్వతీదేవి "శంభూ! పుణ్యప్రదంబైన సారకాండను నిరూపించగా వింటిని. సర్వమును చెప్పుటకు శక్తుండగు నిన్నడిగెదను. మహాత్ముఁడగు రాముఁడు అశ్వమేధంబుల నెట్లు సలిపెను? నలుగు రన్నదమ్ములయిన రామాదులయొక్క సంతతిఁ జెప్పుము. శ్రీరాముఁడు ౧౧౦౧౧ త్రేతాయుగవత్సరంబులు రాజ్యమేలుచుండెనని చెప్పినసంగతిని విస్తరించి వినుపింపుము. తనపుత్రిని తమ్ములపుత్రులను ఎట్లు సతీయుక్తులంజేసి మెలఁగెను? ఆకాలమున రాముని సర్వవిశేషకృత్యంబులను చక్కఁగా నిరూపింపవేఁడెదను." అని ప్రార్థింపగా, నాదేవివాక్యమునువిని మహాదేవుం డిట్లు చెప్పుచున్నాఁడు:—దేవీ! నీవు శ్రీరామచరిత్రను బాగుగానడిగితివి. నే నానందించుచు వచించెదను. వినుము; మునుపొకప్పుడు వాల్మీకిచే చెప్పఁబడినదియును ఒక్కొక యక్షరమైనను పురుషులపాపమును పరిహరించునదియును అగు నూరుకోట్ల గ్రంథముగా విస్తరించియుండు శ్రీరామచరిత్రంబును నీకు చెప్పెదను. ఒకప్పుడు వాల్మీకి మహర్షి తమసానదికి స్నానమునకై వెడలెను. శిష్యులతోఁడఁబోయి కమండలువును నేలనునచి

క్తుమర్హసి ॥ ౫ ॥ ఇతిదేవీవచశ్శ్రుత్వా శంభుస్తాంపునరబ్రవీత్ ॥*॥ శంభురువాచ—పృష్టంసమ్యక్త్వయాదేవి రాఘవస్యకథానకం ॥ ౬ ॥ మమాపిహర్షస్సంజాత స్తద్వదామికథానకం । చరితంరఘునాథస్య శతకోటిప్రవిస్తరం ॥ ౭ ॥ ఏకైకమక్షరంపుంసాం మహాపాతకనాశనం । వాల్మీకికృతంపూర్వ మేకదాతద్వదామితే ॥౮॥ వాల్మీకిస్త్వేకదాస్నాతుం జగామతమసాంనదీం । శిష్యేణసహితోగత్వా భూమౌస్థాప్యకమండలుం ॥౯॥ ఆవశ్యకం తుసంపాద్య కృత్వాశౌచవిధింతతః । యావద్గచ్ఛతిస్నానార్థం దర్భపాణిస్సవైమునిః ॥ ౧౦ ॥ తావద్దదర్శతమసాతీరేకౌతుకముత్తమం। క్రౌంచయుగ్మేహతఃక్రౌంచో నిషాదేనపతత్రిణా॥౧౧॥ క్రౌంచీశోకసమావిష్టా విలలాపాతిదుఃఖితా । విముక్తాపతినాతేన ద్విజేనసహచారిణా॥ ౧౨॥ తామ్రశీర్షేణమత్తేన పత్రిణాసాహతేనచ। తథావిధం ద్విజందృష్ట్వా నిషాదేననిపాతితం॥౧౩॥ ఋషేర్ధర్మాత్మనస్తస్య కారుణ్యంసమపద్యత। తతఃకరుణయావిష్టస్త్వధర్మోయమితిద్విజః । నిశామ్యరుదతీంక్రౌంచీ మిదంవచనమబ్రవీత్॥ ౧౪॥ మానిషాదప్రతిష్ఠాంత్వమగమశ్శాశ్వతీస్సమాః॥ యత్క్రౌంచమిథునాదేక మవధీఃకామమోహితం॥౧౫॥ తస్యేత్థంబ్రువతశ్చింతా బభూవ

శౌచాచారంబును నెరవేర్చి దర్భపాణియై స్నానమునకుదిగునప్పటికి కౌతుకమొకటి కాన్పించెను. అది యేమనిన నచ్చట పాపియగు చండాలుఁడొకడు జంటకొంగలలో మగదానిని బాణప్రయోగముచే జంపెను. ఆడపక్షి సహచరద్విజుఁడగు పతియొక్క వియోగమును సహింపనేరక శోకాక్రాంతయై మిక్కిలి దుఃఖముచే నేడ్చుచుండెను. అట్టి క్రౌంచిని నిషాదునిచే జంపఁబడిన క్రౌంచమునుచూచి ధర్మాత్ముఁడగు వాల్మీకికి కరుణగల్గెను. అంతనతఁడు కారుణ్యావిష్టుఁడై దుఃఖించుచుండు క్రౌంచినిచూచి చండాలుఁడా! నీవు "జంటకొంగలలో కామియగు మొగదానిని చంపినందుచే చిరకాలము బ్రతుకవలదు" అని యిట్లువచించెను. [టీక॥ హేనిషాద=ఓరి మాలవాఁడా! యత్=ఎందువల్ల, క్రౌంచమిథునాత్=జంటకొంగలలో, కామమోహితం=క్రీడాతత్పరంబగు, ఏకం=మగదానినొకటిని, అవధీః=చంపితివో - అందువల్ల-త్వం=నీవు, శాశ్వతీస్సమాః=అనంతంబులగు సంవత్సరంబులు, ప్రతిష్ఠాం=స్థితిని, మా+అగమః=పొందవలదు] ఇట్లు చెప్పుచు ఆత్మానుసంధానముఁ జేయు మునికి చింతగల్గెను. ఆహా! శోకార్తుఁడగు నేను పక్షినిగురించి యేమని పలికితిని? అని చింతించుచునే మహా ప్రాజ్ఞుఁడును మతిమంతుఁడునై యమ్మునీంద్రుఁడు మనస్కరించి శిష్యుండగు భరద్వాజునికి "సమపాదాక్షరంబును వీణాగానలయోపేతంబునగు శోకార్తుఁడగు నాయొక్కమాట తప్పక శ్లోకమగుంగాక." - అని చెప్పెను. శిష్యుండును మునీంద్రుని మాన్యవచనంబును సంతోషముతో సంభావించి యొప్పికొనెను. వానివిషయమై వాల్మీకి ప్రసన్నుఁడై, ఆతీర్థంబున యథావిధిగా స్నానముఁజేసి తదర్థమునే విచారించుచు నిజాశ్రమంబునకుఁ జనెను. వినీతశిష్యుఁడగు భరద్వాజుఁడును పూర్ణకలశంబును చేతఁబట్టికొని సంతుష్టుఁడగుచు ననుచరుఁడై చనెను. ఇట్లు తన పుణ్యాశ్రమం

హృదివీక్షితః ॥౧౬॥ శోకార్తేనాస్య శకునేః కిమిదం వ్యాహృతం మయా । చింతయన్సమహాప్రాజ్ఞ శ్చకారమతిమాన్మతిం ॥ ౧౭ ॥ శిష్యంచైవాబ్రవీద్వాక్య మిదంసమునిపుంగవః । పాదబద్ధోక్షరసమ స్తంత్రీలయసమన్వితః ॥ ౧౮ ॥ శోకార్తస్యప్రవృత్తోమే శ్లోకోభవతునాన్యథా । శిష్యస్తుతస్యబ్రువతో మునేర్వాక్యమనుత్తమం ॥ ౧౯ ॥ ప్రతిజగ్రాహసంతుష్ట స్తస్యతుష్టోభవన్మునిః । సోభిషేకంతతఃకృత్వా తీర్థేతస్మిన్యథావిధి ॥ ౨౦ ॥ తమేవచింతయన్నర్థముపావర్తతవై మునిః । భరద్వాజస్తస్యశిష్యో వినీతశ్శ్రుతవాన్గురోః ॥ ౨౧ ॥ కలశంపూర్ణమాదాయ పృష్ఠతోనజగామహ । సప్రవిశ్యాశ్రమపదం శిష్యేణసహధర్మవిత్ ॥ ౨౨ ॥ ఉపవిష్టఃకథాశ్చాన్యా శ్చకారధ్యానమాస్థితః । ఆజగామతతోబ్రహ్మా లోకకర్తాస్వయంప్రభుః ॥ ౨౩ ॥ చతుర్ముఖోమహాతేజా ద్రష్టుంతంమునిపుంగవం। వాల్మీకిరథతందృష్ట్వా సహసోత్థాయవాగ్యతః ॥ ౨౪ ॥ ప్రాంజలిఃప్రయతోభూత్వా తస్థౌపరమవిస్మితః । పూజయామాసతందేవం పాద్యార్ఘ్యాసనవందనైః ॥ ౨౫ ॥ ప్రణమ్యవిధివచ్చైనం పృష్ట్వాచైవనిరామయం । అథోపవిశ్యభగవా నాసనేపరమార్చితే ॥ ౨౬ ॥ మహర్షయేవాల్మీకయే సందిదేశాసనంతతః । బ్రహ్మణాసమనుజ్ఞాత స్సోప్యుపావిశదాసనే ॥౨౭॥ ఉపవిష్టేతదాతస్మిన్సాక్షాల్లోకపితామహే । తద్గతేనైవమనసా వాల్మీకిర్ధ్యానమాస్థితః॥౨౮॥పాపాత్మనాకృతంకష్టం వైరగ్రహణబుద్ధినా । యస్తాదృశంచారురవం క్రౌంచంహన్యాదకారణం ॥ ౨౯ ॥ శోచన్నే

బును శిష్యునితోడ ప్రవేశించిన ధర్మజ్ఞుఁడగు వాల్మీకముని సుఖాసీనుఁడై యితరవ్యాపారముల నాచరించెను. ధ్యానమునొందెను. అంత నచ్చటికి లోకనిర్మాణనిపుణుఁడు మహానుభావుఁడగు చతర్ముఖ బ్రహ్మదేవుఁడు అమ్మునీంద్రుని వీక్షించుటకు ప్రభువగుటచే తానుగావచ్చెను. పిదప వాల్మీకి విస్మయమునంది వేగమెలేచి మిక్కిలి శ్రద్ధాభక్తులతో నాదేవదేవునింగని యర్ఘ్యపాద్యాసనాదులచే సత్కరించి విధివిధానంబుగా నర్చించి నియమముతో దోసిలిఁబట్టి కుశలప్రశ్నఁ జేసెను. పరమపూజ్యంబగు నాసనముమీఁద కూర్చుండిన భగవంతుఁడు వాల్మీకిమునికి నొక పీఠమును నిర్దేశించెను. అంత నతఁడును బ్రహ్మాజ్ఞచే పీఠాసీనుఁడయ్యె. ఇట్లు సాక్షాల్లోకేశుండు సాన్నిధ్యమునొందియుండగా తద్గతైకచిత్తుఁడై వాల్మీకి ధ్యానమునొందెను. మఱియు "నయ్యో! నిష్కారణముగా మనోహరధ్వనిగల క్రౌంచమును వైరబుద్ధితో నప్పాపాత్ముఁడు సంహరించెను." అని చింతించుచు నా శ్లోకమునే మరల క్రౌంచినిగుఱించి పలుకుచు మఱల శోకించుచు నిట్లుండెను. అంత నప్పుడు బ్రహ్మ నవ్వుచు వాల్మీకిమునితో "నీచే శ్లోకమే రచింపఁబడెను. ఇందుకు నిమిత్తమునాలోచింపవలదు. నాయిచ్ఛవల్లనే నీకు ఈవాణి వెలువడెను. ఋషిశ్రేష్ఠుండా! శ్రీరామచరిత్రమును సమగ్రముగా రచింపుము. ధర్మాత్ముఁడును గుణవంతుఁడును ధీమంతుఁడును ధీరుఁడు నగు శ్రీరామునిచరిత్రమును నారదునివలన నీవు విన్నట్లు చెప్పుము. సీతారాములయొక్క లక్ష్మణునియొక్క రాక్షసులయొక్కయు రహస్యంబులును ప్రకాశంబులునయిన నీకు తెలియని సకలవృత్తాంతంబులును ఇఁక నీకు తెలియుచుండును. కావ్య

వంపునః క్రౌంచీ ముపశ్లోకమిమంజగౌ । పునరంతర్గతమనా భూత్వాశోకపరాయణః॥ ౩౦ ॥ తమువాచతతోబ్రహ్మా ప్రహసన్మునిపుంగవం । శ్లోక ఏవత్వయాబద్ధో నాత్రకార్యావిచారణా ॥౩౧॥ మచ్ఛందాదేవతేబ్రహ్మన్ ప్రవృత్తేయం సరస్వతీ । రామస్యచరితంకృత్స్నం కురుత్వమృషిసత్తమ ॥ ౩౨ ॥ ధర్మాత్మనోగుణవతో లోకేరామస్యధీమతః॥ ౩౩ ॥ వృత్తంకథయధీరస్య యథాతేనారదాచ్ఛ్రుతం। రహస్యంచప్రకాశంచయద్వృత్తంతస్యధీమతః॥౩౪॥రామస్య సహసౌమిత్రే రాక్షసానాంచసర్వశః । వైదేహ్యాశ్చైవయద్వృత్తం ప్రకాశంయదివారహః ॥ ౩౫ ॥ తచ్చాప్య విదితంసర్వం విదితంతేభవిష్యతి । నతేవాగనృతాకావ్యే కాచిదత్రభవిష్యతి ॥ ౩౬ ॥ కురురామకథాంరమ్యాంశ్లోక బద్ధాంమనోరమాం । యావత్స్థాస్యంతిగిరయ స్సరితశ్చమహీతలే ॥ ౩౭ ॥ తావద్రామాయణకథా లోకేషుప్రచరిష్యతి । యావద్రామాయణకథా త్వత్కృతాప్రచరిష్యతి ॥౩౮॥ తావదూర్ధ్వమధశ్చత్వం మల్లోకేషునివత్స్యసి । ఇ త్యుక్త్వాభగవాన్బ్రహ్మా స్వయంరామస్యధీమతః ॥ ౩౯ ॥ చరితంశ్రావయామాస వేదవాక్యైస్సుపుణ్యదైః । తత స్తేనార్చితోబ్రహ్మా తత్రైవాంతరధీయత ॥ ౪౦ ॥ తతస్సశిష్యోభగవాన్ మునిర్విస్మయమాయయౌ । తస్యశిష్యాస్త తస్సర్వే జగుశ్శ్లోకమిమంపునః ॥ ౪౧ ॥ ముహుర్ముహుఃప్రీయమాణాః ప్రాహుశ్చభృశవిస్మితాః । సమాక్షరైశ్చ తుర్భిర్యః పాదైర్గీతోమహర్షిణా । సోనువ్యాహరణాద్భూయశ్శోకశ్శ్లోకత్వమాగతః ॥౪౨॥ తస్యబుద్ధిరియంజా

మున నీమాట దబ్బర కాచాలదు. మనోహరంబులగు శ్లోకంబులచే రామకథ నభివర్ణింపుము. అది పుడమిని నదులు గిరులునుండు నంతవరకు ప్రఖ్యాతినొంది చరించునుగాక. ఎంతవరకు నీచే చెప్పఁబడిన శ్రీరామకథ ప్రచారమునందియుండునో అంతవరకు నీవు పైన దిగువగూడ నా లోకములలోనుండగలవు." అని యనుగ్రహించి మహానుభావుండగు బ్రహ్మదేవుండు శ్రీరాముల వారి దివ్యమంగళచరిత్రంబును పుణ్యాకరంబులగు దేవవాక్కులచే వినుపించెను. అంత వాల్మీకిచే సమర్చింపఁబడిన బ్రహ్మదేవుఁడు అచ్చటనే అంతర్ధానమునందెను. అంత నాసశిష్యుండగు వాల్మీకి అత్యంతాశ్చర్యపరవశుఁడయ్యె. వాని శిష్యులందరును మరల నాయాశ్లోకమునే పఠించిరి. మరలమరల నాశ్లోకమునే ప్రీతించువారలై మిక్కిలి యాశ్చర్యముతో గానముఁజేసిరి. ఇట్లతఁడు మరలమరల పఠించునప్పుడు శోకంబే శ్లోకంబాయెను. [ఎట్లనిన:—«మా నిషాద= లక్ష్మీనివాసుఁడగు శ్రీరామా! యత్=ఏకారణమువలన, క్రౌంచమిథునాత్=క్రుంచరాక్షసియ నగా కుటిలయగు కైకసియొక్క కొడుకు క్రౌంచుఁడు రావణుఁడు, వానిపత్ని మందోదరి క్రౌంచియనబడును, క్రౌంచియును క్రౌంచుఁడును చేరి క్రౌంచులు, వీరియొక్క మిథునము జత క్రౌంచమిథునము. ఇట్టి క్రౌంచమిథునములో; కామమోహితం=లోకవిద్విష్టకర్మ గల రావణుఁడను, ఏకం=ఒకనిని, అవధీః=చంపితివో; ఆకారణమువలన, త్వం=నీవు, శాశ్వతీస్సమాః =అనంతంబులగు సంవత్సరంబులు, ప్రతిష్ఠాం=సుస్థితిని, అగమః=పొందుము." అని శ్రీరామ స్మరణరూప మంగళశ్లోకమును వాల్మీకి దైవికముగా చెప్పినట్లయినది.] పిమ్మట భావితాత్మయ

తా మహర్షేర్భావితాత్మనః । కృత్స్నం రామాయణం కావ్య మీదృశైః కరవాణ్యహం ॥ ౪౩ ॥ ఉదారవృత్తార్థప దైర్మనోరమైస్తదాస్యరామస్యచకారకీర్తిమాన్ । సమాక్షరైః శ్లోకవరైర్యశస్వినో మునిస్స కావ్యం శతకోటిసంమితం ॥ ౪౪ ॥ * ॥ ఇతిశ్రీ శతకోటిరామచరితాంతర్గత శ్రీమదానందరామాయణే వాల్మీకీయే యాత్రాకాండే ప్రథమస్సర్గః ॥ ౧ ॥ * ... ... ... ... ... ... ... ... *

శ్రీశివ ఉవాచ—వాల్మీకినాకృతం దేవి శతకోటిప్రవిస్తరం । రామాయణం మహాకావ్యం జగృహుర్మునయశ్చ తే ॥౧॥ ఆశ్రమే ప్రపఠంతిస్మ కథయంతిస్మ తేముదా । తచ్ఛ్రోతుమమరాస్సర్వే విమానైశ్చ దివి స్థితాః ॥ ౨॥ శ్రుత్వా సర్వం సవిస్తారం వాల్మీకిం పుష్పవృష్టిభిః । నవర్షుర్జయశబ్దైస్తైః ప్రశశంసుర్మునీశ్వరం ॥ ౩ ॥ తతో దేవాస్సగంధర్వా యక్షనాగాస్సకిన్నరాః । మునీశ్వరాగుహ్యకాశ్చ పార్థివాః పద్మభూస్త్వహం ॥ ౪ ॥ పరస్పరం తే కలహం చక్రుః కావ్యార్థమాదరాత్, బ్రహ్మాద్యానిర్జరాన్ప్రోచుః పన్నగాన్ దితిజాన్నరాన్ ॥౫॥ వయం కావ్యం వినేష్యామో దివం వాల్మీకినాకృతం । దితిజాః పన్నగాః ప్రోచు ర్వినేష్యామో రసాతలం ॥౬॥ వయం కావ్యం రాఘవస్య చరిత్రం పావనం శుభం । ఋషీశ్వరాస్సభూపాలాః ప్రోచుః కావ్యం హి భూతలాత్ ॥ ౭॥ నేతుం రసాతలం స్వర్గం నదాస్యామో వయం త్విదం । కావ్యార్థమితి తే చక్రుః కలహం రోమహర్షణం॥౮॥ తతో దేవి మయా సర్వాన్ నివార్యవచసైర్వి

గు వాల్మీకిమహర్షి రామాయణకావ్యమును సమగ్రముగ నిట్లే రచించెదనని నిశ్చయించెను. అట్లే శతకోటిగ్రంథ సంమితంబుగా (శతస్థానము మూడవది. కోటిస్థానము ఎనిమిదవది. ప్రవిస్తరంబున వాటి గుణకము ౩×౮=౨౪. వేలు వేదరామాయణగ్రంథసంఖ్యయని సంఖ్యావంతులు సంభావించుచుందురు.) మహోదారవృత్తంబులును సత్పదగుంభితంబులును మనోహరంబులునగు శ్లోకరత్నంబులచే పుణ్యశ్లోకుండగు ధర్మాత్ముడైన శ్రీరాముని దివ్యమంగళచరిత్రంబును కావ్యంబుగా రచియించెను ॥౧॥... ... ... ॥ * ॥

ముల్లోకములవారును రామాయణకావ్యమునకై కలహించుట.

వాల్మీకిమహర్షి శతకోటి ప్రవిస్తరంబగు మహాకావ్యంబును చేయగా దానిని అచ్చటి మునులందరును స్వీకరించి సంతోషముతోడ చదువుచును చెప్పుచునుండిరి. దానిని వినుటకై దేవతలెల్లరును గగనంబున విమానంబులలోనుండి, సవిస్తరంబుగా నంతయునువిని వాల్మీకిమీఁద పూలవానగురిపించి యచ్చటిమునులను జయశబ్ద పురస్సరంబుగా శ్లాఘించిరి. పార్వతీ! పిదప, దేవతలును గంధర్వులును యక్షులును నాగులును కిన్నరులును మునీంద్రులును గుహ్యకులును రాజులును బ్రహ్మదేవుఁడును నేనును అచ్చటచేరితిమి. అందరు నన్యోన్యముగా నారామాయణ మహాకావ్యముకొఱకు కలహింపసాగిరి. బ్రహ్మాదిదేవతలు తక్కిన నరనాగాదులతో "ఈవాల్మీకికావ్యంబును స్వర్గమునకు కొనిపోవుచున్నాము" అనిచెప్పిరి. దితిజులును పన్నగులును "మంగళంబును పావనంబునగు ఈ రఘురామచరిత్రంబును మేము తీసికొనిపోవుచు

ద్యైః । గత్వాహం తైస్తు క్షీరాబ్ధౌ శేషపర్యంకశాయినం ॥ ౯ ॥ విష్ణుం స్తుత్వా తు వేదోక్తైర్మంత్రైర్నానావిధైరపి । నానాపూజోపహారైశ్చ పూజయిత్వా సవిస్తరం ॥ ౧౦ ॥ కృతవాక్ గీతవాద్యాది తేన విష్ణుః ప్రబుద్ధ్యత । స ప్రపచ్ఛ మాం తదా విష్ణుః కిమర్థం బోధితోఽస్మ్యహం ॥ ౧౧ ॥ వృత్తం సర్వం మయా దేవి కథితం తత్సవిస్తరం । కావ్యార్థం కలహం శ్రుత్వా ప్రహస్య జగదీశ్వరః ॥ ౧౨ ॥ త్రిధా విభజ్య కావ్యం తత్ క్షణేన భక్తవత్సలః । త్రయస్త్రింశత్కోటిలక్షసహస్రాణి పృథక్ పృథక్ ॥ శతాని త్రీణి శ్లోకాంశ్చ త్రయస్త్రింశచ్ఛుభావహాన్ । దశాక్షరమితాన్మంత్రాన్ విభజ్యేతి రమాపతిః ॥ ౧౪ ॥ ద్వ్యక్షరే యాచమానాయ మహ్యం శేషే దదౌ హరిః । ఉపదిశామ్యహం కాశ్యాం తేంతకాలే నృణాం శ్రుతౌ ॥ ౧౫ ॥ రామేతి తారకం మంత్రం తమేవ విద్ధి పార్వతి । లక్ష్మీగరుడశేషేభ్యో యాచమానేభ్య ఆదరాత్ ॥ ౧౬ ॥ మంత్రత్రయం పృథగ్విష్ణుర్దదౌ తేభ్యోతిహర్షితః । శేషో నినాయ పాతాలం లక్ష్మీర్వైకుంఠమాదరాత్ ॥ ౧౭ ॥ పృథివ్యామేవ గరుడస్తం దధార మహామనుం । ప్రాపుశ్చైవ హి పన్నగాద్యాస్సర్వే పాతాలవాసినః ॥ ౧౮ ॥ స్వర్గే ప్రాపుర్మహాలక్ష్మ్యాస్తం మనుం నిర్జరాదయః । తార్క్ష్యాత్ప్రాపుర్మహామంత్రం సర్వే భూతలవాసినః ॥ ౧౯ ॥ మంత్రశాస్త్రే తత్స్వరూపం జ్ఞేయం గుహ్యం గిరీంద్రజే । తతః పూర్వవిభాగాన్స దదౌ విష్ణుః పృథక్ పృథక్ ॥ ౨౦ ॥ ఏకం విభాగం దేవేభ్యో ద్వితీయం పరమేశ్వరః । మునీశ్వరేభ్యో నాగేభ్యస్తృతీయం భాగముత్తమం ॥ ౨౧ ॥ తతో దేవా నిజం భా

---

న్నాము" అనిపలికిరి. మునులును మానవేంద్రులును "ఆహా! ఇక్కావ్యమును భూతలము నుండి స్వర్గమునకుగాని పాతాళమునకుగాని మేము ఇవ్వము." అనిరి. ఇట్లు కావ్యమునకై కఠోరకలహము నాచరించిరి ॥ ౮ ॥ పార్వతీ! అంత నేను వారి కలహంబును నివారించి సదుక్తు

### శివప్రార్థనచే విష్ణుమూర్తి రామాయణమునందరికి పంచిపెట్టుట.

లచే సమాధానపరచి వారితోడ వెడలి క్షీరసముద్రంబున శేషతల్పంబున శయనించియుండు మహావిష్ణువును వేదోక్తంబులగు వివిధమంత్రంబులచే సంస్తుతించి సమస్తపూజాసామగ్రులచే పూజించి గీతవాద్యాదులచే నిద్రమేల్కొలిపితిని. అప్పుడు నారాయణుండు నన్నేల లేపితిరని నన్నడిగెను. నేను సర్వ వృత్తాంతంబును విన్నవించితిని. జగన్నాథుఁడు కావ్యార్థకలహమును ఆకర్ణించి నవ్వి భక్తవత్సలుండగు తాను క్షణమాత్రమున నక్కావ్యంబును మూడు పాళ్లుగా విభజించి వెవ్వేరుగా ముప్పదిమూడుకోట్లు ముప్పదిమూడు లక్షలు ముప్పదిమూడువేల మున్నూట ముప్పదిమూడువంతున పంచిపెట్టి, యాచించుచుండు నాకు నిలచిన తారకంబగు రెండక్షరంబుల ననుగ్రహించెను. నేను అట్టి రామతారకంబను మంత్రమును కాశీపట్టణమున ప్రాణుల చెవిలోనుపదేశించుచున్నాను. మఱియును గరుడుఁడు లక్ష్మి శేషుఁడు వీరును వేడుకొనగా నానారాయణుఁడు వారికిని వెవ్వేరుగా మూడు మంత్రములన నుగ్రహించెను. వారిలో శేషుఁడు పాతాళమున కామంత్రమును గొనిపోయెను లక్ష్మి స్వర్గమునకు తీసికొనిపోయె. గరుడుఁడు భూలోకమున నామహామంత్రమును స్థాపించెను. ఆమహామంత్రమును, పాతాళవాసులగు

గం స్వర్గంనిస్సుర్వుదాన్వితాః । పాతాళేపన్నగాశ్చాపి నిస్సురాభాగంముదానిజం ॥ ౨౨ ॥ ఆసీద్భాగోమునీనాంహి పృథివ్యాంగిరిజాత్మజే । తస్యాపివిస్తరంవక్ష్యే విభక్తోవిష్ణునాయథా ॥ ౨౩॥ సప్తద్వీపేషుసర్వత్ర విభక్తస్సప్తధా పునః । కోట్యశ్చత్వారిలక్షాణి షట్సప్తతిమితానిహి ॥ ౨౪॥ సహస్రాణితథైకోన వింశచ్చైవతథాపునః । సప్తచత్వారింశన్మితాః శ్లోకాశ్చేతిపృథక్పృథక్ ॥ ౨౫ ॥ విభక్తంసప్తధాదేవి సప్తద్వీపేషువిష్ణునా । చతుశ్శ్లోకాశ్శేషభూతా యాచమానాయవేధసే ॥౨౬॥ దదౌవిష్ణుస్తుష్టమనా నిజభక్తాయభక్తితః । పుష్కరద్వీపభాగశ్చ వర్షయోర్ద్వివిధాకృతః ॥౨౭॥ కోటిద్వేవ్యష్టత్రింశచ్చ లక్షాణిహితథాపునః । సహస్రాణినవైవాథ తథాపంచశతానిహి॥ ౨౮ । త్రయోవింశాశ్చశ్లోకాశ్చ షోడశాక్షరజోరనుః । ఏవంద్విధాకృతౌభాగౌ విష్ణునావర్షయోస్త్రియః ॥౨౯॥ శాకద్వీపాదిద్వీపానాం పంచానాంచపృథక్పృథక్ । సప్తస్వపిచసర్వేషు వర్షేష్వపహారిణాయథా॥ 30 ॥ తత్తద్భాగావిభక్తాశ్చ తాంఛృణుష్వబ్రవీమ్యహం । అష్టషష్టిహిలక్షాణి సహస్రేద్వేశతానిహి॥ 31 ॥ సప్తైవచతథా శ్లోకా ఏకవింశచ్ఛుభప్రదాః । విభక్తోషట్సుద్వీపేషు తత్తద్భాగోయథాక్రమం । జంబుద్వీపాగతోభాగో నవవర్షేషుసాదరం ॥ 32 ॥ విభక్తోవిష్ణునా దేవి యథాత్వాంచబ్రవీమ్యహం । ద్విపంచాశత్తులక్షాణి తథాగిరివరాత్మజే॥33॥ సహస్రాణ్యేకనవతిఃశ్లోకాఃపంచతథాపునః । సప్తాక్షరమితావంత్రా స్త్వేవంహినవభాకృతాః ॥34॥ శేషమేకమ

నాగులందరును శేషునివలన స్వీకరించిరి. లక్ష్మివలన స్వర్గవాసులందరు నందిరి. గరుడునివలన భూలోకమువారు కనుగొనిరి. పార్వతీ! రహస్యంబగు దాని తత్త్వంబును మంత్రశాస్త్రంబున నుపదేశగమ్యంబుగా నెఱుంగవలెను. అంత నావిష్ణు మునుపు విభజించునట్లు మొదటి భాగము 333333333 దేవతలకును, రెండవ భాగమును 333333333 మునీంద్రులకును, మూడవ భాగమును 333333333 నాగులకును, ఇవ్వగా వారువారు వారివారి లోకంబులలో ప్రచారము చేసికొనిరి. అట్టి భూలోకమువారి భాగమును విష్ణువే సప్తద్వీపంబులకును ఎట్లు విభజించెననగా:—ఒక్కొక ద్వీపంబునకును నాలుగుకోట్ల డెబ్బదియారులక్షల పంతొమ్మిదివేల నలువదియేడు గ్రంథమువంతున విభజించి యిచ్చెను. నాలుగు శ్లోకములు నిలచినవి. వాటిని ప్రార్థించుచుండు నిజభక్తుఁడయిన బ్రహ్మదేవునికి తుష్టాంతరంగుఁడగు విష్ణుభట్టారకుఁడు అనుగ్రహించి యిచ్చెను. ఇట్లు ద్వీపమొకటికి వచ్చిన ౪౭౬౧౯౦౪౭ గ్రంథములో, పుష్కర ద్వీపభాగమును దానిలోని రెండు వర్షములకును ౨౩౮౦౯౫౨౩ వంతున పంచెను. శాకద్వీపాది పంచద్వీపములలో నేడేడు వర్షంబులకును ఏడేడు భాగములనుచేసి ౬౮౦౨౭౨౧ గ్రంథమువంతున విభజించి యిచ్చెను. పిమ్మట జంబూద్వీపభాగంబును నవవర్షంబులకును ౫౨౯౧౦౦౫ వంతున తొమ్మిదిపాళ్లుగా పంచి, సప్తాక్షర మంత్రంబులతోడ నిచ్చెను. చివరలో శ్రీయనుః నక్షరము నిల్వగా దానినంతట నుపయోగించునట్లు విడువఁబడెను. ఇట్లు మహావిష్ణువు రామకావ్యంబును పంచిపెట్టి యదృశ్యుఁడాయె॥ 36॥ ఇఁకమీఁద కాలాంతరంబున,

క్షరం శ్రీ రితిసర్వత్రవిష్ణునా । నవఖండేషుతత్త్యక్తం తత్సర్వత్రనియోజయత్॥ ౩౫॥ నానానామేషుమంత్రేషునతస్వనియమఃకృతః । విధజ్యేతిమహావిష్ణు రదృశ్యమగమత్తదా ॥ ౩౬ ॥ అగ్రేకాలాంతరేదేవి దశాస్యోబుద్ధిమత్తరః। నిజబుద్ధిబలాదేవ దేవానాంచపృథక్పృథక్॥ ౩౭॥ శతశశ్చైవఖండాని కరిష్యతిబుజాఃచ । జ్ఞాత్వామందధియోవిప్రా భవిష్యంతిచవైకలౌ ॥౩౮॥ క్షీణాయుషోవ్యగ్రచిత్తాస్తేషాంయోగ్యానిరావణః । శ్రీకృష్ణోపిపునర్దేవి వ్యాసరూపధరోభువి ॥౩౯॥ మానవానాంహితార్థాయ కావ్యాద్రామాయణాత్పునః । భాగాద్భారతవర్షాంతర్గతాచ్చవివిధానిహి ॥౪౦॥ పృథక్పృథక్సప్తదశపురాణానికరిష్యతి । భారతంత్వితిహాసంచ మహచ్చేత్థంకరిష్యతి॥౪౧॥ భాగాద్భారతవర్షాంతర్గతాత్సారంవిగృహ్యచ । సవ్యాసోభారతాద్యైశ్చ యదాశాంతింనగచ్ఛతి ॥౪౨॥ సరస్వత్యాస్తటేవ్యాసో వ్యగ్రచిత్తోభవిష్యతి । ఏతస్మిన్నంతరేబ్రహ్మా నారదాయమహాత్మనే ॥౪౩॥ చతుఃశ్లోకైర్విష్ణుదత్తైరుపదేశంకరిష్యతి । లబ్ధ్వాతాన్నారదశ్చాపి సువీణాంరణయన్ముహుః ॥౪౪॥ కీర్తయన్ సుస్వరంగత్వా మునింసత్యవతీసుతం । తాన్ శ్లోకాన్ వ్యాసమునయే సతదాహ్యుపదేక్ష్యతి ॥ ౪౫॥ లబ్ధ్వావ్యాసమునిఃశ్లోకాన్ తాన్స్వరామాయణస్థితాన్ । శాంతింలబ్ధ్వాతతస్తేషాం విస్తారంచకరిష్యతి ॥౪౬॥ తేషామేవార్థమాదాయ పురాణంపరమోదయం । అష్టాదశసహస్రంహి శ్రీమద్భాగవతాభిధం ॥౪౭॥ కరిష్యత్యష్టాదశమం రమ్యంజనమనోహరం। భాగవత

## వాల్మీకి వచనమే సర్వశాస్త్ర పురాణములకును మూలము.

పార్వతీ! మహామతియైన దశాస్యుఁడగు రావణుఁడు మందబుద్ధులగు బ్రాహ్మణులు కలిలో భయచకిత చిత్తులుగాను క్షీణాయుర్బలముగలవారుగాను ఏర్పడుదురని తెలిసి, వేదంబులను వారికి యోగ్యంబులగు సరియైన నూరు ఖండంబులనుగా వెవ్వేరుగా జేయుచున్నాడు. పార్వతీ! శ్రీకృష్ణుఁడు వ్యాసరూపధరుఁడై భువిలో మానవులకు హితముఁజేయనెంచి మరల రామాయణకావ్యమునుండి భారతవర్షభాగములోని సారము నెత్తికొని వెవ్వేరుగా ౧౭ పురాణంబులను భారతేతిహాసంబును చేయుచున్నాడు. పిమ్మట నట్లు రచియించిన భారతాదులచే శాంతి నొందక సరస్వతీ తీరమున వ్యాసమునీంద్రుఁడు చింతాక్రాంతుఁడై యుండును. అంతలో బ్రహ్మదేవుఁడు విష్ణువలన నుపదేశమునందిన నాలుగు శ్లోకములను మహాత్ముఁడగు నారదుని కుపదేశించుచున్నాఁడు. అతఁడు ఆశ్లోకములను పఠించుచు వీణ వాయించుచువచ్చి ఆవ్యాసమునీంద్రునికి ఆనాల్గు శ్లోకములను ఉపదేశించుచున్నాఁడు. రామాయణ స్థితంబులగు వాటినిపొంది యానందమునందిన వేదవ్యాసుఁడు తదర్థనిరూపణంబును విస్తరించుచు అష్టాదశసహస్రగ్రంథ సంమితంబును అత్యుత్తమంబును పురాణరత్నంబునగు శ్రీమద్భాగవతంబును రచించుచున్నాడు అందువల్లనే భాగవతవాక్సరణి వేరుగానుండును. సర్వపురాణంబులకును వాల్మీకియొక్క వాక్కేమూలంబు. ఆరామాయణమునే వ్యాసుండు వేరొకకర్తయై నూరుగాచెప్పెను అట్లే భువిలోనిభారతఖండాంతర్గతరామాయణభాగమునుండి సారసారముతీసి విధవిధంబులగు నుప

స్యాతఏవ వాణీభిన్నా భవిష్యతి ॥౪౮॥ పురాణానాంచసర్వేషాం వాల్మీకీయైవగీఃప్రియే । పృథక్కర్తాస్త్రతో వ్యాసః శ్రీమద్రామాయణాంశతం ॥ ౪౯ ॥ కరిష్యతితథాన్యాని సవ్యాసోఽవివిధానిచ । రమ్యాణ్యుపపురాణాని సారంసారంవిగృహ్యచ ॥౫౦॥ భాగాన్భరతఖండాంత గ్గతాద్రామాయణాద్భువి । కరిష్యతితథావ్యాసః షట్శాస్త్రాణిమునీశ్వర ॥ ౫౧ ॥ తస్మాద్రామాయణాదేవ సారముద్ధృత్యసాదరాత్ । యత్కించిద్గిరిజేభూమ్యాం కీర్తితంవైకథానకం॥ ౫౨॥ రామాయణాంశజంవిద్ధి శ్లోకమాత్రమపీహయత్॥ * ॥ పార్వత్యువాచ—శంభోతేప్రష్టుమిచ్ఛామి వ్యాసాయ నారదోమునిః॥ ౫౩ ॥ స్వయంజ్ఞాత్వావిధిముఖా ద్రమ్యాన్పాతకనాశనాన్ । యాన్రామచరితశ్లోకాం శ్చతురశ్చోపదేక్ష్యతి॥౫౪॥ యైఃకరిష్యతిసవ్యాసో మునిర్భాగవతంపరం । తాన్ శ్లోకాంశ్చతురస్త్వంమాం కృపయాచక్ష్వమహాననే ॥ ౫౫॥*॥ శ్రీశివఉవాచ—సమ్యక్పృష్టంత్వయాదేవి సావధానమనాఃశ్రుణు । నారదోక్తాంశ్చతుఃశ్లోకాం స్తవాగ్రేప్రవదామ్యహం ॥ ౫౬॥ నారదాయాపికథితా విధినాయేపురాశుభాః । బ్రహ్మణేవిష్ణునాపూర్వం శ్రీరామచరితంయదా ॥ ౫౭ ॥ విభక్తంహితదాదత్తా శ్చైషభూతాన్సుపుణ్యదాః । తాన్ శ్రుణుష్వచతుఃశ్లోకాన్ విష్ణునోక్తాన్స్వయంభువా ॥౫౮॥ * ॥ శ్రీభగవానువాచ— (౧)అహమేవాసమేవాగ్రే నాన్యద్యత్సదసత్పరం।

పురాణంబులను రచియించును. అట్లే తత్సారంబును షట్శాస్త్రంబులనుగా రచియించును. అందువల్లనే ఆదరముగా రామాయణములోని సారమునెత్తికొనియే ఏయొక్కకథయును భూలోకమున కీర్తింపఁబడినది. లోకమున శ్లోకమనుదంతయును రామాయణాంశభవంబని తె

భగవంతుఁడు బ్రహ్మకుపదేశించిన భాగవత మూలశ్లోకములు.

లియుము॥౫౨॥ అని చెప్పగా వినుచున్న పార్వతీదేవి "నాథా! నిన్నడుగఁదలఁచెదను. నారదుండు బ్రహ్మముఖమునుండి యభ్యసించి యేరామాయణ శ్లోకంబులను వ్యాసుని కుపదేశించెనో, ఆవ్యాసుండు నేశ్లోకంబులను పరిశీలించి శ్రీభాగవతంబును విరచించెనో, వాటిని నాకు దయచేసి చెప్పుము." అని ప్రార్థింపగా నీశ్వరుఁడిట్లనెను:—దేవీ! నీవు చక్కగానడిగితివి, అవధానము గల్గి వినుము; రామాయణ నిరూపణసమయంబున మునుపు సాక్షాత్పరమాత్మయగు నారాయణుండు బ్రహ్మకుపదేశించగా నావిధినారదునికి అనుగ్రహించెను. ఆవిభాగ సమయంబున మిగిలిన పుణ్యప్రదంబులగు ఆనాల్గుశ్లోకములను చెప్పెదనువినుము. భగవంతుఁడు చెప్పుచున్నడు:—"నేనే సర్వపరిపూర్ణుఁడు కేవలముగానున్నాను. ఈవ్యావహారిక స్థావరజంగమాత్మకప్రపంచంబు నేనుకాను. అదికాదు ఇదికాదని సర్వంబును నిషేధింపఁబడగా మిగిలిన సత్తామాత్రుఁడె నేను. సర్వముపోగానేది తోచునో, అట్లయిన నద్వయాత్మయందు సర్వమునుతోచదో, ఇట్లుతోచియునుతోచక తెరగానుండునదియే ఆత్మయొక్కమాయగా నెఱుఁగదగును. ప్రకాశము తమస్సు పంచమహాభూతంబులు ఇవి సకలప్రాణులలోను వ్యాపించియున్నను వేర్వేరుగా తోచుచున్నట్లే,ఈబ్రహ్మము అంతటను లేపించియున్నను నిర్లేపముగానున్నది. ఈతత్త్వ

పశ్చాదహంయదేతచ్చ యోవశిష్యేతసో ౽స్మ్యహం॥౫౯॥(౨)ఋతే౽ర్థంయత్ప్రతీయేత నప్రతీయేత చాత్మని। తద్విద్యాదాత్మనోమాయాం యథాభాసోయథాతమః॥౬౦॥(3)యథామహాంతిభూతాని భూతేషూచ్చావచేష్వను। ప్రవిష్టాన్యప్రవిష్టానితథా తేషునతేష్వహం॥ ౬౧॥(౪)ఏతావదేవజిజ్ఞాస్యం తత్త్వజిజ్ఞాసునాత్మనః। అన్వయవ్యతిరేకాభ్యాంయత్స్యాత్సర్వత్రసర్వదా ॥౬౨॥*

మును అన్వయ వ్యతిరేక విజ్ఞానముచే బ్రహ్మజ్ఞానాపేక్షగలవాఁడు విచారించికొనవలసినది.”

[అగ్రే = చివరలో (పారమార్థిక దశయందు.) ఏవ = ఇతర వ్యవచ్ఛేదంబుగా, అహమేవ = నేనుమాత్రమే, ఆసం=ఉన్నాను. అన్యత్=వేరయిన (వ్యావహారికములోని) సత్=చరవస్తు, న=నేనుకాను. అసత్=జడవస్తు, న=నేనుకాను, (అయిననేమనివిచారించునపుడు) పరం=కేవలముగా నుందును. ,పశ్చాత్=పిమ్మట (అవిద్యాజ్ఞాననివారణమయినపిమ్మట) యత్=ఏబ్రహ్మము, ఏతత్=ఇదియదియని చెప్పఁబడునో, చ=అదియును, అహం = నేనుగానే ఉన్నాను. యః = ఏయాత్మ, అవశిష్యేత=సర్వము నిషేధింపఁబడగా కేవలముగానిలచునో, సః=ఆయాత్మ, అహం=నేనుగా, అస్మి=అయితిని॥ ౧ ॥ అర్థం ఋతే=వ్యావహారికప్రపంచంతయు విడువఁబడగా, యత్=ఏకారణమువలన, ప్రతీయేత= పొందబడునో, ఆత్మని=బ్రహ్మమందు. నప్రతీయేతచ=(ఈప్రాతిభాసికజగత్తు) పొందబడదో, తత్=ఆకారణమువలన, ఆత్మనః=బ్రహ్మముయొక్క, మాయాం=ప్రకృతిని,విద్యాత్=తెలియవలెను. యథా=ఎట్లు, భాసః=ప్రకాశము, యథా=ఎట్లు, తమః=అంధకారంబును॥౨॥ యథా=ఎట్లు, మహాంతిభూతాని= గొప్పవయిన పంచభూతంబులును, ఉచ్చావచేషు = నానావిధంబులయిన, భూతేషు=ప్రాణులలో, అనుప్రవిష్టాని=చేరికొనియున్నవో, అప్రవిష్టాని=చేరకవేరుగానున్నవో, తథా=అట్లే, అహం=నేను, తేషు=వాటిలోనున్నాను. న తేషు=వాటిలోనేనులేను॥ 3 ॥ ఇట్లు, అన్వయవ్యతిరేకాభ్యాం=స్ఫురించుచున్నది మతియొకప్పుడును స్ఫురించుటయును స్ఫురించుచున్నది మతియొకప్పుడు స్ఫురించకపోవుటయును సామరస్యంబులచే,యత్=నేననునే పరబ్రహ్మము, సర్వదా=త్రికాలాబాధ్యముగా,సర్వత్ర=అంతటను,స్యాత్=సత్తాస్వరూపంబగునో, అట్టి, ఏతావదేవ=ఇంతమాత్ర మీవిషయమొక్కటియే, ఆత్మనః=పరబ్రహ్మముయొక్క. తత్త్వజిజ్ఞాసునా=యాథార్థ్యము నెఱుఁగవలయునని కోరువానిచే. జిజ్ఞాస్యం=మననము చేయఁబడఁదగినది॥౪॥*

వివరణము—అనగా నిచ్చట నన్వయవ్యతిరేక స్వరూపమును తెలియవలయును. ఎట్లనిన—వ్యావహారిక దశయందు తానని వ్యవహరించిన స్థూలదేహము స్వప్నావస్థయందు తోచక తానుతోచుచుండుట అన్వయము. అట్లు తానుతోచినను స్థూలశరీరము తోచకపోవుట వ్యతిరేకము. స్వాప్నికావస్థయందు తానని వ్యవహరించిన సూక్ష్మదేహము సుషుప్త్యవస్థయందు తోచక తాను తోచుచుండుట అన్వయము. అట్లు తానుతోచినను సూక్ష్మశరీరము తోచకపోవుట వ్యతిరేకము. సమాధిదశలో సుషుప్తితోచక తానుతోచుట అన్వయము. తానుతోచినను సుషుప్తితోచకపోవుట వ్యతిరేకము, ఇట్లు అన్వయ వ్యతిరేకయుక్తులచేత తానని వ్యవహరించిన పంచకోశములను త్రోసి కేవలాతీతంబగు బ్రహ్మమే నేనని దృఢతరజ్ఞాననిష్ఠులు తెలియుదురు, ఇట్లే బ్రహ్మజగత్తులకు అన్వయవ్యతిరేకంబులచే తాదాత్మ్యము నెఱుంగవలెను. బ్రహ్మనిర్లిప్తము. తద్భిన్నముమిథ్య. అనిత్యత్వమస్యాది

శ్రీశివ ఉవాచ—ఏవం శ్లోకా భగవతా చత్వారశ్చ ప్రకీర్తితాః । వేధసే మేతవాగ్రేతే కీర్తితా దేవి వై మయా ॥ ౧౩ ॥ ఏతే పవిత్రాః పాపఘ్నా మర్త్యానాం జ్ఞానదాయకాః । అజ్ఞాననాశనాత్సద్యః కీర్తనీయా నరోత్తమైః ॥ ౧౪ ॥ ఏవం దేవి త్వయా పృష్టం యథాతత్తే నివేదితం । కథామారంభితాం పూర్వ మధునా శృణు వచ్మ్యహం ॥ ౧౫॥ తతో రామాయణం వ్యాసో విధ్వస్తం మునిభిః పునః । కృత్వైకత్రైవ భూతం సప్తకాండమితం శుభం॥ ౧౬॥ చతుర్వింశతిసాహస్రం రక్షిష్యతి మునిస్తదా । ఆదావంతే త్వత్రైవ శ్లోకాస్తత్రైకియంతి హి ॥ ౧౭॥ చతుర్వింశతిసాహస్రే వ్యాసస్య రచితా అపి । భవిష్యంతి గిరిజే గ్రే మంగళాచరణాదిషు ॥౧౮ ॥ రామాయణాన్యనేకాని పృథగ్రే మునీశ్వరాః । భాగాద్భారతఖండాంత ర్గతాత్కుంభోద్భవాదయః ॥౧౯॥ కరిష్యంత్యత్రైతత స్తాని సర్వాణి పార్వతి । వాల్మీకీయాద్వినా దేవి నజ్ఞేయాని మనీషిభిః ॥ ౨౦॥ సారకాండం పురా దేవి యదుక్తం చ మయా తవ। వాల్మీకీయాచ్చతచ్చాపి సారముద్ధృత్య వై మయా ॥౨౧॥ నివేదితం చ హ్యధునా పృష్టం రామకథానకం । సవిస్తారం వదస్వేతి త్వయా తస్మాన్న యోదితం ॥౨౨ ॥ మానం రామచరిత్రస్య శతకోటి ప్రవిస్తరం । పంచాననో ప్యహం దేవి దివ్యైర్వర్షాయుతైరపి ॥ ౨౩ ॥ రామాయణం సవిస్తారం వ్యాఖ్యాతుం నక్షమ స్త్విహ । యన్నిర్మితం చ మునినా స్వతపోభిర

---

మహావాక్య చతుష్టయార్థము ఇచ్చట భగవంతునిచే నాల్గు శ్లోకములుగా చెప్పఁబడినవి.] అని యీ నాల్గు శ్లోకములను బ్రహ్మకు భగవంతుఁడు చెప్పెను. పార్వతీ! నీకు నేను వాటిని నిరూపించితిని. ఇవి నాల్గుశ్లోకంబులును పరమపావనంబులు, పాపపరిహారకంబులు, నరులకు జ్ఞానప్రదంబులు, అజ్ఞాననివర్తకంబులు, మానవోత్తములు వెంటనే కీర్తించతగినవి. దేవీ! నీవిట్లు నడుమనడిగినదానిని వివరించితిని. ఇఁక నారంభించినకథను ఇప్పుడు చెప్పుచున్నాను వినుము॥౧౫॥ అంత నా

ఆదిరామాయణము ఖిలమైపోగా ననేకరామాయణంబు లేర్పడుట.

వ్యాసుఁడు మునులచే ఖిలంబైన రామాయణంబును మరల మిగిలినవాటిని ఒకప్రక్కచేర్చి మంగళంబగు సప్తకాండాత్మకంబుగా ౨౪ వేలగ్రంథమును రక్షించిపెట్టుచున్నాఁడు. ఆయిరువదినాలుగువేల గ్రంథములో ఆద్యంతంబులలో మంగళాచరణాదులలో నీవల్ల వ్యాసునివల్లను రచింపఁబడిన శ్లోకములెన్నియో గలుగును. మఱియును అగస్త్యుఁడు మొదలయిన మునీంద్రులు వెవ్వేరుగా భారతఖండాంతర్గత భాగమునుండి నూర్లకొలది రామాయణంబులను రచించెదరు. అన్నియును వాల్మీకీయంబులనియే జ్ఞానులెరుంగవలెను. పార్వతీ! మునుపు సారకాండమును నీకుచెప్పితినే దానిని వాల్మీకిరామాయణ సారంబుగానెఱుఁగుము. ఇప్పుడు నీవు రామకథను సవిస్తారముగాచెప్పుమని యడిగినందున దానిప్రమాణంబును నిరూపించిచెప్పితిని. రామచరిత్రకు ప్రమాణము శతకోటిప్రవిస్తరము. నేను అయిదుముఖములు గలవాఁడైనను పదివేలుదివ్యవర్షంబులలోనైనను, మునిచే తపోమహిమవలన చెప్పఁబడిన రామాయణంబును సవిస్తరముగా వివరించిచెప్పుటకు శక్తుఁడనుకాను. దేవీ!అందువలన నందులోనిసారాంశంబును సర్వ

నుత్తమం ॥౭౪॥ అతస్సంక్షేపమాత్రేంహి సారంసారంవిగృహ్యాచ। కథయిష్యామితేప్రీత్యై యాత్రాకాండంశు భావహం ॥౭౫॥ రామదాసోయథాగేహే విష్ణుదాసంవదిష్యతి। శతకోటిమితాజ్ఞానా ద్దృష్ట్వాచాహంతథాతవ॥ ౭౬॥*॥ఇతిశ్రీశతకోటిరామ చరితాంతర్గత శ్రీమదానందరామాయణే యాత్రాకాండే రామాయణవిస్తారకథనంనామ ద్వితీయస్సర్గః ॥ ౨ ॥ ... ... ... ... ... ... ॥ * ॥

పార్వత్యువాచ— కోరామదాసఃకుత్రస్థో విష్ణుదాసశ్చకఃస్మృతః। కథంవదిష్యతిగురు స్తన్మాంవదస్వ విస్తరాత్॥ ౧॥ శ్రీశివఉవాచ—భారతేదండకారణ్యే గోదానాభౌవిరాజితే, క్షేత్రేబ్జకేనృసింహాఖ్యే మునిరగ్రే భవిష్యతి ॥ ౨॥ రామనామాతుతత్పుత్ర స్తచ్ఛిష్యావిష్ణురిత్యపి। గురుశిష్యౌరామసేవా సక్తౌనిత్యంభవిష్యతః॥౩॥దాస్యత్వాజ్జానకీజానే స్తావుభౌభూసురోత్తమౌ। రామదాసవిష్ణుదాసౌ విఖ్యాతౌలోకేపరాంపృథాం ॥౪॥ గమిష్యతోగ్రే భోదేవి గౌతమ్యాదక్షిణేతటే। రామదాసఃపితుశ్శ్రాద్ధం గయాయాంసంవిధాయచ ॥ ౫॥ పృథివ్యాంయానితీర్థాని తానిగత్వాయథాక్రమం। అధ్యాపయిష్యతిచ్ఛాత్రాన్ గోదానాభౌగృహాశ్రమీ ॥ ౬ ॥ ఏకదావిష్ణుదాసస్స శ్రు

త్రసంగ్రహించికొని యిఁకమీఁద యెట్లురామదాసుఁడు శతకోటిప్రవిస్తరంబును జ్ఞానదృష్టిచే నెఱింగి విష్ణుదాసునికి బోధించుచున్నాఁడో అట్లే నీయొక్క ప్రీతికై నేనుశుభమైనయాత్రాకాండమును నిరూపించుచున్నాను. ॥౭౬॥ ... ... ... ... ॥౨॥

☞ *[ఈ సర్గార్థమును పరిభావించుటలో, సర్వమునకును రామాయణమే మూలమనగా సకలవేద శాస్త్రపురాణములలోని సమస్త తత్త్వరహస్యంబులును ఆదిరామాయణోక్తంబులనియును సమస్త శ్లోకజాతియును రామాయణమునసే మొదట గల్గినదనియును తత్త్వవిత్తు లెఱుంగనగును.] *

## రామదాస విష్ణుదాసుల గురుశిష్యత్వము.

శంభూ! ఎవఁడారామదాసుఁడు? ఎచ్చటివాఁడు? విష్ణుదాసుఁడునెవఁడు? వానికి గురుఁడెట్లుచెప్పుచున్నాఁడు? ఈసంగతిని విస్తారముగాచెప్పవలెనని పార్వతియడుగగా పరమేశ్వరుండిట్లనెను—భారతవర్షమునందలి దండకారణ్యంబున గోదానదీనాభిలో విరాజించునటువంటి నృసింహాఖ్యగల అబ్జకక్షేత్రమునందు ఒకమునీంద్రుఁడుకాగలఁడు. వానిపుత్రుఁడు రామనాముఁడనువాఁడు. వానిశిష్యుఁడు విష్ణువనిపిలువఁబడును. ఈబ్రాహ్మణులగు గురుశిష్యులిరువురును రామసేవాసక్తులైయెల్లప్పుడును శ్రీసీతారామదాసులుగానుండుటంబట్టి రామదాసులని విష్ణుదాసులని లోకప్రసిద్ధినందుదురు. ఓదేవి! రామదాసుఁడు ఒకప్పుడు గౌతమీదక్షిణతీరమునందలి గయలో తండ్రియొక్క శ్రాద్ధంబునునెరవేర్చి, యథాక్రమంబుగా భూమిలోని సకలతీర్థంబులను సేవించి గోదానాభిలో గృహస్థాశ్రమంబు నవలంబించినవాఁడై శిష్యులకధ్యయనము చేయించుచుండును. ఒకప్పుడావిష్ణుదాసుఁడు వివిధవిధంబులగు కథలను రామాయణమునందలి సారకాండమును రామదాసుముఖమువలన విని కుతూహలమునంది రామదాసునితో “స్వా

త్వానానావిధాఃకథాః । రామదాసముఖాత్సార కాండంరామాయణోద్భవం ॥౭॥ శ్రుత్వాకించిత్ప్రహృష్టమనా రామదాసంవదిష్యతి ॥ విష్ణుదాసఉవాచ—గురో తే ప్రష్టుమిచ్ఛామి తత్త్వంవక్తుమిహార్హసి ॥ ౮ ॥ సారకాండంమయాత్వత్త శ్శ్రుతంరామాయణస్థితం । నకించిత్సౌఖ్యలేశోపి జానక్యారాఘవస్యచ॥ ౯॥ శ్రుతోత్రక్వాపిరాజ్యస్య విస్తారోపినచశ్రుతః । కథంయాగాఃకృతాస్తేన సంతతిస్తస్యనశ్రుతా ॥ ౧౦ ॥ సుతానాంబంధుపుత్రాణాం వివాహాదికమశ్రుతం । తత్సర్వంవిస్తరాత్త్వత్తో శ్రోతుమిచ్ఛామిమేగురో ॥౧౧॥ తత్త్వంవదమహాభాగ రఘువీరస్యచేష్టితం । రమ్యంపవిత్రమానంద దాయకంపాతకాపహం ॥౧౨॥ రామదాసఉవాచ—సమ్యక్పృష్టంత్వయావత్స రామచంద్రకథానకం । మంగళంరఘునాథస్య ప్రోచ్యతేయత్సవిస్తరం ॥౧౩॥ సావధానమనాస్త్వం తచ్ఛృణుపాతకనాశనం । యథాశ్రుతంమయాపూర్వం తుష్ట్యర్థంతేవదామ్యహం ॥౧౪॥ హత్వాదశాననంరామో రాజ్యంనిహతకంటకం । అయోధ్యాయాంముక్తిపుర్యాం శశాసమతిమత్తమః ॥ ౧౫ ॥ నదుర్భిక్షంనచౌర్యంచ నాపమృత్యుర్నచేతయః । నదారిద్ర్యంభయంచింతా వ్యాధయశ్చకదాచన ॥౧౬॥ నభిక్షార్థీనదుర్వృత్తో నపాపాత్మానిష్ఠురః । నక్రోధీనకృతఘ్నోపి రామేరాజ్యంప్రశాసతి ॥౧౭॥ ఏకదాజానకీకాంత మేకాంతేప్రాహలజ్జితా । స్మితవక్త్రాచారునాసా దివ్యాలంకారమండితా ॥౧౮ ॥ చామరవ్యగ్రహస్తాసా వినయావనతాననా । రామరాజీవపత్రాక్ష రావణారే

మీ! గురూత్తమా! మిమ్మునడుగవేడెదను. తామే చెప్పుటకు తగినవారలు. రామాయణమునందలిసారకాండమును మీవలనవింటిని. సీతచే రామునికి ఏయొక్క సుఖలేశంబునువినలేదు. ఎచ్చటను రాజ్యవిస్తారంబును వినలేదు. పుత్రులయొక్కయు తమ్ములపుత్రులయొక్కయు వివాహాది విభవంబులను వినలేదు. వాటినన్నిటిని విస్తారముగా మీవలన విన గోరియున్నాను కాబట్టి గురువర్యా! పవిత్రంబును పరమానంద ప్రదంబును పాపపరిహారకంబునగు శ్రీరామ దివ్యమంగళచరిత్రంబును అనుగ్రహించి చెప్పవలయును.” అని సంప్రార్థించెను. అందుకు రామదాసుఁ [illegible]శిటనుగ్రహించి చెప్పుచున్నాడు;—నాయనా! చక్కగా నడిగితివి. మునుపు నేను విని నట్ల[illegible] ప్రయాణము చే[illegible] దివ్య రామచరిత్రంబును శ్రుతపరచెదను. సావధానముగా వినుము. మహా[illegible]గలచే సుఖవసతి రాముఁడు రావణుని సంహరించినపిదప నిష్కంటకంబగు రాజ్యంబును ముక్తినగ[illegible] అ[illegible]యోధ్యలో పరిపాలించుచుండెను. దుర్భిక్షము చౌర్యము అపమృత్యువు ఈతిబాధలు దరిద్రంబు భయము చింత వ్యాధులు ఇవి ఒకప్పుడును రామరాజ్యమున లేవు. రాముఁడు రాజ్యమేలుచుండగా బిచ్చగాడు దుష్టుఁడు పాపాత్ముఁడు క్రూరుఁడు కృతఘ్నుఁడు కోపనుఁడు ఇట్టివారు పుడమిలో లేరు. రామకాంతయగు సీత యొకప్పుడు ఏకాంతంబున మంగళాలంకార మండితయును నగుమొగముగలదియును నయభయ వినయావనతయునయి లజ్జించుచు చేతచామరము వేయుచు శ్రీరామచంద్రునితో “రావణారీ! రాజీవాక్షా! మన్నాథా! రఘునాథా! తాము అనుజ్ఞనిచ్చినట్లయిన నేను ధర్మమూలంబును శ్రేయోనిదానంబునయిన సంగ

మమ ప్రభో ॥౧౯॥ కించిద్విజ్ఞప్తుమిచ్ఛామి యద్యనుజ్ఞాం కరోషి హి । విజ్ఞాపయామి తర్హి త్వాం ధర్మమూలం మహోదయం ॥౨౦॥ తత్సీతావచనం శ్రుత్వా జానకీం ప్రాహ రాఘవః । హే సీతే కంజనయనే మమ ప్రాణసుఖప్రదే ॥౨౧॥ శీఘ్రం వద ప్రియ యత్తే స్తి చిత్తే తత్కరవాణ్యహం । ఇతి రాఘవసన్మాన వచస్సజ్జనకాత్మజా ॥౨౨॥ నితరాంతోష పూరౌఘ పరిపూర్ణాబ్రవీత్పతిం ॥ సీతోవాచ— యదా త్వం రాఘవశ్రేష్ఠ దండకం వచనాత్పితుః ॥౨౩॥ మయా సౌమిత్రిణా సాకం పూర్వం స్వనగరాద్గతః । శృంగబేరపురం గత్వా జాహ్నవ్యాస్తరణే యదా ॥౨౪॥ నౌకాయాం స్థితమస్మాభిర్భాగీరథ్యాం తదా పురా । సంకల్పితం మయా కించిత్తత్త్వం వక్ష్యామ్యహం ప్రభో ॥౨౫॥ దేవి గంగే నమస్తేస్తు నివృత్తా వనవాసతః । రామేణ సహితాహం త్వాం లక్ష్మణేన చ పూజయే ॥౨౬॥ సురామాంసోపహారైశ్చ నానాబలిభిరాదృతా । ఇత్యుక్తం వచనం పూర్వం తత్ జ్ఞాతం భవతాపి చ ॥౨౭॥ తతశ్చతుర్దశే వర్షే విమానేన యుదాగతం । తదా భరతశత్రుఘ్నౌ కౌసల్యా విరహాతురా ॥౨౮॥ అహం తద్విస్మృతా రామ స్మృతిర్జాతాద్య మే ప్రభో । తన్మత్సంకల్పపూర్త్యర్థం గంతుమర్హసి జాహ్నవీం ॥౨౯॥ మయా మాతృబంధుభిస్త్వ మితి తే ప్రార్థయామ్యహం । రోచతే యది తే చిత్తే న త్వామాజ్ఞాపయామ్యహం ॥౩౦॥ ఇతి సీతావచశ్శ్రుత్వా ప్రహస్య రఘునందనః । సీతామాలింగ్య బాహుభ్యాం హర్షయన్తామువాచ హ ॥౩౧॥ ఏతద్వచనచాతుర్యం కుతో జానాసి మైథిలి । న తత్తే వచనం దేవి గంగా

---

తిని కొంచము విన్నవించెదను." అని మందలించెను. అందుకు రాముఁడు "జలజాక్షియగు జానకీ! మదానంద మందిరా! నీమనంబుననున్న దానిని త్వరగా చెప్పుము. దానిని చేయుదును." అని ప్రోత్సాహమునిచ్చెను. అప్పుడు సీతమ్మ యమందానందతుందిలయై "స్వామీ! మునుపు మీరు పితృాజ్ఞాపరిపాలనకొఱకు దండకారణ్యమునకు వెడలి నాతోడను లక్ష్మణునితోడను శృంగబేరమును చేరి భాగీరథిని దాఁటుటకై గంగలోని పడవలో మాతోడ కూర్చుండినపుడు నేనొక సంకల్పము చేసితిని. నాథా! దాని నిప్పుడు చెప్పెదను. తల్లీ! నీకు నమస్కారము. మేము వనవాసమునుండి నివృత్తులైన వెనుక నేను రామలక్ష్మణులతోడ వచ్చి సురామాంసాది నానావిధ బల్యుపహారంబుల నర్పించి నిన్నారాధించెదను. ఇట్లు నేను చెప్పిన మునుపటి[illegible]ంచునట్టియను తెలిసియుంటిరి. అంత పదునాలగవ సంవత్సరంబున పుష్పకంబున[illegible] భరత శత్రుఘ్నులును కౌసల్యయును విరహాతురులుగా నుండుటంబట్టి వేగ[illegible]. అప్పటిలో నేను మరచితిని. ఇప్పుడు జ్ఞప్తిగల్గినది. ఆనాసంకల్పమును నెరవేర్చుటకై గంగాతీరమునకు నాతోడను మాత్రాదులతోడను బంధువులతోడను మీరు నాయెడ దయగల్గి వెడలవలెనని ప్రార్థించుచున్నాను. మిమ్ము నాజ్ఞాపించుదాననుకాను." అని నొక్కి వక్కాణించెను. అంత నామాటలనువిని రాముఁడు నిజబాహువులతో సీత నాలింగించి సంతోషపరచుచు "జానకీ! నీవీమాటలనేర్పు నెక్కడనేర్చితివి? ఇది నీమాటకాదు. గంగామహిమ కాబోలు. దేవీ! నీమాటమీఁద రేపే వెడలుదును. గంగాతీరమున నెచ్చటికిపోవ నెంచియుందువో, ప్రేయసీ! దానిని

మాహాత్మ్యక్రమవత్ ॥౩౨॥ వచనాత్తవవై దేహి శ్వోగంతాజాహ్నవీంప్రతి । కృతేవాంఛాస్తిదయితే గంగాంగం
తుంవదస్వమే ॥౩౩॥ తచ్ఛ్రుత్వాతత్రవైస్థాతుం సేనాయోగ్యంసమంత్ర్యదుం । బుజాంకత్రుంహిపంథానం దూతా
నాజ్ఞాపయామ్యహం ॥౩౪॥ తతస్సీతాబ్రవీద్వాక్యం పునఃశ్రీరామచోదితా । యత్రగంగాచసరయూ స్సంగతాస్తి
రఘూద్వహ ॥౩౫॥ తత్రగంగోత్తరదేశే గంతుమిచ్ఛామి మేమనః । ఇతిసీతావచశ్శ్రుత్వా తథేత్యుక్త్వారఘూద్వ
హః ॥ ౩౬ ॥ ద్వారపాలంసమాహూయ పత్రైరాచ్ఛాద్యజానకీం । ఆజ్ఞాపయచ్ఛతంరామ శ్శీఘ్రంగచ్ఛమమాజ్ఞ
యా ॥ ౩౭॥ లక్ష్మణంవచనంమేత్వం కథయస్వసవిస్తరం । జ్ఞాతవ్యశ్శ్వోహ్యమోద్యోగ స్సీతాయాశ్చైవకౌతుకాత్ ॥
౩౮॥ సరయూసంగమేగంగా పూజనార్థంత్వయాసహ । మాతృభిర్మంత్రిభిస్సైన్యై స్సుహృద్భిర్భరతేనచ ॥౩౯॥
శత్రుఘ్నేనపురిస్థైశ్చ జనైర్విప్రైర్యథాసుఖం । సేనానివేశస్థానాని యోజనార్ధాంతరాణిచ ॥ ౪౦ ॥ పూరితాన్య
న్నతోయాద్యైః కల్పనీయానివైపృథక్ । ఇతిరామవచశ్శ్రుత్వా సతథేతిత్వరాన్వితః ॥ ౪౧ ॥ ఆజ్ఞాప్రమాణమి
త్యుక్త్వా నత్వారామంపునఃపునః । కథయామాససౌమిత్రిం రామవాక్యంసవిస్తరం ॥౪౨॥ తద్రామవచనంశ్రుత్వా
యౌవరాజ్యపదస్థితః । సభాయాంమంత్రిభిర్యుక్తో లక్ష్మణోదూతమబ్రవీత్ ॥ ౪౩ ॥ అంగీకృతంరామవాక్యమితిరా
మంవదస్వతత్ । తచ్ఛ్రుత్వాత్వరితందూతః కథయామాసరాఘవం ॥౪౪॥ సభాయాంలక్ష్మణశ్చాపి దూతాన్నాజ్ఞాప

---

చెప్పుము." అని పలుకగా నందుకు సీత "నాథా! ఎచ్చట గంగాసరయూ సంగమంబు మంగ
ళప్రదంబై యున్నదో అట్టి గంగోత్తరప్రదేశమునకు నామనము పోవ నెంచుచున్నది." అని
విన్నవించెను. అంత రాముం డట్లేయని యంగీకరించి॥ ౩౬ ॥ ద్వారపాలకునిం బిలచి, సీత

శ్రీరాముల తీర్థయాత్రాప్రయాణ సన్నాహము.

తెరలోనుండగా వానిని—ఓరీ, నీవుపోయి నాయాజ్ఞను లక్ష్మణునికి నీవు విన్నవించుము ఏమ
నిన "రేపటి నాయత్నము నిట్లు తెలియఁదగును. సీతయొక్క కుతూహలమువలనను సర
యూసంగమంబున గంగనారాధించుటకై సకల బంధుమిత్ర పరివారంబుతోడ యథాసుఖ
ముగా ప్రయాణము చేయుందగినది. ప్రతియోజనార్థంబునకును సేనాసన్నివేశస్థానంబులను అ
న్నపానాదులచే సుఖవసతులునుగలిగి యుండునట్లు ఏర్పరచునది.'' అని చెప్పుము.పొమ్ము—అని
యాజ్ఞాపించెను. అట్లే యేలినవారి యాజ్ఞాప్రకారమని వాఁడు శ్రీరామునికి అడుగడుగునకు
ను నమస్కరించుచువచ్చి లక్ష్మణునితో నా శ్రీరామవాక్యమును విస్తారముగా విన్నవించెను.
ఆ రామాజ్ఞనువిని, సభలో యౌవరాజ్యపదస్థితుఁడై మంత్రులతోడనున్న లక్ష్మణుఁడు శ్రీరా
మసన్నిధికి యుష్మదాజ్ఞ శిరసా వహింపఁబడెనని విజ్ఞాపించవలసినది." అని దూతున కాజ్ఞాపిం
చెను. అట్లే దూతుఁడుపోయి శ్రీరామునికిని విన్నవించెను. పిదప లక్ష్మణుఁడు వెండికఱ్ఱలను
చేతబూని చిత్రవిచిత్రంబులగు నుష్ణీషంబులనుధరించి సాలంకృతులై యున్న సేవకులనుపిలచి
"మీరలు త్వరగావెడలి యూరిలో జనులకు నయోధ్యలో శ్రీరాములవారికి రేపు తీర్థయా

యుత్తదా । రుక్మదండకరాన్ చిత్రోష్ణీషయుక్తాన్ విభూషితాన్ ॥ ౪౫॥ గచ్ఛధ్వం త్వరితాయూయం కథయధ్వం జనాన్పురి । అయోధ్యాయాం రాఘవస్య శ్వోయాత్రార్థం సముద్యతః ॥ ౪౬ ॥ తథేత్యుక్త్వాజవాద్దూతా రాజమార్గేషు సర్వతః । దీర్ఘస్వరేణతేప్రోచు శ్చోద్ధ్వానం కృత్వాత్మసత్కరాన్ ॥ ౪౭ ॥ హేజనాః శ్రుణుతస్వస్థాః శ్వస్సీతారామయోర్ముదా । సముద్యోగో స్తిపూజార్థం సరయ్వాస్సంగమం ప్రతి ॥ ౪౮॥ భాగీరథ్యాం సుహృద్భిశ్చ సాధనైర్దైర్బలైస్సహ । ఇతిసంశ్రావ్య సకలాన్ జనాన్ సాకేతవాసినః ॥ ౪౯ ॥ తేదూతా రాజభవనే లక్ష్మణం తం పునర్వ్యయుః । సంశ్రావితో జనాంశ్చేతి రామోద్యోగోస్త్యవేదయన్ ॥ ౫౦ ॥ సభాయాం లక్ష్మణశ్చాపి సమాహూయానుగైర్జవాత్ ॥ తక్షకానిష్టికాకారా న్ద్రుపత్కర్మానునైష్ఠికాన్ ॥ ౫౧ ॥ లోహకారాంశ్చర్మకారాంశ్చ భిత్తికర్మాదినైష్ఠికాన్ । క్రయవిక్రయకర్తౄంశ్చ కాష్ఠనిర్జీవకారిణః ॥ ౫౨ ॥ వాసోగృహవిదగ్ధాంశ్చ మహిషైర్జలవాహినః । నానాకర్మసునిపుణాన్ రజ్జుకుద్దాలధారిణః ॥ ౫౩ ॥ ఏతానాజ్ఞాపయామాస తోషణాన్ వసనాదిభిః । సంమానితాన్ససౌమిత్రిః కథయామాససాదరం ॥ ౫౪ ॥ సముద్యోగం రాఘవస్య సీతాయాః శ్వోబలైస్సహ । ఋజుర్మార్గో విధాతవ్య స్సమశ్శర్కరవర్జితః ॥ ౫౫ ॥ నిమ్నభూమిస్సమాకార్యా ఉచ్చాభూమిస్సమాపిచ । ఛిందధ్వం తాం పర్వతావృక్షా మార్గస్థా దుఃఖదాయకాః ॥ ౫౬ ॥ వాప్యః కూపా స్తటాకాశ్చ శోధనీయాస్సహస్రశః ॥ నవీ

---

త్రా ప్రయత్నముగల్గినది అని ప్రకటింపవలసినది." అని నిరూపించెను. అంత వాగు నశ్లే యని వెడలి యూరిలోనంతట నచ్చటచ్చటనిలచి "ఓజనులారా! రేపు మనసీతారాములు సమస్త పరివారంబులతోడ గంగాసరయూసంగమంబగు మంగళతీర్థంబునకు యాత్ర వెడలుచున్నారు." అని చేతులనెత్తి యుద్ఘోషించి జనులందరికిని తెలిపి యాసంగతిని లక్ష్మణునిసన్నిధికి వచ్చివిన్నవించిరి. పిమ్మట సభాసీనుఁడగు లక్ష్మణుఁడు అనుచరులవలన వడ్లవాండ్రను ఱాతిపనివాండ్రను ఇటికెఱాళ్లంజేయువారిని కమ్మరులను చర్మకారులను కుడ్యకర్మాది నిపుణులను బేరమువారిని కట్టెలు మొదలైనవాటిని తెచ్చిచ్చువారలను గుడ్డలగూడారముల నేర్పరచు నేర్పరులను ఎనుబోతులపై నీళ్లదెచ్చువారలను రజ్జుకుద్దాలధారకులను ఇట్లు సమస్తకర్మలలోను నిపుణులగువారిని పిలపించి, అందరిని వస్త్రాభరణాదులచే సంమానితులంజేసి సాదరముగా నిట్లు వారి నాజ్ఞాపించెను—రేపు సీతారాములవారికి సకలబలంబులతోడ యాత్రాసన్నాహము జరుగవలసియున్నది. మార్గంబులను సమముగా నేర్పరచి యిసుకలేనట్లు చక్కబరచవలసినది. పల్లములనుపూడ్చి మిట్టలను పడగొట్టి సమముచేయవలెను. మార్గనిరోధంబులగు పర్వతవృక్షంబులను ఛేదించి దానిని చక్కబరచునది. వేలకొలదిగా దారిలోని బావులను గుంటలను చెరువులను శోధించి చక్కపరచవలెను. క్రొత్తవిగా కొన్నిటిని చేయవలెను. నిజలవనంబులలో నీళ్లను గల్పింపవలెను. అరామడ కొక్కొక సేనానివేశస్థానమును కల్పించి యచ్చట నన్నపానాదుల కేకొరతయును లేనట్లు సర్వవస్తుసమృద్ధి నొదవింపఁదగును. పటగృహంబులు

నాశ్చాపి కర్తవ్యాస్సతో యాని గ్గతేవనే ॥ ౫౭ ॥ సేనానివేశస్థానాని యోజనార్ధసవిస్తరైః । కల్పనీయాని యుష్మాభిః పూరితాన్యన్నవారిభిః ॥ ౫౮ ॥ చుల్ల్యో రమ్యా విధాతవ్యాః పాకశాలాస్వభిత్తయః । వస్త్రైగేహాని కార్యాణి తృణైశ్చాపి సహస్రశః ॥౫౯॥ ఆరక్తఖర్పరైరాచ్ఛాదితాని విచిత్రితాని హి । నానాగృహాణి కార్యాణి పూరితాన్యన్నవారిభిః ॥ ౬౦ ॥ పుష్పాణాం వాటికాః కార్యాః కృతశోధసహస్రశః । మార్గే మార్గే కౌతుకార్థం భిత్త్వాచితాన్యనేకశః ॥ ౬౧ ॥ సరస్కంధకతాశ్చిత్ర వాటికాశ్చ సహస్రశః । పుష్పాణాం వాటికాశ్చాను ధృతాత్రనిర్మితాశ్శుభాః ॥ ౬౨ ॥ మార్గే మార్గే గాయకానాం స్థానాన్యపి సహస్రశః । సేనానివాసస్థానేషు హస్త్యశ్వరథవాజినాం ॥౬౩ ॥ సహస్రశో విధాతవ్యాశ్శాలాః పూర్ణాస్తృణాదిభిః । సుగంధచందనైర్మార్గాస్సేచనీయాస్సమంతతః ॥౬౪॥ నేమిరేఖోపమామార్గే విచిత్రవసనైర్గృహాః । పుష్పైరాచ్ఛాదనీయాస్తే హట్టాస్సంతు సమంతతః ॥ ౬౫ ॥ శృంగారైరతిచిత్రైశ్చ హస్త్యశ్వరథవాజినః । వస్త్రాలంకారఘంటాభిశ్శోభనీయాస్సహస్రశః ॥౬౬॥ శకటేషు రథోష్ట్రేషు వారణేషు రథాదిషు । శతఘ్న్యః పరిఘా బాణాశ్శక్తయః కార్ముకాన్యపి ॥ ౬౭ ॥ స్థాపనీయా నిశితశో విధాతవ్యా ధ్వజా అపి । చతుర్ష్వపి విధాతవ్యా ధ్వజా రామరథేషు హి ॥ ౬౮ ॥ హనుమత్కోవిదారాండజేశబాణాంకితాశ్శుభాః । చతుర్ష్వపి బంధనీయాః పతాకాస్స్యందనేషు హి ॥ ౬౯ ॥ హరిచ్ఛ్వేతపీతనీల వర్ణాః పరమశోభనాః । గజపృష్ఠే రాఘవార్థం హరిద్వర్ణాంకితాసనం ॥౭౦॥ రుక్మమాణిక్యరచితం సితచ్ఛత్రోపశోభితం । స్థాపనీయం మహాదివ్యం ముక్తాహారవిరాజితం ॥ ౭౧॥ సీతార్థం కరిణీపృష్ఠే నీలవర్ణం మహాసనం । రుక్మవిద్రుమవైడూర్య రత్నముక్తావిరాజితం ॥ ౭౨ ॥ ముక్తాఫలహేమతంతుగణైరాచ్ఛాదితం వరం । సిద్ధం కార్యం మహాదివ్యం స్వర్ణకుంభవిరాజితం ॥ ౭౩ ॥ పుష్పమాలాస్తోరణాని బంధనీయాని వైపథి । నృత్యంతు వారవేశ్యాశ్చ స్తుతిం కుర్వంతు వం

---

పాకశాలలు పూరిండ్లు పెంకుటిండ్లు మొదలైన సౌకర్యగృహంబులు వేలకొలదిగా కట్టబడి సిద్ధముగానుండదగును. వినోదావహంబులుగా గోడలమీఁద చిత్రంబులు వ్రాసియుండవలెను. పుష్పవాటికలు సర్వస్థలములలో నానందకరంబులుగా నుండదగును. పూలచెట్లు మట్టి తొట్లలోపెట్టి మార్గంబుల నలంకరించవలెను. దారులలో నచ్చటచ్చట గాయనస్థానంబుల నేర్పరుచునది. సేనానివాసస్థానంబులలో గజాశ్వశాలలు తృణపూర్ణంబులై యుండఁదగును. మార్గంబులలో పరిమళజలసేచనము కావలెను. దారిలో నంచుగెంగీచినట్లు విచిత్ర వస్త్రంబులచే నేర్పరచిన పటగృహంబులును అంగడివీధులును సమస్త శృంగారాలంకారములచే నొప్పియుండఁదగును. రథగజతురగంబులను దివ్యవస్త్ర ఘంటా కింకిణ్యాదులచే నలంకరించియుండవలెను. బండ్లమీఁదను ఒంటెలమీఁదను ఏనుఁగులమీఁదను రథాదులమీఁదను శతఘ్నులను ఇనప కట్ల గుదియలను అమ్ములను చిల్లకోలలను ధనస్సులను నూర్లకొలది నింపవలయును. ఆంజనేయ కోవిదార గరుడ బాణచిహ్నములుగల మంగళపతాకంబులనురథముల నాలుగుప్రక్కలలోను కట్టవలెను. తెల్లనిపచ్చనినల్లనిరంగులుగలమంగళధ్వజంబులను వేయవలయును. శ్రీరాములవారి కొఱకు పచ్చనిరంగుగల సువర్ణరత్న రంజితంబయిన శ్వేతచ్ఛత్రముచే నొప్పుచుండు అంబారిని

దినః ॥ ౨౪ ॥ ద్రవ్యైర్వస్త్రైరాభరణైః పూజాద్రవ్యైశ్చగోరసైః । పాత్రైర్నానావిధైర్దివ్యైః పూరణీయారథోత్తమాః ॥ ౨౫ ॥ అన్యచ్చాపిమయానోక్తం యద్యద్యోగ్యం హితత్పథి । సిద్ధం కార్యం హి యోగేన యేన తుష్యతి రాఘవః ॥ ౨౬ ॥ ఇతిసందిశ్య మేధావీ లక్ష్మణస్సహమంత్రిభిః । సాయంసంధ్యాదికం కర్తుం జగామనిజమందిరం ॥ ౨౭ ॥ మంత్రిణో రాజ్ఞయా తేపి తథాచక్రుర్యథోదితాః । సంతుష్టాస్తేయథాయోగ్యం రామసంతోషహేతవే ॥ ౨౮ ॥ రామోపిసీతయాసార్ధం మందిరేరత్ననిర్మితే । మంచకేపుష్పశయ్యాయాం సీతామాలింగ్యవై దృఢం ॥ ౨౯ ॥ రక్తనేపథ్యయుక్తాభి ర్దాసీభిశ్చముహుర్ముహుః । వీజితో వాలవ్యజనై ర్నిశిసుప్తస్సుఖంతదా ॥ ౩౦ ॥ ఇతి శ్రీమదానందరామాయణే యాత్రాకాండే దూతాజ్ఞావర్ణనంనామ తృతీయస్సర్గః ॥ ... ... 3 ॥ *

రామదాస ఉవాచ—తతః ప్రాతస్సముత్థాయ శ్రుత్వావాద్యధ్వనింతథా । గాయనం వందిభిర్గీతం సీతయాసహరాఘవః ॥ ౧ ॥ కృత్వానిత్యవిధింసర్వం దత్వాదానానివిస్తరాత్ । జ్యోతిర్విదం సమాహూయ గోపాలాభిధముత్తమం ॥ ౨ ॥ నమస్కృత్వాథసంపూజ్య గణకంరాఘవోబ్రవీత్ । భోగోపాలమహాబుద్ధే త్వాంపృచ్ఛేహం

దివ్యగజపృష్ఠముపై స్థాపించవలెను. శ్రీసీతాదేవికొఱకు కరిణీపృష్ఠమున నీలవర్ణపీఠంబును స్వర్ణ విద్రుమ వైడూర్య ముక్తారత్న విరాజితంబుగా నున్నదగును. అది బంగారుసరిగచే సింగారింపఁబడియుండదగును. దివ్యమహామంగళ సువర్ణపూర్ణకుంభము సిద్ధమైయుండవలెను. దారులలో పుష్పహారంబులు తోరణంబులు అలంకరింపఁబడుగాక. వారకాంతలు నర్తనముచేయవలెను. వందిమాగధులు స్తుతించుచుండని. దివ్యపరిమళసద్వస్తువులను రథములలో నింపికొనుఁడు. ఇఁక నేనుచెప్పిన దారికి యోగ్యంబులగు సమస్తవస్తువులను అందరును సిద్ధపరచికొని వెడలుఁడి. సర్వ విధములతోను రామానందము ముఖ్యము అని యాజ్ఞాపించి విప్రుఁడగు లక్ష్మణుఁడు మంత్రులతోడ సాయంసంధ్యానుష్ఠానమునకు నిజమందిరంబునకుఁ జనెను. వారందరును. లక్ష్మణాజ్ఞానుసారముగా శ్రీరామానందముకొఱకై పనులను నెరవేర్చుచుండిరి. శ్రీరాముఁడు సీతాదేవితోడ సుందరమందిరంబున రత్నపర్యంకంబుపై పూలపాన్పుమీఁద కాంతాలింగితకాంతుండై పవ్వళించి బంగారు తెరలనడుమ నడుగడుగుకును దాసీజనులు వాలవ్యజనంబులను లీలతో వీచుచుండగా నారాత్రి శృంగారస్వారాజ్యానుభవమున సుఖనిద్రనంది యానందించుచుండెను... ॥3॥

శ్రీరాములవారు సపరివారముగా నత్యంతవిభవములతోడ తీర్థయాత్ర వెడలుట.

రామదాసుఁడు చెప్పుచున్నాడు:—అంతట ప్రొద్దున సీతతోడ శ్రీరాముఁడు మేల్కొని మంగళవాద్యధ్వనులను వందిగాయనంబులనువిని నిత్యకృత్యములనన్నిటిని నిర్వర్తించి విప్రులకు విస్తారముగా దానములనొసంగి గోపాలనామక దైవజ్ఞునింబిలపించి నమస్కరించి సత్కరించి యతనిని "సుధీవరులగు గోపాలజోయిసులవారూ! మాకు గంగాయాత్రార్థము మంచి ముహూర్తమొకటిని చూచిపెట్టండి.'" అని యడిగెను. అతఁడు వెంటనే పంచాంగపుకట్టను

ద్విజోత్తమ ॥ ౩ ॥ యాత్రార్థంజాహ్నవీతీరం గంతుమిచ్ఛామిసాంప్రతం । అతోముహూర్తోకాలశ్చ స్థిరత్వక
బుద్ధ్యావివిచ్యచ ॥ ౪ ॥ తద్రామవచనంశ్రుత్వా గోపాలఃప్రాహరాఘవం । పంచాంగపట్టంవిస్తార్య తత్రదృష్ట్వా
బలాబలం ॥ ౫ ॥ రామరాజీవపత్రాక్ష ముహూర్తస్త్వద్యవర్తతే । పూర్వయామేమహాంఛ్రేష్ఠః పుష్యనక్షత్ర
మండితః ॥ ౬ ॥ తస్యవక్ష్యేఫలంరాజన్ సావధానమనాశ్శృణు । శృణ్వంతుమునయస్సర్వే శృణోతుతేగురుర్మ
హాన్ ॥ ౭ ॥ నయోగయోగంనచలగ్నలగ్నం నతారతాచంద్రబలంగురోశ్చ । యోగిన్యథరాహుర్నతదైవకాలే స
ర్వాణికార్యాణికరోతిపుష్యః ॥ ౮ ॥ అస్మిన్నామనుక్షత్రే ప్రస్థానంకురుసీతయా । దత్తోమయాముహూర్తోఽ
యం యాత్రార్థంరఘునాయక ॥ ౯ ॥ ఇతితస్యవచశ్శ్రుత్వా లక్ష్మణంరాఘవోబ్రవీత్ । భేరీమృదంగపణవ కాహలా
నకగోముఖైః ॥ ౧౦ ॥ తాలఝుఝురదుందుభిశ్చైభిశ్చనవాభిర్మహాన్ । సేనాయాస్సూచనార్థంహి కర్తవ్యఃప్ర
థమోధ్వనిః ॥ ౧౧ ॥ తథేతిరామవచనా ద్దూతానాజ్ఞాపయత్తదా । నవవాద్యస్వనంతేపి చక్రుఃకలంజాలముస్వరం ॥
౧౨ ॥ తతోరామోద్విజైర్యుక్తో వసిష్ఠేనపురోధసా । ఘృతేనప్రథమంశ్రాద్ధం గణేశాదీన్ప్రపూజ్యచ ॥ ౧౩ ॥ చ
కారప్రోక్తవిధినా వసిష్ఠంప్రాహవైతతః । అగ్నిహోత్రాణిమేగ్రేత్వం స్థాపితానితుపుష్పకే ॥ ౧౪ ॥ నేతుమ
హానీమేభ్రాత్యా గృంధుభిఃపురవాసిభిః । విమానస్థోరణీబద్ధ పుష్పమాలాతిశోభితా ॥ ౧౫ ॥ సీతాంగస్పర్శసీమా

---

విప్పిచూచి యచ్చట బలాబలములను పరిశీలించి “రాజీవాక్షుఁడగు రాముఁడా! నేడే పూర్వ యామమున శ్రేష్ఠమయిన ముహూర్తముగలదు. అది పుష్యనక్షత్రమండితము. దానిఫలము ను చెప్పెదను రాజా వినుము. ఋషులందరును విననీ. నీగురుఁ డాలికించునుగాక. యోగము చేరిరానక్కరలేదు. లగ్నము సంధించనక్కరలేదు. వేఱొకనక్షత్రమువలదు అనగా తారా బలమెందుకు? చంద్రబలమువలదు. గురుబలమువలదు. యోగిని దిగ్రాహు ఎట్లున్ననేమి? అ నగా పైనచెప్పినవాటిలో నేదియున్నను ఏదిలేకపోయినను, ప్రయాణసమయంబున పుష్యనక్ష త్రము సమస్తకార్యములను చేయును. కావున నిట్టినక్షత్రమున ముహూర్తమును పెట్టిచ్చి యున్నాను. సీతతోడ సుఖముగా ప్రయాణముచేయవచ్చును” అని దైవజ్ఞుఁడు పలుకగా శ్రీరాముఁడు లక్ష్మణునికి “భేర్యాది నవమహావాద్యంబులచే సేనాసన్నాహమునకై ప్రథమధ్వ నిని చేయించుము” అనెను. అట్లేయని లక్ష్మణుఁడాదూతల నాజ్ఞాపించగా వారు మహామం గళవాద్యఘోషము నొనరించిరి. అంత నా శ్రీరాముఁడు బ్రాహ్మణసమేతుఁడై వసిష్ఠులతోడ ఘృతముచే నాందీశ్రాద్ధమునాచరించి విధివిధానంబుగా గణేశాది దేవతల నారాధించి, వసిష్ఠు లవారితో “స్వామీ! నాముందర నగ్నిహోత్రంబులను పుష్పకంబున స్థాపించికొని నాత ల్లులతోడను తమ్ములతోడను నాగరికులతోడను విమానంబునకూర్చుండి మమ్మును తీసికొనిపో వుటకు తగినావాఁడవు. అరణీసంబంధంబులగు పూలదండలచే నలంకృతయగు సీత నిజాంగస్ప ర్శగలదై గజారూఢుండగు నాయంగమును స్పృశించుగాక.” అనిచెప్పి, పిదప సీతనుచూచి

గే మాంస్పర్శతుగజస్థితం । తతఃపప్రచ్ఛవైదేహీం కేనయానేన మైథిలి ॥ ౧౬ ॥ గమిష్యసివదత్వంమాం తదేవా జ్ఞాపయామ్యహం । తద్రామవచనంశ్రుత్వా సీతాధ్యాత్వాక్షణంహృది ॥ ౧౭ ॥ సాప్రాహముదితారామం కరిణ్యా గమనంమమ । రోచతేయదితేనాథ తదాజ్ఞాస్తురఘునాయక ॥ ౧౮ ॥ తత్తస్యావచనంశ్రుత్వా యానమాజ్ఞాప్యలక్ష్మ ణం । సీతాయైదివ్యవస్త్రాణి దదౌమాతృభ్యస్తథైవచ ॥ ౧౯ ॥ తథాదత్వాబంధుపత్నీ స్తతోదత్వాగురోఃస్త్రియం । తతోదత్వావసిష్ఠంచ విప్రాణాందత్వాతతఃపరం ॥ ౨౦ ॥ దత్వావస్త్రాణిబంధుభ్యో స్వయంజగ్రాహరాఘవః । బధ్వా శస్త్రాణ్యనేకాని త్వరయిత్వావిదేహజాం ॥ ౨౧ ॥ నత్వామాతౄర్గురూంశ్చాపి మంత్రిభిఃపరివారితః । ఆరుహ్యాశి బికాంరామ స్సభాంప్రతిసమాయయౌ ॥ ౨౨ ॥ తతస్సింహాసనేస్థిత్వా లక్ష్మణంప్రాహరాఘవః । ద్వితీయస్సూచ నార్థంహి నవవాద్యధ్వనింపునః ॥ ౨౩ ॥ ఆజ్ఞాపనీయస్సౌమిత్రే తచ్ఛ్రుత్వారాఘవేరితం । ఆజ్ఞాప్రమాణమిత్యుక్త్వాజ్ఞాప యద్ధ్వనిముత్తమం ॥ ౨౪ ॥ కర్ణుందూరాన్తేపిచశ్రుత్వా ధ్వనింమేఘోపమంతతః । తతఃప్రాహరఘుశ్రేష్ఠః పునస్సౌ మిత్రిమాదరాత్ ॥ ౨౫ ॥ సుమంత్రిఃస్థాప్యతాంపుర్యాం రక్షణార్థంమమాజ్ఞయా । గచ్ఛత్వగ్రేతుభరతో పశ్చా దాయాతుశత్రుహా ॥ ౨౬ ॥ మత్పృష్ఠేత్వంసమాగచ్ఛ తతస్సీతానుగచ్ఛతు । తస్యాఃపృష్ఠేచత్వపత్నీ హ్యూర్మిలా సానుగచ్ఛతు ॥ ౨౭ ॥ తత్పృష్ఠేమాండవీరమ్యా దయితాభరతస్యసా । అనుగచ్ఛతుతత్పృష్ఠే శ్రుతకీర్త్యనుగచ్ఛతు ॥

"దేవీ! ఏయానమునెక్కి పోగలవు? చెప్పుము. దానినే ఆజ్ఞాపించెదను" అని యడిగెను. అందుకు సీత కొంచమాలోచించుచుండి సంతసమునంది "నాథా! నీకు నిష్టమయిన నాడయేనుఁగు మీఁదనెక్కి ప్రయాణముచేయవలె" ననెను. పిదప రాముఁడు అట్లేయని లక్ష్మణునికి అజ్ఞాపించి, సీతకును తల్లులకును తమ్ములపత్నులకును గురుపత్నులకును గురువులకును బంధుగులకును బ్రాహ్మణులకును వరుసగా వస్త్రాదులనిచ్చి తాను స్వీకరించి శస్త్రంబులనుకట్టికొని సీతను త్వరపరచి, గురువులను తల్లులను వందించి, మంత్రులతోడ సభాభవనంబునకువచ్చి, సింహాసనాసీనుఁడై లక్ష్మణునితో "నిఁక సేనాసన్నివేశసూచనకై నవవాద్యధ్వనిని రెండవతూరి చేయింపు"మని యాజ్ఞాపించెను. సౌమిత్రియు నట్లే దూతలకు నిరూపించెను. వారలట్లేచేసిరి. పిమ్మట, శ్రీరాముఁడు మరలసుమిత్రానందనునితో "నాయాజ్ఞచే నూరిలోరక్షణమునకుసుమంత్రునిస్థాపింపుము. మొదటభరతుఁడువెడలని. శత్రుఘ్నుఁడువెనుకవచ్చుచుండని నావెంబడి నీవునునీవెనుక సీతయును సీతకువెనుక నీసతియూర్మిలయును దానివెనుకభరతపత్నిమాండవియును ఆమెవెనుక శత్రుఘ్నసహధర్మిణి శ్రుతకీర్తియును వరుసగావెడలవలసినది. విమానంబులలో పురనారులు తల్లులతోడ సంతసించుచు దారివేడుకలఁజూచుచు రావలసినది. నీవందరిని వారివారియానములపైయెక్కించి రమ్ము. నేనును గజమునారోహించెదను." అని చెప్పగా, నతఁడట్లేయని అందరిని ప్రయాణమున సర్వసిద్ధులఁగాజేసి వేగమెవచ్చెను. అంత నాశ్రీరాముఁడు సుమంత్రునికి వస్త్రాలంకారములతోడ నయోధ్యనప్పగించి సుముహూర్తసమయంబున లక్ష్మణుఁడు హస్త

౨౮ ॥ శత్రుఘ్నస్యప్రియాభార్యా విమానైఃపురయోషితః । మాతృభిస్తాస్సమాయాంతు పశ్యంత్యః కౌతుకం ముదా ॥ ౨౯ ॥ సీతాద్యాః కరిణీష్వద్య స్థాపయిత్వామమాంతికం । ఆగంతవ్యంత్వయాశీఘ్రం తతోహంగజమాశ్రయే ॥ ౩౦ ॥ తథేతిరామవచనాత్తథాతాః కరిణీషుసః । ఆరోహయిత్వాశ్రీరామం సమాగచ్ఛత్త్వరాన్వితః ॥ ౩౧ ॥ సమాగతంలక్ష్మణంతం దృష్ట్వారామోమహామనాః । సుమంత్రాయదదావస్త్రం తదధీనాంపురీంవ్యధాత్ ॥ ౩౨ ॥ తతోముహూర్తేసమయే ధృత్వాలక్ష్మణసత్కరం । సింహాసనాత్సముత్తీర్య మహానాగాంతికంయయౌ ॥ ౩౩ ॥ గజం ప్రదక్షిణంకృత్వా సోపానేనసరాఘవః । గజదంతోద్భవే నారురోహనాగంసుఖంశనైః ॥ ౩౪ ॥ తదాదుందుభినిర్ఘోషాన్ నవవాద్యస్వరాన్వరాన్ । వాదయామాసుగంభీరాన్ గజమాతాస్సహస్రశః ॥ ౩౫ ॥ బభూవుర్యంత్రశబ్దాశ్చ ననృతుర్వారయోషితః । వాదయంతిస్మవాద్యాని గజవాజిరథోపరి ॥ ౩౬ ॥ జయశబ్దాన్ వేదఘోషాన్ ద్విజాశ్చక్రుర్మహాస్వనైః । [illegible]కిపిచ్ఛోద్భవంచిత్రం రత్నదండవిరాజితం ॥ ౩౭ ॥ చామరంవీజయామాస విజయః పార్శ్వసంస్థితః । అన్యస్తుబాలవ్యజనంవీజయామాసప్రవృత్తః ॥ ౩౮ ॥ కలశైశ్శతసాహస్రైర్ముక్తాహారైస్తుశోభితం । రత్నదండంసువిస్తీర్ణం ఛత్రమన్యోదధారతత్ ॥ ౩౯ ॥ తత్పృష్ఠేగజమారుహ్య లక్ష్మణశ్శీఘ్రమాయయౌ । సీతాద్యాస్తాస్సమాజగ్ముస్సౌమిత్రిగజపృష్ఠతః ॥ ౪౦ ॥ పశ్యంతోకౌతుకాన్యేవ జాలరంధ్రైస్సమంతతః । పుష్పకం చాపిగగనమార్గేచైవశనైశ్శనైః ॥ ౪౧ ॥ జగామసంస్థితాస్తత్ర పురవార్యోరఘూత్తమం । పశ్యంత్యోథకౌతుకాని వవర్షుః పుష్పవృష్టిభిః ॥ ౪౨ ॥ తతస్తేతురగారూఢా గజారూఢారథేస్థితాః । నేమిరేఖోపమాస్సర్వేస్థితాస్తే రామపార్శ్వయోః ॥ ౪౩ ॥ చక్రుః ప్రణామం శ్రీరామం సంస్థితాహారబంధవత్ । రామోపికంజహస్తాభ్యాం ప్రణా

లాఘవముసివ్వగా సింహాసనమునుండి లేచి భద్రగజమువద్దికివచ్చి దానికి ప్రదక్షిణమాచరించి గజదంతనిర్మిత సోపానములమీఁదుగా దానినెక్కి యలంకరించెను. అప్పుడు గజమాతలు వేలువేలుగా దుందుభిఘోషంబులను నవవాద్యధ్వనులను గంభీరముగా గల్గించుచుండిరి. యంత్రంబులు శబ్దించుచుండెను. వారకాంతలు నాట్యమాడుచుండిరి. రథ గజ తురగారూఢులై వాద్యగాండ్రు వాద్యములను వాయించుచుండిరి. విప్రులు వేదఘోషముతోడ జయశబ్దంబులను పలుకుచుండిరి. విజయుఁడు నెమలిగరులచే నేర్పరచిన రత్నదండరమ్యంబగు చామరము నొక్కప్రక్క వీచుచుండెను. వెనుక నొకఁడు వాలవ్యజనమును వీచుచుండె. మరియొకఁడు ముక్తాహారములతోను రమ్యకలశంబులతోను రారాజించుచుండు రత్నదండ శ్వేతచ్ఛత్రంబుపట్టెను. ఇట్లు యథోక్తక్రమంబుగా నందరును వారివారియానముల నెక్కి వెడలిరి. గగనమున పుష్పకముతిన్నగా వచ్చుచుండెను. అందులోనున్న పౌరపురంధ్రులు శ్రీరామునిమీఁద నచ్చటివేడుకలనుచూచుచు పూలవానగురిపించిరి. గజరథతురగారూఢులందరును ఇరుగెలంకులలో వరుసగా నున్నవారలై నమస్కరించిరి. వారి సన్నివేశము పూలబంతి గట్టినట్టుండెను. శ్రీరాముఁడును నిజకరకమలంబులచే వారి ప్రణామంబుల నాదరించుచుండెను ॥౪౪॥ ఇట్లు శ్రీరాముఁడు రాజ్యవిభవంబు

మానభ్యనందయత్ ॥ ౪౪ ॥ ఏవంగచ్ఛతిరాజేంద్రే రామచంద్రేశనైఃపథి । గజోపరిసవీణాస్తే నటాగానంప్రచక్రిరే ॥ ౪౫ ॥ ఏవంపశ్యన్ శ్రీరామోపి పుష్పారామాదికౌతుకం । హట్టాన్ చిత్రాణివేశ్యానాం నృత్యానివివిధానిచ ॥ ౪౬ ॥ సుస్వరాణ్యథవాద్యాని శృణ్వన్ మార్గేశనైశ్శనైః । వేష్టితశ్చతురంగిణ్యా సేనయాససమంతతః ॥ ౪౭ ॥ ప్రాపసేనానివాసాయ కల్పితాంభువముత్తమాం । అయోధ్యామివతాందృష్ట్వా వతరద్రాఘవోగజాత్ ॥ ౪౮ ॥ అభినంద్యప్రణామాంశ్చ పునర్వీరకృతాన్ ముహుః । లక్ష్మణస్యకరంధృత్వా స్వకరేణరమాపతిః ॥ ౪౯ ॥ వస్త్రగేహంసంప్రవిశ్య తస్థౌసింహాసనేపునః । సీతాద్యాస్తాః స్త్రియస్సర్వా వివిశుర్వస్త్రసద్మని ॥ ౫౦ ॥ తతశ్శ్రీరామచంద్రోపి లక్ష్మణంవాక్యమబ్రవీత్ । సీమాయాంక్రోశమాత్రేద్య శతదూతాన్ పృథక్ పృథక్ ॥ ౫౧ ॥ ఏకైకస్యాందిశిత్వంమే వచనాత్స్థాపయస్వభోః । యోజనోపరిసౌమిత్రే త్వష్టదిక్షుసమంతతః ॥ ౫౨ ॥ నియోజయస్వశతశో వాజివారాన్ మమాజ్ఞయా । తథేత్యుక్త్వాలక్ష్మణోపి తథాసర్వంచకారసః ॥ ౫౩ ॥ తతోవిప్రైస్సుహృద్భిశ్చ వివిధాన్నైర్మనోరమైః । ఘృతేనశ్రాద్ధశేషేణ భోజనంరాఘవోవ్యధాత్ ॥ ౫౪ ॥ తాంబూలైర్దక్షిణాందత్వా నానావిప్రేభ్య ఆదరాత్ । ముఖశుద్ధింస్వయంకృత్వా తస్థౌసింహాసనేపునః ॥ ౫౫ ॥ శ్రుత్వాశాస్త్రపురాణాని వేదార్థాంశ్చాపిసాదరం । సాయంసంధ్యాదికంకృత్వా హుత్వాహోమంయథావిధి ॥ ౫౬ ॥ సింహాసనేసమాసీనో వేశ్యానాంనృత్యముత్తమం । పశ్యన్ శృణ్వన్ గాయనంచ నీత్వాయామద్వయాంనిశాం ॥ ౫౭ ॥ తతస్సుష్వాపపర్యంకే సీతయాసహ

## శ్రీరాములు దారిలో నచ్చటచ్చట విశ్రమించుచువచ్చుట.

లతోడ తిన్నగా దారిలో పోవునపుడు ఏనుగులమీఁద నటులు వీణలువాయించుచు గానముల కారంభించిరి. శ్రీరాముఁడును పుష్పారామాది వినోదంబులను చిత్రంబులగు నంగడివీధులను వారాంగనా వివిధ నర్తనంబులను చూచుచు, సుస్వరవాద్యంబులను వినుచు తిన్నతిన్నగా చతురంగసేనా పరివృతుఁడై వచ్చుచు నయోధ్యవలె నేర్పరుపఁబడియున్న సేనాసన్నివేశస్థానమునుచూచి యచ్చట వీర కృతప్రణామంబుల నాదరించి సముచితమర్యాదలతోడ లక్ష్మణుఁడు హస్తలాఘవమునివ్వగా నేనుఁగునుండిదిగి వసనమందిరంబును ప్రవేశించి సవిభవముగా నచ్చట సింహాసనాసీనుఁడయ్యె. సీతాదులందరును వస్త్రగృహంబులను ప్రవేశించిరి. అంత నారామచంద్రుఁడు లక్ష్మణుని “అంతట ప్రతిదిక్కులోను కోసెడుదూరమున వెవ్వేరుగా నూరు నూరుమంది దూతలను స్థాపింపుము. ఎనిమిదిదిక్కులలోను ఆమడదూరమున నంతట నూర్లకొలది గుఱ్ఱపురౌతులను నిలుపుము.” అని యాజ్ఞాపించెను. అతఁడు నట్లేయని నెరవేర్చెను. అంత శ్రీరాముఁడు బ్రాహ్మణులతోడను మిత్రులతోడను ఘృతశ్రాద్ధశేషముతోడ వివిధాన్నపానాద్యాహారములను భుజించి, సాదరముగా నావిప్రులకు తాంబూలదక్షిణలనొసంగి తాను తాంబూలమును స్వీకరించి మరల సింహాసనాసీనుండై వేదశాస్త్రార్థవిచారములచే కొంతసేపు సల్లాపగోష్ఠిలోనుండి సాయంసంధ్యానుష్ఠానమును నిర్వర్తించి, అగ్నిహోత్రకర్మల

రాఘవః । ద్వితీయేదివసేతత్ర స్థిత్వారామస్తుకౌతుకీ ॥ ౫౮ ॥ సీతయాసమగ్రం సుదినం తృతీయేదివసేపునః । పూర్వవద్వ్యాఘ్రఘోషాద్యైశ్శనైః స్థానాంతరంయయౌ ॥ ౫౯ ॥ క్వచిద్దినమతిక్రమ్య క్వచిద్ద్వేత్రీణిరాఘవః । స్థిత్వా పశ్యన్ కౌతుకాని రంజయన్ జనకాత్మజాం ॥ ౬౦ ॥ శనైశ్శనైర్యయౌమార్గే మాసేనైకేన రాఘవః । ప్రాపజీర్ణం ముద్గలేన త్యక్తమాశ్రమముత్తమం ॥ ౬౧ ॥ రామమాగతమాజ్ఞాయ ముద్గలోనూతనాశ్రమాత్ । భాగీరథ్యాదక్షిణతః ప్రాపరామాంతికంతదా ॥ ౬౨ ॥ తందృష్ట్వారాఘవశ్చాపి నత్వాసంపూజ్యసాదరం । వాసోగేహేసమాసీనం పప్రచ్ఛవినయాన్మునిం ॥ ౬౩ ॥ త్వయాయమాశ్రమస్త్యక్తః కిమర్థంమునిసత్తమ । తత్త్వంవదమహాభాగ యథావచ్చ సవిస్తరం ॥ ౬౪ ॥ తద్రామవచనంశ్రుత్వా ముద్గలోవాక్యమబ్రవీత్ । అద్యధన్యోస్మ్యహంరామ నివృత్తంవనవాసతః ॥ ౬౫ ॥ యత్త్వాంపశ్యామినేత్రాభ్యాం చిరకాలేనరాఘవ । భరతప్రాణరక్షార్థం యదానీతౌమయాశ్రమాత్ ॥ ౬౬ ॥ దివ్యౌషధ్యస్తదాజాతం పూర్వంతేదర్శనంమమ । మయాయమాశ్రమస్త్యక్తః కిమర్థంతద్బ్రవీమితే ॥ ౬౭ ॥ సాన్నిధ్యంనాత్రగంగాయాః స్వరయ్వాఅపినాత్రవై । ఇతిమత్వామయాత్యక్త శ్చాశ్రమోయంమహాత్తమః ॥ ౬౮ ॥ అత్ర సిద్ధింగతాఃపూర్వం శతశోథసహస్రశః । మునీశ్వరాస్తయాప్యత్ర తపస్తప్తంకియద్దినం ॥ ౬౯ ॥ ఇతిరామసమాఖ్యాతమాశ్రమస్యచమోచనే । కారణంచత్వయాపృష్టం కిమగ్రేశ్రోతుమిచ్ఛసి ॥ ౭౦ ॥ తస్యనేర్వచనంశ్రుత్వా పునస్తం ప్రాహరాఘవః । కింక్షేత్రకేణాతిభాస్వతి ర్భవిష్యతిమునేవద ॥ ౭౧ ॥ తద్రామవచనంశ్రుత్వా రాఘవంప్రాహముద్గలః । యద్యత్రసరయూనద్యాద్విజైర్గమోహిభవిష్యతి ॥ ౭౨ ॥ జాహ్నవ్యాతహ్యహంచాత్ర వత్స్యేరామయథా

---

నాచరించి రాత్రియోలగంబున నృత్తగీతాది వినోదములనంది సీతతోడ సుఖసుప్తుండైమరునాఁడు నచ్చటనే వేడుకలతో నివసించెను. మరల, మూడవనాఁడు యథాపూర్వముగా సమస్తవిభవంబులతో ముందుకు ప్రయాణముచేసెను. కొన్నిచోట్లలో నొకనాఁడు కొన్నిచోట్లలో రెండుమూఁడురాత్రులు ఇట్లు దారిలో సముచితముగా నిలచినిలచి సీతకు మార్గవినోదంబుల నెన్నిటినోచూపుచు నొకనెల ప్రయాణముచేసెను ॥ ౬౦॥ ఇట్లువచ్చుచు జీర్ణంబగు ముద్గల

శ్రీరాములవారు ముద్గలాశ్రమమును ప్రవేశించుట.

మునిచే విడువఁబడిన దివ్యాశ్రమంబును ప్రవేశించెను. ముద్గలుండు శ్రీరాములవారు దయచేసినసంగతినెఱిఁగి నూతనాశ్రమమునుండి వెడలి గంగకుదక్షిణముగావచ్చి రామ సాన్నిధ్యము నొందెను. అప్పుడు శ్రీరాముఁడు మునీంద్రునింజూచి నమస్కరించి సాదరముగా సంపూజించి పటగృహంబున సుఖాసీనుఁడగు నామునిని సవినయముగా “ మునీంద్రా! నీవీయాశ్రమము నేల వదలినది? దానియాథార్థ్యమును చక్కఁగానెఱింగింపుము ” అనిపృచ్ఛించెను. అందుకుముద్గలుండు “ స్వామీ! నేఁడు నేను ధన్యుఁడనయితిని. బహుకాలమునకు నీదర్శనములభించినందున వనవాసమునుండి నివృత్తుఁడుగనున్నాను. మునుపు భరతప్రాణరక్షార్థము దివ్యౌషధులీయాశ్రమమునుండి యెత్తఁబడినపుడు నీదర్శనము లభించియుండె. ఎందువల్ల నేనీయాశ్రమమును

సుఖం । ఇతి తస్య వచనం శ్రుత్వా రాఘవః ప్రాహ తం పునః ॥ ౨౩ ॥ కిమర్థం సరయూ శ్రేష్ఠా కుతః ప్రాప్తా ధరాతలం ।
తత్త్వం వద మహాభాగ సవిస్తారం మమాగ్రతః ॥ ౨౪ ॥ ఇతి రామవచనం శ్రుత్వా ముద్గలో వాక్యమబ్రవీత్ । తవైవ చరి
తం రామ మన్ముఖాచ్ఛ్రోతుమిచ్ఛసి ॥ ౨౫ ॥ తథాపి తే సంప్రవక్ష్యామి తచ్ఛృణుష్వ రఘూత్తమ । శంఖాసురో మ
హాదైత్యో వేదాన్ పూర్వం జహార సః ॥ ౨౬ ॥ తాన్ వికీర్య సముద్రే హి స్వయమాసీన్మహోదధౌ । తదర్థం చ త్వ
యా మాత్స్యం వపుర్ధృత్వా మహత్తరం ॥ ౨౭ ॥ హతశ్శంఖాసురో వేదాస్త్వయా దత్తాస్తు వేధసే । తతో మార్గేణ
మహతా పూర్వరూపం త్వయా స్మృతం ॥ ౨౮ ॥ తదా హర్షేణ నేత్రాత్తే పతితాశ్చాశ్రుబిందవః ॥ హిమాలయే తతో
జాతా నదీ పుణ్యాశుభోదకా ॥ ౨౯ ॥ సా ఖ్యాతా నారాయణస్యైవ ఆనందాశ్రుసముద్భవా । శతైర్బిందుసరః ప్రాప
తస్మాచ్చ మానససంయయా ॥ ౩౦ ॥ ఏతస్మిన్నంతరే రామ పూర్వజస్తే మహాత్తమః । వైవస్వతో మనుర్యష్టుం ముద్యుక్తో
గురుమబ్రవీత్ ॥ ౩౧ ॥ అనాదిసిద్ధాయోధ్యేయం విశేషేణాపి వై మయా । రచితా నిజవాసార్థం మత్రియజ్ఞం కరో
మ్యహం ॥ ౩౨ ॥ యది తే రోచతే చిత్తే తచ్ఛ్రుత్వా గురురబ్రవీత్ । అత్ర తీర్థం వరం నాస్తి నాస్తి శ్రేష్ఠా మహానదీ ॥ ౩౩ ॥
యజ్ఞార్థం యది తే చిత్తం యష్టుం నృపతిసత్తమ । ఆనయస్వ నదీం రమ్యాం మానసాత్పాపనాశినీం ॥ ౩౪ ॥ ఇతి గురో
ర్వచనాద్రాజా మనుర్వైవస్వతో మహాన్ । రణత్కృత్య మహాచ్చాపం సందధే శరముత్తమం ॥ ౩౫ ॥ సశరో మాన
సం భిత్వా తస్మాన్నిష్కాసితాం నదీం । అయోధ్యామానయామాస పంథానం [illegible] ॥ ౩౬ ॥ శరమార్గాను
సారేణాయోధ్యాయాం ప్రాప వై నదీ । మహోదధౌ పూర్వదేశే మిలితా రఘునందన ॥ ౩౩ ॥ ఆనీతా సా శరేణైవ శ

---

విడిచితిననగా, ఇది గంగాతీరమునుకాదు, ఇచ్చట సరయూనదియునులేదు, అయిన నిచ్చట ననేకులు మునీంద్రులు తపస్సిద్ధినొందిరి, నేనును కొంతకాలమిచ్చట తపమునాచరించుచుంటిని. నీవడిగినసంగతిని తెలిపితిని. ఇంకనేమి విననోరుదువు? " అని పలికెను. మరల శ్రీరాముఁడు "మహర్షీ! నీకిచ్చట నేమిచేసిన సుఖవసతిగల్గును? చెప్పు" మని యడిగెను. అందుకుముద్గలుఁడు "ఇచ్చటగంగా సరయూసంగమంబగునెడ నేనునిచ్చటనే యథాసుఖముగా వసించెద" ననెను ఆమాటవిని రాముఁడు "పుణ్యాత్ముఁడా! ఎందువల్ల నీసరయూనది శ్రేష్ఠమైనది? ఇది భూమికెట్లువచ్చినది? ఆసంగతిని చక్కఁగా చెప్పు" మని యడిగెను ॥ ౨౪ ॥ ఆమాటవిని ముద్గలుండు శ్రీరామునితో "స్వామీ! నీచరిత్రమునే నాముఖమునుండి విననోరుచుందువు.

ముద్గలుఁడు శ్రీరాములకు సరయూత్పత్తి నెఱిఁగించుట.

అయినఁ దానిని సంక్షేపముగాఁ జెప్పెదను. వినుము; మునుపు శంఖుఁడను మహాదైత్యుండు వేదంబులనపహరించి గొనిపోయి సముద్రమునఁజల్లి తాను మహోదధిలోనుండెను. దాని కొఱకు నీవు మత్స్యాకృతినిధరించి శంఖాసురునిఁజంపి యావేదంబులను బ్రహ్మదేవునికిచ్చితివి అపుడు నీవు పూర్వరూపమునంది యానందించుచుండఁగా నీయానందాశ్రుబిందువులు హిమాలయమునఁబడెను. అంత నచ్చటినుండి యవి పుణ్యజలంబులుగల మహానదిగానేర్పడెను. అది సా

రయూశ్చేతికథ్యతే। సరోవరాత్సముద్భూతా సరయూశ్చేతి కేచన ॥౮౮॥ తతో భగీరథేనేయం కపిలక్రోధవహ్నినా। విదగ్ధాన్ పూర్వజాన్ సర్వాన్ సాగరాన్ ప్రేషితుందివం ॥ ౮౯ ॥ భాగీరథీసమానీతా త్వత్పాదాబ్జసముద్భవా। తపసా శంకరం తోష్య శరయ్వామిలితాథసా ॥ ౯౦ ॥ వరదానాత్కలౌ శంభో ర్గంగాఖ్యాతింగమిష్యతి। ఆగ్రే పాగరపర్యంత మేనాంగంగాంవదంతిహి ॥ ౯౧ ॥ తవపాదసముద్భూతా యావిశ్వంపాతిజాహ్నవీ। ఇయంతునేత్రసంభూతా కిమద్యాగ్రేవదామ్యహం ॥ ౯౨ ॥ కోటివర్షసహస్రైశ్చ కోటివర్షశతైరపి। మహిమాసరయూనద్యాః కోపివక్తుంనవైక్షమః ॥ ౯౩ ॥ ఇతిరామసమాఖ్యాతం యథాపృష్టంత్వయామమ। మునేస్తద్వచనంశ్రుత్వా లక్ష్మణంప్రాహరాఘవః ॥ ౯౪ ॥ సరయూమానయస్వాత్ర శరంముక్త్వామమాజ్ఞయా। తథేతిరామవచనా ద్ధృత్వా చాపంసలక్ష్మణః ॥ ౯౫ ॥ శరంముక్త్వాతలంభిత్వా శరయూమానయత్క్షణాత్। శరయూంస్నాపయిత్వాథాభూత్వా ముద్గలాశ్రమమాయయౌ ॥ ౯౬ ॥ జాహ్నవ్యామిలితాసాపి తాందృష్ట్వారాఘవోబ్రవీత్। అత్రస్థిత్వాలక్ష్మణేన దారితేయంమహానదీ ॥ ౯౭ ॥ అతోదద్రీతినామ్నాత్ర నగరీఖ్యాతిమేష్యతి। దద్రీయంజగతీమధ్యే బదర్యాశ్చయవాధికా ॥ ౯౮ ॥ భవిష్యతినసందేహ స్తవవాసాద్విశేషతః। తతస్సీతాంసమాహూయ రాఘవోవాక్యమబ్రవీత్ ॥ ౯౯ ॥ ముద్గలస్యాశ్రమే త్వైస సానీతాసరయూర్నదీ। పశ్యసౌమిత్రిణాముక్త్వా శరంమన్నామచిహ్నితం ॥ ౧౦౦ ॥ నారీభిర్మాతృభిస్సీతే పుష్పకేణాతిభాస్వతా। వృథాసాసరయూర్యత్ర సంగతాస్తిమహానదీ ॥ ౧౦౧ ॥ జాహ్నవ్యాసంగమంత్వంహి గచ్ఛస్వగురుణాద్విజైః। పూజయిత్వాసవిస్తారం యథోక్తంవచనంపురా ॥ ౨ ॥ ఆగచ్ఛస్వతతశ్శీఘ్రం)

షనారాయణుని యానందాశ్రుసముద్భవముగానఁ దిన్నగా బిందు సరస్సునుచేరి యందుండి మానససరోవరముఁ జేరెను. అంతలో నీపూర్వుఁజుఁడగు వైవఁస్వతమనవు యజ్ఞముచేయనారంభించి తనగురువుతో « నీయయోధ్య యనాదిసిద్ధంబైనది. నేనును దీని విశేషరాజధానిగాఁజేసికొంటిని. నీమనసొప్పియుండిన నిచ్చట యజ్ఞమునాచరించెదను. ” అని ప్రార్థించగా, నందుకతఁడుఁ ఇచ్చట మంచితీర్థములేదు. మహానదియునులేదు. ఇచ్చటనే యజ్ఞముచేయ నిచ్ఛగల్గియుండిన నీవుమానససరోవరమునుండి దురితపరిహారకంబగు మహానదిని తీసికొనిరమ్ము. ” అనిచెప్పెను. ఆ గుర్వాజ్ఞనువిని వైవస్వతుఁడు ధనుష్టంకారముచేసి బాణమునుప్రయోగించెను.అది పోయిమానసమును భేదించి అందుండివిడదీసి ఆనదిని అయోధ్యకు దారిచూపుదానివలె నీడ్చికొనివచ్చెను. అదిశరమార్గానుసారముగా నయోధ్యకువచ్చి పూర్వమహోదధిలోకలిసెను. శరముచే తేబడినది శరయువని చెప్పఁబడును. సరోవరమునుండి పుట్టివచ్చినదిగాన సరయువనియును కొందరిచేఁ జెప్పఁబడును. అంతట భగీరథునివలన నీపదారవింద సముద్భూతయగు గంగ కపిలక్రోధాగ్నిదగ్ధులగు నీపూర్వజులైన సాగరులను దివమునకంపుటకై తేబడెను. ఆభగీరథుఁడు తపముచే శంకరునినారాధించి సంతుష్టునింజేసి గంగను భూమిలో ప్రవహింపంజేసి సరయూనదిలో కలిపెను. అయిన శివవరమహిమచే కలిలోగంగానది సుప్రఖ్యాతినొందును.

మత్రత్వంమమసన్నిధౌ । విశేషాన్ముద్గలస్యాపి సన్నిధావద్యవై పునః ॥ ౩ ॥ నవీనసరయూనద్యా భాగీరథ్యాశ్చసంగమే । పూజనంత్వంమయాసాకం కర్తుమర్హసి మైథిలి ॥ ౪॥ తథేతిరామవచన మంగీకృత్యవిదేహజా । పూజాసంభారమాదాతుం వివేశవసనగృహం ॥ ౧౦౫ ॥ ✱ ఇతిశ్రీమదానందరామాయణే యాత్రాకాండే సరయూద్విధాకరణంనామ చతుర్థస్సర్గః ॥ ... ... ... ... ... ... ... ... ౪॥

శ్రీరామదాసఉవాచ — తతోగృహీత్వాసంభారాన్ పూజార్థంజానకీజవాత్ । కౌసల్యాదివధూభిస్తు పుష్పకంచారురోహసా ॥ ౧ ॥ క్షణేనవృద్ధాసరయూ ర్యత్రసాగంగయాశుభా । సంగతాస్తిమహాక్షేత్రే తత్రప్రా

ముందు సాగరపర్యంతము దీనినే గంగయని చెప్పుదురు. నీపాదసముద్భూతయగు జాహ్నవీనది లోకపావనిగానున్నది. ఈసరయువు నీకంటినుండి పుట్టినది. దీనిమహిమను నీయెదుటనేమి చెప్పగలను? నూరుకోట్ల వత్సరములైనను వేయికోట్ల సంవత్సరములైనను సరయూమహిమ నభివర్ణించుట కొకఁడును సమర్థుఁడుకాఁడు. శ్రీరామా! నీవడిగిన విషయమును నిరూపించితిని" అని ముద్గలముని మౌనమూనెను ॥ ౯౩ ॥ మునివాక్యములనువిని శ్రీరాముఁడు "లక్ష్మణా! నీవు

శ్రీరాముఁడు సరయువును తెప్పించి గంగలోకలిపి దద్రీనగరమును కల్పించుట.

నాయాజ్ఞచే బాణమునుప్రయోగించి శరయూనది నిచ్చటికి గొనిరమ్ము." అని సౌమిత్రి నాజ్ఞాపించెను. అట్లేయని రామాజ్ఞానుసారముగా లక్ష్మణుఁడు ధనుర్ధారియై శరమునువిడిచి తత్క్షణమే శరయువును వెంటఁదెచ్చెను. ఇట్లు శరయు రెండుగాచీలి ముద్గలాశ్రమమును చేరెను. అదియునుపోయి గంగతో కలిసికొనెను. దానిని చూచి రాముఁడు "ఇచ్చటనిలచి లక్ష్మణుఁడు సరయువును చీల్చెనుగాన నీచోటు దద్రియనుపేర లోకనగరముగల్గి ఖ్యాతినొందును. జగంబున నీదద్రి బదరికన్నను ఒకయవాంశ మధికముకాగలదు. ముద్గలుఁడా! నీవు ఇచ్చట వసించుటవలన నింకనువిశేషమేసరి." అని యానతిచ్చిన; సీతనుపిలచి "దేవీ! చూడుమిచ్చటనే ముద్గలాశ్రమమున మన్నామాంకిత శరమును లక్ష్మణుఁడు ప్రయోగించి శరయువును తెచ్చెను. నీవు నారీమణులతోడను తల్లులతోడను గురువులను వెంటబెట్టికొని పుష్పకమునెక్కి వృద్ధసరయూగంగా సంగమస్థానమునకుపోయి వెనుక నీవడిగినట్లచ్చట గంగనారాధించి త్వరగా నీనవీన సరయూగంగా సంగమప్రదేశంబున విశేషముగా ముద్గలసన్నిధిలో గంగను నాతోడపూజింతువుగాక పోయిరమ్ము." అని యాజ్ఞాపించెను. ... ... ... ॥౪॥

సీత వృద్ధ సరయూగంగా సంగమంబు నారాధించివచ్చుట.

అంత నాజానకీదేవి పూజోపకరణంబులను సిద్ధముజేసికొని కౌసల్యాదులతోడ పుష్పక విమానము నెక్కెను. ఆపుష్పకంబు క్షణమాత్రమున వృద్ధసరయూనదియును గంగయును

పవిదేహజా ॥ ౨ ॥ పతింవినాగ్నినానారీ సీమాముల్లంఘ్యనవ్రజేత్ । సదోషాత్రనవిజ్ఞేయ స్త్రీలోద్యోగంవిహాయ
సా ॥ ౩ ॥ ఉత్తీర్యసావిమానాగ్ర్యా న్నమస్కృత్యాథసంగమం । పురోధసాచోదితాసా నారికేలంసవాయనం ॥
౪ ॥ భాగీరథ్యైసమర్ప్యాథ స్నాత్వాచైవయథావిధి । సంగమంపూజయామాస చోపచారైర్యథావిధి ॥ ౫ ॥
సురామాంసోపహారైశ్చ పక్వాన్నైర్బలిభిస్తథా । పట్టకూలాదిభిర్వస్త్రైర్ముక్తాహారైస్సచందనైః ॥ ౬ ॥ దివ్యైరాభ
రణైశ్చాత్రైర్గ్యాయనాద్యైస్సువిస్తరం । తతస్సువాసినీః పూజ్య పూజయిత్వాత్వరుంధతీం ॥ ౭ ॥ వసిష్ఠంబ్రాహ్మణాం
శ్చాపి భోజయామాసవిస్తరైః । పట్టకూలాదిభిర్వస్త్రైర్దివ్యైరాభరణాదిభిః ॥ ౮ ॥ సువాసినీర్బ్రాహ్మణాంశ్చ తో
షయామాసమైథిలీ । స్వయంకృతోపహారంచ రాఘవార్థముపోషితా ॥ ౯ ॥ యయాయానేనశీఘ్రంసా రాఘవ
స్యాంతికంముదా । తతశ్శ్రీరామచంద్రోపి సీతయాగురుణాద్విజైః ॥ ౧౦ ॥ గంగయోస్సంగమేచక్రే పూజనంసయ
థావిధి । యథాకృతంచవైదేహ్యా తస్మాచ్చాపిశతాధికం ॥ ౧౧ ॥ తతస్సహస్రశోవిప్రాన్ భోజయామాససాదరం ॥
దత్వాదానాన్యనేకాని గోహస్తిరథవాజినాం ॥ ౧౨ ॥ తతోభుక్త్వాస్వయంరామ స్సీతయాబంధుభిర్ద్విజైః । సింహా
సనేసమాసీనో సౌమిత్రిమిదమబ్రవీత్ ॥ ౧౩ ॥ జ్ఞాతవ్యోమమవాసోత్ర రాత్రిర్నవరఘూత్తమ । సమాచారాన్
కురుష్వత్వం శాసనంయన్మయోచ్యతే ॥ ౧౪ ॥ బ్రహ్మచారీగృహస్థోవా వానప్రస్థాశ్రమీయతిః । యఃకశ్చిద్వాస

చేరియుండు సుంగళస్థానమునకువచ్చెను. అగ్నిని పతిని వదిలి స్త్రీలు సీమోల్లంఘనము చేయ
రాదు, అనుసీదోషము నిచ్చట నెంచవలదు. వెంటనే సీత విమానమునుండి దిగి• గంగను
వందించి పురోహితాజ్ఞానుసారముగా ఫలవాయనంబును గంగ కర్పించి తానుస్నానముచేసి
యథావిధానముగా సంగమమును ఆరాధించెను. సురామాంసోపహారాదులను పక్వాన్నాది
బలులను దుకూలాదివస్త్రములను ముక్తాహారాదిభూషణంబులను దివ్యగంధాదులను గంగా
దేవికి సమర్పించెను. అట్లే అరుంధత్యాది సువాసినులను సంపూజించి వసిష్ఠాదిబ్రాహ్మణులకు
మృష్టాన్న పానాదిసత్కారముల నొసంగెను. మఱియు బ్రాహ్మణులకును ముత్తయిదలకును
పుష్పగంధ తాంబూలాభరణదక్షిణాదులను యథేష్టముగానిచ్చి తృప్తినొదవించెను తానును
ఉపహారమునంగీకరించి శ్రీరామునికై యుపవాసముగానే విమానమునెక్కి శ్రీరామసన్నిధికి
వచ్చిచేరెను ॥ ౯ ॥ ఇట్లుసంతోషముగావచ్చిన సీతను వసిష్ఠాదులను కౌసల్యాదులను వెంటఁ

## సీతారాములు గంగాసంగమ పూజాదికము నొనర్చుట.

బెట్టికొని శ్రీరాముండు నవీనసరయూగంగాసంగమప్రదేశంబున, సీతవృద్ధశరయూగంగా సంగ
మంబున చేసినపూజాది విభవములకన్నను నూరింతలధికముగా సంపూజించి, గోగజతురగర
థాది మహాదానంబుల ననేకంబుగా ద్విజులకు సమర్పించి వేలకొలది బ్రాహ్మణులకు సమారా
ధన చేయించి, తాను సకలపరివారముతోడ భుజించి, సంతోషముగా సింహాసనాసీనుండై ల
క్ష్మణునితో ,,తమ్ముఁడా! ఇఁకనిచ్చట నాకుతొమ్మిది రాత్రులునివాసము నిశ్చయింపఁబడినది. ఇ

మాయాతి పథికస్సదుమాజ్ఞయా ॥ ౧౫ ॥ మయా సంపూజితో నైవ గంతుం దేయస్త్వయాతిథిః । మయా స్పృష్టో గతః కశ్చిత్తదా వో శాసనం మమ ॥ ౧౬॥ తద్రామవచనం శ్రుత్వా తథా చక్రే స లక్ష్మణః॥ చ్యవనో మునివర్యస్తు జ్ఞాత్వా రామం సమాగతం ॥ ౧౭ ॥ దర్శనార్థం యయౌ శీఘ్రం రామేణాపి సుపూజితః । స్థిత్వా స నేవ స్త్రగేహే రాఘవం వాక్యమబ్రవీత్ ॥ ౧౮॥ రామ రాజీవపత్రాక్ష గంగాయా దక్షిణే తటే । ఆశ్రమః కీకటే దేశే మమాస్తి పరమశ్శుభః॥౧౯॥ కందమూలఫలార్థం హి విఘ్నం కుర్వంతి మాగధాః । మమాశ్రమే రామదూతాస్తేభ్యో రక్షా విధీయతాం ॥ ౨౦॥ చ్యవనస్య వచః శ్రుత్వా టణత్కృత్య మహాధనుః । బాణం ముక్త్వాశ్రమాత్తస్య పరితః పరిఖోపమాం ॥ ౨౧ ॥ చకార రేఖాం బాణేన దుష్టైర్గంతుం చ వ్యాక్షమాం । రామబాణకృతా రేఖా యత్ర తత్ర పురీ శుభా ॥ ౨౨॥ రామరేఖేతి నామ్నాసీత్తథా చైవ మహానదీ । చ్యవనశ్చ తదా హృష్టో రాఘవం వాక్యమబ్రవీత్॥ ౨౩॥ నింద్యస్స కీకటో దేశో వర్తతే రఘునందన । తవ వాక్యాద్భవిష్యంతి తత్ర పుణ్యస్థలాని హి ॥ ౨౪ ॥ తస్మాత్త్వయాద్య వక్తవ్యం వచనం మే సుఖాస్పదం । తన్మునేర్వచనం శ్రుత్వా వాక్యం రామస్తమబ్రవీత్ ॥ ౨౫ ॥ కీకటేషు గయా పుణ్యా పుణ్యపునా పునః పునః । ఆశ్రమస్తే మహాపుణ్యః పుణ్యం రాజవనం వరం ॥ ౨౬ ॥ భవిష్యతి న సందేహో మమ వాక్యాన్మునీశ్వర । చ్యవనస్తేన సంతుష్టో రామం పృష్ట్వాశ్రమం యయౌ ॥ ౨౭ ॥ ఏతస్మిన్నంతరే తస్య సత్రే రామేణ నిర్మితే । ప్రత్యహం కోటిశో విప్రా భుంజంత్యతిథిభిస్సహ ॥ ౨౮ ॥ కుంభోదరో మునిః ప్రాగాత్ శ్రీమాచారాంతికం తదా । గంగాయాస్తత్ర ప్రసం

చ్చట మన యెల్లలో నిట్లు నాశాసనమును నిరూపింపుము. బ్రహ్మచారిగాని గృహస్థుఁడుగాని వానప్రస్థుఁడుగాని యతిగాని ఎవ్వఁడైనను సరియే, బాటసారిని నాయాజ్ఞచే పట్టి తీసికొనిరావలసినది. వాఁడు నాచేసత్కరింపఁబడక ముందుకు పోకూడదు. నన్నుచూడక యెవ్వఁడైనను నడచెనా నాయాజ్ఞ మీఱినాఁడనున్నది.'' అని చండశాసన మొనరించెను. ॥౧౬॥ రామాజ్ఞా

చ్యవనముని శ్రీరామునిదర్శించగా కీకటదేశము పుణ్యప్రదంబగుట.

నుసారముగా లక్ష్మణుఁడట్లే నెరవేర్చెను. ఇట్లుండ శ్రీరామసమాగమనంబునువిని చ్యవనుండను మునీంద్రుఁడు దర్శనమునకై త్వరగావచ్చి వస్త్రగేహమున సుఖాసీనుఁడై సత్కరింపఁబడి శ్రీరామునితో "రాజీవాక్షుఁడగు రామచంద్రా! గంగకు దక్షిణతీరమునందలి కీకటదేశంబున నాపుణ్యాశ్రమంబు పావనంబుగానున్నది. ఆనాయాశ్రమంబున కందమూలఫలాదులకై మాగధులగు దూతలు తొందరపెట్టుచున్నారు. వారురానట్లు రక్షఁజేయవలెను." అనిచెప్పగా నామాటవిని శ్రీరాముఁడు ధనుష్టంకార పురస్సరముగా బాణమును ప్రయోగించి ఆముని యొక్క పుణ్యాశ్రమమునకు నంతట నంచుకట్టినట్టు రేఖ నేర్పరచెను. ఆరేఖ దుష్టులు దాటుట కశక్యముగానున్నది. ఎచ్చట రేఖగల్గెనచ్చోటు రామరేఖయను పేరుతో మంచిపట్టణముగా నేర్పడెను. అట్లే దానిలోనొక మహానదిగలిగెను. అంత సంతసించిన చ్యవనుఁడు శ్రీరామునితో "రఘునందనా! ఆకీకటదేశము మిక్కిలి నింద్యముగానున్నది. నీమాటవలన న

గేన గయాం గంతుం సముద్యతః ॥ ౨౯ ॥ సమాగతః ప్రయాగాచ్చ దూతాన్ దృష్ట్వా బ్రవీద్వచః । హే దూతాః కుత్ర రందేయం యూయం కస్యాజ్ఞయా స్థితాః ॥ ౩౦ ॥ ఆకాశచుంబినశ్చిత్రా ఇమే గేహస్య వై ధ్వజాః । హనుమత్కో-విదారాండజేః బాణాంకితాశ్శుభాః ॥ ౩౧ ॥ శ్వేతనీలహరిత్పీత వర్ణాః పరమశోభనాః । దృశ్యంతే గేహతాకాశ్చ కస్యేమే తేజయసస్వనః ॥ ౩౨ ॥ తత్తస్య వచనం శ్రుత్వా దూతాః ప్రోచుస్త్వరాన్వితాః । రామో రాజీవపత్రాక్షో యోధ్యాయాః పాలకః ప్రభుః ॥ ౩౩ ॥ సోఽగ్రే యాత్రార్థమాయాతో వయం తస్యాజ్ఞయా స్థితాః ॥ సత్రమన్నస్య రామేణ నిర్మితం చాత్ర వర్తతే ॥ ౩౪ ॥ క్షుధార్తస్త్వం సుఖం గచ్ఛ భుక్త్వా పీత్వా సుఖం వ్రజ । తత్తేషాం వచనం శ్రుత్వా పరివృత్య మునిః పునః ॥ ౩౫ ॥ ఆగతో యేన మార్గేణ తేన మార్గేణ సంయయౌ । గచ్ఛంతం తం మునిం దృష్ట్వా రామదూతాస్త్వరాన్వితాః ॥ ౩౬ ॥ రుద్ధ్వా మార్గం మునేస్తస్య వచనం ప్రోచురాదరాత్ । కిమర్థం త్వం పరావృత్య మునే గచ్ఛసి వై పునః ॥ ౩౭ ॥ ఆగతోసి యథా యేన తేనైవ త్వం వదస్వ నః । ఇతి తేషాం వచః శ్రుత్వా నిర్బంధాన్స మునిస్త్వసౌ ॥ ౩౮ ॥ తూష్ణీం స్థిత్వా క్షణం ధ్యాత్వా నిశ్చయం కృతవాన్ హృది । ఇదానీం రాఘవో యోధ్యాం యాత్రాం కృత్వాగమిష్యతి ॥ ౩౯ ॥ నానాదేశేషు సర్వత్ర నృణాం తద్దర్శనం కథం । భవిష్యతి తథాన్యత్ర రామతీర్థాని భూతలే ॥ ౪౦ ॥ భవిష్యంతి కథం నృణాం మహాత్మ్యపహారిణి చ । కథం రామేశ్వరాభ్యాం భవిష్యంతి గతిప్రదాః ॥ ౪౧ ॥ అతః కిం చి

చ్చట పుణ్యస్థలంబు లేర్పడవలెగదా? గనుక నీవు శుభవచనమును నాకుచెప్పవలెనని" వేడెను. అందుకు శ్రీరాముఁడు "కీకటదేశమున గయాపుణ్యస్థలమును పునఃపునానదియును గలుగని నీయాశ్రమంబు పరమపవిత్రముగానుండని. రాజవనంబును వరవనంబు పుణ్యాకరంబుగానుండిని. నామాట్లవలన నైవిషయములకు సంశయములేదు." అని మునిని మాన్యునింజేసెను. చ్యవనుండును రామాజ్ఞనొంది నిజాశ్రమమున కరిగెను. ఇంతలో రామునియచ్చటి సత్రమున ప్రతిదినమును కోట్లకొలది బ్రాహ్మణులు యతులతోడ భుజించుచుండిరి ॥౨౮॥ ఇట్లుండ నొకప్పుడు కుంభో

కుంభోదరుఁడను బ్రాహ్మణుఁడువచ్చి శ్రీరామసత్కారమును నిరాకరించుట.

దరుఁడను మునియొకండు గంగాయాత్ర పోయినవాఁడు ప్రయాగనుండి గంగకు వచ్చుచుండువాఁడు ఈదారిలోని వినోదములనుచూచి యచ్చటిమాతలను "ఓదూతల్లారా! ఎవనియాజ్ఞమీఁద మీరిచ్చటనున్నారు? తెల్లని హనుమద్ధ్వజంబును నల్లనికోవిదారధ్వజంబును గరుడచిహ్నితంబగు నాకు పచ్చధ్వజంబును పీతవర్ణబాణధ్వజంబును చిత్రంబులై గగనస్పృక్కులై యున్నవి. ఇవి యెవనివి? ఈపతాకంబులు నెవనివి? జయనాదములు వినబడుచున్నవి." అని యడుగగా నాదూతలు త్వరపడి "స్వామీ! అయోధ్యనేలుచుండు రాజీవాక్షుఁడగు రాముఁడు యాత్రార్థమువచ్చియుండగా తదాజ్ఞావశంబున మేమిచ్చటనున్నాము. ఇచ్చట శ్రీరామ నిర్మితంబగు నన్నసత్రముగలదు. ఆకలిగొన్న నీవు సుఖముగాభుజించి పానీయంబులంగొని సంతోషముగా పోవచ్చును." అని ప్రార్థించిరి. ఈమాటవినుచునే ఆముని యెట్లువచ్చెనట్లే వ

త్కరోమ్యత్ర యేన రామస్తు భూతలే । యాత్రోద్దేశేన సర్వత్ర సీతయా పర్యయాస్యతి ॥ ౪౨ ॥ అనేన లోకశిక్షాపి భవిష్యతి న సంశయః । ఇతి నిశ్చిత్య స మునిః ప్రాహ దూతాన్ స్మయన్నివ ॥ ౪౩ ॥ దూతాః శృణుత మే వాక్యం హతో యేన దశాననః । బ్రహ్మపుత్రో బంధుయుతై ర్న కృతం తీర్థసేవనం ॥ ౪౪ ॥ తథా యజ్ఞాః కృతా నైవ తస్యాన్నం నాహమశ్నియాం । దీయతాం మమ మార్గో హి భవద్భిర్వచనం మమ ॥ ౪౫ ॥ కథనీయం రాఘవాయ యాత్రా యజ్ఞాన్ కరిష్యతి । ఇతి తస్య వచః శ్రుత్వా విస్మయావిష్టమానసాః ॥ ౪౬ ॥ దత్వా మార్గం శాపభీత్యా దూతా రామాంతికం యయుః । రామం నత్వా శనైస్తస్య కర్ణే వృత్తం న్యవేదయన్ ॥ ౪౭ ॥ రాఘవోపి మునేస్తస్య జ్ఞాత్వాభిప్రాయముత్తమం । సర్వం వృత్తం సభామధ్యే చకార సస్మితః స్ఫుటం ॥ ౪౮ ॥ మంత్రిభిర్బంధుభిశ్చైవ వసిష్ఠేన పురోధసా । మంత్రయిత్వా మునేర్వాక్యం సత్యం మేనే రమాపతిః ॥ ౪౯ ॥ తతో నిశ్చితవాన్ రామః స్వసభామధ్యే పురోధసా । ఆదౌ కార్యా తీర్థయాత్రా యజ్ఞాః కార్యాస్తతః పరం ॥ ౫౦ ॥ తతో రామాజ్ఞయా దూతా గత్వాయోధ్యాపురీం ప్రతి । తద్వృత్తం చ సవిస్తారం సుమంత్రాయ న్యవేదయన్ ॥ ౫౧ ॥ సుమంత్రోపి చ తద్వృత్తం శ్రుత్వా వస్త్రధనాని చ । ఉష్ట్రాశ్వరథనాగాద్యైః ప్రేషయామాస సాదరం ॥ ౫౨ ॥ పుష్పకం చ తదా ప్రాహ రామః శక్తిస్తవాస్తి హి । యద్యప్యద్య గిరా మే వై శీఘ్రం త్వం మే యథాబలం ॥ ౫౩ ॥ ఉష్ట్రాశ్వరథనాగాద్యై ర్నివాసం చ తవోదరే । కరిష్యతి సవిస్తారం తథా

రలి వెడలెను. పోవుచున్న మునింజూచి రామదూతలు త్వరపడి ఆముని మార్గమును నిరోధించి అత్యంతాదరముగా "మునీంద్రా! మీరేల మరలవచ్చిన దారింబట్టి పోవుచున్నారు? ఎట్లువచ్చితిరో అట్లే మాటలాడండి. ఆగ్రహింపవలదు" అని వేడుకొనిరి. అందుకతఁడు కొంతసే పూరకయుండి ధ్యానించి తన మనమున– ఇప్పుడు రాముఁడు యాత్రఁజేసి యయోధ్యకు పోవుచున్నాడు. నానాదేశంబులలోని యన్ని చోట్లలోను నరులకు శ్రీరామదర్శన మెట్లుగల్గును? మఱియునన్ని చోట్లలోను శ్రీరామతీర్థంబులుగల్గి నరుల దురితము లెట్లుపరిహరించును? మఱియునంతట గతిప్రదంబులగు రామేశ్వరస్థానంబు లెట్లేర్పడును? గనుక శ్రీరాముఁడు సీతతోడ నెల్లచోట్లలోను యాత్రచేసి వచ్చునట్లు ఒకచిన్నపనిఁజేసెదను. ఇందువలన లోకులను కూడ శిక్షించినట్లగును ఇందుకు సంశయములేదు– అని నిశ్చయించికొని నవ్వుచు దూతలనుగుఱించి "భటులారా! వినుఁడు. బ్రహ్మపుత్రుఁడగు రావణునింజంపిన శ్రీరాముఁడు తమ్ములతోడను తనయులతోడను తీర్థసేవ చేయలేదు. యజ్ఞములనాచరించలేదు. అట్టివాని యన్నమును నేను తినను. నాదారిని నేను పోదును. ఈసంగతిని మీరు శ్రీరామునికి చెప్పండి. అతఁడు యాత్రాయజ్ఞంబుల నొనర్చును." అని ముని వచనములను విని శాపభీతిచేత దూతలు కుంభోదరుని వదలి శ్రీరామసన్నిధికివచ్చి నమస్కరించి సంగతిని సర్వము విన్నవించిరి. ॥౪౭॥ శ్రీరా

శ్రీరాముఁడు పుష్పకమునకు వరమునిచ్చి తీర్థయాత్ర వెడలుట.

ముఁడును మునీంద్రుని యాశయంబును గ్రహించికొని సస్మితుఁడై సభామధ్యమున సర్వవృ

విస్తీర్ణతాం భజ ॥ ౫౪ ॥ సర్వేషాం భారవాహార్థం శక్తిరస్తు యథాసుఖం । కస్మిన్కాలే సూక్ష్మరూపం మహద్రూపం దాపి చ ॥ ౫౫ ॥ యథాకామమయా శక్తిః ప్రదత్తా నసంశయః । తచ్ఛ్రుత్వా రామవచనం పుష్పకం దశయోజనం ॥ ౫౬ ॥ సమంతతస్తథోచ్చం హి వ్యవర్ధత ద్వియోజనం । శతాట్టాలైశ్చ సోపానైః హైమరత్నైః ఘనైశ్చితం ॥ ౫౭ ॥ కోటిసూర్యప్రతీకాశం నానాధాతువిచిత్రితం । కలశైశ్చ సహస్రైశ్చ హేమరత్నవిఘట్టితైః ॥ ౫౮ ॥ జాలరంధ్రగవాక్షైశ్చ ముక్తాహారైర్విభూషితం । కవాటైర్దర్పణోద్భూతైర్జలయంత్రశతైర్వృతం ॥ ౫౯ ॥ పుష్పాణాం వాటికాభిశ్చ నానాపక్షినినాదితం । సప్తభూమస్తకం యత్ర శతశోథ సహస్రశః ॥ ౬౦ ॥ విశాయాం మణయశ్చిత్రాః ప్రభాం విస్తారయంతి హి । గోపురాణి చ భాసంతే శతశోథ సహస్రశః ॥ ౬౧ ॥ తత్ర ప్రాథమికాయాం తు పఙ్క్తౌ శ్రీరాఘవాజ్ఞయా । తిష్ఠాశ్వరథనాగాదీన్ దూతాశ్చారోహయంస్తదా ॥ ౬౨ ॥ ద్వితీయాయాం కాష్ఠచయాన్ తృణోలూఖలముసలాన్ । తృతీయాయాం ధాన్యరాశీన్ పాకామత్రాణి వై తతః ॥ ౬౩ ॥ పంచమ్యాం తు శతఘ్నీశ్చ తతశ్శస్త్రాణ్యనేకశః । తతఊర్ధ్వం రాజవాహనాశ్వోష్ట్రరథవారణాన్ ॥ ౬౪ ॥ అష్టమాయాం రాజకోష్ఠాన్ వస్త్రభాన్యవినిర్మితాన్ । హట్టశాలాస్తతశ్చోర్ధ్వే దాసీదాసాంస్తతః పరం ॥ ౬౫ ॥ నటాదీనాం తతశ్శాలా వారస్త్రీణాం తతః పరం । తతో వీరానంఘ్రిగాంశ్చ తేభ్యశ్చోర్ధ్వం తతః పరం ॥ ౬౬ ॥ గచ్ఛంతి తురగైర్యతాన్ పంచదశ్యా పీఠాతతః । రథయోగ్యాస్తతో పూర్ధ్వం గజాంశ్చైవ తతః పరం ॥ ౬౭ ॥ ఆరోహయస్తతో దూతాన్ రాజభా

త్రాంతంబును మంత్రులును పురోహితుండును వసిష్ఠుండును వినుచుండగా నిరూపించి, ముని వాక్యార్థమును పర్యాలోచించి "మొదట తీర్థయాత్ర నాచరించవలయును. పిదప యజ్ఞములనాచరించఁదగును." అని సిద్ధాంతపరచెను. అంత శ్రీరామాజ్ఞచే దూతలుపోయి అయోధ్యలోనున్న సుమంత్రునికి విషయమును విన్నవించిరి. సుమంత్రుఁడును సంగతిని చక్కగా నెఱిఁగి ఒంటెలు ఏనుఁగలు బండ్లు గుఱ్ఱములు మొదలైనవాటిపై ధనకనక వస్త్రాదిసర్వసామగ్రులను సాదరముగా పంపించెను. శ్రీరాముఁడు పుష్పకమునుచూచి "నీకుచక్కగా శక్తికలదు గదా? అయిననిప్పుడు నామాటవలన త్వరగా నీబలముండునంతవరకు రథగజతురగోష్ట్రాదులకును నీగర్భమున నివాసమును కలిగింపుము. సవిస్తారముగానవి సంచరించునట్లు సేవింపుము. సర్వభారమును వహించుటకును ఎప్పుడు ఎట్లు కావలయునన్న నట్లు సూక్ష్మాకారమునుగాని విస్తీర్ణాకారమునుగాని యథేష్టముగా నందుటకును నిస్సంశయముగా నీకుశక్తి నిచ్చియున్నాను." అని వరమునిచ్చెను. అదివినినవెనుక పుష్పకము ౧౦ ఆమడల వైశాల్యమును ౨ ఆమడల పొడుగును, గలదై పెరిగెను. అందులో అంగడివీధులు నూరును సువర్ణరత్నసోపానమార్గంబులును నూర్లకొలది వేలకొలదిగా దివ్యమణికనక కలశంబులును దివ్యసౌధంబులును ముత్తెముల కిటకీలును అద్దపువాకిళ్లును వివిధవిధ జలయంత్రంబులును పలుపక్షుల కలకల మంజులంబులగు పుష్పతరువాటికలును రాత్రిళ్లలోచిత్రప్రతిభనొదవించుచుండు. సర్వశి

గ్యాధికారిణః । సుహృత్పుత్రజనస్త్రీభిర్నృపాస్తాంచలికాం స్తతః ॥ ౬౮ ॥ తతో పూర్ధ్వం రాఘవస్య సుహృదశ్చ పురౌకసః । తతో భోజనశాలాశ్చ వింశత్యైవమనోరమాః ॥ ౬౯ ॥ పాకశాలా స్తతః పంచ స్త్రీణాం భోక్తుం తతో దశ । తతశ్చోర్ధ్వం హి బంధూనాం మిత్రాణాంచ గృహాణి చ ॥ ౭౦ ॥ తతశ్చోర్ధ్వం రాఘవస్య సభా సింహాసనాన్వితా । తతః పూర్వార్ధ్వం చ సీతాయా గేహం నానాసఖీవృతం ॥ ౭౧ ॥ తతో పూర్ధ్వం రాఘవస్య క్రీడాస్థానం తు సీతయా । తతో పూర్ధ్వం తతో షష్టి మిత్రాయాం స్త్రీశ్చ సుహృదాం ॥ ౭౨ ॥ తతః స్త్రీణాం సభార్థం హి సప్తశాలాశ్శుభావహాః । చిత్రశాలా ద్వాదశాథ వయసాం పంచ వై తతః ॥ ౭౩ ॥ పుష్పారామాదికానాం హి పంచశాలా స్తతశ్శుభాః । తతో పూర్ధ్వం తు శాలాయాం ఘటీయంత్రాదికౌతుకం ॥ ౭౪ ॥ వ్యాఘ్రాదీనాం తతశ్శాలా త్వేకా రమ్యాఽతివిస్తృతా । తతో పూర్ధ్వమగ్నిహోత్రశాలా శ్రీరాఘవస్య చ ॥ ౭౫ ॥ తతశ్శివార్చనస్యైకా శాలా జ్ఞేయా శుభావహా । విప్రాణాం చ తతశ్శాలా శాలా విద్యార్థినాం తతః ॥ ౭౬ ॥ యతీనాం చ తతశ్శాలా వాద్యశాలా తతః పరం । జలశాలా తతశ్శ్రేష్ఠా జలయంత్రాన్వితా స్తతః ॥ ౭౭ ॥ తతో పూర్ధ్వమాద్రివస్త్ర శోషణార్థమనుత్తమా । శతశాలా స్త్రీవమాః ఘర్మార్తా శ్శ్రుతు స్తే రామసేవకాః ॥ ౭౮ ॥ రామోపి దృష్ట్వా తాస్సర్వా అరురోహస్వయం తదా । తతో నదత్సు వాద్యేషు స్తువత్సు మాగధాదిషు ॥ ౭౯ ॥ నర్తత్సు వారనారీషు పతాకాసు చలత్సు చ । ప్రకాశయద్దశదిశో విమానం రాఘవాజ్ఞయా ॥ ౮౦ ॥ అగచ్ఛత్పూర్వదిగ్భాగాత్ ప్రతీచీం తపనోపమం । విహాయసా వాయువేగం కింకిణీజాలమాలితం ॥ ౮౧ ॥

రోదితరత్న సమూహంబును దివ్యగోపురంబులును అత్యంతాశ్చర్యకరంబులుగా నుండినవి. ఇట్లుండు పుష్పకవిమానంబున శ్రీరామాజ్ఞ చే దూతలు మొదటిబంతిలో రథగజతురగోష్ట్రాదుల నెక్కించిరి. రెండవబంతిలో తృణకాష్ఠ ముసలోలూఖలాదులును, మూడవబంతిలో ధాన్యరాసులును, నాలగవబంతిలో వంటసామగ్రులును, ఐదవబంతిలో శతఘ్నులును, ఆరవబంతిలో సమస్తాయుధంబులును, ఏడవబంతిలో సమస్తరాజవాహనంబులును, ఎనిమిదవబంతిలో రాజోపచారార్హంబులగు నుగ్రాణంబులును, మనోహరంబులుగా గల్గియుండెను. ఆవెనుక నంగడివీధులును, దాసీదాసవర్గంబుల స్థానంబులును, నటగాయక శాలయును, గణికాశ్రేణియును, పిమ్మట వీరులగు పదాతులు, ఆవెనుక నశ్వయోధులును, రథయోధులును, గజయోధులును, పిమ్మట, రాజభాగ్యాధికారులగు దూతలును, ఇట్లు క్రమముగా గల్గినదాయెను. పిమ్మట మిత్రపుత్ర కళత్రాదిపరివారముతో మండలాధిపతులు పుష్పకప్రవిష్టులైరి. పిదప రామసుహృద్వర్గంబును పౌరపరివారంబును నిలిచెను. పిదపనిరువది భోజనశాలలు మనోహరంబులుగా నుండెను. పిదపనయిదు పాకశాలలు, దానివెను ౧౦ స్త్రీభోజనశాలలు, దానిమీంద బంధువులకును చెల్లులకును దివ్యమందిరంబులు, అందుపైన శ్రీరాములవారి సింహాసనముగల సభాభవనంబును, దానివెనుక సకలసఖీసహితంబగు సీతాంతఃపుర భవనంబును, దానికిపైన శ్రీరాముని క్రీడాస్థానంబును, అరువదియవది మిత్రస్త్రీశాలయును, ఆమీంద స్త్రీలసభలకై ౭ శాలలును, పిమ్మట చిత్రశాలలు ౧౨ ను, తరువాత నయిదువయశ్శాలలును, పిదప నయిదుమంగళపుష్పా

యయౌప్రయాగాభిముఖం శ్రీరామధ్వజచిహ్నితం ॥ విష్ణుదాస ఉవాచ—కథం రామస్య చత్వారో ధ్వజాః ప్రోక్తాః పురా త్వయా ॥ ౭౨ ॥ తత్సర్వం విస్తరేణాద్య శ్రోతుమిచ్ఛామి త్వన్ముఖాత్ ॥ రామదాస ఉవాచ—శైశవే రఘునాథస్తు స్వపితృస్యందనస్థితః ॥ ౭౩ ॥ అతస్సోపి అస్య రామస్య కోవిదారధ్వజః స్మృతః । బాణధ్వజాంకితరథమారుహ్య తాటకాం వనే ॥౭౪॥ జఘానైకేన బాణేన తస్మాద్బాణధ్వజః స్మృతః । ఛిన్నం వజ్రధ్వజం దృష్ట్వా రావణేన స రాఘవః ॥౭౫॥ ధ్వజేఽకరోద్వాయుపుత్రం తస్మాత్సోపి ఖ్యాతః కపిధ్వజః ॥ రణే విమూర్ఛితం దృష్ట్వా రామో మాతలినం తదా ॥౭౬॥ స్థితస్స్వీయరథే దివ్యే తస్మాచ్చ గరుడధ్వజః । శుక్లాయాం హి పతాకాయాం కోవిదారో స్థితశ్శుభః ॥ ౭౭ ॥ బాణశ్శుభోస్తి నీలాయాం హరితాయాం తు మారుతిః । పీతాయాం గరుడో జ్ఞేయః శ్రీరామస్యందనోపరి ॥ ౭౮ ॥ చతుర్షు స్యందనేష్వేవం చత్వారః కీర్తితా ధ్వజాః । కోవిదారధ్వజో రామః శ్రీరామో మాగణధ్వజః ॥ ౭౯ ॥ కపిధ్వజో రాఘవేంద్రో భూతేశో గరుడధ్వజః । ఏవం నామాన్యనంతాని ప్రోచ్యంతే రాఘవస్య హి ॥ ౮౦ ॥ తస్మాద్రామధ్వజాః ప్రోక్తాశ్చత్వారశ్చ మయా తవ । వజ్రధ్వజాంకితరథే స్థిత్వా రామేణ సంగరః ॥ ౮౧ ॥ కృతస్తస్మాద్రాఘవేంద్రం తం వదం

---

రామాదిశాలలును, పిదప నొకటి ఘటికాయంత్రాదిశాలయును, వెనుక నొకటి వ్యాఘ్రాది కౌతుకశాలయును, ఆపిమ్మట శ్రీరామాగ్ని హోత్రశాలయును, శివార్చనాశాలయును, బ్రాహ్మణ శాలయును, విద్యార్థులవసతులును, యతులనివాసంబులును, వాద్యశాలలును, వినోదజలయంత్రోపేత జలశాలలును, పిమ్మట తడి బట్టల నెండించు నెండముంగిళ్లును, ఇట్లు, సమస్త సౌకర్యంబులును గల నూరు శాలలు నిండి యుండెను. సేవకులచే సమస్తస్థలంబులును సముచితంబుగా నొనర్పంబడిన సంగతిని శ్రీరాముఁడు తెలిసి కొని తాను పుష్పకము నెక్కెను. అంత వాద్యములు వాయింపఁబడుచుండ, నాట్యములు జరుగుచుండ ధ్వజపతాకంబులు చలించుచుండ సర్వదిక్కులను ప్రకాశింపఁజేయుచు రామధ్వజాంకితంబగు దేదీప్యమానంబైన విమానంబు వాయువేగము గల్గినదై గగనంబున కిరుగంటల కిణికిణినాదంబు వినోదంబు నొదవించుచుండగా ప్రయాగాభిముఖముగా తూర్పునుండి పశ్చిమమునకు వెడలెను ॥౭౧॥ ఇట్లు కథఁజెప్పుచున్న రామదాసును శిష్యుఁడగు విష్ణుదాసుఁడు

## శ్రీరామధ్వజరథాది చిహ్ననిరూపణము.

"స్వామీ! మీరు శ్రీరామునికి నాలుగుధ్వజములను చెప్పితిరే. వాటిసంగతిని విస్తారముగా నిరూపించండని" వేడెను. అందుకు రామదాసుఁడు చెప్పుచున్నాడు చిన్ననాడు శ్రీరాముఁడు తండ్రియొక్క రథమునెక్కినందున కోవిదారధ్వజుండనబడెను. అప్పుడు సుమంత్రుఁడు సారథిగానుండెను. అప్పుడు మానుష లీలామూర్తికి రామ యని నామ మొప్పుచుండును. తెల్లనిపతాకయందు కోవిదారము చెప్పఁబడినది. ఇఁకనతఁడు బాణధ్వజాంకిత రథము నెక్కి వనమున నొక బాణముచే తాటకను సంహరించినందున బాణధ్వజుండయ్యె. నీలపతాకయందు బాణముశో

త్యశనిధ్వజం । అతో రామధ్వజస్యైక మేవచిహ్నం నవిద్యతే ॥ ౯౨ ॥ తస్మాచ్చిష్యమయాప్రోక్తా శ్చత్వారో రాఘవప్రియాః । కోవిదారాంకితరథే సుమంత్రస్సారథిస్స్మృతః ॥ ౯౩ ॥ బాణధ్వజాంకితరథే సూతశ్చిత్రరథస్స్మృతః । వాయుపుత్రాంకితరథే సారథిర్విజయస్స్మృతః ॥ ౯౪ ॥ రామస్యదారుకస్సూతః స్యందనే గరుడాంకితే । ఏవంశిష్య యథాపృష్టం శ్రీరామధ్వజకారణం ॥ ౯౫ ॥ త్వయాపూర్వంమయాతచ్చ తవాగ్రేద్యనివేదితం ॥ * ॥ ఇతిశ్రీమదానందరామాయణే యాత్రాకాండే కుంభోదరోపాఖ్యానం నామ పంచమస్సర్గః ॥ ... ... * ౫॥

శ్రీరామదాసఉవాచ — తతో రామో విమానేన గత్వాకించిత్తుపశ్చిమాం । దిశంయయౌ ప్రయాగంచ త్రివేణీయత్రవర్తతే ॥౧॥ క్రోశమాత్రేవిమానంతి స్త్యక్త్వారామస్ససీతయా । పద్భ్యాంశనైశ్శనైరేవ త్రివేణీసంగమం యయౌ ॥ ౨ ॥ నారికేరంవాయనేన సమర్ప్యరఘునందనః । చతురంగులమానంహి కేశబంధంసభూషణం ॥ ౩ ॥ దదౌసంఛిద్యసీతాయా స్స్వయంక్షౌరమథాకరోత్ । లక్ష్మణాద్యైర్బంధుభిశ్చ వపనంరఘునందనః ॥ ౪ ॥ మాతృభిఃకారయామాస కృత్వాచైకముపోషణం । ద్వితీయేదివసే ప్రాప్తే కృత్వాశ్రాద్ధంసతర్పణం ॥ ౫ ॥ మాసమాత్రంమాఘమాసే వాసంకృత్వాసవిస్తరం । అష్టతీర్థేతతోగత్వా దత్వాదానాన్యనేకశః ॥ ౬ ॥ దృష్ట్వాక్షయవటంరమ్యం

భించును. అప్పటినామము శ్రీరామయని ధ్యేయము. సారథిచిత్రరథుఁడనబడును. ఇఁక రావణుండు వజ్రధ్వజమును కత్తరించగా నాంజనేయునిని ధ్వజమున నిల్పినందున కపిధ్వజుండయ్యె ఆకుపచ్చపతాకయందు కపిచిహ్నము కాన్పించును. అప్పటిసారథి విజయుఁడనఁబడును. నామము రాఘవేంద్రయని రాజించును. ఇఁకఁ రణమున మూర్ఛితుఁడైనమాతలినిచూచి తనరథము నెక్కెను. అప్పుడు గరుడధ్వజుండయ్యె. అప్పటినామము భూతేశయని భావింపఁబడును. పసపువన్నెపతాకమున గరుడచిహ్న మొప్పును. ఇట్లు శ్రీరామచంద్రస్వామికి అనేకధ్వజపతాక రథనామంబులు రారాజించుచున్నవి. ... . ... ... ... ॥౫॥

## శ్రీరాముఁడు ప్రయాగక్షేత్రయాత్ర నొనర్చుట.

తరువాతశ్రీరాముఁడు కొంత పశ్చిమదిక్కునకువచ్చి అట్టిప్రయాగక్షేత్రమును చూచి కోసెడుదూరముననే సీతతోడ విమానమునుండిదిగి కాలినడకతోనే తిన్నతిన్నగా త్రివేణీ సంగమమును చేరెను. వెంటనే శ్రీరాముఁడు నారికేళవాయనమునర్పించి సీతయొక్క సాలంకారమగు వేణిని నాలుగువ్రేళ్లంత కత్తరించియిచ్చి, పిదప తానుతమ్ములు మొదలైనవారితోడ వపనవిధిగావించి యందరితోడ నొకదినము పవాసవ్రత మొనర్చి, రెండవనాడు యథావిధిగా తీర్థశ్రాద్ధతర్పణంబులచే పితృతృప్తింజేసి, మాఘమాసము ౩౦ రోజులు నచ్చటవసించుచు అష్టతీర్థంబులకుపోయి అనేకదానంబుల నొసంగి, ప్రళయకాలమున నిజనిద్రా నికేతనంబగు నక్షయవటంబును నిరీక్షించి చిరునవ్వునవ్వుచు సీతాలక్ష్మణులతోడ దానింబూజించి దివ్యవస్త్రాభరణాదులచే త్రివేణినారాధించెను. మఱియునచ్చట వెయ్యార్రు కాచభాజనంబులలో గంగ

నిద్రాస్థానం నిజం లయే । కించిద్విహస్య శ్రీరామ స్సీతయా భ్రాతృభిస్సహ ॥ ౭ ॥ పూజాం కృత్వా త్రివేణ్యాశ్చ వస్త్రైర్దివ్యైస్సుభూషణైః । గంగాజలైః కాచకుంభాన్ శతశోథ సహస్రశః ॥ ౮ ॥ పూరయిత్వా విమానాగ్రే స్థాప్య తీర్థపురోహితాన్ । పూజయిత్వా సవిస్తారం నత్వా చైవ పునః పునః ॥ ౯ ॥ తాన్ పృష్ట్వా పుష్పకే స్థిత్వా యయావాకాశవర్త్మనా । వింధ్యాచలం సమాశ్రిత్య యత్ర దుర్గా ప్రవర్తతే ॥ ౧౦ ॥ తత్ర స్నాత్వా తీర్థవిధిం పూర్వవచ్చ విధాయ సః । తాం వింధ్యవాసినీం పూజ్య వస్త్రాభరణాదిభిః ॥ ౧౧ ॥ కృత్వా దానాన్యనేకాని తోష్య తీర్థపురోహితాన్ । యయౌ కాశీం పుష్పకస్థః శ్రీరామస్సీతయా సుఖం ॥ ౧౨ ॥ ఏతస్మిన్నంతరే కాశ్యాం కాశీస్థాః పుష్పకం తు తత్ । కోటిసూర్యప్రతీకాశం దృష్ట్వా పశ్చిమతో దిశం ॥ ౧౩ ॥ యత్ప్రాచీం కాశ్యభిముఖ మాగచ్ఛంతం మహోజ్జ్వలం । చక్రుస్తర్కాన్వితర్కాంశ్చ శతశోట్టాలసంస్థితాః ॥ ౧౪ ॥ కేచిదూచుశ్చదావాగ్ని స్త్వయం పర్వతమస్తకే । సూర్యేణ విస్మృతః పంథా భ్రమణాద్భ్రాంతిమాపసః ॥ ౧౫ ॥ ఇతి కేచిజ్జనాః ప్రోచుః కేచిదూచుస్త్వయం మునిః । నారదస్తు సమాయాతి కేచిత్తత్ర బభాషిరే ॥ ౧౬ ॥ పతత్యసౌ రవిస్స్వర్గాత్ కేచిద్ద్రోణాచలాన్వితః । వాయుపుత్రోయమితి తే ప్రోచుః కాశీనివాసినః ॥ ౧౭ ॥ కేచిదూచుశ్శశీ స్వర్గాన్మృగేణ వినిపాతితః । కేచిదూచుస్సువిశ్వేశం కేచిదూచుస్సుదర్శనం ॥ ౧౮ ॥ కేచిదూచుస్సువర్ణాద్రిం కేచిత్ప్రోచుశ్చ ఖేగిరిం । కేచిత్పతత్రిరాజానం

---

నింపి వాటిని విమానమున స్థాపింపనాజ్ఞాపించెను. పిదప తీర్థవాసులగు పురోహితులను పూజించి పలుమారు వందించివందించి వారియనుజ్ఞనొంది యందరితోడ పుష్పకమునెక్కి గగనమార్గమున నడచెను॥౯॥ అంతనావిమానంబు వింధ్యాద్రికిరాగా, వింధ్యారణ్యములోని శ్రీదు

### శ్రీరాములు వింధ్యాటవిని వింధ్యవాసిని నారాధించుట.

ర్గాసన్నిధిని దిగి స్నానముచేసి తీర్థవిధినాచరించి యథాపూర్వముగా దానధర్మములనొనర్చి ఆ వింధ్యవాసినీ దేవిని దివ్యవస్త్రాభరణంబులచే నారాధించి, తీర్థపురోహితులను సత్కరించి తదనుజ్ఞనొంది సీతతోడ యథాసుఖముగా పుష్పకమునందు కాశికి వెడలెను ॥౧౨॥ అంతలో

### శ్రీరాముఁడు కాశీయాత్రఁ జేయుట.

నచ్చట గోపురంబులలోని కాశీవాసులందరును పశ్చిమదిక్కునుండి వచ్చుచుండు పుష్పకంబునుచూచి నానావిధంబులుగా వితర్కించుచువచ్చిరి. కొందరు పర్వతశృంగమునందలి దవాగ్ని కనుబడుచున్నదనిరి. కొందరు సూర్యుఁడు దారితప్పి వచ్చుచున్నాఁడా? యని విభ్రాంతులైరి. మఱికొందరు నారదుఁడు బృహద్రూపముతో దిగుచున్నాడనిరి. ఇంకకొందరు దివమునుండి రవి యూడిపడుచున్నాడనిరి. మఱియుకొందరు ద్రోణాద్రితోడ నాంజనేయుఁడు వచ్చుననిరి. ఇట్లే కొందరు స్వర్గమునుండి మృగముచే పడవేయఁబడిన చంద్రుఁడనియును, కొందరు స్వర్ణగిరియనియును, కొందరు గగనాద్రియనియును, కొందరు గరుడుఁడనియును, కొందరు ప్రళయాగ్నియనియును, కొందరు కరాళంబగు నాగ్నేయాస్త్రంబు నెవఁడు ప్రయోగించెననియును, కొందరు

కేచిచ్ఛ్రీశయ్యాతలం ॥ ౧౯ ॥ కేచిత్ప్రోచుర్మహాఘోరం వహ్న్యస్త్రం కేన మోచితం । కేచిత్ప్రోచుస్సహస్రాస్యః స్వయం మణివిరాజితః ॥ ౨౦ ॥ ఏవం వదంతి స్త్రీయానం దదృశుః పుష్పకం మహత్ । మహాకోలాహలం చక్రుః ప్రోచుస్తత్ర సమాగతాః ॥ ౨౧ ॥ రామోఽయోధ్యాపతిః శ్రీమాన్ యాత్రార్థం రఘుసాగరః । విశ్వనాథోఽపి తచ్ఛ్రుత్వా పార్వత్యా వృషభస్థితః ॥ ౨౨ ॥ ప్రత్యుజ్జగామ శ్రీరామం కాశీస్థైః పరివేష్టితః । ఉపాయనం రాఘవస్య గృహీత్వా బహువిస్తరం ॥ ౨౩ ॥ ఏతస్మిన్నంతరే రామస్తం దేహళీవినాయకం । పూజ్యం విశ్వేశ్వరం దృష్ట్వా ననామ శిరసా తదా ॥ ౨౪ ॥ ఆలింగితశ్శివేనాథ గృహీత్వోపాయనం శివాత్ । స్వయం వస్త్రైరాభరణైః పూజయామాస శంకరం ॥ ౨౫ ॥ వివేశ కాశీం శంభోశ్చ ధృత్వా హస్తేన సత్వరం । తావుభౌ వాహనే ముక్త్వా జగ్మతుర్మణికర్ణికాం ॥ ౨౬ ॥ తతస్సీతాయుతో రామశ్చక్రపుష్కరిణీజలే । సమర్ప్య శ్రీఫలం స్నాత్వా సచేలం క్షౌరపూర్వకం ॥ ౨౭ ॥ నిత్యయాత్రాం విధాయాథ కృత్వా చైకముపోషణం । తీర్థశ్రాద్ధాని సంపాద్య పంచతీర్థీం విధాయ చ ॥ ౨౮ ॥ అంతర్గృహీం మహాయాత్రాం మానసద్వయమేవ చ । ద్విచత్వారింశల్లింగాని హ్యష్టలింగాని వై తతః ॥ ౨౯ ॥ షట్పంచాశచ్చ గణపాంస్తథాష్టభైరవాన్ ప్రభుః । యోగినీశ్చ చతుష్షష్టిం తాదేవీశ్చ తథా నవ ॥ ౩౦ ॥ తథాష్టదిక్పతీంశ్చాపి తథా చైవ నవగ్రహాన్ । క్షేత్రప్రదక్షిణాం పంచక్రోశయాత్రాం రఘూత్తమః ॥ ౩౧ ॥ చతుర్దశైమా యాత్రాస్తు కృత్వా చైవ స

---

రత్నసమూహాలంకృత సహస్రఫణుండగు నాదిశేషుండనియును, పలుతెరంగులుగాఁ బలుకుచు వచ్చిరి. చివరలో నూరివారు ఇదిపుష్పక విమానంబని తెలిసి మిక్కిలి కోలాహలము నొనర్చిరి. శ్రీరాముండు యాత్రార్థము వచ్చుచున్నాడని యెఱిఁగి విశ్వేశుఁడు వృషభారూఢుఁడై సపరివారుఁడుగా సోపాయనపాణియై శ్రీరామునికి స్వాగతమునొనర్చుటకు వచ్చెను. కాశీనివాసులు పరివేష్టించివచ్చుచుండిరి. అంతలో శ్రీరాముఁడు వచ్చుచుండు దేహళీవినాయకుని పూజ్యుఁడగు విశ్వేశ్వరస్వామిని దర్శించి శిరసాభివందనము నొనర్చి శివునిచే సమాలింగింపఁబడి తదుపాయనమును స్వీకరించివస్త్రాలంకార భూషణాదులచే శంకరునారాధించెను. పిదపనాశివరాములిరువురును ఒండొరులచేతులంబట్టికొని కాశీనగరమును ప్రవేశించి వాహనములనువదలికాలినడకతో మణికర్ణికకువచ్చిరి. పిదప శ్రీరాముఁడు సీతతోడ చక్రపుష్కరిణిలో శ్రీఫలమునర్పించి సచేలస్నానముచేసి, నిత్యయాత్రనొనర్చి ఒకదిన ముపవాసముండి తీర్థశ్రాద్ధాదికర్మల నాచరించెను. ౧ అంతర్గృహయాత్ర, ౨ మహాయాత్ర ౩-౪ మానసయాత్రలు రెండు, ౫ ద్విచత్వారింశల్లింగయాత్ర, ౬ అష్టలింగయాత్ర, ౭ షట్పంచాశద్గణపతియాత్ర, ౮ అష్టభైరవయాత్ర, ౯ చతుష్షష్టియోగినీయాత్ర, ౧౦ నవదేవీయాత్ర, ౧౧ అష్టదిక్పాలకయాత్ర, ౧౨ నవగ్రహయాత్ర, ౧౩ క్షేత్రప్రదక్షిణయాత్ర, ౧౪ పంచక్రోశయాత్ర, అనునీపదునాలుగు యాత్రలను సవిస్తరముగా నాచరించెను. మఱియును కాశీపట్టణముయొక్క వాయవ్యదిగ్భాగమున నెల్లలో వరుణాతీరమున రామేశ్వరలింగమును ప్రతిష్ఠించెను. పిదప గంగలో తనపేరుతో శ్రీరాముండు

విస్తరం । రామేశ్వరం మహాలింగం వరుణాయాస్తటే శుభం ॥ ౩౨ ॥ కాశ్యాం వాయవ్యదిగ్భాగే సీమాయాం స్థాపయన్నుత్తమం । శ్రీరామతీర్థం స్వీయనామ్నా భాగీరథ్యాం చకార సః ॥ ౩౩ ॥ ఏతస్మిన్నంతరే తత్ర వాయుపుత్రస్సమాగతః । వృత్తం శ్రుత్వా రాఘవస్య యాత్రాం కర్తుం గతస్త్వితి ॥ ౩౪ ॥ సీతారామౌ నమస్కృత్య స్నాత్వా భాగీరథీజలే । స్వనామ్నా శంకరం తీర్థ మకరోజ్జాహ్నవీతటే ॥ ౩౫ ॥ ఘట్టం బబంధ గంగాయాస్తటే రమ్యం దృషన్మయం । కాశ్యామద్యాపి తన్నామ్నా ఘట్టోస్తి పరమశ్శుభః ॥ ౩౬ ॥ తథా చకార రామోపి ఘట్టబంధన ముత్తమం । దదర్శ ప్రత్యహం యాత్రాః కాశ్యాం రామస్ససీతయా ॥ ౩౭ ॥ చకార పంచగంగాయాం కార్తీకస్నాన ముత్తమం । కాశీవాసం వత్సరమేకం చకార ధర్మతత్పరః ॥ ౩౮ ॥ తీర్థవాసార్థినస్సర్వాన్ సంతర్ప్య చ పృథక్ పృథక్ । రత్నైర్హిరణ్యై ర్వాసోభి రశ్వాభరణధేనుభిః ॥ ౩౯ ॥ విచిత్రైశ్చ తథామత్రైః స్వర్ణరౌప్యాదినిర్మితైః । అమృతస్వాదుపక్వాన్నైః పాయసైశ్చ సశర్కరైః ॥ ౪౦ ॥ సగోరసైరన్నదానై ర్ధాన్యదానై రనేకధా । గంధచందనకర్పూరైస్తాంబూలైశ్చారుచామరైః ॥ ౪౧ ॥ సతూలైర్మృదుపర్యంకై ర్దీపికాదర్పణాసనైః । శిబికాదాసదాసీభి ర్వాహనైః పశుభిః గృహైః ॥ ౪౨ ॥ చిత్రధ్వజపతాకాభి రుల్లోచైశ్చంద్రచాయభిః । నానావ్రతైర్మహచ్ఛ్రోత్రైస్సధ్వజారోపణాదిభిః ॥ ౪౩ ॥ వస్త్రాసనప్రదానైశ్చ గృహోపస్కరసంయుతైః । ఉపానత్పాదుకాభిశ్చ యతీశ్చాపి తపస్వినః ॥ ౪౪ ॥ యోగ్యైః పట్టదుకూలైశ్చ మృదులైశ్చిత్రకంబలైః । దండైః కమండలుయుతై రజినైర్మృగసంభవైః ॥ ౪౫ ॥ కా

నొకతీర్థమునేర్పరచెను. అంతలో నచ్చటికి యాత్రార్థము శ్రీసీతారాములు వచ్చియున్నారను వృత్తాంతమునువిని హనుమంతుఁడు వేగమెవచ్చి, సీతారాములను వందించి గంగాస్నానము చేసి పరమేశ్వరునినారాధించి తనపేరుతో నొకతీర్థమునుకల్పించి గంగాతీరమున నొకఘట్టము ను రాళ్లతోనిర్మించెను. అది యిప్పటికిని హనుమద్ఘట్టమని ప్రసిద్ధినొందియున్నది. అట్లే రాముఁడును తానొకఘట్టమునేర్పరచెను. శ్రీరాముఁడు సీతతోఁడ నచ్చటియాత్రలనుచూచెను. పంచగంగయందు కార్తికస్నానమునాచరించెను. ధర్మనిరతుఁడై యిట్లు ఒకసంవత్సరము కాశీ వాసమునొనరించెను. తీర్థవాసులుగానుండెడు జనులనందరిని వెవ్వేరుగా, సువర్ణ రత్న ధన వసన భూషణాదులను గవాశ్వంబులను రజతసువర్ణనిర్మితపాత్రలను అమృతాన్నములను దివ్యపాయసంబులను గవ్యంబులను ధాన్యాదివివిధదానములను పుష్పగంధ తాంబూలాది శృంగారాలంకారవస్తువులను సతల్పపర్యంకంబులను దర్పణాదులను దీపాదులను గృహంబులను నానావిధవాహనంబులను ఇచ్చి సంతుష్టులంజేయుచుండెను. ఉత్తమంబులగు నానావ్రతముల నాచరించుటచేత నూరివారి నానందపరచెను. యతులకు కౌపీనపాదుకావస్త్ర దండకమండలు మృగచర్మాదులనిచ్చుటచేతను భిక్షాదిసత్కారములచేతను సంతృప్తులంజేసెను. మఱియును వారికి మఠంబులను విద్యార్థులను పరిచారకులను మంచకంబులను పీఠంబులను కల్పించుచువ చ్చెను. వివిధౌషధంబులచే లోకులకు సదారోగ్యసౌఖ్యంబునిచ్చునట్టి సద్వైద్యులకు జీవనం

పీఠైరుచ్చముంచైశ్చ పరిచారకకాంచనైః । మఠైర్విద్యార్థినామన్నైరతిథ్యర్థంమహాధనైః ॥ ౪౬ ॥ బహుధాప
థదానైశ్చ భిషజాంజీవనాదిభిః । మహాపుస్తకసంభారైర్లేఖకానాంచజీవనైః ॥ ౪౭ ॥ రసాయనైరమూల్యైశ్చ సత్ర
దానైరనేకశః । గ్రీష్మేప్రపాభిర్ద్రవిణైర్హేమంతేగ్నిష్టకేంధనైః ॥ ౪౮ ॥ ఛత్రాచ్ఛాదనకాద్యర్థైర్వర్షాకాలోచి
తైర్బహు । రాత్రౌ పాఠప్రదీపైశ్చ పాదాభ్యంజనకాదిభిః ॥ ౪౯ ॥ పురాణపాఠకాశ్చాపి ప్రతిదేవాలయంధనైః
దేవాలయేనృత్తగీతకరణార్థైరనేకశః ॥ ౫౦ ॥ దేవాలయేసుధాకార్యైర్జీర్ణోద్ధారైరనేకశః । చిత్రలేఖనమూ
ర్త్యైశ్చ రంగమాల్యాదిమండనైః ॥ ౫౧ ॥ ఆరార్తిక్యైర్గుగ్గులైశ్చ దశాంగాదిసుధూపకైః । కర్పూరవర్తికాదైశ్
శ్చ దేవార్చార్థైరనేకశః ॥ ౫౨ ॥ పంచామృతానాంస్నపనైస్సుగంధస్నపనైరపి । దేవార్థంముఖవాసైశ్చ దేవో
ద్యానైరనేకశః ॥ ౫౩ ॥ మహాపూజార్థమాల్యాది గుంఫనార్థైస్త్రికాలతః । శంఖభేరీమృదంగాది వాద్యనాదైశ్శి
వాలయే ॥ ౫౪ ॥ ఘంటాగండుకకుంభాది స్నానోపస్కరభాజనైః । శ్వేతైర్నూతనవస్త్రైశ్చ సుగంధైర్యక్షకర్ద
మైః ॥ జపహోమైస్తోత్రపాఠైశ్శివనామోచ్చభాషణైః । రాసక్రీడాదిసంయుక్తైశ్చలనైస్సుప్రదక్షిణైః ॥ ౫౬ ॥
ఏవమాదిభిరుద్దండైః క్రీడాకాండైరనేకశః । వర్షమేకముషిత్వాథ కృత్వాతీర్థాన్యనేకశః ॥ ౫౭ ॥ దీనానాథాం
శ్చసంతర్ప్య నత్వావిశ్వేశ్వరంవిభుం । బ్రహ్మచర్యాదినియమైర్బుధః తుకాలాగమేనచ ॥ ౫౮ ॥ సత్యసంభాషణేనాపి
తీర్థమేవంప్రసాధ్యచ । పునఃపునర్విశ్వనాథం కాలరాజంగణాధిపం ॥ ౫౯ ॥ అన్నపూర్ణాందండపాణిం దృష్ట్వా

---

బులను కల్పించెను. అచ్చటచ్చట పుస్తకభండారంబులను అందులో పుస్తకలేఖకులను పర్పర
చెను. దివ్యాన్నపానంబులచే వర్ణులను సత్కరించునట్టి యన్నసత్రంబులను సంస్థాపించెను.
గ్రీష్మకాలమున చలివందెళ్లచేతను హేమంతకాలమున కుంపట్లచేతను లోకులకు సుఖమునొ
దవించుచుండెను. వర్షాకాలోచితంబులగు ఛత్రాదులనిచ్చెను. దేవాలయంబులలో ననేకం
బులుగా నృత్తగీతవాద్యాదులు నిరంతరము జరుగుచుండునట్లు చేసెను. విద్యార్థులు రాత్రుల
లో పాఠములుచదువుటకు దీపభాజనాదివసతులను కల్పించెను. మఱియు శిథిలంబులగు దేవా
లయంబులను జీర్ణోద్ధారముచేసి వాటిలో సున్నములుకొట్టించుట చిత్రములనువ్రాయించుట
ముగ్గులుపెట్టించుట అలంకారములుచేయించుట ఆరతులనెత్తించుట ధూపములువేయించుట
కర్పూరములనువెలిగించుట దీపారాధనలుచేయించుట పంచామృత స్నానాదులనాచరింపిం
చుట పుష్పార్చనంబులను చేయించుట ఇట్టి సత్కారముల నెన్నిటినో చేసెను. శివాలయంబున
శంఖభేరీమృదంగాది దివ్యమంగళవాద్యంబులు | మోగుచుండునట్లును దివ్య నైవేద్యములు జరు
గునట్లును జపహోమ బలిప్రదానంబులు స్తోత్రపాఠనంబులు నామస్మరణంబు క్రీడాప్రదక్షి
ణంబులును తప్పకనడచుచుండునట్లును పర్పరచెను. ఇట్లు ఒకసంవత్సరము దీనులను అనాథు
లను సంరక్షించుచుండి విశ్వేశ్వరునివందించి బ్రహ్మచర్య సత్యభాషణాది నియమవర్తనంబులచే
తీర్థవాసవ్రతమును నెరవేర్చి పలుమారు విశ్వేశ్వరస్వామిని కాలభైరవునిని ధుండిరాజగణపతిని

స్తుత్వా ప్రణమ్యచ । అనుజ్ఞాతశ్శివేనాథ విమానేనరఘూత్తమః ॥ ౬౦ ॥ యయావాకాశమార్గేణ గంగాయాదక్షిణే తటే । కర్మనాశాంనదీందృష్ట్వా చ్యవనస్యాశ్రమంయయౌ ॥ ౬౧ ॥ రామచంద్రఃపుష్పకస్థః స్నాత్వానత్వామునీశ్వరం । రామతీర్థంచరామేశం చకారతత్రరాఘవః ॥ ౬౨ ॥ నిజబాణకృతాంరేఖాం దర్శయామాసతాంజనాన్ । కాశ్యామప్యధికంతత్ర కృత్వాదానాన్యనేకశః ॥ ౬౩ ॥ యయౌయానేనదివ్యేన శోణభద్రస్యసంగమం యానియానీహతీర్థాని రాఘవశ్చగమిష్యతి ॥ ౬౪ ॥ ఉత్తరోత్తరతస్తేషు దానాధిక్యంకరిష్యతి । యత్రయత్ర రఘుశ్రేష్ఠో గమిష్యతిససీతయా ॥ ౬౫ ॥ తత్రతీర్థాన్యనేకాని భవిష్యంతిమహాంతిచ । శేషోపితేషాంసంఖ్యాంహి వక్తుంనాత్రక్షమోభవేత్ ॥ ౬౬ ॥ తేషుతీర్థానిశ్రేష్ఠాని షట్ జ్ఞేయానిమనీషిభిః । బంధూనాంచైవచత్వారి సీతాయాఃపంచమంస్మృతం ॥ ౬౭ ॥ షష్ఠమంజనిపుత్రస్య సర్వత్రైవంవినిశ్చయః । రామఃస్నాత్వాశోణభద్ర గంగయోస్సంగమేముదా ॥ ౬౮ ॥ త్రిరాత్రంసమతిక్రమ్య గండకీసంగమంయయౌ । కస్మింస్తీర్థేత్రిరాత్రంచ పంచరాత్రమథక్వచిత్ ॥ ౬౯ ॥ సప్తరాత్రంక్వచిచ్చాపి పక్షమేకమథక్వచిత్ । అష్టాదశైకవింశద్వా త్రిమాసంచక్వచిత్ప్రభుః ॥ ౭౦ ॥ చకారవాసంతీర్థేషు ధర్మాన్ కుర్వన్ యథాసుఖం । గండకీసంగమేస్నాత్వా నేపాళేజగదీశ్వరం ॥ ౭౧ ॥ దృష్ట్వాహరిహరక్షేత్రం యయౌరఘుకులోద్వహః । ఏవంకుర్వన్ సతీర్థాని సర్వాణిరఘునందనః ॥ ౭౨ ॥ పునః

అన్నపూర్ణాదేవిని దండపాణిని చూచిచూచి ప్రణుతించి ప్రణమించి శ్రీసాంబసదాశివానుజ్ఞనంది శ్రీరాముఁడు విమానమునెక్కి ॥ ౬౦ ॥ గగనమార్గముగా గంగాదక్షిణతీరమున విడలెను.

సుక్షేత్రములను చూచికొనుచు శ్రీరాముఁడు మరల గయకువచ్చుట.

ఇట్లు రాముఁడు కర్మనాశయైననదినిచూచి చ్యవనాశ్రమమునకువచ్చెను. శ్రీరాముఁడు పుష్పకస్థుఁడైవచ్చి స్నానముచేసి మునికిమ్రొక్కి యచ్చట రామతీర్థంబును రామేశ్వరునిని కల్పించెను. ఆజనులకు తనబాణముచే వేయఁబడిన రేఖనుచూపెను. అచ్చట కాశిలోచేసిన దానములకన్నను అధికముగా దానధర్మములనొసంగెను. పిదప శ్రీరాముఁడు సీతతోడ శోణభద్రానదీ సంగమంబునకువచ్చెను. ఏయేతీర్థంబులకు శ్రీరాముఁడుపోవునో అచ్చటచ్చట నుత్తరోత్తరంబుగా దానధర్మాధిక్యంబు గలుగుచుండును. ఎచ్చటెచ్చట వీరుపోదురో అచ్చటచ్చట మహాతీర్థంబులు విశేషంబులుగా గల్గుచుండినవి. ఆక్షేత్రతీర్థసంఖ్యను ఆదిశేషుఁడైనను నిరూపింపనేరఁడు. వాట్లలో నారుతీర్థంబులు పరమోత్తమంబులని యెన్నదగినవి. అవియేవి యనిన ఏతీర్థమునకుపోయినను శ్రీరామలక్ష్మణ భరత శత్రుఘ్న తీర్థములు నాలుగు, సీతాతీర్థమైదవది, ఆరవ దాంజనేయతీర్థము. ఇట్లే అంతట నిర్ణయము. శ్రీరాముఁడు గంగా శోణభద్రాసంగమంబున స్నానముచేసి మూడురాత్రులువసించి గండకీగంగాసంగమభూమికి వెడలెను. ఒకతీర్థమున మూడురాత్రులు మఱియొకచోటున నైదురాత్రులు ఇంకొకచోటున నేడురాత్రులు కొన్నితావులలో పదునైదురాత్రులును ౧౮ రాత్రులు ౨౧ రాత్రి స్వతంత్రుఁడుగాన

పునస్సంగమంచ యయౌజాహ్నవిదక్షిణే । వైకుంఠనగరంగత్వా జరాసంధపురంయయౌ ॥ ౨౩ ॥ వైకుంఠీయాజ
లేస్నాత్వా తతోరామోయయౌగయాం । ఫల్గునద్యాస్తటేపూర్వే ముక్త్వాతద్యానముత్తమం ॥ ౨౪॥ నత్వావిష్ణుప
దందివ్యం పునర్యానాంతికంయయౌ । తాంనిశాంసమతిక్రమ్య ప్రభాతేరఘునందనః ॥ ౨౫॥ స్నాతుంఫల్గునదీతో
యే యయౌతీర్థంద్విజైస్సహ । ఏతస్మిన్నంతరేసీతా సఖీభిఃపరివేష్టితా ॥ ౨౬॥ యయౌస్నాతుంఫల్గునద్యాంస్నా
త్వాపూజ్యసువాసినీః । సైకతేసాక్షణంతస్థౌ పూజనార్థంమహేశ్వరీం ॥ ౨౭ ॥ వాలుకాభించపిండైశ్చ దుర్గాంక
ర్తుంసముద్యతా । గృహీత్వావామహస్తేన పార్ద్రాంసైకతాంతదా ॥ ౨౮ ॥ సవ్యేనకృత్వాపిండంతు యావత్సా
పాణినాభువి । స్థాపయామాసతావత్తు దదర్శజగతీతలాత్ ॥ ౨౯ ॥ వినిర్గతందశరథశ్వశురస్య కరంశుభం । దక్షి
ణంనిజహస్తాచ్చ గృహీత్వాపిండముత్తమం ॥ ౩౦ ॥ గచ్ఛంతంభూతలంరమ్యం తద్దృష్ట్వాకౌతుకంపునః । ద్వితీయం
స్థాపయామాస భువిపిండంతుసైకతం ॥ ౩౧ ॥ సోపినీతఃపూర్వవత్స హ్యేవముత్తరంశతం । దదౌపిండాన్ కౌ
తుకేన తతశ్శాంతావిదేహజా ॥ ౩౨ ॥ మనసాపూజ్యదుర్గాంసా యయౌయానంత్వరాన్వితా । తద్వృత్తంచసఖీ
భిస్తు జ్ఞాతంరామేణవాపిన ॥ ౩౩ ॥ తయాపికథితంనైవ కింరామోమాంవదిష్యతి । ఇతిభీత్యాతతోరామః పంచతీ
ర్థంవిగాహ్యచ ॥ ౩౪ ॥ ప్రేతపర్వతమాసాద్య పిండదానమథాకరోత్ । కనిష్ఠికాయాంనిష్కాస్య నిజనామాంకి

నొకానొకచోటున మూడుమాసంబులుకూడ యథాసుఖముగా వసించుచు ధర్మములనాచరిం
చుచుండెను. గండకీసంగమమున స్నానముచేసి నేపాలములో పశుపతీశ్వరస్వామి నారాధించి
హరిహరక్షేత్రమునకుపోయి, ఇట్లే సమస్తతీర్థంబులను సేవించి మరలమరల గంగాదక్షిణతీర
మున సంగమంబులకువచ్చి వైకుంఠనగరమునకుపోయి జరాసంధపురమునకు వెడలి . వైకుంఠీ
యోదకమున స్నానముచేసి, శ్రీరాముఁడు గయాక్షేత్రమునకువచ్చెను. పిమ్మట ఫల్గునదీ పూ
ర్వతీరమున విమానమునువిడిచి విష్ణుపాదమునద్దికివచ్చి వందించి మరల విమానముసుచేరెను.
ఆరాత్రి కడచినవెనుక ప్రొద్దున బ్రాహ్మణులతోడ శ్రీరాముఁడు ఫల్గునదీస్నానమునకై వెడ
లెను.॥ ౨౫ ॥ అంతలో సీతాదేవి సఖులతోడకూడి ఫలునదికివెడలి స్నానముచేసి ముత్తె

దశరథుఁడు సీతయిచ్చిన సికతాపిండములచే సంతృప్తుఁడగుట.

యిదలను పూజించి, యిసుకదిబ్బమీఁద కొంతసేపుకూర్చుండి, గౌరీపూజకై ఇసుకముద్దల
నైదింటినెత్తి దుర్గాదేవినిచేయ నారంభించెను. అప్పుడామె తడియిసుకను ఎడమచేతనెత్తి
కుడిచేతితో ముద్దచేసి నేల నునచునప్పటికి భూతలమునుండి తనమామగారైన దశరథరాజు
యొక్క హస్తమువెలువడి కుడిచేతిలోని యిసుకముద్దను తీసికొని నేలలోదాగుచుండు మంచివేడు
కనుచూచెను. అయిననిది యేమిచూతమని రెండవముద్దను పెట్టెను. అదియు నట్లేగ్రహింపఁ
బడెను. ఇట్లు ౧౦౦ ఇసుకముద్దలనిచ్చి యత్యాశ్చర్యమునంది యాపనిని చాలించి మనమున
నే గౌరి నారాధించి విమానమునకు వెడలెను. ఈసంగతి సఖులకును తెలియదు. రామునికిని

తాంశుభాం ॥౧౫॥ కాంచనీం ముద్రికాం రమ్యాం దక్షిణాభిముఖస్తదా । అపహతేతి మంత్రేణ చకార భువి రాఘవః ॥౧౬॥ రేఖాత్రయం తదద్యాపి దృశ్యతే తత్ర వైస్ఫుటం । ఆస్తీర్య సకుశాం స్తత్ర పిండాన్ సక్తుమయాన్ శుభాన్ ॥౧౭॥ తిలాజ్యమధుసంయుక్తాన్ దాతుం రామస్సముద్యతః । సవ్యేన పాణినా పిండం గృహీత్వా రఘునందనః ॥౧౮॥ యావత్పశ్యతి భూమ్యాంతు నదదర్శ పితుః కరం । తదాశ్చర్యేణ విప్రాస్తే రామమూచుస్త్వరాన్వితాః ॥౧౯॥ సమ్యా[illegible]మత్యత్రైసర్వేషాం పితౄణాం దక్షిణః కరః । నదృశ్యతే తవ పితుః కారణం నాత్ర విద్మహే ॥౨౦॥ రామోపి విస్మయావిష్టశ్చకితః ప్రాహ లక్ష్మణం । జానీషే కారణం కించిత్త్వత్ర త్వం బుద్ధిమానసి ॥౨౧॥ సప్రాహ రాఘవాస్మాభిర్యదా గోదావరీం గతం । ఇంగుదీఫలపిణ్యాకపిండదానే తదా కరః ॥౨౨॥ అస్మాభిః స్వపితుర్దృష్టస్సోత్ర నైవ ప్రదృశ్యతే । మమాపి జాతమాశ్చర్యం సీతాం త్వం ప్రష్టుమర్హసి ॥౨౩॥ తచ్ఛ్రుత్వా జానకీ శీఘ్రం ప్రాహ కించిద్భయాతురా । మయాపరాధితం కించిత్ తత్ క్షమస్వ రఘూత్తమ ॥౨౪॥ తత్తస్యా వచనం శ్రుత్వా రాఘవః ప్రాహ తాం పునః । వద తథ్యం న భేతవ్యం కారణం కిం మమాంకితం ॥౨౫॥ యథావృత్తం తయా సర్వం రాఘవాయ నివేదితం । తచ్ఛ్రుత్వా రాఘవః ప్రాహ కస్సాక్షీ తవ కర్మణి ॥౨౬॥ సా ప్రాహ చూతవృక్షోస్తి పృష్టస్స నేత్యువాచ హ । తదాశప్తస్సీతయా స ఫలహీనస్సకీటకః ॥౨౭॥ భవ మే వచనాచ్చూత యతో మిథ్యాత్వయేరితం । పునస్సా రాఘవం ప్రాహ ఫల్గుస్సాక్ష్యం ప్రదాస్యతి ॥౨౮॥ సాపి రామేణ పృష్టాథ నేత్యు

తెలియదు. శ్రీరాముఁడేమిచెప్పునో అను భీతివలన నామెయును ఎవ్వరితోను చెప్పలేను. పిదప నచ్చట శ్రీరాముఁడు పంచతీర్థస్నానముచేసి ప్రేతపర్వతమునెక్కి పిండదానముచేయబూని తనపేరిటి ముద్రయుంగరమును చిటికినవ్రేలినుండి తీసి దక్షిణాభిముఖముగా కూర్చుండి మూడురేఖలను భూమిమీఁద గీచెను. పార్వతీ! అవి యిప్పుడును చక్కగా కనుబడుచున్నవి. అతఁడు పిమ్మట దర్భలనుపరచి నువ్వులు తేనె నెయ్యికలసిన పిండిపిండములను ఇచ్చుటకారంభించెను. శ్రీరాముఁడు కుడిచేతిచే పిండమునెత్తికొని యెంతచూచినను భూమిమీఁద తండ్రిచేయి కనుబడలేదు. అప్పుడచ్చటిబ్రాహ్మణులు ఆశ్చర్యమునంది త్వరపడి రామునితో "ఈ పిండదానసమయమున అందరికిని వారివారి పితృవులయొక్క దక్షిణహస్తము వెలువడును. నీతండ్రిది కనుబడకయున్నది. కారణము మాకు తెలియదు." అని పలకరించిరి. శ్రీరాముఁడును ఆశ్చర్యచకితుఁడై "నీవేమైన దీనికి కారణమెఱుంగుదువా! బుద్ధిమంతుఁడుగానున్నావు" అని లక్ష్మణునినడిగెను. అందుకు లక్ష్మణుఁడు "అన్నా! అప్పుడు మనము గోదావరీతీరమున గారకాయల పిండిపిండములనిచ్చినప్పుడును పితృకరమును నేనుచూచితిని. అది యిప్పుడేలకనుబడలేదని నేను నాశ్చర్యయుక్తుఁడైయున్నాను. ఈవిషయమును సీతనడుగవచ్చునుగానున్నది." అని చెప్పగా, విని సీత భయభ్రాంతయై "నాథా! నేను కొంచ మపరాధముచేసినాను. దానిని క్షమింపుము" అని వేడుకొని, శ్రీరాముఁడు "యథార్థమునుచెప్పుము, ఎంతమాత్రమును భయపడవలదు." అని యభయమునివ్వగా, సీత జరిగినవృత్తాంతమును యథార్థముగా పలికెను.

...దభయాకులా । సాపిశప్తా రామపత్న్యా ఊర్ధ్వోర్ధ్వముఖా మమవాక్యతః ॥౯౯॥ వహ యస్మాత్ప్రభృతి ప్రోక్తం త్వయా సత్యేపి నదీ । తతస్సీతా పునః ప్రాహ సాక్ష్యం మే క్షేత్రనివాసినః ॥౧౦౦॥ దాస్యంతీమే ద్విజాస్సర్వేతి రామసన్నికటస్థితాః । తేపి పృష్టా రాఘవేణ నేత్యూచుర్భయవిహ్వలాః ॥౧॥ దద్మస్సాక్ష్యంతిహీ రామ శ్శాపం నస్సప్రదాస్యతి । నివారితాః కథం నేయుం త నసీతేతి చింత్యతే ॥౨॥ తాంస్తదా జానకీ శాపం దదౌ తీర్థనివాసినః । యుష్మాకం నాత్ర సంతృప్తిః కదా ద్రవ్యైర్భవిష్యతి ॥౩॥ ద్రవ్యార్థం సకలాన్దేశాన్ భ్రమధ్వం దీనరూపిణః । తతస్సా జానకీ ప్రాహ బిడాలస్సాక్ష్యం ప్రదాస్యతి ॥ ౪ ॥ సోపి పృష్టో నేత్యువాచ రామం సీతాశశాప తం । పుచ్ఛాగం స్వపురః కృత్వా తదా మన్నికటోపి సన్ ॥ ౫ ॥ వృషేతిం యత స్తస్మాత్పుచ్ఛే హ్యస్పృశ్యతాం భజ । తతస్సా జానకీ ప్రాహ గౌర్మే సాక్ష్యం ప్రదాస్యతి ॥ ౬ ॥ సాపి పృష్టా నేత్యువాచ రామం సీతా శశాప తాం । అపవిత్రా భవాస్యే త్వం మమ వాక్యేన గౌతమి ॥ ౭ ॥ తతస్సీతాశ్వత్థవృక్షం సాక్ష్యార్థం ప్రాహ రాఘవం । సపృష్టో నేత్యువాచాథ తం సీతా ... ॥ ౮ ॥ ... వాచ లదళ స్త్వం హి మద్గిరాశ్వత్థపాదప । పునస్సీతా పతిం ప్రాహ మమ సాక్షీ ప్రభాకరః ॥ ౯ ॥ ... ప్రాహ తథ్యం హి తుష్టిజా తాపితుస్తవ । ఏతస్మిన్నంతరే తత్ర విమానేనార్క ... సా ॥ ౧౦ ॥ రాజా దశరథో రామమాగత్యాలింగ్య వైదృఢం । ప్రాహ త్వయా తారితోహం నరకాదతిదుస్తరాత్ ॥ ౧౧ ॥ మైథిల్యా పిండదానేః జాతా

అందుకు రాముఁడు "సరియే, దీనికెవ్వరు సాక్షి గానున్నా"రనెను. సీత "ఈ మామిడి చెట్టు నా వెనుకనుండి చూచుచుండె"ననెను. అది నాకు తెలియదనెను. అప్పుడు సీత "ఓ చూతవృక్షమా! నీవు అసత్యమాడినందున పండకయుండుము, నీయందు పురుగులుపడని" అని మామిడి చెట్టును శపించి, మఱియొక సాక్ష్యమున్నదని ఫల్గునీనదిని చూపెను. రాముఁడు దానినడుగగా నదియును నేనెఱుఁగననెను. అందుకు సీత "యథార్థకర్మయందును నీవసత్యము చెప్పినందున అధోభాగమున ప్రవహించుచుండుము" అని శపించి, ఈ బ్రాహ్మణులందరును నావద్ద నప్పుడు నిలచియుండిరిగాన వీరందరును క్షేత్రవాసులు సాక్ష్యము నివ్వగలరనెను. రాముఁడు వారినడుగగా వారును "సాక్ష్యమిచ్చితిమా రాముఁడు మమ్మును శపించును. ఈమె యెట్లు నివారింపఁబడును? అప్పుడు సీత చింతింపఁబడును." అని తమలో తాము భయభ్రాంతులై మాకు తెలియదనిరి. వారినిగుఱించి సీత "తీర్థవాసులారా! మీకిచ్చట నెంత ద్రవ్యమిచ్చినను తృప్తిలేకపోవునుగాక. మీరు దీనరూపముతో ద్రవ్యమునకై సకలదేశములలోను భ్రమించుచుండుడు." అని శపించి, పిల్లి సాక్ష్యమివ్వగలదనెను. రాముఁడడుగగా నదియును లేదనెను. అప్పుడు సీత మార్జాలమునకు "నీతోఁకకొనను ముందర పెట్టుకొని నీవు నావద్ద కూర్చుండినను దబ్బర చెప్పినందున నీతోక నెవ్వనిచేతను తాకఁబడతగినదికాదు" అని శాపమునిచ్చి, ఈయావు నాకు సాక్ష్యమునిచ్చుననెను. అదియును అడిగెడు రామునికి లేదని యుత్తరమిచ్చెను. అప్పుడు సీత యాయావును "ఓయి గౌతమి! నీవు ముఖమున నపవిత్రతనందుము." అని శపించి, యశ్వత్థ

మేతృప్తిరుత్తమా । తథాపిలోకశిక్షార్థం గయా... ...ంతతో... పితరంప్రాహరామోపి ...ర్థం
హిత్వయాత్రవై । త్వరయానీకతాపిండ స్సంగృహీతి... ...॥ సప్రాహాత్రగయాయాంతు బహువి
ఘ్నానిరాఘువ । భవంతిశ్రాద్ధసమయే కృతాతస్తాత్వ... ...॥ ఇతిరామంసమాభాష్య గృహీత్వారాఘు
వాదపి । కించిత్కవ్యంవిమానేన యయాదశరథస్తదా ॥ ...రాఘవఃప్రేతగిరౌ పిండదానంవిధాయచ । గ
త్వాప్రేతశిలాయాంచ దత్వాకాకబలింతతః ॥ ౧౬ ॥ ధర్మ...ణ్యంతదాగత్వా కృత్వైవకోనపదేషుహి । సక్తునా
చతిలాజ్యైశ్చ పాయసైశ్చసశర్కరైః ॥ ౧౭ ॥ పృథగ్వ్యపిండదానాని వటశ్రాద్ధంవిధాయచ । అష్టతీర్థానంతతఃకృ
త్వా తతస్సంధ్యాస్థలత్రయే ॥ ౧౮ ॥ కృత్వాయథావిధానేన దత్వాదానాన్యనేకశః । గదాధరంతతఃపూజ్య మహా
విభవపూర్వకం । సేచయామాసతోయైశ్చ చూతవృక్షంసకీటకం ॥ ౧౯ ॥ ఏకోమునిఃకుంభకుశాగ్రహస్త శ్చూతస్య
మూలేసలిలందధార । ఆమ్రశ్చసిక్తఃపితరశ్చతృప్తా ఏకాక్రియాద్వ్యర్థకరీప్రసిద్ధా ॥ ౨౦ ॥ కృత్వావిష్ణుపదేపూ
జాం విమానాలోపణాదిభిః । మాసత్రయమతిక్రమ్య గయాయాంరఘునందనః ॥ ౨౧ ॥ విమానేనయయౌప్రాచీం
...శంసంతోషయన్జనాన్ । ఫల్గునద్యాస్తటేపూర్వే విమానంయత్రసంస్థితః ॥ ౨౨ ॥ తత్రరామగయానామ్నా
భూమివిఖ్యాతయుదీర్యతే । రామేశ్వరోరామతీర్థం వర్తతేతత్రపావనం ॥ ౨౩ ॥ రామోపిఫల్గునద్యాశ్చ గంగా

---

వృక్షమును సాక్ష్యముగానిచ్చెను. అదియును నాకు తెలియదనగా నందుకు సీత "ఓయశ్వత్థ
మా! నీవచలదళంబగు"మని శపించి, నాకు జగచ్చక్షువగు సూర్యుఁడే సాక్ష్యమనెను, అప్పుడు
రాముఁడు సూర్యునినడుగగా నతఁడు "మీతండ్రికి సంతృప్తిగల్గెనని" యథార్థమును చెప్పె
ను. అంతలో నచ్చటికి దశరథరాజు సూర్యప్రకాశంబగు విమానమునెక్కి వచ్చి శ్రీరామచంద్రు
ని నాలింగించికొని "శ్రీరామా! మిక్కిలి దుస్తరంబగు నరకమునుండి నీవు నన్నుద్ధరించితివి.
జానకియిచ్చిన పిండదానముచేత నాకు సంతృప్తిగలిగినది. అయినను లోకమును శిక్షించుటకై
గయాశ్రాద్ధము నాచరింపుము." అని వక్కాణించెను. అందుకు రాముఁడును "ప్రభూ! నీవేల
యిచ్చుట నిసుకముద్దలను త్వరపడి గ్రహించితివి?" అని యడిగెను. అదివిని దశరథుఁడు "రా
మా! ఈ గయాశ్రాద్ధసమయమున ననేకవిఘ్నములు సంభవించును. గనుక నేను త్వరపడితి
ని." అనిచెప్పి రాముని చేత నివ్వఁబడిన కవ్యముకూడ కొంతస్వీకరించి నిజవిమానమునెక్కి పో

## శ్రీరాముఁడు గయావాసముచేసి రామగయ నేర్పరచుట.

యెను॥ ౧౧౪ ॥ తరువాత శ్రీరాముఁడు ప్రేతగిరిలో పిండదానములనిచ్చి ప్రేతశిలయందును
పోయి పిమ్మట కాకబలినిచ్చి అటుమీఁద ధర్మారణ్యమునకు వెడలి తిలాజ్యపాయస శర్కరాన్విత
పిష్టపిండంబులను వెవ్వేరుగానిచ్చి వటశ్రాద్ధముపెట్టి అష్టతీర్థముల నాచరించి యథావిధానము
గా త్రిస్థలమునందు సంధ్యలనాచరించి యనేకంబులగు దానంబులనొసంగి యత్యంత విభవ
ముతోడ గదాధరస్వామినారాధించి సకీటకంబగు చూతవృక్షమును నీళ్లతోముంచెను. ఒక

ఫల్గుస్సంగమయయా । గయాం బహిః ... పృష్ఠే యయౌ సా తు మహానదీ ॥ ౨౪ ॥ తతో యయౌ ముద్గలస్య నూతనాశ్రమముత్తమం । యస్మిన్నుదగ్వహా గంగా జాహ్నవీ పాపనాశనీ ॥ ౨౫ ॥ తతోఽగ్రే జానకీ జ్ఞాత్వా భూమ్యాం దివ్యం ప్రదాస్యతి । తస్యా దివ్యస్థలే రామ తీర్థమాద్యం చకార సః ॥ ౨౬ ॥ బంధూనాం చ పృథక్తత్ర సంతి తీర్థాని సర్వతః । సీతయా న కృతం తత్ర స్వనామ్నా తీర్థముత్తమం ॥ ౨౭ ॥ జ్ఞాత్వాథ విష్యత్యగ్రే మత్తీర్థం చేతి సవిస్తరం । యదా భూమ్యాం ప్రదాస్యామి దివ్యం తీర్థం తదాస్తు మే ॥ ౨౮ ॥ రామస్తతో విమానేన గతశ్చోత్తరవాహినీం । నామ్నా పురీ తథా గంగా యత్రాస్తి పరమార్థదా ॥ ౨౯ ॥ పర్వతో యత్ర గంగాయామస్తి విశ్వేశ్వరోఽపి చ । తతః శ్రీవైజనాథేశం నత్వా రావణనిర్మితం ॥ ౩౦ ॥ తతశ్చ స్వైర్విమానేన పశ్యన్నానాస్థలాని సః । యయౌ భాగీరథీమధ్యే దృష్ట్వా త్రిభిన్నాసితాం పునః ॥ ౩౧ ॥ ప్రయాగాద్యోజనశతే మానే దేశే రఘూద్వహః । తతో గంగాబ్ధిసంయోగం సహస్రే పుష్పకేణ సః ॥ ౩౨ ॥ గత్వా స్నాత్వా తతో యత్ర కాలిందీసంగతార్ణవే । తత్ర గత్వా రఘుశ్రేష్ఠస్తతః పశ్యన్ స్థలాని సః ॥ ౩౩ ॥

మునీంద్రుండు కుశాగ్రంబులను కుంభంబును చేతబూని మామిడిచెట్టుక్రింద నీళ్లను ధరించెను. మామిడిచెట్టును తడిసెను. పితృవులును తృప్తినందిరి. ఒకపని రెండుప్రయోజనములనిచ్చునను నది ప్రసిద్ధము. పిమ్మట శ్రీరాముండు విమానమునెక్కుచుటయే మొదలుగాగల సత్కారములచే విష్ణుపాదమున పూజనమొనర్చి యిట్లు మూడుమాసములు గయలోవసించి, లోకులను సంతోషపరచుచు విమానమునెక్కి తూర్పునకువెడలెను. ఫల్గునదీతీరమున పూర్వమున మొదట విమానమునిలచినచోటు రామగయయను పేరుచే ప్రసిద్ధముగానున్నదని బ్రాహ్మణులు చెప్పుచుందురు. అచ్చట రామేశ్వరుండును రామతీర్థంబును పరమపావనముగానున్నవి. శ్రీరాముండు ఫల్గునదీగంగాసంగమంబునకు వెడలెను. గయనువెనుక ఫల్గు వాకయే తెలియును, అది మహానదిగానున్నది॥ ౧-౨౪ ॥ తరువాత రాముండు ఎచ్చట పరమపవిత్రయగు జా

శ్రీరాముండు నూతన ముద్గలాశ్రమంబునకువచ్చి పూర్వసాగర తీర్థంబులను సేవించుట.

హ్నవియైన గంగ యుత్తరవాహినిగానున్నదో అట్టి నూతనంబగు ముద్గలాశ్రమంబునకు వచ్చెను. అంత నచ్చట జానకీదేవి భూమిలో దివ్యమనగా తనమహాతేజస్సును తెలిసియిచ్చెను ఆమెయొక్క దివ్యస్థలమున శ్రీరాముండు మొదట తీర్థమును కల్పించెను. వేఱుగా శ్రీరామానుజుల తీర్థంబులునుగలవు. సీతమాత్రము “ముందు నాయొక్కతీర్థ మిచ్చట విస్తారముగా నేర్పడును. ఎప్పుడు నాతేజస్సు నీభూమిలోనిత్తునో అప్పుడుగదా అది జరుగు”నని తెలిసి తనపేరుతో తీర్థమును కల్పించలేదు. అంత నాదాశరథి పుష్పక విమానారూఢుండై పరమార్థప్రదంబైన యుత్తరవాహిని యను నూరికి వచ్చి యచ్చటి యుత్తరవాహినీ గంగ నారాధించి, ఎచ్చటిగంగలో పర్వతంబును విశ్వేశ్వరుండును గలదో అచ్చటికిపోయి రావణనిర్మితంబగు వైజనాథేశ్వరుని నారాధించి విమానంబున తిన్నగాపోవుచు ననేకస్థలంబులను చూచి గంగనుండి

నానాపుణ్యానితీర్థాని దృష్ట్వా శ్రీపురుషోత్తమం। పూర్వసాగరతీరస్థం దత్త్వా [illegible] ౩౪॥ తతశ్శనైః పుష్పకేణ దృష్ట్వానానావిధాన్ సురాన్ । దృష్ట్వా నానానదీస్సర్వా నానాదేశాన్ విలంఘ్య [illegible] గోదాతీరే స్వనామ్నా తు కృత్వా గిరిమనుత్తమం। సప్తగోదావరీభేద సంగమే సుమహోదధౌ ॥౩౬॥ స్నాత్వా [illegible] మార్గేణ తతో రామో యయౌ పునః । పూర్వదేశే నృపతిభిర్మానితః పూజితోఽపి చ ॥ ౩౭ ॥ గృహీత్వా స్వకరం తేభ్యస్తైస్సహైవ శనైశ్శనైః । విమానేనసుఖేనైవ తీర్థాన్యన్యాని సేవితుం ॥ ౩౮ ॥ శ్రీరామో యామ్యదిగ్జాని దక్షిణాభిముఖో యయౌ । ఏవం ప్రోక్తా పూర్వదేశం యాత్రా రామేణ యా కృతా ॥ ౩౯ ॥ * ॥ ఇతి శ్రీమదానందరామాయణే యాత్రాకాండే పూర్వదేశయాత్రావర్ణనంనామ షష్ఠస్సర్గః ॥ * ॥ ... ... ... ... ... ... ॥౬॥

శ్రీరామదాస ఉవాచ—తతో రామస్సముల్లంఘ్య మత్స్యతీర్థం మనోరమం । తీర్త్వా మహానదీం కృష్ణాం పశ్యన్ పుణ్యస్థలాని సః ॥౧॥ తతో యయౌ నారసింహం రామః పానకనామకం। కృష్ణాబ్ధిసంగమే స్నాత్వా దత్త్వా దానాని విస్తరైః ॥ ౨ ॥ పశ్యన్నానాస్థలాన్యేవ యయౌ శ్రీశైలపర్వతం । స్నాత్వా స నీలగంగాయాం దృష్ట్వా శ్రీమల్లికార్జునం ॥ ౩ ॥ తత్రైవ కృష్ణా సా జ్ఞేయా నీలాగంగేతి నామతః । శ్రీశైలశిఖరం దృష్ట్వా పునర్జన్మ నివారకం ॥౪ ॥ శిఖరే

యెచ్చట సితానది వీడిపోవునచ్చటికివచ్చి, ప్రయాగకు నూరామడదూరమున గంగాసాగరసంగమసహస్రంబునకు విమానముమీఁదవచ్చి స్నానముచేసి, ఎచ్చట యమునానది సముద్రసంగమమాయె నచ్చటికిపోయి అచ్చట స్థలంబులనుచూచి వివిధపుణ్యతీర్థంబులను విలోకించి పూర్వసాగరతీరమునందుగల పురుషోత్తమస్థలమునకువచ్చి యనేక దానధర్మంబుల నాచరించి, తిన్నగా పుష్పకమునవచ్చుచు వివిధసురులను నదులను చూచి పలుదేశంబులనుదాటి గోదాతీరమున తనపేరుతో నొకపర్వతమును కల్పించి సప్తగోదావరీసంగమంబున మహోదధిలో స్నానముచేసి, మరల రాముఁడు దక్షిణమార్గముగా వచ్చుచు పూర్వదేశమునందలి రాజులచే పూజింపఁబడి వారినందరిని పుష్పకముమీఁద నెక్కించికొని సుఖముగా దక్షిణదిగ్భవంబులగు తీర్థంబులను విలోకించుచు దక్షిణదిక్కునకు వెడలెను. విష్ణుదాసా! నీకిట్లు శ్రీరాముని పూర్వ దిక్తీర్థయాత్రా వర్ణనము చేయఁబడినది. ... ... ... ... ॥౬॥

శ్రీరాముఁడు శ్రీశైలాదిక్షేత్రములను చూచుట.

రామదాసుఁడిట్లు చెప్పుచున్నాఁడు.—తరువాత నా శ్రీరాముఁడు మత్స్యతీర్థమును దాటి మహానదియగు కృష్ణనుతరించి, పుణ్యస్థలంబులను చూచుచుపోయి పానకాల నరసింహస్వామిని చేరి కృష్ణాసాగరసంగమంబున స్నానముచేసి యథేష్టంబుగా దానంబులనొసంగి, దారిలోని సుస్థలంబుల నీక్షించుచు శ్రీశైలపర్వతంబునకువచ్చి నీలగంగలో మునుంగి శ్రీమల్లికార్జునస్వామి నారాధించెను. అచ్చటి కృష్ణానదియే నీలగంగయనబడును. శ్రీశైలశిఖరమును చూచిన మరల జన్మములేదు. శిఖరేశ్వరుని శిఖరమునుండి బ్రహ్మకుండమున నవగాహించి పిదప భీమ

శ్వరస్యశిఖరాత్ బ్రహ్మకుండేవిగ ... భీమకుండేతతః స్నాత్వాతథానివృత్తిసంగమే ॥ ౫ ॥ తుంగభద్రాసంగమేపి మహానదీసరోవరే । విగాహ్యభవనాశిన్యాం తతోదృష్ట్వాహ్యహోబలం ॥ ౬ ॥ నారసింహంతతో నత్వా కృత్వాస్తంభప్రదక్షిణాం । గత్వాపుష్పగిరౌతత్ర పినాకీమవగాహ్యచ ॥ ౭ ॥ పశ్యన్ పుణ్యస్థలానీశాన్ దృష్ట్వాపంపాసరోవరం । కిష్కింధాయాంతతోగత్వా సుగ్రీవాద్యైఃప్రపూజితః ॥ ౮ ॥ సుగ్రీవాద్యైర్వానరైశ్చ విమానేన వివాహమసాప్రవర్షణగిరౌస్వీయ గుహాంరమ్యాంప్రదర్శయన్ ॥౯॥ వైదేహీంకౌతుకాద్రామః కించిత్కృత్వాస్మితాననం । ద్వితీయేభీమంకుండేథ స్నాత్వాగత్వాషడాననం॥౧౦॥ స్నాత్వాగస్తికుండమధ్యే పశ్యన్ తీర్థాన్యనేకశః । కనకగిరిస్థంశంభుంనత్వాసంపూజ్యరాఘవః ॥ ౧౧ ॥ వీరభద్రంతతోదృష్ట్వా నత్వాద్రింవేంకటంభువి । గోవిందరాజంతంనత్వా తృప్తిపత్తనసంస్థితం ॥ ౧౨ ॥ స్నాత్వాకపిలధారాయాం తీర్థశ్రాద్ధంవిధాయచ । తతోశేషాచలంగత్వా స్నాత్వాపుష్కరిణీజలే ॥౧౩॥ వేంకటేశంపూజయిత్వా పంచతీర్థంవిగాహ్యచ । సువర్ణముఖరీతీరసంస్థంశ్రీకాలహస్తినం ॥ ౧౪ ॥ పూజయిత్వాయయౌకాంచీం రామశ్శివహరిప్రియాం । ఏకాంబరేశ్వరంపూజ్య సర్వతీర్థేవిగాహ్యచ ॥ ౧౫ ॥ కామాక్షీమంబికాంనత్వా స్నాత్వావేగావతీజలే । నత్వావరదరాజంచ పక్షితీర్థంతతోయయౌ ॥ ౧౬॥ పూషావిధాతృనామానౌ పక్షిణౌపూజ్యసీతయా । పుష్పకేణతతశ్శీఘ్రం క్షీరనద్యాంవిగాహ్యసః ॥ ౧౭॥ నత్వాత్రివిక్రమంతత్ర తతోగాదరుణాచలం । ముక్తిర్యత్ స్మరణాదేవ నత్వాతమరుణాచలం ॥౧౮॥మ

కుండమున జలకమాడి అట్లే నివృత్తిసంగమంబునను తుంగభద్రాసంగమంబునను మహానదీసరోవరంబునను భవనాశినియందును అవగాహనంబుల నొనర్చుచువచ్చి అహోబలనృసింహస్వామినారాధించి స్తంభప్రదక్షిణమొనర్చి పుష్పగిరికివెడలి పినాకిలో మునుంగి పుణ్యస్థలంబులను మహాలింగములను దర్శించుచు పంపాసరోవరమునుచూచి కిష్కింధకువెడలి సుగ్రీవాదులచే సత్కరింపఁబడి వారినందరిని విమానముననెక్కించికొని ప్రవర్షణగిరిలోని తన గుహను చూపుచు సీతను వేడుకలచే హాసన్ముఖినిం జేసి రెండవ భీమకుండమున స్నానముచేసి కుమారస్వామినిదర్శించి, అగస్తికుండమునమునింగి అనేక తీర్థంబులనుచూచుచు కనకగిరిలోని శంభుదేవుని నమస్కరించి పూజించి, వీరభద్రునిఁదర్శించి వేంకటగిరినివందించి తృప్తిపట్టణవాసియగు గోవిందరాజును నమస్కరించి, కపిలధారలో స్నానమాడి తీర్థశ్రాద్ధముపెట్టి పిదప శేషాచలమునకువెడలి పుష్కరిణీస్నానముచేసి వేంకటేశ్వరుల నారాధించి పంచతీర్థిమునుంగి సువర్ణముఖరీతీరమున కాలహస్తీశ్వరుని నారాధించి, శంకరనారాయణప్రియంబగు కాంచీనగరికేతెంచి, సర్వతీర్థమున స్నానముచేసి కామాక్షీదేవిని నేకామ్రనాథు నారాధించి వేగవతీస్నానముచేసి వరదరాజును పూజించి, పక్షితీర్థమునకువెడలి పూషయను విధాతృవను పక్షులను సత్కరించి శీతతోడ పుష్పకమునవెడలి క్షీరనదిలో స్నానముచేసి త్రివిక్రమమూర్తిని మ్రొక్కి యరుణాచలమునకువచ్చెను. దేనిని స్మరించినమాత్రమున ముక్తిలభించునో అట్టి యరుణాచలంబు నారాధించి మణిముక్తానదీతీరమున వృద్ధాచలంబునకువెడలి తదీశ్వరునారా

ధౌమ్యః కణ్వశ్చైకపాదస్త్రిపాదశ్చోర్ధ్వబాహుకః ॥ ౩౦ ॥ ఊర్ధ్వపాదశ్చోర్ధ్వనేత్ర శ్చోర్ధ్వాస్యస్త్రిశిరాస్తథా । వృద్ధగౌతమనామాథ పర్ణాదశ్చంద్రసంజ్ఞకః ॥ ౩౧ ॥ ఋష్యశృంగో మతంగశ్చ జాబాలిః కుంభసంభవః । దధీచిశ్శౌనకస్సూత స్సుతీక్ష్ణో లోమశ స్తథా ॥ ౩౨ ॥ వాల్మీకిశ్చాపి దుర్వాసా మునిర్వేదనిధిర్మహాన్ । ఏతే చాన్యే చ మునయః స్త్రీశిష్యతనయాదిభిః ॥ ౩౩ ॥ కేచిత్పర్ణాశనాః కేచి ద్వాయుభక్షా స్తథాపరే । కుశాగ్రజలపానాశ్చ కేచిత్త్యక్తాశనా స్తథా ॥ ౩౪ ॥ భిక్షాశనా స్తథా కేచి త్పరదత్తాశనాః పరే । అయాచ్యావ్రతినః కేచిత్త్యక్తసంభాషణాః పరే ॥ ౩౫ ॥ కేచిద్వల్కలసంవీతాః కేచిత్పాషాణవస్త్రిణః । మృగచర్మధరాః కేచి త్కేచిదాకాశవస్త్రిణః ॥ ౩౬ ॥ వృక్షపల్లవవస్త్రాశ్చ కేచిత్పంచాగ్నిసాధకాః । ధూమ్రపానవ్రతాః కేచిత్కేచిత్త్యక్తైషణాః పరే ॥ ౩౭ ॥ ఏవం నానావనారామ గిరిదుర్గాశ్రమాదిషు । వాసిన స్తే సమాయాతా స్సదారాశ్చ సబాలకాః ॥ ౩౮ ॥ సశిష్యా రామచంద్రస్య ద్రష్టుం యజ్ఞోత్సవం వరం । దశదిగ్భ్యో మునిశ్రేష్ఠాః కోటిశశ్చ దినే దినే ॥ ౩౯ ॥ తాన్సర్వాన్రామచంద్రోఽపి ప్రత్యుత్థానాసనాదిభిః । మధుపర్కాదిపూజాభి స్తోషయామాస సాదరం ॥ ౪౦ ॥ యజ్ఞవాటే మహారమ్యే కామధేనుం రఘూత్తమః । పూజయామాస విధివద్వస్త్రాభరణైరపి ॥ ౪౧ ॥ సువర్ణశృంగభూషాభిః కింకిణీనూపురాదిభిః । ఏవం తాం శోభయిత్వాథ ప్రార్థయామాస రాఘవః ॥ ౪౨ ॥ ధేనో సాగరసంభూతే త్వమన్నాని ద్విజాదికాన్ । దాతు

ర్వాసుఁడు వీరే మొదలుగాఁగల యితరమునీంద్రులును కళత్ర పుత్ర చ్ఛాత్రులతోఁడ వచ్చిరి. కొందరు పర్ణాహారులు, కొందరు వాయుభక్షకులు, కొందరు కుశాగ్ర జలపానులు, కొందరు నిరాహారులు, కొందరు భిక్షాశనులు, కొందరు పరదత్తాశనులు, కొందరు అయాచ్యావ్రతులు, కొందరు మౌనవ్రతులునై యుందురు. కొందరు నారబట్టలవారు కొందరు కావిగుడ్డలవారు, కొందరు చర్మాంబరులును, కొందరు అంబరాంబరులును, కొందరు కిసలయవస్త్రులును, కొందరు పంచాగ్ని సాధనాపరులును, కొందరు పొగఁద్రాగువారును, కొందరు విరాగులునై యిట్లు వివిధ వన దుర్గ పర్వతాశ్రమములలో వసించువారందరును తమతమ పత్నులను బాలకులను శిష్యులను వెంటబెట్టికొనివచ్చిరి. ఇట్లే ప్రతిదినంబును శ్రీరామచంద్రుని యజ్ఞోత్సవమును చూచుటకై కోట్లకొలది మునీంద్రులు వచ్చుచుండిరి. వారినందరిని రఘునందనుండు ప్రత్యుత్థానముచేతను ఆసనాద్యుపచారంబులచేతను మధుపర్కాదులచేతను సాదరముగా సత్కరించుచుండెను. పిదప శ్రీరాముఁడు యజ్ఞవాటమున కామధేనువును దివ్య వస్త్రాభరణ సువర్ణ శృంగాదులచే పూజించి “జగన్మాతయగు కామధేనువా! నీవు నా యీయజ్ఞమున ప్రసన్నురాలవై ద్విజాదులకు మృష్టాన్నమునిచ్చుదానవుగా నున్నావు” అని ప్రార్థించి, ప్రణమించి, పాకశాలలో పట్టువస్త్రములమీఁద నిలిపెను. అంత నాకామధేనువు పరితుష్టయై జానకీదేవికి ఎల్లప్పుడు కావలసినంత షడ్రసాన్నముల నిచ్చుచుండెను. వంటయిండ్లలో నొకప్పుడును నిప్పుపని లేదు. మునీంద్రులు స్వేష్టాహారంబులచే సంతుష్టులగుచుండిరి. యజ్ఞమున నెల్లెట్లు శ్రీరాముఁడు

మహాన్యధ్వరేమే ప్రసీదజగదంబికే ॥ ౪౩ ॥ ఏవంసంప్రార్థ్యతాంకామ ధేనుంరామః ప్రణమ్యచ । బబంధపాక శాలాయాం పట్టకూలాసనోపరి ॥ ౪౪ ॥ అథసాసురభిస్తుష్టా షడ్రసాన్నానిసాదరాత్। దదౌజనకనంద్విన్యై స్సదా వాధ్వరకర్మణి ॥ ౪౫ ॥ నాగ్నికార్యంచతత్రాసీ త్పాకశాలానువైకదా । ఇచ్ఛాశక్త్యైస్సదాతుష్టా బభూవుర్మునిస త్తమాః ॥ ౪౬ ॥ యాన్యాన్కామాన్రామచంద్ర శ్చింతయామాసచేతసి । తాన్భోగాన్మణిశ్శీఘ్రం కల్పయామాసతుర్ముఖే ॥ ౪౭ ॥ తథాసీతాపియాన్ కామాన్ చింతయామాసచేతసి । కామధేనుర్దదౌతాంస్తాం శీఘ్రంత్రైలోక్యదుర్లభాన్ ॥ ౪౮ ॥ సర్వత్రయజ్ఞవాటేహి ద్విజాద్యైశ్చసమంతతః । పఙ్క్తిషుభూమిజాదీనాం పరివేషణ కర్మణి ॥౪౯ ॥ స్త్రీణాంకంకణనాదైశ్చ శుశ్రువేనూపురధ్వనిః । అథరామశ్చసౌమిత్రిం సమాహూయవచోబ్రవీత్ ॥౫౦॥సీమాచారాన్సమాహూయ మమవాక్యాచ్ఛసాదరం । ఆజ్ఞాపయస్వశీఘ్రంత్వం శాసనంయన్మయోచ్యతే॥ ౫౧ ॥ బ్రహ్మచారీగృహస్థోవా వానప్రస్థాశ్రమీయతిః । యఃకశ్చిద్వాసమాయాతి పథికస్సరమాజ్ఞయా ॥ ౫౨॥ నివారణీయోయుష్మాభి ర్నకదాప్యధ్వరేమమ । మమాజ్ఞాంనప్రతీక్షధ్వం కోపఃకార్యోనకస్యచిత్ ॥ ౫౩॥ ఇతిరామ వచఃశ్రుత్వా తథేత్యుక్త్వాసలక్ష్మణః । సీమాచారాన్సమాహూయ రాఘవోక్తంన్యవేదయత్ ॥ ౫౪ ॥ తతోరామఃపునఃప్రాహ సమాహూయాథలక్ష్మణం । బ్రహ్మచారీగృహస్థోవావానప్రస్థాశ్రమీయతిః॥౫౫॥ మునీనాంచయితా బాలా శ్శిష్యాస్సంబంధినస్తథా । పౌరాజానపదస్థస్తు తేషాంసంబంధినఃస్త్రియః ॥౫౬ ॥ దాసీదాసజనాస్సర్వే య

దేనినిదేనిని చింతించునో వాటినివాటిని కామధేను చింతామణులు తప్పక యిచ్చుచుండినవి. అట్లే సీతయును మదిని దేనిని కోరునో దుర్లభంబగు నావిషయమును కామధేను విచ్చుచుండెను. సర్వత్ర యజ్ఞవాటికలో బ్రాహ్మణాదుల పఙ్క్తిలో జానకియె మొదలయిన స్త్రీలయొక్క వడ్డించడము మొదలగుపనులలోని కంకణధ్వనులును నూపురనాదంబులును వినవచ్చుచుండి

## శ్రీరాముల యౌదార్య సంతర్పణారాధనము.

నవి॥ ౫౦ ॥ తరువాత శ్రీరాముఁడు లక్ష్మణునింబిలచి “తమ్ముఁడా! ఎల్లలలోని యాచారవ్యవహారకులను పిలిపించి వారికి సాదరముగా నా యీయాజ్ఞను నిరూపింపుము. బ్రహ్మచారిగాని గృహస్థుఁడుగాని వానప్రస్థాశ్రమిగాని యతిగాని యెవఁడొక్కఁడైనను బాటసారిగా వచ్చినా వానిని నాయాజ్ఞమీఁదుగా ప్రయాణమును నిలిపికొనిరావలయును. ఈ యజ్ఞసమయమున నీక నెప్పుడును నాయాజ్ఞను నిరీక్షింపవలదు. ఎవనివిషయమునను కోపించకూడదు.” అని యాజ్ఞాపించగా, నట్లేయని లక్ష్మణుఁడు సీమాచారులను పిలపించి శ్రీరామాజ్ఞను నిరూపించి చెప్పెను. మరల శ్రీరాముఁడు లక్ష్మణునిఁబిలచి “బ్రహ్మచర్యాద్యాశ్రమ ధర్మపరాయణులు వారి పత్నులు బాలురు శిష్యులు వారిబంధువులు పౌరులు జనపదమువారు వారి సంబంధులు స్త్రీలు దాసీదాసజనులు వీరందరును దేనిని దేనిని అపేక్షించెదరో, లక్ష్మణుఁడా! వారికి దానిని నన్నడుగకనే ఇయ్యవచ్చును. ఇందుకు విచారమక్కఱలేదు. ఎల్లప్పుడు నంత్యజులవరకు నంద

ద్యద్వాంఛంతిలక్షణ । మామపృష్ట్వాతులత్తేషాం దాతవ్యంహ్యవిచారితం ॥౫౭॥ అంత్యజావధిసర్వాన్హితోషయధ్వం నిరంతరం । నకేషామఖిలాపాశ్చ విఫలాహివిధీయతాం ॥౫౮॥ అయోధ్యాంకామధేనుంచ జానకీంకౌస్తుభంమణిం। చింతామణింపుష్పకంచ రాజ్యకోశాదికంచమే ॥౫౯॥ ఏతేష్వపిచయోయాచ్ఞాం యాచయిష్యతితస్త్వయా।న దత్తంచేతివైశ్రుత్వా మమాలోపోభవేత్త్వయి ॥౬౦॥ అతోజ్ఞాత్వాభయంమత్తో దదస్వహ్యవిచారతః । యాచ్ఞాభంగఃకృతశ్చేద్ధి మచ్ఛిరోహాఖపిష్యసి ॥౬౧॥ సదాస్మరగిరంమేత్వ మిమాంలక్ష్మణసాదరం । ఇతిరామకృతాంశిక్షామంగీకృత్యసలక్ష్మణః ॥౬౨॥ తథాచకారతత్సర్వం యథారామేణశిక్షితం ॥*॥ ఇతి శ్రీమదానందరామాయణే వాల్మీకీయే యాగకాండే ద్వితీయస్సర్గః ॥ ... ... ... ... ... ... ... ॥౨॥

శ్రీరామదాసఉవాచ—అథముక్తస్తదావాజీ రాఘవేణమహాత్మనా । యజ్ఞాంగశ్శ్యామకర్ణాస్స పూర్వదేశంయయాజవాత్ ॥౧॥ శత్రుఘ్నసహసైన్యేన ప్రాప్తోభాగీరథీతటం । ఏతస్మిన్నంతరేరామః స్వప్రతాపం ప్రదర్శయన్ ॥౨॥ చకారకౌతుకంతత్రశత్రుఘ్నస్యపురోమహత్ । బ్రహ్మావర్తంమహాదేశం త్యక్త్వాగంగాతటం ప్రతి ॥౩॥ యావత్ప్రాప్తశ్శ్యామకర్ణ స్తావదాసీత్తదాద్భుతం । గంగాయాంచమహాపూరో యత్రనౌకాపికుంఠితా ॥ శత్రుఘ్నోపితంద్రృష్ట్వా కుంఠితాంగతిమీక్ష్యచ । కాలాతిక్రమభీత్యాస నిజచిత్తేవ్యచింతయత్ ॥౫॥ ఆదా

---

రిని ఆనందింపఁదగును. ఒకరియపేక్షను కూడ విఫలమాయెననిపింపవలదు. అయోధ్యను కామధేనువును జానకిని కౌస్తుభరత్నమును చింతామణిని పుష్పకమును రాజ్యకోశాదులను ఇఁక నిష్టమగు నేవస్తువులనైనను అపేక్షించినవారికి దానిని నీ విష్వకపోవుటను నేను వింటినా కొంచమును సంతోషించచాలను. కనుక నాభయమునెఱింగి నిర్విచారుఁడై యిచ్చుచుండుము. నాయాజ్ఞను భంగపరచితివా నాతలకొట్టినవాఁడగుదువు. లక్ష్మణుఁడా! ఎల్లప్పుడును నా యీ మాటను తప్పక స్మరించుచుండము." అని యిట్లు చెప్పిన శ్రీరామశాసనమును లక్ష్మణుఁడు అంగీకరించి యథోక్తముగా నంతటిని నట్లే నెరవేర్చుచుండెను॥ ... ... ౨॥

శ్రీరాముని యజ్ఞాశ్వము పూర్వదిగ్యాత్ర చేయుటలో గంగ దారియిచ్చుట.

పిమ్మట, మహాత్ముఁడగు శ్రీరామునిచే విడువఁబడిన యజ్ఞాశ్వము వేగముగా పూర్వదేశమునకు వెడలెను. సైన్యములతోడ శత్రుఘ్నుండును దాని వెంటవెడలి గంగాతీరమును చేరెను. అంతలో నచ్చట శ్రీరాముఁడు నిజమహిమచే శత్రుఘ్నునియెదుట నొక యద్భుతమును జరిగించెను. ఏమనిన—గుఱ్ఱము బ్రహ్మావర్తమను మహాదేశంబునువదలి గంగాతీరమునకు వచ్చునప్పటికి గంగలో మహాప్రవాహము నిండియుండెను. పడవయును పగిలియుండెను. శత్రుఘ్నుఁడు దానినిచూచి కాల మతిక్రమించిపోవుచున్నదను భీతిచేత తన మనంబున "నా ప్రయాణమున మొదటనే ఈవిఘ్నము సంభవించినది. భోజనముచేయువాని మొదటికబళము

జేవాత్రమేవిఘ్నం మత్పక్షం గమవేమహాత్ । గ్రాసే ప్రాథమికే యద్వన్మక్షికాపతనం తథా ॥ ౬ ॥ తర్హీదానీం రామచంద్ర ప్రతాపేనాస్తు మే గతిః । నిశ్చిత్యేత్థం స శత్రుఘ్నో రథస్థో జాహ్నవీతటే ॥ ౭ ॥ స్థిత్వా ప్రోవాచ గంగాం తాం పరిపూజ్య సవిస్తరాత్ । శృణ్వంతు సర్వలోకేషు మునిదేవగణాస్తు చ ॥ ౮ ॥ దేవి గంగే మహాపుణ్యే యది సత్యం రఘూత్తమే । దీయతాం తర్హి పంథా మే శీఘ్రం సైన్యయుతస్య చ ॥ ౯ ॥ ఇతి శత్రుఘ్నవచనం శ్రుత్వా వై జాహ్నవీ తథా । స్వవేగం ఖండయామాస స్వోదరం తం ప్రదర్శయత్ ॥ ౧౦ ॥ పద్భిర్వాజీ తథా శీఘ్రం పరం తీరం యయౌ క్షణాత్ । తథా సైన్యైః శత్రుఘ్నః ససుమంత్రిస్సమాయయౌ ॥ ౧౧ ॥ మాగధాఖ్యం మహాదేశం స ఏవ కీకటః స్మృతః । పూర్వవచ్చ మహాపూరో జాహ్నవ్యాం స బభూవ హ ॥ ౧౨ ॥ ప్రతాపం రామచంద్రస్య సర్వే వర్ణ్య మహాద్భుతం । చక్రుస్తే జయశబ్దాంశ్చ సీతారామాఖ్యయా ముహుః ॥ ౧౩ ॥ శ్యామకర్ణస్తతశ్శీఘ్రం యయౌ పూర్వాశం ప్రతి । మాగధేశోఽస్య పశ్చాచ్చ శ్రుత్వా తురగమాగతం ॥ ౧౪ ॥ ప్రత్యుజ్జగామ సైన్యేన పురస్కృత్యాథ వారణం । వినాయాశ్వం పఠిత్వాతి త్వాపపత్రం పురం నిజం ॥ ౧౫ ॥ పూజ్యాదరాత్ససైన్యం తం శత్రుఘ్నం వివిధైర్ద్విజైః । సమస్తం నిజకోశాది సమర్ప్య మగధాధిపః ॥ ౧౬ ॥ పౌరాన్ జానపదాన్ స్వస్త్రీః సుహృత్పుత్రమంత్రిణః । పౌరపత్నీర్జానపదం పత్నీర్విప్రాన్ పురోధసం ॥ ౧౭ ॥ ప్రేషయామాస సాకేతే వాహనైరధ్వరం ప్రతి । స్వయం సైన్యేన తురంగ చరణాననులక్ష్య

లోనే ఈఁగదూరినట్లయినది. అయిన నిప్పుడు శ్రీరామచంద్రుని ప్రతాపమువలన ప్రయాణమగునుగాక." ఇట్లని నిశ్చయించికొని, రథారూఢుఁడగు శత్రుఘ్నుఁడు గంగాతీరమున నిలచి గంగాదేవిని చక్కఁగా పూజించి సర్వలోకంబులును దేవమునులును వినుచుండగా "గంగాదేవీ! పుణ్యవతీ! శ్రీరామునియందు సత్యమున్న యెడల ససైన్యుఁడగు నాకు సుపథమునివ్వుము." అని ప్రతిజ్ఞ చేయగా, నావచనమునువిని ఆజాహ్నవి తనవేగమును ఖండించి తనకడుపుఁజూపెను. పిదప క్షణమాత్రమున యజ్ఞాశ్వము కాలినడకతో నదినిదాఁటెను. అట్లే సైన్యములతోడ శత్రుఘ్నుఁడు సుమంత్రుఁడును వచ్చిరి. కీకటంబని చెప్పంబడు మాగధదేశంబునకువచ్చి అచ్చటను గంగాప్రవాహమును వెనుక చెప్పినట్లే దాటిరి. అప్పు డందరును శ్రీరామచంద్రుని ప్రతాపమును పొగడుచు సీతారాములను జయనాదంబులచే కొనియాడిరి. శ్యామకర్ణంబగు యజ్ఞాశ్వము అచ్చటనుండి పూర్వమునకు వచ్చుచుండెను. మాగధరాజు యజ్ఞాశ్వము వచ్చుచున్న సంగతినివిని తనపట్టపేనుఁగును సైన్యములను ముందుపెట్టికొని గుఱ్ఱమువద్దికివచ్చి దానినొసటనున్న లేఖను చదివికొని సాదరముగా దానినారాధించి ససైన్యుండగు శత్రుఘ్నునిసత్కరించి, తనసమస్తభండారములను సమర్పించి, తనదేశమునారిని నాగరికులను నిజాంతఃపురస్త్రీలను పుత్రమిత్రమంత్రిప్రముఖులను సపత్నీకులనుగా నిజపురోహితునితోడ నయోధ్యలోని యజ్ఞమునకంపించి, తాను సైన్యములతో యజ్ఞాశ్వముయొక్క చరణములను కనిపెట్టికొనుచు శత్రుఘ్నాజ్ఞానువర్తిగా ముకుళితాంజలియైవచ్చుచుండెను. ఇట్లే సర్వదిక్కులలోని సమస్తరాజులును తెలియఁబడద

చ ॥ ౧౮ ॥ శత్రుఘ్నవాగానువర్తీ బద్ధహస్తపుటోఽయయా । ఏవం సర్వేఽపి రాజానో జ్ఞాతవ్యాస్సర్వదిక్స్థితాః ॥ ౧౯ ॥ నకేనాపి శ్యామకర్ణో బద్ధో నృపతినా భువి । ఇంద్రాద్యైర్నిర్జరైర్నాపి నాసురాద్యైః కదాచన ॥ ౨౦ ॥ తతో వాజీ పూర్వదేశాన్ వంగవంగకలింగకాన్ । తథా నానావిధాన్ సర్వాన్ విలంఘ్య జలధేస్తటం ॥ ౨౧ ॥ దృష్ట్వా నృపకులైర్యుక్తో దక్షిణాభిముఖో యయౌ । గోదావరీం నదీం తీర్త్వా దేశమాంధ్రం చ ద్రావిడం ॥ ౨౨ ॥ అతిక్రమ్యారవారాఖ్య దేశం సమతిక్రమ్య చ । కాంచీప్రదేశాన్ సకలాన్ పశ్యన్నానావిధాన్ శుభాన్ ॥ ౨౩ ॥ కావేరీం సమతిక్రమ్య చోలదేశం విలంఘ్య చ । సేతుబంధం తతో దృష్ట్వా పశ్చిమాభిముఖో యయౌ ॥ ౨౪ ॥ తామ్రపర్ణీం విలంఘ్యాథ సమతిక్రమ్య కేరలాన్ । ద్విషట్ ప్రకారాన్ దేశాంశ్చ గోకర్ణం చ తతో యయౌ ॥ ౨౫ ॥ కృష్ణాతీరప్రదేశాంశ్చ సమతిక్రమ్య ఘోటకః । కర్ణాటకం మహాదేశం సమతిక్రమ్య సత్వరం ॥ ౨౬ ॥ కొంకణం సమతిక్రమ్య తత్రత్యదేశనృపైస్సహ । భీమాప్రదేశాన్ సకలాన్ శ్యామకర్ణశ్శుభావహః ॥ ౨౭ ॥ పశ్యన్ యయౌ మహారాష్ట్రం గౌతమీం తాం విలంఘ్య చ । విదర్భం సమతిక్రమ్య యయావాభీరమండలం ॥ ౨౮ ॥ మాలవం సమతిక్రమ్య తీర్త్వా పుణ్యాం మహానదీం । తీర్త్వా సాభ్రమతీం పుణ్యాం సమతిక్రమ్య గుర్జరం ॥ ౨౯ ॥ ప్రభాసం చ తతో గత్వా యయావాసతీముత్తమం । సౌవీరాన్సమతిక్రమ్య మరుదేశం యయౌ హయః ॥ ౩౦ ॥ ధన్వదేశమతిక్రమ్య యయౌ సారస్వతాన్ అథ ।

---

గును. యజ్ఞాశ్వమును భూమిలో నొకరాజును బంధించలేదు. దానిని బంధించుటకు ఇంద్రాదులచేతకాదు. దానవులచేతకాదు. అంతనా తురంగంబు అంగవంగకళింగాది నానాపూర్వదేశంబులనతిక్రమించి పూర్వసముద్రతీరమునకువచ్చి ॥ ౨౧ ॥ రాజసమూహముచే కూడి దక్షిణాభి

శ్రీరాముని యజ్ఞాశ్వము దక్షిణ దిగ్యాత్ర చేయుట.

ముఖముగా వెడలి గోదావరినిదాటి ఆంధ్రద్రావిడ దేశంబులను చూచి ఆరవారదేశమునతిక్రమించి మంగళంబులగు సమస్త కాంచీమండల ప్రదేశంబులనన్నిటిని చూచుచు కావేరినిదాటి చోళదేశమునతిక్రమించి శ్రీరామసేతువునకువచ్చి ॥ ౨౪ ॥ పశ్చిమాభి ముఖముగా వెడలి

శ్రీరాముని యజ్ఞాశ్వము పశ్చిమదిగ్యాత్ర చేయుట.

తామ్రపర్ణీనదినిదాటి పండ్రెండు తెరంగులగు కేరలదేశంబులనతిక్రమించి గోకర్ణంబునకువచ్చి కృష్ణాతీరప్రదేశంబును చూచుచు కర్ణాటదేశమునతిక్రమించి కొంకణదేశమునుదాటి ఆయా దేశపురాజులతోడ భీమానదీప్రదేశంబులనుచూచి మహారాష్ట్రంబున కేతెంచి గౌతమీనదిని దాటి విదర్భమునుచూచి ఆభీరమండలమునుచేరి మాలవమునకువచ్చి పుణ్యమగుమహానదిని దాటి సాభ్రమతినిలంఘించి ఘుర్జరదేశమునతిక్రమించి ప్రభాసమునకువచ్చి ॥ ౨౯ ॥ యాన

శ్రీరాముని యజ్ఞాశ్వము ఉత్తరదిగ్యాత్ర చేయుట.

త్తరదేశమునకు వెడలి సౌవీరదేశంబులను మరుదేశమును ధన్వదేశమును సారస్వతదేశమును మత్స్యదేశములను మాథురంబులను శూరసేనంబులను పాంచాలంబులను కురుక్షేత్రమును

మత్స్యాన్ దేశానతిక్రమ్య యయౌ వాజీ సమాధురాత్ ॥ ౩౧ ॥ శూరసేనానతిక్రమ్య పంచాలాన్ తురగో యయౌ । కురుక్షేత్రం తతో గత్వా తిక్రమ్య కురుజాంగలాన్ ॥ ౩౨ ॥ దేశం కైకేయముల్లంఘ్య యయౌ కాశ్మీరముత్తమం । భిల్లదేశం గౌడదేశం శకదేశం యయౌ హయః ॥ ౩౩ ॥ యవనాస్తామ్రదేశాంశ్చ సమతిక్రమ్య వేగతః । పశ్యన్ నానావిధాన్ దేశాన్ కరతోయాతటే న వై ॥ ౩౪ ॥ యయౌ వాజీ వాయుగత్యా శీఘ్రం జ్వాలాముఖీం ప్రతి । దోషభీత్యా కరతోయాం తీర్త్వా నైవాగ్రతో గతః ॥ ౩౫ ॥ కర్మనాశానదీస్పర్శాత్ కరతోయావిలంఘనాత్ । గండకీబాహుతరణాత్ ధర్మః స్ఖలతి కీర్తనాత్ ॥ ౩౬ ॥ హరిద్వారం యయౌ వాజీ తతో గంగాతటే న హి । హిమాద్రేస్సన్నిధాన్ దేశాన్ సమతిక్రమ్య వేగతః ॥ ౩౭ ॥ బదరికాశ్రమమాలోక్య కలాపగ్రామవాసిభిః । సంమానితస్తదా వాజీ గత్వాతిన్మానసంసర ॥ ౩౮ ॥ దృష్ట్వా హరిహరక్షేత్రం మిథిలాం ప్రాప సేనయా । నానాదేశానతిక్రమ్య ఆర్యావర్తం స యయౌ హయః ॥ ౩౯ ॥ దృష్ట్వా కాశీం త్రివేణీం చ హ్యంతర్వేదీం యయౌ జవాత్ । శృంగబేరపురం గత్వా తమసాం తాం విలంఘ్య చ ॥ ౪౦ ॥ గత్వా స నైమిషారణ్యం సముల్లంఘ్యాథ గోమతీం । బ్రహ్మావర్తం సరో గత్వా పశ్యన్ దేశాన్ మనోరమాన్ ॥ ౪౧ ॥ కోసలాఖ్యం మహాదేశం దృష్ట్వా వాజీ మనోరమం । తతస్సాకేతవిషయే షణ్మాసైః ప్రాప చాధ్వరం ॥ ౪౨ ॥ నానాదేశనృపైస్సార్ధం శత్రుఘ్నేనాభిరక్షితః । ఆగతం శ్యామకర్ణాంతం జ్ఞాత్వా సీతాపతిస్తదా ॥ ౪౩ ॥ ఆజ్ఞాపయచ్చ సౌ

---

కురుజాంగల కేకయంబులను క్రమముగా నతిక్రమించి కాశ్మీరమునకు వచ్చెను. పిదప నాయజ్ఞాశ్వము భిల్లదేశమును శకదేశమును గౌడదేశమును దాటి యవనతామ్రదేశములన్నుచూచి ఇంకను నానాదేశంబుల నీక్షించుచు కరతోయానదీతీరముననే వాయువేగముతో వచ్చుచుండెను. పిమ్మట జ్వాలాముఖికివచ్చి దోషభీతివలన కరతోయానదినిదాటి ముందుకుపోక హరిద్వారమునకువెడలెను. ఆదోషమేమనిన—కర్మనాశానదిని స్పృశించుటచేతను కరతోయానదిని దాటుటచేతను గండకీబాహ్వతిక్రమణముచేతను చెప్పికొనుటచేతను ధర్మము నశించును. పిదప నా యజ్ఞాశ్వము గంగాతీరముననే హిమాద్రిప్రవేశంబులను వేగముగా నతిక్రమించి బదరికాశ్రమము నీక్షించి కలాపగ్రామవాసులచే సంమానింపఁబడి మానససరోవరమున కేతెంచి హరిహరక్షేత్రము నవలోకించి మిథిలాదేశమునకువచ్చి నానాదేశంబుల నతిక్రమించి యార్యావర్తమునదిగి కాశికివచ్చి త్రివేణింజొచ్చి వేగముగా నంతర్వేది కేతెంచెను. శృంగబేరపురమునకుపోయి తమసానదినిదాటి నైమిశారణ్యమునకువెడలి గోమతీనదిని లంఘించి బ్రహ్మావర్తసరస్సునుచూచి మనోహరంబులగు దేశంబుల నీక్షించుచు కోసలనామక దివ్యదేశంబును చూచి, యయ్యజ్ఞాశ్వంబు ఆరుమాసములలోపల నానాదేశపు రాజులతోడ శత్రుఘ్న పరిరక్షితంబై వచ్చి సాకేతరాజధానిలోని యజ్ఞవాటికను ప్రవేశించెను॥ ౪౨ ॥ పిదప శ్రీరాముఁడు

## శ్రీరామాశ్వమేధమున జనసంమర్దాది విభవము.

వచ్చుచున్న శ్యామకర్ణమునువిని లక్ష్మణుని నాజ్ఞాపించెను. అతఁడును పట్టపేనుఁగును ముందు

మిత్రిం సోఽపిప్రత్యుజ్జగామతం । వారణేంద్రంపురస్కృత్య భేరీదుందుభినిస్వనైః ॥ ౪౪ ॥ వారస్త్రీణాంనృత్తగీతై ర్వేదఘోషైర్ద్విజైరితైః । సంపూజ్యాథశ్యామకర్ణం నృపతీంశ్చసవిస్తరం ॥ ౪౫ ॥ ఆనయామాససౌమిత్రి శ్చా రధ్వరమంటపం । మహోత్సవోమహానాసీ త్తదాతురగదర్శనే ॥ ౪౬ ॥ దశయోజనపర్యంతం సర్వత్రజగతీత లం । వ్యాప్తంసమంతతోఽయోధ్యా బహిర్నృపగణైస్తదా ॥ ౪౭ ॥ తత్రసర్వత్రరాజానః పూర్వంసంప్రేషితాన్ జనాన్ । పౌరాన్ జానపదాన్ స్త్రీశ్చ పశ్యంతోభ్రమరోపమాః ॥ ౪౮ ॥ సైన్యేనబభ్రముస్సర్వే స్వీయదర్శనలాలసాః । నప్రాపుర్దర్శనంతేషాం జనౌఘేఽధ్వరమంటపే ॥ ౪౯ ॥ కేచిత్తేదర్శనంస్వానాం ప్రాపుస్తత్రాఽహని । కేచిత్తృతీయదివసే పంచమేసప్తమేథవా ॥ ౫౦ ॥ కేచిద్దుందుభిఘోషేణ ప్రాపుఃస్వానాంప్రదర్శనం । కేచిత్పక్షానంతరంహి మాసేనానంతరంజనాః ॥ ౫౧ ॥ కేషాంవియోగఏవాసీ చ్చిరకాలంతదాధ్వరే । తజ్జ్ఞాత్వారామచంద్రోపి లక్ష్మణంప్రాహసాదరం ॥ ౫౨ ॥ పరస్పరంవియోగోఽత్ర సంమర్దేనతులక్ష్మణ । జాయతేఽత్రయుక్తింత్వం మత్తశ్శ్రుత్వాకురుష్వతాం ॥ ౫౩ ॥ తమసాయాస్తటేశాలాం కృత్వాద్యమహతీంశుభాం । ఘోషంవిశ్రుత్యసర్వత్ర మహాంతం దుందుభిస్వనం ॥ ౫౪ ॥ యేషాంవియోగస్తైర్గత్వా తమసాతటశోభితాం । శాలాంప్రవేశయధ్వంహి స్వానాంయో

పెట్టికొని సైన్యవిభవముతోడ భేరీ మృదంగాది మంగళవాద్యంబులు మోగుచుండ నృత్తగీతంబులు జరుగుచుండ బ్రాహ్మణుల వేదఘోషంబులు బరగుచుండ, నయ్యజ్ఞాశ్వము నెదురుకొని పూజించి రాజవర్గంబును సత్కరించి తిన్నగా యజ్ఞమంటపంబునకు పిలచికొనివచ్చెను. ఆ తురగదర్శనంబున మహోత్సవంబు బాగుగా జరిగినది. అయోధ్యాపురికి చుట్టున పదియామడభూమి రాజులచే రాజించుచు నిండియుండెను. అప్పు డచ్చటరాజులందరును తమ సైన్యములతోడ తుమ్మెదలవలె పరిభ్రమించుచు తాము మునుపంపిన తమ యిష్ట మిత్ర పుత్ర కళత్ర పరివార నాగరిక దేశీయాదిజనులను వెదకుచుండిరి. తమవారిని, కొందరు మరునాడు కొందరు రెండుదినములకు కొందరు మూడుదినములకు కొంద రైదుదినంబులకు కొంద రేడు దినంబులకును కనుగొనుచుండిరి. కొందరు భేరీనాదంబుచే తమవారిని చూచికొనిరి. కొందరు ౧౫ రోజులకును కొంద రొక నెలకును కనుగొనిరి. అయ్యజ్ఞమున కొందరికి వియోగమే చిరకాలముగ్గలైను? ఆసంగతినెఱింగి శ్రీరాముఁడు సాదరముగా లక్ష్మణుని "తమ్ముఁడా! ఈ మహాజనులలో నన్యోన్యముగా సంమర్దముచే వియోగము విశేషంబుగా కలుగుచున్నది. దానికి నేనొక యుక్తిని చెప్పెదను. నీవు దానినివిని యట్లుచేయింపుము. తమసానదీతీరంబున మంగళంబగు మహాశాలనొకటిని పరికల్పించి, యచ్చట గొప్ప దుంధుభులచే మహాఘోషమును వినునట్లుచేసి, ఎవ్వరెవ్వరు వియోగమునందియుందురో వారందరును తమసానదీతీరమున శోభించుచుండు శాలను ప్రవేశించండి. అచ్చట మీవారిని చూచెదరుగాక. అని చాటించునది. మఱియు నచ్చటనే అన్యంబులని తెలియవచ్చు చతుష్పదాది సకలవస్తువులను పెట్టిపెట్టవలయు

గోస్తుత్రహి ॥ ౫౫ ॥ చతుష్పదాదివస్తూని జ్ఞాత్వాన్యస్యేతరాణ్యపి । తత్రైవస్థాపనీయాని స్వంస్వంగృహ్ణంతు తేజనాః ॥ ౫౬ ॥ ఇతిరామవచశ్శ్రుత్వా తథేత్యుక్త్వాసలక్ష్మణః । తథాచకారతత్సర్వం యేనయోగః పరస్పరం ॥ ౫౭ ॥ సర్వేతత్రజనాః ప్రాపుః స్వానాంస్త్రీబాలమంత్రిణాం। చతుష్పదాదివస్తూనాం తత్రలాభోబభూవహ ॥ ౫౮ ॥ యత్కించిద్విస్మృతంయేన తద్దృష్ట్వాన్యేనవైతదా । శాలాయాంస్థాపితందృష్ట్వా స్వీయంజగ్రాహతత్రసః ॥ ౫౯ ॥ ఏవంశ్రీరామయజ్ఞేహి సంమర్దస్సంబభూవహ । నతత్రశుశ్రువేశబ్దః కర్ణేఽప్యుక్తోజనైస్తదా ॥ ౬౦ ॥ తతస్తేపార్థివాస్సర్వే తస్థుర్వాసనసద్మసు ॥ ౬౧ ॥ ఇతిశ్రీమదానందరామాయణే వాల్మీకీయే యాగకాండే తృతీయస్సర్గః ॥ ౩ ॥

శ్రీరామదాస ఉవాచ—అథతేఋత్విజస్సర్వే మంగళైర్వివిధైశ్శుభైః । సమ్యక్ప్రవర్తయామాసు ర్వాజిమేధంయథావిధి ॥ ౧ ॥ తత్రర్త్విజో వాజిమేధ రత్నకౌశేయవాససః । ససదస్యావిరేజుస్తే యథావృత్రహణోధ్వరే ॥ ౨ ॥ ఏతస్మిన్నంతరేతత్ర సురేశసహితైస్సురైః । స్వామినావిఘ్నరాజేన పార్వత్యావృషభస్థితః ॥ ౩ ॥ మహేశ్వరోయజ్ఞవాటం రామాహూతోయయాగతః । శివమాగతమాజ్ఞాయ ప్రత్యుద్గమ్యాథలక్ష్మణః ॥ ౪ ॥ వారణేంద్రంపురస్కృత్య పతాకాధ్వజతోరణైః । నానావాద్యనుఘోషైశ్చ వారస్త్రీణాంప్రవర్తనైః ॥ ౫ ॥ సంపూజ్యశంకరంభక్త్యా చానయామాసమంటపం । పంచసప్తపదాన్యగ్రే గత్వారామోపిశంకరం ॥ ౬ ॥ నమస్కృత్యసమా

ను. ఎవరిసొమ్మును వారు వచ్చిగొనిపోదురుగాక" అని యాజ్ఞాపింపగా నట్లేయని లక్ష్మణుఁడు యథోక్తంబుగా చేయించెను. సర్వజనులును అచ్చటచేరి వారివారిని స్త్రీబాలకాది జనులను కనుగొనిరి. చతుష్పదాది వస్తువులును దొరకుచువచ్చినవి. ఎవఁడైనను దేనినైనను మరచి విడిచిపోయినను ఇతరుఁడు దానినిచూచి యచ్చటనున్నగా తీసికొనుచుండును. ఇట్లు శ్రీరామ కృతయజ్ఞంబున సంమర్దకోలాహలము కలిగినది. చెవిని మాట్లాడినను ఒకరిశబ్దము మఱియొకరికి వినబడదు. అంత నచ్చటికివచ్చిన రాజులందరును గూడారంబులలో యథాసుఖంబుగానిలచిరి॥౩॥

శ్రీరామాశ్వమేధమునకు సపరివారముగా శంకరుఁడేతెంచుట.

తరువాత నచ్చటి ఋత్విక్కులందరును వివిధమంగళ కృత్యంబులతోడ యథావిధిగా నశ్వమేధయాగమును జరుపుచున్నవారలయిరి. ఆ వాజిమేధఋత్విక్కులు మణులుచెక్కిన పట్టుబట్టలను కట్టికొని సదస్యులతోడ ఇంద్రునియజ్ఞమున నున్నట్లు ప్రకాశించుచుండిరి. అంతలో నచ్చటికి సదేవేంద్రులగు దేవతలతోడ పార్వతీ గణపతులను వెంటదీసికొని వృషభారూఢుఁడై పరమేశ్వరుఁడు శ్రీరామునిచేత పిలువంబడి సగణుండుగా నేతెంచెను. శివుఁడు వచ్చుచున్న సంగతినివిని లక్ష్మణుఁడు భద్రగజమును ముందుపెట్టికొని ఛత్రధ్వజతోరణ పతాకలతోడ వెడలి యెదురుకొని నృత్తగీతవాద్యంబులు జరుగుచుండగా శివునిఁబూజించి యజ్ఞవాటమునకు పిలచికొనివచ్చెను. అప్పుడు శ్రీరాముఁడును ౫-౭ అడుగులు ముందుకువెడలి చం

లింగ్య విశ్వేశంగిరిజాయుతం । హైమాసనే సన్నివేశ్య హేమపాత్రే స్వహస్తతః ॥౭॥ పాదప్రక్షాళనం శంభోశ్చ
కార సీతయా ప్రభుః । హేమనిర్మితఝర్ఝర్యా మణిరత్నాదిచిత్రయా ॥౮॥ జలధారాం యథాయోగ్యాం ము
ముచే హ్యథ జానకీ । తతస్తే రాఘవం సీతాం దృష్ట్వా దేవగణాస్తదా ॥౯॥ అనిమేషాః కంజనేత్ర కటాక్షాన్ సన్నివేశ్య
హి । తయోశ్చిత్రోపమా ఆసన్ న విదుః కేవయంత్వితి ॥౧౦॥ తుష్టువుస్తత్ర కేచిత్తే సురాః శ్రీరాఘవం యదా । జాన
కీం తుష్టువుః కేచిత్ ప్రబద్ధకరసంపుటాః ॥౧౧॥ ఏవం నిర్జరసంఘానాం సంతోషస్తత్ర వై హ్యభూత్ । అనుపమ్యం త
యోర్దృష్ట్వా రూపం కోటిరవిప్రభం ॥౧౨॥ అథ రామస్సీతయా హి శంకరం గిరిజామపి । స్వయం సంపూజ్య సకలాన్
దేవాన్ సౌమిత్రిణా క్రమాత్ ॥౧౩॥ పూజయిత్వాబ్రవీద్వాక్యం శంకరం లోకశంకరం । అద్యాధన్యోస్మ్యహం దేవ
దర్శనాత్తవ సీతయా ॥౧౪॥ అద్య మే సూర్యవంశేస్మిన్ జన్మసాఫల్యతాం గతం । ఇతి రామస్య వచనం శ్రుత్వా స శశి
భూషణః ॥౧౫॥ విహస్య రాఘవం ప్రాహ వేద్మి మాయాం హరే తవ । త్వన్నాభికమలే బ్రహ్మా జాతస్తస్మాన్మునీశ్వరాః ॥
౧౬॥ మరీచ్యాద్యాస్సంబభూవుః పౌత్రాస్తపమహౌజసః । మరీచేః కశ్యపః పుత్రః సృష్ట్యుత్పత్తివిధాయకః ॥౧౭॥
కశ్యపాత్సవితా జజ్ఞే పౌత్రసూనుస్తవ ప్రభో । రవేర్జాతస్సూర్యవంశస్తద్వంశే తవ జన్మ వై ॥౧౮॥ త్వద్వంశసంభ
వస్సూర్యః కిం మాం మోహయసి ప్రభో । దేవానాం కార్యసిద్ధ్యర్థం మవతీర్ణోసి మాయయా ॥౧౯॥ కురు క్రీడాం య

---

ద్రశేఖరుని వందించి యాలింగించి పార్వతీ పరమేశ్వరులను కనకసింహాసనమున కూర్చుండఁ బెట్టి తనచేతులతో బంగారుపళ్లెములో శివుని చరణకమలములను కడిగెను. సీతాదేవి రత్నాలంకృతమగు బంగారుగిండినుండి జలధారను విడిచెను. అట్టి సీతారాములనుచూచి దేవగణంబులు రెప్పవేయక కలువగన్నుల కటాక్షంబులను సీతారాములలో చేర్చి తామెవరను దానిని కూడనెఱుఁగక చిత్రపుబొమ్మలవలె నుండిరి. చేతులుజోడించికొని, కొందరు శ్రీరాముని కొందరు సీతాదేవిని కొనియాడుచుండిరి. ఇట్లు అసమానమగు సీతారాముల లావణ్యమునుచూచి దేవగణంబు లానందించుచుండినవి. పిదప శ్రీరాముండు లక్ష్మణునితోడ పార్వతీ పరమేశ్వరులను దేవతలను అందరిని తానే క్రమముగా పూజించి పూజచేయించి, లోకశంకరుండగు శంకరునితో “దేవా! నీ దర్శనము నేడుగల్గుటచేత సీతతోడ నేను ధన్యుఁడనైతిని. నేడు నాయొక్క యీ సూర్యవంశంబున నాజన్మము సఫలమయినది.” అని చెప్పెను. దానినివిని చంద్రశేఖరుఁడు నవ్వుచు రామునితో “శ్రీహరీ! నీమాయను నేనెఱుఁగుదును. నీ నాభికమలంబున బ్రహ్మపుట్టెను. వానినుండి మరీచ్యాది మహర్షులు మనుములుగా నేడుమంది యవతరించిరి. మరీచికి కశ్యపుఁడు సృష్ట్యాది విధాయకుఁడగు పుత్రుఁడు. కశ్యపునినుండి నీ ప్రపౌత్రుఁడగు సూర్యుఁడుపుట్టెను. రవినుండి సూర్యవంశమయ్యె. అచ్చట నీ యవతారముగలిగెను ప్రభూ! నన్నేల మోసపరచెదవు? నీవంశంబునపుట్టినవాఁడు సూర్యుఁడు కాఁడా? నీమాయచే దేవకార్యముకొఱకవతరించితివి. తీర్థయాత్ర యజ్ఞకర్మాది వినోదంబులచే యథేష్టముగా క్రీడించుము.

ఖేచ్ఛం త్వం యాత్రాయజ్ఞాదికౌతుకైః । శిక్షాం కరోషి లోకానాం వేద్మ్యహం చేష్టితం తవ ॥ ౨౦॥ ఇతి శ్రుత్వా శంభువాక్యం సీతారామౌ విహస్య చ । యజ్ఞకుండసమీపే తు తస్థతుర్గురుసన్నిధౌ ॥ ౨౧॥ ఏతస్మిన్నంతరే తత్ర సమాజగ్ముస్సహస్రశః । గంధర్వాః కిన్నరాః సిద్ధాస్తథా చాప్సరసాం గణాః ॥ ౨౨॥ లోకపాలాశ్చ దిక్పాలా రసాతలనివాసినః । నవగ్రహాష్షడృతవ ష్షష్టిసంవత్సరాణి చ ॥ ౨౩॥ ఋక్షాణి తిథయో యోగాః కరణాని చ రాశయః । పర్వతాస్తరవస్సర్వే సాగరాశ్చ నదా అపి ॥ ౨౪ ॥ సరోవరాణి నద్యశ్చ వాప్యః కూపాః ఖగాదయః । ధృత్వా జంగమరూపాణి యయుస్తే యజ్ఞమంటపం ॥ ౨౫ ॥ సమాగతశ్చ సంపాతి గుహాకో మకరధ్వజః । సమాయయౌ స లంకాయా రాక్షసైశ్చ విభీషణః ॥ ౨౬॥ మానితా రాఘవేణాపి సర్వే తస్థుః ప్రపూజితాః । ప్రాంతికే స్థాపితాః పూర్వం తత్రైవాసన్ ప్లవంగమాః ॥ ౨౭ ॥ ఏతస్మిన్నంతరే తత్ర సమాయాతో మునీశ్వరః । కుంభోదరో మహాతేజా స్సీమాచారైర్విలోకితః॥ ౨౮॥ తం దృష్ట్వా భయభీతాస్తే సర్వే ప్రోచుః పరస్పరం । హా కష్టం పునరాయాత స్సోయం కుంభోదరో మునిః ॥ ౨౯॥ యాత్రాశ్రమో రాఘవస్య యస్మిన్మిత్రో బభూవ హ । యద్వాక్యాదశ్వమేధేపి సర్వేషాం సంబభూవ హ ॥ ౩౦ ॥ మహాన్ శ్రమోశ్వపృష్ఠే తు భ్రమతాం జగతీతలే । అధునాపి సమాయాతః కిమగ్రే వై పునస్త్వయం ॥ ౩౧॥ కరిష్యతి సతద్విద్మో రాఘవస్యాపి నిందకః । ఏవం నానావిధా వాచ స్సీమాచారగణేరితాః ॥ ౩౨ ॥ శృణ్వన్ కుంభోదరస్తూష్ణీం

నీనడతవలన లోకమును శిక్షించుచుందువు. నేనెఱుంగుదును.” అని చెప్పెను. ఇట్లు పలికిన పరమేశ్వరుని పలుకులనువిని శ్రీరామచంద్రుఁడు సీతాదేవియును నవ్వుచువెడలి యజ్ఞకుండసమీపమున గురుసన్నిధిలో కూర్చుండిరి॥ ౨౧ ॥ అంతలో నయ్యజ్ఞవాటికకు వేలకొలదిగా గంధ

అశ్వమేదావలోకమునకు, అమరాదులందరును వచ్చుట.

ర్వులు కిన్నరులు సిద్ధులు యక్షులు అప్సరసలు దిక్పాలకులు లోకేశ్వరులు పాతాళవాసులు నవగ్రహములు తిథివార నక్షత్ర యోగకరణ దినపక్ష మాసర్తు వత్సరాది కాలాభిమాని దేవతలు సాగరదేవతలు పర్వతదేవతలు వృక్షదేవతలు పక్షిదేవతలు వాపీకూప తటాకాది దేవతలు వీరందరును జంగమాకారంబులనుదాల్చి వచ్చుచుండిరి. సంపాతి గుహకుఁడు మకరధ్వజుండును లంకనుండి రాక్షసులతోడ విభీషణుఁడును వచ్చిరి. శ్రీరామునిచే నందరును సంమానింపఁబడి యథోచితాసనంబులలో కూర్చుండిరి. కపులను మొదట తనదగ్గిరనే కూర్చుండబెట్టెను.

కుంభోదరుఁడువచ్చి శ్రీరామునితో సంభాషించుట.

వారల ట్లేయుండిరి॥ ౨౭ ॥ అంతలో నచ్చటికి మునీంద్రుఁడగు కుంభోదరుండు వచ్చెను. వానిని సీమాచారులు (ఎల్లకావలివారు) చూచిరి. భయభ్రాంతులగువా రందరును పరస్పరముగా “అయ్యో! కష్టము! మరల నీకుంభోదరుఁడువచ్చెనే! వీనివల్లనేకదా శ్రీరామునికి తీర్థయాత్రాశ్రమగల్గినది! ఈ యశ్వమేధంబున నందరికి తొందరకలిగెను! అశ్వముపై భూమిని చుట్టివచ్చుచుండగా నెంతబరువెక్కినది! ఇప్పుడును వచ్చెనే, ఇఁక వీఁడేమిచేయునో! దానిని మేము

యయౌ యజ్ఞభువం ప్రతి । తదాగమనపూర్వం స సీతాచార్యైర్నివేదితః ॥ ౩౩ ॥ ధావద్భిర్వేపమానైశ్చ స్ఖలద్వాగ్భిస్త్వ రాన్వితైః । రామ రామ మహాబాహో హే లక్ష్మణ శృణు ప్రభో ॥ ౩౪ ॥ యాత్రా యజ్ఞశ్చ యద్వాక్యాత్కృతా యాతిస్స వై పునః । కుంభోదరో మునిశ్రేష్ఠో రామ త్వయ్యపి నిష్ఠురః ॥ ౩౫ ॥ తద్దూతవచనం శ్రుత్వా సర్వే తద్దర్శనోత్సుకాః । త్యక్త్వా స్వీయాని కర్మాణి స్వోత్తస్థుస్తద్దిదృక్షయా ॥ ౩౬ ॥ ఋత్విజో రామవస్సీతా సభయం మునితేజసా । కుంభోదరో యజ్ఞవాటం యయౌ సర్వైర్విలోకితః ॥ ౩౭ ॥ అతిఖర్వః స్థూలశిరాః శ్యామకర్ణస్సపాదుకః । స్థూలోదరో పింగనేత్రస్సకౌపీనో జటాధరః ॥ ౩౮ ॥ చీరవాసాః ఖర్వపాదః ఖర్వహస్తో మహామునిః । యువా కించిత్ శ్మశ్రుయుక్తో ధృతదండకమండలుః ॥ ౩౯ ॥ తం దృష్ట్వా సకలా లోకా భయం ప్రాపుః స్వచేతసి । పూర్వకర్మ చ సంస్మృత్య సంశ్రుత్య చ పరస్పరం ॥ ౪౦ ॥ ఏతస్మిన్నంతరే రామశ్శీఘ్రం ప్రత్యుజ్జగామ తం । సాష్టాంగం ప్రణిపత్యాథ కరే ధృత్వా తు మంటపం ॥ ౪౧ ॥ ఆనయామాస శ్రీరామో దదౌ హైమాసనం వరం । కుంభోదరో మునిశ్శీఘ్రం భూమౌ దండకమండలుం ॥ ౪౨ ॥ స్థాపయామాస చీరాణి ననామ రఘునాయకం । రామశ్శీఘ్రం కరాభ్యాం తం ప్రత్యుత్థాప్య మునీశ్వరం ॥ ౪౩ ॥ గాఢమాలింగ్య బాహుభ్యాం తతో మునిమభాషత । నాహం యోగ్యో వందనార్థం త్వయా రావణమారక ॥ ౪౪ ॥ ఇతి రామవచోరూపైర్బాణైస్సంతాడితో హృది । కుంభోదరస్తదోవాచ యజ్ఞవాటే రఘూత్తమం ॥ ౪౫ ॥

---

ఱుఁగము. అహా! వీఁడు శ్రీరామదూషకుఁడుగదా!" అని యిట్లు నానావిధంబుగా సీతాచారులు గుంపులుగుంపులుగా చెప్పికొనుచుండు మాటలను వినుచు నూరకె కుంభోదరుఁడు యజ్ఞభూమికివచ్చెను. వాఁడు వచ్చుచున్నసంగతిని మొదలే నిర్విణ్ణులై చింతతో పరుగెత్తుకొనివచ్చి నోట మాట లూడిపోవుచుండగా "రామ! రామ! మహాప్రభూ! ఓయి లక్ష్మణప్రభూ! ఎవనిమాటమీఁద తీర్థయాత్రయును యజ్ఞకర్మయును చేయబడెనో, అట్టి కుంభోదరమునీంద్రుండు వచ్చియున్నాఁడు. శ్రీరామా! నీయందును అతఁడు మిక్కిలి నిష్ఠురుఁడు." అని మొఱపెట్టిరి. ఆమాటలను విని సభికులందరును తద్దర్శనమునకై కుతూహలముతో స్వస్వకృత్యంబులను మాని లేచిరి. ఈమునివలన శ్రీరాముఁడును సీతయును ఋత్విక్కులును భయపడెదు. ఇట్లుండఁగా నప్పు డప్పటికి, పొట్టి మేను పెద్దతల నల్లని చెవులు పెద్దబొజ్జ పచ్చనికండ్లు జడలు మోటుకాళ్లు గుజ్జుచేతులు కుఱిమీసములు గడ్డము దండకమండలువులు పిటిచే ప్రకాశించునటువంటివాఁడును కౌపీన పాదుకాలంకృతుఁడును తరుణుఁడును నారబట్టలను తొడిగినవాఁడునగు కుంభోదరుఁడు అందరిచే చూడబడుచువచ్చెను. లోకులందరును వానినిచూచి మదిలో వెనుకటి వీనిచర్యను తలంచితలంచి వెరిచిరి. అంతలో నాసంగతి నెఱిఁగి శ్రీరాముఁడు తానేవచ్చి కుంభోదరునికి సాష్టాంగముగా నమస్కరించి హస్తలాఘవమునిచ్చి పిలచికొని యజ్ఞమంటపమున కనకపీఠమునిచ్చి సత్కరించెను. కుంభోదరుఁడు త్వరగా తన దండకమండలువులను వస్త్రములను నేలనునచి శ్రీరామునికి దండప్రమాణము చేసెను. త్వరగా రాముఁడు మునిని లేవ

రామరామమహాబాహో నకోపఃక్రియతాంమయి। అపరాధ్యస్త్వహంతేహి క్షమస్వరఘునాయక ॥౪౬॥ నమయా స్వార్థసిద్ధ్యర్థం దోషారోపఃకృతస్త్వయి। కృతఃపరోపకారార్థం తథాకీర్త్యైతవాపిచ ॥౪౭॥ శిక్షార్థంసకలాన్ లోకాన్ తత్ జ్ఞాతంచత్వయాపిహి।యథైతేమునయస్సర్వేత్వసత్రేన్ననిర్మితే ॥౪౮॥ శతశోభోజనంచక్రుస్తథా భుక్తంమయాపిచ । తదాకృతోమహాత్కీర్తిస్తవమేరఘునందన ॥౪౯॥ ఇతినిశ్చిత్యహృదయే మయాపూర్వం హితాయహి । లోకానాంచకృతోయత్నస్త్వయిదోషానుకీర్తనైః ॥౫౦॥ నోచేద్యాత్రాసముద్యోగః కథంరామ భవేత్తవ । యత్రయత్రచదేశేషు తీర్థేషూపవనేషుచ ॥౫౧॥ ఆశ్రమారామగ్రామేషు నదీవనగిరీషుచ । యేయే జనాశ్చసర్వత్ర నానాకర్మానుతత్పరాః ॥౫౨॥ తవదర్శనలాభస్తు తేషాంజాతస్సుఖప్రదః । తత్రాహంకారణం మన్యే చాత్మానంరఘునందన ॥౫౩॥ మమాయముపకారస్తు జనైస్సర్వత్రకీర్త్యతే । కుంభోదరప్రసాదేన ససీతా రామదర్శనం ॥౫౪॥ జాతంవిషయలుబ్ధానా మితి మేకృతకృత్యతా । జాతాసముంతతఃకీర్తి స్త్వయిదోషానుకీర్త నాత్ ॥౫౫॥ తవాపికీర్తిస్సర్వత్ర జాతాత్రరఘునందన । రామేశ్వరాశ్చసర్వత్ర రామతీర్థాన్యనేకశః ॥౫౬॥ యావద్భూమ్యాంప్రగీయేత తావత్కీర్తిస్తవాపిచ । అన్యచ్చలోకశిక్షాపి జాతామద్వాక్యకారణాత్ ॥౫౭॥ కుంభో దరేణమునినా రాఘవస్యమహాత్మనః। దోషారోపఃకృతఃపూర్వం కథంసోనభవిష్యతి ॥౫౮॥ స్వదోషపరిహారార్థం

నెత్తి భుజములచే నాలింగించి మునీంద్రునిని "రావణ బ్రహ్మహత్య చేసిన నేను నీచే వందనీయుఁడగుదునా?" అని వాక్యరములచే పొడిచెను. అప్పుడు కుంభోదరుఁడు శ్రీరామచంద్రునిం జూచి "శ్రీరామ! శ్రీరామా! మహాబాహూ! నామీఁద నీవు కోపపడవలదు. ఒకవేళ నేను అపరాధిగానుండిన నన్ను క్షమించి కావుము. నా స్వప్రయోజనమునకై నీయందు నేను దోషమునారోపించలేదు. నేను పరోపకారంబునకును నీకు కీర్తిగల్గుటకును చేసితిని. లోకశిక్షార్థమని నీవు నెఱిఁగియున్నావు. అట్లే యీమునీంద్రులందరును మీయన్నసత్రమునందు నూర్లకొలది భోజనము చేయుదురు. నేనునట్లే భుజించెదను. అయిన నందువలన మీ కేమి కీర్తిగల్గినట్లు? నాకేమిఫలము? ఇట్లని మదిని నిశ్చయించి లోకహితమునుకోఱి నేనుదోషానుకీర్తనము చేయఁదొడఁగితిని. అట్లుకాకపోయిన నీయాత్రాయజ్ఞంబులు నీకెట్లుగల్గును? నీయొక్క తీర్థయాత్రవలన సకలదేశంబులలోను తీర్థంబులలోను క్షేత్రంబులలోను ఆశ్రమంబుల లోను వనంబులలోను నదీతీరంబులలోను పర్వతములలోను గ్రామములలోను గల జనులకందరికిని నీదర్శనములభించినది. అందువల్ల నందరును సుఖించిరి. మఱియు, రామచంద్రా! ఇందుకు కారణము నేననియెఱింగెదను. నాయుపకారమును జనులు అంతట "కుంభోదరుని యనుగ్రహమువలన ఇంద్రియభోగానక్తులగు మాకు సీతారాముల దర్శనము లభించినది" అని సంతసించుచున్నారుగాన నేను ధన్యుఁడనయితిని, నీయందు దోషము నభివర్ణించుటచేత నంతట కీర్తిగల్గినది. రఘుపతీ! నీకును కీర్తిలభించినది. అంతట రామేశ్వర ప్రతిష్ఠలును రామతీర్థంబులును గ

రాఘవేణ మహాత్మనా । తీర్థయాత్రా కృతా పూర్వ మస్మాకం తారకాత్మనః ॥ ౫౯ ॥ ఇతి స్మృత్వా భయం చిత్తే సర్వత్ర జగతీతలే । కరిష్యంతి జనా యాత్రాం స్వదోషక్షాలనాయ హి ॥ ౬౦ ॥ త్వయి పూర్ణే పరంబ్రహ్మ దోషారోపః కథం భవేత్ । పద్మపత్రే జలస్పర్శో న ఘటేత యథా తథా ॥ ౬౧ ॥ యస్య భ్రూభంగమాత్రేణ బ్రహ్మాండప్రళయో భవేత్ । బ్రహ్మాండాంతర్గతాన్ జీవాన్ హరసి త్వం యదా ముహుః ॥ ౬౨ ॥ తదా దోషానురోపస్తే కిం ఘటేత జనార్దన । సర్వేషాం చక్షయో మృత్యు ర్దదాతి తవాజ్ఞయా ॥ ౬౩ ॥ తత్ర సంఖ్యా కృతా కేనా త్వయా దోషః కృత స్త్వితి । యథా చిత్రాణి కుడ్యే హి లిఖితాని సహస్రశః ॥ ౬౪ ॥ సంమార్జితాని తేనైవ తత్ర దోషో భవేత్కథం । తథా త్వమపి శ్రీరామ త్రిధాభూత్వా త్రిభిర్గుణైః ॥ ౬౫ ॥ సృష్టిం కరోషి రజసా సత్త్వరూపేణ పాలనం । తమోరూపేణ సంహారం విధివిష్ణుశివాత్మకః ॥ ౬౬ ॥ అస్మాభి స్త్వత్ప్రసాదార్థం తీర్థయాత్రా విధీయతే । తవ తీర్థైర్నస్తు కిం రామ తీర్థభూతగుణస్య చ ॥ ౬౭ ॥ సర్వతీర్థేషు ముఖ్యా యా కీర్త్యతే స్వర్ధునీ భువి । తవ దక్షిణపాదస్యాంగుష్ఠాగ్రాజ్జనితా తు సా ॥ ౬౮ ॥ తవాంఘ్రిరజసస్పర్శా త్పవిత్రా కీర్తితా భువి । తవ పాదరజోమిశ్రా దృశ్యతే ద్యాపి సా సితా ॥ ౬౯ ॥ రజాంస్యపి ప్రదృశ్యంతే ద్యాపి భాగీరథీజలే । ఇతి నానావిధై ర్వాక్యై స్తోషయామాస రాఘవం ॥ ౭౦ ॥ అష్టోత్తరశతం శ్రీమద్రామనామస్తవేన చ । స్తుత్వా రామం రాఘవేణ పూజితః స్థితవాన్మునిః ॥ ౭౧ ॥ రామోఽపి గురుసాన్నిధ్యే తస్థౌ సీతాసమన్వితః ॥

లినవి. అవి భూమిలో నుండు నంతవరకు నీకీర్తియుండును. మఱియు నావలన లోకశిక్ష చేసినట్లయినది. అదియెట్లనిన—"మహాత్ముండగు రాముని దోషమునే కుంభోదరుండు చెప్పి దూషించెనే, ఇఁక దోషములుచేసిన వాటివలన మాకు దూరణరాకమానునా! అట్టి రాముఁడే తీర్థయాత్ర చేసెను. ఇఁక మావంటి వారిబ్రతుకెంత?" ఇట్లని చెప్పికొనుచు మనమున లోకులు వెఱచుచుందురు. తమదోషములను పోగొట్టికొనుటకు తీర్థయాత్రలఁ జేయుదురు. శ్రీరామా! నీవు పూర్ణుఁడై పరబ్రహ్మగానుందువు. తామరాకుమీఁద నీళ్లంటనట్లు నిన్ను నా దూషణలంటవు. కనుబొమ నాడించి నంతమాత్రమున ప్రపంచప్రళయమగును. నీవు మాటిమాటికి జగదంతర్గత ప్రాణులను సంహరించుచుండు జనార్దనుఁడవు. అట్టినీకు నాదోషారోప మెట్లుకల్గును? నీయాజ్ఞచే మృత్యువందరికిని క్షయమునిచ్చుచున్నది. అప్పటనీచే దోషముచేయఁబడెనను లెక్కనేలపట్టవలెను? గోడమీఁద వివిధచిత్రములను వ్రాసి వాటిని వ్రాసినవాఁడే తుడిచివేసినపుడు గోడకేమికొఱంత? శ్రీరామా! అట్లే బ్రహ్మవిష్ణు శివాత్మకుఁడగు నీవు సత్త్వరజస్తమో గుణంబులచే మూఁడు ప్రకారములుగా నేర్పడి సృష్టి స్థితి సంహారములను చేయుచుందువు. మేము మీ సంతోషముకొఱకు తీర్థయాత్ర చేయుచున్నాము. పరిశుద్ధుఁడగు నీకు నీతీర్థములవలన నేమి ఫలము? సమస్త తీర్థంబులలో నుత్తమోత్తమంబగు దేవగంగ నీకుడికాలి బొటకినవ్రేలినుండి పుట్టినది. నీకాలిదుమ్ము నంటినందున భూమిలో మిక్కిలిపవిత్రముగానున్నది. ఆ నీపాదరజోమిశ్రంబై యిప్పటికిని అది తెల్లగానున్నది. భాగీరథిలో నీపాదధూళి యిప్పటికి నిసుకగా కను

నిజాసనేషు సర్వత్ర తస్థుస్తే సకలా[illegible]ః ॥ ౭౨ ॥ * ॥ ఇతి శ్రీమదానందరామాయణే వాల్మీకీయే యాగకాండే చతుర్థస్సర్గః ॥ ... ... ... ... ... ... ... ... ... ॥౪॥

శ్రీవిష్ణుదాస ఉవాచ—గురో తే ప్రష్టుమిచ్ఛామి తత్త్వం వద సవిస్తరం । కుంభోదరేణ మునినా యత్ స్తోత్రం సముదీరితం ॥ ౧ ॥ అష్టోత్తరశతం నామ్నాం రాఘవస్య శుభప్రదం । శ్రవణే తస్య మే ప్రీతి ర్జాతా త్వికథయస్వ తత్ ॥ ౨ ॥ * ॥ శ్రీరామదాస ఉవాచ—శృణు శిష్య మహాబుద్ధే సమ్యక్పృష్టం త్వయా మమ । అష్టోత్తరశతం నామ్నాం రాఘవస్య వదామ్యహం ॥ ౩ ॥ సర్వేశ్వరస్సర్వమయ స్సర్వభూతోపకారకః । సర్వేషాముపకారార్థం యస్సాకారో నిరాకృతిః ॥ ౪ ॥ సంభవత్యేవ లోకేస్మిన్ సంసారభయనాశనః । యదా యదా హి లోకానాం భయముత్పద్యతే తదా ॥ ౫ ॥ అవతీర్యాకరోచ్ఛ్రీమాన్ దుష్టదైత్యవిమర్దనం । మత్స్యకూర్మవరాహాది రూపైస్స్వపరమార్థదృక్ ॥ ౬ ॥ తత్కాలేషు చ సర్వేషు సర్వేషాముపకారకృత్ । సాధూనాం సముచిత్తానాం భక్తానాం భక్తవత్సలః ॥ ౭ ॥ ఉపకర్తుం నిరాకార స్సదాకారేణ జాయతే । అజోయం జాయతే నంతో విశ్రుతో భూతభావనః ॥ ౮ ॥ తదా తదావతరతి భక్తానామనుకంపయా । శ్రీరాఘో దేవదేవేశో లక్ష్మీనారాయణో విభుః ॥ ౯ ॥ అశేషైశ్శంఖచక్రాభ్యాం దేవైః బ్రహ్మాదిభిస్సహ । శేషో భూల్లక్ష్మణో లక్ష్మీ ర్జానకీ శంఖచక్రకే ॥ ౧౦ ॥ జాతౌ భరతశత్రుఘ్నౌ దేవాస్సర్వేపి వానరాః । అపరే పురవాసర్వేపి దేవానాం భయకారిణః ॥ ౧౧ ॥ తత్ర నారాయణో దేవ శ్శ్రీరామ ఇతి విశ్రుతః । సర్వలోకోపకారాయ భూమావస్వయమవాతరత్ ॥ ౧౨ ॥ ధ్యానమాత్రేణ దేవేశో మహాపాతకనాశకృత్ । కీర్తనశ్రవణాభ్యాం చ హత్యాకోటినివారణః ॥ ౧౩ ॥ కలౌ సంకీర్తనేనైవ సర్వపాపం వ్యపోహతి । రామ రామేతి రామేతి యే వదంత్యతిపాపినః ॥ ౧౪ ॥ పాపకోటిసహస్రేభ్య స్తానుద్ధరతి నాన్యథా । అష్టోత్తరశతం నామ్నాం తస్య స్తోత్రం వ

---

బడుచున్నది” ఇట్లు వివిధమగు స్తుతివాక్యములచే కుంభోదరుఁడు శ్రీరామచంద్ర పరబ్రహ్మను ప్రశంసించి అష్టోత్తరశత నామంబులచే పూజించి నిలచెను. పిదప శ్రీరాముఁడును సీతతోడ వసిష్ఠసన్నిధిలో తనపీఠమున కూర్చుండెను. జనులందరును సుస్థితులుగానుండిరి. ॥౪॥

## కుంభోదరమునికృత శ్రీరామస్తుతి.

తరువాత, వినుచున్న విష్ణుదాసుఁడు రామదాసునితో “స్వామీ గురువులవారూ! కుంభోదరుఁడు ఏయష్టోత్తర నామములచే శ్రీరాముని స్తుతించెనో వాటిని వినఁగోరెద” ననగా రామదాసుఁడు చెప్పుచున్నాఁడు—వినుము సన్మతియగు శిష్యుఁడా! చక్కఁగా నడిగితివి. సర్వేశ్వరుఁడును సర్వజ్ఞుండును సర్వమయుఁడును సర్వ భూతోపకారకుఁడును నిరాకారుఁడైనను సాకారుండునగు శ్రీరామ పరబ్రహ్మమూర్తి సర్వజనోపకారార్థముగా ఎప్పుడెప్పుడు భువనంబులకు భయముసంభవించునో అప్పుడు సంసృతి భయనాశనుఁడై యీలోకమున నవతరించుచున్నాఁడు. మత్స్య కూర్మ వరాహాది మహిమరూపంబులచే పరమార్థదృశుండగు శ్రీరాముఁడు నవతరించి దుష్ట దైత్యులను సంహరించి, ఆకాలంబులలో నంతట నందరికి

దాశ్యహం॥౧౫॥ అస్య శ్రీరామచంద్రనామాష్టోత్తర శతమంత్రస్య-బ్రహ్మఋషిః_అనుష్టుప్ ఛందః-జానకీవల్లభశ్శ్రీరామచంద్రో దేవతా- ఓంబీజం. నమశ్శక్తిః. శ్రీరామచంద్ర ఇతి కీలకం- శ్రీరామచంద్ర ప్రీత్యర్థే జపేవినియోగః- ఓంనమోభగవతే రాజాధిరాజాయ రామాయ పరమాత్మనే హృదయాయనమః- ఓంనమోభగవతే రాజాధిరాజాయ పంచాశద్వర్ణాత్మనే శిరసేస్వాహా- ఓంనమోభగవతే విద్యాధిరాజాయ హయగ్రీవాయ శిఖాయైవషట్- ఓంనమోభగవతే రఘునందనాయామితతేజసేకవచాయహుం-ఓంనమోభగవతే క్షీరాబ్ధిమధ్యస్థాయ నారాయణాయ నేత్రత్రయాయ వౌషట్- ఓంనమోభగవతే సత్ప్రకాశాయ రామాయ అస్త్రాయఫట్- ఇతిషడంగః- ఏవమంగులిన్యాసఃకార్యః- అథధ్యానం॥ శ్లో॥ మందారాకృతి పుణ్యధామ విలసద్వక్షస్థలం కోమలం। శాంతంకాంత మహేంద్రనీలరుచిరాభాసంసహస్రాననం॥ వందేహం రఘునందనం సురపతిం కోదండదీక్షాగురుం। రామంసర్వజగత్సుసేవితపదం సీతామనోవల్లభం॥ ౧౬ ॥ సహస్రశీర్ష్ణే వైతుభ్యం సహస్రాక్షాయతేనమః। నమస్సహస్రహస్తాయ సహస్రచరణాయచ॥ ౧౭ ॥ నమోజీమూతవర్ణాయ నమస్తేవిశ్వతోముఖ। అచ్యుతాయనమస్తుభ్యం

---

నుపకరించువాఁడై భక్తులకు భక్తవత్సలుండగుటచే సమచిత్తులగు సాధువులను ఉపకరించుటకై నిరాకారుఁడైనను సాకారుఁడుగా నేర్పడుచున్నాడు. అజుండునై జనించువాఁడు. అంతములేనివాఁడు. భూతభావనుఁడై సుప్రసిద్ధుఁడుగా నున్నాడు. క్షీరాబ్ధిలో దేవదేవుఁడై విభువగు శ్రీమన్నారాయణుఁడు అశేషులగు శంఖచక్ర బ్రహ్మాది దేవతలతోడ నప్పుడప్పు డవతరించుచున్నాడు. ఆదిశేషుఁడే లక్ష్మణుఁడయ్యె. లక్ష్మియే సీత. శంఖచక్రంబులే భరతశత్రుఘ్నులు. దేవతలందరును వానరులు. ఇట్లు మునుపవలెనే భయశాంతికై యవతరించిరి. అప్పట శ్రీనారాయణుఁడే శ్రీరాముఁడుగా సర్వలోకోపకారమునకై భూమి నవతరించెను. ధ్యానించినమాత్రమున మహాపాపంబులను పరిహరించును. కీర్తించుటచేతను వినుటచేతను రాముఁడు కోటిహత్యలదురితమును హరించుచున్నాడు. కలియుగంబున నామకీర్తనంబుచే పాపపరిహారకము. రామ రామ రామ యని ముమ్మారుపలికినమాత్రమున పాపాత్ములను సముద్ధరించుచున్నాడు. అట్టి శ్రీరాముని యష్టోత్తరనామస్తోత్రమును చెప్పెదను వినుము. • యథోక్తవిధిగా సంకల్పాంగన్యాసాదులనుచేసి, "కల్పవృక్షాకృతియును పుణ్యమందిరంబునగు విలసద్వక్షస్థలంబుగలవాఁడును కోమలుఁడును ఇంద్రనీలకాంతి కాంతుఁడును శాంతుఁడును సహస్రవక్త్రుఁడును ధనుర్దీక్షాచార్యుండును సర్వజగత్సేవితచరణుఁడును జానకీమనోవల్లభుఁడును దేవదేవుఁడునగు దశరథరాముని నేను వందించెద"నని ధ్యానించి క్రింది ౧౦౮ నామంబులను కీర్తించవలెను.

నమస్తే శేషశాయినే॥ ౧౮ ॥ నమోహిరణ్యగర్భాయ పంచభూతాత్మనేనమః । నమోమూల ప్రకృతయె దేవానాంహితకారిణే॥ ౧౯ ॥ నమస్తేసర్వలోకేశ సర్వదుఃఖనిషూదన। శంఖచక్ర గదాపద్మ జటామకుటధారిణే॥ ౨౦ ॥ నమోభర్గాయతత్వాయ జ్యోతిషాంజ్యోతిషేనమః। ఓం నమోవాసుదేవాయ నమోదశరథాత్మజ ॥ ౨౧ ॥ నమోనమస్తేరాజేంద్ర సర్వసంపత్ప్రదాయచ। నమఃకారుణ్యరూపాయ కైకేయీప్రియకారిణే ॥ ౨౨ ॥ నమోదాంతాయశాంతాయ విశ్వామిత్రప్రియాయతే। యజ్ఞేశాయనమస్తుభ్య నమస్తేక్రతుపాలక ॥ ౨౩ ॥ నమోనమఃకేశవాయ నమోనాథాయశార్జ్గిణే। నమస్తేరామచంద్రాయ నమోనారాయణాయచ॥ ౨౪ ॥ నమస్తేరామచంద్రాయ మాధవాయనమోనమః। గోవిందాయనమస్తుభ్యం నమస్తేపరమాత్మనే ౨౫ ॥ నమోవిష్ణుస్వరూపాయ రఘునాథాయతేనమః। నమస్తేనాథనాథాయ నమస్తేమధుసూదన॥ ౨౬ ॥ త్రివిక్రమనమస్తేస్తు సీతాయాఃపతయెనమః। వామనాయనమస్తుభ్యం నమస్తేరాఘవాయచ॥ ౨౭ ॥ నమోనమఃశ్రీధరాయ జానకీవల్లభాయచ । నమస్తేస్తుహృషీకేశ కందర్పాయనమోనమః॥ ౨౮ ॥ నమస్తేపద్మనాభాయ కౌసల్యాహర్షకారిణే। నమోరాజీవనయన నమస్తేలక్ష్మణాగ్రజ॥ ౨౯ ॥ నమోనమస్తేకాకుత్స్థ నమోదామోదరాయచ। విభీషణపరిత్రాతర్నమస్సంకర్షణాయచ॥ ౩౦ ॥ వాసుదేవనమస్తేస్తు నమస్తేశంకరప్రియ । ప్రద్యుమ్నాయనమస్తుభ్య మనిరుద్ధాయతేనమః ॥ ౩౧ ॥ సదసద్భక్తిరూపాయ నమస్తేపురుషోత్తమ । [illegible] నమస్తేస్తు సప్తతాలహరాయచ॥ ౩౨ ॥ ఖరదూషణసంహర్త్రే శ్రీనృసింహాయతేనమః। అచ్యుతాయనమస్తుభ్యం నమస్తేసేతుబంధక॥ ౩౩॥ జనార్దననమస్తేస్తు నమోహనుమదాశ్రయ। ఉపేంద్రచంద్రవంద్యాయ మారీచమథనాయచ ॥ ౩౪ ॥ నమోవాలిప్రహరణ నమస్సుగ్రీవరాజ్యద। జామదగ్న్యమహాదర్ప హరాయహరయెనమః॥ ౩౫॥ నమోనమస్తేకృష్ణాయ నమస్తేభరతాగ్రజ। నమస్తేపితృభక్తాయ నమశ్శత్రుఘ్నపూర్వజ ॥ ౩౬ ॥ అయోధ్యాధిపతేతుభ్యం నమశ్శత్రుఘ్నసేవిత। నమోనిత్యాయసత్యాయ బుద్ధ్యాదిజ్ఞానరూపిణే ॥౩౭॥ అద్వైతబ్రహ్మరూపాయ జ్ఞానగమ్యాయతేనమః।నమఃపూర్ణాయరమ్యాయ మాధవాయచిదాత్మనే॥౩౮॥అయోధ్యేశాయశ్రేష్ఠాయ చిన్మాత్రాయపరాత్మనే।నమోహల్యోద్ధారణాయ నమస్తేచాపభంగినే॥ ౩౯ ॥సీతారామాయ సేవ్యాయ స్తుత్యాయపరమేష్ఠినే । నమస్తేబాణహస్తాయ నమఃకోదండధారిణే॥ ౪౦॥ నమఃకబంధహంత్రేచ వాలిహంత్రేనమోస్తుతే। నమస్తే స్తుదశగ్రీవ ప్రాణసంహారకారిణే॥౪౧॥

## * శ్రీరామచంద్రాష్టోత్తరశతనామావళిః. *

సహస్రశీర్ష్ణేనమః
సహస్రాక్షాయనమః
సహస్రహస్తాయనమః
సహస్రచరణాయనమః
జీమూతవర్ణాయనమః
విశ్వతోముఖాయనమః
అచ్యుతాయనమః
శేషశాయినేనమః
హిరణ్యగర్భాయనమః
పంచభూతాత్మనేనమః(౧౦)
మూలప్రకృతయేనమః
దేవానాంహితకారిణేనమః
సర్వలోకేశాయనమః
సర్వదుఃఖనిషూదనాయనమః
శంఖచక్ర గదాపద్మజటాము
[illegible] మః
ధర్గాయనమః
తత్త్వాయనమః
జ్యోతిషాంజ్యోతిషేనమః
వాసుదేవాయనమః
దశరథాత్మజాయనమః (౨౦)
రాజేంద్రాయనమః
సర్వసంపత్ప్రదాయనమః
కారుణ్యరూపాయనమః
కైకేయీ ప్రియకారిణేనమః
దాంతాయనమః
శాంతాయనమః
విశ్వామిత్రప్రియాయనమః

యజ్ఞేశాయనమః
క్రతుపాలకాయనమః
కేశవాయనమః (౩౦)
నాథాయనమః
శార్ఙ్గిణేనమః
రామచంద్రాయనమః
నారాయణాయనమః
రామచంద్రాయనమః
మాధవాయనమః
గోవిందాయనమః
పరమాత్మనేనమః
విష్ణుస్వరూపాయనమః
రఘునాథాయనమః (౪౦)
నాథనాథాయనమః
మధుసూదనాయనమః
త్రివిక్రమాయనమః
సీతాయాఃపతయేనమః
వామనాయనమః
రాఘవాయనమః
శ్రీధరాయనమః
జానకీవల్లభాయనమః
హృషీకేశాయనమః
కందర్పాయనమః (౫౦)
పద్మనాభాయనమః
కౌసల్యాహర్షకారిణేనమః
రాజీవనయనాయనమః
లక్ష్మణాగ్రజాయనమః
కాకుత్స్థాయనమః

దామోదరాయనమః
విభీషణపరిత్రాత్రేనమః
సంకర్షణాయనమః
వాసుదేవాయనమః
శంకరప్రియాయనమః (౬౦)
ప్రద్యుమ్నాయనమః
అనిరుద్ధాయనమః
సదసద్భక్తిరూపాయనమః
పురుషోత్తమాయనమః
అధోక్షజాయనమః
సప్తతాలహరాయనమః
ఖరదూషణసంహర్త్రేనమః
శ్రీనృసింహాయనమః
అచ్యుతాయనమః
సేతుబంధకాయనమః (౭౦)
జనార్దనాయనమః
హనుమదాశ్రయాయనమః
ఉపేంద్రచంద్ర వంద్యాయ
నమః
మారీచమథనాయనమః
వాలిప్రహరణాయనమః
సుగ్రీవరాజ్యదాయనమః
జామదగ్న్యమహాదర్పహరా
యనమః
హరయేనమః
కృష్ణాయనమః
భరతాగ్రజాయనమః (౮౦)
పితృభక్తాయనమః

శత్రుఘ్నపూర్వజాయనమః
అయోధ్యాధిపతయేనమః
శత్రుఘ్నసేవితాయనమః
నిత్యాయనమః
సత్యాయనమః
బుద్ధ్యాదిజ్ఞానరూపిణేనమః
అద్వైతబ్రహ్మరూపాయనమః
జ్ఞానగమ్యాయనమః
పూర్ణాయనమః (౯౦)
రమ్యాయనమః
మాధవాయనమః
ఉదాత్మనేనమః
అయోధ్యేశాయనమః
శ్రేష్ఠాయనమః
చిన్మాత్రాయనమః
పరమాత్మనేనమః
అహల్యోద్ధారణాయనమః
చాపభంగినేనమః
సీతారామాయనమః (౧౦౦)
సేవ్యాయనమః
స్తుత్యాయనమః
పరమేష్ఠినేనమః
బాణహస్తాయనమః
కోదండధారిణేనమః
కబంధహంత్రేనమః
వాలిహంత్రేనమః
దశగ్రీవప్రాణ సంహారకారి
ణేనమః (౧౦౮)

అనంతశిరస్కుఁడవా! అనంతనయనుఁడవా! అనంతకరుఁడవా! అనంతపాదుఁడవా! మేఘశ్యాముఁడవా! సర్వాంతర్యామీ! షడ్భావవికారశూన్యుఁడవా! భుజగశయనుఁడా! బ్రహ్మాత్మకుండా! పృథివ్యప్తేజోవాయ్వాకాశస్వరూపుఁడవా (౧౦)! అనాదిమాయాస్వరూపుఁడా! దేవతలకు హితమును చేయువాఁడవా! సమస్త భువనంబులకును నియామకుఁడా! అందరిదుఃఖములను పరిహరించువాఁడా! శంఖచక్రగదాపద్మాయుధములను జడలను కిరీటమును ధరించినవాఁడవా! తేజస్స్వరూపుఁడా! పరమార్థసదాత్మకుఁడా! సూర్యరూపుఁడా! సర్వభూతాధివాసుఁడవా! దశరథనందనా (౨౦)! రాజరాజా! సమస్త సంపదలనిచ్చువాఁడా! దయాళూ! కైకేయికి మేలుచేసినవాఁడా! తపఃక్లేశసహనుఁడా! విషయసుఖాసంగుఁడవా! విశ్వామిత్రునికి ప్రియుఁడవా! యజ్ఞనియామకుఁడా! యజ్ఞపాలకుఁడా! స్వవశమునందు (క=బ్రహ్మ, అ=విష్ణు, ఈశ=రుద్రులు. గనుక కేశాః=త్రిమూర్తులనబడుదురు.) త్రిమూర్తులునుగలవాఁడా (౩౦) ఆశ్రయుఁడనా! శార్ఙ్గ ధనుస్సుగలవాఁడా! చంద్రునివలె లోకమున రమించువాఁడా! నరుని నుండిగల్గినవి నారంబులనగా నాకాశాది భూతంబులకు మార్గముగానుండువాఁడవా! ఆహ్లాదకంబగు రామనాముఁడా! లక్ష్మీపతీ! వేదవాక్కులచే తెలియఁబడువాఁడా! కార్యకారణవిలక్షణుఁడగు నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుఁడా! వ్యాపకస్వరూపుఁడా! రఘువంశమునేలినవాఁడా (౪౦)! రారాజా! మధుదైత్యుని సంహరించినవాఁడా! త్రివిక్రమావతారము చేసినవాఁడా! జానకీరమణా! వామనావతారుఁడా! దశరథరామావతారుఁడా! లక్ష్మీధరుఁడా! సీతాప్రియుఁడా! క్షేత్రజ్ఞరూపుఁడా! కామరూపుఁడా (౫౦)! కమలనాభుఁడా! కౌసల్యానందకరుఁడా! కమలాక్షుఁడా! లక్ష్మణునియన్నా! కకుత్స్థునివంశమున జన్మించినవాఁడా! లోకనామంబులు దరంబున గలవాఁడవా! విభీషణుని సంరక్షించినవాఁడా! సంహారసమయమున ప్రజల నాకర్షించువాఁడా సర్వభూతాధివాసుఁడవా! శివమిత్రుఁడా (౬౦)! ప్రబలుఁడా! తడలేనివాఁడవా (వ్యూహచతుష్టయమున మూడవమూర్తి నాల్గవమూర్తి) సదసత్తుల విభాగాత్మకుండా! పరమాత్మా! అధఃపతనరహితుఁడా! సప్తతాలములను కత్తరించినవాఁడా! ఖరదూషణలను సంహరించినవాఁడా! నృసింహావతారముచేసినవాఁడా! చ్యుతిలేనివాఁడా! సముద్రమునకు సేతువునుకట్టించినవాఁడా (౭౦)! సంహారమూర్తీ! ఆంజనేయాశ్రయుఁడా! చంద్రోపేంద్రాది వందితుఁడా! మారీచమారణుఁడా! వాలివిధ్వంసకుఁడా! సుగ్రీవునికి రాజ్యమిచ్చినవాఁడా! పరశురామునిగర్వమును పరిహరించినవాఁడా! దురితపరిహారకుండా! సచ్చిదానందాత్మకుఁడా! భరతునియన్నా (౮౦)! తండ్రియందు భక్తిగలవాఁడా! శత్రుఘ్నునియన్నా! అయోధ్యారాజధానికీశుఁడా! శత్రుఘ్న

అష్టోత్తరశతంనామ్నాం రామచంద్రస్యపావనం । ఏతత్ప్రోక్తంమయా శ్రేష్ఠం సర్వపాతకనాశనం ॥ ౪౨ ॥ ప్రచరిష్యతితల్లోకే ప్రాగ్యదృష్టవశాద్ద్విజ। తస్యకీర్తనమాత్రేణ జనాయాస్యంతిసద్గతిం॥౪౩॥తావద్విజృంభతేపాపం బ్రహ్మహత్యాపురస్సరం । యావన్నామాష్టకశతం పురుషోనహికీర్తయేత్ ॥ ౪౪ ॥ తావత్కలేర్మహోత్సాహో నిశ్శంకంసంప్రవర్తతే । యావచ్ఛ్రీరామచంద్రస్య శతనామ్నాంనకీర్తనం ॥ ౪౫ ॥ తావద్యమభటాః క్రూరాస్సంచరిష్యంతినిర్భయాః॥ యావచ్ఛ్రీరామచంద్రస్య శతనామ్నాంనకీర్తనం ॥ ౪౬॥ తావత్స్వరూపంరామస్య దుర్బోధంప్రాణినాంస్ఫుటం । యావన్ననిష్ఠయారామ నామమాహాత్మ్యముత్తమం ॥ ౪౭ ॥ కీర్తితంపఠితంచిత్తే ధృతంసంస్మారితంముదా । అన్యతశ్శృణుయాన్మర్త్య స్సోపిముచ్యేతపాతకాత్॥ ౪౮ ॥ బ్రహ్మహత్యాదిపాపానాం నిష్కృతింయస్తువాంఛతి । రామస్తోత్రంమాసమేకం పఠిత్వాముచ్యతేనరః ॥ ౪౯॥ దుష్ప్రతిగ్రహదుర్భోజ్య దురాలాపాదిసంభవం । పాపంసకృత్కీర్తనేన రామస్తోత్రంవినాశయేత్ ॥ ౫౦ ॥ శ్రుతిస్మృతిపురాణేతి హాసాగమశతానిచ । అర్హంతినాల్పాంశ్రీరామ నామకీర్తికలామపి ॥ ౫౧॥ అష్టోత్తరశతంనామ్నాం సీతారామస్యపావనం। అస్యసంకీర్తనాదేవ సర్వాన్కామాన్లభేన్నరః ॥ ౫౨॥పుత్రార్థీలభతేపుత్రాన్ ధనార్థీధనమాప్నుయాత్।స్త్రి

నిచే సేవింపబడినవాఁడా! త్రికాలాబాధ్యుఁడా! అవితథరూపుఁడా! అంతరంగజ్ఞానాత్మకుండా! స్వాతిరిక్తసత్తాశూన్యుఁడవా! విజ్ఞానముచేనంటఁదగినవాఁడా! నిండినవాఁడా!(౯౦)! మనోహరుఁడా! రమారమణుఁడా! జ్ఞానత్మకుండా! పురుషుఁడా! ఉత్తముఁడా! ప్రజ్ఞానమూర్తీ! పరబ్రహ్మమూ! అహల్యనుద్ధరించినవాఁడవా! శివచాపమును విరిచినవాఁడా! సీతారమణా (౧౦౦)! సకలసేవ్యుఁడవా! సకలస్తుత్యుఁడవా! పరమమగు స్వమహియందుండువాఁడా! శరకరుఁడా! కోదండపాణీ! కబంధహరణా! వాలినాశకా! రావణమారకా (౧౦౮) నీకు నూటయెనిమిది నమస్కారములు మఱియును నమస్కారంబులు. నన్నుద్ధరించి కావవే శ్రీరామచంద్రప్రభూ! అని యిట్లు చెప్పఁబడిన దురితహారంబగు శ్రీమద్రామాష్టోత్తరనామ స్తోత్రంబు ప్రాణుల యదృష్టానుసారంబుగా నాలోకంబున వర్తించుచున్నది. దానిని కీర్తించుటచేత జనులు సద్గతినందుదురు. ఈ యష్టోత్తరశతనామస్తోత్రమును కీర్తించకయుండువరకే బ్రహ్మహత్యాది పాపములుండును, యమభటులసంచారము నంతవరకే, అదివరకు శ్రీరామస్వరూపము తెలియదు, అనగా శ్రీరామనామకీర్తనముచే పాపభయములేదు, యమదూతభీతిలేదు, రామతత్వము తెలియును. అశ్రద్ధతోనయినను శ్రీరామనామమును పఠించినను విన్నను స్మరించినను దురితములు పరిహరించును. బ్రహ్మహత్యాది మహాపాపంబులకు పరిహారముకోరువారు. దీనినొకనెల పఠించవలయును. రామస్తోత్రము నొకమారు చదివినంతచేత దుష్ప్రతిగ్రహము దుర్భోజ్యము దురాలాపాదులు మొదలగువాటి దురితము హరించును. సకల వేదశాస్త్రపురాణాది సారస్వతజాతంబు శ్రీరామకీర్తనకు సాటికాదు. ఈ యష్టోత్తరనామకీర్తనచే పుత్రేచ్ఛగలవారు పుత్రు

యంలభతేపత్నీ వ్రతీ స్తోత్రపాఠ ప్రవాదినా ॥ ౫౩ ॥ కుంభోదరేణమునినా యేనస్తోత్రేణరాఘవః । స్తుతఃపూర్వం యజ్ఞవాటే తదేతత్త్వాంమయోదితం ॥ ౫౪ ॥ * ॥ ఇతి శ్రీమదానందరామాయణే వాల్మీకీయే యాగకాండే శ్రీరామనామాష్టోత్తర శతస్తోత్రంనామ పంచమస్సర్గః ॥ * ॥ ... ... ... ... ... ॥౫॥

శ్రీరామదాసఉవాచ—అథకుంభోదరేదివ్యే ఆసనోపరిసంస్థితే। యజ్ఞస్తంభేశ్యామకర్ణం బబంధుస్తేహి ఋత్విజః ॥౧॥ తస్యాంగానిసమస్తాని పృథఙ్మంత్రైర్యథావిధి । సంమంత్ర్యాపిశమిత్రాతం విహస్యర్ద్విజపుంగవాః ॥౨॥ తన్మాంసఖండైరాజ్యాక్తైర్హోమంచక్రుస్సువిస్తరం। తథానానావిధైర్ద్రవ్యైః స్సక్తుపాయసగోఘృతైః ॥౩॥ మధ్వాక్తతిలదూర్వాద్యైః స్సమిధాభిశ్చసాదరం ॥ గోఘృతేనవసోర్ధారాం వహ్నౌస్థూలామఖండితాం ॥౪॥ గోముఖేనోర్ధ్వబద్ధేన దదుర్మంత్రైస్సువిస్తరం । చిరకాలంహోమకుండే యావద్యజ్ఞసమాపనం ॥౫॥ తదాధూమచయైర్వ్యాప్తమాకాశంచసమంతతః । నాద్యాపిదృశ్యతేశుభ్రం నీలవర్ణంప్రదృశ్యతే ॥౬॥ చైత్రమాసేమహాపుణ్యేవసంతర్తౌసుఖావహే । ఏవంప్రవర్తయామాసు ర్వాజిమేధంమునీశ్వరాః ॥౭॥ ఇజతుర్యజ్ఞవిధినా వహ్నిహోత్రాదిలక్షణైః । ప్రాకృతైర్వైకృతైర్యజ్ఞై ర్ద్రవ్యజ్ఞానక్రియేశ్వరం ॥౮॥ ప్రత్యహంప్రాతరుత్థాయ రామచంద్రస్సుసీత,

లను ధనేచ్ఛగలవారు ధనమును కామేచ్ఛగలవారు కామమును, అందరును వారివారి యభిలాషలనంది యానందించెదరు. విష్ణుదాసా! నీకిట్లు కుంభోదరుండుచెప్పిన స్తోత్రమును నిరూపించితిని॥ ... ... ... ... ... ... ౫॥

## అశ్వమేధముచే పరమేశ్వరుని నారాధించుట.

తరువాత కుంభోదరుఁడు రమ్యపీఠమున సుఖాసీనుఁడుకాగా, ఋత్విక్కులు శ్యామకర్ణం బగు యజ్ఞాశ్వంబును యూపస్తంభంబున బంధించిరి. శమితచే యథావిధిగా దాని యంగంబులను వెవ్వేఱుగా నభిమంత్రించి ఛేదించిరి. ఆ మాంసఖండంబులను ఆజ్యంబున తడిపి సవిస్తరముగా హోమముచేసిరి. అట్లే పిండి పాయసము గోఘృతము తేనెలోతడిపిన తిలలు గరికె మొదలైనవాటిచేతను సమిత్తులచేతను సాదరముగా నగ్నినారాధించిరి. పైనకట్టిన గోముఖముచే యజ్ఞపూర్తివరకు చిరకాలము అఖండితమగు గోఘృతవసోర్ధారను సమంత్రంబుగా సవిస్తరముగా నిచ్చిరి. అప్పుడంతటను గగనమున హోమధూమము వ్యాపించి యిప్పటికిని నభంబు నీలవర్ణంబుగా నగుపడుచున్నది. ఇట్లు సుఖకరంబగు వసంతచైత్ర శుక్లంబున వాజిమేధంబున కారంభించిరి. క్రతువిధి ననుసరించి యగ్నిహోత్రాది లక్షణంబులుగల ప్రకృతివికృతియజ్ఞంబులచే ద్రవ్యజ్ఞానక్రియేశ్వరుండగు పరమేశ్వరుని

## యజ్ఞ దినచర్యావర్ణనంబు.

నారాధించిరి॥ ౮ ॥ శ్రీరామచంద్రుఁడు నిత్యము ప్రొద్దునలేచి సీతతోడ శివ బ్రహ్మాది దేవతల

యా । నత్వాశంభుంవిధింశేషాన్ మునీంశ్చాపిపృథక్ పృథక్ ॥ ౯ ॥ కౌసల్యాదీశ్చమాతౄశ్చ కామధేనుంప్రదక్షి ణం । చింతామణింకౌస్తుభంచ కంఠబద్ధంరవిప్రభం ॥౧౦॥ పుష్పకంయజ్ఞవాటస్థ దేవానాంయజ్ఞపూరుషం। తతో గత్వారామతీర్థేన స్నాత్వారామోయథావిధి ॥ ౧౧ ॥ కృత్వానిత్యవిధింసర్వం పూజయామాసశం॥౧౨। ఉపహా రాన్ సమర్ప్యాథ కామధేనుసముద్భవాన్ ॥ ౧౨ ॥ సమానీతాన్ రత్నపాత్రైస్సీతయారఘునందనః । తతస్సం పూజ్యతాంధేనుం విధింపూజ్యసవిస్తరం ॥ ౧౩ ॥ ఋత్విగ్జనంతుసంపూజ్య తస్థౌసగురుసన్నిధౌ । ప్రభాతేఋత్వి జస్సర్వే తథాదేవామునీశ్వరాః ॥ ౧౪ ॥ స్నాత్వానిత్యవిధింకృత్వా తస్థుర్యజ్ఞస్యమంటపే । రామాజ్ఞయాథసౌమి త్రిస్తేషాంపూజాంచకారసః ॥౧౫॥ దివ్యైర్నానోపహారాద్యైః కామధేనుసముద్భవైః । తతశ్చకారసౌమిత్రిర్నృ పాదీనాంప్రపూజనం ॥౧౬॥ వస్త్రైరాభరణైర్దివ్యైః పక్వాన్నైర్వివిధైరపి । తథాసీతాజ్ఞయాప్రీణా మూర్మిలా లక్ష్మణప్రియా ॥ ౧౭ ॥ మాండవీశ్రుతకీర్తీశ్చ సర్వాశ్చక్రుఃప్రపూజనం । అథతేఋత్విజశ్చక్రుః స్వాహాకారైర్యథా విధి ॥ ౧౮ ॥ హోమంనానావిధైర్దివ్యైస్సుగంధైర్యజ్ఞమంటపే । పురోడాశాన్స్వాదివ్యాన్ నశ్నన్ రామోపిసీత యా ॥౧౯॥ వాజిమేధేరాఘవస్య సాక్షాద్దేవాస్స్వయంముదా । హవిః పిభక్షయామాసు స్తర్కక్తమాత్రాణి వైవకే, ౨౦ ॥ అస్తుశ్రౌషడితిప్రోచు ర్వాద్యఘోషస్సమేఘవత్ । శ్రూయతేయజ్ఞశాలాయాం సర్వత్విగ్భిఃకీర్తితః॥

కు నమస్కరించి మునుల నభివందించి వెవ్వేఱుగా కౌసల్యాది తల్లులకు ప్రణమించి కామధే నువునకు కంఠమునందుండు కౌస్తుభ చింతామణులకు మ్రొక్కి పుష్పకమును యజ్ఞవాటికను యజ్ఞపురుషునినివందించి, పిదప రామతీర్థమునకు వెడలి యథావిధిగా స్నానముచేసి నిత్యాహ్ని కకృత్యమును నిర్వర్తించి శ్రీ సాంబశంకరస్వామిని సీతతెచ్చిన రత్నపాత్రంబులలో కామధేను కల్పితంబులగు నుపహారంబులచే నారాధించి, కామధేనువును పూజించి ఋత్విగ్జనులను సత్క రించి గురుసన్నిధానమున సుఖాసీనుండగుచుండును. తెల్లవారగా నంతట ఋత్విక్కులు నట్లే దేవతలు మునీంద్రులును స్నానముచేసి కాల్యకృత్యమునాచరించి యజ్ఞమంటపమున సంప్రవిష్టులై యుపవిష్టులగుచుండిరి. శ్రీరామాజ్ఞచే లక్ష్మణుడు కామధేనూద్భవంబులగు వి విధసత్కారంబులచే వారినందరి నారాధించుచుండును. పిదప లక్ష్మణుడు వస్త్రాభరణవివిధ పక్వాన్నములచే నృపాదులను సత్కరించును. అట్లే సీతమ్రొక్క ఆజ్ఞాప్రకారము ఊర్మిళా మాండవీ శ్రుతకీర్తులందరును పూజించుచుండును. అంతనా ఋత్విక్కులు దివ్యపరిమళ హవి ర్ద్రవ్యంబులచే యథావిధిగా స్వాహాకారములతోడ హోమమమాచరించెదరు. మఱి సీతారా ములతోడ ఉత్తమపురోడాశంబులను భక్షించెదరు. శ్రీరాముని యశ్వమేధమున దేవతలు ప్ర త్యక్షముగావచ్చి హవిర్భాగములను అగ్నిలో నర్పించినమాత్రమున నాక్రమించుచుండిరి. యజ్ఞ శాలలో మేఘమువలె వాద్యములు మ్రోగుచుండగా నంతట ఋత్విక్కులు వేదశస్త్రంబుల నుచ్చరించుచుందురు. మంగళంబగు యజ్ఞకుండము ఋత్విగ్జనపరివృతంబై మధ్యభాగమున మ

౨౧ । మధ్యేకుండంమహారమ్యం వ్యాప్తమృత్విగ్జనైశ్శుభం । తతో మునీశ్వరాస్సర్వే తతో దేవాస్సమంతతః ॥ ౨౨ ॥ తతస్సర్వాః స్త్రియశ్శ్రేష్ఠా స్తతో విద్యాధరాః స్థితాః । తతో యక్షాశ్చగంధర్వాః కిన్నరాః ప్లవగోత్తమాః ॥ ౨౩ ॥ తతస్తే క్షత్రియాస్సర్వే తతస్తేషాంతుసేవకాః । తతః స్థితా వారనార్య స్తతో మాగధబందినః ॥ ౨౪ ॥ దదృశుస్సంస్థితా యజ్ఞమంటపే యజ్ఞకౌతుకం । మధ్యాహ్నావధిహుత్వాతే ఋత్విజశ్చసవిస్తరం ॥ ౨౫ ॥ తతో మాధ్యాహ్నికం కర్తుం యయుస్తాం సరయూనదీం । కృత్వామాధ్యాహ్నికం కర్మ గత్వాతుయజ్ఞమంటపే ॥ ౨౬ ॥ హైమాసనేతుసర్వత్ర నేమిరేఖోపమే స్థితాః । దేవాశ్చాపీశ్వరాద్యాస్తే తస్థుర్దివ్యాసనోపరి ॥ ౨౭ ॥ లక్ష్మణస్తాః ప్రపూజ్యాథ భరతేనసశత్రుఘ్నః । సంస్థాప్య హేమపాత్రాణి సర్వేషాంపురతస్తదా ॥ ౨౮ ॥ జానకీంత్వరయామాసుః పరివేషణకర్మణి । అథ సీతోర్మిళారమ్యా తథాసామాండవీశుభా ॥ ౨౯ ॥ శ్రుతకీర్తిర్మంత్రిపత్న్యః స్నుషాశ్చైవసహస్రశః । పరివేషణకర్మాణి చక్రుస్తాయజ్ఞమంటపే ॥ ౩౦ ॥ నానావిధైర్వరాన్నైశ్చ కామధేనుసముద్భవైః । మునీశ్వరాదికాస్సర్వే తోషమాపుస్తదాధ్వరే ॥ ౩౧ ॥ సీతాదీనాంహినారీణాం తదాయజ్ఞస్యమంటపే । నూపురాణాంకింకిణీనాం శుశ్రువేసర్వతోధ్వనిః ॥ ౩౨ ॥ యథేచ్ఛంభుంజతాంసర్వే యాచ్యతాంయద్యదీప్సితం । మాశంకాభోజనేకార్యా త్యక్తవ్యంయన్నరోచతే ॥ ౩౩ ॥ అయాచితానిదేయాని పక్వాన్నానియథారుచి । అఖండితాజ్యధారాత్ర కార్యారాఘవశాసనాత్ ॥ ౩౪ ॥ గృహ్యతాంకించిదూచుస్తే నేతినేతిద్విజాఃపునః । ఇతిభోజనకాలేవై శుశ్రువేసర్వతోధ్వ

నోహారంబుగానుండ నంతట నందరు మునీంద్రులును దేవతలును ఉత్తమసువాసినులును విద్యాధర యక్ష గంధర్వ కిన్నరులును వానరులును వారివెనుక క్షత్రియులు వారి సేవకులు వారాంగనలు వందిమాగధులు ఇట్లు సభామంటపమున సాలంకారులుగా కూర్చుండి యజ్ఞవిభవము నవలోకించుచుందురు. ఆ ఋత్విక్కులు మధ్యాహ్నమువరకు హోమవిధినాచరించి మాధ్యాహ్నికమునకై సరయూనదికిపోదురు. అచ్చట మాధ్యాహ్నికము నాచరించి యజ్ఞమంటపమునకువచ్చి కనకపీఠంబులపై సుఖాసీనులగుచుందురు. ఈశ్వరాది దేవతలును మునీంద్రులును దివ్యాసనంబులలో కూర్చుండగా, భరత శత్రుఘ్నులతోడ లక్ష్మణుఁడు వారినందరిని కూర్చుండబెట్టి అందరిముందరను సువర్ణపాత్రంబులను పెట్టి వడ్డించుటకు సీతను త్వరపరచెదరు. పిదప సీత ఊర్మిళ మాండవి శ్రుతకీర్తి మంత్రిపత్నులు మిత్రపత్నులు మొదలైనవారు వేలకొలదిగా కామధేను సృష్టంబులగు దివ్యపదార్థంబులను వడ్డించుచుందురు. మును లానందించి భుజించుచుందురు. సీతాది స్త్రీలయొక్క నూపుర కింకిణీధ్వను లంతట నిండియుండును. "శ్రీరామాజ్ఞచే నందరును యథేచ్ఛముగా భుజింపవలయును. మదిని కావలసినదాని నడుగవలెను. భోజనమున సంకోచింపవలదు. ఇష్టములేనిదానిని పరిహరింపనగును. యథారుచిగా పక్వాన్నములను అపేక్షించినట్లు వడ్డించవలయును. నేతిధారవిడువకపడవలెను." అని చెప్పఁబడుచుండును. వడ్డించువారు ఇంకకొంచము వడ్డించికొనుఁడనియును భుజించువారు వలదువలదనియును చెప్పెదు

నిః ॥ ౩౫॥ కించిదపేక్షితం స్వామిన్నితి రామేణ ప్రార్థితాః । చక్రుస్తే భోజనం సర్వే వీజితా వ్యజనాదిభిః ॥ ౩౬ ॥ జలైరుష్ణోదకైశ్చక్రుః కరశుద్ధిం మునీశ్వరాః । తతో గృహీతతాంబూలా మునయస్తే తు నిర్జరాః ॥ ౩౭ ॥ గృహీత్వా హేమముద్రాంహి రాఘవేణ పృథక్ పృథక్ । సమర్పితాం దక్షిణార్థం జగ్ముర్వాసస్థలాని హి ॥ ౩౮ ॥ తతః పూర్వోపచారాద్యైః క్షత్రియైరేవ పార్థివాః । చక్రుస్తే భోజనం సర్వే చక్రుర్వైశ్యాస్తతః పరం ॥ ౩౯ ॥ స్త్రీణాం భోజనశాలాసు పూర్వం భుక్త్వా వరస్త్రియః । సహితా మునిపత్నీభిస్తతస్తాః క్షత్రియస్త్రియః ॥ ౪౦ ॥ చక్రుర్వై భోజనం సర్వాస్సీతయా ప్రార్థితా ముహుః । తతో వైశ్యస్త్రియశ్చక్రుః పారవార్యస్తతః పరం ॥ ౪౧ ॥ తతశ్శూద్రస్త్రియశ్చాపి ముదా చక్రుశ్చ భోజనం । శాలాసు పురుషాణాం చ తతో వానరరాక్షసాః ॥ ౪౨ ॥ ఋక్షాః పౌరా జానపదాశ్చక్రుర్భోజనముత్తమం । తతశ్శూద్రాదయస్సర్వే తతః పార్థివసేవకాః ॥ ౪౩ ॥ న కశ్చిత్ క్షుధితస్తత్ర నాసీత్కస్యాపి షేధనం । తతో రామస్సుహృన్మిత్రైర్బాంధవైస్సచివాదిభిః ॥ ౪౪ ॥ చకార భోజనం స్వస్థస్సీతయా ప్రార్థితో ముహుః । యావంతో భూమికణికా యావంతస్తోయబిందవః ॥ ౪౫ ॥ యావంత్యుడూని గగనే తావంతో రాఘవాధ్వరే । ప్రత్యహం భోజనం చక్రుర్విప్రాద్యాస్తత్స్త్రియోపి చ ॥ ౪౬ ॥ శ్వశ్రూభిర్మంత్రిపత్నీభిస్తథా దేవరపత్నిభిః । చకార భోజనం సీతా దివ్యాన్నైః స్వస్థమానసా ॥ ౪౭ ॥ తతశ్చతుర్థప్రహరే సభాం కృత్వా తు మంటపే । కథాభిః కీర్తనైర్గీతైః శాస్త్రవాదైస్సుపుణ్యదైః ॥ ౪౮ ॥ వారస్త్రీణాం నృత్యగీతైః క్షేత్రైరామోదినక్షయం । తతస్సంధ్యాదికం కృత్వా

మాటలే అంతట వినఁబడుచుండును. నడుమనడుమ శ్రీరాముఁడు "స్వామీ! కొంచ మపేక్షిత మా" అని విచారించుచుండును. వ్యజనంబులచే విసరబడుచు యథాసుఖముగా నందరు భుజించెదరు. ఉష్ణోదకంబులచే నందరును చేతులు కడిగికొని, తాంబూలంబులనందికొని, శ్రీరామ ముద్రాంకితంబులగు సువర్ణనాణకంబులను దక్షిణగా నంగీకరించి వారివారి స్థలములకు పోవుచుందురు. పిదపనట్లే మొదటయుపచారంబులచే క్షత్రియులు భుజించెదరు. పిదప వైశ్యులును భుజించెదరు. స్త్రీలయొక్క భోజనశాలలలో మొదట మునిపత్నులతోడ దేవాంగనలు, పిదప క్షత్రియస్త్రీలు, పిమ్మట వైశ్యాంగనలును భుజించుచుందురు. మఱియు నట్లే పురుషశాలలో వానరులు రాక్షసులు ఋక్షులు పౌరులు జనపదమువారును భుజించెదరు. పిదప శూద్రులు మొదలగువారు రాజసేవకులును భుజించెదరు. అచ్చట నొకఁడైనను ఆకలిగొన్న వాఁడుండఁడు. ఒకనికిని నీకు భోజనము లేదను నిషేధము లేదు. పిమ్మట రాముండు బంధుమిత్ర సుహృత్సచివాదులతోడ సీతచే పలుమారు ప్రార్థింపఁబడి సుస్థితుఁడై భుజించును. శ్రీరామాశ్వమేధంబున ప్రతిదినమును ప్రపంచమున భూమిరేణువు లెన్నిగలవో జలబిందువు లెన్నిగలవో ఎన్ని నక్షత్రములు గగనమునగలవో అందరు బ్రాహ్మణాదిజనులును స్త్రీలును భుజించుచుందురు. ఇంతకన్న నతిశయమేమి? అత్తలతోడను మంత్రిపత్నులతోడను తోడికోడండ్రతోడ కలసికొని స్వస్థచిత్తయై సీత దివ్యాన్నములను భుజించును. అంత నాల్గవజామున సభ

పునఃపునస్త్వాయథావిధి ॥ ౪౯ ॥ పూర్వోక్తైస్తుకథాద్యైశ్చ నిశాయాః ప్రహరద్వయం । సమతిక్రమ్యనిద్రా ర్థంసర్వానాజ్ఞాపయత్తదా ॥ ౫౦ ॥ గత్వాస్వస్వస్థలంసర్వే నిద్రాంచక్రుర్యథాసుఖం । పట్టకూలాసనేధామ్యాం సీతయాసజితేంద్రియః ॥ ౫౧ ॥ ఒకారనిద్రాంశ్రీరామో హ్యదిచింత్యేష్టదేవతాః । అజ్ఞాభంగోనరేంద్రాణాంవిప్రా ణాంయూనఖండనం ॥ ౫౨ ॥ పృథక్శయ్యాచనారీణా మశస్త్రవధఉచ్యతే । అతస్ససీతయాయుక్తశ్చకారశయనంప్ర భుః ॥ ౫౩ ॥ ఏవమాసీత్ప్రత్యహంవై దినచర్యాధ్వరేప్రభోః ॥ ఇతిశ్రీమదానందరామాయణే వాల్మీకీయే యాగకాం డే యజ్ఞాంగక్రమిత దినచర్యావర్ణనంనామ షష్ఠస్సర్గః ॥ ... ... ... ... ... ॥౬॥

శ్రీరామదాసఉవాచ—సుత్యేహన్యవనీపాలో యాజకాన్సదసస్పతీన్ । అపూజయన్మహాభాగాన్ యథావత్సుసమాహితః ॥ ౧ ॥ అథచైత్రేసితేపక్షేరాజానఃప్రతిపత్తిథౌ । ధ్వజానారోపయామాసు ర్విధివాధ్వరమం టపే ॥ ౨ ॥ విష్ణుదాసఉవాచ—ఆరోపితాధ్వజాఃప్రోక్తా పార్థివైర్యజ్ఞమంటపే । గురోతేషాంవిధానంమాం సమ్యగ్వక్తుంత్వమర్హసి ॥ ౩ ॥ శ్రీరామదాసఉవాచ—సమ్యక్ప్రశ్నఃకృతశ్శిష్య త్వయాలోకోపకారకః । సావ ధానమనాభూత్వా శృణుష్వత్వంమయోచ్యతే ॥ ౪ ॥ సాంవత్సరంవ్రతంచేదం నృపైర్వృష్టౌసమాగతం । ఆరోపితా ధ్వజాస్సర్వైర్యజ్ఞమంటేతదాముదా ॥ ౫ ॥ వోచేద్విష్ణుగృహేష్వేవా రోపణీయాధ్వజానృభిః । ప్రత్యబ్దంమధుకు

చేసికొని శ్రీరాముఁడు నృత్తగీతవాద్య పుణ్యకథా పరిసంగాదులచే పగలను కడపుచుండును. ఆవెనుక సాయంసంధ్యాదికము నాచరించి మరల నగ్నిహోత్రమును సలిపి సత్కథాశ్రవణా దులచే రాత్రి రెండుజాములనుకడపి అందరి నానందముగా నిద్రించుట కాజ్ఞాపించును. వారు వారు యథాసుఖముగా స్వస్వస్థలములలో నిద్రించుచుందురు. శ్రీరాముఁడు సీతతోడ పట్టు మంచముపై హంసతూలికాతల్పంబున సానందనిద్ర ననుభవించును. రాజుల కాజ్ఞాభంగం బును విప్రులకు మానభంగంబును స్త్రీలకు వేఱుపడకయును శస్త్రములేని హింస చెప్పఁబడి యుండుటచే సీతారాములు ఏకశయ్యానిద్రితులై బరగుచుండిరి. మహాప్రభువగు శ్రీరాముని యొక్క యజ్ఞవిభవంబున నిట్లు దినచర్య జరుగుచుండినది॥ ... ... ౬॥

విష్ణు ధ్వజారోపణ వ్రత మహిమాభివర్ణనము.

సుత్యాహస్సునందనగా సోమరసమును పిండెడు పగటిలో శ్రీరాముఁడు యాజకులను సభ్యులలో పూజ్యులను సముచితంబుగా పూజించెను. పిదప చైత్రశుక్ల ప్రతిప త్తిథిలో నధ్వర మంటపంబున రాజులందరును యథావిధిగా ధ్వజములను సంస్థాపించిరి.అని చెప్పిన రామదాసునిని విష్ణుదాసుఁడు "గురూత్తమా! నృపోత్తములు యజ్ఞమంటపమున యథావిధిగా ధ్వజారోపణ ములను చేసినట్లు చెప్పితిరే, తద్విధానమును సవిస్తరముగా వినగోరుచున్నాను." అని ప్రా ర్థించెను. శ్రీరామదాసుఁడు చెప్పుచున్నాఁడు—శిష్యుఁడా! లోకోపకారకంబగు ప్రశ్నను బా గుగాచేసితివి. నేనుచెప్పెదను. శ్రద్ధతోవినుము. ఇది ప్రతిసంవత్సరమును చేయతగినవ్రతము

జ్ఞాయాం పుణ్యాయాంప్రతిపత్తిథౌ ॥౬॥ అథవారోపణీయాస్తే శ్రీరామనవమీదినే । మధుశుక్లదశమ్యాంవా దశమ్యామాశ్వినేసితే ॥ ౭ ॥ అథవోర్జప్రతిపది శుక్లపక్షేపిభోద్విజ । ఏతేకాలామయాప్రోక్తా ప్రతిస్యాస్యతివాగ్రతః ॥౮॥ అధునాసంప్రవక్ష్యామి ధ్వజారోపణసంజ్ఞితం । వ్రతంపాపహరంపుణ్యం రామసంతోషకారిణం ॥ ౯ ॥ యఃకుర్యాద్విష్ణుభవనే ధ్వజారోపణముత్తమం । సంపూజ్యతేవిరించాద్యైః మస్త్యైస్సహభాషితైః ॥ ౧౦ ॥ హేమభారసహస్రంతు యోదద్యాచ్చకుటుంబినే । తత్ఫలంసమవాప్నోతి ధ్వజారోపణకర్మణా ॥౧౧॥ ధ్వజారోపణతుల్యంస్యాన్నగంగాస్నానముత్తమం । అథవాతులసీసేవా శివలింగప్రపూజనం ॥ ౧౨ ॥ అహోపూర్వమహోపూర్వ మహోపూర్వంతమాత్తరం । సర్వపాపహరంకర్మ ధ్వజారోపణసంజ్ఞితం ॥౧౩॥ యానిపర్వాణివక్ష్యామి శృణుధ్వంగదతోమమ ॥౧౪॥ అథచైత్రేసితేపక్షే వ్రతంహిప్రతిపత్తిథౌ । మధుశుక్లదశమ్యాంవా నవమ్యాం రాఘవస్యవా ॥౧౫॥ కార్యంవాశ్వినమాసస్య దశమ్యాంశుక్లపక్షకే । ఊర్జశుక్లప్రతిపది దశమ్యాంవావిధీయతాం ॥ ౧౬ ॥ అవశ్యంచైత్రమాసేహి కార్యంచైతద్వ్రతోత్తమం । అతిక్రాంతేచైత్రమాసే కార్యంచేతరపర్వసు ॥ ౧౭ ॥ చైత్రశుక్లప్రతిపది ప్రభాతేప్రయతోనరః । స్నానంకుర్యాత్ప్రయత్నేన దంతధావనపూర్వకం ॥ ౧౮ ॥ తతఃకృత్వా నిత్యకర్మ పశ్చాద్విష్ణుంసమర్చయేత్ । చతుర్భిర్బ్రాహ్మణైస్సార్థం కృత్వాచస్వస్తివాచనం ॥౧౯॥ నాందీశ్రాద్ధం ప్రకు

---

అప్పు డచ్చట యజ్ఞవాటంబున సంతసమున నృపులు ధ్వజారోపణలనుచేసిరి. అట్లు కాకున్న నరులు విష్ణుదేవాలయంబులలో ధ్వజములను స్థాపింపఁదగును. ప్రతిసంవత్సరమునందును చైత్రశుక్లప్రతిపత్తునాఁడు, అదితప్పిన శ్రీరామనవమినాఁడు, అదితప్పిన చైత్రశుక్ల దశమినాఁడు, మఱియు విజయదమినాఁడు, అథవా కార్తికశుక్ల ప్రతిపత్తునాఁడు ధ్వజారోపణకు సముచితమగు కాలంబులు చెప్పఁబడినవి. ఇఁక శ్రీరామ సంతోషకారణంబును పవిత్రంబును దురితహారంబునగు ధ్వజారోపణ సంజ్ఞితంబగు వ్రతమును నిరూపించుచున్నాను. విష్ణుమందిరంబున నెవ్వఁడు ధ్వజారోపణముచేయునో వానిని బ్రహ్మాదులు పూజించెదరు. ఇఁక నితరు లెంతటివారుః కుటుంబియగు బ్రాహ్మణునికి వెయ్యిబారువలబంగారమును దానముచేసిన ఫలమును ధ్వజారోపణచేసినవాఁ డందగల్గఁడు. తులసీపూజనము శివలింగార్చనము గంగాస్నానముకూడ ధ్వజారోపణమునకు సమానముకాదు. ఆహా! ఉత్తమోత్తమంబగు నీ ధ్వజారోపణసంజ్ఞితవ్రతంబు సర్వపాప పరిహారకంబై యపూర్వముగానున్నది. దీనిసంగతులను చెప్పెదను వినుము. చైత్రశుక్ల ౧-౯-౧౦, ఆశ్వయుజశుక్ల ౧౦, కార్తిక శుక్ల ౧, వీట్లలో ముఖ్యముగా చైత్రశుక్ల ౧ నాఁడీవ్రతము నాచరించవలయును. చైత్రమాస మతిక్రమించితే తక్కిన కాలములలో నాచరించునది ॥౧౮॥ పుణ్యాపేక్షగలపు

### విష్ణుధ్వజారోపణ వ్రతాచరణ విధానము.

రుషుఁడు చైత్రశుక్ల ప్రతిపత్తునాఁడు ప్రయత్నపూర్వకముగా ప్రభాతమున శౌచవిధినాచరించి స్నానముచేసి నిత్యకర్మలను నిర్వర్తించి పిదప శ్రీ విష్ణుమూర్తి నారాధించునది. ఎట్లనిన; నలు

ర్కృత ధ్వజారోపణకర్మణి । ధ్వజస్తంభౌ చ గాయత్ర్యా ప్రోక్షయేద్వస్త్రసంయుతౌ ॥౨౦॥ పతాకయోర్లేఖనీయౌ వైనతేయాంజనీసుతౌ । సూర్యం చంద్రం మారుతిం చ వైనతేయం ప్రపూజయేత్ ॥౨౧॥ ధాతారం చ విధాతారం పూజయేత్కుంభకద్వయే । హరిద్రాక్షతదూర్వాద్యైశ్శుక్లపుష్పైర్విశేషతః ॥౨౨॥ తతో గోచర్మమాత్రం తు స్థండిలం చోపలిప్య తు । అథాయాగ్నిం స్వగృహ్యోక్త్యా ఘృతభాగాదికం క్రమాత్ ॥౨౩॥ జుహుయాత్పాయసేనైవ ఘృతేనాష్టోత్తరం శతం । ప్రథమం పౌరుషం సూక్తం విష్ణోర్నుకేన మంత్రతః ॥౨౪॥ తతశ్చ వైనతేయస్య స్వాహేత్యష్టాహుతీస్తథా । తథైవ మారుతేరష్టాహుతీః స్వాహేతి హావయేత్ ॥౨౫॥ సోమో ధేనుం సముచ్చార్య జుహుయాత్ప్రియతస్తదా । సౌరాన్మంత్రాన్ జపేత్తత్ర శాంతిసూక్తాని భక్తితః ॥౨౬॥ రాత్రౌ జాగరణం కుర్యాదుపకంఠం హరేశ్శుచిః । ఏవం నవదినం కార్యం పూజనం పరమోత్సవైః ॥౨౭॥ నవరాత్రం జాగరణం కుర్యాన్నిత్యం హరికీర్తనైః తతో దశమ్యాముషసి సముత్థాయ వ్రతీ శుచిః ॥౨౮॥ ప్రాతఃస్నాత్వా నిత్యకర్మ సమాప్యాథ పరిస్ఫురం । గంధపుష్పాదిభిర్దేవాన్ అర్చయేత్పూర్వవత్క్రమాత్ ॥౨౯॥ తతో మంగళవాద్యైశ్చ శుక్లపీఠైశ్చ శోభనైః । నృత్తైశ్చ స్తోత్రపఠనైర్నయేద్దేవాలయం ధ్వజం ॥౩౦॥ దేవస్య ద్వారదేశే వా శిఖరే వా ముదాన్వితః । సుస్థిరం స్థాపయేచ్ఛిల్పశ్రీ

---

గురు బ్రాహ్మణులతోడ స్వస్తివాచనమునాచరించి నాందీశ్రాద్ధముచేసి ధ్వజారోపణకర్మయందు వస్త్రాలంకృతంబులగు రెండు ధ్వజస్తంభంబులను గాయత్రీమంత్రముచే ప్రోక్షించవలయును. ధ్వజపతాకములయందు గరుడాంజనేయులను వ్రాయవలెను. సూర్య చంద్ర గరుడ హనుమంతులను పూజింపవలయును. రెండుకలశంబులలో ధాతృ విధాతృ దేవతలను పసపక్షతలు దూర్వలు మొదలైనవాటిచేతను విశేషముగా తెల్లనిపుష్పములచేతను పూజింపవలయును. పిదప గోచర్మమాత్ర స్థండిలముపరచి దానియందు స్వగృహ్యోక్త విధానముగా నగ్ని ప్రతిష్ఠించి ఘృతపాయసంబులచే హోమము చేయవలెను. అందులో ౧౦౮ ఘృతాహుతులు. మొదట పురుషసూక్తముచే విష్ణోర్నుకేన మంత్రముచే హోమముచేసి, పిదప వైనతేయునికి స్వాహాకారముతోడ నెనిమిదియాహుతులను మారుతికి నట్లే ౮ ఆహుతులను హోమముచేసి, సోమోధేనుం అనుమంత్రముచే హోమము చేయవలెను. భక్తితో నచ్చట సౌరమంత్రంబులను శాంతిసూక్తంబులను జపించవలయును. శ్రీవిష్ణు సాన్నిధ్యమున శుచిగానారాత్రి జాగరణము చేయవలయును. ఇట్లు ౯ దినములు పరమోత్సవంబులతో పూజింపవలయును. ౯ రాత్రులు హరికీర్తనచే జాగరవ్రతము చేయవలయును. అంతనావ్రతి దశమినాడులేచి శుచిస్నాతుడుగా స్నానముచేసి నిత్యకర్మానంతరము పూర్వమెట్లో అట్లు క్రమముగా గంధపుష్పాదులచే దేవతలనర్చించి, పిదప మంగళవాద్యంబులతోడను శుక్ల పీఠంబులతోడను శుభనృత్యంబులతోడను స్తోత్ర పఠనంబులతోడను ధ్వజమును దేవాలయమునకు తీసికొనిపోయి దేవద్వార దేశంబుననో శిఖరంబుననో సుస్థితుడై సంతోషముగా ధ్వజస్తంభం

ధ్వజస్తంభానుశోభితం ॥ ౩౦ ॥ గంధపుష్పాక్షతైర్దీపైర్నైవేద్యధూపైర్మనోరమైః । భక్ష్యభోజ్యైః సంయుక్తై స్తాంబూలైర్వస్త్రకైర్హరిం యజేత్ ॥ ౩౧ ॥ ఆ ప్రతిపదమారభ్య దశమ్యవధి సన్మని । ధ్వజయోః పూజనం కృత్వా తద్దశ్యాం నారోపయేత్ ॥ ౩౨ ॥ అథవా దశమ్యాం కుర్యాత్ పరతో వాయథాసుఖం । అథవా రోపణీయాహి దశమ్యాం తౌధ్వజౌ త్తమౌ ॥ ౩౪ ॥ నవమ్యాంవాద్వితీయాయాం చతుర్థ్యాంషష్టమీదినే । అష్టమ్యాం రోపణీయౌతౌ పూర్వ పూజ్యయథా విధి ॥ ౩౫ ॥ ప్రతిష్ఠప్రతిపద్యేవ ప్రారంభో నేతరే దినే । పూర్వోక్తేషు వారేషు ఏకాద్యై నను సిధ్యతి కేవల ॥ ౩౬ ॥ మాఘాసితచతుర్దశ్యా మేవంశంభోర్గృహే ధ్వజౌ । నందీభృంగ్యంకితౌ కృత్వా రోపణీయౌయథావిధి ॥ ౩౭ ॥ ఆశ్విన స్యసితాష్టమ్యాం మధోర్వాగిరిజాగృహే । నభస్యస్య చతుర్థ్యాంహి ప్రోక్తాగణపసద్మని ॥ ౩౮ ॥ మార్గశీర్ష శుక్లషష్ఠ్యా మేవ మార్తాండసద్మని । ఏవంహిసర్వదేవానా ముత్సాహ ఉత్సవేష్వపి ॥ ౩౯ ॥ మధూర్జాశ్వినమాసేషు వినావిష్ణోర్న చేతరే । ఏవందేవాలయే స్థాప్య శోధనా తౌధ్వజో త్తమౌ ॥ ౪౦ ॥ సంపూజ్య విష్ణు విధినిర్వర్తితాత్ప్ర విధాతతః । ప్రదక్షిణమనువ్రజ్య స్తోత్రమేతదుదీరయేత్ ॥ ౪౧ ॥ నమస్తే పుండరీకాక్ష నమస్తే విశ్వభావన । నమస్తేస్తు హృషీకేశ మహాపురుషపూర్వజ ॥ ౪౨ ॥ యేనేదమఖిలంజాతం యస్మిన్సర్వం ప్రతిష్ఠి

---

బులను స్థాపించవలయును. గంధ పుష్పాక్షత ధూప దీప భక్ష్య భోజ్యాది నైవేద్య తాంబూలాదులచే శ్రీహరి నర్చించవలయును. మఱియు, శుక్ల ప్రతిపత్తు మొదలు దశమి వరకు ౧౦ దినములింటిలో పూజించి పిదప నేనాదశినాడు ధ్వజారోపణచేయవచ్చును. దశమి నాడే స్థాపించినను స్థాపింపవచ్చును. అట్లే ద్వితీయనాడుకాని చతుర్థినాడుకాని షష్ఠినాడుకాని అష్టమినాడుకాని నవమినాడుకాని యథావిధిగా ప్రతిపత్తు మొదలుకొని యర్చించుచుండి శ్రీవిష్ణుమూర్తికెదుటగాని శిఖరమునగాని ధ్వజారోపణ చేయవచ్చును. ఈవ్రత ప్రారంభమునకు ప్రతిపత్తే ముఖ్యము. ఇతరదినములు కూడదు. ॥౩౬॥ మాఘకృష్ణచతుర్దశినాడే నందిభృం

## శివాలయాదుల యందును ధ్వజారోపణ కాలము.

గ్యంకితంబులగు ధ్వజంబులను యథావిధిగా నర్చించి స్థాపించవలయును. ఆశ్వయుజ శుక్లాష్టమినాడు చైత్ర శుక్లాష్టమినాడుగాని ఈశ్వరీదేవాలయంబునను, భాద్రపదశుక్ల చతుర్థినాడు గణపతిదేవాలయంబునను, మార్గశిరశుక్ల షష్ఠినాడు సూర్యసన్నిధానమునను, ఇట్లే సర్వదేవతలకును తత్తదుత్సవ దినంబులయందు తత్తద్దేవతామంత్ర తంత్రవిధానోక్తంబుగా ధ్వజారోపణవ్రతములచే తృప్తిని కలుగజేయఁదగును. చైత్రాశ్వినకార్తికంబులుతప్ప తక్కినవి విష్ణువుకు పనికిరావు. ఇట్లు మంగళధ్వజంబులను శ్రీవిష్ణు సన్నిధిలో సంస్థాపించి విత్తశాఠ్యములేక విధివిధానముగా విష్ణునారాధించి ప్రదక్షిణముచేసి యీస్తోత్రమును భక్తిపురస్సరముగా పఠించవలయును. హృదయస్థమగు పుండరీకమును వ్యాపించి యచ్చట నుపలక్షితుఁడగువాఁడా!

తం। లయమేష్యతియస్మై తత్ తం ప్రపన్నోస్మిమాధవం ॥ ౪౩ ॥ నజానంతిపరందేవం సర్వేబ్ర
హ్మాదయస్సురాః। ధ్యాయంతియోగినోయంవై తం వందేజ్ఞానరూపిణం॥ ౪౪ ॥ అంతరిక్షంతుప
న్నాభి ర్ద్యౌర్మూర్ధా యస్యచైవహి। పాదాచ్చాభూశ్చవై పృథ్వీతం వందేవిశ్వరూపిణం॥ ౪౫॥
యస్యశ్రోత్రాదిశస్సర్వా యచ్చక్షుర్దినకృచ్ఛశీ। ఋక్సామయజుషో యేన తంవందేబ్రహ్మరూపి
ణం॥ ౪౬ ॥ యన్ముఖాద్బ్రాహ్మణాజాతా యద్బాహ్వోరభవన్నృపాః। వైశ్యాయస్యోరుతో
జాతాః పద్భ్యాంశూద్రస్త్వజాయత ॥ ౪౭ ॥ మనసశ్చంద్రమాజాతో దినేశశ్చక్షుషస్తథా।
ప్రాణేభ్యఃపవనోజాతో ముఖాదగ్నిరజాయత ॥ ౪౮ ॥ పాపసందాహమాత్రేణ వదంతిపురు
షంతుయం। స్వభావవిమలంశుద్ధం నిర్వికారంనిరంజనం ॥ ౪౯ ॥ క్షీరాబ్ధిశాయినందేవ మనంత

## శ్రీవిష్ణుధ్వజారోపణాంగ శ్రీవిష్ణుస్తుతి.

పుండరీకాకారంబులగు నయనంబులుగలవాఁడవా! నీకునమస్కారము. ప్రపంచమును పుట్టించువా
డును గిట్టించువాడునగువాఁడా! అనాదిమూర్తీ! నీకు నమస్కారము. ఎవనిచే నీ సమస్తంబును
కలిగినదో, ఎవనియందు ఈ సర్వంబునున్నదో, ఇదంతయు నెచ్చట లయమునందునో, అట్టి
మాధవునికి నేను శరణాగతుఁడనైతిని. ఏ పరబ్రహ్మంబును బ్రహ్మాదిదేవతలుకూడ నెఱుఁగక
యున్నారో, ఎవనిని యోగులు నిరంతరము ధ్యానించుచుందురో, జ్ఞానాత్మకుండగు నట్టిదేవుని
వందించెదను. ఎవనియొక్క నాభి గగనంబో, స్వర్గమే శిరస్సో, పాదమునుండి భూమిగల్గెనో,
అట్టి విరాడ్రూపునికి నమస్కారము. సమస్తదిక్కులును ఎవనిచెవులో, సూర్యచంద్రు లెవనిక
న్నులో, ఎవనిచే ఋగ్వేద యజుర్వేద సామవేదంబు లుద్భవించెనో అట్టి పరబ్రహ్మకు నమ
స్కారము. ఎవనిముఖమునుండి బ్రాహ్మణులును, ఎవనిభుజములనుండి క్షత్రియులును, ఎవని
తొడలనుండి వైశ్యులును, ఎవనియంఘ్రులనుండి శూద్రులును, మనస్సునుండి వాయువును,
ముఖమునుండి యగ్నియును, పుట్టెనో - అట్టి విరాడ్రూపునికి నమస్కారము. మలమాయా
ర్మ పాశబద్ధంబగు సంసృతిపాశంబులను సందహించుటచేతనే పురుసంజ్ఞంబగు దేహంబున నం
తర్యామిగానిలచిన పురుషునినెవనిని ప్రకృతినిర్మలుఁడనియును కేవల పరిశుద్ధుఁడనియును ని
రవయవుఁడగుటచే సేవికారమును లేనివాఁడనియును నిస్సంగుఁడనియును జ్ఞానులభివర్ణించి చె
ప్పుచుందురో, అట్టివాఁడైన నాశములేనివాఁడును అంతరశత్రువులగు రాగాదులచేతను బా
హ్యశత్రువులగు రాక్షసులచేతను జయింపఁబడక యుండువాఁడును సాధువులగు భక్తులయం
దు ప్రీతిగలవాఁడును వ్యాపకుఁడును స్వానుభవైకానుసంధానప్రీతిచేతనే పొందతగినవాఁడును
అగు క్షీరాబ్ధిశయనస్వామిని నమస్కరించుచున్నాను. పృథివ్యప్తేజోవాయ్వాకాశంబులు శబ్దస్ప

మపరాజితం। సద్భక్తవత్సలంవిష్ణుం భక్తిగమ్యంనమామ్యహం ॥ ౫౦ ॥ పృథివ్యాదీనిభూతాని తన్మాత్రాణీంద్రియాణిచ । సుసూక్ష్మాణిచయేనాస న్తంవందేసర్వతోముఖం॥౫౧॥ యద్బ్రహ్మపరమంధామ సర్వలోకోత్తమోత్తమం । నిర్గుణంపరమంసూక్ష్మం ప్రణతోస్మిపునఃపునః ॥ ౫౨ ॥ నిర్వికారమజంశుద్ధం సర్వతోవహ్నిమీశ్వరం । యమామనంతియోగీంద్రా స్సర్వకారణకారణం॥ ౫౩ ॥ ఏకోవిష్ణుర్మహద్భూతం పృథగ్భూతాన్యనేకశః । త్రీన్లోకాన్ వ్యాప్యభూతాత్మాభుఙ్క్తే విశ్వభుగవ్యయః॥ ౫౪॥ నిర్గుణఃపరమానంద స్సమేవిష్ణుఃప్రసీదతు। హృదయస్థోపిదూరస్థో మాయయామోహితాత్మనాం। జ్ఞానినాంసర్వధర్మస్తు సమేవిష్ణుఃప్రసీదతు॥ ౫౫ ॥ చతుర్భిశ్చ చతుర్భిశ్చ ద్వాభ్యాంపంచభిరేవచ। హూయతేచపునర్ద్వాభ్యాం సమేవిష్ణుఃప్రసీదతు॥ ౫౬ ॥ జగద్ధితార్థంయోదేహమదధల్లీలయాహరిః। యమర్చయంతివిబుధా స్సమేవిష్ణుఃప్రసీదతు॥౫౭ ॥ జ్ఞానినాంకర్మిణాంచైవ తథాభక్తిమతాంనృణాం।గతిదాతావిశ్వభుగ్య స్సమేవిష్ణుఃప్రసీదతు॥౫౮॥

---

శబ్దరూప రసగంధంబులు శ్రోత్రత్వక్ చక్షుర్జిహ్వాఘ్రాణంబులు వాక్పాణిపాదపాయూపస్థలు మనోబుద్ధి చిత్తాహంకారంబులును ఎవనివల్లనయినవో సర్వపూర్ణుఁడగువానిని వందించెదను ఏపరబ్రహ్మము సర్వలోకోత్తమోత్తమంబును తేజోరూపంబును గుణరహితంబును అత్యంతసూక్ష్మంబునై యున్నదో అట్టి పరబ్రహ్మను మరలమరల వందించుచున్నాను. వికారరహితుండగు నేపరబ్రహ్మను సర్వలోకనియామకుండనియును శుద్ధుండనియును అనాదియనియున్ను నిండిన తేజస్సనియును జగత్కారణకారణుండనియును యోగీంద్రులు చెప్పుచుందురో, కేవలుండును జనార్దనుఁడునగు నేనారాయణుండు మహత్తత్త్వంబును వేర్వేఱైన పంచవింశతి భూతంబులను ముల్లోకంబులను వ్యాపించి తత్స్వరూపుఁడునై నాశములేనివాఁడగుచు అనుభవించుచున్నాఁడో, నిర్గుణుఁడగు నావిష్ణుమూర్తి నాకు ప్రసన్నుఁడగునుగాక. ఎవఁడు జ్ఞానులయొక్క సమస్తధర్మము తానైయుండునో, ఆవిష్ణుమూర్తి నాకు ప్రసన్నుఁడగుగాక. ప్రాజాపత్యదేవతాకంబులగు సప్తదశాక్షర మంత్ర శస్త్రంబులచే హోమము చేయఁబడు యజ్ఞనారాయణుఁడు నాకు ప్రసన్నుఁడగుగాక. జ్ఞానులకును కర్మఠులకును భక్తులకును సర్వాంతర్యామి యెవ్వఁడు సద్గతినిచ్చుచుండునో ఆవిష్ణు నాకు ప్రసన్నుఁడగుగాక. లోకహితముకొఱకు ఏ హరి నిజలీలచే దేహమును ధరించునో పండితు లెవనినర్చించెదరో, వాఁడు నాకు ప్రసన్నుఁడుకానిమ్ము. సత్పురుషు లెవ్వని నిత్యానందమూర్తియనియును సత్త్వరజస్తమోగుణంబులకు నాధారుండైనను స్వతోగుణములేక నిర్గుణుండనియును చెప్పంబడుచుండునో, వాఁడు నాకు ప్రసన్నుఁడుగానుండని. ఎవ్వఁడు పరమేశ్వరుఁడుగాను పరమానందమూర్తిగాను పరతత్త్వమువాఁది

...మమామనంతివైసంత స్సచ్చిదానం... ...చిన్మూపశ్చ... ...ః ప్రసీదతు ॥౫౯॥
...రేశః పరమానందః పరాత్పరతరః ప్రభుః ... ప్రసీదతు ॥ ౬౦॥
య ఇదం కీర్తయేన్నిత్యం స్తోత్రాణాముత్తమోత్తమం । సర్వపాపవినిర్ముక్తో విష్ణులోకే మహీయతే ॥౬౧॥ య ఇదం కీర్తయేద్విష్ణుం బ్రాహ్మణాంశ్చ ప్రపూజయేత్ । ఆచార్యం పూజయేత్పశ్చాద్దక్షిణాచ్ఛాదనాదిభిః ॥౬౨॥ బ్రాహ్మణాన్భోజయేత్పశ్చాత్ భక్తితస్స్వస్య భావనః । పుత్రమిత్రకళత్రాద్యైర్బంధుభిస్సహ వాగ్యతః ॥౬౩॥ కుర్వీత పారణం శిష్య నారాయణపరాయణః ॥౬౪॥ యస్త్వేతత్కురుతే కుర్వీత ధ్వజారోపణముత్తమం । తస్య పుణ్యఫలం వక్ష్యే శృణుష్వ సుసమాహితః ॥ ౬౫ ॥ వస్త్రం ధ్వజస్య సంబద్ధం యావచ్చలతి వాయునా । తావత్స్వపాపజాలాని నశ్యంత్యత్ర న సంశయః ॥ ౬౬ ॥ మహాపాతకయుక్తో వా యుక్తశ్చేత్సర్వపాతకైః । ధ్వజం విష్ణుగృహే కృత్వా సర్వపాపైః ప్రముచ్యతే ॥౬౭॥ యావద్దినాని వసతి ధ్వజో హరిగృహోపరి । తావద్యుగసహస్రాణి హరేస్సాయుజ్యమాప్నుయాత్ ॥ ౬౮ ॥ ఆరోపితం ధ్వజం దృష్ట్వా యేఽభివందంతి ధార్మికాః । తేఽపి సద్యో విముచ్యంతే మహాపాతకకోటిభిః ॥ ౬౯ ॥ ఆరోపితో ధ్వజః విష్ణుగృహే ధున్వన్స్వకం పటం । కర్తుస్సర్వాణి పాపాని ధునోతి నిమిషార్ధతః ॥౭౦॥ ఏవం శిష్య మయా ప్రోక్తం యథా పృష్టం త్వయానఘ । ధ్వజారోపణమాహాత్మ్యం సవిధానం మనోహరం ॥౭౧॥ సమాగతం ప్రతిపదం జ్ఞాత్వా చైత్రికే తాం న... । ఆరోపితా ధ్వజాస్సర్వే ద్వితీయాయాం పృథక్పృథక్ ॥ ౭౨॥

యవ్యక్తతత్త్వముగాను స్వతంత్రుఁడుగాను జ్ఞానరూపుఁడుగాను తెలియఁతగినవాఁడగునో అట్టి విష్ణుమూర్తి నాకు ప్రసన్నుఁడుకావలయును॥ ౬౦ ॥ ఎవఁడీ సర్వోత్తమమగు స్తోత్రంబు

## శ్రీవిష్ణు ధ్వజోత్సవస్తుతుల ఫలశ్రుతి.

ను పఠించునో వాఁడు సకలదురిత పరిహృతుఁడగును. విష్ణులోకము నందును. ఎవఁడు దీనిని పఠించునో వాఁడు బ్రాహ్మణులను పూజించి, పిమ్మట పురోహితునింబూజించి. దక్షిణాతాంబూలాదులతోఁడ బ్రాహ్మణసమారాధనంజేసి, భక్తితో సత్యవ్రతుఁడై పుత్రమిత్రకళత్రాదులతోఁడ పారణనాచరించవలయును. నారాయణభక్తి పరవశుండగు నెవ్వఁడీవ్రతమునాచరించునో వానికిగల్గు పుణ్యఫలమును చెప్పెదను వినుము. ధ్వజంబుననున్న వస్త్రంబెంతవరకు గాలికి చలించుచుండునో అంతలో వ్రతముచేసినవాని దురితంబుల్లు పరిహరించును. ఇందుకు సంశయములేదు. మహాపాపియైనను సకలపాపములను చేసినవాఁడైనను విష్ణుదేవాలయంబున ధ్వజారోపణముచేసి సర్వపాపముక్తుఁడగును. ఎన్నిదినములు విష్ణుమందిరమున ధ్వజముండునో అన్ని సహస్రయుగంబులు ధ్వజధారి విష్ణుసాన్నిధ్యము నందును. ఏమహాత్ములు ధ్వజారోపణమునుచూచి వందించెదరో వారును పాపముక్తులగుదురు. విష్ణుమందిరంబున సంస్థాపించిన ధ్వజము నిజపతాకమును వీచుచు ధ్వజారోపణచేసినవాని పాపములను విదలించుచున్నది. విష్ణుదాసా! ఇట్లు నీవడిగిన ధ్వజారోపణవిధానమును నిరూపించితిని. శ్రీరామాశ్వమేధ

జ్ఞాత్వా రామం మహా° ... దినంస్వస్వ వాసగేహేషుపూజనం ॥ ౨౩ ॥ ధ్వజస్య పూజనం గేహే వష ... థాశక్త్యనుసారం వా చైకరాత్రమథాపి వా ॥ ౨౪॥ యజ్ఞోత్సవదర్శనార్థం కృతమేకదినం ... చకార రాఘవశ్చాపి పూర్వమేవధ్వజోత్సవం ॥ ౨౫ ॥ మాఘమాసే కృష్ణపక్షే చతుర్దశ్యాం శివాగ్రతః । తదా ధ్వజైర్మహోచ్చైస్తైశ్శుశుభే గగనాంగణం ॥౨౬॥ ఇదం చరిత్రం పరమం మనోహరం । శ్రీమద్ధ్వజారోహణసంజ్ఞకం శుభం, పఠంతి శృణ్వంతి నరాస్సుపుణ్యదం భవేచ్చ తేషాం నియతం విచింతితం ॥ ౨౭॥

ఇతి శ్రీమదానందరామాయణే వాల్మీకీయే యాగకాండే ధ్వజారోహణవ్రతంనామ సప్తమస్సర్గః ॥ ... ॥౭॥

శ్రీరామదాస ఉవాచ—అథ చైత్రే సితే పక్షే నవమ్యాం రామజన్మని । తదావభృథస్నానాయ వాజిమేధ ఫలాప్తయే ॥ ౧ ॥ చకార సూచనాం రాజ్ఞే రాఘవాయ గురుస్స్వయం । త్వరయామాస తం రామం రవితాపభయాన్మునిః ॥ ౨ ॥ వసిష్ఠవచనం శ్రుత్వా రామో లక్ష్మణమబ్రవీత్, అద్యావభృథస్నానార్థ ముత్సవైర్గమనం మమ ॥ ౩॥ రామతీర్థం త్వయా జ్ఞాత్వా కరణీయం వ యోచ్యతే । ఆజ్ఞాపనీయా రాజానో సజస్సైన్యైర్గజాదిభిః ॥ ౪ ॥ సజ్జీభూతాస్సావరోధాస్తిష్ఠన్త్వమిత మంటపే, సిద్ధం కార్యం నిజం సైన్యం శిబికారథవారణః ॥ ౫ ॥ అశ్వపత్తిసమాయుక్తం తురంగోష్ట్రిగజైర్యుతం । నవవాద్యస్వనిః కార్య స్తూర్యాదీనాం స్వనోపిచ ॥ ౬ ॥ పతాకాశ్చధ్వజాశ్చాపి తోరణాదిసమంతతః । ముక్తాప్రవాళపుష్పాది హారాశ్చాధ్వరమంటపాత్ ॥ ౭ ॥ బంధనీయా రామతీర్థ పర్యంతం సైకతేపిచ, కదలీ

ముననచ్చియున్న రాజులందరును వేర్వేఱుగా తమతమయిండ్లలో ధ్వజములను ౯ రాత్రులు భక్తితో పూజ చేయందగును. యథాశక్తిగా నొకదినమైనను జరుపందగును. యజ్ఞోత్సవములను చూచుటకై యారాజులు ఒకదినమే చేసిరి. శ్రీరాముండును మొదట ధ్వజోత్సవంబొనరించెను. మాఘకృష్ణచతుర్దశినాడు శివసన్నిధిలో నారాజులచే పొడుగైనధ్వజములు నెట్టబడి గగనమున ప్రకాశించుచుండెను. ఈ మనోహరంబగు ధ్వజారోహణచరిత్రంబును చదివినవారు కూడ తప్పక వారి మనోరథములనందగలరు॥ ... ... ... ...౭॥

## శ్రీరామాశ్వమేధమున నవభృథస్నాన సన్నాహము

పిదప, చైత్రశుక్లనవమీ శ్రీరామ జన్మోత్సవదినమునందు అశ్వమేధయాగ ఫలావాప్తికొఱకై అవభృథస్నానముచేయుటకు శ్రీరామునికి గురువగు వసిష్ఠుండు సూచననిచ్చెను. ఎండలతిశయించునను భీతివలన త్వరపరచుచుండు వసిష్ఠులమాటమీద శ్రీరాముండు లక్ష్మణునితో "తమ్ముండా! ఇప్పు డవభృథస్నానమునకై యుత్సవంబులతోడ నేను వెడలవలయును. నీవు రామతీర్థము నెఱిఁగి చేయవలసిన పనియేమనిన—రాజులకందరికిని వారివారి సైన్యంబులతోడను రాణివాసంబులతోడను వారువారు యజ్ఞమంటపంబున సర్వసిద్ధులుగానుండునట్లు ఆజ్ఞాపింపుము. మన సైన్యమును రథగజతురగోష్ట్రి పదాతి యాన వాహనాదులతోడ సిద్ధముగానుండునట్లు చేయుము. నవవాద్యంబులు తుర్యాది ఘోషంబులతోడ మ్రోగుచుండని. యజ్ఞ

నాంమహాస్తంభా శ్చేక్షుదండాస్సమంతతః ॥ ౮ ॥ పుష్పాణాం వాటికాశ్చాపి వృత్తాన్తాద్యభినిర్మితాః । స్థాపనీయాశ్చసర్వత్ర నృత్యంతు వారయోషితః ॥ ౯ ॥ సేచనీయో రామతీర్థ మార్గశ్చందనవారిభిః । పుష్పైరాచ్ఛాదనీయో హి పట్టకూలాదిభిస్తథా ॥ ౧౦ ॥ అన్యచ్చాపి యథాయోగ్యం యన్నోక్తంచ మయాతవ । తత్కురుష్వాఖిలంచేవ సౌమ్యపృష్ట్వావిచారితం ॥ ౧౧ ॥ తథేత్యుక్త్వా లక్ష్మణోపి తథా సర్వం చకార సః । అథ తే ఋత్విజశ్చక్రు ర్గమనేష్టిం సవిస్తరం ॥ ౧౨ ॥ వాజివాహో రథే వహ్నిం పాత్రాణి స్థాప్య రాఘవం । సీతాంచారోహ్య సగురు శ్చారురోహర్త్విగ్జనైస్సహ ॥ ౧౩ ॥ మునయో దేవఘోషాంశ్చ సర్వే చక్రుస్సమంతతః । సమ్రాడ్రథముపారూఢ స్సదశ్వం రుక్మమాలినం ॥ ౧౪ ॥ యయౌ శనైశ్శనైర్మార్గే ముదా వందిజనైః స్తుతః । అగ్రే గజాః పతాకాభిః జగ్మురశ్వాస్తతః పరం ॥ ౧౫ ॥ తతస్తే తూర్యఘోషాణాం కర్తారస్తురగస్థితాః । తతస్తే రాజదూతాశ్చ చిత్రోష్ణీషాస్స్వదండినః ॥ ౧౬ ॥ తతో వందినటాద్యాశ్చ వారస్త్రీణాం తతో గణాః । తతో దేవాస్సగంధర్వా స్తతో రామస్ససీతయా ॥ ౧౭ ॥ ఋత్విగ్జనైర్యయౌ వహ్ని సంయుతః స్యందనస్థితః । తతో మునీశ్వరాస్సర్వే ఋషిపత్న్య స్తతో యయుః ॥ ౧౮ ॥ తతః క్షత్రియపత్న్యాద్యాః స్త్రియస్సర్వాశ్శనైర్యయుః । తతస్తే క్షత్రియాస్సర్వే నానావాహనసంస్థితాః ॥ ౧౯ ॥ తతస్సేనా హి సైన్యాని తతోన్యే రాజసేవకాః । నవవాద్యధ్వనీనాంచ వారణాద్యాస్తతః పరం ॥ ౨౦ ॥ తతశ్చోష్ట్రాస్తు బాణానాం శకటాశ్చ స్త్రీభూషితాః । లోహకారాస్తక్షకాశ్చ చర్మకారాస్తతః పరం ॥ ౨౧ ॥

మంటపమునుండి రామతీర్థమువరకు నిసుకలోను చిత్రధ్వజ పతాక తోరణ రత్నహారంబులను అలంకరించవలయును. పూలచెట్లు మట్టితోట్లును చెఱకుగడలును అరటిచెట్లును మార్గంబులలో సింగారింపఁబడని. నర్తనముజరుగని. రామతీర్థమార్గమున చందనరసము చల్లవలెను. పట్టుబట్టలనుపరచి పూలుజల్లవలెను. ఇంకను కావలసినపనులను నన్నడుగకయే యథాయోగ్యంబుగాం చేయింపుము." అనిచెప్పెను. లక్ష్మణుఁడు ఆజ్ఞయని సర్వమును నెరవేర్చెను॥ ౧౨ ॥

## శ్రీరాముఁడు మునులతోఁడ నవభృథస్నానముచేయుట.

తరువాత చక్కఁగా ఋత్విక్కులు గమనేష్టినొనర్చిరి. వసిష్ఠుండు అశ్వమేధయాగ రథమున నగ్నిని యజ్ఞపాత్రంబులను స్థాపించి సీతారాముల నెక్కించి తాను ఋత్విగ్జనులతోఁడ రథము నెక్కెను. అంతట మునీంద్రులు వేదఘోషంబుల నొనర్చుచుండిరి. పిదప సువర్ణాలంకృత సాశ్వరథమున శ్రీరామ మహారాజు వందిజనవందితుఁడై మార్గంబున తిన్నతిన్నగా వచ్చుచుండెను. ముందర ధ్వజాలంకృతంబగు గజంబులు పోవుచుండెను. చతుర్విధవాద్యములను వాయించుచు నశ్వారూఢులు వెడలిరి. వారివెనుక వెండి బంగారుకఱ్ఱల రాజదూతలు సాలంకృతులై వెడలిరి. వారివెనుక వందులు నటులు వారాంగనలు వరుసగా వచ్చుచుండిరి. అంత గంధర్వులను దేవతలను ముందుపెట్టుకొని శ్రీ సీతారాములు సఋత్విగగ్నిహోత్రంబులతోఁడ వచ్చుచుండిరి. వారివెనుక క్షత్రియాంగనలును వారివెనుక తక్కిన స్త్రీపరివారంబులును

భూమిమానప్రకర్తారో రజ్జుస్థాలధారిణః । యయుర్యథాక్రమంసర్వే తదైవంపరమోత్సవైః ॥ ౨౨ ॥ తదానినే దుర్వాద్యాని ననృతుర్వారయోషితః । మునిపార్థివపత్న్యస్తం వవర్షుః పుష్పవృష్టిభిః ॥ ౨౩ ॥ మాగధావందిజనాద్యాశ్చ తుష్టువూ రఘునందనం । పఠంతిస్వరాన్ గంధర్వాః ప్రజగుః పథితేముదా ॥ ౨౪ ॥ చక్రుస్తేవేదఘోషాంశ్చ మునయస్స్వరపూర్వకాన్ । ఏవంరామశ్శనైర్మార్గే కౌతుకానిపశ్యంతతః ॥ ౨౫ ॥ పశ్యన్ జనకనందిన్యా యయౌచామరవీజితః । తత్రరామస్యమార్గేహి సీతాయాముఖపంకజం ॥ ౨౬ ॥ ద్రష్టుంకోలాహలంచక్రుస్సంభ్రమాత్సకలాజనాః । తదాతాంస్తాడయామాసు శ్శతశోవేత్రపాణయః ॥ ౨౭ ॥ విశేషేణతదాసీతా మహాన్కోలాహలోఽభ్యజ । తత్సర్వంరాఘవోదృష్ట్వా ప్రత్యువాచప్రాహలక్ష్మణం ॥ ౨౮ ॥ ఏతేసర్వేపుష్పకస్థా జనాస్సీతాంచమాంసుఖం । పశ్యంతుఃలవహోమాస్తు తథాస్త్రీతిసలక్ష్మణః ॥ ౨౯ ॥ సర్వానారోహయామాస పుష్పకేతాన్ జనాన్ముదా । తతస్తేపుష్పకారూఢా జనారామంమనోరమం ॥ ౩౦ ॥ జానకీసహితంయాంతం దదృశుఃపథిశైశవైః । కేచిదూచుర్వయంధన్యాః పరిపూర్ణామనోరథాః ॥ ౩౧ ॥ అద్యరామంససీతంచ పశ్యామోఽత్రమహోత్సవే । కేచిదూచుశ్చతౌధన్యౌ పితరౌనస్సుజన్మదౌ ॥ ౩౨ ॥ యయోఃపుణ్యనయోరద్య నస్సీతారామదర్శనం । ఏవంగచ్ఛతిశ్రీరామే స్త్రియస్సర్వాఃపరస్పరం ॥ ౩౩ ॥ సంమంత్ర్యపుష్పకేస్థాతుం ప్రార్థయంతిస్మజానకీం । తదాసాజానకీప్రాహ లక్ష్మణంపురతఃస్థితం ॥ ౩౪ ॥ స్త్రియస్సర్వాస్త్వయాశీఘ్రం నారీశాలాసుపుష్పకే । ఆరోహణీయామైవంస్యాత్త్వా

ఆవెనుక, రాజులును వారి సైన్యంబులు ఇతర రాజసేవకులును నవవాద్యధ్వనులతోడ గజాదులును అమ్ములమొంటెలును శస్త్రశకటంబులును వారివెనుక కమ్మరులు వడ్లవాండ్రు చర్మకారులు రజ్జుకుద్దాలాదిధారులైన నేలగొలిచెడివారును, ఇట్లు యథాక్రమంబుగా నందఱును పరమోత్సవంబులతోడ వచ్చుచుండిరి. అప్పుడు వాద్యంబులు మ్రోగుచుండినవి. నర్తనంబులు జరుగుచుండినవి. మునిపత్నులును రాజపత్నులును సీతారాములమీఁద పూలవానగురిసించుచుండిరి. వందిమాగధులు కీర్తించుచుండిరి. గంధర్వులు గానము చేయుచుండిరి. మునులు సస్వరంబుగా వేదపారాయణంబుల నాచరించుచుండిరి. ఇట్లు శ్రీరాముఁడు సీతతోడ చామరవీజితుఁడై తిన్నగా దారిలోని వేడుకలనుచూచుచు వచ్చునపుడు, లోకులందఱును సీతారాముల ముఖపద్మంబులను చూచుటకై సంభ్రమమువలన త్రొక్కిసలాడి కోలాహలముచేయగా వారిని వేత్రపాణులు అదలించుచు కొట్టిరి. సర్వమును పరికించుచున్న శ్రీరాముఁడు వారి కోలాహలమునువిని లక్ష్మణుని «వీరినందరిని పుష్పకముమీఁద నెక్కింపుము. సంతోషముగా మమ్మును చూచుచుండవలె. కలహమువలదు." అని యాజ్ఞాపింపగా నతఁడట్లేచేసెను. పుష్పకారూఢులగు నాజనులందఱును తిన్నగావచ్చుచు రాజమార్గంబుల నలంకరించుచుండు శ్రీసీతారాములను తృప్తులై చూచుచు; కొందఱు మేము ధన్యులము సఫలమనోరథులము నేడిచ్చట మహోత్సవంబులతోడ శ్రీసీతారాములను చూచుచున్నాముకదా!" అనియును, మఱికొందఱు «ఇట్టి శ్రీ సీ

గ్గయంత్వత్రమాం ముహుః ॥ ౩౫ ॥ లక్ష్మణోపి తథేత్యుక్త్వా తాః స్త్రీస్సర్వాశ్చపుష్పకే । ఆరోహయామాస స్త్రీశాలాసు యథాసుఖం ॥ ౩౬ ॥ తతస్తాః పుష్పకారూఢా స్తృణజాలపటాంతరైః । దదృశుస్సీతయారామం వవర్షుః పుష్పవృష్టిభిః ॥ ౩౭ ॥ మృదంగశంఖపణవ ధుంధుర్యానకగోముఖాః । వాదిత్రాణి విచిత్రాణి నేదుశ్చావభృథోత్సవే ॥ ౩౮ ॥ నర్తక్యో ననృతుర్హృష్టా గాయకా యూథశో జగుః । వీణావేణుతంత్రీన్నాద స్తేషాం సదివమస్పృశం ॥ ౩౯ ॥ చిత్రధ్వజపతాకాఢ్యై రథేంద్రస్యందనార్వభిః । స్వలంకృతైర్భటైర్భూపా నిర్యయుర్ముక్తమాలినః ॥ ౪౦ ॥ యదుసృంజయకాంభోజ కురుకైకయకోసలాః । కంపయంతో భువం సైన్యై ర్యజమానపురస్సరాః ॥ ౪౧ ॥ సదస్యర్త్విగ్ద్విజశ్రేష్ఠా బ్రహ్మఘోషేణ భూయసా । దేవర్షిపితృగంధర్వా స్తుష్టువుః పుష్పవృష్టిభిః ॥ ౪౨ ॥ స్వలంకృతా నరానార్యో గంధస్రగ్భూషణాంబరైః । విలింపంత్యోభిషించంత్యో విజహ్రుర్వివిధైరసైః ॥ ౪౩ ॥ తైలగోరసగంధోదహరిద్రాసాంద్రకుంకుమైః । పుంభిర్లిప్తాః ప్రలిపంత్యో విజహ్రుర్వారయోషితః ॥ ౪౪ ॥ ఏవం నానాసముత్సాహైః శ్రీరామశ్చ ససీతయా । పశ్యన్నాకాశగాని స్యందనేనశనైశ్శనైః ॥ ౪౫ ॥ అగమత్సరయూతీరే రామతీర్థం శుభావహం । అవరుహ్య రథాద్రామ స్సీతయా సరయూజలే ॥ ౪౬ ॥ సచకార జలే స్నిగ్ధై ఋత్విగ్భిః పరివారితః । పత్నీసంయాజావభృథ్యైశ్చరిత్వా తే తమృత్విజః ॥ ౪౭ ॥ సర్వే రామం బ్రాహ్మణవిప్రా యజమానపురస్సరం । ఆచాంతస్నాపయాంచక్రు స్సరయ్వా సహసీతయా ॥ ౪౮ ॥ శత్రుఘ్నేన పురానీతై ర్నానాతీర్థజలైస్తదా । రామాభిషే

తారాములను దర్శించుభాగ్యముగల జన్మమునుమాకిచ్చిన తలిదండ్రులిరువురును మిక్కిలి ధన్యులు." అనియును చెప్పికొనుచుండిరి. ఇట్లు శ్రీరాముఁడు వచ్చుచుండగా స్త్రీలందరును తమలో తామాలోచించి పుష్పకమునెక్కుటకై సీతాదేవిని ప్రార్థించిరి. అప్పుడు సీత లక్ష్మణునింజూచి "నీవు ఈస్త్రీల నందరిని పుష్పకమున స్త్రీశాలలలోనుండునట్లు చేయుము."అని యాజ్ఞాపింప నతఁ డట్లే చేసెను. వారందరును యథాసుఖంబుగా కూర్చుండి జాలరుతడికెల రంధ్రములనుండి సీతారాములనుచూచుచు పూలవాన గురిపించిరి. అప్పుడు వీణా వేణు మృదంగ కాహళాది దివ్యవాద్యధ్వనుల నాదంబు దివమునందుచుండె. మంగళ నృత్తగీత వాద్యంబులు మహోత్సవంబుగానుండెను. యదుసృంజయ కాంభోజ కురు కైకయ కోసలాదినృపులు చిత్రధ్వజపతాక గజ రథాది రాజవిభవంబులతోడ సువర్ణరత్నాలంకృతులై యజమానుని వెంబడివచ్చునప్పుడు వీరి భారమునకు భూమి కంపించుచుండె. సదస్యులును ఋత్విక్కులును బ్రాహ్మణశ్రేష్ఠులును వేదఘోషముచే నాదబ్రహ్మమును ప్రత్యక్షపరచుచుండగా, దేవర్షి పితృ గంధర్వులు పుష్పవృష్టులచే తుష్టినందుచుండిరి. పుష్ప గంధ భూషణ వస్త్రంబులచే నలంకృతులగు నరులు నారులును గంధోదకము పసుపు కుంకుమలు గోరోచనాది నానారసములు తైలములు మొదలైనవాటిని పరస్పరముగా లేపించికొనుట అభిషేకించుట హాస్యములుచేయుట మొదలైన వినోదకృత్యంబుల నాచరించుచుండిరి. ఇట్లు జరుగుచుండు వేడుకల నీక్షించుచు శ్రీరాముఁడు రథా

కంతే చ ఋత్విజః ముదా మంత్రైరనీశ్వరాః ॥ ౪౯ ॥ దేవదుందుభయో నేదుర్నరదుందుభిభిస్సమం । ముముచుః పుష్పవర్షాణి దేవర్షిపితృమానవాః ॥౫౦॥ సస్నుస్తత్ర తతస్సర్వే వర్ణాశ్రమయుతా నరాః । మహాపాతకినశ్చాపి స్నాత్వా ముక్తా హి పాతకాత్ ॥౫౧॥ అథ రామో మహాతేజా మే పరిధాయ స్వలంకృతః । శుభే నితరాం దివ్య కంకణాభ్యాం సుమండితః ॥ ౫౨ ॥ కేయూరాభ్యాం కుండలాభ్యాం ముక్తాహారైర్విచిత్రితైః । నానాప్రసూనహారైశ్చ రత్నానాం నూపురాదిభిః ॥ ౫౩॥ హృది చింతామణియుతః కంఠే కౌస్తుభమండితః । చింతామణికౌస్తుభయోః ప్రభయా దీపితోదయః ॥ ౫౪ ॥ కోటిసూర్యప్రతీకాశ స్సీతాయాం వరాసనే । తస్థౌ జనకనందిన్యా ఋత్విగ్భిః పరివేష్టితః ॥ ౫౫ ॥ అథ ఋత్విగ్భ్యో ద్విజవరాత్తే యథా స్నాతం సదక్షిణాః । స్వలంకృతేభ్యో లంకృత్య గోభూతురగవారణాన్ ॥ ౫౬ ॥ కామధేనుమలంకృత్య గురుం దాతుం సముద్యతః । తత్ జ్ఞాత్వా చింతయామాస వసిష్ఠస్స్వచేతసి॥ ౫౭॥ అస్తి నూనం నందినీ నామ్నీ కామధేనుసుతా మమ । నాస్త్యాః ప్రయోజనం మేఽస్య హ్యత్రాపూర్వం కరోమ్యహం॥ ౫౮ ॥ అస్మై న దాస్యామి కామధేనుం రఘూత్తమః । ఏనాం త్యక్త్వా తు రామస్య కీర్త్యర్థం జగతీతలే॥౫౯॥ యాచామ్యహం శుభాం సీతాం సాలంకారాం సదక్షిణాం । దాతవ్యం రాఘవస్యాద్య దర్శయిష్యామ్యహం జనాన్॥ ౬౦ ॥ ఇతి నిశ్చిత్య స గురుస్తదా ప్రాహ రఘూత్తమం । కరోషి కిం ధేనుదానం తేనత్వష్టిర్న మే భవేత్॥ ౬౧ ॥ యది దాస్యసి దేహి మే సీతాలంకారమండితా । తయా తృప్తిర్భవేన్మేద్య నాన్యైర్నారీశతైరపి ॥ ౬౨ ॥ తన్నిశమ్య వచనం...

...ఘ్నుఁడై తిన్నగా వచ్చి సరయూతీరమున మంగళప్రదంబగు శ్రీరామతీర్థమును చేరి సీతతోడ రథమునుండిదిగి ఋత్విగ్జనపరివృతుఁడై వారితోడ జలేష్టికర్మ నాచరించెను. ఆ ఋత్విక్కులు పత్నీసంయాజావభృథ్య మంత్రవిధుల నాచరించి,అందరును మునులును యజమాన పురస్సరులై శత్రుఘ్నుఁడు తెచ్చిన నానాదేశంబులలోని దివ్య మంగళతీర్థ జలంబులచే సరయూనది లో వేదమంత్రంబుల నుచ్చరించుచు శ్రీ సీతారాములను అభిషేకించిరి. దేవదుందుభులు మానవదుందుభులతోడ మ్రోగుచుండినవి. దేవతలు పితృవులు మహర్షులు మానవులుకూడ పూలవానలం గురిపించిరి. అపుడు వర్ణాశ్రమాచారయుతులగు నరులందరును స్నానముచేసిరి. మహాపాపులుకూడ స్నానముచేసి తమ పాపములనుండి విముక్తులైరి. అపుడు శ్రీరాముఁడు అచ్ఛిద్రమగు వెలిపట్టువస్త్రముల నలంకరించికొని దివ్యకంకణ కేయూర కుండల ముక్తాహారాద్యాభరణంబులకు నిజ దేహకాంతి కాంతినిచ్చుచుండగా మిగుల ప్రకాశించుచుండెను. హృదయమున చింతామణి రత్నంబును కంఠమున కౌస్తుభరత్నంబును దేదీప్యమానంబై యుండగా వాటి కాంతులచే ప్రకాశోదయంబయి కోటిసూర్యులువలె వెలుఁగుచు,సికతాస్థలంబున దివ్యరత్న పీఠముపై సీతతోడ కూర్చుండి ఋత్విగ్జనులచే పరివృతుఁడై యుండెను॥

శ్రీరాముఁడు ఋత్విగ్జనులకు దానంబులనిచ్చుచు వసిష్ఠులకు సీతను దాన మిచ్చుట.

౫౫ ॥ అంత నక్కాలంబున స్వాలంకృతులగు ఋత్విగ్జనులకు గో భూ తురగ గజ హిరణ్యాది

త్వా వసిష్ఠస్య జనా స్తదా హాహాకార మహచ్చక్రు ర్విషణ్ణా భయవిహ్వలాః ॥౧౩॥ కేచిదూచుర్వసిష్ఠోఽయం కింభ్రాన్తిజర రతోద్యహి । కేచిదూచుర్వినోదోఽయం కృతో హి మునినా త్రహి ॥౧౪॥ కేచిదూచూ రాఘవస్య ధైర్యంపశ్యత్యయంమునిః । కేచిదూచూ ర్రాఘవోద్య కిం కరిష్యతి పశ్యతాం ॥౧౫॥ ఏతస్మిన్నంతరే రామశ్శ్రుత్వా తచ్చ గురోర్వచః । ప్రహస్య సంజ్ఞయాహూతా మాహూయ గురుసన్నిధౌ ॥౧౬॥ సీతాయాః స్వకరేణైవ ధృత్వా వామకరం ముదా । సభాయాం రాఘవః ప్రాహ వసిష్ఠం తోషయన్ముదా ॥౧౭॥ స్త్రీదానమంత్రో వక్తవ్య స్సీతాదానం కరోమి తే । తథేతి మునివ్యందేష వసిష్ఠశ్చయథావిధి ॥౧౮॥ అంగీచకార స్త్రీదానం రాఘవేణ సమర్పితం । చలితం చ తదా భూద్వై సర్వం స్థావరజంగమం ॥౧౯॥ దేవాభానం కస్యాసీ త్తదాసీదతిచిత్రవత్ । తదా సీతాం మునిః ప్రాహ మత్పృష్ఠే తిష్ఠ బాలకే ॥౨౦॥ కుమార్పితాసి రామేణ త్వం మున్యేవహం సుతోపమాం । తస్మ నేర్వచనం శ్రుత్వా సీతా సాఖిన్నమానసా ॥౨౧॥ వామన్యస్త్రేక్షణా సాధ్వీ మునేః పృష్ఠే పల్యపావిశత్ । బభూవాశ్రుపూర్ణనేత్రా సారోమాంచితవిగ్రహా ॥౨౨॥ తతో రామః పునః ప్రాహ వసిష్ఠం విన

దానంబుల ననేకంబులను సదక్షిణాకంబుగా నిచ్చుచు, కామధేనువును అలంకరించి గురువుల వారగు వసిష్ఠులవారికి దానము చేయుటకు యత్నించెను. ఆసంగతి నెఱిఁగి వసిష్ఠుండు మనమున "నావద్ద 'నందినియను కామధేనువుయొక్క కూతురి కూతురున్నది. ఇందువల్ల నాకేమిప్రయోజనములేదు. ఇచ్చట నేనొక యద్భుతమును చూపెదను. ఇతనికే కామధేనువు తగును. కామధేనువున కితఁడేతగినవాఁడు. దీనిని వదలి శ్రీరామునికి జగమున కీర్తిగల్గుటకై సదక్షిణాకంబుగా సాలంకృతయగు సీతనిమ్మని యాచించెదను. జనులకు శ్రీరాముని యౌదార్యమును చూపించెదను." అని నిశ్చయించి శ్రీరామునింజూచి "రఘూత్తమా! ధేనుదాన మేమిచేసెదవు? ఇందువలన నాకు తృప్తికలుగదు. నీవొకవేళ సాలంకృతయగు సీతను దానమిచ్చినట్లయితే, దానివలన నాకు తృప్తికలుగును. తక్కిన నూఱుమంది స్త్రీలవల్లను కలుగనేరదు." అని చెప్పెను. ఆ మునిమాటవిని జనులందరును మోమువాఁడి హాహాయని భయభ్రాంతులైరి. కొందరు "ఏమన్నా వీడే మిప్పుడు మిక్కిలి చానస్తముగలవాఁడైనాఁడు?" అనియును, కొందరు "ఆహా ఈ మునీంద్రు డిప్పుడేమో వినోదమును చూపుచున్నాడు" అనియును, కొందరు "శ్రీరాముని ధైర్యమును పరీక్షించుచున్నాడు" అనియును, కొందరు "ఇప్పుడు రాముఁ డేమిచేయునో చూడుఁడ"నియును, చెప్పికొనుచుండిరి. ఇంతలో శ్రీరాముఁడు గురువాక్యమును పరిభావించి నవ్వుచు కనుసైగచే సీతనుపిలచి గురుసన్నిధానమున సీతయొక్క యెడమచేతిని తనచేతంబట్టికొని సంతోషముగా వసిష్ఠుని నానందపరచుచు సభికులు వినుచుండ "నీకు సీతాదానము చేసెదను. స్త్రీదానమంత్రము చెప్పఁబడని" అని పలికెను. అట్లేయని వసిష్ఠుండు ముని సమూహమున యథావిధిగా శ్రీరామునిచే నర్పింపఁబడిన స్త్రీదానమును అంగీకరించెను. అప్పుడు స్థావర జంగమాత్మక ప్రపంచంబు దిగ్భ్రాంతినొందెను. ఒకనికైన నప్పుడు తమ దేహ

యాఽవ్రతః । గృహాణసురభించాపి సీతాయైహ్యర్పితాంపురా॥ ౨౩॥ మయాతోషేణకైలాసే మన్మనస్తోషదాయినీ॥ మయాపిదాతుమానీతా తచ్ఛ్రుత్వాగురురబ్రవీత్ ॥ ౨౪ ॥ రామరామమహాబాహో తవోదార్యంచదర్శితుం । యాచితాతవపత్నీయం మయాతేస్తుపునశ్శుభా ॥ ౨౫ ॥ అస్యాఃకురుతులామద్య సువర్ణేనరఘూత్తమ । అష్టవారం ప్రతులితం సీతయారుక్మముత్తమం ॥ ౨౬॥ మాందత్వేయంత్వయాగ్రాహ్యా పునస్సదసిమద్గిరా । అన్యత్కించిచ్ఛృణుష్వత్వం వచనంయన్మయోచ్యతే ॥ ౨౭॥ ధేనుంచింతామణింసీతాం కౌస్తుభంపుష్పకంపురీం । స్వీయంరాజ్యమయోధ్యాయాం త్వంచేత్కస్యప్రదాస్యతి ॥ ౨౮ ॥ అగ్రేతదాతదాజ్ఞామే త్వయాలుప్తాభవిష్యతి । మమాజ్ఞాభంగదోషేణ బహుక్లేశీభవిష్యతి ॥ ౨౯ ॥ మదుక్తైస్సప్తభీరాజన్ వినాయద్యత్త్వమిచ్ఛసి । తత్తద్దదస్వవిప్రేభ్యో త్వంసుఖంహ్యవిచారతః ॥ ౩౦ ॥ తద్గురోర్వచనంశ్రుత్వా తథేత్యుక్త్వారఘూత్తమః । సీతాంతులాయామారోప్య సువర్ణేనాష్టసంఖ్యయా ॥ ౩౧ ॥ తులితాంప్రతిజగ్రాహ గురోస్సాక్షీంస్మితాననాం । దివ్యాలంకారహీనాంతాం కంచుకీ

స్మృతికూడ కలుగలేదు. అందరును చిత్రప్రతిమలవలె నుండిరి. వసిష్ఠుండు సీతనుచూచి "బాలిక! నీవు శ్రీరామునిచే నాకర్పింపఁబడినదానవుగాన నావెనుక నిలువుము. నిన్ను నాకూతురివలె నెంచెదను." అని యాజ్ఞాపించెను. అందు చింతాక్రాంతస్వాంతయై సొగసుగా నిలచిన చూపులుగల్గి యాసతి మునీంద్రుని వెనుకప్రక్కలోనిలిచెను. మఱియు నామె కండ్లనీళ్లు కమ్ముచుండ పులకితాంగియై యుండె. అంత నారాముఁడు గురువునుచూచి "స్వామీ! ఈ కామధేనువునుకూడ పరిగ్రహించండి. మునుపు కైలాసమున ఇది సీతకేయివ్వఁబడినది. నేనును దానమిచ్చుటకే తెచ్చితిని." అని ప్రార్థింపఁగా; వసిష్ఠుఁడు "రఘువీరా! రామచంద్రా! నీయౌదార్యమును చూపుటకై నీయొక్క పత్నిని యాచించితిని. నాచే మరల నీకివ్వఁబడును. మంగళాంగియగు నీమెయొక్క తూకమునకు సరియైన సువర్ణమును ఎన్మిదిమారులు తూచి ఆబంగారును నాకిచ్చి మరల నీసభయందు నామాటమీఁద నీ సీతను నీవు గ్రహింపుము. వేఱొక మాటను నేనుచెప్పెదను వినుము. ఈ యయోధ్యలో నీవుండునపుడు కామధేనువును చింతామణిని సీతను కౌస్తుభమును పుష్పకమును ఈ యయోధ్యను నీరాజ్యమును ఎవనికివ్వగలవు? ఇఁకమీఁద నీ వేమైన నిచ్చితివా నాయాజ్ఞనప్పుడు లోపించినవాఁడగుదువు. నాయాజ్ఞను భంగపరచినందున నీవు మిక్కిలి సంకటమనుభవించువాఁడగుదువు. రామరాజా! నామాటమీఁద నీవు పైనచెప్పిన సప్తపదార్థములుతప్ప తక్కినవాటి నెవ్వరెవ్వ రేమడిగినను నిర్విచారముగానిచ్చి సుఖింపుము." అని నిరూపించెను. అప్పుడు శ్రీరాముఁడు గుర్వాజ్ఞను సారముగా నట్లేయని సీతను త్రాసుమీఁదనెక్కించి ఎనిమిదంతల బంగారముచేత సమానురాలుగాచేసి మార్చికొనెను. స్మితాననయును రవికె చీరలను తొడిగికొని దివ్యాలంకారములులేనిదియును అగు నప్పతివ్రతను శ్రీరాముఁడు మరల పరిగ్రహించినప్పుడు విమానములయందున్న

వస్త్రసంయుతాం ॥ ౧౨ ॥ తదానినేదుర్వాద్యాని వవర్షుఃపుష్పవృష్టిభిః । సురస్త్రియోవిమానస్థా స్సీతారామా ముదాన్వితాః ॥ ౧౩ ॥ పూర్వాధికానలంకారాన్ స్వదేహేజానకీదధౌ । జనాస్సర్వేసుసంతుష్టా స్తదాసన్ముదితాననాః ॥ అథసీతాపతింనత్వా తత్పార్శ్వేసంస్థితాభవత్ । స్మితాననానందమగ్నా లజ్జితారామలోచనా ॥౧౪॥ తతోధామోప్యనేకాని కృత్వాదానానివిస్తరాత్ । ఋత్విక్సదస్యముఖ్యాదీ నానర్చాభరణాంబరైః ॥ ౧౫॥ స్వీయజ్ఞాతీన్నృపాన్మిత్ర సుహృదోన్యాంశ్చసర్వశః । అభీక్ష్ణంపూజయామాస వస్త్రాలంకారభూషణైః॥ ౧౬॥ సర్వే జనాసులలితోన్మణికుండలస్రగుష్ణీషకంచుకదుకూలమహార్ఘహారాః । నార్యశ్చకుండలయుగాలకవృందజుష్టవక్త్రశ్రియఃకనకమేఖలయావిరేజుః ॥ ౧౭ ॥ * ॥ ఇతిశ్రీమదానందరామాయణే వాల్మీకీయే యాగకాండే అవభృథోత్సవవర్ణనంనామాష్టమస్సర్గః॥ * ॥ ... ... ... ... ... ... ... ॥౧॥

శ్రీరామదాసఉవాచ—శ్రీరామోవభృథస్నాతోశంభుర్బ్రహ్మాదిభిస్సురైః । రామంవేదస్తవైఃస్తుత్వా ప్రత్యువాచపురఃస్థితః ॥౧॥ అద్యధన్యావయంసర్వే యత్త్వాంస్నాతంసుమంగళం । పశ్యామోవాభ్యవభృథేస్య సీతయాబంధుభిస్సహ ॥ ౨ ॥ అస్మాకంహర్షకాలోయం దేవదేవకృపానిధే । తస్మాదయంసదాపుణ్యః శ్రేష్ఠకాలోభ

---

దేవస్త్రీలు పూలవానగురిపించిరి. వాద్యములు వాయింపఁబడెను. శ్రీ సీతారాములు ఆనందించిరి. సీత ముందుకన్నను అధికమగు దివ్యాలంకారములను ధరించెను. జనులందరును ఆహ్లాదవదనులును సంతుష్టాంతరంగులునయిరి. పిదప సీతాదేవి శ్రీరామునికి నమస్కరించి తత్పార్శ్వమున స్వానందముచే హాసస్ముఖియై రామునిపై కటాక్షంబులుజారుచుండినను లజ్జించుచు సుస్థితయై బరగుచుండెను. పిదప శ్రీరాముఁడును విస్తారముగా ననేకదానములనొసంగి వస్త్రాభరణంబులచే ఋత్విక్సభికాది మహనీయులను సమర్చించి, తన జ్ఞాతులను రాజులను మిత్రులను దివ్య సత్కారంబులచే సత్కరించెను. అక్కాలంబున పురుషులందరును అంగులు తలపాగలు పుష్పహారములు రత్న కుండలాది భూషణములు దివ్య వస్త్రములును గలవారై, స్త్రీలందరును తాటంకంబులచే కచమేచకంబులచే ముఖసంపద మీరివచ్చుచుండ కనకమేఖలాద్యాభరణంబులు గలవారై, బరగుచుండిరి॥ ... ... ... ౧॥

అయోధ్యా సరయూ రామతీర్థంబుల మహిమాభివర్ణనము.

అవభృథస్నాతుఁడగు శ్రీరామునిఁజూచి శంకరుఁడు బ్రహ్మాది దేవతలతోఁడ వేదస్తుతులచే సంస్తుతించి యెదుటనిలిచి "శ్రీరామా! నీవు సీతతోఁడను తమ్ములతోఁడను మంగళంబగు నవభృథ స్నానముచేయుచుండుటను చూచుటచే మేమందరము ధన్యులము. దేవదేవుఁడగు దయానిధీ! మాకిది మిక్కిలి సంతోషసమయము. అందువలన నెల్లప్పుడును ప్రత్యబ్దమున నీపుణ్యకాలంబు మిక్కిలి శ్రేష్ఠమైయుండును. నీవును సంతోషించి యిప్పుడు ఈ తీర్థమునకు విశేష

విష్యతి ॥ ౩ ॥ త్వంచాప్యంగీకురుష్వాద్య దేవ్యాస్తైనుబహూన్వరాన్ । అన్యస్త్వత్ర ప్రతిష్ఠం యేన తే దర్శనం భవేత్ ॥ ౪ ॥ తీర్థాకురురఘుశ్రేష్ఠ తీర్థానాం తైర్వరాన్వద । అన్యానిచత్వయాపూర్వం యానిభూమ్యాం కృతానిహి ॥ ౫ ॥ యాత్రా కాశీనుతీర్థాని లింగాన్యపినిజాఖ్యయా । తేషామపివరానద్య వదత్వంమమవాక్యతః ॥ ౬ ॥ పురీషు శ్రేష్ఠామయోధ్యేయం త్వయావాచ్యాద్యరాఘవ । నదీషుసరయూః శ్రేష్ఠా వర్తైః కార్యాద్యమద్గిరా ॥ ౭ ॥ తచ్ఛంభు వచనంశ్రుత్వా ప్రహస్యరఘునందనః । హర్షకాలేబ్రవీద్వాక్యం యత్త్రైలోక్యోపకారకం ॥ ౮ ॥ యత్ప్రార్థితం త్వయాశంభో తదేవహృదిమేస్థితం । శృణుష్వవచనంమేద్య యద్ధర్షాత్ప్రోచ్యతేశుభం ॥ ౯ ॥ సర్వేషామేవమాసానాం శ్రేష్ఠశ్చాయంమధుర్భవేత్ । వైశాఖాత్కార్తికశ్శ్రేష్ఠః కార్తికాన్మాఘఏవచ ॥ ౧౦ ॥ మాఘమాసాద్వరశ్చాయం చైత్రమాసోభవిష్యతి । చైత్రమాసేభవజ్జన్మమమయస్మాత్తథాపునః ॥ ౧౧ ॥ వాజిమేధావభృథేష్వపు స్నానేనాపివిశేషతః । సర్వేషామధికశ్చాస్తు మధుస్తేవాక్యగౌరవాత్ ॥ ౧౨ ॥ చైత్రమాసేకృతందత్తం హుతంస్నాతంవిచింతితం । సర్వంకోటిగుణంప్రోక్త మయోధ్యాయాంవిశేషతః ॥ ౧౩ ॥ సర్వాసుప్రథమాచేయం పురీషునగరీమమ । అయోధ్యాముక్తిదాత్రీతు భవిష్యతిగిరామమ ॥ ౧౪ ॥ అన్యత్రయత్కృతంపుణ్యం షష్టిసంవత్సరైశ్శుభం । తదత్రది

ఫలదంబులయిన నిన్ను చూడగల్గిన మిక్కిలి మంచివరంబుల ననుగ్రహింపుము. అంతమాత్ర మేకాక నీ వింకను భూమిలో నెన్ని తావులలో తీర్థంబులను కల్పించియుందువో ఎచ్చటెచ్చట శ్రీరామేశ్వరలింగములను ప్రతిష్ఠించియుందువో, అచ్చోట్లలోనంతట ప్రవర్తిల్లునట్లు నామాట మీఁద నీవు మంచివరములనిమ్ము. మఱియు నామాటమీఁద నదులలో సరయూనదియును పట్టణంబులలో నయోధ్యాపట్టణంబును నీ వరంబులచే మేలుగా నేర్పడవలయును." అని ప్రార్థించెను. అట్టి శివవాక్యమునువిని శ్రీరాముఁడు తత్సంతోషసమయమున నవ్వుచు "శంభూ! ముల్లోకంబులకు నుపకారకంబుగా నేది నీచే ప్రార్థింపఁబడుచున్నదో ఆసంగతియే నామనంబున గలదు. నామాటనువినుము. నేనుసంతోషముగా శుభమును చెప్పుచున్నాను. అన్ని నెలలలోను ఈ చైత్రమాసమే శ్రేష్ఠంబుగానుండును. వైశాఖముకన్నను కార్తికమాసము శ్రేష్ఠము. కార్తికము కన్నను మాఘమాసము శ్రేష్ఠము. మాఘముకన్న నీ చైత్రమధికము. ఎందువల్లననగా చైత్రమున నాయవతారమయినది. మఱియును అశ్వమేధావభృథంబున ఈనెలలో స్నానములు జరిగినవి. గనుక నీవాక్యగౌరవముచేతను చైత్రమే మిక్కిలి శ్రేష్ఠముగానుండని. చైత్రమాసమున చేసినది దానము హోమము స్నానము ధ్యానము ఇవన్నియును కోటింత లధికముగా నయోధ్యయందు మఱియు విశేషంబుగా నెంచబడును. ఈ నాయొక్కపురము అన్నిపట్టణంబులకును మొదటిదిగానుండని. నావాక్యమువిూఁద అయోధ్య ముక్తిప్రదంబగును. ఇతరస్థలములలో నరువదిసంవత్సరములు చేసినంతపుణ్యమును అయోధ్యలో మానవుల కొకదినములోనే గలుగును. మంగళప్రదంబగు నీరాజధాని ముక్తిప్రదాననిపుణగా నెఱుఁగునది. నీవు వరములను

వసేనైవ భవిష్యతినృణాంసదా ॥ ౧౪ ॥ పరిణామధురీక్షేయా రాజధానీశుభప్రదా । త్వయాప్రైగ్యయా చితోహంపస్మా ద్వరాథఈమహామాదరాత్॥ ౧౫॥ తవవాక్యాద్గౌరవేణ తవకాశ్యాశ్శతాధికా । భవిష్యతిపురీచేయ మయోధ్యామనువల్లభా ॥ ౧౬ ॥ నదీషుసరయూశ్శ్రేయం శ్రేష్ఠాస్తువచనాన్మమ । సరయూసదృశీనాన్యా నదీభూతాభవిష్యతి॥ ౧౭॥ అస్యాశ్చపిమయా చేదం రామతీర్థంవినిమితం । నిజతేజఃప్రతాపేన తీర్థేష్వముకుటోపమం ॥ ౧౯॥ భవిష్యతినసందేహః సర్వపాతకనాశనం । తథాయానిపృథివ్యాంహి యయాతీర్థానివైపురా ॥ ౨౦ ॥ లింగాన్యపి స్వీయనామ్నా కృతానితానిశంకర । స్నానేనదర్శనాచార్చాద్యై ముక్తిదానత్రసంతువై॥ ౨౧॥ రామతీర్థంచైత్రమాసే ప్రత్యబ్దంభువిమానవైః । స్నాతవ్యంవిధినాసమ్యక్ నియమైర్వచనవాక్యతః ॥ ౨౨॥ యచ్ఛ్రేయశ్చాశ్వమేధేన యద్గోమేధనవైఫలం । యత్ఫలంసోమయాగేన తచ్చైత్రేత్రావగాహనాత్॥ ౨౩॥ సూర్యగ్రహేకురుక్షేత్రే యచ్ఛ్రేయఃస్నానదానతః । తచ్ఛ్రేయఃస్యాన్మధౌస్నానా దయోధ్యాయాంసురేశ్వర ॥ ౨౪॥ అయోధ్యాయాంరామతీర్థే సరయూజలసంస్థితే । చైత్రస్నానంప్రకుర్వాణా స్తేనరామోక్షభాగినః ॥ ౨౫॥ యథామాఘే ప్రయాగేహి స్నాతవ్యంసుఖమిచ్ఛతా । కార్తికేపియథాకాశ్యాం పంచగంగాజలేష్వతః ॥ ౨౬ ॥ ద్వారకాయాంయథాప్రోక్తో వైశాఖశ్చక్రతీర్థకే । అయోధ్యాయాంరామతీర్థే తథాచైత్రేవగాహనం ॥ ౨౭ ॥ కరణి

ప్రార్థించినందున నీ వాక్యగౌరవముచే నాకు మిక్కిలి ప్రీతిపాత్రంబగు నీ యయోధ్య నీయొక్క రాజధానియగు కాశికన్నను నూరింతలు గుణాధికముగానుండును. ఇఁక నదులలో నా మాటమీఁద నీసరయూనది మిక్కిలి శ్రేష్ఠంబు. సరయువునకు సమానమైననది కలుగనేరదు. దీనియందును నాచే నిర్మింపఁబడిన రామతీర్థంబు పరమోత్తమంబు. ఇది స్వతేజస్సాన్నిధ్యముచే సర్వదురిత పరిహారకంబై తీర్థంబులలో కిరీటంబనఁబడి వెలుఁగును. ఇందుకు సందేహములేదు. శివుఁడా! అట్లే పుడమిని నాచే నానామమిడి చేసిన తీర్థంబులును శివలింగంబులును క్షేత్రంబులును స్నానపూజనసత్కారంబులచే నవవి యచ్చటచ్చట ముక్తిప్రదంబులై బరగుచుండని. నామాటమీఁద మానవులు ప్రతిసంవత్సరమునను చైత్రమాసమున నీ రామతీర్థమున నియమంబులతోడ యథావిధిగా స్నానముచేయవలయును. ఇచ్చటి చైత్రస్నానముచే అశ్వమేధఫలమును గోమేధఫలమును సోమయాగఫలంబునుకూడ నందగలరు. సూర్యగ్రహణసమయమున కురుక్షేత్రమునందలి స్నానదానాదులచే గల్గు శ్రేయస్సు, ఈ యయోధ్యానగరమున చైత్రమాసస్నానముచే కలుగును. అయోధ్యా సరయూ రామతీర్థ చైత్రస్నానపరులు ముక్తిభాగులై యుందురు. సుఖాపేక్షగలవారు మాఘమాసంబున ప్రయాగలో స్నానముచేయునట్లును, ద్వారకలో చక్రతీర్థస్నానమును వైశాఖమాసమున చేసినట్లును, కార్తికమాసమున కాశీపట్టణములో పంచగంగాతీర్థస్నానము నాచరించునట్లును చైత్రమాసమున నయోధ్యా రామతీర్థస్నానము మంగళప్రదముగానున్నది. అందరును నామాటమీఁద నిట్లు ప్రవర్తింపఁద

యంనరైర్భక్త్యా వచనాన్మమసర్వదా । సర్వేష్వపిచమాసేషు ప్రథమస్సకలైర్జనైః ॥౨౮॥ ఏతావత్కాలపర్యంతం మార్గశీర్షః ప్రగీయతే । అద్యారభ్యమధుశ్చాయం ప్రథమఃఖ్యాతిమేష్యతి॥౨౯॥యథాదేవేషుప్రథమస్త్వం మహేశ స్తథామధు । మాసేషుప్రథమశ్చాస్తు తథాయోధ్యాపురీష్వపి ॥౩౦॥ చైత్రేమాసేతుసంప్రాప్తే సర్వేదేవాస్సవాసవాః । బహిర్జలంసమాశ్రిత్య తిష్ఠధ్వంహిమమాజ్ఞయా ॥ ౩౧ ॥ ప్రత్యబ్దంచైత్రమాసేత్ర యథేదానీం సమాగతాః । ఆగంతవ్యంతథాసర్వై స్త్రైలోక్యాంతరవాసిభిః ॥౩౨॥ జరఠైరాతురైఃస్త్రీభి ర్యేషాంయత్సన్నిధింమమ । రామతీర్థంప్రగంతవ్యం సర్వత్రభువిశంకర ॥౩౩॥ చైత్రమాసేవగాహార్థం వచనాన్మమసర్వదా। ఇతిరామవచఃశ్రుత్వా గిరిజాప్రాహజానకీం ॥౩౪॥ సీతేవరాస్త్వయాదేయా ఇదానింవచనాన్మమ । నారీణాంచహితార్థంహి సర్వేలోకోపకారకాః ॥ ౩౫ ॥ తదాద్రిజావచశ్శ్రుత్వా జానకీప్రాహసాదరం । పృథివ్యాంమమతీర్థాని యానిసంతిసహస్రశః ॥౩౬॥ అత్రాపిచమహచ్ఛ్రేష్ఠం యత్రస్నాతంమయాధునా । తేషుచైత్రతృతీయయా యావద్వైశాఖసంభవా ॥౩౭॥ సితాతృతీయాఽక్షయ్యాఖ్యా తావత్స్త్రీభిస్తుసాదరం । స్నాతవ్యంసీతలాగౌరీ సంజ్ఞకంస్నానముత్తమం ॥౩౮॥ సౌభాగ్యదంమాసమేకం పుత్రపౌత్రప్రవర్ధనం । సర్వత్రరామతీర్థస్య వామేతీర్థంమమాస్తిహి ॥౩౯॥ ఇతిదత్వావరాన్సీతాఽసీత్తూష్ణీంరామసన్నిధౌ । తతోఽరామంగురుఃప్రాహ గంతవ్యంయజ్ఞమంటపం ॥౪౦॥ తద్గురోర్వచనంశ్రుత్వా తథేత్యుక్త్వారఘూద్వహః । ఆరురోహరథంశీఘ్రం సీతయాఋత్విగ్జనై

గును. ఇదివరకు మార్గశీర్షము మొదటిదిగా నెంచబడుచుండును ఇఁకమీఁదనదితప్పి చైత్రమాసము మొదటిదిగానెంచబడని. దేవతలలో నీవెట్లు మొదటివాఁడవో అట్లు మాసములలో చైత్రము మొదటిది. అట్లే పట్టణంబులలో నయోధ్య గొప్పది. సేంద్రాదులగు దేవతలారా! మీరందరును చైత్రమాసమురాగానే నాయాజ్ఞానుసారముగా బహిర్జలము నాశ్రయించి యుండవలెను. ఎందువల్లననిన ప్రతిసంవత్సరంబునను చైత్రమాసమున నిప్పుడెట్లు వచ్చినారో అట్లే ముల్లోకములలోనుండు ముసలివాండ్రు ఆర్తులు స్త్రీలు అందరును వచ్చెదరు. శంకరుఁడా! భూమిలోనంతట నందరును నారామతీర్థమునకు పోవలసినది. ఇట్లనిన శ్రీరాముని మాటలనువిని పార్వతీదేవి సీతనుచూచి ‘‘జానకీ నామాటమీఁద నీవును లోకోపకారకంబునును స్త్రీలకు హితంబులునగు వరములనిమ్ము” అని ప్రోత్సాహపరుపగా; నా జనకపుత్రి ‘‘పార్వతీదేవి పలుకులనువిని సాదరముగా నిట్లనెను. వేలకొలదిగా నాయొక్క తీర్థంబులు భూమిలో నెన్నిగలవో వాట్లలోను ఇప్పుడు నేను స్నానముచేసిన పరమోత్తమంబగు నీస్థలమునను చైత్రశుక్ల తృతీయమొదలు వైశాఖశుక్లాక్షయ తృతీయవరకు నెలరోజులు ఉత్తమంబగు సీతలా గౌరీ సంజ్ఞకంబయిన స్నానమును సాదరముగా స్త్రీలు చేయవలసినది. ఆనెలవారికి సౌభాగ్యప్రదంబును పుత్ర పౌత్రాద్యభివృద్ధి నిచ్చునట్టిదియునై యున్నది. అంతట శ్రీరామతీర్థమున కెడమప్రక్క నాయొక్క తీర్థముండును. అని ఇట్లు వరమునిచ్చి సీత పతిసన్నిధి మూరకయుండెను॥

స్సహ ॥౪౧॥ తతో వేణుదుందుభీనాం భేరీణాం నిస్వనా స్తతః। మృదంగపణవాదీనాం మహాఘోషాస్సమంతతః॥ ౪౨॥ వేదఘోషాశ్చ సర్వత్ర జయశబ్దాదివేరితాః। బహుపుణ్యమంత్రశబ్దాశ్చ నన్నృతుశ్చాప్సరోగణాః ॥౪౩॥ నానోత్సవైః పూర్వవచ్చ కౌతుకాని సమంతతః। పశ్యన్నయా రామచంద్ర శ్శనైరధ్వరమంటపం ॥౪౪॥ అవరుహ్య రథాచ్ఛీఘ్రం సీత్వాగ్నిం ప్రక్షిపత్సునః। యజ్ఞకుండే రామచంద్ర స్సీతయార్త్విగ్జనైస్సహ ॥౪౫॥ పూర్ణాహుతిం తతో దత్వా వస్త్రాభరణైః ఫలైః। కృత్వాఽగ్నేః పూజనం చాపి యజ్ఞపాత్రాణి రాఘవః ॥౪౬॥ తతో విసర్జయామాస యజ్ఞాంతే దక్షిణాం బహు। దాతుం తాన్ఋత్విజస్సర్వా న్సౌమిత్రం రాఘవో బ్రవీత్ ॥౪౭॥ కోశాగారం లక్ష్మణాద్య సర్వే మే ఋత్విజ స్త్వయా। నీత్వా దూతాన్నిరాకృత్య తూష్ణీం స్థేయం తతః పరం॥ ౪౮॥ యథేచ్ఛయా మితం యేన గృహీతమ ఉత్తమం వసు। తస్యాశ్రమే ప్రాపణీయం వాహనాద్యైశ్చ తత్త్వయా॥౪౯॥ తతో మునిజనాన్సర్వాన్దేయం విపులమా స్తతః॥ తద్రామవచనం శ్రుత్వా లక్ష్మణోపి తథాకరోత్ ॥౫౦॥ తతో విసర్జయామాస భోజయిత్వా రఘూత్తమః। ఋత్విగ్జనాన్సంవృణీతా న్వాజిమేధాఖ్యకర్మణి ॥౫౧॥ తతో రామో మరాన్సర్వాన్ శివాద్యాన్స్వభవైర్నిజైః। పూజయామాస విధివద్వస్త్రాలంకారవాహనైః ॥౫౨॥ దదౌ కేషాం సతురగాన్ కేషాం సశిబికాం దదౌ। కేషాం రథాన్గజాన్ కేషాం దదౌ శస్త్రాణ్యపీశ్వరః ॥౫౩॥ ఏవం పృథ్వీపతిశ్చాపి సావరోధాన్ససేవకాన్। వస్త్రాభా

### శ్రీరాముఁడు యజ్ఞమంటపమునకు వచ్చుట.

౪౦॥ అంత నావసిష్ఠుండు ఇఁక యజ్ఞమంటపమునకు వెడలవలయుననెను. వెంటనే శ్రీరాముఁడు అట్లేయని గురువాక్యమును గౌరవించుచు త్వరగా సీతతోడ రథమునెక్కెను. ఋత్విగ్జనులును రథములనెక్కిరి. పూర్వోక్తప్రకారంబుగా మంగళవాద్యధ్వనులును వేదఘోషణంబులును జయశబ్దంబులును కోలాహలంబులును అంతట నతిశయించుచుండ, నృత్తగీతాది మహోత్సవంబులు జరుగుచుండ, శ్రీరాముఁడు తిన్నగా మార్గమున వేడుకలనుచూచుచు యజ్ఞమంటపమునకేతెంచి త్వరగా రథమునుండిదిగి సీతతోడను ఋత్విక్కులతోడను అగ్నిశాలలో మరల నగ్నిని ప్రతిష్ఠించెను॥ ౪౫ ॥ పిదప, శ్రీరాముఁడు వస్త్రాభరణ ఫలాములచే నగ్నిలో పూర్ణాహు-

### శ్రీరామాశ్వమేధ పరిసమాప్తి.

తిని సమర్పించి అగ్నిపూజనంబునొనర్చి యజ్ఞపాత్రంబులను విసర్జించి, యజ్ఞాంతమున ఋత్విగ్జనులకు విశేష దక్షిణలనిచ్చువాఁడై లక్ష్మణునింజూచి "తమ్ముఁడా! ఇప్పుడీ ఋత్విక్కులను నీవు పిలచికొనిపోయి దూతలను దూరీకరించి వీరిని కోశాగారమునవిడచి నీవూరకె నిలచియుండఁదగును. వారివారి మనంబునకుతోచినంత వారువారు సువర్ణమును తీసికొననిమ్ము. పిదప వారి యాశ్రమంబులకు వాటిని వాహనాదులమీఁదనింపి పంపుము. తక్కిన మునీంద్రులకు చేతినుండి విశేషముగానిచ్చి నీవు తృప్తినందింపుము. ఆ శ్రీరామవాక్యానుసారముగా లక్ష్మణుండు నట్లేజరిపెను. పిదప శ్రీరాముఁడు తాను యజ్ఞమునకై వరించియుండిన ఋత్విగ్జనుల

భరణైర్యానైః పూజయామాస భోజనైః ॥ ౫౪ ॥ తతో రామః స్వశరీరే దివ్యవస్త్రాణి సందదౌ । తదా తం పూజయామాసు ర్బలిభి ర్విబుధా నృపాః ॥ ౫౫ ॥ సరిత్సముద్రా గిరయో నాగా గావః ఖగా మృగాః । ద్యౌః క్షితిస్సర్వభూతాని సమాజగ్ము రుపాయనం ॥ ౫౬ ॥ సీతయా సమహారాజ స్సువాసాస్స్వలంకృతః । బంధుభిస్సేవ్యమానశ్చ విరేజేగ్నిరివాపరః ॥ ౫౭ ॥ తస్మై దదౌ వై ధనదో హైమం పీఠవరాసనం । వరుణస్సలిలస్రావి హ్యాతపత్రం శశిప్రభం ॥ ౫౮ ॥ వాయుశ్చవాలవ్యజనే ధర్మః కీర్తిమయీం స్రజం । ఇంద్రః కిరీటముత్కృష్టం దండం సంయమనం యమః ॥ ౫౯ ॥ బ్రహ్మా బ్రహ్మమయం వర్మ భారతీ హారముత్తమం । దశచంద్రమసిం రుద్ర శ్శతచంద్రమథాంబికా ॥ ౬౦ ॥ సోమోమృతమయానశ్వాం స్త్వష్టా రూపాశ్రయం రథం । అగ్నిరాజగవం చాపం సూర్యో రశ్మిమయా నిషూన్ ॥ ౬౧ ॥ భూః పాదుకే యోగమయ్యౌ ద్యౌః పుష్పావలిమన్వహం । నాట్యం సుగీతం వాదిత్ర మంతర్ధానంచ ఖేచరాః ॥ ౬౨ ॥ ఋషయశ్చాశిష స్సత్యా స్సముద్ర శ్శంఖమాత్మజం । సింధవః పర్వతా నద్యో రథవీథిం మహాత్మనః ॥ ౬౩ ॥ తతో నృపాదదుస్సర్వే స్యందనాం స్తురగాన్ గజాన్ । శిబికా గో వృషాన్ ఖడ్గాన్ దాసీర్దాసోష్ట్రిఖేచరాన్ ॥ ౬౪ ॥ సీతాయై నృపపత్న్యశ్చ దేవపత్న్య స్సహస్రశః । వస్త్రాలంకారయానాని మాంగల్యాన్యథ కంచుకీః ॥ ౬౫ ॥ క్రీడోపకరణాదీని దదుస్తాః పక్షిపంజరాన్ । తతస్తైః పూజితస్సర్వై స్సీతయా రఘునాయకః ॥ ౬౬ ॥ ఆరురోహ రథం దివ్యం వహ్నినా వందిభిః

---

నందరిని చక్కఁగా భోజనముపెట్టి యుద్వాసనచేసెను. అంత నమరవర్యులను శంకరాదులను స్వవిభవానుసారముగా దివ్యవస్త్రాభరణాద్యలంకారంబులచే పూజించెను. అందులో కొందరికి గుఱ్ఱములను, కొందరికి యేనుఁగులను, కొందరికి పల్లకీలలు, శస్త్రంబులనుకూడ నిచ్చెను.ఇట్లే, రాజులను వారివారి రాణివాసంబులను పరివారంబులనుకూడ వస్త్రాభరణ భోజనాదులచే సత్కరించెను॥ ౫౫ ॥ అప్పు డక్కడచేరియుండిన దేవతలు రాజులు నదీదేవతలు

యజ్ఞమునకువచ్చిన దేవోత్తమనరోత్తములు శ్రీరాములను సత్కరించుట.

సముద్రదేవతలు గిరిదేవతలు నాగులు గోదేవతలు ఖగ మృగాదిదేవతలు భూతదేవతలు అందరును శ్రీరాములవారికి కానుకలను సమర్పించిరి. అమ్మహారాజగు శ్రీరాముఁడు సీతతోడ చక్కఁగా నలంకరింపఁబడినవాఁడై తమ్ములచే సేవింపఁబడుచు అపరాగ్నిమూర్తివలె రాజిల్లుచుండెను. అపుడు కుబేరుండు సువర్ణ పీఠాసనంబును, వరుణుఁడు నీళ్లంటని చంద్రప్రభంబగు ఛత్రంబును, వాయుదేవుఁడు చామరంబులను, ధర్మదేవత కీర్తిమయంబగు పుష్పమాలికను, ఇంద్రుఁడు ఉత్తమంబగు కిరీటంబును, యముఁడు సంయమన దండమును, బ్రహ్మ వేదాత్మకంబగు కవచంబును, సరస్వతి మేలైనహారమును, రుద్రుఁడు దశచంద్రఖడ్గమును, రుద్రాణి శతచంద్రఖడ్గమును, సోముఁడు అమృతమయంబులగు తురంగమంబులను, త్వష్టబ్రహ్మ రూపాశ్రయంబగు రథంబును, అగ్నిభట్టారకుఁడు ఆజగవకార్ముకంబును, సూర్యుఁడు కిరణాత్మకబాణంబులను. భూదేవి యోగమయపాదుకలను, స్వర్గదేవత నిత్యపుష్పమాలికను, ఖేచరులు నృ

స్తుతః । స్వస్త్రీభిఃనృపపత్నీభి ర్విమానేనమునీశ్వరాః ॥ ౨౭ ॥ విహాయసాయయుస్సర్వే ఽయోధ్యాయాంనృప తేఃగృహం । తతోరామోరథేనైవ పూర్వోక్తైరుత్సవైశ్శనైః ॥ ౨౮ ॥ వివేశనగరీంరామః స్తుతస్సూతైశ్చమాగ ధైః । ఛత్రందధారసౌమిత్రి ర్ముక్తాజాలవిరాజితం ॥ ౨౯ ॥ భరతస్తాలవ్యజనం శత్రుఘ్నశ్చామరద్వయే । తాం బూలపాత్రంసుగ్రీవ స్తోయపాత్రంతువాయుజః ॥౩౦ ॥ నలఃక్షీవసపాత్రంచ వాలిజోముకురంవరం। వాసఃకోశం రాక్షసేంద్రో ధూపపాత్రంహిజాంబవాన్ ॥ ౩౧ ॥ నానాఫలానాంపాత్రాణి పూజాపాత్రాణ్యనేకశః । సుగంధ ద్రవ్యపాత్రాణి దధుస్తేమంత్రిసత్తమాః ॥ ౩౨ ॥ ఏవంసుగంధివస్తూని ప్రక్షిపన్ వారయోషితాం । వృందేషుసీత యారామో విరేజేస్యందనేస్థితః ॥ ౩౩ ॥ సుగంధరాగపూర్ణైశ్చ జలయంత్రైఃకరేధృతైః । వారాంగనానాంవ స్త్రాణి నృపాదీనాంచరాఘవః ॥౩౪ ॥ చిత్రితాన్యకరోద్రాగైః కింశుకానివమాధవే । స్నేహాత్సుగంధైరాగాద్యైశ్ శ్రాద్రాణవస్త్రేషురాఘవః ॥ ౩౫ ॥ క్షిప్త్వాపరిమళాదీని చిత్రితాన్యకరోత్సునః । నర్తకాస్సువారయోషిత్సు వాద్యై ర్వినదత్సుచ ॥ ౩౬ ॥ స్తువత్సుబందివృందేషు పుష్పవృష్టివిరాజితః । యయౌరాజగృహద్వారం రామోరాజపథా శ్శనైః ॥ ౩౭ ॥ మార్గేకుంభప్రదీపైశ్చ దధ్యోదనవినిర్మితైః । బలిదీపైఃపూర్ణకుంభై రాజమార్గేపురస్త్రియః ॥ ౩౮ ॥ చక్రుర్నీరాజనంరామం స్వస్థరథేసీతయాయుతం । అవరుహ్యరథాద్రామో సీతయాన్వితోనిజేగృహే॥

త్తగీత వాద్య వస్త్రాదులను, మునులు సత్యాశీర్వాదంబులను, సముద్రుఁడు తనయందుపుట్టిన శంఖమును, సింధుపర్వత నదీదేవతలు రథవీధులననగాన ప్రతిహతరథ వేగశక్తులను, రాజులం దరును రథగజతురగపదాతి గోవృషభోష్ట్రాదులను దాసీదాసవర్గంబులను ఖడ్గాద్యాయుధంబుల ను క్రీడాసామగ్రులగు పక్షులగూండ్లు మొదలైనవాటిని, ఇట్లుసర్వులును తత్తదుచితంబులగు కానుకల నర్పించిరి॥ ౨౬ ॥ వీరిచే సంపూజింపఁబడి శ్రీరాముండు సీతతోడ నగ్నిహోత్రం

శ్రీ సీతారాములు యథాపూర్వముగా రాజమందిరమునుచేరి సుఖించుట.

బులనుతీసికొని వందిజనాభి వందితుఁడగుచు దివ్యరథమునెక్కెను. తక్కిన రాజాది సమస్తప రివారంబును పుష్పకవిమానమునెక్కి వెడలెను. అంత శ్రీరాముఁడు రథముమీఁదనే పూర్వో క్తంబులగు మహావిభవంబులతోడ తిన్నగా పట్టణమును ప్రవేశించెను. వందిమాగధులు పొ గడుచుండిరి. లక్ష్మణుఁడు మౌక్తికచ్ఛత్రంబును పట్టెను. భరతుండు తాళవృంతంబును శత్రు ఘ్నుఁడు చామరయుగళంబును సుగ్రీవుఁడు తాంబూలకరండికను ఆంజనేయుఁడు జలపాత్రం బును నలుఁడు ఉమిగిన్నెను అంగదుఁడు దర్పణమును విభీషణుఁడు వస్త్రపేటికను జాంబవం తుఁడు ధూపపాత్రంబును మంత్రిప్రవరులు వివిధఫలపాత్రంబులను పూజాపాత్రంబులను పరి మళపదార్థ పాత్రంబులను ధరించి వచ్చుచుండిరి. వారకాంతావృందమధ్యమున శ్రీరాముఁడు సీతతోడ రథారూఢుఁడై సుగంధచూర్ణాదులను చల్లుచు విరాజించెను. శ్రీరాముఁడు రాజుల యొక్కయు వారాంగనలయొక్కయు వస్త్రంబులను నిజకరోద్ధృత జలయంత్రాదులచే పరి

౨౯ ॥ స్థాప్యస్వీయసభాంగత్వా దదౌహస్వీయమాసనం । తతస్తేపార్థివాస్సర్వే ప్రణేమూరఘునందనం ॥ ౩౦॥ రాజ్ఞాంముకుటరత్నౌఘ ప్రభాభిఃపదపంకజే ।విరేజతూరాఘవస్య తదాసింహాసనోపరి ॥ ౩౧॥ ముకుటస్థావతంసానాం పరాగైఃపూజితేనృపైః। ప్రాపతుర్నితరాంశోభాం రక్తోత్పలనిభేపరే ॥ ౩౨॥ సీమంతస్థచంద్రసూర్య రత్నమాణిక్యదీప్తిభిః । సురపార్థివపత్నీనాం సీతాయాఃపదపంకజే ॥ ౩౩ ॥ విరేజతుఃపరాగైశ్చ కేశబంధప్రసూనజైః । సురపార్థివపత్నీభిః పూజితేకనకోజ్జ్వలే ॥ ౩౪ ॥ తతస్సభాయాంశ్రీరామం స్తుత్వాదేవైర్మహేశ్వరః । శ్రీరామస్తవరాజేన శ్రీరామేణాపిపూజితః ॥ ౩౫ ॥ ప్రాప్యాజ్ఞాంరామచంద్రస్య సావరోధైస్సురాదిభిః। ప్రస్థానంస్వస్థలంగంతుం చకారవృషమాస్థితః॥ ౩౬ ॥ నృపస్త్రియోపిసీతాయాః ప్రాప్యాజ్ఞాంపూజితాస్తయా। యానాన్యారురుహుస్సర్వాః స్త్వయోధ్యాయావినిర్యయుః ॥ ౩౭ ॥ అథతేపార్థివాద్యాశ్చ ప్రాప్యాజ్ఞాంరాఘవస్య చ । సావరోధాస్ససైన్యాశ్చ స్వీయరాజ్యానివైయయుః ॥౩౮ ॥ యయౌశివోపికైలాసం సత్యలోకంవిధిర్యయౌ। ఇంద్రాద్యానిర్జరాస్సర్వే స్వర్గలోకంయయుర్ముదా ॥ ౩౯ ॥ అథత్విజోమహాశీలా స్సదస్యాబ్రహ్మవాదినః। స

మళద్రవ్యంబులచే చిత్రవస్త్రంబులుగాజేసెను. వాద్యంబులు మ్రోగుచుండ గణికలాడుచుండ వందులు పొగడుచుండ గాయకులు పాడుచుండ రాముఁడు రాజమార్గంబున తిన్నగావచ్చి రాజమందిరంబున కేతెంచెను. దారిలో దీపకలశంబులచే దధ్యన్న బలిదీపంబులచే పూర్ణకుంభంబులచే పురస్త్రీలు సీతారాములను మంగళప్రదంబుగా నారతుల నిచ్చుచుండిరి. అంత శ్రీరాముఁడు రథమునుండిదిగి సీతచే నిజాగారంబున నగ్నిప్రతిష్ఠచేయించి సభకువచ్చి దివ్యసింహాసనము నలంకరించెను. అంత నచ్చట రాజులందరును శ్రీరాముని నభివందించిరి. సింహాసనాసీనుఁడగు శ్రీరాముని పాదారవిందంబులు నమస్కరించుచుండు రాజులయొక్క కిరీటరత్నప్రభలచే రాజించుచుండెను. మఱియు వారి కర్ణపూరంబుల పరాగప్రసరణచే రక్తోత్పలంబులనబడినవి. సింహాసనాసీనయగు సీతయొక్క చరణకమలంబులు నమస్కరించుచుండు దేవస్త్రీలయొక్క సీమంత చంద్రసూర్యాభరణ రత్నకాంతులునిండి కేశబద్ధప్రసూనపరాగంబులచే నర్చింపబడి కనకమయంబులై బరగినవి॥ ౩౪ ॥ తరువాత సభలోనున్న శ్రీరామచంద్రునిం జూ

దేవదేవాదులు నిజనిజ నివాసంబులకు శ్రీరామాజ్ఞచే వెడలుట.

చి శ్రీ సాంబమూర్తి శ్రీరామస్తవరాజముచేతను వేదంబులచేతను స్తుతించి శ్రీరామునిచే పూజింపఁబడి అనుజ్ఞనంది సకలదేవతలతోడ ప్రయాణముచేసి వృషభారూఢుఁడై నిజావాసమునకు వెడలెను. రాజపత్నులును రాజులును శ్రీసీతారాముల అజ్ఞనంది నిజసైన్యంబులతోడ

ర్యేమునీశ్వరావ్యాశ్చ స్వధామానియయుస్తదా ॥ ౯౦॥ తతోరామఃపూర్వవచ్చ శశాసజగతీతలం । రేమేజనకనందిన్యా చిరకాలంయథాసుఖం ॥ ౯౧॥ వర్షాంతరేణకాలేన వాజిమేధాఃపృథక్పృథక్ । ఉత్తరోత్తరతఃశ్రేష్ఠావింశద్వర్షైఃకృతాదశ ॥ ౯౨॥ ఇత్థంశ్రీరామచంద్రేణ దశమేతురగాధ్వరే । ప్రతిపాల్యగురోర్వాక్యం సర్వస్వమపి భూసురాః ॥ ౯౩ ॥ దత్తంకిలమహారాజ్ఞా యథాచదిక్చతుష్టయం । ఋత్విగ్భ్యోదక్షిణార్థంహి దత్తంచేతిమయాశ్రుతం ॥ ౯౪ ॥ ఋత్విగ్భిస్తత్పునర్దత్తం రాఘవాయైవసాదరం । కృపాలుభిఃపాలనార్థం మితిశిష్యాత్రశ్రూయతే ॥ ౯౫ ॥ ఏవంశిష్యత్వయాపృష్టం రామచంద్రస్యమంగలం । చరితంతన్మయాకించిత్తవోక్తంయజ్ఞసంభవం॥ ౯౬ ॥ ఇదంయఃప్రాతరుత్థాయ యాగకాండంమనోరమం । పఠిష్యతినరఃపుణ్యం సర్వాన్కామానవాప్నుయాత్॥ ౯౭ ॥ పుత్రార్థీప్రాప్నుయాత్పుత్రం ధనార్థీధనమాప్నుయాత్ । యాగకాండమిదంశ్రుత్వా వాజిమేధఫలంలభేత్ ॥౯౮॥ హోమకాలేశ్రాద్ధకాలే చాతుర్మాస్యాదికేష్వపి। జపధ్యానార్చనారంభే పూర్వంనిత్యంపఠేదిదం॥౯౯॥

---

నయోధ్యనువిడచి నిజనిజరాజ్యంబులకు వెడలిరి. శివుఁడు కైలాసమును, బ్రహ్మ సత్యలోకమును ఇంద్రాదులు స్వర్గలోకమును చేరిరి. ఋత్విక్కులును మహాత్ములగు మునీంద్రులును వారివారి యాశ్రమంబులకు వెడలిరి. అంత నాశ్రీరాముఁడు యథాపూర్వముగా లోకమును బరిపాలించుచుండెను. జానకీదేవితోడ యథాసుఖంబుగా చిరకాలము రమించుచుండెను. పిదప సంవత్సరములక్రమముగా నిరువదివత్సరంబులలో నుత్తరోత్తర మహోత్సవాతిశయంబుగా ౧౦ అశ్వమేధయాగంబుల నాచరించెను. ఇట్లే శ్రీరామచంద్రుండు పదియవవాజిమేధంబున వసిష్ఠులవారివచనమును పరిపాలించుచు తన సర్వస్వమును చతుర్దిక్కులలోని సర్వభూమిని ఋత్విగ్జనులకు దక్షిణగానిచ్చెననియును, పిదప ధర్మపరిపాలనకై వారందరిచే నాభూమి శ్రీరామునికే సమర్పింపఁబడినదనియును వినుచున్నాను. శిష్యుఁడగు విష్ణుదాసుఁడా! వినుము నీవడిగిన శ్రీరామచంద్రుని వాజిమేధాధ్వరమంగళ వృత్తాంతమును నీకు చెప్పితిని. ఈ యాగకాండమును ప్రొద్దునలేచి యెవ్వఁడు భక్తితో పఠించునో వాఁడు సమస్తేష్టంబుల నందగలఁడు. పుత్రులు కావలసినవారు పుత్రులను ధనముకావలసినవారు ధనమును పొందగలరు. ఈ యాగకాండమును పఠించినవారు అశ్వమేధ యజ్ఞఫలము నందుదురు. హోమసమయంబునను శ్రాద్ధకాలంబునను చాతుర్మాస్యాది వ్రతకాలంబులలోను జపధ్యాన పూజాసమయంబులలోను మొదట దీనిని పఠించవలయును. శ్రీరాముని యశ్వమేధ యాగోద్భవంబైన దివ్యమంగళచరి

రమ్యంపవిత్రంరఘునాయకస్య శ్రీమచ్చరిత్రంతురగాధ్వరోద్భవం।
పఠంతిశృణ్వంతిజనాస్సపుణ్యదం లభంతిసైజంఖలువాంఛితంహ్యది ॥ ౧౦౦॥ *

ఇతి శ్రీమదానందరామాయణే శతకోటిరామచరితాంతర్గతే వాల్మీకీయే యాగకాండే
యజ్ఞసమాప్తిర్నామ నవమస్సర్గః॥

ఇతిశ్రీమదానందరామాయణే యాగకాండ స్సమాప్తః.

శ్రీరామచంద్రార్పణమస్తు.



త్రంబును పుణ్యప్రదంబని చదివిన వినిన జనులు తమ మనోరథంబులనుపొంది శ్రీమదానందరామానుగ్రహంబుచే నానందించుచుందురు॥ ... ... ... ... ౯॥

ఇట్లు వాల్మీకిప్రోక్తంబగు నానందరామాయణంబున యాగకాండ సంపూర్ణమయినది.

శ్రీరామచంద్ర చరణారవిందార్పణము.



శ్రీః

శ్రీరామః ప్రసన్నోస్తు॥ శ్రీగణేశాయనమః.

శ్రీసీతాలక్ష్మణభరతశత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామ

# శ్రీమదానందరామా

విలాసకాండశ్చతుర్థః ప్రారభ్యతే॥

శ్రీవిష్ణుదాస ఉవాచ—గురో శ్రోతుమిచ్ఛామి తద్వదస్వ సవిస్తర
మస్తవేనచ ॥ ౧॥ తంరామస్తవరాజంమే విస్తరేణప్రకాశయ । ఇతిశిష్యవచః
శ్రీరామదాస ఉవాచ—సమ్యక్పృష్టం త్వయావత్స సావధానమనాః శృణు ।
మయాధునా ॥ ౩ ॥ యత్పరంయద్గుణాధారం యజ్జ్యోతిరమలంశివం । తదేవప...
౪ ॥ శ్రీరామేతిపరంజాప్యం తారకంబ్రహ్మసంజ్ఞితం । బ్రహ్మహత్యాదిపాపఘ్న **కౌసల్యానందనుండును ధను**
రామరామేతి యేవదంత్యపి సర్వదా । తేషాంభుక్తిశ్చముక్తిశ్చ భవిష్యతి న సంశయః ॥ **...వీరుఁడును అగు వెలుఁ**
శ్శివేనపరమాత్మనా । తమహంసంప్రవక్ష్యామి హరిధ్యానపురస్సరం ॥ ౭ ॥ తాపత్రయాగ్ని**లయును. వృషభధ్వ**
కృంతనం । దారిద్ర్యదుఃఖశమనం సర్వసంపత్ప్రదాయకం ॥ ౮ ॥ విజ్ఞానఫలదందివ్యం మోక్ష...**కును హితమును**

శ్రీరామదాసుఁడు శ్రీరామస్తవరాజము నుపదేశించుట.

వినుచున్న విష్ణుదాసుఁడు 'గురూత్తమా! ఏ శ్రీరామస్తవముచే శంకరుఁడు శ్రీరామచం ద్రస్వామిని స్తుతించెనో, ఆ రామస్తవరాజంబును విస్తారముగా నాకు చెప్పవలయును" అని ప్రార్థింపఁగా శ్రీరామదాసుఁడిట్లు నిరూపించుచున్నాఁడు—బాలుఁడా! చక్కఁగానడిగితివి. ఏకాగ్రచిత్తుఁడవై వినుము. ఆరామచంద్ర స్తవరాజంబును చెప్పెదను॥ ౩ ॥ అవ్యక్తంబును కేవలంబై త్రిగుణాధారంబును శుద్ధచిదాత్మకంబును నిత్యమంగళంబునగు పరబ్రహ్మమే ముక్తినిచ్చునట్టిది॥ ౪ ॥ సర్వవ్యాపకంబగుటచే బ్రహ్మసంజ్ఞనందిన జన్మదుఃఖనివారకంబగుటచే తారకంబనఁబడిన శ్రీరామయను పరమమంత్రమును జపించవలయును. అందువలన బ్రహ్మహత్యాదిసమస్తదురితంబులును పరిహరింపఁబడునని తత్త్వజ్ఞులు తెలియుదురు॥ ౫ ॥ రామ! రామ! శ్రీరామ! యని యెవరు నిరంతరము పఠించెదరో వారికి ఇహలోకమున భుక్తియును పరలోకమున ముక్తియును తప్పకకల్గును. ఇందుకు సంశయములేదు॥ ౬ ॥ మునుపు పరమాత్మయగు పరమేశ్వరునిచే చెప్పఁబడిన శ్రీరామస్తవరాజంబును నేను విష్ణుధ్యానతత్పరుఁడనై నీకు చెప్పుచున్నాను॥ ౭॥ ఆధ్యాత్మికాధి భౌతికాధిదైవికంబులను తాపత్రయంబును పరిహరించువాఁడును సక

రమ్యంపవిత్రమనామయం ॥ ౯ ॥ అయోధ్యానగరే రమ్యే రత్నమంటపమధ్యగే । స్మరేత్కల్ప
పఠంతిశృణ్వంతి ॥ తన్మధ్యేష్టదళంపద్మం నానారత్నైశ్చశోభితం । స్మరేన్మధ్యేదాశరథిం స
గసీన మింద్రనీలసమప్రభం । కోమలాంగం విశాలాక్షం విద్యుద్వర్ణాంబరా
౯ కిరీటైః విరాజితం । రత్నగ్రైవేయకేయూర వరకుండలమండితం ॥౧౩॥ ర
ము । శ్రీవత్సకౌస్తుభోరస్కం ముక్తాహారోపశోభితం ॥ ౧౪ ॥ చింతామణి
దివ్యరత్న సమాయుక్తం ముద్రికాభిరలంకృతం ॥ ౧౫ ॥ కర్పూరాగరు
న్దమందార పుష్పమాల్యైరలంకృతం॥ ౧౬ ॥ రాఘవంద్విభుజంవీరం రామ
రతం యోగేశంయోగదాయకం ॥ ౧౭ ॥ సదాసౌమిత్రిభరత శత్రుఘ్నై
గంధర్వకిన్నరై ॥౧౮॥ యోగీంద్రైర్నారదాద్యైశ్చ స్తూయమానమహర్నిశః।
రితం ॥ ౧౯ ॥ సనకాదిమునిశ్రేష్ఠైః యోగివృందైస్సమావృతం। రామంరఘు
౦॥ మంగళాయతనందేవం రామంరాజీవలోచనం। సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞమానంద

త్రంబును పుణ్యప్రదంబు దారిద్ర్య దుఃఖనాశకుఁడును సమస్తసంపదల నిచ్చువాఁడును శాస్త్రజన్య మానుగ్రహంబుచేయుఁడును ఆనందాత్మకుఁడును ముఖ్యముగా మోక్షానందదాయకుఁడు నగు శ్రీరాముని నమస్కరించి పలికెదను॥ ౯॥ రమ్యమగు నయోధ్యాపట్టణంబున రత్నమంటపంబున కల్పవృక్షమూలమున మంగళంబగు రత్నసింహాసనంబును ధ్యానముచేయ వలయును॥ ౧౦ ॥ దానినడుమ వివిధ రత్న విరాజితంబగు నష్టదళపద్మంబును భావించవలెను. దానినడుమ సహస్రాదిత్య తేజంబుగల్గి దాశరథియై తండ్రి సింహాసనము నలంకరించినవాఁడును ఇంద్రనీలరత్నంబులవలె కాంతిగలవాఁడును సుకుమార గాత్రుఁడును సువిశాల నేత్రుఁడును మెరుపు వన్నెలగల బట్ట గట్టినవాఁడును కోటిసూర్యులవలె వెల్గువాఁడును కిరీట హార కేయూర కుండలకంకణ మంజీర కటిసూత్రాదులచే నలంకృతుఁడును శ్రీవత్సాంకితుఁడును కౌస్తుభధారియును ముక్తాహార సంశోభితుఁడును చింతామణి సంయుతుఁడును మణిమాలాలంకృతుఁడును దివ్యరత్న ముద్రికాశోభితుఁడును కర్పూర కస్తూరీ కాలాగరు కాశ్మీర దివ్యగంధమును లేపించికొనినవాఁడును తులసీ దామముచే మల్లికా పారిజాతాది హారములచే నలంకృతాంగుఁడును మందస్మిత ముఖారవిందుండును ఐక్యానుసంధానంబనబడు యోగమునందాసక్తుఁడును యోగనియామకుఁడును యోగప్రదుఁడును ద్విభుజ వీరరాఘవమూర్తియును ఎల్లప్పుడును లక్ష్మణ భరతశత్రుఘ్నులచే పరివృతుఁడును సురేంద్ర విద్యాధర సిద్ధగంధర్వకిన్నరనారదాది యోగీంద్ర ప్రముఖులచే సంస్తుతింపఁబడినవాఁడును వసిష్ఠ విశ్వామిత్రాది మహర్షులచే పరివృతుఁడును సనకాది మహాయోగీంద్రులచే నాశ్రయింపఁబడినవాఁడును ధనుర్వేద విశారదుఁడును సకల

మతిసుందరం ॥ ౨౧ ॥ కౌసల్యాతనయంరామం ధనుర్బాణధరంహరిం । ఏవంసంచింతయేద్విష్ణుం యజ్ఞోశ్రీత్రిశ్లోకీ షాంపరః॥ ౨౨॥ ప్రహృష్టమనసోభూత్వా సభాయాంవృషభధ్వజః। సర్వలోకహితార్థాయ తుష్టావరఘునందనం॥ ౨౩॥ కృతాంజలిపుటోభూత్వా చింతయన్నద్భుతంహరిం॥౨౪॥ ... ... ... ... ... ... ...

## శ్రీరామ స్తవరాజస్తుతిః.

శ్రీశివఉవాచ—యదేకంయత్పరంనిత్యం యదనంతంచిదాత్మకం ॥ ౨౪ ॥ యదేకంవ్యాపకంలోకే తద్రూపంచింతయామ్యహం। సర్వత్రైలోక్యసౌఖ్యార్థం రామభక్త్యభివృద్ధయే ॥ ౨౫ ॥ విజ్ఞానహేతుంవిమలా యతాక్షంప్రజ్ఞానసందివ్యనుఖైకరూపం। శ్రీరామచంద్రంహరిమాదిదేవం విశ్వేశ్వరంరామమహంభజామి ॥౨౬॥ కవింపురాణంపురుషంపరేశంసనాతనంయోగినమీశితారం । అణోరణీయాంస మనంతవీర్యంప్రాణేశ్వరం రామమహంభజామి॥ ౨౭ ॥ నారాయణంజగన్నాథ మభిరామంజగత్పతిం। కవింపురాణంవాగీశం రామందశరథాత్మజం॥ ౨౮ ॥

కలావిభుఁడును ఆనందమూర్తియును దివ్యసుందరుండును కౌసల్యానందనుండును ధనుర్బాణధారియును కల్యాణనిలయుఁడును దేవదేవుఁడును రఘుకులవీరుఁడును అగు వెలుఁగులవెలుఁగైన రాజీవాక్షుఁడగు రామచంద్రస్వామి నిట్లు ధ్యానించవలయును. వృషభధ్వజుఁడగు శివుఁడు సభలో స్వానందితాంతరంగుఁడై సమస్తలోకంబులకును హితమును కోరి,అద్భుతుఁడగు నచ్యుతునను సంధానముఁజేసి సాంజలియై శ్రీరామచంద్రుని నిట్లుస్తుతించెను.

## శ్రీ శివకృత శ్రీరామ స్తవరాజము.

స్వాతిరిక్త సత్తాశూన్యంబగుటచే నెయ్యది కేవలంబును ఉత్కృష్టంబును త్రికాలాబాధ్యంబగుటచే నిత్యంబును జ్ఞానస్వరూపంబును లోకమున పూర్ణంబునై యున్నదో ఆరూపంబును, ముల్లోకములయందంతట శ్రీరామభక్తియును ఆనందంబును గల్గియుండుటకై నేను భావించెదను॥ ౨౫ ॥ శాస్త్రజన్యజ్ఞానకారణంబును నైర్మల్యవిస్తృతేంద్రియుఁడును ప్రజ్ఞానరూపుఁడును కేవలానందాత్మకుఁడును జగన్నాథుఁడును పాపపరిహారకుఁడును ఆదిదేవంబునగు శ్రీరామచంద్ర సంజ్ఞగల యోగి హృదయారామవ్యక్తిని సేవించెదను ॥ ౨౬ ॥ సర్వజ్ఞుఁడును కాలాపరిచ్ఛిన్నుండగుటచే పురాతనుఁడును; ఆదికారణుఁడును; పరమాత్మయును; సమస్తజ్ఞానేంద్రియములను మనస్సుతోడ నిగ్రహించి క్షేత్రజ్ఞ పరమాత్మలయొక్క ఏకత్వభావనయే యోగమనఁబడును, అట్టి యోగముగల మహాత్ములు యోగులు, యోగక్షేమ వహనాదులచే వారికినేతయగు వాఁడును; సూక్ష్మాతి సూక్ష్ముఁడును; అపారశక్తికుఁడును; అగు ప్రాణేశ్వరుఁడయిన శ్రీరాముని సేవించెదను॥ ౨౭॥ త్రిమూర్తి స్వరూపుఁడును అనాది సర్వజ్ఞుఁడునైనను దశరథనందనుఁడుగా నవతరించి లోకము నుద్ధరించుచుండువాఁడును రాజులకు రాజును రఘువంశ

రాజరాజంరఘువరం కౌసల్యానందవర్ధనం । భర్గంవరేణ్యంవిశ్వేశం రఘునాథంజగద్గురుం॥ ౨౯ ॥ సత్యంసత్యప్రియం(శ్రేష్ఠం జానకీవల్లభంప్రభుం। సౌమిత్రిపూర్వజంశాంతం కామదంకమలేక్షణం॥ 3౦ ॥ ఆదిత్యంరవిమీశానం ఘృణింసూర్యమనామయం । ఆనందరూపిణంసౌమ్యం రాఘవంకరుణాకరం॥ 3౧ ॥ జామదగ్న్యంతపోమూర్తిం రామంపరశుధారిణం । వాక్పతింవరదంవాచ్యం శ్రీపతింపక్షివాహనం ॥ 3౨ ॥ శ్రీశార్ఙ్గధారిణంరామం చిన్మయానందవిగ్రహం । హలధారిణమీశానం బలరామంకృపానిధిం॥ 33 ॥ శ్రీవల్లభంకలానాథం జగన్మోహనమచ్యుతం। మత్స్యకూర్మవరాహాది రూపధారిణమవ్యయం॥ 3౪॥ వాసుదేవంజగద్యోని మనాదినిధనంహరిం। గోవిందంగోపతింవిష్ణుం గోపీజనమనోహరం॥ 3౫ ॥ గోపాలంగోపరీవారం గోపకన్యాసమావృతం । విద్యుత్పుంజప్రతీకాశం రామంకృష్ణంజగన్మయం ॥ 3౬ ॥ గోగోపికాసమాకీర్ణం వేణువాదనతత్పరం । కామరూపంకలావంతం కామినాంకామదంప్రభుః॥ 3౭ ॥ మన్మథంమధురానాథం మాధవంమకరధ్వజం॥ శ్రీధరంశ్రీకరంశ్రీశం శ్రీనివాసంపరాత్పరం॥ 3౮ ॥ భూతేశంభూపతింభద్రం భూతిదంభూరిభూషణం। సర్వదుఃఖహరంవీరం దుష్టదానవమర్దనం॥ 3౯ ॥ శ్రీనృసింహంమహావిష్ణుం మహాంతందీప్తితేజసం। చిదానందమయంనిత్యం ప్రణవంజ్యోతిరూపకం ॥ ౪౦ ॥ ఆదిత్యమండలగతం నిశ్చితార్థస్వరూపిణం। భక్తిప్రియంపద్మనేత్రం భక్తానామీప్సితప్రదం ॥ ౪౧ ॥ కౌసల్యేయంకలామూర్తిం కాకుత్స్థంకమలాప్రియం। సింహాసనేసమాసీనం నిత్యవ్రతమకల్మషం ॥ ౪౨ ॥ విశ్వామిత్రప్రియందాంతం స్వదారనియతవ్రతం। యజ్ఞేశంయజ్ఞపురుషం యజ్ఞపాలనతత్పరం ॥ ౪3 ॥ సత్యసంధంజితక్రోధం శరణాగతవత్సలం । సర్వక్లేశాపహారిణం విభీషణవరప్రదం॥ ౪౪ ॥ దశగ్రీవహరంరుద్రం కేశవంకేశిమర్దనం । వాజిప్రమథనంవీరం సుగ్రీ

జులగు వారిలో (శ్రేష్ఠుండును కౌసల్యానందవర్ధనుఁడును విశ్వేశ్వరమహాభర్గరూపుఁడై లోకగురుఁడగువాఁడును సీతావల్లభుండును మహాప్రభువును సత్పురుషులలో సాధుత్వముగుటవలనఁ సత్యుఁడును శాంతుఁడును లక్ష్మణాగ్రజుఁడును ఇష్టముల నిచ్చువాఁడును పద్మలోచనుఁడును దయానిధియును సహస్రకిరణుఁడును సుఖాత్మకుండును జమదగ్నికి పుత్రుఁడై పరశురాముఁడనఁబడి తపోమహిమచే పొగడ్త నొందినవాఁడును వాగీశ్వరుఁడును వరముల నిచ్చువాఁ[illegible] చెప్పంబడెడు సగుణబ్రహ్మమగువాఁడును మాధవుండును వేదాత్మక గరుడారూఢుఁడును జ్ఞానానందగాత్రుఁడును శార్ఙ్గపాణియును కృపచే బలరామ మూర్తియైనవాఁడును లోకమోహనుఁడును సకలవిశ్వేశ్వరుఁడును మత్స్యకూర్మాద్యవతారముల నెత్తినవాఁడును శ్రీకృష్ణావతారముచే గోగోపగోపీజనవల్లభుండై క్రీడలచే మన్మథ మన్మథుఁడై ప్రద్యుమ్నాది వ్యూహాకారుఁడును లక్ష్మీపతియును లక్ష్మీధరుఁడును లక్ష్మీప్రదుఁడునయి సర్వభూతాంతర్యామియును సకలైశ్వర్య ప్రదాయకుఁడును సమస్తదుఃఖ పరిహారకుఁడును క్రూర రాక్షస సంహారకుండును భక్తిపరవశుఁడై భక్తుల వరంబుల నిచ్చువాఁడును క్షత్రసింహాసనాసీనుఁడును శరణాగతులను రక్షించువాఁడును యజ్ఞ రక్షకుండును యజ్ఞ పురుషుఁడును విజితేంద్రియుఁడును సీతాపతియై యేకపత్నీ

వేష్టితరాజ్యదం॥ ౪౫॥ నరవానరదేవైశ్చ సేవితంహనుమత్ప్రియం। శుద్ధంసూక్ష్మంపరంశాంతం తారకబ్రహ్మరూపిణం॥ ౪౬ ॥ సర్వభూతాత్మభూతస్థం సర్వాధారంసనాతనం। సర్వకారణకర్తారం నిదానంప్రకృతేఃపరం॥ ౪౭॥ నిరామయంనిరాభాసం నిరవద్యంనిరంజనం। నిత్యానందంనిరాకార మద్వైతంతమసఃపరం॥౪౮॥పరాత్పరతరంనిత్యంసత్యానందంచిదాత్మకం। మనసాశిరసానిత్యం ప్రణమామిరఘూత్తమం॥ ౪౯ ॥ భవోద్భవంవేదవిదాం వరిష్ఠమాదిత్యచంద్రానిలసంప్రభావం। సర్వాత్మకంసర్వగతస్వరూపం నమామిరామంతమసః పరస్తాత్॥ ౫౦ ॥ నిరంజనంనిష్ప్రతిమం నిరీహంనిరాశ్రయం కారణమాదిదేవం। నిత్యంధ్రువంనిర్విషయస్వరూపం నిరంతరంరామమహంభజామి॥౫౧ భవాబ్ధిపోతంభరతాగ్రజంతం భక్తిప్రియంభానుకులప్రదీపం। భూతాధినాథం భువనాధిపత్యం భజామిరామంభవరోగవైద్యం ॥ ౫౨ ॥ సర్వాధిపత్యం రణరంగధీరం సత్యంచిదానందసుఖస్వరూపం। సత్యంశివంసజ్జనహృన్నివాసంధ్యేయంపరానందమహంభజామి॥ ౫౩ ॥ కార్యక్రియాకారణమప్రమేయం కవింపురాణం కమలాయతాక్షం। కుమారవేషం కరుణామయంతం కల్పద్రుమంరామమహంభజామి॥ ౫౪ ॥ త్రైలోక్యనాథం సరసీరుహాక్షం దయానిధింద్వంద్వవినాశహేతుం। మహాబలంవేదనిధింసురేశం సనాతనంరామమహంభజామి ॥ ౫౫ ॥ వేదాంతవేద్యం

---

వ్రతస్థుఁడును నరేంద్ర వానరేంద్ర సేవితుఁడును ఆంజనేయప్రియుఁడును జనార్దనుఁడును రావణాంతకుఁడును సుగ్రీవవాంఛితార్థప్రదుఁడును విభీషణవరదుఁడును ప్రకృతినియామకుఁడును సర్వ కారణకారణుఁడును నిత్యబుద్ధశుద్ధ సచ్చిదానందాద్వైత బ్రహ్మంబునగు శ్రీరామచంద్రస్వామికి సాష్టాంగముగా నమస్కరించెదను॥౪౯॥వేదవిద్వరిష్ఠుఁడును సంసారమూలుఁడును సూర్యాగ్ని చంద్రతేజోరూపుఁడును సర్వాంతర్యామియును సర్వమయుఁడును అగు శ్రీరాముని మాయాతీతంబుగా నెఱిఁగి నమస్కరించెదను ॥ ౫౦ ॥ నిర్లేపుఁడును అసమానుఁడును నిష్క్రియుఁడును సర్వాశ్రయుఁడును అనాదికారణ విగ్రహుఁడును సత్యుఁడునగు కేవలానంద స్వరూప బ్రహ్మమయిన శ్రీరాముని సేవించెదను॥ ౫౧॥ సంసారోత్తారకుఁడును రవికులరత్నంబుగా నవతరించి భరతునికగ్రజుఁడై భక్తిపరాధీనుఁడైనను లోకైకప్రభువగుటచే జననమరణ దుఃఖప్రవాహరూప సంసారరోగమునకు వైద్యుఁడైయుండు శ్రీరామునికి నమస్కారము॥ ౫౨॥ సత్యజ్ఞానానంద స్వరూపుఁడును మంగళుండును సాధువుల హృదంతరాళంబులలో పరమానంద విగ్రహుఁడుగా ధ్యానింపఁబడువాఁడునయిన శ్రీరామునికి నమస్కారము॥ ౫౩ ॥ ఈశ్వరుఁడగుటచే కారణాత్మకుఁడై ప్రపంచస్వరూపుఁడగుటచే కార్యాత్మకుఁడై పరిణామాధార కాలాత్మకుఁడగుటచే క్రియాత్మకుఁడై యిట్టివాఁడని యూహించుటకలవిగాని వాఁడును,అనాదిదివ్యరూపముచే కమలాక్షుండై యుండువాఁడును కామితంబుల నిచ్చుటలో కల్పవృక్షంబై యుండెడు శ్రీరాముని సేవించెదను॥ ౫౪॥ ముల్లోకములకు మూలంబును శుద్ధసత్త్వప్రధాన విష్ణురూపుఁడును జ్ఞాననిధియును శోకమోహజరామరణాది ద్వంద్వదుఃఖములను పరిహరించునట్టివాఁడు

కవిమౌళిశారమనాదిమధ్యాంతమచింత్యమాద్యం। అగోచరంనిర్మలమేకరూపం పరాత్పరంరామమహంభజామి॥ ౪౬॥ అశేషవేదాత్మకమాదిదేవమజం హరింరామమనంతమూర్తిం। అపారసంవిత్సుఖమేకరూపం నమామిరామంతమసః పరస్తాత్॥ ౪౭॥ తత్త్వస్వరూపంపురుషంపురాణం స్వతేజసాపూరితమేకమేవ। రాజాధిరాజం రవిమండలస్థం విశ్వేశ్వరంరామమహంభజామి॥ ౪౮॥ యోగీంద్రసంఘైరపిసేవ్యమానం నారాయణంనిర్మలమాదిదేవం। నతోస్మినిత్యం జగదేకనాథం హరించిదానందమయంముకుందం॥ ౪౯॥ అశేషవిద్యాధిపతింనమామి రామంపురాణం తమసఃపరస్తాత్। విభూతిదంవిశ్వసృజం విరాజంరాజేంద్రమీశం రఘువంశనాథం॥ ౫౦॥ అచింత్యమవ్యక్తమనంతరూపం జ్యోతిర్మయంరామమహంభజామి। అశేషసంసారవికారహీన మానందసంపూర్ణసుఖాభిరామం॥ ౫౧॥ నారాయణంవిష్ణుమహంభజామి సమస్తసాక్షింతమసఃపరస్తాత్। మునీంద్రగుహ్యం పరిపూర్ణమేకం కలానిధింకల్మషనాశహేతుం। పరాత్పరంయత్పరమం పవిత్రం నమామిరామం మహతోమహాంతం॥ ౫౨॥ బ్రహ్మావిష్ణుశ్చరుద్రశ్చ దేవేంద్రోదేవతాస్తథా। ఆదిత్యాదిగ్రహాశ్చైవ త్వమేవరఘునందన॥ ౫౩॥ తాపసాఋషయస్సిద్ధా స్సాధ్యాశ్చమునయస్తథా విప్రావేదాశ్చయజ్ఞాశ్చ పురాణంధర్మసంహితాః॥ ౫౪॥ వర్ణాశ్రమాస్తథాధర్మా వర్ణధర్మాస్తథైవచ। నాగాయక్షాశ్చ

నగు శ్రీరామునికి నమస్కారము॥ ౪౫ ॥ అదిమధ్యాంత శూన్యుఁడును అగోచరుఁడును నిర్మలుఁడును కేవలచిదానందాత్మకుఁడును ఉపనిషత్ప్రతిపాద్యుఁడును సర్వజ్ఞుఁడునగు శ్రీరామునికి నమస్కారము ॥ ౪౬ ॥ సకల సారస్వత విద్యాత్మకుండును జన్మరహితుఁడును ఆదిదేవుఁడును అనంతవిగ్రహుఁడును అపారజ్ఞానానందైకాకారుఁడునగు శ్రీహరి రామచంద్రస్వామికి నమస్కారము ॥ ౪౭॥ ప్రకృతి తత్త్వాత్మకుఁడై పురాణపురుషుఁడై నిజాంశమువలన నిండి తానొక్కఁడుగానే నిలచినవాఁడునై విశ్వపతియనఁబడి రవిమండల మధ్యవర్తియైయారవివంశమును రాజరాజగు శ్రీరామాకృతిచే రంజింపఁజేసిన పరమాత్మకు నమస్కారము॥౪౮॥సనకాది యోగీంద్రుల బృందముచే వందితుఁడై నిర్మలనిత్య జ్ఞానానందస్వరూపుఁడై మోక్షప్రదుఁడగు శ్రీమన్నారాయణునికి నమస్కారము॥ ౪౯॥ రఘువంశాలంకార రామావతారముచేసిన ప్రపంచమునుసృష్టించిన సకలైశ్వర్యప్రదుఁడగు మాయాతీత సనాతన బ్రహ్మకు నమస్కారము॥ ౫౦॥ నానావిధంబులగు సంసృతివికారంబుల కంటనివాఁడును పరిపూర్ణానంద ఘనుఁడగుటచే నభిరాముఁడను మనోవాగగోచరుఁడును తేజస్స్వరూపుఁడునగు శ్రీరామునికి నమస్కారము॥౫౧॥ మహత్తత్త్వంబులగు త్రిమూర్తులకుపైని మహత్తత్త్వంబగు కేవలబ్రహ్మంబునుసర్వసాక్షియును సర్వాత్మకుఁడును దురిత పరిహారకుఁడును పరమపవిత్రుఁడును వ్యాపకుఁడు నగు శ్రీమన్నారాయణునికి నమస్కారము॥ ౫౨॥ శ్రీరామా! బ్రహ్మ విష్ణు రుద్రులను త్రిమూర్తులును దేవేంద్రుఁడును సురులును సూర్యాది గ్రహంబులును నీవుగానున్నావు ॥ ౫౩॥ తపస్విజనులును ఋషులును సిద్ధులును సాధ్యులును ధ్యానసంపన్నులును బ్రాహ్మణులును వేదంబులును య

గంధర్వాదిశ్వాలాదిగ్గజాదిశః ॥౧౫॥ వసవోష్టౌత్రయఃకాలారుద్రాఏకాదశస్మృతాః । తారకాద్ద్వాదశాదిత్యా స్త్వ మేవరఘునాయక ॥ ౧౬ ॥ సప్తద్వీపాస్సముద్రాశ్చ నదానద్యస్తథాద్రుమాః । స్థావరాజంగమాశ్చైవ త్వమేవరఘునందన ॥ ౧౭ ॥ దేవతిర్యఙ్మనుష్యాణాం దానవానాందివౌకసాం । మాతాపితాతథాభ్రాతా త్వమేవరఘునందన ॥ ౧౮ ॥ సర్వేశస్త్వంపరంబ్రహ్మ త్వద్రూపంవిశ్వమేవచ । త్వమక్షరంపరంజ్యోతి స్త్వమేవరఘుపుంగవ॥౧౯॥ శాంతంసర్వగతంసూక్ష్మం పరంబ్రహ్మసనాతనం । రాజీవలోచనంరామం ప్రణమామిజగత్పతిం ॥ ౨౦ ॥ తతఃప్రసన్నశ్శ్రీరామః ప్రోవాచవృషభధ్వజం ॥ * ॥ శ్రీరామ ఉవాచ—తుష్టోహంగిరిజాకాంత వృణీష్వవరముత్తమం॥౨౧॥ శ్రీశివ ఉవాచ—యదితుష్టోసిదేవేశ శ్రీరామకరుణానిధే । తవాద్యదర్శనేనైవ కృతార్థోహంనసంశయః ॥ ౨౨॥ ధన్యోహంకృతకృత్యోహం పుణ్యోహంపురుషోత్తమ । అద్యమేసఫలంకర్మ హ్యద్యమేసఫలంతపః ॥ ౨౩ ॥ అద్యమేసఫలంజ్ఞాన మద్యమేసఫలంశ్రుతం । అద్యమేసఫలంసర్వం త్వత్పదాంభోజదర్శనాత్ ॥౨౪ ॥ అద్వైతంవిమలంజ్ఞానం త్వన్నామస్మరణంతథా । త్వత్పదాంభోరుహద్వంద్వే సద్భక్తిందేహిరాఘవ ॥ ౨౫ ॥ తతఃపరంసుసంప్రీతో

---

జ్ఞంబులును స్కాందాది పురాణంబులు మన్వాది శాస్త్రంబులు నారద వసిష్ఠ విశ్వామిత్రాది సంహితలు, అష్టవసువులు త్రికాలంబులు ఏకాదశరుద్రులు సప్తవింశతి నక్షత్రంబులు ద్వాదశాదిత్యులు సప్తద్వీపంబులు సముద్రంబులు నదీనదంబులు వృక్షంబులు చిట్టచివరకీ చరాచరాత్మకంబగు ప్రపంచంబంతయును నీవుగానున్నావుగనుకనే నీవు విరాట్పురుడవై యుందువు॥ ౨॥ శ్రీరామా! సురులకు నరులకు తిర్యగ్జంతుజాలమునకు రాక్షసులకు స్వర్గవాసులకు నందరికిని నీవేతల్లి నీవేతండ్రి నీవేఅన్నగానున్నావు ॥౧౮॥ రఘువర్యా! నీవేసమస్తనియామకుండవు, సర్వోత్తముండవు, సర్వవ్యాపకుండవు. నీవిరాట్స్వరూపమే ఈప్రపంచము, నీవునాశరహితుండవు. నీవే చిత్ప్రకాశకుండవు ॥ ౧౯ ॥ ఏకములనయనుండు లోకపతియై సూక్ష్మాతిసూక్ష్ముడై యంతట నన్నిటిలోను వ్యాపించి స్థూలాతిస్థూలంబై యగోచరంబనంబడి శుద్ధసత్త్వతేజంబుగా నున్నాడో, అట్టి రామచంద్రస్వామికినమస్కారము ॥ ౨౦॥ * ॥ ఇట్లు స్తుతించుచుండగా శ్రీరాముడు పరమేశ్వరునింజూచి "పార్వతీపతీ! నేను ప్రసన్నుండనైతిని. మేలైనవరమునువేడుము" అని పలికెను. అందుకు శంకరుండు "దయానిధియగు శ్రీరామా! నీవుప్రసన్నుండవయితే, నేను నీదర్శనముచేతనే ధన్యుండనయితిని. ఇందుకుసంశయములేదు. నేనేధన్యుండను. నేనే కృతకృత్యుండను. నేనేపుణ్యవంతుండు. పురుషోత్తమా! నీపాదకమలములను దర్శించినందువలన నేడు నాసుకృతముపండినది. నాతపస్సునేడుఫలించినది. నాజ్ఞానమీదినమున సఫలమయ్యె. నేడునా తెలివి ఫలితమయ్యె. సర్వమునిప్పుడేసుఫలంబాయెను. శ్రీరామా! నీపాదారవిందద్వంద్వమున సద్భక్తిని నీనామస్మరణంబును నిర్మలంబగు నద్వైతజ్ఞానంబును నాకిమ్ము" అని ప్రార్థించెను॥ ౨౫ ॥ ఆతరువాత గూడ శ్రీరాముడు సంప్రీతుండై "పూజ్యుండగుశంకరుండా! మరలనీ

రామః ప్రాహ సదాశివం । గిరిజేశ మహాభాగ పునరిష్టం దదామ్యహం ॥౭౬॥ * శ్రీశివ ఉవాచ—వరం నయాచే రఘునాథ యుష్మత్పదాబ్జభక్తిస్సతతం మమాస్తు । ఇదం ప్రియం నాథ వరం ప్రయచ్ఛ పునః పునస్త్వామిద మేవ యాచే ॥౭౭॥* రామదాస ఉవాచ—ఇత్యేవమీడితో రామః ప్రాదాత్తస్మై వరాంతరం। తేనోక్తః స్తవరాజాయ దదౌ నానావరాన్ బహూన్ ॥౭౮॥ ఏవం శివేనయః ప్రోక్తః స్తవరాజశ్శుభావహః । సఏవాద్య త్వయా పృష్టస్తవాగ్రేః కథితో మయా॥౭౯ ॥ అయం శ్రీరఘునాథస్య స్తవరాజో హ్యనుత్తమః । సర్వసౌభాగ్యసంపత్తి దాయకో ముక్తిదః స్మృతః ॥ ౮౦॥ కథితో గిరిజేశేన వేదానాం సారసంగ్రహః । గుహ్యాద్గుహ్యతరో నిత్యః స్తవస్నేహాత్ప్రకీర్తితః ॥౮౧॥ యః పఠేచ్ఛృణుయాద్వాపి త్రిసంధ్యం శ్రద్ధయాన్వితః । బ్రహ్మహత్యాదిపాపాని తత్సమాని బహూనిచ ॥ ౮౨ ॥ హేమస్తేయ సురాపాన గురుతల్పాయుతానిచ । గోవధాద్యుపపాపాని చింతనాత్సంభవానిచ ॥ ౮౩ ॥ సర్వైః ప్రముచ్యతే పాపైః కల్పాయుతశతోద్భవైః । మానసం వాచకం పాపం కర్మణా సముపార్జితం ॥ ౮౪ ॥ శ్రీరామస్మరణేనైవ వ్యపోహతి న సంశయః । ఇదం సత్యమిదం సత్యం సత్యం నైవాన్యగుచ్యతే ॥౮౫॥ రామస్సత్యం పరం బ్రహ్మ రామాత్కించి

యిష్టమును చెప్పుము ఇచ్చెద" ననెను. అందుకు చంద్ర శేఖరుఁడు "రాఘవస్వామీ! నేనువరమును వేడను. నీపాదారవిందభక్తి సతతము నాకు గల్గియుండని. ఈ ఒక్క వరమును మాత్రమిమ్ము. మరలమరల దీనినే వేడెదను."అని మందలించెను.ఇట్లు స్తుతింపఁబడిన శ్రీరాముఁడు శివునికి వేఱేవరమునిచ్చెను. శివోక్తంబగు శ్రీరామస్తవరాజంబునకును అనేకంబులగు వివిధవరంబుల నిచ్చెను. అనియిట్లు రామదాసుఁడు చెప్పుచున్నాఁడు॥౭౮॥ విష్ణుదాసుఁడా! వినుము. ఇట్లు సర్వమంగళేశ్వరునిచే చెప్పఁబడిన మంగళప్రదంబగు శ్రీరామస్తవరాజంబే నీచే నిప్పుడడుగఁబడెను. దానినే నీయెదుట నేను చెప్పితిని.ఉత్తమోత్తమంబగు శ్రీరామచంద్రుని స్తోత్రరాజంబిది ఇహమున సమస్త సౌభాగ్యంబులనిచ్చి పరమున ముక్తిప్రదంబై యున్నది॥ ౮౦ ॥ శ్రీ పరమేశ్వరునిచే చెప్పఁబడి దేవతలలో సారముగా గ్రహింపఁబడిన పరమ రహస్యంబగు నీ సనాతనస్తోత్రంబు నీకు ప్రీతిచే చెప్పఁబడెను. ప్రాతర్మధ్యాహ్న సాయంకాలంబులలో నక్కరగల్గి యెవ్వఁడు దీనిని పఠించునో శ్రవణముచేయునో వాఁడు-బ్రహ్మహత్యాది పాపములు వాటితో సమానములయినవి స్వర్ణస్తేయము సురాపానము గోవధ గురుతల్పగమనము మొదలగునవి మఱియు నుపపాతకంబులు మఱి మానసికపాపంబులు ఇట్టి కల్పాంతరమునుండి సంచితంబులగు సమస్త దురితంబులచే పరిముక్తుఁడై సుఖించును. శ్రీరామయని స్మరించినంతమాత్రమున కాయిక వాచిక మానసికంబులను త్రికరణ దురితంబులును తప్పక పరిహరించును. ఇందుకు సంశయములేదు. ఇది సత్యము, ఇది యథార్థము, ఇంతకన్నను వేఱొకటి సత్యముకాదు, త్రైకాలికాబాధ్య శుద్ధ బుద్ధ సచ్చిదానంద పరబ్రహ్మంబు రాముఁడొక్కఁడే. రామునికన్నను వేఱొక్కటిలేదు. కనుక శ్రీరాముని స్వరూపమునే మననము చేయవలెనుకదా? ఈ సమస్తజగం

ఛిన్నవిస్యతే। తస్మాద్రామస్వరూపంహి రామస్సర్వమిదంజగత్ ॥౨౬॥ శ్రీరామచంద్రరఘుపుంగవరాజవర్య రాజేంద్రరామరఘునాయకరాఘవేశ। రాజాధిరాజరఘునాయకరామచంద్ర దాసోహమద్యభవతశ్శరణాగతోస్మి ॥౨౭॥ ఉత్ఫుల్లామలకోమలోత్పలదళ శ్యామాయరామాయచా । కామాయప్రశమాయనిర్మలగుణ గ్రామాయరామాత్మనే । ధ్యానారూఢమునీంద్రమానససరోహంసాయసంసారవిధ్వంసాయస్ఫురదోజసే రఘుకులోత్తంసాయపుంసేనమః ॥౨౮॥ ఏవంశిష్యమయాప్రోక్తో యథాపృష్టస్త్వయామమ । స్తవరాజోరాఘవస్య శ్రవణాత్పాపనాశనః ॥౨౯॥* ఇతిశ్రీ శతకోటిరామచరితాంతర్గత శ్రీమదానందరామాయణే విలాసకాండే వాల్మీకీయే రఘువీరస్తవరాజోనామ ప్రథమస్సర్గః ॥ ... ... ... ... ... ... ... ... ... ౧॥*

విష్ణుదాస ఉవాచ—గురోత్రేప్రష్టుమిచ్ఛామి తత్త్వంమాంవక్తుమర్హసి । అయోధ్యాయాంరాఘవేణ సీతయాతిసురూపయా ॥ ౧ ॥ కథంభుక్తావరాభోగాః కింకిమాచరితంశుభం । చరిత్రంతస్యసకలం వదమంగళదాయకం ॥ ౨ ॥ రామదాస ఉవాచ—సమ్యక్పృష్టంత్వయావత్స సావధానమనాః శ్రుణు । రణదీక్షాంవాజిమేధ దీక్షాంచరఘునందనః ॥ ౩॥ నిర్వాహ్యసీతయారేమే ఽయోధ్యాయాంబంధుభిస్సుఖం । జానకీంరంజయామాస నానాభోగైర్మనోహరైః ॥ ౪ ॥ తత్కించిచ్ఛ్రుణుమాంగల్యం విలాసచరితంశుభం । సీతాయాఃకోసలేంద్రస్య శ్రవణాన్మంగ

బును రాముఁడుగానున్నది. రఘునందనుఁడై రాజాధిరాజునై శ్రీరామచంద్రావతారముచే లోకరంజకుఁడై బరగిన పరబ్రహ్మమూర్తి నీకు చరణకింకరుండగు నేను శరణాగతుఁడైయున్నాను. వికసితవర మృదులోత్పలదళ శ్యాముఁడును నిర్మల గుణాభి రాముఁడును నిష్కాముఁడును రఘుకులకాంతుఁడును శాంతుఁడును ధ్యానించుచుండు మునీంద్రుల మానససరస్సులకు రాజహంసుఁడును సంసార విధ్వంసుఁడును రవివంశోత్తంసుఁడును నిత్యశుద్ధ బుద్ధ ముక్త సచ్చిదానందాద్వయ తేజంబునగు పురుషోత్తమునికి నమస్కారము. శిష్యుఁడా! ఇట్లు నీవడిగిన శ్రీరామ స్తవరాజంబు శ్రవణమాత్రమున దురితహారణంబగుటం జేసి నీకు చెప్పఁబడినదని శ్రీరామదాసుఁడు నిరూపించెను. ... ... ... ... ౧॥

శ్రీరాములవారి సుఖసామ్రాజ్యభోగ మందిరవర్ణనము.

వినుచున్న విష్ణుదాసుఁడు "స్వామీ! నేనడుగగోరెదను. మీరు చెప్పుటకు తగినవారలు. దివ్య మోహనాంగియగు సీతతోడ శ్రీరాముఁడు అయోధ్యలో నఖిలభోగంబుల నెట్లనుభవించెను. ఏమేమి మంగళంబులనాచరించెను. కల్యాణప్రదంబగు శ్రీరాముని సర్వచరిత్రంబును చెప్పవలయు" నని ప్రార్థించెను. రామదాసుఁడు చెప్పుచున్నాఁడు—చక్కఁగా నడిగితివత్సా! చెప్పెదను, అక్కరతో వినుము. శ్రీరాముఁడు యుద్ధదీక్షను అశ్వమేధదీక్షను పరిసమాప్తిజేసి అయోధ్యలో సీతా లక్ష్మణ భరత శత్రుఘ్నాదులతో నానందించెను. మనోరంజకంబులగు వివిధభోగంబులచే సీతను సంతోషపరచెను. వినినమాత్రమున సౌభాగ్యఫలదంబైన

శప్రదం ॥ ౫ ॥ కః కృత్స్నం చరితం వక్తుం తయోః క్రీడాన్వితం క్షమః । అతస్సంక్షేపతః కించిద్వక్ష్యామి తవ సన్నిధౌ ॥ ౬ ॥ అథ సీతాయుతో రామః పార్వత్యా శంకరో యథా । క్రీడాం చకార కైలాసే హ్యయోధ్యాయాం స తథాకరోత్ ॥ ౭ ॥ హైమరత్నమయే దివ్యే గేహే వైకుంఠసన్నిభే । నిద్రాస్థానం రాఘవస్య మనోజ్ఞం శశిసన్నిభం ॥ ౮ ॥ భిత్తౌ రత్నోపలా యత్ర హేమ్నః పంక్తిస్తి యత్ర హి । యత్ర స్తంభాః స్ఫాటికాశ్చ యత్ర మారకతోద్భవాః ॥ ౯ ॥ ప్రతోళ్యశ్చ కృతాశ్శోరమ్యాశ్చేంద్రనీలాదిభిః శ్రితాః । ముకురై రుజ్జ్వలా యత్ర భిత్తయశ్చిత్రచిత్రితాః ॥ ౧౦ ॥ యత్ర హేమమయీ భూమిర్యత్ర ముక్తామయీ శుభా । వితానం పుష్పహారైశ్చ ముక్తాగుచ్ఛైర్విరాజితం ॥ ౧౧ ॥ హేమతంతుమయాన్యత్ర భిత్తివస్త్రాణ్యనేకశః । యత్రాయుతమనుష్యైశ్చ సంమర్దో నైవ జాయతే ॥ ౧౨ ॥ ఏవం తద్విస్తృతం రమ్యం రత్నదీపైర్విరాజితం । హేమకుంభా విరాజంతే ప్రాసాదాగ్రేషు చిత్రితాః ॥ ౧౩ ॥ యత్ర చిత్రాణ్యనేకాని మోహయంతి మృగీదృశాం । యత్ర హేమమయా రమ్యాః పర్యంకాశ్చిత్రచిత్రితాః ॥ ౧౪ ॥ హేమకౌశేయసంభూతతంతుపట్టైర్విగుంఫితాః । మహార్ఘవసనైః పుష్పజాలైరాచ్ఛాదితాశ్శుభాః ॥ ౧౫ ॥ చతుష్కోణే లంబమానముక్తాఘోషైర్విరాజితాః । యేషు దివ్యాః కశిపవస్తథోపబర్హణాని చ ॥ ౧౬ ॥ కేకిపక్షమయాన్యేషు చామరాణి మహాంతి చ । గోపుచ్ఛతాలఖర్జూరీసంభవానీ సంతి హి ॥ ౧౭ ॥ చతుష్కోణేషు సర్వేషాం మంచకానాం మహా

---

అట్టి శ్రీసీతారాములయొక్క దివ్యమంగళ విలాస చరిత్రమును కొంచము వినుము. వారియొక్క క్రీడా కౌతుకమంగళ చరిత్రంబును సమగ్రముగా చెప్ప నెవనిదరము. కావున సంగ్రహించి నీయెదుట కొంచెము చెప్పెదను॥ ౬ ॥ తరువాత నా శ్రీరాముండు అయోధ్యలో సీతాసమేతుండై కైలాసంబున గిరిజతోడ శ్రీశంకరుఁడు సుఖక్రీడలనందినట్లు క్రీడించుచుండెను. శ్రీవైకుంఠముతో సమానంబైన సువర్ణ రత్నాలంకృతంబగు రాజమందిరంబున శ్రీరాములవారి శయ్యాగృహము చంద్రునివలె వెల్గుచు మనోహరంబుగానుండును. అందులోని గోడలు బంగారుగారవేసి రత్నశిలలచే కట్టఁబడినవి. అచ్చట స్ఫటిక స్తంభంబులును పచ్చల కంబంబులును, ఇంద్రనీలాదులు చెక్కబడిన మధ్యమార్గంబులును, గోడలలో నలంకరింపఁబడి చిత్రవిచిత్రితంబులయిన దర్పణంబులును, గల్గియుండె. నేలంతయును బంగారము. ఎచ్చటచూచినను మంచిముత్తెములు. పూలదండలచేతను ముత్తెముల హారములచేతను మేలుకట్లు మేలైయుండును. బంగారుసరిగెల తెరబట్టలు కట్టబడియుండును. అచ్చట పదివేలమంది గుంపుచేరినను అల్లరికాచాలదు. ఇట్లది మనోహరంబుగాను విస్తారంబుగాను విరాజించుచుండును. రత్నదీపంబులును సువర్ణకలశంబులును ప్రాసాదాగ్రంబులలో ప్రకాశించుచుండును. అచ్చటి చిత్రంబులు స్త్రీలకు మోహజనకంబులైనవి. చిత్రాలంకారంబుల బంగారుమంచములు బరగుచుండును. అవి సరిగె పట్టుబట్టలచే కప్పఁబడినవి. పూలపాన్పులు గలవు. నాలుగుమూలలలో ముత్తెములకుచ్చులును దివ్యాంబరంబులు తలగడలు నెమలిపురుల చామరంబులు ఆవుతోక

జ్వాలాః । రత్నదీపాఃప్రకాశంతే సదైవాగ్నిశిఖోపమాః ॥ ౧౮ ॥ ఉశీరవ్యజనాదీని చామరాదీనిసంతిహి । యత్రతాంబూలపాత్రాణి హేమరత్నోద్భవానిచ ॥ ౧౯॥ తథావిక్షీవనాగ్ధంహి పాత్రాణిరాజతానిచ । యత్రరంభోపమాదాస్య శ్శతశోరత్నభూషితాః ॥౨౦॥ చామరైర్వీజయంత్యేశ్చ సీతారామావహర్నిశం । యత్రహేమమయాశ్చిత్రా బద్ధాస్తేపంజరాశ్శుభాః ॥ ౨౧ ॥ యేయాగేనృపపత్నీభిః శ్రీసీతాయాస్సమర్పితాః । యేషువైకేకినోహంసాస్సారసాస్సారికాశ్శుకాః ॥ ౨౨ ॥ లావకాఃకోకిలాద్యాశ్చ నానాయేన్యేపతత్రిణః । నానాశబ్దాన్ప్రకుర్వంతశ్శతశస్తేషుసంస్థితాః ॥ ౨౩ ॥ తేషాంశబ్దస్యశివ్యత్వాం కింప్రాకట్యంవదామ్యహం । యేరామస్మరణేనైవ జీవన్ముక్తానసంశయః ॥౨౪॥ పక్షిణఊచుః—జయతురాఘవోజానకీయుతో । జయజరాజరాజేశ్వరేశ్వరః ॥ దశరథాత్మజోలక్ష్మణాగ్రజో జయతుమాపతిస్తాటకాంతకః ॥౨౫॥ జయతుకౌశికస్యాధ్వరంగతో, జయతురక్షసాంమారకోమహాన్ । జయతుగౌతమాహల్యయాస్తుతో జయతుజానకీతాతమానితః ॥౨౬॥ జయతునఃపతిశ్చాపఖండనో జనకజాకరాన్స్రక్తమాలయా, నృపసభాంగణేకౌశికానుగఃపరమశోభితశ్చాతిహర్షితః ॥౨౭॥ జయతుభూమిజాంఘ్ర్యాత్తదాముదా । నిజకరోత్పలేస్థాప్యరాఘవః । కమలమస్తకేనాకరోన్నతిం । సరఘునందనఃపాతునస్సుఖం॥౨౮॥జయతుభూమిజాలింగితోమహాన్ । జనమనోహరశ్చాతిశోభనః। భృగుభవార్పితంస్వత్యవైధనుర్నిజపితుస్తదాదర్శయన్

తాటి పేర్చిన పీటవల్లగల్గిన సామగ్రులును గలవు. మంచముల నాల్గుమూలలలోను ఎల్లప్పుడును దివ్యకాంతులుగల రత్నదీపంబులు అగ్నిజ్వాలలవలె వెల్గుచుండును. వట్టివేరు విసనకఱ్ఱలు మొదలయిన చామరంబులు మొదలయినవి సువర్ణ రత్నాలంకృత తాంబూలపాత్రలు అట్లే వెండి యుమిగిన్నెలు గలవు. అచ్చట రంభాసమాన దాసీజనులు నూర్లకొలదిగా రత్నాలంకృతలై యుందురు. వారు శ్రీ సీతారాములకు అహర్నిశంబుగా చామరంబు వేయుచుందురు. యజ్ఞంబున రాజపత్నులచే శ్రీ జానకీదేవికి సమర్పింపబడిన నెమళ్లు హంసలు బెగ్గురుపిట్టలు చిలుకలు గోరింకలు కోయిలలు లావుకపిట్టలు మొదలయిన నానాపక్షులుగల సువర్ణరత్నపంజరంబులు రంజించుచుండును. ఆగూండ్లలోనవి నూర్లకొలది పలుపలుకులచే కోలాహలంబొనరించుచుండును. శ్రీరామస్మరణవలన నవన్నియును జీవన్ముక్తంబులనందగును ॥ ౨౪ ॥ ఆ పక్షులు శ్రీరాములచరిత్రము నిట్లు పాడుచుండినవి:—ఈశులకేశుం

## శ్రీరామ స్తుతిరూపక పక్షిగీతానవకంబు.

డైన యే లక్ష్మీపతి రఘువంశంబున దశరథనందనుఁడై యవతరించి లక్ష్మణుని యన్నయై తాటకిని సంహరించెనో అట్టి రాజులరాజగు రాముఁడు సీతాసమేతుఁడుగా సర్వోత్కృష్టుండగుగాత. విశ్వామిత్రుని యజ్ఞమును సంరక్షించుచు రాక్షసులను సంహరించువాఁడై శాపముక్తయగు నహల్యచే సంస్తుతింపఁబడిన జనకరాజుచే సంమానింపఁబడిన శ్రీ సీతారామమూర్తి సర్వోత్కృష్టుఁడై యుండని. ఏ మాయొక్క నాథుఁడు శైవచాపమును

బలం ॥౨౮॥ జయతు సీతయా భోగకృచ్చిరం । జయతు కైకయీప్రేరితో వనం। జయతు పర్వతే వాసకృచ్చిరం జయతు యోఽత్రిణా పూజితో వనే ॥౩౦॥ జయతు యో విరాధస్య పాతకృజ్జయతు దూషణాదిప్రమర్దనః । జయతు యో మృగం మోచయద్భవా । జ్జయతు యోఽకబంధం తణాజ్జహౌ ॥ ౩౧ ॥ జయతు వాలిహా సేతుకారకో జయతు రావణాదిప్రమర్దకః । జయతు స్వంపదం ప్రాపసీతయా। జయతు మంగళస్నానకృన్ముదా ॥ ౩౨ ॥ జయతు వాక్యతో భూసురస్య యః। స్సకలభూతలం పర్యటన్ చిరం । జయతు యాగకృల్లోకశిక్షయా । జయతు జానకీం రంజయన్ స్థితః ॥ ౩౩॥ శ్రీరామదాస ఉవాచ—రఘువరస్య యుత్పక్షిభిః కృతం । నవకముత్తమం యః పఠిష్యతి । తపన నిగమే భక్తితత్పరో నిజమనోరథం తం సంగమిష్యతి ॥ ౩౪ ॥ ఏతాదృశే రమ్యగేహే మయా శిష్య ప్రవర్ణితే । సీతయా స సుఖం రేమే చైకపత్నీవ్రతస్థితః ॥౩౫॥ అథ సా జానకీదేవీ రంజయామాస రాఘవం । స్థితం మంచకవర్యే తం నిజక్రీడాదకౌతుకైః ౩౬ ॥ మంచకస్థశ్చ శ్రీరామస్త్వేకదా సుఖనిర్భరః । సీతాసౌందర్యమాలోక్య వర్ణయామాస తాం ముదా ॥ ౩౭ ॥ హే సీతే

ఖండించి సీతాదేవీ పాణిపద్మమునుండి పుష్పమాలికనంది రాజసభలో విశ్వామిత్రానుచరుండై మిగుల ప్రకాశించె నా శ్రీ సీతారామమూర్తి సర్వోత్కృష్టుండుగానుండని. తన కరకమలంబులచే సీతా చరణారవిందంబుల నలంకరించి నిజమస్తకాలంకృతం బగునట్లు వందించిన శ్రీరాముండు జయశాలియైయుండని. ఎవండు సీతాసమాలింగితుండగుటచే భువనసుందరుండై వచ్చుచు నిజజనకుండగు దశరథునికి పరశురామ ధనురాకర్షణముచే నిజబలమునెఱింగించె నతండు జయించుచుండని. సీతతోడ చిరకాలము భోగించు వాండు జయించని. కైకేయిచే వనమున కంపబడినవాండు జయించని. బహుకాలము పర్వతవాసియగువాండు జయించని. అరణ్యంబున నత్రిచే సంపూజింపంబడినవాండు జయించని. విరాధునిని హింసించి ఖరదూషణాదులను సంహరించి మాయామృగంబునకు జన్మరాహిత్యమునిచ్చి కబంధునిం జంపినవాండు జయాన్వితుండై బరగుచుండవలయును. వాలిని సంహరించి సేతువునుకట్టించి రావణాదులను నిర్మూలించి నిజరాజ్యమునకేతెంచి మంగళస్నానముచే లోకమోహనుండై వెల్గినవాండు జయయుతుండగుగాక. బ్రాహ్మణవాక్యముచే భూమిని చుట్టివచ్చి లోకశిక్షకై యజ్ఞంబుల నాచరించి సీతాదేవితోడ క్రీడించుచుండువాండు జయియై విరాజించుచుండని॥ 33 ॥ సూర్యాస్తసమయంబున భక్తితో నెవ్వండు ఈ పక్షులచే పాడబడిన తొమ్మిదిశ్లోకములను చదువునో వానికి మనోరథంబులు కూడివచ్చును. ఇట్టి మనోహరంబగు మందిరంబున శ్రీరాముండు ఏకపత్నీవ్రత పరాయణుండై

శ్రీరాముండు సీతాదేవి నభివర్ణించుట.

సీతతోడ సుఖముగా క్రీడించుచుండెను. పిదప జానకీదేవి పర్యంకస్థితుండైన శ్రీరామునిని తన యాటపాటలు మొదలగు వేడుకలచే రంజింపంజేసెను. ఒకప్పుడు మంచముపై యెక్కియున్న శ్రీరాముండు సీతయొక్క సౌందర్యమునుచూచి సంతోషముతో నిట్లభివర్ణించెను. ఓసి జానకి!

కంజనయనే బ్రహ్మణాత్వంకథంచితా । జానామ్యహంవితర్కేణ తేనత్వంనిర్మితాసిన ॥ ౩౮ ॥ త్వద్రూపసదృశీం నాన్యాం పశ్యామిజగతీతలే । ప్రతిపచ్చంద్రకలయా స్పర్ధయంతినఖానితే ॥ ౩౯ ॥ నఖమధ్యారక్తవర్ణా శ్శుభా దాడిమబీజవత్ । అంగుష్ఠౌవర్తులౌరమ్యౌ శిశ్వంగుష్ఠోపమాతివ ॥ ౪౦॥ మృదులేతేపాదతలే కంజపత్రాంతరోపమే। సమేరేఖాధ్వజయుతే స్వస్తికాదిసుచిహ్నితే ॥ ౪౧ ॥ సీతేతేంఘ్ర్యూర్ధ్వభాగౌతౌ నిర్లోమౌమాంసలౌశుభౌ। అతిరామృదులౌపీతౌ నృపస్త్రీవందనోచితౌ ॥ ౪౨ ॥ పాదమూలేదధిజేన స్పర్ధేతేరక్తవర్తులే । పాదపృష్ఠే సమే పీతే కోమలేలోమవర్జితే ౪॥౩॥ తవగుల్ఫౌంకత్తవర్ణౌ వర్తులౌమాంసలౌశుభౌ। జంఘేగోపుచ్ఛసదృశే వర్తులేమాంసలేశుభే ॥ ౪౪ ॥ నిర్లోమేమృదులేపీతే హ్యశిరేవిరలేవరే । వర్తులౌతేమహాజానూ మాంసలౌబీజపూరవత్ ॥ ౪౫॥ రంభాస్తంభోపమేచోరూ మాంసలౌత్వతికోమలౌ। పీతౌఘనౌవర్తులౌతౌ విలోమౌమేసుఖోచితౌ ॥౪౬॥ జఘనే మాంసలేరమ్యేవర్తులేగజకుంభవత్ । పీతేవిలోమేసుస్నిగ్ధే మమచిత్తైకమోహనే ॥ ౪౭ ॥ నాహంతేవర్ణనేశక్తో రతిస్థానస్యభామిని।గంభీరావర్తులానాభి స్తవరమ్యాప్రదృశ్యతే॥ ౪౮॥వలిత్రయంతుజఠరే దృశ్యతేశత్రివేణివత్। మృగరాజస్యకటినా తుల్యాస్తేకటిరుత్తమః॥౪౯ ॥ రమ్యంతవోదరంసూక్ష్మం మృదులంమాంసలంశుభం । విలోమంపీ

నీవు బ్రహ్మచే నెట్లు నిర్మింపఁబడియుందువు? తర్కించిచూచినపుడు అతండు నిన్ను నిర్మించలే దని తోఁచుచున్నది. నీతో సమానమగు రూపముగల వేఱొకపణతి నిజగంబున నే నెఱుంగను. నీగోళ్లు పాడ్యమినాటి చంద్రరేఖతో పోరాడుచున్నది.నీనఖమధ్యంబులు ఎఱ్ఱని మేలైన దానిమ్మ విత్తులవలె నున్నవి. నీ బొటనవ్రేళ్లు గుండ్రముగా మిక్కిలి సొగసై బిడ్డల అంగుష్ఠంబులవలె నున్నవి. మెత్తని నీయరగాళ్లు తామరరేకుల మధ్యభాగంబులవలె వెల్గుచు సమముగా స్వస్తికధ్వజాది దివ్యరేఖాంకితంబులైయున్నవి. నీ మీఁగాళ్లు నరములు కనుబడక రోమములు లేక బలిసి కోమలముగాను మృదువుగాను పసుపువన్నెగలదిగాను రాజస్త్రీల ప్రణామంబులకు తగినవిగానున్నవి. నీచరణమూలంబులు వెన్నముద్దతో పోట్లాడుచు గుండ్రముగా నెఱ్ఱగనున్నది. పాదపృష్ఠంబులు వెంట్రుకలులేక కోమలముగా పచ్చగా సమముగానున్నవి. నీచీలమండలు గుండ్రగా నెఱ్ఱగా బలిసి శోభించుచున్నవి. నీపిక్కలు ఆవుతోకవలె గుండ్రగా బలిసి నరములుకనుపడక బాగైయున్నవి. అవి సరళంబులు, మృదుళంబులు, నిర్లోమంబులు. నీమోఁకాళ్లు మాదీఫలంబువలె గుండ్రగా బలిసియున్నవి. నీతొడలు మిక్కిలి కోమలంబులును నిర్లోమంబులును పీతవర్ణంబులును వర్తులంబులును దట్టముగాను నాసుఖపాత్రంబులై యున్నవి. నీమడికట్లు నామనంబునకుమాత్రమే మోహాకరంబులై గజకుంభస్థలంబులవలె గుండ్రగా బలిసి విలోమంబుగా వెలయుచునున్నవి. నీరతిస్థానమును వర్ణించుటకు శక్తుఁడనుకాను. నీబొడ్డు గుండ్రగా సొగసుగా లోతుగా కనుబడుచున్నది. నీకడుపుమీఁది మూడుముడుతలు ఆ త్రివేణి వలె బరగుచున్నది. నీనడుము సింగపునడుమునకు సాటియైయున్నది. నీకడుపు మృదువుగాను

తవణాంచ పుత్రోత్పత్తివిసూచకం ॥ ౫౦ ॥ వంశస్యశకలేనైవ స్పర్థతేతవమాంసలః । పృష్ఠేస్తంభశ్శోమలశ్చ నిమ్నో లోమవివర్జితః ॥ ౫౧ ॥ పార్శ్వేతిమృదులేపీతే మాంసలేలోమవర్జితే । కుక్షీపీతేలోమహీనే మాంసలేకించిదున్నతే ॥ ౫౨ ॥ హృదయంకోమలంరమ్యం మాంసలంపీతమున్నతం । విస్తీర్ణంలోమహీనంచ సుస్నిగ్ధం సౌఖ్యదంమమ ॥౫౩ ॥ హేమకుంభసమౌనౌద్వౌ కుచౌపీనౌఘనౌశుభౌ । గజశుండాతుండతుల్యౌ పీనౌతేకోమలౌ భుజౌ ॥ ౫౪ ॥ కృశారమ్యాఃకోమలాశ్చ తేంగుల్యోజనకాత్మజే । రక్తేపాణితలేశంఖ ధ్వజమత్స్యాదిచిహ్నితే॥ ౫౫ ॥ మాంసలేకోమలేప్రోచ్చై స్సురేఖామండితేవరే । కరపృష్ఠేలోమహీనే మాంసలేకోమలేశుభే ॥ ౫౬ ॥పీనౌస్కంధౌవర్తులౌతే జత్రుస్తేమాంసపూరితః । కంబుకంఠోతిపీనశ్చ సవలిత్రయసత్తమః ॥ ౫౭ ॥ మధ్యేనిమ్నంసుపీనంతే చుబుకంవర్తులంమృదు । ప్రవాలబింబసదృశం చారువక్త్రంసుకోమలం ॥ ౫౮ ॥ సీతేతేధోధరోభాతి మధురోఽమృతసన్నిభః । కుందపుష్పకలికయా స్పర్ధంతేదశనాస్తవ ॥౫౯ ॥ సాంద్రాఃకృత్రిమవర్జైతాశ్చ కృష్ణవర్ణామనోహరాః । హేమపుష్పైర్హేమతంతు బంధైశ్చిత్రవిచిత్రితాః ॥ ౬౦ ॥ ఊర్ధ్వాధరఃకోమలస్తే రక్తవర్ణోవిభాత్యయం । ఋజుఘ్రాణమున్నతంతే దివ్యంభాతిమనోహరం ॥ ౬౧ ॥ తవనేత్రేకంజపత్ర తుల్యేదీర్ఘే

మనోహరముగాను పసుపువన్నెగలదిగాను రోమవిహీనముగాను పుత్రోదయమును సూచించునదిగానుబలసి బాగుగానున్నది. నీవెన్నెముక కోమలస్థంభమువలె వెదురుబద్దనుపోలి లోఁతుగా నునుపుగానున్నది. మిక్కిలి మెత్తని నీప్రక్కలు వెంట్రుకలులేక బలిసి బాగై యున్నవి. నీకుక్షి కొంచమెత్తుగా పచ్చగా మెచ్చతగియున్నది. నీయెద యెత్తుగా విస్తీర్ణముగా మిగుల రమ్యముగా కోమలముగా బంగారువన్నెగలదిగా నాకు మిక్కిలి సౌఖ్యకరంబుగానున్నది. నీస్తనములు రెండును కనకకలశంబులవలె ఘనంబుగా బలిసి శోభనంబులుగానున్నవి. ఏనుఁగు తొండములవలె నీ భుజములు రెండును సొంపుగా నింపైయున్నవి. నీవ్రేళ్లు సొగసుగా సన్నగానున్నవి. నీ యరచేతులు మత్స్యశంఖ ధ్వజాది దివ్యరేఖలచే సమలంకృతంబులై యెత్తుగా నెఱ్ఱగా చక్కగానున్నవి. నీమీఁదిచేతులు నీరోమంబులును కోమలంబులును శుభప్రదంబులునైనవి. నీమూఁపులు గుండ్రముగా బలిసియున్నవి. నీమెడకొంకులు మాంసపూరితంబులై మనోజ్ఞములుగా నున్నవి. శంఖమువంటి నీమెడ మిక్కిలి చక్కగానున్నది. నీగడ్డము నడుమ లోఁతుగా మెత్తగా గుండ్రగా బలిసి సుపీనంబై యసమానంబనఁబడుచున్నది. తొండపండువలె లేఁతచిగుళ్లవలె పగడమువలె నీనోరు మిక్కిలి ముక్కువనిచ్చుచున్నది. జానకీ! నీమధురమగు నధరంబు దివ్యామృతంబువలె భవ్యంబై యున్నది. నీదంతంబులు కుందకుట్మలంబులతో స్పర్ధజేయునని నిర్ధరించఁదగియున్నవి. మఱియునవి పండ్లపుడి మొదలైన వన్నెలచే చెన్నుమీరి నల్లగా నుల్లాసకరంబులై బంగారు సరిగెకట్లచే కనకకుసుమంబులతో కాంతిప్రదంబులైయున్నవి. నీపై పెదవి రక్తవర్ణంబై రక్తినిచ్చుచున్నది. నీయొక్క చక్కనిముక్కు యెత్తుగా మిక్కిలి మనోహ

మనోహరే । హరిణీనేత్రసదృశే కామబాణావివప్రియే ॥ ౬౨ ॥ తవః శ్రోణుఘనాపీనా బహుభారసహావరా। త
వసీతేతిసుస్నిగ్ధే ప్రోచ్చేగండస్థలేశుభే ॥ ౬౩ ॥ కృశేభ్రువౌచాపతుల్యేకృష్ణవర్ణేసుకోమలే । లలాటంతవవిస్తీ
ర్ణం మాంసలంహిసమంతృదు ॥ ౬౪ ॥ గంగాకూలోపమస్సీతే సీమంతస్తవసుందరః। హేమతంతుసమానాస్తే
కేశాఃస్నిగ్ధాస్సుకోమలాః ॥ ౬౫ ॥ మస్తకస్తవసూక్ష్మశ్చ వర్తులోమాంసలశ్శుభః । వేణీబంధోవరస్సీతే జఘనేప
తితస్తవ ॥ ౬౬ ॥ చంపపుష్పోపమముఖం సౌకుమార్యమపిప్రియే । సీతేతవాననస్పర్ధీ శశాంకఃక్షయమాపసః॥
౬౭ ॥ త్వన్నేత్రవిజితాసీతే మృగీధావతికాననే । సీతేత్వద్భ్రుకుటిస్పర్ధీ చాపంభగ్నంమయాపురా ॥ ౬౮ ॥ తవ
నేత్రకటాక్షేణ మునీనాంమదనోద్భవః । నేత్రయోస్తవచాంచల్యం మకరాన్లజ్జయత్యహో ॥ ౬౯ ॥ తవభ్రూణం
శుకోదృష్ట్వా ఉత్మానంధిక్కిక్కరోతహి । దృష్ట్వాష్ఠయోశ్శోణిమాంతే సౌకుమార్యమపిప్రియే ॥ ౭౦ ॥ సహకారత
రోశ్చాపి రక్తఃకోమలపల్లవః । లజ్జయాహరితోభాతి త్యక్త్వాస్వీయాంసురక్తతాం ॥ ౭౧ ॥ సౌకుమార్యంతథాత్య
క్త్వా లజ్జయాతేఘనోపిసః । ఏవంకింకింమయాకాంతే సౌందర్యంతవజానకి ॥ ౭౨ ॥ వర్ణనీయంమహద్దివ్యం
యత్రబ్రహ్మాపికుంఠితః । ఇత్యుక్త్వారాఘవస్సీతాం ప్రీత్యాతాంపరిషస్వజే ॥ ౭౩ ॥ తచ్ఛ్రుత్వావర్ణనంస్వీయం

రంబైనది. నీనేత్రంబులు కంజపత్రంబులవలె విశాలంబులై మనఃప్రీతిపాత్రంబులై మృగీనేత్ర
సమానంబులై మన్మథబాణంబులవలె హృన్మదప్రదంబులై యున్నవి. ప్రేయసీ! నీచెవులు దట్ట
మై భారసహంబులుగా బలిసి మేలుగా లీల నొదవించుచున్నవి. నీచెక్కిళ్లు మిక్కిలి చిక్కన
గా నెత్తుగా నుత్తమంబులై యున్నవి. నీయొక్క సన్నని కనుబొమ్మలు విల్లువలె వక్రంబులై
నల్లగా నుల్లాసప్రదంబులుగా నున్నవి. నీనుదురు మృదులమాంసల విశాలంబై విరాజించుచు
న్నది. నీ పాపట గంగాకూటంబువలె సుందరంబైనది. మృదువైన నీ తలవెంట్రుకలు మిక్కిలి
కోమలంబులై కనకతంతువులవలె కాంతంబులయినవి. నీమస్తకంబు గుండ్రగా స్వస్తిప్రదంబై
ప్రశస్తంబనఁబడినది. సుఘనంబగు నీజడ కడుసొబగై జఘనమువరకుఁబడి బరగుచున్నది. ప్రి
యురాలా! నీసౌకుమార్యంబు ఎఱ్ఱని కాంచనపుష్పసమాన సుఖరాగంబైనది. జానకీ! చంద్రుఁ
డు నీమోముతో స్పర్థఁజేసి క్షయించుచుండును. సీతా! నీకండ్లచే గెలువఁబడిన లేడి యడవిలో
పారిపోవుచున్నది. కాంతామణీ! నీకనుబొమ్మలతో పోటీగావచ్చినదని వెనుక ధనుస్సు నాచే
భగ్నంబయ్యె. నీ కడగంటిచూపుచే మునీంద్రులుకూడ మన్మథావిష్టులగుదురు. నీకండ్లలోని
చాంచల్యము మకరంబులకు లజ్జనిచ్చుచున్నది. చిలుకలు నీముక్కునుచూచి తిమ్మతామే నిం
దించికొనుచున్నవి. తియ్యమామిడిచిగుళ్లు నీపెదవుల యెఱుపునెఱిఁగి సిగ్గుపడి తమ యెఱుపు
నువదలి పచ్చగాపోవుచున్నవి. అట్లే మేఘును నీ సౌకుమార్యమునుచూచి సిగ్గుపడి పారిపో
వుచున్నది. ప్రేయసీ! నేనేమి నీసౌందర్యమును వర్ణించెదను? బ్రహ్మదేవుఁడును నిన్ను వర్ణింపనే
రక నశక్తుఁడనఁబడె, ఇట్లు పలుకుచు ప్రీతిచే సీతాదేవిని సమాలింగించి సానందనిర్భరుఁడయ్యె.

లజ్జయాధఃకృతాననా । కించిత్స్మితాననం కృత్వా తిష్ఠావంకేపతేశ్చసా ॥ ౨౮ ॥ * ॥ ఇతిశ్రీమదానందరామాయణే వాల్మీకీయే విలాపకాండే సీతావర్ణనంనామ ద్వితీయస్సర్గః ॥ ... ... ... ... ... ...॥౨॥

శ్రీరామదాసఉవాచ—అథసాజానకీరామం వినయాల్లజ్జితాబ్రవీత్ । రామరాజీవపత్రాక్ష కించిత్ప్రష్టుం మమప్రభో ॥ ౧ ॥ వాంఛాస్తిచేత్కరోష్యాజ్ఞాం తర్హిపృచ్ఛామ్యహంతవ । తత్సీతావచనంశ్రుత్వా రాఘవఃప్రాహజానకీం ॥ ౨ ॥ పృచ్ఛస్వసీతేయత్తేస్తి ప్రష్టవ్యంమాంసుఖేనతత్ । మాశంకాంభజరంభోరు గుహ్యంచాపివదామి తే ॥౩॥ తద్రామవచనంశ్రుత్వా నత్వాతంప్రాహజానకీ । రామరామమహాబాహో కించిదుపదిశస్వమాం ॥౪॥ యేనమాంతవసంజ్ఞానం భవిష్యతిమహోజ్జ్వలం । తత్సీతావచనంశ్రుత్వా రామచంద్రోబ్రవీద్వచః ॥ ౫ ॥ సమ్యక్పృష్టంత్వయాసీతే శ్రుణుష్వైకాగ్రమానసా । మమజ్ఞానాయతేవచ్మి పరంకౌతూహలంశుభం ॥ ౬ ॥ శ్రీరామచంద్ర ఉవాచ—సచ్చిదానందరూపాఖ్య సాగరస్యతదిచ్ఛయా । తరంగరూపయాఽఽత్మాంశ బిందుశ్శుద్ధోవినిర్గతః ॥ ౭॥ ఆత్మనామా మాతృభూత బుద్ధేర్జఠరసంభవః । శుద్ధసత్వాంతఃకరణం పితాచాత్మనఈరితః ॥ ౮ ॥ తస్యాత్మనశ్చ చత్వారో భేదాస్తేబంధవఃస్మృతాః । తుర్యావస్థస్తత్రవర స్తతోజాగ్రదవస్థకః ॥౯॥ స్వప్నావస్థస్తృతీయశ్చ వర

ఈ స్వీయవర్ణనంబును విని సీతాదేవి లజ్జచే తలవంచికొని మందహాసము నొనరించుచు కాంతుఁడగు శ్రీరాముని యంకము నలంకరించి యుండెను॥... ... ... ౨॥

## శ్రీరాముఁడు సీతాదేవికి సంజ్ఞానపేటిక ననుగ్రహించి యిచ్చుట.

తరువాత నా సీతాదేవి వినయమువలన లజ్జించుచు శ్రీరామునింజూచి “రాజీవాక్షుఁడగు శ్రీరామా! మన్నాథా! నిన్ను నేను కొంచమడుగనెంచితిని. నీకు నదియిష్టమైన నాజ్ఞనొసంగుము. అంత నేను ప్రశ్నఁజేసెద”నని విన్నవించెను. అందుకు శ్రీరాముఁడు “ప్రేయసీ! నీవేమడుగఁదలఁచితివో దానినడుగుము. శంకించవలదు. రహస్యవిషయంబై యుండినను చెప్పెదను.” అని యనుగ్రహించెను. అంతనా జానకీదేవి శ్రీరాముని వందించి “మహానుభావుండగు శ్రీరామా! మహోజ్జ్వలంబగు నీ సంజ్ఞానంబు నాకెట్లు లంభించునో దానినుపదేశించి యుద్ధరించుము.” అని ప్రార్థించెను. ఆ సీతాప్రశ్నమును విని శ్రీరాముఁడు ఇట్లు చెప్పుచున్నాఁడు. * దేవీ! నీవు చక్కఁగానడిగితివి. ఏకాగ్రమానసవై వినుము. నాయొక్క విజ్ఞానముకొఱకు నీకు మిక్కిలి కౌతుకంబగు మంగళవిషయంబును నిరూపించుచున్నాను. అదియెట్లనిన;—నిషేధాప్రతియోగియగుటచేత సత్తనఁబడి సంవిద్రూపంబగుటచే చిత్తనంబడి నిత్యానంబగుటచే నానందంబనఁబడి అపారంబును గంభీరంబునగుటచే సముద్రసదృశంబైన సచ్చిదానందలక్షణుండగు సాగరుఁడగు పరమాత్మనుండి తరంగాత్మకంబగు తనయిచ్ఛచేత శుద్ధంబగు నాత్మాంశబిందువు వెలువడెను. అదియే ఆత్మయనఁబడును. అయ్యాత్మ తల్లియైన బుద్ధియొక్క కడుపునఁ బుట్టినది. ఆయాత్మకు శుద్ధసత్వంబగు నంతఃకరణంబు తండ్రిగాఁ జెప్పంబడినది. అట్టియా

స్సుషుప్త్యవస్థః । హృదయాకాశంతత్స్థానం మనోవేగోబహిర్గమః ॥ ౧౦ ॥ మనోదుర్వృత్తిఘాతశ్చ మనోవేగస్యఖండనం । మాయాయోగస్తతస్తస్య పూర్వసంస్కారనిగ్రహః ॥ ౧౧ ॥ తతఃకుబుద్ధిహేతోర్హి భవారణ్యాటనంచిరం । దంభస్యనిగ్రహస్తత్ర పంచభూతాత్మకాస్థిరా ॥ ౧౨ ॥ ఆత్మనఃపర్ణకుటికా విశ్రాంతిస్థానమీరితా । కామక్రోధలోభజయస్తత్రాశాకృంతనంస్మృతం ॥ ౧౩ ॥ మోహస్యనిగ్రహస్తత్ర శుద్ధమాయాశ్రయస్తతః । రజోరూపాతుయామాయా జఠరాగ్నౌతదాస్మృతా ॥ ౧౪ ॥ తామస్యాశ్చైవమాయాయా వియోగశ్చతదాస్మృతః । సుఖాలాభమహాక్లేశ శ్శోకభంగస్తతఃపరం ॥ ౧౫ ॥ వివేకస్యాశ్రయస్తత్ర భక్త్యుద్రేకసమాగమః । అవివేకవధశ్చాపి హ్యుత్సాహేనసమాగమః ॥ ౧౬ ॥ అజ్ఞానతరణోపాయ స్త్రిగుణాశ్రయసద్మని । లింగాఖ్యనిగ్రహస్తత్ర మదస్యసంప్రకీర్తితః ॥ ౧౭ ॥ నిగ్రహోమత్సరస్యాపి తతోహంకారనిగ్రహః । వియోగోలింగదేహస్య మాయానాస్త్యైక్యతాతతః ॥ ౧౮ ॥ హృదయాకాశగమన మానందైకసుఖంతతః । మాయాత్యాగస్తతశ్చైవ సాత్వి

త్మకు నాల్గుభేదములుగలవు. వాటినే సోదరులని చెప్పెదరు. అందులో తురీయావస్థుఁడు శ్రేష్ఠుఁడు. పిదప జాగ్రదవస్థగలవాఁడు. మూఁడవవాఁడు స్వప్నావస్థవాఁడు. నాల్గవవాఁడు సుషుప్త్యవస్థగల్గినవాఁడు. వానిస్థానంబు హృదయాకాశంబనఁబడును. మనోవేగంబే వాని బైటి సంచారము. మనంబునగల్గిన దుర్వృత్తిని ధ్వంసముచేయుట. పిదప మనోవేగమును ఖండించుట. అట్టి యాత్మకు మాయాయోగము ఘటించుచున్నది. పిదప పూర్వజన్మ సంస్కారమును నిగ్రహించుట. పిదప దుర్బుద్ధియే కారణమగుటచేత సంసారారణ్య సంచారము సంభవించినది. పిదప దంభమును నిగ్రహించుట. పిదప నతఁడు పంచభూతాత్మకుఁడై నిశ్చలంబుగా నుండుట. ఆత్మకు పర్ణశాలయే విశ్రాంతిస్థానంబుగా చెప్పఁబడినది. పిదప నయ్యాత్మ కామక్రోధ లోభంబులను జయించి యాశను కత్తరించుచున్నాఁడు. పిదప మోహము నిగ్రహింపఁబడగా శుద్ధమాయ నాశ్రయించుచుండును. రజోరూపంబగు మాయ జఠరాగ్నిలో లీనంబగును. తామసరూపంబగు మాయ అపుడు తొలగిపోవును. సుఖలాభము లేదను గొప్పక్లేశము సంభవించగా నప్పుడు శోకభంగ మగుచున్నది. పిదప నచ్చట వివేకమువచ్చి యాశ్రయించును. అచ్చట నడుమ భక్త్యతిశయంబు వచ్చిచేరును. పిమ్మట నవివేకము నశించును. అటుమీఁద నుత్సాహము వచ్చిచేరును. పిదప నజ్ఞానమున నతిక్రమించుట కుపాయము సందింపఁబడి త్రిగుణాశ్రయంబగు గేహమునందు లింగమును నిగ్రహించుట. అందులో మదమును మర్దించి మాత్సర్యమును ధ్వంసముచేసి అహంకారమును నిర్మూలముచేయవలయును. పిదప లింగదేహము వియోగమైపోగా మాయతోకూడ నీయాత్మకైక్యత ఘటిల్లుచుండును. పిదప హృదయాకాశమున కేతెంచుట. అంత నానందైక సుఖముగల్గుట. అటుమీఁద మాయను వదలివేయుట పిమ్మట సాత్వికియగు మాయను స్వీకరించి యామెతోడ నీ హృదయాకాశంబును సచ్చిదానం

క్యాగ్రహణంస్మృతం ॥ ౧౯ ॥ సాత్వికాఖ్యామాయయాసార్ధం హృదయాకాశముత్తమం । మహాకాశేప్రణయసం
సచ్చిదానందసంజ్ఞకే ॥ ౨౦ ॥ ప్రవేశనంసాగరేహి ముక్తిర్జ్ఞేయాత్మనశ్శుభా। సాయుజ్యాఖ్యాపరిజ్ఞేయా ముక్తిర్ముక్తి
చతుష్టయే ॥ ౨౧ ॥ ఏవంమయేయంతే ప్రీత్యా సీతేసంజ్ఞానపేటికా। గూఢార్థైర్వేదసారార్థైరజ్ఞానమతినాశ
కైః ॥ ౨౨ ॥ మత్ జ్ఞానదైఃపంచదశ శ్లోకరత్నైఃప్రపూరితా । సమర్పితాగృహాణత్వ మస్యాంబుద్ధ్యావలోకయ
౨౩ ॥ భవిష్యతిమమజ్ఞాన మస్యాస్సమ్యగ్విచారతః । తద్రామవచనంశ్రుత్వా సీతాసంజ్ఞానపేటికాం ॥ ౨౪ ॥ నిజ
హృన్మందిరేస్థాప్య బుద్ధిదృష్ట్యాముహుర్ముహుః । సమ్యదుద్ఘాట్యతూష్ణీంసా ముహూర్తమవలోకయత్ ॥ ౨౫ ॥ త
దాజ్ఞాత్వాథసకలాం నిజక్రీడాంవిదేహజా । విహస్యరఘువీరస్యసా ననామాంఘ్రిపంకజే ॥ ౨౬ ॥ ఆనందనిర్భరా
జాతా సానందాశ్రుసమన్వితా । ఆనందోత్ఫుల్లరోమాంచా తూష్ణీమాసీత్తదాక్షణం ॥ ౨౭ ॥ ఆనందనిర్భరాంసీ
తాం దృష్ట్వాతాంరాఘవోబ్రవీత్ । పేటికాయాంత్వయాసీతే కిందృష్టంతోషకారకం ॥ ౨౮ ॥ కచ్చిద్గతం
తవాజ్ఞానం కచ్చిల్లబ్ధంమమత్వయా । సంజ్ఞానంవదమాంసీతే యథాజ్ఞాతంత్వయాహృది ॥ ౨౯ ॥ జ్ఞాతంత్వయావా
నజ్ఞాతం వేత్తుమిచ్ఛామిత్వన్ముఖాత్ । యదికించిత్త్వయానస్యాం జ్ఞాతంతద్బోధయామ్యహం ॥ ౩౦ ॥ ఇతిరామవచః
శ్రుత్వా నిమగ్నానందసాగరే । మంచకస్థారామచంద్రం జానకీవాక్యమబ్రవీత్ ॥ ౩౧ ॥ * ॥ శ్రీసీతోవాచ—

దాత్మకంబగు మహాకాశంబున చక్కఁగా చేర్చునది. సాగరప్రవేశైక్యంబే ఆత్మముక్తిగా నెం
చబడును. అదియే చతుర్విధముక్తులలో సాయుజ్యముక్తి యనఁబడుచున్నది॥ ౨౧॥ సీతాదేవీ!
ఇట్లు నీకు నేను వేదశాస్త్రసారంబులును బ్రహ్మజ్ఞానప్రదంబులును రహస్యార్థంబులును అజ్ఞాన
మతి నివారకంబులునగు ౧౫ శ్లోకంబులను రత్నములచే నిండియుండు సంజ్ఞానపేటికను అనుగ్ర
హించి యిచ్చితిని. దీనిని నీవు గ్రహించి నీబుద్ధిచే దీనిని చక్కఁగా నొక్కి చూడుము. దీనియొ
క్క చక్కని విచారముచేత నాయొక్క జ్ఞానముకలుగును. ఇట్లని శ్రీరాముఁడు తత్త్వోపదేశ
ముచేయఁగా నారామవాక్యామృత వచనంబులను సంజ్ఞానపేటికను జనకపుత్రి తన మనోమం
దిరంబున సంస్థాపించి బుద్ధిదృష్టిచే పలుమారు పర్యాలోచించి చక్కఁగాతెరచి యూరకె ము
హూర్తకాలము పరిభావించుచుండెను. పిమ్మట వైదేహీదేవి తనయొక్క క్రీడయగు సంగతి
నంతటెనిఁ దెలిసి నవ్వుచు శ్రీరాముని చరణకమలంబులను వందించెను. అప్పుడు సీతాదేవి ఆనం
దతుందిలయై దేహమున నానందరోమాంచంబులును నయనంబులలో నానందాశ్రువులునుగల్గి
యూరకె క్షణకాలముండెను. అప్పుడు శ్రీరాముఁడు ఆనందనిర్భరాంగియైన సీతనుచూచి
“సంతోషకారకంబగు సంగతి సంజ్ఞానపేటికయందు నీచేనేమి తెలియఁబడినది? నీయజ్ఞానము
నివృత్తించెనా? నాయొక్క సంజ్ఞానంబు నీకుఁదెలిసినదా? నీకెట్లుతెలిసినదో ఆసంగతిని చెప్పు
ము. నీకు తెలిసెనో తెలియలేదో నేనెఱుఁగను. నీనోటినుండి వినగోరుచున్నాను. ఒకవేళ ఏదై
నను నీకు తెలియకయుండినఁ దానిఁజెప్పెదను.” అని పలుకగా, నందుకు సీతాదేవి పంచము

రామరావణదర్పఘ్న త్వద్దత్తాజ్ఞానపేటికా । మయావలోకితాబుద్ధ్యా లబ్ధంజ్ఞానంతవప్రభో ॥ ౩౨ ॥ నిర్గుణోనిర్వి
కారస్త్వం క్రీడేయంసకలాత్వయా । మత్సంగాద్దర్శితాభూమ్యాం కృత్వాలోకహితాయహి ॥౩౩॥ పేటికాయాం
యథాజ్ఞాతం మయాతత్ప్రవదామితే । త్వయాపంచదశశ్లోకై ర్యదుక్తంగుహ్యముత్తమం ॥ ౩౪॥ ప్రకటంతత్క రో
మ్యద్య తవాగ్రేరఘునందన । సర్వేషాంమందబుద్ధీనాం హితాయజ్ఞానసిద్ధయే ॥ ౩౫ ॥ జనానాంసంబోధయితుం
చరిత్రంభవతాత్రయత్ । కృతంతస్యవిచారేణ హ్యాత్మజ్ఞానంలభేన్నరః ॥౩౬॥ సచ్చిదానందరూపోయో విష్ణుర్జ్ఞే
యస్ససాగరః । భూభారహరణాదీచ్ఛా విష్ణోర్యాజాయతేశుభా ॥ ౩౭ ॥ సవైజ్ఞేయస్తరంగోత్ర తయాత్మాంశలవ
శ్శుభః । బహిఃకృతాత్సాగరాత్స ఆత్మాఖ్యఃకథ్యతేభువి ॥ ౩౮ ॥ తస్యబుద్ధిస్తుజననీ కౌసల్యాసాత్రకథ్యతే । శుద్ధత
త్వాంతఃకరణం పితాతస్యాత్మనఃస్మృతః ॥ ౩౯ ॥ రాజాదశరథోజ్ఞేయః శ్రీమాన్ సత్యపరాక్రమః । తస్యాత్మన
శ్చచత్వారో భేదాస్తేబంధవఃస్మృతాః ॥ ౪౦ ॥ రామస్సౌమిత్రిభరత శత్రుఘ్నా ఏవచాత్రహి । తుర్యావస్థాస్తేషువర
స్సత్వందశరథాత్మజః ॥ ౪౧ ॥ తతోజాగ్రదవస్థశ్చ లక్ష్మణస్సోత్రకథ్యతే । స్వప్నావస్థస్తృతీయశ్చ భరతో
పినిగద్యతే ॥ ౪౨ ॥ అపరస్సుషుప్త్యవస్థస్తు జ్ఞేయశ్శత్రుఘ్న ఏవసః । హృదయాకాశంతత్స్థాన మయోధ్యా

పై ఆనందసాగరనిమగ్నయై శ్రీరామచంద్రుని కిట్లు విజ్ఞాపించుచున్నది.—రావణదర్పహార
ణంబొనర్చిన రామా! నీవిచ్చిన జ్ఞానపేటికను నేను బుద్ధిచే చక్కగా నవలోకించి నీయొక్క
సంజ్ఞానంబును సంగ్రహించితిని. నీవు నిర్గుణుఁడవు, నిర్వికారుఁడవు. నాయొక్క సంగమువలన
భూమిలో లోకహితముకొఱకై ఈసమస్తక్రీడ నీచే చూపఁబడినది. నేనెట్లు సంజ్ఞానపేటిక
యందు తత్త్వము నెఱింగితినో దానిని చెప్పెదను. మూఢబుద్ధులగు వారందరి హితమున
కును జ్ఞానసిద్ధికిని నీవుచెప్పిన ౧౫ శ్లోకంబులలోని గూఢార్థమును ప్రకటపరుచుచున్నాను. లో
కులకు తెలివినిచ్చుటకై నీచేత నేచరిత్రంబు అనుకరింపఁబడెనో అట్టి నీచరిత్రంబును విచారిం
చికొనుటచేత మానవుండాత్మజ్ఞానము గలవాఁడగును ॥౩౬॥ ఎవఁడు సచ్చిదానందరూపుఁడో

### రామసన్నిధిలో సీతాదేవి దేహరామాయణతత్త్వమును నిరూపించుట.

వాఁడే విష్ణువని తెలియఁబడును. అతఁడే సాగరుఁడు. వానియొక్క భూభారహరణాదిచ్ఛయే
తరంగంబనబడును. వానినుండి వెలువడిన ఆత్మాంశబింబమువే పురుషోత్తముండను జీవాత్మ శ్రీ
రాముఁడనఁబడును. వాని జనని బుద్ధి. ఇచ్చటనది కౌసల్య యనఁబడును. వానితండ్రి శుద్ధస
త్వాంతఃకరణంబు. అది యిచ్చట సత్యపరాక్రముఁడగు దశరథమహారాజుగా నెంచబడును.
ఆ దాశరథియగు నాత్మయొక్క భేదంబులు నాలుగును తమ్ములుగానెంచబడును. ఇచ్చట లక్ష్మ
ణభరత శత్రుఘ్ను లనఁబడుదురు. వారిలో తురీయావస్థానుభవ వ్యక్తియే శ్రేష్ఠుఁడగు శ్రీరా
ముఁడగునీవు. పిదపజాగ్రదవస్థానుభవవ్యక్తి లక్ష్మణుఁడు. మూడవదియగుస్వప్నావస్థానుభవవ్యక్తి
భరతుఁడు. కడపటి సుషుప్త్యవస్థ ననుభవించు వ్యక్తి శత్రుఘ్నుఁడనఁబడును. వానిస్థానము

త్రిస్పృతా తు సా ॥ ౪౩ ॥ మనోయోగో బహిర్యాత్రా విశ్వామిత్రాధ్వరే గమః । మనోదుర్వృత్తిఘాతశ్చ తాటికా యా వధో త్ర సః ॥ ౪౪ ॥ మనోవేగస్య యో భంగ స్స ధనుర్భంగ ఉచ్యతే । మాయాయోగ స్తత స్తస్య మత్పాణిగ్రహణం స్మృతం ॥౪౫॥ పూర్వసంస్కారనిగ్రహో జామదగ్న్యవినిగ్రహః । తతో కుబుద్ధి హేతోర్హి కైకేయ్యా వరదానతః ॥ ౪౬ ॥ భవారణ్యే టనం ప్రోక్త మటనం దండకే త్వితే । దంభస్య నిగ్రహ స్తత్ర విరాధస్యాత్ర నిగ్రహః ॥ ౪౭ ॥ ఆత్మనః పర్ణకుటికా పంచభూతాత్మకశ్చ లః । దేహో యః పంచవటికా విశ్రాంత్యర్థం తవాత్ర సా ॥౪౮॥ కామస్య నిగ్రహః ప్రోక్తః ఖరస్యాత్ర వినిగ్రహః । క్రోధస్య నిగ్రహశ్చాపి దూషణస్య తు నిగ్రహః ॥ ౪౯ ॥ లోభస్య మర్దనం తత్ర త్రిశిరా నిగ్రహో త్ర హి । తత్రాశా కృంతనం ప్రోక్తం బాణేనాత్ర విరూపణం ॥ ౫౦ ॥ తస్యా శ్శూర్పణఖాయాశ్చ మోహస్య నిగ్రహః స్మృతః । మృగమారీచఘాతో త్ర శుద్ధమాయాశ్రయ స్తతః ॥ ౫౧ ॥ మమాశ్రయస్తే వామాంగే సాత్విక్యా దండకే వనే । రజోరూపా తు యా మాయా జనరాగ్నౌ ప్రస్మృతా శుభా ॥౫౨॥ మమ రజస్స్వరూపాయాః ప్రవేశశ్చానలే త్ర సః । తామస్యాశ్చైవ మాయాయా వియోగశ్చ తదా స్మృతః ॥ ౫౩ ॥ మమ తమః స్వరూపాయా హరణం రావణేన హి । సుఖాలాభ మహాక్లేశ స్త్వత్తో మద్విరహ స్తు వ ॥ ౫౪ ॥ శోకభంగ స్తతః ప్రోక్తః క

హృదయాకాశ మనబడినది యయోధ్యగా దెలియవలయునుగదా! మనోయోగంబు నటుపై బయట ప్రయాణమనునది విశ్వామిత్రమునివచ్చి యజ్ఞమునకుపోవుట. మనస్సుయొక్క దుర్వృత్తిని నాశము చేయుటయే తాటికాసంహారమన బడును. మనోవేగముయొక్క భంగమే ధనుర్భంగంబనబడును. పిదప నయిన మాయాయోగమే నాయొక్క వివాహ మహోత్సవంబు. పరశురాముని జయించుటయే జన్మాంతర సంస్కారమును నిగ్రహించుట. పిమ్మట కుబుద్ధి కారణంబున ననగా కైకేయీ వరదానమువలన సంసారారణ్య సంచారంబనునదియే దండకారణ్యసంచారము. అచ్చట విరాధుని నిగ్రహించుటయే దంభనిగ్రహము. ఆత్మయొక్క పంచభూతాత్మక స్థిరవృత్తియే ఆకులగుడిసె. ఈదేహంబే పంచవటీక్షేత్రము. అది నీ విశ్రాంతికిగా నేర్పడినది. అచ్చట కామవిధ్వంసనమే ఖరునిసంహరించుట. దూషణుని సంహరించుట క్రోధధ్వంసము. లోభమును నాశము చేయుట త్రిశిరసంహారమనఁబడును. అచ్చట నాశాచ్ఛేదనంబె బాణముచే నాశూర్పణఖకు విరూపము నేర్పరచుట. మోహనిగ్రహంబే మాయామృగమారీచ మథనము. పిదపశుద్ధమాయాశ్రయంబయిన దండకవనంబున సాత్వికియగు నన్ను వామాంగమున ధరించుట. రజోరూపయగుమాయ జనరాగ్నిలో పోవునని చెప్పంబడినదిగదా అదియే రజస్స్వరూపిణియగు నేను అగ్నిని ప్రవేశించుట. పిదప తామసియగు మాయకును ఆత్మకును వియోగము గల్గునని చెప్పినది తమస్స్వరూపయగు నన్ను రావణుఁ డపహరించుటగదా! అప్పుడు సుఖాలాభమహాక్లేశం బనునది నావిరహమువల్ల నీకుపుట్టిన వేదన. అంత నయినకబంధసంహారమే శోకభంగంబనబడును సుగ్రీవుని యాశ్రయంబే వివేకాశ్రయ

బంధస్యవధోఽత్ర సః । వివేకస్యాశ్రయ స్తత్ర సుగ్రీవస్యాశ్రయోఽత్ర సః ॥ ౫౫ ॥ భక్త్యుద్రేక ప్రలాభశ్చ తవలాభో హనూమతః । అవివేకవధః ప్రోక్త శ్చాత్ర వాలివధ స్త్వయా ॥ ౫౬ ॥ ఉత్సాహసంగతిస్సంగ స్సావిభీషణమైత్రికీ । అజ్ఞానతరణోపాయ స్సేతుబంధో మహోదధౌ ॥ ౫౭ ॥ త్రిగుణాశ్రయగేహం తు లింగదేహస్యయే శుభే । త్రికూటాచలసంస్థాయాం లంకాయాం రఘునందన ॥ ౫౮ ॥ మదస్యనిగ్రహ స్తత్ర కుంభకర్ణవధ స్త్వయా । నిగ్రహో మత్సరస్యాపి మేఘనాదవధోఽత్ర సః ॥ ౫౯ ॥ తత్రాహంకారఘాతశ్చ రావణస్యవధ స్త్వయా । వియోగో లింగదేహస్య లంకాత్యాగ స్త్వయాత్ర సః ॥ ౬౦ ॥ మాయానామైక్యతాచాపి త్రివిధాయామమైక్యతా । హృదయాకాశగమన మయోధ్యాగమనం పునః ॥ ౬౧ ॥ ఆనందైకసుఖంతత్ర రాజ్యభోగ స్త్వయా తథా । మాయాత్యాగ స్తతశ్చాప వాల్మీకేరాశ్రమే మమ ॥ ౬౨ ॥ త్యాగోఽగ్రే భావి శ్రీరామ త్వయా సోఽత్ర ప్రకాశితః । సాత్వికస్యాగ్రహణం యచ్చ పునస్తద్గ్రహణం స్మృతం ॥ ౬౩ ॥ సాత్వికస్యామాయయా సార్ధం తవోద్యోగో మయా సహ । తతశ్చ హృదయాకాశం మహాకాశే విలాపయేత్ ॥ ౬౪ ॥ అయోధ్యానగరీమగ్రే వైకుంఠం ప్రతి నేష్యసి । ప్రవేశనం సాగరే హి సచ్చిదానంద సంజ్ఞకే ॥ ౬౫ ॥ నరరూపం పరిత్యజ్య విష్ణురూపప్రదర్శనం । నృణాం త్వయా హి సైవ ముక్తి స్సాయుజ్యాత్మన ఈరితా ॥

ణంబనఁబడును. నీకు హనుమంతుఁడు దొరకుటయే భక్త్యుద్రేకాతిలాభంబు. నీచే వాలి సంహరింపఁబడుటయే అవివేకనాశనము. పిదప గల్గునట్టి యుత్సాహసాంగత్యమే విభీషణుని మైత్రిగాఁ జెప్పంగనగును. మహాబ్ధిలో సేతునిర్మాణమును చేయుటయే అజ్ఞానమునుండి తరించునట్టి యుక్తి. త్రిగుణాశ్రయగేహంబే త్రికూటాచలంబు. అందులోని లంకయే లింగదేహంబు. అచ్చట మదమును మర్దించుటయే కుంభకర్ణసంహారంబు. మత్సరమును జయించుటయే మేఘనాదసంహారము. అహంకార సంహారంబే రావణవధ యనఁబడును. లింగదేహ నివారణమే లంకాపట్టణమును విడిచివచ్చుట. త్రివిధయగు మాయయొక్క ఐక్యమే నాతోడ చేరుట. అయోధ్యకేతెంచుటయే హృదయాకాశగమనంబు. ఆనందైక సుఖానుభవంబే రాజ్యభోగంబు. పిదపనగు మాయాత్యాగంబనగా ఇఁకమీఁద జరుగబోవునట్టి వాల్మీక్యాశ్రమంబున నన్ను విడిచిపెట్టుటను ప్రకాశపరచితివి. ఏది సాత్వికీ గ్రహణంబనబడినదో అదియే మరలనన్ను పరిగ్రహించుట. సాత్వికియగు మాయచేరి యుండుటయే నాతోడ నీప్రయత్నంబు. పిదప హృదయాకాశంబను మహాకాశంబున జొప్పించుటయనగా నయోధ్యను వైకుంఠమునకు నీవు తీసికొనిపోవుట. సాగరప్రవేశంబనగా నరరూపమునువదలి సచ్చిదానంద సంజ్ఞకంబున శ్రీవిష్ణురూపమును చూపుట. నరులకు నీచే నిదియే సాయుజ్యముక్తిగాఁ జెప్పఁబడినది. శ్రీరామా! నీవిట్లు శుభాశుభరూపంబగు నేకర్మ జేసితివో అదంతయును అందరియొక్క హితముకొఱకును వివేకము లభించుటకును చూపఁబడినది. నిర్గుణుఁడును స్వాత్మారాముఁడును సచ్చిదానందరూపుఁడును కర్మాతీతుఁడును అగు నీకు చేయతగినది చేయకూడనిదియును గలదా! ॥౬౮॥ అనియిట్లు మంగ

౧౬ ॥ ఏవంయద్యత్త్వయారామ కృతంకర్మశుభాశుభం । తత్సర్వంజనబోధాయ సర్వేషాంచహితాయహి ॥౧౭॥ కర్తవ్యమప్యకర్తవ్యం కర్మణాతీతస్యకింతవ । విగుణస్యాత్మరూపస్య సచ్చిదానందరూపిణః ॥ ౧౮ ॥ ఇత్థంత్వయోపదిష్టామే శుభాసంజ్ఞాన పేటికా । అహంతస్యావిచారేణ జీవన్ముక్తానసంశయః ॥ ౧౯ ॥ దేహరామాయణం సర్వంయత్త్వయామమదర్శితం । పంచదశశ్లోకరత్నైః కంఠేతద్ధారవత్కృతం ॥ ౨౦ ॥ శ్లోకరత్నమయంహ్యేనం యైకంఠేహారంబిభర్తిహి । జీవన్ముక్తఃక్షణాదేవ భవిష్యతినరోత్తమః ॥ ౨౧ ॥ దేహరామాయణంనామ రామయత్కథితంత్వయా । నేదృశంకథితంకేన నకోప్యగ్రేవదిష్యతి ॥ ౨౨ ॥ మమప్రీత్యోపదిష్టంహి త్వయైతద్రఘునందన । ఇత్థంకోపినజానాతి బ్రహ్మాదీనామగోచరం ॥ ౨౩ ॥ గుహ్యంరమ్యంసుదుర్బోధం స్వల్పంజ్ఞానప్రకాశితం । దేహరామాయణంహ్యేతచ్ఛ్రవణాత్పాతకాపహం ॥ ౨౪ ॥ ఇతిసీతావచఃశ్రుత్వా ప్రహస్యరాఘవోబ్రవీత్ । విదేహతనయే సాధ్వి ధన్యాసిగజగామిని ॥ ౨౫ ॥ సమ్యగ్విచారితాబుద్ధ్యా త్వయాసంజ్ఞానపేటికా । కించిన్న్యూనంత్వయానైవ దృష్టమప్యంయథాస్థితం ॥ ౨౬ ॥ బుద్ధ్యాజ్ఞానమమజ్ఞానం మోహజాలనికృంతనం । దేహరామాయణంనామ కథనీయంనకస్యచిత్ ॥ ౨౭ ॥ ఏతద్గుహ్యతమంప్రోక్తం తవప్రీత్యావిదేహజే । దాంభికాయనదాతవ్యం నాస్తికాయ శఠాయచ ॥౨౮ ॥ అభక్తాయద్విజద్వేష్ట్రే పరదారరతాయచ । మలినాయాతిక్రూరాయ నిందకాయజడాయచ॥

శంబగు సంజ్ఞానపేటిక నీచే నాకుపదేశింపఁ బడినది. నేను దానివిచారమువలన జీవన్ముక్తయై యున్నాను. ఇందుకు సంశయములేదు. నీచే నాకుచూపఁబడిన దేహ రామాయణంబను నిది ౧౫ శ్లోకరత్నంబులచే కంఠమున హారముగా చేయఁబడినది. ఇట్టి శ్లోకరత్నమయంబైన హారంబును ఏమానవోత్తముఁడు కంఠంబున ధరించునో వాఁడు తత్‌క్షణంబుననే జీవన్ముక్తుఁడు కాగలఁడు. శ్రీరామా! ఈదేహ రామాయణంబనునది నీచేత నిప్పుడు చెప్పఁబడినది. ఈవరకు నెవ్వరును చెప్పలేదు. ఇఁక నెవ్వరుచెప్పరు. నాయొక్క ప్రీతికొఱకు నీచే నిట్లుపదేశింపఁబడినది. రఘునందనా! బ్రహ్మాదులకును అగోచరంబగు నీవిషయము ఇట్లు ఎవ్వరికిని గోచరము కాచాలదు. ఇది మిక్కిలి రమ్యంబు, రహస్యంబు, దురూహంబు, స్వల్పంబు, జ్ఞానప్రకాశితంబు. ఇట్టి యీదేహరామాయణము వినుటచేతనే పాపములను పరిహరించునట్టిది. అని చెప్పుచున్న సీతయొక్క పలుకులనువిని శ్రీరాముఁడు నవ్వుచు "సతియగుజానకీ! నీవుకృతకృత్యవయితివి. నీవు బుద్ధిశక్తిచే సంజ్ఞానపేటికను చక్కగా విచారించితివి. నీవు తెలిసినదానిలో కొంచముకూడ కొఱతలేదు. యథాస్థితంబుగా నెఱింగితివి. బుద్ధిచే తెలియఁబడిన నాయొక్క జ్ఞానము సమస్తాజ్ఞానంబులను పరిహరించును. ఇట్టి సుప్రసిద్ధమగు దేహ రామాయణంబును ఎవనికిని చెప్పకూడదు. ఇదిమిగుల రహస్యవిషయంబు నీకు ప్రీతిచే నుపదేశించితిని. విదేహపుత్రీ! దాంభికునకును నాస్తికునికిని శఠునికిని అభక్తునికిని బ్రాహ్మణవిరోధికిని పరదారరతునికిని కల్మషస్వభావునికిని క్రూరాత్మకునికిని నిందించువారికిని మూఢునికిని చెప్పఁదగదు. కలియుగంబు

౭౯ ॥ కలౌచైతత్తుపైశుహ్యాం భవిష్యతినసంశయః । సహస్రేషునరఃకశ్చిజ్జ్ఞాస్యత్యేతన్నసంశయః ॥౮౦॥ సర్వవేదాంతసారంహి మయాతేసముదీరితం, దేహరామాయణంచైత ద్భుక్తిముక్తిప్రదంవరం ॥ ౮౧ ॥ ఇత్యుక్త్వారాఘవస్సీతాం పర్యంకేరత్నమండితే । సుష్వాపసీతయారాత్రౌ దాసీభిర్వీజితస్సుఖం ॥ ౮౨ ॥ * ॥ ఇతిశ్రీశతకోటిరామచరితాంతర్గత శ్రీమదానందరామాయణే వాల్మీకీయే విలాసకాండే దేహరామాయణంనామ తృతీయస్సర్గః ॥ 3॥

న నిది గుహ్యంబై యుండును. సందేహములేదు. వేయింటి కొకఁడు దీనితత్త్వము నెఱుంగును. సంశయములేదు. సమస్తవేదాంతసారంబైన ఈ దేహ రామాయణ రహస్యంబును నీకు చెప్పితిని. ఇదియే భుక్తిముక్తుల నిచ్చునట్టి పరమోత్తమతత్త్వంబు. ఇదియే సర్వోత్తమంబు;" అని చెప్పి శ్రీరాముఁడు దివ్యరత్నాలంకృత పర్యంకంబున సీతతోడ పవ్వళించి దాసీవర్గంబులు వీచుచుండగా సుఖనిద్రనందెను॥... ... ... ... ...॥3॥

విశేషసూచన—ఇట్లే భారత భాగవతాదీతిహాస పురాణచరిత్రలుగూడ ఆత్మతత్త్వనిరూపణ ను ద్దేశించి చెప్పియున్నట్లును, మిథ్యాభూత ప్రపంచంబున నేదియును పారమార్థిక సత్తుకాదుగాన వ్యావహారిక సత్యంబులని వర్ణింపఁబడు సచ్చరిత్రంబులలో నన్నివిషయంబులను "పిండాండవద్బ్రహ్మాండం" అను న్యాయము ననుసరించి స్వదేహ స్వాత్మచింతనముచే సర్వమును తనలోతాను మననము చేసికొనవలయు ననియును తెలియవచ్చుచున్నది. ఇందువల్లనే శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యస్వాములవారు తమభాష్యమునకు శారీరకభాష్యమని నామధేయమునిచ్చిరి. బ్రహ్మవిచారకంబగు నౌపనిషత్సారస్వతంబు శారీరక మీమాంసయనఁబడును. ఇందువల్లనే "శారీరఆత్మా" యని యుపనిషత్తు ఘోషించుచున్నది. కనుకనే బాహ్యయజ్ఞంబులకన్నను ప్రాణాగ్నిహోత్రమే సారతమంబని యజుర్వేదాంతమున మహానారాయణంబు "తస్యైవంవిదుషోయజ్ఞస్యాత్మాయజమానః" అనియారంభించి స్వాత్మారాముఁడై యుండుట నుపదేశించుచున్నది. కావున తెలివిగల ప్రాజ్ఞులుబయటి రామకృష్ణాదుల మఱియు మహామునుల పుణ్యచరిత్రంబులన్నియును పారమార్థిక తత్త్వార్థవిషయ నిరూపణ సూచకంబులని యెఱిఁగి సర్వమును పిండాండంబున సమన్వయముచేసికొని కృతార్థులగుచుందురు. ఈరహస్యము నెఱుఁగని కొందరు పామరులు "పురాణంబులు పుక్కిడికథలను కూయుచున్నవి. సూర్యగోళముమీఁద చంద్రగోళమున్నట్లు వర్ణించిన పురాణములను నమ్మవచ్చునా? ఇవి పనికిమాలిన వ్రాతలు" అని యజ్ఞానదోషముచే నిందించెదరు. ప్రాజ్ఞులు "ఓరి వెఱ్ఱివాఁడవా! – చంద్రమా మనసోజాతః, చక్షోస్సూర్యో అజాయత– అని శ్రుతిచెప్పుచున్నదిగదా? సూర్యాధిదైవతాకంబగు చక్షువులకుపైన చంద్రాధి దైవతాకంబగు మనస్సున్నదను పిండాండసామర స్యోద్దేశక

కథావర్ణనములోని విషయమును ఈవట్టి బయటివేషములయందు సమన్వయించలేదని పురాణ
ములనే నిందించదగునా?" అని తెలివి చెప్పక మానరు. కొందరు "ఏమో నాస్తికాధములు వే
దశాస్త్రంబులను నిందించిన నేమిహాని? గజరాజునుచూచి యెన్నికుక్కలు మొఱుగవు?" అని
యుపేక్షించెదరు. పోనిండు, అట్టి నాస్తికదుర్వాదవిచారము మనకేల? ప్రకృతమున—శ్రీమహా
భారతమున నాదిపర్వలో ప్రథమాధ్యాయముననే "మహాభారతంబున ప్రతిపాద్యమగు సద్గుణ
వృక్షద్వయముగా తోచుచున్నది. ఎట్లనిన—క్రోధమయుండైన దుర్యోధనుండను వృక్షమున
కు ధృతరాష్ట్రుడే వేరు, కర్ణుండు స్కంధము, శకుని శాఖలు, దుశ్శాసనుడు పుష్పఫలంబులు.
ధర్మమయుండగు యుధిష్ఠిరుండను వృక్షమునకు శ్రీకృష్ణుడు వేదములు బ్రాహ్మణులును వేళ్లు, అ
ర్జునుండు స్కంధము, భీమసేనుడు శాఖలు, నకులసహదేవులు పుష్పఫలంబులు." అని సంగ్ర
హాముగా నొకరూపకాలంకారవర్ణనచే స్వాత్మైకమనన ప్రక్రియను వేదవ్యాసులవా రుపదే
శించియున్నారు. ఇంక నిందులో తాత్త్వికు లిట్లూహించి తెలియుదురుగాక. దేహంబను కురు
క్షేత్రంబున ధర్మాధర్మవిచారమే భారతయుద్ధము. సంశయాత్మక మనస్సే ధృతరాష్ట్రుడు. ని
శ్చయాత్మకబుద్ధియే పాండురాజు. ప్రజ్ఞయే వేదవ్యాసుడు. పంచప్రాణంబులే పంచపాండవు
లు. న్యానుండయిన నరుడే జీవాత్మ. అవిద్యయే ద్రౌపది. • జీవుడు తదుపాధికుడు. క్రోధ
మే దుర్యోధనుడు. కామమే దుశ్శాసనుడు. వంచనయే శకుని. దురహంకార వికత్థనమే కర్ణుం
డు. వీటిచేరికయే దుష్టచతుష్టయము. మాత్సర్యాద్యనేక దుర్గుణంబులే దుర్యోధనానుజులు.
వినయమే విదురుడు. వివేకమే భీష్ముడు. విజ్ఞానమే ద్రోణుడు అహంకారమే అశ్వత్థామ.
శ్రీకృష్ణుడే పరమాత్మ. మహామాయయే రుక్మిణి. జీవాత్మ పరమాత్మైక్యా ద్వైతామృత
సారమే భగవద్గీత. దోషనిగ్రహమే రాజసూయము. కామక్రోధాదులను జయించి జితేంద్రియుం
డై నిలచుటే ధర్మరాజజయము. పుణ్యపరిపాలనమే ధర్మరాజ్యము. ఇట్లే భారతచరిత్రము
ను దేహమున సామరస్యము చేసికొనదగియున్నది. కనుకనే వేదశాస్త్ర రహస్యంబులు స
ద్గురూపదేశ గమ్యంబులని పెద్దలు వచించెదరు. మహాత్ముల సద్వచనంబులు సార్థకంబులని
యెంచి, ఈ శ్రీ సీతారామ సంవాదాత్మక దేహరామాయణమువలె మన హిందూమతసిద్ధాం
తగ్రంథములలోని సత్కథలు బ్రహ్మాండపిండాండ సామరస్యంబులై ఇహపరసాధకంబులై
భుక్తిముక్తిప్రదంబులై యున్నవని యెఱుంగదగును. ఇది ఆస్తికశిరోమణుల స్వానందసిద్ధాం
తంబని సుజను లాదరించదగునని విజ్ఞాననిధులు విజ్ఞాపింపఁబడుచుందురు.

శ్రీరామదాస ఉవాచ — చతుర్నాడ్యవశిష్టాయాం నిశాయాం రఘునాయకం । ఉద్బోధనార్థం సంప్రాప్తా రతిశాలాబహిఃస్థితాః ॥ ౧ ॥ వందినో మాగధాస్సూతా నర్తక్యశ్చ నటాదయః । వాదయామాసు ర్వాద్యాని ననృతుశ్చాప్సరోగణాః ॥ ౨ ॥ జగుర్మంగళగీతాని స్తోత్రాణి వివిధాని చ । ప్రాభాతికీం స్తుతిం ప్రోచుః కలకంఠైర్మనోహరైః ॥ ౩ ॥ * ॥ విఘ్నేశ్వరస్సకలవిఘ్నవినాశదక్షో । దక్షాత్మజా భగవతీ చ సరస్వతీ చ ॥ దృప్తాస్తు భైరవగణా నవ దివ్యదుర్గా । దేయాత్సురాస్తు నృప తే తవ సుప్రభాతం ॥ ౪ ॥ భానుశ్శశీ కుజబుధౌ గురుశుక్రమందా । రాహుస్స కేతురదితిర్దితిరాదితేయాః । శక్రాదయః కమలభూః పురుషోత్తమేంద్రో । రుద్రః కరోతు సతతం తవ సుప్రభాతం ॥ ౫ ॥ పృథ్వీజలం జ్వలనమారుతపుష్కరాణి । సప్తాద్రయోపి భువనాని చతుర్దశైవ । శైలావనాని సరితః పరితః పవిత్రా । గంగాదయో విదధతాం తవ సుప్రభాతం ॥ ౬ ॥ దిక్చక్రమేతదఖిలం ద్విరదాదిశశ్చ । నాగాస్సుపర్ణభుజగా నగవీరుధశ్చ । పుణ్యాః దేవసదనాని బిలాని దివ్యా । న్యవ్యాహతం విదధతాం తవ సుప్రభాతం ॥ ౭ ॥ వేదాస్సషడంగసహితాః స్మృతయః పురాణం । కావ్య సనాగముసథోమునయోపి దివ్యాః । వ్యాసాదయః పరమకారుణికా ఋషీణాం । గోత్రాణి వై సదధతాం తవ సుప్రభాతం ॥ ౮ ॥ * ॥ ఇతి బందిజనైస్సూతైః స్తోత్రైర్గీతాదిభిస్తుతః । నానావిధైస

## శ్రీరాములవారిని వందిమాగధాదులు నిద్రలేపుట.

పిదప తెల్లవారుటకు నాలుగుగడియలున్నవనునప్పటికి వందిమాగధులును సూతులును నటులును నర్తకీజనులు మొదలగువారును శ్రీరామచంద్రస్వామిని మేలుకొలుపులచే నిద్రలేపుటకై రతిశాలకు వెలుపలవచ్చి చేరిరి. వాద్యములు వాయింపఁబడినవి. అప్సరసలు నాట్యమాడిరి. నానామంగళ సంగీతంబులును స్తోత్రంబులును పాడ బడినవి. సుప్రభాతస్తోత్రమును మనోహరంబులగు నవ్యక్తమధురధ్వనులచే నిట్లు చెప్పిరి ॥ * ॥ సమస్తవిఘ్నంబులను పరిహరించుటలో సమర్థుండగు విఘ్నేశ్వరుండును భగవతియగు దాక్షాయణీదేవియును శ్రీసరస్వతీదేవియును ఉన్మదయుక్తులగు నష్టభైరవులును నవదుర్గలును దేవతలును శ్రీరామా! నీకు సుప్రభాతము నొసంగుదురుగాక. సూర్యుఁడు చంద్రుఁడు అంగారకుఁడు బుధుఁడు గురుఁడు శుక్రుఁడు శని రాహువు కేతువు అదితిదేవి దితి దేవతలు ఇంద్రాదులు బ్రహ్మ విష్ణు మనువులు రుద్రుఁడు వీరందరును నీకు సుప్రభాతమును చేయుదురుగాక. పృథివ్యప్తేజో వాయ్వాకాశంబులను పంచభూతంబులు సప్తకుల పర్వతాభిమాని దేవతలు చతుర్దశభువన దేవతలు గంగాది పవిత్రంబులయిన నదీదేవతలు నీకు సుప్రభాతము నిచ్చుచుందురుగాక. ఈ సమస్త దిక్సమూహంబును దిగ్గజంబులును దిక్కులును నాగులును సుపర్ణులును వృక్షలతాధిష్ఠిత దేవతలును పవిత్రంబులగు దేవాయతనంబులును దివ్య గుహలును నిరంతరాయముగా నీకు సుప్రభాతము నొసంగని. నాల్గువేదంబులును వాటితోడ నారుశాస్త్రంబులును స్మృతులును పురాణంబులును వేదమార్గంబుల నవలంబించిన కావ్యంబులును దేవర్షులును వ్యాసపట్టాంచి

మాహైశ్చ పూరోక్తైః పంజరస్థితైః ॥ ౯ ॥ స్తుతో వాదిత్రనినదైర్నవవాద్యస్వనైరపి । సుప్రబుద్ధోఽభవచ్చాథ రామచంద్రస్సీతయా ॥ ౧౦ ॥ ఆదౌ ప్రబుద్ధా సా సీతా పశ్చాత్ప్రబుద్ధో రఘూత్తమః । రామస్సురాన్మునీన్ తాతం మాతరం సరయూం గురుం ॥ ౧౧ ॥ చింతామణిం కామధేనుం చింతయామాస చేతసి । తతస్సీతాపి సాధు గంగాం గాంవాణీం రఘూత్తమం ॥ ౧౨ ॥ చింతయామాస కౌసల్యాం గురుపత్నీం స్వమాతరం । తతో నత్వా రామచంద్రం వినయావనతా స్థితా ॥ ౧౩ ॥ ఉపస్కరం తు సంపాద్య కృత్వా శౌచం యథాక్రమాత్ । దంతశుద్ధిం చకారాథ రామచంద్రస్సవిస్తరాం ॥ ౧౪ ॥ తతః స్నాత్వా సరయ్వాం తీర్థే కృత్వా నిత్యవిధిం శుభం । హుత్వాగ్నిం హవ్యమాత్రవిధినా కృత్వా దేవార్చనం గృహే ॥ ౧౫ ॥ దదౌ దానాన్యనేకాని బ్రాహ్మణేభ్యో యథాక్రమం । ఏతస్మిన్నంతరే సీతా స్నాత్వా దేవీం ప్రపూజ్య చ ॥ ౧౬ ॥ దేవాన్ గుర్వగ్నిద్విజాన్నత్వా శ్వశ్రూర్నత్వా యథాక్రమం । తతో నత్వా రామచంద్రం తత్పార్శ్వే వ్యవస్థితా ॥ ౧౭ ॥ అథ రామో వసిష్ఠస్య ముఖాత్పౌరాణికీం కథాం । సీతయా మాతృభిర్భ్రాతృభిర్బంధుభిశ్చ సుహృజ్జనైః ॥ ౧౮ ॥ సమ్యక్ శ్రుత్వైకచిత్తేన పూజయామాస తం గురుం । తతో నత్వా గురుం రామో గురుప

తాది దయావంతులును ఋషుల గోత్రము వారలును నిను సుప్రభాతము చేయుదురు గాక॥*॥ ఇట్లు వందిమాగధ సూతాదులు స్తోత్రగీతాదులచే పూర్వోక్తంబులగు రత్నపంజరంబులలోనుండు వివిధపక్షుల చేతను పొగడుచు పొగడించుచునుండిరి. మంగళఘోషంబుల చేతను నవవాద్యధ్వనుల చేతను శ్రీరామచంద్రుండు సీతతోడ నిద్రమేల్కొనెను. మొదట నా సీతాదేవి నిద్రలేచెను. శ్రీరాముండు పిమ్మట లేచెను. అపుడు రాముండు దేవతలను మునులను తల్లిదండ్రులను వసిష్ఠులను సరయూనదిని చింతామణిని కామధేనువును వీటిని నిజచిత్తంబున ధ్యానించెను. పిమ్మట నా సీతాదేవియును శ్రీరామచంద్రస్వామిని దుర్గాదేవిని గంగాదేవిని శారదాదేవిని తన తల్లిని కౌసల్యాదేవిని అరుంధతిని ధ్యానము చేసి, శ్రీరామచంద్రుని పాదారవిందములకు వినయావనతయై నమస్కరించి నిలిచెను. ముఖ్యమగు నుపకరణంబులను తీసికొని క్రమముగా శౌచాచారవిధిని నిర్వర్తించి శ్రీరాముండు చక్కగా దంతశుద్ధినొనరించి సరయూనామ రమ్యంబగు తీర్థంబున స్నానము చేసి మంగళంబగు నిత్యకర్మల నాచరించి, క్రమముగా హవ్యవాహుల కాహుతుల నిచ్చి నిజగృహ దేవతార్చనం జేసి యథాక్రమముగా బ్రాహ్మణోత్తములకు వివిధదానంబుల నొసంగెను. అంతలో సీతాదేవి లేచి స్నానము చేసి పార్వతీదేవిని పూజించి దేవగుర్వగ్ని బ్రాహ్మణులను నమస్కరించి అత్తలను వందించి పిదప శ్రీరామచంద్రునిని నమస్కరించి రఘునాథుని ప్రక్కలో చక్కగా నిలిచెను॥ ౧౭ ॥ పిమ్మట శ్రీరాముండు వసిష్ఠమునులవారివలన పౌ

## శ్రీరాముండు పురాణశ్రవణానంతరము పూజ్యులనర్చించుట.

రాణికకథను తల్లులతోడను తమ్ములతోడను సీతతోడను సుహితులతోడను ఏకాగ్రమానసులై శ్రవణము చేసి. గురుపూజనమునొనర్చి, అరుంధతీ వసిష్ఠులను తల్లులనందరిని బ్రాహ్మణుల

ర్ణీంచమాతరం ॥ ౧౯ ॥ సర్వానాత్మీయాంశ్చవిప్రాంశ్చ పండితాన్ వైదికాన్మునీన్ । యోగనిష్ఠాం స్తపోనిష్ఠాన్ విప్రాన్ జ్యోతిర్విదస్తథా ॥ ౨౦ ॥ మీమాంసకాంస్తార్కికాంశ్చ మంత్రశాస్త్రవిశారదాన్ । ధర్మశాస్త్రవిదశ్చైవ వంద్యాన్ వయోధికాన్ ॥ ౨౧ ॥ పూజయామాసశ్రీరామ స్సీతయా ప్రణనామతాన్ । అథసీతా హేమపాత్రే పూజోపకరణానిసా ॥ ౨౨ ॥ గృహీత్వాస్వసఖీభిశ్చ నత్వాసురభిమర్చయత్ । నానోపచారై స్సంపూజ్య పక్వాన్నైర్వివిధైర్వరైః ॥ ౨౩ ॥ విచిత్రైఃపాయసాద్యైశ్చ సాతాంధేనుమతోషయత్ । తతఃప్రదక్షిణంకృత్వా ప్రార్థయామాసజానకీ ॥ ౨౪ ॥ కామధేనోనమస్తుభ్యం పక్వాన్నాదీని వైగతః । దివ్యాన్నానిభూసురేభ్యో రామాదిభ్యస్త్వమర్పయ ॥ ౨౫ ॥ ఇతిసాప్రార్థనాంకృత్వా కామధేనోస్తుజానకీ । తదగ్రేకనకపాత్రాణి స్థాపయామాసకోటిశః ॥ ౨౬ ॥ దివ్యాన్నైఃపరిపూర్ణాని చకారసురభిస్త్వపి । తతస్సీతాస్వయం హేమపాత్రైః గృహీత్వాన్నానిపృథక్ జవాత్ ॥ ౨౭ ॥ పరివేషణార్థంసంతుష్టా యయౌనూపురగర్జితా । ఏతస్మిన్నంతరే రామ శ్శోపహారార్థమాదరాత్ ॥ ౨౮ ॥ విప్రాన్ శిష్టాన్ మంత్రిణశ్చ సమాహూయసహస్రశః । ఉపావిశద్భోజనస్య శాలాయాంతైస్సమన్వితః ॥ ౨౯ ॥ రుక్మపీఠేషుసర్వేతే నేమిరే భోజనాయస్థితాః । పీతకౌశేయవస్త్రైర్దివ్యైః భూషితారుక్మమండనైః ॥ ౩౦ ॥ పూజితారాఘవేణాపి గంధమాల్యాదిభిర్ముదా । స్త్రీభిఃకనకపాత్రాణి రుక్మపాత్రాణి

ను సదసద్వివేకంబుగలవారిని వేదవిద్వాంసులను మునులను యోగీంద్రులను తపస్సంపన్నులను ద్విజులను దైవజ్ఞులను కర్మ బ్రహ్మవాదులను మాంత్రికులను ధర్మశాస్త్రజ్ఞులను ఇంకనువయోధికులగు వంద్యులను శ్రీరాముఁడు సంపూజించి సీతతోఁడ వారినందరిని నమస్కరించెను॥౨౨॥

సీతాదేవి కామధేనువునర్చించి యందరిని సత్కరించుట.

పిదప సీతమ్మ తన చెలికత్తెలతోఁడ బంగారుపళ్లెరములో పూజాసామగ్రులను తీసికొని కామధేను సన్నిధానమునకుపోయి నమస్కరించి వివిధోపచారంబులచే పూజించి అన్నినిర్మితంబులగు పక్వాన్నములను విచిత్రంబులగు పాయసాదులను నివేదించి ధేనువు నానందపరచుచు, నాసీతాదేవి ప్రదక్షిణనమస్కారముచేసి కామధేనువును “ఓకామధేనూ! నీకు నమస్కారము. బ్రాహ్మణులకును శ్రీరామాదులకును త్వరగానీవు దివ్యాన్నంబులను వివిధపక్వాన్నంబులను సమర్పించుము.” అని ప్రార్థించి కామధేనువుయొక్క కాళ్లనడుమ కనకపాత్రంబుల ననేకంబులుగా సంస్థాపించెను. అంతనా కామధేనువుకూడ వాటినిండ దివ్యాన్నాదిభోజ్య వస్తువులను నించెను అంతనతిత్వరగా వెవ్వేరుగా బంగారుపాత్రలలో పక్వాన్నములను తీసిపెట్టి, నూపురనాద గర్జనగల సీతాదేవి సంతోషచిత్తయై వడ్డించుటకువెడలెను. అంతలో శ్రీరాముఁడు ఉపహారము కొఱకై సాదరముగా స్వేష్టులగు బ్రాహ్మణులను మంత్రులను వేలకొలదిగా పిలచి భోజనశాలలో వారితోఁడకూడి కూర్చుండెను. బంగారుపీటలపై వారందరును కనకాభరణంబులను దివ్యపీత కౌశేయంబుల నలంకరించికొని సుస్థితులై శ్రీరామునిచేతగూడ పుష్పగంధాదులచే

చ పృథక్ । రంగవల్ల్యాదిచిత్రాయాం భూమ్యాం న్యస్తాని తత్పురః ॥ ౩౧ ॥ హేమోద్భవాని చానీయ పాత్రాణ్యపి పృథక్ పృథక్ । సోపపాత్రాణి చిత్రాణి రత్నదీపయుతాని చ ॥ ౩౨ ॥ స్థాపయామాసుః శ్రీరామ బంధుపత్న్యస్త్వరాన్వితాః । ఏతస్మిన్నంతరే సర్వైః శ్రుతో మంజులనిస్వనః ॥ ౩౩ ॥ నూపురాణాం కింకిణీనాం కంకణానాం మనోరమః । రత్నమౌక్తికమాలానాం ఘర్షణాదుత్థితో మహాన్ ॥ ౩౪ ॥ తం మంజులస్వనం శ్రుత్వా కస్యాయం శ్రూయతే స్వనః । ఇతి సందిగ్ధచిత్తాస్తే వ్యగ్రనేత్రైరితస్తతః ॥ ౩౫ ॥ అపశ్యన్ బ్రాహ్మణాద్యాశ్చ తావత్సీతాం వ్యలోకయన్ । తటిత్పుంజోపమాం దివ్యాం శతకోటిరవిప్రభాం ॥ ౩౬ ॥ యస్యాంగులిషు సర్వత్ర పాదయోర్వివిధాని చ । మత్స్యకచ్ఛపచక్రాది చిహ్నితాన్యుజ్జ్వలాని చ ॥ ౩౭ ॥ దదృశూ రత్నచిత్రాణి హైమాన్యాభరణాని తే । తత ఊర్ధ్వం కింకిణీనాం పాదయోర్నూపురాణి చ ॥ ౩౮ ॥ శృంఖలా వివిధా రమ్యాస్తథా గుర్జరదేశజాః । నానానూపురభేదాశ్చ కంకణాన్యుజ్జ్వలాని చ ॥ ౩౯ ॥ తస్యాః కట్యాం దదృశుస్తే పీతకౌశేయముజ్జ్వలం । ముక్తాజాలరుక్మతంతు పుష్పరాజివిరాజితం ॥ ౪౦ ॥ రత్నకంకణగర్భాణి దివ్యరుక్మోద్భవాని చ । దదృశుస్తే హి సీతాయా మాణిక్యచిత్రితాని చ ॥ ౪౧ ॥ నవీనంగతిచాంచల్యం కృతమంజులనిస్వనం । ఆదర్శబింబసంయుక్తం సుగంధామోదమోదితం ॥ ౪౨ ॥ వస్త్రోపరి దదృశుస్తే రశనాం రుక్మతంతుజాం । రత్నకంకణగర్భాభిః కింకిణీభిర్విరాజి

---

పూజింపఁబడిరి. అంత నంగనామణులు వారియెదుట వెవ్వేగఁగా చిత్రవిచిత్రంబులుగా ముగ్గులిడిన నేలమీఁద బంగారు ముక్కాలుపీటలను వేసి వాటిమీఁద బంగారుపళ్లెములను పెట్టిరి. రత్నదీపంబులచే రాజించుచుండు సువర్ణోపపాత్రంబులనుకూడ త్వరగా లక్ష్మణ భరత శత్రుఘ్నపత్నులు స్థాపించిరి. అంతలో నచ్చటివారికందరికిని మనోహరధ్వనియొకటి వినఁబడెను. అది కాలందెలయొక్కయు చేతిగాజులయొక్కయు చిరుగజ్జలయొక్కయు రత్నహారంబులయొక్కయు ముక్తాసరంబులయొక్కయు మనోహరనాదంబని తెలియవచ్చెను. ఆ మనోహరధ్వనినివిని దేనిశబ్ద మిది వినవచ్చుచున్నది? అని సందేహించుచు చకితనేత్రులై యచ్చటి బ్రాహ్మణాదు లందరును ఇటటుచూచి యంతలో సీతాదేవి నవలోకించిరి. మెఱుపుల గుమివంటి మేనుగల్గిన నూఱుకోట్ల బాలసూర్యులవంటి తేజస్సుగల యామంగళదేవతయగు తల్లియొక్క కాలివేళ్ల లోనంతట మత్స్య కమఠ మకరాకారంబులయిన సువర్ణరత్న నిర్మితంబులగు దివ్యాభరణంబులను చూచిరి. అంత నాలోకమాతయొక్క చరణకమలంబులపై చిరుగజ్జలుగల నూపురంబులను గుజరాతిదేశపు పలుతెరంగులగు బంగారుగొలుసులను నవమనదును రత్ననిర్మితంబులగు కడియములను చిత్రంబులుగా నవలోకించిరి. అంతనా జగజ్జననియొక్క నడుమున బంగారుసరిగె పూలచే లీల నొదవించుచుండు నదియును ముత్తెముల జాలరులుగలదియును నడకవలన మురమురలాడుచుండునదియును దర్పణ శకలంబులుగలదియును దివ్య పరిమళయుక్తంబునగు పీతాంబరమును విలోకించిరి. దానిపైన నెమలి సింహము వృషభము పులి జింక ఇట్టి చిత్రములచే

తాం ॥ ౪౩ ॥ కేకిసింహవృషవ్యాఘ్రమృగచిత్రవిచిత్రితాం । పీతరక్తహరిన్నీలకృష్ణమాణిక్యమండితాం ॥ ౪౪ ॥ తత
ఊర్ధ్వం దదృశుస్తే పదకాన్యుజ్జ్వలానిహి । రంభాఫలోపమాన్యేవ హైమాన్యాభరణానిచ ॥ ౪౫ ॥ సకాంచన
శృంఖలాని కాచద్రవయుతానిచ । నానారత్నవిచిత్రాణి ముకురైర్మండితాన్యపి ॥ ౪౬ ॥ నానామాణిక్యముక్తాని
దీప్తిమంత్యుజ్జ్వలానిహి । తతో దదృశుస్తే దివ్యాన్ రుక్మహారాన్విచిత్రితాన్ ॥ ౪౭ ॥ నవరత్నయుతాన్ హా
రాన్ ముక్తాహారాంశ్చ శృంఖలాః । మూర్తిమాలా రుక్మజాశ్చ యవమాలావిచిత్రితాః ॥ ౪౮ ॥ పుష్పమాలాః కాం
చనజాస్సారికా రత్నమండితాః । రుక్మగుంజాన్వితా మాలా హేమధాత్రీఫలాన్వితాః ॥ ౪౯ ॥ ప్రవాళమణిముక్తా
సమ్మిశ్రితాశ్చిత్రచిత్రితాః । చంపకస్థూలకళికయా సదృశా హేమమాలికాః ॥ ౫౦ ॥ కంఠే మంగళసూత్రంచ పే
టికా రత్నభూషితాః । కాంచనానాం సుసూక్ష్మాణాం మణీనాం వివిధానిచ ॥ ౫౧ ॥ గుచ్ఛైః కంఠభూషణాని ము
క్తాగుచ్ఛయుతాన్యపి । దదృశుస్తేహి సీతాయాః కంఠే హైమాన్యనేకశః ॥ ౫౨ ॥ రశనాసదృశాన్యేవ గ్రీవాయాం
భూషణాన్యపి । ప్రవాళమణిమాణిక్య రచితాన్యుజ్జ్వలానిచ ॥ ౫౩ ॥ ముక్తాగుచ్ఛాన్ కాచగుచ్ఛాన్ రత్నగుచ్ఛాన్
విచిత్రితాన్ । ప్రవాళమణిగుచ్ఛాంశ్చ రత్నపుష్పగుంఫితాన్ ॥ ౫౪ ॥ తతో దదృశుస్తే సర్వే శైథిలీకుచకంచుకీం ।
హేమతంతుభిరాచిత్రాం ముక్తామాణిక్యగుంఫితాం ॥ ౫౫ ॥ ఆదర్శబింబసంయుక్తాం పుష్పరాజవిరాజితాం । మ

---

చిత్రంబును పంచవర్ణ పంచరత్నంబులచే సంచితంబును కనకతంతువులచే నల్లబడిన బంగారు తీ
గెను అంచు రత్నకింకిణులను విలోకించిరి. అటుమీఁద ప్రకాశించుచుండు పదకములను అరటి
పండ్లవంటి ఆకృతివిశేషంబులచే నాహ్లాదకరంబులగు నాభరణంబులను బంగారుగొలుసులను
వివిధరత్న విచిత్రితంబులుగాను వజ్రములచే నలంకృతంబుగాను చూచిరి. పిదప నవరత్న
హారంబులను ముక్తాసరంబులను దేవప్రతిమా యుక్తంబులయిన వరహాలదండలను గోధుమస
రములను విచిత్రితంబులయిన కనక కుసుమ మాలికలను రత్నపుచిలుకలచే నలంకరింపఁబడిన
సువర్ణమణిహారంబులను కనకామలక హారంబులను ముత్తెములు పగడములు కలిసిన కనక
చంపకా కుసుమ మాలికలను కంఠంబున మంగళసూత్రంబులను రత్నాలంకృతంబులగు తాయి
త్తులను వివిధమణి కనక కల్పితంబులగు కుచ్చులను ముత్తెముల కుచ్చులను ఇట్లు సువర్ణాలం
కారంబుల ననేకంబులుగా నవలోకించిరి. మెడలో నన్నియాభరణంబులను ధారములవంటి
వి. పగడముల రత్నముల మాణిక్యంబుల ముత్తెముల స్ఫటికముల గుచ్ఛంబులను రత్నపు
ష్పంబులను చూచిరి. అటుపిమ్మట, ముత్తెములు రత్నములు చెక్కఁబడిన బంగారు సరిగెతో
చేయబడిన స్ఫటిక శకలములలో చేరిన పూలవరుసలచే లీలాస్పదంబయిన నెమళ్లు మొదలగు
చిత్రములచే నలంకరింపఁబడిన శ్రమఘర్మముచే నార్ద్రమయిన చక్కగా తొడిగిన రవికెను
చూచిరి. అంతనా మంగళాంగియొక్క భుజములపై రత్నాలంకృతంబులయిన కేయూరంబుల
ను, కనకమణి చిత్రితంబులును రత్నచిత్రంబులును గలదియునగు భుజతాయెత్తులను నిరీక్షించిరి

యూరశుకపృష్ఠైశ్చ లవంగైస్తంతునిర్మితైః ॥ ౫౬ ॥ చిత్రితాం శ్రమఘుర్మణా ... సంలగ్నాం దృఢంతినా । తతోదదృశుర్భుజయోః కేయూరే రత్నమండితే ॥ ౫౭ ॥ వక్రకంకణసాదృశ్యే హేమమాణిక్యనిర్మితే । రత్నచిత్రవిచిత్రాశ్చ భుజయోః పేటికాశ్శుభాః ॥ ౫౮ ॥ హేమతంతుభిరైర్లంబమానగుచ్ఛైస్సుమండితాః । ప్రవాళమణిముక్తానాం నానాగుచ్ఛైర్యుతా అపి ॥ ౫౯ ॥ తదధః కరయోస్సర్వే దదృశుర్భూషణాని తే । రత్నమాణిక్యముక్తాభిశ్చిత్రితౌ హేమసంభవౌ ॥ ౬౦ ॥ కరచూడౌ దీప్తిమంతౌ హేమపుష్పాదిచిత్రితౌ । కాంచనకంకణమధ్యస్థౌ చంద్రసూర్యోపమౌ త్విషా ॥ ౬౧ ॥ తదూర్ధ్వాగ్రకంకణాని హేమజానిఘనానిచ । రత్నమాణిక్యముక్తాభిశ్చిత్రితాన్యుజ్జ్వలానిచ ॥ ౬౨ ॥ ప్రవాళమణిముక్తానాం కరహారాదిచిత్రితాన్ । కరయోస్సారికే దివ్యే హ్యూర్ధ్వాధోరత్నమండితే ॥ ౬౩ ॥ తదూర్ధ్వం కంకణాన్యేవ పుష్పవల్ల్యంకితానిహి । దంతరాజ్యసమాని రత్నహేమోద్భవానిచ ॥ ౬౪ ॥ అంగుళీషు దదృశుస్తే ముద్రికా యుక్తనిర్మితాః । రత్నమాణిక్యముక్తాభిర్నవరత్నైరపి ॥ ౬౫ ॥ ప్రవాళచంద్రకాంతైశ్చ సూర్యకాంతైర్విచిత్రితాః । నానాపుష్పసమాఢ్యా ప్రతిపర్వసమాశ్రితాః ॥ ౬౬ ॥ తతోదదృశుస్సీతాయా రమ్యం ఘ్రాణే తిలోజ్జ్వలం । దివ్యం మయూరచిత్రం చ వరముక్తావినిర్మితం ॥ ౬౭ ॥ మణిమాణిక్యముక్తాభిర్వరరత్నైస్సుమండితం । లంబితైర్మౌక్తికాదీనాం వరగుచ్ఛైస్సువేష్టితం ॥ ౬౮ ॥ తతోదదృశుస్సీతాయాః కర్ణయోర్భూషణాని తే । మకరధ్వజసాదృశ్యే తాటంకే రత్నచిత్రితే ॥ ౬౯ ॥ మణిమాణిక్యముక్తాభిర్గుంఫితేసో

---

వాటిక్రింద బంగారుసరిగెచే చుట్టఁబడిన వ్రేలుచుండు ముత్తెముల పొగడముల రత్నముల గుచ్ఛములచే నలంకృతంబులయిన చేతిపొమ్ములను పరికించిరి. మణిమాణిక్య మండితంబులయి సువర్ణ సుమాలంకృతంబులయి వెలుఁగుచుండు బాహుపురులను, సూర్యచంద్రులవలె వెల్గుచుండు గాజుకడియములను వాటిపై బంగారు గట్టిగాజులను, మణిమాణిక్య ముక్తాలంకృతంబులయిన కరహారంబులను, దిగువపైన రత్నమండితంబులగు చేతిసారికలలును, వాటిపైన పుష్పవల్లి విచిత్రితంబులగు గజదంతావళులవలె వెల్గుచున్నట్టి కనకమణ్యాలంకృతంబగు కంకణంబులను పదివ్రేళ్ళలోను ముత్తెములు పగడములు పుష్యరాగములు గోమేధకములు వైడూర్యములు మరకతములు మాణిక్యములు వజ్రములు ఇంద్రనీలములు అను నవరత్నంబులచే దేదీప్యమానంబులైన గనుపులనన్నిటి నాశ్రయించిన మణిసువర్ణ ముద్రికలను చూచిరి. పిదప సీతాదేవియొక్క చంపకనాసికపై ముత్తెముల కుచ్చులచేతను నవరత్నరచనలచేతను రారాజిలుచుండు మయూరాకారంబయిన మనోహరంబగు ముక్కఱను విలోకించిరి. పిదప నామెయొక్క కర్ణంబులలో మకరధ్వజ సమానంబులయిన రత్నవిచిత్రితంబులయిన దివ్య తాటంకంబులను, మణిమాణిక్య ముక్తాలంకృతంబులయిన బుగడలను, రత్నపుష్పక రమణీయంబులయిన కత్తిరిబావిలీలను, సువర్ణముక్తారత్న విరాజితంబులగు జంపులను, ముక్తాగుచ్ఛ ప్రకాశితంబులయిన బుగడ గొలుసులను, చెవిమొదలుకొని పాపటవరకు నొసటిప్రక్కల నాశ్రయించిన మణి

జ్వలేవరే । రత్నపుష్పాదిభిశ్చైశ్చిత్రితేరవిభాస్వరే ॥ ౨౦ ॥ తతోభ్రమరికేదివ్యే రుక్మరత్నవిచిత్రితే । ముక్తాభిర్గుంఫితేరమ్యే హేమపుష్పాణివై తథా ॥ ౨౧ ॥ కర్ణయోశ్శృంఖలాశ్చిత్రా దదృశూరుక్మనిర్మితాః । ముక్తాగుచ్ఛైర్గుంఫితాశ్చ రత్నమాణిక్యమండితాః ॥ ౨౨ ॥ ఆకర్ణాద్భ్యంచసీమంత పర్యంతంఫాలపార్శ్వయోః ॥ హారవద్రుక్మజాలాని మాణిక్యసహితానిహి ॥ ౨౩ ॥ ముక్తాగుచ్ఛైర్గుంఫితాని వైడూర్యచిత్రితాన్యపి । తతస్తదూర్ధ్వం సీతాయాః దదృశుశ్శిరసిద్విజాః ॥ ౨౪ ॥ సీమంతస్యోత్తరేయామ్యే కేశేషుశశిభాస్కరౌ । రుక్మజౌరత్నవైడూర్య మణిముక్తావిచిత్రితౌ ॥ ౨౫ ॥ నీలకాశ్మీరకాంతైశ్చ విద్రుమైరతిశోభితౌ । చంద్రసూర్యావివస్వీయ భాసాదీపయతోదిశః ॥ ౨౬ ॥ నిటిలేతిలకంరత్న మణిముక్తావిరాజితం । హైమందివ్యముజ్జ్వలంచ కోటిసూర్యసమప్రభం ॥ ౨౭ ॥ తతోదదృశుస్సీమంతే ముక్తాహారంమహోజ్జ్వలం । నానారత్నవిచిత్రంచ హ్యావేణీతిలకావధి ॥ ౨౮ ॥ చూడామణిందదృశుస్తే జనకేనసమర్పితం । నానారత్నవిచిత్రంచ ముక్తాగుచ్ఛవిరాజితం ॥ ౨౯ ॥ తతోదదృశుశ్శిరసి ముక్తాజాలానిభూసురాః । హేమతంతుగుంఫితాని రత్నపుష్పయుతాన్యపి ॥ ౩౦ ॥ మణివైడూర్యకాశ్మీర విద్రుమైశ్చిత్రితానిహి । తదూర్ధ్వంపుష్పజాలాని సుగంధీనిష్యలోకయన్ ॥ ౩౧ ॥ తతోవేణ్యాంభూషణాని దదృశుస్తేవరాణిహి । నానాపక్ష్యుపమాన్యేవ మాణిక్యచిత్రితానిహి ॥ ౩౨ ॥ పల్లవాంతరవర్తీన్యప్యతిదీప్తోజ్జ్వలానిచ । హేమతంతుమయాన్గుచ్ఛాన్ ముక్తాహారవిమిశ్రితాన్ ॥ ౩౩ ॥ లంబమానాన్దదృశుస్తే మణిమాణిక్యసంయుతాన్ । వేణ్యగ్రేసంస్థితాన్రమ్యాన్ పుష్పాపీడసమన్వితాన్ ॥ ౩౪ ॥ ఏవంసీతాందదృశుస్తే క్రమన్యస్త

---

మాణిక్యమండిత కనకహారంబులను, ముక్తాగుచ్ఛ గుంభితంబయిన రత్న వైడూర్య రాజితంబగు పాపటను, దాని కిరుగెలంకులలో వెంట్రుకలనడుమ నిజముగా స్వతేజస్సువలన దిక్కులను ప్రకాశింపజేయునట్టి నవరత్నంబులచే దేదీప్యమానంబయిన చంద్రసూర్యులవంటి శశిభాస్కరబింబాభరణంబులను చూచిరి. ఆమెమోమున కోటిసూర్యప్రకాశమానంబై ముక్తామణి విరాజితంబై యుండు ఇంద్రనీలమణి తిలకంబును దర్శించిరి, పిదప జడమొదలు తిలకమువరకు పాపటపై బరగుచుండు నవరత్నవిరాజితంబగు ముక్తాహారము నవలోకించిరి. పిమ్మట జనకరాజుచే సమర్పింపఁబడిన సర్వరత్న సమాగ్ణంబగు చూడామణినిచూచిరి. అంతనా శిరస్సుపైన బంగారు సరిగెచుట్టిన ముక్తాహారంబులను సద్రత్న పుష్పాలంకృతంబులుగా నవలోకించిరి. వాటిపైన దివ్యపరిమళ పూర్ణంబులగు పుష్పమాలికలను చూచిరి. అంత నామెయొక్క జడలోని సువర్ణనిర్మిత వివిధపక్ష్యాకృతి రత్నరాజితంబయిన జడ బంగారును అంచులో ముక్తాగుచ్ఛంబులను కొనలో కనకరత్నమయంబులగు జడకుచ్చులను నడుమనడుమ పుష్పాభరణంబులను చూచిరి. ఇట్లుండు సీతాదేవిని ఆబ్రాహ్మణులు దర్శించిరి. ఆహా! క్రమముచే సర్వాభరణంబులను ధరించిన సాక్షాల్లక్ష్మీదేవినిచూచుట కెవ్వఁడును సమర్థుఁడుకాఁడు. ఆ దివ్యాలంకారంబులలోని రత్నకాంతులచే ప్రతిహతదృష్టులయిన బ్రాహ్మణాదులందరును ఎడమచేతిలో పాత్రంబును కు

విభూషణాం । సర్వాలంకారసహితాం తాం ద్రష్టుం కోపినక్షమః ॥ ౭౫ ॥ దివ్యాలంకారరత్నానాం ప్రభయాహత లోచనాః । వామహస్తేన పాత్రంచ దర్వీం దక్షిణసత్కరే ॥ ౭౬ ॥ దధానాం పద్మచరణాం రక్తోత్పలకరాంవరాం । పద్మాస్యాం పద్మపత్రాక్షీం పద్మగర్భస్వరూపిణీం ॥ ౭౭ ॥ దివ్యైః కర్పూరగంధైశ్చ చందనైరపిచర్చితాం । నూపుర రత్నమంజీరచరణాం దివ్యకంకణమండితాం ॥ ౭౮ ॥ స్వపదారక్తవర్ణేన గతిం దర్శయతీం నిజాం । రత్నాంగదధరాం సీతాం దదృశుస్తే ద్విజాదయః ॥ ౭౯ ॥ గజేంద్రగమనాం రమ్యాం దివ్యపుష్పైస్సుశోభితాం । దివ్యమందారకుసుమ మాలాభిశ్చ సుశోభితాం ॥ ౮౦ ॥ కస్తూరీకృతతిలకాం కుంకుమేన సుశోభితాం । హరిద్రయా కజ్జలాద్యైర్భూషితాం చ స్మితాననాం ॥ ౮౧ ॥ ఇతి దృష్ట్వా జానకీం తే భూవర్ చిత్రోపమాస్తదా । ఆత్మానం నవిదుస్సర్వే సీతాసౌందర్య విస్మితాః ॥ ౮౨ ॥ ॥ ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే శ్రీమదానందరామాయణే వాల్మీకీయే విలాసకాండే సీతాలంకారవర్ణనం నామ చతుర్థస్సర్గః ॥ ... ... ... ... ... ... ॥౪॥

శ్రీరామదాస ఉవాచ—అథ సీతాక్షణేనైవ చకార పరివేషణం । హేమపాత్రేషు సర్వేషాం పక్వాన్నైర్వివిధైర్ముదా ॥ ౧ ॥ కామధేనూద్భవైశ్చైవ మండకైః పూర్ణపూరితైః । వటకైః ఫేనకైశ్చాపి పాయసాన్యుజ్జ్వలానిచ ॥ ౨ ॥ పర్పటకైర్లడ్డుకాంశ్చ కూష్మాండవటకాంస్తథా । భృష్టతండులరామలాన్ దధిక్షీరం ఘృతంమధు ॥ ౩ ॥ పృథక్కాంచనద్రోణేషు జానకీపర్యవేషయత్ । శర్కరాశ్శ్వేతవర్ణాశ్చ తత్రైవ ఖండశర్క-

---

డి చేతితో గరిటెను ధరించినదియును కమలములవంటి చరణములుగలదియును రత్నపుకలువుల వంటి చేతులుగలదియును తామరరేకువంటి నయనంబులుగలదియును పద్మములవంటి ముఖముగలదియును దివ్యగంధాలేపితాంగియును మంజీరమంజుల చరణయును కంకణాలంకృత కరకమలయును నిజాంఘ్రిరక్తిమచే గమనమునుచూపునదియును అయిన సాక్షాల్లక్ష్మీస్వరూపిణియగు సీతాదేవిని దర్శించిరి. గజరాజగమనయును దివ్యపుష్పాలంకృత భవ్యాంగియును సురపారిజాతాది మాలికలనంది రారాజించునదియును కస్తూరీతిలకాంకితయును కుంకుమాలంకృతయును హరిద్రాలంకృతయును కజ్జలాదులచే సముజ్జ్వలయునగు ఆ సీతమ్మనుచూచుచున్నవారందరును తమ్ముతామెఱుంగక జానకీ సౌందర్య విస్మితచిత్తులై చిత్రప్రతిమలవలె స్తబ్ధులైయుండిరి. ... ... ... ... ... ... ౪॥

## శ్రీరామాదులకును బ్రాహ్మణులకును సీత వడ్డించుట.

పిదప నామంగళదేవతయగు జానకమ్మ క్షణమాత్రమున నచ్చటివారికందరికిని కామధేనుకల్పితంబులైన పక్వాన్నాది సమస్తపదార్థంబులను కనకపాత్రంబులలో వడ్డించెను. ఊరబిండ్లు కోసుంబరులు గొజ్జులు పచ్చళ్లు నేతితోవండిన కూరలు నూగులవడియములు గుమ్మడివడియములు అటుకులవడియములు వరుగులు ఫేవళంబులు నప్పళంబులు మండిగెలు లడ్డువులు పాయసంబులు పక్వాన్నంబులు భక్ష్యములు లేహ్యములు చోహ్యములు పానీయంబులు బంగారు

రాః ॥ ౪ ॥ మరిచాద్యుపచారైశ్చ సంస్కృతంతక్రముత్తమం । ఘృతపాచితశాఖాశ్చ పాల్యపకాకారుచిప్రదాః॥౫॥ తిలసంమిశ్రవటకా నార్ద్రికంబీజపూరకం । ఆమ్రాదీనాంరసాంశ్చాపి రంభాదీఃఫలాన్యపి ॥ ౬ ॥ ఏవమాదీన్యనేకాని చోష్ణానివివిధానిచ । తథాశేష్యాని పేయాని జానకీపర్యవేషయత్ ॥ ౭ ॥ తతోరామస్సుహృన్మిత్రైః కథాంకుర్వన్సుఖేనసః । అకరోదుపహారంచ కరశుద్ధిం విధాయసః ॥ ౮ ॥ సర్వేషాంనిజహస్తేన దదౌతాంబూలముత్తమం। స్వయంభుక్త్వాథతాంబూలం వాసాంసిపరిధాయసః ॥ ౯ ॥ బద్ధ్వాశస్త్రాణిసర్వాణి దృష్ట్వాదర్శేనిజంముఖం । ఆరుహ్యశిబికాందివ్యాం ముక్తాగుచ్ఛవిరాజితాం ॥ ౧౦ ॥ హైమరత్నాదిభిశ్చిత్రాం యయౌనిజగృహాద్బహిః । బంధుభిస్సచివైరిష్టై ర్దూతైస్సర్వత్రవేష్టితః ॥ ౧౧ ॥ స్తుతోబందిజనైస్సర్వై ర్యయౌసజననీగృహం । తత్రనత్వాథ కౌసల్యాం తథామాతౄర్యథాక్రమం ॥ ౧౨ ॥ ఆశీర్భిరీడితస్తాభి ర్యయౌరామస్సభాంతరం । తత్రసింహాసనేస్థిత్వా మంత్రిభిర్లక్ష్మణాదిభిః ॥ ౧౩ ॥ రాజకార్యాణిసర్వాణి చకారనీతిమత్తరః । శశాసరాజ్యంధర్మేణ బుద్ధిమాంశ్చారలోచనః ॥ ౧౪ ॥ అథసీతోపహారంస్వ సఖీభిశ్చోర్మిళాదిభిః। దేవరాణాంకామినీభిః స్వసృభిశ్చాకరోత్సుఖం॥ ౧౫ ॥ కరశుద్ధింవిధాయాథ భుక్త్వాతాంబూలముత్తమం । పరిధాయహరిద్వస్త్రం తథారక్తాంతుకంచుకీం ॥ ౧౬॥

దొన్నెలలో నెయ్యి పాలు పెరుగు దివ్యతక్రము తెల్లచక్కెర ఖండశర్కర అరటిపండ్లు మామిడిపండ్లు దానిమ్మపండ్లు ద్రాక్షపండ్లు పనసపండు మొదలయిన ఫలములు ఇంక ననేక పదార్థంబులు వీటినన్నిటిని సాదరముగా సీతమ్మ వడ్డించి యభిఘార మొనరించెను॥ ౭ ॥ అంతనా శ్రీ

శ్రీరాములవారు భుజించివచ్చి ధర్మపాలన మొనర్చుట.

రాముఁడు, ఇష్టమిత్రులలోడ వినోదకథా సల్లాపంబుల నొనర్చుచు సుఖముగా నాహారము నారగించి, కరశుద్ధిచేసికొనినవెనుక నందరికి తనచేతిమీఁదుగా తాంబూలంబులనిచ్చెను. తాను భోజనముచేసి తాంబూలమునువేసికొని వస్త్రంబుల నలంకరించికొని సమస్తాయుధములను కట్టికొని నిలువటద్దములో ముఖమునుచూచికొని ముత్తెముల కుచ్చులచే నలంకరింపఁబడియుండు సువర్ణాలంకృతంబయిన పల్లకీమీఁద నెక్కి నిజగృహామునుండి వెడలి ఇష్టమిత్ర బంధు మంత్రి దూత ప్రముఖులచే పరివృతుఁడై వందిమాగధులు పొగడుచుండ తనతల్లియింటికివచ్చి కౌసల్యాదేవి నచ్చటవందించి అట్లే క్రమముగా తల్లులనందరికిని నమస్కరించి వారి యాశీర్వాదంబుల నంగీకరించి సభామంటపమున కేతెంచి యచ్చటి దివ్యసింహాసనంబున సుఖాసీనుఁడై లక్ష్మణాది మంత్రులతోడ నీతిజ్ఞుఁడై రాజకార్యంబులనన్నిటిని విచారించెను. చారలోచనుండును బుద్ధిమంతుండునైన శ్రీరాముఁడు ధర్మముగా రాజ్యమును పరిపాలించెను॥౧౪॥ తరువాత

సీత తోడికోడండ్రతోడ భుజించి యుద్యానమున కేతెంచుట.

సీతమ్మ తనమరదుండ్ర పత్నులయిన ఊర్మిళాదులతోడను తన చెలికత్తెలతోడను యథాసుఖముగా భోజనమునారగించి చేతులు కడిగికొని తాంబూలములనంది, పీతాంబరము నలంక

హేమతంతుసుపుష్పాఢ్యాం ముక్తాజాలవిగుంఫితాం। గేహాంతర్వృత్త్యుపవన శాలాయాంసంస్థితాభవత్ ॥౧౭॥ సఖీ
భిర్వేష్టితారమ్యా ధృతాధోంశోపబర్హణా । తతోదివ్యానలంకారా న్నిజదేహేదధారసా ॥ ౧౮ ॥ యేమయా
కథితానైవ పూర్వన్యస్తాన్క్రమేణతాన్। కస్తస్యావర్ణనేశక్తో భవేఽత్రనరోత్తమః ॥ ౧౯ ॥ చతురాస్యఃశంభి
తోభూత్వం చాస్యశ్చషడాననః। ఉచ్చైఃశ్రవాశ్చసప్తాస్య స్సహస్రాస్యోపివర్ణనే ॥ ౨౦ ॥ శ్రుత్వాసీతాముప
వనే గతాంతేజలపూరకాః। జలయంత్రాణిసర్వాణి చక్రుర్ముక్తానివేగతః ॥ ౨౧ ॥ రత్నమంచకసంస్థాసా సీతా
చామరవీజితా। జలయంత్రకౌతుకాని దదర్శనగవీరుధాన్ ॥ ౨౨ ॥ ఏతస్మిన్నంతరేరామో రాజకార్యాణికృ
త్స్నశః। కృత్వాయయౌసభాయాస్స నిజగేహంతుబంధుభిః ॥ ౨౩ ॥ తదాదుందుభిఃఘోషో నవవాద్యస్వనా
అపి। శంఖానాంగోముఖానాంచ భేరీణాంతుములస్వనాః ॥ ౨౪ ॥ బభూవుర్యంత్రశబ్దాశ్చ తూర్యాదీనాంస్వనా
శ్శుభాః। ననృతుర్వారనార్యశ్చ తుష్టువుర్మాగధాదయః ॥౨౫॥ తంస్వనంజానకీచాపి శ్రుత్వాచోపవనేస్థితా।
సంభ్రమేణసముత్తీర్య మంచకాద్వరాననా ॥౨౬॥ వామహస్తేర్ఘుర్ఘరింతాం హ్యుపపాత్రంతుదక్షిణే। ధృత్వా
కరేసావైదేహీ రామంప్రత్యుజ్జగామవై ॥ ౨౭ ॥ ఏతస్మిన్నంతరేరామస్త్యక్త్వాతాంశిబికాంబహిః। విసర్జ్యసక

రించికొని ముక్తాజాలంబులచేతను బంగారుసరిగె పూలునుగల యెల్లరవికె దొడిగికొని ఇంటి
లోని వెనుకటి యుపవనంబును ప్రవేశించి సుఖాసీనయయ్యె. విష్ణుదాసుఁడా! మునుపు నేను
చెప్పినట్టి యలంకారములుండని, నేను చెప్పని దివ్యాలంకారంబుల నన్నిటినో నిజసఖీపరివృత
యై జానకీదేవి యలంకరించికొనెను. సీతాలంకారమును వర్ణించుటకే నరోత్తముండును శక్తుఁ
డుగాఁడు. నాలుగు మోములుగల బ్రహ్మయును అయిదుమోములుగల రుద్రుఁడును ఆరువక్త్ర
ములుగల కుమారస్వామియును యేడాననంబులుగల యగ్నిభట్టారకుండును వెయ్యినోళ్లుగల
యాదిశేషుఁడుకూడ సమర్థుఁడుకాడు. సీతాదేవి యుపవనంబునకు దయచేసెనని విని జలపూ
రకులందరును జలయంత్రంబుల నన్నిటిని తెరచివిడిచిరి. మణికాంచన పర్యంకముపై సుఖాసీన
యగు సీతమ్మ దాసీజనులు చామరములు వీచుచుండగా జలయంత్ర వినోదంబులను వృక్షశా
ఖలలోనుండి చూచుచుండెను॥ ౨౨ ॥ అంతలో నా శ్రీరాముఁడు రాజకార్యంబుల నన్నిటిని
నిర్వర్తించి సభనుండి వెడలి తన తమ్ములతోడ నిజమందిరంబున కేతెంచెను. అప్పుడు దుం

### శ్రీ సీతారాముల జలక్రీడామహోత్సవము నందుట.

దుభులు నవనాద్యంబులును వాయింపఁబడెను. వారాంగనలాడిరి. మాగదాధులు కొనియా
డిరి. ఆ కోలాహలంబును ఉపవనాసీనయగు జానకీదేవియును విని మిక్కిలి సంభ్రమముతోడ
మంచమునుండిదిగి యెడమచేతిలో నర్ఘ్యపాత్రంబును కుడిచేతిలో నుపపాత్రంబును తీసికొని
శ్రీరామునియెదుట వచ్చెను. అంతలో నారాముఁడు బయట నా ముత్తెములపల్లకీనుండిదిగి
సమస్త పరివారజనులను వదలి తమ్ములతోడ లోపలప్రవేశించెను. అంతలో నచ్చట సువర్ణా

లాకాలోకాః విశేషబంధుభిర్గృహే ॥ ౨౮ ॥ ఏతస్మిన్నంతరే వాస్య శ్శతశోరుక్మభూషితాః । రాఘవాగ్రేదు ద్రువుస్తాః స్వస్వకర్మానుతత్పరాః ॥౨౯॥ కాచిత్తువ్యజనేనైవ వీజయామాసవేగతః । దధారచామరేకాచిత్కాచిదాసనముత్తమం ॥ ౩౦ ॥ కాచిత్తాంబూలపాత్రంసా కాచిన్నిష్ఠీవనస్యచ । పాత్రందధారకాచిత్తు జలకుంభం మనోరమం ॥ ౩౧ ॥ కాచిద్దధారవస్త్రాణాం కోశంకాచిత్తుకార్ముకం । కాచిద్దధారతూణీరంకాచిత్ఖడ్గందధారసా ॥ ౩౨॥ ఏవమాదీన్యనేకాని తదోపకరణానితాః । జగృహూరామచంద్రంతం వేష్టయామాసురాదరాత్ ॥౩౩॥ తతోరామశ్శనైఃపద్భ్యాం యయౌజనకనందినీం । స్వీయంమార్గంప్రతీక్షంతీం లజ్జయావనతాననాం ॥ ౩౪॥ గృహాంగణారామమధ్యే సంస్థితాంసస్మితాననాం । దృష్ట్వాత్మానంవిలజ్జంతీం సునాసాంచారులోచనాం ॥ ౩౫ ॥ శనైశ్శనైస్సమాయాంతీం సఖీభిఃపరివేష్టితాం । తాందృష్ట్వారాఘవశ్చాపి కించిత్కృత్వాస్మితాననం ॥౩౬ ॥ చకారాచమనంసమ్యక్సీతార్పితజలేనసః । తతఃస్థిత్వాసనేపీత్వా జలమగ్రేయయౌపునః ॥ ౩౭ ॥ జలయంత్రసమీపస్థాం శాలాంసీతాసమన్వితః । తస్యాంసింహాసనేస్థిత్వాలక్ష్మణంప్రాహరాఘవః ॥ ౩౮ ॥ గచ్ఛభోజనశాలాంత్వంలసర్వానాహూయవేగతః । బ్రాహ్మణాదీనూర్మిళాది నారీణాంత్వరయస్వహి ॥ ౩౯ ॥ సర్వంకృత్వాయథాయోగ్యం తతోమాంకురుసూచనాం । తథేతిరామవచనాద్భరతేనసశత్రుహా ॥ ౪౦ ॥ లక్ష్మణస్త్వరితోగత్వా సర్వానాహూయ

లంకృతాంగులయిన దాసీజనులు తమతమపనులలో జాగరూకులై వెడలిరి. ఒకతె విసనకఱ్ఱచే వీచసాగెను. మఱియొకతె చామరంబులను ధరించెను. ఇంకనొకతె యాసనమునందుకొనెను. ఇట్లే తమ్మపడిగెనొకతె అమ్ములపొదనొకతె వస్త్రపేటికనొకతె, ధనుస్సునొకతె, ఖడ్గమునొకతె, ఇట్లే శ్రీరాములవారి సర్వోపకరణంబులను ఒక్కొకతెయెత్తికొని చుట్టుబారుకొనిరి. అంత నారఘునందనుఁడు కాలినడకతో వెడలి తనరాకనే గృహాంగణారామమధ్యముననిలచి తన్నుచూచి లజ్జించుచుండు దివ్యసుందరాంగియైన మంగళదేవతయొక్క సన్నిధానమునకు వచ్చెను. అచ్చట సీతచే సమర్పింపఁబడిన జలములచే నాచమనముచేసి పీఠముపై కూర్చుండి దివ్యోదకముఁద్రావి ముందుకువెడలెను. జలయంత్రసమీపంబున నుండెడు లతాశాలను సీతాసమన్వితుఁడుగా ప్రవేశించి అచ్చిటి సింహాసనముమీఁద కూర్చుండి లక్ష్మణునిఁజూచి "తమ్ముఁడా! నీవు భోజనశాలకుపోయి బ్రాహ్మణాదులనందరిని పిలిపించి, ఊర్మిళాదులను త్వరపరచుము. అన్నిటిని సిద్ధపరచి నాకు సూచనచేయుము." అనిచెప్పెను. లక్ష్మణుఁడు అట్లేయని భరతశత్రుఘ్నులతోడ వెడలి వసిష్ఠాదిమునులను మంత్రులను ఇష్టమిత్రులను అందరిని పిలిపించెను. ఊర్మిలా శ్రుతకీర్తి మాండవులను కార్యములలో శ్రీరామాజ్ఞచే త్వరపరచెను. అంతలో నుద్యానవనమ్మున శ్రీరాముఁడు చిత్రరాగంబులనునింపి కేసరాదులచే నిర్మింపఁబడిన జలయంత్రంబుల ననేకంబులను చేయించి వేరుగా దాసీజనులందరును సంతోషించుచుండ వాటిలో సీతను నిజబాహుపాశంబులచే కట్టిపట్టి యెత్తి త్రోసెను. తానుకూడ వేరుగా జలయంత్రంబులలో మె

గతః । వసిష్ఠాదిమునీన్మిత్ర మంత్రిణస్సుహృదస్తథా ॥ ౪౧ ॥ త్వరయామాసోర్మిలాంచ మాండవీం భరతప్రియాం। శ్రుతకీర్తించ సౌమిత్రిః శ్రీరామవచనాత్తదా ॥ ౪౨ ॥ ఏతస్మిన్నంతరే రామః కేశరాదివినిర్మితైః । చిత్రరాగైః పూరితాని జలయంత్రాణ్యనేకశః ॥ ౪౩ ॥ కారయిత్వా తేషు సీతాం బాహుపాశైః పృథుం ముదా । ధృత్వాక్షిపత్ప్రథ్వగాప్యా ఉపపశ్యత్స్వైసుఖం ॥ ౪౪ ॥ తతః స్వీయం పపాతోచ్చై జలయంత్రేషు వై పృథక్ । జలక్రీడాం సమైథిల్యా చకార రఘునందనః ॥ ౪౫ ॥ భుజాభ్యాం సమాలింగ్య తాం ముహుః ప్రక్షిపన్ముదా । రంజయామాస వైదేహీం సురాగాంజలిసేచనైః ॥ ౪౬ ॥ తతస్సుగంధతైలాని తథా పరిమళానిహి । నానాసుగంధద్రవ్యాణి మాంగల్యాని బహూనిచ ॥ ౪౭ ॥ దాసీభిః క్షిప్యమాణాని తావుభౌహి పరస్పరం । వవృషతుః సూనాద్యైశ్చ క్రీడాద్రవైర్మణాసూరమైః ॥ ౪౮ ॥ కరాభ్యాం జలయంత్రాణి మిథస్తౌ సంముముచతుః । రామాక్షిసంజ్ఞయా దాస్యస్సీతాసఖ్యోపి సూచితాః ॥ ౪౯ ॥ వస్త్రైర్భిత్తిబహిర్దూరం గత్వాతస్థుర్వ్యలజ్జితాః । కాశ్చిద్ద్వారేషు తస్థుస్తాస్తూష్ణీం ప్రముదితాననాః ॥ ౫౦ ॥ అదృష్ట్వాన్యాంతతస్సీతా రామారహసి సాదరం । జలయంత్రేషు తౌ క్రీడాం చక్రతుస్సుచిరం ముదా ॥ ౫౧ ॥ ముష్టిభ్యాం జానకీ రామం తాడయామాస కౌతుకాత్ । సోపి తాం తాడయామాస ముష్ట్యా పుష్పసమానయా ॥ ౫౨ ॥ చుచుంబతస్యా బింబోష్ఠం చూర్ణయామాస తత్కుచౌ । ముక్త్వా తత్కంచుకీబంధ మాలింగ్య హృదయేన తాం ॥ ౫౩ ॥ ముమోచకచ్చం శ్రీరామః సీతాయాస్స్వకరేణ సః । ఉడ్డీయ వస్త్రం వాస్తేన తద్రంభోరూ దదర్శ సః ॥ ౫౪ ॥ తతః కరేణ త

క్కుడు దుమికెను. ఆ వైదేహితోడ శ్రీరాముఁడు జలక్రీడామహోత్సవంబుల కారంభించెను. భుజములచే నామె నాలింగించికొని పలుమారు నీళ్లలో పడద్రోయుచు రాగరసయుక్త జలాంజలును చల్లుచు మిక్కిలి రంజింపఁజేసెను. పిదప నట్టి పరిమళోదకంబులను దివ్య తైలంబులను సుగంధిచూర్ణంబులను మంగళద్రవ్యంబులను దాసీజనులు తెచ్చి యందిచ్చుచుండగా నొండొరులు మీఁదచల్లికొనుచు క్రీడించిరి. పూలవానలను పరస్పర మొకరిమీఁదనొకరు కురిపించిరి. మఱి వారు పిచకారులచే వసంతంబులను చల్లుకొనుచుండిరి. శ్రీరాముఁడు కనుసన్నచే సూచనచేయగా సీతా సఖీజనులుకూడ నక్కడనిలువక దివ్యవస్త్రంబుల ధరదాలకు వెలుపల దూరముగాపోయి లజ్జించుచు నిలిచిరి. కొందరు ద్వారప్రదేశమునపోయి సంతోషముతో నూరకె నిలిచియుండిరి. ఇట్లుండగా నాసీతారాములు అన్యు లెవ్వరులేదని మెఱిఁగి రహస్యమున జలయంత్రంబులలో చాలాసేపు క్రీడించుచు నానందించిరి. ఒండొరులు కుసుమ సుకుమారంబులయిన ముష్టితాడనంబులచే ముదాన్వితులయిరి. శ్రీ పరమాత్మయగు రాముఁడు మహామాయయగు మంగళదేవియొక్క బింబోష్ఠమును సాంసారిక మానవసుఖ నిరూపణమును చూపుచున్నాడనునట్లు చూపించెను. కుచకుంభంబులను మర్దించెను. కంచుక బంధమును వదలించి గాఢాలింగనంబుల నొనరించెను. ఇఁకను కామోత్తేజకంబులయిన చేష్టలచే సీతను ఆనందకేలిలో తేలించెను. ఒండొరులు పరస్పర వస్త్రాపహారణంబులచే పరిహాసములాడిరి.

స్నివీం రామశ్చాకర్షయన్ముదా । సీతాప్యాకర్షయద్వేగా ద్రామనీవీం స్మితాననా ॥ ౫౫॥ ఏవం పరస్పరం క్రీడాం చక్రతుర్దంపతీ ముదా । కస్సమర్థస్తయోః క్రీడాం సవిస్తారాం నివేదితుం ॥ ౫౬॥ ఏతస్మిన్నంతరే రామం భోజనార్థం తుసూచనాం । కర్తుం యయౌ స సౌమిత్రి స్సుమహాత్మా సుహృజ్జనాన్ ॥ ౫౭ ॥ నిషేధితస్స దాసీభి ర్వనద్వారా ద్బహిః స్థితః । తావూచతుస్సమయో నాయం రామం గంతుం నచక్షణం ॥ ౫౮॥ స్థిరో భవాత్ర సౌమిత్రే రామో రహసి సీతయా । కరోతి జలయంత్రేషు జలక్రీడాం యథాసుఖం ॥ ౫౯ ॥ పునస్తాః ప్రాహ సౌమిత్రి ర్యుష్మాభిర్వచనం మమ । నివేదనీయం రామాయ సూచనార్థం హి లక్ష్మణః ॥ ౬౦ ॥ సమాగతస్త్వామస్తీతి తతో యాస్యామ్యహం గృహం । తతస్తాసు తదా త్వేకా దాసీ గత్వా రఘూత్తమం ॥ ౬౧ ॥ వస్త్రభిత్తేర్బహిః స్థిత్వా భయభీతాతిలజ్జితా । కథయామాస సౌమిత్రే ర్ద్వార్యాగమనం శనైః ॥ ౬౨ ॥ తద్దాసీవచనం శ్రుత్వా జలయంత్రాత్తు జానకీం । బహిః కృత్వా వినిర్గతశ్చ రామస్తుష్టమనాః స్వయం ॥ ౬౩ ॥ జలైరుష్ణైః ప్రభుః స్నాత్వా దేహముద్వర్తనాదిభిః । సుగంధద్రవ్యరాగాదీన్ కృత్వా దూరం ప్రియాన్వితః ॥ ౬౪ ॥ పీతకౌశేయవాసాంసి పరిధాయాథ దంపతీ । దదతుశ్చార్ద్రవస్త్రాణి హేమతంత్వంకితాని చ ॥ ౬౫ ॥ దాసీభ్యశ్చాథ దాసేభ్యో రాగాద్వై శ్చిత్రితాని హి । తతస్తౌ జగ్మతుః పుష్పచితమాగాశనగృహం ॥ ౬౬ ॥ తత్ర పూర్వోక్తోపచారాధికై ర్నానోపచారకైః । ఊర్మిళాదిభిరన్నం చ త్కామధేనుసముద్భవం ॥ ౬౭ ॥ దర్వీభిః స్వర్ణజాభిశ్చ పాత్రేషు పరివేషితం । మునీశ్వరైశ్చ గురుణా సుహృన్మిత్రసమన్వితః ॥ ౬౮ ॥ మంత్రిభిర్బంధుభిశ్చాపి రామో౽న్నం స్తోషమాపసః । తత్పాత్రం వీజయామాస జానకీ చామరేణ సా ॥ ౬౯ ॥ సవినో

---

వర్ణింపనెవని దరము? అంతలో నచ్చటికి భోజనసమయసూచన నిచ్చుటకై లక్ష్మణుండే తెంచి తత్సఖీజనములను పిలిచెను. ద్వారదాసులచే నడ్డగింపఁబడి నిలచియుండు లక్ష్మణునింజూచి వారు "శ్రీసీతారాములిరువురును రహస్యముగా జలయంత్రంబులతోడ జలక్రీడాతత్పరులై యున్నారు. నీవుపోవలదు. ఇచ్చటనే క్షణకాలము నిరీక్షించుచుండుము." అనిపలికిరి. అందుకు లక్ష్మణుఁడు "సరియే, మీరువెళ్లి-భోజనసమయసూచనకై లక్ష్మణుఁడు వచ్చి కనిపెట్టికొనియున్నాడు-అని యింతమాత్రము చెప్పి రండి. నేడుపోదును." అని యాజ్ఞాపించెను. వారిలోనొకతె యప్పుడు శ్రీరామసన్నిధానమునకు వెడలి తెరచాటున నిలిచి భయభీతయును లజ్జితయునై తిన్నగా లక్ష్మణుని యాగమనంబును విన్నవించెను. శ్రీరాముఁడు ఆమాటను విన్నతోడుతనే సీతను నీళ్లతొట్టినుండి బయటవిడిచి తాను బయటవచ్చి సంతసించుచు నుష్ణోదకంబున నలుగుపిండి మొదలైన సుగంధదివ్యద్రవ్యచర్చలచే స్నానముచేసి సీతాదేవితోడ దివ్యపీతాంబరంబులను ధరించి సరిగెతడిబట్టలను దాసీజనులుకిచ్చి పూలుపరచిన నేలమీఁదుగా భోజనశాలకే తెంచెను. అచ్చట పూర్వోక్తవిధానంబులకన్నను అధికముగా వివిధోపచారంబులతోడ సువర్ణపాత్రంబులలో నూర్మిళాద్యంగనామణులు కామధేనుకల్పితంబులయిన పక్వాన్నాదిసమస్తపదార్థంబులను వడ్డించియుండిరి. అప్పుడు శ్రీరాముఁడు మునీంద్రులతోడను గురువులతోడను మిత్రులతోడను

ర్వైశ్చాటువాక్యై రంజయామాస రాఘవం । ఏవం కృత్వా భోజనం తు కృత్వా తాంబూలచర్వణం ॥ ౨౦॥ సీతాసమర్పితం రామస్తస్థౌ శృణ్వన్ కథాః సుఖం । మంత్రిభిర్బంధుభిర్మిత్రైర్గేహాంతస్సదసి ప్రభుః ॥ ౨౧ ॥ సీతాపి భోజనం కృత్వా దివ్యాలంకారమండితా । నిద్రాశాలాం సమాసీనా సఖీభిః పరివేష్టితా ॥ ౨౨ ॥ చకార సారిభిః క్రీడాం దాసీభిర్వీజితా ముదా । కుర్వతీ రఘునాథస్య ప్రతీక్షాం ద్వారలోచనా ॥ ౨౩॥ * ॥ ఇతి శ్రీమదానందరామాయణే వాల్మీకీయే విలాసకాండే పంచమస్సర్గః ॥ ... ... ... ... ... ... ॥౫॥

శ్రీరామదాస ఉవాచ—అథ రామో బంధుభిశ్చ నిద్రాశాలాం యయౌ ముదా । స్తుతో బందిజనాద్యైశ్చ విశేషైకాంతమందిరం ॥ ౧ ॥ విసృజ్య లక్ష్మణాదీంశ్చ దాసీభిః పరివారితః । దదర్శ జానకీం నిద్రాశాలాయాం రఘునందనః ॥ ౨ ॥ సాపి జ్ఞాత్వాగతం రామం సారిక్రీడాం విహాయ చ । ప్రత్యుజ్జగామ రామాయ సఖీభిర్యానపురస్సరా ॥౩॥ నత్వా రామం కరే ధృత్వా మంచకే సన్నివేశయత్ । దత్వా పాతుం జలం తస్మై దదౌ తాంబూలముత్తమం ॥ ౪॥ తతశ్చకార శ్రీరామో నిద్రాం సీతాసమన్వితః । దాసీభిర్వీజితశ్చాపి పర్యంకే రత్నభూషితే ॥ ౫ ॥ ముహూర్తమాత్రాదుత్థాయ ధృతాధోంకోపబర్హణా । తస్థౌ సీతా మంచకాదథ తతో రామోప్యబుధ్యత ॥ ౬ ॥ దృష్ట్వా సముత్థితం రామం

సాధువులతోడను మంత్రులతోడను సుఖభోజనమునారగించి యానందించుచుండెను. సీతమ్మ వ్యజనముచే వీచుచు వినోదకరంబులగు చాటువాక్యంబులచే శ్రీరాముని రంజింపఁజేసెను. ఇట్లు భుజించి సీతాకరకమలార్పితంబయిన తాంబూలము నాస్వాదించి, అంతఃపుర దివ్యమందిరంబున శ్రీరాముఁడు మంత్రిబంధుమిత్రపరివారముతోడ కథాగోష్ఠీసుఖము ననుభవించుచుండెను. సీతమ్మయును భోజనముచేసి దివ్యాలంకారంబుల నలంకరించికొని నిద్రాశాలకేతెంచి సఖీజనపరివేష్టితయై శ్రీరామాగమనంబును ప్రతీక్షించుచు తద్ద్వారము నవలోకించునదియై దాసీజనులు వ్యజనాదులచే సేవించుచుండగా సాగటాలాడుచుండెను ॥ ............... ౫॥

శ్రీసీతారాముల దినచర్యా వర్ణనము.

శ్రీరాముండు పిదప తమ్ములతోడ సంతసముగా నిద్రాశాలకువెడలెను. వందిజనులచే స్తుతింపఁబడుచు లక్ష్మణాదులను దాసీవర్గమునువదలి ఏకాంతమందిరమును ప్రవేశించి, నిద్రామందిరమున సీతనుచూచెను. ఆమెయును శ్రీరాముని రాకనెఱింగి సారికాక్రీడనువదలి సఖులతోడ నెదుటవచ్చి శ్రీరామునిచరణకమలములకువందించి హస్తలాఘవమునిచ్చి దివ్యమంచముమీఁదకూర్చుండఁబెట్టి, దివ్యపానీయంబుసమర్పించి తాంబూలమును సరాగముగానర్పించెను. అంతనారఘునందనుఁడు రత్నాలంకృత పర్యంకంబున దాసీజనులచే వీజితుండై జానకీదేవితోడ స్వానందనిద్రనందెను. ధరింపఁబడిన తొడతలగడగల సీత యొకముహూర్తముకాగానే లేచి మంచమునుండిదిగి నిలచెను. అంతట వెంటనే శ్రీరాముఁడును మేల్కొనగా, జనకపుత్రి

దత్త్వాపానీయంజలంపునః । దదౌసీతాథతాంబూలం రాఘవాయాతిహర్షితా ॥ ౭ ॥ రామదాస్యస్తథారామం వీజయామాసురాదరాత్ । కేకిపక్షసముద్భూతైః చామరై రుక్మభూషితైః ॥ ౮ ॥ సీతాదాస్యస్తథాసీతాం వీజయామాసురాదరాత్ । ధేనుపుచ్ఛోద్భవైర్దివ్యైశ్చామరైర్హేమమండితైః ॥ ౯ ॥ తతస్సీతాకరంధృత్వా ద్రాక్షావల్ల్యాశ్చమంటపం । యయౌరామోంగణోద్భూతం తస్థౌతద్దివ్యఆసనే ॥ ౧౦ ॥ ఉపబర్హణసంస్పృష్టస్సీతావామస్థితో ముదా । హస్త్యశ్వోష్ట్రమంత్రిరాజ దూతైఃకృత్రిమనిర్మితైః ॥ ౧౧ ॥ హేమరత్నహస్తిదంత సంభూతైరతిచిత్రితైః । క్రీడాంబుద్ధ్యాబలేనైవ చకారసీతయాసుఖం ॥ ౧౨ ॥ తతఃపక్షికులైస్సర్వైః పంజరస్థైస్ససీతయా । క్రీడాంచకారశ్రీరామో దాసీభిర్వీజితోముహుః ॥ ౧౩ ॥ ఏతస్మిన్నంతరేతత్ర సీతయాకారితాఃపురా । సమాయయుర్వారనార్యో ననృతుశ్శతశస్తదా ॥ ౧౪ ॥ చక్రుర్గీతంసుస్వరంతాః షడ్జస్వరసమన్వితం । తతస్తాభ్యోహ్యలంకారాన్ దత్త్వావస్త్రాణిజానకీ ॥ ౧౫ ॥ విసర్జయామాససర్వాస్తతోరాఘవమబ్రవీత్ । స్థిత్వాప్రాసాదవర్యేద్య కౌతుకం హట్టజంత్వయా ॥ ౧౬ ॥ ద్రష్టుమిచ్ఛామ్యహంరామ శీఘ్రముత్తిష్ఠరాఘవ । తత్సీతావచనాద్రామః ప్రాసాదంప్రతిసీతయా ॥ ౧౭ ॥ గత్వాదివ్యాసనేస్థిత్వా గవాక్షైరుక్మభూషితైః । రత్నోద్భవకపాటైశ్చ ముక్తాజాలైఃరాజి

నిద్రలేచిన పతికి మరల పానీయంబులగు, దివ్యజలంబులనర్పించి మిక్కిలిసంతసముతో తాంబూలముననందిచ్చుచుండెను. శ్రీరాముని దాసీవర్గము సాదరముగా శ్రీరాఘవేంద్రునిని నెమలిఱెక్కలతో నేర్పరచిన కనకాలంకృతవ్యజనంబులచే వీచుచుండెను. అట్లే సీతయొక్క దాసీవర్గము మైథిలిని ధేనుపుచ్ఛోద్భవంబులగు, సువర్ణాలంకృత చామరంబులచే విసరుచుండిరి. అంతనా శ్రీరామచంద్రుఁడు నిజకరకమలంబులచే సీతాపాణిపద్మంబును గ్రహించి అంగణమధ్యవర్తియగు ద్రాక్షాలతలమంటపములకువచ్చి దానిలోనిదివ్యాసనంబున సుఖాసీనుండాయెను. సీతాదేవికి ఎడమప్రక్కలో సంతోషించుచు వెన్నుతలగడ నానుకొనికూర్చుండి, రాజుమంత్రి సేనాపతులు గజరథతురగపదాతులు మొదలయిన సువర్ణరత్నగజదంతాదులచే బొమ్మలగా కల్పించిపెట్టియుండు కృత్రిమప్రతిమలచే శ్రీరాముఁడు జానకమ్మతోడ బుద్ధిబలముచే యథేష్టముగా క్రీడలనొనరించెను. పిదప పలుమారుదాసీజనసేవితుఁడైన శ్రీరాముఁడు సీతతోడ పంజరంబులలో నిపక్షులను పట్టికొనిక్రీడించెను. ఇంతలో వారియెదుట సీతచే పిలుపింపఁబడిన వారకాంతలు నూర్లకొలదిగావచ్చి నర్తనములాడిరి. షడ్జస్వరసమన్వితముగా సుస్వరగీతంబులనుపాడిరి. సీతా

## శ్రీజానకీదేవియొక్క మహోదారశాసనము.

దేవి పిదపవార్కికి వస్త్రాలంకారంబులను పారితోషికంబుగానిచ్చి యందరినిపంపించి, శ్రీరామచంద్రునింజూచి “ప్రాణనాథా! మనమీయుప్పరిగెమీఁదనెక్కి యంగడిబజారులోనివేడుకలను చూతము, వేగమెలెమ్ము.” అనిప్రార్థించెను. అట్టిభూపుత్రీభాషితంబునువిని సీతతోడమేడనెక్కి దివ్యాసనంబున కూర్చుండి ముత్తెములజాలర్లుగల్గి రత్నకవాటంబులచే రాజించుచుండు కనకగ

త్రైః ॥ ౧౮ ॥ రాజవీథ్యాం హట్టజాతం దదర్శ జనకౌతుకం । సీతాయై దర్శయామాస కౌతుకాని స రాఘవః ॥౧౯॥ స్వీయదక్షిణహస్తస్య తర్జన్యా ముదితాననః । ఏతస్మిన్నంతరే హట్టే ద్విజపత్నీం తు సీతయా ॥ ౨౦॥ దృష్ట్వాలంకారవస్త్రైర్హీనా కటిధృతార్భకా । గచ్ఛంతీ రాజమార్గేణ కృశా భిక్షార్థముద్యతా ॥ ౨౧ ॥ తాం తాదృశీం నిరీక్ష్యాథ దాస్యాహూయ విదేహజా । పప్రచ్ఛ భూషణాద్రిక్తా త్వం కిమర్థం రహితా హ్యసి ॥ ౨౨॥ సా ప్రాహ తీర్థయాత్రార్థం త్యక్త్వా మాం తాతలాలితాం । తాతగేహం గతో భర్తా తాతో౽పి జరతో మృతః ॥ ౨౩ ॥ గురుగేహేఽవంతికాయాం వర్తేతే భ్రాతరౌ మమ । న పోషకః కో౽పి గేహే ధునా సీతే స్తి వై మమ ॥ ౨౪ ॥ తస్మాన్న సంత్యలంకారా మమ దేహే విదేహజే । ఇతి తస్యా వచః శ్రుత్వా రామాస్యం సన్నిరీక్ష్య సా ॥ ౨౫ ॥ నిజాలంకారవాసాంసి దదౌ తస్యై విదేహజా । బ్రాహ్మణీం సా పునః ప్రాహ గచ్ఛ త్వం లక్ష్మణం ప్రతి ॥ ౨౬ ॥ హేమముద్రా లక్షమితాః త్వం గృహాణ మమాజ్ఞయా । తథేతి జానకీం స్పృష్ట్వా సా యయౌ లక్ష్మణం తదా ॥ ౨౭ ॥ పూర్వాధికానలంకారాన్ స్వదేహే జానకీ పునః । దధార దివ్యవాసాంసి హేమతంతూద్భవాని సా ॥ ౨౮॥ లక్ష్మణం బ్రాహ్మణీ గత్వా సీతావాక్యం న్యవేదయత్ । దదౌ తస్యై లక్ష్మణో౽పి హేమముద్రాస్తదైవ సః ॥ ౨౯ ॥ సీతావాక్యాల్లక్షమితా మృషా మే నేన తద్వచః,

---

వాక్షంబులలో నుండి యంగడిబజారులోని వేడుకలను చూచుచు సీతకు తనకుడిచేతి తర్జన్యంగుళముచే చూపించుచు హాసన్ముఖుండై యుండెను. ఇట్లుండగా నచ్చట నంగడివీథిలో దారిద్ర్య క్లిశ్యమానశరీరయై వస్త్రాలంకారాదులు లేకయే నడుమున బిడ్డనిడికొని బిచ్చమెత్తుచు పోవుచుండు బ్రాహ్మణస్త్రీని సీతమ్మ చూచెను. అంతన ట్లే యావిప్రవనితను దాసీలనంపి పిలపించెను. నీవేలయిట్లు అలంకారములేక యుండునని యడిగెను. ఆమె సీతనుచూచి “నామగఁడు పుట్టినింట కన్నతండ్రిచే గారాబముగా పెంచబడుచుండు నన్ను వదలి తీర్థయాత్రార్థము వెడలినవాఁడీవరకు నింకయును రాలేదు. నాతండ్రియును ముసలివాఁడుగాన చనిపోయెను. నా సోదరులిరువురు అవంతిలో గురుకుల వాసము చేయుచునున్నాను. ఇప్పుడింటిలో నాకుపోషకులెవ్వరునులేరు. కావున నాదేహమున నేయలంకారమునులేదు.” అని చెప్పగా నామాటలను విని జనకపుత్రి శ్రీరామచంద్రుని ముఖారవిందమును చక్కఁగా నవలోకించి తనయలంకారంబులను వస్త్రంబులను ఆ బ్రాహ్మణస్త్రీకి ఇచ్చి “నీవు లక్ష్మణుని వద్దపొమ్ము. నాయాజ్ఞవలన నతనివద్ద లక్షసువర్ణ నాణకములను తీసికొని పొమ్ము.” అని చెప్పి పంపించగా నామె యట్లేయని లక్ష్మణ సన్నిధానమునకు వెడలెను. జానకమ్మ మునుపున్న అలంకారంబులకన్న నధికముగా దివ్యభూషణంబులను బంగారు సరిగెవస్త్రములను అలంకరించి కొనెను. ఆద్విజాంగన లక్ష్మణునివద్దికి పోయి సీతాదేవియొక్క యాజ్ఞనెఱిఁగించెను. అప్పుడే లక్ష్మణుఁడు దీనిమాట దబ్బర యని యెంచక, లక్షసువర్ణ నాణకంబుల నామెకర్పించెను. శ్రీరాముని రాజ్యములో దబ్బరలాడెడు వారుగూడ గలరా? అట్టి సాహసముగల వారెవరుగలరు? లేనేలేరు. పిమ్మట సీతమ్మయును లక్ష్మ

కస్సముఖోఽరామరాజ్యే వృషావక్తుంభవేదితి ॥ ౩౦ ॥ అథసీతాపిసౌమిత్రిం స్వాందాసీంప్రేష్యవైతదా । అయో
ధ్యాయాంతథారాష్ట్రే ఘోషయామాసదుందుభిం ॥ ౩౧ ॥ సప్తద్వీపేషుసర్వత్ర పృథగ్వర్షేషుసాదరం । నా
చిన్నారీపుమాన్వాపి వినాసద్వస్త్రభూషణైః ॥ ౩౨ ॥ దృష్టశ్చేద్రామరాజ్ఞాతో యుద్దేశేయత్పురే కదా । తద్రా
జ్ఞశ్చాస్తుమేదండో రామస్యాపివిశేషతః ॥ ౩౩ ॥ ఇతిమచ్ఛిక్షితంజ్ఞాత్వా స్వకోశైఃస్వీయరాష్ట్రికే । వస్త్రాలంకార
భూషాభి ర్భూషణీయాద్విజాదయః ॥ ౩౪ ॥ సప్తద్వీపనృపతయశ్చేత్థంసీతానుశిక్షితం । గజదుందుభిఘోషేణ శ్రుత్వా
చక్రుస్తథైవచ ॥ ౩౫ ॥ తదారభ్యజగత్యాంన కశ్చిద్విగతభూషణః । నారీవాపురుషోవాసీత్ కుత్రాప్యవనిజాభయాత్ ॥
౩౬ ॥ ఏవంనానాకౌతుకాని భూమ్యాంసీతాకరోత్తదా । అథరామస్సభాంగత్వా పునర్యామేచతుర్థకే ॥ ౩౭ ॥
చకారరాజ్యకార్యాణి ధర్మేణైవస్వబంధుభిః । నటనాటకవేశ్యానాం కౌతుకానిమహాంతిచ ॥ ౩౮ ॥ దదర్శససభా
మధ్యే స్తుతోమాగధబందిభిః । తతస్సర్వాన్విసర్జ్యాథ యయౌసీతాగృహంప్రభుః ॥ ౩౯ ॥ సాయంసంధ్యాదికం
కృత్వా హుత్వాగ్నింయథావిధి । గంధాదిభిశ్శివంపూజ్య బ్రాహ్మణాంశ్చాపిరాఘవః ॥ ౪౦ ॥ నానోపహారనై
వేద్యం దత్వాతేభ్యస్స్వయంపునః । కృత్వోపహారంశ్రీరామః శ్రుత్వాపౌరాణికీఃకథా ॥ ౪౧ ॥ కీర్తనైర్హరిదాసా

ణునికి తన దాసినంపించి “సప్తద్వీపంబులలో నంతట నితరవర్షంబులలోను ఒక్కపురుషుఁడు గాని ఒక్కస్త్రీగాని మంచివస్త్రములును మంచిసొమ్ములును లేనివాఁడుగా లేనిదానగా చారులవలన నాకు తెలియవచ్చితే, ఎప్పుడే దేశమునందు ఏపురమునందట్లు తటస్థించునో ఆరాజునాయొక్క శిక్షను శ్రీరామదండనమును వహింపగలవాఁడుగానుండును. ఇట్లు నాచేత శాసనము చేయఁబడినదని తెలిసి తమకోశంబులవలన రాష్ట్రమునందు ద్విజాతులు వస్త్రాలంకారభూషణంబులచే నలంకరింపఁబడవలయును.” అని భేరినాదముతోడనంతట డంగోరా వేయించునట్లు చెప్పిపంపెను. అట్లే లక్ష్మణుండు శ్రీసీతాదేవిశాసనంబును ఏనుఁగులమీఁద దుందుభులచే మ్రోగించుచు ప్రకటించెను. దానినివిని సప్తద్వీపగతరాజులందరును అట్లేనెరవేర్చిరి. అదిమొదలు జానకీదేవియొక్క భయమువలన స్త్రీగాని పురుషుఁడుగాని జగమున నెవఁడొక్కఁడును ఆభరణములేక యుండలేదు. ఇట్లు సీతాదేవి వివిధకౌతుకంబులను సంతసముతో చూపుచువచ్చును. అంతనా శ్రీరాముఁడు సభకువెడలి నాలుగవయామమున తనతమ్ములతోడ ధర్మముగా రాజకార్యంబులను నెరవేర్చెను. వందిమాగధులచే నభివందితుఁడగుచు సభామధ్యంబున రాజించు శ్రీరాముఁడు నటులనాటకాదులను గణికానర్తనాదులను విలోకించెను. పిదప శ్రీరాముఁడు సభనుండి సర్వజనులనువిడిచి జానకీమందిరంబునకుంజని సాయంసంధ్యావందనాది సత్కర్మలనాచరించి యథావిధిగా నగ్నిహోత్రకర్మలనునిర్వర్తించి గంధాద్యుపచారంబులచే సాంబశంకరస్వామినారాధించి భూసురోత్తములను పూజించి వారికి వివిధోపచారనైవేద్యంబులను సమర్పించి తాను అభ్యవహారము నారగించి, పురాణకథల నాలకించి, హరినామస్మరణం

నాం వేశ్యానాంచ నర్తనైరపి । పౌరోదితాభిర్వార్తాభి ర్గాయకానాంచ గాయనైః ॥ ౪౨ ॥ సార్ధయామాంశకాన్నీ త్వా యయౌ నిద్రాస్థలం శనైః । తతో రత్నప్రకాశైస్స జగామ జానకీం ప్రతి ॥ ౪౩ ॥ సాపి ప్రత్యుజ్జగామాథ రత్న దీపైస్సఖీయుతా । తతస్ససీతయా రామః పర్యంకే రత్నచిత్రితే ॥ ౪౪ ॥ చకార సీతయా క్రీడాం రంజయామాసజా నకీం । తతస్తౌ దంపతీ నిద్రాం చక్రతుర్వీజితౌ ముహుః ॥ ౪౫ ॥ దాసీభిర్వ్యజనైశ్చిత్రై శ్చామరైర్హేమభూషి తైః । ఏవం రామేణ సా సీతా సుఖమాప పతివ్రతా ॥ ౪౬ ॥ సీతయా రాఘవశ్చాపి సుఖమాప విశేషతః । ఏవం నానా కౌతుకాని ప్రత్యహం రఘునందనః ॥ ౪౭ ॥ చకార సీతయా సార్ధం పరిపూర్ణమనోరథః । కదా చంద్రస్య జ్యోత్స్నా యా మంగణే సద్మనః ప్రభుః ॥ ౪౮ ॥ చకార సీతయా నిద్రాం కదా ప్రాసాదమస్తకే । ప్రాసాదాభ్యంతరే వాపి గ వాక్షపవనైశ్శుభైః ॥ ౪౯ ॥ సుఖమాప కదా రామః కదా రహసి మందిరే । కనకశృంఖలాన్యస్తసవితాన సుమంచకే ॥ ౫౦ ॥ కదా ద్రాక్షామంటపాధో జలయంత్రసమీపతః । కాచభూమ్యాం రుక్మభూమ్యాం మణిభూమ్యాం తథాపి వా ॥ ౫౧ ॥ స్ఫటికాదిసుభూమ్యాంహి కదా సుష్వాప రాఘవః । కదా సపుష్పకే వాపి రంగశాలాంతరే కదా ॥ ౫౨ ॥ కదా సచిత్ర శాలాయాం కదోశీరమయే గృహే । కదా పుష్పమయే గేహే కదా రంభావనే వరే ॥ ౫౩ ॥ కదా పుష్పవాటికాయాం

---

బునొనర్చు భాగవతులకథలచేతను వారాంగనానర్తనంబులచేతను ఉత్తములగు పూరివారు చెప్పెడు వార్తలచేతను గాయకులయొక్క దివ్యగానంబులచేతను రాత్రియొక్క మొదటి యొకటిన్నరజామును కడపి తిన్నగా నిద్రాలయమునకువెడలెను. పిదప రత్నప్రకాశంబుతోడ వచ్చుచుండు శ్రీరామచంద్రస్వామిని సీతాదేవి రత్నదీపంబులతోడను సఖీవర్గముతోడను ఎదు టవచ్చి పిలిచికొనిపోవగా నాయిరువురును రత్నచిత్రితంబగు పర్యంకంబునెక్కిరి. శ్రీరాముఁ డు సీతాదేవితోడ సరససల్లాపాది క్రీడాకౌతుకంబులనంది యానందతుందిల హృదయారవిం దుండయ్యె. అంతనిరువురును దంపతులు దాసీజనులచే కనకరత్నచిత్రిత చామరవ్యజనంబుల చే సేవింపఁబడుచు సుఖనిద్రాముద్రితులై యుండిరి. ఇట్లు సతీమణియగు సీత శ్రీరామునివలన సుఖమునందుచుండెను. సతీవ్రతుఁడగు శ్రీరాముఁడు సీతవలన విశేషసుఖమునందుచుండెను. మఱియునిట్లే శ్రీరాముఁడు సీతాదేవితోడ ప్రత్యహంబునను వివిధవినోదంబులను అనుభవిం చుచు పరిపూర్ణమనోరథుఁడై బరగుచుండెను. ఒకప్పుడు చంద్రశాలలలో నంగణంబున వెన్నెల లోను, ఒకప్పుడు ప్రాసాదశిఖరప్రదేశంబునను, ప్రాసాదమధ్యమున గవాక్షంబుల మంగళ మారుతంబులచే రంజించు సుస్థలంబులలోను, ఒకప్పుడే కాంతశుద్ధాంతంబుల బంగారు గొలు సులచే కట్టబడిన సవితానపర్యంకంబునను, ఒకప్పుడు ద్రాక్షా మంటపంబులక్రింద జలయంత్ర సమీపంబునను, అట్లే స్ఫటికస్థలంబునను, కాంచనస్థలంబునను, రత్నస్థలంబునను, ఒకప్పుడు పుష్పకవిమానంబునను, ఒకప్పుడు రంగశాలలోను, ఒకప్పుడు చిత్రశాలలోను, ఒకప్పుడు వ ట్టివేరుతడికెలపందిలిలోను, ఒకప్పుడు పూలయింటిలోను, ఒకప్పుడు అరటిపొదలలోను, ఒకప్పు

కదాపృష్ఠోర్ధ్వసద్మని । శృంఖలావృక్షసంబద్ధ దోలికేరత్నచిత్రితే ॥౫౪॥ కదాకాష్ఠమయేదివ్యే మంచకేరత్నభూషితే । కదాచకారతులసీ వాటికాయాంరఘూత్తమః ॥ ౫౫ ॥ నిద్రాంజనకనందిన్యా సభాయామథవాకదా । కదాద్వారోర్ధ్వప్రాసాదే కదైకస్తంభసద్మని ॥ ౫౬ ॥ కదాస్వగృహదేహల్యాం కదావృందావనేపిచ । ఏవంససీతయారేమే యోధ్యాయాంరఘునందనః ॥ ౫౭ ॥ * ॥ ఇతిశ్రీమదానందరామాయణే వాల్మీకీయే విలాసకాండే సీతారామయోర్దినచర్యావర్ణనంనామ షష్ఠస్సర్గః ॥ * ॥ ... ... ... ... ... ౬॥

శ్రీరామదాస ఉవాచ—ఏకదారాఘవంద్రష్టుం తథాస్నాతుంమధావపి । శిష్యైస్స్వమాయయా వ్యాసో మునిభిఃపరివేష్టితః ॥ ౧ ॥ సమాగతంమునింశ్రుత్వా తంప్రత్యుద్గమ్యరాఘవః । ననామశిరసాభక్త్యా నినాయనిజమందిరం ॥ ౨ ॥ దత్వావరాసనంతస్మై ద్విజేభ్యశ్చాపివైపృథక్ । దత్వాసనానిదివ్యాని చకారపూజనంపృథక్ ॥౩॥ కామధేనూద్భవైరన్నై ర్మణిభ్యాంసంభవైరపి । వ్యాసంతంభోజయామాస మునిభిర్జానకీపృథక్ ॥ ౪॥ తాంబూలందక్షిణాందత్వా ప్రబద్ధకరసంపుటః । పప్రచ్ఛకుశలంతస్మై వ్యాసాయరఘునందనః ॥ ౫॥ సీతాతంవీజయామాస వ్యాసంసత్యవతీసుతం । ఏతస్మిన్నంతరేవ్యాసో రామాయకుశలంనిజం ॥ ౬ ॥ నివేద్యస్పష్టాత్తక్షేమం తమాహాకౌతుకాత్పునః । రామరామమహాబాహో యథారాజ్యంత్వయాభువి ॥ ౭ ॥ భుజ్యతేనతథాన్యేన కేనాపిపృథివీభృ

డు పుష్పవాటికయందును, ఒకప్పుడు వృక్షముమీఁది క్రీడామందిరంబునను, ఒకప్పుడు చెట్లకంటగట్టిన గొలుసుల రత్నచిత్రితమంచకంబునను, ఒకప్పుడు రత్నాలంకృతదారుపర్యంకంబునను. ఒకప్పుడు తులసీవనంబునను, ఒకప్పుడు సభామధ్యంబునను, ఒకప్పుడు ద్వారోర్ధ్వసౌధంబునను, ఒకప్పుడు ఏకస్తంభముమీఁది మందిరంబునను, ఒకప్పుడు నిజగృహదేహలిలోను, ఒకప్పుఁడు బృందావనముమీఁదను, ఇట్లే శ్రీరాముఁడు అయోధ్యలో సీతాదేవితోడ సుఖక్రీడల నంది యానందించుచుండెను ... ... ... ... ... ... ॥౬॥

## వ్యాసులవారు శ్రీరాములవారితో మాటలాడి పోవుట.

ఒకానొకప్పుడు వ్యాసముని శ్రీరామదర్శనమునకును చైత్రస్నానమునకును శిష్యులతోడను మునులతోడను పరివృతుఁడై అయోధ్యకువచ్చెను. మునీంద్రుఁ డేతెంచినసంగతినివిని శ్రీరాముఁడు ఎదుటజని భక్తితో ప్రణమించి నిజమందిరమునకు పిలిచికొనివచ్చి, దివ్యాసనమునిచ్చి ఇతరద్విజవర్యులకును వేర్వేరుపీఠములనిచ్చి యందరిని వేర్వేరుగా కామధేను చింతామణి కౌస్తుభ జన్యంబులగు మహార్ఘ్యసద్వస్తువులచే సత్కరించెను. జానకీదేవి మునీంద్రులతోడనావ్యాసమహర్షికి దివ్యభోజనము చేయించెను. శ్రీరాముఁడు దక్షిణతాంబూలంబుల నర్పించి చేతులుజోడించుకొని వ్యాసునియోగక్షేమంబును విచారించెను. సీతాదేవి వ్యాసమునిని వ్యజనము చే వీచుచు సేవించుచుండెను. అప్పుడు వ్యాసుఁడు తనకుశలోదంతంబును శ్రీరామునికెఱిఁగిం

తా । పురాభుక్తంనరోఽప్యగ్రే భోక్ష్యతిపృథివీపతిః ॥ ౮ ॥ అస్మిన్త్రేత్రమహద్ధైర్య మేకపత్నీవ్రతంప్రతి । దృష్ట్వాఽతి విస్మయశ్చిత్తే జాయతేరఘుసత్తమ ॥ ౯ ॥ కస్సహేతాత్రతారుణ్య కామదావానలంనృప । పదస్థేయౌవనేచాపి త్వమేవాస్మిన్స్త్రితేక్షమః ॥ ౧౦ ॥ ఇతివ్యాసవచశ్శ్రుత్వా రామోవ్యాసంవచోఽబ్రవీత్ । మయాత్రయేకృతాస్సంతి నియమామునిసత్తమ ॥ ౧౧ ॥ ముఖాద్వినిర్గతంవాక్య మేకమేవవినిశ్చితం । నక్రియతేమ్మయాతిచ్ఛ నోచ్యతేవ్యాపరంపునః ॥ ౧౨ ॥ అన్యత్సీతాంవినాన్యాస్త్రీ కౌసల్యాసదృశీమమ । నక్రియేహంవరాంపత్నీం మనసాపినచింతయే॥ ౧౩ ॥ తథాయఃఘాతుమిచ్ఛామి బాణేనైకేనకోపతః। నిహన్యతేతదైకేన నాన్యంబాణంసృజామ్యహం ॥౧౪॥ఇత్థం త్రయఃకృతాఃపూర్వంనియమాస్తవత్రభోమునే । సత్యాఏవభవంత్యగ్రేఽఖండితాస్తవవాక్యతః ॥౧౫॥ తత్తథైవాస్త్వి తిసోఽప్యాహ వ్యాసఃశ్రీరాఘవంతదా । పునరాహమునిఃశ్రీమాన్ వ్యాసఃశ్రీరాఘవంప్రతి ॥ ౧౬ ॥ ఏకపత్నీవ్రత స్యాస్య ఫలేవాపరజన్మని । త్వంకృష్ణరూపేణబహ్వీ ర్నారీర్భోక్ష్యసిరాఘవ ॥౧౭॥ తన్మునేర్వచనంశ్రుత్వా విహస్యరాఘవోఽబ్రవీత్ । బహ్వీశ్చకామినీర్భోక్తుం కృష్ణరూపధరోప్యహం ॥ ౧౮ ॥ ద్వారకాయాంయదాగేహే ద్వాపరేమునిసత్తమ । యేనవ్రతేనదానేన నియమేనాథవామునే ॥ ౧౯ ॥ బహునారీర్నిశ్చయేన ప్రాప్స్యామిత్వం

---

చి యతని కుశలంబులను విచారించి, మరల కుతూహలమునంది “మహానుభావుఁడైన శ్రీరామచంద్రా! ఈపుడమిని నీవు రాజ్యమేలినట్లు ఏరాజును పాలించుటలేదు. మునుపుగూడ నిట్లెవఁడును రాజ్యము ననుభవింపలేదు. ఇఁకమీఁదగూడ నెవ్వఁడు ననుభవింపఁడు. మఱియు నేకపత్నీవ్రతమునుచూడగా నీధైర్యము గొప్పది. దీనినిచూచి నామనంబున మిక్కిలి యాశ్చర్యము గల్గుచున్నది. రాజ్యపదవినొంది పైగా క్రొవ్విన యౌవనముగల్గియుండగా నెవ్వఁడిట్లు తారుణ్యకామదావాగ్నిని సహింపగలఁడు? ఈవ్రతమున నీవే సమర్థుఁడవు.” అని నొక్కి-వక్కాణించెను. ఆవ్యాసవాక్కునువిని అందుకు శ్రీరాముఁడు “స్వామీ! నాచేమూడు నియమములు చేయఁబడినవి. అవియేవనిన చెప్పెదను వినుఁడు. నానోటవచ్చినమాట యొక్కటిగా నుండును. అది వ్యర్థమెన్నటికిని కాచాలదు. దానినిమార్చి వేరుగాచెప్పను. ఇదియొకటి. మఱియొకటి యేదనిన, సీతతప్ప తక్కిన పణతులు లోకమున నాతల్లియగు కౌసల్యాదేవికి సమానలు. నేను వేరొకపత్నిని వరించను. మనసులోగూడ చింతించను. ఇదియొకటి. ఇంకొకటియేదియనిన, నేనొకబాణమునెత్తి యెవనిని చంపఁబూనుదునో వానినాబాణమొక్కటిచేత నేసంహరించెదనను. వేరొక్కబాణమును విడువను. ఇట్లు నేనుమూఁడునియమముల నవలంబించియున్నాను. ఇఁకమీఁదను మీవాక్యబలముచే నెడదెకక నట్లే జరుగవలయును” అని విన్నవించెను. ఆవ్యాసుఁడు అట్లే యగునుగదాయని మరలఁశ్రీరామచంద్రునితో “శ్రీరామమూర్తీ! ఈయేకపత్నీవ్రతఫలమువలన రాగలజన్మమున నీవుకృష్ణుఁడై బహు స్త్రీభోగము ననుభవింపగలవు.” అని పలికెను. ఆముని వాక్యమునువిని శ్రీరామచంద్రుఁడు నవ్వి, “మునీంద్రా! ముందిఁకమీఁద ద్వాపరయుగం

వదస్వమాం । ఇతిరామవచశ్శ్రుత్వా వ్యాసోరాఘవమబ్రవీత్ ॥ ౨౦ ॥ సమ్యగుక్తంత్వయారామ దానంతేప్రవదా మ్యహం । ఏకపత్నీవ్రతాదేవ యద్యపిత్వంచ స్త్రీర్బహూః ॥౨౧॥ లభిష్యసితథాప్యద్య దానంతవవదామ్యహం। సీ తాభారసువర్ణేన మూర్తిమేకాంరఘూత్తమ ॥ ౨౨ ॥ ఏవంషోడశమూర్తీశ్చ కారయిత్వాంపృథక్పృథక్, గే హిత్వాంసరయూనద్యా స్తీరేవిప్రేభ్యఆదరాత్ ॥ ౨౩॥ వస్త్రాలంకారభూషాద్యై ర్దక్షిణాభిశ్చతాశ్శుభాః॥ అనే నబహునారీస్త్వం లభిష్యస్యన్యజన్మని ॥ ౨౪ ॥ తథేతిరాఘవశ్చాపి మూర్తీఃకృత్వామనోరమాః । దదౌతాస్స రయూనద్యాం బ్రాహ్మణేభ్యస్తుషోడశ ॥ ౨౫ ॥ తతస్తేబ్రాహ్మణాస్తుష్టా రామాయాశీర్దదుస్తదా । దత్తమేకగు ణంరాజన్ సహస్రగుణితంపురా ॥ ౨౬ ॥ అస్మాకంవచనాద్దానం సఫలంచభవిష్యతి । షోడశస్త్రీసహస్రాణి త్వంల భిష్యసినిశ్చయాత్ ॥ ౨౭ ॥ తథాస్త్విత్యాహరామోపి తతోవిప్రాన్వ్యసర్జయత్ । ప్రణమ్యపూజితంవ్యాసం దదావాజ్ఞాంరఘూద్వహః ॥ ౨౮ ॥ అథైకదారామచంద్ర స్సీతయాసరయూతటే ; మధుమాసేవస్త్రగేహే స్థితః క్రీడాంచకారసః ॥ ౨౯ ॥ ఏతస్మిన్నంతరేయోధ్యాం నానాదేశనివాసినః । రామతీర్థేమధాస్నాతుం సమాజగ్ము స్సహస్రశః ॥ ౩౦॥ సురాయక్షాఃకిన్నరాశ్చ గంధర్వాఃపన్నగానగాః । వల్ల్యశ్చసరితస్సర్వా స్తీర్థానిమునయో నృపాః ॥ ౩౧ ॥ అప్సరసఃపన్నగాశ్చ ఖగాఃక్షేత్రాణివానరాః । అథైకదాదేవపత్న్యో జ్ఞాత్వాఽస్పృశ్యాంవిదే

బున ద్వారకలో నేను కృష్ణరూపధరుండైనను అనేక కామినుల ననుభవించుట యేవ్రతాచరణ మువలన నేదానమువలన తప్పదో అట్టి దానినిచెప్పుము." అని యడిగెను. అందుకు వ్యాసుఁడు "రఘునాథా! చక్కఁగానడిగితివి. ఆదానమును నీకు చెప్పుచున్నాను. అయిన నీకు ఏకపత్నీవ్రత మువలననే అనేకస్త్రీలు దొరుకుదురు. అట్లయినను దానమును చెప్పెదను. సీతతో సమానతూ కముగల సువర్ణప్రతిమలను ౧౬టిని చేయించి సరయూనదీ తీరమున బ్రాహ్మణులకు దానము చేయుము. వస్త్రాలంకారదక్షిణలతోడ నిచ్చిన షోడశసువర్ణప్రతిమాదానమువలనజన్మాంతరమున బహుస్త్రీలాభము తప్పకగల్గును." అని చెప్పగా శ్రీరాముఁడట్లేయని మనోహరంబులగు ౧౬ ప్రతిమలనుచేయించి సరయూతీరంబున బ్రాహ్మణులకిచ్చెను. అంతనాబ్రాహ్మణులు మిక్కిలి సం తుష్టులై "ఒకటిగానిచ్చినది వేయింతలుగా ఫలించును. మామాటలు వ్యర్థముకావు. నిశ్చ యముగా నీవు ౧౬ వేలపణతులను భోగింపఁగలవు." అని యాశీర్వదించిరి. రాముఁడు వారిని ట్లే పనని యనుమోదించుచు పంపెను. మఱియును సత్కృతుఁడైన శ్రీవ్యాసమునీంద్రు నిం బ్రణమించి యనుజ్ఞనిచ్చి పంపెను. ॥ ౨౮ ॥ పిదప నొకప్పుడు శ్రీరామచంద్రుఁడు సీతతో

శ్రీరామునిచే దేవపత్నులకు గోపికలగునట్లు వరదానము.

డ సరయూతీరమున చైత్రమాసమున పటగృహములో క్రీడించుచుండెను. అంతలో నయోధ్య కు నానాదేశవాసులగువారు రామతీర్థమున చైత్రస్నానమునకై వేలకొలఁదిగా వచ్చుచున్న వారయిరి. దేవతలు యక్షులు రాక్షసులు కిన్నరులు గంధర్వులు పన్నగులు నాగులు మునులు

హజాం ॥ ౩౨ ॥ పరస్పరంతాస్సంమంత్ర్య నిశీథేరాఘవంప్రతి । సమాజగ్ముర్దివ్యవస్త్ర రత్నాభరణభూషితాః॥ ౩౩ ॥ రామసౌందర్యసంభ్రాంతాః కామబాణప్రపీడితాః । తాదృష్ట్వారామదూతాస్తే పప్రచ్ఛూరక్షణస్థితాః॥౩౪॥ యూయంకిమర్థంసంప్రాప్తా నిశీథేత్రభయావహే । కథయధ్వంహినస్సర్వం మాశంకాంకురుతాత్రహి ॥౩౫॥ తా ఊచూరాఘవంద్రష్టుం సమాయాతావయంస్త్రియః । అధునాచేద్రాఘవస్య దర్శనంనభవిష్యతి॥౩౬ ॥ జాతోవధిస్తదాస్మాకం జీవితస్యనదీజలే । ఇతితాసాంవచఃశ్రుత్వాదూతాస్తేరాఘవంజవాత్ ॥౩౭॥ దాస్యాన్యవేదయామాసుస్స్త్రీవృత్తాంతత్సవిస్తరం । శ్రుత్వాదాసీముఖాద్రామ సైకతేమంచకేస్థితః ॥ ౩౮ ॥ సమాహూయస్త్రియస్సర్వా దదర్శరఘునాయకః । తాశ్చాపిదృష్ట్వాశ్రీరామం మేనిరేకృతకృత్యతాం ॥౩౯ ॥ తతస్తారాఘవంనత్వా లజ్జయాధోముఖాఃస్త్రియః । పీడితాఃకామబాణైశ్చ తస్థుఃశ్రీరామసన్నిధౌ ॥ ౪౦ ॥ తాఃపప్రచ్ఛరాఘవోఽప్యాగమనస్యాథకారణం । తారాఘవంతదాప్రోచు స్సర్వంవేత్సిత్వమీశ్వర ॥ ౪౧॥ జ్ఞాత్వాతాసాంరామచంద్రో హృద్గతంప్రాహతాఃపునః । ఏకపత్నీవ్రతంమేస్తి చైతజ్జన్మనిభోస్త్రియః ॥ ౪౨ ॥ నక్షేయుమేమృషావాక్యం గమ్యతాంస్వస్థలంజవాత్ । మాభూదధర్మోమద్రాజ్యే రాజ్ఞాంవైనిరయప్రదః ॥ ౪౩॥ ఇతిరాఘవవాగ్బాణైర్భిన్నమర్మస్థలాఃస్త్రి

నృపులు ఖగులు ప్లవగేంద్రులు అప్సరసలు నదీతీర్థ వృక్షగుల్మ పక్షివల్ల్యాది కామరూపులగు నధిదేవతలుకూడ వచ్చియుండగా, నొకప్పుడు శ్రీరామునియొక్క దివ్యసౌందర్య సుకుమారాకారమునుచూచి మన్మథబాణప్రపీడితలైన దేవపత్నులు జానకీదేవి దూరమైయున్న సంగతి నెఱింగి తమలో తామొండొరులా లోచించికొని అర్ధరాత్రిలో దివ్యవస్త్రాభరణాలంకృత గాత్రలై శ్రీరాముని దర్శనమునకై వచ్చిరి.అప్పుడచ్చట రక్షకులుగానుండిన రామదూతలు వారిని " భయంకరమగు నీయర్ధరాత్రిలో మీరేలవచ్చితిరి. ఎవరుమీరు? మాకుసంగతిని శంకింపక చెప్పవలయును." అని యడిగిరి. అందుకువారు "మేముస్త్రీలు. శ్రీరామదర్శనమునకై వచ్చితిమి. ఇప్పుడును మాకు శ్రీరామచంద్రునిదర్శనము దొరకనియెడల నేటితో మాప్రాణములకు సరయూనదిలో ముక్తి గల్గినది." అని యేకగ్రీవముగా పలికిరి. ఆదూతలు ఈసంగతిని దూతికలమూలకముగా శ్రీరామ సన్నిధి కెఱిగించిరి. దాసీలమూలముగా నామాటనువిని సరయూసైకతమునమంచముపై మండితుఁడైయున్న రాఘవుండు వెంటనే వారినందరిని పిలిపించికొని చూచెను. వారలును శ్రీదాశరథినిచూచి తమ ధన్యతనెంచి కొనిరి. పిదప వారందరును శ్రీరామునికి నమస్కరించి సిగ్గుచే తలవంచికొని కామబాణప్రపీడితలై తత్సన్నిధానమున నిలిచిరి. శ్రీరాముఁడును వారినిచూచి మీరు వచ్చుటకేమి కారణమని యడిగెను. అందుకు వారు "సర్వజ్ఞుండగు భగవంతుఁడైన నీవంతటిని తెలిసియున్నావు." అని ప్రత్యుత్తరమునిచ్చిరి. శ్రీరఘునందనుఁడుమరల వారి మనోభిప్రాయము నెఱింగి "ఓపణతులారా! ఈజన్మమందు నాకు ఏక పత్నీవ్రతముగలదు. నామాటను వ్యర్థముగా నెంచవలదు. మీమీ స్థలము

యః । యయుర్మూర్ఛాం క్షణాదేవ సికతాయాం సహస్రశః ॥ ౪౪ ॥ తా మూర్ఛావిహ్వలా దృష్ట్వా రామో విహ్వలమానసః । నారీస్సంతోషయన్ ప్రాహ హే నార్యశ్శ్రూయతాం మమ ॥ ౪౫ ॥ వాక్యం ఖేదాపహం త్వద్య ద్వాపరే కృష్ణరూపధృక్ । అహం వ్రజే భవిష్యామి నందగోపేశపాలితే ॥ ౪౬ ॥ తదా దేవాస్తు గోపాలా భావితుద్వరదానతః । భవిష్యంతి సురేశశ్చ నందస్తత్ర భవిష్యతి ॥ ౪౭ ॥ భవిష్యథ తథా యూయం గోపికాస్సకలా వ్రజే । యుష్మాకం పూరయిష్యామి యథేచ్ఛం వాంఛితం తదా ॥ ౪౮ ॥ రాసక్రీడాం హి యుష్మాభిః కరిష్యామి న సంశయః । వృందావనే తు కాళింద్యాం సైకతే నిశి వై చిరం ॥ ౪౯ ॥ భవధ్వం స్వస్థచిత్తాశ్చ గచ్ఛధ్వం స్వస్థలం ముదా । ఇతి రామవచోరూపసుధయా జీవితాః స్త్రియః ॥ ౫౦ ॥ కించిత్తుష్టహృదో రామం నత్వా జగ్ముర్నిజం స్థలం । ఏతస్మిన్నంతరే తత్ర మధుస్నానార్థమాదరాత్ ॥ ౫౧ ॥ మాయాపుర్యాస్సమాయాతా రమ్యా గుణవతీ శుభా ॥*॥ విష్ణుదాస ఉవాచ — కా సా ప్రోక్తా గుణవతీ కింశీలా కస్య కన్యకా ॥ ౫౨ ॥ తద్వదస్వ సవిస్తారం కస్యాసీత్ప్రమదా పురా । ఇతి శిష్యవచః శ్రుత్వా రామదాసోఽబ్రవీత్పునః ॥ ౫౩ ॥*॥ ఇతి శ్రీమదానందరామాయణే వాల్మీకీయే విలాసకాండే దేవపత్నీవరదానం నామ సప్తమస్సర్గః ॥ ... ... ... ... ... ... ... ... ... ౭॥

లకు మీరు జనుఁడు. నా రాజ్యమున నధర్మము జరుగవలదు. అది రాజులకు నరకప్రదంబుగదా?" అని నిరాకరించెను. ఇట్లు శ్రీరాముని వాగ్బాణములచే విభిన్నగాత్రలయిన స్త్రీలు వేలకొలది ఆక్షణముననే సరయూసైకతంబున మూర్ఛాక్రాంతలయిరి. ఇట్లు మూర్ఛనంది విహ్వలులగు విలాసినులను చూచి శ్రీరాముఁడు విహ్వలచిత్తుఁడై ఆపన్నతులను సంతోషపరచుచు "కామినులారా! మీరు దుఃఖపరిహారకంబగు నామాటనిప్పుడు వినుఁడు. నేను ద్వాపరాంతమున నందగోపపరిపాలితంబగు గోకులంబున శ్రీకృష్ణరూపమునంది యవతరించెదను. అప్పుడు సురులు రాగలనా వరప్రదానముచే గోపాలకులగుదురు. అచ్చట నింద్రుఁడే నందుఁడుగాపుట్టును. అప్పుడు మీరందరును గోపికలుగా నవతరించవలయును. అప్పుడు మీకోరికను యథేష్టముగా నెరవేర్చగలను. మీతోడ కాళిందీనదీ తీరమున వృందావనములో రాత్రిచిరకాలము రాసక్రీడ నొనరించెదను. ఇందుకు సంశయములేదు. మీరందరును మంచిమనస్సుగలవారలై మీస్థలములకు సంతోషముగా పొండఁడి." ఇట్లు చెప్పిన శ్రీరామవాక్యామృతపానముచే స్త్రీలందరును బ్రతికి కొంచముసంతుష్టిగలవారలయి శ్రీరాముని నమస్కరించి తమతమ నెలవులకుఁ జనిరి. ఇంతలోపల నచ్చటికి సాదరముగా మాయాపురినుండి చైత్రస్నానమునకై శుభాంగియైన గుణవతియను రామామణి వచ్చెను. అని యిట్లు చెప్పిన రామదాసుని వచనమును విని విష్ణుదాసుఁడు గురూత్తమా! ఆగుణవతియెవతె? ఎట్టిస్వభావముగలది? ఎవనికూతురు? ఎవనియొక్క పత్నిగానుండె? దానిసంగతిని నాకు సవిస్తరముగా నెఱింగింపు" మని వేఁడను॥ ... ... ... ... ... ... ౭॥

శ్రీరామదాస ఉవాచ—ఆసీత్కృతయుగస్యాంతే మాయాపుర్యాం ద్విజోత్తమః । అత్రేయో దేవశర్మేతి వేదవేదాంగపారగః ॥ ౧ ॥ అతిథేయోఽగ్నిశుశ్రూషీ సౌరవ్రతపరాయణః । సూర్యమారాధయన్నిత్యం సాక్షాత్సూర్య ఇవాపరః ॥ ౨ ॥ తస్యాతివయసశ్చాసీన్నామ్నా గుణవతీ శుభా । అపుత్రస్స స్వశిష్యాయ చంద్రనామ్నే దదౌ సుతాం ॥ ౩ ॥ తమేవ పుత్రవన్మేనే సచ తం పితృవద్వశీ । తౌ కదాచిద్వనం యాతౌ కుశేధ్మాహరణాయ వై ॥ ౪ ॥ హిమాద్రిపాదే వేగేన చేరతుస్తావితస్తతః । తావత్తౌ రాక్షసం ఘోరమపశ్యతాం పురఃస్థితం ॥ ౫ ॥ భయవిహ్వలసర్వాంగౌ వపమథౌ పలాయితుం । నిహతౌ రక్షసా తేన కృతాంతసమరూపిణా ॥ ౬ ॥ తౌ తత్ క్షేత్రప్రభావేణ ధర్మశీలతయా పునః । వైకుంఠభువనం యాతౌ నీతౌ విష్ణుగణైస్తదా ॥ ౭ ॥ యావజ్జీవం తు యత్తాభ్యాం సూర్యపూజాదికం కృతం । కర్మణా తేన సంతుష్టో విష్ణుస్తాభ్యాం బభూవ హ ॥ ౮ ॥ శైవాస్సౌరాశ్చ గాణేశా వైష్ణవాశ్శక్తిపూజకాః । తమేవ ప్రాప్నువంతీహ వర్షాపస్సాగరం యథా ॥ ౯ ॥ ఏకస్స పంచధా జాతః క్రియయా నామభిః కిల । దేవదత్తో యథా కశ్చిత్పుత్రాద్యాహ్వాననామభిః ॥ ౧౦ ॥ తతశ్చ తౌ తద్భవనాధివాసినౌ విమానయానౌ రవివర్చసౌ శుభౌ । తత్తుల్యరూపౌ హరిసన్నిధానగౌ దివ్యాంగనాచందనభోగభోగినౌ ॥ ౧౧ ॥ తతో గుణవతీ శ్రుత్వా రక్షసా నిహతౌ శుభౌ ।

## శ్రీరాముఁడు గుణవతిని కృష్ణావతార సమయమున సత్యభామయగునట్లు వరమిచ్చుట.

విష్ణుదాసుఁడిట్లు నిరూపించుచున్నాఁడు. కృతయుగాంతమున మాయాపురియందు వేదవేదాంగ పారంగతుఁడును ఆత్రేయుండు నయిన దేవశర్మయను భూసురవర్యుండుండెను. అతఁడు అతిథిసత్కారపరుఁడును అగ్ని సేవాపరాయణుఁడును సౌరవ్రత నిరతుఁడునై నిత్యము సూర్యునినారాధించుచు తాను అపర సూర్యునివలె వెలుఁగుచు నుండెను. ముసలివాఁడగు నతనికి మంగళాంగియగు గుణవతియను పేరుగల కూతురొకతెయుండెను. పుత్రులులేని యా బ్రాహ్మణుఁడు చంద్రశర్మయను తన శిష్యునికి తన కూతురినిచ్చి వివాహము కావించెను. వానినే పుత్రునిగానెంచెను. వాఁడును తండ్రినవలెనే అతనినెంచి వశమునసుండెను. ఇట్టి మామయును అల్లుఁడునుచేరి యొకప్పుడు సమిత్కుశాహరణంబునకై యడవికి వెడలిరి. వారిరువురును హిమవత్పాదమున నిటటుసంచరించుచునుండి యంతలో నెదుటవచ్చిన రాక్షసుని నొకనిని చూచి యొడలు గడగడ వడఁకుచుండ భయభ్రాంతులై పరుగెత్తి పోఁజాలకపోయిరి. యముని వలెనుండు రాక్షసుఁడు వారిని చంపెను. వారు ఆ క్షేత్ర ప్రభావమువలనను ధర్మస్వభావమువలనను వైకుంఠము నకు విష్ణుగణముచే పిలుచుకొని పోఁబడిరి. బ్రతికియుండువరకు వారిరువురును సూర్యపూజాదిక వ్రతమునాచరించుటచేత నాకర్మవలన వారివిషయమై విష్ణుమూర్తి ప్రసన్నుఁడాయెను. శైవులనగా శివపూజాపరాయణులును సౌరులనగా సూర్యార్చనానిరతులును గాణేశులనగా గణపతి సమర్చాతత్పరులును వైష్ణవులనగా విష్ణుధర్మప్రవణులును శాక్తులనగా దేవీ పూజాసక్తులును ఇట్లే తత్తద్దేవతా పారమ్యవాదులందరును వాననీళ్లంతయును వెల్లువ

పితృభర్తృజదుఃఖార్తా విలలాపభృశాతురా ॥ ౧౨ ॥ సాగృహోపస్కరాన్సర్వాన్ విక్రీయశుభకర్మకృత్ ।
తయోశ్చక్రే యథాశక్తి పరలోకక్రియాంతదా ॥ ౧౩ ॥ తస్మిన్నేవపురేవాసం చక్రేప్రసృతజీవినీ । విష్ణుభక్తిపరా
శాంతా సత్యశౌచాజితేంద్రియా ॥ ౧౪ ॥ వ్రతాష్టకంతయాసమ్యగాజన్మమరణాత్కృతం । ఏకాదశీవ్రతంసమ్య
క్సేవనంకార్తికస్యచ ॥ ౧౫ ॥ మాఘేచైత్రేమాధవేపి స్నానానిప్రతివత్సరం । సంమార్జనంవిష్ణుగేహే స్వస్తి
కాదినివేశనం ॥ ౧౬ ॥ నిత్యంవిష్ణోఃపూజనంచ భక్త్యాతత్పరమానసా । ఇత్థంవ్రతాష్టకంసమ్యక్ సాచకారాథభక్తి
తః ॥ ౧౭ ॥ ఏకదాసాగుణవతీ పౌరాణికముఖేనహి । శ్రుత్వామహత్ఫలంశివ్య సాకేతేసరయూజలే ॥ ౧౮ ॥ చైత్ర
స్నానస్యకైవల్య దాయకంజనసంయుతా । యయాశ్రీరామనగరీం రామతీర్థేవసచ్ఛుభా ॥ ౧౯ ॥ సైకదారాఘ
వంద్రష్టుం సరయూసైకతస్థితం । వాసోగేహేరహఃపత్న్యా యయాబంధుసమన్వితం ॥ ౨౦ ॥ పూజాపాత్రాణి
హస్తాభ్యాం బిభ్రతీద్వారసంస్థితా । ప్రతిహారేణరామాయ వేదితాసావివేశహ ॥ ౨౧ ॥ వాసోగేహందదర్శాథ
సీతయారఘునాయకం । రత్నమంచకసంలగ్నం ధృతాధోంకోపబర్హణం ॥ ౨౨ ॥ క్రీడంతంసారిభిఃపాశైః స్మిత
యాలక్ష్మణేనచ । కైకేయీతనయాభ్యాంచ సఖీభిఃపరివారితం ॥ ౨౩ ॥ మయూరపిచ్ఛసంభూత చామరైఃపరివీ
జితం । రత్నచిత్రరుక్మభవే నూపురేపదయోర్వరే ॥ ౨౪ ॥ బిభ్రంతంరశనాంకట్యాం రత్నరుక్మవిభూషితాం । ర

లుపారి సముద్రమున చేరినట్లు ఆశ్రీమన్నారాయణమూర్తి సన్నిధానము నందెదెరు. ఆయొక్క
పరమాత్మయే నామక్రియాభేదమువలన నైదువిధములుగా నాకారభేదములనం దియున్నాడు
గదా? ఒకానొక సాంసారికుఁడు కుమారునిచే తండ్రియనియును అల్లునిచే మామయనియును
మరదిచే బావయనియును తమ్మునిచే నన్నయనియును తల్లిచే బిడ్డఁడనియును మామచే నల్లుఁ
డనియును పిలువంబడు చుండినను తానొకఁడుగా నుండినట్లు, శ్రీనారాయణుఁడు తత్తద్దేవ
తా రూపనామ ప్రీతిగల తత్తద్భక్త జనులచే నట్లట్లు భావింపంబడుచున్నను తానద్వితీయుఁడై
బరగుచునున్నాడు. అంతనా యిరువురు బ్రాహ్మణులును సూర్యసమ కాంతిగలవారలై విమా
నమునసంచరించువారలై శ్రీహరి సన్నిధానమున తత్సమాకారముగలవారునై దివ్యాంగనాది ది
వ్యభోగంబులనందిరి. అటుపిమ్మట నిచ్చట రాక్షసునిచే తండ్రియును మగఁడును చంపంబడిన సం
గతినివిని అత్యంత దుఃఖమునందిన గుణవతి మిక్కిలి ప్రలాపించెను. పిదప నామె ఇంటిలోని
వస్తువులనన్నిటినమ్మి వారిరువురికిని పరలోక క్రియను యథాశక్తిగా నెరవేర్చెను. మఱియు
నాపట్టణంబుననే వసించుచు బిచ్చమెత్తి జీవించుచుండెను. ఆగుణవతి విష్ణుభక్తి పరాయణ
యును శాంతచిత్తయును సత్యశౌచాచారములు గలదియును జితేంద్రియురాలునై, ౧ ఏకా
దశీవ్రతాచరణము, ౨ కార్తిక విష్ణుసేవనము, ౩ ప్రతివత్సరంబును మాఘమాసస్నానంబు,
౪ చైత్రస్నానంబు, ౫ వైశాఖస్నానంబు, ౬ విష్ణ్వాలయసంమార్జనసేవ, ౭ స్వస్తికాది నివే
శనంబు, ౮ నిత్యమువిష్ణుపూజ, అనునీ విష్ణువ్రతాష్టకమును మిక్కిలి భక్తితో తదైకమానస

త్నరుక్మభవేదివ్య కంకణేకరయోర్వరే ॥ ౨౫ ॥ బిభ్రంతంభుజయోర్దివ్య కేయూరైరత్నభూషితే । కంఠదేశేకౌ స్తుభంచ హృదిచింతామణింశుభం ॥ ౨౬ ॥ బిభ్రంతంవివిధాన్ హారాన్ రత్నమాణిక్యనిర్మితాన్ । తథామాలా రుక్మజాశ్చ ముక్తాహారాన్విచిత్రితాన్ ॥ ౨౭ ॥ తులసీకాష్ఠహారాంశ్చ పుష్పహారాననేకశః । ప్రవాళమణిహారాం శ్చ శృంఖలాఃకాంచనోద్భవాః ॥ ౨౮ ॥ పదకానివిచిత్రాణి రత్నమాణిక్యవంత్యపి । రంభాఫలాబ్జసదృశా, నలం కారాన్విచిత్రితాన్ ॥ ౨౯ ॥ రత్నమాణిక్యసంయుక్తాన్ ముకురైరతిమండితాన్ । నీలమారకతైశ్చిత్రాన్ రామ నామాంకితానపి ॥ ౩౦ ॥ అంగుళీష్వపిబిభ్రంతం హస్తయోర్ముద్రికాశ్శుభాః । రత్నమాణిక్యముక్తాభి శ్చిత్రితారుక్మ నిర్మితాః ॥ ౩౧ ॥ రామనామాంకితాశ్చాపి పవిత్రాన్యుజ్జ్వలానిహి । రత్నముక్తాహేమమయే కర్ణయోఃకుండ లేవరే ॥ ౩౨ ॥ బిభ్రంతంమహిసాదృశ్యా లంకారాంశ్చాప్యనేకశః । బిభ్రంతంరవిసాదృశ్యం ముకుటంరత్నచిత్రి తం ॥ ౩౩ ॥ నానామణిసమాయుక్తం కలశైరతిశోభితం । ముక్తాప్రవాళవైదూర్య యుక్తంహేమమయంవరం ॥ ౩౪ ॥ ఏవంగుణవతీరామం కోటిసూర్యసమప్రభం । హేమవర్ణాంమహారమ్యం కంజపత్రాయతేక్షణం ॥ ౩౫ ॥ సో

---

నై నెరవేర్చుచువచ్చెను. శిష్యుడా! ఇట్లది వ్రతపరాయణయయ్యుండగా నొకప్పుడు పౌరాణిక ముఖమున అయోధ్యవద్ద సరయూతీరమున చైత్రస్నానముచేయుటచే కైవల్యప్రదంబగు మ హాత్ఫలము సంఘటించుటనువిని, అయోధ్యానగరమునకువచ్చి రామతీర్థమువద్ద వాసముచేయు చుండెను. ఆమె యొకప్పుడు సరయూసైకతంబున పటగృహములో పత్నీ బంధుసమేతుండై యుండెడు శ్రీరామునిదర్శించవలెనని నిశ్చయించి పూజాసామగ్రులను తీసికొని రాజనివాసస్థ లమునకువచ్చి ప్రతీహారిమూలకముగా చెప్పిపంపి వచ్చుట కుత్తరవునందిలోపలప్రవేశించెను. ఇట్లు గుణవతి పటగృహముంజొచ్చి యచ్చటి వైభవమునవలోకించి, తోడదిండ్లనానుకొని సీ తాలక్ష్మణ భరత శత్రుఘ్నులతోడ పగడకాయలాటనాడుచు మితపరివారము సేవించుచుండ గా; నవరత్న విచిత్రితంబులయిన రుక్మనూపురంబులను చరణములలోను, దివ్యమణిమండితంబ గు మొలత్రాడునుకటీభాగముననను,దివ్యరత్న కంకణంబులను కరకమలంబులలోను,రత్నకేయూ రంబులను భుజంబులలోను,కౌస్తుభంబును కంఠంబునను, చింతామణిని హృదయంబునను, నవ రత్నాలంకృత దివ్యహారంబులను విచిత్రితంబులగు ముక్తాహారంబులను సువర్ణహారంబులను వివి ధపుష్పహారంబులను తులసీదామంబులను కమల కదళీసదృశ శృంగారాలంకార హారవిశేషంబు లను వక్షస్థలంబునను, చేతివ్రేళ్లలో మణిమాణిక్య మంజులకాంచన రంజిత ముద్రికలను, దివ్య క ర్ణకుండలంబులను కర్ణంబులలోను, దివ్యాలంకారంబులగు సూర్యనిభ కిరీటంబును మస్తకంబు నను ఇట్లే అన్యాదృశంబులును సూర్యసమాన కాంతి కాంతంబులును అమూల్యంబులునగు దివ్యాలంకారంబులను ధరించినవాడును; తామరలవంటి దీర్ఘనయనంబులును చంద్రునివంటి మోమును కమలములవంటి కరంబులును గల్గి కోటిసూర్యప్రకాశమానుండు నయిన; శ్రీరా

మానసం కంజహస్తం దృష్ట్వా తం ప్రణనామ సా । తాం సముత్థాపయ ద్రామ స్తయా సమ్యక్ప్రపూజితః ॥ ౩౬ ॥ తద్దత్తై
రుపహారాద్యై స్సుప్రీతస్తాం తదాబ్రవీత్ । వరం వరయ మామద్య యత్తే మనసి వర్తతే ॥ ౩౭ ॥ ఇతి రామవచశ్శ్రు
త్వా సా తుష్టా రామమబ్రవీత్ । రామ రాజీవపత్రాక్ష యథేమాస్తే సహస్రశః ॥ ౩౮ ॥ దాస్యస్సంతి తథా మాం త్వ
మంగీకర్తుమిహార్హసి । ఇతి తద్వచనం శ్రుత్వా రాఘవః ప్రాహ సస్మితః ॥ ౩౯ ॥ కథం త్వం బ్రాహ్మణీ చేత్థం వదస్య
ద్య శుభవ్రతే । మచ్ఛేవాం కర్తుమిచ్ఛాస్తి తవ తర్హి వదామ్యహం ॥ ౪౦ ॥ శృణుష్వ త్వం గుణవతి కృష్ణరూపధరో
హ్యహం । ద్వారికాయాం ద్వాపరే హి భవిష్యామ్యన్యజన్మని ॥ ౪౧ ॥ భవిష్యసి తదా మాం త్వం స్త్రీరూపేణ న సంశ
యః । సత్రాజిద్దేవశర్మా తే భవిష్యతి పితా పునః ॥ ౪౨ ॥ యశ్చంద్రనామా సోక్రూరో భవిష్యతి సఖా మమ । సత్య
భామేతి నామ్నా త్వం భవిష్యసి ప్రియా మమ ॥ ౪౩ ॥ తదా కురుష్వ దాస్యం మే యత్తే మనసి వర్తతే । ఇతి రామవచః
శ్రుత్వా తుష్టా గుణవతీ ముహుః ॥ ౪౪ ॥ నత్వా శ్రీరాఘవం సీతాం యయౌ స్వీయస్థలం ప్రతి । చైత్రస్నానానంతరం
హి హరిద్వారం యయౌ జనైః ॥ ౪౫ ॥ ఆయుశ్శేషం సమాప్యాథ గంగాయాం కుణపం నిజం । సజ్వరం స్నానసమ
యే త్యక్త్వా నాకం చిరం గతా ॥ ౪౬ ॥ తతః కాలాంతరేణాసీత్సత్రాజిత్తనయా భువి । బభూవ శ్రీకృష్ణస్య ద్వా

మునియొక్క దివ్యమోహన సౌందర్యాకారమును చూచి సాష్టాంగ దండప్రణామంబు నాచరిం
చెను. శ్రీరాముఁడును ఆమెను లేవనెత్తి ఆమెచే పూజితుఁడై ఆమె యర్పించిన ఫలాహారా
దివస్తువులను సాదరముగా స్వీకరించి సుప్రీతుండై యామెతో “నీమనమున నేమికావల
యునో వరింపుము. నేనిప్పుడు వరమునిచ్చెద” నని ప్రసన్నుఁడుగాఁ బలికెను. శ్రీరామవాక్య
మునువిని యాగుణవతి మిక్కిలి సంతసించి శ్రీరామసన్నిధికి “రాజీవాక్షుఁడగు రామా! వేల
కొలదిగా వీరెట్లు నీకు దాసీజనులుగలరో నన్ను నట్లే నీవంగీకరింపవేడెదను” అని విన్నవించె
ను. శుభవ్రతాచరణగల దానవా! ఏమి నీవిట్లుప్పుడు బ్రాహ్మణస్త్రీవయ్యుండిను ఈవిధ
ముగా నడుగుచున్నావు. నాయొక్క సేవను నీవుచేయనిచ్ఛగల్గితే అప్పుడు చెప్పెదను వి
నుము. గుణవతీ! నేను వేరొకజన్మమున ద్వాపరాంతమున ద్వారకాపట్టణంబున శ్రీకృష్ణాకారము
న నవతరించెదను. అపుడు నీవు నన్ను స్త్రీ రూపముచే భజించెదవుగాక. అందుకుసంశయము
లేదు. నీతండ్రియగు దేవశర్మ మరల నప్పుడు సత్రాజిత్తుగాపుట్టును. ఆచంద్రనాముఁడు నాకుస
ఖుఁడైన అక్రూరుఁడుగా జన్మించును. నీవు సత్యభామయను పేరుతో నాకు నత్యంతప్రేయసిగా
నుందువు. అప్పుడు నీవు నన్ను సేవింపుము పొమ్ము” అని వరమిచ్చెను. అంతనాగుణవతి మహా
దానందమునంది పలుమారు సీతారాములనువందించి తననెలవునకుఁజని చైత్రస్నానానంతరంబు
జనులతోడ హరిద్వారంబునకు వెడలెను. అచ్చట నాయుస్సుండునంతవరకు ధర్మములనాచ
రించుచుండి జ్వరముగల తనదేహమును స్నానసమయంబున గంగానదిలోవదలి చిరకాలము
స్వర్గముననుభవింపఁజనెను. అంతనట్లే యామె కాలాంతరంబున సత్రాజిత్పుత్రిగాపుట్టి శ్రీ

పరేద్వారికాపురి ॥ ౪౭ ॥ ఏకదాపింగలానామ్నీ వేశ్యారాత్రౌవినిద్రితం । సీతయాదివ్యపర్యంకే యయౌపాదాను వంరవాః ॥ ౪౮ ॥ విహాయనూపురాదీని స్వనవంతిపదోశ్చ్యైః । ఇతస్తతోవిరీక్షంతీ దివ్యవస్త్రాదిభూషితా ॥౪౯॥ సీతాభయాత్ప్రకంపంతీ కామబాణప్రపీడితా । మండితాపుష్పమాలాద్యై ర్భూషణైరతిశోభితా ॥౫౦॥ అజ్ఞాతా ద్వారపాలైస్సా నిద్రితైర్మఞ్చకంయయౌ । స్వకరేణపదస్పర్శం కృత్వారామంప్రబోధయత్ ॥౫౧॥ తదాప్రబుద్ధశ్శ్రీరామ స్తాందదర్శాపురఃస్థితాం । సాధృత్వాతత్పదేగాఢం ప్రార్థయామాసరాఘవం ॥ ౫౨ ॥ రామరాజీవపత్రాక్ష మయాతేద్యాపరాధితం । త్వంక్షమస్వకృపాంకృత్వా మయిచానుగ్రహంకురు ॥ ౫౩ ॥ తత్తస్యావచనం శ్రుత్వా జ్ఞాత్వాకామప్రపీడితాం । తాంసమాశ్వాసితుంప్రాహ రాఘవఃకంజలోచనః ॥ ౫౪ ॥ ఏకపత్నీవ్రతంమే స్మిన్నవేత్త్వంజత్సిపింగళే । అతస్త్వత్కామపూర్త్యర్థకాం వదామితచ్ఛ్రుణుష్వహి ॥ ౫౫ ॥ యథాహంమధురామగ్రే వ్రజాచ్ఛ్రీకృష్ణరూపధృక్ । యాస్యామిమాతులంకంసం హత్వాస్థాస్యామితత్పురీం ॥ ౫౬ ॥ తదాధిజివ్యసిత్వంమాం కుబ్జారూపేణపింగళే । గచ్ఛదాసీస్వరూపేణ తిష్ఠత్వంకంసవేశ్మని ॥ ౫౭ ॥ అయుఃక్షయేత్విమందేహం విసృజ్యబహుభుక్తకం । ఇత్యుక్త్వాపింగలాంరామో దదావాజ్ఞాంభయాచ్ఛ్రియః ॥ ౫౮ ॥ శిక్షయామాసద్వార

---

కృష్ణపత్నియయ్యె॥౪౭॥ఒకప్పుడు పింగలయను పేరుగల యొక వేశ్యాంగన రాత్రికాలమున శ్రీ

### శ్రీరాముఁడు పింగలయను గణికకు వరమిచ్చుట.

రామునిమీఁద నాశగలదియయి తన కాలియొక్క గజ్జెలగొలుసును అందెలను శబ్దమగుచున్నదని యెత్తిపెట్టి కామబాణప్రపీడితయయ్యును సీతమ్మయొక్క భయమువలన కంపించుచు పుష్పమాలికలను సువర్ణభూషణాద్యలంకారములను ధరించికొని నిద్రించుచుండు ద్వారపాలకులచే నెఱుఁగఁబడక యిటుటుచూచుచు తిన్నగా శ్రీరాముఁడు సుఖనిద్రపోవుచుండు దివ్య పర్యంకము వద్దికివచ్చి తనచేతితో శ్రీరామపాదమును స్పృశించి నిద్రలేపెను. అప్పుడు నిద్రమేల్కొనిన శ్రీరాముఁడు ఎదుటనున్నదాని నవలోకించెను. అది చక్కఁగా కాళ్లుపట్టికొని శ్రీరామభద్రస్వామిని మిక్కిలి ప్రార్థించెను. రాజీవాక్షుండైన రాఘవేంద్రా! నేనిప్పుడు అపరాధమునాచరించితిని. నీవు దయచేసి నన్ను క్షమింపుము. నాయందనుగ్రహముగలవాఁడగుము." అను నామెయొక్క మాటలనువి, శ్రీరాముఁడు కమలాక్షియగు కామబాణప్రపీడితయైన దానిని సమాధానపరచుచు "ఓసి పింగలా! నీవీజన్మమున నాకు ఏకపత్నీవ్రతముగలసంగతి నెఱుఁగుదువు. కావున నీకామపూర్తికొఱకు చెప్పెదను. వినుము; నేనెప్పుడు శ్రీకృష్ణరూపమున నవతరించి గోకులమునుండి మధురాపట్టణమునకువచ్చి యచ్చట మేనమామయగు కంసుని సంహరించెదనో, అప్పుడు తత్పురవాసినియగు నన్ను నీవు కుబ్జారూపముతో సేవించుము. అనేకులచే ననుభవింపఁబడిన ఈ దేహమును ఆయుస్సుముగియుచునే విడిచి దాసీస్వరూపముందాల్చి కంసమందిరంబున వసించుచుండుము." అనిచెప్పి యాపింగళయను శ్రీకి ఆజ్ఞనిచ్చిపంపించి, నిద్రించుచున్న ద్వార

ష్ఠాః దాసాః దాసీర్వినిద్రితాః । తతస్సీతాంప్రబోధ్యాథ వేశ్యావృత్తంన్యవేదయత్ ॥ ౫౯ ॥ తచ్ఛ్రుత్వాజానకీరు
ష్టా త్యక్త్వాపర్యంకముత్తమం । రాఘవంప్రాహసక్రోధా కథంనాహంప్రబోధితా ॥ ౬౦ ॥ త్వదైవాద్యమయాజ్ఞాత
మేకపత్నీవ్రతంనృప । భుక్త్వాదౌపింగలాంతూష్ణీం త్వయాహంబోధితాతతః ॥ ౬౧ ॥ తాంవిసృజ్యచిరాదద్యజ్ఞాతం
తేచరితంమయా । మృషాత్వయాప్రతిజ్ఞాతం పురావ్యాసమునేఃపురః ॥ ౬౨ ॥ ఏకపత్నీవ్రతంమేస్తి కౌసల్యాసదృశీ
మమ । అన్యాస్త్రీతిమృషావాక్యం కథ్యసేత్వంపునఃపునః ॥ ౬౩ ॥ క్వగతంతద్వచస్తేద్య క్వగతంతద్వ్రతంతవ । అ
ద్యైవజీవితంస్వీయం త్యజామిసరయూజలే ॥ ౬౪ ॥ వేశ్యాయాఃపృష్ఠసంలగ్నాం శయ్యాంనాహంస్పృశామ్యహం ।
వేశ్యాసక్తంస్వామినంత్వాం దృష్ట్వాద్వేషోభవేత్త్వయి ॥ ౬౫ ॥ మృతాయాంమయియద్భావ్యం వేశ్యాసక్తస్యతే
భవేత్ । వేశ్యాసక్తపార్థివస్య చిరంరాజ్యంనతిష్ఠతి ॥ ౬౬ ॥ ఇత్యుక్త్వారాఘవంనత్వా దేహత్యాగార్థముద్య
తా । యయౌవేగేనసరయూం వస్త్రగేహాత్త్రటిత్ప్రభా ॥ ౬౭ ॥ గచ్ఛంతీంరాఘవోదృష్ట్వా ముక్తకచ్ఛఃప్రదుద్రు
వే । సంభ్రమాజ్జానకీంధృత్వా భుజాభ్యాంసైకతేమలే ॥ ౬౮ ॥ అబ్రవీన్మధురంవాక్యం మారుషస్త్వంవిదేహజే । శ్రు
ణుష్వవచనంమేత్వం దివ్యంతేప్రవదామ్యహం ॥ ౬౯ ॥ మయితేశపథైరద్య ప్రత్యయోనభవిష్యతి । ఘుణాటంయు
ద్ధ్రువీక్షిత్వం తద్దివ్యంప్రవదామ్యహం ॥ ౭౦ ॥ వదశీఘ్రంజనకజే మాక్రోధంకురుభామిని । ఇతిరామవచఃశ్రుత్వా

పాలకులను దాసీదాసజనులను శిక్షించెను. అంత నూరకయుండక సీతమ్మనులేపి వేశ్యాంగనా సమాచారంబును ఆమెకుం దెలిపెను ॥ ౫౯ ॥ ఆమాటవినగానే మహాకోపమునంది మంచము

### శ్రీరాముఁడ సీతామౌర్ఖ్యము నివారించుట.

నుండి దిగి శ్రీరామునితో "నన్నెందువల్ల అప్పుడు నిద్రలేపలేదు? గనుకనే నాకిప్పుడు నీయేక పత్నీవ్రతము తెల్లవారెనని తెలిసినది. మొదట పింగలను నీవనుభవించి పిమ్మట యూరక నిద్ర లేపితివిగాబోలు, దానినివదలిపెట్టిన నెంతోసేపుకు నీచరిత్ర నాకుఁదెలిసినది. నీవు శ్రీవ్యాసమునీంద్రునియెదుటవ్యర్థప్రతిజ్ఞఁజేసితివి. ఆహా! నీవు పలుమారప్పుడప్పుడు—నాకేకపత్నీవ్రతము గలదు, సీతతప్ప తక్కినస్త్రీ నాకు కౌసల్యాసదృశగానున్నది—అని కల్లలాడుచున్నావుగదా? ఆ మాట యిప్పుడేమైనది? అవ్రత మెచ్చటికేగె? ఇప్పుడే నేనీప్రాణమును సరయూతీర్థమునందు విడిచెదను. లంజపృష్ఠము స్పృశించిన ఈ పాడుపరుపును నేనంటను. వేశ్యారతుఁడగు నా థునింజూచి నీయందు నాకు ద్వేషముగల్గుచున్నది. నేను చావగా నేమికావలయునో వేశ్యారతుఁడగు నీకదియగునుగాక. వారకాంతాసక్తుఁడగు రాజునకు రాజ్యము చిరకాలమునిలువదు." ఇట్లని నిరాకరించుచు శ్రీరామునికి నమస్కరించి దేహత్యాగమునకై ప్రయత్నించి మించుబోణియగు సీతమ్మ పటగృహమునుండి సరయూనదికి వెడలెను. ఇట్లు పోవుచున్న సీతనుమాచి శ్రీరాముఁడు కచ్ఛవీడియుండగా వెంబడించి పరుగెత్తెను. పిదప రాఘవుండు మిక్కిలి సంభ్రమముచే జానకమ్మను నిజభుజంబులచే పట్టికొని యిసుకదిబ్బమీఁద తిన్నగాతియ్యని

జానకీ ప్రాహ రాఘవం ॥ ౨౧ ॥ జానక్యువాచ—రామ బ్రూయామహం కింతే యేనదివ్యం దదాసిమే । అనల స్త్వన్ముఖోద్భూతో నయనే శశిభాస్కరౌ ॥౨౨॥ వాస స్తేజలధౌ రామ పృథ్వీ యుద్ధృతా త్వయా । శేష స్తల్ప స్తథైవాయం లక్ష్మణ స్తిష్ఠతే బహిః ॥ ౨౩ ॥ శస్త్రాణి త్వన్ముఖోద్భూతా న్యాసన్ సర్వాణ్యసంశయః । యద్యత్పశ్యామి తత్సర్వం తవ రూపం న సంశయః ॥ ౨౪ ॥ న దుర్లభం తే దివ్యార్థం కించిత్పశ్యామి రాఘవ । కిం బ్రూయామధునా తేత్ర యేన మే ప్రత్యయో భవేత్ ॥ ౨౫ ॥ ఏక మేవాస్తి జానేహం తత్కురుష్వ రఘూత్తమ । ఇదానీ మేవ స్వగురుం సమాహూయ రఘూత్తమ ॥ ౨౬ ॥ పదయో స్తస్య శపథం కృత్వా తే ప్రత్యయో మమ । భవిష్యతి న సందేహ స్త్వం కురుష్వ రఘూత్తమ ॥ ౨౭ ॥ ఇతి సీతావచః శ్రుత్వా ప్రహస్య రఘునందనః । దాస్యా సౌమిత్రిమాహూయ వసిష్ఠం ప్రేషయత్తదా ॥ ౨౮ ॥ లక్ష్మణ శ్శిబికారూఢః పురద్వారాంతికం యయౌ । రామవాక్యా ద్ద్వారపోపి ద్వారముద్ఘాటయత్తదా ॥ ౨౯ ॥ గత్వా పుర్యాం లక్ష్మణస్స గురోర్ద్వారి స్థిరోభవత్ । వసిష్ఠ ద్వారపో దాస్యా వసిష్ఠాయన్యవేదయత్ ॥ ౩౦ ॥ నిశీథే లక్ష్మణం ద్వార మాగతం త్వితి సంభ్రమాత్ । అరుంధత్యా వసిష్ఠోపి తత్ శ్రుత్వా విహ్వలోభవత్ ॥ ౩౧ ॥ నిశీథే లక్ష్మణ శ్చాత్ర కిమర్థం మాం సమాగతః । ఏవం విహ్వలచిత్తస్స సమాహూయాథ లక్ష్మణం ॥ ౩౨ ॥ పప్రచ్ఛ గమనస్యాథ కారణం మునిసత్తమః । తం నత్వా లక్ష్మణః ప్రాహ రామేణ స్మారితోఽసి హి ॥ ౩౩ ॥ కారణం నాత్ర జానామి సముత్తిష్ఠాథ

మాటలచే “ప్రేయసీ! కోపింపవలదు. నీవు నామాటవినుము. నేను ప్రమాణముచేసి చెప్పెదను. నాయందు శపథములచే నీకు నమ్మకము లేకపోయిన, నీవు దుర్ఘటంబగు నేప్రమాణమును పలికెదవో దానిం జేసెదను. త్వరగా చెప్పుము. కోపమువలదు కోమలాంగీ” యని సమాధానముచేయుగా, నంతకామె యిట్లనెను—శ్రీరామచంద్రస్వామీ! నీకు నేనేమి చెప్పగలను? దేనిచే నీవు ప్రమాణమును నాకు చూపగలవు? అగ్ని నీముఖమున పుట్టినవాఁడు. చంద్రసూర్యులిరువురును నీ నయనంబులనబడుచున్నారు. నీయొక్క వాసస్థానము సముద్రమయ్యె ఈభూమిని నీవేధరించి యుద్ధరించితివి. ఆదిశేషుఁడు నీ శయనతల్పంబు మఱియు లక్ష్మణుఁడు వెలుపలనున్నాఁడుగదా? సకల శస్త్రంబులును నీ నోటంబుట్టినవి. దేనిదేనింజూచెద నవన్నియును నీవుగానుందువే? అందుకు సంశయములేదే? నీకు దుర్ఘటంబేమియునులేదు. నాకు నమ్మకముగలుగునట్లు నేనేమి చెప్పగలను. నేనెఱింగిన దొకటిగలదు. దాని నాచరింపుము. చెప్పెదను? ఇప్పుడే నీగురువును పిలిపించి వారిపాదములంబట్టి ప్రమాణముచేయుము. అప్పుడు నాకు నమ్మకమగును. ఇందుకు సంశయములేదు—ఇట్టి సీతయొక్క వచనములనువిని శ్రీరాముఁడు వెంటనే దాసినంపి లక్ష్మణునింబిలపించి వసిష్ఠులవద్దికి పంపెను. వెంటనే లక్ష్మణుఁడు పల్లకినెక్కి ఊరివాకిలివద్దికివచ్చి శ్రీరామాజ్ఞవలన ద్వారపాలకుఁడు తలుపుదెరవగా నూరివెంబడిపోయి వసిష్ఠగేహద్వారమున నిలచి చెప్పిపంపెను. ఆద్వారపాలకుఁడు దాసీమూలకముగా వసిష్ఠులవారికి సంగతిని తెలిపెను. అర్ధరాత్రిలో లక్ష్మణుఁడువచ్చి వాకిట నిలచియున్నాఁడన్న సంగతిని అరుంధ

నైవహి । శిబికాతిష్ఠతేద్వారా ద్యుహిస్తే మునిసత్తమ ॥ ౮౪ ॥ ఇతిశ్రుత్వారామవాక్యా దరుంధత్యాతిప్రార్థితః। శిబికాయామరుంధత్యా స్థిత్వాశీఘ్రయయౌగురుః ॥ ౮౫ ॥ తత్పృష్ఠే శిబికాసంస్థ స్సౌమిత్రి స్త్వరితోయయౌ। రత్నదీపప్రకాశైశ్చ వేష్టితో వేత్రపాణిభిః ॥ ౮౬ ॥ సమాగతంగురుంజ్ఞాత్వా ప్రత్యుద్గమ్యరఘూత్తమః । దత్వాసనంవసిష్ఠాయ సీతయా ప్రణనామసః ॥ ౮౭ ॥ కృత్వాపూజాంసవిస్తారం వస్త్రాభరణాదిభిః । కథయామాససకలం పింగలావృత్తమాదరాత్ ॥ ౮౮ ॥ కథయామాససీతాయాః క్రోధవాక్యాన్యపిప్రభుః । దివ్యందాతుంనకించిచ్చ దృష్ట్వాసత్యేతరామమ ॥ ౮౯ ॥ వినిశ్చితంతేపదయో ర్దివ్యంతత్తేవదామ్యహం । మనసాపిసభుక్తాసా మయావేశ్యాథవాపరా ॥ ౯౦ ॥ ఇదంచేద్వచనంసత్యం స్పృశామితహితత్పదే । ఇత్యుక్త్వారాఘవశ్శీఘ్రం వసిష్ఠపదయోః కరౌ ॥ ౯౧ ॥ స్వీయాసంస్థాప్యశిరసా ప్రణనామగురుంపునః । తద్దృష్ట్వాలజ్జితాసీతా జ్ఞాత్వాశుద్ధంరఘూత్తమం॥ ౯౨ ॥ ప్రణమ్యమేపరాధంతం క్షమస్వేతిప్రసాదయత్ । తతస్సీతాంగురోః పత్నీ దదౌచిత్రాణిభక్తితః ॥ ౯౩॥ భూషణానివరాణ్యేవ దివ్యవస్త్రాణిసాదరం । రామేణపూజితశ్చాపి వసిష్ఠః పూర్వవత్ స్త్రియా ॥ ౯౪ ॥ సహితశ్శిబికాసంస్థ స్తుష్టః స్వీయగృహంయయౌ । తతస్సీతాంసమాలింగ్య రామోనిద్రాంచకారసః ॥ ౯౫ ॥ ప్రభాతేపిం

తితోడ వసిష్ఠుండువిని కలతనొంది, ఎందువల్ల లక్ష్మణుఁడు ఈమధ్యరాత్రిలో నాకైవచ్చెనని చింతించి లక్ష్మణుని పిలచి యెందుకిట్లు వచ్చితివని యడిగెను. అందుకు లక్ష్మణుఁడు "స్వామీ! నాకేమియును తెలియదు. మీరిప్పుడు శ్రీరాముని చే స్మరింపఁబడితిరి. ఇప్పుడే బయలుదేరండి. మునీంద్రా! వాకిట పల్లకీ-కనిపెట్టికొని యున్నది." అని త్వరపరచెను. పిదప వసిష్ఠుండు వెంటవచ్చుటకు ప్రార్థించుచుండ నరుంధతితోడవచ్చి పల్లకీ-నెక్కెను. లక్ష్మణుఁడు దానివెనుక కూర్చుండి వేత్రపాణులగు భటులచేతను రత్నదీపకాంతులచేతను పరివృతుఁడై త్వరగావచ్చెను. శ్రీరాముఁడు దయజేసివచ్చిన గురూత్తమునిఁగని యెదుటఁజని దివ్యాసనంబునర్పించి సీతతోడ ప్రణమించి వస్త్రాభరణాదులచే సత్కరించి పింగళావృత్తాంతమును సవిస్తరముగా విన్నవించి సీతాదేవియొక్క క్రోధవాక్యములను వినుపించి," స్వామీ! మీపాదములుతప్ప తక్కినవేదియును ప్రమాణభూతములు కానందున నిదిగో మీపాదములంబట్టి ప్రమాణము చేయుచున్నాను. నామనసులోనయినను నాచేవేశ్యగాని యితరస్త్రీలుగాని అనుభవింపఁబడలేదు. ఈమాట సత్యమగుటచేత నీపాదారవిందములను స్పృశించుచున్నాను." అనిచెప్పి శ్రీరాముఁడు త్వరగా నిజకరంబులను గురుపాదములమీఁదఁబెట్టి శిరసాష్టాంగ ప్రణామముఁజేసెను. దానినిచూచిసీత మ్లానజితయై శ్రీరాముఁడు పరిశుద్ధుండనినమ్మి నమస్కరించి నాయపరాధమును క్షమింపుమని ప్రార్థించెను. శ్రీరాముండును ప్రసన్నుఁడయ్యె. పిమ్మట జానకమ్మ యరుంధతిని వస్త్రాభరణాలంకారార్ఘ్యాది సత్కారంబులచే పూజించెను. శ్రీరామప్రపూజితుఁడయిన వసిష్ఠుఁడు యథాపూర్వముగా నరుంధతితోడ పల్లకీ-నెక్కి-కొని సంతసముతో నిజాశ్రమమునకుఁజనెను. అంత

గలాంబాస్యా సమాహూయాథజానకీ । ధిగ్ధిక్కృత్వాసఖీభిస్తాం తాడయామాస బంధితాం ॥ ౯౬ ॥ సీతోవాచతదావేశ్యాం యస్మాన్మేఽద్యాపరాధితం । భవిష్యసిత్రిధావక్రా మధురాయాంహికుత్సితా ॥ ౯౭ ॥ వేశ్యయాప్రార్థితాప్రాహ కృష్ణస్త్వాముద్ధరిష్యతి । శ్రుత్వాతాంబంధితాం వేశ్యాం మోచయామాసరాఘవః॥ ౯౮ ॥ ఏవంనానాకౌతుకాని చకారరఘునందనః । సీతాంసంరంజయామాస స్వచరిత్రైర్మనోరమైః ॥౯౯॥ * ॥ ఇతిశ్రీమదానందరామాయణే వాల్మీకీయే విలాసకాండే సీతాక్రోధవర్ణనం నామాష్టమస్సర్గః॥ ... ... ... ౮॥

శ్రీరామదాసఉవాచ—ఏకదాసీతయారామః కురుక్షేత్రంస్వబంధుభిః। యయౌస్నానార్థ్యోపరాగే వై స్నాతుంపుష్పకసంస్థితః ॥ ౧ ॥ తత్రదేవాస్సగంధర్వాః కిన్నరాఃపన్నగాయయుః । నానాశ్రమేభ్యోమునయః పార్థివాశ్చసహస్రశః ॥ ౨ ॥ తత్రస్నాత్వారవిగ్రస్తే రాఘవస్సీతయాసహ । చకారనానాదానాని హస్త్యశ్వరథవాజినాం ॥ ౩ ॥ తతస్తేపార్థివాస్సర్వే నానోపాయనపాణయః । యయుఃశ్రీరాఘవంద్రష్టుం రాజపత్న్యశ్చజానకీం॥ ౪ ॥ అథసీతారాజపత్నీస్సమాలింగ్యవరాసనే । సఖీభిస్తునిదారైశ్చ సుఖంచోపావిశత్తదా ॥ ౫ ॥ ఏతస్మిన్నంతరేతత్ర సీతయాపూజితాస్థితా । లోపాముద్రాబ్రవీద్వాక్యం జానకీంరంజయన్ముదా ॥ ౬ ॥ హేసీతేకంజనయనే ధన్యాసిగజగామిని । కించిద్వర్ణయరామస్య పౌరుషంశ్రుతిశోభనం ॥ ౭ ॥ తత్తస్యావచనంశ్రుత్వా వర్ణయా

నాశ్రీరామచంద్రుఁడు సీతాదేవి సమాలింగితుఁడై నిద్రాముద్రితుఁడయ్యె. తెల్లవారగానే సీతమ్మ దాసీలనంపి పింగలనుపిలిపించి స్తంభముననంటగట్టి ఛీ ఛీయని ఛీక్కరించుచు సఖులచే కొట్టించెను. మఱియుఁ, పింగలా! నాకు నీవపరాధము చేసినందున మధురాపురిలో నీవుమూడు విధములుగా వక్రయై కుత్సితయై యుండగలవు పొమ్మనెను. ఆపింగలయును మిక్కిలి ప్రార్థించి సీతచే కృష్ణుండుద్ధరించునని యనుగ్రహింపఁబడెను. శ్రీరాముఁడు పింగళనుబంధమునుండి తొలగించిపంపెను. ఇట్లు శ్రీరాముఁడు పలు తెరంగులను వేడుకలనుచూపుచు మనోహరంబులగు నిజచరిత్రలచే సీతాదేవిని రంజింపజేయుచుండెను... ... ... ... ॥౮॥

శ్రీరాముఁడు గ్రహణస్నానమునకై కురుక్షేత్రమునకు పోవుట.

ఒకప్పుడు సీతాలక్ష్మణ భరతశత్రుఘ్నులను పిలుచుకొని పుష్పక విమానారూఢుఁడై సూర్యగ్రహణ స్నానమునకై కురుక్షేత్రమునకు వెడలెను. అచ్చటికి దేవతలు గంధర్వులు కిన్నరులు నాగులును వచ్చిరి. సమస్తాశ్రమములనుండి మునీంద్రులును నానాదేశములనుండి రాజేంద్రులును వేలకొలదిగావచ్చిచేరిరి. అచ్చట శ్రీరాముఁడు సీతతోడ గ్రహణస్నానముచేసి గజతురగోష్ట్రప్రముఖ సమస్తదానంబుల నొసంగెను. అంత నచ్చటచేరిన రాజులందరును వివిధంబులగు కానుకలనుతీసికొని శ్రీరామదర్శనమునకును రాజపత్నులు సీతాదర్శనమునకును వచ్చిరి. పిదపజానకీదేవి రాజపత్నులను ఆలింగనాదిసమ్మానంబులచే మన్నించి సఖీజనులతోడను మునిపత్నులతోడను సుఖముగా దివ్యాసనంబున కూర్చుండెను ॥ ౫ ॥ ఇట్లుండగా నచ్చట జనక

మాస జానకీ। స్వపాణిగ్రహణాత్పూర్వం కుకుష్ఠే త్రావధిం కథాం ॥ ౮ ॥ లోపాముద్రాపి తత్ శ్రుత్వా విహస్య ప్రాహ జానకీం। సర్వం యోగ్యం కృతం సీతే రాఘవేణ మహాత్మనా ॥ ౯ ॥ ఏక ఏవ వృథాక్లేశః కృతస్తేనేతి వద్మ్యహం। మహాన్ శ్రమస్సేతుబంధే కిమర్థం హి కృతః పురా ॥ ౧౦ ॥ కథం న కథితం కుంభజన్మనే రాఘవేణ హి। క్షణాత్తం చళకే కృత్వా పిబేత్యేష లవణార్ణవం ॥ ౧౧ ॥ శుష్కం కృత్వా కపీన్ మార్గో భవిష్యదత ఏవ హి। వృథా తే శ్రమితాస్సర్వే వానరాస్సేతుబంధనే ॥ ౧౨ ॥ ఇతి తస్యాః వచః శ్రుత్వా సగర్వం వై విదేహజా। లోపాముద్రాం విహస్యాహ లోపాముద్రే పతివ్రతే ॥ ౧౩ ॥ సమ్యక్కృతం రాఘవేణ తత్సేతోర్బంధనం వరం। తత్కారణం వదామ్యద్య శ్రుణు త్వం స్వస్థమానసా ॥ ౧౪ ॥ శ్రుత్వాం త్వమాస్సమాయాతా మద్వాక్యం పార్థివస్త్రియః। బాణేన శోషణీయశ్చేత్ త్నాకరో రాఘవేణ హి ॥ ౧౫ ॥ భవిష్యంతి తదా హత్యా బహవశ్చేతి శంకితం। ఉల్లంఘనీయో జలధిశ్చేద్రామేణ విహాయసా ॥ ౧౬ ॥ తదా రామం మనుష్యం చ కథం జ్ఞాస్యతి రావణః। హనుమత్పృష్ఠమారుహ్య గంతవ్యం చేత్పరే తటే ॥ ౧౭ ॥ లంకాం ప్రతి తదా రామ పౌరుషం కిం వదంతి హి। యది తీర్త్వా ప్రగంతవ్యం బాహుభ్యాం రాఘవేణ హి ॥ ౧౮ ॥ నోల్లంఘనీయోపి పస్య మాత్రం చేతి విశంకితం। చేన్మునిః కుంభజన్మా వై ప్రార్థనీయః పతిస్తవ ॥ ౧౯ ॥ రామేణ చులకం

## సీతాలోపాముద్రా సంవాదమున శ్రీరామపౌరుషాభివర్ణనము.

పుత్రిచే పూజింపఁబడియుండు లోపాముద్ర సంతసముచే సీతమ్మను రంజింపజేయుచుఁ "కంజాక్షియగు సీతమ్మా! నీవే ధన్యవు. గజగామినీ! చెవికింపయిన శ్రీరామపౌరుషంబును కొంచమభివర్ణింపుము." అనిపలుకఁగా, నందుకు జానకమ్మ తనపాణిగ్రహణ మహోత్సవము మొదలుకొని కుకుష్ఠే త్రమునకు వచ్చుటవరకు నడచిన శ్రీరామకథను అభివర్ణించెను. లోపాముద్ర దానినివిని నవ్వి సీతతోడ "జానకీ! శ్రీరాముఁడు చేసినదంతయును సరియే, ఒకవిషయమునందు మాత్రము వ్యర్థముగా క్లేశపడెనని నేను తెలియుచున్నాను. అదియేమనిన, మునుపు సేతురచనకై యెందుకంత గొప్పశ్రమనందవలె? శ్రీరాముఁడేల కుంభజమునికి చెప్పకపోయె? అతఁడు క్షణమున నీలవణసాగరమును అరచేతిలో నందుకొని త్రాగివేసి సముద్రమును శుష్కించుటచే నప్పుడే కపులకు మంచిదారి నేర్పరచియుండునే. వ్యర్థముగా కపులకు సేతుబంధనశ్రమను కలుగించెను." అని చెప్పెను. గర్వయుక్తముగు నీమాటనువిని సీతాదేవి నవ్వి లోపాముద్రతో నిట్లనియె.— సతీమణియగు లోపాముద్రా! వినుము, శ్రీరాముఁడు సేతుబంధనమును చక్కగానే నెరవేర్చెను దాని కారణముఁ జెప్పెదను. సమాహితచిత్తవై యాలికింపుము; ఇచ్చటనుండు రాజపత్నులందరును నావాక్యమును విందురుగాక. శ్రీరాముఁడు తనబాణముచే సాగరంబును శోషించినయెడల అనేక హత్యాదోషములుగల్గునని శంకించెను. ఇఁక శ్రీరాముఁడు గగనమున సముద్రమును దాటినట్లయిన నప్పుడు రావణుఁడు శ్రీరాముని మనుష్యమాత్రునిగా నెట్లెంచెను? హనుమంతుని మీఁదనెక్కి శ్రీరాముఁడు లంకకు సముద్రమును దాఁటిన నతని పౌరుషమునేమందురు?

కర్తుం తదాశక్తువణాంబుధేః । మంత్రితం రాఘవేణాపి తదాహ్యదివిశంకితం ॥ ౨౦ ॥ పీతోఽయం జలధిః పూర్వం క్రుతం క్రోధాదగస్తినా । మూత్రద్వారాచ్చహి త్యక్తస్తస్మాత్ క్షారత్వమాగతః ॥ ౨౧ ॥ సర్వదామూత్రవత్ క్షారస్సః ధం పాతుమర్హతి । సబుభుక్షణామువాక్యేన చులకం తుకరిష్యతి ॥ ౨౨ ॥ భవిష్యతియమాకీర్తి స్సర్వత్రజగతీతలే । మూత్రపానం బ్రాహ్మణేన స్వకార్యార్థంగతోక్తిభిః ॥ ౨౩ ॥ కారితం యేన రామేణ సోఽయం చేతీవశంకితః । సమునిం ప్రార్థయామాస రాఘవో ధర్మతత్పరః ॥ ౨౪ ॥ ఏవం సంమంత్ర్య రామేణ స్వకీయైర్యః సేతుబంధనం । కృతం కేనాపి న కృతం న కోఽప్యగ్రే కరిష్యతి ॥ ౨౫ ॥ యేన రామేణ జలధౌ శిలాస్సంతారితాః పునః । సోఽయం దాశరథీ రామశ్చేతిఖ్యాతింగతో భువి ॥ ౨౬ ॥ ఇతి సీతావచోభిస్సా లోపాముద్రాజితా తదా । తూష్ణీమాసక్షణం నారీ సభాయాం లజ్జితాభవత్ ॥ ౨౭ ॥ తతో విహస్య వైదేహీ లోపాముద్రాం ప్రపూజయత్ । మునిపత్నీశ్చ సంపూజ్య ప్రార్థయామాస తాం పునః ॥ ౨౮ ॥ మయాపరాధితం తేద్య తత్ క్షమస్వ పతివ్రతే । స్నేహాత్ప్రసంగతశ్చోక్తం త్వదగ్రే రామపౌరుషం ॥ ౨౯ ॥ త్వద్భర్తురాశిషారామే పౌరుషం చేతి వేద్మ్యహం । ఇతి సంప్రార్థ్య తాస్సర్వా మునిపత్నీర్వ్యసర్జయత్ ॥ ౩౦ ॥ పూజితాస్సపత్నీభిర్యయా సీతారఘూత్తమం । తతో రామోఽపి స్వశ్రేష్ఠైః పూజితోఽగజవాజిభిః ॥ ౩౧ ॥ యయావాసనగరీం తుష్ట స్సీతయాగరుడే స్థితః । యేయే సమాగతా స్తత్ర కురుక్షేత్రే రవిగ్రహే ॥ ౩౨ ॥ తేసర్వే

చేతులతో నీదుచు సముద్రమును దాటుదమనిన బ్రాహ్మణమూత్రమును పానముచేయరాదని శంకించెను. అయిన నీమగడు నామగనిచే ప్రార్థనీయుడే సరి. శ్రీరాముడును తనమనమున: క్రోధమువలన నగస్త్యుడీజలధిని పానముచేసెనని వింటిని. అతడు మూత్రద్వారమునుండి బయటవిడిచెను. అందువల్ల సముద్రము క్షారమయ్యె. అట్టిదానిని మరల అతడెట్లు పానము చేయగలడు? నామాటమీద నామహర్షి సముద్రమును పుక్కిలించినను నాకులోకమునం దంతట — తనకార్యమునకై బ్రాహ్మణునిచే మూత్రపానము చేయించె — నని యపకీర్తి తప్పక వచ్చును." అని యిట్లాలోచించి ధర్మతత్పరుడగు శ్రీరాముడు మునీంద్రుని బ్రార్థింపలేదు. కావున నిట్టియోచనలచే శ్రీరాముడు సేతుబంధనమును చేయించెను. ఈవరకిట్లెవరును చేయలేదు. ఇకనెవరును చేయరు. ఏరామునిచే సముద్రమున రాళ్లు సంతరింపబడినవో అట్టివాడు గదా దాశరథియని నామగడు ఖ్యాతినందెను—అని యిట్లు సీతావాక్యములచే లోపాముద్ర జయింపబడి లజ్జితయై సభలో కొంతసేపూరకయుండెను. అంతనాజానకమ్మ నవ్వి లోపాముద్రను చక్కగా సత్కరించి మునిపత్నుల నందరిని పూజించి, తిన్నగా నామెతో "ఓమహాపతివ్రతయగు లోపాముద్రా! నేనుమిక్కిలి యపరాధము నాచరించితిని. దీనిని క్షమింపుము. స్నేహమువలన ప్రసంగవశముగా నీయెదుట శ్రీరామపౌరుషమును చెప్పితిని. నీమగనియొక్క సవాశీర్వాదబలముచేతనే శ్రీరామునికి పౌరుషముగల్గి యుండునని నేనెఱుంగుదును." అనియిట్లు చక్కగా ప్రార్థించి ఆమునిపత్నుల నందరిని పంపించెను. వారిచే మన్నింపబడినదియై శ్రీరామ

సస్వస్థలం జగ్ముః రామదర్శనహర్షితాః । రామోపి నగరీమధ్యే పురస్త్రీభిర్ముహుః పథి ॥ ౩౩ ॥ నీరాజితః కుంభదీపై ర్యయౌ నిజగృహం ముదా । రేమే జనకనందిన్యా చిరకాలం యథాసుఖం ॥ ౩౪ ॥ ఏవం రామేణ సాకేత పుర్యామవనితనయా । నానాక్రీడాకౌతుకాని కృతాన్యపి మహాంతిచ ॥ ౩౫ ॥ యథా కృతా రాఘవేణ సుఖక్రీడా తు సీతయా । తథైవోర్మిళయా రేమే లక్ష్మణోపి యథాసుఖం ॥ ౩౬ ॥ మాండవ్యా భరతశ్చాపి రేమే రామో యథా శ్రియా । తథైవ శ్రుతకీర్త్యాపి శత్రుఘ్నః క్రీడనం వ్యధాత్ ॥ ౩౭ ॥ ఏవం తే స్వీయపత్నీభిః పౌరాః క్రీడాః ప్రచక్రిరే । నానాదేశవాసినశ్చ నానాద్వీపనివాసినః ॥ ౩౮ ॥ రేమిరే తేపి పత్నీభిః స్వీయాభిర్ముదితాస్సుఖం । సీతయా రాఘవో రేమే యథా గౌర్యా స శంకరః ॥ ౩౯ ॥ రామే శాసతి రాజ్యేత్ర న కోపి జగతీతలే । పరదారరతో వేశ్యాగామీ మాదకవస్తుభుక్ ॥ ౪౦ ॥ న దరిద్రో నైవ రోగీ చింతాగ్రస్తో న విహ్వలః । న పాపాత్మా జడో నాసీన్న చోరో నాపి హింసకః ॥ ౪౧ ॥ ఏవం శిష్య యథా ప్రోక్తం విలాసచరితం వరం । సీతయా రామచంద్రస్య సాకేతే సౌఖ్యదం నృణాం ॥ ౪౨ ॥ విలాసకాండమేతద్వై యః పఠిష్యతి మానవః । ప్రాతఃకాలే చ మధ్యాహ్నే నిశాయాం రామసన్నిధౌ ॥ ౪౩ ॥ స జ్ఞేయో రాఘవస్సాక్షా ద్భువి మానవరూపధృక్ । విలాసకాండపఠనా ద్ధనాఢ్యత్వమాప్నుయాత్ ॥ ౪౪ ॥ భోగావాప్నోతి భోగా

### శ్రీరాముఁడు గరుడారూఢుఁడై యయోధ్యకువచ్చి సుఖించుట.

సన్నిధానమునకే తెంచెను॥ ౩౦॥ పిదప శ్రీరాముఁడు రాజులచే సంసేవితుఁడై వారర్పించిన గజరథతురగాదులగు కానుకల ననుమోదించి, సీతతోఁడ గరుడారూఢుఁడై యయోధ్యకేతెంచెను. అచ్చట కురుక్షేత్రమున సూర్యగ్రహణమునకై యెవరెవరు వచ్చియుండిరో వారందరును శ్రీరామదర్శనానందముచే పూర్ణమనోరథులై తమతమ నెలవులకుంజనిరి. శ్రీరాముఁడును నిజనగరమధ్యమున దారిలో పురపురంధ్రులచే కుంభదీప నీరాజనాదుల నంగీకరించుచు మహావిభవముతో రాజమందిరముఁజొచ్చి సంతసించెను. శ్రీరామచంద్రుఁడు జానకీదేవితోడ యథాసుఖముగా చిరకాలము క్రీడించుచుండెను. ఇట్లే శ్రీసీతారాములు అత్యంతాశ్చర్యకరంబులయిన గొప్పగొప్ప వేడుకలఁజేయుచు వినోదముగా నుండిరి. వారెట్లుండిరో అట్లే ఊర్మిళాలక్ష్మణులును మాండవీభరతులును శ్రుతకీర్తి శత్రుఘ్నులును నిత్యానందనిర్భరులై విలాసముగానుండిరి. ఇంతమాత్రమే కాదు, పురవాసులు దేశవాసులు ద్వీపాంతరవాసులు చివరకు లోకులందరును తమతమ పత్నులతోడ శ్రీసీతారామవిలాసక్రీడలవంటి మహోత్సవంబులు గలవారలై యానందించుచుండిరి. శ్రీసీతారాములు శ్రీగౌరీశంకరులవలె రమించుచుండిరి. శ్రీరాముఁడు రాజ్యమును పరిపాలించుచుండగా నిజ్జగంబున నెచ్చటను పరదారరతుఁడుగాని వారకాంతాసక్తుఁడుగాని మాదకవస్తుసేవన గలవాఁడుగాని దరిద్రుఁడుగాని రోగిగాని చింతాక్రాంతుఁడుగాని విహ్వలుఁడుగాని పాపాత్ముఁడుగాని జారుఁడుగాని చోరుఁడుగాని హింసకుఁడుగాని ఒకఁడును నుండఁడు. అట్టివారేలేరు॥౪౧॥ శిష్యుఁడా! ఇట్లు అయోధ్యలోని లోకరం

ర్థీ పుత్రార్థీ పుత్రమాప్నుయాత్ । విలాసకాండమేతద్ధి రామభక్త్యేకమానసః ॥ ౪౫ ॥ యః శృణోతి నరః కశ్చి
త్స సుఖం ప్రాప్నుయాద్భువి । విలాసకాండశ్రవణా న్నరః పాపాత్ప్రముచ్యతే ॥ ౪౬ ॥ విలాసకాండం పరమం ర
మ్యం జనమనోహరం । ఆనందదాయకం చిత్రం శ్రుతిసౌఖ్యప్రదం మహత్ ॥ ౪౭ ॥ యే పఠంతి విశృణ్వంతి సర్వాన్
కామాన్ లభంతి తే । ధర్మార్థీ ప్రాప్నుయాద్ధర్మా న్ధనార్థీ ప్రాప్నుయాద్ధనం ॥ ౪౮ ॥ కామానాప్నోతి కా
మార్థీ మోక్షార్థీ మోక్షమాప్నుయాత్ । నిశాయాం మంచకే స్థిత్వా నిజపత్న్యా యుతో తు యః । విలాసకాండం షణ్మా
సం తస్య పుత్రో భవిష్యతి ॥ ౪౯ ॥ అథవా మంచకే వ్యాసం సన్నివేశ్యాథ తత్పురః । ద్వితీయే మంచకే స్థిత్వా స్వయం
దయితయా సహ ॥ ౫౦ ॥ యః శృణోతి నిశాయాం హి విలాసాఖ్యం మనోరమం । ఏతత్కాండం పవిత్రం చ నవమా
సాన్ పునః పునః ॥ ౫౧ ॥ తస్యాపుత్రస్య పుత్రస్స్యా న్నాత్ర కార్యా విచారణా । పుత్రార్థినామేవ శ్రోతవ్యం మంచకే
వ్యాసపరిశ్య చ ॥ ౫౨ ॥ శ్రోతవ్యం నాన్యకామేషు మంచకస్థైర్నరైః కదా । విలాసకాండమేతద్ధి స్త్రీకామార్థిభిః
పఠేన్నరైః ॥ ౫౩ ॥ స భార్యాం ప్రాప్నుయాద్రమ్యాం నవమాసైర్న సంశయః । కుమారీ శృణుయాదేతత్పత్యర్థం కాం
తముత్తమం ॥ ౫౪ ॥ పునః పునస్సు షణ్మాసం లభిష్యతి వరం పతిం । విలాసకాండమేతద్ధి యాః శృణ్వంతి వరాః స్త్రీ

## విలాసకాండము యొక్క ఫలశ్రుతి రామదాసునిచే చెప్పఁబడుట.

జకంబయిన శ్రీసీతారాముల యొక్క విలాసచరిత్రంబును నీకు నిరూపించితిని. ఈవిలాసకాండ
మునే మానవుండు ప్రొద్దున మధ్యాహ్నమైన సాయంకాలమున నర్ధరాత్రిలో శ్రీరామసన్ని
ధానమునను పఠించునో, వాఁడే పుడమిలో సాక్షాద్రాముఁడుగా నెంచబడును. నరులు విలాస
కాండమును పఠించుటచేత ధనము కావలసినవారికి ధనము, భోగము కావలసినవారికి భోగ
ములు, పుత్రులు వలయువారికి పుత్రులు, గల్గిసుఖించెదరు. రామభక్తి పరాయణుఁడై ఈవి
లాసకాండమును విన్నవాఁడు ఇహలోకసుఖమునొందును. దీనినివినుటచే పాపములు పరిహరిం
చును ఈవిలాసకాండము శ్రేష్ఠమైనది, మిక్కిలిపవిత్రము, లోకహృదయంగమము, ఆనంద
ప్రదంబు, విచిత్రంబు, కర్ణానందంబు, కావున దీనింబఠించిన నఖిలకాంక్షలు లభించును. ధర్మా
ర్థులు ధర్మమును ధనార్థులు సంపదను కామార్థులు కామమును మోక్షార్థులు ముక్తిని పొంద
గలరు. ఈవిలాసకాండమును మంచముపై పరుండి రాత్రిళ్లలో నెవఁడు తప్పక నారునెలలుపఠిం
చునో వానికి సత్పుత్రుఁడుపుట్టును. మఱియును ఒకమంచముపై వ్యాసునిస్థాపించి దానియెదుట
మఱియొక మంచముపై తాముదంపతులు కూర్చుండి ౯ నెలలు ఎవరు శ్రవణము చేయుదురో,
అట్టి యపుత్రులకు పుత్రుఁడు లభింపగలఁడు. దీనికారణము విచారింపవలదు. పుత్రార్థులైన
వారొక్కఁడే మంచముపైయుండి విననగును. తక్కిన కోర్కెల వారెవ్వరును అట్లు వినఁ
దగదు. మంచిమగఁడు కావలసిన నాఁడుబిడ్డలు మరలమరల నారుమాసములు దీనినివినుచుండిన
మంచివరుఁడు లభించును. ఈవిలాసకాండమును వినుచున్న వనితలకు సౌమంగల్యము తప్పక

యః ॥ ౫౫ ॥ సౌభాగ్యలక్ష్మ్యైనకదా తాంవిహీనాభవంతిహి । భర్తురాయుష్యవృద్ధ్యర్థం స్త్రీభిశ్చస్నానపూర్వకం । శ్రవణీయంవిలాసాఖ్య మేతత్కాండంమనోహరం॥ ౫౬ ॥ ... ... ...

రమ్యంవిచిత్రంమధురంపవిత్రం । విలాసకాండంహియథేక్షుదండః ।
పాతాదినాపాపచయప్రచండం । ధర్మైకకుండంభవరోగదండం॥ ౫౭ ॥

ఇతి శ్రీమద్వాల్మీకీయే శతకోటిరామచరితాంతర్గతే ఆనందరామాయణే విలాసకాండే
కురుక్షేత్రయాత్రావర్ణనంనామ నవమస్సర్గః॥ ౯ ॥
సమాప్తోయం విలాసకాండశ్చతుర్థః.
శ్రీరామచంద్ర చరణారవిందార్పణమస్తు.



గల్గియుండును. పణతులు భర్తల యాయుర్వృద్ధికొఱకు దీనిని స్నానముచేసి నియమముగా వినవలయును చెవులకింపై మఱి మనసుకుసొంపై, పవిత్రంబై మఱి విచిత్రంబై, పఠించినవారి పాపంబులను పరిహరించునట్టి విలాసకాండంబు భవరోగదండంబును ధర్మకుండంబునై రాజించుచున్నది. ... ... ... ... ... ... ॥౯॥

ఇట్లు శ్రీమద్వాల్మీకీ యానంద రామాయణంబున
విలాసకాండము సంపూర్ణము.
శ్రీ రామార్పణము.



శ్రీరామాయనమః.

# శ్రీరామపంచరత్నస్తుతిః.*

శ్లో॥ ప్రాతస్స్మరామిరఘునాథముఖారవిందం। మందస్మితం మధురభాషివిశాలఫాలం॥
కర్ణావలంబి చలకుండలశోభిగండం। కర్ణాంతదీర్ఘనయనంనయనాభిరామం ॥ ౧॥

శ్లో॥ ప్రాతర్భజామిరఘునాథకరారవిందం । రక్షోగణాయ భయదంవరదంనిజేభ్యః॥
యద్రాజసంసది విభజ్యమహేశచాపం। సీతాకరగ్రహణమంగళమాపసద్యః ॥౨॥

శ్లో॥ ప్రాతర్నమామి రఘునాథపదారవిందం। పద్మాంకుశాది శుభరేఖిసుఖావహం మే॥
యోగీంద్రమానసమధువ్రతసేవ్యమానం। శాపాపహంసపదిగౌతమధర్మపత్న్యాః॥౩॥

శ్లో॥ ప్రాతశ్శ్రయేశ్రుతినుతాంరఘునాథమూర్తిం। నీలాంబుదోత్పలసితేతరరత్నలీలాం॥
ఆముక్తమౌక్తికవిశేషవిభూషణాఢ్యాం। ధ్యేయాంసమస్తమునినిర్జరమృత్యుహంత్రీం॥

శ్లో॥ ప్రాతర్వదామి వచసారఘునాథనామ । వాగ్దోషహారి సతతంసుఖదంద్విజేభ్యః॥
యత్పార్వతీస్వపతినాసహభోక్తుకామా । ప్రీత్యాసహస్రహరినామసమంజజాప॥౪॥

శ్లో॥ యఃపద్యపంచకమిదంరఘునందనస్య । నిత్యంప్రభాతసమయేపురుషఃప్రబుద్ధః॥
శ్రీరామకింకరజనేషుసఏవముఖ్యో। భూత్వాప్రయాతిహరిలోకమనన్యలభ్యం॥౫॥

ఇతిశ్రీరామపంచరత్నం సంపూర్ణం.

---

* పైశ్రీమద్రామ పంచరత్నస్తుతులవంటి మనోహరస్తోత్రములును, ఇతరసర్వదేవతాస్తుతులును, న్యాయధర్మవేదాంతతత్త్వనిరూపణస్తవములును, అర్థటీకతోడ బృహత్స్తోత్రరత్నాకరముయొక్క మూడవభాగముగానున్నది. వెల 3 మూడు రూపాయిలు. ముఖ్యముగా దైవభక్తిగావార్కు కిదిమిక్కిలి సంగ్రాహ్యము.

శ్రీః
శ్రీరామాయనమః.
చిత్రవిచిత్రాద్భుతకథా సందర్భగర్భితంబును
శ్రీ సీతారామవాక్యామృత వేదాంత తత్త్వసార గుంభితంబునగు

# శ్రీమదానంద రామాయణము.

ఆస్తికులగు సుజనవర్యులకు విజ్ఞాపనము:—

"శ్లో॥ రమంతేయోగినోనంతే సత్యానందేచిదాత్మని । ఇతిరామపదేనాసౌ పరంబ్రహ్మాభిధీయతే=శాశ్వతుండైన సచ్చిదానందస్వరూపుఁడగు పరమాత్మయందు యోగులు రమించెదరు. కనుక నట్టిపరబ్రహ్మము రామపదవాచ్యంబగునని యుపనిషత్తు చెప్పుచున్నది. శ్లో॥ శ్రీరామరామరామేతి రమేరామేమనోరమే। సహస్రనామతత్తుల్యం రామనామవరాననే=పార్వతితోపరమేశ్వరుఁడు ౧౦౦౦ విష్ణునామములకు సమానము రామనామమని పఠించుచున్నట్లు చెప్పినసంగతి భారతమునుండి తెలియనగుచున్నది. శ్లో॥నాయనాయముఖతోవినాష్టకం మౌళితోపినశివాయపంచకం। నామరామ ఇతితావృశంతథా తత్తదన్వయవశాచ్చతద్ద్వయం=అష్టాక్షరంబున ముఖవర్ణంబగు రేఫలేనియెడల (నాయనాయ) పరమపదముకొఱకుగాచాలదని యర్థభేదమగుచున్నది. పంచాక్షరంబున శిరోవర్ణంబగు మకారములేకుండిన (నశివాయ) శుభముకొఱకుగాదని యర్థభేదమగును. కావున నుభయమంత్రములకును అర్థక్రియానమన్వయమగునది రామనామమని యభియుక్తవచనముగలదు, ఇట్టితారకమూర్తిచారిత్రముకన్నను మానవకోటికి రక్షకంబువేరుగలదే? గనుక, ఆస్తికులందరును రామచారిత్ర వర్ణనంబున నిహపరసౌఖ్యములనందవలసియున్నది. అందువలన పరమపవిత్రంబగు శ్రీరామచారిత్రంబును నిరూపించుచుండు గ్రంథములలో:—

శ్రీమద్రామాయణము గాయత్రీరామాయణంబని ప్రసిద్ధికెందినదిగాక, దూర్వాసరామాయణము. వసిష్ఠరామాయణము. విశ్వామిత్రరామాయణము. మొదలుగాగలవి (౧౦౦) నూరు రామాయణములుగలవు.వాటిలో రామోపాసనాది సమస్త తత్త్వరహస్యంబులకు మూలంబై చిత్రకథాసంవిధానములతో నొప్పుచుండు పార్వతీపరమేశ్వరసంవాదాత్మకంబగు "ఆనందరామాయణము" మిక్కిలి రమణీయంబును నమస్తాస్తిక జనాదరణీయంబునై బరగుచున్నది. అది తెనుగునముద్రాయితంబై సర్వజన సులభము కాకయుండు కొఱతను పోగొట్టి, సర్వజనులు శ్రీరామచంద్ర దివ్యాపదానములనుచదివి యానందించునట్లు చేయుదలచి," బ్రహ్మశ్రీ॥సిద్ధాంతి. శివశంకరశాస్త్రులవారిచే రచింపఁబడిన ఆంధ్రభాషాతాత్పర్యముతోడ, ఈ గ్రంథము నచ్చువేయింపవలయుననిన వారిసదుపదేశంబునుపుణ్యకీర్తికరంబనినమ్మి యీ ప్రకటనకార్యమున ప్రవర్తించియున్నారము.

ఈ "ఆనందరామాయణ"ములోని విషయ సూచికనే ఈప్రకటనలోసూచనగా వేయించియున్నారము. దానిని చదివికొనుటచేత ఈ మహాగ్రంథముయొక్క ప్రయోజనము సర్వజనులకును

నువ్యక్తంబగుచున్నది. అందుమీఁద నందరును ఆనందముతో మాప్రయత్నమునకు సహాయభూతుల గుదురనియును నమ్ముచున్నాము.

ఈ గ్రంథమున నాయాకాండలవద్ద సముచితముగా చిత్రపటములు పెట్టబడుచుండును.

ఇట్టి యమూల్యమగు "ఆనందరామాయణ"మను గ్రంథమును పై ప్రక్క మూలమును, దిగువ దాని తాత్పర్యమునుపెట్టి డిమ్మి ౮ పేజీల సైజులో ముద్రించుచునున్నారము. ఈగ్రంథము ౨ మారమి యిరువది సంచికలుగల పుస్తకము కావచ్చునని తోచుచున్నది. గనుక:—

దీనికి, "ఆనందరామాయణ"మునకు సర్వజన సులభముగానుండునట్లు (౮౦) పుటలుగల ౧౦ఫారముల సంచికయొకటికి రూ. ౦-౪-౦ చందానిష్కర్షింపబడియున్నది. దీనికై అడ్వాన్సుగా నొక్క రూపాయిమాత్రమునే ఇచ్చినసరి. పిమ్మట సంచికలనిచ్చి పయికమును తీసికొందుము. ఇప్పటికి ఆరు సంచికెలు వెలువడినవి. చందాదారుగా చేరెడువారు ఇప్పుడు ౨ రూపాయలనిచ్చి(౮) సంచికలనందవలయును. సంవత్సరము నాలుగు నెలలకు పుస్తకము పూర్తి కావచ్చును. చెన్నరాజధానితప్ప బైటిచందాదారులు, మాకు అడ్వాన్సురూపాయనుమాత్రమే మొదట పంపవలెను. పిదపమూడునెలల కొకమారు మూడుసంచికలను వి.పి. గా పంపించుచున్నారము. చందాదారులకు అడ్వాన్సును గ్రంథపూర్తితో ముజరా ఇచ్చెదము.

ఈ మహాగ్రంథమునకు ౫ చందాలను మొత్తముగా చేయువారు పోషకులుగా నెంచబడుదురు. ౧౨ చందాలను చేయించినవారికి ౧ ప్రతి యుచితముగానిచ్చెదము. చందాదారుల పేళ్లను గ్రంథములో ప్రకటించెదము. ౧౯౪౫ వ-సం॥ జనవరినుండి సంచిక వెలువననవి.

సూచన—ఆరవ (౮) సంచికె వెలువడినవెనుక ఈ ఆనందరామాయణ చందాదారులుగా నేర్పడువారలు కడచిన సంచికలకు సంచికె ఒకటింటికి ఒక అణావంతున యెక్కువగా నివ్వవలసియుండును. ౧౦ సంచికెలననగా నర్ధగ్రంథమైనవెనుక చందా చేయువారికి, కడచిన సంచికలకు ౨ జేసి అణాలవంతున ఎక్కువ అగును. గ్రంథపూర్తియైనవెనుక కొనువారికి సంచికె ౧ టికి ౧౨ అణాలవంతననగా సమగ్ర పుస్తకము ౧౫ రూపాయలగును.

ఈ యానందరామాయణమునందలి యారవసంచికయొక్క ౫-౭ ఫారములనగా విలాసకాండలోని ౧౨ ఫొరటలు, చందాదారులుగా చేరెడువారు చూచుటకై ఈ ప్రకటనపత్రికతోడ చేర్చియున్నారము. వాటినైనను చూచి యానందరామాయణమునందలి యానందానుభవము నందుటకు చందాదారులై వెలయుఁడు.

ఇట్టి, శ్రీరామ చరితామృతపాన ప్రయత్నమునకు మహాత్ములందరును సహాయులుగా నేర్పడి యానుమోదింపవలెనని ప్రార్థించుచున్నాను. ఆనందరామాయణము వలయువారు, మదరాస్, టంకసాల వీధి, ౩౯౭ నెం॥ గృహములో ఆనందరామాయణ ప్రకటన కార్యాలయం ఏజంటు

౧౯౪౫-వ సం॥జూన్ నెల. ☞ యం. జి. సుబ్బరాయ శాస్త్రియను నాపేరిటికి వ్రాయవలెను.

# ఆ నం ద రా మా య ణ వి ష యా ను క్ర మ ణి క.

శ్రీ

# శ్రీబృహత్స్తోత్రరత్నాకరము.

:o:

## మొదటిభాగము.

ఇందువలన సమస్త సత్పురుషులకు తెలియచేయుడ మేమనగా:—

శ్రద్ధాయుక్తులగు ఆర్యులు, అనేకములైన సద్గ్రంథములను ఇదివరకే అచ్చువేయించియుండినను త్రికాలములయందు పారాయణము చేయుటకు అనుకూలములై ధర్మార్థ కామమోక్షప్రదంబులై ఋషిప్రోక్తంబులగు భగవన్నామస్తోత్రములబృందము ఇదివరకు లేదని కొదవపడుటంజూచి, అస్మద్గురువులగు బ్రహ్మశ్రీ, ధూళిపాటి-అరుణాచల శాస్త్రులవారు తాము మహాయాత్రంబోవుచుండునపుడు అచ్చటచ్చట దివ్యక్షేత్రములలో పుణ్యపురుషులవలన సంపాదింపంబడిన స్తోత్రములతో కూడ వారి నిత్యగ్రంథ సత్కాలక్షేపములలోని పారాయణ యోగ్యంబులై పురాణాంతర్గతములైన దివ్యస్తోత్రములనన్నిటిని చేర్చి యొక పుస్తకములో క్రమముగా పరిశీలనచేసి వ్రాయించి అ

పుస్తకమునకు శ్రీబృహత్ స్తోత్రరత్నాకరమని నామంబిడి లోకోపకారార్థమై ఈసద్గ్రంథమును అచ్చు వేయింప నాజ్ఞాపించినందుననే దీనినిఁ బ్రచురింపఁబూనితి.

ఈగ్రంథములోని స్తోత్రంబులు అనేక వృత్తజాతుల వలన యుక్తంబులై నవిగాన గాయకులకు సహా సంతోషప్రదంబులై హృదయానందకరంబులుగనుండును. ఇందులో మంగళాదివినాయకస్తోత్రములు (౫) శివస్తోత్రములు (౬౮) విష్ణుస్తోత్రములు (౭౦) శ్రీరామస్తోత్రములు (౨౮) గంగాది తీర్థస్తోత్రములు (౨౦) మహాలక్ష్మ్యాది దేవీస్తోత్రములు (౨౭) నవగ్రహస్తోత్రములు (౩౯) వేదాంత స్తోత్రములు (౧౧) మొత్తము (౨౬౮) స్తోత్రములుగలవు. ఇది ౫౬౦ పుటలుగలిగి ౫౦ పౌనులు దళసరి గ్లేజ్ కాగితములపై (అనగా ఈనోటీసు వేసియుండు కాగితములవంటి కాగితములపై) అతిసుందరమైన తెనుగక్షరములతో నచ్చువేయింపబడి మిక్కిలి రమ్యంబగు బైండుతోకూడి సమస్తసద్భక్తులకు లభ్యంబగునటుల సులభక్రయమునకు విక్రయించబడును. ప్రతి ౧-కి ర్పూ. ౧-౮-౦ కు ఇయ్యబడును. వ్యాల్యూపేయబిల్ చార్జి ౫ అణాలు అగును ౫-౬ ప్రతులు ఒక్కసారిగా రప్పించుకొనువారికి ప్రతి ఒకటికి రెండున్నరఅణా పోస్టేజి లాభమగును.

ప్రపంచములో అన్నిజన్మములకంటె మిక్కిలిశ్రేష్ఠమైన మనుష్యజన్మంబును మనకు కృపజేసిన భగవంతునిని ఈజన్మములో స్తోత్రంబులచే బ్రార్థించి అత్యుత్తమమైన సద్గతినిఁ బొందగోరు సత్పురుషులందరును ఈగ్రంథమును తెప్పించికొని కృతార్థులు కావలెనని ప్రార్థించుచున్నాఁడను.

---:o:---

## శ్రీ బృ హ త్ స్తో త్ర ర త్నా క ర ము.

# రెం డ వ భా గ ము.

మొదటిభాగమునకంటే సుమారు ౧౦౦ పేజీలు అధికముగా నుండును. మంచికాగితములు. బైండు దీనికంటె అందముగా నుండును. (మొదటిభాగములోనుండు స్తోత్రములలో నొకటి కూడ ఇందులోనుండదు) అందులోలేని అపూర్వమైన శ్రీమహావిష్ణుస్తోత్రములు (౨౮) శ్రీమద్దశావతార స్తోత్రములు (౮౫) శ్రీరామస్తోత్రములు (౮) శ్రీమదాంజనేయస్తోత్రములు (౧౦) శ్రీగణేశ స్తోత్రములు (౯) శ్రీశివస్తోత్రములు (౫౬) శ్రీమహాలక్ష్మీస్తోత్రములు (౧౩) అంబా స్తోత్రములు (౧౬) మొత్తము (౧౮౬) స్తోత్రములుండును దీనివెల ౧-కి ౧-౧౨-౦. వి. పి పోస్టేజి ప్రతి ౧-కి ౦-౬-౦ అగును; రెండుప్రతులుకు పైబడి మూడు ప్రతులు తెప్పించుకొనువార్లకు సగము టపాలు సెలవులు మేమే వహించెదము.

౧౨-ప్రతులు ఒకటేసారిగా తెప్పించుకొనువారికి ౧ ప్రతి లాభముగా నివ్వఁబడును.

ఇట్లు సకలసజ్జన విధేయుఁడను,
రత్నపసి. ఎమ్. జి. సుబ్రాయశాస్త్రి,
౩౯౭ టంకసాలవీథి, మద్రాసు.

శ్రీరామాయనమః.

శ్రీమహాగణపతయేనమః— శ్రీపార్వతీ పరమేశ్వరాభ్యాం నమః.

# శ్రీమదానందరామాయణే

## జన్మకాండః ప్రారభ్యతే.

శ్రీరామదాస ఉవాచ—అథరామస్సీతయా స సాకేతే బంధుభిశ్చిరం। క్రీడాంచకారవివిధాం దుర్లభాం త్రిదశైరపి ॥౧॥ ఏకదారఘువీరస్తు సోఽంతర్వత్నీం విదేహజాం। జ్ఞాత్వాధాత్రీముఖాత్తుష్టో దదౌదానాన్యనేకశః ॥౨॥ బ్రాహ్మణాన్ భోజయామాస కోటిశః ప్రత్యహంముదా। చకారనానాలంకారా న్నవీనాన్రత్ననిర్మితాన్ ॥౩॥ సీతాయైదివ్యవాసాంసి హేమతంతూద్భవానిచ। హరితాన్యథపీతాని రక్తానిచిత్రితాన్యపి ॥౪॥ కారయిత్వా ధనుశ్శతైర్జనైస్సూక్ష్మాణిరాఘవః। విస్తృతాన్యతిదీర్ఘాణి పుష్పవత్సులఘూన్యపి ॥౫॥ మహార్ఘ్యాణ్యతిరమ్యాణి దదౌతస్యై ముదాన్వితః। అథమాసేద్వితీయేహ్ని రామోద్విజవరైస్సహ ॥౬॥ వసిష్ఠేనపుంసవనంవిధానంవిధిపూర్వకం। సచకారోత్సవైర్దివ్యై స్సీతాయాఃపరమాదరాత్ ॥౭॥ సుమేధాంజనకంచాపి సమాహూయసవిస్త

## శ్రీరాముండు సీతాదేవి గర్భిణియని తెలిసి పుంసవనమహోత్సవముచేయుట.

శ్రీరామదాసుఁ డిట్లుచెప్పుచున్నాడు. అనంతరము శ్రీరాముండు దేవతలకుకూడ దుర్లభంబులయిన వివిధక్రీడలను సీతాలక్ష్మణ భరతశత్రుఘ్నులతోడ నయోధ్యలో నొనర్చుచుండెను. ఒకప్పుడు సీతమ్మ గర్భిణియనుసంగతిని దాదులముఖమునుండివిని సంతుష్టుఁడై యనేకదానంబులనొసంగెను. ప్రతినిత్యము కోట్లకొలదిబ్రాహ్మణులకు సంతర్పణఁజేయించుచువచ్చెను. సీతాదేవికొఱకు క్రొత్తక్రొత్త యలంకారములను చేయించెను. నేర్పరులగు నేతగాండ్రచే వివిధవర్ణంబులును విచిత్రరచనాయుక్తంబులును మిక్కిలి సూక్ష్మంబులును పుష్పములవలె తేలికయైయుండునట్టి బంగారు సరిగెవస్త్రములను చేయించి సతికినిచ్చెను. అంత [illegible]వనెలలో నొకమంచిపగటిలో శ్రీరాముండు వసిష్ఠాదిబ్రాహ్మణోత్తములతోడ విధివిధానంబుగా సీతమ్మకు పుంసవనకర్మను సాదరంబుగా మహోత్సవంబుననొనర్చెను. అందుకైసుమేధాజనకులను పిలిపించెను. జనకరాజు తనకూతురు గర్భిణియని తెలిసి పరమానందభరితుఁడైచూచి పుంసవనోత్సవ

రం । జనకఃపరమస్తుష్ట స్సోంతర్వత్నీంనిజాంసుతాం ॥ ౮ ॥ దృష్ట్వాపుంసవనోత్సాహే సీతారామౌప్రపూజయత్ । నానాలంకారవాసాంసి హేమతంతూద్భవానిచ ॥ ౯ ॥ హరితాన్యథపీతాని సూక్ష్మాణ్యపిలఘూనిచ । విస్తీర్ణాన్యథదీర్ఘాణి సీతాయైసదదౌముదా ॥ ౧౦ ॥ హస్త్యశ్వరథతురగాన్ దాసీదాసాన్మనోరమాన్ । శిబికాశ్చాపివాసాంసి దదౌరామాయసాదరం ॥ ౧౧ ॥ ఏవంసంపూజ్యశ్రీరామం సీతాంచజనకఃస్త్రియా । సంమానితోరాఘవేణ యయౌస్వాంమిథిలాంపురీం ॥ ౧౨ ॥ అథరామస్సీతయాస రేమేసంతుష్టమానసః । గర్భాతిభారాక్రాంతాసా సీతాసన్యస్తభూషణా ॥ ౧౩ ॥ పాండువర్ణాననాదీనా కృశాపివిరరాజభౌ । ఏకదారాఘవంధాత్ర్యా సూచయామాసజానకీ ॥ ౧౪ ॥ మమేచ్ఛాఽఽరామమధ్యేద్య రంతుమస్తిత్వయాసహ । తథోపవనమధ్యేపి సాకేతనగరాద్బహిః ॥ ౧౫ ॥ తద్ధాత్ర్యాప్యాత్ప్రియావాక్యం శ్రుత్వాచాహూయలక్ష్మణం । రామోబ్రవీచ్ఛుభాం వాచం మధురాంస్మితపూర్వకం ॥ ౧౬ ॥ హేసౌమిత్రేద్యసీతాయా జాతాఽఽరామస్పృహాస్తిహి । మయారంతుంతతస్త్వంహి సూచితోసిమయాధునా ॥ ౧౭ ॥ తథేతిరామవాక్యంసోఽప్యంగీకృత్యలక్ష్మణః । గత్వాసభాయామాహూయ త్వరయామాససేవకాన్ ॥ ౧౮ ॥ చిత్రోష్ణీషాన్వేత్రపాణీన్ ప్రాహవాక్యంస్మితాననః । కథనీయంహట్టమధ్యే హ్యారామంయాతిజానకీ ॥ ౧౯ ॥ రాఘవేణతతోయూయం వణిజస్త్వరయంత్వితి । తతస్సౌమిత్రి

సమయంబున శ్రీసీతారాములను పూజించెను. సీతమ్మకు మనోహరంబులగు దివ్యదుకూలంబులను శ్రీరాములవారికి రథగజతురగపదాతులను దాసీదాసవర్గంబులను వస్త్రంబులను సాదరముగా సమర్పించెను. ఇట్లు జనకుండు శ్రీసీతారాములను పూజించి శ్రీరామునిచే సమ్మానింపఁబడి నిజసతితోడ మిథిలాపురికి వెడలెను. అంత రాముఁడు సంతుష్టాంతరంగుండై సీతతోడ క్రీడించుచుండెను. గర్భభారాక్రాంతయును విగతభూషణయును పాండువర్ణాననయును కృశయును దీనయునైయున్నను జానకమ్మమిక్కిలి ప్రకాశించెను. ఒకప్పుడామెదాదిచే శ్రీరామునికి "అయోధ్యకావల నారామంబులలో నుపవనంబులలో నేను నీతోడ క్రీడింపవలయు" నని తన కోర్కెను సూచించెను. దాదిచెప్పిన ప్రేయసీ వచనమును విని శ్రీరాముండు లక్ష్మణునిఁబిలచి "తమ్ముఁడా! నీవదినె నాతోడ నారామక్రీడాకౌతుకము నపేక్షించినది. అందుకై నీకుసూచనచేసితిని" అనిన నతండు నన్నగారివాక్యమున నట్లేయని యానందించుచువచ్చి సభలో వేత్రపాణులును చిత్రోష్ణీషులు నగు సేవకులకు "శ్రీసీతారాములు ఆరామోత్సవమునకు వెడలుచున్నారు. వర్తకులారా మీరందరు త్వరపడండియని అంగడిబజారులలో చాటించవలయును." అని యాజ్ఞాపించెను. అంతవారు నట్లేపోయి అంగడిబజారులలోని చదుకమున వీథిలోనిలచి యూర్ధ్వహస్తులై "ఊరివారును వర్తకులును అందరును తక్కినవారును సంతుష్టులైవినుడు. నేడు సీతా

సీతయొక్క ఆరామక్రీడా మహోత్సవము.

దేవి శ్రీరాములవారితోడ నుద్యానమునకు వచ్చుచున్నారు. రాజాజ్ఞవలన మీరలందరును

వచనాత్ శ్రుత్వాతే వేత్రపాణయః ॥ ౨౦ ॥ చిత్రోక్షీసారుక్తదండా రాజమార్గేచతుష్పథే । మార్గేవీథ్యామూర్ధ్వహస్తా స్తదాప్రోచుర్మహాస్వరైః ॥ ౨౧ ॥ పౌరాశ్చవణిజస్సర్వే తథాన్యేవ్యవసాయినః । శృణ్వంతువ్యాపృతహృదయా సీతోద్యానంప్రగచ్ఛతి ॥ ౨౨ ॥ రాఘవేణాభ్యనుజ్ఞాతై ర్భవద్భిర్గమ్యతాంపురః । ఏవంసర్వాన్నివేద్యార్థ జగ్ముస్తేలక్ష్మణంచరాః ॥ ౨౩ ॥ దూతానాజ్ఞాపయామాస పునస్సౌమిత్రిరాదరాత్ । వాసోగేహానిచిత్రాణి హర్మ్యారామేషుసమంతతః ॥ ౨౪ ॥ కల్పనీయానివేగేన శోధనీయాభువశ్శుభాః । జలయంత్రాణిసర్వాణి శోధనీయానిసాదరం ॥ ౨౫ ॥ నానామాంగల్యవస్తూని సుగంధీనివహాంతిచ । స్థాపనీయానివైతత్ర వస్త్రాణ్యతిఘూనిచ ॥ ౨౬ ॥ ఏవమాదీన్యనేకాని కల్పనీయానిసాదరం । శృంగారణీయాః ప్రాసాదాస్సర్వేహ్యారామసంభవాః ॥ ౨౭ ॥ దివ్యవస్త్రైస్తోరణాద్యై ర్ముక్తాగుచ్ఛైర్విరాజితాః । తథేతిదూతాస్తేసర్వే తథాచక్రుస్త్వరాన్వితాః ॥ ౨౮ ॥ లక్ష్మణో రాఘవంగత్వా నత్వాతంప్రాహసాదరం । ఉద్యోగసమయోద్యైవ వర్తతేరఘునందన ॥ ౨౯ ॥ కుర్యాంసిద్ధం హికింయానం సీతాయాస్తవవావిభో । తత్సౌమిత్రేర్వచశ్శ్రుత్వా జానకీంరాఘవోబ్రవీత్ ॥ ౩౦ ॥ సీతేయానంవదాద్యత్వం యత్తేమనసివర్తతే । తద్రామవచనంశ్రుత్వా శిబికాంప్రాహజానకీ ॥ ౩౧ ॥ రామోపిరోచయామాస శిబికామేవవైతదా । తత్ శ్రుత్వాలక్ష్మణశ్చాపి శిబికేరత్నభూషితే ॥ ౩౨ ॥ హేమతంతూద్భవైర్వస్త్రై స్సర్వత్ర

మొదటనెడలండి" అని యుచ్చస్వరంబుతో నుచ్చరించి యచ్చటినుండి సౌమిత్రిసన్నిధికివచ్చిరి. పిదప లక్ష్మణుఁడు మరల దూతులకు "శీఘ్రముగా నారామంబులలో నంతట విచిత్రంబులగు పటగృహంబులను పరికల్పింపవలెను. నేలలు మంగళకరంబులుగా పరిశుద్ధంబులుగా నుండద గును. జలయంత్రంబులను చక్కఁదిద్దిపెట్టుఁడు. సమస్తసౌమంగల్యసద్వస్తువులు సద్యస్సిద్ధములు గా నుండవలయును. ఇంక ననేక శృంగారములనుచేయించి పెట్టవలయును. ఉద్యానంబులలోని మేడలన్నియును దివ్యవస్త్రతోరణ ధ్వజాదులచే నలంకరింపఁబడని" అని యాజ్ఞాపించెను. వా రు నట్లేయని సత్వరులై వారివారిపనులలోనుండిరి. లక్ష్మణుఁడు శ్రీరామసన్నిధికివచ్చి నమస్క రించి సాదరముగా "స్వామీ! రఘుకులస్వామీ! ఇప్పుడే ఉద్యానప్రయాణోద్యోగ సమయమైయు న్నది. నీకును వదినెకును ఎట్టివాహనమును సిద్ధపరచునది?" అని యింపుగానడిగెను. అందుకు శ్రీరాముఁడు సీతాదేవినడిగి తనకును ఆమెచెప్పినట్లే రుచించగా "పల్లకీలను సిద్ధపరచునది" యని యనుజ్ఞనిచ్చెను. ఆమాటవిని లక్ష్మణుఁడు బంగారు సరిగెదుప్పట్లాలచే శృంగారింపఁబడి సువర్ణరత్నముక్తాసరసముజ్జ్వలంబై దేదీప్యమానంబుగానుండు రెండు పల్లకులను తెప్పించెను. శ్రీరాముఁడు సంతసముతో నాపల్లకినెక్కెను. అంతనాపాండురాంగియగు జానకీదేవి తగుబాటి భూషణంబులుగలదియై దాసీలిచ్చుచుండు హస్తలాఘవంబులతోడ తిన్నగావచ్చి పల్లకినెక్కి ఒఱగుదిండునానుకొని తొడదిండ్లనందుకొని దాసీజనులు సేవించుచుండఁగా పల్లకిలోని ము క్తాజాలవిరాజిత సువర్ణరత్నగుచ్ఛంబును నిజకరకమలముచే బట్టికొని ముత్తెములచే నేర్పరచి

వేష్టితే శుభే । ఆనయామాస దూతైస్సా ముక్తాజాలవిరాజితే ॥ ౩౩ ॥ ఆరురోహాథ శ్రీరామః శిబికాం పరయా ముదా । తతస్సీతా పాండురాంగీ పరిమేయవిభూషణా ॥ ౩౪ ॥ కృశాంగయష్టిర్దాసీభిర్దత్తహస్తా యయౌ శనైః । శిబికామారురోహాథ వృత్తాలగ్నోపబర్హణా ॥ ౩౫ ॥ దాసీభిర్వీజితా చాపి ధృతాఘ్రోణోపబర్హణా । దధార శిబికాగుచ్ఛం హేమతంతువినిర్మితం ॥ ౩౬ ॥ విగుంఫితం చ ముక్తాభిస్సీతా స్వీయకరేణ తం । ముక్తాజాలగవాక్షైశ్చ పశ్యంతీ పౌరహర్మ్యకాః ॥ ౩౭ ॥ రాజమార్గగతాన్యేన కౌతుకాని సమంతతః । దదర్శ నృత్తం వేశ్యానాం సఖీభిః పరితో వృతా ॥ ౩౮ ॥ తతస్తే బంధవస్సర్వే బంధుపత్న్యశ్చ మాతరః । శిబికాసూపసంవిష్టా దివ్యాసు చ పృథక్ పృథక్ ॥ ౩౯ ॥ అగ్రే తే భ్రాతరస్సర్వే తతస్సర్వాశ్చ మాతరః । సీతాద్యా బంధుపత్న్యశ్చ సర్వేషాం పురతో గురుః ॥ ౪౦ ॥ ఏవం తే ప్రయయుస్సర్వే పశ్యంతో రాఘవం ముహుః । ననృతుర్వారనార్యశ్చ నేదుర్వాద్యాన్యనేకశః ॥ ౪౧ ॥ తుష్టువుర్బందినస్సర్వే సీతాం చ రఘునాయకం । ఏవం నానాసముత్సాహై రారామం సముయయౌ ముదా ॥ ౪౨ ॥ రాఘవస్సీతయా యుక్తస్సైన్యైస్సర్వత్ర వేష్టితః । వివేశ వాసోగేహం స ససీతో రఘునందనః ॥ ౪౩ ॥ వాసోగేహేషు సర్వే తే తస్థుః పౌరాస్సమంతతః । హట్టాస్సమంతతశ్చాసన్ననృతుర్వారయోషితః ॥ ౪౪ ॥ వాసోగేహస్య సీతాయా భిత్తయో వస్త్రనిర్మితాః । పంచక్రోశమితాయామాశ్చాసన్ విస్తారతోఽపి చ ॥ ౪౫ ॥ పంచక్రోశమితాశ్చాసన్ తత్ర కే.

యుండు గవాక్షంబులనుండి రాజమార్గంబులలోని వేడుకలనడుగడుగునను చూచుచు నడుమ నడుమ నర్తనంబుల నాలోకించుచుండెను. అట్లే లక్ష్మణాది రామానుజులు నిజపత్నులతోడ పల్లకీలనెక్కి సవిభవంబుగా మొదటవెడలిరి. వారివెనుక తల్లులువెడలిరి. అందరికిముందర వసిష్ఠులవారువచ్చుచుండిరి. ఇట్లు వారందరును శ్రీరాముని దర్శించుచు వచ్చుచుండిరి. వారకాంతలు నాట్యమాడుచుండిరి. వాద్యంబులు మ్రోగుచుండినవి. వందిమాగధులు శ్రీసీతారాములను పొగడుచుండిరి. ఇట్లు వివిధవినోదంబులను పఠికించుచు శ్రీరాముఁడు సైన్యంబులుచుట్టు బారివచ్చుచుండగా నాదివ్యారామంబును ప్రవేశించి సీతమ్మతోడ నొకరాజార్హ దివ్య వస్త్ర మందిరంబును ప్రవేశించెను. ఆపౌరులందరును అంతట పటగృహంబులలో నిలిచిరి. ఎచ్చట చూచినను తోటలో నంగడి బజారులు నిండియుండెను. వేశ్యానర్తనంబులు జరుగుచుండెను. సీతయొక్క వసనమందిరంబు, విచిత్రవస్త్ర చిత్రితంబులగు గోడలచే నొప్పుచుండెను. ఐదు కోసులు నిడుపును ఐదుకోసులు వెడల్పునుగల తోటలో సీత విహరించుచు రాజసౌఖ్య ప్రదంబై రాజించుచుండు దివ్యారామము నవలోకించెను. ఆవనంబెట్టిదనిన, రసాలంబులనగా మామిడిచెట్లచే, రసమునకాలయంబు. అశోకవృక్షంబులచే శోకనివారకంబు. తాటి త్రానుగు గిరుకతాడి పపెచెట్లచే వ్యాపించినది. పోకచెట్లు లోకోత్తరంబులు. బిల్వవృక్షంబులచే చెల్వమయినది. అగరుచెట్లచే వనశ్రీకి పొగరెక్కును. వెలగచెట్లలో కపిశిశువులు వెలయుచుండును. వనశ్రీ స్తనంబులంబోలి గజనిమ్మపండ్లు ఘనంబులై యుండు. అమృతఫలంబులుగల యర

మేవిదేహజా । ఉదకశాలాజానకీసద్మ గారామంన్నృపసౌఖ్యదం ॥ ౪౬ ॥ రసాలయంరసాలైస్తైరశోకైశ్శోకవారణం । తాలైస్తమాలైర్హింతాలైః స్థాలైస్సర్వత్రశాలితం ॥ ౪౭ ॥ ఖపురైఃఖపురాకారం శ్రీఫలైశ్శ్రీప్రపలంబిల । గురుశ్రియంత్వగురుభిః కపిపింగం పిశంగకైః ॥ ౪౮ ॥ వనశ్రియఃకుచాకారై ర్లకుచైశ్చమనోరమం। సుధాఫలసమారంభై రంభాభిఃపరిభాసితం ॥ ౪౯ ॥ సురంగైశ్చాపినారంగై రంగమంటపవచ్ఛ్రియః । వాసితైశ్చాపిజంబీరై ర్బీజపూరైః ప్రపూరితం॥ ౫౦ ॥ మందాందోళితకర్పూర కదలీదలసంజ్ఞయా । విశ్రామాయ శ్రమాపన్నా నాహ్వయంతమివాధ్వగాన్ ॥ ౫౧ ॥ పున్నాగఇవపున్నాగ పల్లవైఃకరపల్లవైః । కలయంతమివామోదై ర్మల్లికాస్తబకస్తనం ॥ ౫౨ ॥ విదీర్ణదాడిమైస్స్వాంతం దశయంతంసురాగవత్। మాధవీనవరూపేణ శ్లిష్యంతమివసర్వతః ॥ ౫౩ ॥ ఉదుంబరైరంబరగై రసంతతఫలాలభిః । బ్రహ్మాండకోటిబిభ్రంత మనంతమివసర్వతః ॥ ౫౪ ॥ పనసైర్వనవాసాభిః శుకనాసైఃపలాశకైః । పలాశనాద్విరహిణాం పత్రత్యక్తైరివావృతం ॥ ౫౫ ॥ కదంబవాదినోనీపా న్స్పష్టాన్కంటకితైరివ । సమంతతోభ్రాజమానం కదంబకకదంబకైః ॥ ౫౬ ॥ న మేరుభిశ్చ మేరోశ్చ శిఖరైరివరాజితం । రాజాదనైశ్చమదనైస్సదనైరివకామినాం ॥ ౫౭ ॥ సమంతతఃపటువటైరుచ్చైఃపటకుటీకృతం। కుటజస్తబకైర్భాతి మధిష్ఠితబకైరివ ॥ ౫౮ ॥ కరమర్దైఃకరీరైశ్చ కరుణైశ్చకదంబకైః । సహస్రకరవద్భాతి మర్థిప్రత్యర్థితైఃకరైః ॥ ౫౯ ॥ నీరాజితమివో

టిచెట్లును, సురంగనారంగంబుల రంగమంటపంబులును, అబ్బురంబుగు ప్రబ్బచెట్లును, మాన్యంబులగు మాతులుంగంబులును, శ్రమార్తులను విశ్రమించుటకై పిలుచున్నట్లుండు దళచలనము గల కర్పూరకదళికలును, కరపల్లవాందోళనముగల పున్నాగంబులంబోలు సపల్లవపున్నాగ వృక్షంబులును, రాగాస్యంబులను చూపుచున్నవన్నట్లు విరిసినపండ్లచే నిండియుండు దానిమ్మచెట్లును, నిమ్మచెట్లును, వసంతమల్లికలచే నల్లుకొనబడి మేఘముల నందుకొనుచుండు మేడిచెట్లును, వననాసాభంబులగుపనసచెట్లును, చిలుకముక్కువంటి పూలుగల్గిన విరహుల పలాశనమున పత్రహీనంబులయిన పలాశవృక్షంబులును, కదంబనామము నందిన కడిమిచెట్లనుచూచి కంటకితంబులగు కడపచెట్లును, మేరుశిఖరంబులవంటి నమేరువృక్షంబులును, ప్రియాశ్రయంబులగు ప్రియాళు వృక్షంబులును, కామిసదనంబులయిన మదనవృక్షంబులును, పటకుటీకృత పటువృక్షంబులును, బకాధిష్ఠితంబులవలెనుండు స్తబకంబులుగల కొండమల్లెలును, కలివెచెట్లును, వెణుతురుచెట్లును, క్రానుగుచెట్లును, సహస్రకరంబులచే నర్థిజనులను ప్రత్యర్థించుచుండు కోరకంబులచే నిండినరాజచంపక వృక్షంబులును, కమలాకరంబులంబోలు కుసుమిత శాల్మలీవృక్షంబులును, రాత్రులవరుసయనఁ బత్రపాత్రంబులయిన తమాలవృక్షంబులును, కాంతియుక్త కాంచన కేతకీవృక్షంబులును, సంగతంబులగు గంగరేగుచెట్లును, చందన రక్తచందన తిందుక బంధుజీవక పుత్రజీవక వృక్షంబులును, సారంబులగు గారచెట్లును, కరుణాలయంబన తరుణ జంబీరంబులును, నిజకరశాఖాగత ముక్తాకుసుమంబులచే ధరారూపధరుండగు హరునర్చించు నట్లొప్పు

ద్ధిపై రాజసంపకకోరకైః। సపుష్పశాల్మలీభిశ్చ జితపద్మాకరశ్రియం ॥౬౦॥ క్వచిచ్చలదలైరుచ్చైః క్వచిత్కాంచనకేతకైః। కృతమాలైర్నక్తమాలైః శోభమానం క్వచిత్క్వచిత్ ॥౬౧॥ కరంధుబంధుజీవైశ్చ పుత్రజీవైర్విరాజితం। పరిందుకేంగుదీభిశ్చ కరుణైః కరుణాలయం ॥౬౨॥ గలన్మధూకకుసుమైర్ధరాం యావద్వరం వారం। స్వహస్తముక్తముక్తాభిరర్చయంతమివానిశం ॥౬౩॥ సతాలహింతాలఖర్జూరైర్వ్యజనైర్వీజ్యమానవత్। నారికేళైస్సఖర్జూరైర్ధృతచ్ఛత్రమివాంబరే ॥౬౪॥ అమందైరపి మందైశ్చ మందారైః కోవిదారకైః। పాటలాంతింతిణీంఘోటాం శాఖోటైః కరహాటకైః ॥౬౫॥ ఉద్దండైశ్చాపి శేహుండైర్గండపుష్పైర్విరాజితం। వకులైస్తిలకైశ్చైవ తిలకాంకితమస్తకం ॥౬౬॥ అక్షైః ప్లక్షైస్సల్లకీభిర్దేవదారుహరిద్రుమైః। సదాఫలసదాపుష్పవృక్షవల్లీవిరాజితం ॥౬౭॥ ఏలాలవంగమరిచకులంజనవనావృతం। జంబ్వామ్రమాతకఫల్లాతకేలుశ్లేష్మాంతకాదిభిః ॥౬౮॥ శాకశ్చ ఖదిరైరమ్యం చందనైరక్తచందనైః। హరీతకీకణీకారధాత్రీవనవిభూషితం ॥౬౯॥ ద్రాక్షావల్లీనాగవల్లీకదళీవల్లికావృతం। మల్లికాయూథికాకుంద మదయంతీసుగంధితం ॥౭౦॥ తులసీవృక్షఖండైశ్చ అగ్రస్థితైర్ద్రుమైర్యుతం। ధ్రివవృక్షమరమాలాభిర్మాలతీభిరలంకృతం ॥౭౧॥ అలిచ్ఛలాగతంకృష్ణం గోపీరంతుమనేకశః। సుగంధవాతంసుఖదం కామసంజనకం పరం ॥౭౨॥ నానామృగగణాకీర్ణం నానాపక్షినినాదితం। నానాసరిత్సరస్స్రోతైః పల్వలైః పరిశోభితం ॥౭౩॥ ఉత్సృజంతమివాధారం వైపతత్పుష్పైరితస్తతః। కేకికేకారవైర్దూరాదాగతం స్వాగతం కిల ॥౭౪॥ ఏతాదృశం చోపవనం జానకీ తం దదర్శ సా। తుష్టాఽభూద్దర్శనాన్నైవ విచచారతత్ర సా ॥౭౫॥ ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గత శ్రీమదానందరామాయణే వాల్మీకీయే జన్మకాండే ప్రథమస్సర్గః॥౧॥

నట్టి యిప్పచెట్లును, గగనచ్ఛత్రంబులవంటి ఖర్జూరవృక్షంబులును, వ్యజనంబులచే వీచుచుండునట్టివయిన నారికేలవృక్షంబులును, మద్దిచెట్లు వేగిస కరక నెల్లి వేప చింత నేరేడు మామిడి జీడి నల్లతుమ్మికిచెట్లును, పారిజాత వృక్షంబులును, దేవకాంచన వృక్షంబులును, ఘోట కరహాట పాటలవృక్షంబులును, ఉద్దండ శేహుండంబులును, అక్షప్లక్షంబులును, తిలకవకులంబులును, ఉల్లసత్సల్లకీవృక్షంబులును, ఇట్లేసదాఫలసదాపుష్ప సముదయంబులయిన సద్వృక్షసమూహంబులు గల్గి రారాజించుచుండును. ఏలాలవంగమరిచ జాజీపూగంబులచె పరిమళించుచుండును. మఱియునా యారామంబు తులసీవన పరిశుద్ధంబు. ద్రాక్షాలతలు పిప్పలీలతలు మల్లికాలతలు నాగవల్లీలతలు పెద్దగోరంటలు నిండి ఘుమఘుమ లాడుచుండును. గోపీవృక్షంబులనబడు నల్లసుగంధ పాలచెట్లలో నల్లనితుమ్మెద లాడుచుండ కృష్ణక్రీడ ననుకరించినట్లుండును. వివిధవృక్షంబులును వివిధపక్షులును వివిధసరస్సులును, విలాసప్రదంబులై యుండును. అంతట పడియకుంటలు పరితోషావహంబులు. ఇటటు పూలురాలియున్న నవి భూరి దక్షిణలను పాఱజల్లినట్లుండును. నెమళ్లు కేకలు వేయుచుండిన నవి దూరమునుండి వచ్చువారికి స్వాగతంబులఁ బలుకునట్లుండును. ఇట్టి దివ్యారామంబును నిరీక్షించుచునె పరితుష్టయగు జానకీదేవి యిటటు సంచరించుచు సంతోషించుచుండెను॥ ... ... ... ౧॥

శ్రీరామదాస ఉవాచ—అథ సీతా రాఘవేణ రమ్యోపవనభూమిషు । క్రీడాశ్చకార వివిధా స్త్రిదశైరపి సంస్తుతాః ॥ ౧ ॥ కదా వనాంతః ప్రాసాదే కదా వస్త్రగృహేష్వపి । కదా త్వమ్రవృక్షచ్ఛాయాయాం కదా పుష్పవనేషు సా ॥ ౨ ॥ కదా సా జలయంత్రాణాం సమీపస్థవరాసనే । కదా సరోవరతటే కదా నద్యాస్తటేపి చ ॥ ౩ ॥ నౌకాస్థా సరయూతోయే సా రామేణాఽకరోత్కదా । కదా రాత్రౌ జలక్రీడాం సా దివాపి కదా ముదా ॥ ౪ ॥ కదా తటాకే నౌకాస్థా కదా రంభావనేషు సా । కదా వృక్షోర్ధ్వగేహేషు కదా శిరగృహేష్వపి ॥ ౫ ॥ కదా సా సరయూనద్యాం నిర్మితేషు గృహేషు సా । కదా కృత్రిమగేహేషు పుష్పగేహేషు వా కదా ॥ ౬ ॥ కదా సా చిత్రశాలాయాం పుష్పకే వా కదా ముదా । కదా సా కేతకీఖండే కదైవ స్తంభసద్మని ॥ ౭ ॥ కదా నౌకోర్ధ్వగేహస్థా సరయ్వాస్సైకతే కదా । ఏకస్తంభోర్ధ్వగేహేపి సఖీభిః పరివేష్టితా ॥ ౮ ॥ కదా రామేణ రహసి కదాందోళికసంస్థితా । పర్యంకచక్రమధ్యస్థా కదా సా దాడిమీవనే ॥ ౯ ॥ వృక్షసంబద్ధపర్యంకసంస్థితా రాఘవేణ హి । చకార సా కదా క్రీడాం పాండురాంగీ పృథూదరీ ॥ ౧౦ ॥ హారిద్వస్త్రయుతా రక్తకంచుకా జానకీ బభౌ । గోపయిత్వా నిజం దేహం తదా వృక్షదళైర్ఘనైః ॥ ౧౧ ॥ చకార వ్యాకులం రామం వినోదేన స్మితాననా । జ్ఞాత్వాత్మానం రాఘవేణ దృష్ట్వా సమ్యగ్విచిత్య చ ॥ ౧౨ ॥ దు

## సీతాదేవియొక్క దోహద క్రీడావర్ణనము.

సమనంతరంబున జానకీదేవి శ్రీరామునితోడ దేవతలచే సంస్తుతంబులయిన క్రీడలను అనుభవించుచుండెను. ఒకప్పుడు తోటలోనుప్పరిగమీఁదను, ఒకప్పుడు పటగృహంబునను, ఒకప్పుడు మామిడిచెట్టుక్రిందను, ఒకప్పుడు పూలతోఁటలలోను, ఒకప్పుడు జలయంత్రంబులవద్ది దివ్యపీఠములమీఁదను, ఒకప్పుడు కొలనిగట్టునను, ఒకప్పుడు నదీతీరమందును, ఒకప్పుడు సరయువులోనినావమీఁదను, శ్రీరామునితోడ క్రీడించుచుండె. ఒకప్పుడు రాత్రిజలక్రీడను, ఒకప్పుడు పగటిజలక్రీడను, చేయును. ఒకప్పుడు చెఱువులోనిపడవమీఁదను, ఒకప్పుడు అరటితోటలలోను, ఒకప్పుడు వృక్షాగ్రమందిరంబునను, ఒకప్పుడు వట్టివేరు మేడలోను, ఒకప్పుడు సరయూనదిలో నిర్మించిన గృహములలోను, ఒకప్పుడు కృత్రిమగృహములలోను, ఒకప్పుడు పూలయిండ్లలోను, ఒకప్పుడు చిత్రశాలలలోను, ఒకప్పుడు పుష్పకవిమానంబునను. ఒకప్పుడు మొగలిరేకులమందిరమునను, ఒకప్పుడు స్తంభగృహమునను, ఒకప్పుడు నావమీఁదిమేడలోను, ఒకప్పుడు సరయూనదియొక్క యిసుకదిబ్బలమీఁదను, ఒకప్పుడు సఖులతోడ నొంటికంబపుమేడమీఁదను, ఒకప్పుడు రహస్యముగా శ్రీరామునితోడ సందళముమీఁదను, ఒకప్పుడు దానిమ్మతోఁటలోని పర్యంకచక్రమధ్యంబునను, ఒకప్పుడు తరునిబద్ధపర్యంకంబునను, ఇట్లు వివిధస్థలంబులలో పాండురాంగియును పృథూదరియునగు జానకమ్మ యథాసుఖముగా క్రీడించుచుండెను. సీతమ్మ పసుపుచీరెను ఎఱ్ఱరవికెను తొడిగి ప్రకాశించుచుండెను. ఒకప్పుడు సీతాదేవి నిబిడ తరుపల్లవంబులచే నాచ్ఛాదితయై మరుగుననుండి నవ్వుచు శ్రీరామునిని వ్యాకులపరచును. తన్ను

ద్రావసంస్థితమాద్రామం తత్కంఠే దోర్లతేకరోత్ । ఏవం సీతారాఘవయోః క్రీడనం పరమాద్భుతం ॥ ౧౩ ॥ విస్తారేణ నహి వక్తుం సమర్థాః పృథివీతలే । ఏక ఏవ సమర్థోఽభూద్వాల్మీకిర్మునిసత్తమః ॥ ౧౪ ॥ శతకోటిమితం యేన పఠితం చరితం తయోః । సారం సారం మయా తస్మాద్విచ్యత్య ప్రవర్ణ్యతే ॥ ౧౫ ॥ వారస్త్రీణాం కదా నృత్యం సీతాఽరామే దదర్శ సా । కదా శుశ్రావ వాద్యాని మంజులాని మహాంతి చ ॥ ౧౬ ॥ కదా చిత్రైః ఖారమ్యా శ్చేంద్రజాలాని వీక్ష వా । కదా వంశారోహణాది కౌతుకాని దదర్శ సా ॥ ౧౭ ॥ కదా స్తంభోద్భవం దివ్యం దదర్శ కౌతుకం ముహుః । కదా కలానాం కౌశల్యం సూత్రబంధైర్వినిర్మితం ॥ ౧౮ ॥ కదా కృత్రిమమత్స్యాని నానారూపాణి వై పతేః । సీతా దదర్శ కుశలై ర్ధృతాన్యాత్మీయ తాన్యపి ॥ ౧౯ ॥ ఏవం సీతాఽరామమధ్యే మాసమేకం నినాయ సా । యయౌ రామేణ నగరీం నృత్యగీతాదిభిశ్చ తైః ॥ ౨౦ ॥ సౌధస్థాభిః పురస్త్రీభిర్వర్షితా కుసుమాదిభిః । నీరాజితా కుంభదీపైర్దీపైః స్వర్ణదధ్యోదనోద్భవైః ॥ ౨౧ ॥ మాషతైలసర్షపాద్యైశ్చ నానాబలిభిరాదరాత్ । యయౌ స్వగృహం సీతా రాఘవేణ సమన్వితా ॥ ౨౨ ॥ ఏవం నానాకౌతుకైశ్చ నానాదోహదపూరణైః । రామస్తాం రంజయామాస సాపి రామం స్వలీలయా ॥ ౨౩ ॥ షష్ఠే మాసేత్వథ ప్రాప్తే సీతాయా రాఘవో ముదా । సీమంతోన్నయనం విప్రై ర్వసిష్ఠేన చ కా

శ్రీరాముఁడు కనుగొనగానే పరుగెత్తి వచ్చి కంఠాలింగనము నిచ్చుచుండెను. ఇట్లు శ్రీసీతారాములయొక్క దివ్యక్రీడను అభివర్ణించుటకు భూమిలో నెవడు నేర్పరిగా నుండును? శతకోటి రామాయణమును చెప్పిన మునిశ్రేష్ఠుఁడగు వాల్మీకియొక్కఁడే సమర్థుఁడు. దానిలోని సారమైన కొన్ని సంగతులను మాత్రము నేను వివరించుచున్నాను. ఆదివ్యారామంబున సీతాదేవి ఒకప్పుడు వారకాంతల నర్తనమును విలోకించుచుండును. ఒకప్పుడు దివ్యమనోహర మహావాద్యంబున నాలకించుచుండును. ఒకప్పుడు మంజులసత్కథల నాకర్ణించుచుండును. ఒకప్పుడు ఇంద్రజాలమహేంద్రజాలాదిక్రీడను దొంబరాట మొదలయిన ఆటలను చూచుచుండును. ఒకప్పుడు గడమీఁది వినోదమును నిరీక్షించును. ఒకప్పుడు సూత్రములచే కట్టబడిన చేతిపనుల నేర్పరితనమును విలోకించును. ఒకప్పుడు నేర్పరులేర్పరచిన నిజపతియొక్క కృత్రిమ మత్స్యకూర్మాదిసజీవరూపంబులను పరికించును. ఇట్లు జానకమ్మ ఆరామమధ్యమున నొకనెల కడిచినవెనుక శ్రీరామునితోడ నయోధ్యానగరమునకు వెడలి తిన్నగా నృత్తగీతాదివాద్యంబులతోడను ఊరిమేడలమీఁది పురపురంధ్రులు వర్షించెడు పుష్పంబులతోడను దివ్యనీరాజనంబులతోడను కుంభదీప దధ్యన్నాదులగు నివాళికలతోడను తిలసర్షపాది బలిప్రదానంబులతోడను నిజరాజమందిరమునకు వచ్చిచేరెను. ఇట్లు శ్రీరాముఁడు వివిధకౌతుకంబులచే నానాదోహదపూరణంబులచే సీతను రంజింపఁజేసెను. ఆమెయును స్వలీలచే శ్రీరాముని నానందపరచుచుండెను ॥ ౨౩ ॥ పిదప సీతాదేవికి నార

సీతమ్మ యారునెలల గర్భిణియైనపుడు సీమంతము.

వమాసము రాగానే శ్రీరాముఁడు అత్తమామలగు సుమేధాజనకులను సాదరముగా పిలిపిం

రసః ॥ ౨౪ ॥ సుమేధాంజనకంచాపి సమాహూయాదరేణహి । దదౌదానాన్యనేకాని బ్రాహ్మణేభ్యోరఘూత్తమః ॥ ౨౫ ॥ జనకఃపూజయామాస రామంస్త్రీబంధుసంయుతం । కౌసల్యాదీంశ్చసాకేత వాసినోవసనాదిభిః॥ ౨౬ ॥ పౌరాశ్చసుహృదస్సర్వే భోజనార్థంవిదేహజాం । స్వంస్వంగేహంపృథఙ్నిన్యుః శ్రీరామాదిభిరుత్సవైః॥ ౨౭ ॥ నానావాద్యనినాదైశ్చ వారస్త్రీనృత్యగాయనైః । స్త్రీముక్తపుష్పవర్షాభి ర్నానాకౌతుకదర్శనైః ॥ ౨౮ ॥ నానాదేశనివాసిన్యః కోటిశస్తానృపస్త్రియః । సమాజగ్ముస్త్వయోధ్యాయాం సీతాంద్రష్టుంముదాన్వితాః॥ ౨౯ ॥ తాసాంసైన్యైశ్చసర్వత్ర వేష్టితానగరీబభౌ । తాస్సర్వానృపపత్న్యశ్చ సీతాయాఃపరమాంవరాం ॥ ౩౦ ॥ దోహదాస్స్వారయామాసు దివ్యాన్నాదిభిరాదరాత్ । దదుర్వస్త్రాణ్యలంకారాన్ దివ్యాంశ్చిత్రవిచిత్రితాన్ ॥ ౩౧ ॥ స్వస్వదేశోద్భవైర్దివ్యై ర్నానావస్తుభిరాదరాత్ । జానకీంపూజయామాసు స్తాస్సర్వాఃపార్థివస్త్రియః ॥ ౩౨ ॥ స్థిత్వానామాసమేకంతు జగ్ముర్దేశంనిజంనిజం । అథైకదాతుశ్రీరామ స్సుమేధాంజనకంతథా ॥ ౩౩ ॥ సీతాయాఃపురతః ప్రాహ గుహ్యంరహసివృత్తస్థితం । సీతామదృష్ట్వాసాన్నిధ్యే క్షణాచ్చవిరహేణతాం ॥ ౩౪ ॥ మయాగత్వాతన్ముఖేందు సుధయాస్వాస్థ్యమాప్యతే । ఆత్మానంవిహ్వలందృష్ట్వా సీతాసాన్నిధ్యమాశ్రయే ॥ ౩౫ ॥ అధునాజానకీందృష్ట్వా కామోమేతీవబాధతే । పంచమాసోర్ధ్వతిస్సంగం గర్హయంతిమునీశ్వరాః ॥ ౩౬ ॥ ప్రసూత్యగ్రేపం

---

చి బ్రాహ్మణులచే పరివృతుండై వసిష్ఠోక్తవిధానంబున సీమంత కర్మనాచరించెను. విప్రులకు వివిధదానధర్మములనొసంగెను. జనకమహారాజు శ్రీసీతారాములను లక్ష్మణాదులను కౌసల్యాదులను పౌరులనుకూడ వస్త్రపాత్రాదిసత్కారంబులచేపూజించెను. పౌరప్రముఖులును మిత్రులును తమతమయిండ్లకు సీతమ్మను శ్రీరామాదులతోడ వెవ్వేరుగా భోజనమునకు సమస్తవిభవంబులతోడ గొనిపోయి సత్కరించి పంపుచువచ్చిరి. నానాదేశములనుండి రాజస్త్రీలు సంతోషయుక్తలై సీతాదేవినిచూచుటకు నయోధ్యకేతెంచిరి. వారలయొక్క సైన్యములనుండి నిండిననగరంబు మనోహరంబుగానుండెను. ఆరాజస్త్రీలందరును సీతమ్మను దివ్యాన్నాదిసత్కారంబులచే తమతమదేశంబులలోని దివ్యవస్తువులచే వస్త్రాభరణాలంకారంబులచేతను సత్కరించి వేవిళ్లనుపూర్తిజేయుచుండిరి. ఇట్లు వారందరును ఒకనెల వాసముచేసి సీతను సేవించి తమదేశములకుంజనిరి ॥౩౩॥ తరువాత నొకనాడు శ్రీరాముండు సీతయెదుట సుమేధాజనకులతో

సుమేధాజనకులకు శ్రీరాముండు రహస్యకర్తవ్యమును చెప్పుట.

డ "క్షణకాలమైనను సీతను నాసన్నిధానమున చూడకయుండలేను. వెంటనేవచ్చి యామె మోముచంద్రుని యమృతమువలన సుస్థితుండగుచుందును. నామనస్సు కలత నందుటనెఱింగి సీతాసన్నిధి నాశ్రయించెదను. ఇప్పుడు సీతనుచూచి నాకు కామమధికముగా బాధించుచున్నది. ౫ నెలలు నిండినవెనుక సంగమంబును మునీంద్రులు నిందించెదరు. మరల కనినవెనుక ౫ మాసములు స్త్రీ స్వాస్థ్యమునందు చుండును. ౫ నెలలకాకనే సంగమించుట దంపతులకుహా

చమాసైః స్త్రీస్వాస్థ్యం ప్రాప్యతే పునః । పంచమాసైర్వినా సంగాద్దంపత్యోః శోభతే తథా ॥ ౩౭ ॥ అత్రకించిత్కరణీయం హి వదత్వం శ్వశురాద్య మాం । చేత్ప్రేషణీయా సీతేయం మిథిలాం ప్రతి వై మయా ॥ ౩౮ ॥ తర్హి తత్రాపి మే గంతుం భవిష్యతి సముద్యమః । కించిత్కాలం తు సీతాయా వియోగో యేన మే భవేత్ ॥ ౩౯ ॥ ఉపాయస్సః ధాతవ్యశ్చింతితో స్తి మయాపి చ । లోకాపవాదభీత్యాహం రజకోక్తిచ్ఛలాదపి ॥ ౪౦ ॥ గంగాయా దక్షిణే తీరే వాల్మీకేరాశ్రమే శుభే । త్యజామి జానకీం శుద్ధాం కించిత్కాలాంతరాత్పునః ॥ ౪౧ ॥ ఏనాం సమానయిష్యామి ప్రత్యయం మాం ప్రదాస్యతి । తతోనయా చిరంకాలం నానాభోగాన్భజామ్యహం ॥ ౪౨ ॥ జనకాద్య త్వయాత్ర నిజపత్న్యా సుమేధయా । వాల్మీకేరాశ్రమే గత్వా స్థేయం వర్షాణి పంచ వై ॥ ౪౩ ॥ తథేత్యంగీచకారాథ జనకోపి సుమేధయా । సీతాప్యంగీచకారాస పత్యుర్వాహస్యతద్వచః ॥ ౪౪ ॥ అథ రామాదదాదాజ్ఞాం సస్త్రీయం జనకం ముదా । స గత్వా మిథిలారాజ్యే స్వీయం సంస్థాప్య మంత్రిణం ॥ ౪౫ ॥ యయౌ సుమేధయా శీఘ్రం వాల్మీకేరాశ్రమం ముదా । కించిద్దాసీదాససైన్య వాజివారణవేష్టితః ॥ ౪౬ ॥ నానోపచారాన్ సీతార్థం సంగృహ్యాశకటాదిభిః । చకార గేహం విపులం వాల్మీకేస్సుఖావహం ॥ ౪౭ ॥ సర్వసంపత్తిసంయుక్తం బహుగోమహిషీయుతం । పూరితం ధాన్యసంఘైశ్చ వస్త్రైరాభరణాదిభిః ॥ ౪౮ ॥ కాసారోపవనారామ పుష్పవాటికతావృతం । గవాక్షైశ్చంద్రకాంతానాం కపాటైశ్చ సమన్వితం ॥

నికరము. మామగారూ! ఇచ్చట నేనేమిచేయవలయును? సెలవిండి. మిథిలకు సీతను పంపించినను అచ్చట కూడ నేనువచ్చిచేరు నట్లవకాశముండును. కొంతకాలమువరకు సీతావియోగమును నేననుభవింపవలసియున్నది. గనుక నేనొకఉపాయమును చింతించియున్నాను. ఏమనిన-నేను లోకాపవాదభీతివలనను చాకలవానిమాట నెపముమీఁదను గంగానదీ దక్షిణతీరమునందలి వాల్మీకియొక్క దివ్యాశ్రమంబున పరిశుద్ధురాలగు జానకిని పరిత్యజించెదను. కొంతకాలమయినవెనుక మరలపిలిపించెదను. నాకు నామె నమ్మకము నీగలదు. పిదప నీమెతోడ చిరకాలము వివిధభోగముల ననుభవించెదను. జనకరాజా! ఇప్పుడు నీవచ్చట నీపత్నియగు సుమేధాదేవితోడ వాల్మీక్యాశ్రమంబునకుపోయి ౫ సంవత్సరములవరకు వసించవలయును." అని రహస్యముగా హృదయాభిప్రాయమును చెప్పెను. అట్లేయని సుమేధతోడ జనకుండు అంగీకరించెను. మగనిమాటకు నవ్వుచు సీతాదేవియును సంమతించెను. అంతనా శ్రీరాముఁడు అత్తమామలకాజ్ఞనిచ్చి సంతోషముతోడ పంపెను. ఆజనకరాజు తనమిథిలారాజ్యమున మంత్రిని సంస్థాపించి సుమేధతోడ త్వరగా వాల్మీక్యాశ్రమంబునకువెడలి, మితమైన దాసీదాససైన్య గజతురగాది పరివారముతోడను సీతమ్మకొఱకు వివిధోపచారార్హసద్వస్తుపరిపూర్ణంబులగు శకటంబులతోడను వాల్మీకి ఋష్యాశ్రమమునుచేరి, అచ్చట వాల్మీకమునీంద్రునికి సుఖావహంబును సమస్తైశ్వర్యసంపూర్ణంబును గోమహిషాదిపశు సమృద్ధంబును ధాన్యపూరితంబును వస్త్రాభరణాలంకృతంబును కొలనులు తోటలు పుష్పవాటికలు క్రీడారామంబులు గలదియును చంద్రకాం

౪౯ ॥ కృష్ణాగరుసకర్పూరైః శిరమాల్యాదిమోదితం । కాంచనశృంఖలాబద్ధ రత్నపర్యంకమండితం ॥ ౫౦ ॥ హంస పారావతపిక కేకిశుకనినాదితం। ముక్తాగుచ్ఛవితానాద్యైశ్శోభితంచిత్రచిత్రితం ॥౫౧॥ ఏవంమనోహరం గేహం సీతార్థంజనకోఽకరోత్। శ్రీరామస్తద్గృహంతుముద్యుక్తా యస్మిన్నివసితుంచిరం॥ ౫౨॥ కిందుర్లభంహితత్రాస్తి వర్ణనీయంవయాద్యకిం । యస్యానేత్రకటాక్షేణ శక్రాదీనాంవిభూతయః ॥ ౫౩ ॥ వాల్మీకయేసర్వవృత్తం జనకోపిన్యవేదయత్ ॥ మునిశ్చాప్యతిసంతుష్టో మేనేస్వతపసఃఫలం॥ ౫౪ ॥*॥ ఇతిశ్రీ శతకోటిరామచరితాంతర్గత శ్రీమదానందరామాయణే జన్మకాండే వాల్మీకీయే ద్వితీయస్సర్గః॥ ... ... ... ... ... ॥౨॥

శ్రీరామదాసఉవాచ—అథరామంతుకౌసల్యాఽఽవిర్రహసిసంస్థితా । సీతాంసీమోల్లంఘనార్థం శీఘ్రంప్రేషయరాఘవ ॥౧॥ తన్మాతుర్వచనంశ్రుత్వా తథేత్యుక్త్వాసవిస్తరాత్। సలక్ష్మణోనిజామంబాం ప్రాహయన్మంత్రితంపురా ॥ ౨ ॥ వాల్మీకేరాశ్రమేసీతా త్యాగాదిచసకారణం । అథమాసేష్టమేప్రాప్తే రామోరాజీవలోచనః॥ ౩ ॥ ఏకాంతేజానకీంప్రాహ వీజితోలక్ష్మణేనహి । కల్పయిత్వామిషందేవి రజకోక్తంత్వదాశ్రయం ॥ ౪॥ త్యజామి త్వాంవనేలోక వాదాద్భీతఇవాపరః । త్రిమాసాత్పంచమాసాద్వా సప్తమాసాత్సుబుద్ధిభిః ॥ ౫ ॥ అంతర్వత్నీనగ

మణి నిర్మితగవాక్షకవాటాది శిల్పరచనాచిత్రితంబును పరిమళద్రవ్య పుంజమంజుళంబును సువర్ణశృంఖలాబద్ధ దివ్యరత్నపర్యంకాది భోగసామగ్రులచే నిబిడితంబును చిలుకలు నెమళ్లు కోవెలలు పావురంబులు హంసలు మొదలగు పక్షిగణకలకలంబులచే మనోహరంబును వివిధచిత్రాలంకార రమణీయంబునగు విశాలరాజమందిరంబును కట్టించిపెట్టెను. ఎవతెయొక్క కడగంటిచూపుచే నింద్రాదులయొక్క దివ్యైశ్వర్యములుగల్గునో అట్టి సాక్షాల్లక్ష్మియే ప్రత్యక్షముగాపోయి చిరకాలము వసింపఁదగిన సీతకొఱకై చేయించిన ఆదివ్యమందిరమున దేనికి కొఱత గలదు? నేను వర్ణింపఁదగినదియేది? ఆజనకరాజ వాల్మీకికిని సమస్తవృత్తాంతము నెఱిఁగించెను. మునీంద్రుండును సంతోషించువాఁడై దీనిని తన తపోఫలముగా నెంచెను. ... ॥౨॥

## శ్రీ సీతారాముల రహస్యాలోచన.

అటుపిమ్మట నొకనాఁడు కౌసల్యాదేవి శ్రీరామునితో “శ్రీరామభద్రా! సీతమ్మను సీమోల్లంఘనకై త్వరగా పంపుము.” అని రహస్యముగాఁ బలికెను. ఆతల్లిమాటనువిని లక్ష్మణుని తోడ శ్రీరాముఁడు కౌసల్యకు సకారణంబుగా తానుయోచించియుండెడు వాల్మీక్యాశ్రమగమనాది విషయమును విన్నవించెను. అంత నెన్మిదవనెలరాఁగానే లక్ష్మణుఁడు వీచుచుండగా రాఘవుఁడు సీతతో నేకాంతమున “నిన్నుసంబంధించిన చాకలిమాటమీఁద నెపముకల్పించి లోకాపవాద భీతివలననన్నట్లు నిన్నువనమున వదలుదును. మూఁడు నెలలనుండిగాని ౫ నెలలనుండిగాని తుదకేడునెలలనుండిగాని గర్భిణితోడ సంగమింపరాదను శాస్త్రాజ్ఞను రజకచ్ఛలముచే

మ్యేతి శాస్త్రాజ్ఞారజకచ్ఛలాత్ । త్వాంత్యక్త్వా పాలయిష్యామి నికటే వస్తుమక్షమః ॥౬॥ త్వాం దృష్ట్వా చంద్రవదనాం కామో మేతీవ బాధతే । త్వద్వియోగస్తు నిర్బంధా ద్వినా మే త్రకథం భవేత్ ॥౭॥ తస్మాత్కృతోయం నిర్బంధస్సత్యం విద్ధి మనోరమే । పంచవర్షాంతరేణ పునరాగత్య మేంతికం ॥౮॥ లోకానాం ప్రత్యయార్థం త్వం శపథం హి కరిష్యసి । భూమేర్వివరమార్గేణ స్థిత్వా సింహాసనోపరి ॥౯॥ యదా గచ్ఛసి పాతాలం జగత్పూజితా తదా । భువం స్తుత్వా భూషయిత్వా త్వామంకే స్థాపయామ్యహం ॥౧౦॥ పుత్రాభ్యాం చ మయా సీతే తతో భోగానవాప్స్యసి । మత్తస్త్వేకః కుశో జ్యేష్ఠస్తవ పుత్రో భవిష్యతి ॥౧౧॥ మునేస్తపః ప్రభావేణ భవిష్యత్యపరో లవః । వాల్మీకేరాశ్రమే చైవ కుమారౌ ద్వౌ భవిష్యతః ॥౧౨॥ గత్వాగ్రే జనకేనైవ త్వద్యోగ్యం చ గృహాదికం । సను మే ధేనసకలం కృతమస్తి మదాజ్ఞయా ॥౧౩॥ కురుష్వాద్య మయాయత్త్వా ముచ్యతే జనకాత్మజే । సాత్వికీ త్వం యథాపూర్వం దండకే గౌతమీతటే ॥౧౪॥ మద్వామాంగే స్థితా తద్వ న్మే వామాంగే వసాధునా । వాల్మీకేరాశ్రమే గంతుం గుణద్వయ విమిశ్రితా ॥౧౫॥ భూత్వా త్వమాశ్రమే స్థిత్వా మద్వియోగం ప్రదర్శయ । తత్రాపి త్వం కుశోత్పత్తౌ దాస్యామి దర్శనం రహః ॥౧౬॥ ఇత్యేతి రామవచనా జ్జానకీ విస్మితానవా । రజస్తమోమయీం స్వీయాం ఛాయాం నిర్మాయ సాదరం ॥౧౭॥ శ్రీరాఘవస్య వామాంగే సత్త్వరూపా లయం యయౌ । తతో రామస్సభాం గత్వా రాత్రౌ జ్ఞానై

పరిపాలించెదను. నీవద్దనుండ నేరను. చంద్రముఖియగు నిన్ను జూచి నాకు కామమధికమగుచున్నది. నీవియోగము నిర్బంధము మీఁదగాక నాకెట్లుగల్గును? అందువల్ల నిర్బంధము నేర్పరచితిని. సత్యముగావినుము. మనోహారిణీ! అయిదు వత్సరములయిన వెనుక మరల నాసమీపమునకువచ్చి లోకమును మెప్పించుటకై శపథమును చేయగలవు. భూరంధ్ర మార్గముగా నీవు సింహాసనము మీఁదగూర్చుండి పాతాళమున కెప్పుడుపోగలవో, అప్పుడు భూదేవిని స్తుతించి భూషించి జగత్పూజితవగు సీతోడ వసించుచుందును. ఇద్దరు కొడుకులతోడను నాతోడను నీవు భోగంబుల ననుభవింపగలవు. నావలన నీకు కుశుఁడను జ్యేష్ఠపుత్రుఁడు కాగలఁడు. మునీంద్రుని తపఃప్రభావంబువలన లవుఁడను మఱియొకఁడు కాగలఁడు. వాల్మీక్యాశ్రమంబుననే ఇరువురుబిడ్డలు పుట్టుదురు. మీతండ్రి మొదటనే వెడలి నీకు తగిన గృహాదులను సిద్ధపరచియున్నాడు. మీతల్లియు నచ్చటనే వసించుచున్నది. అట్లు చేయుటకు నేనే ఆజ్ఞనిచ్చితిని. ఇప్పుడు నేను చెప్పినట్లు చేయుము. మునుపు దండకారణ్య గౌతమీతీరమున నీవు నాయెడమప్రక్కలో వసించుచున్నట్లు ఇప్పుడును నావామాంగమున వసింపుము. వాల్మీక్యాశ్రమంబునకు పోవుటకై రజస్తామసగుణ విమిశ్రితవైయెవెల్లి యాశ్రమంబున నావియోగమును నటింపుము. అచ్చటను కుశుఁడు పుట్టినపుడు రహస్యముగా దర్శనమిచ్చుచున్నాను. "అనిపలుకగా, సీతాదేవి యట్లేకాని మ్మని హసన్ముఖియై సాదరముగా రజస్తమోమయంబైన నిజచ్ఛాయనునిర్మించి శ్రీరాముని వామాంగంబున సత్త్వాలయము నాశ్రయించెను ॥ ౧౭ ॥ పిదప, జ్ఞానైకవిగ్రహుండైన శ్రీరా

కః గ్రహః ॥ ౧౭ ॥ మంత్రిభిర్ముఖ్యైస్తత్త్వజ్ఞైః బలముఖ్యైర్యోధిభిః । సమంతతో వేష్టితస్సం ప్రస్థాపింహాస
నోపరి॥ ౧౮ ॥ తత్రోపవిష్టం రాజానం సుహృదః పర్యుపాసిరే, హాస్యప్రాయకథాభిశ్చ హాసయన్తః స్థితాః ప్రభుం॥
౨౦ ॥ కథాప్రసంగాత్ప్రపచ్ఛ రామో విజయనామకం । పౌరాజానపదా నామే కింవదంతి శుభాశుభం ॥ ౨౧ ॥
సీతాం తాం వా తరం వా మే భ్రాతౄన్వా కైకయీం తథా । నభేతవ్యం త్వయా బ్రూహి కాపి నోఽనిమమోపరి ౨౨ ॥ ఇ
త్యుక్తః ప్రాహ విజయో దేవ సర్వే నదంతి తే । కృతం సుదుష్కరం కర్మ రామేణ విదితాత్మనా ॥ ౨౩ ॥ తథాప్యే
వం వదంతి త్వాం జనాస్తత్తే వదామ్యహం । కింతు హత్వా దశగ్రీవం సీతామావృత్య రాఘవః ॥ ౨౪ ॥ అమర్షం పృష్ఠ
తః కృత్వా స్వవేశ్మ ప్రత్యపాదయత్ । కీదృశం హృదయం తస్య సీతాసంభోగజం సుఖం ॥ ౨౫ ॥ యా హృతా విజనే
పూర్వం రావణేనవనే తదా । అః పాదపి గుష్కర్మ యోషిత్స్వ మపవాదం భినేత్ ॥ ౨౬ ॥ యాదృగ్భవతి వై రాజా తా
దృశో హ్యనియతాః ప్రజాః । ఇతి నానావిధా వాచః వదంతి పురౌకసః ॥ ౨౭ ॥ అన్యత్కించిత్స్వ త్యామి సాంప్రత
రజకోదితం । గుమార్గగాం స్వరజకీం భార్యాం క్రోధవశేన సః ॥ ౨౮ ॥ రజకః ప్రాహ భో రండే సోఽహం రామో
న మైథిలీం । రావణస్య గృహే స్పష్టం స్థితాం సంగీచకార యః॥ ౨౯ ॥ యథేచ్ఛం గచ్ఛ రండే త్వం ... రామః తదా

## శ్రీరాముఁడు లోకవార్తలను విచారించుట.

ముఁదు రాత్రి సభకువచ్చి మంత్రిముఖ్యులు వృద్ధముఖ్యులు సేనాప్రముఖులు నంతట పరివే
ష్టించియుండఁగా సింహాసనము నలంకరించెను. ఇట్లు సింహపీఠాసీనుఁడగు శ్రీరామరాజును సు
హృత్తులు సేవించుచుండిరి. మఱియు హాస్యవినోద సల్లాపంబులచే ప్రభువనోరంజకులై యుం
డిరి. అపుడు శ్రీరాముఁడు కథాప్రసంగవశమున విజయుఁడను పేరుగలవానితో "ఊరివారు
కాని దేశమువారుకాని సీతనుగురించిగాని ననుగూర్చిగాని మాతల్లినిగూర్చిగాని తమ్ములనుద్దే
శించిగాని కైకేయినిగురించిగాని శుభాశుభంబుల నేమిచెప్పుదురు? నీవెంతమాత్రము వెరువక
చెప్పుము. నాయాజ్ఞ నందియుందువు." అని యడిగెను. ఇట్లడుగఁబడిన విజయుండు "మహాప్రభూ!
అందరును నినుగూర్చి – విజ్ఞాననిధియగు శ్రీరాముఁడు దుష్కరంబున మహాకార్యంబును చేసె
నని – సంశ్లాఘించుచున్నారు. అయిన శ్రీరాముఁడు రావణాసురుని సంహరించి సీతను తెచ్చు
కొని వ్యభిచారీ భావవిశేషరోషమును వెనుకద్రొక్కి తనయింటఁజేర్చికొనెను. మునుపు విజన
వనమున రావణుఁడెవతెను గొనిపోయెనట్టి సీతయొక్క సంభోగసంభవసంతోషము నెంచునట్టి
యతని హృదయమెట్టిది? అకస్మాత్తుగాఁగల్గిన దుష్కర్మ యును స్త్రీలయందు వ్యభిచారీభావవిశే
షము నిచ్చుచున్నది. రాజెట్టివాఁడగునో ప్రజలును తప్పక నట్టి వారలగుచుందురు. ఇట్లు
నానావిధంబులుగా పౌరులు పలుకుచుందురు. చాకలివాఁడు చెప్పిన వేరొక్కసంగతిని విన్న
వించెదను. ఏమనిన, ఆచాకలివాఁడు దుర్మార్గురాలయిన తనభార్యనుచూచి క్రోధమునందిఁయోసి
నీచురాలా! స్పష్టముగా రావణాసురుని యింటిలో వసించుచుండివచ్చిన సీతనంగీకరించెనే,ఆరా

చరే । గచ్ఛతా చ మయా మార్గే రజకేన సమీరితం ॥ ౩౦ ॥ ఇతి రామ శ్రుతం పూర్వం త్వయాపృష్టం నివేదితం । యత్పథ్యం సహితం చాత్ర తత్కురుష్వ రఘూత్తమ ॥ ౩౧ ॥ శ్రుత్వా తద్వచనం రామః స్వజనాన్పర్యపృచ్ఛత । తేపి నత్వా బ్రువన్రామమేవమేతన్న సంశయః ॥ ౩౨ ॥ తతో విసృజ్య సచివాన్విజయం సుహృదస్తథా । ఆహూయ లక్ష్మణం రామో వచనం చేదమబ్రవీత్ ॥ ౩౩ ॥ లోకాపవాదస్తుమహాన్ సీతామాశ్రిత్య మే భవేత్ । సీతాం ప్రాతస్త్వమానీయ వాల్మీకేరాశ్రమాంతికే ॥ ౩౪ ॥ త్యక్త్వా శీఘ్రం రథేన త్వం పునరాయాహి లక్ష్మణ । వక్ష్యసే యది వా కించిదత్ర మాం హతవానసి ॥ ౩౫ ॥ ఛిత్వా సీతాభుజం లోకప్రత్యయార్థం సమానయ । ఇత్యుక్త్వా లక్ష్మణం రామో కైకేయీం ద్రష్టుమాయయౌ ॥ ౩౬ ॥ ఏతస్మిన్నంతరే సీతాం కైకేయీ రహసి స్థితా । పప్రచ్ఛ కౌతుకాత్ప్రీతే భిత్తౌ లేఖ్య దశాననం ॥ ౩౭ ॥ మమాగ్రే దర్శయస్వాద్య తాం ప్రాహ జానకీ తదా । మయావలోకితో నైవ కదాపి సదశాననః ॥ ౩౮ ॥ యదాహర్తుం పంచవట్యాం మాం ప్రాప్తో గౌతమీతటే । తదా దృష్టస్తదంగుష్ఠో మయా దక్షిణపాదజః ॥ ౩౯ ॥ తత్సీతావచనం శ్రుత్వా కైకేయీ ప్రాహ తాం పునః । యథా దృష్టస్త్వయాంగుష్ఠస్తథా భిత్తౌ లిఖస్వహి ॥ ౪౦ ॥ తథేతి జానకీ లేఖ్య తదంగుష్ఠం భయానకం । కైకేయ్యై దర్శయామాస తామామంత్ర్య గృహం యయౌ ॥ ౪౧ ॥ అంగుష్ఠోపరి కైకేయ్యా యథా

మునివంటివాఁడు నేను కాను. నీయిచ్చవచ్చినట్లు నీవు పొమ్ము. రాముని వలెనే నాచరించను." అను మాటను దారిలోఁ బోవుచు నేను వింటిని. శ్రీరామచంద్రస్వామీ! నీయాజ్ఞచే నిట్లు విజ్ఞాపించితిని. ఈవిషయమునం దుచితమగు నట్లాచరించవలెను. అని విజయుఁడు విజ్ఞాపించెను. ఆమాట విని శ్రీరాముఁడు స్వజనుల నడిగెను. వారును సరియే ఇందుకు సంశయము లేదనిరి. అంత నా మంత్రులను మిత్రులను విజయునిని పంపివేసి, లక్ష్మణునిఁ బిలిచి "లోకాపవాదము గొప్పది, సీతవలన నాకు నపవాదము గల్గెను. తమ్ముఁడా! నీవు ప్రొద్దున జానకిని తీసికొనిపోయి వాల్మీక్యాశ్రమసమీపంబున విడిచిపెట్టి రథము నెక్కి వచ్చివేయుము. అచ్చట నేమయిన మాటాడితివా నన్ను చంపినట్లు. సీతయొక్క భుజమును ఛేదించి లోకప్రత్యయముకొఱకు గొనిరమ్ము." అని చెప్పి, యచ్చటినుండి కైకేయినిచూచుటకు వెడలెను ॥ ౩౬ ॥ అంతలో రహస్యముగా

కైకేయివంచించి సీతచే రావణాంగుష్ఠమును వ్రాయించుట.

కూర్చుండియుండు కైకేయి సీతనుచూచి "జానకీ! ఈగోడమీఁద రావణుని వ్రాసి నాకు చూపుము" అని వేడుకగా నడిగెను. అందుకామె "అత్తగారూ! నేనెప్పుడును రావణునిఁ జూడలేదు. గౌతమీతీరమున పంచవటికలో నన్నపహరించుటకు వచ్చినపుడు వానికుడికాలిబొటన వ్రేలు నొకటిని చూచితిని." అని చెప్పెను. పిమ్మట కైకేయి మరల "పోనిమ్ము, నీవుచూచినట్టి ఆయంగుష్ఠమును వ్రాయుము" అనియుత్సాహపరచెను. అంత నట్లేయని సీతమ్మ భయావహంబగు రావణాంగుష్ఠమును వ్రాసి చూపించి, యనుజ్ఞనంది నిజమందిరంబునకుఁ జనెను. ఆకైకేయి ఆయంగుష్ఠముమీఁద యథాయోగ్యముగా నిజశిల్పకౌశలముచే దశముఖుని రూపమును

యో గోష్ఠే దశాననః । లిఖితస్స స్వహస్తేన రామం ద్రష్టుం కుబుద్ధినా ॥ ౪౨ ॥ తావద్రామం సమాయాతం దృష్ట్వా సా సంభ్రమాన్వితా । భిత్త్యంతికం రాఘవాయ దదావాసనముత్తమం ॥ ౪౩ ॥ రామోపి నత్వా కైకేయీ మాసనే సంస్థితోఽభవత్ । దదర్శ భిత్తౌ లిఖితం చిత్రితం తం దశాననం ॥ ౪౪ ॥ రామః పప్రచ్ఛ కేనాత్ర లిఖితోఽయం దశాననః ॥ కైకేయీ కథయామాస సీతయా లిఖితస్త్వితి ॥ ౪౫ ॥ యత్ర యత్ర మనో లగ్నం స్మర్యతే హృది తత్సదా । స్త్రీయాశ్చరిత్రం కో వేత్తి శివాద్యా మోహితాః స్త్రియా ॥ ౪౬ ॥ కైకేయీ వచనం చేత్థం శ్రుత్వా రామో మహామనాః । సీతాత్రయం సభావృత్తం కైకేయీ మాహ విస్తరాత్ ॥ ౪౭ ॥ లక్ష్మణేన త్యజామ్యంబ శ్వస్సీతాం జాహ్నవీతటే । సీతాభుజం వనే ఛిత్త్వా సమానీయాత్ర మద్గిరా ॥ ౪౮ ॥ సౌమిత్రిస్త్వాం తథా పౌరాన్ దర్శయిష్యతి నిశ్చయాత్ । సీతయా లిఖితో యస్తాత్ స్వభుజేన దశాననః ॥ ౪౯ ॥ స్త్రీహత్యాభయమాలక్ష్య తద్వధే లక్ష్మణో మయా । న చోదితశ్చ తాం హింస్రా భక్షయిష్యంతి వై క్షణాత్ ॥ ౫౦ ॥ ఇతి రామ వచశ్శ్రుత్వా కైకేయీ ముదితాఽభవత్ । సీతాయా విరహాద్రామో నేదం రాజ్యం ప్రశాస్యతి ॥ ౫౧ ॥ సేవార్థం రామచంద్రస్య లక్ష్మణోపి న శాస్యతి । తదా శ్రీరామ వాక్యేన భరతో మే ప్రశాస్యతి ॥ ౫౨ ॥ ఇతి సంచింత్య హృదయే కైకేయీ ముదితాఽభవత్ । రామోపి నత్వా కైకేయీం సుమిత్రాం స్వాం చ మా

లిఖించి శ్రీరామునికి చూపవలెనని దుర్బుద్ధినాలోచించెను. ఆవేళకు శ్రీరాముఁడు వచ్చుచుండగా నామె మిక్కిలి సంభ్రమము గలిగినదియై ఆగోడ ప్రక్కననే శ్రీరామునికి ఉత్తమ పీఠంబును చూపెను. శ్రీరాముఁడును తల్లినివందించి పీఠముపై కూర్చుండి ప్రక్కనగోడలో చిత్రముగా వ్రాసియుండు రావణుని రూపముఁజూచెను. అప్పుడు కేకేయి ఈచిత్రము నెవరువ్రాసిరని యడుగఁబడి సీతలిఖించెనని తిన్నగా ముట్టించెను. స్త్రీజాతికి ఎచ్చటెచ్చట మనసొప్పియుండు నదగజాస్మృతిపథంబగుచుండును. స్త్రీలయొక్క చరిత్రము నెవరెఱుంగుదురు. పరమేశ్వరాదులును స్త్రీచే మోహితులయిరి. ఇఁక చెప్పఁదగినదియేమి? మహామానసుండగు శ్రీరాముఁడు ఆకైకేయీవాక్యమునువిని యామెతో సవిస్తారముగా సీతనుగుఱించి గడ్డినసభలోని సంగతిని చెప్పి «తల్లీ! లక్ష్మణునిచే రేపు సీతను గంగాతీరమున పరిత్యజించెదను. నాయాజ్ఞచే లక్ష్మణుఁడు సీతయొక్క భుజమును కత్తరించితెచ్చి నీకును పౌరులకును చూపుచున్నాఁడు. ఇదిని క్కువంబు. స్త్రీహత్యతగిదని నేను లక్ష్మణునికి చంపునట్లుచెప్పక .రావణుని వ్రాసినభుజమును ఛేదించు ట్లు చెప్పితిని. పిదప దానిని దుష్టజంతువులు త్వరగాభక్షించివేయును.” అని యనుకూలముగానొక్కి వక్కాణించెను. ఆశ్రీరామవాక్యములనువిని కేకేయి – ఆహా! ఇకశ్రీరాముఁడు సీతావిరహమువలన రాజ్యమునేలజాలఁడు. రామసేవాపరాయణుండైన లక్ష్మణుఁడు తత్సేవకొఱకై రాజ్యము నంగీకరించడు. పిదప నాయొక్క భరతుఁడు రామాజ్ఞచే రాజ్యమును పాలించును- అనియిట్లు మనమున నాలోచించి సంతసించెను శ్రీరాముఁడు కైకేయిని వందించి వెడలి, సుమిత్రకును తనతల్లికిని సభలోని సమాచారమును కైకేయీ మందిరవృత్తాం

తసం ॥౫౩॥ సభావృత్తంచకైకేయీ గేహేయజ్జాతమాదరాత్ । శ్రావయామాసపకలం వృత్తంసీతాశ్రయంప్రభుః॥ ౫౪॥ నత్వాసుమిత్రాంకౌసల్యాంరామస్సీతాగృహంయయౌ । సీతయాదత్తపాద్యార్ఘ్యాసనమంగీచకారసః॥౫౫॥ సభావృత్తంచకైకేయీ గేహేయజ్జాతమాదరాత్ । శ్రావయామాసతత్కృత్స్నం వృత్తంతాంజానకీంముదా॥౫౬॥ తచ్ఛ్రుత్వాజానకీ ప్రాహ కైకేయ్యావచనాన్మయా । అంగుష్ఠఏవలిఖిత స్తయోర్ధ్వంలిఖితోధియా ॥ ౫౭ ॥ అంగుష్ఠ స్యాతురూపేణ దశాస్యోదుష్టబుద్ధితః । తత్సీతావచనంశ్రుత్వా జానకీమాహరాఘవః ॥ ౫౮ ॥ కౌటిల్యబుద్ధింకైకే య్యాః స్సమగ్రాంవేద్మ్యహంప్రియే । ఇత్యుక్త్వారాఘవస్సీతా మాలింగ్యాస్యంచుచుంబసః ॥ ౫౯ ॥ సీతయాహే మపర్యంకే భుక్త్వాభోగాననుప్కలాన్ । వినోదార్థంరఘుపతిః ప్రాహరాత్రౌవిదేహజాం ॥ ౬౦॥ స్త్రీణాం సీతేసగర్భాణాం వాంఛితంవాంఛతేమనః । కాతేవాంఛావదస్వత్వాం తాంతేదాస్యామినిశ్చితం ॥ ౬౧ ॥ ఇతిరామ వచశ్శ్రుత్వా భావికార్యేణయంత్రితా । సాప్రాహరాఘవంరామం గంగాతీరస్థితాంస్తరూన్ ॥౬౨॥ మునీనామా శ్రమాంశ్చాపి ఋషిపత్నీశ్చతత్వినా । వాంఛతేమేమనోద్రష్టుం శీఘ్రంప్రేషయతత్రమాం॥ ౬౩ ॥ ఇతిసీతావచఃశ్రు త్వా తథాస్త్విత్యరఘూత్తమః । ప్రాహసీతేలక్ష్మణస్త్వాం నేష్యతిత్వాంమమాజ్ఞయా ॥ ౬౪ ॥ పునఃప్రాహరఘుశ్రే ష్ఠస్సీతేతేక్రీడవాదిభిః । జపధ్యానాదికంసర్వం విస్మృతంయన్మయాపురా॥౬౫॥తత్కారోమ్యహనాసీతే గతాయాం

తమును వినుపించి కౌసల్యా సుమిత్రలను నమస్కరించి॥ ౫౪ ॥ సీతయొక్క అంతఃపురమునకు

## శ్రీ సీతారామ రహస్య సల్లాపము.

వచ్చి, జానకీదేవియిచ్చిన అర్ఘ్యపాద్యాది సత్కారముల నంగీకరించి యామెతో సభాసమా చారమును కైకేయీ గృహవృత్తాంతమును చక్కగా వినుపించెను. అందుకు సీతమ్మ "స్వా మీ! ఆకైకేయీ గృహాభిత్తిమీఁద నామెయాజ్ఞ మీఁదక రావణుని యంగుటము నొకటినే వ్రాసితిని. ఆమె నిజబుద్ధికౌశలముచే రావణరూపము నూహించి వ్రాసెను. ఇదిదుర్బుద్ధిగదా?" అని విన్నవించెను. అంతనాశ్రీరాముఁడు "ప్రేయసీ! సమగ్రముగా కైకేయియొక్క దుర్బుద్ధిని నేనెఱుంగుదును." అనిచెప్పి, సీతనాలింగించి ముద్దుబెట్టి, సీతతోడ దివ్యకనకపర్యంకంబున యథేచ్ఛముగా దివ్యభోగంబుల ననుభవించి వినోదార్థముగా నారాత్రి శ్రీరాముఁడు సీతతోడ "గర్భవతులగు స్త్రీలయొక్క 'మనస్సు ప్రదైన నొకవాంఛితంబును వాంఛించుటగలదు. నీకేమి వాంఛగలదు? చెప్పుము. నిశ్చయముగా నీకుదానిని అనుకూలపరచెదను." అనిపలికెను. ఱట్టి రామవాక్యమునువిని జానకీదేవి భవిష్యత్కార్యవశవర్తినియై "గంగాతీరమునందలి వృక్షంబు లను మునీంద్రుల యాశ్రమంబులను ఋషిపత్నులను నినువిడచి చూడవలయునని నామనస్సు అపేక్షించుచున్నది. త్వరగా నన్నుపంపుము' అనిచెప్పగా నట్లేయని "ప్రేయసీ! నాయాజ్ఞచే లక్ష్మణుఁడు రేపు నిన్నుతీసికొని పోవుచున్నాఁడు." అని, మఱియు "సీతా! నీయొక్క క్రీడనా దులచే జపధ్యానాది సత్కర్మలన్నియును మరచిపోయినవి. నీవు కాననమునకు పోయినపుడు

త్వయి కాననం। ఇత్యుక్త్వా ...నకేం రామో సుఖం సుష్వాప మంచకే ॥ ౧౬ ॥ సీతాపి చింతయామాస యత్ర మాతాపి తా మమ। కిం మాం న్యూనం హి తత్రాస్తి కించిద్వస్త్వాదికం సహ ॥ ౧౭ ॥ నాహం నేష్యామి వస్తూష్ణీం సఖ్యా దాస్యా సమన్వితా। లక్ష్మణేన రథే స్థిత్వా గచ్ఛామి ముదితా సుఖం ॥ ౧౮ ॥ ఇతి నిశ్చిత్య సా రాత్రౌ సుఖం సుష్వాప మంచకే। అథ ప్రభాతే సోత్థాయ స్నాతా స్నాతం రఘూత్తమం ॥ ౧౯ ॥ పక్వాన్నాదీని సత్పాత్రే పరివేషయదుత్తమం। ఉపహారే కృతే భర్త్రా స్వయం కృత్వోపహారకం ॥ ౨౦ ॥ పృష్ట్వోర్మిలాదికాః స్త్రీశ్చ తతః శ్వశ్రూః ప్రణమ్య చ। గంగాతీరస్థితాన్ వృక్షాన్ మునీన్ ద్రష్టుం సముద్యతా ॥ ౨౧ ॥ తాః పప్రచ్ఛ సఖీయుక్తా దాస్యా సస్మార లక్ష్మణం। తతో సౌ లక్ష్మణో భ్రాత్రా చోదితస్తాం యయౌ జవాత్ ॥ ౨౨ ॥ దాస్యా సఖ్యా తులస్యాథ సీతాం కృత్వా రథస్థితాం। యయౌ దక్షిణమార్గేణ వాయువేగాత్సజాహ్నవీం ॥ ౨౩ ॥ ఇంద్రాద్యా నిర్జరాశ్చక్రుః సీతాసన్మార్గసత్క్రియాం। ఉల్లంఘ్య తమసాం పుణ్యాం గౌతమీం జాహ్నవీమపి ॥ ౨౪ ॥ యమునాం తాం మహాపుణ్యాం తథా మందాకినీం నదీం। ద్వితీయాం తమసాం పుణ్యాం సముల్లంఘ్యాథ లక్ష్మణః ॥ ౨౫ ॥ చిత్రకూటోపత్యకాయాం వాల్మీకేరాశ్రమాంతికే। పిప్పలాధో మైథిలీం తాం సఖ్యా దాస్యా వరాసనే ॥ ౨౬ ॥ నివేశ్య నత్వా ప్రాహ సాశ్రునేత్రః సగద్గదః। లోకాపవాద

---

వాటినన్నిటి నాచరించెదను." అనియుఁజెప్పి, పర్యంకముమీఁద సుఖముగా నిద్రించెను. జానకమ్మయును "ఎచ్చట నాతల్లియును తండ్రియును గలరో అచ్చట నాకేమి కొదవగలదు? రేపు నేనేమియు నొకవస్తువును తీసికొనిపోను. ఊరకె సఖిని దాసిని మాత్రమే పిలచికొని లక్ష్మణుని తోడ రథము నెక్కి సంతసించునదియై సుఖముగా వెడలెదను" అని చింతించి, నిశ్చయించి మంచముపై సుఖముగా నిద్రించెను॥ ౧౮॥ తరువాత తెల్లవారగానే లేచి సీతమ్మ స్నానము

## లక్ష్మణుఁడు సీతమ్మను వాల్మీక్యాశ్రమమువద్ద వదలుట.

చేసి స్నాతుండైన శ్రీరామునికి సత్పాత్రంబున పక్వాన్నాదులను వడ్డించి మగని భోజనమయిన వెనుక తాను భోజనముచేసి ఊర్మిలాది తోడికోడండ్రను పరామర్శించి, కౌసల్యాయే మొదలయిన అత్తలను నమస్కరించి యనుజ్ఞనంది గంగాతీరస్థవృక్షంబులను మునీంద్రులను చూచుటకు యత్నించి, సఖియుతయై దాసిచే లక్ష్మణునిఁ బిలచెను. అంత నతఁడును అన్నగారిచే సంచోదితుఁడై యామెయొక్క సన్నిధానమునకువచ్చి దాసిని తులసియనుసఖిని జానకమ్మను రథముపై నెక్కించి, దక్షిణమార్గమున వాయువేగంబుగా గంగాతీరమునకు వెడలెను. ఇంద్రాదిదేవతలు సీతాదేవివచ్చుచున్నమార్గమున సత్కారంబుల నాచరించిరి. పుణ్యప్రదయగుతమసానదినిదాఁటి గౌతమీనదిని జాహ్నవీనదిని కూడనతిక్రమించి, పావనంబైన యమునానదిని అట్లే మందాకినిని తరించి రెండవ తమసానదినిదాఁటి చిత్రకూటము వద్దనుండెడు వాల్మీక్యాశ్రమంబునకు సమీపంబున అశ్వత్థవృక్షముక్రింద నుత్తమపీఠముపై దాసీసఖులతోడ నావదినెగారిని కూర్చుండబెట్టి నమస్కరించి, లక్ష్మణుఁడు కండ్లనీళ్లు కమ్మివచ్చుచుండ సగద్గదుఁడై "లోకాపవాద భీతివలన శ్రీరాముండు వనమున నిన్ను పరిత్యజించెను. నాతల్లీ! కొంచముకూడ నీయం

ధిత్యక్త్వా త్యక్తవాన్ రాఘవో వనే ॥ ౨౭ ॥ దోహనశ్చ త్వమేవాత్ర గచ్ఛాశ్రమపదం మునేః । ఇత్యుక్త్వా తాం పరిక్రమ్య సఖ్యా దాస్యాపి వీజితాం ॥ ౨౮ ॥ యయౌ రథేన సౌమిత్రిః పూర్వమార్గేణ జాహ్నవీం । శిష్యైః శ్రుత్వాథ వాల్మీకిః జగామ సహ మేధయా ॥ ౨౯ ॥ యయౌ స్త్రీభిర్ద్విజైర్యుక్తః పూజయామాస జానకీం । శిబికాయాం సన్నివేశ్య వీజితా చామరాదిభిః ॥ ౩౦ ॥ నానావాద్యనినాదైశ్చ వైశ్యానాం నర్తనైర్వరైః । ప్రవనైర్మాగధాదీనాం నటాదీనాం సుగాయనైః ॥ ౩౧ ॥ నినాయ జనకః సీతాం వాల్మీకేరాశ్రమే ముదా । వన్యపుష్పైర్మునీపత్న్యో వవర్షుర్జానకీం ముదా ॥ ౩౨ ॥ జానకీశిబికాగ్రే తే మద్రుపుర్వేత్రపాణయః । ఏవం వివేశ సా సీతా వాల్మీకేరాశ్రమం శనైః ॥ ౩౩ ॥ చక్రుర్నీరాజనం దీపైః మునిపత్న్యశ్చ జానకీం । జానకీ హేమపర్యంకే ధృతాధోంశోపబర్హణా ॥ ౩౪ ॥ సుఖమాప్యాశ్రమే తస్య వాల్మీకేశ్చ తపస్వినః । జానకీం పూజయామాసు మునిపత్న్యః పృథక్ పృథక్ ॥ ౩౫ ॥ దివ్యాన్నైర్వసనైర్భూతైర్వన్యపుష్పైర్నిరంతరం । జ్ఞాత్వా పరాత్మనో లక్ష్మీం మునివాక్యేన భక్తితః ॥ ౩౬ ॥ దోహదాన్ పూరయామాసు స్సీతాయాస్తా మునిస్త్రియః । శిబికాసంస్థితా సీతా దదర్శ వనకౌతుకం ॥ ౩౭ ॥ యథాసుఖం తు సాకేతే పూర్వమాప విదేహజా । తథా మునేరాశ్రమేపి సుఖమాప విదేహజా ॥ ౩౮ ॥ ॥ ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతానందరామాయణే వాల్మీకీయే జన్మకాండే తృతీయస్సర్గః ॥ ... ... ... ... ౩॥

దేదోషమును లేదు. మునియొక్క సదాశ్రమమునకు వెడలుము, అని యిట్లు పలికి సఖిదాసీ సంసేవితయగు సీతమ్మకు ప్రదక్షిణమాచరించి, రథమునెక్కి యథాపూర్వముగా గంగాతీరమునకు వెడలెను॥ ౨౭॥ శిష్యులవలన సమాచారమును వినిన వాల్మీకిమహర్షి సుమేధాజనకు

వాల్మీకిమహర్షి సీతాదేవిని నిజాశ్రమంబునకు తీసికొనిపోవుట.

లను మునిపత్నులను బ్రాహ్మణులను వెంటపిలచి కొనిపోయి జానకీదేవిని పూజించి, పల్లకి మీఁదనెక్కించి ఛత్ర చామరాద్యుపచారములతోడను వివిధవాద్యంబులతోడను వందిమాగధ సంస్తవంబులతోడను నటీనట నృత్తగీతంబులతోడను సమస్త రాజోపచారంబులతోడను నిజాశ్రమంబునకు సంతోషముతో తీసికొని వచ్చెను. వన్యపుష్పంబులచే మునిపత్నులు సీతమ్మమీఁద వానగురిపించిరి. వైదేహీశిబికముముందర వెండిబంగారు కఱ్ఱలవారు పరుగెత్తుచుండిరి. ఇట్లు తిన్నగా సీతమ్మ మునీంద్రాశ్రమంబును ప్రవేశించెను. మునిపత్నులు దీపంబులచే జానకీదేవికి నీరాజనంబుల నర్పించిరి. తపస్వియగు వాల్మీకియొక్క దివ్యాశ్రమంబున జానకీదేవి కనకరత్న మంచకముపై తొడదిండ్ల నానుకొని సుఖముగా సుస్థితయైయుండెను. పరమాత్మయొక్క సాక్షాల్లక్ష్మియే ఈసీతమ్మయనుసంగతిని మునివాక్యముచే నెఱిఁగి భక్తిచేదివ్యాన్నంబులను వన్యసుమంబులను వేవ్వేరుగావచ్చి సమర్పించి, గర్భిణీ కుతూహలంబులనీడేర్చుచు కృతకృత్యలగుచుండిరి. వైదేహి పల్లకినెక్కి మునుపు అయోధ్యలో నారామక్రీడ నెట్లనుభవించుచుండెనో అట్లే ఈతపోవనంబున నంతట కౌతుకములనాలోకించుచు సుఖముగా నుండెను. ... ... ... ... ... ... ...॥౩॥

శ్రీరామదాస ఉవాచ— అథగంగాతటంగత్వా లక్ష్మణశ్చింతయత్ హృది । స్వేచ్ఛయాకౌతుకాత్సీతాంచ యాశుద్ధాంసత్యక్తవాన్ ॥ ౧ ॥ స్వీయకామప్రశాంత్యర్థం శాస్త్రాజ్ఞాంప్రతిపాలయన్ । ఏవంసతిపునస్తేన కింమమాజ్ఞాపితంరహః ॥ ౨ ॥ వనాత్సీతాభుజంఛిత్వా నయస్వేత్యతిదుర్ఘటం । మయాపిశపథంశ్రుత్వా నపృష్టస్సవిచింత్యచ ॥ ౩ ॥ అధునాకింకరోమ్యత్ర కథంరామంప్రగమ్యతే । సీతాభుజంవినాదృష్ట్వా రామోమాంకింవదిష్యతి ॥ ౪ ॥ ఛేత్తుంసీతాభుజంశక్తో భవిష్యామికథంత్వహం । యయాహంపుత్రవన్నిత్యం పాలితో లాలితస్త్వితి ॥ ౫ ॥ అధునాగ్నింవిశామ్యత్ర రామాయాస్యంనదర్శయే । ఏవంనిశ్చిత్యసౌమిత్రిః చితాంకర్తుంసముద్యతః ॥ ౬ ॥ ఏతస్మిన్నంతరే తత్ర విశ్వకర్మాభిధోఽమరః । కుఠారహస్తోవిపినే బభ్రామతక్షరూపధృక్ ॥ ౭ ॥ తందృష్ట్వాలక్ష్మణఃప్రాహత్వంమే సాహాయ్యమాచర । కుఠారేణతరూంశ్ఛిత్వా చితార్థందేహిమాంజవాత్ ॥ ౮ ॥ యథేచ్ఛంవసుదాస్యామి త్వామహం నిశ్చయేనహి । సోఽప్యాహలక్ష్మణంవీర చితాహేతుంవదస్వమాం ॥ ౯ ॥ సౌమిత్రిఃకథయామాస పూర్వవృత్తంసవిస్తరం । తచ్ఛ్రుత్వాసకలం తక్షాసౌమిత్రింప్రాహసస్మితః ॥ ౧౦ ॥ అల్పార్థంస్వీయతనుం మాజహీవత్సబాహుజ । అహంసీతాభుజంకృత్వా ధువాదాస్యామితేక్షణాత్ ॥ ౧౧ ॥ ఇత్యుక్త్వాలక్ష్మణంకృత్వా జానకీభుజముత్తమం । త్వ

## లక్ష్మణుఁడు సీతయొక్క కృత్రిమ భుజమును తెచ్చి చూపుట.

అంత నాలక్ష్మణుండు గంగాతీరమునకువచ్చి తనమనమున "స్వయంప్రభువగు శ్రీరాముఁడు శాస్త్రాజ్ఞను పాలించువాఁడై తనకామనిగ్రహముకొఱకు స్వేచ్ఛాకౌతుకమున పరిశుద్ధయగు సీతను త్యజించెను. ఇట్లుండ, నతఁడు రహస్యముగా నాకుసీతయొక్క భుజమునుకత్తరించి తీసికొనిరమ్మని యాజ్ఞాపించెను, నేనును శపథమునువిని యోచించి యతని నడుగకపోతిని. ఇప్పు డేమిచేయుదును? రాముని సన్నిధికెట్లుపోదును? సీతాభుజములేక నేనచ్చటికేఁజనిన నాశ్రీరాముఁడు ఏమిచెప్పగలఁడో! ఎవతెచేత నేను తనబిడ్డవలె నిత్యము పాలింపఁబడితినో అట్టి సీతాదేవియొక్క భుజమును నేనెట్లు ఛేదించగలను? ఇప్పుడు నేనగ్నిప్రవేశముఁ జేసెదను. రామునికి ముఖముఁజూపను" అని చింతించి చితినేర్పరచుటకు దృఢముగా నిశ్చయించెను. అంతలో బ్రహ్మాజ్ఞనొందిన విశ్వకర్మయను దేవశిల్పి వడ్లవానివేషముఁదాల్చి గొడ్డలినిగైకొని కాననమున తిరుగుచువచ్చెను. లక్ష్మణుఁడు వానిఁజూచి "నీకుకావలసినంత డబ్బునిచ్చెదను. గొడ్డలిచే చెట్లనునరికి చితిపేర్చుటకు నాకు కట్టెలనిచ్చి సాహాయ్యము చేయుము. ఇదినిక్కవము" అని యడిగెను. వాఁడును లక్ష్మణునిఁజూచి "చితానిర్మాణ కారణమేమి చెప్పుమనెను. అంత నతఁడా తక్షునికి వెనుకటిసంగతిని సవిస్తరముగాఁ పలికెను. అందుకు వడ్లవాఁడు "క్షత్రియుఁడా! ఈయల్పవిషయమునకై నీదేహము నగ్నిలో నాహుతిగానియ్యవలదు. ఇదిగో క్షణమాత్రమున సీతాదేవిభుజమును నిర్మించియిచ్చెదను." అనిచెప్పి త్వక్చర్మమాంసరుధిర మేదో మజ్జాస్థి సహితంబును కంచుకీయుక్తంబును సీతాలంకార సంయుతంబును అగు జానకీబాహు

క్షాంపాక్షిప్తాయురక్త పూరితం కంచుకీయుతం ॥ ౧౨ ॥ సీతాలంకారసహితం తత్పార్శ్వేత్వభిచిహ్నితం । దదౌ లక్ష్మణహస్తేతం స్వయమంతర్దధే తతః ॥ ౧౩ ॥ సీతాభుజం సమాదాయ లక్ష్మణోపి త్వరీయయా । గత్వాయోధ్యాం నిరుత్సాహాం వాత్యాతిధూలిధూసరాం ॥ ౧౪ ॥ దదర్శ నగరీం వ్యర్థాం నారీహీనగృహోపమాం । విశేషాధోముఖః పుర్యాం సభ్యాసద సిరాఘవం ॥ ౧౫ ॥ దర్శయామాస సీతాయా భుజం కంకణమండితం । తన్నిరీక్ష్య భుజం రామోధోముఖః ప్రాహ లక్ష్మణం ॥ ౧౬ ॥ కైకేయీం సుహృదః పౌరాన్ సర్వాన్ జానపదాన్నృపాన్ । సీతాభుజో దర్శనీయః స్త్వయాద్యమమశాసనాత్ ॥ ౧౭ ॥ తథేత్యుక్త్వా లక్ష్మణోపి సచకార యథోదితః । భుజం సంరక్షయామాస పేటికాయాం నిధాయ సః । కైకేయీ తం భుజం దృష్ట్వా తుతోష నితరాం హృది ॥ ౧౮ ॥ రామోపి సీతారహితః పరాత్మా విజ్ఞానదృక్కేవల ఆదిదేవః । సంత్యజ్య భోగానఖిలాన్విరక్తో మునివ్రతో భూన్మునిసేవితాంఘ్రిః ॥ ౧౯ ॥ అథ సీతాపి వాల్మీకేర్మునిపత్నీభిరాశ్రమే । ప్రత్యహం పూజితా వన్యైస్సుఖం తస్థౌ ముదాన్వితా ॥ ౨౦ ॥ ఏవం మాసద్వయం తత్రసీత్వా సీతాఽఽశ్రమే మునేః । సుదినే సుషువే రాత్రౌ పుత్రరత్నం రవిప్రభం ॥ ౨౧ ॥ ఏతస్మిన్నంతరే రాత్రౌ జ్ఞాత్వా

వును ఈషద్భేదముకూడ లేనట్లు కల్పించి లక్ష్మణునిచేతినిచ్చి వెంటనే తానంతర్హితుండయ్యె. సుమిత్రానందనుండును సీతాభుజమును తీసికొనివచ్చి యయోధ్యను ప్రవేశించి ధూళీధూసరంబును నిరుత్సాహంబును నిర్గతలక్ష్మియునై సుందరీవిహీనమగు మందిరమువలె నుండెడు నగరమును చూచుచు తలవంచికొని సభలోనున్న శ్రీరామునికి నమస్కరించి కంకణాలంకృతమయిన సీతాభుజమును చూపించెను. దానిని శ్రీరాముఁడు వినమ్రముఖుండై "తమ్ముఁడా! నాయాజ్ఞచే కైకేయికిని మిత్రులకును పౌరులకును దేశమువారికిని రాజులకునందరికిని దీనిని కనుపింపుము." అనియాజ్ఞాపించెను. అట్లేయని లక్ష్మణుఁడు అందరికిని కృత్రిమ సీతాభుజమును చూపించి బదిలముగా పెట్టెలోపెట్టి దాచెను. కైకేయి ఆభుజమునుచూచి మిక్కిలి సంతసించెను. సర్వజ్ఞమూర్తియగు శ్రీరాముఁడు సాక్షాత్పరబ్రహ్మయైనను లోకనటనంబు ననుసరించి విరక్తుండై సమస్తభోగంబులనువదలి, మునీంద్రారాధిత చరణారవిందుండైనను మునివ్రతమునాచరించుచుండెను॥ ౧౯ ॥ అంత నచ్చట సీతాదేవి వాల్మీక్యాశ్రమంబున మునిపత్నులచే వన్యోప

శ్రీరాములవారు రహస్యముగాపోయి పుత్రోత్సవానందము నందుట.

చారంబులనందుచు పూజింపఁబడి సంతోషాన్వితయై సుఖముగానుండెను. ఇట్లు సీతాదేవి ఋష్యాశ్రమంబున రెండు మాసములయిన వెనుక నొక శుభరాత్రియందు సూర్యప్రకాశంబగు పుత్రరత్నముఁగనెను. అంతలో నారాత్రి స్వయంప్రభువగు రామచంద్రుఁడు నామంగళముహూర్తము నెఱిఁగి పుష్పకవిమానమున కింకిణీమాలికను ఘంటను తీసిపెట్టించి తమ్మునితోడ నావిమానమునెక్కి గగనమార్గమున వెడలి వేగమున వాల్మీక్యాశ్రమంబునకు వచ్చి యమ్మునిని తమ్మునితోడ వందించెను. అంత నారాఘవుండు వాల్మీకితోడను బ్రాహ్మణుల

తం సమయం ప్రభుః । రాఘవః కుశీలవౌ లోఘుంటాం ముక్త్వాథ బంధునా ॥ ౨౨ ॥ పుష్పకస్యైత తస్మిం కృత్వాకాశవ ఘాయయా । వాల్మీకేరాశ్రమే వేగా త్సబంధు స్తం నసామసః ॥ ౨౩ ॥ తతో వాల్మీకినావిప్రైః మిత్రైరీశతరఘూత్త మః । జాతకర్మాదిసంస్కారాం శ్చకారవిధిపూర్వకం ॥ ౨౪ ॥ సీతాయాః పురతః పుత్రా ననమాలోకయన్ముదా దదౌ దానాన్యనేకాని స్వవస్త్రాభరణాన్యపి ॥ ౨౫ ॥ చకారవిధివచ్ఛ్రాద్ధం పుత్రజన్మమహోత్సవే । దేవదుందుభయో నేదుర్వవషుః పుష్పవృష్టిభిః ॥ ౨౬ ॥ మరాస్సీతాం శిశుం రామం ననృతుః ఖేచరస్త్రియః । నేదుర్జానకవాద్యా నినన్నృతుర్వారయోషితః ॥ ౨౭ ॥ తుష్టువుర్మాగధాద్యాశ్చ సీతాం రామం శిశుం ముహుః । ఋషిపత్న్యశ్శిశుం సీతాం రామం దీపైస్సుభూషితాః ॥ ౨౮ ॥ పృథఙ్నీరాజనం కృత్వా జగుర్గీతం హి సుస్వరం । వస్త్రాద్యైః పూజయామాస తాస్సర్వా రఘునందనః ॥ ౨౯ ॥ సీతారామావిదేహోపి పూజయామాస విస్తరాత్ । వాల్మీకిస్తు కుశైశ్శాంతిం చకారవిధినా శిశోః ॥ ౩౦ ॥ శాంత్యర్థం ప్రోక్షితో యస్మాత్కుశైస్తస్మాత్కుశః స్మృతః । వాల్మీకినా రాఘవాగ్రే నిశ్చితం బాలకస్య హి ॥ ౩౧ ॥ ఏవం నానా సముత్సాహై స్సీతాత్వాత్రి విశాం సుఖం । తత్రస్థాన్ సకలాన్ వాహ మమాత్రాగమనస్య హి ॥ ౩౨ ॥ యస్మాద్వా తాన్ బహిర్గచ్ఛే దాశ్రమాదస్య వై మునేః । స మే దండ్యోథ వేదేవ శత్రురూపో న సంశయః ॥ ౩౩ ॥ ఇత్యుక్త్వా సకలాన్ పృష్ట్వా మునిం నత్వా పునః పునః । సీతామామంత్ర్య శ్రీరామో యానం భ్రాత్రా

తోడను మితపరివారుఁడై జాతకర్మాది సంస్కారంబులను విధివిధానంబుగా నాచరించెను. సీతాదేవియెదుట సంతోషముతో పుత్రవరముఖము నాలోకించుచు నిజవస్త్రాభరణాదులు మొదలుగాఁగల దానంబుల ననేకంబులుగానిచ్చి. పుత్రజన్మ మహోత్సవసమయంబున యథావిధిగా నాందీశ్రాద్ధము నాచరించెను. దేవదుందుభులు మ్రోగినవి. జేజేల పూలవానలు శ్రీసీతారాములమీఁదను శిశువుమీఁదను కురిసినవి. దేవస్త్రీలాడిరి. జనకమహారాజుయొక్క మహావాద్యంబులు వాయింపఁబడెను. గణికలు నాట్యమాడిరి. వందిమాగధులు సీతారాములను శిశువును సంశ్లాఘించుచుండిరి. ఋషిపత్నులందఱును సాలంకృతలయి శ్రీసీతారాములను శిశువును దివ్యరత్న దీపంబులచే నారతులనెత్తి చెవులకింపుగా పాటలు పాడిరి. వారినందరిని శ్రీరాఘవుఁడు వస్త్రాలంకారంబులచే పూజించెను. జనకమహారాజు జానకీ దాశరథులను సవిభవంబుగా సంపూజించెను. వాల్మీకిమునీంద్రుఁడు శిశువునకు కుశములచే క్రమముగా శాంతికర్మనాచరించెను. కుశశాంతికర్మలో మంత్రప్రోక్షితుఁడగుటచే కుశుఁడని చెప్పంబడెను. ఇట్లు వాల్మీకిచే రాముని యెదుట బాలకునికి నామధేయంబిడఁబడెను. ఇట్లనేక మహోత్సవంబులతోడ నచ్చట యథాసుఖంబుగా నారాత్రినికడచి యచ్చటనున్న వారందరితో "ఇచ్చటికి నేనువచ్చినసంగతిని ఈయాశ్రమమందుతప్ప మఱియెచ్చోటనైనను ఎవరుచెప్పుదురో వారు నాచే దండింపఁబడుదురు. నాకు వారు ప్రత్యక్షశత్రువులు." అనియిట్లుచెప్పి యందరివద్ద ననుజ్ఞనంది మునీంద్రుని పలుమారువందించి సీతాదేవివద్ద సెలవుగైకొని తమ్మునితోడ పుష్పకవిమానము నెక్కెను. మ

దుగోపాసః ॥ ౩౪ ॥ విహాయ సాకేతాత్ప్రాప సాకేతం రఘునందనః । అదృశ్యో వియానాత్స పూర్వవన్నిద్రితో గృహే ॥ ౩౫ ॥ అథ రామో వాజిమేధ శతం కర్తుం మనో దధే । కృత్వా స్వర్ణమయీం సీతాం వస్త్రాలంకారభూషితాం ॥ ౩౬ ॥ పాపినీం కులినాం దుష్టాం భర్తృనిందాపరాయణాం । భర్తృవిద్వేషిణీం క్రూరాం చోరకర్మరతిప్రియాం ॥ ౩౭ ॥ భర్తారం ఘాతుమిచ్ఛంతీం సదా కలహకారిణీం । వరభుక్తాం పాపరతాం భర్తృవాక్యవిలోపినీం ॥ ౩౮ ॥ స్వేచ్ఛాచారరతాం నష్టాం గతాం నీతాం మృతాం స్త్రియం । త్యక్త్వా కుశమయీ భార్యా పత్నీ విప్రైః స్వకర్మసు ॥ ౩౯ ॥ హైమీ భార్యా రాజకైశ్చ వైశ్యైః భార్యా తు రాజతీ । శూద్రైః భార్యా తామ్రమయీ స్వస్వకర్మప్రసిద్ధయే ॥ ౪౦ ॥ అథవా సర్వవర్ణైశ్చ భార్యా పత్నీ తు కాంచనీ । రామో విధాయ తాం పత్నీ మగ్నిహోత్రం చకార సః ॥ ౪౧ ॥ తదా వనే నయావాసీతా సీతా పాదండకే తదా । హేమభార్యా కుశమయీ కృతా రామేణ వానఘ ॥ ౪౨ ॥ అన్యైః కుశమయీం పత్నీం విధాయ గృహమేధిభిః । అగ్నిహోత్రముపాసంతే నిత్యం త్యాగో న గర్హితః ॥ ౪౩ ॥ వ్యభిచారవతీ పాపా భర్తృవిద్వేషిణీ తథా । అధానే సా పరిత్యాజ్యా నవా త్యాజ్యా మతాంతరాత్ ॥ ౪౪ ॥ యజ్ఞే యజ్ఞే చకార్యం హి స్నానం వ్యావభృథాభిధం । క్రతూనాం నిశ్చితం వా రామః ప్రదాద్విప్రైః పురోధసా ॥ ౪౫ ॥ భాగీరథ్యుత్తరతటే యజ్ఞభూమిం చకార సః । అప్రయాగాన్ముద్గలస్య ప్రమాయావచ్చదక్షిణే ॥ ౪౬ ॥ జాహ్నవ్యుత్తరతస్తావచ్చకార స్వర్ణ...లాం గతైః । యస్యాః శమస్య పాన్నిధ్య భాగీరథ్యస్త్య్యదగ్వహా ॥ ౪౭ ॥ దక్షిణయా...ధనాన్యా యజ్ఞారంభం చకార

జేయొక క్షణమాత్రమున విమానమునుండి దిగి గృహమున ముందువలె నిద్రించువాఁడై యుం డెను ॥ ౩౫ ॥ పిదప శ్రీరాముఁడు వసనభూషణాలంకృతయగు సువర్ణ సీతాప్రతిమను పెట్టికొని

శ్రీరాములవారు బంగారు సీతతోడ శతాశ్వమేధ ప్రయత్నము.

శతాశ్వమేధముల నాచరింపనెంచెను. దురితస్వభావయును మలినయును దుష్టయును పతినిందాసక్తయును కాంతునితో పోట్లాడునదియును క్రూరాత్మయును దొంగలించునదియును పతిహత్య నెంచునదియును నిత్యకలహప్రియయును జారిణియును మగనిమాటదోసి స్వేచ్ఛాచారిణియును నష్టయునయిన స్త్రీనిగాని చచ్చినదానిని దుర్నీతిగలదానిని పరిత్యజించి, బ్రాహ్మణుఁడైనయెడల సత్కర్మాచరణసమయంబున కుశమయియగు భార్యనేర్పరచికొనవలయును. క్షత్రియుఁడైనచో సువర్ణప్రతిమను వైశ్యుండైతే రజతప్రతిమను శూద్రుఁడైనపక్షమున తామ్రప్రతిమను సర్వస్వస్వకర్మసిద్ధికై భార్యగాచేసి పెట్టికొనఁదగును. అట్లుగాకున్ననన్ని వర్ణములవారును బంగారు ప్రతిమను చేయించవచ్చును. శ్రీరాముఁడు సువర్ణకృత్రిమ సీతను చేయించి పెట్టికొని యగ్నిహోత్రంబుల నాచరించుచువచ్చెను. ఇతరులు కుశమయపత్నులనంది గృహస్థులగ్నిహోత్రంబుల నాచరించెదరు. సంతతము విడిచిపెట్టుట మిక్కిలి నింద్యము. వ్యభిచరించుచు పతితో కలహించుచు పాపినియైన పణతిని ఆధానకర్మయందు పరిత్యజించవలయును. మతాంతరమున ప్రాయశ్చిత్త పూతగావించి పరిత్యజించక పెట్టికొనవచ్చును. శ్రీరాముఁడప్పుడు బ్రాహ్మణుల

సః । అజ్ఞానదృగ్భ్యో దృష్టుం వై చకార స్వర్ణనిర్మితాం ॥ ౪౮ ॥ వామాంగస్థాం గురూపాం జ్ఞానదృగ్భ్యశ్చ సాత్త్వికీం । బిభ్రత్స్వదైవ శ్రీరామో జానకీం లోకమాతరం ॥ ౪౯ ॥ యజ్ఞాంతే స్వర్ణజాం సీతాం దదౌ స్వగురవే ప్రభుః । ఏవం యజ్ఞశతే వ్యత్ర గురవే శతమూర్తయః ॥ ౫౦ ॥ యాస్సమర్పితా రామేణ తాసాం దానఫలేన హి । షోడశ సహస్రేభ్య శ్చోర్ధ్వం స్త్రీణాం శతం పునః ॥ ౫౧ ॥ ద్వారకాయాం కృష్ణరూపో వివాహేనోద్వహిష్యతి । ప్రతియజ్ఞే శ్యామకర్ణ మశ్వం రామో ముమోచహ ॥ ౫౨ ॥ చతుర్దినైశ్చతుర్దిక్షు పరిక్రమ్య హయో వహః । ఏవం సర్వేషు యాగేషు యయావాజీ పృథక్ పృథక్ ॥ ౫౩ ॥ పుష్పకస్థస్స శత్రుఘ్నో హయరక్షాం చకార వై । ఏవం సదా యజ్ఞవాటే విరేజే దీక్షయా ప్రభుః ॥ ౫౪ ॥ నవనవతి యజ్ఞాః శ్రీరామేణైవ కృతాశ్శుభాః । చరమస్యాపి ప్రారంభం రామో యజ్ఞస్య సోఽకరోత్ ॥ ౫౫ ॥ గంగాయా దక్షిణే తీరే ముద్గలస్యాశ్రమాస్తి హి । యత్ర తస్యాంతికే గంగో దక్షిణే చ ఉదగ్వహా ॥ ౫౬ ॥ దివానిదశ వాల్మీకి ర్నిశాయాం సంధ్యయోరపి । శ్రీరామరక్షయా చక్రే బాలకాయాభిమంత్రణం ॥ ౫౭ ॥ కులంనామకృతదా చక్రే మునిర్దశమదేదినే । చకార సర్వసంస్కారాన్ మునిశ్శ్రీరాఘవాజ్ఞయా ॥ ౫౮ ॥ ఏవం సలాలకస్తత్ర వవృధే మాతృలాలితః । జనకశ్చ సుమేధా చ నానావస్త్రైస్సుశోభనైః ॥ ౫౯ ॥ శోభయామాసదా హి

తోడను వసిష్ఠులవారితోడను పక్షపక్షంబునను అవభృథస్నానముచేయ నిశ్చయించెను॥౪౫॥

## శ్రీరాముఁడు శతాశ్వమేధముల నాచరించుట.

పిదప శ్రీరాముఁడు గంగానదికి ఉత్తరతీరంబున ప్రయాగమొదలు దక్షిణమున ఉత్తరవాహిని యగు 'గంగాప్రవాహముగల ముద్గలాశ్రమమువరకు నట్లే గంగకుత్తరంబునను 'విస్తారముగా బంగారునాగేళ్లచే యజ్ఞభూమి నేర్పరచెను. కనకమయయగు జానకీదేవితోడ యజ్ఞమునకా రంభించెను. ఆహా! శ్రీరాములవారి మహిమనేమనవచ్చును? జ్ఞానదృశులనగా తపస్సంపన్నులు మాత్రమే చూచునట్లు సాత్త్వికియై సాక్షాల్లోకైకమాతయగు జానకీదేవిని తనయెడమప్రక్క లో నిరంతరముగాధరించుచు, అజ్ఞానదృశులనగా పామరలోకులు చూచునట్లు బంగారుసీతను చేయించిపెట్టికొనెను. యజ్ఞాంతమున నాసీతాప్రతిమను నిజగురువగు వసిష్ఠముని కర్పించును. ఇట్లే నూరు యజ్ఞంబులలోను నూరు సీతామూర్తులు గురువులవారికర్పింపఁబడెను. అట్టి శత సువర్ణ సీతాప్రతిమాదాన ఫలముచేతనే ద్వారకలో శ్రీకృష్ణావతారమున ౧౬ వేలమందికి మీఁద నూరుగురిని పెండ్లాడుచున్నాడు. ప్రతియజ్ఞంబునను శ్రీరాముఁడు నల్లనిచెవ్విగల య జ్ఞాశ్వంబును విడచుచుండును. అది నాల్గుదినములలో చతుర్దిక్కులను చుట్టివచ్చును. ఇట్లే వేర్వేఱుగా గుఱ్ఱములు అన్నియజ్ఞంబులలోను వచ్చుచుండెను. శత్రుఘ్నుఁడు పుష్పకవిమాన మునెక్కి యజ్ఞతురగములను వెంబడించి పాలించుచుండును. ఇట్లెల్లప్పుడును యజ్ఞశాలలో శ్రీరాముఁడు దీక్షవహించి రారాజించుచుండెను. ఇవ్విధంబుగా ౯౯ యజ్ఞములనాచరించి శ్రీరామచంద్రస్వామి ౧౦౦వ- యజ్ఞంబునకు నారంభించెను ॥ ౫౫ ॥ గంగానదియొక్క దక్షిణ

త్రం నానావ్యాఘ్రనఖాదిభిః । బాలోపి రంజయామాస స్వక్రీడాభిర్దివౌకసాం ॥౬౦॥ ఏకదా నిద్రితం ప్రేంఖే దృష్ట్వా బాలం మునేః పురః । అన్యకర్మణి వ్యగ్రాంచ సఖీం స్వీయాం స్వమాతరం ॥ ౬౧ ॥ జనకం చాపి సా సీతా దృష్ట్వా సర్వాన్ బహిర్గతాన్ । అశ్వినే రవివారే చ నద్యాం స్నాతుం సముద్యతా ॥ ౬౨ ॥ మునింతం బాలరక్షాయాం కృత్వాథ తమసాం యయౌ । దాస్యా మార్గే గచ్ఛంతీ దదర్శ పథి వానరీం ॥ ౬౩ ॥ కటిస్కంధమస్తకేషు బిభ్రతీం పంచ బాలకాన్ । తాం దృష్ట్వా స్వశిశుం స్మృత్వా చింతయజ్జానకీ హృది ॥౬౪॥ తిర్యగ్యోనౌ జన్మవత్యా వానర్యా బాలకా న్యహో । స్నేహాత్సహైవ నీయంతే ధిఙ్మాం మానవదేహినాం ॥ ౬౫ ॥ ఏకం చాపి నిజం బాలం త్యక్త్వా దేహాద్య గమ్యతే । మయా విమూఢయా స్నాతుం భువి త్రక్షణికం సుఖం ॥౬౬॥ ఇతి ధిక్కృత్య చాత్మానం పరివృత్యాశ్రమం యయౌ । ఏతస్మిన్నంతరే గేహే వాల్మీకిర్మునిపుంగవః ॥ ౬౭ ॥ గతస్సలఘుశంకార్థం కార్యార్థం వటవో గతాః। గృహీత్వా సా కుశం ప్రేంఖా ద్య - సీతా బహిః పునః ॥ ౬౮॥ దాస్యా సహ నదీం గత్వా వని స్నానం చకార తైః। అదృష్ట్వాథ మునిర్బాలం దీర్ఘం నిశ్వస్య వై ముహుః॥ ౬౯ ॥ సీతాశాపభయాచ్చక్రే అన్యం బాలం సపూర్వవత్ । త

## వాల్మీకిముని తపశ్శక్తిచే లవుని నిర్మించి సీతాదేవికిచ్చుట.

తీరంబున ముద్గలాశ్రమముగలదుగదా? అచ్చట దానిసమీపమున ఉత్తరవాహినియగు గంగ గలదు. తదుత్తరతీరమున వాల్మీకిముని ౧౦దినములు రాత్రిలోను సంధ్యాకాలములయందును శ్రీరామరక్షచే బాలకుని నభిమంత్రించెను. ౧౧వ- దినమునందు ఆబాలకునికి కుశుఁడని నామకరణముచేసి శ్రీరామాజ్ఞానుసారముగా నన్నిసంస్కారములను ఆచరించెను. ఇట్లు ఆశిశువు తల్లిచే లాలింపఁబడుచు వృద్ధినొందుచువచ్చెను. సుమేధాజనకులు తమదౌహిత్రునిని మంగళకరంబులగు మనోహరవస్త్రములచేతను పులిగోరు మొదలయిన వివిధరత్నావస్తువులచేతను అలంకరించి యానందించుచుండిరి. ఆబాలకుండును తనయాటలచే తల్లిని సంతోషపెట్టుచుండెను. ఒకప్పుడు సీతమ్మ వాల్మీకియెదుట చౌతామీఁద నిద్రించుచున్న బాలకునింజూచి, వేఱొకపనిమీఁద తనచెలికత్తె వెడలఁగా, తనతల్లిదండ్రులయిన సుమేధాజనకులు మొదలగువారందరును వెలుపల వెడలిన సంగతి నెఱింగి ఆశ్వీనభానువాసరమున నదీస్నానము చేయనెంచి, బిడ్డను రక్షించికొని యుండునట్లు వాల్మీకిమహర్షితోఁజెప్పి, తాను దాసితోడ తమసానదికి బయలుదేరెను. ఇట్లుపోవుచు దారిలో నడుముమూఁపుతలలమీఁద అయిదుపిల్లలనెక్కించికొని క్రీడించుచుండు ఆఁడకోఁతినిచూచి తనబిడ్డనుతలంచి మనమునఁ"తిర్యగ్యోనిలోఁబుట్టిన ఈకోఁతి తనపిల్లలను స్నేహముచే వెంటఁబెట్టికొని పోవుచున్నది. ఛీ-పొమ్ము, మానవజన్మమెత్తిన నేను నాయొక్క-బిడ్డను ఇంటిలోవిడిచి మూఢురాలై స్నానమునకు పోవుచున్నాను. ఈభూమిలోని సుఖము క్షణికమయినది." అనితన్ను తానే నిందించికొని వెనుకకుఁదిరిగి యాశ్రమమునకువచ్చెను. అంతలో నిచ్చటయింటిలో వాల్మీకిముని అల్పశంకకు వెడలెను. శిష్యులగువటువులు వారివారి

పోబలేనతం ప్రోక్ష్య జీవయామాస నేగతః ॥ ౨౦ ॥ జ్ఞానదృష్ట్యావ్యగ్రతయా మునినానావలోకితం । తతస్సీతాపిను స్నాతా దాస్యాగేహంశనైర్యయౌ ॥ ౨౧ ॥ కటౌగృహీత్వాతంబాలం రుక్మనూపురనిస్స్వనా । ప్రేంఖేన్యంబాలకం దృష్ట్వా మునింపప్రచ్ఛజానకీ ॥ ౨౨ ॥ ప్రేంఖేకస్యాత్మజశ్చాయం సోపిదృష్ట్వాతపాకులం । కటిప్రదేశేజానక్యా విస్మయంపరమంగతః ॥ ౨౩ ॥ నమస్కృత్యతదాసీతాం సర్వంవృత్తంన్యవేదయత్ । అంకేనిధాయతంబాలం సీతాయాఅబ్రవీన్మునిః ॥ ౨౪ ॥ ప్రసాదాన్మమవైదేహి ద్వితీయోయంసుతస్తవ । భవత్వద్యలవోనామ్నా లవైర్యస్మాద్వినిర్మితః ॥ ౨౫ ॥ ఏ లీకేవచనాత్సాపి శిశుంజగ్రాహజానకీ । మునిస్తయోర్నామచక్రే కుశోజ్యేష్ఠోనుజోలవః ॥ ౨౬ ॥ జాతకర్మాదిసంస్కారాన్ లవస్యాపిచకారసః । తదానినేదుర్వాద్యాని భూమ్యాంఖేఽపిదివౌకసాం ॥ ౨౭ ॥ వవృషుర్జానకీంబాలౌ వాల్మీకింకుసుమైస్సురాః । చకారజనకశ్చాపి సుమేధాపరిహోత్సవాన్ ॥ ౨౮ ॥ క్రమేణవిద్యాసంపన్నౌ సీతాపుత్రౌవిరేజతుః । ధనుర్విద్యామస్త్రవిద్యాం శిక్షయామాసతౌమునిః ॥ ౨౯ ॥ కృత్స్నంరామాయణంస్వీయం కృతందేనసుశిక్షితౌ । యస్మిన్నానందరమ్యంచ చరిత్రంరాఘవస్యహి ॥ ౩౦ ॥ కుమారౌస్వరసం

---

పనులమీఁద వెడలిరి. అప్పుడు సీతమ్మ చవుతామీఁదినుండి బిడ్డనెత్తికొని మరల బయలుదేఱెను. అట్లే దాసితోడ తమసానదిలో ప్రాతఃస్నానము నాచరించెను. ఇచ్చట మునీంద్రుఁడు బిడ్డనుకానక మరలమరల నిట్టూర్పువిడుచుచు సీతాదేవి శపించునేమోయను భయమువలన లవంబులచే (కోఁతకడ్డనియును తెల్లవట్టివేఱనియును ఇచ్చట లవశబ్దమున కర్థమగుచున్నది.) యథాపూర్వముగా నొకబాలునిఁజేసిపెట్టి నిజతపోబలముచే ప్రోక్షించి త్వరగా జీవశక్తినిచ్చెను.అప్పటి యాతురతచే మునీంద్రుఁడు జ్ఞానదృష్టిచే యథార్థము నెఱుఁగడయ్యె. అంత నాసీతమ్మయును స్నానముచేసి దాసితోడ తిన్నగా నింటికి వచ్చెను. నడుమున కుశునియెత్తికొని చౌతామీఁద మఱియొకబాలునిఁగని "చవుతామీఁద నెవఁడీబాలకుఁడు" అని మునీంద్రునడిగెను. అతఁడును సీతాదేవియొక్క కటిప్రదేశమున కుశునింజూచి మిగులనాశ్చర్యమునందె. సీతాదేవికి నమస్కరించి సర్వవృత్తాంతమును విన్నవించెను. మఱియు నాబాలకునిని సీతాదేవియొక్క తొడమీఁద కూర్చుండబెట్టి "జానకమ్మా!నాయొక్క ప్రసాదమువలన నీకు వీఁడు రెండవకొడుకగును.వీనిని లవములచే నిర్మించుటంబట్టి వీనిపేరు లవుఁడని చెప్పఁబడును." అనియానతిచ్చెను. అంత నాయింతియును వాల్మీకి వచనానుసారముగా నాశిశువు నంగీకరించి లాలించెను॥ ౨౬॥ మునీంద్రుఁడు ఆబాలకులిరువురిలో పెద్దవానికి కుశుఁడనియును చిన్నవానికి లవుఁ

వాల్మీకిముని కుశలవులకు విద్యనేర్పి శ్రీరామచరిత్ర నుపదేశించుట.

డనియును పేళ్లుపెట్టి, లవునికికూడ జాతకర్మాది సంస్కారంబులనుచేసెను. అప్పుడు పుడమిలోను స్వర్గములోను వాద్యములు మ్రోగినవి. దేవతలు సీతాదేవిమీఁదను బాలకులమీఁదను వాల్మీకిమీఁదను పూలవానఁగురిపించిరి. సుమేధాజనకులు పరమోత్సవంబులను చేయిం

కన్యా సుందరావవ్యనావివ । తంత్రీలయసమాయుక్తౌ గాయంతౌ చేరతుర్వనే ॥ ౨౧ ॥ తత్రతత్రమునీనాంయుసమాజేషుసురూపిణౌ । గాయంతావపితౌదృష్ట్వా విస్మితామునయోఽబ్రువన్ ॥ ౨౨ ॥ గంధర్వేష్వపికిన్నరేషుభువి వా వేదేషుదేవాలయే । పాతాలేష్వథవాచతుర్ముఖగృహే లోకేషుసర్వేషుచ ॥ అస్మాభిశ్చిరజీవిభిశ్చిరతరం దృష్ట్వాదిపస్సర్వతో । నాజ్ఞాయీదృశగీతవాద్యగరిమా నాదర్శినాశ్రావిచ ॥ ౨౩ ॥ ఏవంస్తువద్భిరఖిలైర్మునిభిః ప్రతివాసరం । అసాతేమునిమేకాంతే వాల్మీకేరాశ్రమేచిరం ॥ ౨౪ ॥ రుక్మకంకణమంజీర నూపురైస్తావిభూషితౌ । కేయూరరశనాహార కుండలైరతిశోభితౌ ॥ ౨౫ ॥ నిజక్రీడాకౌతుకైస్తౌ బాలవాక్యైర్మనోహరైః । సీతాంచ సుధాంజనకంరంజయామాసతుర్మునిం ॥ ౨౬ ॥ * ॥ ఇతిశ్రీశతకోటిరామచరితాంతర్గతానందరామాయణే వాల్మీకీయే జన్మకాండే కుశలవజన్మకథనంనామ చతుర్థస్సర్గః ॥ ... ... ... ... ... ... ॥౪॥

విష్ణుదాసఉవాచ—శ్రీరామరక్షయాప్రోక్తం కుశాయవ్యాభిమంత్రణం । కృతంతేనైవమునినా గురోతాంమే పకాశయ ॥ ౧ ॥ రామరక్షాంవరాంపుణ్యాం బాలానాంశాంతికారిణీం । ఇతిశిష్యవచఃశ్రుత్వా రామదాసోఽబ్రవీద్వచః ॥ ౨ ॥ శ్రీరామదాసఉవాచ—సమ్యక్పృష్టంత్వయాశిష్య రామరక్షాధునోచ్యతే । యాప్రోక్తాశం

చిరి. క్రమముగా నాబాలురిరువురును విద్యాసంపన్నులయిరి. వారికి వాల్మీకి ధనుర్విద్యను అస్త్రవిద్యను చక్కగా నేర్పెను. శ్రీరామునియొక్క ఆనందరమ్యంబగు చరిత్రంబుగల సమగ్ర రామాయణంబును తానునిర్మించినదానిని నేర్పించెను. అశ్వినీదేవతలవలె సుందరాంగులయిన బాలకులు మధురస్వరసంపన్నులై వీణాపాణులై తాళలయానుసారముగా శ్రీరాము దివ్యచారిత్రంబును పాడుచు వనమునను మునిసమాజంబులలోను సంచరించుచుండిరి. గానముచేయునట్టి కుమారులనుచూచి అత్యంతాశ్చర్యమునందిన మునీంద్రులు “ఆహా! చిరకాలమునుండి చిరజీవులగు మేము గంధర్వులలోను కిన్నరులలోను దేవతలలోను స్వర్గభూపాతాళకైలాససత్యలోకాది సమస్తలోకంబులలోను సర్వదిక్కులలోను విశేషముగా సంగీతమును వింటిమిగాని, ఇట్టి గీతవాద్యనైపుణ్యమును మేమెఱుఁగము. మేమెన్నడను వినలేదు.” అనియిట్లు పొగడుచుండిరి. ఇట్లు సర్వసంస్తుతులై కనకాభరణాలంకృతులైన సుకుమారమూర్తులయిన కుమారులిరువురును వాల్మీక్యాశ్రమంబులో నేకాంతమున సుఖముగా చిరకాలము వసించుచుండిరి. ఆ బాలకులు బాలక్రీడలచేతను బాలభాషణంబులచేతను సీతాదేవిని సుమేధాజనకులను వాల్మీకి మునీంద్రునింగూడ నానందపరచుచుండిరి. ... ... ... ... ॥౪॥

## శ్రీరామరక్షా స్తోత్రాభి వర్ణనము.

“గురువరా! వాల్మీకిముని శ్రీరామరక్షచేత కుశునినభిమంత్రించె నని సెలవిచ్చితిరే, అట్టి శ్రేష్ఠంబును పుణ్యప్రదంబును బాలదోషశాంతి కారిణియునైన శ్రీరామరక్షను నాకు ననుగ్రహించి చెప్పవలయు”నని ప్రార్థించిన విష్ణుదాసుఁడను శిష్యునికి రామదాసుఁడిట్లు నిరూపించు

ధునాపూర్వం స్కందార్థంగిరిజాంప్రతి ॥ ౩ ॥ శ్రీశివఉవాచ—దేవ్యత్రస్కందపుత్రాయ రామరక్షాభిమంత్రణం। కురుతారకఘాతాయ సమర్థోయంభవిష్యతి ॥ ౪ ॥ ఇత్యుక్త్వాకథయామాస రామరక్షాంశివస్త్రియై । నమస్కృత్య శ్రీరామచంద్రం శుచిర్భూత్వాజితేంద్రియః ॥ ౫ ॥ * ॥ అథధ్యానం ॥ వామేకోదండదండంనిజకరకమలే దక్షిణే బాణమేకం। పశ్చాద్భాగేచనిత్యందధతమభిమతం సాసితూణీరభారం। వామేఽవామేవసద్భ్యాంసహమిలితతనుం జానకీలక్ష్మణాభ్యాం। శ్యామంరామంభజేహం ప్రణతజనమనఃఖేదవిచ్ఛేదదక్షం ॥ ౬ ॥ ఓమస్యశ్రీరామరక్షాస్తోత్ర మంత్రస్య-బుధకౌశికఋషిః- శ్రీరామచంద్రోదేవతా-రామఇతిబీజం-అనుష్టుప్ఛందః- శ్రీరామప్రీత్యర్థేజపేవిని యోగః- ఓం ॥ చరితంరఘునాథస్య శతకోటిప్రవిస్తరం। ఏకైకమక్షరంపుంసాం మహాపాతకనాశనం ॥ ౭ ॥ ధ్యాత్వానీలోత్పలశ్యామం రామంరాజీవలోచనం। జానకీలక్ష్మణోపేతం జటామకుటమండితం ॥ ౮ ॥ సాసితూణధనుర్బాణ పాణింనక్తంచరాంతకం। స్వలీలయాజగత్త్రాతు మావిర్భూతమజంవిభుం ॥ ౯ ॥ రామరక్షాంపఠేత్ప్రాజ్ఞః

---

చున్నాడు—శిష్యుఁడా! నీవు చక్కగానడిగితివి. మునుపు స్కందునికొఱకు పార్వతితో పరమేశ్వరుఁడుచెప్పిన శ్రీరామరక్షను చెప్పుచున్నాను. వినుము, శ్రీశివుఁడిట్లనెను—దేవీ! మనస్కందుఁడను పుత్రునికి రామరక్షాభి మంత్రణమును చేయుము. ఇందువలన నితఁడు తారకాసుర సంహారమున సమర్థుఁడు కాఁగలఁడు. ఇట్లని శ్రీరామచంద్రస్వామికి నమస్కరించి పరిశుద్ధుఁడుగా జితేంద్రియుఁడైన సాంబశంకరమూర్తి సతితోనిట్లనెను॥౫ ॥ * ॥ (ఇదిమొదలు ౪౦వ శ్లోకము వరకు శ్రీరామరక్షాస్తుతి భక్తితోఁడ పఠించవలసినది. అర్థవివరణము ననుసంధానము చేయఁదగును. మూలశ్లోక పారాయణమువలననే భక్తిగలమానవుఁడు యథోక్తఫలముల నందగలఁడు. ఇట్లే రామాష్టోత్తర రామసహస్ర రామస్తవరాజాదుల నెఱుఁగునది.) ॥ * ॥ తామరవంటి తనయెడమచేతిలో ధనుర్దండమును కుడిచేతిలో బాణమునుధరించి వెనుకప్రక్కలోఖడ్గమును అమ్ములపొదనుదాల్చి, తనయెడమప్రక్క సీతాదేవియును కుడిప్రక్క లక్ష్మణస్వామియును నిలచియుండగా, నల్లనిమేనుగల్గి సల్లలితాకారుఁడై వెల్గుచుండు భక్తుల మనస్సంకటంబులను పరిహరించుటలో మిక్కిలి సమర్థుఁడైన శ్రీరామచంద్రస్వామిని భజించుచున్నాను॥ అనియిది ధ్యానము॥ ౬॥ (ఇచ్చట మఱియెచ్చటను ప్రణవోచ్చారణంబు స్త్రీ శూద్రులకు తగదు. తక్కిన పౌరాణిక మంత్రస్తోత్ర పారాయణంబు సమస్తేష్ట ప్రదంబుగానుండును.) ఈ రామరక్షాస్తోత్ర మంత్రమునకు బుధకౌశికుఁడు ఋషియైయుండును. దీనికి దేవత శ్రీరామచంద్రుఁడు. దీనికిబీజము రామనామము. దీనిఛంద స్సనుష్టుప్పనఁబడును. శ్రీరామప్రీతికై దీనినివిని యోగింపఁదగినది. శతకోటిప్రవిస్తరంబైన శ్రీరామచరిత్రంబున నొక్కొకయక్షరంబును నరునికి మహాపాపంబులను పరిహరించునంతటిది. నల్లకలువలవలె నల్లనిసల్లలితాంగము గలవాఁడును కమలములవంటి కన్నులుగలవాఁడును సీతాలక్ష్మణ సమేతుఁడును జటాకిరీటాలంకృతుఁడును ధనుర్బాణఖడ్గతూ

పాపఘ్నీం సర్వకామదాం । శిరో మే రాఘవః పాతు ఫాలం దశరథాత్మజః ॥ ౧౦ ॥ కౌసల్యేయో దృశౌ పాతు విశ్వామిత్రప్రియః శ్రుతీ । ఘ్రాణం పాతు మఖత్రాతా ముఖం సౌమిత్రివత్సలః ॥ ౧౧ ॥ జిహ్వాం విద్యానిధిః పాతు కంఠం భరతవందితః । స్కంధౌ దివ్యాయుధః పాతు భుజౌ భగ్నేశకార్ముకః ॥ ౧౨ ॥ కరౌ సీతాపతిః పాతు హృదయం జామదగ్న్యజిత్ । పార్శ్వే రఘువరః పాతు కుక్షిమిక్ష్వాకునందనః ॥ ౧౩ ॥ మధ్యం పాతు ఖరధ్వంసీ నాభిం జాంబవదాశ్రయః । సుగ్రీవేశః కటిం పాతు సక్థినీ హనుమత్ప్రభుః ॥ ౧౪ ॥ ఊరూ రఘూత్తమః పాతు గుహ్యం రక్షఃకులాంతకృత్ । జానునీ సేతుకృత్పాతు జంఘే దశముఖాంతకః ॥ ౧౫ ॥ పాదౌ విభీషణశ్రీదః పాతు రామోఽఖిలం వపుః । ఏతాం రామబలోపేతాం రక్షాం యస్సుకృతీ పఠేత్ ॥ ౧౬ ॥ స చిరాయుస్సుఖీ పుత్రీ విజయీ వినయీ భవేత్ । పాతాలభూతలవ్యోమచారిణశ్ఛద్మచారిణః । న ద్రష్టుమపి శక్తాస్తే రక్షితం రామనామభిః ॥ ౧౭ ॥ రామేతి రామభద్రేతి రామచంద్రేతి వా స్మరన్ । నరో న లిప్యతే పాపైర్భుక్తిం ముక్తిం చ విందతి ॥ ౧౮ ॥ జగజ్జైత్రైకమంత్రేణ రామనామ్నాభిరక్షితం । యః కంఠే ధారయేత్తస్య కరస్థాస్సర్వసిద్ధయః ॥ ౧౯ ॥ వజ్రపంజరనామేదం యో రామకవచం పఠేత్ । అవ్యాహతాజ్ఞస్సర్వత్ర లభతే జయమంగళం ॥ ౨౦ ॥ ఆదిష్టవాన్యథా స్వప్నే రామరక్షామిమాం హరః । తథా లిఖితవాన్ప్రా

ణీరంబులను ధరించినవాఁడును రాక్షసాంతకుఁడును స్వయంప్రభువుగాన నిజలీలచే లోకములను రక్షించుటకై యవతరించినవాఁడునయిన శ్రీరామచంద్రస్వామిని ధ్యానించి॥ ౯ ॥ సమస్తేష్టంబులనిచ్చునట్టిదియును దురితపరిహారకంబునయిన రామరక్షను ప్రాజ్ఞుఁడు పఠించవలయును. రాఘవుఁడు నాతలను రక్షించని. దశరథనందనుఁడు నాఫాలమును పాలించని॥ ౧౦ ॥ కౌసల్యాసుతుఁడు నాకన్నులనుబ్రోచని. విశ్వామిత్రప్రియుఁడు చెవులను, యజ్ఞరక్షకుఁడు నాముక్కును, లక్ష్మణవత్సలుఁడు నాముఖమును, విద్యానిధి నానాలుకను, భరతస్తుతుఁడు కంఠమును, దివ్యాయుధుఁడు నామూఁపులను, శివునివిల్లువిరచినవాఁడు నాభుజములను, జానకీనాథుఁడు నాచేతులను, పరశురాముని జయించినవాఁడు నాడెందమును, రఘువరుఁడు నాప్రక్కలను, ఇక్ష్వాకువంశజుండు నాకడుపును, ఖరాంతకుఁడు నానడుమును, జాంబవదాశ్రయుఁడు నాబొడ్డును, సుగ్రీవనాథుఁడు నాకటిప్రదేశమును, హనుమన్నాయకుఁడు నాపైతొడలను, రఘూత్తముఁడు నాక్రిందితొడలను, రాక్షసాంతకుఁడు నాగుహ్యంబును, సేతువును కట్టినవాఁడు నామోఁగాళ్లను, రావణాంతకుఁడు నాపిక్కలను, విభీషణునికి సంపదనిచ్చినవాఁడు నాపాదములను, శ్రీరాముఁడు సర్వాంగమును కాపాడుగాత. ఇట్టి రామశక్తియుక్తంబగు రక్షను ఎవ్వఁడు పఠించునో వాఁడు ఆయుస్సౌఖ్యంబులును వినయవిజయంబులును పుత్రులును గల్గినవాఁడగును॥ ౧౬॥ రామనామములచే రక్షింపఁబడినవానిని త్రిలోకసంచారులును మోసగాండ్రును చూచుటకుగూడశక్తులు కాచాలరు॥ ౧౭॥ రామయనిగాని రామభద్రయనిగాని రామచంద్రయనిగాని స్మరించుమానవుఁడు పాపముక్తుఁడై ఇహపరగతుల నందగలఁడు. లోకైకవిజయ మంత్రంబయిన రామనామముచే రక్షింపఁబడినవాఁడెవఁడు దీనిని కంఠమునధరించునో సర్వసిద్ధులును వానిచేతఁజిక్కి

తః ప్రబుద్ధో బుధకౌశికః ॥ ౨౧ ॥ రామో దాశరథిశ్శూరో లక్ష్మణానుచరో బలీ । కాకుత్స్థః పురుషః పూర్ణః కౌసల్యానందవర్ధనః ॥ ౨౨॥ వేదాంతవేద్యో యజ్ఞేశః పురాణపురుషోత్తమః । జానకీవల్లభశ్శ్రీమా నప్రమేయపరాక్రమః॥ ౨౩ ॥ ఇత్యేతాని జపేన్నిత్యం మద్భక్తశ్శ్రద్ధయాన్వితః । అశ్వమేధాధికం పుణ్యం లభతే నాత్ర సంశయః॥ ౨౪ ॥ సన్నద్ధః కవచీ ఖడ్గీ చాపబాణధరో యువా । గచ్ఛన్ మనోరథోఽస్మాకం రామః పాతు సలక్ష్మణః॥ ౨౫ ॥ తరుణౌ రూపసంపన్నౌ సుకుమారౌ మహాబలౌ । పుండరీకవిశాలాక్షౌ చీరకృష్ణాజినాంబరౌ ॥ ౨౬ ॥ ఫలమూలాశనౌ దాంతౌ తాపసౌ బ్రహ్మచారిణౌ । పుత్రౌ దశరథస్యైతౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ ॥ ౨౭ ॥ ధన్వినౌ బద్ధనిస్త్రింశౌ కాకపక్షధరౌ శ్రుతౌ । వీరౌ మాం పథి రక్షేతాం తావుభౌ రామలక్ష్మణౌ ॥ ౨౮ ॥ శరణ్యౌ సర్వసత్త్వానాం శ్రేష్ఠౌ సర్వధనుష్మతాం । రక్షఃకులనిహంతారౌ త్రాయేతాం నో రఘూత్తమౌ ॥ ౨౯ ॥ ఆత్తసజ్జధనుషావిషుస్పృశౌ । వక్షయాశుగనిషంగసంగినౌ । రక్షణాయ మమ రామలక్ష్మణౌ । వగ్రతః పథి సదైవ గచ్ఛతాం ॥ ౩౦ ॥ ఆరామః కల్పవృక్షాణాం విరామస్సకలాపదాం । అభిరామస్త్రిలోకానాం రామశ్శ్రీమాన్ స నః ప్రభుః ॥ ౩౧ ॥ రామాయ రామభద్రాయ రామ

నని. వజ్రపంజరనామకంబగు నీరామకవచంబును పఠించినవాఁడు అంతట నిజాజ్ఞ చెల్లుచుండగా జయమును మంగళంబు నందగలఁడు॥ ౨౦ ॥ ఈరామరక్షను శివుఁడు స్వప్నమునం దెట్లు చెప్పెనో అట్లే బుధకౌశికుఁడు మేల్కొని ప్రొద్దున వ్రాసెను ॥ ౨౧ ॥ రామునాదిగా నప్రమేయపరాక్రమః- అనువరకు నుండెడు రెండు శ్లోకములను నాయొక్క భక్తుఁడెవ్వఁడు అక్కఱతో పఠించుచుండునో వాఁడు అశ్వమేధముకన్న నధికమయిన పుణ్యమునందగలఁడు. ఇందుకు సంశయము లేదు॥ ౨౪॥ చాపబాణంబులను కవచఖడ్గంబులను ధరించిన తరుణుఁడును యుద్ధసన్నద్ధుఁడునై లక్ష్మణునితోడ పోవుచుండు మా మనోరథమూర్తియగు రాముఁడు రక్షించని ॥ ౨౫॥ సుకుమారులును సుందరాంగులును మహాబలులును తరుణులును కమలాయతనేత్రులును నారమళ్లను కృష్ణాజినంబులను ధరించినవారును ఫలమూలభక్షకులును జితేంద్రియులును తపస్సంపన్నులును బ్రహ్మచారులును అనురూపసహజాతులును వీరులును ధనుర్బాణ ఖడ్గధారులును చెవులమీఁద కాకపక్షధారులును దశరథనందనులునయిన శ్రీరామ లక్ష్మణులు నన్ను దారిలో రక్షించుచుండని ॥ ౨౮ ॥ సమస్తప్రాణులకు రక్షకులును, ధనుర్ధారులలో శ్రేష్ఠులును, రాక్షసకులాంతకులునయిన రఘువీరులు మముఁ బ్రోచుగాత॥ ౨౯॥ అక్షయతూణీరంబులుగల రామలక్ష్మణులు వింటినెక్కుబెట్టి చేత బాణమునందికొని నిరంతరము నాయొక్క రక్షణకొఱకు దారిలో నెదుట పోవుచుండని॥ ౩౦॥ మాయొక్క ప్రభువగు శ్రీరాముఁడు కల్పవృక్షంబులకు నారామంబు (ఉద్యానవనము – అన్నికోర్కెలనీడేర్చువాఁడు.) సమస్తవిపత్తులకును విరామంబు (అంతము–ఆపదలను తొలగించును.) ముల్లోకములకును అభిరాముఁడు (సుందరుఁడు – కష్టముల నుపరిహరించి కోరికెలనిచ్చినవానికన్న నెవఁడు సుందరుండు!) ॥ ౩౧ ॥ యోగిచిత్తంబులలో

చంద్రాయ వేధసే । రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః ॥ ౩౨ ॥ శ్రీరామ రామ రఘునందన రామ రామ । శ్రీరామ రామ భరతాగ్రజ రామ రామ ॥ శ్రీరామ రామ రణకర్కశ రామ రామ । శ్రీరామ రామ శరణం భవ రామ రామ ॥ ౩౩ ॥ లోకాభిరామం రణరంగధీరం । రాజీవనేత్రం రఘువంశనాథం ॥ కారుణ్యపాత్రం కరుణాకరం తం । శ్రీరామచంద్రం శరణం ప్రపద్యే ॥ ౩౪ ॥ దక్షిణే లక్ష్మణో యస్య వామే చ జనకాత్మజా । పురతో మారుతిర్యస్య తం వందే రఘునందనం ॥ ౩౫ ॥ గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసం । రామాయణమహామాలా రత్నం వందే నిలాత్మజం ॥ ౩౬ ॥ అఘౌఘులిప్తమూర్తే త్వం రోగాస్తిష్ఠంతు దూరతః । వసీవతీః సదాస్మాకం హృది రామో ధనుర్ధరః ॥ ౩౭ ॥ మనోజవం మారుతతుల్యవేగం । జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం । వాతాత్మజం వానరయూధముఖ్యం । శ్రీరామదూతం శరణం ప్రపద్యే ॥ ౩౮ ॥ రామ రామ తవ పాదపంకజం చింతయామి భవబంధముక్తయే । వందితం సురనరేంద్రమౌళిభిర్ధ్యాయితం మనసి యోగిభిస్సదా ॥ ౩౯ ॥ రామం లక్ష్మణపూర్వజం రఘువరం సీతాపతిం సుందరం । కాకుత్స్థం కరుణార్ణవం గుణనిధిం విప్రప్రియం ధార్మికం ॥ రాజేంద్రం సత్యసంధం దశరథతనయం శ్యామలం శాంతమూర్తిం । వందే లోకాభిరామం రఘుకులతిలకం రాఘవం రావణారిం ॥ ౪౦ ॥ ఏతాని రామనామాని ప్రాతరుత్థాయ యః పఠేత్ । అపు

---

లించువాఁడు మంగళమూర్తియును లోకాహ్లాదకుండును పరమాత్మయును రఘుకులతిలకుండును ఈశ్వరుఁడును జానకీవల్లభుండునయిన శ్రీరామునికి నమస్కారము॥ ౩౨॥ శ్రీరామా! నిన్ను పంతొమ్మిదిమార్లు స్మరించెదను. నాకునీవు రక్షకుండగుము॥ ౩౩॥ లోకమోహనుండును యుద్ధశూరుఁడును కమలనయనుండును రఘుకులనాయకుఁడును దయానిధియును రక్షకుండునయిన శ్రీరామచంద్రస్వామిని పొందుచున్నాను॥ ౩౪॥ కుడిప్రక్కలో లక్ష్మణుఁడును ఎడమప్రక్కలో సీతయును ఎదుట నాంజనేయుండునుగల రాఘవమూర్తిని వందించెదను॥ ౩౫॥ సముద్రమును ఆవుయొక్క అడుగుగాఁజేసికొని లంఘించినవాఁడును, రాక్షసులను దోమలుగాజేసికొని దుమ్ముదులిపినవాఁడునగు శ్రీరామచరిత్రమనుహారమున రత్నమువలె రంజించునట్టి వాయుపుత్రుని వందించెదను॥ ౩౬॥ కోదండపాణియగు శ్రీరాముఁడు నిరంతరము మామనమున నివసించుటచేత పాపసమూహమా! నీవు దూరముగాపొమ్ము. రోగములారా! మీరుదూరమున నిల్వఁదగును॥౩౭॥మనస్సువంటి వేగమును వాయువువంటి గమనశక్తియును జితేంద్రియత్వము ధీమంతులలో శ్రేష్ఠత్వము కపిసైన్యమున ప్రాముఖ్యము శ్రీరామకింకరత్వమునుగల వాయునందనుఁడగు నాంజనేయస్వామిని రక్షకునిగానందెదను॥ ౩౮॥ శ్రీరామా! నిరంతరము యోగులచే మనంబున ధ్యానింపఁబడుచుండెడు దేవరాజ నరరాజ కిరీటంబులచే వందింపఁబడుచుండెడు నీయొక్క చరణకమలంబులను జన్మసంకట పరిహారమునకై చింతించుచున్నాను॥ ౩౯ ॥రామా, లక్ష్మణాగ్రజా, రఘువీరా, సీతాపతీ, సుందరా, కకుత్స్థకులజాతా, దయానిధీ, గుణనిధీ, బ్రాహ్మణప్రియా, ధార్మికా, రాజరాజా, సత్యసంధా, దశరథనందనా, శ్యామలాంగా, శాంతమూర్తీ, లోకసుందరా, రఘువంశరత్నమా, రాఘవా, రావణవైరీ! నినువందించెదను ॥ ౪౦ ॥ * ॥ ఈ శివ- శ్లోకము

త్రోలభతేపుత్రం ధనార్థీలభతేధనం ॥ ౪౧ ॥ మాతారామో మత్పితారామచంద్రః । స్వామీరామో మత్సఖారామచంద్రః । సర్వస్వంమేరామచంద్రోదయాళు । ర్నాన్యంజానేనైవజానేనజానే ॥ ౪౨ ॥ శ్రీరామనామామృతమంత్రబీజ సంజీవనీచేన్మనసిప్రవిష్టా ॥ హాలాహలంవాప్రళయానలంవా మృత్యోర్ముఖంవావిశతాంకుతోభీః ॥ ౪౩ ॥ శ్రీశబ్దపూర్వంజయశబ్దమధ్యం జయద్వయేనాపిపునఃప్రయుక్తం । త్రిస్సప్తకృత్వోరఘునాథనామ జపాన్నిహన్యాద్ద్విజకోటిహత్యాః ॥ ౪౪ ॥ ఏవంగిరీంద్రజేప్రోక్తా రామరక్షామయాతవ । మయోపదిష్టాయాస్వప్నే విశ్వామిత్రాయవైపురా ॥ ౪౫ ॥ * ॥ రామదాసఉవాచ—ఏవంశివేనోపదిష్టాం శ్రుత్వాదేవీగిరీంద్రజా । రామరక్షాంపఠిత్వాసాస్కందంసమభిమంత్రయత్ ॥ ౪౬ ॥ తస్యాస్తేజోబలేనైవ జఘానతారకాసురం । షడాననఃక్షణాదేవ కృతకృత్యోభవత్పురా ॥ ౪౭ ॥ సైవేయంరామరక్షాతే మయాఖ్యాతాతిపుణ్యదా । యస్యాఃశ్రవణమాత్రేణ కస్యాపినభయంభవేత్ ॥ ౪౮ ॥ వాల్మీకినానయాపూర్వం కుశాయవ్యాభిషేచనం । కృతంబాలగ్రహాణాంచ శాంత్యర్థంసామయోదితా ॥ ౪౯ ॥ బాలానాంగ్రహశాంత్యర్థం జపనీయానిరంతరం । రామరక్షామహాశ్రేష్ఠామహాఘౌఘనివారిణీ ॥ ౫౦ ॥

---

మొదలు ౪౧వ- శ్లోకమువరకుగల శ్రీరామనామాంకిత శ్లోకంబులను ౩౫టిని ప్రొద్దునలేచి యెవ్వఁడుపఠించునో, వాఁడు పుత్రులులేనివాఁడైన పుత్రులను, ధనార్థిగానుండిన ధనమును పొందగలఁడు॥ ౪౧॥ నాతల్లియును నాతండ్రియును నన్నేలినవాఁడును నాచెలికాఁడును మఱియు నాసర్వస్వంబును దయాళువైన శ్రీరామచంద్రుండొక్కఁడె. వేఱొకనిని నేనెఱుఁగను, నిక్కముగా నెఱుఁగను. నాకుఁదెలియదు॥ ౪౨॥ శ్రీరాములవారి దివ్యనామంబను అమృతమంత్రముయొక్క బీజంబయిన రామభక్తియును సంజీవనీరసము మనంబునప్రవేశించియుండగా, కాలకూటవిషంబునను ప్రళయాగ్నియందును మృత్యుముఖమునందును ప్రవేశించినను భయములేదు॥ ౪౩॥ "శ్రీజయరఘునాథ జయజయ"—అను మంత్రము ౨౧తిడవులు.జపించువానియొక్క బ్రహ్మహత్యాద్యనేక పాపంబులు పరిహరించును॥ ౪౪॥ పార్వతీ! మునుపు నేను విశ్వామిత్రునికి స్వప్నమున నెట్లుపదేశించితినో అట్లే రామరక్షను నీకు నుపదేశించితిని॥ ౪౫॥ అని శివుఁడు అనుగ్రహించెనని రామదాసుఁడు మరల చెప్పుచున్నాఁడు—పార్వతీదేవి ఇట్లు శివునిచే నుపదేశింపఁబడిన శ్రీరామమంత్రరక్షచే కుమారస్వామి నభిమంత్రించెను. మునుపు షణ్ముఖుఁడు దాని మహిమవలననే తారకాసురుని సంహరించి ధన్యుఁడాయెను॥ ౪౭॥ ఆ యీరామరక్షను విష్ణుదాసా! నీకునేను చెప్పితిని. ఇది మిక్కిలి పుణ్యాకరంబు దీనిని విన్నందువలన దేనిభయమునులేదు॥ ౪౮ ॥ శ్రీవాల్మీకిముని బాలగ్రహశాంతికొఱకు ఈరామరక్షచేతనే కుశుని నభిమంత్రించెను॥ ౪౯॥ మహాదురిత పరిహారకంబగు నీశ్రీరామరక్షను బాలగ్రహపీడాపరిహారార్థమునిరంతరము జపించఁదగును॥ ౫౦॥ దీనికి మించిన మేలైనస్తోత్రములేదు. దీనికన్నను మంచి

నాస్యాః పరతరంస్తోత్రం నాస్యాఃపరతరోజపః । నాస్యాఃపరతరంకించి త్సత్యంసత్యం వదామ్యహం ॥౫౧॥ ॥
ఇతిశ్రీ శతకోటిరామచరితాంతర్గతే శ్రీమదానందరామాయణే వాల్మీకీయే జన్మకాండే రామరక్షాకథనంనామ పంచమస్సర్గః ॥ * ॥ ... ... ... ... ... ... ... ... ... ॥౫॥

శ్రీరామదాసఉవాచ—ఏకదాజానకీప్రాహ వాల్మీకింమునిపుంగవం । కథయస్వవ్రతంయేన రామయోగోభవేన్మనే ॥ ౧ ॥ తత్సీతావచనంశ్రుత్వా వాల్మీకిస్తాంవచోబ్రవీత్ । ప్రతిపద్దినమారభ్య యావత్స్యాన్నవమీసితా ॥ తావన్నవదినంసీతే వ్రతంకురుమయోచ్యతే। ప్రతిపదిరామచంద్ర పాదుకేధాతునిర్మితే ॥ ౩ ॥ కృత్వార్చ్య నవకమలై ర్దేహిమంత్రాంజలి శుభం । తతఃపుత్రాననాభ్యాంత్వం జన్మకాండంశుభం శ్రుణు ॥ ౪ ॥ అష్టాదశకమలైశ్చ ద్వితీయాయాంశుభాంజలిం। మంత్రైర్దేహిపూజనాంతే పతిపాదుకయోర్ముదా ॥ ౫ ॥ పతింవినాస్త్రియానాన్య త్పూజనీయంహిదైవతం । జన్మకాండంద్వివారంతు శ్రుణుభక్త్యాశుచివ్రతే ॥ ౬ ॥ ఏవంవృద్ధిర్నవాబ్జైశ్చ కార్యాస్మిన్దినే । నవమ్యామేకాశీత్యబ్జైః పూజ్యస్త్వథిత్వపాదుకే ॥ ౭ ॥ నవవారజన్మకాండం పుత్రాస్యా

౦లేదు. ఇంతకన్నను గొప్పది మఱియొక్కటిలేదు. నేను సత్యముగాఁ జెప్పుచున్నాను. ౫౧ ॥*॥ (ఈసర్గలో చెప్పఁబడిన రామరక్షను షణ్ముఖునికై శివుఁడు దేవికుపదేశించెననిన కాలవ్యత్యాసదోషమని శంకించఁదగదు. వేదమున రామతాపిన్యుపనిషత్తులో శ్రీరామకథగలదు. ధాతాయథా పూర్వమకల్పయత్ – అనియుండుటచే కుమారోత్పత్తికి ఁనుకటి యేఁదోకల్పములోని శ్రీరామరక్షయని యెఱుఁగదగును.) ... ... ... ॥౫॥

వాల్మీకిముని సీతాదేవికి సంయోగకరణ వ్రతము నుపదేశించుట.

ఒకప్పుడు జానకీదేవి వాల్మీకిమునీంద్రునింజూచి "మునీంద్రా! శ్రీరాముని సమాగమము కలుగునట్టి వ్రతము నుపదేశింపుము." అనివేడెను. ఆసీతావాక్యమును విని వాల్మీకియిట్లనెను—సీతమ్మా! నేనొకవ్రతమును చెప్పెదను, వినుము. శుక్లపక్షమున పాడ్యమిమొదలు నవమివరకు వ్రతము నాచరించవలయును. పాడ్యమినాఁడు శ్రీరామచంద్రునియొక్క ధాతురచితములయిన పాదుకలను చేయించిపెట్టి పూజించి తొమ్మిది తామరపూలుగల మంత్రాంజలిని సమర్పించవలసినది. పిదప నీబిడ్డ నోటిమీఁదుగా మంగళకరమగు జన్మకాండమును వినుము. రెండవనాడగు విదియయందు పతిపాదుకలకు ౧౮ కమలములుగల మంత్రాంజలి నర్పించదగును. నియమములతో జన్మకాండమును రెండుమార్లు వినవలయును. పతిసితప్ప వేరుదైవమును స్త్రీలు పూజింపరాదు. మూఁడవనాడు ౨౭ కమలములు, ౩మార్లు జన్మకాండ కథవినుట, ఇట్లే వృద్ధినొందుచురాగా తొమ్మిదియవనాడు ౮౧ కమలముల మంత్రాంజలినర్పించి ౯మార్లు జన్మకాండమును పుత్రులనుండి వినవలయును. అంత దశమినాడు మంగళస్నానము

భ్యాం సుఖం శృణు । తతో దశమ్యాం సుస్నాతై కాశీతి ద్విజదంపతీన్ ॥ ౮॥ సంపూజ్య వస్త్రాభరణైః భోజయిత్వా
త్రమైథిలి । దత్త్వా తేభ్యో దక్షిణాస్త్వం విసర్జయ ప్రణమ్య తాన్ ॥ ౯ ॥ అనేన వ్రతరాజేన జన్మకాండశ్రవణేన హి ।
అచిరాత్పతినా యోగం ప్రాప్స్యసి త్వం విదేహజే ॥ ౧౦ ॥ సంయోగకరణం నామ వ్రతం చేదం సుపుణ్యదం । యే కుర్వ
న్త్యత్ర మనుజాః స్త్రియో యోగం లభంతి తే ॥ ౧౧॥ తన్మునేర్వచనం శ్రుత్వా జానకీ ప్రాహ తం పునః । బహూన్యబ్జాని
సాకేతే పుష్పారామజలాశయే ॥౧౨॥ సంతి కః ప్రతివైగంతుం సమర్థోస్తి హ వర్తతే । రామాజ్ఞయా రామదూతైః
క్రియతే రక్షణం సదా ॥ ౧౩ ॥ తత్సీతావచనం శ్రుత్వా తత్పురస్సంస్థితో లవః । అబ్రవీన్మాతరం వాక్యం పంచవర్ష
వయస్థితః ॥ ౧౪॥ అంబారంభం వ్రతస్యాద్య త్వం కురుష్వాచిరాదిహ । అబ్జాన్యహం ప్రదాస్యామి సమానీయ నిరం
తరం ॥ ౧౫ ॥ తల్లవస్య వచః శ్రుత్వా విహస్యాలింగ్య బాలకం । చుచుంబ తన్ముఖం సీతా లవం వచనమబ్రవీత్ ॥౧౬॥
పంకజాని కథం వత్స త్వం సమానీయ దాస్యసి । అసంఖ్యాతై రామదూతైః క్రియతే రక్షణం సదా ॥౧౭॥ తన్మాతృవచనం
శ్రుత్వా లవః ప్రాహాథ మాతరం । అంబ త్వత్ స్తన్యపానేన వాల్మీకేశ్శస్త్రవిద్యయా ॥ ౧౮॥ తథాశీర్భిర్మునేశ్చాపి
రామస్యాపి భయం న మే । పశ్యాంబ పౌరుషం మేఽద్య మా మసజ్ఞాతుమర్హసి ॥ ౧౯ ॥ ఇత్యుక్త్వా మాతరం నత్వా

చేసి యచ్చట ౮౧ బ్రాహ్మణదంపతులకు వస్త్రాభరణాలంకారాది సత్కారములచే పూజించి,
మంచిభోజనము పెట్టి తాంబూలదక్షిణలనిచ్చి నమస్కరించి పంపుము. ఈ సర్వోత్తమవ్రతము
నాచరించుటచేతను జన్మకాండ శ్రవణముచేతను నీవు త్వరగా నీపతితోడ చేరుదువు. ఇది మి
క్కిలి పుణ్యకరంబయిన సంయోగకరణమను పేరుగల వ్రతము. పతిభక్తిగల్గి యెవరు ఈ వ్ర
తము నాచరించెదరో వారు తమ వారియొక్క సమాయోగము గల్గియుందురు. అనియిట్లు చెప్పి
న వాల్మీకిమునీంద్రునియొక్క మాటనువిని మరల సీతమ్మ “మునీంద్రా! అయోధ్యలోని పుష్పా
రామంబున సరోవరమునందు కావలసినన్ని తామరలుగలవు. అచ్చటికి పోయివచ్చునట్టి సమ
ర్థుడు ఇచ్చట నెవడుగలడు? అక్కడ శ్రీరామదూతలు రాజాజ్ఞచే చక్కగా రక్షించుచుం
దురు.” అని మందలించెను. అప్పుడచ్చట నెదుటనున్న లవుడు సీతావాక్యములనువిని యై
దేండ్ల వయస్సుగలవాడైనను తనతల్లినిజూచి “తల్లీ! త్వరగా నీవిపుడే వ్రతమునకారంభింపు
ము. నిరంతరమును నిరంతరాయముగా తామరలను తెచ్చి. నీకు సిద్ధపరచుచున్నాను.” అని
వక్కాణించెను. ఆబాలకుని మాటనువిని సీతమ్మ నవ్వి యాచిన్నవాని నాలింగించుకొని మో
మును ముద్దుపెట్టి “వత్సా! ఎల్లప్పుడును లెక్కలేని రామదూతలు రక్షించుచుందురే, అట్టి
శ్రీరామారామ సరసీరుహంబుల నెట్లు నీవు తెచ్చియివ్వగలవు?” అనియడిగెను. అందుకు లవుం
డు “తల్లీ! నీ స్తన్యపానబలము చేతను వాల్మీకిముని యుపదేశించిన శస్త్రవిద్యచేతను మునీంద్రా
శీర్వాదములచేతను శ్రీరామునియొక్క భయము గూడ నాకు లేదు. జననీ! నాయొక్క పౌరు
షమును చూడుము. నన్నిప్పుడు పంపుటకు తగియుందువు.” అని యిట్లు చెప్పి తల్లికినమస్క

ల్మీకిం ప్రణిపత్యచ । అతిఖిలారీడితస్తాభ్యాం ధృతతూణీరకార్ముకః ॥ ౨౦ ॥ వస్త్రాలంకారసంయుక్తస్త్వేకాకీరథమా
స్థితః । యయౌలవస్త్వయోధ్యాయాం శ్రీఃహీనాంబవేనసః ॥ ౨౧ ॥ క్రోశోపరిరథంస్థాప్య పద్భ్యామారామమా
యయౌ । తావన్మధ్యాహ్నసమయే గతాఆరామరక్షకాః ॥ ౨౨ ॥ భోజనార్థంస్వగేహాని లవో౽బ్జానితదాహరత్ ।
పునస్స్వస్యందనేస్థిత్వా గత్వాశ్రమపదంమునేః ॥ ౨౩ ॥ నత్వామునింమాతరంస్వాం పంకజాన్యర్పయన్ముదా । ముది
తాజానకీచాపి వ్రతారంభమథాకరోత్ ॥ ౨౪ ॥ ఏవంసప్తదినాన్యబ్జా న్యానయామాసబాలకః । నవిదూరామదూ
తాస్తే నీయంతేబ్జానిచేతిహి ॥ ౨౫ ॥ అథాష్టమదినేయోధ్యాం పూర్వవత్సలవోయయౌ । ఆరామస్యబహిఃస్థాప్య
రథంపద్భ్యాంయయౌలవః ॥ ౨౬ ॥ గత్వారామస్థకాసారం గృహీత్వాబ్జానినిర్భయః । శనైర్యాస్యద్రథంప్రాప
తావదారామమాయయుః ॥ ౨౭ ॥ తేతంద్దృష్ట్వాలవంసాబ్జం పప్రచ్ఛుర్విస్మయాన్వితాః । నత్వంద్దృష్టః దాస్మాభిః
శ్రీరామానుచరేషుహి ॥ ౨౮ ॥ కదారభ్యరామసేవా త్వయాచాంగీకృతావద । యతస్త్వంనిర్భయోబ్జాని గృహీ
త్వాగచ్ఛసిప్రభుం ॥ ౨౯ ॥ రామదూతవచఃశ్రుత్వా విహస్యాహలవోపిసః । వాల్మీక్యనుచరశ్చాహం నరామదర్శ
కమ ॥ ౩౦ ॥ వాల్మీకేరాజ్ఞయాబ్జాని నీయంతేప్రత్యహంత్వితః । మయాయుష్మాభిరద్యైవ దృష్టోహంనపురా

---

రించి వాల్మీకినివందించి వారియిరువురి యాశీర్వాదంబులనంది ధనుర్బాణములను ధరించిన వాఁడై వస్త్రాలంకారభూషణాన్వితుఁడునై ఒంటరిగా రథమునెక్కి శ్రీదేవిలేనియయోధ్యకు త్వరగావెడలి క్రోసెడుదూరముననే రథమును నిలిపి కాలినడకతో నుద్యానవనమునకు వచ్చెను. అంతలో నాఁడు మధ్యాహ్నకాలమున తోటయొక్క కావలివారందరును తమయిండ్లకు భోజనమునకై వెడలిరి. ఆసమయంబున లవుఁడు కావలసిన కమలములను సరోవరమున తీసికొని వచ్చి, మరలనల్లె రథమునెక్కి మునీంద్రాశ్రమమునకే తెంచి, వాల్మీకికిని తల్లికిని వందించి సంతోషముగాఁ దామరలనర్పించెను. జానకీదేవియును వ్రతాచరణమున కారంభించెను. ఇట్లే ౭దినములు బాలకుండు కమలములనుగొనివచ్చెను. ఆరామరక్షకులెవ్వరును చూడలేదు. అంత నెనిమిదవదినమునందు అయోధ్యాపట్టణమున ముందువలెనే లవుండేతెంచెను. తోటకు బయట రథమునునిలిపి కాలినడకతో వెడలి, తిన్నగా సరోవరమున నిర్భయముగా కమలములను తీసికొని యథాపూర్వముగా తనరథమువద్దికివచ్చెను. అంతలో నచ్చటికి రక్షకులగు రామదూతులువచ్చి కమలములతోడనున్న లవునిఁజూచి యాశ్చర్యమునంది యిట్లడిగిరి—"మేము నిన్నెప్పుడును శ్రీరాముని యనుచరులలో నొకనినిగా నెఱుఁగముగదా! నీవు భయములేక తామరలను తీసికొని ప్రభుసన్నిధికి పోవుచుండుటచే విచారించుచున్నాము ఎప్పుడు మొదలు నీవు శ్రీరామునిసేవ కొప్పికొనియున్నావు? చెప్పుము." అని యడిగిన శ్రీరామదూతులమాట విని లవుఁడునునవ్వుచు "నేను వాల్మీకిమునియొక్క ఆజ్ఞచే ప్రతిదినమందును ఇచ్చటినుండి కమలములను కొనిపోవుచున్నాను. మీరలిపుడే నన్నుచూచితిరి. మునుపెప్పుడును మీరెఱుఁ

కదా ॥ ౩౧ ॥ ఇతితద్వచనంశ్రుత్వా వాల్మీకియంలవంతదా । జ్ఞాత్వాదూతాః పారకీయం క్రోధాద్వచనమబ్రువన్ ॥ ౩౨ ॥ రామస్త్వయానదృష్టోఽత్ర ననః పృష్టంత్వయాపునః । నాజ్ఞాపితోఽసిరామేణ నీయంతేజ్ఞానిప్రత్యహం ॥ ౩౩ ॥ నజ్ఞాతమతదస్మాభిస్త్విదానీంతిష్ఠమాప్రజ । అపరాధ్యసిరామస్య త్వాంనేష్యామోవయంప్రభుం ॥ ౩౪ ॥ ఇత్యుక్త్వాతస్యపంథానం రురుధూరామసేవకాః । చతుర్దశశస్త్రపాస్త్రాస్సశతారామతోయదా ॥ ౩౫ ॥ తాందృష్ట్వా స్యందనస్థస్స లవోఽప్యాహవిహాస్యచ । యూయంగచ్ఛత శ్రీరామం మద్వృత్తంబ్రూతసాదరాత్ ॥ ౩౬ ॥ యద్యస్తిపౌరుషంరామే తర్హిఽయాస్యతిమాంప్రతి । తత్తస్యవచనంశ్రుత్వా క్రోధాద్దూతావచోఽబ్రువన్ ॥ ౩౭ ॥ మర్తుకామః కథంవత్స త్వమిత్థంవల్గసేముధా । త్వాంబధ్వావయమేవాద్య వినేష్యామోరఘూత్తమం ॥ ౩౮ ॥ ఇత్యుక్త్వాతేలవం ధర్తుకామా యయుస్తస్యరథాంతికం । తాందృష్ట్వాసికటంప్రాప్తాన్ రామదూతాన్ లవోఽపిసః ॥ ౩౯ ॥ ఆకృష్యచధనుశ్చాపం శరాన్సంధాయవేగతః । అబ్రవీత్తాన్పునర్వాక్యం మాగంతవ్యంమమాంతికం ॥ ౪౦ ॥ మాగచ్ఛతైరథునాయుష్మాన్ త్యజామిరాఘవాంతికే । ఇత్యుక్త్వాతాన్పునర్దృష్ట్వాత్మానంధర్తుంసముద్యతాన్ ॥ ౪౧ ॥ రామాగ్రేప్రాక్షిపద్బాణైర్లీలయాధ్వరమంటపే । చతుర్దశరామదూతా లవమార్గణతాడితాః ॥ ౪౨ ॥ నిపేతుర్మూర్ఛితాస్సర్వే రామాగ్రేజాహ్నవీతటే । శతశోరామదూతాస్తే దృష్ట్వాచక్రుః పలాయనం ॥ ౪౩ ॥ లవోఽపివిజయీశీఘ్రం పూర్వవచ్చాశ్రమంయయౌ । సమర్ప్యబ్జానిసీతాయై సర్వంవృత్తంన్యవేదయత్ ॥ ౪౪ ॥ చతుర్దశరామదూతాః స్వ

గరు."॥౩౧॥అని చెప్పగా నామాటలను విని శ్రీరామదూతలు లవునిని అన్యాయిగా నెఱిఁగి క్రోధము

## లవుఁడు శ్రీరాముని యుద్యానవనమ్మున పరాక్రమించుట.

చే "నీవు శ్రీరామునిఁ జూడనేలేదు? మఱి మమ్మును నీవడుగలేదు. రాముని యుత్తరువు లేకయే తామరలను కొనిపోదువా? ఇట్లని మాకు తెలియలేదు. నిలువుము. పోవలదు. శ్రీరామాపరాధిగానున్నావు. నిన్ను ప్రభుసన్నిధికి కొనిపోవుచున్నాము." అని చెప్పి లవునిదారి నడ్డగించిరి. ఇట్లు నిరోధించిన తోటకు నీళ్లుజల్లెడువారు నూరుమందితోడ ముట్టడించిన ౧౪ మంది బటులను చూచి రథముమీఁదనున్న లవుఁడు నవ్వి "మీరు వెడలి శ్రీరామునికి నాసంగతిని చెప్పండి. రామునికి పౌరుషముండిన నతఁడే నావద్దికి వచ్చును." అనిగర్జించగా, వారు క్రోధమునంది "బాలకా! నీవు చావుఁగోరి యిట్లు మొఱుగుచున్నావు. నిన్ను కట్టికట్టి యిపుడే శ్రీరామసన్నిధికి తీసికొనిపోవుచున్నాము." అని లవునిఁబట్టుటకై రథమువద్దికివచ్చిరి. సమీపించిన వారిని చూచి లవుఁడు తనగొప్పధనుస్సు నాకర్షించి త్వరగా బాణముల ననుసంధానముచేసి "నావద్దికిరావలదు. బాణములచే మిమ్మును శ్రీరామునివద్దికి పంపెదను." అనియనుచు ఆతురపడివచ్చుచున్నవారిని వినోదముగా యజ్ఞమంటపమున శ్రీరామసన్నిధికి బాణములచే పడద్రోసెను. ఇట్లా పదునాల్గురు రామదూతలు గంగాతీరమున శ్రీరామసన్నిధిలో లవశరవిద్ధులై పడి మూర్ఛితులైరి. తక్కిన నూరారుమంది తోటవాండ్రు పరుగెత్తిరి. లవుఁడును జయముగల

స్థధిత్వాశ్చిరేణతే । సర్వంవృత్తంరాఘవాయ కథయామాసురాదరాత్ ॥ ౪౫ ॥ తత్ శ్రుత్వారామచంద్రోపి విస్మయావిష్టమానసః । సహస్రదూతాన్నారామ రక్షణార్థంప్రచోదయత్॥ ౪౬ ॥ లవోప్యథనవమ్యాంస సాకేతంపూర్వవద్యయౌ । సహస్రంగామదూతాస్తే లవంయోద్ధుంసముద్యతాః ॥ ౪౭ ॥ లవస్తానాహ యుష్మాకం స్వామినారాఘవేణహి । యదాసీతావనేత్యక్తా జయశ్రీశ్చగతాతదా ॥ ౪౮॥ యుష్మాకంరాఘవస్యాపి గచ్ఛధ్వంరాఘవంపునః॥ యుష్మాభిర్నామయాయుద్ధం కర్తవ్యంమరణోన్ముఖైః ॥ ౪౯ ॥ సీతాత్యాగేతుయుష్మాకం స్వామినఃపౌరుషంనమాం॥ ఇతితేలవవాగ్బాణైః భిన్నమర్మస్థలాస్తదా ॥ ౫౦॥ దూతాశ్శస్త్రాణిముముచుర్లవోపరిమహాస్వనైః । లవోపిచాపమాకృష్య రామదూతాన్ స్వమార్గణైః ॥౫౧॥ ప్రాక్షిపత్పూర్వవద్రామం తచ్ఛస్త్రౌఘంనివార్యచ । ఆరామతో యదాదూతాశ్చక్రుస్సర్వేపలాయనం ॥ ౫౨ ॥ యయౌలవస్సువిజయీ పూర్వవత్కమలాన్వితః । ఆశ్రమంమాతరంనత్వా సర్వంవృత్తంన్యవేదయత్ ॥ ౫౩ ॥ పుత్రస్యపౌరుషంశ్రుత్వా తుతోషజానకీతదా । వృత్తంనివేదయామాసూ రామదూతారఘూత్తమం ॥ ౫౪ ॥ గతమూర్ఛాలవశరైః భిన్నదేహాముఖాంగణే । రామరామమహాబాహో శ్రుణుష్వపూర్వమాదరాత్॥ ౫౫ ॥ పంచవర్షీయబాలేన వయమద్యపరాజితాః । వాల్మీకేర్లబ్ధవిద్యస్స నజేయోలక్ష్మణాదిభిః ॥ ౫౬ ॥ తద్యధేమంత్రయస్వాద్య త్వముపాయంరఘూత్తమ । సీతాత్యాగాదివచనైః నశాస్త్రవాపిదబా

వాఁడై త్వరగా మునుపటివలె నాశ్రమంబునకువచ్చి సీతాదేవికి తామరలనర్పించి నడచిన సమాచారమును విన్నవించెను. కొంతసేపటికి ఆపదునాల్గుమంది రామదూతులు సర్వవృత్తాంతమును శ్రీరామసన్నిధికి సాదరముగా విన్నవించిరి. ఆసంగతినివిని శ్రీరాముఁడును మనమున నాశ్చర్యమునంది తోటకావలికి వేయిమంది భటులను పంపెను. అంతనాలవుండును నవమినాడు యథాపూర్వముగా నయోధ్యకువచ్చెను. వేయిమంది రాజభటులును లవునితోడ యుద్ధమునకు సన్నద్ధులయిరి. వారినిచూచి లవుఁడు "ఎప్పుడు మీప్రభువగురాముఁడు సీతాదేవిని వనమున కంపివేసెనో అప్పుడే మీకును మీయజమానునికిని జయసంపద తొలగెను. మరల రామునివద్దికే పొండి. చావు నెదురుచూచువారై మీరు నాతోడ కలహింపవలదు. మీరాజుకు సీతనువిడుచుటలో పౌరుష మేగాని ననుగుఱించి శౌర్యములేదు." అనిచెప్పగా, నాలవుఁని వచనశరంబులచే కీళ్లువిరిగిన నాదూతులు ఆర్భాటముచేయుచు తమశస్త్రంబులను ప్రయోగించిరి. లవుండు వాటినిఖండించి వారిని మునుపటివలెనే రామసన్నిధికి పారవేసెను. తోటకు నీళ్లుజల్లెడు తక్కిన దూతులందరును పరుగెత్తిరి. లవుఁడును మునుపటివలెనే జయమునంది కమలములతోడ నిజాశ్రమమునకుపోయి తల్లికివందించి సంగతులనన్నిటిని విన్నవించెను. అదివిని సీతమ్మ పుత్రుని పౌరుషమునుగుఱించి మిక్కిలి సంతసించెను. అచ్చట యజ్ఞవాటికలో లవుని శరంబులచే మూర్ఛాక్రాంతులై యుండిలేచిన రామభటులు "శూరాగ్రణియైన శ్రీరామప్రభూ!సాదరంబుగా మొదట వినవలెదము. అయిదేండ్ల బాలకునిచే మేమునేడు జయింపఁబడితిమి.

లకః ॥ ౫౭ ॥ చకారనిందాం శ్రీరామ గతిభీస్త్వేక ఏవ యః । తత్తేషాం వచనైర్వృత్తం కృత్స్నమాకర్ణ్య రాఘవః ॥ ౫౮ ॥ సంమంత్ర్య సచివైర్దూతం వాల్మీకిం ప్రేషయజ్జవాత్ । నత్వా మునిం రామదూతో రామవాక్యం న్యవేదయత్ ॥ ౫౯ ॥ యస్తే శిష్యో మహావీర సోఽపరాధ్యస్తి వై మమ । తం ప్రేషయాథ వా తేన త్వమాగచ్ఛ స్వమన్మఖం ॥ ౬౦ ॥ విస్మృత్యా పూర్వమేవ త్వాం నాహూతోఽసి క్షమస్వ తత్ । తద్దూతవచనం శ్రుత్వా రామీయం మునిరబ్రవీత్ ॥ ౬౧ ॥ శిష్యాభ్యామన్వితశ్చాహమేవయాస్యామి త్వం వ్రజ । తథేతి రామదూతోఽపి మునిం నత్వాయయౌ మఖం ॥ ౬౨ ॥ జానన్నేవం భావవృత్తమాదౌ రామో మునిం మఖం । నాహ్వయామాస శిష్యాభ్యాం లౌకికీం వృత్తిమాశ్రితః ॥ ౬౩ ॥ స్వీయవ్రతిసమాప్తిం సా కరోత్సీతాపి సాదరం ॥ * ॥ విష్ణుదాసఉవాచ ॥ * ॥ అశక్తైశ్చ కథం కార్యం వ్రతమేతద్వదస్వ మాం ॥ ౬౪ ॥ రామదాసఉవాచ ॥ * ॥ కాంచనస్యాథవా రౌప్యస్యాథవా తామ్రనిర్మితే । కార్యే ద్వే పాదుకే రమ్యే రాఘవస్య యథాసుఖం ॥ ౬౫ ॥ అభావే కమలానాం చ పుష్పైరంజలిరీరితః । ఏకాశీతిదంపతీనాం నశక్తిః పూజనే తదా ॥ ౬౬ ॥ పూజనీయాథ యుగ్మాని నవ శక్త్యాథవా సుఖం । స్వశక్త్యా పూజనం కార్యం విత్తశాఠ్యం పరిత్య

వాల్మీకివలన విద్యలనందిన వానిని లక్ష్మణాదిమహాశూరులుగూడ జయింపఁజాలరు. నీవు వానిని నిగ్రహించుటకు తగిన సదుపాయమును యోచింపవలయును. సీతాత్యాగాది వాక్యములచే నాబాలకుండు నిన్నుగూడ నిందించెను. వాఁడు ఒంటరిగానుండినను నిర్భయముగానున్నాడు." అని మొఱపెట్టగా, నావాక్యములనువిని శ్రీరాముఁడు॥౫౮॥మంత్రులతోడ నాలోచించి, వా

శ్రీరాముఁడు వాల్మీకిని పిలుపించుట.

ల్మీకివద్దికి నొకదూతను నంపించెను. ఆ రామదూత వచ్చి వాల్మీకిమునికి నమస్కరించి "మహావీరుఁడగు శిష్యుఁడు నీకెవ్వఁడుగలఁడో వాఁడు మావిషయమై యపరాధిగానున్నాడు. వానిని పంపించుము. వానివెంటఁబెట్టుకొని నాయజ్ఞమునకు నీవైననురమ్ము. మఱపుచే మొదటనే నిన్ను యజ్ఞమునకు పిలువలేదు. దానిని క్షమింపుము." అని మాప్రభువుగారు మీకు విన్నవించిరని చెప్పెను. వాల్మీకిముని శ్రీరామవాక్యమునువిని "నీవుపొమ్ము. నేనిరువురు శిష్యులతోడ వచ్చుచున్నాను." అనిపలుకగా నట్లేయని మునికి మ్రొక్కిలిడి రామదూత యజ్ఞవాటమునకు వచ్చెను. విష్ణుదాసా! వినుము. ఇఁక మీఁదనిట్లు కాఁబోవుచున్నదని యెఱిఁగినవాఁడు కాబట్టియే శ్రీరాముఁడు మొదట శిష్యులతోడ నావాల్మీకిని పిలుపింపలేదు. అచ్చట జానకీదేవియును తానుపట్టినవ్రతమును పూర్తిఁజేసెను. అనిన రామదాసునిగుఱిఁచి విష్ణుదాసుఁడు "గురూత్తమా! అశక్తులయినవారు ఈవ్రతము నెట్లు చేయవలయును. చెప్పుమని" వేఁడెను. అందుకు రామదాసు చెప్పుచున్నాఁడు. బంగారములోగాని వెండిలోగాని రాగిలోగాని గతిగల్గిన దానిలో శ్రీరామునియొక్క పాదుకలను చేయించవలయును. కమలములు దొరకకపోయిన సామాన్యముగా పూజాయోగ్యంబులగు నేపుష్పములచేతనైనను అంజలి నర్పింపఁదగును. ౮౧ దంప

శేత్ ॥౬౭॥ అనేనదూరగస్యాపి సంయోగశ్చభవేద్ద్రుతమ్ । భావికార్యాణివేగేన భవిష్యంతిన సంశయః ॥౬౮॥
ఇతిశ్రీమద్వాల్మీకీయే శతకోటిరామచరితాంతర్గతే ఆనందరామాయణే జన్మకాండే సంయోగకరణవ్రతంనామ పఞ్చమస్సర్గః ॥౫॥ ... ... ... ... ... ... ... ... ... ౬౮।

శ్రీరామదాసఉవాచ—అథరామోపిధర్మాత్మా చరమేతురగాధ్వరే । హయంముమోచ శత్రుఘ్నస్తస్య పృష్ఠేయయౌజవాత్ ॥౧॥ దక్షిణాంపశ్చిమాంశా ముత్తరాంతురగోత్తమః । అతిక్రమ్యతథాప్రాచీం యజ్ఞస్థానం న్యవర్తత ॥౨॥ నృపతిభ్యస్సమస్తేభ్య శ్శత్రుఘ్నోవసుకోటికః । గృహీత్వాతైర్నృపైర్యుక్తస్తురగస్యానుగోయయౌ ॥౩॥ సేనయాచతురంగిణ్యాదశసాహస్రసంఖ్యయా । తస్మిన్వితానేఋషయ స్సర్వేరాజపతయస్తథా ॥౪॥ బ్రాహ్మణాఃక్షత్రియావైశ్యా స్సమాజగ్ముస్సహస్రశః । చరమాధ్వరేతేద్రష్టుం రామస్యోత్సవమాగతాః ॥౫॥ వాల్మీకిరపిసంగృహ్య గాయంతౌభూమిజాత్మజౌ । జగామఋషివాటస్య సమీపంసీతయాసుఖం ॥౬॥ మార్గేనృపసమూహేషు శిబికాస్థాంమహీజానకీం । నవిదుఃపార్థివాస్సర్వే జనాస్తేపిరథేతరే ॥౭॥ సుమేధయాజనకోపి యయౌ రామాధ్వరంప్రతి । క్రోశద్వయాంతరేపూర్వే యజ్ఞవాటాన్మునీశ్వరః ॥౮॥ కృత్వాపర్ణకుటీంరమ్యాం తాభ్యాం తత్రాసనీతయా । వాల్మీకిర్వాసయామాస పర్ణకుట్యాంవిదేహజాం ॥౯॥ నృపసేనానివాసేషు జనకస్సుమేధ

తులను పూజించుటకు శక్తిలేకపోయినన్ మంది దంపతులను పూజించునది. అందుమీఁద వానివాని శక్తియున్నంత జేయవచ్చును. ఎట్లయినను కల్గి వంచించకూడదు. ఈవ్రతమువలన దూరంగతులైన ప్రియులును తమతోడవచ్చి చేరుచుందురు. కాతగిన కార్యంబులు త్వరగానగును. ఇందుకు సంశయములేదు॥౬౮॥ ... ... ... ... ॥౬౮॥

౧౦౦వ- శ్రీరామాశ్వమేధంబునకు వాల్మీకి సపరివారముగావచ్చుట.

అనంతరము ధర్మాత్ముఁడగు శ్రీరాముఁడు చివరదియగు నశ్వమేధయాగంబున గుఱ్ఱమును విడిచెను. దానివెనుక శత్రుఘ్నుండు త్వరగావెడలెను. దక్షిణపశ్చిమోత్తర. దిక్కులన తిక్రమించి యయ్యశ్వోత్తమంబు తూర్పునవచ్చుచు యజ్ఞస్థానమును చేరను. దానివెంటనే శత్రుఘ్నుఁడును వేలకొలది రాజులనుండి. సమర్పింపఁబడిన కోట్యంతరద్రవ్యమును తీసికొని ఆ రాజులతోడను పదివేలుచతురంగ సైనంబుతోడను వచ్చిచేరెను. అయ్యజ్ఞంబున కడపటియాగముగాన శ్రీరాముని యుత్సమును చూడవలయునని సమస్తమునీంద్రులును రాజర్షులును బ్రాహ్మణులును క్షత్రియులును వైశ్యులునువేలకొలదిగా వచ్చిచేరిరి. వాల్మీకిమునియును కుశలవులను వెంటతీసికొని సీతతోడ సుఖముగావెడలి యజ్ఞమునకువచ్చుచున్న ఋషులందరుండఁదగిన వాడకట్టుకువచ్చెను. నడుమదారిలో పల్లకీనెక్కివచ్చుచున్న జానకీదేవిని రాజులును జనులును అట్లే యితరులును ఎవ్వరు నెఱుఁగరయిరి. జనకరాజు సుమేధతోడ రాముని యజ్ఞమునకేతెంచెను. వాల్మీకి యజ్ఞవాటికకు తూర్పున రెండుకోసెల దూరముననే మనోహరమగు

యా । స్వాపత్యేనయయా తూష్ణీం రామేణాసా నిరీక్షితః ॥ ౧౦ ॥ వాల్మీకిరపి తౌ ప్రాహ న్యస్తాలంకారమండితౌ । జటాచీరాజినధరౌ సీతాపుత్రౌ మహాధియౌ ॥ ౧౧ ॥ యత్రతత్రచ గాయంతౌ పురవీథిషు సర్వతః । రామస్యాగ్రే చ గాయేతాం శుశ్రూషుర్యది రాఘవః ॥ ౧౨ ॥ ఆజన్మకాండాత్కాండాని నగేయాన్యత్ర బాలకౌ । యదా కరోమ్యహంచాజ్ఞాం గాయేతాం సకలం తదా ॥ ౧౩ ॥ నగ్రాహ్యం తద్యువాభ్యాం స యదికించిత్ప్రదాస్యతి । ఇతి తౌ చోదితౌ తత్ర గాయమానౌ విచేరతుః ॥ ౧౪ ॥ యథోక్తం ఋషిణా పూర్వం తత్రతత్రాభ్యగాయతాం । తాంతు సుశ్రావ కాకుత్స్థః పూర్వచర్యాకృతిం తతః ॥ ౧౫ ॥ అపూర్వపద్యవృత్తాది గేయైః సమభిప్లుతాం । బాలాభ్యాం రాఘవః శ్రుత్వా కౌతూహలముపేయివాన్ ॥ ౧౬ ॥ అథ కర్మాంతరే రామ స్సమాహూయ మహ[illegible]వరాన్ । రాజ్ఞశ్చైవ నరవ్యాఘ్ర పండితాంశ్చైవ నైగమాన్ ॥ ౧౭ ॥ పౌరాణికాన్ శబ్దవిదో గణకాంశ్చ చికిత్సకాన్ । నానాకౌశల్యనిపుణాం స్తథా వృద్ధాన్ ద్విజాదికాన్ ॥ ౧౮ ॥ యజ్ఞవాటే తు తాన్ పూజ్య గాయకౌ సంప్రవేశయత్ । తే సర్వే హృష్టమనసో రాజానో బ్రాహ్మణాదయః ॥ ౧౯ ॥ రామం తౌ దారకౌ దృష్ట్వా విస్మితా నిర్నిమేషకాః । అవోచన్ సర్వ ఏవైతే పరస్పరమథాగతాః ॥ ౨౦ ॥ ఇమౌ రామస్య సదృశౌ బింబాద్బింబమివోదితౌ । జటిలౌ యది న స్యాతాం నచ వల్కలధారిణౌ ॥ ౨౧ ॥ విశేషం నాధిగచ్ఛామో రాఘవస్యానయో స్తదా । ఏవం సంవదతాం తేషాం విస్మితానాం పరస్పరం ॥

నొకపర్ణశాలను కల్పించి యందులో సీతమ్మను దాచిపెట్టి కుశలవులతోడ నివసించెను. జనక రాజు రాజసేనానివాసంబులలో తనసైన్యమును తీసికొని సుమేధతోడ నూరకపోయి శ్రీరాముని చే చూడఁబడెను. వాల్మీకి అలంకారంబులను తీసిపెట్టి నారబట్టలు కట్టుకొనిన కుశలవుల నుచూచి "మంచిబుద్ధిగల బిడ్డలారా! ఊరిలో వీధులలో నంతటనచ్చటచ్చట శ్రీరాముఁడు వినువాఁడుగానుండిన వానియెదుటను చక్కగా జన్మకాండము వరకు శ్రీరామాయణమును పాడండి. ఇచ్చట పాడవలదు. నేనెప్పుడాజ్ఞాపించెదనో అప్పుడు సమస్తమును పాడండి. ఆతఁడు ఏమైననిచ్చిన మీరు కొంచముకూడ తీసికొనవలదు." అనియిట్లు ప్రేరించెను. వారు నట్లే ఊరిలోపాడుచు సంచరించుచుండిరి. ఇట్లు వాల్మీకిముని చెప్పినట్లు పాడుచున్న వారి యొక్క దివ్యగానమును శ్రీరాముఁడు వినెను. అపూర్వరచనచే రమ్యంబయిన రాగయుక్తంబగు గానంబును విని కుతూహలమునందెను. పిదప నా శ్రీరాముఁడు యజ్ఞకర్మాచరణాంతరంబున మునీంద్రులను రాజులను పండితులను వేదజ్ఞులను పౌరాణికులను వైయాకరుణులను జ్యోతిషికులను వైద్యులను శిల్ప కౌశలాది చమత్కారవిద్యలను నేర్చినవారిని అట్లేవృద్ధ బ్రాహ్మణాదులను అందరినియజ్ఞవాటికలో చక్కగాపూజించి॥౧౮॥గాయకుల నిరువురిని ప్రవేశింపఁజేసెను. రాజులును బ్రాహ్మణులును మొదలుగాగల వారందరును సంతుష్టచిత్తులయి శ్రీరాముని నా

యజ్ఞవాటంబున శ్రీరామసభకు కుశలవులు ప్రవేశించుట.

బాలకులనుకూడ రెప్పవేయకచూచి యాశ్చర్యమునందుచుండిరి. అంతనచ్చట వచ్చినవారంద

౨౨ । తదాహ రామదూతోఽపి లవబాణరుజం స్మరన్ । రామచంద్రం యజ్ఞవాటస్థితం వై సంభ్రమేణ హి ॥ ౨౩ ॥ లవమంగుళినా వీరం దర్శయంశ్చ ముహుర్ముహుః । రామ రామ మహాబాహో త్వమేనం పశ్య వై లవమ్ ॥ ౨౪ ॥ యేనాప్యాకం శరౌఘైశ్చ ప్రక్షిప్య తవ సన్నిధౌ । సీతానికనకాబ్జాని సుగంధీని నిరంతరమ్ ॥ ౨౫ ॥ సీతాత్యాగనిమిత్తేన యేన తేనాపి వై ముహుః । కృతా నిందా గర్వితేన త్వద్దండైకాంక్షిణా ప్రభో ॥ ౨౬ ॥ తవ దండభయాద్దేవ పూర్వవేషో విగోపితః । రథవస్త్రాభరణాని శస్త్రాణ్యపి విహాయ చ ॥ ౨౭ ॥ ధృతాః సవల్కలాదీని దీనరూపాన్న దృశ్యతే । త్వయా వ్యదండనీయోఽయం బంధుసారాతిగర్వితః ॥ ౨౮ ॥ ఇతి స్వదూతవాక్యాని శ్రుణ్వన్ స రఘూత్తమః । ప్రేమ్ణావలోకయామాస సుధాక్షిభ్యాం శిశూ ముహుః ॥ ౨౯ ॥ బాలావపి సభాసంస్థౌ నమస్కృత్య యథాక్రమమ్ । రాఘవం స్వపితృవ్యాంశ్చ వసిష్ఠం ప్రణిపత్య చ ॥ ౩౦ ॥ ఉపచక్రమతుర్గాతుం వీణేరణయుతౌ శుభే । తతః ప్రవృత్తం మధురం గాంధర్వం గీతముత్తమమ్ ॥ ౩౧ ॥ శ్రుత్వా తన్మధురం గీతం రామస్తోషముపావహ । తాభ్యాం ప్రుతం స్వచరితం విలాసావధ్యనుక్రమాత్ ॥ ౩౨ ॥ యద్యదాచరితం పూర్వం సీతయా సహ సౌఖ్యదమ్ । తతోఽపరాహ్ణే శ్రీరామః ప్రసన్నవదనాంబుజః ॥ ౩౩ ॥ ఉవాచ తౌ సమగ్రం వై శ్వో గేయం మమ సన్నిధౌ । తథేతి రామవచనం తావంగీచక్రతుస్తదా ॥ ౩౪ ॥ తతో

---

రును పరస్పరంబుగా "బింబమునుండి ప్రతిబింబము పుట్టినట్లుండెడువారైన వీరిరువురు చిన్నవాండ్రు శ్రీరామునికి సమానులుగానున్నారు. అయిన వీరు నారబట్టలు కట్టుకొని జడలుదాల్చియున్నారు. అయినను శ్రీరామునికిని వీరికిని రూపముననే విశేషమును కనిపెట్టజాలము." అని వాదించుచుండిరి. ఇట్లుండువారిలో నొకరామదూత లవునిబాణముచే గాయము గొన్నవాఁడు తనపెట్టునుస్మరించుచు సంభ్రాంతినంది యజ్ఞవాటంబుననున్న శ్రీరామునితో "రామ! రామ! మహాశూరుఁడా! వానినే లవునినిగా నెఱుంగుము. వీఁడే మమ్మును బాణములచే నీవద్దికి పడద్రోసి దివ్యపరిమళ యుక్తంబులగు బంగారుతామరలను తీసికొనిపోయినవాఁడు. సీతనువదలిననిమిత్తము పెట్టుకొని వీఁడే మిమ్మును నిందించినవాఁడు. కావున వీఁడు నీశిక్షనపేక్షించునట్టి గర్విగానున్నాడు. నీవెచ్చట శిక్షించెదవో అను భీతివలననే మొదటివేషమును మార్చియున్నాడు. రథమును దివ్యవస్త్రంబులను శస్త్రంబులను భూషణంబులను వదలి నారబట్టలతోవచ్చి బీదవాఁడుగా కనుబడుచున్నాడు. బంధుసారముచే మిక్కిలి క్రొవ్విన వీనిని నీవు తప్పక శిక్షింపుము."అని మొఱపెట్టిన నాదూతవాక్యంబులను విన్నవాఁడైనను శ్రీరాముఁడు బిడ్డలను పలుమారు అమృతకటాక్షంబులచే ప్రేమతోచూచెను. ఆబాలకులును సభాసీనుఁడైన శ్రీరాముని నట్లేక్రమముగా లక్ష్మణాదులను పినతండ్రులను వసిష్ఠమహామునిని వందించి, వీణలను వాయించుచు పాడనారంభించిరి. అంత నప్పుడు గాంధర్వదివ్యగానము వెలువడెను. వారు పాడుచువచ్చిన సీతతోడ తాననుభవించిన విలాసకాండ చరిత్రమువరకుగల నిజచరిత్రమును విని యానందమునందెను. పిదప నపరాహ్ణసమయమున శ్రీరాముఁడు సుప్రసన్న

రాఘమాలవంప్రాహ మయాస్యస్యపరాధితం । త్వయాపూర్వంతథాపిత్వాం తుష్టోహంనాత్రసంశయే ॥ ౩౫ ॥ ద్గీతమచ్చరితాది శ్రవణాద్యమేమనః । పరాంవిశ్రాంతిమాపన్నం త్వత్కృతంక్షమితంమయా ॥ ౩౬ ॥ అధునా ముద్భయంత్యక్త్వా త్వంసుఖంవిచరాత్రహి । తద్రామవచనంశ్రుత్వా లవోరాఘవమబ్రవీత్ ॥ ౩౭ ॥ మయాపరాధితంరాజం స్తవదర్శనకామ్యయా । మదపరాధితంస్మృత్వా త్రాహమాంతోహంయాతిస్త్వయా ॥ ౩౮ ॥ అద్యైవదర్శనేనైవ పౌరుషంవృద్ధిమాగతం । కీర్తిర్మేతవపాతీజాతా తవాగ్రేగాయనాదపి ॥ ౩౯ ॥ ఇత్యుక్త్వాసోలవస్తూష్ణీం బంధునాగంతుముద్యతః । సభాయాస్తాగతఃకుశావహా స్థలంస్వీయంనిరీక్ష్యచ ॥ ౪౦ ॥ రామోయుతంవసుతయోర్భరతేనప్రదాపయత్ । దీయమానంసువర్ణంతౌ నతజ్జగృహతుస్తదా ॥ ౪౧ ॥ రాజన్ హేమ్నాకిమేతేవ న్యోర్నావెవన్యభోజినౌ । కృపావలోకనేనైవ పాహిత్వమావయోస్సదా ॥ ౪౨ ॥ ఇతిసంత్యజ్యసందత్తం జగ్మతుర్ము...ధిం । ఆసీచ్ఛ్రుత్వాస్వచరితం రామోహృద్యతివిస్మితః ॥ కుశోపిసకలంవృత్తం వాల్మీకింమాతరంతథా । నివేద్యజాహ్నవీంస్నాతుం కౌతుకేనమహాసుఖం ॥ ౪౩ ॥ లవస్తుమునిశిశుభిశ్శిశుక్రీడనమాచరత్ । ఏతస్మిన్నంతరేయత్ర

ముఖారవిందుఁడై బాలకులను చూచి "మీరిరువురును రేపువచ్చి సమగ్రముగా పాడవలయును" అని నిరూపించెను. అంతనట్లే యనివారు నంగీకరించిరి. అప్పుడు రాముఁడు లవునితో "నీవు నావిషయమై నేరము జేసినవాడవై యున్నను సంతుష్టుఁడగు నేను నిన్నిచ్చట శిక్షించను. నీచేతపాడఁబడిన నాచరిత్రమును వినుటచే నామనంబు మిగుల విశ్రాంతి నందియున్నది. నేను నీతప్పునుమన్నించితిని. ఇప్పుడు నాభయములేక నీవు సుఖముగా నిచ్చట సంచరింపవచ్చునుగదా" అని యనుగ్రహించెను. అందుకు లవుఁడు "మహారాజా! నీదర్శనమును కోరి నేనపరాధము నాచరించితిని. నాతప్పునుతలఁచిగదా నన్ను పిలుపించితివి. ఇపుడు నీదర్శనమువలననే నాకు పౌరుషమధికమగుచున్నది. నీయెదుట గానముచేయుటచే నాకు గొప్పకీర్తిగలినది." అనిచెప్పి యూరకె కుశునితోడ వెడలఁదొడఁగెను. ఇట్లు సభనుండి లేచిపోవుచున్న కుశలవులనుచూచి శ్రీరాముఁడు పదివేలవరాలను భరతునిచే వారికిప్పించెను. ఇచ్చుచున్న ద్రవ్యమును వారంగీకరించక శ్రీరాముని నీక్షించి "మహారాజా! ఈబంగారుచే మాకేమిఫలము? మేమిరువురును కందమూలఫలాది భక్షకులుగదా? నీవు నిరంతరము దయాదృష్టులచే మమ్ము రక్షింపుము." అనిచెప్పి ఇచ్చిన సువర్ణమును విడిచిపెట్టి మునిసన్నిధికి నేడలిరి. శ్రీరాముఁడు తనచరిత్రమువిని మనమున నాశ్చర్యమునందెను. కుశుఁడు నచ్చటి సమస్తవృత్తాంతమును వాల్మీకిమునికిని తల్లికిని తెలిపి కుతూహలముతో గంగాస్నానమునకై సుఖముగావెడలెను. లవుఁడుతక్కిన మునిడింభకులతోడ బాలక్రీడలలో నుండెను ॥౪౪॥

లవుఁడు శ్రీరామాశ్వమును బంధించి భరతాదులను జయించుట.

అంతలో లవుఁడచ్చట బాలురతో క్రీడించుచుండెనూ అచ్చటికి యజ్ఞకారులు గుఱ్ఱమును

లవః క్రీడాం చకార సః ॥ ౪౫ ॥ బాలకైస్తత్ర సంప్రాప్తస్తురగోధ్వరకారిణః । త్యక్త్వా క్రీడాం లవశ్శీఘ్రు మశ్వంధృత్వోటజాంతికే ॥ ౪౬ ॥ వృక్షే బబంధ శిశుభిః పూర్వవత్క్రీడనం వ్యధాత్ । తతః శేషాస్సుసంప్రాప్తా దృష్ట్వా బద్ధం తురంగమం ॥ ౪౭ ॥ హాత్వా బాలకృతం సర్వే శత్రుఘ్నాద్యా విహాస్య తే । దూతానాజ్ఞాపయామాసు ర్ముచ్యతాం తురగస్సుఖం ॥ ౪౮ ॥ లవస్తానాగతాన్ దృష్ట్వా వాయవ్యాస్త్రేణ వై తృణం । సంమంత్ర్య తాన్ముమోచాథ లీలయా శిశుసంయుతః ॥ ౪౯ ॥ జంఝావాతైస్తదా యానం హస్త్యశ్వరథపూరితం । శత్రుఘ్నాపి తైర్దూతైః ఖేభూత్తద్భ్రమరోపమం ॥ ౫౦ ॥ తచ్ఛ్రుత్వా రామచంద్రోపి ప్రేషయామాస సాదరం । సుగ్రీవమంగదం నీలం మైందం జాంబవతం నలం ॥ ౫౧ ॥ సుమంత్రం భరతం వాయుపుత్రం తార్క్ష్యం విభీషణం । సుషేణం పార్థివాన్ సర్వాన్ స్వస్వామితబలైర్యుతాన్ ॥ ౫౨ ॥ ద్వివిదం దధివక్త్రం చ వానరాన్మకరధ్వజం । తే లవం దుద్రువుర్గర్వా ద్యుద్ధం చక్రుస్త్వరాన్వితాః ॥ ౫౩ ॥ తానాగతాన్ లవో దృష్ట్వా కస్యచిత్పతితం భువి । దూతస్య చ హాచనార్థమాగతస్య శరాసనం ॥ ౫౪ ॥ తూణీరం చ స్వయం ధృత్వా యయౌ యోద్ధుం త్వరాన్వితః । టణత్కృత్య మహచ్చాపం చింతయామాస చేతసి ॥ ౫౫ ॥ పితృవ్యాద్యాః స్థితా యోద్ధుం మయా హ్యపురిత స్త్విహ । కథమేభిశ్చ యోద్ధవ్యం మయా చ సమరాంగణే ॥ ౫౬ ॥ కథం తీక్ష్ణానద్య శరా నేతేషు ప్రక్షిపామ్యహం । స్వీయానాం వధకర్తారం మాం సీతా ముని రాఘవాః ॥ ౫౭ ॥ సహిష్యంతి కథం దృష్ట్వా కర్తవ్యం కిం మయాధునా । యుద్ధాత్పరాఙ్ముఖో హం చేద్భూత్వా గచ్ఛామి తం మునిం ॥ ౫౮ ॥ వాల్మీకిః

---

తీసికొనివచ్చిరి. దానినిచూచి లవుఁడాటను విడిచి త్వరగా నాతురగమునుపట్టి పర్ణశాలవద్ద చెట్టునకంటగట్టి, మునుపటివలె మునికుమారులతో నాటలాడుచుండెను. అంతనాకాశమున పుష్పక విమానమువచ్చెను. శత్రుఘ్నాదులు కట్టబడిన గుఱ్ఱమునుచూచి పిల్లలాటగా నెంచి నవ్వి దూతలనుచూచి సుఖముగా గుఱ్ఱమును విడుపింపుఁడని యాజ్ఞాపించిరి. లవుఁడు వారువచ్చుట నెఱిఁగి వాయవ్యాస్త్రముచే నొక తృణమునుమంత్రించి వారిమీఁద విడిచి బాలకులతోడ లీలనుండెను. ఆ లవబాణమునపుట్టిన జంఝామారుతంబులచే చతురంగ సైన్యములతోనిండిన పుష్పకవిమానము శత్రుఘ్నునితోడను ఆదూతలతోడను గగనమున తుమ్మెదవలె భ్రమింపసాగెను. ఆసంగతినివిని శ్రీరామచంద్రుఁడు అంగద సుగ్రీవ నల నీల మైంద ద్వివిద దధివక్త్ర మకరధ్వజాది కపివీరులను సమస్తరాజులను గరుడాంజనేయులను సుమంత్ర భరతాదులను వారివారి సైన్యములతోడ శత్రుఘ్నునికి సహాయముగా నంపెను. వారు గర్వముచే త్వరపడి పరుగెత్తి లవునితో కలహింపఁబూనిరి. లవుఁడు వచ్చుచున్న వారినిచూచి, తప్పించికొనుటకై వచ్చిన ఒకానొకదూతునియొక్క నేలఁబడిన ధనుస్సును తూణీరంబునుతీసికొని తానుధరించి, యుద్ధమునకు వెడలి. ధనుష్టంకారముచేసి తన మనమున "నాయెదుట నిప్పుడు పినతండ్రులు మొదలయినవారు యుద్ధసన్నద్ధులై యున్నారు. రణాంగణమున వీరితోడ నే నెట్లు జగడమాడుదును? ఎట్లు వీరలమీఁద తీక్ష్ణబాణంబులను ప్రయోగింతును? స్వజన హింసకుఁడ

క్షితా విద్యా తిర్హి సా విఫలా భవేత్। అతః కేషామపివధం వినా యుద్ధం కరోమ్యహం ॥ ౫౯ ॥ ఇతి నిశ్చిత్య మనసి మే ఘవద్వదాహ తాన్। ఆగమ్యతే కిమర్థం మాం యుష్మాభిః బ్రూత వేగతః ॥ ౬౦॥ యూయం సీతాపత్స్వలం మాం పీడనార్థమిహాగతాః। సీతాక్లేశానలాహారం మామద్య చేత్థ భో ఖలాః ॥ ౬౧ ॥ సీతోష్ణోచ్ఛ్వసితోగ్రాగ్ని జ్వాలాభిర్వో౽ద్య పౌరుషం। విదగ్ధం నష్టుం లోకా న్దర్శనీయం మయాపి చ॥ ౬౨ ॥ ఇతి స్వవాక్యైర్భిన్న హృదయాన్ సకలాన్ పునః। మోహయామాస సః లాన్ మోహనాస్త్రం విసృజ్య చ॥ ౬౩ ॥ తతో లవస్సువిజయీ సుమంత్రం భరతం తథా। దృష్ట్వా స్వకక్షయోః కృత్వా కరాభ్యాం వాయునందనం॥ ౬౪ ॥ సుగ్రీవం చ ముదా ధృత్వా సీతాయై తాన్ ప్రదర్శయత్ । దృష్ట్వా సీతాపి తాన్ వీరాన్ మోహనాస్త్రేణ మోహితాన్ ॥ ౬౫ ॥ పుత్రాత్తాన్మోచయామాస రక్షయామాస తాన్ రహః। తాన్నీతాన్ రాఘవః శ్రుత్వా లక్ష్మణం వాక్యమబ్రవీత్ ॥౬౬॥ ఈదృశం పౌరుషం బంధో రావణేనాపి నో కృతం । యథా కృతం బాలకేన కరణీయం కిమత్ర వై॥౬౭॥ తద్రామవచనం శ్రుత్వా లక్ష్మణః ప్రాహ రాఘవం। మా చింతేయం త్వయా కార్యా ధృత్వాహం తం శిశుం క్షణాత్ ॥ ౬౮ ॥ త్వత్సన్నిధావానయామి సింహో మృగశిశుం యథా । ఇత్యుక్త్వా రాఘవం నత్వా రథారూఢో యయౌ జవాత్ ॥ ౬౯ ॥ సేనయా సచివైర్యుక్తో వాల్మీకేర్వసతిస్థలం। తమాగతం విబుద్ధ్యాథ లవో

గు నన్నుచూచి సీతారామ వాల్మీకిమునులు ఎట్లు సహించెదరు? ఇపుడు నేనేమిచేయఁదగినది? యుద్ధమునుండి నేను వెనుకదిరిగి మునీంద్రుని సన్నిధికి పోతినా, వాల్మీకి నేర్పిన విద్య విఫలమై పోవుచున్నది. అందువలన నెవ్వరికిని ప్రాణముపోనట్లు యుద్ధముచేసెదను.'' అని యాలోచించికొని మేఘమువలె గర్జించుచు "ఎందుకునాకొఱకై వేగముగా వచ్చుచున్నారు? మీరు సీతయందు ప్రీతిగలనన్ను పీడించుటకై వచ్చితిరిగదా? దుష్టులారా! నన్ను సీతయొక్క దుఃఖాగ్ని నార్పెడువానినిగా నెఱుంగుడు. జానకీదేవియొక్క నిట్టూర్పుల యగ్నిజ్వాలలచే మీయొక్క పౌరుషముకాలినది. నేను దానిని చక్కగా లోకమునకు చూపించఁదగియున్నది."అనియిట్లు తనములుమాటలచే భిన్నహృదయులైన వారినందరిని మరల మోహనాస్త్రమును ప్రయోగించి మూర్ఛితులంజేసెను. అంతనా లవుండు సుమంత్రభరతులను తనచంకలలోను సుగ్రీవాంజనేయులను చేతులలోను పట్టుకొని పోయి వారిని సీతాదేవికి చూపించెను. సీతమ్మగూడ మూర్ఛితులగు వారినిచూచి పుత్రునినుండి విడిపించి రహస్యముగా వారిని రక్షించెను. ఇట్లుండ నిచ్చట భరతాదులను లవుఁడు కొనిపోయెనని తెలిసి శ్రీరాముఁడు లక్ష్మణునితో "తమ్ముఁడా! ఇట్టిపౌరుషమును రావణుఁడు కూడచూపలేదు. బాలుఁడైనను ఎట్లుచేసెను చూచితివా? మనమేమి చేయఁదగినది?" అని యాలోచించెను. ॥౬౭॥ అందుకు లక్ష్మణుఁడు "అన్నా! నీవుచింతింపవలదు. నేనాబిడ్డను క్షణములోపట్టి నీసన్నిధానమునకు సింహము జింకపిల్లను పట్టితెచ్చినట్లు తెత్తును."' అని శ్రీరామునికి నమస్కరించి రథమునెక్కి సైన్యముతోడను మంత్రులతోడను

## లవుఁడు లక్ష్మణుని జయించుట.

పితత్పురోయయౌ॥ ౨౦ ॥ తం దృష్ట్వా బాలకం రమ్యం కృపయా లక్ష్మణో௨బ్రవీత్ । మాకశోకత్వం కురుష్వాద్య సాహసం మత్పురస్త్వహో॥ ౨౧॥ న సమర్థోసి వై స్థాతుం గచ్ఛ నో చేన్మరిష్యసి । శేషం రామాయణం శ్రోతుం త్వత్తో௨హం త్వాం న హన్మి॥ ౨౨ ॥ త్వయా௨పరాధితం బాల రాఘవస్య ముహుర్ముహుః । తత్సర్వమప్యహం వేద్మి తథాపి త్వాం న హన్మి న॥ ౨౩ ॥ సీతాన్వీరాన్ సమర్ప్యాద్య వాజినా రఘునందనం । ఏహి త్వం శరణం బాల యద్యస్తి జీవితస్పృహా ॥ ౨౪ ॥ తత్సౌమిత్రేర్వచః శ్రుత్వా లవోభీతస్తమబ్రవీత్ । వేద్మి త్వాం రాఘవం చాపి సీతాత్యాగదపౌరుషం॥ ౨౫ ॥ సీతాయామేవ యువయోః పౌరుషం న లవే మయి । సీతాదుఃఖాపనోదార్థం మునినా నిర్మితస్త్వహం ॥ ౨౬ ॥ యువాం జిత్వాద్య సమరే సీతాదుఃఖం ప్రమార్జయే । ముధా యువాభ్యాం సా సీతా ఛలితాపి పతివ్రతా ॥ ౨౭ ॥ తస్యా విపిన[illegible]తించావాం కర్తుమత్ర సమాగతః॥ సీతాదుఃఖాగ్నినా యుష్మత్పౌరుషం దగ్ధమస్తి తత్ ॥ ౨౮ ॥ న స్థాతవ్యం మమాగ్రేత్ర గచ్ఛధ్వం విధవోపమైః । ఇతి తల్లవవాగ్బాణైర్భిన్నమర్మస్థలాశ్చ తే ॥ ౨౯ ॥ లక్ష్మణాద్యా వవర్షుస్తం శస్త్రైరస్త్రైర్లవం క్రుధా । తతో లవః స్వబాణైస్తాం శస్త్రవృష్టిం నివార్య చ॥ ౩౦ ॥ శ్రీరామసచివాదీంశ్చ ప్రాక్షిపద్యజ్ఞమంటపే । తే సర్వే సచివాద్యాశ్చ లవమార్గణతాడితాః॥ ౩౧ ॥ భిన్నదేహా లోహితాక్తాః ప్రోచూ రామం స్ఖలద్గిరా । రామ త్వం నోపశ్యసి కిం తూష్ణీం యజ్ఞవరమంటపే ॥ ౩౨ ॥ ఉపాయం చింతయస్వాద్య వక్ష్యే తస్య లవస్య చ । శస్త్రైరస్త్రైర్న కృతి-

కూడి వాల్మీకిమహర్షి వసించుచున్న చోటికి వచ్చెను లవుఁడును వాని యెదుటపోయి తాఁకినిల్చెను. ఆబాలకునిఁజూచి లక్ష్మణుండు దయచే "బిడ్డఁడా! ఇప్పుడు నీవు నాయెదుట సాహసింపకుము. నాయెదుట నిలచుటకును నీవు శక్తుఁడవుకావు. పోకపోతివా చత్తువు. నీవలన శేషించిన రామాయణమును వినుటకై నేను నిన్ను చంపను. నీవు పలుమారు శ్రీరామువిషయమై తప్పులు చేసితివి. వాటినన్నిటిని నేనెఱింగినను నిన్ను చంపను. నీవు బ్రదుకగోరితివా కొనిపోయిన వీరులను గుఱ్ఱమును తీసికొని శ్రీరామసన్నిధికివచ్చి శరణాగతుఁడగుము." అని చెప్పిన లక్ష్మణునిఁజూచి లవుఁడు నిర్భయముగా "నిన్ను శ్రీరామునినికూడ సీతను వదలిపెట్టిన వారగుటచే పౌరుషము లేని వారని యెఱుఁగుదును. సీతమ్మయందే మీపౌరుషంబు. లవుండగు నాయందు కాదు. సీతాదేవి యొక్క దుఃఖపరిహారముకొరకై వాల్మీకిముని నన్ను నిర్మించెను. మిమ్మును యుద్ధమున జయించి, సీతాదుఃఖమును పోగొట్టుదును. పతివ్రతయగు జానకి వ్యర్థముగా మీచే కళంకిత యయ్యె. అందుకు ప్రాయశ్చిత్తము చేయుటకు నేనిచ్చటవచ్చియున్నాను. మీయొక్క శౌర్యంబు సీతయొక్క దుఃఖాగ్నిచే దగ్ధమైయున్నది ఇచ్చట నాయెదుట నీవు నిలువవలదు. విధవలవంటి వీరలతోడ పొమ్ము." అని వాక్శరంబులచే లక్ష్మణాదుల మర్మస్థలంబులను బదలు చేసెను. అంత వారు శస్త్రాస్త్రంబులచే లవునిమీఁద వర్షముకురిపించిరి. లవుఁడును వారి శస్త్రవృష్టిని నివారించి శ్రీరాముని మంత్రులను యజ్ఞవాటిక కెగరగొట్టెను. మంత్రులు మొదలయిన వారందరును లవశరవిద్ధులై యొడలువిరిగి నెత్తురమునుఁగి మాటలు జారిపోవుచుండగా శ్రీరామ

యుద్ధే నగచ్ఛతి ప్రభో ॥ ౫౩॥ సాహాయ్యం కురు సౌమిత్రే ర్యదిబంధుం సజీవితం । త్వమిచ్ఛసి లవశర ప్రహారా ద్బ్రాతుం త్వలః ॥ ౫౪ ॥ ఇత్యుక్త్వా వవా కృత్యి రాఘవం తేన్యవేదయత్ । తాని శ్రుత్వా రాఘవోఽపి తూష్ణీమాసీ త్త దా క్షణం ॥౫౫॥ లవోఽపి లక్ష్మణం బాణై ర్వవ్యాధ దశభిర్దృఢం । ఆపుంఖమగ్నా స్తే బాణాః శరీరే లక్ష్మణస్య చ ॥౫౬॥ తతః క్రోధపరీతాత్మా లక్ష్మణో వేగవత్తరః । లవదేహే స్వశస్త్రాణి భవంతి విఫలాని హి ॥౫౭ ॥ దృష్ట్వేతి వ్యగ్రచిత్త స్స క్షణం సంచింత్య వై హృది। బ్రహ్మాస్త్రేణ లవం బద్ధ్వా సాశ్వం రాజ్ఞే న్యవేదయత్ ॥౫౮ ॥ బ్రహ్మాస్త్రం మానయన్ తూ ష్ణీం యయౌ రామం లవోఽపి సః । రాఘవ స్తం సమానీతం దృష్ట్వా లక్ష్మణమబ్రవీత్ ॥ ౫౯ ॥ జానన్నపి సుతం స్వీయం కా కుకందన్యయన్ జనాన్ । మహాత్కార్యం కృతం బంధో త్వమేనం విద్ధి బాహుజం ॥ ౬౦ ॥ ద్విజహత్యాభయం త్యక్త్వా ఘాతయస్వైనమద్య హి । రామం ప్రోవాచ సౌమిత్రి ర్నాయం శస్త్రై ర్మరిష్యతి ॥ ౬౧ ॥ భరతాద్యై ర్మయా చాపి నాయం కింతాడితోఽసిభిః । అస్య దేహే క్షతం చైక మపి కిం దృశ్యతే త్వయా॥ ౬౨ ॥ తచ్ఛ్రుత్వా రాఘవః ప్రాహ ప్రష్ట వ్యో బాలక స్త్వయా । కేనోపాయేన తే మృత్యు ర్భవేదితి మమాగ్రతః ॥ ౬౩ ॥ గోపాయంతి నిజం మృత్యుం న శూ రా వధకాంక్షయా । నవదంత్యనృతం క్వాపి స్వబలే నైవ జీవితాః ॥ ౬౪॥ తతః పృష్టో లక్ష్మణేన లవః ప్రాహ ధలక్ష్మణం।

చంద్రహాస్వామీ! మన్మునూరకె, యజ్ఞమంటపమున చూచుచుందువా ఏమి? ఆలవుని చంపుటకు వేరొకయుపాయమును చింతింపుము. మహాప్రభూ! శస్త్రాస్త్రంబులచే నాలవుండు రణమున చావడు. బంధువత్సలుఁడా! తమ్మునిమీఁద నీకు బ్రతికియుండవలెనను కోరికగల్గియుండిన నాల వుని ప్రహారమునుండి తప్పిబ్రతుకునట్లు సాహ్యాముచేయుము.”అని మొఱపెట్టి లవుని మాటలను విన్నవించెను. ఆమాటలను విని శ్రీరాముఁడు కొంతసేపూరక యుండెను. లవుఁడును పదిబాణ ములచే లక్ష్మణుని పడమొత్తెను. ఆబాణములు పుంఖములవరకు శరీరమున నాటినవి. అంతనా లక్ష్మణుఁడు క్రోధావిష్టుఁడై లక్ష్మణుఁ డతిత్వరితముగా నేమి నాబాణములు లవునిదేహ మును విఫలములై పోవుచున్నవని కలతనంది కొంతసేపు మనమున నాలోచించి బ్ర హ్మాస్త్రమును ప్రయోగించి గుఱ్ఱముతోడ వానిని శ్రీరామ సన్నిధిలో తెచ్చి విడిచెను. ఆలవుండును బ్రహ్మాస్త్రంబును గౌరవించును తిన్నగావెడలెను. శ్రీరాముఁడు వానిని తెచ్చుచు న్న లక్ష్మణునింజూచి, తనకొడుకనుసంగతి నెఱింగినవాఁడైనను లోకమునకాశ్చర్యమును చూ పించువాఁడై “తమ్ముఁడా! గొప్పపనిఁజేసితివి వీనిని క్షత్రియుండని యెఱిఁగి, బ్రాహ్మణహత్యాభ యములేక ఇప్పుడే చంపవలయునుగదా;” అనిచెప్పెను. అందుకు లక్ష్మణుఁడు “అన్నా; వీఁడు శస్త్రంబులచే చావువాఁడుకాఁడు. భరతాదులచేతను నాచేతను వీఁడు పలుమారు నరుకఁబ డినను వీనిదేహమున నొకగాయము గూడలేదు. చూడుము.” అని విన్నవింపగా. రాఘవుఁడు “నీవు బాలకుని నడుగుము. ఎట్లు నీకుమరణము గల్గుననుసంగతిని నాయెదుట నీవడిగిన శూ రులగువారు వధకాంక్షచే మృత్యువును దాచరు. ఒకప్పుడు నసృతమాడరు. స్వబలముచేతనే

జలస్య సేచనాద్వృద్ధిం నీయమానం త్వయా మునే ॥ ౯౫ ॥ కాపట్యబుద్ధ్యా లోకాన్ స దర్శయన్ స్వపరాక్రమం। జలస్య సేచనేనాద్య మృత్యుర్మే నిశ్చితో భవేత్ ॥ ౯౬ ॥ తత్తస్య వచనం శ్రుత్వా శిలాయాం తం నివేశ్య చ। సేచనం తోయకలశైః కారయామాస లక్ష్మణః ॥ ౯౭ ॥ అయోధ్యావాసిభిర్నారీపురుషైః పరమాదరాత్। చరుమకాక్షైశ్చ మహాఘటైః వృషానీతైశ్చ కోటిశః । తథా కార్పటికైశ్చాపి రథోష్ట్రవారణాదిభిః ॥ ౯౮ ॥ ఆనయిత్వాఽజలం తేభ్యో నిషేచ లవబాలకం । యథా యథా జలైస్తం హి సేచనం చక్రిరే జనాః ॥ ౯౯ ॥ తథా తథా లవస్తత్ర వ్యవర్ధత కుశానుజో యథా । సప్తతాళప్రమాణోఽభూత్ వృద్ధ్యా భీమపరాక్రమః ॥ ౧౦౦ ॥ తతస్తం లక్ష్మణః ప్రాహ త్వయాఽవమృషితం । నాయం తవ వధోపాయః స్వవృద్ధ్యర్థం కృతః ఖలు ॥ ౧ ॥ లవోఽప్యాహ స సౌమిత్రిం కౌటిల్యేన ప్రతారయన్। యథా తైలక్షయే దీపో వృద్ధిమంతే ప్రగచ్ఛతి ॥ ౨ ॥ తథాయుషః క్షయే మేఽపి వృద్ధిం పశ్య క్షణాంత్యగాం । తద్వాక్యం మానయన్ సత్యం సేచయత్తం స లక్ష్మణః ॥ ౩ ॥ జలైర్గాంగైస్సమానీతైః పూర్వవచ్చ పునః పునః । కాష్ఠసోపానమార్గేణ సేచనం చక్రిరే జనాః ॥ ౪ ॥ బ్రహ్మాస్త్రేణ వినిర్ముక్తః ప్రచచాల లవస్తదా। భుజావాస్ఫాలయామాస తథోరూ బాలలీలయా ॥ ౫ ॥ తం దృష్ట్వా ముముచుః సర్వే త్యక్త్వా తోయఘటానపి । శకృన్మూత్రం ప్రముంచంతో ముక్తకచ్ఛాలవేక్షణాః ॥ ౬ ॥ ఏతస్మిన్నంతరే క్రీడన్ గంగాయాం తౌ ద్వనాన్యకాః । వస్త్రచ్ఛాద్య ముహుర్నీరం కిమథాం

---

బ్రతికియుందురు." అని యాజ్ఞాపింపగా, నంతనా లక్ష్మణుండట్లే ప్రశ్నఁజేసెను. అందుకు లవుఁడు తనమనమున వాల్మీకిముని మాటచే తనమీఁద నీళ్లుముంచిపోయుటచే తనకు వృద్ధియగుచుండుసను సంగతి నాలోచించుకొని కపటబుద్ధిచే లోకులకు నిజపరాక్రమమును చూపించువాఁడై "నానెత్తిని నీళ్లుపోయుటచే నాకుమృత్యువు ఘటిల్లు" సని చెప్పెను. ఆమాటనువిని లక్ష్మణుఁడు వానిని బండమీఁదనిలిపి జలకుంభములచే నభిషేకము చేయింపసాగెను. అప్పుడు నీళ్లుచాలక యూరివారగు స్త్రీపురుషులను రాజసేవకులను నానాపాత్రలలోను వాహనాదులమీఁదను నీళ్లుతెచ్చి పోయుచువచ్చిరి. ఎట్లెట్లు జలాభిషేకము చేయుచువచ్చిరో అట్లట్లే మేఘమువలె ఏడుతాటిచెట్లపొడుగు పెరిగెను. అంత వానినిచూచి లక్ష్మణుఁడు "లవుఁడా! నీవు దబ్బరాడితివి, ఇది నీయొక్కవధోపాయముకాదు. నీయభివృద్ధికై యిట్లు చేసితివిగదా!" అని యాక్షేపించెను. అందుకు లవుఁడును కుటిలత్వముచే వంచించుచున్నవాఁడై "చమురు ముగిసినప్పుడు దీపము పెద్దదగునట్లు ఆయుఃక్షయసమయంబున నేనునిట్లు పెరుగుచున్నాను." అనిపలుకగా నామాటను సత్యమనినమ్మి లక్ష్మణుఁడు జలాభిషేకమును చేయించుచుండెను. అందరును ముందువలెనే గంగోదకమును తెచ్చి కొయ్యపడికట్ల దారిగావచ్చి నీళ్లుపోయుచుండిరి. అప్పటికి బ్రహ్మాస్త్రమునుండి విముక్తుఁడైన లవుఁడు చలించి బిడ్డలాటచే భుజమునుతట్టి తొడనాస్ఫాలించెను. దానినిచూచి యందరును జలపాత్రంబులనట్లే వదలి కచ్చలువీడిపోవ మలమూత్రంబులను విసర్జించుచు లవునినే చూచువారై యెచ్చటివారచ్చట పరుగెత్తిరి ॥ ౧౦౬ ॥ అంతలో

నీయతేజవాత్ ॥ ౭ ॥ జనాంశ్రోచుర్లవంహంతు మస్మాభిర్నీయతేబలం । విశ్వస్తైర్లవవాక్యేన తచ్ఛ్రుత్వాసయయౌకుశః ॥ ౮ ॥ సంగృహ్యస్వాశ్రమాచ్చాపం తూణీరేచేగవత్తరః । లవంమోచయితుంచాపం తదాత్కృత్వాధ్వరస్థలే॥ ౯ ॥ కుశచాపధ్వనింశ్రుత్వా తస్థౌతూష్ణీంలవఃక్షణం । తతోదృష్ట్వాకుశంప్రాప్తం యయౌయోద్ధుం సలక్ష్మణః॥౧౦॥ తంద్రృష్ట్వాసకుశఃప్రాహ ఛలితౌజానకీంప్రా । త్వయారామేణలోకైశ్చ తయోఃకతుఃణాంవినిష్కృతిం ॥ ౧౧ ॥ అహంప్రాప్తోఽస్మిమాంబాలం లవవత్త్వంనమానయ । యువయోఃపౌరుషంనార్యాం శిశావస్తీతివేద్మ్యహం॥౧౨॥ సీతాక్లేశానలజ్వాలా సందగ్ధంయువయోర్బలం । నమమాగ్రేస్ఫుటంకార్యం యువాభ్యాముపహాసకృత్ ॥ ౧౩॥ వాల్మీకిశిక్షితాంవిద్యాం రామంత్వామద్యదర్శయే । ఇత్యుక్త్వాతుములంయుద్ధం పితృవ్యేణచకారసః ॥ ౧౪ ॥ అసకావ్యధాజానకీయే లక్ష్మణోత్సృష్టమార్గణాః । రామాయణాత్కుశోజ్ఞాత్వా శేషఏవాత్రలక్ష్మణః ॥౧౫॥ బాలోస్త్రీతివధేతిస్య గారుడాస్త్రంముమోచసః । క్షాత్రధర్మంపురస్కృత్య నతద్ధింసాభయందధే ॥౧౬॥ జానకీ యుద్ధే పితుహింసా జాతాచేన్నభయంత్వితి । తద్దృష్ట్వాఖగరాజాస్త్రం సౌమిత్రేఃకుంఠితాగతిః ॥౧౭ ॥ భయభీతఃపృథ్వీ

## • కుశుఁడు నిజపరాక్రమముచే లక్ష్మణునితో యుద్ధముచేయుట.

నచ్చట గంగాతీరమున నాటలాడుచున్న కుశుఁడు ఆజనులనుచూచి మీరేల నేఁడు పలుమారు నీళ్లుమోయుచున్నారనెను. అందుకు వారు లవునిమాటనునమ్మి వానిని చంపుటకు నీళ్లుమోయుచున్నారమనిరి. అంతనాకుశుఁడు అతిత్వరితముగావచ్చి నిజాశ్రమంబున ధనుస్సును అమ్ములపొదులను గైకొని లవునివిడిపించుటకై యజ్ఞవాటికవద్దికివచ్చి ధనుష్టాంకారముచేసెను. వాని చాపనాదమునువిని లవుఁడు కొంతసే పూరకయుండెను. కుశుఁడు వచ్చుచుండుట నెఱిఁగి లక్ష్మణుఁడుపోయి తారసిల్లెను. వానినిచూచి సౌమిత్రి "నీవును రాముఁడును లోకులును జానకీదేవిని లవుని మోసబుచ్చితిరి. వాటికితగిన ప్రాయశ్చిత్తము చేయుటకై నేను వచ్చియున్నాను. లవునివలె నన్ను బాలకునిగా నీవెంచవలదు. మీ యన్నదమ్ముల పౌరుషంబు స్త్రీయందును శిశువునందును మాత్రమే గలదని నే నెఱుంగుదును. సీతాదేవియొక్క దుఃఖాగ్నిజ్వాలలచే మీబలంబు దగ్ధమైనది. హాస్యాస్పదంబుగా నాయెదుట చూపవలదు. వాల్మీకివద్ద నేర్చిన విద్యను నీకును రామునికిని చూపెదను." అనిచెప్పి పినతండ్రితోడ దొమ్మి యుద్ధము నాచరించెను. కుశునిమీఁద లక్ష్మణుఁడు ప్రయోగించిన బాణములు వ్యర్థములయినవి. **అప్పుడు లవుఁడు రామాయణకథచే నిచ్చట శేషుఁడే లక్ష్మణుఁడుగా నవతరించెననుట నెఱిఁ**గి వానిని వధించుటకై గారుడాస్త్రమును ప్రయోగించెను. మఱి యుద్ధమున తండ్రినిజంపినను క్షత్రియునికి పాపముకాదనుటనెఱింగి పినతండ్రివిషయమై రణాంగణమున హింసాభయమునందలేదు. ఆగారుడాస్త్రంబును చూచి లక్ష్మణుని గతిచెడెను. భయభ్రాంతుఁడై రథము నుండి నేలఁబడెను॥ ౧౭ ॥ దీక్షాయుక్తుఁడైనను శ్రీరాముఁడు లక్ష్మణుఁడు నేలఁబడుటనుచూ

వాక్యం హి ప్రపాతలక్ష్మణోరథాత్ । తం దృష్ట్వా రామచంద్రశ్చ దీక్షాయుక్తోపి సంగతః ॥ ౧౮ ॥ ధృత్వా చాపం చ తూణీరం యజ్ఞకుండాగ్రతః స్థితః । చాపే సంధాయ బ్రహ్మాస్త్రం సౌమిత్రేర్జీవితాశయా ॥ ౧౯ ॥ ముమోచ బాణమాశాశే గారుడోపరి సాదరం । తేన తచ్ఛాంతిమగమద్బ్రహ్మాస్త్రేణ తు గారుడం ॥ ౨౦ ॥ తతః కుశస్సందధే స సర్పాస్త్రం రాఘవోపరి । ఉవాచ నాహం సీతావత్సులభశ్ఛలితుం త్వయా ॥ ౨౧ ॥ జనాన్దర్శయితుం వ్యర్థం పౌరుషం జానకీ వనే । త్యక్తా త్వయా వృథా పూర్వం జానేహం తవ చేష్టితం ॥ ౨౨ ॥ వాల్మీకిశిక్షితాం విద్యాం మమాద్య త్వం విలోకయ । నో చేత్త్వం యాహి శరణం వాల్మీకిం జానకీమపి ॥ ౨౩ ॥ తద్వాక్యైర్భిన్నమర్మా రామస్సర్పం విలోక్య తత్ । మార్జారాస్త్రం ససృజే ఘోరం తేన తచ్ఛాంతిమాపవై ॥ ౨౪ ॥ సందధే సారమేయాస్త్రం కుశస్తం రాఘవం ప్రతి । రామోపి ముసలాస్త్రేణ సారమేయాస్త్ర మవారయత్ ॥ ౨౫ ॥ వహ్న్యస్త్రం ససృజే ఘోరం కుశోపి రాఘవం జయన్ । న్యవారయచ్చ తద్రామో మేఘాస్త్రేణ సలీలయా ॥ ౨౬ ॥ వాయవ్యం ససృజే రామం జానకీజఠరోద్భవః । నివారయచ్చ తద్రామో పర్వతాస్త్రేణ లీలయా ॥ ౨౭ ॥ వజ్రాస్త్రం ససృజే రామం సీతేయః పరమాదరాత్ । యామ్యాస్త్రేణాథ రామోపి వజ్రాస్త్రం తన్న్యవారయత్ ॥ ౨౮ ॥ బ్రహ్మాస్త్రం ససృజే రామం సీతేయః పరమాదరాత్ । హాహాకారస్తదా చాసీద్రాఘవస్యాధ్వరాంగణే ॥ ౨౯ ॥ న్యవారయత్తద్బ్రహ్మాస్త్రం వైష్ణవేన రఘూత్తమః । తతో రామం కుశస్తీక్ష్ణైర్నారాచాంశ్ఛతశః పునః ॥ ౩౦ ॥ ముమోచ రాఘవశ్చాపి మార్గణాన్ శతశః కుశే । ఏవం తత్తుములం యుద్ధం బభూవ ప్రహరం తయోః ॥ ౩౧ ॥ తదాసీత్కౌతుకం రామకుశయోర్యుద్ధతో మహాత్ । రామచాపవినిర్ముక్తా గతాయే

## కుశుఁడును శ్రీరాములును యుద్ధముచేయుట.

చి త్వరగా చాపతూణీరంబుల నందికొని యజ్ఞకుండమునకెదుట నిలిచెను. మఱియు నాలక్ష్మణుని బ్రతుకింపవలెనను నాశచే గారుడాస్త్రముమీఁద బ్రహ్మాస్త్రమును ప్రయోగించెను. అంతలోనది శాంతమయ్యె. అప్పుడు లవుఁడు శ్రీరామునిమీఁద సర్పాస్త్రమును ప్రయోగించి ‚‚నేను సీతవలె సులభముగా నీవల్ల వెనుకద్రొక్కఁబడువాఁడనుకాను. మునుపు వ్యర్థముగా మీ పౌరుషమును జనులుచూడవలయునని సీత నరణ్యమునకంపితివి. నీచేష్టితమును నేనెఱుఁగుదును. వాల్మీకివద్ద నేను నేర్చినవిద్యను నీవిప్పుడు చూడుము. అట్లుగాకున్న నీవే వాల్మీకి మునికిని సీతాసతికిని శరణాగతుఁడగుము.” అని వాగ్బాణంబులనువిడిచెను. అంతనారాముఁడు సర్పాస్త్రముమీఁద మార్జాలాస్త్రమును ప్రయోగించెను. అది శాంతమయ్యె. కుశుఁడు శునకాస్త్రంబునువేయగా రాముఁడు ముసలాస్త్రముచే దానిని నిగ్రహించెను. పిమ్మట కుశుఁడు ప్రయోగించిన ఆగ్నేయాస్త్రంబు శ్రీరాముని మేఘాస్త్రంబుచే మాయమయ్యె. కుశుఁడు వాయవ్యాస్త్రమును విడువగా లీలచే రాముఁడు పర్వతాస్త్రముచే దానిని నివారించెను. కుశుఁడు తనవజ్రాస్త్రము రాముని యమాస్త్రముచే శాంతినొందగా బ్రహ్మాస్త్రమునే ప్రయోగించెను. అప్పుడు రామునియజ్ఞాంగణమున హాహాకార కోలాహలముపుట్టెను. శ్రీరాముఁడు దానినికూడ వైష్ణవాస్త్రముచే నణఁచెను. అంత నూరకుండక కుశుఁడును శ్రీరా

ర్యేషతత్రిణః ॥ ౩౨ ॥ తేతేకుశస్యోత్తమాంగో పరిష్టాద్ధరణీతలే । పతంతిస్మతథాయేయే కుశచాపవినిర్గతాః ॥ ౩౩ ॥ శరాస్తేరామచంద్రస్య పతంతిస్మపదాంతికే । తద్దృష్ట్వాకౌతుకంరామో విస్మయావిష్టమానసః ॥ ౩౪ ॥ ఆజ్ఞాపయత్స్వసచివం గచ్ఛవాల్మీకిసన్నిధిం । పృచ్ఛస్వతంనమస్కృత్య కావేతౌశిష్యౌమహాబలౌ ॥ ౩౫ ॥ తతోజ్ఞాత్వానయోర్నామ్నీతే కరిష్యామిమతింక్షణాత్ । తథేతిరామవచనాత్సమంత్రీరథమాస్థితః ॥ ౩౬ ॥ క్రోశద్వయాంతరేగత్వా సవ్యంకృత్వాకుశంలవం । దృష్ట్వాతత్యాజ వాల్మీకిం రామవాక్యాన్యజీవయత్ ॥ ౩౭ ॥ మునిఃప్రాహామంత్రిణంత్వం వదరామాయమేవచః । సభామధ్యేగాయనస్య కాలేశ్వోవిదితంతవ ॥ ౩౮ ॥ భవిష్యతిసమస్తంహి వృత్తంబాలకయోశ్శుభం । తతోమంత్రిమునేర్వాక్యం రాఘవాయన్యవేదయత్ ॥ ౩౯ ॥ కుశంలవంసమాహూయ వాల్మీకిరపితౌముదా । సమాలింగ్యకథాభిస్తాం వినాయరజనీంముఖం ॥ ౪౦ ॥ * ఇతిశ్రీమచ్ఛతకోటి రామచరితాంతర్గతే శ్రీమదానందరామాయణే వాల్మీకీయే జన్మకాండే కుశలవయోః పరాక్రమవర్ణనంనామ సప్తమస్సర్గః ॥ * ... ౭॥

శ్రీరామదాసఉవాచ—అథప్రభాతేరామేణ సమాహూతావుభౌశిశూ । నత్వామునింమాతరంచ సభాయాంజగ్మతుర్ముదా ॥ ౧ ॥ వాల్మీకేరాజ్ఞయాబాలౌ జటాకృష్ణాజినాంబరౌ । జన్మకాండంత్వేకమేవ జగతుస్తౌ పితుఃపురః ॥ ౨ ॥ జనైఃశ్రుత్వాస్వచరితం రామోభూదతివిస్మితః । అసజ్జనాశ్చాపిసర్వే విస్మయావిష్టమానసాః ॥

ముందును తీక్ష్ణనారాచంబులచే కొంతసేపు పోరాడిరి. అప్పటి రామకుశలయుద్ధమున కౌతుక మొకటిజరిగినది. రాముఁడుప్రయోగించిన బాణములన్నియును కుశునితలమీఁదుగా నేలఁగూలుచుండెను. కుశుఁడుప్రయోగించిన వన్నియును రాముని పాదముమీఁదుగా నేలజారుచుండెను. ఆసంగతిలో శ్రీరాముఁడు ఈవేడుకనుచూచి యాశ్చర్యచిత్తుఁడై తనమంత్రికి“నీవు వాల్మీకి మునిసన్నిధికిపోయి నమస్కరించి ఎవరు వీరిరువురు బలిష్ఠులగు శిష్యులు? అనియడిగి తెలిసికొనిరమ్ము. నేను సంగతినెఱిఁగి పిమ్మట వీరి సంహారవిషయమై మదినెంచెదను.” అని యాజ్ఞాపించెను. అంత నతఁడట్లేయని రథమునెక్కి వెడలి రెండుకోసులు దూరముననే కుశలవులను కుడిప్రక్కజేసి వాల్మీకిమునికి నమస్కరించి శ్రీరామవాక్యమును విన్నవించెను. అమ్మునీంద్రుఁడు మంత్రినిచూచి “బాలకులయొక్క మంగళచరిత్రంబు సమగ్రముగా రేపు సభలో గానముజరుగునప్పుడు తెలియును. అని నామాటగా చెప్పుము. పొమ్ము.” అని పంపించెను. అతఁడట్లే రామునికి విజ్ఞాపించెను. అచ్చట వాల్మీకి కుశలవులను సంతసముతో పిలిచి యాలింగించి, కథలచే నా రాత్రిని సుఖముగానడపెను॥ ... ... ... ... ౭॥

యజ్ఞసభలో కుశలవులు జన్మకాండమును పాడుట.

అంత మఱునాడు ప్రొద్దున శ్రీరాముండు బాలకులనుపిలుపించెను. జటాకృష్ణాజినాంబరధారులగు నాకుశలవులు వాల్మీకిని వైదేహిని వందించి సభలోప్రవేశించి సంతోషముతో వాల్మీకి యనుజ్ఞనంది తండ్రియెదుట జన్మకాండమొకటినే పాడిరి. శ్రీరామచంద్రుఁడు జనుల

౩ ॥ జ్ఞాత్వా సీతా కుమారౌ తౌ సంతోషం పరమం యయౌ । ఏతస్మిన్నంతరే సర్వే లవ వాయవ్యాస్త్రపీడితాః ॥౪॥ శత్రుఘ్నాద్యా యయుస్తత్ర యానస్థాశ్చ సజీవినః । అంగదాద్యాః పార్థివాశ్చ మోహనాస్త్రైర్విజీవితాః ॥౫॥ యయుస్స వానరాస్సర్వే లక్ష్మణోపి యయావరుక్ । సర్వే నత్వా రామచంద్రం తస్థుస్తత్పార్శ్వకే ముదా ॥౬॥ అథ సంమంత్ర్య రామోపి తౌ విసృజ్యాదరేణహి । రాక్షసేంద్రం లక్ష్మణం చ శత్రుఘ్నం మకరధ్వజం ॥౭॥ అంగదం చ సుషేణం చ జాంబవంతం వచోబ్రవీత్ । ఆనయధ్వం మునివరం ససీతం దేవసంమితం ॥౮॥ అద్యాస్తు పక్షదాం మధ్యే ప్రత్యూషే సభాంగణే । గంగాయా దక్షిణే తీరే సభా కార్యా మయా శుభా ॥౯॥ కరోతి శపథం సీతా మమాగ్రే జాహ్నవీతటే మునీశ్వరాద్యాస్సర్వే తాం జానంతు గతకల్మషాం ॥ ౧౦॥ తథా మమాపి వాల్మీకేశ్శుద్ధిం జానంతు వై గతాః । ఇతి తద్వచనం శ్రుత్వా లక్ష్మణాద్యా మునిం గతాః ॥ ౧౧ ॥ ఊచుర్యథోక్తం రామేణ వాల్మీకిం లక్ష్మణాదికాః । రామస్య హృద్గతం సర్వం జ్ఞాత్వా వాల్మీకిరబ్రవీత్ ॥ ౧౨ ॥ సమర్పితాన్ సుమంత్రాద్యాన్ లక్ష్మణాయ సమర్ప్య చ యుష్మాభిః కథనీయం మద్వాక్యం శ్రీరాఘవం ప్రతి ॥ ౧౩ ॥ శ్వః కరిష్యతి వై సీతా శపథం జనసంసది । యోషితాం పరమో దేవః పతిరేకో నచాపరః ॥౧౪॥ పతిం వినా గతిః కాన్యా నార్యాశ్చాస్తి జగత్త్రయే । లక్ష్మణాద్యాస్తతస్సర్వే రామమాగత్య తేఽనఘాః ॥ ౧౫ ॥ సుమంత్రాదీంశ్చతుర్వీరాన్ రాఘవాయ సమర్ప్య చ । వాల్మీకేర్వచనం ప్రాహు రూచుస్తం రఘునాయకం ॥

తోడ తనచరిత్రమునువిని అత్యంతాశ్చర్యమునందెను. లోకులును విస్మయావిష్టులై వీరు సీతమ్మ యొక్క ముద్దుబిడ్డలనియెఱిఁగి ముదమునందిరి. అంతలో లవుని వాయవ్యాస్త్రముచే పీడితులై యున్న శత్రుఘ్నాదులును మోహనాస్త్రమగ్నులైయున్న అంగదాదికపివీరులును మహారాజులును గాయమునందక యుండెడు లక్ష్మణుఁడును అచ్చటికివచ్చి శ్రీరామచంద్రస్వామిని వందించి తత్సన్నిధానమున సంతోషముతో కూర్చుండిరి. అప్పుడు రాఘవుఁడు ఆబాలకులను సాదరముగా పంపించెను ॥ ౭ ॥ పిదప శ్రీరాముఁడు విభీషణ లక్ష్మణ శత్రుఘ్న మకరధ్వజాంగద సు

శ్రీరాముఁడు సీతాదేవిని వాల్మీకిని పిలుపించుట.

షేణ జాంబవంతులతో నాలోచించి "దేవపూజ్యుఁడగు వాల్మీకిమునీంద్రునిని సీతాదేవితోడ తీసికొనిరండి. నేఁడైననో సభికులనడుమ సభాంగణమున నమ్మకము కావలయును. గంగయొక్క దక్షిణతీరమున మంగళకరమైన గొప్పసభ నేర్పరుపవలెను. గంగాతీరమున నాయెదుట సీత శపథముచేయుగాక. మునీంద్రులందరును ఆమెను పాపములేనిదానినిగా నెఱుఁగని. అట్లే నాయొక్క నిష్కల్మషత్వమును వాల్మీకియొక్క పారిశుద్ధ్యమును తెలియుదురుగాక." అని చెప్పిపంపెను. ఆమాటనువిని లక్ష్మణాదులు మునీంద్రునివద్దికివచ్చి శ్రీరామవచనములను విన్నవించిరి. అప్పుడు ఆమహర్షి శ్రీరాముని హృదయాభిప్రాయము నెఱింగి సంమానింపఁబడిన సుమంత్రాదులను లక్ష్మణుని వశమునకుసమర్పించి వారినిచూచి "శ్రీరామునికి నామాటలనిట్లు మీరు విన్నవించవలసినది. రేపు సభామధ్యమున సీతాదేవి శపథము చేయుచున్నదిగదా? శ్రీ

౧౬ ॥ ... కివ... శ్రుత్వా తతో ఽపి రాఘవో ఽపి చ । సుమంత్రం భరతం చాపి శత్రుఘ్నం వానరరాజకం ॥౧౭॥ సమా లింగ్య ... గృహ్య పునర్జాతానమన్యత । సీతయా పాలితాస్సర్వే వయం లవజితా స్త్వితి ॥ ౧౮॥ కథయామాసు శ్శ్రీరామం సుమంత్రాద్యాస్సవిస్తరం । ద్వితీయేదివసే కృత్వా సభాం శ్రేష్ఠాం మనోరమాం ॥౧౯॥ సర్వాం స్తపార్థం సమాహూయ రామో వాక్యమథాబ్రవీత్ । మునయః పార్థివాస్సర్వే శృణుత స్వస్థమానసాః ॥ ౨౦ ॥ సీతాయాశ్శ పథం లోకా విజానంత్వశుభం శుభం । ఇత్యుక్త్వా రాఘవేణాథ లోకాస్సీతాదిదృక్షవః ॥౨౧॥ బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యా శ్శూద్రాశ్చైవ సహస్రశః । సవానరాస్సమాజగ్ము స్తం దివ్యం ద్రష్టుముద్యతాః ॥ ౨౨ ॥ తతో మునివరశ్శ్రీఘ్రం ససీతస్సముపాగతః । అగత స్తం మునిం కృత్వా యాంతీ కించిదవాఙ్ముఖీ ॥ ౨౩ ॥ కృతాంజలిర్బాష్పకంఠా సీతా శ్చైర్యజ్ఞం ప్రవేశితం । దృష్ట్వా లక్ష్మీమివాయాంతీం శ్రీవిష్ణుమనుయాయినీం ॥ ౨౪ ॥ వాల్మీకేః పృష్ఠతస్సీతాం సాధువాదో మహానభూత్ । తదా మధ్యే జనౌఘస్య ప్రవిశ్య మునిపుంగవః ॥ ౨౫॥ సీతాసహాయో వాల్మీకి స్తదా రాఘవమబ్రవీత్ । ఇయం దాశరథే సీతా సువ్రతా ధర్మచారిణీ ॥ ౨౬ ॥ త్వయా పాపాత్పరిత్యక్తా మమాశ్రమసమీపతః । లోకాపవాదభీతేన యమునాదక్షిణే తటే ॥౨౭ ॥ ప్రత్యయం దాస్యతే సాధ్వీ తదనుజ్ఞాతుమర్హసి । ఇమౌతు సీతాతనయౌ కుశ స్త్వత్తో లవో మయా ॥ ౨౮ ॥ లక్షైర్విశిమిర్తతస్సీతా భయాత్ప్రివ్యగ్రచేతసా । సుతావిమౌ తేదుర్ధర్షౌ తథ్య

లకు పతియే పరమోత్తమదేవుఁడు. ఇతరుఁడు కాఁడు. ముల్లోకములలోను పతితప్ప సతికి మఱియేమియేఁ గతిగలదు!" అనియాజ్ఞాపింపగా, నట్లేయని లక్ష్మణాదులువచ్చి శ్రీరామసన్నిధిలో భరతాదివీరులను సమర్పించి వాల్మీకివాక్యంబును సంతసముతో విన్నవించిరి. రాఘవేంద్రుఁడును విని విశేషముగా నానందించి భరత సుగ్రీవ సుమంత్ర హనుమంతులను ఆలింగించి మరలపుట్టినవారినిగా నెంచెను. వారు శ్రీరామసన్నిధికి "మేము నలుగురును లవునిచేజయింపఁబడినవారము. సీతమ్మ మమ్మును పాలించుచుండెను" అని తనుసంగతిని సవిస్తరముగా విన్నవించిరి॥౧౯॥

వాల్మీకిముని శ్రీరాములవారికి కుశలవులను సమర్పించుట.

మఱునాఁడు మనోహరమగు గొప్పసభ చేయించి అందరినిపిలువించి శ్రీరామచంద్రుఁడు "మునీంద్రులారా! మహారాజులారా! మీరందరును స్వస్థచిత్తులై వినుఁడు. శుభమయినను అశుభమైనను సీతయొక్క శపథమును తెలియుదురుగాక." అనిచెప్పెను. అంతనందరును సీతాదేవిని పరికించువారలై యుండిరి బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులు వేలకొలఁదిగా వానరులతోడ ప్రతిజ్ఞనవలోకింప నుద్యుక్తులైవచ్చిరి. అంతినావాల్మీకిమహర్షి త్వరగా సీతాదేవితోడ సభకేతెంచెను. మునీంద్రుని ముందు బెట్టుకొని తలవంచి బద్ధాంజలియై సంతసముతో జానకమ్మ చిన్నగా నాయజ్ఞసభను ప్రవేశించెను. వాల్మీకికి వెనుక, శ్రీవిష్ణుమూర్తిని వెంబడించునదియైన సాక్షాల్లక్ష్మీవలె వచ్చుచుండెను సీతాదేవినిచూచి సాధుసల్లాపంబు గొప్పగానయ్యె. అపుడు జనసమూహమధ్యమున వాల్మీకిముని సీతమ్మతోడప్రవేశించి శ్రీరామునితో "దాశరథీ! యీమ

మేతద్బ్రవీమి తే ॥ ౨౯ ॥ ప్రచేతసోఽహం దశమః పుత్రో రఘుకులోద్వహ । అనృతం న స్మరామ్యుక్తం యథేమౌ తవ పుత్రకౌ ॥ ౩౦ ॥ బహూన్వర్షగణాన్సమ్యక్ తపశ్చర్యా మయా కృతా । నోపాశ్నీయాం ఫలం తస్యా దుష్టేయం యది మైథిలీ ॥ ౩౧ ॥ ఇత్యుక్త్వా రాఘవస్యాంకే దక్షిణే స్థాపయత్కుశం । లవం విన్యస్య వామాంకే తస్థౌ రామాగ్రతో మునిః ॥ ౩౨ ॥ రామోపి తౌ సమాలింగ్య మూర్ధ్ని ఘ్రాత్వా సుసాదరం । లవస్య మస్తకే హస్తం సంస్థాప్య జగదీశ్వరః ॥ ౩౩ ॥ అతిహ్రస్వతరం బాలం పూర్వవత్స్వకరోత్తదా । తతో రామోపి తాం సీతాం దృష్ట్వా గాంభీర్యయాన్వితాం ॥ ౩౪ ॥ అజ్ఞాత ఇవ సంప్రాహ లక్ష్మణం పురతః స్థితం । త్వయా భుజస్సమానీతః సీతాయా మాం ప్రదర్శితుం ॥ ౩౫ ॥ పురా తమానయ స్వాద్య చేత్ స్థిరక్షితస్త్వయా । తథేత్యుక్త్వా లక్ష్మణోపి పేటికావిహితం భుజం ॥ ౩౬ ॥ సీతాయాః పురతో రామం దర్శయామాస సాదరం । సీతాభుజోపమం దృష్ట్వా భుజం మాంసాదిభిర్యుతం ॥ ౩౭ ॥ సభాసదః తత్కాలే హ్యాసన్ సర్వేతివిస్మితాః । ఏతస్మిన్నంతరే తత్ర పశ్యత్సు సకలేష్వపి ॥ ౩౮ ॥ భుజస్సముత్థితాం ప్రాప్తో విశ్వకర్మోద్భవః క్షణాత్ । తద్దృష్ట్వా కౌతుకం లోకా అభూవన్నతివిస్మితాః ॥ ౩౯ ॥ రామోపి విస్మితః ప్రాహ వాల్మీకిం ప్రణిపత్య చ । ఏవమేవ మహాప్రాజ్ఞ యదుక్తం మాం త్వయాధునా ॥ ౪౦ ॥ ప్రత్యయో జనితో మహ్యం తవ వా

నాదక్షిణతీరంబున నాయాశ్రమసమీపమందు పాపమువలన లోకాపవాదభీతుఁడైన నీవు ధర్మచారిణియును సుశీలయునగు నీసీతాదేవిని త్యజించితివి. ఆమెయిప్పుడు నమ్మకము నిచ్చుచున్నది! అందుకు నీవనుజ్ఞ నిమ్ము. వీరిద్దఱును సీతాపుత్రులు. నావలన కుశుఁడును సీతమ్మయొక్క భయముచే చకితుఁడగు నాచే లవంబులచే నిర్మింపఁబడినవాఁడు లవుఁడును గల్గిరి. నీకువారలు వీరు మిక్కిలిసమర్థులు. నీకునేను యథార్థమును చెప్పుచున్నాను. రఘునాథా! నీకువీరు పుత్రులయినట్లే, నేను వరుణునియొక్క పదియవ పుత్రుఁడుగానున్నాను. అసత్యమును నేనెన్నడునుస్మరించను. ఈసీతమ్మ దుష్టురాలుగా నుండినయెడల అనేకవర్షగణంబులు నేనాచరించిన తపస్సుయొక్క ఫలంబుననుభవించును.” అని చెప్పి శ్రీరామచంద్రుని కుడితొడమీఁద కుశునిని ఎడమతొడమీఁద లవునిని కూర్చుండబెట్టి యెదుటనిలిచెను. జగదీశ్వరుఁడగు రాఘవుఁడును వారినాలింగించి మస్తకమునాఘ్రాణించి సాదరముగా లవుని తలమీఁద నిజహస్తమునిడి వానిని మునుపటివలె చిన్నబాలకునినిగా జేసెను ॥ ౩౪ ॥ అంత నాశ్రీరాముఁడు ద్విభుజ

## విశ్వకర్మ నిర్మిత సీతాభుజ సుదృశ్యమగుట.

జయైన సీతాదేవినిచూచి తెలియనివానివలె సముఖముననున్న లక్ష్మణునితో “మునుపు నాకు చూపుటకై సీతయొక్క భుజమును తెచ్చిచూపితివిగదా? దానిని బదులుగా పెట్టెయుండిన పుడు తీసికొనిరమ్ము.” అనియాజ్ఞాపించెను. అతఁడు నట్లేయని సాదరముగా పెట్టలోనుండి సీతాభుజమునెత్తి ఆమెయెదుట రాములవారికి చూపించెను. అయిదేండ్లకుమునుపే ఛేదింపఁబడి మాంసపూరితంబై సీతాభుజమువలెనుండెను దానినిచూచి అందరు నాశ్చర్యము నందు

కైర్నిశ్చితైః। లంకాయామపిదృష్టోమే వైదేహ్యాః ప్రత్యయోమహాన్ ॥ ౪౧ ॥ దేవానాంపురతస్తేన మందిరం సంప్రవేశితా । సేయంలోకభయాద్బ్రహ్మన్నపాపాపిసతీపురా ॥ ౪౨॥ సీతామయాపరిత్యక్తా తద్భవాన్ క్షంతుమర్హసి। మత్తోజాతౌ స్త్విమౌనామి కుశోయంచలవస్త్వయా ॥౪౩॥ లవైర్భింత్యాకృతోఽద్మి సీతాశాపభయాన్మునే। తథాపిలోకాన్ సకలాన్ ద్రష్టుంసీతాత్రప్రత్యయం ॥౪౪॥ కరోతుశపథంచాపి సభాయాంతవసన్నిధౌ। శుద్ధాయాంజగతీమధ్యే సీతామంగీకరోమ్యహం ॥౪౫॥ తదాతచ్ఛపథంద్రష్టుమాసన్ లోకాస్సముత్సుకాః। సభాయాం జానకీచాథ తథాకౌశేయవాసినీ ॥౪౬॥ ఉదఙ్ముఖీహ్యధోదృష్టిః ప్రాంజలిర్వాక్యమబ్రవీత్ । రామాదన్యమహంచేద్ధి మనసాపినచింతయే ॥౪౭॥ తర్హిమే ధరణీదేవీ వివరందాతుమర్హతి। ఏవంశపంత్యాస్సీతాయాః ప్రాదురాసీన్మహాద్భుతం॥౪౮॥ భూతలాద్దివ్యముత్కృష్టం సింహాసనముత్తమం। భువోవివరమార్గేణ సమానీతంమనోరమం॥౪౯॥ నాగేంద్రైర్ధ్రియమాణంతద్దివ్యదేహైరవిప్రభం। భూదేవీజానకీందోర్భ్యాం ధృత్వాదుహితరంనిజాం॥౫౦॥ స్వాగతాసీతితాముక్త్వాసనేహ్యాసన్యవేశయత్। వస్త్రాలంకారస్రగ్గంధ సుగంధైఃపూజ్యమైథిలీం॥౫౧॥ సమాలింగ్యాథభూదేవీ వీజయామాససాదరం। తదాశనైశ్శనైర్భూమ్యాం గుప్తంసింహాసనంత్వభూత్ ॥ ౫౨॥ సింహాసనస్థాంవైదేహీం ప్రవిశంతీం

చుండగా నావిశ్వకర్మనిర్మితభుజం బన్యశ్యంబయ్యె. ఆఘంతనుచూచి జనులు అత్యంతాశ్చర్య మునందిరి. శ్రీరాముండును ఆశ్చర్యమునందినవాండై వాల్మీకిమునినిచూచి నమస్కరించి “మహానుభావా! ఇప్పుడు నీవు నాతో చెప్పినదంతయు నశ్లైసరి. నిర్మలంబులైన నీమాటలచేనాకు నమ్మకము చక్కగాగల్గినది. లంకలోకూడ దేవతలయెదుట సీతవలన నేను ప్రత్యయమునందితిని. అందువల్లనే అంతఃపురమున నామెనంగీకరించితిని. అట్టి యీమెను లోకభీతివలన నేను పరిత్యజించితిని. దానిని నీవుక్షమించుము. ప్రాజ్ఞుండా! కుశుండు నావల్ల గల్గెనని యెఱుంగుదును. సీతాశాపభయమువలన భ్రాంతిచేనీవు లవుని లవంబులచే నిర్మించితివని తెలిసియున్నాను. అయినను ఈలోకులందరికిని నమ్మకమునిచ్చుటకై సీత ఈనిర్మలసభలోనీయెదుట శపథమును చేయవలెయును. లోకులయెదుట సీతనంగీకరించెదను.” అనిచెప్పగా, నప్పుడా శపథమును చూచుటకు జనులందరును సముత్సాహులైరి. అంత పట్టుబట్టకట్టికొనిన జానకీదేవి సభలో నంజలి బట్టి యుత్తరదిక్కునుచూచుచు నేలచూపుగలదై «శ్రీరామునికన్నను వేఱొకనిని మనంబున గూడ తలంచిన దాననుకాను. అట్లున్న నీభూదేవి నాకు రంధ్రమునిచ్చునుగాక” అని యిట్లు శపించుచుండగా నొకవింతజరిగెను. భూమివిరిసి యారంధ్రమునుండి మిక్కిలిమనోహరంబగు మేలైనసింహాసన మొక్కటివెలువడెను. భూదేవిప్రత్యక్షమైవచ్చి తనకూతురగు సీతమ్మనుచేపట్టి సుఖముగా వచ్చినదానవయితివనిచెప్పి దివ్యదేహులగు నాగేంద్రులచే ధరింపఁబడి[illegible]ర్కప్రభంబగునాసింహాసనమున కూర్చుండబెట్టి వస్త్రభూషణగంధమాల్యాదులచే సత్[illegible]చి యాలింగించిసాదరముగా వీచుచుండెను. అప్పుడు తిన్నతిన్నగా సింహాసనము భూమిలో గ్రుంగినదా

రసాతలం । దృష్ట్వాకాశస్థితా దేవాః స్త్రియస్సర్వాస్సుసంభ్రమాత్ ॥ ౫౩ ॥ నిరంతరాభిశ్శ్రీదేహం వవర్షుః పుష్పవృష్టిభిః । సాధువాదశ్చ సుమహాన్ స్వస్సూనమరకీర్తితః ॥ ౫౪ ॥ అంతరిక్షే చ భూమౌ చ సర్వం స్థావరజంగమం । తదా బభూవ చకితం సీతాశపథదర్శనాత్ ॥ ౫౫ ॥ ఊచుస్తే బహుధా వాచో వానరాశ్చ నరాధిపాః । కేచిచ్చింతాపరాః కేచిదాసన్ ధ్యానపరాయణాః ॥ ౫౬ ॥ కేచిద్రామం నిరీక్షంతః కేచిత్సీతామచేతసః । ముహూర్తమాత్రం తత్సర్వం తూష్ణీభూతమచేతనం ॥ ౫౭ ॥ ప్రవిశంతీం భువం సీతాం దృష్ట్వా సంమోహితం జగత్ । ఏతస్మిన్నంతరే రామః ప్రవిశంతీం చ భూతలే ॥ ౫౮ ॥ విదేహజాం తదా దృష్ట్వా వామహస్తేన సంభ్రమాత్ । తాం దధార కరేణాథ ధృత్వా హస్తేన వై భువం ॥ ౫౯ ॥ తతస్తాం ప్రార్థయామాస భువం రఘునందనః ॥ ౬౦ ॥ * । శ్రీరామచంద్ర ఉవాచ — దేవి త్వం సర్వలోకానాం నివాసస్థానముత్తమం । పవిత్రైకమాతా త్వం మహానీరోగ్యదాత్రి సదా ॥ ౬౧ ॥ వరదా సేవ్యపుణ్యరూపా త్వం వసుదా సకలాన్ జనాన్ । స్వగాత్రరంధ్రదౌషధీస్త్వం కరోషి శేషతృప్తిదాః ॥ ౬౨ ॥ త్వం దుర్గా లక్ష్మీస్త్వం స్వరాత్మికా మహావిష్ణోః ప్రియా శుభా । త్వమేవాద్యాత్ర మే శక్తిర్నిర్మితాసి మయా హి ॥ ౬౩ ॥ నిజోదరాద్దదాసి త్వం ధాతూన్ప్రీత్యా జనాన్ సదా । క్షమాయుక్తా త్వమేవాసి వేదసూక్తాస్మృతోక్తకర్మసు ॥ ౬౪ ॥ జానకీ తే సుతా త్వం శ్వ

యెను సింహాసనమున కూర్చుండి రసాతలంబునకు దిగంబడి పోవుచున్న జానకిన్ జూచి గగనమున దేవస్త్రీలు సీతమీంద నెడతెగక పూలవానం గురిపించిరి. ఆహా! ఎంతమంచిది ఎంతమంచిది నిదేవతలు కీర్తించిరి. అప్పుడు భూమిలోను అంతరిక్షమందును గల చరాచరప్రపంచంబు సీతాశపథమును చూచుటవలన భయభ్రాంతంబయ్యె. నరాధిపులును వానరాధిపులును విచ్చలవిడిగా మాటలాడుచుండిరి. కొందఱు చింతాక్రాంతులయిరి. కొందఱు ధ్యాననిష్ఠులైరి, కొందఱు శ్రీరాముని నీక్షించుచుండిరి. కొందఱు సీతాదేవిని నవలోకించుచుండిరి. సీత భూమిలో ప్రవేశించుటను చూచి యిజ్జగంబు సంమోహితంబై యచేతనంబై యొక ముహూర్తకాల మూరకయుండెను. అంతలో నపుడు శ్రీరాముండు పోవుచుండు సీతను సంభ్రమమువలన నెడమ చేతితో పట్టి ధరించి కుడిచేతిలో భూదేవినిపట్టి యిట్లు ప్రార్థించెను॥ ౬౦॥ దేవీ! నీవు సర్వలోకములకును ఉత్త

సీత భూమిలో గ్రుంగునపుడు శ్రీరాముండు భూదేవిని ప్రార్థించుట.

మనివాసస్థానమయితివి. నీవు పుణ్యస్వరూపవు. సకలజనులకును నీకడుపునుండి సువర్ణమునిచ్చెదవు. నీవ శేషతృప్తిదంబులగు నౌషధులను చేయుచున్నావు॥ ౬౨ ॥ నీవే దుర్గాదేవి, నీవే లక్ష్మీదేవి, స్వరాత్మిక, విష్ణువగు నాకు నీవే ప్రియురాలయిన మంగళదేవత. నీవే ఇప్పుడిచ్చట నాశక్తిగానున్నావు. నిన్ను నేనే నిర్మించితిని॥ ౬౩ ॥ నీకడుపునుండి లోకులకు ప్రీతితో ధాతువులనిచ్చుచున్నావు. [illegible]తము నీవే వేదసూక్తోక్తకర్మలు ఇతరశాస్త్రోక్తకర్మలు మొదలైనవాటిలో క్షమగల్గినదానవు॥ ౬౪॥ ఈజానకి నీకూతురు. ఇప్పుడిచ్చట నాకు నీవత్తగారుగానున్నావు. నాకు కన్యాదానము చేయుము, మునుపు చేయలేదుగదా?॥ ౬౫॥ దేవీ! నీవు సుప్రసన్నవగుము. ఇట్లు

క్రూరస్త్వం మేధునాత్విహ । కన్యాదానం కురు ముదా త్వయా పూర్వం కృతం న హి ॥ ౬౫॥ ప్రసీద దేవి నో చేత్తే త్వయి క్రోధో భవిష్యతి ॥ * ॥ రామదాస ఉవాచ—ఇతి సంప్రార్థితా చాపి రాఘవేణ మహాత్మనా ॥౬౬॥ నారీకాఠిన్యభావాత్సా నాశృణోద్రాఘవేరితం । శనైశ్శనైరధస్సీతా సహితా సాజగామహ ॥ ౬౭ ॥ తాం గచ్ఛంతీం పునర్దృష్ట్వా భువం రామో ధృతామపి । బభూవ క్రోధతామ్రాక్షస్తదా లక్ష్మణమబ్రవీత్ ॥ ౬౮ ॥ చాపమానయ సౌమిత్రే శిక్షయేహం భువంత్విమాం । సుతీక్ష్ణకోపమబాణేన వసుధేయం విదేహజాం ॥ ౬౯॥ మామద్య దాస్యతి క్షిప్రమస్యా ఘాతం న రోచయే । తతోసౌ లక్ష్మణానీతం కరే కోదండముత్తమం ॥ ౭౦ ॥ ధృత్వా జ్యాఘోషణం కృత్వా శరసంధానమాతనోత్। తదా హి మహాన్వాయు శ్చుక్షుభే లవణార్ణవః ॥ ౭౧ ॥ తారాని పేతుర్ధరణీం బభూవుస్సరజా దిశః । చకంపే ధరణీ చాపి త్రాహీతి వదతీ ముహుః ॥ ౭౨ ॥ కరాభ్యాం జానకీం ధృత్వా రామస్యాంకే న్యవేశయత్ । స్వయం శ్రీరామపదయోశ్శిరః పాతనమన్వ్యధాత్ ॥ ౭౩॥ తదాథ దేవవాద్యాని నేదుః కుసుమవృష్టిభిః । వవర్షుర్జానకీం రామం దేవసంఘా ముదాన్వితాః ॥ ౭౪ ॥ తతో రామోపి తాం దృష్ట్వా పదయోర్న్నమతీం భువం । స్వక్రోధం శాంతమకరోత్కరాభ్యాం చాపమార్గణౌ ॥ ౭౫ ॥ విసృజ్య స్థాపయామాస స్వకరేణావనిం ప్రభుః । తతస్సా రాఘవం నత్వా ప్రసాద్య చ పునః పునః ॥౭౬॥ దత్వా విదేహకన్యాయై తల్సింహాసనముత్తమం । సీతాం స్తుత్వాథ తాం స్పృష్ట్వా

కాకపోయిన నీయందు నాకు క్రోధముపుట్టుచున్నది.” అని మహాత్ముఁడగు రాఘవుఁడు ప్రార్థించినను, స్త్రీకాఠిన్యస్వభావముచే నాభూదేవి రామునిమాటవినక సీతాదేవితోడ తిన్నఁతిన్నగా నేలఁదిగఁబడి పోవుచుండెను ॥ ౬౭ ॥ చెప్పినట్లు వినకపోవుచున్న భూదేవినిచూచి శ్రీరాముఁడు

శ్రీరాముని యాగ్రహము నోర్వజాలక భూదేవి సీతమ్మ నప్పగించి సెడలుట.

కన్నులెఱ్ఱవారుచుండ లక్ష్మణునిచూచి “తమ్ముఁడా! ధనుస్సును తెమ్ము. ఈభూమిని శిక్షించెదను. నాతీక్ష్ణబాణముచే నీభూదేవి సీతను నాకర్పించుచున్నది. దీనినివధించను” అనియాజ్ఞాపించెను. అంతనతఁడు చాపమునందివ్వగా, కోదండరాముఁడు ధనుష్టంకారముచేసి బాణమును అనుసంధించెను అప్పుడు చండమారుతము వీవసాగెను. లవణాంబుధి యల్లకల్లోలమయ్యె. చుక్కలు నేలరాలుచుండె. దిక్కులలో దుమ్ముక్రమ్మె. భూమికంపించె. భూదేవి పలుమారు రక్షింపుమనివేడుచు సీతమ్మను చేతులతో నెత్తుకొనివచ్చి శ్రీరామునితొడమీఁద కూర్చుండబెట్టి, శ్రీరాముని కాళ్లమీఁదఁబడి నమస్కరించెను. అప్పుడు గగనమున దేవవాద్యములు మ్రోగినవి. సురులు సీతారాములమీఁద విరులవాన గురిపించిరి. అంత నారాముఁడు తనకాళ్లలోపడియుండు భూదేవినిచూచి తనకోపమును చల్లార్చుకొని ధనుర్బాణంబులనువదలి ధరణినిచేతనెత్తెను. అంత నావసుధాదేవి పలుమారు రామునినమస్కరించి ప్రసన్నునింజేసి సీతాదేవికి శ్రేష్ఠమైనతల్సింహాసనమునిచ్చి కొనియాడివిచారించి సీతచేసంపూజింపఁబడి శ్రీరాములవారివద్ద సెలవందిక్షణములోనంతర్హితయయ్యె. అప్పుడు లోకులందఱును సీతమ్మను మరలపుట్టి వచ్చినదానినిగా

తయాసంపూజితాపిచ ॥ ౬౭ ॥ ఆమంత్ర్యరాఘవం పృథ్వీ తదాదంతహితాఽభవత్ । తదా సీతాం జనాస్సర్వే తుష్టువుశ్చ ముదాన్వితాః ॥ ౬౮ ॥ జయశబ్దైః ప్రణేముస్తాం చక్రుః పూజాం పృథక్ పృథక్ । దదౌ దానాన్యనేకాని తదా రామో ముదాన్వితః ॥ ౬౯ ॥ నవవాద్యనినాదాశ్చ సంబభూవుస్సమంతతః । ననృతుర్వారనార్యశ్చ తుష్టువుర్వందిమాగధాః ॥ ౭౦ ॥ సీతాయాశ్శపథో యత్ర జాహ్నవ్యా దక్షిణే తటే । సీతాకుండమితిఖ్యాతం తత్ర తీర్థం బభూవ తత్ ॥ ౭౧ ॥ విపాతాశ్రుజలం పుణ్యం సంతప్తమనలోపమం । ఆసీదద్యాపి తత్తీర్థే సీతోష్ణశ్వాసకారణాత్ ॥ ౭౨ ॥ తదత్ర జానకీకుండం స్మరణాద్భయనాశనం । పత్యురాయుష్యవృద్ధ్యర్థం స్త్రీభిస్సేవ్యం సదా భువి ॥ ౭౩ ॥ తతస్సీతాయుతో రామః పుత్రాభ్యాం సహితో ముదా । వస్త్రాలంకారయుక్తాభ్యాం స్నానం హ్యవభృథాహ్వయం ॥ ౭౪ ॥ చకార తతోత్సాహైః పూర్వవచ్చ సవిస్తరం । అథయజ్ఞశతం పూర్ణం మేవం కృత్వా రఘూత్తమః ॥ ౭౫ ॥ జాతకర్మాదిసంస్కారాన్ లవస్య విధినాకరోత్ । చకార నానాదానాని దేవాన్ సంపూజ్య భక్తితః ॥ ౭౬ ॥ తతో మునీశ్వరాన్ పూజ్య పూజయామాస పార్థివాన్ । జనకం చ సుమేధాం చ పూజయామాస రాఘవః ॥ ౭౭ ॥ విససర్జ ఋషీన్ సర్వాన్ ఋత్విజో యే సమాగతాః । ద్విజాద్యాస్తాన్ ధనాద్యైశ్చ తోషయామాస సాదరం ॥ ౭౮ ॥ తతో విసృజ్య విప్రాంశ్చ పార్థివాన్ స్వస్వపురం ప్రతి । కుమారాభ్యాం సీతయా చ బంధుభిస్సాగరం ప్రతి ॥ ౭౯ ॥ సిరాజితః

---

నెంచిరి. వెవ్వేఱుగా నందఱును జయజయ కోలాహలముతోడ సీతాదేవిని పూజించిరి. అపుడు రాముఁడానందభరితుఁడై యనేకదానంబులనొసంగెను. ఎచ్చట చూచినను నవవిధవాద్యంబులు మ్రోగుచుండెను. గణికలాడుచుండిరి. వందిమాగధులు పొగడుచుండిరి ॥ ౭౦ ॥ గంగాద

శ్రీరాముఁడు సీతతోడ యజ్ఞపూర్తిజేసి యందరికిని సెలవిచ్చిపంపుట.

క్షిణతీరమున సీతయెచ్చట శపథముచేసెనో అచ్చట సీతాకుండమను నొకదివ్యతీర్థము గల్గినది. అచ్చట సీతమ్మకు నిప్పువంటి దుఃఖసంతప్తంబగు కన్నీరు పరిశుద్ధంబుగా నత్తీర్థంబునపడినందునను సీతయొక్క వేడినిట్టూర్పులవల్లను అది తప్తతీర్థంబననొప్పియున్నది. ఆకుండమును స్మరించినమాత్రమున భయములువీడును. స్త్రీలు పతులయాయుర్వృద్ధికొఱకు దానిని సేవించవలయును. అంతనా సీతాదేవి వస్త్రాలంకారయుతులగు పుత్రులతోడ వెనుకఁజెప్పిన మహోత్సవంబులతోడ నవభృథస్నానమునాచరించెను. శ్రీరాముఁడిట్లు ౧౦౦ యజ్ఞంబులను పూర్తిజేసి, విధిప్రకారముగా లవునికి జాతకర్మాదిసంస్కారంబులనుచేసి, వివిధదానంబులనొసంగి, భక్తితో దేవతలనుపూజించెను. పిదప మునులను ఋత్విక్కులను వచ్చియున్న బ్రాహ్మణాదులనందరిని ధనధాన్య దక్షిణాదిప్రదానంబులచే నానందపరచిపంపెను. రాజులనందరికిని వారివారినెలవులకు సెలవిచ్చెను ॥ ౭౯ ॥ అంతనాస్వామి సీతతోడను పుత్రులతోడను తమ్ములతోడను అయోధ్యను ప్రవేశిం

మరల సీతారాములు పుత్రులతోడ నయోధ్యను ప్రవేశించుట.

చెను. పత్నీ పుత్రులతోడ నేనుఁగమీఁదనెక్కి మహోత్సవముగా నూరిలోవచ్చుచున్న రాఘ

పురస్త్రీభి ర్వారణస్థోరఘూత్తమః । సీతయాతనయాభార్యాంచ యయౌనిజగృహంప్రతి ॥ ౯౦ ॥ త[illegible] వక్షానీ దదౌ భార్యయాంసముంతతః । చిరకాలేన వై దేవ్యా దర్శనంచ జనైస్సుకృతం ॥ ౯౧ ॥ తతోన్యపాదికా[illegible] జక్రి విససర్జ రఘూద్వహః । జనకంచ సుమేధాంచ దదావాజ్ఞాంనిజాంపురే ॥ ౯౨ ॥ తతస్సీతాయుతో రామః పుత్రభార్యాబంధుభిస్సహ । భూవర్షావత్సుఖంరేమే చిరకాలంరఘూద్వహః ॥ ౯౩ ॥ రామేణసీతయాసార్థం సహస్రాణిత్రయోదశ । వర్షాణ్యత్రకృతంరాజ్యం కస్మిన్ కాలేద్విజోత్తమ ॥ ౯౪ ॥ ఏకాదశసహస్రాణి వత్సరాణిమహాంతిచ । తత్రైకాదశవర్షాణి మాసాఏకాదశైవతు ॥ ౯౫ ॥ దినాన్యైకాదశైవాత్ర రామేణసీతయాసహ । అయోధ్యాయాంకృతంరాజ్యం కస్మిన్ కాలేద్విజోత్తమ ॥ ౯౬ ॥ ఏకాదశసహస్రాణి చైకాదశదినానిచ । సప్తద్వీపవతీపాలో రామోభూత్కల్పభేదతః ॥ ౯౭ ॥ దశవర్షసహస్రాణి దశవర్షశతానిచ । రామేణసీతయారాజ్యంకస్మిన్ కాలేకృతంద్విజ ॥ ౯౮ ॥ * ॥ ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే శ్రీమదానందరామాయణే జన్మకాండే వాల్మీకీయే జానకీగ్రహణంనామాష్టమస్సర్గః ॥ ... ... ... ... ... ... ... ౮॥

శ్రీరామదాసఉవాచ—అథోర్మిళామాండవీచ శ్రుతకీర్తిస్సహైవతాః । బభూవురంతరాత్కించిదం తర్వత్న్యో వ్యసుహోదరాః ॥ ౧ ॥ తాసాంచకారసీతాసా కౌతుకానిచసాదరం । తాసాంపుంసవనాదీని వివిధాని రఘూత్తమః ॥ ౨ ॥ ఆహూయపత్న్యై జనకం కారయామాసబంధుభిః । దోహదాన్పూరయామాసుస్తాసాంపౌ

వుందుపురనారులచే సమర్పింపఁబడు నీరాజనాది సత్కారముల నానందముచేనంగీకరించెను. ఇట్లువచ్చి రామచంద్రుఁడు రాజమందిరముచేరి రారాజించుచుండెను. బహుకాలమునకు సీతాదేవియొక్క దర్శనము లోకులకు లభించినందుచే నయోధ్యలో మహోత్సవంబులు మనోహరంబులై జరుగుచుండెను. అంత శ్రీరాముఁడు తక్కిన రాజులకు సెలవిచ్చిపంపి, అత్తమామలను మిథిలాపురికి సాదరముగా నంపించి, పత్నీ పుత్రులతోడను తమ్ములతోడ చిరకాలము సుఖముగానుండెను. వినుము, విష్ణుదాసా! శ్రీరామచంద్రుఁడు పదుమూడ వేలయైదు నూరేండ్లు రాజ్యమేలుచున్నట్లును; ౧౧౧౧౧ సంవత్సరములు ౧౧ మాసములు ౧౧ దినములు సీతతోడ రాజ్యమేలినట్లును; ౧౧ వేలేండ్ల ౧౧ దినములు రాజ్యమేలినట్లును; ౧౧ వేలేండ్లుమాత్రమే రాజ్యమేలినట్లును; కల్పాంతరభేదముచే తెలియఁదగును. .... ... ... ౮౦॥

## లక్ష్మణ భరత శత్రుఘ్నులకు పుత్రులుపుట్టుట.

తరువాత క్రమముగా కొంతకొంత యంతరముగా ఊర్మిళా మాండవీ శ్రుతకీర్తులు గర్భిణులయి వెలసిరి. సీతాదేవి వారికి సాదరముగా పలు వేడుకల్లుచేయించెను. శ్రీరాముఁడు అత్తమామలను మిథిలనుండి పిలుపించి తన తమ్ములచే వారికి పుంసవనాది సంస్కారంబులను సవిభవంబుగాఁ జేయించెను. పౌరనారులు సుహృత్కాంతలును వారియొక్క వేవి

రను ప్రాప్త స్త్రియః ॥ ౩ ॥ తాసాం సర్వాః సముత్సాహా న్నేవం కృత్వా రఘూత్తమః । వస్త్రాలంకారభూషాభి స్తోష
యామాస తాస్సుఖం ॥ ౪ ॥ అథోర్మిలా సా తనయం సుషువే పరమం దయుం । తదస్సా మాండవీ పుత్రం సుషువే
వరమేదినే ॥ ౫ ॥ తతస్సా శ్రుతకీర్తిశ్చ సుషువే యమలౌ సుతౌ । కాలాంతరేణోర్మిలాయా ద్వితీయ స్తనయో భ
వత్ ॥ ౬ ॥ తథాపరస్తు మాండవ్యాః పుత్రః కాలాంతరాదభూత్ । జాతకర్మాదిసంస్కారాం స్తేషాం రామః పృథక్
పృథక్ ॥ ౭ ॥ చకార గురుణా విప్రై ర్మహోత్సాహై ర్యథావిధి । లక్ష్మణస్యాంగదో జ్యేష్ఠ శ్చిత్రకేతుః పరః స్మృతః ॥
౮ ॥ మాండవ్యాః పుష్కరో జ్యేష్ఠః కనిష్ఠ స్తక్షనామకః । శ్రుతకీర్త్యాస్సుబాహుశ్చ యూపకేతుః పరః స్మృతః ॥ ౯ ॥
ఏవం కృతాని నామాని గురుణా విప్రపూర్వకం । ఏతేంతరేణ సంజాతాః కాలే కాలే క్రమేణ చ ॥ ౧౦ ॥ తేత్రైకత్ర మయా
ప్రోక్తా స్సంక్షేపేణాంగ త్వత్పురః । సర్వేషాం జన్మకాలేషు సురాస్సర్వే ముదాన్వితాః ॥ ౧౧ ॥ వాదయామాసు
ర్వాద్యాని వవర్షుః పుష్పవృష్టిభిః । మాతృభిః పితృభిర్యుక్తాన్ బాలకాన్ సూర్యసన్నిభాన్ ॥ ౧౨ ॥ రాజద్వా
రి మహానాసీ దుత్సవశ్చ నృపాజ్ఞయా । నినేదు ర్నవవాద్యాని ననృతు శ్చాప్సరోగణాః ॥ ౧౩ ॥ వాదయంతి స్మ తూ
ర్యాణి తుష్టువుర్వందిమాగధాః । నగరీం శోభయామాసుః పతాకాధ్వజతోరణైః ॥ ౧౪ ॥ సుహృదః పార్థివాస్సర్వే
రామాదీనాం చ పూజనం । వస్త్రాలంకరణాద్యైశ్చ చక్రిరే తే పృథక్ పృథక్ ॥ ౧౫ ॥ నను దానాని విప్రేభ్యో రామా

ళ్లను పూర్తిజేయుచుండిరి. వారినందరిని పిలుపించి శ్రీరాముడు వస్త్రాలంకారాది సత్కారం
బులచే నానందపరచెను. పిదప ఊర్మిలాదేవి తొలుత కుమారునింగనెను. పిమ్మట మాండవిదే
వికి పుత్రుడుదయించెను. అటుమీద శ్రుతకీర్తికి అమడబిడ్డలిరువురుపుట్టిరి. కాలాంతరమున
ఊర్మిల రెండవపుత్రునింగనెను. మాండవియు నట్లే మఱియొకనింగనెను. శ్రీరాముడువసిష్ఠుల
వారిచే వారందరికిని జాతకర్మాది సంస్కారములనుచేయించి యథావిధిగా వేర్వేరుగాపేళ్లుపె
ట్టించెను. లక్ష్మణుని జ్యేష్ఠపుత్రుడు అంగదుడు. రెండవవాడు చిత్రకేతువనువాడు. మాండవి
యొక్క మొదటికొడుకు పుష్కరుండు. ఇంకొకడు తక్షుడనువాడు. శ్రుతకీర్తియొక్క జ్యేష్ఠ
సుతుడు సుబాహునాముడు. కనిష్ఠుడు యూపకేతువనువాడు. ఇట్లు వారికి వసిష్ఠుడు పే
ళ్లుపెట్టెను. కాలక్రమముగా నిట్లందరికిని బిడ్డలు పుట్టినసంగతిని సంక్షేపముగా నీకుచెప్పితిని.
వారువారు పుట్టినప్పుడంతయును, దేవతలందరును సంతోషయుక్తులై మంగళవాద్యములను
వాయించిరి. తలిదండ్రులతో నాబిడ్డలమీద విరులవానగురిపించిరి. రాజాజ్ఞచే నగరముం
దర గొప్పయుత్సవములయ్యె. నవవాద్యములుమ్రోగినవి. అప్సరసలాడిరి. వందిమాగధులువం
దించుచుండిరి. చిత్రధ్వజపతాకాదులచే పురమునలంకరించిరి. మిత్రులు రాజులందరును శ్రీరా
మాదులను వస్త్రాభరణాదులచే వేర్వేరుగాపూజించిరి. రామలక్ష్మణభరతశత్రుఘ్నులు నాందీ
శ్రాద్ధ బ్రాహ్మణభోజనాది సత్కర్మలనాచరించిరి. ఇట్లు శ్రీరామాదులయొక్క యెనిమిదిమంది
ముద్దుబిడ్డలు తల్లులచేలాలింపబడుచు చంద్రునివంటి ముఖముగలవారలై సుఖముగావిరాజిం

స్త్యాబంధనవిశ్రుతే । బ్రాహ్మణాన్భోజయామాస శ్రాద్ధానిచ సురాదరాత్ ॥ ౧౬ ॥ ఏవమష్టకుమారాస్తే రామాదీనాం మనోరమాః । వవృధుశ్చంద్రవదనా మాతృభిర్లాలితాస్సుఖం ॥ ౧౭ ॥ శృంఖలాబద్ధరుక్మాది నిర్మితేషువరేషు చ । ప్రేంఖేషు హి కుమారాస్తే విరేజుః కనకభూషితాః ॥ ౧౮ ॥ ఫాలేష్వగ్రమయాశ్వత్థ పర్ణాన్యతిమహాంతి చ । ముక్తాఫలావలంబీని శోభయంతిస్మ బాలకాన్ ॥ ౧౯ ॥ కంఠే రత్నమణివ్రాత మధ్యద్వీపినఖాంచితాః । కర్ణయోశ్చ స్వర్ణసంపన్న రత్నాజానసుతాలుకాః ॥ ౨౦ ॥ శింజానమణిమంజీర కటిసూత్రాంగదైర్యుతాః । స్మితవక్త్రాల్పదశనా ఇంద్రనీలమణిప్రభాః ॥ ౨౧ ॥ అంగణేరింగమాణాశ్చ సంస్కారైస్సంస్కృతాశ్శుభాః । తేపితౄన్ రంజయామాసు ర్మాతౄశ్చాపి విశేషతః ॥ ౨౨ ॥ నానాశిశుక్రీడనకై శ్చేష్టితైర్ముఖచుంబనైః । బాల్యకృత్రిమయుద్ధైశ్చ గమనైర్మధురైరితైః ॥ ౨౩ ॥ తతస్తే బాలకాస్సర్వే వస్త్రాలంకారభూషితాః । సభాయాం రాఘవం నత్వా తస్థుస్సింహాసనోపరి ॥ ౨౪ ॥ ఏకదా రాఘవః ప్రాహ వసిష్ఠం సదసిస్థితం । అవలోకయ బాలానాం త్వం చిహ్నాని యథాక్రమం ॥ ౨౫ ॥ తచ్ఛ్రుత్వా రామవచనం వసిష్ఠో మునిభిస్సహ । ఆదౌ కుశం సమాహూయ దృష్ట్వా రామం వచోబ్రవీత్ ॥ ౨౬ ॥ వసిష్ఠ ఉవాచ — పంచసూక్ష్మః పంచదీర్ఘః సప్తరక్తః షడున్నతః । త్రిపృథుర్లఘుగంభీరో ద్వాత్రింశల్లక్షణస్త్వయం ॥ ౨౭ ॥ పంచదీర్ఘాణి శస్తాని యథాదీర్ఘాయుషోస్యచ । భుజౌ నేత్రే తే హనుర్జానూ నాసాచతసయుస్యతే ॥ ౨౮ ॥ గ్రీ

చిరి. బంగారుగొలుసులుగల యుయ్యాలలో కనకాలంకృతులై వెల్గుచుండిరి. మోమున ముక్తాలంకృతంబులయిన రావిరేకలు ఆబాలురను ప్రకాశింపజేసెను. కంఠమున నవరత్నహారమధ్యవ్యాఘ్రనఖంబులును కర్ణంబులలో కనకరత్నకుండలంబులును దేహంబున శబ్దించుచుండు రత్ననూపురంబులును కనకకటిసూత్రకేయూరంబులును వెలయుచుండ నగుమోములలో నింద్రనీలమణినిభంబులయిన చిట్టిపలువరుస బరగుచుండె. కాలోచితమంగళసంస్కారంబులచే సంగతులగు నాబాలకులు ముంగిలిలో నాటలాడుచు తలిదండ్రులను వివిధబాలక్రీడలచేతను చుంబనాదిచేష్టలచేతను కృత్రిమయుద్ధములచేతను మంచినడకలచేతను సంతోషపరచుచుండిరి. అంత కొంతకాలంబునకు నాబిడ్డలు వస్త్రాలంకారయుక్తులై సభలో శ్రీరామునివందించి సింహాసనంబులమీఁద కూర్చుండిరి. ఒకప్పుడు శ్రీరాముఁడు సభాసీనులగు వసిష్ఠులవారినిచూచి “బాలకులయొక్క లక్షణంబులను చూడవలయు” నని వేడెను॥ ౨౫॥ వసిష్ఠుఁడు ఆమాటవిని బ్రాహ్మ

వసిష్ఠులవారు కుశలవాదులకు సాముద్రికాది లక్షణంబులను చెప్పుట.

ణులతోడకూడి, మొదట కుశునింబిలచి పరికించి శ్రీరామునితో నిట్లనెను—౫ సూక్ష్మంబులు, ౫ దీర్ఘంబులు, ౭ ఎఱ్ఱనివి, ౬ పొడవయినవి, ౩ విరివియైనవి, ౩ చులకనివి, ౩ లోఁతయినవి, ఇట్టి ౩౨ శుభలక్షణంబులు గలవాఁడితఁడు. దీర్ఘాయుష్మంతుఁడగు నితనికి ౫ దీర్ఘంబులయినవి చక్కగానున్నవి. అవియేవనిన, భుజములు నేత్రములు మోఁకాళ్లు చెక్కిళ్లు ముక్కు. గొంతు పిక్కలు మేహనము అనునివిమూడును హ్రస్వములు. స్వరము బొడ్డు మనస్సు ఇవిమూడును

వాజంఘామేహనైశ్చ త్రిభిర్హ్రస్వోయమీడితః । స్వరేణసత్త్వనాభిభ్యాం త్రిగంభీరశ్శుభః ॥ ౨౯ ॥ త్వక్కే-శాంగులిదశనా పర్వాణ్యంగులిజాన్యపి । తథాస్యపంచసూక్ష్మాణి సూచయంతివరాంశ్రియం ॥ ౩౦ ॥ పాణ్యంఘ్రితలనేత్రాంతే తాలుజిహ్వాధరోష్ఠకం । సప్తారుణంచసనఖ మస్మిన్ రాజ్యసుఖప్రదం ॥ ౩౧ ॥ వక్షఃకుక్ష్యలికస్కంధకరవక్త్రపదున్నతం । తథాత్రిదృశ్యతేబాలే మహదైశ్వర్యభోగభాక్ ॥ ౩౨ ॥ లలాటకటివక్షోభి స్త్రిభిర్విస్తీర్ణోయథాహ్యసౌ । సర్వతేజోమహైశ్వర్యం తథాప్రాప్స్యతినాన్యథా ॥ ౩౩ ॥ అచ్ఛిన్నాతర్జనీంప్రాప్య తథారేఖాస్యదృశ్యతే । కనిష్ఠాస్పృష్టినిర్యాతా దీర్ఘాయుష్యంయథాభవేత్ ॥ ౩౪ ॥ కమఠపృష్ఠకఠినౌ వకమఃకరణౌకరౌ । రాజ్యహేతూశిరోఽస్య పాదౌచాద్యనిరోమలౌ ॥ ౩౫ ॥ పాదౌసమాంసలౌరక్తౌ సమౌసూక్ష్మౌసుశోభనౌ । సమాంగుళ్యౌస్వదేహేన స్నిగ్ధావైశ్వర్యసూచకౌ ॥ ౩౬ ॥ స్వల్పాభిఃకరరేఖాభి ర్వ్యక్తాభిస్సదాసుఖీ । లింగేనకృశహ్రస్వేన రాజరాజోభవిష్యతి ॥ ౩౭ ॥ ఉత్కటాసనగుల్ఫస్ఫిగ్నాభిరస్యాపివర్తులాః । దక్షిణావర్తమరుణం మహాదైశ్వర్యసూచకం ॥ ౩౮ ॥ ధారైకామూత్రయత్యస్మిన్ దక్షిణావర్తనీయది । గంధశ్చమీనమధునో ర్యస్యవీర్యేతదానృపః ॥ ౩౯ ॥ విస్తీర్ణామాంసలౌస్నిగ్ధౌ భుజావస్యసుఖోచితౌ । వామావర్తౌనుప్రలంబౌ దోషౌభూరక్షణోచితౌ ॥ ౪౦ ॥ శ్రీవత్సవజ్రచక్రాబ్జ మత్స్యకోదండదండభృత్ । తథాస్యకరగారేఖా యథాస్యాత్త్రిదివస్పతిః ॥

గంభీరంబులు. తోలు వెంట్రుకలు వ్రేళ్లు పల్లు వ్రేళ్లగనుపులు ఇవియైదును సూక్ష్మంబులునై గొప్పసంపదను సూచించుచున్నది. అరచేతులు అరకాళ్లు నేత్రాంతములు దవడలు నాలుక పెదవి గోళ్లు ఇవి యేఁడునొకటియును ఎఱ్ఱనివిగాన రాజ్యసుఖదాయకంబులు. ఎద కడుపు నుదురు మూఁపులు చేయి నోరు, ఇవి యేఁడునున్నతంబులుగానున్నవి. ఇవి మహదైశ్వర్య భోగప్రదంబులు. ఎద నుదురు మొల, ఇవి మూఁడును విరివియైనవి. సకలతేజంబులుగల మహైశ్వర్యము ననుభవించును. చిటికినవ్రేలు మొదలు జుట్టినవ్రేలివరకు నెడదెగక బారినరేఖక నుపడుటచేత నితఁడు దీర్ఘాయుష్మంతుఁడుగా నుండును. ఇతనిచేతులు శత్రుసంహారకార్యమున తాఁబేలివీపువలె కఠినంబులు. ఇది రాజ్యప్రదంబు. ఇతని పాదములు సమములు మృదువులు సూక్ష్మములు కోమలంబులు పుష్టంబులు దేహముతో సరియైన వ్రేళ్లుగలవి, ఇవి ఐశ్వర్యసూచకంబులు. చేతిలో రేఖలు కొద్దిగాగల్గి యవియెఱ్ఱగా తెలియుటచే వీఁడు నిత్యసుఖిగానుండును. లింగము హ్రస్వముగా కృశమైయుండుటచే రేరాజుగానుండును. గుదము చీలమండలు పిఱుఁదలయున్నతి బొడ్డు ఇవి గుండ్రముగానుండుటచేతను కుడి సుడి యెఱ్ఱబాఱియుండుటచే తను మహదైశ్వర్యముగలదు. కుడిసుడిగా నొకధారగా మూత్రము పడుచుండిన వీర్యము మీన మధుగంధము గలదిగానుండిన నప్పుడు రాజుగానుండును. ఇతని భుజములు విస్తీర్ణంబులును బలిసినవియును చిక్కనగలవియునుగాన సుఖార్హంబులు. మఱియుమిక్కిలిలంబములై యెడమ సుడిగలవిగాన భూరక్షణకుతగినవి. శ్రీవత్స వజ్ర చక్ర కమల మత్స్య చాప దండములను ధ

౪౧ ॥ ద్వాత్రింశద్దశనశ్చాయం వరశంఖశిరోధరః । క్రౌంచదుందుభిహంసాభ్రస్వరస్సర్వేశ్వరాధికః ॥ ౪౨ ॥ మధుపింగలనేత్రోసౌ నైనం శ్రీస్త్యజతి క్వచిత్ । పంచరేఖాలలాటస్తు తథా సింహోదరః కృశః ॥ ౪౩ ॥ ఊర్ధ్వరేఖాంకితపదో నిశ్వాసస్పద్మగంధవాన్ । అచ్ఛిద్రపాణిస్సునసో మహాలక్షణవానయం ॥ ౪౪ ॥ ఏవం కుశం పరీక్ష్యాథ సర్వాన్ దృష్ట్వా క్రమేణ సః । లవాదీనాం చ చిహ్నాని పూర్వవత్ప్రాహ రాఘవం ॥ ౪౫ ॥ తతః ప్రీతమనా రామః పూజయామాస తం గురుం । వస్త్రైరాభరణైశ్చైవ యయౌ హర్షాత్తతో గృహం ॥ ౪౬ ॥ ఏతస్మిన్నంతరే సీతా భూమిదత్తవరాసనే । సంస్థితా చామరైర్దివ్యైర్దాసీభిః పరివీజితా ॥ ౪౭ ॥ సఖీభిస్సేవితా రమ్యా ధృతాధోంగోపబర్హణా । ముకురే స్వం నిరీక్షంతీ ముఖం చంద్రనిభం వరం ॥ ౪౮ ॥ రామస్యాగమనం శ్రుత్వా సంచచాలాసనాజ్జవాత్ । తతో దదర్శ శ్రీరామం బాలకైః పరివేష్టితం ॥ ౪౯ ॥ స్వకట్యాం యూపకేతుం చ దధానమపరం శిశుం । తథైవ దక్షిణే హస్తే దధానం చాంగదం శుభం ॥ ౫౦ ॥ కుశం లవం పురస్కృత్య సమాయాంతం శనైశ్శనైః । తత్పృష్ఠే సా దదర్శాథ లక్ష్మణం బాలకాన్వితం ॥ ౫౧ ॥ తక్షం కట్యాం పుష్కరం చ దధానం దక్షిణే కరే । తత్పృష్ఠే భరతం సీతా దదర్శ ముదితాననా ॥ ౫౨ ॥ చిత్రకేతుం శిశుం కట్యాం దధానం రుక్మమండితం । తథైవ దక్షిణే హస్తే సుబాహుం పంకజేక్షణం ॥ ౫౩ ॥ తత్పృష్ఠే సా దదర్శాథ శత్రుఘ్నం జనకాత్మజా । రామశస్త్రాణి బిభ్రంతం సమాయాంతం శనైశ్శనైః ॥ ౫౪ ॥ ఏవం

---

రించునట్టి దివ్యరేఖలుగల్గి ముల్లోకములకు నాయకుఁడుగానున్నాఁడు. ఇతఁడు ౩౨ దంతములు గలవాఁడు. శంఖమువంటి గొంతుగలవాఁడు. హంసక్రౌంచ మేఘదుందుభినాదముగలవాఁడు. సర్వేశ్వరాధికుఁడు. తేనెవంటి పింగళనయనుండుగాన నితనిని శ్రీదేవి యొకప్పుడును వదలదు. నొసట నైదురేఖలును సింహమువంటి కృశోదరంబును గలవాఁడుగాన మంగళాంగుఁడు. ఊర్ధ్వరేఖలచే నంచితంబగు పాదములుగలవాఁడు. ఊపిరివిడిచిన తామరసగంధముగలదు. దట్టమైన కరతలములు. మంచిముక్కు. కావున నితఁడు మహాలక్షణ సంపన్నుండుగానున్నాఁడు ఇట్లు కుశునికిచూచి పిదప క్రమముగానందరి శుభలక్షణంబులను పరీక్షించి తొలుతచెప్పినట్లె వరుసగా వచించెను. అంత నా శ్రీరామచంద్రుఁడు సుప్రీతుఁడై ఆగురువును వస్త్రాభరణంబులచే పూజించి, నిజరాజమందిరమునకరిగెను. అంతలో నంతఃపురమున సీతాదేవి భూదేవియిచ్చిన దివ్యాసనంబున కూర్చుండి దాసీజనులు చామరాదులను వేయుచుండ సఖీజనులు సేవించుచుండ నొరగుదిండ్ల నానుకొని చంద్రప్రభంబగు నిజముఖబింబము నద్దములో చూచుకొనుచు సుఖముగానున్నదై శ్రీరామచంద్రస్వామియొక్క రాకనువిని యాసనమునుండి లేచివెడలి, తననడుమున యూపకేతువును కుడిచేతిలో నంగదుని నెత్తుకొని ముందర కుశలవులను పెట్టుకొనివచ్చుచుండు రామునిని, ఆవెనుక నెడమచంకలో తక్షుని కుడిచేతిలో పుష్కరుని నెత్తుకొని వచ్చుచున్న లక్ష్మణునిని, వానివెనుక చంకలో చిత్రకేతువును చేతిలో సుబాహువు నెత్తుకొని వచ్చుచున్న భరతునిని, వానివెనుక శ్రీరాముని శస్త్రంబులనుధరించి తిన్నతిన్నగా వచ్చుచు

సారాఘవందృష్ట్వా సీతాప్రత్యుజ్జగామతం । సింజన్మణిరశనా పీతకౌశేయధారిణీ ॥ ౫౫ ॥ కరాభ్యాంపురతోయాంతం లవంధృత్వాచుచుంబసా । నిధాయతంలవంకట్యాం ధృత్వాహస్తేనతంకుశం ॥ ౫౬ ॥ యయౌశనైస్సాస్వరామేణ వదతీస్వస్థలంపునః । సఖీభిర్వేష్టితాసీతా రంజయామాసరాఘవం ॥ ౫౭ ॥ అథరామోపిసీతాయాః స్థిత్వా సింహాసనోపరి । అంకయోఃపురతశ్చాపి బాలకాన్సంస్థితాంశ్చసః ॥ ౫౮ ॥ సీతాయైదర్శయన్ప్రీత్యా లాలయామాససాదరం । సీతాయైరాఘవఃప్రాహ సభాయాంగురుణాపురా ॥ ౫౯ ॥ యాన్యుక్తానిసుచిహ్నాని శిశూనాంతానివిస్తరాత్ । శ్రుత్వారామముఖాత్తాని సీతాతోషంపరంయయౌ ॥ ౬౦ ॥ రాఘవఃప్రాహవైదేహీం మూర్మిళాపరివీజితాం । సీతేఽంగదంచిత్రకేతుం లక్ష్మణాంకేన్యవేశయ ॥ ౬౧ ॥ తద్రామవచనంశ్రుత్వా సీతాశీఘ్రంశిశూద్వయా । తావదుత్థాయసౌమిత్రి ర్లజ్జయాగంతుముద్యతః ॥ ౬౨ ॥ తంగంతురామోపి దృష్ట్వాతాంమాండవీంతథా । శ్రుతకీర్తింకంజనేత్ర సంజ్ఞయాచోదయత్తదా ॥ ౬౩ ॥ తాభ్యాంధృతోథసౌమిత్రిః స్మితాస్యాభ్యాముపావిశత్ । తావత్తదంకయోస్సీతాతత్పుత్రౌసన్న్యవేశయత్ ॥ ౬౪ ॥ తద్వచ్ఛభరతస్యాంకే న్యవేశ్యతక్షపుష్కరౌ । శత్రుఘ్నాంకేసుబాహుంచ యూపకేతుంన్యవేశయత్ ॥ ౬౫ ॥ తతస్సీతాంపునఃప్రాహ స్మితాస్యస్సరఘూద్వహః । వీజయంతూర్మిళాద్యాశ్చ స్వంస్వంస్వామినమాదరాత్ ॥ ౬౬ ॥ తతస్తాదుద్రువుస్సర్వాః సఖీభిర్లజ్జితాధృతాః । వ్యజనై

---

న్న శత్రుఘ్నునిచూచి సంతోషస్వాంతయై, యల్లేటి నిజవస్త్రాలంకారంబులు నిగనిగలాడుచుండ నెదుట వచ్చుచున్న లవునింగని చేతులతోపట్టి ముద్దుపెట్టి మొలనెత్తుకొని యాకుశునింజేతపట్టుకొని తిన్నగా రామునితోమాటలాడుచు మరల నిజస్థానమునకేతెంచెను. సఖులతోడ నాజానకి జనకజామాతను రంజింపఁజేసెను. అంతనారాముఁడు సీతతోఁగూడ సింహాసనమునకూర్చుండి తొడలమీఁద బిడ్డలను కూర్చుండబెట్టుకొని సీతకు చూపుచు వారినిలాలించెను. మఱియు నక్కాంతామణికి సభలో వసిష్ఠులవారానతిచ్చిన బాలకుల లక్షణంబులనన్నిటిని నిరూపించెను. శ్రీరాముని నోటినుండి వాటినివిని జానకమ్మ పరమానందభరితయయ్యె॥ ౬౦॥

## శ్రీరాముఁడు తమ్ములతోడ సరసములాడుట.

ఊర్మిలచే సేవింపఁబడుచున్న సీతాదేవితో శ్రీరాముఁడు “సతీ! అంగదుని చిత్రకేతువును లక్ష్మణుని తొడమీఁద కూర్చుండబెట్టుము.” అనిచెప్పగా; నామె ఆబిడ్డలనుతీసికొని త్వరగావెడలెను. అంతలో సిగ్గుచే లక్ష్మణుఁడు వెడలఁదొడంగెను. దానినెఱిఁగి రాముఁడు మాండవీశ్రుతకీర్తులను లక్ష్మణునిని పోనియ్యవలదని కనుసయిఁగచేసెను. నవ్వుచు వారునల్లేవచ్చి బావనడ్డగించిరి. లక్ష్మణుఁడును కూర్చుండెను. అంతనాసీత వానిబిడ్డలను వానితొడమీఁద విడిచెను అల్లే భరతునితొడపై తక్షపుష్కరులనువిడిచి, శత్రుఘ్నుని తొడమీఁద సుబాహు యూపకేతువులను కూర్చుండఁబెట్టెను మఱియు రాముఁడు సీతనుచూచి నవ్వుచు “ఊర్మిలాదులు కూడ వారివారిపతులను వీచుచుందురుగాక” అనిచెప్పెను. అంత వారందఱును సిగ్గుపడి పరు

.ర్యజయామాసుః స్వం స్వం కాంతం సులజ్జితాః ॥౬౭॥ ఏవంనానాకౌతుకాని భోజనాసనకర్మసు । కారయామాస వైదేహ్యా బంధ్వాదీనాం రఘూద్వహః ॥ ౬౮ ॥ అథరామోవసిష్ఠం స ఏకదా వాక్యమబ్రవీత్ । కుశస్యాథలవస్యాపి వ్రతబంధో విధీయతాం ॥౬౯॥ తథేతిగురుణాప్రోక్తస్తతో రామశ్శుభేదినే । గణకాన్ సమాహూయ మంత్రయామాససాదరం ॥ ౭౦ ॥ కుశాయ పంచమం వర్షం కించిన్న్యూనం లవాయచ । జ్ఞాత్వాతే గణకాస్సర్వే గురుశుక్రాదికంబలం ॥ ౭౧ ॥ దృష్ట్వా పంచాంగ పత్రేషు రాఘవం వాక్యమబ్రువన్ । బ్రాహ్మణస్యాష్టమే ప్రోక్తో ద్వాదశే క్షత్రియస్యచ ॥ ౭౨ ॥ వైశ్యస్యషోడశే వర్షే వ్రతబంధో మునీశ్వరైః । జన్మాత్ పష్ఠే తథా గర్భాత్ సప్తమే క్షత్రపస్యచ ॥౭౩॥ వ్రతబంధో విధాతవ్యో యత్నతశ్చ బలార్థినః । బ్రహ్మవర్చసకామస్య కార్యం విప్రస్య పంచమే ॥౭౪॥ రాజ్ఞో బలార్థినష్షష్ఠే వైశ్యస్యార్థార్థినోష్టమే । ఏతద్విశోపనయన మేవంశాస్త్రే షునిర్ణయః ॥ ౭౫॥ అతో గర్భాచ్చషష్ఠేబ్దే పుత్రయోస్త్వం రఘూత్తమ । సుఖం కురూపనయనం ముహూర్తం శృణుసాదరం ॥ ౭౬॥ అద్యారభ్య పంచదశ దినేదత్తం కులాయహి । పశ్చాంతరేణతం శ్రుత్వా ముహూర్తం రఘునందనః ॥ ౭౭ ॥ గణకాన్ ధనవస్త్రాద్యైః పూజ్యలక్ష్మణమబ్రవీత్ । అలంకరణీయా రాజాన స్సుహృదశ్చ మునీశ్వరాః ॥ ౭౮ ॥ పాంతః పురాస్సపౌరాశ్చ స్వస్వజ్ఞానపదైస్సహ । శృంగారణీయాయోధ్యేయం పరిఖాస్సప్తసాదరం ॥ ౭౯ ॥ శోధనీయాస్తథా సౌధ స

గెత్తి సఖిజనులచే పట్టబడిరి. సిగ్గుతో రామాజ్ఞానుసారముగా తమతమ పతులను వీచుచుండిరి. ఇట్లే శ్రీరామచంద్రస్వామి సీతతోడ భోజనాదిసమయంబులలో లక్ష్మణాదులను వినోదపరచుచుండెను॥ ౬౮॥ పిదప నొకప్పుడు రాముఁడు వసిష్ఠులవారితో "కుశునికి లవునికిని ఉపస

శ్రీరాముఁడు కుశునిలకు పనయనము చేయుట.

యనమును చేయించెదరుగాక" అని ప్రార్థించెను. అట్లే కానిమ్మని గురువులవారాజ్ఞాపింపగా, శ్రీరాముఁడు శుభదినమున దైవజ్ఞులను పిలుపించి వారితో సాదరముగా నాలోచించెను. అప్పుడా గణకులు కుశునికి ఐదేండ్లనియును లవునికి కొంచముతక్కువగా నైదేండ్లనియును తెలిసి, పంచాంగములనెత్తి గురుశుక్రాది బలములను పరిశీలించి శ్రీరామునితో "బ్రాహ్మణునికి నెనిమిదవయేటను క్షత్రియునికి ౧౨ వ యేటను వైశ్యునికి ౧౬ వ యేటను ఉపనయనంబని మునీంద్రులచే స్మరింపఁబడియున్నది. అట్లే బలాపేక్షగల రాజునకు జన్మాదిగా నాఱవయేటను గర్భాదిగా నేడవయేటను ప్రయత్నించి వడుగుచేయ వలయునందురు. బ్రహ్మవర్చసకాముండగు బ్రాహ్మణునికి నైదవయేట నుపనయనమును చేయఁదగును. బలాపేక్షగలరాజున కాఱవయేటను ధనార్థియగు వైశ్యున కెనిమిదవయేటను వడుగుకాదగినది. ఇట్లు శాస్త్రనిర్ణయముగలదు. కావున శ్రీరామస్వామీ! గర్భాదిగా నాఱవయేటిలో నీపుత్రుల కుపనయనమును చేయుంపుము. సాదరముతో ముహూర్తమును వినుము. నేటికి మొదలు ౧౫వ-దినమునందు కుశునికి సుముహూర్త మివ్వఁబడినది." అనిన దైవజ్ఞులమాటనువిని శ్రీరాముఁడు వారినిధనకనక

మాహాశ్చతథాశుభాః । దత్వాచిత్రాణిలేఖ్యాని ప్రాసాదేషుసమంతతః ॥౨౦॥ దేవాలయేషుసర్వేషు సుధాదేయా మనోరమా । లేఖనీయానిచిత్రాణి స్థాప్యంతాంబలయఃపృథక్ ॥ ౨౧ ॥ బంధనీయాఃపతాకాశ్చ రోపణీయాధ్వజాఅపి । సమంతతస్తోరణాని బంధనీయానిలక్ష్మణ ॥ ౨౨ ॥ వేద్యఃకార్యాఃరుక్మమయ్యో బంధనీయాశ్చమంటపాః। శృంగారణీయాహస్త్యశ్వ శిబికాశ్చసహస్రశః ॥ ౨౩ ॥ అన్యచ్చాపియథాయోగ్యం యద్యజ్ఞానాసిలక్ష్మణ। తత్తత్కురుష్వయన్మోక్తం మయాతవరఘూత్తమ ॥౨౪॥ తద్రామవచనంశ్రుత్వా తథేత్యుక్త్వాసలక్ష్మణః । తథాచకార తత్సర్వం యథారామేణశిక్షితః ॥ ౨౫ ॥ తతోముహూర్తేశ్రీరామః స్నానమభ్యంగపూర్వకం । కృత్వాకుమారైర్వైదేహ్యా బంధుస్త్రీభిశ్చబంధుభిః ॥ ౨౬ ॥ నానాలంకారవస్త్రాణి పరిధాయాథతైస్సహ । పుణ్యాహవాచనంచక్రే గురుంపూజ్యఋషీశ్వరాన్ ॥ ౨౭॥ నాందీశ్రాద్ధాదికంకృత్వా ప్రతిష్ఠాందేవకస్యచ । చకారమంగళైస్తూర్యనాదైస్సీతాసమన్వితః ॥ ౨౮ ॥ తతోయయుఃకోటిశస్తే పార్థివాశ్చమునీశ్వరాః। సప్తద్వీపాంతరస్థాశ్చ సావరోధాస్సవాహనాః ॥ ౨౯ ॥ తైస్సాయోధ్యాతదావ్యాప్తా విరేజేఽతిరాంతదా । తతోముహూర్తదివసే వసిష్ఠోబ్రాహ్మణైర్యుతః ॥ ౩౦॥ రామస్యాథకుశస్యాథ మధ్యేధృత్వాంతరంపటం । ఉవాచమంగలాన్యేవ సుస్వరైర్మధురాక్షరైః ॥౩౧॥ *॥ ధ్యాత్వాశ్రీగణనాయకంవిధిమతాంశంభుంవిధింమాధవం। లక్ష్మీంశైలసుతాంవిధేస్తుదయితా మింద్రం

వస్త్రాదులచే సత్కరించి పంపిం, లక్ష్మణునితో తమ్ముడా! అంతఃపురమువారు పురమువారు దేశమువారు మొదలగువారితోడ రాజులను మిత్రులను మునీంద్రులను పిలువింపవలయును. ఇయ్యయోధ్యను శృంగారించవలయును. అగడ్తలనేడింటిని శోధించవలయును. మంగళసౌధ సమూహాంబులలో చిత్రాలంకారంబులను చేయవలయును. దేవాలయంబులందంతట సున్నమువూయించి చిత్రములను వ్రాయించి బలులనర్పింపఁదగును. అంతట వితానములుకట్టి ధ్వజములను స్థాపించి తోరణంబులను బంధించి, మంటపములను వేయించి సువర్ణవేదికలను కట్టించి, వేలకొలఁది గజరథతురగాందోళనంబులను సాలంకృతంబులంజేయించి, మఱియు నట్లే యథాయోగ్యంబుగా నీయుల్లంబున కుల్లాసంబగునట్లు నేనుచెప్పనివాటినిఁగూడ చేయింపుము. అని యాజ్ఞాపించెను. అంత నాసౌమిత్రి యట్లేయని తదాజ్ఞానుసారముగా సర్వమునుచేయించెను. పిదప శుభముహూర్తమున శ్రీరాముఁడు సీతతోడను కుమారులతోడను తమ్ములతోడను అభ్యంగమంగళస్నానముచేసి వివిధభూషణ వస్త్రంబుల నలంకరించుకొని వారందఱితోడ పుణ్యాహవాచనముచేసెను. మునీంద్రులను వసిష్ఠులవారిని పూజించెను. నాందీశ్రాద్ధమునాచరించి కులదేవతను ప్రతిష్ఠించెను. మంగళవాద్యములు మ్రోగుచుండినవి. అంత నచ్చటికి సపరివారులుగా రాజులును మునీంద్రులును సప్తద్వీపవాసులందఱును వచ్చిచేరిరి. ఇట్లనేకులచే నిండి యయోధ్య మిక్కిలి చక్కగానుండెను. అంత ముహూర్తదినంబున వసిష్ఠుఁడు బ్రాహ్మణులతోడ శ్రీరామునికిని కుశునికిని నడుమ దివ్యమంగళవస్త్రమును అడ్డముగాపట్టి వధు

సురాంస్తథా గ్రహాన్ । పుణ్యాన్ స్థావరనిమ్నగాశ్చ సుమునీన్ స్వీయాంకులస్యాంబికాం తాతం మాతరమాదరే
ణ వటవే ధ్యాయాత్సదా మంగళం ॥ ౯౨ ॥ తదేవ లగ్నం సుదినం తదేవ తారాబలం చంద్రబలం తదేవ। విద్యాబలం దైవ
బలం తదేవ సీతాపతేర్యత్ స్మరణం విధేయం ॥ ౯౩ ॥ ఇతి నానా మంగళాద్యైస్తూర్యఘోషైర్మనోహరైః । ఓంకా
రఘోషైస్సగురుర్దుకూలాంతఃపటం తదా ॥ ౯౪ ॥ తతస్తు రాఘవస్యాంకే నివేశ్య హవనాదికం । విధిం కృత్వాథ
కౌపీనం దృఢం చాథ కమండలుం ॥ ౯౫ ॥ బధ్వా దౌయక్ష్మణాం మౌంజీం బబంధైణాజినం తదా । తతః కుశాయ సగురు
గాయత్రీముపదిష్టవాన్ ॥ ౯౬ ॥ బ్రహ్మచర్యవ్రతాదీని సకుశాయోపదిష్టవాన్ । కృత్వోక్తవిధినా శౌచం కుర్యా
దాచమనం తథా ॥ ౯౭ ॥ దంతాన్ జిహ్వాం విశోధ్యాథ కృత్వా మలవిశోధనం । స్నాత్వాంబుదేవతైర్మంత్రైః ప్రా
ణానాయమ్య యత్నతః ॥ ౯౮ ॥ ఉపస్థానం రవేః కృత్వా సంధ్యయోరుభయోరపి । అగ్నికార్యం తతః కృత్వా బ్రా
హ్మణానభివాదయేత్ ॥ ౯౯ ॥ బ్రువన్నముకగోత్రోఽహమభివాదయ ఇత్యపి । ధారయన్మేఖలాం దండో పవీతాజినమే
వచ ॥ ౧౦౦ ॥ అనింద్యేషు చరేద్భైక్ష్యం బ్రాహ్మణేష్వాత్మవృత్తయే । వాగ్యతో గుర్వనుజ్ఞాతో భుంజీతాన్నమకు

---

రాక్షరంబులున్ను సుస్వరంబులునుగల మంగళంబులను వచించెను—“శ్రీమహాగణపతిస్వామిని సావిత్రీదేవిని శంకరునిని బ్రహ్మను విష్ణువును లక్ష్మీవాణీసరస్వతులను ఇంద్రాదిదేవతలను గ్రహంబులను పుణ్యాత్ములగు గిరినదీదేవతలను, మునీంద్రులను నిజకులదేవతను జననీజనకులను వీరినందఱిని ధ్యానించి సాదరముగా ప్రార్థించునట్టిది యేమనిన ఈవటువుకు నిరంతరము మంగళమగుగాక. శ్రీసీతాపతిని చక్కఁగా స్మరించవలయును. ఎందువల్లననిన, నతని స్మరణముచేయునట్టి కాలమే దివ్యలగ్నము. అద్దియేసుదినంబు. అదిగదా చంద్రతారాబలయుక్తంబు. విద్యాబలంబు నదియే. దైవబలంబు నదియే.” ఇట్లు వివిధ మంగళశ్లోకంబులతోడను వాద్యఘోషంబులతోడను ప్రణవనాదంబులతోడను వసిష్ఠుఁడు తెరబట్టను తీసివేసెను. పిమ్మట శ్రీరామునితొడమీఁద, కుశునింగూర్చుండబెట్టి హోమాదికము నాచరించి, విధిప్రకారముగా కౌపీనమును కమండలువును ఇచ్చి సువర్ణమౌంజిని బంధించి జింకచర్మమునుకట్టి, కుశునికి వసిష్ఠుండు గాయత్రీ మంత్రము నుపదేశించెను. బ్రహ్మచర్య వ్రతకర్మంబులను చక్కఁగా తెలిపెను. ఎట్లనిన—

కుశునికి వసిష్ఠులవారు ద్విజధర్మంబుల నుపదేశించుట.

చెప్పఁబడినట్లు శౌచవిధినాచరించి ఆచమనముచేసి పండ్లను నాలుకను తోమికడిగి మురికికడిగికొని జలదేవతామంత్రంబులంజెప్పుచు స్నానముచేసి ప్రాణాయామముంబట్టి రెండుసంధ్యల లోను సూర్యోపస్థానమును చేసి అగ్నికార్యమునాచరించి పిదప బ్రాహ్మణులకు నమస్కరించునది. వందించునపుడు దండకమండలూప వీతాజినంబులనుధరించి ఇట్టిగోత్రమువాఁడగునే న

త్సయుతః ॥ ౧ ॥ ఏకాన్నం న సమశ్నీయాత్ శ్రాద్ధేశ్నీయాత్తథాపది । ద్వివారం నైవభుంజీత దివాఽప్యపిద్విజోత్తమః ॥ ౨ ॥ సాయంప్రాతర్ద్విజోఽశ్నీయా దగ్నిహోత్రవిధానవిత్ । మధుమాంసంప్రాణిహింసాం భాస్కరాలోకనం జలే ॥ ౩ ॥ స్త్రియంపర్యుషితోచ్ఛిష్టే పరివాదంవివర్జయేత్ । యథేష్టచేష్టాంనభవే ద్గురోర్నయనగోచరే ॥ ౪ ॥ ననామపరిగృహ్ణీయా త్పరోక్షేప్యవిశేషణం । గురునిందాభవేద్యత్ర పరివాదస్తుయత్రచ ॥ ౫ ॥ శ్రుతిపిధాయ స్థాతవ్యం యాతవ్యంవాతతోఽన్యతః । నమాత్రానపితుఃస్వస్రా నస్వస్రైకాంతశీలతా ॥ ౬ ॥ బలవంతీంద్రియాణ్యత్ర మోహయంత్యతికోవిదాన్ । ఏవమాదీన్యనేకాని బ్రహ్మచారివ్రతానిహి ॥ ౭ ॥ తస్మైగురుర్హ్యుపదిశ్య దదౌదానాన్యనేకశః । భోజయామాసతంమాత్రా సహనానోత్సవైస్తదా ॥ ౮ ॥ కారయిత్వాథపాలాశ పూజనంవిధిపూర్వకం । తేనాపికుశబాలేన దేవకస్యవిసర్జనం ॥ ౯ ॥ చకారరాఘవేణైవ సీతయాసగురుస్తదా । తతోరామో నృపతిభి ర్జనకేనాపిపూజితః ॥ ౧౦ ॥ చకారధనవస్త్రాద్యై స్తుష్టాన్విప్రాన్నృపాదికాన్ । ఆచాండాలాం స్తదా రామ స్తోషయామాససాదరం ॥ ౧౧ ॥ ఏవంనానాసముత్సాహై ర్మాసమేకంనినాయసః । రామోవిసర్జయా

భివాదనము చేసెదనని చెప్పవలయును. దూష్యులుకాని బ్రాహ్మణులవద్ద తనజీవనమునకై భిక్షాచర్యము నాచరించి తెచ్చి మౌనముగాని గురువు ఆజ్ఞనిచ్చినవెనుక ఆయన్నమును నిందింపక భక్షించవలయును. ఒకయన్నమునే తినవలెను. ఆపద్విషయమునందు శ్రాద్ధభోజనమును చేయవచ్చును. రెండుమార్లు భుజింపగూడదు. ఎప్పుడును పగలు రెండుమారులు ద్విజోత్తమునికి భోజనముకూడదు. అగ్నిహోత్రక్రమము నెఱిఁగినద్విజుఁడు సాయంకాల ప్రాతఃకాలములలో భుజించదగును. మద్యము మాంసము ప్రాణిహింస నీటిలోసూర్యునిఁజూచుట స్త్రీ ఎంగిలి చద్ది అపవాదము, వీటిని విడువవలయును. గురువునకు కనుపడునట్లు యథేష్టముగా చేష్టలుచేయరాదు. అవిశేషణముగా పరోక్షమున పేరును గ్రహించరాదు. ఎచ్చట గురునింద అపవాదము చెప్పఁబడుచుండునో అచ్చట నిలువవలసియుండినం జెవులుమూసికొనవలయును. అటుగాకున్నచ్చట నిలువకపోవలయును. తల్లితోడను మేనత్తతోడను తోబుట్టుతోడనైనను ఏకాంతమున వసింపరాదు. గొప్పపండితులనుకూడ ప్రబలమగు నింద్రియంబులు మోహింపఁజేయును. ఇవియే మొదలైన బ్రహ్మచారివ్రతములను ఆవసిష్ఠముని కుశుని కుపదేశించి వివిధదానంబులనొసంగి, అతనికి తల్లితోడ వివిధోత్సవంబులు జరుగుచుండగా భోజనముచేయించెను. అప్పుడు విధిప్రకారముగా పాలాశి పూజనంబునుచేయించి సీతారాములతోడ వెరసి వసిష్ఠుఁడు దేవక విసర్జనమునుచేసెను. పిదప రాముఁడు రాజులచేతను జనకునిచేతను పూజింపఁబడినవాఁడై ధనకనకవస్త్రాదులచే బ్రాహ్మణులను నృపాదులను ఆచండాలాంతము సకలప్రాణులను

మాప తతస్తాన్స్వాథితవాదికాన్ ॥ ౧౨ ॥ ఏవంపఞ్చాన్తరాద్రామో వ్రతబంధంలవస్య చ । చకారపూర్వవత్సర్వా త్సమాహూయన్నృపాదికాన్ ॥ ౧౩ ॥ తతస్తౌబాలకౌరమ్యౌ వేదాధ్యయనముత్తమం । చక్రతుర్గురుసాన్నిధ్యేవి ధివద్బుద్ధిసత్తమౌ ॥ ౧౪ ॥ ఏవంతేషాంతుబాలానాం సర్వేషాంరఘునందనః । వ్రతబంధవిధానాని యథాకాలేమ హోత్సవైః ॥ ౧౫ ॥ చకారగురుణావిప్రై స్సమాహూయన్నృపాదికాన్ । విశేషైర్నిజపుత్రాభ్యాం చకారసమ హోత్సవైః ॥ ౧౬ ॥ అకరోదధికంకించి న్నస్నాత్రసమకరోద్విభుః । తతస్తేబాలకాస్సర్వే బ్రహ్మచర్యవ్రతేస్థి తాః ॥ ౧౭ ॥ చక్రుస్తేగురుసాన్నిధ్యే వేదాధ్యయనముత్తమం । అథరామోపివైదేహ్యా బాలకైఃపరివారితః ॥౧౮॥ విరేజేస్కందగణపాదిభిర్దేవ్యాయథాశివః । అథతేబాలకాస్సర్వే కృత్వాధ్యయనముత్తమం ॥ ౧౯ ॥ వేదాదీ నాంగురుముఖా ల్లబ్ధ్వాజ్ఞాంస్వగురో స్తతః । జగ్ముస్తీర్థానివైకతుకాం సేనయాగురుమంత్రిభిః ॥ ౨౦ ॥ పృథివ్యాం భారతేఖండే యానితీర్థానితానితే । కృత్వాసమాయయుఃపంచ మాసైఃస్వనగరీంశనైః ॥ ౨౧ ॥ బాలాన్సమా గతాన్ శ్రుత్వా శోధయిత్వానిజాంపురీం । ప్రత్యుజ్జగామసౌమిత్రిః పురస్కృత్యాథవారణం ॥ ౨౨ ॥ తేదృష్ట్వాల

సాదరముగా సంతుష్టులంజేసెను. ఇట్లు వివిధమహోత్సవంబులచే నొకనెల గడచినవెనుక నందఱిని వారివారి స్థలములకుపంపించెను. ఇట్లే సంవత్సరమయిన వెనుక యథాపూర్వముగా లవునికిని ఉపనయము చేసెను. అంత నాయిరువురును కుశలవులు గురుసన్నిధానమున విధిప్రకారముగా వేదంబుల నధ్యయనముచేసిరి. ఇట్లే శ్రీరాముఁడు తక్కిన చిన్నవాండ్రకును తత్తత్కాలోచితంబుగా క్రమముగా రాజులను గురుదేవద్విజులనురప్పించి తనకొడుకులకన్న నతిశయంబుగా పలువేడుకలతోడ వడుగులు చేయించెను. ఒకటికన్న నొకటి యధికముగా నుండునుగాని యెందును ఏకొఱఁతయును లేదు. అంతనాబాలకులందఱును బ్రహ్మచర్యవ్రతస్థులైరి. గురుసన్నిధిలో నందఱును వేదాధ్యయనము చేసిరి ॥౧౧౮॥ పిదప రాముఁడు సీతాసమే

### బాలకులు విద్యనేర్చి తీర్థయాత్రజేసి యయోధ్య కేతెంచుట.

తుఁడై బాలకుల చేపరివృతుఁడై గౌరీగణేశకుమార పరివృతుండగు పరమేశ్వరునివలె ప్రకాశించెను. అంతనాబాలకులు విద్యాభ్యాసముచేసి వేదాదివిద్యా తత్త్వంబులను గురుముఖమునుండి తెలిసికొని గుర్వాజ్ఞనంది గురువు మంత్రులు సేనలు వెంబడించివచ్చుచుండగా తీర్థాటనమునకువెడలి భూమిలో భారతఖండమున నెన్ని తీర్థములుగలవో వాటినన్నిటిని చరించి తిన్నగా నైదునెలలలో మరలివచ్చి యయోధ్యను ప్రవేశించిరి. బాలకులువచ్చుచున్న సంగతినివిని లక్ష్మణుఁడు పురమును శృంగారింపఁజేసి వారిని పిలచికొనివచ్చుటకై భద్రగజమును ముందు పెట్టుకొని వెడలెను. వారు లక్ష్మణునిజూచి నమస్కరించి లక్ష్మణునిచేత నాలింగింపఁబడి దివ్య

ష్మాణం నేము స్తతే వాలింగితా అపి । నానోత్సవైర్యయుర్బాలా అయోధ్యాయాం గృహం ప్రతి ॥ ౨౩ ॥ మార్గేమా ర్గే పురస్త్రీభిః స్వాధస్థాభిస్తు వర్షితాః । వృష్టిభిః కుసుమాదీనాం దీపైర్నీరాజితా అపి ॥ ౨౪ ॥ తత స్తే బాలకా స్సర్వే సభాయాం రఘునందనః । నేము స్తేనాలింగితాశ్చ యయుస్సీతాగృహాంతరం ॥ ౨౫ ॥ ఏతస్మిన్నంతరే సీతో ర్మిళా పాండవీ తథా । శ్రుతకీర్తిశ్చ వేగేన చక్రుర్నీరాజనం పృథక్ ॥ ౨౬ ॥ దధ్యోదనశ్చ దీపైః పక్వాన్నై స్తైలపాచితైః । సవర్ణపైర్లవణైర్మాషైః తోయకుంభైశ్చ సాదరం ॥ ౨౭ ॥ తత స్తే బాలకాస్సర్వే నేముస్సీతాం పృథక్పృథక్ । తతో నేముస్స్వమాతౄశ్చ పూర్వం నత్వా పితామహీం ॥ ౨౮ ॥ తత స్తే బాలకాస్సర్వే దదుర్దానా న్యనేకశః । బ్రాహ్మణాన్ భోజయామాసుః కోటిశ స్తే పృథక్పృథక్ ॥ ౨౯ ॥ ఏవం నానోత్సవా స్తత్ర బభూవూ రామసద్మని । అథ తే బాలకాస్సర్వే స్యందనాదిషు సంస్థితాః ॥ ౩౦ ॥ దివ్యవస్త్రాణి చిత్రాణి పరిధాయ సమంతతః । అయోధ్యా రాజమార్గేషు హట్టేషు చ చతుష్పథే ॥ ౩౧ ॥ ఆరామోపవనారణ్య వాటికాసు నదీతటే । గమనాగమ నేచక్రు స్సేనయా మంత్రిబాలకైః ॥ ౩౨ ॥ ఏవం సాకేతనగరే బాలకైస్సీతయా సుఖం । రమే సబంధుభిర్యుక్తః శ్రీ

మంగళ మహోత్సవంబులతోడ నగరమున వచ్చుచుండిరి. దారులలో మేడలమీఁదనుండెడు పురాంగనలు పుష్పవృష్టులం గురిపించుచుండిరి. మంగళదీపంబుల నారతులనెత్తుచుండిరి. అంత నాబాలకులు రాజమందిరమును ప్రవేశించి సభాసీనుండైన శ్రీరామచంద్రస్వామి చరణారవిందంబులకు దండప్రణామంబుల నాచరించి శ్రీరామదివ్యమంగళ దేహస్పర్శమునంది యమందానందతుందితులై సీతాదేవియొక్క అంతఃపురమునకువచ్చిరి. అంతలో నచ్చట సీతోర్మిళాశ్రుతకీర్తి మాండవులుచేరి వేఱుగా నారతులనెత్తిరి. పెరుగన్నము పక్వాన్నము తైలపక్వవస్తువులు వీట్లతోడ దీపములు ఆవాలు ఉప్పు ఉద్దులు జలకుంభములు వీట్లచేనాదరముగా దిగుటుదుపులనుచేసిరి. అంతనాబాలకులు తొలుత నాయనమ్మలను వందించి పిమ్మట సీతాదేవికి అభివాదనముచేసి తమతమ తల్లులకు నమస్కారముచేసిరి. వెంటనే అనేకదానధర్మముల నాచరించిరి. కోట్లకొలది బ్రాహ్మణులకు సంతర్పణలు చేయించిరి. ఇట్లు పలువేడుకలు శ్రీరామమందిరమున జరుగుచుండెను. పిమ్మట నిత్యము యథాసుఖముగా నారాజకుమారులు తమకిచ్చవచ్చిన తొడుగులను తొడిగి కావలసిన వాహనంబులనెక్కి దివ్యాలంకారయుక్తులై మంత్రి పుత్రులతోడ సేనలు వెంబడించివచ్చుచుండ రాజమార్గంబులలోను అంగళ్లబజారులలోను నలుదారులు చేరెడుచోట్లలోను తోటలలోను ఉద్యానవనంబులలోను వనంబులలోను నదీతీరంబులలోను రాకపోకలచే రారాజించుచుండిరి. ఇట్లు సాకేతరాజధానిలో రామచంద్రస్వామి సీతాదేవితోడను తమ్ములతోడను పుత్రులతోడను చిరకాలము రమించుచుండెను॥ ౧౩౩॥ శిష్యుఁడగు విష్ణు

రంరాజారఘూద్వహః ॥ ౩౩ ॥ ఏవంతే ప్రకథితం జన్మకాండమిదంతవ । శుకాదీనాంతు జన్మాని కథితా న్యతివిస్తరాత్ ॥ ౩౪ ॥ రమ్యంపవిత్రమానంద దాయకంచమనోహరం । పుత్రపౌత్రప్రదజన్మ కాండమేతత్సు ఖావహం ॥ ౩౫ ॥ జన్మకాండమిదంపుణ్యం యేశృణ్వంతినరోత్తమాః । తేషాంపుత్రైశ్చపౌత్రైశ్చ వియోగోనభ విష్యతి ॥ ౩౬ ॥ జన్మకాండమిదంయేతు భక్త్యాశృణ్వంతిమానవాః । తేషాంస్త్రీణాంవియోగోపి నకదాప్యత్ర జాయతే ॥ ౩౭ ॥ జన్మకాండమిదంపుణ్యం యాఃశృణ్వంత్యత్రవైస్త్రియః । స్వభర్తృభిర్వియోగంతా నగచ్ఛంతి యథారమా ॥ ౩౮ ॥ గ్రామందేశాంతరంతీర్థం యేగతాశ్చచిరంనరాః । తేషామాగమనార్థంహి జన్మకాండం పఠేదిదం ॥ ౩౯ ॥ యేషాంభావీనికార్యాణి లబ్ధుంత్వరయతేమనః । తైర్నరైఃపఠనీయంవై జన్మకాండందినేదినే ॥ ౪౦ ॥ పూర్వేదినేచైకవారం ద్వివారంచాపరేదినే । ఏవంనవదినంవృద్ధి స్తథైకేనక్షయోపిహి ॥ ౪౧ ॥ కార్యే నరైఃస్వస్థచిత్తై స్తేషాంకార్యంభవిష్యతి । వర్షమేకంపఠేదేవ మపుత్రోపిలభేత్సుతం ॥ ౪౨ ॥ పుత్రార్థీప్రాప్ను యాత్పుత్రం ధనార్థీధనమాప్నుయాత్ । ఇష్టాన్కామాంశ్చకామ్యర్థీ జన్మకాండశ్రవాల్లభేత్ ॥ ౪౩ ॥ ఆనంద

## జన్మకాండ ఫలశ్రుతి.

దాసా! వినుము. కుశాదులయొక్క పుట్టుకదేనియందు వర్ణింపఁబడినదో అట్టి జన్మకాండమును నీకుచెప్పితిని. ఈజన్మకాండము. పుత్రపౌత్రప్రదంబు, మిక్కిలి సుఖావహంబు, ఆనందదాయకంబు, రమ్యంబు, పవిత్రంబు, మనోహరంబు నైయున్నది. పుణ్యరూపంబగు నీజన్మకాండము ను ఏమానవోత్తములు వినుచుందురో వారు పుత్రపౌత్రులతో నెప్పుడు నెడబాయకయుందు రు. ఈజన్మకాండమును ఏనరులు భక్తితో శ్రవణముచేయుదురో వారు ఎన్నటికిని పత్నీవియో ముగ నొందజాలరు. ఏస్త్రీలు ఈజన్మకాండమును భక్తితో నవధరింతురో ఆకాంతలు త మపతులతోఁడ నిత్యానపాయినియైన శ్రీదేవివలె నెప్పుడు నెడబాయక వర్తించెదరు గ్రామము నకు దేశాంతరమునకు తీర్థమునకుపోయి రాకయుండెడు వారిని రప్పించుటకై యీజన్మకాండ మును పఠించవలయును. ఎవరు భవిష్యచ్ఛుభకార్యంబులనుత్వరగా కావలయునని యెంచెదరో వారు నిత్యము ఈజన్మకాండమును పఠించవలయునుగదా? కార్యసిద్ధిని కోరువారు తొలినా డు ఈజన్మకాండము నొకమాఱు, రెండవనాడు రెండుతూర్లు, మూడవనాడు మూడుతూర్లు, ఇట్లు తొమ్మిదిదినములవరకు వృద్ధిగాఁజదివి; పిమ్మట తొమ్మిదిదినములు ౯–౮–౭–౬–౫–౪–౩– ౨–౧ ఇట్లు తగ్గించుచు పఠించినయట్టి స్వస్థచిత్తులగు వారియొక్క కార్యము తప్పక సిద్ధించుచు న్నది. ఇట్లు ఒకసంవత్సరము పఠించినయెడల పుత్రులు లేనివాఁడు పుత్రవంతుఁడగును. జన్మ కాండశ్రవణమువలన పుత్రులు కావలసినవారు పుత్రులను ధనము కావలసినవారు ధనమును తక్కిన యిష్టార్థములు కావలసినవారు వారివారి యిష్టార్థములను పొంది సుఖించెదరు. ఆనం

రామాయణమధ్యసంస్థం శ్రీజన్మకాండంతనయప్రదంచ । పారాయణంసంశ్రవణంతథావా కరోతియోవాసలభే త్సుపుత్రం ॥ ౪౪ ॥ * ॥ ... ... ... ... ... ... ... ...

ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గత శ్రీమదానందరామాయణే వాల్మీకీయే
జన్మకాండే కుశలవాదీనాం జన్మకథనంనామ నవమస్సర్గః ౯॥
ఇతి జన్మ కాండః పంచమ స్సంపూర్ణః.
శ్రీరామచంద్ర చరణార విందార్పణమస్తు.
సంతతం శ్రీరస్తు.



దరామాయణ మధ్యంబుననుండెడు సంతాన సౌఖ్య ప్రదంబగు నీజన్మకాండమును తప్పకపఠించి వినునట్టి పుణ్యాత్ములు వంశాభివృద్ధిగల్గి సంసారసుఖ సంపదలచే నానందించుచుందురు ౯॥

ఇట్లు శ్రీమద్వాల్మీకీ యానందరామాయణంబున

నైదవ జన్మకాండము సంపూర్ణము.

శ్రీరామచంద్రార్పణము.



శ్రీరామాయ నమః

శ్రీమహాగణపతయేనమః—వాల్మీకిమునయేనమః.

# శ్రీమదానందరామాయణే

## వివాహకాండః షష్ఠః ప్రారభ్యతే.

శ్రీరామదాస ఉవాచ—అథరామస్సభామధ్యే మంత్రిభిః పరివేష్టితః । తస్థౌ సింహాసనే రమ్యే వరచ్ఛత్రోపశోభితః ॥ ౧ ॥ ఏతస్మిన్నంతరే తత్ర కశ్చిద్దూతస్సమాయయౌ । నత్వా సభాయాం శ్రీరామం స్వామివృత్తం న్యవేదయత్ ॥ ౨ ॥ పూర్వదేశాధిపతినా రాజ్ఞా శ్రీభూరికీర్తినా । ప్రేషితోస్మి మహారాజ ద్రష్టుం త్వత్పాదపంకజం ॥ ౩ ॥ పత్రం పఠిత్వా శ్రీరామ కార్యా మత్స్వామినః కృపా । ఇత్యుక్త్వా రామచంద్రస్య కరే పత్రం న్యవేదయత్ ॥ ౪ ॥ రామదూతోపి సౌమిత్రేః పురస్తాత్పత్రమాదరాత్ । స్థాపయామాస వేగేన నత్వా తస్థౌ నిజస్థలే ॥ ౫ ॥ తతస్సలక్ష్మణః పత్రం పరిబంధనవేష్టితం । సముద్ఘాట్య రాఘవాగ్రే పపాఠ మంజులస్వరః ॥ ౬ ॥ హేమకృత్రిమపుష్పాద్యైరంకితం కుంకుమాన్వితం । దర్శనాదేవ మాంగల్యసూచకం తోషకారకం ॥ ౭ ॥ ఉవాచ పత్రలిఖితైరక్షరైర్లక్ష్మణశ్శనైః । స్థితః శ్రీరామపురతో వరసింహాసనాంతికే ॥ ౮ ॥ శ్రీమాన్ శ్రీరాఘవేంద్రో జయతు దశశిరశ్ఛేదనార్థం జగత్యాం । కౌసల్యాయాం ప్రవేశో దశరథతనయశ్చేతి నామ్నావతీర్ణః । తస్యాహం భూరికీర్తిః పదజలరుహయోర్గంధమాఘ్రా

### శ్రీరామసన్నిధికి భూరికీర్తి స్వయంవరలగ్న పత్రిక నంపించుట.

—:o—

తరువాత నొకనాడు శ్రీరామచంద్రస్వామి సభామధ్యమున దివ్యచ్ఛత్రాలంకృత సింహాసనముమీఁద కూర్చుండి మంత్రి పరివేష్టితుఁడై బరగుచుండెను. అంతలో నచ్చటికి ఒకానొక దూతవచ్చి సభలో శ్రీరామునికి నమస్కరించి, "స్వామీ! పూర్వదేశాధిపతియైన శ్రీభూరికీర్తి మహారాజుగారిచే పంపఁబడినవాఁడై తమదివ్యపాదారవిందములను దర్శించుటకు వచ్చియున్నాఁడను. రామచంద్రస్వామీ! ఈమంగళపత్రికను చదివి మాదొరగారిని కృపజేయవలయును." అని విన్నవించి పత్రిక నర్పించెను. శ్రీరామదూతయు నట్లే అప్పత్రికనెత్తి లక్ష్మణస్వామి యెదుటఁబెట్టి తాను తనతావులో నిలచెను. అంత నాసౌమిత్రి అతికించియుండెడు జాబును తీసికొని శ్రీరామునియెదుట విప్పి బంగారుపూలచే నలంకరింపఁబడి కుంకుమాంకితంబునై చూచినమాత్రముననే మంగళకార్యమును సూచించునట్టి సంతోషకరమైన పత్రికను మనోహరస్వరముతో శ్రీరామసన్నిధిలో మెల్లగా పఠించెను—"శ్రీకౌసల్యాగర్భంబున దశరథతనయుఁడనుపేరుతో జగంబున దశకంఠ శిరశ్ఛేదనార్థంబుగా నవతరించిన శ్రీమంతుఁడగు శ్రీరామచంద్రస్వామి సర్వోత్కృష్టుఁడుగా నుండునుగాక. అట్టి శ్రీరాముని పాదారవిందంబు

తుకామః । కృత్వాస్వీయంశిరస్తుభ్యమరవదనిశం ప్రార్థనాంప్రార్థయామి ॥౯॥ మమపౌత్ర్యావుభేరామ చంపికాసుమతీతిచ । తయోస్స్వయంవరార్థంచ మాయాంతిబహవోనృపాః ॥ ౧౦ ॥ బంధుపుత్రైర్బాంధుభిస్త్వం స్వసుతాభ్యాంచమంత్రిభిః । సుహృజ్జనైస్తథాపౌరై స్సావరోధస్స్వసేనయా ॥ ౧౧ ॥ ఆగచ్ఛస్వమమపురం యది కృత్వామహత్కృపాం । విఫలాంప్రార్థనాంమేత్వం మాకురువ్వత్వియాంప్రభో ॥ ౧౨ ॥ ఇతిపత్రార్థమాకర్ణ్య స్వస్థచిత్తోరఘూత్తమః । స్వయంవరంతతోగంతుం మనసానిశ్చయంవ్యధాత్ ॥ ౧౩ ॥ తతోబ్రవీత్సౌమిత్రి మద్యసేనాంప్రచోదయ । శ్వోహంగచ్ఛామిపుత్రాభ్యాం త్వయామంత్రిజనైస్సహ ॥ ౧౪ ॥ భరతేనాపియుష్మాకంపుత్రైశ్శత్రుఘ్నసంయుతః । స్వయంవరంసమస్త్రీకః పౌరైర్జానపదైస్సహ ॥ ౧౫ ॥ విజయోనగరీంరాజ్యం పాలితుంస్థాపితోమయా । అద్యైవపటగేహాని బహిర్నయావిలక్ష్మణ ॥ ౧౬ ॥ పంథానంశోధయంత్వద్య నానాదూతాస్త్వరాన్వితాః । గచ్ఛంతుకులనార్యః పుష్పకేణవిహాయసా ॥ ౧౭ ॥ తథేతిలక్ష్మణోప్యుక్త్వా చకారసయథోదితం । రాఘవేణసభామధ్యే ప్రబద్ధకరసంపుటః ॥౧౮॥ తతోద్వితీయదివసే ప్రభాతేరఘునందనః । స్నాత్వానిత్యవిధింకృత్వా సనాయాగ్నీన్ సపుష్పకే ॥ ౧౯ ॥ స్థాపయామాసకుండేషు ధృత్వాసుహృజ్జనైస్సహ । తతస్సీతాంసమాహూయ త్వరయామాసరాఘవః ॥౨౦॥ తతఃస్త్రియస్తదాసర్వాః సీతాద్యారుక్మభూషితాః యానమారురుహు

---

లలోని దివ్యపరిమళమును ఆఘ్రాణించనెంచి భూరికీర్తియను నేను నాతలను తుమ్మెదగా జేసికొని యీప్రార్థనను ప్రార్థింపుచున్నాను—మహాప్రభూ! నాపుత్రుని పుత్రికలు చంపకాసుమతులను వారిరువురు గలరు. వారిస్వయంవరము కొఱకు పెక్కండ్రురాజులు వచ్చుచున్నారు. తమరు తమ్ములను తమ్ముల కుమాళ్లను మీకుమాళ్లను తీసికొని మంత్రి మిత్రపరివారములో డను ఊరివారితోడను రాణివాసముతోడను సేనలతోడను నాపట్టణమునకు దయజేసి రావలయును. నాయొక్క ప్రార్థనను వ్యర్థపరచవలదు మహాప్రభూ" అని చదువబడిన శుభపత్రికా సమాచారమును విని సమాహిత మనస్కుండైన శ్రీరామచంద్రుడు వసిష్ఠులవారితో నాలోచించి స్వయంవరమునకు పోవుటను నిశ్చయించి లక్ష్మణునితో "నేడు సేనలను పంపించుము. రేపు, సీతతోడ నేను నీవు భరతశత్రుఘ్నులు కుశలవులు మీపుత్రులు పౌరులు జనపదము వారునుకూడ వెడలవలయును. విజయునిని నగరమును రాజ్యమును పాలించుటకై స్థాపించి యున్నాను, నేడే గుడారములను వెలుపలికి పంపనగును. దూతలు త్వరగావెడలి దారులను చక్కబరచని. స్త్రీలందఱును పుష్పకవిమానమునెక్కి గగనమున వెడలని." అని యాజ్ఞాపించెను. అట్లేయని శ్రీరాముడు చెప్పినట్లు తగినయేర్పాటుచేసి లక్ష్మణుడు కేలుమోడ్చి శ్రీరామసన్నిధిలో నిలిచెను. అంత మఱునాడు ప్రాతఃకాలమున రాఘవుడు స్నానముచేసి నిత్యకృత్యంబుల నాచరించి సుహృజ్జనులతోడ యగ్నిహోత్రంబులను పుష్పకంబున సముచిత కుండంబులలో స్థాపించి సీతాదేవిని పిలిచి త్వరగా పయనము పోవలయునని త్వరపరచెను.

శ్శుభ్రం దివ్యవస్త్రైర్విమండితాః ॥ ౨౧ ॥ తతో రామో గజారూఢో వరచ్ఛత్రోపశోభితః । యయావగ్రే చామరాద్యైర్వీజితశ్చ ముహుర్ముహుః ॥ ౨౨ ॥ రామాగ్రే వారణారూఢో యయౌ శీఘ్రం గురుస్తదా । రాఘవస్య పృష్ఠభాగే గజస్థో లక్ష్మణో యయౌ ॥ ౨౩ ॥ తతః కుశాద్యాస్తే స్వేచ బాలాజగ్ముర్గజస్థితాః । తతో భరతశత్రుఘ్నౌ జగ్మతుర్గజసంస్థితౌ ॥ ౨౪ ॥ తతస్సర్వేమంత్రిణశ్చ పౌరాజానపదాదయః । నానావాహనసంస్థాస్తే యయుస్సర్వేత్వరాన్వితాః ॥ ౨౫ ॥ చతుర్దంతే శుక్లవర్ణే వారణే రాఘవోచితే । సంస్థితో రాఘవో రేజే ముక్తాజాలవిరాజితే ॥ ౨౬ ॥ ఏవం రామశ్చ నైమార్గే వందిమాగధసంస్తుతః । శృణ్వన్ వాద్యనినాదాంశ్చ యయౌ పూర్వాదిశం శనైః ॥ ౨౭ ॥ వవర్షుస్సకలానార్యః పుష్పకస్థా రఘూత్తమం । పుష్పవృష్టిభిరానంద పూరితా రాఘవేక్షణాః ॥ ౨౮ ॥ వినేదుర్నవవాద్యాని ననృతుర్వారయోషితః । జగుర్గీతాని రమ్యాణి పురతస్తే నటాదయః ॥ ౨౯ ॥ ఏవం రామశ్చ నైగతాత్వ సాకేతాద్యోజనోపరి । సేనానివాససంస్థానం నిర్మితం తద్దదర్శ సః ॥ ౩౦ ॥ అవరుహ్య గజేంద్రాత్స వివేశ పటగృహం । ఏవం రామశ్చ నైమార్గే పశ్యన్ దేశాన్ మనోరమాన్ ॥ ౩౧ ॥ తీర్త్వా భాగీరథీం గంగాం విలంఘ్య కటకాన్ ప్రభుః । యయౌ వింశద్దినైర్భూరి కీర్తేర్దేశమనుత్తమం ॥ ౩౨ ॥ భూరికీర్తిస్తతో దూతో గత్వాశు జవిభుంజవాత్ । కథయామాస రామస్య ముదాగమనమాదరాత్ ॥ ౩౩ ॥ భూరికీర్తిర్న్ పశ్శ్రుత్వా గమనం రాఘవస్యసః ।

అంత నపుడు సీతాది స్త్రీలందఱును దివ్యవస్త్ర భూషణాలంకృతలై త్వరగా తమతమ యానములనెక్కిరి. అంత నా శ్రీరాముఁడు దివ్యగజమునెక్కి ఛత్రచామరాలంకృతుఁడై మొదట వెడలెను. రాముని ముందర వసిష్ఠుఁడు గజారూఢుఁడై వెడలెను. రాముని వెనుక నేనుఁగునెక్కి లక్ష్మణుఁడేఁతెంచెను. అంత నావెనుక కుశాదు లెనమండుగురు బాలకులును వేర్వేఱుగా నేనుఁగులనెక్కి వచ్చుచుండిరి. వారివెనుక గజారూఢులై భరతశత్రుఘ్నులు బయలుదేరిరి. అంత నందఱు మంత్రులును నాగరీకులును దేశమువారును క్రమముగా వివిధవాహనారూఢులై వెడలిరి. శ్రీరాముఁడు తనకు తగినట్లు నాల్గుదంతములుగల మౌక్తికాలంకృతమయిన ధవళవారణంబున రారాజించుచుండెను. ఇట్లు శ్రీరాముఁడు పూర్వదిగ్గామియై మార్గమున వచ్చుచుండగా వందిమాగధులు పొగడుచుండిరి. పుష్పకంబున నుండెడు నారులు సంతసించుచు శ్రీరాముని నిరీక్షించువారలై విరులవానఁ గురిపించుచుండిరి. నవవిధవాద్యములు మ్రోగుచుండెను. గణికల యాటపాటలు జరుగుచుండెను. నటాదులు మనోహరగీతంబులను పాడుచుండిరి. ఇట్టి విభవముతో రఘునందనుండువచ్చి యయోధ్యకు నామడదూరమున నేర్పరచియుండు సేనాసన్నివేశ స్థానమునుచూచి వాహనమునుండిదిగి పటగృహమును ప్రవేశించెను. ఇట్లే రాముఁడు తిన్నగా దారిలో మనోహరంబులగు ప్రదేశంబుల నవలోకించుచు గంగానదినిదాటి కటకరాష్ట్రంబుల నతిక్రమించి ౨౦ దినములలోగా భూరికీర్తి ప్రదేశమునకువచ్చెను. అంత నచ్చట భూరికీర్తి దూతముఖమునుండి శ్రీరామాగమనంబును విని మిక్కిలి సంతోషమునంది త్వరగా

స్తుతోపనీతరాం శ్రీమాన్ రామం ప్రత్యుద్యయౌజవాత్ ॥ ౩౪ ॥ స్వపురీం శోభయామాస పతాకాధ్వజతోరణైః ॥ వారణేంద్రం పురస్కృత్య సమాయాతైః నృపైస్సహ ॥ ౩౫ ॥ యేయే సమాగతా స్తత్ర పార్థివాశ్చ స్వయంవరే । విషణ్ణాస్యా బభూవుస్తే వ్యగ్రచిత్తా స్తథైవ చ ॥ ౩౬ ॥ స్వచిత్తే మంత్రయామాసుః కథమత్ర స్వయంవరే । త్యక్త్వా శ్రీరామబాలాని కన్యేస్మాకం వరిష్యతి ॥ ౩౭ ॥ ఇతి చింతావిష్టచిత్తాః ప్రత్యుజ్జగ్ము ర్రఘూత్తమం । రామం దూరాద్దదృశుస్తే తత్సేనాం చత్వరాన్వితాం ॥ ౩౮ ॥ తత స్తే రాఘవం నత్వా పాయనాని న్యవేదయన్ । రామేణాలింగితా స్సర్వే తత్పార్శ్వే సంస్థితా స్తదా ॥ ౩౯ ॥ తతస్స భూరికీర్తిస్తు స్వపుత్రాభ్యాం సమన్వితః । నత్వా రామాదికాన్ పూజ్య వస్త్రాభరణవాహనైః ॥ ౪౦ ॥ నినాయ నగరీం స్వీయాం గోపురాట్టాలమండితాం । నర్తకీష్వారనారీషు వాద్యేషు నినదత్సు చ ॥ ౪౧ ॥ స్తువత్సు వందివృందేషు వివేశ నగరీం ప్రభుః । తదా తత్పురనార్యస్తాః శ్రుత్వా రామం సమాగతం ॥ ౪౨ ॥ విహాయ నిజకార్యాణి దుద్రువుర్గోపురాదిషు । శీఘ్రమారురుహుస్సర్వా దదృశుస్తా రఘూత్తమం ॥ ౪౩ ॥ కాచిత్స్వ బాలకం త్యక్త్వా రుదంతం నిజమంచకే । దుద్రావ రాఘవం ద్రష్టుం వరప్రాసాదమస్తకే ॥ ౪౪ ॥ కాచిత్తాంబూలవీటికాః కృత్వా యావత్పతిం దదౌ । తావచ్ఛ్రుత్వా సమాయాంతం రామం దుద్రావ సాదరం ॥ ౪౫ ॥ కాచిత్త్యక్త్వా

శ్రీరామునిఁ బిలచికొని వచ్చువాఁడై నిజనగరమును చిత్రధ్వజ పతాక తోరణాదులచే నలంకరింపించి, తనయూరికి వచ్చియుండెడు రాజులనందఱిని తీసికొని భద్రగజపురస్కృతుఁడై శ్రీరామసన్నిధికి వచ్చెను ॥ ౩౫ ॥ ఆస్వయంవరమునకై యెవ్వరెవ్వరువచ్చి యుండిరో ఆరాజులందఱును విషణ్ణముఖులును చకితాంతరంగులునై తమమనంబులలో నాహా! ఎట్లీస్వయంవరంబున చంపకాసుమతులు శ్రీరాముని బిడ్డలను వదలి మమ్మును వరించెదరు? అను చింతచే నాక్రాంతస్వాంతులై యెట్లో శ్రీరామ సన్నిధికేతెంచి దూరముననే శ్రీరామసేనను శ్రీరాముని దర్శించి నమస్కరించి కానుకలనర్పించిరి. శ్రీరాముఁడు వారిని సముచితాలింగనాదులచే సంతోషపరచి తనప్రక్కలో నిలిపెను. అంత నాభూరికీర్తియును తనపుత్రులతోడఁగూడి శ్రీరామచంద్రాదులనందఱిని వందించి వస్త్రాభరణవాహనాదులచే సత్కరించి గోపురాట్టాల శోభితంబగు నిజరాజధానికి పిలచికొనివచ్చెను, వారకాంతలు నర్తించుచుండ మంగళవాద్యంబులు మ్రోగుచుండ వందిమాగధవృందంబు పొగడుచుండ నాస్వయంప్రభువగు శ్రీరాఘవస్వామి పట్టణమును ప్రవేశించెను. అప్పుడచ్చటి పురస్త్రీలందఱును శ్రీరామునిరాకనువిని తమతమ పనులను వదలి రఘునాథునిదర్శన కుతూహలంబులచే గోపురాద్యున్నత ప్రదేశంబులను త్వరగానెక్కిరి. ఒకవనిత యేడ్చుచుండు తనబిడ్డను మంచముపైవదలి రాముని చూచు వేడుకచే పరుగెత్తి గోపురాగ్రముమీఁద నెక్కెను. ఒకకాంత కాంతునికి విడియములందిచ్చుచుండి యట్లే శ్రీరామాగమనమునువిని మిక్కిలి ముక్కువతో పరుగెత్తెను. మఱియొకతె భోజనమునువిడిచి,

### శ్రీరాముఁడు సపరివారుఁడుగా భూరికీర్తి పురమును ప్రవేశించుట.

భోజనంతు కాచిత్త్యక్త్వాన్నసేవనం, కాచిత్సకబరీహస్తా ముక్తకేశాయయాజవాత్ ॥ ౪౬ ॥ పతినాలింగితాకాచిన్నిష్క్రమ్యస్వపతేః కరం । యయౌవేగేనలలనా వరప్రాసాదమస్తకం ॥ ౪౭ ॥ క్షాలయంతీపతేఃపాద మేకంప్రక్షాల్యకామినీ । యావజ్జగామసాన్యంతు తావచ్ఛ్రుత్వాసమాగతం ॥౪౮॥ సీతయారామచంద్రంహి శీఘ్రోంద్రుద్రావకాతరా । కాచిద్భర్త్రాచుంబమానా దూరంకృత్వాచతన్ముఖం ॥౪౯॥ దుద్రావరాఘవంద్రష్టుం ప్రాసాదేస్రస్తపల్లవా । కాచిద్వినిద్రితాభర్త్రా త్యక్త్వాసిద్ధాంత్వరాన్వితా ॥ ౫౦ ॥ విస్తీర్ణాః జ్జలామంద నేత్రానిద్రాభరాన్వితా। నేత్రాభ్యాంకుంచితాన్ కేశాన్ వారయంతీజవాద్యయా ॥ ౫౧ ॥ త్యక్త్వాభ్యంగంహి కాచిత్సా కుర్వతీకరసన్నిధిం। యయౌవేగేనప్రాసాదం శ్రుత్వారాఘవమాగతం ॥ ౫౨ ॥ కాచిద్భుజేకంకణంసా కృత్వైకేత్వపరేభుజే, కర్తుకామాయయౌశీఘ్రం తద్దైవప్రఘదోత్తమా ॥౫౩ ॥ కాచిదేకేపదేకృత్వా నూపురాదీనిభామినీ । అపరేకర్తుకామాసా తత్థైవాట్టాలమాయయౌ ॥ ౫౪ ॥ కథయంతీశుభాంవార్తాం స్వపత్యుఃపురతఃస్థితా । శ్రుత్వారామంసమాయాంతం దుద్రావగజగామినీ ॥ ౫౫ ॥ కాచిన్నిజంతింపాత్రే కుర్వతీపరివేషణం । భూమౌత్యక్త్వాన్నపాత్రంసాయయౌ రామంనిరీక్షితుం ॥ ౫౬ ॥ కాచిత్స్నాత్వాదివ్యవస్త్రా కుర్వతీసాప్రదక్షిణాః । తులసీంచమహాదేవం శ్రుత్వారామంయయౌజవాత్ ॥ ౫౭ ॥ కాచిద్రజ్జుఘటంకూపే కృత్వాతోయార్థముద్యతా । త్యక్త్వారజ్జుఘటంకూపే దుద్రావేందుశిభానా ॥౫౮ ॥ కాచిత్స్వబాలకంస్తన్యం రహఃపాయయినీవధూః । కుచయోర్బాలకంధృత్వాతత్రైన

యింకొకతె వంటచేయుటనుమాని, వేఱొకతె కొప్పుపెట్టుకొనుచున్నట్లె వెండ్రుకలు విరియబోసికొని, త్వరగా పరుగిడిరి. మఱియొకమగువ మగఁడాలింగించుచుండ కాంతుని కరములను త్రోసివేసి గోపురాగ్రమునకు వేగముగా నేగెను. ఇంకొక యింతి పెనిమిటియొక్క పాదము నొకటినికడిగి మఱియొకటిని వదలివచ్చెను. ఇంకొక యిల్లాల్కు మగడు ముద్దుపెట్టుచుండగా నతనిముఖమునుత్రోసి కాళ్లు తడబడుటనెఱుఁగక ప్రాసాదమునకు పరుగెత్తెను. మఱియొక తరుణి పతితోడ పాన్పుపై పవ్వళించి నిద్రించుచుండినది దబ్బునలేచి కన్నులకాటుక కలసియుండ నిద్రఘిక్కుటమ్మై యుండ కన్నులకడ్డమగు ముంగురులను సవరించుకొనుచు త్వరగానే తెంచెను. మఱియొకనాతి సిద్ధమగు నభ్యంగమునుమాని రాముని రాకనుచూడగోరి రయమునవెడలెను. మఱియొకప్రమద యొకచేతికిరవికెం దొడిగికొని మఱియొకచేతికిఁ దొడిగికొనునంతలో నట్లే త్వరపడివచ్చెను. మఱియొకకామిని యొకకాలికి కడియముపెట్టికొని మఱియొకటికి పెట్టికొనునంతలో నిల్వనేరకవచ్చెను. ఇంకొకమందయాన పతికి శుభవార్త వినుపించుచునెదుటనున్నది రామాగమనమునువిని యట్లే బయలువెడలెను. ఒకగయ్యాలి మగనికివడ్డించుచు నాయన్నపాత్రమునట్లే పారవేచి రాముని చూతునని పరుగెత్తెను. ఒకసువాసిని స్నానముచేసి దివ్యవస్త్రము నలంకరించికొని తులసీప్రదక్షిణమును చేయుచున్నది మహాదేవుండగు రాముఁడేతెంచెననివిని త్వరగా చూడవెడలెను. వేఱొకచపల మాతిలో నీళ్లుచేదుచుండి చెం

పాయయామాసవాత్ ॥ ౫౯ ॥ కాచిత్సా పరిధాయాథ వస్త్రం కచ్ఛం కరేణ సా । కటౌ కామాయయౌ వేగాత్తస్థౌ వా ట్టాలమస్తకం ॥ ౬౦ ॥ ఏవం కర్మాణ్యనేకాని కుర్వంత్యస్తాః పురస్త్రియః । విహాయ తాని సర్వాణి యయూ రామం నిరీక్షితుం ॥ ౬౧ ॥ దృష్ట్వా రామం గజస్థం తా వవర్షుః పుష్పవృష్టిభిః । ఊచుః పరస్పరం నార్యః కృతకోట్టాలసంస్థితాః ॥ ౬౨ ॥ ధన్యా సా రామజననీ కౌసల్యా యా రఘూత్తమం । సుషువే రాజరాజానం పరిపూర్ణమనోరథా ॥ ౬౩ ॥ కాశ్చిదూచుశ్చ సా ధన్యా సీతా జనకనందినీ । యస్యా బింబాధరరసమంక్షుః లోలి రాఘవః ॥ ౬౪ ॥ కాశ్చిదూచుస్తయా తప్తం జానక్యా దుష్కరం తపః । పూర్వజన్మని యత్పుణ్యా ద్రాజరాజప్రియాభవత్ ॥ ౬౫ ॥ కాశ్చిదూచుర్వయం మందభాగ్యాస్తు జగతీతలే । సీతాదాస్యో న జాతాస్స్మ రామసేవనతత్పరాః ॥ ౬౬ ॥ ఇతి నానావిధా వాచస్తాసాం శృణ్వన్ రఘూత్తమః । యయౌ సరాజమార్గేణ నృపకల్పితమందిరం ॥ ౬౭ ॥ తత్రావరుహ్య నాగేంద్రా ద్వివేశవర మందిరం । తస్థౌ సుఖేన జానక్యా బంధుభిర్బాలకైః ప్రభుః ॥ ౬౮ ॥ * ॥ ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గత శ్రీమదానందరామాయణే వాల్మీకీయే వివాహకాండే స్వయంవరాత్ భూరికీర్తేః పురం ప్రతి శ్రీరామగమనం నామ ప్రథమస్సర్గః ॥ ... ... ... ... ... ... ... ... ... ౧॥

బుచేంత్రాళ్లనట్లే పారవేచి పరుగెత్తెను. మఱియొకముగ్ధ రహస్యముగా బిడ్డకు పాలిచ్చుచున్నది పాలిండ్లపై బాలకునినెత్తుకొని యట్లే జవముగానేతెంచెను. మఱియొకతె చీరెగట్టికొని కచ్చవేసికొనుచునే గోపురాగ్రమునకు వచ్చిచేరెను. ఇట్లు వారివారి పనులలోనుండిన పురస్త్రీలందఱును శ్రీరామదర్శనమునకై తమపనులనుమాని కుతూహలంబుతో వచ్చిచూచుచుండిరి. వారందఱును శ్రీరామునిమీఁద విరులవాన గురిపించిరి. ఒండొరులు నానాపలు తెఱంగులుగా మాటలాడుచుండిరి. కొందఱు ఏకౌసల్యాదేవి రాజరాజగు శ్రీరామచంద్రస్వామిని కనెనో పూర్ణమనోరథయగు నామెయె కృతకృత్యురాలనిరి. మఱికొందఱు శ్రీరామచంద్రుఁడు ఎవతెయొక్క బింబాధరమధుర రసమునాస్వాదించునో ఆసీతాదేవిగదా ధన్యురాలనిరి. ఇంక కొందఱు జానకమ్మ పుర్వజన్మంబులలో కఠోరతపము నాచరించినది, యిప్పుడు రాజేంద్రుఁడగు రామునికి ప్రేయసీమణియయ్యెననిరి. కొందఱు మనము నిర్భాగ్యురాండ్రము, సీతయొక్క దాసీజనులై పుట్టి శ్రీరామసేవాపరాయణలై యుండకపోతిమని చింతించిరి. ఇట్లు చెప్పికొనుచుండు సగరస్త్రీల సంభాషణంబులనువినుచు వినోదముగా శ్రీరామచంద్రుఁడు రాజమార్గంబున వచ్చి భూరికీర్తికల్పిత రాజమందిరముంజేరి దివ్యగజమునుండిదిగి యచ్చట సీతాలక్ష్మణ భరత శత్రుఘ్న పుత్రమిత్ర పరివారసమేతుఁడై మహావిభవంబుల నందుచు మహోన్నతుఁడై బరగుచుండెను. ... ... ... ... ... ... ॥౧॥

శ్రీరామదాసఉవాచ — అథాపరేదినేరామం భూరికీర్తిస్సమాయయౌ । నత్వాప్రాహరఘుశ్రేష్ఠం సభాగంతుమహాజానీ ॥ ౧ ॥ తథేతిరాఘవప్రోక్త్వా బాలకైరుక్మభూషితైః । రుక్మతంతూద్భవశ్రేష్ఠ కంచుకోష్ణీషమండితైః ॥ ౨ ॥ ఖడ్గైః పిధానవిముక్తైః కటిబంధోత్తరీయకైః । భూషితైరష్టభిశ్శిఘ్రం శిబికాస్థైస్సమాయయౌ ॥ ౩ ॥ సభాయాంయేనృపాఃపూర్వ మాసనేషుచసంస్థితాః । శ్రుత్వారామంసమాయాంతం సంభ్రమాత్తస్సరోయయౌ ॥ ౪ ॥ చక్రుస్సర్వేరాఘవాయ ప్రణామాన్పార్థివోత్తమాః । తేషాంనామానిరామంతం దీర్ఘశబ్దైఃపృథక్పృథక్ ॥ ౫ ॥ చిత్రోష్ణీషారామదూతాః ప్రోచుర్వైవేత్రపాణయః । వస్త్రాలంకారభూషాది భూషితాముదితాననాః ॥ ౬ ॥ రాజరాజనృపశ్చాయం కర్ణాటవిషయేస్థితః । విజయస్తేప్రణామాంశ్చ కరోతిత్వంవిలోకయ ॥ ౭ ॥ రాఘవేంద్రనృపశ్చాయం శ్రీమాన్ద్రవిడదేశజః । కంబుకంఠోప్రణామాంస్తే కరోతిత్వంవిలోకయ ॥ ౮ ॥ దీననాథనృపశ్చాయం విదర్భవిషయేస్థితః । అంగనాథఃప్రణామాంస్తే కరోతిత్వంవిలోకయ ॥ ౯ ॥ మహారాజనృపశ్చాయం మాగధేవిషయేస్థితః । పరంతపఃప్రణామాంస్తే కరోతిత్వంవిలోకయ ॥ ౧౦ ॥ సీతాకాంతనృపశ్చాయం హ్యవంతిస్థః ప్రతాపవాన్ । ఉగ్రబాహుఃప్రణామాంస్తే కరోతిత్వంవిలోకయ ॥ ౧౧ ॥ రఘువీరనృపశ్చాయం స్థితోహైహయ

## సకలరాజులును సత్కారముతో శ్రీరామాదులను సభాసీనులం జేయుట.

రెండవనాడు భూరికీర్తి శ్రీరామసన్నిధానమునకువచ్చి నమస్కరించి సభకుదయచేయవలయునని ప్రార్థించెను. అట్లేయని రఘునాథుఁడుపలికి — బంగారు సరిగెబట్టలను దివ్యసువర్ణరత్నాభరణంబులను దివ్యకంచుకోష్ణీషంబులను అలంకరించి కొనినవారును మొనలుమూసిన కత్తులు దట్టీలు దివ్యోత్తరీయంబులు వీటిచే నలంకృతులును సుందరాంగులునయినే ఎనిమిది మంది పుత్రులు పల్లకీలనెక్కి వరుసగా నెంబడించి వచ్చుచుండగా — వెడలి స్వయంవరమంటప సభవద్దికివచ్చెను. అంతకుమునుపు సభలో కూర్చుండియుండిన రాజులందఱును శ్రీరాముని రాకనువిని సంభ్రమముతో నెదుటపోయి ప్రణామంబుల నర్పించుచుండిరి. అప్పుడు చిత్రోష్ణీషాద్యలంకారయుక్తులయిన వేత్రపాణులగు శ్రీరామదూతలు హసన్ముఖులై ఆరాజులయొక్క నామధేయంబులను వెవ్వేఱుగా దీర్ఘనాదంబులతో విన్నవించుచుండిరి. ఎట్లనిన — రాజరాజేంద్ర శ్రీరామప్రభూ! విజయనాముఁడైన కర్ణాటదేశాధీశ్వరుఁడగు నీరాజు ప్రణమించుచున్నాఁడు, ప్రసాదింపుము. శ్రీరాఘవస్వామీ! శ్రీమంతుండును ద్రవిడదేశాధిపుఁడునయిన కంబుకంఠుఁడను నీనృపుఁడు నినునమస్కరించుచున్నాఁడు, నిరీక్షింపుము. కరుణాపయోధియగు దాశరథీ! విదర్భదేశమున వసించుచుండు అంగనాథుఁడను నవనీశుఁడు నీకు వినమించుచున్నాఁడు, విలోకింపుము. మహారాజా! మగధదేశపతియైన పరంతపుఁడను పృథ్వీపతి యభివాదనము చేయుచున్నాఁడు, అనుగ్రహింపుము. శ్రీజానకీవల్లభా! అవంతీనాథుఁడైన ఉగ్రబాహువను నుర్వీ

పత్తనే । ప్రతీపస్తే ప్రణామాంశ్చ కరోతిత్వంవిలోకయ ॥౧౨॥ హేరామ నృపతిశ్చాయం శూరసేనేస్థితో మహాన్ । సుషేణస్తే ప్రణామాంశ్చ కరోతిత్వంవిలోకయ ॥ ౧౩ ॥ కోసలేంద్రనృపశ్చాయం హరిద్వారస్థితో మహాన్ । నీపాన్వయేయజ్ఞకీర్తిః కరోతినమనంతవ ॥౧౪॥ అయోధ్యేశనృపశ్చాయం కలింగవిషయేస్థితః । హేమాంగదస్తటేభ్యేశ్చ కరోతినమనంతవ ॥౧౫॥ రావణారేనృపశ్చాయం నాగపత్తనసంస్థితః । పాండ్యోయంమతిమాన్ శూరః కరోతినమనంతవ ॥ ౧౬ ॥ ఏవంతేషాంప్రణామాంశ్చ మానయన్ స్వేక్షణాదిభిః । వివేశబంధుభిర్బాలైః స్సభాయాంమంత్రిభిఃప్రభుః ॥ ౧౭ ॥ తత్రసింహాసనేదివ్యే పశ్చిమాయాంతతోహరిః । ఉపావిశచ్చపూర్వాస్యశ్ఛత్రచామరమండితః ॥ ౧౮ ॥ రామస్యసవ్యేసౌమిత్రిః కైకేయీయాస్థితౌతదా । తస్యస్తవారామవామే కుశాద్యామంత్రిబాలకాః ॥ ౧౯ ॥ శత్రుఘ్నసవ్యేసంతస్థుస్సుమంత్రాద్యాస్సుమంత్రిణః । సభాయాముత్తరేయామ్యే పశ్చాత్సర్వేనృపాదికాః ॥౨౦॥ నేమిరేఖోపమాస్తస్థుః స్వసువృత్యపుత్రమంత్రిభిః । పశ్చిమాభిముఖాఃపూర్వే ననృతుర్వారయోషితః ॥ ౨౧॥ అట్టాలసంస్థావిప్రాద్యా దదృశుఃకౌతుకంమహత్ । తతోనదత్సువాద్యేషు ధూపేషుప్రజ్వలత్సుచ ॥

---

పతి వందించుచున్నాడు, చూడుము. వీరాగ్రణీ! హైహయదేశాధీశుఁడైన ప్రతీపుఁడను భూపతి ప్రణామముచేయుచున్నాడు, పరికింపుము. రఘుకులరత్నమా! శూరసేనదేశస్థితుఁడగు సుషేణుఁడను వసుధేశుఁడు వందించుచున్నాడు, విలోకింపుము. కోసలేంద్రా! హరిద్వారవిషయవర్తియగు నీపాన్వయాలంకారుఁడగు యజ్ఞకీర్తియను వసుమతీశుఁడు నమస్కరించుచున్నాడు, నిరీక్షింపుము. అయోధ్యానిలయా! కళింగదేశాధీశుఁడైన హేమాంగదుండను మహీపతి వినమించుచున్నాడు, విలోకింపుము. రావణదర్పవిరామా! నాగపత్తనమున వసించెడు శూరుఁడు సుధీకుఁడునయిన పాండ్యరాజు ప్రణమించుచున్నాడు. ప్రసన్నుఁడగుము – ఇట్లు అచ్చటిరాజులందఱియొక్క నమస్కారముల నీక్షణమాత్రమున నంగీకరించి తమ్ములతోడను మిత్రులతోడను పుత్రులతోడను శ్రీరామచంద్రుఁడు సభలో ప్రవేశించెను. అచ్చట పడమట దివ్యసింహాసంబున ఛత్రచామరాలంకృతుఁడై శ్రీమన్నారాయణుఁడు సుఖాసీనుండయ్యె. శ్రీరాముని కుడిప్రక్క లక్ష్మణ భరతశత్రుఘ్నులును ఎడమప్రక్క కుశాదులును మంత్రిపుత్రులును కూర్చుండిరి. శత్రుఘ్నుని కుడిప్రక్క సుమంత్రాది మంత్రులు కూర్చుండిరి. సభలో నుత్తరదక్షిణంబులలో నితరరాజులందఱును వారివారి పుత్రమిత్ర పరివారములతోడ వరుసగా పీఠాసీనులయిరి. పూర్వభాగంబున పశ్చిమాభిముఖంబుగా వారకాంతలు నర్తనముచేయుచుండిరి. పై మంచకంబులలో నివసించువారలై విప్రోత్తములు ఆగొప్పవేడుకను చూచుచుండిరి. వాటిపై మేడలమీఁద నంతఃపురాంగనలు గవాక్ష జాలంబులనుండి స్వయంవర మహోత్సవమును నిరీక్షించుచుండిరి॥ ౨౨॥

## చంపకాసుమతులు స్వయంవర మంటపమును ప్రవేశించుట.

అపుడు గణికలు నర్తించుచుండ మాగధులు పాడుచుండ వందులు పొగడుచుండ

౨౨ ॥ నర్తకీషు వారనారీషు గాయత్సు మాగధాదిషు । స్తువత్సు వందిబృందేషు సభాయాం నృపసాత్రికే ॥ ౨౩ ॥ శిబికాస్థే దివ్యవస్త్ర దివ్యాలంకారమండితే । నవరత్నమహామాలా ధృతరమ్యకరోత్పలే ॥ ౨౪ ॥ తే సమాజగ్మతూ రమ్యే సభాగ్రస్థే విరేజతుః । తయోర్నేత్రకటాక్షైశ్చ భిన్నమర్మస్థలా నృపాః ॥ ౨౫ ॥ బభూవుర్వికలాస్సర్వే కామబాణైర్వికీలితః । స్త్రీవత్ప్రదారాభిరేకమణ ఉత్కంఠోద్ధతాలంకాః ॥ ౨౬ ॥ సభాంతాం చంపికా నామ్నా వహ్నికోణాద్వివేశ హ । ఈశకోణాచ్చ సుమతి స్సభాంతాం సంవివేశ హ ॥ ౨౭ ॥ అథోపమాతా వృద్ధా సా ధృతహస్తాగ్రయష్టికా । సభాయాం చంపికా నామ్నే దక్షిణస్థాన్ పృథక్ పృథక్ ॥ ౨౮ ॥ క్రమేణ వర్ణయామాస నందా నృపతిసత్తమాన్ । తథాన్యా చ సభాగ్రాచ్చ ధృతహస్తాగ్రయష్టికా ॥ ౨౯ ॥ సునందాఖ్యాతి జరఠా సుమత్యై నృపతీన్ క్రమాత్ । వర్ణయామాసోత్తరస్థాన్ సుపమాతా పృథక్ పృథక్ ॥ ౩౦ ॥ అథ సా చంపికాం ప్రాహ నీత్వా తాం నృపతేః పురః । శిబికాస్థాం చోపమాతా నందా చామరవీజితాం ॥ ౩౧ ॥ రాజకన్యే చంపికే త్వం శృణుష్వ వచనం మమ । ఏనం నృపం వర్ణయామి పశ్య త్వం మదనోపమం ॥ ౩౨ ॥ పాండ్యోయం మతిమాన్నామ్నా నాగపత్తనసంస్థితః । శూరో రక్షన్ నృపశ్రేష్ఠః ప్రజాపాలనతత్పరః ॥ ౩౩ ॥ యది తే రోచతే చిత్తే వరయైనమనుత్తమం । అస్య త్వం మహిషీ భూత్వా నాగపత్తనసంస్థితా ॥ ౩౪ ॥ క్రీడస్వ ముదితానేన సప్రాసాదరాజిషు । నందోక్తం చంపికా శ్రుత్వా వ్యర్థం

గా నాసభాంగణమునకు భూరికీర్తియొక్క మనుమరాండ్రిరువురును దివ్యాలంకారముల నలంకరించికొని నవరత్నమాలికలను చేతఁబట్టికొని పల్లకీలనెక్కి ప్రవేశించిరి. ఇట్లువచ్చి సభాగ్రమున విరాజించుచుండు నాబాలికలయొక్క కటాక్షంబులచే నచ్చటి రాజులందఱును వికలిత మర్మస్థలులును వికలచిత్తులునై పెదవెలారి గొంతుయెండి యప్పాడెంతమాత్రము సుఖమునందినవారుకారు. చంపికయనుకన్య ఆగ్నేయ దిగ్భాగమునుండి సభను ప్రవేశించెను. సుమతియను సుకుమారి యీశాన్య దిగ్భాగమునుండి సభను ప్రవేశించెను. అంతముసలిదియైన యుపమాత నందయనునది చేతకఱ్ఱనూనుకొని వెంటవచ్చుచు చంపికకు దక్షిణభాగముననున్న రాజులను వేర్వేఱుగా వర్ణించిచెప్పుచుండెను. అట్లే యుత్తరభాగంబున సునందయనునుపమాత దండావలంబితహస్తయై సుమతికి నృపులనభివర్ణించి చూపుచుండెను ॥ ౩౦ ॥ పిదప

నందయనునది చంపికకు రాజుల నభివర్ణించి చూపుట.

పల్లకీనెక్కి చామరవీజితయై యుండెడు చంపికను నంద యొకరాజుముందర నిలిపి, "రాజపుత్రీ! ఇచ్చట నామాటవినుము. ఈరాజును వర్ణించెదను. ఇతఁడు కామునివంటివాఁడు, మతిమంతుఁడను పేరుగలవాఁడు, పాండ్యనాథుఁడు, నాగపత్తనమున వసించును, శూరుఁడు, ప్రజాపాలననిపుణుఁడైన రాజేంద్రుండు, నీకు మనస్సు ఒప్పితే ఇయ్యనుత్తమునివరింపుము. వీనికి నీవు రాణివై నాగపత్తనంబున మేడలమీఁద క్రీడింపుము." అని చెప్పగా నానిపుణయగు చంపిక నంద పలికిన యనుత్తముఁడను మాటచే వీఁడు వ్యర్థుఁడనియెంచి (వీనికన్న నుత్తముఁడు లేని

వాక్యమనుత్తమం ॥ ౩౫ ॥ నబబంధమనస్తస్మిన్నృపతౌ సుతిమత్తరీ । చోదయామాస నందాం తాం చాగ్రేగంతుం నృపాంతరం ॥ ౩౬ ॥ తదాన్యం నృపతిం నందా నీత్వా తాం శిబికాస్థితాం । చంపికాం ప్రాహ వేగేన పశ్యైనం బాలికే నృపం ॥ కలింగవిషయస్థోయం నామ్నా హేమాంగదో మహాన్ । కోటిశో వారణేంద్రాణాం యస్య గండస్థలాదిషు ॥ ౩౭ ॥ ముక్తాజాలాతిరుచ్చాళ్చ రాజంతే కమలాననే । అస్య త్వం మహిషీ భూత్వా గవాక్షైస్సాగరస్య చ ॥ ౩౮ ॥ పశ్యంతీ కౌతుకం బాలే కరోషి క్రీడనాదికం । అస్యస్త్రీవృందముఖ్యా త్వం భవ ముఖ్యా ద్యకవ్యకే ॥ ౪౦ ॥ ఇత్యుక్త్వాపి తయా తన్వీ నందయా చంపికా నృపే । తస్మిన్ మనో నబబంధాన్యం గంతుం తామచోదయత్ ॥ ౪౧ ॥ సపత్నీభయమాలక్ష్య సపత్నీకస్త్యజిష్యతి । అమహానితి వాక్యేన నందయా సూచితాపి సా ॥ ౪౨ ॥ తతోన్యం నృపతిం గత్వా నందా ప్రాహ చంపికాం । పశ్యైనం నృపతిం ముగ్ధే హారిద్వారనివాసినం ॥ ౪౩ ॥ నీపాన్వయసముద్భూతం వ్యాఘ్రాంబావనిశాకరం । యజ్ఞానాం నృపతేరస్య కీర్త్యా జగతి మండలే ॥ ౪౪ ॥ యజ్ఞకీర్తిరితి ఖ్యాతః పృథ్వీశః ప్రమదాప్రియః । వరయైనం నృపం పుత్రి దివ్యభూషణభూషితం ॥ ౪౫ ॥ అస్యాద్య మహిషీ భూత్వా గంగావీచిపరంపరాః । నౌకాస్థా పశ్య నిత్యం హి వరయైనం నృపోత్తమం ॥ ౪౬ ॥ అస్య పత్నీవరిష్ఠా త్వం భవ మాగ్రే వ్రజాబలే । ఇత్యుక్త్వాపి తయా తస్మిన్నబబంధ నిజం మనః ॥ ౪౭ ॥ త్వం వరిష్ఠా మా భవేతి నందయా గ్రే ప్రజేరితా । చోదయామాస సా నందాం మగ్రేగంతుం

వాఁడు అనుత్తముఁడు అనగా సర్వోత్తముఁడనియును, ఉత్తముఁడు కానివాఁడ నుత్తముఁడనగా వ్యర్థుఁడనియును రెండర్థములు స్ఫురించుచున్నది.) వానిని మోహింపక వేఱొక భూపతి యెదుటకు పొమ్మని నందనుఁ బ్రేరించెను. అప్పుడు నంద యింకొక రాజువద్దికి పోయినిలచి చంపికతో “వరవర్ణినీ! ఈనరనాథుని నిరీక్షింపుము. ఇతఁడు కళింగదేశమునందుండు హేమాంగదుఁడను మహామహారాజు. కమలముఖీ! ఇతనియొక్క కోట్లకొలదిగాగల యేనుఁగుల గండస్థలంబులపై ముత్తెములకుచ్చులు వెలయుచుండును. వీనికి నీవు రాణివై గవాక్షంబులనుండి సముద్రముయొక్క వేడుకలను నిరీక్షించుచు క్రీడించెదవుగాక. వీనియొక్క ప్రియురాండ్రనడుము నీవే ముఖ్యురాలవై యుందుము.” అని పలుకగా, నాచంపిక పెక్కండ్రు పత్నులుగలవాఁడు ఎన్నఁడైనను త్యజించునను భీతిచేతను మహామహారాజను మాటచే గొప్పవాఁడు కాఁడనియును నందావాక్యసూచనను గ్రహించి వానియందు మనస్సును నిలుపలేదు. అంత మఱియొక రాజువద్దికివచ్చి నంద యిట్లనియె—“నవమోహనాంగీ! ఈనరేంద్రుని నీక్షింపుము. ఇతఁడు నీపవంశమునకు సముద్రమునకు చంద్రునివలె వర్ధకుఁడు, హారిద్వారనివాసి, ఈరాజు చేయునట్టి యజ్ఞములవలన గలిగినకీర్తిచే నితనికి యజ్ఞకీర్తియనుపేరు గల్గినది. ఇతఁడు విలాసినీ వినోదపరుఁడు. దివ్యాలంకృతుఁడగు నీరాజును నీవు వరింపుము. ఇవుడు నీవితనికి పత్నివై పదపడిమీఁదనెక్కి గంగాసంగతతరంగ మంగళవిహారంబులం బడయుచుందువు. ఇతని పత్నులలో నీవు గొప్పదానవుకావా? లోలాంబకీ! ముందాలోచింపుము.” అని వచించినను నందావాక్యముఁ

నృపాంతరం ॥ ౪౮॥ సందాస్యన్యంనృపంనీత్వా చంపికాంప్రాహవైగతిః । పశ్యైనంనృపతింముగ్ధే శూరసేనాహ్వయేవరే ॥ ౪౯ ॥ దేశేకరోతివైరాజ్యం సుషేణోయమనుత్తమః । తురగావాయువేగాశ్చ యస్యపత్న్యోమృగీదృశః ॥ ౫౦ ॥ యస్యాంగణే వారనారీ నృత్యఘోషస్త్వహర్నిశం । వరయైనంచంపికేద్య త్వాననవదాననం ॥ ౫౧॥ అస్యత్వంమహిషీభూత్వా జన్మసాఫల్యతాంవ్రజ । వారస్త్రీలంపటంశ్రుత్వా తథావాక్యమనుత్తమం ॥ ౫౨॥ సబంధమనస్తస్మిన్న్యపతౌతాంప్రచోదయత్ । అథసాచోదితానందా తయాన్యంనృపతింక్షణాత్ ॥ ౫౩ ॥ నినాయ శిబికాస్థాంతాం చంపికామాహసాదరం । పశ్యైనంనృపతింబాలే స్థితంహైహయపత్తనే ॥ ౫౪ ॥ సహస్రార్జునవంశస్య భూషణంకమలదృశం । ప్రతీపఇతినామ్నాయం ఖ్యాతశ్శూరోమహారథః ॥ ౫౫॥ వరయైనంనృపంమాన్యం గచ్ఛహంసస్వరూపిణీ । అస్యత్వంమహిషీభూత్వా రేవాయాంపతినాసహ ॥ ౫౬ ॥ కరిష్యసిజలక్రీడాం చంపికే శృణుమద్వచః । ఇత్యుక్త్వాపితయాతస్మిన్ నబబంధమనోనృపే ॥ ౫౭ ॥ వరయైనంనృపంమేతి సంవాస్యాదమహారథీ । నృపోయంచేతివాక్యద్వే శ్రుత్వావ్యర్థాణివిదుత్తమా ॥ ౫౮ ॥ ఏవంనానానృపాణాంసా వర్ణనానిపృథక్పృథక్ । శ్రుతిరూపనిషేధాని శృణ్వంతీనృపాత్మజా ॥ ౫౯ ॥ జగామశిబికాసంస్థా సనందాభరతానుజం । సుమంత్రాదీనతిక్రమ్య శ్రుత్వా శ్రీరామమంత్రిణః ॥ ౬౦॥ తతఃప్రోవాచసానందా పశ్యైనంభరతానుజం । కోసలేం

లో నితనిని నీవు పెండ్లాడితే గొప్పదానవుకావు ఆలోలాంబకీ! యనియును ముందాలోచింపుమనినందుకు మఱియొకనిని చూడుమనియును అర్థము నాలోచించి వానిని వరింపక, నందను ముందు వెడలుమని ప్రేరించెను. అంత నానంద సానందముగా మఱియొక నరపతియెదుట “సుందరీ! ఇతని నవలోకింపుము. అనుత్తముఁడగు శూరసేనదేశాధీశుఁడైన సుషేణుఁడను రాజేంద్రుఁడితఁడు. ఇతని గుఱ్ఱములు వాయువేగంబులు. హరిణాక్షులితనికాంతలు. ఇతని యింట నెల్లప్పుడును భోగము వాండ్రాడుచుందురు. నీముఖమువంటి ముఖముగలవీనిని వరింపుము. నీవు వీనికి సతివై జన్మసాఫల్యత నందుము.” అని నొక్కి వక్కాణించిన నావాక్యములచే చంపిక, వీఁడుత్తముఁడు కాడనియును గణికాలోలుఁడనియును గ్రహించి, వానిని హృదయంగమునిం జేసికొనక వేఱొకచోటకు పొమ్మని నందను ప్రేరించెను. అంత నప్లె యామె యింకొక నృపుని సన్నిధికిఁజని “కన్యామణీ! వీనిని విలోకింపుము. హైహయ రాజధానియందుండు వాఁడితఁడు. కార్తవీర్యార్జునిని వంశమున కలంకారభూతుఁడు. కమలములవంటి నేత్రములుగలవాఁడు. ఇతనిపేరు ప్రతీపుఁడు. పరమమహారథుఁడును శూరుఁడనై ఖ్యాతి నందియున్నాఁడు. సప్రేమ మన్యుని (ప్రేమమన్యుఁడు=ప్రణయకోపరసికుఁడు) వరింపుము, మానినీ! వీనికి నీవు ప్రేయసివై రేవానదిలో బతితోడ జలక్రీడనాచరించెదవు. చంపికా! నామాటవినుము.” అని పలుకగా, నామె పరమమహారథుఁడనుచోట పరము అమహారథుఁడనియును సప్రేమము అన్యుని వరింపుమని యర్థమును గ్రహించి, నాకు వీఁడు వలదు, ముందుకు పొమ్మని నందను ప్రేరించెను. ఇట్లు

ద్రస్యరామస్య బంధుమేకోదరోపమం ॥ ౬౧ ॥ అయోధ్యావాసినం రామ రాజవాక్యానువర్తినం । వరయైనం చంపికేద్య శ్రుతకీర్త్యాః స్వసా భవ ॥ ౬౨ ॥ ఇత్యుక్త్వాపి తయా తస్మిన్ శత్రుఘ్నే [illegible]మానసం । నబబంధభ్రూవాహం జ్ఞా మగ్రేగంతుం చకార తాం ॥ ౬౩ ॥ తతస్సా భరతం నీత్వా నందా తామాహ మంజులం । శత్రుఘ్నస్యాగ్రజం చైనం కైకేయ్యా జఠరోద్భవం ॥ ౬౪ ॥ రామసేవారతం శాంతం యువానం దయితాప్రియం । వరయైనం బాలికేద్య మాండవ్యా సరయూజలే ॥ ౬౫ ॥ కరిష్యసి జలక్రీడాం నౌకాస్థా భరతేన హి । తతస్తత్సంజ్ఞయా నందా లక్ష్మణం చంపికాం జవాత్ ॥ ౬౬ ॥ నీత్వా సౌమిత్రికీ తీరం తాం వగాయామాస సాదరం । పశ్యైనం లక్ష్మణం బాలే సుమిత్రాజఠరోద్భవం ॥ ౬౭ ॥ అయోధ్యావాసినం రామ సేవారక్తం మనోహరం । వరయైనం చంపికేద్య మేఘనాదప్రమర్దనం । శేషాంశసంభవం వీరం చోర్మిళాయాః స్వసా భవ ॥ ౬౮ ॥ సర్వాన్ శ్రుత్వా రామసేవా రక్తాన్ పత్నీయుతానపి । ఛత్రచామరహీనాంశ్చ రోచయామాస తాన్న సా ॥ ౬౯ ॥ తతస్తత్సంజ్ఞయా నందా శ్రీరామాగ్రే స్వయంవరాం । నీత్వా తామాహ మధురం స్తోతుం తం రఘునందనం ॥ ౭౦ ॥ మహాత్తే చంపికే దైవ మేనం శ్యామరాఘవం । ధన్యాహమపి యా రామం దృష్ట్వా స్తోతుం పురః స్థితా ॥ ౭౧ ॥ క్వాహం మందమతిర్నారీ క్వ రామో గుణసాగరః । నాహం తత్ స్తవనే శక్తా వాల్మీకిర్యత్ర కుంఠితః ॥ ౭౨ ॥ శతకోటిమితైః శ్లోకైశ్చరిత్రం రాఘవస్య హి । మునినా వర్ణితం తచ్చ శత

---

చంపకాదేవి నందయను నుపమాత స్తుతించునట్లును వేంటనే నిషేధించునట్లునుకూడ వెవ్వేఱుగా రాజుల నభివర్ణించుచుండగా నందతి నతిక్రమించి 'శ్రీరామమంత్రులని విని సుమంత్రాది మంత్రులను విడలి, పల్లకీమీఁదుగావచ్చి శత్రుఘ్నుని యెదుట నిలిచెను. అపుడు నంద "రాజపుత్రి! భరతానుజుఁడును కౌసల్యా నందవర్ధనుండగు శ్రీరాముని తమ్ముఁడును అన్నలతోనే కోదరునివలె బరగువాఁడును అయోధ్యా వాసియును రామరాజుయొక్క వాక్యానువర్తియును అగునీ శత్రుఘ్నస్వామిని వరింపుము, ఇతని భార్యయగు శ్రుతకీర్తికి చెల్లెలైయుండు" మని చెప్పగా, నాచంపిక శత్రుఘ్నునిపై కటాక్షములనునపక ముందుకువెడలెను. అంత నానంద భరతునియెదుట చంపకనుమాచి "కన్యారత్నమా! కైకేయియొక్క గర్భమున నుద్భవించినవాఁడును శత్రుఘ్నుని కన్నయును శ్రీరామసేవారతుండును శాంతుఁడును తరుణుఁడును ప్రేయసీ ప్రియుఁడునగు నీభరతప్రభువును వరింపుము. సరయూనదిలో నౌకనెక్కి మాండవీదేవియును నీవును భరతునితోడ జలక్రీడా మహోత్సవము నందగలవు." అని యభివర్ణించి పలికి చంపిక యతనిని మోహింపక విముఖయైయుండ నచ్చటినుండి లక్ష్మణస్వామి యుండెడు సింహాసనము వద్దికి వచ్చి చంపికనుచూచి "బాలామణీ! ఈమహానుభావునిని సిరీక్షింపుము. ఇతఁడు సుమిత్రానందనుఁడు. అయోధ్యావాస్తవ్యుఁడు, శ్రీరామసేవాపరాయణుఁడు మనోహరాకారుఁడు, ఇంద్రజిత్సంహారకుఁడు, శేషాంశసంభవుండు నయిన యితనిని వరించి యూర్మిళాదేవికి చెల్లెలయి యుండుము." అని వచించెను. చంపక యంతటినివిని శ్రీరామసేవార

కోట్యంశవర్ణితం ॥ ౭౩ ॥ తస్యాహంవర్ణనంకించి త్కరోమియత్ శృణుష్వతత్ | సూర్యవంశభూషణంశ్రీద శరథనృపాత్మజం ॥ ౭౪ ॥ కౌసల్యాతనయంరామం సాక్షాన్నారాయణంవిభుం | తాటికాంతకరంవీరం గాధిజాధ్వరపాలకం ॥ ౭౫ ॥ అహల్యోద్ధారిణంశ్రేష్ఠం శివచాపైకఖండనం | జానకీవల్లభంరామం జామదగ్న్యదర్పావలం ॥ ౭౬ ॥ నృపవృందైకజేతారం భరతప్రాణదాయినం | తాతాజ్ఞాపాలకంభ్రాత్రా సీతయారణ్యవాసినం | విరాధమర్దనంశ్యామం ఖరదూషణమర్దనం ॥ ౭౭ ॥ త్రిశిరామృగమారీచ కబంధవాలిమర్దనం | సముద్రబంధనంలంకా రాక్షసాంతకరంప్రభుం ॥ ౭౮ ॥ రావణాంతప్రకర్తారం సీతయారాజ్యకారిణం | తీర్థయజ్ఞప్రకర్తారం సీతాక్రీడనతత్పరం ॥ ౭౯ ॥ జానకీత్యాగకర్తారం సీతాగ్రహణతత్పరం | కుశలవాత్మజాభ్యాంచ వాజ్యర్థం యుద్ధకారిణం ॥ ౮౦ ॥ ఏకపత్నీవ్రతంశాంతం సత్యభాషణతత్పరం | ఏకబాణసమాఖ్యాత నామానంమారుతిధ్వజం ॥ ౮౧ ॥ కోవిదారధ్వజంబాణ ధ్వజంవజ్రధ్వజంశుభం | తార్క్ష్యధ్వజంపుష్పకస్థం తార్క్ష్యవాయుజవాహనం ॥ ౮౨ ॥ నానారాజావతంసస్థ ముక్తాదీప్త్యంఘ్రిశోభితం | వరసింహాసనాసీనం ఛత్రచామరమండితం ॥ ౮౩ ॥ వరయేనం

క్తులు వీరు పత్నీసమేతులును ఛత్రచామరరహితులునుగాన వీరు నాకు వలదని నందకు సంజ్ఞ జేసెను. అంత నానంద స్వయంవరయగు చంపికను శ్రీరామసన్నిధానమున నిలిపికొని రఘురాముని నిట్లు స్తుతించెను ఓసిచంపికా! నీవు మహాత్ముండైన సాక్షాద్దేవునిగా నీశ్రీరాముని దర్శించుచున్నావు. ఈశ్రీరాముని నిల్లెదుటనిలిచి స్తుతించుటచే నేను కృతకృత్యురాలుగానున్నాను. అయిన మందమతియగు నేనెక్కడ? సుగుణసాగరుండగు శ్రీరామచంద్రుండెక్కడ? శ్రీవాల్మీకిమహామునిగూడ నెవనిని వర్ణించుటలో నశక్తుండయ్యెనో నేనతనిని వర్ణించుటకుశక్తురాలనుకాను, ఆమునీంద్రుండు శతకోటి శ్లోకములచే నారామచంద్రునిచరిత్రము నభివర్ణించె నప్పటికిని నామహాత్ముని యనంతమహిమవర్ణనమున నూటిలోనొకపాలుకాదు. అట్టి స్వామిని కొంచమభివర్ణించి చెప్పెదనువినుము. రవికులరత్నంబు, దశరథనందనుండు, కౌసల్యానందవర్ధనుఁడు, సాక్షాన్నారాయణుఁడు, స్వయంవిభువగువాఁడు, తాటికాసంహారకుఁడు, మహావీరుఁడు, విశ్వామిత్రయజ్ఞరక్షకుండు, అహల్యాపాపవిమోచకుఁడు, శ్రీకంఠచాపఖండనుఁడు, వైదేహీవల్లభుఁడు పరశురామగర్వభంజనుఁడు, జితరాజలోకుఁడు, భరతప్రాణరక్షకుఁడు, పితృవాక్యపరిపాలకుఁడు, సీతాలక్ష్మణులతోడ నరణ్యమున వసించినవాఁడు, విరాధసంహారకుఁడు, ఖరదూషణవిమర్దనుఁడు, త్రిశిరునిని మారీచమృగములను కబంధునిని వాలిని సంహరించినవాఁడు, సముద్రమునకు సేతువును కట్టించినవాఁడు, లంకారాక్షసాంతకుఁడు, మహాప్రభు, రావణుని సంహరించినవాఁడు, సీతతోడ రాజ్యమేలువాఁడు, తీర్థాటనయజ్ఞాచరణ నివర్తకుఁడు, జానకీఖేలనాసక్తుఁడు, జానకీదేవిని లోకులకు లోకాపవాదభీతిని చూపువానివలె పరిత్యజించి ప్రతిజ్ఞావశమున పరిగ్రహించినవాఁడు, కుశలవులను పుత్రులతోడ నశ్వమేధాశ్వముకొఱకు యుద్ధము నాచరించినవాఁ

చంపికేద్య సీతయా భజ రాఘవం । నవవర్షాణ్యాయం సప్తద్వీపాధిపో౽పి చ ॥ ౮౪ ॥ బాణః పత్నీ వచో౽యస్య నాన్యం మా ఖేదమాచర । నవరత్నమాలికామస్య గ్రీవాయాం కురు మా వ్రజ ॥ ౮౫ ॥ ఇత్యుక్త్వా నందయా బాలా స్వల్ప పుణ్యా విధేర్వశాత్ । నిబబంధ మనో రామే సీతాం సంస్పృశ్య చంపికా ॥ ౮౬ ॥ ఏకపత్నీవ్రతం రామం సీతయా హ్య భజేతి చ । ఖేదం మాచర తత్కంఠే మాలాం మా కురు చోదితా ॥ ౮౭ ॥ తతస్తత్సంజ్ఞయా నందా తాం నినాయ కుశం ప్రతి । ప్రోవాచ మధురం వాక్యం కుశ బాలకమాశ్రితా ॥ ౮౮ ॥ ఏనం పశ్యాల్పవయసం శ్రీరామతనయం కుశం । జానకీజఠరోద్భూతం శ్రేష్ఠం భార్యార్థినం శిశుం ॥ ౮౯ ॥ లవాగ్రజం ధనుర్వేద నిపుణం వినయాన్వితం । పితృసంగ్రామకర్తారం వాల్మీకిమునిశిక్షితం ॥ ౯౦ ॥ ఏనం వృణీష్వ బాలే త్వం సురమానవసంస్తుతం । నవరత్నమయీం మాలామస్య కంఠే సమర్పయ ॥ ౯౧ ॥ ఇతి నందావచః శ్రుత్వా చంపికా హాస్మితాననా । మమోచ మాలికాం కంఠే స్వా రాభ్యాం తస్య హి ॥ ౯౨ ॥ తదా నినేదుర్వాద్యాని తుష్టువుర్వందిమాగధాః । లజ్జయాధోముఖో౽శేత సభాయాం

డు, ఏకపత్నీవ్రతుఁడు, శాంతుఁడు, సత్యవ్రతుఁడు ఒకటే బాణము గలవాఁడని సుప్రసిద్ధమైన పేరుగలవాఁడు, బాణ వజ్రకోవిదార హనుమద్ధ్వజంబులుగలవాఁడు, గరుడధ్వజుండు, పుష్పకారూఢుఁడు, గరుడాంజనేయారూఢుఁడు, సకలరాజకిరీట నీరాజితపదారవిందుఁడు, ఇట్టి ఛత్రచామరాలంకృత దివ్యసింహాసనాసీన శ్రీరామచంద్రస్వామిని వరింపుము. చంపికా! సీతాదేవితోడ నితనిని భజింపుము. ఇతండు నవవర్షములకును నాయకుఁడు, సప్తద్వీపాధిపుఁడు, ఎవనికి బాణము పత్నిమాట ఈమూడును వేఱొకటిలేదో అట్టివీనినివదలి చింతింపకుము. నవరత్నమాలికను ఇతనికంఠమున నర్పింపుము పోవలదు." అని యభివర్ణించిన నందావాక్యములను వినినను చంపిక విధివశమున నల్పపుణ్యయగుటంజేసి "ఏకపత్నీవ్రతుఁడు, సీతతోడ భజింపుము, అర్పింపుము, పోవలదు." అను మాటల నెంచుచు శ్రీరామునియందు మనసును నిలుపకనందను ముందుకు వెడలమని సంజ్ఞఁ జేసెను. ౮౭ అంత నామె శ్రీరాముని వదలి కుశునివద్దికివచ్చి హాసన్ముఖియై చంపిక

## స్వయంవరమున చంపిక కుశుని వరించుట.

తో "చిన్నవయస్సుగల సుకుమారాంగుఁడను నీ శ్రీరామపుత్రుని జూడుము! ఇతనిపేరు కుశుఁడు, కుశలుఁడు, జానకీగర్భసంభూతుఁడు, ప్రేయసీమణి నభ్యర్థించుచుండు తరుణరత్నము, లవుని యన్నయనబడును, ధనుర్వేదనిపుణుఁడు, సుగుణసంపన్నుఁడు, శ్రీమద్వాల్మీకిమునీంద్రునిచే శిక్షనందినవాఁడు, జనకునితో సంగ్రామమొనర్చినవాఁడు, సురనరవందితుండగు నితనిని వరింపుము. నవరత్నాలంకృతమాలిక నితనికంఠమున కలంకరింపుము." అనిన నందావాక్యములను విని సానందయగు చంపిక స్మితముఖియై కుశుని కంఠమున రెండుచేతులతో నారత్నమాలిక నర్పించెను. అపుడు మంగళవాద్యములు మ్రోగినవి. వందిమాగధులు పొగడిరి. బాలకుండగు కుశుఁడు లజ్జచేత నవనతముఖుఁడై విరాజించుచుండెను. అపుడు రాజులందఱును నిరీక్షించు

కుశబాలకః ॥ ౯౩ ॥ తదాతుష్టా భూరికీర్తిః కుశాంకే చంపికాం శుభాం । స్థాపయామాస వేగేన పశ్యత్సు నృపతిషు చ ॥ ౯౪ ॥ దదర్శ జాలరంధ్రస్థం ప్రాసాదస్థా విదేహజా । ముమోద నితరాం స్త్రీభిర్ముమోద రాఘవోఽపి సః ॥ ౯౫ ॥
ఇతి శ్రీమదానందరామాయణే వాల్మీకీయే వివాహకాండే చంపికాస్వయంవరో నామ ద్వితీయస్సర్గః ... ౨ ॥

శ్రీరామదాస ఉవాచ — అథాన్యా సా సభాగ్రాచ్చ సుమతిముత్తరస్థితాం । నృపానీశానదిగ్భాగాత్ప్ర శరదా ధృతయష్టికా ॥ ౧ ॥ క్రమేణ వర్ణయామాస శిబికాస్థాం సులోచనాం । బాలే శృణుష్వ మే వాక్యం పశ్యైనం త్వం నృపోత్తమం ॥ ౨ ॥ అవంతిస్థం చోగ్రబాహుం నామానం చ వ్యనుత్తమం । నానేన సదృశః కశ్చిత్ పృథివ్యాం వర్తతే నృపః ॥ ౩ ॥ వరయైనం నృపం చాగ్రే గచ్ఛ త్వం గజగామిని । అస్య త్వం మహిషీ భూత్వా శిప్రానద్యాస్తు సైకతే ॥ ౪ ॥ వస్త్రాగేహస్థితానేన సుఖం క్రీడస్వ భామిని । అనుత్తమం చేతి వాక్యం ద్వ్యర్థం సా సుమతిః పురా ॥ ౫ ॥ శ్రుత్వా మైనం వరయేతి సునందాయా వచః స్ఫుటం । శ్రుత్వా తాం చోదయామాస సా తాం నీత్వా నృపాంతరం ॥ ౬ ॥ సునందా సుమతిం ప్రాహ పశ్యైనం త్వం నృపం వరం । అంగనాథాహ్వయం శ్రేష్ఠం విదర్భవిషయస్థితం ॥ ౭ ॥ పూర్వవత్త్యజ బాలే మా వృణీష్వైనం నృపోత్తమం । శ్రీరామం స్వల్పవయసం భుజకేయూరరాజితం ॥ ౮ ॥ అస్య త్వం మహిషీ భూత్వా పయోష్ణీజలవీచిషు । సుఖం కురు జలక్రీడాం నృపేణానేన భామిని ॥ ౯ ॥ ఏవం వృణీష్వ మా చేతి వాక్య

చుండగా నానందతుందిలుఁడైన భూరికీర్తి త్వరగావచ్చి చంపికాకన్యకను కుశుని తొడమీఁద కూర్చుండఁబెట్టెను. మేడమీఁదనున్న సీతాదేవి జాలరంధ్రములనుండి స్త్రీలతోడ మిగుల నానందించెను. శ్రీరాముఁడును మిక్కిలిసంతసించెను. ... ... ... ౯౫

సుమతికి స్వయంవర మంటపమున సునంద రాజులనభివర్ణించి చూపుట.

అటువెనుక దండధారిణియైన సునందయను పేరుగలయుపమాత పల్లకిలోపలనుండు సుందరియగు సుమతికి నీశాన్యదిగ్భాగమునుండి యుత్తరపార్శ్వమునగల రాజులనందఱినిచూపుచు నొకరాకొమరుని యెదుటనిలచి, సుమతితో "నామాట వినుము నారీమణీ! ఉగ్రబాహువను పేరుగలవాఁడితఁడు అవంతీనివాసుఁడై యనుత్తమనృపోత్తముఁడై యున్నాఁడు. పుడమిని వీనితోసమానమైన రాజులేడు. మంచిది యీరాజును వరించుట, యేల ముందుకుపోదువమ్మా! వీనికి నీవుప్రియురాలవై శిప్రానదియొక్క సైకతభూములలో పటగృహనివాసినివై సుఖక్రీడలనందుదువుగాక."అని మందలించగా, నాసుమతి అనుత్తముఁడనియును ఈరాజును వరించుటయేల? ముందుకు పోదువమ్మా! యనియును సునందావాక్యార్థమును గ్రహించి, ఉగ్రబాహువు నుల్లాసపరుపక వెడలెను. ఆసునంద యప్పుడు "అంగనామణీ! మఱియొక రాజునుచూడుము, శ్రేష్ఠుఁడగు నంగనాథుఁడను పేరుగల యీరాజు విదర్భదేశము నేలుచున్నాఁడు. మంచిది, పూర్వమువలె వదలుటతగదు. వీనినివరించుట బలుబాగు. చిన్నవయస్సుగల శ్రీరాముఁడితఁడు దివ్యాభరణాలంకృతుఁడై యున్నాఁడు. వీనికి నీవుపత్నివై పయోష్ణీనదిలో జలక్రీ

పద్మాత్రా సుచోదితా । అగ్రేగంతుం సునందాం సా చోదయామాస సంజ్ఞయా ॥ ౧౦ ॥ తతో౽న్యం నృపతిం నీత్వా సునందా తాం వచో౽బ్రవీత్ । పశ్యైనం నృపతిం బాలే దేశే మాగధసంజ్ఞకే ॥ ౧౧ ॥ రాజ్యం కరోత్యయం శ్రీమాన్నామ్నా ఖ్యాతః పరంతపః । వరయైనం నృపం మాగ్రే గచ్ఛాన్యం పార్థివోత్తమం ॥ ౧౨ ॥ అస్యత్వం మహిషీ భూత్వా తప్తనీరప్రపూరితే । బ్రహ్మతీర్థే సదా క్రీడాం హేమంతే భజ భామిని ॥ ౧౩ ॥ మైనం నృపం వరయేతి శిక్షితా సా సునందయా । చోదయామాస తాం వృద్ధాం సా తాన్యన్యనృపాంతరం ॥ ౧౪ ॥ సునందా బాలికామాహ శ్రుణుష్వ మృగలోచనే । పశ్యైనం నృపతిం రమ్యం ద్రావిడే విషయే స్థితం ॥ ౧౫ ॥ కంబుకంఠాహ్వయం శ్రేష్ఠం కాంతిపుర్యాం నివాసినం । ఏనం నృపం వృణీష్వాద్య మాత్యజాస్యాన్నృపోత్తమం ॥ ౧౬ ॥ కాంతిపుర్యామనేన త్వం సర్వతీర్థే మనోరమే । క్రీడాం భజస్వ విస్తీర్ణే హేమకంజవిరాజితే ॥ ౧౭ ॥ విష్ణుం వరదరాజాఖ్యం శివమేకాంబరాహ్వయం । పూజయస్వ సదానేన కంబుగ్రీవనృపేణ చ ॥ ౧౮ ॥ వృణీష్వైనం నృపం మాద్య సామాన్యనృపవత్త్యజ । ఇతి వృద్ధావచః శ్రుత్వా గ్రే తాం గంతుం ప్రచోదయత్ ॥ ౧౯ ॥ సునందాన్యం నృపం నీత్వా సుమతిం వాక్యమబ్రవీత్ । పశ్యైనం నృపతిం ముగ్ధే మత్తమాతంగగామిని ॥ ౨౦ ॥ కర్ణాటవిషయస్థం త్వం విజయం పార్థివోత్తమం । కమలాస్యం కంజహస్తం కమలాంఘ్రిం సముజ్జ్వలం ॥ ౨౧ ॥ స్మితాస్యం కంజనయనం విజయాఖ్యం పురఃస్థితం । శ్రుణుష్వ వచనం మేద్య వృణీ

---

డా మహోత్సవమునంది యానందింపుము" అని చెప్పగా సుమతి యొక్క మాటలలో, మంచిది పూర్వమువలె వదలుట. తగదు వీనిని వరించుట బలుబాగు! అని వ్యతిరేకార్థమయిన సూనందాసూచనేరు తెలిసికొని, విముఖయై సునందను ముందుపొమ్మని సంజ్ఞచేసెను. అంత నింకొక భూపతివద్దికిఁజని యచ్చట సునంద సుమతితో "మానినీమణీ! మగధదేశాధిపుండైన శ్రీమన్నాముఁడైన మహీపతి నితని నవలోకింపుము. ఇతఁడు శూరుండు. మంచిది వీనిని వరించుట. వల యింకొక పార్థివోత్తమునిం జూతము? వీనికి నీవిల్లాలవై వేడినీళ్లతోనిండిన బ్రహ్మతీర్థములో హేమంతమున నెల్లప్పుడును క్రీడించుచుందువు." అనివచించెను. ఈమాటలలో "మంచిది, వీనినివరించు టేల? ఇంకొక పార్థివోత్తమునింజూతము." అనెడు సునందాభిప్రాయము నంగీకరించి, నృపాంతరము నవలోకింప నుద్యమించెను. అంత నావృద్ధయగు సునంద మఱియొక మహీపతివద్దికివచ్చి నిలిచి "బాలామణీ! భావింపుమితనిని, కంబుకంఠుఁడను నితఁడు ద్రవిడదేశాధీశుఁడు. కాంతిపురిలో నితని నివాసంబు. కనకకమలవిరాజితంబగు సర్వతీర్థంబను సరోవరంబున నితనితోడ విహరింపుము. వరదరాజనువిష్ణుమూర్తిని ఏకామ్రనాథుఁడను సాంబమూర్తిని ఈ రాజుతోఁగలసి సేవించెదవుగాక. ఈనృపుని నీవువరించుట మేలుకాదు సామాన్యరాజునుగానెంచి విడుచుటబాగు." అనిన వృద్ధావచనములువిని భావగ్రాహిణియగు భామామణి ముందుకు పోవ నాసునందను ప్రేరించెను. అట్లే సునంద యింకొకరాజువద్దికిపోయి సుమతితో నిట్లనెను— "మదగజగామినీ! ఈనరేంద్రు నవలోకింపుము. ఇతఁడు కర్ణాటదేశమునందుండు విజయుఁడన

హ్యైవసంస్పృహో త్తమం ॥ ౨౨ ॥ అస్యత్వంమహిషీభూత్వా వసేః కృష్ణానదీజలే । సుఖంస్వపేణక్రీడస్వ మద్వాక్యంశ్రుణుమావ్రజ ॥ ౨౩ ॥ మద్వాక్యంశ్రుణుమేత్యుక్త్యా శ్రుత్వావాక్యమనుత్తమం । వ్రజేతిసూచితాబాలా చోదయామాసతాంపునః ॥ ౨౪ ॥ ఏవంనానానృపాణాంచ వర్ణనానిపృథక్ పృథక్ । స్తుతిరూపనిషేధాని శ్రుత్వావ్యర్థానిబాలికా ॥ ౨౫ ॥ నబబంధమనఃకస్మిన్నృపతౌ తేషుసాతదా । తతస్తాంశిబికాహస్తాం సునందాసాశనైఃక్రమాత్ ॥ ౨౬ ॥ అగ్రేత్యక్త్వారామమంత్రి బాలకానపిపూర్వవత్ । యూపకేతుంశిశుంనీత్వా బాలికాంవాక్యమబ్రవీత్ ॥ ౨౭ ॥ శత్రుఘ్నతనయంబాలం యూపకేతుంమనోహరం । పితృవ్యరామతనయ ద్వయవాక్యానువర్తినం ॥ ౨౮ ॥ ఏనంపశ్యబాలికేత్వం సావధానమనాథవ । వరయైవంయూపకేతుం మాగ్రేగచ్ఛనృపాత్మజే ॥ ౨౯ ॥ మైనంవరయగచ్ఛాగ్రే వద్ధయాసేతిచోదితా । సునందాంచోదయామాసా ఉగ్రేగంతుంసుమతిఃపునః ॥ ౩౦ ॥ సుబాహుంపుష్కరంతక్షమేవంసాసుమతిశ్శనైః । చిత్రకేతుమంగదంచ త్యక్త్వాసాతంలవంయయౌ ॥ ౩౧ ॥ లవార్పితేక్షణాంబాలాం సునందావాక్యమబ్రవీత్ । పశ్యైనంబాలికేబాలు లవంశ్రీరాఘవాత్మజం ॥ ౩౨ ॥ స్త్రీకామం

---

రాజు. విజయమ్ముగలవాఁడు, పంకజవక్షుఁడు, కంజనేత్రుఁడు, కమలచరణుఁడు, హాసన్ముఖుఁడు, నీయెదుటనున్న యీనృపునివరింపుము. ఈయనుత్తమునికి నీవుసతివై కృష్ణానదిలోవిహరింపుము. నామాటవినవలదా? ప్రక్కకుపొమ్ము;" అనిపలుకగా నాసుమతి సునందావచనములలో "నామాటవినవలదు, అప్రక్కకుపొమ్ము." అని తాత్పర్యము నాలోచించి ముందుకుపొమ్మని మరలసూచించెను. ఇట్లే అనేకరాజులయొక్క వర్ణనలను వేర్వేఱుగావిని "వాటిలో స్తోత్రరూపంబులును నిషేధకంబులునయిన రెండర్థములుగు వాక్యంబులచే మనంబొప్పక యందఱినివదలి వెడలెను. అంత నాపల్లకిని సునంద తిన్నగాతీసికొని శ్రీరామమంత్రి పుత్రులనతిక్రమించివచ్చి యూపకేతువను శత్రుఘ్నపుత్రుని యెదుటనిలిచి సుమతితో "సుందరీమణీ! మనోహరాకారుండగు యూపకేతువను శత్రుఘ్నస్వామి పుత్రునింజూడుము. ఇతఁడు పెత్తండ్రికొడుకులగు కుశలవుల వాక్యానుసారము ప్రవర్తించువాఁడు. బిడ్డా! వీనినిచూచి సమాహితచిత్తయగుము. రాజపుత్రీ! ఈయూపకేతువును వరించునది. యేలముందుకుపోవలెను?"అనిసుందరించెను. ఆసునందావాక్యమున "నీ యూపకేతువును వరించునదియేల?ముందుకుపోవలె"నని గూఢార్థమునెఱిఁగి సుమతి యతనినొప్పక ముందుపొమ్మని సునందకు సూచించెను. ఇట్లే శత్రుఘ్నుని జ్యేష్ఠపుత్రుఁడగు సుబాహువును భరతుని ద్వితీయపుత్రుఁడగు తక్షునిని, భరతుని ప్రథమ సుతుఁడగుపుష్కరునిని, లక్ష్మణుని ద్వితీయపుత్రుండయిన చిత్రకేతువును, లక్ష్మణునిజ్యేష్ఠనందనుఁడయిన అంగదునిని, వదలి లవునిమీఁద కటాక్షంబులనునచి నిలిచెను. ॥ ౩౧ ॥ అప్పు

సుమతియను రాజపుత్రి స్వయంవరమున లవునివరించుట.

డు సునంద లవస్యస్తాపాంగయగు సుమతితో "కామినీమణీ! కటాక్షింపు మీశ్రీరామనందనుం

స్వల్పవయసం సీతాలాలితముత్తమం । వాల్మీకికృపయాలబ్ధ విద్యం రమ్యం కుశానుజం ॥ ౩౩ ॥ వృణీష్వైనం మహాభాగే త్వ
వః కంఠేస్య మాలికాం కురు । కుశాంకే చంపికేయం తే స్వసా యద్వత్ స్థితా ద్యహి ॥ ౩౪ ॥ తథా త్వమపి భో ముగ్ధే ల
వాంకే సంస్థితా భవ । ఇతి తస్యాః వచః శ్రుత్వా సునందాయాః స్మితాననా ॥ ౩౫ ॥ లవస్య కంఠే హర్షేణ లజ్జయా
వనతాననా । సుమతిః స్వజబాహుభ్యా మర్పయామాస మాలికాం ॥ ౩౬ ॥ తదా నినేదుర్వాద్యాని జగుస్తే గాయ
కాస్తదా । ననృతుర్వారనార్యశ్చ తుష్టువుర్వందిమాగధాః ॥ ౩౭ ॥ భూరికీర్తిః నృపస్తుష్టో లవాంకే సుమతిం తదా
శీఘ్రం న్యవేశయామాస పరిపూర్ణమనోరథః ॥ ౩౮ ॥ తోషమాప రఘుశ్రేష్ఠ స్సీతా ప్రాసాదసంస్థితా । జాలరం
ధ్రైస్సపత్నీకం లవం దృష్ట్వా తుతోష సా ॥ ౩౯ ॥ తతస్సర్వాన్ నృపాన్ పూజ్య భూరికీర్తిర్నృపోత్తమః । ప్రార్థ
యామాస వినయ వచనైస్తత్పురః స్థితః ॥ ౪౦ ॥ వివాహకౌతుకం దృష్ట్వా భవద్భిర్గమ్యతామితి । తథేతి తే నృపాః
ప్రోచుర్యయుర్వా స్వస్థలాని హి ॥ ౪౧ ॥ రామాగ్రే సంగరం కర్తుమసమర్థా గతశ్రియః । మ్లానాననా గతోత్సాహాః
కామబాణప్రపీడితాః ॥ ౪౨ ॥ రామోపి బంధుభిర్బాలై ర్యయా వాసస్థలం ముదా । అథాపరేః సేరామం భూరి

డయిన లవుండను సుందరాంగునిఁ. ఇతఁడు చిన్ని ప్రాయముగలవాఁడు, శ్రీ కుతూహలచిత్తుఁ
డు, జానకీదేవిచే లాలింపఁబడుచుండువాఁడు, శ్రీమద్వాల్మీకియొక్క దివ్యానుగ్రహముచే సక
లకలాకుశలుఁడై బరగుచుండు. కుశునితమ్ముఁడితఁడే దివ్యమోహనాంగుఁడు. సుఖముగా నీవిత
నిని వరింపుము. ఇతని కంబుకంఠంబున రత్నమాలిక నర్పింపుము. కుశునియంకముమీఁద నీ
యక్క చంపిక ప్రకాశించుచుండునట్లు ఇప్పుడితనియంకమున నీవును ప్రకాశించుదానవు." అని
నొక్కివక్కాణించెను. అంత నక్కాంతామణి హసన్ముఖియై లవునికంఠమున నవరత్నమాలి
కను శిరీషమాలికలవంటి నిజసుకుమార బాహువులచే నర్పించెను. అప్పుడచ్చట మంగళమ్ము
హావాద్యంబులు మ్రోగెను. గాయకులు గానములం జేసిరి. వారకాంతలు నర్తనమాడిరి, వం
దిమాగధులు శ్లాఘించుచుండిరి. అపుడు భూరికీర్తి మహా॰ పరిపూర్ణమనోరథుఁడై వచ్చి అను
మతిని లవాంకమున త్వరగా కూర్చుండబెట్టి, యమందానందమునందెను. నిత్యానందమూర్తి
యగు శ్రీరాముండు సంతసించెను. మేడమీఁదనున్నది జానకీదేవి జాలరంధ్రములనుండి లల
నాసమేతుఁడగు లవునింజూచి హర్షించెను॥ ౩౯ ॥ పిదప నాభూరికీర్తి మహారాజు సమస్తరాజేం

కుశలవుల వివాహ మహోత్సవాభి వర్ణనము.

ద్రులనుచూచి సంపూజించి వారియెదుటనిలిచి సవినయముగా "మహారాజులారా! నాయం
యగల్గి యీవివాహమహోత్సవమును సాంతముగాచూచి నన్నానందపరచి సత్కృతులై వెడల
వలయునని వేఁడుకొనెనుచున్నాను" అనిసంప్రార్థించెను. వారందఱును అట్లేయని యంగీకరించి
శ్రీరామునియెదుట యుద్ధము చేయనేరక నిస్తేజస్కులును నిరుత్సాహులును రామబాణప్రపీడి
తులును దీనాననులునై తమతమ విడదిండ్లనుచేరిరి. శ్రీరామచంద్రస్వామికూడ తనతమ్ములతో

కీర్తిస్సమాయయౌ ॥ ౪౩ ॥ పురోధసోపవిష్టస్స నత్వా రామం వచో౽బ్రవీత్ । ద్రష్టవ్యో౽ద్యలగ్నదివస స్సుముహూర్తస్సుఖావహః ॥ ౪౪ ॥ మామంగీకురు రామాద్య త్వత్పాదాశ్రయకాముకం । ఉభయోస్త్వం మంటపయోః కార్యాణ్యాజ్ఞాపయ ప్రభో ॥౪౫॥ ఇత్యుక్తో రాఘవస్సోక్త్వా వసిష్ఠం చోదయత్తదా । సో౽పి రామాజ్ఞయా జ్యోతి శ్శాస్త్రజ్ఞైః పరివేష్టితః ॥ ౪౬ ॥ ముహూర్తం కథయామాస పంచమే౽హని రాఘవం । తతస్తుష్టో భూరికీర్తిః గణేశం లగ్నపత్రికాం ॥ ౪౭ ॥ సంపూజ్య గణకాంశ్చైవ పండితాన్ వైదికాదికాన్ । బంధుపుత్రాదిభిస్సార్ధం శ్రీరామం పూజయత్తదా ॥ ౪౮ ॥ నత్వా రామం గృహం గత్వా చకార మంటపాదికం । రామాజ్ఞయా లక్ష్మణో౽పి చకార మంటపాదికం ॥ ౪౯ ॥ తదా వటపురీ రమ్యా పతాకాధ్వజతోరణైః । పురుషోత్తమ రాజధానీ రేజే సాగరరోధసి ॥ ౫౦ ॥ తతో ముహూర్త సమయే వధూచ్ఛిష్టాం నిశాం కులం । లవంచలిప్య తైలాక్తాం సీతాద్యా మాతరస్తదా ॥ ౫౧ ॥ కలశాంశ్చ చతుర్దిక్షు జలపూర్ణాన్ సదీపకాన్ । సంస్థాప్య స్నాపయామాసు ర్మహావాద్య పురస్సరం ॥ ౫౨ ॥ తైలాభ్యంగం నిశాయుక్తం సీతాద్యాః స్వీయబాలకైః । సహైవ చక్రురానంద పూరితా రుక్మభూషితాః ॥ ౫౩ ॥ అభ్యంగ

డను పుత్రులతోడను నిజనివాసగాజమందిరంబున కేతెంచెను. అంత నామఱునాడు భూరికీర్తి పురోహితుని వెంటఁబెట్టుకొనివచ్చి శ్రీరామసన్నిధిలో నమస్కరించి సుఖాసీనుండై "స్వామీ! సుఖావహంబైన సుముహూర్తమును, సులగ్న దినమున కటాక్షించి యానందించవలయును. శ్రీరామప్రభూ! నన్నిపుడు నీ చరణారవింద కింకరునిగా నంగీకరింపుము. వియ్యాలవారి యిరు పురియొక్క మంగళమంటపంబులలోను నీవేకర్తవ్యంబుల నాజ్ఞాపించుచుండవలయును." అని ప్రార్థించెను. అట్లేయని వసిష్ఠమహామునీంద్రునిని ఆపనిలో నియోగించెను. అతఁడంతట జ్యోతిశ్శాస్త్రపారీణులగు దైవజ్ఞులతోడ పరివేష్టితుఁడై నేటికైదవనాడు సుముహూర్తదినమని నిశ్చయించి చెప్పెను. అంత నానందమునందిన భూరికీర్తి శ్రీమహాగణపతిని లగ్నపత్రికను పూజించి గణకులను పండితులను వైదికమండలిని సత్కరించి సుతసోదరసమేతుండయిన శ్రీరామచంద్రస్వామిని సేవించి నమస్కరించి యనుజ్ఞనంది నిజమందిరమునకువచ్చి మంటపాలంకరణాది కార్యంబుల నారంభించెను. అచ్చట లక్ష్మణుండును శ్రీరామాజ్ఞానుసారముగా మంటపాదులను మనోహరంబుగా నిర్మింపఁజేసెను. అప్పుడు సముద్రతీరమునందలి వటపురి పురుషోత్తముని

రాజధానియై చిత్రధ్వజతోరణ పతాకాలంకృతంబై మంగళ మహోత్సవంబులచే రాజిల్లుచుండెను. అంత ముహూర్తసమయమురాగా సీతాదేవ్యాది ముత్తయిదువుల కుశలవులకు సువాసినీ పూజాశేషితంబులయిన పసపు మొదలగు మంగళ లేపనంబులతోడ తైలాభ్యంగము కావించి, నలుదెసలలోను నీళ్లునింపినకలశంబులను దీపంబులతోడ సంస్థాపించి మంగళవాద్యంబులు మ్రోగుచుండగా పరిమళజలంబులచే దివ్యమంగళ స్నానంబులం జేయించుచు, జానక్యాదిరాజ మహిషులును ఆబాలకులతోడ హరిద్రాంకిత తైలాభ్యంగ మంగళ స్నా

పూర్వాశంసన్ను స్తేరామాద్యా స్తదాముదా । సమాహూయ తతస్సీతాం ముక్తానాంస్వస్తికోపరి ॥౫౪॥ వసిష్ఠోము నిభిర్యుక్త శ్శుభాభ్యాంరాఘవేణహి । గణపార్చాంకారయిత్వా పుణ్యాహాదిత్రయంక్రమాత్ ॥ ౫౫ ॥ దేశాచారాన్ కులాచారా నిష్టదేవీంప్రపూజ్యచ । కారయామాసవిధివత్ప్రతిష్ఠాం దేవకస్యచ ॥ ౫౬ ॥ తదాజనకనందిన్యా రజనీ కుంకుమాన్వితే । విరేజతుః స్త్రీకదంబ స్థితాయాఃపదపంకజే ॥ ౫౭ ॥ సీతాద్యాస్తాః స్త్రియస్సర్వా హరిత్పీతారు ణైర్వరైః । హేమతంత్వంకితైర్వస్త్రైర్విరేజుర్మంటపాంగణే ॥౫౮ ॥ స్వయంవరోత్సవైః పూర్వం నాగతాయేసహ స్రశః । శ్రుత్వోత్సాహంవివాహస్య కుశస్యచలవస్యచ ॥ ౫౯॥ తతస్సమాయయుస్సర్వే ముదాతత్రమునీశ్వరాః తాన్సర్వాన్ రామచంద్రోపి వస్త్రాభరణధేనుభిః ॥౬౦ ॥ పూజయామాసవిధివత్సీతయాలక్ష్మణాదిభిః । భూరికీర్తిః నృపైర్యుక్తో మహావాద్యపురస్సరం ॥ ౬౧ ॥ స్వయంకుశలవౌగేహం నేతుకామస్సమాయయౌ । మంటపేపూజ యామాస భూరికీర్తేర్వరస్సుతః ॥ ౬౨ ॥ కుశంతథాలవంచాపి కనీయాన్ భూరికీర్తిజః । హేమతంతూద్భవైర్ది వ్య వస్త్రైరాభరణాదిభిః ॥ ౬౩ ॥ తదావిరేజతుర్బాలౌ తథాతేప్యంగదాదయః । తతస్తౌవారణేంద్రస్థౌ దివ్యచామ

---

నంబుఁ జేసికొనిరి. అట్లే ముదముతో నా శ్రీరామాదులును అభ్యంగ మంగళ స్నానముచేసిరి. పిమ్మట వసిష్ఠమహాముని మునీంద్రులతోడ శ్రీరామచంద్రసన్నిధానమున కుశలవులను కూర్చుండఁబెట్టుకొని, శ్రీమహాగణపతిని పూజించి పుణ్యాహమునాంది నవగ్రహము అను నీమూఁడు కర్మలన్నాచరించుచు దేశాచారంబులను కులాచారంబులను అనుసరించి యిష్టదేవతను ప్రార్థించి కులదేవతనర్చించి విధివిధానంబుగా దేవకమూర్తిని ప్రతిష్ఠించెను. అపుడు జానకమ్మ మునిపత్నులుమొదలయినసువాసినుల కందరికిని పసపు కుంకుమలనిచ్చి వారినడుమ కూర్చుండియుండగా సీతాదేవియొక్క కుంకుమహరిద్రాంకిత సుకుమార చరణారవిందంబులు రాజించుచుండెను. మఱియు నా మైథిలి మొదలుగాగల మానినీమణులు ఎఱుపుపసపు పసరువన్నెల బంగారుసరిగె చీరెల నలంకరించికొని మంగళ మంటపమునడుమ మంగళ దేవతలవలె వెల్గుచుండిరి. స్వయంవరసమయమున రాకయుండిన మునీంద్రులు వేలకొలఁదిగా కుశలవ కల్యాణమహోత్సవంబులనువిని కుతూహలముతో రాగా వారినందఱిని శ్రీ సీతాలక్ష్మణులతోడను శ్రీరామచంద్రుఁడు వస్త్రాభరణ ధనకనకవస్తు వాహనధేన్వాదులనిచ్చి సత్కరించి సంతోషపరచుచు చక్కగానారాధించెను. నిరంతరము దివ్యవాద్యంబులు భవ్యవాదంబులచే కర్ణానందప్రదంబులుగానుండెను. తరువాత భూరికీర్తి భూపతి ఇతర రాజలోకముతోడ మంగళవాద్య పురస్సరంబుగా కుశలవులను నిజరాజమందిరంబునకు పిలచికొని పోవుటకై యేతెంచెను. అప్పుడా శ్రీరామమంటపంబున భూరికీర్తియొక్క జ్యేష్ఠపుత్రుఁడు కుశునికి వరపూజఁజేసెను. భూరికీర్తియొక్క కనిష్ఠపుత్రుఁడు లవునికి వరపూజఁజేసెను. అపుడు కుశలవులు మామలిచ్చిన మంగళ దివ్యకనకవస్త్రంబులచే నలంకృతులై పెండ్లికొడుకులు కండ్లపండుగగా నుండిరి. అట్లే

**రవీజితౌ ॥ ౬౪॥ పశ్యంతౌ నర్తనం వారస్త్రీణాం స్మితాననౌ । శృణ్వంతౌ వాద్యఘోషాంశ్చ వర్ణితౌ తౌ మా గధాదిభిః ॥ ౬౫ ॥ సీతాదిభిర్వారణేషు సంస్థితాభి స్తథా పథి । ప్రాసాదోపరిసంస్థాభి ర్నారీభిః పుష్పవృష్టిభిః ॥ ౬౬ ॥ హారిద్రాపీతధాన్యైశ్చ మాంగల్యైర్మౌక్తికైరపి । లాజాభిర్హేమపుష్పైశ్చ వర్షితౌ వీక్షితౌ ముహుః ॥ ౬౭ ॥ జగ్మతుర్బాలకావేవం పశ్యంతౌ కౌతుకాని హి । దదర్శతుర్వాటికాశ్చ పుష్పవృక్షవినిర్మితాః ॥ ౬౮ ॥ తథా కృత్రిమవృక్షాంశ్చ పతాకాంశ్చ ధ్వజాం స్తథా । తథా పథి భవాన్ వృక్షాన్ వహ్నిస్ఫురైశ్చ దీపితాన్ ॥ ౬౯ ॥ శకటస్థానౌషధిభిః పూరితాన్ కృత్రిమాన్ జనాన్ । తథా వ్యాఘ్రాదికాన్ హింస్రా నౌషధీభిః ప్రపూరితాన్ ॥ ౭౦ ॥ తటిత్సమానాన్ గగనే ప్రాకారానౌషధీభవాన్ । కేకిచక్రోపమాదీంశ్చ చంద్రజ్యోత్స్నాశ్చ కృత్రిమాః ॥ ౭౧ ॥ ఏవం దదర్శతుర్నానా కౌతుకాని నృపాత్మజౌ । తతస్తౌ ధూళికీతేశ్చ గత్వా మంటపముత్తమం ॥ ౭౨ ॥ నానామహోత్సవైర్బాలౌ చామరచ్ఛత్రమండితౌ । అవరుహ్య గజేంద్రాభ్యాం తస్థతుర్మంటపాంగణే ॥ ౭౩ ॥ మధుపర్కవిధా**

---

అంగదాది రాజపుత్రులందఱును సాలంకారులై సానందముగా నచ్చటముచ్చట లాడుచుండిరి. అంత నాకుశలవులు గజరాజంబుల నెక్కి ఛత్రచామరాది రాజోపచారంబులనందుచు వారకాంతలనాట్యంబులను పరికించుచు శుభవాద్యంబుల సుస్వరంబులనాకర్ణించుచు హాసన్ముఖులై వందిమాగధులు కీర్తించుచుండగా నాఁడయేనుఁగులనెక్కిన సీతాది పట్టమహిషులతోడ వట పురీ రాజమార్గమునవచ్చుచుండిరి. అప్పు డుప్పరిగెలపైనుండి పురపురంధ్రులు పుష్పంబులను పసపక్షతలను ముత్తెములను లాజలను కనకకుసుమంబులను వర్షించుచు మిక్కిలి మక్కువతో నొక్కి-నిక్కి చూచుచుండిరి. కుశలురన నాకుశలవులు దారి వేడుకలం జూచుచుండిరి. అవి యేవనిన-రాజమార్గము నందిరుగెలంకులలోను పుష్పవృక్ష వాటికలు కల్పింపఁబడియుండె. మఱియు నచ్చట కృత్రిమపుష్ప వాటికలు సహజపుష్పవాటికతో గలసి వాటికివీటికి విశేషముతోచనట్లు రాజించుచుండెను. వింతవింతలయిన చిత్రధ్వజతోరణ పతాకాదులు విరాజించుచుండె. వెల్గించినమాత్రమున తేజోవనంబులను చూపునట్టి నల్లమందుచే చేయఁబడిన వృక్షంబులు నడుమ నడుమ నేత్రానంద దాయకంబులైయుండె. బండ్లుపోవుచుండుట, వాటిపై జనులు సంచరించుచుండుట, అట్లే నడుమనడుమ వ్యాఘ్రాదిజంతువు లార్భాటముచేయుట, అంతయును క్షణమాత్రమున బయలువెడలుట, అంతలోనంతర్హితమగుట, ఇట్టి నల్లమందు బాణవేడుకలుబాగై బరగుచుండె. పగలువత్తులు వెన్నెలవత్తులు మించువత్తులు నెమలివత్తులు మొదలయిన వెల్గువత్తులు వెల్గుచుండె. గగనప్రాకారంబులను నభోవృక్షంబులను వ్యోమలతలను చూపునట్టి యాకాశబాణంబులు ఆనందావహంబులై వెల్గుచుండె. ఇట్లు పలుమహోత్సవంబులతోడ ఛత్రచామరాది రాజోపచార రారాజితులయిన కుశలవులు వివిధవినోదంబులను విలోకించుచు భూరికీర్తినిర్మిత వివాహమంగళ మంటపమువద్దికివచ్చి గజేంద్రంబులనుండిదిగి మంటప

నాని విష్టరాదీని వై క్రమాత్ । తయోః కుశాహ్వౌ చక్రతుస్తౌ బ్రాహ్మణైః పరివేష్టితౌ ॥ ౭౪ ॥ తతో౽ర్ఘ్యైః పూజనాదీని సీత యా రఘునందనః । చకార గురుణా యుక్తస్సదా సమంటపాంగణే ॥ ౭౫ ॥ తతో లగ్నముహూర్తేఽతం కుశం చంపి కయాగుహః । తిథాలవం మతుత్యాపి పృథగ్వేదికయోస్తదా ॥ ౭౬ ॥ కృత్వా సుసంస్థితౌ చోభౌ దంపత్యోరంతరేప టౌ । ధృతో౽థతయోః పృథక్చిత్రౌ నూతనౌ హేమతంతుజౌ ॥ ౭౭ ॥ నానామంగలఘోషాంశ్చ మునిభిశ్చక్రురుత్త దా । అశృణ్వన్ సర్వజనాస్తూష్ణీం శృణ్వంతో మంగళస్వనాన్ ॥ ౭౮ ॥ * ॥ ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గత శ్రీమదానందరామాయణే వివాహకాండే చంపికాసుమతిస్వయంవర వర్ణనంనామ తృతీయస్సర్గః ॥ ... ॥౩॥

శ్రీరామదాస ఉవాచ—శ్రీసీతారఘునాయకశ్చ గిరిజా శంభుర్గణేశస్తథా । నందీషణ్ముఖలక్ష్మణౌ చభర తః కంజోద్భవశ్శత్రుహా ॥ సర్వేతే మునయస్సురాశ్చదితిజో స్తీర్థాని వద్యో నదా । దిక్పాలాశ్శశిభాస్కరౌ చ మహా మాః కుర్వంతు వో మంగలం ॥ ౧ ॥ తదేవ లగ్నం సుదినం తదేవ తారాబలం చంద్రబలం తదేవ । విద్యాబలం దైవబ లం తదేవ సీతాపతేర్యత్ స్మరణం విధేయం ॥ ౨ ॥ ఏవం మంగళఘోషైశ్చ నానావాద్యపురస్సరం । తత స్త్వంతఃపటౌ ము క్త్వా ఓం పుణ్యాహమితి స్వరన్ ॥ ౩ ॥ తయోస్తే పాణిగ్రహణ విధానం విధిపూర్వకం । లాజాహోమాదికం సర్వం చ

సభామధ్యమున వేదికలపై సుఖాసీనులైరి. వారికి బ్రాహ్మణపరివారముతోడ పరివేష్టింపఁబడిన పురోహితాచార్యులు మంగళపీఠంబులనిచ్చి మధుపర్కాది సత్కారములను విధిప్రకారముగా నాచరించిరి. అంత నా శ్రీరాముండు సీతాదేవితోడ వసిష్ఠులవారు చెప్పినట్లు ఆమంటపాంగణ మున వధూరత్నంబులయిన చంపికాసుమతులను సత్కరించిరి. అపుడు వసిష్ఠుఁడు వివాహల గ్న ముహూర్తమునకు సంముఖముగా చంపికాకుశులను సుమతిలవులను వెవ్వేఱువేదికలపై నిలిపి వారినడుమ కనకతంతు కమనీయంబులయిన దివ్యవస్త్రమును తెరవైచి పట్టుకొనిరి. వి విధమంగళ వాద్యంబులు విశ్వజనానందంబుగా వాయింపఁబడుచుండెను. మునీంద్రులందఱును స్వస్తివాచనంబులను అమోఘంబులుగా నుచ్చైస్స్వరంబుతో వచించుచుండిరి. సమస్తజనులు ను సుమంగళ సుస్వరంబులను సుఖముగా నూరకె యాకర్ణించుచుండిరి. ... ॥౩॥

కుశలవులయొక్క వివాహ విధానమహోత్సవము.

"శ్రీ సీతాలక్ష్మణ భరతశత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రుఁడును, శ్రీపార్వ తీ విఘ్నేశ్వరనంది షణ్ముఖసమేత చంద్రశేఖరుండును, వాణీహిరణ్యగర్భుఁడును, ఇంద్రాగ్నియ మ నిరృతివరుణవాయు కుబేరేశానులును దిక్పాలకులును, ముప్పదిమూడుకోట్ల దేవతలును, సూర్యచంద్రులును సమస్తమునీంద్రులును, సకలనదీ తీర్థదేవతలును, అందఱును మీకు మంగళప్రదులుగానుందురుగాక. సాక్షాల్లక్ష్మీపతిని స్మరించుట యేదికలదో అదియే సులగ్నం బు, నక్షత్రబలంబు, చంద్రబలంబు, విద్యాబలంబు, దైవబలంబు, నైయున్నదిగాన శ్రీజానకీ రమణుని భజింపవలయును."—అని యిట్లు మంగళ వాక్యంబుల నుద్ఘోషించి వివిధశుభవా

త్రుమంగళపూర్వకం ॥ ౪ ॥ తదామహావాద్యఘోషా వినేదుర్మంటపాంగణే । ననృతుర్వారనార్యశ్చ తదామా
గధవందినః ॥ ౫ ॥ జగుర్మంగళగీతాని తుష్టువుస్తే మహాస్వనైః । తదాదానాన్యనేకాని చక్రతుస్తౌ నృపోత్తమౌ ॥
౬ ॥ భూరికీర్తిరామచంద్రౌ మహోత్సవప్రపూరితౌ । అథతౌ బాలకావధ్వా నిజకట్యోర్న్యవేశయతాం ॥ ౭ ॥ సీతోర్మి
లాదిభిః స్త్రీభిర్జగ్మతుర్భోజనగృహం । తత్రగౌరీహరౌ పూజ్య చక్రతుశ్చాప్రమేచనం ॥ ౮ ॥ తతోఽకుశశ్చంపిక
యా సుమత్యాఽసలవోఽపిచ । చక్రతుర్భోజనం చోభౌ స్త్రీభిస్సర్వత్రవేష్టితౌ ॥ ౯ ॥ మాత్రా సహోపనయనే వివా
హే భార్యయాసహ । అన్యేననైవభోక్తవ్యం భుక్తంచేత్పతితః స్మృతః ॥ ౧౦ ॥ రామోపిబంధుభిః పౌరై స్సభ్రా
తృభిః పార్థివోత్తమైః । చకారభోజనం భూరికీర్తేస్సద్మని సైముదా ॥ ౧౧ ॥ ఏవం సీతాపినారీభి శ్చకారభోజనం
తదా । భూరికీర్తేః స్నుషాభిస్సా ప్రార్థితా వందితా ముహుః ॥ ౧౨ ॥ తతో నానాసముత్సాహా భూరికీర్తే
శ్చకారసః । అథతౌ బాలకౌ రమ్యౌ స్త్రీవాక్యైర్మాతృసన్నిధౌ ॥ ౧౩ ॥ స్వశ్వశ్రూసన్నిధౌచాపి స్త్రీభిస్సర్వత్ర
వేష్టితౌ । స్వస్వపత్న్యైః పదయోః స్వశిరోభ్యాం నమనం ముహుః ॥ ౧౪ ॥ చక్రతుస్తోషసంపూర్ణౌ తతావపిస్త్రీ

ద్య సముద్ఘోషంబులతోడ తెరబట్టనెత్తివేసి స్వస్తివాచనము నొనర్చి వారిరువురికిని విధిపూర్వ
కంబుగా పాణిగ్రహణ విధానంబునుగావించి లాజహోమాదిక సమస్తకల్యాణశుభకర్మల నాచ
రించిరి అపుడు పెండ్లిపందిలినడుమ దివ్యమంగళ మహావాద్య ఘోషంబులు కర్ణసంతోషంబు
లుగానుండె. నటీనర్తనంబులు నయనానంద జనకంబులయినవి. వందిమాగధులు వందనగీత
మాలికలు మంగళ సంగతంబులైయుండ నుచ్చస్వనంబుతో స్తుతుల నుచ్చరించుచుండిరి. అపుడు
అగాజేంద్రుండగు భూరికీర్తియును రాజరాజేంద్రుండగు శ్రీరామచంద్రుడును మహానందభరి
తులై వివిధదానంబుల నొసంగిరి. అంత నాకుశలవులు చంపికాసుమతులను వధువులను తమ
నడుములమీద నెత్తికొని సీతోర్మిలామాండవీశ్రుతకీర్త్యాది స్త్రీ పరివారముతోడ భోజన
గృహంబునకువెడలిరి. అచ్చట పార్వతీపరమేశ్వరులను సంపూజించి ఆమసించన మను మాఖిడి
చిగుళ్లచే వంసెంత మంగళోదకము నొంశారులు విధివిధానంబుగా చల్లికొను కల్యాణమహో
త్సవమును సలిపిరి. అంత కుశుండు చంపికతోడను లవుండు సుమతితోడను అంతట మగువ
లు నిండియుండ నడుమ వినోదభోజనముంజేసిరి. ఉపనయనంబున తల్లితోడను వివాహంబున
పత్నితోడను భుజింపవలయునుగాని యితరులతో నెన్నడును భుజింపరాదు. అట్లు భుజించనే
ని పతితుడగునని స్మృతిశాసనము. శ్రీరామచంద్రుండును తమ్ములతోడను పురజనులతోడను
మిత్రులతోడను రాజేంద్రులతోడను భూరికీర్తిమందిరంబున నానందభోజనమునందెను. అట్లే
భూరికీర్తియొక్క కోడండ్రచే పలుమారు ప్రార్థింపఁబడి వందింపఁబడి సీతాదేవియును ఇతర
నారీబృందముతోడ భుజించిరి. అంత నాభూరికీర్తి వినోదావహంబులైన వివిధమహోత్సవం
బులును విశేషముగా చేయించెను. పిమ్మట నావరబాలకులిరువురును అత్తలయెదుటను తల్లుల

తాసనే । వధూవరాశ్చతేసర్వే నిశో వాంతే విరేజిరే ॥ ౧౫ ॥ కుంకుమాంకితపాదేతే దదతుర్వల్లభాంకయోః । ఏ
వంనానాసముత్సాహై రతిక్రాంతం దినత్రయం ॥ ౧౬ ॥ చతుర్థేఽహవసేరాత్రౌ వంశపాత్రవిరాజితైః । దీపైర్నీరా
జితౌచోభౌ బాలకౌతౌ విరేజతుః ॥ ౧౭ ॥ తతస్తౌబాలకౌపత్నీః స్వస్వపృష్ఠే నివేశ్యచ । చక్రతుస్తాండవంనృ
త్యం కుశలౌమంటపాంగణే ॥ ౧౮ ॥ మాతృశ్వశ్ర్వాద్యేషువాద కేషుపశ్యత్సుసాదరం । పారిబర్హాంభూరికీర్తిః కు
శాయచలవాయచ ॥ ౧౯ ॥ దదౌతుష్టమనాశ్శీఘ్రం రామసంబంధహర్షితః । నియుతాన్వారణేంద్రాంశ్చ శిబి
కాశ్చాపితన్మితాః ॥ ౨౦ ॥ తురంగాన్పంచనియుతం నియుతాన్ స్యందనాన్ దదౌ । ద్వాభ్యాంపృథక్ పృథక్ పా
త్రీ ధవాభ్యాం ద్రవ్యపూరితాన్ ॥ ౨౧ ॥ నానాలంకారవాసాంసి గాదాసీస్సేవకాం స్తథా । దదౌతాభ్యాంభూరి
కీర్తిః స్యేషాంసంఖ్యానవిద్యతే ॥ ౨౨ ॥ ఏవం సంమానితస్తేన శ్రీరామోభూరికీర్తినా । సపత్నీకాభ్యాంపుత్రాభ్యాం

యెదుట శ్రీలసరసాలాపంబులచే నారీబృందమునటుమ నానందితాంతరంగులై తమతమ పత్నుల
పాదంబులకు పలుమారు ప్రణయవందనంబులనాచరించిరి. ఆవధువులు వరుల పాదారవిందంబు
లకు భక్తివందనంబుల నానందముతో నర్పించుచుండిరి. వధూవరులును అచ్చటి సతీమణులు
ను వేకువజామున వెలయుచుండిరి. నలుగిడిన కుంకుమలాక్షారుణ చరణారవిందంబులను ఆవ
ధూమణులు వరరత్నంబుల తొడలపైయిడుచుండిరి. ఇటు ప్రేమప్రపంచ నవనాటకరంగ
భూమియైన న్వావివాహమంగళ మందిరంబున నుత్సాహక్రీడా పరంపరలచే నందఱు నానంద
తుందిల హృదయారవిందులై యుండ మూడుదినములు గతించెను. పిదప నాలగవనాడు రాత్రి
వంశపాత్రంబులలో దివ్యదీపారతు లెత్తఁబడిన కుశలవులు రాజించుచుండిరి. అంతనారాజ
కుమారులు తమపత్నులను తమమీఁద నెక్కించికొని మంగళమంటప మధ్యమున నాట్యవిదు
లైతల్లులు అత్తలు మొదలైన బంధువర్గములు వారందఱును బంధురంబుగా నిరీక్షించుచు సౌఖ్యం
దించుచుండఁగా నర్తనములనాడిరి. అప్పుడు మహారాజు శ్రీరామసంబంధము గల్గినదని సంతో
షితస్వాంతుఁడై కుశలవులకు ౫ లక్షగుఱ్ఱములను లక్షపల్లకీలను లక్షయేనుఁగులను లక్షర
థములను పారిబర్హముగానిచ్చెను. ఇట్లు పౌత్రీపతుల కిరువురికిని వేర్వేఱుగానుపభోగవస్తుపూ
ర్ణంబులగు వాహనంబులను దివ్యామూల్యకనక పట్టవస్త్రంబులను గోదాసీ సేవకాదులను మ
ఱియు విశేషంబులయిన రాజభోగ్య సద్వస్తువుల నపారంబుగా నర్పించెను. నిక్కముగ దాని
లెక్క నొక్కింత వక్కాణించుటకు నక్కజంబనదగు ॥ ౨౨ ॥ ఇట్టుభూరికీర్తిమహారాజుచే సం

శ్రీరాముఁడు సపరివారంబుగా పూర్వోదధిలో క్రీడించుట.

మానింపంబడిన శ్రీసీతాయుతరామచంద్రస్వామి చంపికాసుమతుల తోడఁగూడి సాంప్రలయుం
పంది ముచ్చటగానుండు గజారూఢులయిన కుశలవులను పిలచికొని తమ్ములతోడను తత్పుత్రు
లతోడను మిత్రులతోడను రాజ సమూహముతోడను యథాపూర్వముగా మంగళమహావా

గజస్థాభ్యాంసమన్వితః ॥ ౨౩ ॥ సీతయాబంధుభిఃపౌరైః స్నుషాభ్యాంభ్రాతృభిస్సహ । పూర్వవదుత్సవాద్యైశ్చ సయయౌస్వీయమంటపం ॥ ౨౪ ॥ వటపుర్యాంతతోరామో మాసమేకంనివాసనః । చకారసీతయాక్రీడాంనానా సంస్థోమహాదధౌ ॥ ౨౫ ॥ తతఃస్నుషాభ్యాంశ్రీరామో యయౌగజపురీంసుఖం । అయోధ్యాయాంవిజయోపి శ్రుత్వారామంసమాగతం ॥ ౨౬ ॥ యఃపుర్యారక్షణార్థంహి రామేణాజ్ఞాపితఃపురా । సపురీంశోభయామాస పతాకాధ్వజతోరణైః ॥ ౨౭ ॥ వారణేంద్రంపురస్కృత్య తూర్యనృత్యపురస్సరం । విజయోనామసచివో రామంప్రత్యుద్యయౌజవాత్ ॥ ౨౮ ॥ అథోసదత్సువాద్యేషు రామోబాలైస్సహాత్మజైః । స్నుషాభ్యాంసీతయాబంధుపత్నీభిర్భ్రాతృభిఃపురీం ॥ ౨౯ ॥ వివేశసేనయాపౌరైః పశ్యన్నృత్యాదికంపథి । తదావేశ్యానృత్యస్తా స్తుష్టువుర్వందిమాగధాః ॥ ౩౦ ॥ స్వస్వపత్నీయుతౌబాలౌ వరవారణయోఃస్థితౌ । తదావిరేజతుర్మార్గే స్త్రీభిఃపుష్పైస్సువర్షితౌ ॥ ౩౧ ॥ ఏవంరామోగృహంగత్వా బాలాభ్యాంస్వీయసద్మని । కారయిత్వారమార్చాంస దదౌదానాన్యనేకశః ॥ ౩౨ ॥ తదాలంకారవస్త్రాద్యైస్సంపూజ్యరఘునందనః । సుహృదస్సకలాన్పౌరాన్ నిష్ఠాన్ జానపదాన్నృపాన్ ॥ ౩౩ ॥ ఆచండాలాదికాన్సర్వాన్ సంతుష్టానకరోన్ముదా । తతస్సఘోరకీర్తేస్తాన్ మంత్రిణస్సైన్యసంయుతాన్ ॥ ౩౪ ॥ సంపూజ్యప్రేషయామాస స్వదేశంరఘునందనః । తతస్సర్వాన్ జానపదాన్ సుహృదశ్చప్లవంగమాన్ ॥ ౩౫ ॥

ద్యాద్యుత్సవ పరంపరలనంది నిజ శుభమంటపంబున కేతెంచెను. అంతనావటపురిలో నొకనెల వసించియుండెను. అప్పుడు శ్రీరామచంద్రుఁడు సీతాసమేతుఁడై యోడనెక్కి పూర్వస్థముద్ర

శ్రీరాముఁడు కొడుకులు కోడండ్రలతోడ నయోధ్యకేతెంచి పెండ్లిచుట్టముల నంపించుట.

మున విహరించుచుండెను ॥ ౨౫ ॥ పిదప శ్రీరాముఁడు కోడండ్రను తీసికొని యయోధ్యారాజధానికి వచ్చెను. అప్పురిలో పురరక్షణకై స్థాపింపఁబడియుండిన విజయుఁడును శ్రీరాముని రాకనువిని చిత్రధ్వజతోరణ పతాకలచే దివ్యాలంకారము చేయించెను. దివ్యగజంబును పురస్కరించికొని తూర్యనృత్త వాద్యంబులతోడ శ్రీరామమంత్రియైన విజయుఁడు జవమున నెదుర్కొలు వెడలెను. అంత మంగళవాద్యములు మ్రోగుచుండగా శ్రీరాముఁడు సీతాసమేతుఁడై క్రొత్తపెండ్లికొడుకులగు కొడుకులతోడను క్రొత్తపెండ్లికూతుండ్రగు కోడండ్రతోడను తమ్ములతోడను తమ్ములపత్నులతోడను పౌరులతోడను సైన్యంబులతోడను దారిలో నర్తనాదుల నవలోకించుచు నిజపట్టణమును ప్రవేశించెను. వారకాంతలాడిరి. వందిమాగధులు స్తుతించుచుండిరి. కుశలవులు నిజకాంతలతోడ నేనుఁగులమీఁద వచ్చుచు పురాంగనల పూలవానలనంది ప్రకాశించుచుండిరి. ఇట్లు శ్రీరాముఁడు నిజరాజమందిరమును ప్రవేశించి కోడుకులచే లక్ష్మీపూజచేయించి యనేకదానంబుల నిచ్చెను. అప్పుడు రఘునందనుఁడు నాగరికులను దేశము వారిని మిత్రవర్గము వారిని రాజులను దివ్యాలంకారవస్త్రంబులచే సత్కరించి, సంతోషముతో నాచండాలాంతముగా ప్రజలనందఱి నానందపరచెను. అంత నాఘోరకీర్తిరాజును వానిమం

విభీషణాదికానాజ్ఞాం గంతుంస్వస్వస్థలం దదౌ । తతస్సర్వేరాఘవం తే వస్త్రాభరణవాహనైః ॥ ౩౬ ॥ స్వస్వకో
శైశ్చసంపూజ్య నత్వారామం యయుర్ముదా । స్వంస్వం దేశం నిజైస్సైన్యైః శ్రీరామేణాభిమానితాః ॥ ౩౭ ॥ అథ
రామస్సుస్నుషాభ్యాంచ పుత్రాభ్యాం బంధుభిః స్త్రియా । సుఖంచకార రాజ్యంస ధర్మేణాప్రతిమం చిరం ॥ ౩౮ ॥ తతః
శ్రావణమాసస్య దర్శమారభ్యషోడశ । ప్రాప్తాన్యష్టేయానియాని సముత్సాహదినానిహి ॥ ౩౯ ॥ తేషుసర్వేషుతం
రామం సావరోధం సబాలకం । స్వపురీం భూరికీర్తిస్స నినాయపరమాదరాత్ ॥ ౪౦ ॥ పూజయామాసః విధవస్త్రా
లంకారవాహనైః । కియద్దినానిసంస్థాప్య దదావాజ్ఞాం పునః పునః ॥ ౪౧ ॥ సంవత్సరసముత్సాహ దినానిషోడశాధు
నా । విష్ణుదాసమయాతేగ్రే కథ్యంతే తాని వై శ్రుణు ॥ ౪౨ ॥ శ్రావణస్యాథమాసస్య కుహూః శ్రేష్ఠా ప్రకీర్తితా ।
భాద్రశుక్లచతుర్థీతు విజయాదశమీ తథా ॥ ౪౩ ॥ దీపావల్యాశ్చచత్వారి దినాన్యతిమహాంతిచ । మార్గశీర్షేపం
చమీచ సీతాషష్ఠీ తథాపునః ॥ ౪౪ ॥ సంక్రాంతిర్మకరాఖ్యాతు తథాచ రథసప్తమీ । హుతాశనీ చైత్రశుక్ల ప్రతి
పచ్చాపిపుణ్యదా ॥ ౪౫ ॥ అక్షయ్యాఖ్యాతృతీయాచ తథావై జ్యేష్ఠపూర్ణిమా । పంచమీ శ్రావణే శుక్లా షోడశై

త్రులను సైన్యంబులతోడ చక్కగా సంమానించి వాని దేశమున కంపించెను. అంత పెండ్లికి వచ్చియున్న వారినందఱిని దేశస్థులను మిత్రులను కపీంద్రులను విభీషణాదులను స్వస్వదేశంబులకుం జనుట కాజ్ఞనొసంగి సంమానించెను. అంత వారందఱును తమతమ కోశంబులలోనుండి తెచ్చిన వస్త్రాభరణవాహనంబులచే శ్రీరామచంద్రస్వామికి కానుకలనర్పించి నమస్కరించి నిజ

పెండ్లిజరిగిన సంవత్సరములోని విశేషోత్సవంబులు.

సైన్యంబులతోడ తమతమ నెలవులకుంజనిరి. ॥ ౩౭ ॥ అంత నప్రతిముండైన శ్రీరామచంద్రుండు జానకీదేవితోడ క్రొత్తగావచ్చిన కోడండ్రతో కొడుకులు కోర్కెలుతీర క్రీడించుచుండ వారితోడను లక్ష్మణాద్యనుజులతోడను ధర్మముగా రాజ్యపరిపాలనము చేయుచుండెను. పిదప శ్రావణమాసామావాస్య మొదలు ౧౬ దినములు సముత్సాజనకంబులై యెద్ది వచ్చుచుండెనో వాటిలో నన్నిటిలో, భూరికీర్తిమహారాజువచ్చి శ్రీరామచంద్రమూర్తి పుత్రులతోడను రాణివాసము వారితోడను నిజరాజనియగు వటపురికి తీసికొనివెళ్లి పలు వేడుకలు చేసి వివిధవస్త్రాలంకార వాహనంబులచే సత్కరించి కొన్నికొన్ని దినములు కలసిమెలసియుండి మరలమరల పంపించుచు నిట్లు సంతోషించెను. వినుము విష్ణుదాసా! నేను చెప్పిన పెండ్లియైన సంవత్సరములోని షోడశసముత్సాహదినంబులెవ్వి యనినం జెప్పెదను శ్రావణమాసము మొదలుకొని (౧) అమావాస్య మిక్కిలి శ్రేష్ఠముగా చెప్పంబడినది (౨) భాద్రపదశుక్ల చతుర్థి. (౩) ఆశ్వయుజ శుక్ల విజయదశమి (౪-౫-౬-౭) ఆశ్వయుజ కృష్ణత్రయోదశి మొదలు నాలుగుదినంబులు మిక్కిలి గొప్పవి. (౮-౯) మార్గశిరమాసమున పంచమియును సీతాషష్ఠియును, (౧౦) మకరసంక్రాంతి (౧౧) రథసప్తమియనగా మాఘశుక్లసప్తమి, (౧౨) హుతాశనియనగా ఫాల్గున శుక్లపూర్ణిమ

వంష్య్రతానిహి ॥ ౪౭ ॥ సంవత్సరసముత్సాహ దినాన్యతిమహాంతిచ । ఏతేషుభూరికీర్తిస్సరా మఃనీత్వాప్రపూజయత్॥ ౪౮॥ ఏవంకుశస్యచతథా లవస్యాపిసవిస్తరాత్ । వివాహశావర్ణితౌశిష్య యథాపూర్వంశ్రుతౌమయా॥౪౯॥ యదాశ్రీరామచంద్రస్య వైకుంఠారోహణంశుభం । భవిష్యతితదాయోధ్యా పుర్యాంవై సరయూంజలే॥ ౫౦ ॥ కుశః శ్రీయాచంపికయా జలక్రీడాంకరిష్యతి । తస్యదక్షిణహస్తస్య కంకణంరుక్మనిర్మితం ॥ ౫౧॥ సరయూజలమధ్యే తు పతిష్యతిమహోజ్జ్వలం । తత్రతోయేపన్నగస్య కుముదస్యకుముద్వతీ ॥౫౨ ॥ స్వసాదృష్ట్వాకంకణంతద్గృహీత్వాసద్మయాస్యతి । కుశోపికంకణార్థంహి బాణంసంధారయిష్యతి ॥ ౫౩ ॥ సరయూశోషణార్థంహి సన్నద్ధశ్చభవిష్యతి । తతస్సాకుముదంగత్వా సరయూఃప్రార్థయిష్యతి ॥ ౫౪ ॥ సోపిదృష్ట్వాకుశంక్రుద్ధం స్వసామాదాయసాదరం । కుశమాగత్యతంనత్వా స్వసాంతస్మైప్రదాస్యతి ॥ ౫౫ ॥ రత్నానికంకణందత్వా తేనసఖ్యంకరిష్యతి। ఏవంకుముద్వతీభార్యా గ్రేతస్యాన్యాభవిష్యతి ॥ ౫౬ ॥ తస్యాంకుశాత్పుత్రనయో తిథిర్నామ్నాభవిష్యతి । చంపికాయాదుహితర స్సంభవిష్యంతినోసుతాః ॥ ౫౭ ॥ అతిథేస్సూర్యవంశోగ్రే చిరఁవిస్తారమేష్యతి। ఏవంకుశస్యద్వేప

---

కామదహనదినము, (౧౩) చైత్రశుక్ల ప్రతిపత్తు (౧౪) అక్షయ్యతృతీయ, (౧౫) జేష్ఠశుక్ల పూర్ణిమ (౧౬) శ్రావణశుక్ల పంచమి. ఇట్లు ౧౬ దినంబులు చెప్పఁబడినవిగదా! ఇవి పెండ్లియైన సంవత్సరమున మిక్కిలి సముత్సాహదినంబులు. వీట్లలో భూరికీర్తిరాజు శ్రీరామభద్రునిందీసికొని

శ్రీరామావతార పరిసమాప్తిలోని కథాసూచనము.

వెడలి సంపూజించెను. ॥౪౮॥ శిష్యుఁడగు విష్ణుదాసా! నేనెట్లువింటినో అట్లు కుశలవులయొక్క వివాహవిషయమును నీకు నిరూపించితిని. ఎపుడు మంగళకరంబయిన శ్రీరామచంద్రునియొక్క వైకుంఠారోహణము నడుచుచున్నదో అప్పుడు అయ్యయోధ్యాపురిలో సరయూజలంబులలో కుశుఁడు నిజపత్నియగు చంపికతోడ జలక్రీడనాచరించును. అతని కుడిచేతిలోనున్న దివ్యసువర్ణకంకణంబు సరయూనదిలో పడుచున్నది. అచ్చటనీళ్లలో కుముదుఁడను పన్నగేంద్రుని చెల్లెలైన కుముద్వతి యాకంకణమునుచూచి తీసికొని తనయింటికి పోవుచున్నది. కుశుఁడును కంకణము కొఱకు బాణము ననుసంధానముచేయుచున్నాఁడు, ఆబాణంబు సరయూజలంబులను శోషించుటకు సర్వసిద్ధమగుచున్నది. అంతనాసరయూదేవత కుముదుని వద్దికిపోయి ప్రార్థించుచున్నది, అతండును కోపావిష్టుండైన కుశునింజూచి వెరచి సాదరముగా తనచెల్లెలని తీసికొని వచ్చి కుశుని సన్నిధింజేరి నమస్కరించి కుముద్వతిని కానుకగా నర్పించుచున్నాఁడు. ఆదివ్యసువర్ణరత్నకంకణము నప్పగించి మైత్రినందియానందించుచున్నాఁడు. ఇట్లు కుముద్వతియను మఱియొకపత్ని ఈకుశునికి కాఁబోవుచున్నది. దానిగర్భమందు కుశునికి అతిథియనునందనుండు జనించుచున్నాఁడు. చంపికాగర్భంబున కూతుండ్రు జనించెదరుగాని పుత్రులుదయించరు. అతిథినుండి సూర్యవంశము ఇఁకమీఁద విస్తారముగా పోవుచున్నది. ఇట్లు కుశునికిరువురు పత్నులువర్ణిం

త్వాన్ వర్ణితౌ శిష్యైర్మయా ॥ ౫౭ ॥ అథస్వీయగృహే పత్న్యౌ కరోత్క్రీడాం కుశస్సుఖం । తథా స్వీయగృహే పత్న్యౌ కరోత్క్రీడాం లవోపిచ ॥ ౫౮ ॥ * ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే శ్రీమదానందరామాయణే వాల్మీకీయే వివాహకాండే కుశలవయోర్వివాహోనామ చతుర్థస్సర్గః ॥ ... ... ... ౪॥

శ్రీరామదాస ఉవాచ—ఏకదా రఘువీరస్స సీతయా బాలబంధుభిః । పౌరైర్మంత్రిజనైరిష్టైః పుష్పకస్థోయయౌ వనం ॥ ౧ ॥ పశ్యన్నానాకౌతుకాని రంజయన్ జానకీం ముదా । యయౌ సదండకారణ్య మగస్త్యేరాశ్రమాంతికం ॥ ౨ ॥ రామమాగతమాకర్ణ్య కుంభజన్మా మునీశ్వరః । ప్రత్యుద్గమ్య రఘుశ్రేష్ఠం నినాయ స్వాశ్రమం ప్రతి ॥ ౩ ॥ తతస్స మునివర్యస్తు స్నాత్వా రహసి సంస్థితః । అన్నపూర్ణాం మహాలక్ష్మీం చింతయామాస చేతసి ॥ ౪ ॥ తదా తత్తపసా తుష్టా ప్రాదుర్భూతా సురేశ్వరీ । దదౌ తస్మై పాయసేన పూరితం పాత్రముత్తమం ॥ ౫ ॥ అన్నపూర్ణా మునిం ప్రాహ స్థాల్యాస్తు వివిధానిహి । పక్వాన్నాని యథేష్టాని నిష్కాస్య తవ భామినీ ॥ ౬ ॥ సర్వేషామగ్రతశ్శీఘ్రం కరోతు పరివేషణం । ఇత్యుక్త్వా సాన్నపూర్ణా తం మునిమంతర్దధే తదా ॥ ౭ ॥ లోపాముద్రా మునేః పత్నీ స్థాల్యా నిష్కాస్య సంగతః । దివ్యాన్నాని విచిత్రాణి సర్వేషాం పురతస్తదా ॥ ౮ ॥ రామాన్వితానాం మునీనాం చకార పరివేషణం । అథ తుష్టం రఘుశ్రేష్ఠం కంఠే హేరత్నని ర్మితే ॥ ౯ ॥ దదౌ ముదా కుంభజన్మా సీతాయై దివ్యకుండలే । ఏవం

పంబడిరి. ఆసంగతియట్లుండ నా కుశలవులిరువురును చంపికాసుమతులతోడ తమతమ దివ్యమందిరంబులలో సంసారానందసముద్ర పరిమగ్నులై కేళిం దేలుచుండిరి. ... ... ॥౪॥

శ్రీరాముఁడు సపరివారముగా నగస్త్యాశ్రమమునకే తెంచుట.

ఒకప్పుడు శ్రీరఘురాముఁడు సీతాదేవితోడను తమ్ములతోడను మంత్రులతోడను ఇష్టమిత్రులతోడను పుష్పకము నెక్కి వనమునకు నెడలెను. దారిలోని వివిధకౌతుకంబులను విలోకించుచు జానకీదేవిని రంజింపజేయుచు సంతోషముతో దండకారణ్యమునందలి యగస్త్యాశ్రమము వద్దికివచ్చెను. శ్రీరామచంద్రుని రాక నెఱిఁగి కుంభసంభవము నీంద్రుఁడు ఎదురోక్కొలు పోయి తన యాశ్రమమునకు శ్రీరామస్వామిని పిలిచికొనివచ్చెను. అంత నామునీంద్రుఁడు స్నానముచేసి రహస్యప్రదేశమున సుఖాసీనుఁడై మహాలక్ష్మియగు నన్నపూర్ణాదేవిని మనంబున ననుసంధానముచేసెను. అప్పు డన్నపూర్ణాంబ యతని తపంబుచే సంతుష్టయై ప్రత్యక్షముగా వచ్చి పాయస పరిపూర్ణంబయిన పాత్రము ననుగ్రహించి యిచ్చి "మునీంద్రా! వినుము! ఈ పాయస పాత్రమునందు బహు విధపక్వాన్నాదులు సమస్తభోజ్యవస్తువులును నిండియున్నవి. వాటిని నీపత్నియైన లోపాముద్ర యథేష్టముగా నెత్తి అందఱియెదుట త్వరగా వడ్డించవలయును" అని యాజ్ఞాపించి యంతర్ధానమయ్యె. పిమ్మట అగస్త్యపత్ని లోపాముద్ర ఆతప్పెలనుండి విచిత్రంబులగు పక్వాన్నంబులనుతీసి శ్రీరామాదులతోడ నచ్చటనుండెడు మునీంద్రులకందఱికిని వడ్డించెను. అంత నగస్త్యుఁడప్పుడు సంతసించుచుండెడు శ్రీరామచంద్రునికి దివ్యరత్న ని

సంపూజితస్తేన మునినారఘునందనః ॥ ౧౦ ॥ సహితోఽగస్తినాస్థిత్వా పుష్పకేపూర్వవత్ప్రభుః । పశ్యన్సదండకారణ్యే కౌతుకానిసమంతతః ॥ ౧౧ ॥ విచచారరఘుశ్రేష్ఠో దర్శయామాసమైథిలీం । నానావృక్షాన్ పర్వతాంశ్చ నదీఃపక్షికులాన్ మృగాన్ ॥౧౨॥ పంచాప్సరసరోనామ దదర్శాసౌథ్రిమ్యక్సరః । తత్రైవరాఘవోరాత్రౌ నివాసమకరోన్ముదా ॥ ౧౩ ॥ ఏతస్మిన్నంతరేరాత్రౌ నృత్యమప్సరసాంశుభం । శుశ్రావమధురంగీతం సీతయామం చకేప్రభుః ॥ ౧౪ ॥ తేపిసర్వేశుశ్రువుస్తన్నృత్యంగీతంచసుస్వరం । అదృష్ట్వాప్సరసస్తత్ర తదాసరఘునందనః ॥ ౧౫ ॥ పప్రచ్ఛకుంభజన్మానం గీతంనృత్తంకుతస్త్విదం । శ్రూయతేమునిశార్దూల వదస్వత్వంసవిస్తరం॥౧౬॥ ఇతిరామవచఃశ్రుత్వా తమగస్తివర్చోబ్రవీత్ । రామరాజీవపత్రాక్ష కింత్వంవేత్సినవైత్విదం॥౧౭॥ సర్వానేతాన్మన్ముఖేన వృత్తంశ్రావయితుంముదా । చేన్మాంపృచ్ఛసితర్హ్యాద్య తవాగ్రేపివదామ్యహం ॥౧౮ ॥ పురాగంధర్వరాజస్య పుత్ర్యఃపంచమనోరమాః । అత్రజస్కాముదాక్రీడాం చక్రురత్రసరోవరే॥ ౧౯ ॥ ఏతస్మిన్నంతరేరామ నాగ

---

స్త్రితంబులగు కంకణంబులను సీతాదేవికి దివ్యకుండలంబులను సమర్పించెను. ఇట్లు కుంభజునిచే సంభావింపఁబడిన శ్రీరామచంద్రుఁడు ॥౧౦॥ అగస్త్య మహామునీంద్రునిఁగూడ పిలచికొని యథాపూర్వముగా పుష్పకమునెక్కి దండకారణ్యమునందంతట వింతలను విలోకించుచు సంచరించువాఁడై జానకమ్మకు వివిధవృక్ష విచిత్రంబులను బహువిధ పర్వతవిశేషంబులను నానావిధ నదీవినోదంబులను పలుతెఱఁగుల పక్షులవిహారంబులను అనేక ప్రకారంబులయిన మృగముల సొగసులను చూపించుచువచ్చి పంచాప్సరస్సను పేరుగల దివ్యసరోవరంబును చూచి దాని తీరముననారాత్రి సంతోషముగా నందఱితోడ నివాసముచేసెను. అంతనానాడు రాత్రియచ్చట సీతతోడ మంచముమీఁద పవ్వళించిన శ్రీరాముఁడు మంగళసంగతంబయిన అప్సరసలయొక్క నర్తనంబును మధురంబగు గీతంబులను వినెను. ఇతరులందఱును ఆనృత్తగీతంబుల సుస్వరంబులను వింతగా విన్నవారయిరి. అప్పుడు శ్రీరాముఁడు అప్సరసలు మాత్రముకంటికి కనుపడనందున "మునీంద్రా! ఇవియేమో వినవచ్చుచున్నదిగదా సవిస్తరముగా నాసంగతినెఱిఁగింపుము. ఈనృత్త గీతంబులెచ్చటివని" అగస్త్యముని నడిగెను. అంత నగస్త్యుఁడందుకు శ్రీరామునితో నిట్లు చెప్పుచున్నాఁడు:— రాజీవాక్షుఁడగు రామచంద్రస్వామీ! సర్వజ్ఞుఁడైన నీకు ఈసంగతి తెలియదాయేమి! ఇదియు నొక వినోదమా! అయిన వీరికందఱికిని నాచే నీవృత్తాంతంబులను వినుపింపవలెనని నీవిట్లు నన్నడిగెదవు. అయిన నీయెదుట చెప్పెదను ॥౧౮॥ మునుపు గంధర్వరాజుయొక్క పుత్రికలయిదుమంది మనోహరాంగులు రజస్వలలు కా

అగస్త్యుఁడు శ్రీరామునికి పంచాప్సరో నాగకన్యకలవృత్తాంతము నెఱిఁగించుట.

నివారు సంతోషముతో నీసరోవరంబున క్రీడించిరి. అంతలో సరోవరమునుండి క్రీడించుటకై

కన్యాస్సహోవరాత్ । క్రీడార్థంనిర్యయుస్సప్త బహిర్ప్రాప్తయౌవనాః ॥ ౨౦ ॥ తాసాంపరస్పరంమంత్రో బభూవరఘునందన । తత్రితానాగకన్యాశ్చ తథాగంధర్వకన్యకాః ॥ ౨౧ ॥ యాతాయాతంసదాచక్రుః క్రీడార్థంసరస్తటే । తపతామునినాతత్ర ముహుర్వాక్యైర్నివారితాః ॥ ౨౨ ॥ మాగచ్ఛధ్వంమున్నిః టే చేతితాబాలభావతః ॥ అమానయంతస్తద్వాక్యం సమాజగ్ముర్నిరంతరం ॥ ౨౩ ॥ ఇంద్రేణబోధితాశ్చాపి తత్తపోధ్వంసనంప్రతి । మునిశ్చాపితపోనాశం దృష్ట్వాశాపాదినాతదా ॥ ౨౪ ॥ వినాశాపేనతాసాంస దండంసమంత్రయద్ధృది । ఆత్మవాక్యగౌరవేణ జలదేవీః ప్రచోదయత్ ॥ ౨౫ ॥ తద్వాక్యాజ్జలదేవ్యస్తా మధ్యాహ్నేస్వీయమందిరం । నిన్యుర్హృత్వాబలాదేవ యత్రకేషాంగతిర్నహి ॥ ౨౬ ॥ గంధర్వాః పన్నగాయత్ర గంతుంశక్తానచాభవన్ । తపోంతేసమునిః స్వర్గంగతస్తాఅత్రసంస్థితాః ॥ ౨౭ ॥ తాస్సర్వాజలదేవీనాం గేహేసంత్యధునాప్రభో । ఇదంవృత్తమాధునికం విద్ధిరామస్తయత్పదం ॥ ౨౮ ॥ తాఅత్రజలదేవీనాం జలాంతర్గతసద్మని । కుర్వంతినృత్యగీతాని తాసాంసంశ్రూయతేధ్వనిః ॥ ౨౯ ॥ ఏవంరామయథాపృష్టం త్వయాసర్వంమయాతథా । వృత్తంనివాగ్రేఃథితం కురుయేనహితంభవేత్ ॥ ౩౦ ॥ సర్వాసాంనాగకన్యానాం గాంధర్వీణాంతథావిభో । మునినాచోదితశ్చేత్థం తదాసీతాపతిర్ముదా ॥ ౩౧ ॥ లక్ష్మణం

యౌవనమునందని యేడుగురు నాగకన్యకలు వెలువడివచ్చిరి. వారలందఱికిని వీరితో సరస్పరస్నేహము పొసగెను, ఇట్లు ఈగంధర్వకన్యకలును ఆనాగకన్యకలును క్రీడించుటకై సరస్తీరంబున రాకపోకలన్ను జరిగించుచుండిరి. ఇట్లుండ నచ్చట తపమాచరించుచుండిన మునీంద్రుఁడు వీరిని మీరిచ్చట రావలదని పలుమారు నిరాకరించెను. వారు బాల్యదోషముచే నతనిమాటను లక్ష్యపెట్టక యెల్లప్పుడును వచ్చుచుండిరి. దేవేంద్రును ఆమునీంద్రుని తపోనాశనమునకై మఱికొంత వీరిని ప్రోత్సాహపరుపగా నీమగువలు రచ్చజేయుచుండిరి. అంతనాముని వీరికి శాపాదుల నిచ్చినట్లయిన తన తపోభంగమగునని యాలోచించి, శాపమునివ్వక వీరిని దండింపవలయునని యెంచి తన వాక్యమునందు గౌరవముగల జలదేవతలను ప్రేరించెను. అంత నాముని వాక్యమహిమచే జలదేవతలు ఎచ్చట పోయినమాత్రమున నెవరికిని వెనుకకువచ్చుటకు వీలు లేదో గంధర్వులును నాగులును ఎచ్చటికి పోవుటకు శక్తులుకారో అట్టి తనయింటికి మధ్యాహ్నకాలమున నాపంచాప్సరసలను నాగకన్యకలను బలాత్కారముగా పట్టి తీసికొనిపోయిరి. తపశ్చరణానంతరము ఆముని స్వర్గమునకువెడలెను. వారందరు నచ్చట జలదేవతలయొక్క నీటియింటిలో నిప్పటికిని నివసించియున్నారు. ఈవృత్తాంతమును 'నవీనంబనియును ఆశ్చర్యకరంబనియును తెలియును. వారచ్చట జలదేవతలయొక్క జలాంతర్గృహమున నృత్తగీతంబుల నాచరించుచున్నారు. వాటియొక్క మనోహరనాదము వినవచ్చుచున్నది. శ్రీ రామచంద్రా! ఇట్లు నీవడిగిన సంగతిని విన్నవించితిని. యథాస్థితినెఱిగిన నీవు ఆనాగకన్యకలకును అప్సరఃపంచకంబునకును సంతోషమగునట్లు కార్యమును నెరవేర్పుము. ఇట్లు అగస్త్య మునీంద్రునిచే ప్రే

ప్రాహ మే చాప మానయాద్య క్షణాదిహ । యుక్త్వా బాణం మోచయామి దగ్ధ్వా దేవీ జలస్థితాః ॥ ౩౨ ॥ కన్యకాః ప
న్నగానాంచ తథా గంధర్వకన్యకాః । ఇతి తద్రామవాక్యం స శ్రుత్వా సౌమిత్రిరాదరాత్ ॥ ౩౩ ॥ శీఘ్రం [illegible] చాపం స
తూణీరం దదౌ శ్రీరాఘవం ప్రతి । తతః కోదండముద్యమ్య టంకృత్య రఘూద్వహః ॥ ౩౪ ॥ శరం జగ్రాహ తూణీ
రాన్నిజనామాంకితం శితం । తదా చచాల ధరణీ చుక్షుభుస్సప్తసాగరాః ॥ ౩౫ ॥ వవౌ ఘోరతరో వాయూ రజో
వ్యాప్తా దిశో భవన్ । తారా నిపేతుర్ధరణీం దుద్రువుర్వనచారిణః ॥ ౩౬ ॥ పర్వతాః కంపితా ఆసన్ వవర్షుర్లోహి
తం ఘనాః । తజ్జ్ఞాత్వా జలదేవ్యస్తాః శ్రుత్వా చాపధ్వనిం తదా ॥ ౩౭ ॥ భయభీతాస్సమాజగ్ముస్తాభిస్సర్వాభిరాద
రాత్ । ప్రణేముస్తాస్తదా రామం బాలికాస్తాస్తు ద్వాదశ ॥ ౩౮ ॥ రాఘవాయార్పయామాసు ర్దివ్యభూష
ణభూషితాః । రాఘవం జలదేవ్యస్తాః ప్రార్థయామాసురాదరాత్ ॥ ౩౯ ॥ రామ రామ మహాబాహో స్తాభిర్య
దపరాధితం । తత్ క్షమస్వ రఘుశ్రేష్ఠ మాముంచ స్వపతత్త్రిణం ॥ ౪౦ ॥ న కశ్చిత్సూర్యవంశే భూత్ స్త్రీషు శస్త్ర
ప్రహారకః । త్వయాపి రక్షితా పూర్వం స్త్రీత్వాద్భూర్జాహ్నవీతటే ॥ ౪౧ ॥ యద్దానయా తు శపథః కృతో మైథిల
కన్యయా । తాటికాది రాక్షసీషు యత్కృతం బాణమోచనం ॥ ౪౨ ॥ బ్రహ్మఘ్నీషు త్వయా పూర్వం తత్సర్వేషాం హితా

రింపఁబడిన సీతాపతి ॥౩౧॥ లక్ష్మణునిం బిలచి "తమ్ముఁడా! నా ధనుర్బాణంబులను తీసికొనిరమ్ము బాణమును ప్రయోగించి జలదేవతలును శిక్షించి నాగకన్యకలను గంధర్వకన్యకలను క్షణమా

శ్రీరాములవారు అప్సరఃకన్యకా నాగకన్యకలను విడిపించుట.

త్రమున విడిపించెదను." అనియాజ్ఞాపించెను. అంతనామాటవిని లక్ష్మణుఁడు సాదరముగా నా ధనుస్సును తూణీరంబును తెచ్చి సమర్పించెను. రాముఁడా చాపంబును చేతఁబట్టి టంకారము చేసి తూణీరమునుండి నిజనామాంకిత బాణమునెత్తి ధనుస్సులో సంధానము చేయనెంచెను. అప్పుడు భూమిచలించె. సాగరంబులల్ల కల్లోలంబులయ్యె అంతట చండమారుతంబులు ప్రచండంబులయ్యె. దుమ్ముకమ్మి దిక్కులు కానరాక దిమ్మదిరుగుచుండె. చుక్కలుబ్రాలుచుండె. వనచరులు పరుగెత్తిరి. పర్వతంబులు కంపించెను. మేఘములలో నెత్తురువానగురిసె. ఇట్టి మహోత్పాతంబులను చూచి శ్రీరాముని ధనుష్టంకారధ్వనినివిని జలదేతలు భయభ్రాంతలై అక్కన్యకల నందఱిని వెంటదీసికొనివచ్చి శ్రీ రామచంద్రస్వామియొక్క పాదారవిందముల మీఁదఁబడి ప్రణమిల్లిరి. దివ్యభూషణాలంకృతలగు నా పండ్రెండుమంది కన్యకలను శ్రీరామసన్నిధికి సమర్పించిరి. మఱియు నాజలదేవతలు "మహానుభావుఁడైె శ్రీరామచంద్రస్వామీ! మాయపరాధమును మన్నింపుము రఘువీరా! బాణమును ప్రయోగింపవలదు. ఈసూర్యవంశంబున నొక్కఁడును స్త్రీలమీఁద బాణప్రయోగము చేయలేదు. నీవుకూడ గంగాతీరమున సీతాదేవి ప్రతిజ్ఞజేసినప్పుడు భూదేవిని బాణప్రయోగముచేయక రక్షించలేదా? అయిన నేను తాటికాది రాక్షసస్త్రీలమీఁద శస్త్రములను ప్రయోగించలేదాయని శంకింపవలదు. బ్రహ్మహత్యాది మ

యచ । ఇతి తాసాం వచః శ్రుత్వా విహస్య రఘునందనః ॥ ౪౩ ॥ స్థాపయామాస తూణీరే పూర్వవత్తం స్వమార్గణం। తతస్తాభిః పూజితస్తదా హృష్టో రఘూత్తమః॥ ౪౪ ॥ జలదేవీర్దదావాజ్ఞాం స్వస్థలం గమ్యతామితి । ఏతస్మిన్నంతరే తత్ర గంధర్వాశ్చాథ పన్నగాః ॥ ౪౫ ॥ విదిత్వా సకలం రామ కృతం రామాంతికం యయుః । నత్వా రామం ససీతం చ తథా తం కుంభసంభవం ॥ ౪౬ ॥ ఉపాయనాన్యనేకాని సమర్ప్య రఘునందనం । ఊచుస్తే మంజులం వాక్యం ప్రబద్ధకరసంపుటాః ॥౪౭ ॥ *॥ ఇతి శ్రీ శతకోటిరామచరితాంతర్గత శ్రీమదానందరామాయణే వాల్మీకీయే వివాహకాండే జలదేవీజీవదానం బాలికామోచనం నామ పంచమస్సర్గః ॥ ... ... ... ... ౫॥

గంధర్వపన్నగా ఊచుః—రామ కంజాననస్వామిన్ మోచితా బాలికాస్త్వయా । వివాహో నరజస్కానాం పుత్రైస్త్వం కర్తుమర్హసి ॥ ౧ ॥ అద్య ధన్యా వయం సర్వే నః కులం పావనం కృతం । త్వయా రామ మహాబాహో తారితాః స్మో న సంశయః ॥ ౨ ॥ సప్తజన్మసు యత్పుణ్యం కృతమస్తి రఘూద్వహ । అస్మాభిస్తేన సంబంధస్త్వయాద్య ఘటితః ప్రభో ॥ ౩ ॥ శ్రీరామదాస ఉవాచ—ఇతి తేషాం వచః శ్రుత్వా సీతయా స రఘూద్వహః । అంగీకృత్య వచస్తేషామగస్తిమవలోకయత్ ॥ ౪॥ తదా ప్రాహ కుంభజన్మా రాఘవం వచనం మునిః । రామాన్యాగ్రే కుముదస్య స్వసా నామ్నా కుముద్వతీ॥ ౫ ॥ త్వయి ప్రాప్తే హి వైకుంఠం కుశపత్నీ భవిష్యతి। చంపికాయై నతనయా భవిష్యంతి రఘూద్వ

హాపాతకములచే పాపిష్ఠులైనవారిని సంహరించుట లోకహితముకొఱకై చేసినట్లయినదిగాని స్త్రీహత్యగా నెంచబడదు.” అనియిట్లు మిక్కిలి భయభక్తులతో ప్రార్థింపగా, వారి ప్రార్థనను విని శ్రీరామచంద్రుఁడు నవ్వి తనబాణమును యథాపూర్వముగా తూణీరమున సంస్థాపించెను. అంత, నా జలదేవతలచే శ్రీరాముఁడు సంపూజింపఁబడి సంతుష్టాంతరంగుఁడై జలదేవతలను మీస్థలములకు మీరు సుఖముగాపొండని యాజ్ఞాపించెను. ఆవేళకచ్చటికి గంధర్వులును నాగులును ఇచ్చటి సమస్తవృత్తాంతము నెఱిఁగినవారై శ్రీరామ సన్నిధానమునకేతెంచి, శ్రీ సీతారాములను అగస్త్యమునీంద్రునిని వందించి, శ్రీరామునికి బహువిధంబులయిన కానుకలనర్పించి బద్ధాంజలులై మనోహరవాక్యంబులచే నిట్లు సంప్రార్థించిరి. ... ... ॥౫॥

### నాగగంధర్వులు శ్రీరాముని ప్రార్థించుట.

“రాజీవాక్షుఁడైన రామచంద్రస్వామీ! నీవీ బాలికలను చెరనుండి విడుపించితివి. రజస్వలలు కాని యిక్కన్యకలను నీపుత్రులకు పత్నులనుగా నంగీకరించి వివాహమహోత్సవంబులను చేయింపుము. మేమందఱము కృతకృత్యులయితిమి. మాయొక్కకులము మిక్కిలి పవిత్రమయ్యె. మహానుభావుండగు నీవు మమ్ముద్ధరించితివి. ఇందుకు సంశయములేదు. మేము ఏడుజన్మములనుండి చేసినపుణ్యము ఇప్పటికి ఫలించి నీసందర్శనసౌఖ్యము సంఘటించినది” అనియిట్లు ప్రార్థించిన గంధర్వనాగుల ప్రార్థనను విని శ్రీరామచంద్రుఁడు సీతతోడ నట్లేయని వారిమాట నంగీకరించి అగస్త్యమునీంద్రుని నవలోకించెను ॥౪॥ అంత నగస్త్యుఁడు రాము

హా ॥ ౬ ॥ కుశాత్పుత్రః కుముద్వత్యామతిథిస్తు భవిష్యతి । రాజ్యకర్తా వంశకర్తా స ఏవాగ్రే భవిష్యతి ॥ ౭ ॥ అతస్త్వమధునా రామ నాగకన్యాః కుశం వినా । సప్తతాః సప్తపుత్రేభ్యః ప్రయచ్ఛ విధినా ద్విజైః ॥ ౮ ॥ పంచగంధర్వకన్యాశ్చ యూపకేతుం కుశం లవం । వినాస్య పంచపుత్రేభ్యః ప్రయచ్ఛ రఘునందన ॥ ౯ ॥ రాక్షసేన వివాహేన యూపకేతుశ్శుభస్తవ । అగ్రే పత్నీం మహానేవ కరిష్యత్యపరాం శుభాం ॥ ౧౦ ॥ ఏవం రామసుతాస్సర్వే స్వస్వస్త్రీభార్యా యథాసుఖం । క్రీడయిష్యంతి పౌత్రాస్తాః భవిష్యంతి ప్రపౌత్రకాః ॥ ౧౧ ॥ ప్రపౌత్రస్య ప్రపౌత్రం త్వం దృష్ట్వా సీతా సమన్వితః । సుఖం గచ్ఛసి వైకుంఠం బంధుభిర్నగరీస్థితైః ॥ ౧౨ ॥ ఏవం శ్రుత్వా మునేర్వాక్యమంగీకత్య రఘూద్వహః । తాసాం నామాని పప్రచ్ఛ గంధర్వపన్నగానపి ॥ ౧౩ ॥ తదాబ్రవీత్స గంధర్వః స్వపుత్రీణాం సవిస్తరాత్ । తాసాం నామాని రామాగ్రే పంచానాం సంస్తవే ॥ ౧౪ ॥ చంద్రికా చంద్రవదనా చంచలా చపలాచలా । ఏవం నామాని పంచానాం క్రమేణ రఘునందన ॥ ౧౫ ॥ శ్రుత్వా విలోకయామాస పన్నగాం తేపి చాబ్రువన్ । కంజాననా కంజనేత్రా కంజాంఘ్రీ చ కలావతీ ॥ ౧౬ ॥ కలికా కమలా చైవ మాలతీ సప్రకీర్తితాః । ఏవం నామాని సర్వాసాం క్రమేణ రఘునందన ॥ ౧౭ ॥ శ్రుత్వా తాః పుష్పకే స్థాప్య తైర్నిద్రామకరోన్నిశి । అథ ప్రభాతే శ్రీరామః స్నాత్వా హుత్వా యథావిధి ॥ ౧౮ ॥ గంధర్వపన్నగాంశ్చాపి తదా వచనమబ్రవీత్ । ఏభిజ్జానైర్దుహితౄణాం వివాహార్థం

## పంచాప్సరో నాగకన్యకల వివాహములు.

నితో "స్వామీ! వినుము; నీవు వైకుంఠమునకు పోవునప్పుడు కుముదునియొక్క చెల్లలయిన కుముద్వతియనునది కుశపత్నిగా నేర్పడును. శ్రీరామా! ఈచంపికకు మొగబిడ్డలుపుట్టరు. కుముద్వతీగర్భమున కుశునికి అతిథియనువాఁడు జనించుచున్నాడు. వాఁడే రాజ్యము నేలువాఁడును వంశవర్ధకుఁడునై విరాజించుచుండును, అందువలన నిప్పుడు కుశుఁడు తప్ప. తక్కిన లవాదిపుత్రులకు నాగకన్యకల నేడుమందిని విధివిధానముగా నిప్పించి బ్రాహ్మణులచే వివాహములను చేయింపుము. నీబిడ్డఁడగు యూపకేతువు ఇంకొకపత్నిని రాక్షసవివాహవిధిచే చేసికొనుచున్నాడు. ఇతఁడు మిగులసమర్థుఁడు. ఆ నాగలపత్నియును మంగళాంగిగానుండును, శ్రీరామా! ఇట్లు నీకొమాళ్లందఱును తమతమపత్నులతోడ యథాసుఖముగా క్రీడించుచుందురు. వారికి కొడుకులును మనములును కాగలరు. మనుములకు గలిగెడు మునుములనుకూడ చూచినవాఁడవై నీవు బంధుమిత్రపౌర పరివారముతోడ వైకుంఠమునకు వెడలుచుందువు." అనిపలికిన అగస్త్యమునీంద్రుని పలుకులనువిని అట్లేసరియని యంగీకరించి శ్రీరామచంద్రస్వామి ఈకన్యకలపేళ్లేమని నాగగంధర్వులనడిగెను. అప్పుడా సరస్తీరమున గంధర్వులు తమబిడ్డలయిదుగురియొక్క నామంబులను "చంద్రిక చంద్రవదన చంచల చపల అచల" అని విన్నవించిరి. అంతనా రఘునాథుఁడు గంధర్వవాక్యమును వినినవెనుక నాగుల నవలోకించెను. అందుకు వారును "కంజానన కంజనేత్ర కంజాంఘ్రి కలావతి కలిక కమల మాలతి" అని యాక

రసాతలం ॥ ౧౯ ॥ నైవయోగ్యం సమాగంతుం మర్త్యలోకనివాసినా । తస్మాచ్ఛృణుధ్వం మద్వాక్యం సుహృదస్స కలాశ్శుభం ॥ ౨౦ ॥ యూయం గత్వా నిజస్థానం స్వస్త్రీభిశ్చ సుహృజ్జనైః । ఆగంతవ్యం వివాహార్థం మయోధ్యాం ప్రేమయా సుఖం ॥ ౨౧ ॥ అధునాహం తు గచ్ఛామి పురీమగ్రే క్షణేన హి । విహాయసా విమానేన పతాకాధ్వజమాలినా ॥ ౨౨ ॥ తథేతి రామవచనాత్తే గతాః స్వస్థలాని హి । రామోపి మునినా తాభి ర్బాలికాభిస్సుతైః స్త్రియా ॥ ౨౩ ॥ విహాయసా పుష్పకస్థో యయావపశ్య ద్వనానిసః । అయోధ్యాం ప్రహరేణైవ ముదా ప్రాప రఘూద్వహః ॥ ౨౪ ॥ నీరాజితః పురస్త్రీభిర్వివేశ రాజమందిరం । వసిష్ఠగేహే తాస్సర్వాః ప్రేషయామాస రాఘవః ॥ ౨౫ ॥ అథ రామస్సభామధ్యే సౌమిత్రిమిదమబ్రవీత్ । ఆకారణీయా రాజాన స్సుహృదశ్చ మునీశ్వరాః ॥ ౨౬ ॥ పాంథాః పురాస్సపౌరాశ్చ స్వస్వజానపదైస్సహ । శృంగారణీయాయోధ్యేయం పరిఖాస్స ప్తసాదరం ॥ ౨౭ ॥ శోధనీయాస్తథా సౌధ సమూహేషు సుభాః శుభాః । దేయాశ్చిత్రాణి లేఖ్యాని ప్రాసాదేషు సమంతతః ॥ ౨౮ ॥ దేవాలయేషు సర్వేషు సుధా దేయా మనోరమా । లేఖనీయాని చిత్రాణి బలయుః స్థాప్యతాం పృథక్ ॥ ౨౯ ॥ బంధనీయాః పతాకాశ్చ రోపణీయా ధ్వజా

---

న్యకలు పిలువఁబడుచుందురను సంగతిని యేడుగురు నాగకన్యకలయొక్క నామంబులును చెప్పిరి. పిదప శ్రీరామచంద్రుఁడు వారందఱి యభిధానంబుల నాలకించి వారినీ పుష్పకవిమానమున నెక్కించి యందఱితోడ నారాత్రి సుఖనిద్రనందెను. మఱునాఁడుదయమున స్నానముచేసి విధ్యుక్తప్రకారముగా నగ్నిహోత్రంబుల నారాధించి గంధర్వపన్నగులనుచూచి “ఈజనులతోడ మనుష్యలోకవాసియగు నేను వివాహమునకై నాగలోకమునకుగాని స్వర్గలోకమునకుగాని వచ్చుట యోగ్యముకాదు, సుహృదులగు మీరందఱును అందువలన మంగళంబగు నామాటనువినుఁడు. మీరు మీస్థానములకుపోయి మీమిత్రులతోడను కళత్రములతోడను వివాహమునకై నాయయోధ్యాపట్టణమునకు రావలయును. ఇదిగో ఇఁకక్షణమున నేను ధ్వజపతాకావందన మాలికాలంకృతమయిన విమానము మీఁదనెక్కి గగనమున నయోధ్యకు పోవుచున్నాను.” అని నిరూపించెను. అట్లే కానిమ్మని నాగులును గంధర్వులును శ్రీరామవాక్యము నంగీకరించి తమతమ నివాసస్థలములను చేరిరి ॥౨౨॥ ఇచ్చట శ్రీరామచంద్రస్వామి అకన్య

అయోధ్యలోని వివాహ మంగళాలంకార విధానము.

కలను పుత్రులనుతీసికొని సకలపరివారముతోడ పుష్పకమునెక్కి వనంబుల నవలోకించుచు పెడలి యొకజాములోపల సంతోషములో నయోధ్యాపట్టణమునుచేరెను. పౌరనారుల నీరాజనంబుల ననుమోదించుచు రాజమందిరమునుచేరి రామచంద్రుఁడు రారాజించుచుండెను. గంధర్వ నాగకన్యకలను వసిష్ఠమునీంద్రుని యింటికిపంపించెను. పిమ్మట సభాసీనుండైన రఘురాముఁడు లక్ష్మణునిఁజూచి “పురస్థులను జనపదస్థులను పరివారములను కూడ పిలిచికొనివచ్చునట్లు మిత్రులకును రాజులకును శుభలేఖలను పంపవలయును. అంతటగల మునులనందరిని పిలుపింపవలయును. ఈ యయోధ్యాపట్టణమును శృంగారింపవలయును. పడగ ద్దలను శోధింపవలయును.

అపి । సమంతతస్తోరణాని బంధనీయాని లక్ష్మణ ॥౩౦॥ వేద్యః కార్యా రుక్మమయ్యో బంధనీయాశ్చ మంటపాః। శృంగారణీయా హస్త్యశ్వశిబికాశ్చ సహస్రశః ॥ ౩౧ ॥ గంధర్వేభ్యః పన్నగేభ్యో వస్తుం గేహాని వై పృథక్ । కురుష్వ నూతనాన్యన్నవస్త్రాద్రవ్యైః పూరితాని చ ॥ ౩౨ ॥ అన్యచ్చాపి యథాయోగ్యం యద్యజ్ఞాపాని లక్ష్మణ । తత్తత్కురుష్వ యన్నోక్తం ఇయాత వరఘూద్వహ ॥ ౩౩ ॥ తద్రామవచనం శ్రుత్వా తథేత్యుక్త్వా స లక్ష్మణః । తథా చకార తత్సర్వం యథా రామేణ శిక్షితః ॥౩౪॥ అథ గంధర్వరాజస్తు తథా వై సప్తపన్నగాః । సువృద్ధిపస్సావరోధాస్తే యయుశ్శీఘ్రం ముదాన్వితాః ॥ ౩౫॥ సర్వా మానవరూపేణ హస్త్యశ్వరథసంస్థితాః । గంధర్వాశ్చాపి సైన్యైస్తే సాకేతోపవనం యయుః ॥ ౩౬ ॥ తతస్తాన్నాగతాన్ శ్రుత్వా ప్రత్యుద్గమ్య రఘూద్వహః । నానావాద్యనినాదైశ్చ నృత్తైశ్చరస్వరసాం పురీం ॥౩౭॥ నీత్వా సంస్థాపయామాస విస్తీర్ణేషు గృహేషు సః । అథ తైరేకదా రామస్సభాయాం సంస్థితస్సుఖం ॥ ౩౮ ॥ జ్యోతిర్విదస్సమాహూయ వసిష్ఠం తత్పురోధసః । పృథగ్వివాహాన్కర్తుం స ముహూర్తాన్ సతి మంగళాన్ ॥ ౩౯ ॥ సమ్యగ్విచారయామాస పక్షమధ్యాసవిస్తరం । జ్యోతిర్విదస్తదా ప్రోచుర్ముహూర్తాన్ సతి

సమస్తసౌధంబులకును క్రొత్తగా సున్నముపూయించి బాగుచేయించవలయును. అంతట ప్రాసాదంబులలో చిత్రములు వ్రాయించవలయును. సకలదేవాలయంబులను చిత్రములచే నలంకరించి బలులను సంస్థాపించి మనోహరంబులగునట్లు చక్కపరుపదగును. పతాకంబులను కట్టింపవలయును. ధ్వజంబులను స్థాపింపవలయు. అంతట తోరణంబలను అలంకరింపవలయును. సువర్ణ వేదికలను వేయించవలయును. మంగళమంటపంబులను కల్పింపవలయును వేలకొలది గుఱ్ఱములను ఏనుఁగులను పల్లకీలను శృంగారించిపెట్టింపుము. గంధర్వులకును నాగులకును వసించుటకుతగినట్లు అన్నవస్త్ర ధనకవస్తు వాహనపూరితంబులయిన నూతనగృహంబులను సిద్ధపఱుపుము. ఇవిగాక నేనుచెప్పకయుండెడు వాటిని యథాయోగ్యముగా నీకు తోచినట్లుచేయింపుము." అని యాజ్ఞాపించెను. లక్ష్మణుఁడు శ్రీరామవాక్యంబులను శిరసావహించి యథోక్తవిధానంబుగా సర్వమును సిద్ధపరచెను. అంతగంధర్వరాజును అట్లే సప్తనాగరాజులును తమతమరాణి వాసంబులతోడను మిత్రులతోడను మానవాకారంబులను స్వీకరించి హర్షాంతరంగులై నిజసైన్యంబుల తోడవచ్చి అయోధ్యారాజధానియొక్క ఉద్యానవనమునకుచేరిరి. పిదప గంధర్వనాగులు వచ్చిరని విని శ్రీరామచంద్రుఁడు రాజవిభవంబులతోడ నెదుర్కొలుపోయి వారినందరిని సంమానించి వివిధవాద్యంబులతోడను మంగళ నృత్తగీతంబులతోడను నగరములోనికి తీసికొనివచ్చి విశాలంబులగు విడిదియిండ్లలో సంస్థాపించెను ॥౩౭॥ అంత నొకదినమునందు శ్రీరామచంద్రస్వామి సుఖముగా సభాసీనుండై జ్యోతిశ్శాస్త్ర పారంగతులగు దైవజ్ఞులను పిలుపించి, వసిష్ఠులవారిని నాగగంధర్వ పురోహితులనుచూచి వేర్వేఱుగా వివాహములను

### పంద్రెండు పెండ్లిండ్లకు ముహూర్తములను నిశ్చయము.

సౌఖ్యదా ॥౪౦॥ పక్షాంతరేణ వైశాఖే ద్వౌ ముహూర్తౌ శుభావహౌ । తథాదదుముహూర్తౌ ద్వౌ జ్యేష్ఠే పక్షాంతరేణ తే ॥ ౪౧ ॥ ద్వావేవ మార్గశీర్షేఽపి త్రీన్మాఘే ఫాల్గునేపి చ । ఏవం ద్వాదశ నారీణాం చక్రుర్లగ్న వినిశ్చయం ॥ ౪౨ ॥ లవస్యాథాంగదస్యాపి వివాహౌ తైర్వినిశ్చితౌ । జ్యోతిర్విద్భిర్వసిష్ఠేన వైశాఖే రాఘవాగ్రతః ॥ ౪౩ ॥ చిత్రకేతోః పుష్కరస్య వివాహౌ తైర్వినిశ్చితౌ । జ్యేష్ఠే మాసి క్రమేణైవ పక్షే పక్షే పృథక్ పృథక్ ॥౪౪॥ తక్షస్యాథ సుబాహోశ్చ వివాహౌ మార్గశీర్షకే । పక్షాంతరేణ రామాగ్రే జ్యోతిర్విద్భిర్వినిశ్చితౌ ॥ ౪౫॥ యూపకేతో రంగదస్య చిత్రకేతోర్వినిశ్చితాః । మాఘమాసే వివాహాశ్చ జ్యోతిశ్శాస్త్రవిశారదైః ॥ ౪౬॥ పుష్కరస్యాథ తక్షస్య సుబాహోః ఫాల్గునే శుభే । వివాహా నిశ్చితాశ్శివ్య రామాగ్రే గణకైస్తదా ॥౪౭॥ ఏవం నిశ్చితాన్సర్వే వివాహాన్ద్వాదశ క్రమాత్ । జ్యోతిర్విద్భిశ్చ తాన్ముత్వా గణకానర్చయద్విభుః ॥ ౪౮ ॥

ఇతి శ్రీశతకోటి రామచరితాంతర్గతానందరామాయణే వాల్మీకీయే వివాహకాండే

ద్వాదశ వివాహ వినిశ్చయో నామ షష్ఠస్సర్గః ॥౬॥

---

నెరవేర్చుటకు దివ్యమంగళ ముహూర్తంబులను నిర్ణయింపుండని విచారింపఁబూనెను. అప్పుడు జ్యోతిర్విదులు మిక్కిలి సౌఖ్యకరంబులయిన ముహూర్తంబుల నిటు వక్కాణించిరి. వైశాఖమాసమున ౧౫ దినము లంతరముగా శుక్లపక్షమున నొక ముహూర్తము కృష్ణపక్షమున నొక ముహూర్తమును శుభకరంబులుగా నున్నవి. అట్లే జ్యేష్ఠమాసమునను శుద్ధమున నొకటియును బహుళమున నొకటియును సుఖావహంబులై యున్నవి. అట్లే మార్గశీర్షమాసమున రెండు ముహూర్తములే గలవు. మాఘమాసమునందు మూడు ముహూర్తములు ముచ్చటగానున్నవి. ఫాల్గున మాసమునను మూడు ముహూర్తములు మేలైనవి గలవు. ఇట్లు ౧౨ ముహూర్తములు ౧౨ మంది కన్యకలకును వివాహమంగళ సంగతంబులై యున్నవని నిర్ణయించిరి. పిమ్మట వారందఱును వసిష్ఠులవారితోడ నాలోచించి శ్రీరామునియెదుట లవునికిని అంగదునికిని వైశాఖమాస ముహూర్తములను నిష్కర్షించిరి. చిత్రకేతు పుష్కరులకు జ్యేష్ఠమాసమున వెవ్వేఱుపక్షంబులలో సులగ్నంబులను నిశ్చయించిరి. తక్షసుబాహువులకు మార్గశిరమాసమున నిర్ణయించిరి. యూపకేతువునకును అంగదునికిని చిత్రకేతువునకును మాఘమాసమున వరుసగా మూడు సుమూర్తములు విధింపఁబడెను. పుష్కరునికిని తక్షునికిని సుబాహువునకును ఫాల్గున మాసమున క్రమముగా మూడు ముహూర్తములు నిరూపించిరి. ఇట్లు గణకులు ద్వాదశవివాహ ముహూర్తములను నిర్ణయించిన పిమ్మట శ్రీరామచంద్రుఁడు అర్థితటిని విని యందఱిని క్రమముగా సంమానించెను. ... ... ... ॥౬॥

శ్రీరామదాస ఉవాచ—అథ తే గణకాస్సర్వే వసిష్ఠస్తత్పురోధసః । కుమారీణాం విభాగాంశ్చ చక్రుః శ్రీరాఘవాగ్రతః ॥ ౧ ॥ కంజాననాం లవాయాథ కంజాక్షీమంగదాయ చ । గణకాశ్చ యుంచక్రుః కంజాంఘ్రీం చిత్రకేతవే ॥ ౨ ॥ కలావతీం పుష్కరాయ తథా తక్షాయ కాలికాం । సుబాహవే చ కమలాం మాలతీం యూపకేతవే ॥ ౩ ॥ గణకాస్సస్తతా ఏవం నాగకన్యా వినిశ్చితాః । చంద్రికామంగదాయాథ చంద్రాస్యాం చిత్రకేతవే ॥ ౪ ॥ చంచలాఖ్యాం పుష్కరాయ తక్షాయ చపలాం తథా, సుబాహవే త్వచలాం ప్రోచుస్తే గణకాదయః ॥ ౫ ॥ ఏవం గంధర్వకన్యాస్తాః పంచవిప్రైర్వినిశ్చితాః । ఏవం వినిశ్చయం కృత్వా గణకాదీన్ రఘూత్తమః ॥ ౬ ॥ విసృజ్య మైథిలీం గత్వా సర్వం వృత్తాంతమ్న్యవేదయత్ । తతో యయుః కోటిశస్తే పార్థివాశ్చ మునీశ్వరాః ॥ ౭ ॥ సప్తద్వీపాంతరస్థాశ్చ సావరోధాస్సబాలకాః । నానావాహనసంస్థాశ్చ పౌరైర్జానపదైర్ద్విజైః ॥ ౮ ॥ తైస్సా అయోధ్యాపురీ వ్యాప్తా విరేజే నితరాం తదా । యయౌ విభీషణశ్చాథ సుగ్రీవోపి ప్లవంగమైః ॥ ౯ ॥ యయౌ సభూరికీర్తిశ్చ పుత్రాభ్యాం శీఘ్రమాదరాత్ । యయౌ సజనకశ్చాపి యుధాజిత్సయయౌ తదా ॥ ౧౦ ॥ కౌసల్యాయాస్సుమిత్రాయా బాంధవాస్సమాయయుః ।

తరువాత నాగణకులును వసిష్ఠుండును ఆగంధర్వనాగుల పురోహితుఁడునుచేరి శ్రీరామచంద్రుని సన్నిధానమున గంధర్వనాగకన్యకల నిట్లుపంచిరి. కంజాననను లవునికిని, కంజాక్షిని అంగదునికిని, కంజాంఘ్రిని చిత్రకేతువునకును, కలావతిని పుష్కరునికిని, కాలికను తక్షునికిని, కమలను సుబాహువునకును, మాలతిని యూపకేతువునకును, ఇచ్చి వివాహముహూర్తములను నెరవేర్చుటకు పొంతనములు మొదలయినవి చక్కగా నమరియున్నవని యేడుగురు నాగకన్యకలకును గణకాదులు వరులను నిశ్చయించిరి. చంద్రికను అంగదునికిని చంద్రాస్యను చిత్రకేతువునకును, చంచలను పుష్కరునికిని, చపలను తక్షునికిని, అచలను సుబాహువునకును, ఇచ్చి పెండ్లిజరుపుటకు తగియున్నదని దైవజ్ఞులు గంధర్వకన్యకలైదుగురికిని వధూవర ఘటితార్థనిర్ణయము నొనరించిరి. శ్రీరామచంద్రుఁడు ఇట్లు సభలోనందఱి యెదుట ౧౨ వివాహములలోను వధూవరులను నిశ్చయించికొని, గణకాదులను సత్కరించి పంపించి సీతాదేవికి సమస్తవృత్తాంతమును సవిస్తరముగా చెప్పెను. ॥౬॥ అటుమీఁద కోట్లకొలఁది సప్తద్వీ

శ్రీరామచంద్రుఁడు ఏడుగురుకొమాళ్లకు పంద్రెండు వివాహములను చేయించుట.

పములలోగల రాజేంద్రులు తమతమపత్నులతోడను బాలకులతోడను పౌరజానపదాది సమస్తపరివారంబులతోడ వివిధవాహనారూఢులై యయోధ్యానగరమునకు వచ్చిరి సమస్తమునీంద్రులును నిజశిష్యవర్గంబులతోడ దయచేసిరి. వారలందఱిచేనిండి యయ్యయోధ్యారాజధాని రారాజించుచుండెను. విభీషణుఁడును, కపీంద్రులతోడ సుగ్రీవుండును, తనయిరువురు కొడుకులతోడ భూరికీర్తిరాజును, సపరివారుఁడగు జనకమహారాజును, యుధాజిత్తుకూడ నందఱును వచ్చిచేరిరి. కౌసల్యాదేవియొక్క బంధువులును సుమిత్రయొక్క బాంధవులును నంకె

అథరామస్తు వైశాఖ శుక్లేద్విజవరైస్సహ ॥ ౧౧ ॥ పురోధసా సుహృద్భిశ్చ స్నానమభ్యంగపూర్వకం । కృత్వాలవా యమాంగల్యం స్నానార్థం స్త్రీః ప్రచోదయత్ ॥ ౧౨ ॥ తతో ముహూర్తసమయే వధూచ్ఛిష్టాంశిఖాంలవం । సమ్యక్ లిప్యసుతైలాద్రాణాం సీతాద్యామాతరస్తదా ॥ ౧౩ ॥ స్వాపయంస్సుర్ముదాసర్వాస్తూర్యనాదైస్సబాలకాః అథరామో దేవకస్య ప్రతిష్ఠాం బ్రాహ్మణైస్సహ ॥ ౧౪ ॥ ఆదౌకృత్వాగణపతేః పూజాంసమ్యగ్యథావిధి । పుణ్యాహాదిత్రయంచాపి కృత్వాపూర్వంసవిస్తరం ॥ ౧౫ ॥ చకారవిధివత్తుష్టః పూజయామాసవై మునీన్ । తతో ముహూర్తసమయే గత్వాపన్నగమందిరం ॥ ౧౬ ॥ లవస్యకంజనయనా వివాహంవినివర్తయత్ । చతుర్థేదివసే వంశపాత్రస్థై రత్నదీపకైః ॥ ౧౭ ॥ నీరాజితస్తదాలవో విరేజేమంటపేస్త్రియా । తతో నిజగృహంగత్వా పూర్వోక్తైరుత్సవాదిభిః ॥ ౧౮ ॥ లవేనకారయామాస లక్ష్మీపూజనముత్తమం । తతో దానాన్యనేకాని దదౌ సరఘునందనః ॥ ౧౯ ॥ తతస్తే పార్థివాస్సర్వే తథాతే పన్నగా అపి । సుహృదశ్చాథగంధర్వాః పౌరాజనపదాదయః ॥ ౨౦ ॥ పూజయామాసుః శ్రీరామం వస్త్రైరాభరణాదిభిః । తథాతాన్ లక్ష్మణాదీంశ్చ కుశాద్యాంశ్చాపి బాలకాన్ ॥ ౨౧ ॥ తతస్సాన్నృప

కావలసిన వారందఱునువచ్చిరి. అంత శ్రీరామచంద్రుఁడు వైశాఖశుక్లమున, బ్రాహ్మణులతోడను పురోహితులతోడను మిత్రులతోడను అభ్యంగ మంగళస్నానములనాచరించి లవునిని మంగళస్నాన పూర్వకముగా పెండ్లికొడుకును చేయుండని వృద్ధసువాసినులను పేరిరించెను. వారునట్లే వధూచ్ఛిష్టమనిన సువాసినీపూజాప్రార్థనాశేషమగు మంగళకరమయిన పసపును పూసి లవునికి దివ్యపరిమళతైలంబులచే నభ్యంగమును చేయించి, సీతాదేవి మొదలయిన తల్లులుగూడ మంగళస్నానమును చేయించి, వారును మంగళాభ్యంగస్నానములంజేసికొని యలంకార పూర్ణలయి నెలయుచుండిరి. బాలకులందఱును సుస్నాతులై సాలంకృతులై బరగుచుండిరి. తూర్యాది మంగళవాద్యంబులు సంగతంబులై మ్రోగుచుండినవి. పిదప శ్రీరఘురాముఁడు బ్రాహ్మణులతోడ దేవకప్రతిష్ఠనుచేసి శ్రీమహాగణపతిని పూజించి యథావిధానంబుగా చక్కగాప్రార్థించి, పుణ్యాహ నవగ్రహనాందులను కర్మత్రయమును నెరవేర్చి, విధివిధానంబుగా మునీంద్రులనందఱిని పూజాసత్కారంబులచే సంతోషపరచెను. అంత ముహూర్తసమయంబునకు పన్నగరాజుల విడిదియింటికి వెడలి లవునికిని కంజనయనకును కండ్లపండుగగా పెండ్లి చేయించెను. నాలగవనాడు లవుండు మంగళమంటపంబున నూతన పత్నితోడ వంశపాత్రంబులలోని రత్నదీపంబులచే నీరాజితుండై విరాజించుచుండెను. పూర్వోక్తంబులయిన సమస్త విభవోత్సవంబులతోడ శ్రీరాముఁడు నిజరాజమందిరంబునకువచ్చి లవునిచే శ్రీమహాలక్ష్మీ పూజనంబునుచేయించి వివిధంబులగు మహాదానంబుల నొసంగెను. అపుడు పెండ్లికివచ్చియుండిన సమస్తరాజులును నాగులును మిత్రులును గంధర్వులును నాగరికులును దేశమువారును శ్రీరామచంద్రస్వామిని వస్త్రాభరణాద్యమూల్యదివ్యవస్తువులచే పూజించిరి. అట్లే లక్ష్మణాదులును

పత్న్యశ్చ సుహృత్ పత్న్యః పృథక్ పృథక్ । నాగపత్న్యశ్చగంధర్వ పత్న్యశ్చాన్యాస్తథాస్త్రియః ॥ ౨౨ ॥ సీతాద్యాః పూజయామాసుః వస్త్రైరాభరణాదిభిః । సీతాపి తాన్సుహృత్పత్నీ స్తథాపార్థివకామినీః ॥ ౨౩ ॥ పూజయామాసవిధివద్వస్త్రైరాభరణాదిభిః । రామోపిసుహృదః పౌరాన్ గంధర్వాన్ పన్నగాన్నృపాన్ ॥ ౨౪ ॥ వస్త్రైరాభరణైర్యానైః పూజయామాససాదరం । ఏవంవైశాఖమాసేతు సితేపక్షేలవస్యచ ॥ ౨౫ ॥ కృత్వావివాహంరామస్స కృష్ణపక్షేతుమాధవే । చకారపూర్వవద్ధర్షా ద్వివాహంహ్యంగదస్యచ ॥ ౨౬ ॥ చిత్రకేతోః పుష్కరస్యవివాహౌరఘునందనః । జ్యేష్ఠమాసేశుక్లకృష్ణ పక్షయోరకరోన్ముదా ॥ ౨౭॥ తతస్సర్వాన్ నృపాదీంశ్చ దదావాజ్ఞాంసుపూజితాన్ । తతఃపునస్తానాహూయ పూర్వవన్మార్గశీర్షకే ॥ ౨౮ ॥ తక్షస్యాథసుబాహోశ్చ వివాహావకరోత్ప్రభుః । తతస్సర్వాన్నృపాన్ రామో దదావాజ్ఞాంసుహృజ్జనాన్ ॥ ౨౯॥ తతఃపునస్తానాహూయ మాఘమాసేనుహృన్నృపాన్ । యూపకేతోరంగదస్య చిత్రకేతోర్మహోత్సవైః ॥ ౩౦ ॥ వివాహానకరోద్రామః పార్థివాన్సవిసర్జయత్ । పుష్కరస్యాథతక్షస్య సుబాహోశ్చమహోత్సవైః ॥ ౩౧ ॥ చకార[illegible]ల్గునేమాసి వివాహాన్జానకీనపః । ఏవంకృత్వావివాహాంశ్చ రామోద్వాదశసాదరం ॥ ౩౨ ॥ నృపైస్సంపూజితస్సర్వాన్ స్వాశ్యా

కుశాదిరాజపుత్రులను సత్కరించిరి. పిదప నృపపత్నులును మిత్రపత్నులును నాగపత్నులును గంధర్వపత్నులును వేర్వేఱుగా సీతాదేవి మొదలుగాగల యంగనామణులనందఱిని వస్త్రాభరణాది దివ్యవస్తువులచే నారాధించిరి. సీతమ్మయును వారినందఱిని సముచిత సత్కారంబులచే సంతోషపరచెను. ఇట్లు వైశాఖమాసంబున శుక్లపక్షంబున లవునికి వివాహమును చేసి, శ్రీరామచంద్రుఁడు వైశాఖకృష్ణపక్షమున యథాపూర్వముగా మిక్కిలిహర్షముతోడ అంగదునికి వివాహమహోత్సవమును చేయించెను. జ్యేష్ఠశుక్ల కృష్ణపక్షంబులలో చిత్రకేతుపుష్కరులకు పెండ్లిండ్లు బాగుగా జరిగినవి. అప్పుడు శ్రీరఘురాముఁడు సమస్తరాజులను మిత్రులను సత్కరించి యాజ్ఞనిచ్చిపంపించెను. అంత నట్లే మరల వారిని పిలిపించి పూర్వమువలెనే మార్గశీర్షమాసమున తక్షునికినిసుబాహువునకును వివాహములసుచేయించెను. అంతశ్రీరాముఁడు మిత్రమండలికిని ధాత్రీపతిమండలికిని ఆజ్ఞనిచ్చిపంపించెను. మరల వారినిపిలిపించి, వచ్చి మిలత రాజబృందముతోడ మాఘమాసంబున యూపకేతువునకును అంగదునికిని చిత్రకేతువునకును అత్యంతవైభవంబులచే వివాహములను చేయించి రాజులను పంపకయట్లే నిలిపికొని, ఫాల్గునమాసమున పుష్కరునికిని తక్షునికిని సుబాహువునకును మహోత్సవంబులతోడ పెండ్లిండ్లు చేయించెను ఇట్లు జానకీరమణుఁడు పండ్రెండు మంగళవివాహములను చేయించి సమస్త రాజబృందముచే నారాధింపఁబడి, వారినందఱిని సముచిత సత్కారంబులచే సంమానించి పంపించెను. మఱియు మునీంద్రులనందరిని సంపూజించి వారి వారియాశ్రమంబులలో వదలిపెట్టెను. గంధర్వులును పన్నగులును సాకేతరాజధానిలోనే వసించువారలై సాక్షాత్ రామచంద్రస్వా

జ్ఞాంన్నపత్రీం దదౌ । పూజయిత్వా మునీంశ్చాపి విససర్జ రఘూద్వహః ॥౩౩॥ గంధర్వపన్నగాస్సప్త తే సాకేతే త్రసం
స్థితాః । రామం ముక్త్వా న తే నైజం స్థలం జగ్ముర్ముదాన్వితాః ॥౩౪॥ మంత్రిణః ప్రేషయామాసుః స్వస్వరాజ్యేషు తే పృ
థక్ । యదా రామస్స వైకుంఠ మగ్రే గచ్ఛతి కాలతః ॥ ౩౫ ॥ తదా సాంతానికాఁల్లోకాం స్తే గచ్ఛంతి న సంశయః ।
అథ రామః పన్నగానాం గంధర్వాణాథ సద్మసు ॥ ౩౬ ॥ వార్షికేషూత్సవేష్వత్ర సావరోధస్సుహృజ్జనైః । పౌరైః
స్వీయైర్భోజనాది గత్వా హ్యంగీకరోత్సదా ॥ ౩౭ ॥ సదా మహోత్సవాశ్చాసన్నయోధ్యాయాం గృహే గృహే
ఆనందస్సర్వదైవాసీ న్నాసీత్కుత్రాప్యమంగలం ॥ ౩౮ ॥ అథ తేషాం రాఘవేణ పుత్రాణాంచ పృథక్ పృథక్ । అష్ట
కృత్వాతు గేహాని పృథక్కృత్వాథ శాంతయః ॥౩౯॥ తేషు తే స్థాపితాస్సర్వే స్వస్వస్త్రీభ్యాం పృథక్ సుఖం । తథా తే
లక్ష్మణాద్యాశ్చ పృథగ్గేహేషు బాంధవాః ॥౪౦॥ పూర్వమేవ స్థాపితాశ్చ స్వస్వపత్నీముదాన్వితాః । సుమిత్రా
సాతు సౌమిత్రేః స్వీయ గేహే వసత్సుఖం ॥ ౪౧ ॥ కైకేయీ భరతస్యాథ గేహే మాసమువాస సా । తస్థౌ శత్రుఘ్న
గేహేపి మాసమేకం యథాసుఖం ॥ ౪౨ ॥ ఏవం సా పుత్రయోర్గేహే కరోద్వాసం ముదాన్వితా । కౌసల్యాపి
రామగేహే తస్థౌ సీతాతిసేవితా ॥ ౪౩ ॥ తే సర్వే బాంధవాః పుత్రా నిజయానైశ్చ సేవకైః । స్వదాసీగోధనాద్యై

మి సాంగత్యమున గల్గుచుండు బ్రహ్మానందమును వదలిపోజాలక యచ్చటనే విహరించుచుండిరి.
మఱివారు తమతమ రాజ్యంబులకు వేర్వేఱుగా తమతమ మంత్రులను పంపించిరి॥౩౪॥ కాలక్రమ

### బంధుపుత్రాదులతోడ శ్రీరాముఁడు కలసిమెలసి యుండుట.

ముగా నెకనెపుడు శ్రీరాముఁడు వైకుంఠనగరమునకు వెడలునో, అప్పుడు ఆగంధర్వపన్నగులు నిజనిజసంతానంబులుగల లోకంబులకు పోదురు. అంతవరకు శ్రీరామపరబ్రహ్మసన్నిధానమును వదలరు. ఇందుకు సంశయములేదు. అంతనా శ్రీరామచంద్రుఁడు గంధర్వపన్నగుల యిండ్లలో వార్షికాదిమహోత్సవ దినములయందు తన సమస్తపరివారముతోడను వెడలి వారుచేయుంచెడు భోజనాది సమస్తసత్కారంబులను అంగీకరించుచుండెను. అయోధ్యాపట్టణమున నిరంతరము మహోత్సవంబులు జరుగుచుండినవి. ఇంటింటను మంగళవిభవంబులు సంగతంబులై బరగుచుండె. అంతట నానందంబు నిండియుండె. ఎచ్చటను అమంగళమనునది యడుగంటిపోయె. పిమ్మట శ్రీరామచంద్రుఁడు ఆ పుత్రు లెనమండుగురికిని వేర్వేఱుగా దివ్య రాజమందిరంబులను కల్పించి వాటికి విధిప్రకారముగా వాస్తుశాంతులనుచేయించి, వాట్లలో నాపుత్రులను వారివారి పత్నీపరివారంబులతోడ సంస్థాపించెను. మునుపే నిజనిజ పత్నీపరివారంబులతోడ లక్ష్మణాదులు సంతోషముగా పృథగ్రాజమందిరంబులలో బరగుచున్నారుగదా? ఆసుమిత్రాదేవి తనయొక్క లక్ష్మణుని యింటిలో సుఖముగా నివసించుచుండెను. కైకేయి ఒకనెల యథాసుఖముగా భరతుని యింటిలోను ఒకనెల శత్రుఘ్నుని యింటిలోను ఇట్లు తనయిరువురి కొడుకుల యిండ్లలోను సంతుష్టహృదయయై పూజ్యురాలైయుండెను. శ్రీకౌసల్యాదేవి శ్రీరామమం

శ్చ సుఖమాపుః పృథక్ పృథక్ ॥ ౪౪ ॥ అథ తే లక్ష్మణాద్యాశ్చ కుశాద్యా బాలకా అపి । స్వస్వగేహేషు వై ప్రాతః స్నాత్వా హోమార్క శివార్చనం ॥ ౪౫ ॥ గోద్విజాంశ్చాదిసంపాద్య తత స్తే రాఘవం యయుః । నత్వా రామం జానకీం తే తస్థుః దివ్యాసనోపరి ॥ ౪౬ ॥ తేషాం సర్వాః స్త్రియశ్చాపి స్నాత్వా దుర్గాం ప్రపూజ్య చ । గత్వా సీతాం ప్రణేముః ప్రా స్తస్థుస్సీతాజ్ఞయాఽఽసనే ॥ ౪౭ ॥ తత స్తే లక్ష్మణాద్యాశ్చ కుశాద్యాః స్వగురోర్ముఖాత్ । కథాం పౌరాణికీం శ్రుత్వా జగ్ముః స్వం స్వం గృహం ప్రతి ॥ ౪౮ ॥ తత స్సర్వే రామగేహే సమాహూతా ముదాన్వితాః । ఉపహారాన్ పృథక్ చక్రు ర్మధ్యాహ్నే భోజనాన్యపి ॥ ౪౯ ॥ ఏవం తేషాం స్త్రియశ్చాపి సమాహూతా స్తు సీతయా । ఉపహారాన్ భోజనాని చక్రుస్సీతాగృహే సదా ॥ ౫౦ ॥ కదాచిదాస్వీయగేహే రాఘవేణాథ సీతయా । ఉపహారాన్ భోజనాని చక్రు స్తే బ్రాహ్మణాదిభిః ॥ ౫౧ ॥ ఏవం తైర్బంధుభి ర్బాలైః ప్రాపతుర్నితరాం సుఖం । సీతారామౌ దానాసీత్కలహః క్వాపి కస్యచిత్ ॥ ౫౨ ॥ * ॥ ఇతి శ్రీశతకోటి రామచరితాంతర్గత శ్రీమదానందరామాయణే వాల్మీకీయే వివాహకాండే ద్వాదశవివాహవర్ణనం నామ సప్తమస్సర్గః ॥ ... ... ... ... ..., ౭॥

దిరంబున జానకీదేవీసంసేతయై నిలచెను. ఇట్లు సమస్తబాంధవులును పుత్రులును నిజనిజ వాహనంబులతోడను సేవకులతోడను స్వదాసీదాసవర్గముతోడను గోధనంబుతోడను వేర్వేఱుగా నానందించుచుండిరి. అంతనా లక్ష్మణాదులును కుశాదిబాలకులును తమతమ మందిరంబులలో ప్రాతఃస్నానంబులను అగ్నిహోత్రంబులను శివార్చనంబులను గోబ్రాహ్మణ పూజాసత్కారంబులను నెరవేర్చి శ్రీరామసన్నిధికివచ్చి శ్రీసీతారాముల చరణారవిందంబులకు వందించి సుఖాసీనులగుచుందురు. వారి పత్నులందరును కూడ స్నానంబులనాచరించి గౌరీపూజనాది సత్కార్యంబులను నెరవేర్చి సీతాదేవి వద్దికేతెంచి యామెనువందించి తదాజ్ఞానుసారముగా పీఠములపై యాసీనులగుచుందురు. అంతనుదయమును లక్ష్మణాదులు కుశాదులు తత్తత్పత్నులును శ్రీవసిష్ఠమునీంద్రులవారు అనుగ్రహించి చెప్పెడు పౌరాణిక గాథలనువిని నిజనిజ దివ్యమందిరంబులకు వెడలుచుందురు. అంత నందఱును శ్రీరామమందిరంబునకువచ్చి ఫలాహారాదులను మధ్యాహ్నభోజనంబులను సంతోషముగా నారగించుచుందురు. ఇట్లె సీతామందిరమునందు పంతతము జానకీదేవిచే పిలువంబడి కోడికోడండ్రును కోడండ్రునువచ్చి ప్రసాదంబులనంది యానందించుచుందురు. ఒకప్పుడు శ్రీరాముఁడు బ్రాహ్మణులతోడను సీతాదేవితోడను ఫలాహార భోజనాదులను స్వీకరించి యానందించుచుండు. ఇట్లు శ్రీరామచంద్ర పరబ్రహ్మవస్తు జగన్నాటక ప్రదర్శకుండై తమ్ముండ్రతోడను కొడుకులతోడను చేరి సంసారవిభవ భోగంబులననుభవించుచుండెను. ఒకప్పుడును ఒకరితోడను శ్రీసీతారాములకు వైమనస్యకలహంబులనునది లేదు. ఇదికదా సంసారసారము. ... ... ... ... ... ... ॥౭॥

శ్రీరామదాస ఉవాచ — అథైకదా దక్షిణేహి శివకాంత్యాం మహారిపుః । కంబుకంఠో నృపశ్శ్రీమాన్ నిజకన్యాస్వయంవరం ॥ ౧ ॥ కర్తుకామో నృపాన్సర్వా నాహ్వాయామాస సాదరం । తదా తే పార్థివాస్సర్వే. పత్రాణిహి పృథక్ పృథక్ ॥ ౨ ॥ పూర్వవైరమనుస్మృత్య కుశస్యాపి లవస్య చ । స్వయంవరే స్వీయమాన భంగనోద్భూతహృత్ స్థితం ॥ ౩ ॥ ప్రేషయామాసుర్నృపతిం నయయుశ్చ స్వయంవరం । తేషాం పత్రాణి సర్వాణి కంబుకంఠో దదర్శ సః ॥ ౪ ॥ సర్వేషు లిఖితస్త్వేక వివాహార్థస్తం వదామ్యహం । యది నాయాంతి రామస్య బాలకాస్తే స్వయంవరే ॥ ౫ ॥ వయం సర్వే తిహీఽయామో జంబుద్వీపాంతరస్థితాః । ఇతి తేషామభిప్రాయం జ్ఞాత్వా స నృపతిస్తదా ॥ ౬ ॥ నసమాహ్వయచ్ఛ్రీరామ మాహ్వాయామాస పార్థివాన్ । స్వయ చాపిస్మరన్వైరం తదేవం రామపుత్రయోః ॥ ౭ ॥ చంపికాసుమతీపాణి గృహణీయం పురాతనం । తతస్తే పార్థివాస్సర్వే శ్రుత్వా రామం హి నాగతం ॥ ౮ ॥ సప్తద్వీపాంతరస్థాశ్చ యయుః కాంతిపురీం ప్రతి । అథ తాం కంబుకంఠస్య కన్యాం మదనసుందరీం ॥ ౯ ॥ ప్రాసాదసంస్థితాం దృష్ట్వా నారదః ఖాత్సమాయయౌ । సఖీభిస్సా మునిం పూజ్య వినయాత్పురతః స్థితా ॥ ౧౦ ॥ పప్రచ్ఛ నారదం భక్త్యా వి స[illegible]వనతాశ్రవైః । కుతస్సమాగతం స్వామిన్ సత్యం తత్కారణం వద ॥ ౧౧ ॥ భవతాం దర్శనేనాద్య పావిత్ర్యం

## కాంతిపురీ కంబుకంఠరాజు తనకూతురికి స్వయంవరమును చేయించుట.

అంత నొకప్పుడు దక్షిణభాగంబున శివకాంతిలో కంబుకంఠనాముఁడయిన మహాశత్రువగు రాజొకఁడు సంపన్మదాంధుఁడై తనకూతురికి స్వయంవరమహోత్సవమును చేయనెంచి సాదరముగా నందఱురాజులకును శుభలేఖను వ్రాసిపంపెను. అప్పుడా రాజులందఱును వేర్వేఱుగా తమకువచ్చిన పత్రములచూచికొని కుశలవులయొక్క చంపికాసుమతీ స్వయంవర సమయమునందలి వైరమును స్మరించినవారలై తమకప్పుడుగల్గిన యవమానముచే దుఃఖించుచు కంబుకంఠునికి చెప్పిపంపిరేగాని యొకరైనను స్వయంవరమునకు రాకపోయిరి. వారు ప్రత్యుత్తరముగా వ్రాసినజాబులను కంబుకంఠరాజు చూచి చదివికొనెను. అందఱు వ్రాసినసంగతియు నొక్కటిగానుండును. అది యేమనిన. "నీవుచేయించు స్వయంవరమునకు శ్రీరాముని పుత్రులు రాకయుండిన నప్పుడుమేము తప్పక వచ్చుచున్నారము. వారువచ్చు పక్షమునందు మేము రాచాలము." అనియిట్లు వ్రాసియుండిన సమస్తనృపుల లేఖనమును పరిభావించి, ఆరామపుత్రులయందు అప్పటి చంపికాసుమతీ స్వయంవర జన్యవైరమును తానుగూడ స్మరించువాఁడై శ్రీరామచంద్రస్వామిని పిలువక తక్కిన నరపాలకులనందఱిని పిలుపించెను. పిపద సప్తద్వీపాంతరగతులయిన సమస్తభూపతులును శ్రీరాముఁడురాలేదను సంగతినెఱిఁగి కాంతిపురికి సంతోషముతోనే తెంచిరి. ఇట్లుండగా గగనమునుండి నారదమునీంద్రుఁడు భూలోకమున

## మందనసుందరితో నారదముని మాటాడిపోవుట.

కవతరించుచు మేడమీఁద వేడుకల పంతుగానుండిన కంబుకంఠ రాజపుత్రియైన మదనసుంద

పరమంగతా । ఇతితస్యావచః శ్రుత్వా కించిత్ స్మిత్వామునిస్తదా ॥౧౨॥ తామాహ బాలే స్వర్లోకా దాగతోస్మ్యధు
నాత్వహం । అయోధ్యాయాం రాఘవస్య పుత్రాణాంతుపృథక్ పృథక్ ॥౧౩॥ గేహే సంభోక్తుకామోద్య నిర్గతో
స్మివిహాయసా । ఏతస్మిన్నంతరేకాంతి పుర్యాస్సైన్యానివైబహిః ॥ ౧౪ ॥ దృష్ట్వాకేషాంహి సైన్యాని సంతీతిహృది
చింతితం । తతః పాంథముఖాచ్ఛ్రుత్వా తవచాత్రస్వయంవరం ॥ ౧౫ ॥ తదావినిశ్చితంచిత్తే మయారామః స్వయం
వరే । అత్రైవాస్తిహ్యాగతశ్చే త్తంపశ్యామి సబాలకం ॥ ౧౬ ॥ నైవాస్తిహ్యాగతశ్చేద్వై తర్హియాస్యామ్యతఃప
రం । స్వయంవరోవినారామం నభవిష్యతిసాత్మజం ॥ ౧౭ ॥ పశ్యామ్యత్రైతంరామం వృథాత్రేగమనంమమ । ని
శ్చిత్యేత్థంసమాయాతస్తతోదృష్ట్వారఘూత్తమం ॥ ౧౮ ॥ కథంరామోనాగతోత్ర చేతిపృష్టానృపామయా । నృపాభి
ప్రాయమాకర్ణ్య తదాఖిన్నంమనోమమ ॥ ౧౯ ॥ సప్తద్వీపపతింరామం బంధుబాలకసంయుతం । స్వయంవరమ
నాహూయ త్వత్పిత్రానిశ్చితంనృపైః ॥ ౨౦ ॥ అధునాహంప్రగచ్ఛామి సాకేతంపురంరఘూత్తమం । మందభాగ్యాసిబా
లేత్వం స్నుషారాఘవసత్పతేః ॥ ౨౧ ॥ యతోజాతాసినైవాత్ర విచిత్రాకర్మణోగతిః । ఇత్యుక్త్వాబాలికాంప్ర

రినిచూచి యస్స్త్రీయాకన్యకయొక్క అంతఃపురసౌధమును ప్రవేశించెను. సఖీజనపరివృతయ
గు ఆమదనసుందరి మునీంద్రునింబూజించి మిక్కిలి భయభక్తులతో నెదుటనిలిచెను. మఱియు
నామునీంద్రునిని “స్వామీ! ఎచ్చటినుండి దయచేసితిరి? ఇప్పుడెచ్చటికి పోవుచున్నారు. తమ
దర్శన మగుటచేత నిప్పుడు మిక్కిలి పవిత్రతగల్గినది.” అనియత్యంత వినయముతో విన్నవించె
ను. అంతనా నారదముని యాలలనామణి యొక్క పలుకులనువిని కొంచెము చిఱునవ్వునవ్వి
యామెతో, “బాలికా! నేనిప్పుడు స్వర్గలోకమునుండి వచ్చుచున్నాను. అయోధ్యారాజధానిలో
శ్రీరాముని సన్నిధానమున నెనమండుగురు పుత్రులు వెవ్వేఱుగా తమతమ యిండ్లలో నత్యం
తవైభవ భోగంబులనందుచుందురు. వారియిండ్లలో పోయి భుజింపవలయునను కోరికగల్గి వె
డలితిని. ఇదిగోపోమను. అయితే నేను గగనమార్గమున వచ్చుచుండగా నికాంతిపురికి చు
ట్టుత బయట విశేషముగా సైన్యములు నిలిచియుండగా నివియెచటివని చింతించి నడుమనొక
బాటసారివలన నీకు స్వయంవరమహోత్సవంబు జరుగుచున్నదను మంగళవృత్తాంతమును
వింటిని. అప్పుడు నామనమున శ్రీరాముఁడు ఈస్వయంవరమహోత్సవమునకు వచ్చియుండిన
పక్షమందు నేనిచ్చటనే పుత్రులతోడ నా శ్రీరఘురామమూర్తిని దర్శించెదనని కుతూహలిత చి
త్తుండనైతిని. ఒకవేళ శ్రీరాముండు పుత్రులతోడ నిచ్చటికి దయచేయకయుండిన నప్పుడు అ
యోధ్యకు పోదును. వృథాయేల ప్రయాసపడవలయును? సపుత్రుండగు శ్రీరామచంద్రునివిడి
చి స్వయంవరముకూడ జరుగునా? అని నిశ్చయించికొని వచ్చిచూచితిని. శ్రీరాముండు రాడ
య్యె. ఏమి ఇట్లుజరిగినదని మీతండ్రినడిగితిని. అతని యభిప్రాయమునువిని నామనస్సు మి
క్కిలి కలతనందెను. ఆహా! చూచితివా! మీతండ్రి సప్తద్వీపాధిపతియై చక్రవర్తిగా రారాజిం

ష్ట్వా నారదో గంతుముద్యతః ॥ ౨౨ ॥ తతస్సంప్రార్థయామాస నారదం బాలికా ముహుః । ఖిన్నచిత్తాశ్రుపూర్ణాక్షీ మ్లానాస్యా స్ఫురితాధరా ॥ ౨౩ ॥ రోమాంచితతనుర్ముగ్ధా గతశ్రీర్గద్గదస్వరా । యేనాహం మునిపౌత్రస్త్రీ స్నుషా శ్రీరాఘవస్య చ ॥ ౨౪ ॥ భవిష్యామి తథా కార్యం త్వయా త్వాం శరణం గతా । ఇత్యుక్త్వా మునివర్యస్య పాదయోః స్థాప్య సా శిరః ॥ ౨౫ ॥ చకార కరుణాం బాలాం తదా తాం మునిరబ్రవీత్ । మా చింతాం కురు రంభోరు త్వముత్తిష్ఠస్వ బాలికే ॥ ౨౬ ॥ భవిష్యసి త్వం రామస్య స్నుషా యత్నం కరోమ్యహం । ఇత్యుక్త్వా తాం సమాశ్వాస్య స్వమార్గేణ మునిర్యయౌ ॥ ౨౭ ॥ ఏతస్మిన్నంతరే యోధ్యాపుర్యాః స్యందనసంస్థితః । యూపకేతుర్వనం పశ్యం స్తమసాతీరమాయయౌ ॥ ౨౮ ॥ కించిత్సైన్యయుతో బాలస్తమసాయాం విగాహ్య సః । యావత్సంధ్యాదికం కర్తుముపవిష్టస్తదా మునిం ॥ ౨౯ ॥ దదర్శ నారదం నత్వా పూజయామాస సాదరం । తతః సప్రచ్ఛ మునయే యూపకేతుః పురః స్థితః ॥ ౩౦ ॥ కుతస్సమాగతం చేతి తచ్ఛ్రుత్వా నారదో మునిః । సర్వం వృత్తం సవిస్తారం కథయామాస బాలకం ॥ ౩౧ ॥ తచ్ఛ్రుత్వా సకలం వృత్తం నత్వా తం నారదం మునిం । అబ్రవీద్బాలకో వాక్యం సక్రోధస్సంభ్రమాన్వితః ॥ ౩౨ ॥ మునే నృపా

మచుండు రామచంద్రస్వామిని వదలి యీ రాజులతో గలసి నీకు స్వయంవరమహోత్సవమును జరిపించుచున్నాడు. ఇదిగో నేను సాకేతరాజధానికి వెడలిపోవుచున్నాను. నీవు దురదృష్టముగలదానవై శ్రీరామచంద్రస్వామికి కోడలు కాకపోతివి." అనియిట్లు మాటలాడి నారదమునీంద్రుడు బయలువెడలుట కుద్యమించెను. అంత నామదనసుందరి మిక్కిలి చింతాక్రాంతయై కన్నీరు కమ్మివచ్చుచుండగా గద్గదస్వరంబును రోమాంచంబును స్వేదంబును అధరస్పందంబును నిజమనఃస్థితిని చూపుచుండగా వాడిన మోముగలదై "స్వామీ; ఎట్లయినను నన్ను శ్రీరామచంద్రస్వామియొక్క కోడలగునట్లు చేయవలయును. అందుకై మిమ్మునే శరణమని నమ్మియున్నాను." అని చెప్పి మునీంద్రునియొక్క పాదారవిందములమీద తనతలనుంచి ప్రణమించెను. ఇట్లు అంగలార్చుచుండు మదనసుందరిని చూచి నారదుడు "ఓకన్యారత్నమా! లెమ్ము! నీవు శ్రీరామచంద్రస్వామియొక్క కోడలు కాగలవు. నేను దానికితగిన యత్నమును చేయుదును." అని చెప్పి యామెను సమాధానపరచి తనదారిలో తానువెడలెను ॥౨౭॥ అంతలో నయోధ్యాపట్టణము

### మదనసుందరీ స్వయంవరవృత్తాంతమును యూపకేతువునకు నారదుడు చెప్పుట

నుండి రథారూఢుండయిన యూపకేతువు వనమును అవలోకించుచు తమసానదీతీరమునకు వచ్చెను. అచ్చట తగుబాటి సైన్యములతోడనున్న యూపకేతువు సంధ్యావందనాది నిత్యకర్మలను ఆతమసానదిలో స్నానముచేసి నెరవేర్చుచుండు నప్పటికి, నారదమునీంద్రుడు అచ్చటికేతెంచెను. యూపకేతువు మునీంద్రునిజూచి యర్ఘ్యపాద్యాదికములనిచ్చి పూజించి యెదుటనిలిచి యెచ్చటనుండి తమరాకయని కుశలప్రశ్నమడిగెను. అంతనా బాలకునికి నారదుండు సమస్తవృత్తాంతమును సవిస్తరముగా చెప్పెను. అంత నామాటలనువిని విదితవృత్తాంతుండైన

ణాం సర్వేషాం ద్వేషబుద్ధిశ్చ రాఘవే । యా జాతా సాద్య సర్వేషాం క్షయానర్థకరీ జవాత్ ॥ ౩౩ ॥ కంబుకంఠాదిభూషానాం సారం పశ్యామ్యహం రణే । మునే త్వత్కృపయా సర్వాన్ జిత్వా తామానయామ్యహం ॥ ౩౪ ॥ ఇత్యుక్త్వా స యయౌ కాంతిం పంచ మేహానిసేనయా । నారదోపి యయౌ రామం ద్రష్టుం ప్రీతమనాస్తదా ॥ ౩౫ ॥ రామేణ పూజితః ప్రేమ్ణా భోజనార్థం నిమంత్రితః । అథ భోజనవేలాయాం యూపకేతుం రఘూత్తమః ॥ ౩౬ ॥ అదృష్ట్వా లక్ష్మణం ప్రాహ యూపకేతుర్న దృశ్యతే । బాలేషు తం భోజనార్థం లక్ష్మణాత్ర సమాహ్వయ ॥ ౩౭ ॥ తదా స మాలతీం గత్వా పప్రచ్ఛ లక్ష్మణో జవాత్ । సా ప్రాహ వనమధ్యేద్య కించిత్సైన్యయుతో గతః ॥ ౩౮ ॥ తచ్ఛ్రుత్వా లక్ష్మణో వృత్తం కథయామాస రాఘవం । అథ రామో భోజనాది సంపాద్య మునినా సహ ॥ ౩౯ ॥ యయౌ సభాయామాసీనస్తం మునిం వాక్యమబ్రవీత్ । పంచ సప్త దినాన్యత్ర స్థేయం మద్వచనాత్త్వయా ॥ ౪౦ ॥ తథేతి నారదః ప్రాహ సభాయాం సంస్థితస్సుఖం । అథ రాత్రౌ యూపకేతుమదృష్ట్వా రఘునందనః ॥ ౪౧ ॥ ఉపహారం కర్తుకామః పునర్లక్ష్మణమబ్రవీత్ । ఆకారయ యూపకేతుం నాహం దృష్టో మయా శిశుః ॥ ౪౨ ॥ తథేతి రామవచనాత్పునర్గత్వా తు మాలతీం । పప్రచ్ఛ

యూపకేతువు క్రోధావిష్టుఁడై "మునీంద్రా! వినుము, ఈ రాజులందఱికిని శ్రీరామచంద్రస్వామి యందు ద్వేషబుద్ధిగలుగుటచేత నిదియేదో అనర్థమును కలుగింపక మానదు. కంబుకంఠుఁడే మొదలైన మహారాజులయొక్క సామర్థ్యమును నేనురణమున పరీక్షించిచూచెదను. మునీంద్రుఁడా! నీయనుగ్రహమువలన నేనందరిని జయించి యామదనసుందరిని తీసికొనివచ్చుచున్నాను." అని చెప్పి నారదునికి నమస్కరించి యైదవనాడు కాంతిపురికి వెడలెను. ఇచ్చట నారదుఁడును శ్రీరామదర్శనమునందు మిక్కిలి కుతూహలముగలవాఁడై యయోధ్యకువచ్చి శ్రీరామునిచే సంపూజింపంబడి యచ్చటనే అభ్యవహారమునకు నభ్యర్థింపఁబడెను. అంతనందఱును కూర్చుండి భోజనము చేయునప్పుడు శ్రీరాముఁడు యూపకేతువు కానరానందున లక్ష్మణునింజూచి "ఎచ్చట యూపకేతువు కనుపడలేదు. బాలకులతోడ నతనిని భుజించుటకు తీసికొనిరమ్ము" అని యాజ్ఞాపించెను. అంతనతఁడువచ్చి యూపకేతుపత్నియైన మాలతిని నీమగఁడెచ్చటపోయెనని యడిగెను. అందుకామె "కొంతసేనను వెంటతీసికొని వనమధ్యమునకు వెడలెను." అని వినయముగా పలికెను. లక్ష్మణుఁడాసంగతిని శ్రీరామసన్నిధానమునకు విన్నవింపగా నరియని యందఱితోడ మునీంద్రునితోడను భుజించి సభకేతెంచెను. అప్పుడాసభలో శ్రీరామచంద్రుఁడు నారదునిని "తపోధనా! నీవు ౫-౭ కొన్నిదినములు ఇచ్చటనే ఆతిథ్యము నంగీకరించి యానందించుచుండవలయునని ప్రార్థించెదను." అనిచెప్పగా, నతఁడు నట్లేయని యంగీకరించి సభాసీనుండై సుఖముగానుండె. అంతనారాత్రిగూడ యూపకేతువును చూడనందున దశరథాత్మజుండు రాత్రిభోజనమును స్వీకరించచాలక మరల లక్ష్మణునితో "తమ్ముఁడా! చిన్నవానిని తీసికొనిరమ్ము,నాబిడ్డఁడగు యూపకేతువును నేనుచూడలేదు. మిక్కిలివ్యాకులముగా నున్నది." అని

యూపకేతుం స ప్రాహ నాగతస్త్వితి ॥ ౪౩ ॥ తతస్సవిహ్వలోభూత్వా రామంవృత్తంన్యవేదయత్। రామోపి నాగతంశ్రుత్వా విహ్వలఃఖిన్నమానసః ॥ ౪౪॥ తతస్సాజానకీశ్రుత్వా బంధుభ్యాంవిహ్వలాభవత్। దుద్రావరాఘవాగ్రేసా సర్వేతూష్ణీంకథంస్థితాః ॥ ౪౫॥ ఇతితాన్ ప్రాహవైదేహీ తదాసర్వేతివిహ్వలాః। త్యక్త్వోపహారాన్ వేగేన తచ్ఛోధార్థంసముద్యతాః ॥ ౪౬ ॥ తదాతాన్విహ్వలాన్దృష్ట్వా నారదఃప్రాహరాఘవం। కాంతివృత్తం యూపకేతోః ప్రయాణాదికమాదరాత్ ॥౪౭ ॥ తత్సర్వంరాఘవఃశ్రుత్వా కించిత్తుష్టమనాస్తదా। లక్ష్మణంప్రాహ వేగేన శత్రుఘ్నోద్యైవగచ్ఛతు ॥౪౮॥ సేనయాచతురంగిణ్యా జవాత్కాంతింకుశాదిభిః। తథేతిలక్ష్మణఃప్రోక్త్వా చోపహారాన్విధాయసః ॥౪౯॥ సేనయాబాలకైర్వేగాచ్ఛత్రుఘ్నంప్రేషయన్నిశి। రామంనత్వాథశత్రుఘ్నశ్శీఘ్రం స్యందనసంస్థితః ॥ ౫౦ ॥ యయౌకాంతిసమీపంస షష్ఠేహనిముదాన్వితః। ఏతస్మిన్నంతరేకాంతి పుర్యాంతత్రస్వ యంవరే ॥౫౧॥ సభాయాంరాజశార్దూలాస్సంస్థితాస్తేముదాన్వితాః ।, అథసాశిబికారూఢాయయౌమదనసుం దరీ ॥ ౫౨ ॥ కించిత్ మ్లానముఖీదుఃఖాత్ స్మరంతీంనారదేరితం। వృద్ధోపమాతాతాన్సర్వాన్ దర్శయామాస

చెప్పెను. అట్లేయని లక్ష్మణుఁడు శ్రీరామవాక్యముచొప్పున మరల మాలతివద్దికిపోయి మగఁడెచ్చటయని యడిగి యామగువ యీవరకురానేలేదని చెప్పగా నాసంగతిని శ్రీరామసన్నిధికి విన్నవించెను. ఆమాటవిని శ్రీరాముఁడు చింతాక్రాంతచిత్తుఁడై కలతపడుచుండెను. సీతాదేవి యీసంగతినివిని విచారపడుచు పరుగెత్తివచ్చి శ్రీరామసన్నిధానమున "ఏమందఱును ఊరకె యున్నారే" అని జాగరూకత నిచ్చుచుండెను.అప్పుడు అందఱును ఆహారాదుల నట్లేవదలిచింతతో యూపకేతువును త్వరగావెదకుట కుద్యమించిరి॥౪౬॥ ఇట్లు పరితపించుచుండు శ్రీరామా

శ్రీరామాదులు యూపకేతువునెఱుఁగక చింతించుట.

దులనుచూచి నారదమునీంద్రుఁడు కాంతిపురిలోని మదనసుందరీ స్వయంవరవృత్తాంతమును యూపకేతు ప్రయాణసమాచారమును తిన్నగా మందలించెను. ఆసంగతిని శ్రీరామచంద్రుఁడు సమగ్రముగావిని మనమున కొంతయానందమునంది యప్పుడు లక్ష్మణునిచూచి "త్వరగా నిప్పుడె శత్రుఘ్నుఁడు పోనిమ్ము. చతురంగసైన్యములతో కుశాదిపుత్రులతోడను వెడలవలయును." అనియాజ్ఞాపించెను. అట్లేయని లక్ష్మణుఁడు అభ్యవహారమునువదలి సేనతోడను బాలకులతోడను శత్రుఘ్నుని నారాత్రిపంపించెను.శత్రుఘ్నుఁడపుడు శ్రీరామచంద్రుని చరణారవిందములకు నమస్కరించి రథారూఢుఁడై వెడలి,ఆరవనాడు సంతోషముతో కాంతిపురీ సమీప ప్రాంతములను చేరెను॥౫౧॥అంతలో నక్కాంతిపురిలో నాస్వయంవరమున సభలో రాజేంద్రు

స్వయంవరమంటపమునుండి మదనసుందరిని యూపకేతువు జయించితెచ్చుట.

లందఱును ఆనంద తుందిలాంతఃకరణులై సుఖాసీనులై యుండిరి. సమనంతరమున నామదన సుందరి కొంచమువాడిన మోముగలదై దుఃఖమున నారదవచనమును తలంచుచు పల్ల

పార్థివాః ॥౫౩॥ యూపకేతుస్తదా వేగాద్గత్వా తూష్ణీం సభాంగణం । మోహనాస్త్రం విసృజ్యాథ మోహయామాస తాం సభాం ॥౫౪॥ మోహితైర్మోహనాస్త్రేణ న్యస్తాం తద్వాహకైర్భువి । రథేన శిబికాం గత్వా ధృత్వా మదనసుందరీం ॥౫౫॥ నిజాభిధానం సంశ్రావ్య తాం తుష్టామకరోత్తదా । అథ సా వరయామాస వీరం మదనసుందరీ ॥౫౬॥ ముమోచ మాలాం తత్కంఠే నవరత్నమయీం శుభాం । తతస్స యూపకేతుర్హి రథే మదనసుందరీం ॥౫౭॥ నివేశ్య కాంతిపుర్యాస్స బహిర్గత్వా స్థిరోఽభవత్ । తామాహ దయితాం వీరస్త్విదానీం త్వం భయం త్యజ ॥౫౮॥ జిత్వా సర్వాన్ నృపానద్య త్వయా గచ్ఛామ్యహం పురీం । తత్తస్య వచనం శ్రుత్వా సా ప్రాహ వచనం తదా ॥౫౯॥ బహవస్సంతి రాజానస్త్వమేకః స్వల్పసేనయా । అసంఖ్యాతాని సైన్యాని తేషాం పశ్య సమంతతః ॥౬౦॥ కథం యుద్ధం ఘటేదత్ర మా కురుష్వాద్య సంగరం । శీఘ్రం మాం నయ సాకేతం తతో రామేణ సేనయా ॥౬౧॥ యుద్ధం కురు నృపైర్ఘోరం శృణు మద్వచనం ప్రభో । మా సాహసం కురుష్వాత్ర ప్రార్థయామీతి తే ముహుః ॥౬౨॥ ఇతి తస్యాః వచః శ్రుత్వా తామాశ్వాస్య పునః పునః । ఉపసంహారయామాస మోహనాస్త్రం సలీలయా ॥౬౩॥ తదా తే పార్థివాస్సర్వే శ్రుత్వా నీతాం వధూం బలాత్ । శత్రుఘ్నతనయేనేతి స్త్రీవాక్యైస్స్యందనే స్థితాః ॥౬౪॥ నిర్యయుః కోటిశో యోద్ధుం స్వస్వసేనావృతా జవాత్ । చంపికాయాస్సుమత్యాశ్చ పూర్వవైరేణ దర్పితాః ॥౬౫॥ దుద్రువుశ్శ్రేణిమార్గేణ

క్కినెక్కి యాసభాభవనమును ప్రవేశించెను. ముసలిదియగు దాది యామెకు సమస్తరాజుల ను చూపించుచువచ్చెను. అప్పుడు యూపకేతువు మిక్కిలిత్వరగా నాసభామంటపమును ప్రవేశించి ఆసభనంతయును మోహనాస్త్రమును ప్రయోగించి మూర్ఛాక్రాంతమ్ముంజేసెను. ఆమోహనాస్త్రముచే మూర్ఛాక్రాంతులైన వాహకులు పల్లకీని నేలబెట్టి పడియుండగా నాయాందోళనమువదికి రథారూఢుండైన యూపకేతువువచ్చి యామెనుపట్టి తనపేరుచెప్పి యామె నానందకేళినందించెను. అంతనామె నవరత్నాలంకృత దివ్యమంగళహారమును యూపకేతుకంఠమున కలంకరించి యతనిని ప్రాణనాథునిగా వరించెను. పిదప యూపకేతువు మదనసుందరిని రథముననెక్కించికొని కాంతిపురియొక్క యెల్లనతిక్రమించి నిజపరివారముతోడ సుస్థిరుండై నిలచి, మదనసుందరినిచూచి "ప్రేయసీ! నీవిపుడు భయపడవలదు. ఈరాజుల నందఱిని జయించి నిన్ను సాకేతరాజధానికి కొనిపోవుచున్నాను" అని యావీరుండు పలికెను. ఆవీరాలాపంబులనువిని యామె "రాజులైననో పెక్కండ్రుగలరు. నీవైననోమిత పరివారముతో నొక్కండుగానున్నావు ఎచ్చటచూచినను సేనలేకనుపడుచున్నవి, వారిసైన్యంబు లసంఖ్యాకంబులు, చూడుము. ఇట్టిస్థితిలో నెట్లు యుద్ధముఘటిల్లును? ఇప్పుడు నీవు రణసాహసమునకు వెడలవలదు. త్వరగానన్ను అయోధ్యకు తీసికొనిపొమ్ము. పిమ్మట రామునియొక్క మఱిసైన్యములయొక్క సహాయమునందిరాజులతోడ ఘోరసంగరము నొనరింపుము. మహాప్రభూ! నామాటవినుము. నిన్ను నేనిట్లు పలుమారు ప్రార్థించుచున్నాను. సాహసింపకుము." అని ప్రార్థించుచుండు మదనసుందరియొక్క మాటలనువిని, మరలమరల యామెను సమాధానపరచుచు వినోదముగా నా

దృశుస్తం రథసంస్థితం । యుక్తం మదనసుందర్యా బిభ్రంతం మాలికాం హృది ॥ ౬౬ ॥ తతస్తం యుయుధుస్సర్వే నానాస్త్రాణి సైనికాః । యూపకేతుస్తదా వేగాత్ టణత్కృత్య మహాధనుః ॥ ౬౭ ॥ వాయవ్యాస్త్రేణ తాన్సర్వా నుద్ధూయ దశదిక్షు సః । క్షిపత్పార్థివాన్ సైన్యైః నానావాహనసంస్థితాన్ ॥ ౬౮ ॥ తదా స కంబుకంఠోఽపి పూర్వం వైరమనుస్మరన్ । చంపికాయాస్సుమత్యాశ్చ స్వయంవరసముద్భవం ॥ ౬౯ ॥ విశేషాన్నిజకన్యాయా వైరతోఽపహృతాం బలాత్ । మహాక్రోధాన్నిర్యయౌ స్వసైన్యేన మహతావృతః ॥ ౭౦ ॥ కుర్వన్ దుందుభిఘోషాంశ్చ యుద్ధార్థం యూపకేతునా । యూపకేతురపి శ్రుత్వా దుందుభీనాం మహత్స్వనం ॥ ౭౧ ॥ కాంతిపుర్యుత్తరద్వార పురతస్సంస్థితో రథీ । టణత్కృత్య మహాచాపం సందధే శస్త్రముత్తమం ॥ ౭౨ ॥ యేయే వీరాః పురద్వారా న్నిర్గతాశ్చ బహిశ్శరైః । తాన్ జఘాన క్షణాదేవ ప్రేతైర్ద్వారం రురోధ సః ॥ ౭౩ ॥ తం దృష్ట్వా యూపకేతోశ్చ కంబుకంఠః పరాక్రమం । యయౌ స్వస్యందనేన ప్రేతసంఘం విదార్య చ ॥ ౭౪ ॥ శేషసైన్యేన సంయుక్తో యూపకేతుం ప్రధావత । తదాహ యూపకేతుం స మయా త్వం సంగరం కురు ॥ ౭౫ ॥ కిమేతాన్ శకలాన్ హత్వా పౌరుషం మన్యసే జడ । ఇత్యుక్త్వా సప్తభిర్బాణై ర్యూపకేతుం జఘాన సః ॥ ౭౬ ॥ తాన్బాణానాగతాన్ దృష్ట్వా యూపకేతుర్నిజైశ్శరైః । తాన్ ఛిత్వా నవబాణైస్త చ్చాపం సారథిం నధ్వజం ॥ ౭౭ ॥ కవచం ముకుటం ఛిత్వా జఘాన తురగానపి ।

మోహనాస్త్రమును ఉపసంహారము చేసెను. అపుడా రాజులందఱును బలాత్కారముగా శత్రుఘ్ననందనుండగు యూపకేతువు కన్యారత్నము నంటుకొనిపోయెనని స్త్రీలవాక్యములచే నెఱిఁగి రథారూఢులై క్రోట్లకొలదిగా తమతమ సైన్యంబులనుతీసికొని త్వరగా యుద్ధోన్ముఖులైవచ్చిరి. ఇట్లు చంపికాసుమతీ స్వయంవరవైరముచే మదోన్మత్తులైవచ్చుచుండు రాజులందఱును మదనసుందరీదత్త రత్నమాలికాలంకృత కంఠుండైన రథారూఢుఁడగు యూపకేతువును విభ్రాంతులై విలోకించిరి. అంత నందఱిసైనికులును నానాస్త్రంబులను యూపకేతువు మీఁద నేకకాలమున ప్రయోగించిరి. అప్పుడతఁడు నిజధనుస్సు నెక్కుపెట్టి టంకారముచేసి వాయవ్యాస్త్రమును ప్రయోగించి వారినందఱిని పదిదిక్కులకును చిమ్మెను. వివిధవాహనంబులనెక్కిన వసుమతీశులను వారివారి సైన్యంబులతోడ నిట్లు పడమొత్తి వెదజల్లగా నప్పుడు కంబుకంఠుఁడును చంపికాసుమతీ స్వయంవరజన్యమైన వైరమును స్మరించుచు మఱియు తనకూతురిని బలాత్కారముగా నపహరించినందున నతిశయ శత్రుత్వమునువహించి క్రోధావిష్టుండై తనయొక్క మహాసైన్యములను తీసికొని రణవాద్యములు మ్రోయుచుండగా యుపకేతువులతోడ యుద్ధమునకేతెంచెను. ఇచ్చట యూపకేతువు రణదుందుభుల నాదమునువిని కాంతిపురియొక్క యుత్తరద్వారమున రథారూఢుఁడైనిలచి ధనుష్టంకారముంజేసి ఉత్తమశస్త్రము నను సంధించెను. ఏవీరులు ఊరిబయిటికివచ్చుచుందురో వారినందరిని క్షణమాత్రమున నీయూపకేతువు సంహరించుచుండగా నాద్వారము పీనుగులచే నడ్డగింపఁబడెను. అట్టి యూపకేతువుయొక్క పరాక్రమమును కంబుకంఠుఁడుచూచి తానే రథారూఢుఁడై ప్రేతసంఘమును భేదించి

పద్భ్యాం భూతదా కంబుకంఠో గదామాదాయ దుద్రువే ॥ ౭౮ ॥ తావత్సహ ప్రధాబాణై ర్యూపకేతుశ్చకార తాం। తతో బధ్వా దృఢాం ముష్టిం కంబుకంఠ స్త్వరాన్వితః ॥ ౭౯ ॥ హృదయే యూపకేతో స్తాం జఘానాచలసన్నిభాం । తదా సయూపకేతు స్తం శ్వాసుగంస్యందనోపరి ॥ ౮౦ ॥ ధ్వజే బబంధ వేగేన ఖడ్గం జగ్రాహ సంభ్రమాత్ । కంబుకంఠ శిర చ్ఛేదనం కర్తుం తం సముపస్థితం ॥ ౮౧ ॥ దృష్ట్వా నృత్వా కరం తస్య సఖడ్గం సంభ్రమాన్వితా । తమాహ నత్వా సా వీరం తదా మదనసుందరీ ॥ ౮౨ ॥ విహ్వలా విగతోత్సాహా వేపంతీ హ్యశ్రులోచనా । మమ తాతం కంబుకంఠ మేనం హంసి కథం ప్రభో ॥ ౮౩ ॥ మక్షికాపతనం పూర్వం గ్రాసే యద్వత్తథా త్వయా । సుఖారంభే పూర్వమేవ దుఃఖకర్మావలంబితం ॥ ౮౪ ॥ మద్వాక్యాన్నైవ హంతవ్య స్తస్మాత్త్వాం ప్రార్థయామ్యహం । ఏవం మదనసుందర్యా వచః శ్రుత్వా విహాస్య సః ॥ ౮౫ ॥ కరాన్న్యస జ్యతం ఖడ్గం స్వసూతం చోదయ స్తదా । సేనయా సహయా యాయావ స్వధా యోధ్యాం పురీం ప్రతి ॥ ౮౬ ॥ తావద్దుందుభిః ఘోషా న గ్రేసు శ్రావనే యా । పునశ్చాపం సమ్యగ్ధీకృత్య యూపకేతు స్తదా పథి ॥ ౮౭ ॥ కస్యాగ్రే వాహినీ చేతి చింతయామాస చేతసి । తతశ్శరం ముమోచైకం నిజనామాంకితం జవాత్ ॥ ౮౮ ॥ యోజ

కొని మిగిలిన సేనతోడ క్రుద్ధుండై త్వరగా యూపకేతువునకు సముఖముగా నిలిచి "ఓరి జడుండా! ఈదోమలవంటి మానవులను చంపినమాత్రమున నేమి నీపౌరుషమును గొప్పగా తలంచెదవు? నాతోడ యుద్ధము చేయుము." అని ధిక్కరించి యేడు బాణంబులచే యూపకేతువును పడమొత్తెను. ఆ వచ్చుచున్న బాణములను చూచి యూపకేతువు నిజనారాచంబులచే వాటిని ఖండించి, మఱి తొమ్మిది బాణంబులచే వాని ధనస్సును ధ్వజమును సారథిని ఖడ్గమును కవచమును కిరీటమును గుఱ్ఱంబులనుకూడ ధ్వంసము చేసెను. అప్పుడు కంబుకంఠుండు త్వరాన్వితుండై పర్వతతుల్యమగు దృఢముష్టిచే యూపకేతువుయొక్క హృదయమున కొట్టెను. అంతనా యూపకేతువు కంబుకంఠుని నారథముమీఁద నల్లెత్రాటితో ధ్వజస్తంభమున కంటగట్టి వేగముగా నతనిని సంహరించుటకై ఖడ్గము నెత్తెను. అప్పుడు మదనసుందరి ఖడ్గసహితమై

యూపకేతువు కంబుకంఠునిని కాపాడుట.

త్వరపడుచుండు మగని కరమును పట్టుకొని సంభ్రమాన్వితయై నమస్కరించుచు "ప్రభూ! నా తండ్రియైన కంబుకంఠరాజును ఎట్లు చంపెదవు? అట్లు చంపితే నోటికెత్తినకడిలో నీఁగపడినట్లు కాదా? సుఖారంభమున మొదట నీదుఃఖకర్మ యారంభింపఁబడుచున్నది. నామాటమీఁద నితఁడు చంపఁబడకూడదు. అందువలన నేను నిను ప్రార్థించుచున్నాను." అని యుత్సాహ ముతగ్గి కలతనంది క్లేశపడుచు కన్నీరు మున్నీరుకాగా కంబుకంఠునిని రక్షింపుమని ప్రార్థించుచుండెను. అంతనా యూపకేతువు ఆఖడ్గమును పారవేచి తన సారథిని ప్రేరించెను. ఆసారథి యట్లే యయోధ్యానగర మార్గమున సపరివారముగా రథమున్మ త్రిప్పి నడిపెను॥ ౮౬ ॥

నాంతరసేనాయాం శరశ్శత్రుఘ్నసన్నిధౌ । పపాతతత్పదాగ్రేతం దృష్ట్వాసచకిత స్తదా ॥౪౯॥ శరపృష్ఠేయూపకేతో ర్నామదృష్ట్వాథశత్రుహా । నిశ్చితవాన్యూపకేతుమార్గేఽగ్రేవర్తతేధ్రువం ॥ ౫౦ ॥ తతశ్చాపేసశత్రుఘ్నః స్వనామాంకితముత్తమం । శరంసంధాయవిశిఖం యూపకేతుంముమోచహ ॥ ౫౧ ॥ సశరోయూపకేతోశ్చ మస్తకాదూర్ధ్వతస్తదా । అపతత్పృష్ఠభాగేస తందదర్శపితుశ్శరం ॥ ౫౨ ॥ తదాహృష్టోయూపకేతుః కుర్వన్దుందుభినిస్వనాన్ । గత్వావేగేనశత్రుఘ్నం దృష్ట్వోత్తుర్యాద్రథాదథ ॥ ౫౩ ॥ ననామపితరంపత్న్యాశ్శీఘ్రం కంబుకంఠంప్రదర్శయత్ । తదాతంసుహృదంజ్ఞాత్వా మోచయామాసశత్రుహా ॥ ౫౪ ॥ కంబుకంఠముఖాచ్ఛ్రుత్వా సర్వంవృత్తంసవిస్తరం । శత్రుఘ్నఃప్రార్థితస్తేన సుహృదాతత్పురీంయయౌ ॥ ౫౫ ॥ కాంతిపుర్యాంబహిఃస్థిత్వా కంబుకంఠమతేనసః । ఆకారణార్థంలగ్నాయ రామందూతాన్వ్యచోదయత్ ॥౫౬॥ తదాతేకంబుకంఠస్య శత్రుఘ్నస్యాపివేగతః । ఆకారణార్థంశ్రీరామం యయుర్దూతాముదాన్వితాః ॥ ౫౭ ॥ * ॥ ఇతి శ్రీశతకోటి రామచరితాంతర్గతానందరామాయణే వివాహకాండే వాల్మీకీయే మదనసుందరీహరణం నామాష్టమస్సర్గః॥ ... ॥౮॥*

## శత్రుఘ్నుండు యూపకేతువును విడిపించుట.

ఇట్లు వచ్చుచుండునపుడు యూపకేతువు దారిలో నెదుట సేనతోడ వచ్చుచుండు దుందుభినాదమును వినెను. అప్పుడు యూపకేతువు నురల ధనుస్సును దృఢపరచుకొని ఎవనిది యీ సేనయని చింతించుచు నంతె తిన్నగా నొకబాణమును ప్రయోగించెను. అయ్యూపకేతు నామాంకిత బాణము వెడలి యోజనాంతరమునందుండు సైన్యమధ్యంబున శత్రుఘ్నుని పాదములమీఁదఁబడెను. అతఁడు దానినిచూచి యిప్పుడు చకితుఁడై బాణమూలమున యూపకేతువుయొక్క నామమునుచూచి తప్పక దారిలో యూపకేతు వెదుట వచ్చుచున్నాడని నిశ్చయించి, యంత తానుగూడ చాపమున నిజనామాంకితమగు బాణమును తలక్రిందుగా ననుసంధానము చేసి యూపకేతువుమీఁద ప్రయోగించెను. ఆబాణము యూపకేతువుయొక్క తలమీఁదుగా వెడలి వీపుప్రక్కఁబడెను. అంత నతఁడు దానినిచూచి తండ్రిప్రయోగించిన బాణమని యెఱిఁగి యత్యంతానందమునంది దుందుభి వాద్యంబులను వాయించికొనుచు త్వరగా ప్రయాణముచేసి శత్రుఘ్నుఁడు కనుపడగానే తటాలున రథమునుండి దిగి పత్నితోడ ప్రణమించి, కంబుకంఠునిం జూపించెను. అపుడు శత్రుఘ్నుండు వానిని సుహృదునిగా నెఱింగి విడుపించెను. అంతనా కంబుకంఠునినుండి సమస్త వృత్తాంతంబు నెఱిఁగినవాఁడైన శత్రుఘ్నుండు మిత్రుఁడగు కంబుకంఠునిచే సంప్రార్థింపఁబడి వాని పట్టణమునకు వెడలి, యచ్చట యూరిబయటనే యతని యభిప్రాయముచొప్పున నిలిచెను. మదనసుందరీ వివాహలగ్నమునకు దయచేయవలయునని శ్రీరామసన్నిధానమునకు కంబుకంఠుని దూతలును శత్రుఘ్నుని దూతలును సంతోషముతో శ్రీరామచంద్రస్వామిని పిలిచికొని వచ్చుటకై యయ్యయోధ్యకు వెడలిరి. ... ౮॥

శ్రీరామదాసఉవాచ—గత్వాయోధ్యాపురీందూతా రామంవృత్తంన్యవేదయత్ । రామోపిశ్రుత్వాతద్వృత్తం సీతాయై సంన్యవేదయత్ ॥ ౧ ॥ తతో ముహూర్తే శ్రీరామ స్స్వావరోధజనైస్సహ । పౌరైర్జానపదైస్సర్వై స్సుహృద్భిస్సేనయాసహ ॥ ౨ ॥ నారదేనయయౌ కాంతి మాద్యాంముక్తిపురీంప్రతి । తతఃశ్రుత్వాకంబుకంఠ శ్శీఘ్రింరాఘవమాగతం ॥ ౩ ॥ తంప్రత్యుద్గమ్యవినయా న్నత్వా సంపూజయన్ముదా । యూపకేతుంతతఃపూజ్య వారణస్థఃపురీంయయౌ ॥ ౪ ॥ వారస్త్రీనృత్యగీతైశ్చ తూర్యఘోషైర్నినాయసః ॥ తతఃకాంతిపురీస్థాస్తాః స్త్రియః ప్రాసాదసంస్థితాః ॥ ౫ ॥ దృష్ట్వారామంయూపకేతుం వవర్షుఃపుష్పవృష్టిభిః । తతోరామశ్శనైశ్శాస్తుం కల్పితంగృహముత్తమం ॥ ౬ ॥ నత్వాదృష్ట్వాముహూర్తంతు పూర్వోక్తకౌతుకైస్సుఖం । యూపకేతోర్వివాహంసచ కారపరమోత్సవైః ॥ ౭ ॥ తతోవివాహంనివృత్త్య కంబుకంఠేనపూజితః । హస్త్యశ్వరథపాదాత దాసదాసీజనాదిభిః ॥ ౮ ॥ యయౌమదనసుందర్యా రామోయోధ్యాపురీంనిజాం । తతోవిశేశనగరీం నేదుర్వాద్యానివైతదా ॥ ౯ ॥ ననృతుర్వారనార్యశ్చ తుష్టువుర్మాగధాదయః । ప్రాసాదస్థాఃస్త్రియోరామం వవర్షుఃపుష్పవృష్టిభిః॥౧౦॥ మార్గేశిరాజితఃస్త్రీభిః వివేశనిజమందిరం । కారయిత్వారమాపూజాం దదౌదానాన్యనేకశః ॥ ౧౧ ॥ సుహృదః

## శ్రీరాముఁడు మదనసుందరీ వివాహమునకేతెంచుట.

తరువాత నాదూతలు శ్రీరామచంద్రస్వామికి సర్వవృత్తాంతమును సవిస్తరముగా విన్నవించిరి. రఘునాథుఁడును ఆవృత్తాంతమును విని సీతాదేవికి తెలిపించెను. అంతట వివాహముహూర్తముగాగా శ్రీరామచంద్రుఁడు అంతఃపురజనులతోడను పౌరజానపదాది ప్రముఖులతోడను సమస్తమిత్రులతోడను సేనలతోడను నారదమహామునీంద్రునిని వెంటబిలిచికొని మొదటి ముక్తిక్షేత్రమగు కాంతిపురికి వెడలెను. అంతనాసంగతిని కంబుకంఠుండు త్వరగా శ్రీరాముఁడు వచ్చుచున్నాడని విని ఎదుర్కొలుపోయి వినయావనతుఁడై శ్రీరామచంద్రస్వామిని సంతోషముతో సంపూజించెను. గజారూఢుఁడగు యూపకేతువునకు వరపూజఁజేసి నృత్తగీతవాద్యాది సమస్తవిభవంబులతోడ కాంతిపురిలోనికి తీసికొనివెడలెను. అంత నప్పురిలోని మేడలమీఁదనెక్కి వేడుకలుజూచుచుండు నాగరికులగు నారులందరును యూపకేతువుమీఁద విరులవాన గురిపించిరి. అంతనా కంబుకంఠుఁడు శ్రీరామచంద్రస్వామికి విడిదిల్లును విభవోపేతంబుగా నమర్చి విశేష వినోదంబులతో వివాహమును విధివిధానంబుగా చేయించెను. అటుమీఁద రఘురాముఁడు కంబుకంఠునిచే సంపూజింపఁబడి అతఁడు సమర్పించిన గజరథతురగపదాతి దాసదాసీ వాహనాది సమస్తంబును స్వీకరించి యతని ననుగ్రహించి మదనసుందరీ యూపకేతువులను నూతన వధూవరులను తీసికొని నిజరాజధానియగు నయోధ్యాపురికి వచ్చెను. అంత నగరప్రవేశము చేయునపుడు మంగళవాద్యంబులు చక్కఁగా వాయింపఁబడెను. గణికలాడిరి. గాయకులుపాడిరి. వందిమాగధులు స్తోత్రపాఠంబులంజెప్పుచు సంస్తుతించుచుం

పూజయామాస రాఘవో వసనాదిభిః ; తతో విసర్జయామాస సర్వాన్ స్వస్వస్థలం ప్రతి ॥ ౧౨ ॥ అథస[illegible]కుమారా
శ్చ లవాద్యాః స్వస్వవేశ్మని । చక్రుః క్రీడాం పృథక్ స్త్రీభిర్యాం కుశశ్చంపికయా తతః ॥ ౧౩ ॥ చంపి[illegible]దుహి
తరః కుశాజ్జాతాశ్చ భానవ । కుశాయాం గే కుముద్వత్యాం భవిష్యంత్యష్ట సూనవః ॥ ౧౪ ॥ భవిష్యతి తథా కన్యాత్వే
కా చంపకమాలినీ । జ్యేష్ఠః పుత్రో ఽతిథిరితి నామ్నా రాజ్యం కరిష్యతి ॥ ౧౫ ॥ చతుర్దశ సుమత్యాద్యాః స్త్రియస్స
ర్యాః క్రమేణహి । కుశపుత్రస్తనయానష్ట కన్యైకాపి పృథక్ పృథక్ ॥ ౧౬ ॥ సద్వాదశశతం పౌత్రా నప్త్రీశ్చ
వమనోరమాః । త్రయోవింశ ద్రామచంద్రో లాలయామాస సీతయా ॥ ౧౭ ॥ కుముద్వతీ భావిపుత్ర సహితాశ్శి
పశ్చభాః । సవింశచ్ఛతమాసంస్తే తథా పౌత్ర్యస్తటిత్ప్రభాః ॥ ౧౮ ॥ చతుర్వింశన్మితాస్తాస్సర్వాః ప్రోద్వాహితా
నృపైః । తదా శ్రీరామపౌత్రైశ్చ నృపకన్యా అనేకశః ॥ ౧౯ ॥ కాశ్చిత్స్వయంవరేణైవ కాశ్చిద్రాక్షసయోగతః । కా
శ్చిద్గాంధర్వయోగేన కాశ్చిద్వైవాహకర్మణా ॥ ౨౦ ॥ పరిణీతాః పౌరుషేణ తాసాం సంఖ్యా న విద్యతే । తాసాం
హి సంతతిం వక్తుం కస్సమర్థో ఽభవేదిహ ॥ ౨౧ ॥ ఏవం సయూపకేతోశ్చ వివాహాశ్చరమశ్శుభః । సంపాద్యనా
రతః శ్రీమాన్ సభాయాం రఘునందనం ॥ ౨౨ ॥ రామనామసహస్రేణ సూతో క్తైనాతిభక్తితః । స్తుత్వా శ్రీరాఘు

డిరి. ప్రాసాదంబులమీఁది విలాసినులందఱును శ్రీరామచంద్రస్వామిమీఁద పూలవానఁగురిపించి
రి. నడుమనడుమ నారీమణులు సమర్పించుచుండు రత్ననీరాజనాదులను అనుగ్రహించుచు రా
జమందిరమును ప్రవేశించెను. మఱియు నాయూపకేతువుచే లక్ష్మీపూజ చేయించి వివిధంబులగు
సమస్త దానంబులనొసంగి, మిత్రమండలిని కనకవసనాదులచే సత్కరించి, యంత నందఱిని
వారివారి స్వస్థలంబున కంపించెను॥ ౧౨ ॥ అనంతరము లవుఁడే మొదలుగాఁగల యేడుగురు కు

శ్రీరామచంద్రస్వామియొక్క వంశాభివర్ణనము.

మాళ్లును తమతమ రాజమందిరంబులలో వేర్వేఱుగా నిజపత్నులతోడ నానందకేళి నందుచుం
డిరి. కుశుఁడు చంపికతోడ విహరించుచుండెను. కుశునివలన చంపికయందు తొమ్మిదిమంది
మంగళాంగులగు పుత్రికలు జనించిరి. ఇఁకమీఁద కుశునికి కుముద్వతీగర్భమున నెనమండుగు
రు పుత్రులు జనించెదరు. అట్లే మఱియొకకన్యకకూడ చంపకమాలిని యనునది జనించును.
అతిథియను పేరుగల జ్యేష్ఠపుత్రుఁడు రాజ్యమునేలఁగలఁడు. సుమతి మొదలయిన ౧౪ మంది
కోడండ్రు వేర్వేఱుగా నొక్కొకరు ౮మంది మొగబిడ్డలను ఒక్కొక యాడబిడ్డను కనుచుం
డిరి. శ్రీరామచంద్రుఁడు సీతాదేవితోడ ౧౧౨ మంది మనుములను ౨౩ మంది మనుమరాం
డ్రను లాలించుచుండెను. కుముద్వతియొక్క భవిష్యత్పుత్రులతోడ ౧౨౧ మంది పౌత్రులు
ను, అట్లే మించుబోడులగు ౨౪ మంది పౌత్రికలును అయిరి. అందఱును రాజులచే వివా
హితలై వెలయుచుండిరి. అట్లే ఆపౌత్రులను నృపకన్యారత్నంబుల ననేకంబుగా పెండ్లాడిరి.
కొందఱు స్వయంవరంబులలోను కొందఱు రాక్షసవివాహవిధితోను కొందఱు గాంధర్వవివా